క. అటు పసిఁడి పరులయమ్ముల దిటు మగు
పక్కి-దొర నల్లదేవర వోలెక ..
అచ్చ భా ౨. ౩౦

పక్కి-యు[1] = పక్కి- వి పిచులము, పక్కి-చెట్టు. (శ. ర.)

పక్కి-యు[2] = పక్క-, ప్రక్క-. ని (సం పక్షక ప్రా పఖ్ఖ-ఓ)

౧. ప్రక్క-, పార్శ్వము, పార్శ్వస్థలము.

క. పాదుశగతుసు నసుశగమును, పరి నిరుపక్కి-యలు దాఁకి జవ మణి శిరసం, భరమునఁ గిరిగ వరాహము, శరనిధి మథనమునఁ దిరుగు శైలము పోలెక

భాగ అగి ౧ ౩౦౬

చ పసిఁడి మెఱుంగు ఱెక్క- లిరఁ బక్కి-యఁలం బరఁటుల్ వలె న్సము, ల్లసద పమానిలాంకు గములం బొరియించుచు సేద దేవ్వ

రామా ౧ ౫

సీ. ఇరుపక్కి-యల నుండి నుర వింధురంబులు పరిపూర్ణ హేమకుంభములు దాల్ప

హరి ౬ ౩౩

వ. ... ఐరిరవనితలు తమకు ప్రమొక్కం దారు ప్రమొక్క- కొక్కి-ంచుకి దొరార మొా మిడి వారి యిరుపక్కి-యల నొదిఁగి .

ఆమ ౪ ౩౫.

౨ తెగ, పక్షము

గీ రణసముత్సాహలక్ష్మి వక్త్రిగు నె వింత, చెన్ను వెలయింప నాళ్ళుకు నేరి రెండు, పక్కి-యలయందుఁ బవరింపు పలుకు లెసఁగ.

భాగ కిష్క ౧ ౬౦

పక్కి-యు[3] = పక్కా[3].

పక్కి-యొుడలివాఁడు. వి (√పక్కి-) కిన్న రుఁడు. (శ. ర)

పక్కి-రా. వి (√పక్కి-) గరుత్మంతుఁడు.

సీ. పక్కి-రా తేజపై కెక్కి-నయభ్యాసి చాణూరుఁ ద్రుంచినసత్యరాశి ... నిరం ౧ ౨.

పక్కి-రాచెలి. వి (√పక్కి-) గరుడస్త్రీ, గరుడ జాతిస్త్రీ

ఉ వీసుల కంటిలోయ్యలియు వేల్పువెలందియు జక్కి- మోరలేఁ, జానయు పక్కి-గా చెలియు ... అచ్చ గా బాల ౧౪౪

పక్కి-రాజక్కి-దొర. వి (√పక్కి-) గరుడ వాహనుఁడు, విష్ణువు, కృష్ణుడు

గీ పక్కి-రాజక్కి- గొంగల్మి జక్కి-ఁ గోరి, చొక్క-మండెడుడెంద మమ్మక్కి- యొక్కి-, తులువమానినితోడఁ బొందుగను నిచ్చ, యిడఁగఁజూచెను తలఁప కెయ్యెదలనైన

నీలా ౨ ౧౬

పక్కి-రాయఁడు. వి (√పక్కి-) పక్షిరాజు, గరుత్మంతుఁడు. (శ ర)

పక్కి-తేఁడు. వి (√పక్కి-) పక్షిరాజు; పక్షి శ్రేష్ఠుఁడు

రగడ ఖరుని పీచ మడంచి కల్లమెకంబు నొక్కి- వెడందతూపున మఱియ లానరిచి పక్కి- ఱేనికి ముక్తి సతము గ నొసఁగి యేపున

అచ్చ రా. యు ౬౪

(జటాయువు అని భావము)

పక్కి-లి = పక్కి-యు[2] వి పార్శ్వము, ప్రక్క-

ద్వి కొలంకుల రెండు నంగుళముల నడుమఁ గలయఁగఁ గన్నెల్లఁ గొలఁకు లై శాకు, నక్కి-న్నగొలంకులు నరచేత మూయఁ బక్కి-ళ్లఁ బింఛించి పొంగఁ దొడఁగి ...

బస ఫు. ౩౪౯.

ద్వి. గంధంపుఁ జెక్క లాకాంక్షమై తెచ్చి,
బంధించి కావటిపక్షిళ్లఁ జెరివి
పండితా. పురా. ౧౨౭ పా

పక్షిసామి. వి (√పక్షి) గరుత్మంతుఁడు

సీ తమ్మికోలను జొచ్చు కొమ్ముటేనుఁగు రివిఁ
బాములఁ దోల్పక్షి సామిజాడ ..
అచ్చ రా యు ౩౪౧

పక్కు¹. వి (అ పక్కు) నవ్వుట పడఁగొట్టుట ఏయుట త్రెంచుట పొడుచుట మున్నగు వానియం దగు ధ్వని కనుకరణము

ఉ పక్కున నవ్వు నింతిపయి బాళి నృపాలకు
మాళి ఖిన్నతన్ . హంస ౧ ౮౨

ఆ భూమి నాది యన్న భూమి పక్కున నవ్వు,
దానహీనుఁజూచి ధనము నవ్వు, కదనభీతుఁ
జూచి కాలుండు నవ్వును ...
వేమన. ౨ ౭౬.

గీ బలులకిందూరి కై రాయఁబడిన తరువు,
తునిసి పెళ్లున విఱుగ గిఱ్ఱున మరలి,
పక్కునను రేఁడుతునియ లై పడఁగఁ గొట్టె,
భీకరం బగు నొక దొడ్డ మోకరంబు ...
చంద్రా ౨ ౯౨

చ. ... మోతు నాలుక్రొం, బదను లకోరులన్
పిడముఁ బక్కున జేసినఁ ద్రుంచి యుర్వి
టన్, జదిపెఁ దదీయ బాపహయసారథి
కేతుల నాతఁ డుగ్రుఁడై .
చంద్రా. ౬ ౭౦

సీ మును బూది పొలదిండిమునము పక్కునఁ
ద్రెంచి భవుని మెప్పించు నీ బంటుతనము
చంద్రా ౩. ౫౬.

(దీని యామ్రేడితరూపము "పక్కుపక్కు")

వ. ... అంచుల సంచరించు రాయంచబోఁదల
కాకుగా మక్కునఁ బక్కుపక్కునఁ బొడువ
పొక్కించుక విచ్చుకొట్టు కెత్తమ్మి కొంగ
దల ... చంద్రా. ౫. ౬౩.

ఉ పక్కునఁ దిట్టినం గసరి పల్కును ...
వి ప్ర. ౫. ౨౯.

సీ పక్కుపక్కున నంఘ్రిపాశముల్ విసఁ
ద్రుంచి . మను చ. ౪ ౧౦౩

పక్కు². ఎండినవట్టు, వరుగు.

ఉ చిక్కులు పడ్డ చెంద్రుకలు చిక్కి వలంగిన
కమ్మపూవులుం, జక్కగి మోవులుం గుసుమ
సాయకముద్రలు చిట్లు గందపుం, బక్కుల
తోడి దేహములు వి పు ౬. ౨౭.

౨ ఎండు మెదుకు

గీ ఎండుమెదుకులు పక్కునా నెసఁగు ...
ఆం భా. ౨. ౨౫౭.

౩ పరిపాకము

వ ... ఇవ్విధంబున నయ్యార్యావళియు వని
మాలఁ జెనంగి యక్కిరీటి చక్కని మనంబు
పక్కు గానక .. హర ౭. ౧౩౪.

౪ (త పక్కు) పగులు, బీఁట (చూ. పక్కు
గోను)

(విశే) వృద్ధుఁడు, ముసలివాఁడు (పక్కువంటి
వాఁడు)

సీ .. డొక్కు ముదురు పక్కు పన్న, యుర
గడం బనఁగను సలయు వృద్ధాభిధ .
ఆం భా. ౨. ౧౧౯.

౫ పక్కుగోను

పక్కుగోను. అ. క్రి (√పక్కు²) బీఁటలు వాఱు

వ. అంతం గంతుండు నిజరక్ష్యాధిదేవత ప్రసన్నం బై నంతియ సంతోషించి యుద్దేశికం గామాధికారంబుసేసి పరమేశ్వరున కెఱిం గించి పక్కుగొన జేయుదు నని తలంచి గౌరి హృదయంబు న్మదనాస్త్రంబున భేదించిన నాక్షణంబ ... శు. సం. ౫ ౫౦౭

పక్తిక. సం వి ఆ. స్త్రీ గౌరసర్షపము, గౌర వర్ణముగల ఆవ ్రీ (వై ని)

పక్తిశూలము. సం వి అ న తిన్నపదార్థము జీర్ణ మగునపుడు కలుగు శూలబాధ

పక్త్రిము. సం వి అ న ౧ గార్హపత్యాగ్ని ౨ గృహస్థ ధర్మము

పక్త్రిమము. సం విశ (అ ఆ అ) ౧ పండి నది ౨. పక్వ మైనది, పరువమునకు వచ్చినది ౩ పాకముచే సిద్ధించినది, వండఁగా వచ్చినది

పక్వకృత్తు. సం విశ (న్) ౧ పక్తిము చేయు నది, పరిపాకము నొందుచునది, భక్షము చేయు నది. ౨ వంటునది

(వి. త్ పుం) నింబము, వేము ్రీ

పక్వకేశుఁడు. సం విశ (అ ఆ శ అ) నెరసిన వెంట్రుకలు గలవాఁడు

పక్వము. సం విశ (అ ఆ. అ) ౧ పరిణతము, పరిపాకము పొందినది ౨ పండినది ౩ పరువము నొందినది పూర్ణముగా ఎదిగినది ౪ వినాశో న్ముఖము, పోవనున్నది (ఉదా పక్వోన్మాన జ్వరి స్త్రీణామ్) ౫ వండఁబడినది (స్మృతి. ఆమము) ౬ జీర్ణించినది, అఱిగినది

వి. అ న ౧ పాకము ౨ కాచిన పాలచేఁ గలిగిన పెరుఁగు (శే ని వై ని)

పక్వరసము. సం వి అ పుం వండఁజేసిన అన్న గుడాదుల రసము మద్యము (వాచ)

పక్వవారి. సం వి ఇ న ౧ గిండి ౨ కాఁచిన నీరు

పక్వాధానము సం వ అ న = పక్వాశయము.

పక్వాన్నము. సం వి అ న. వండిన యన్నము, వండిన యాహారపదార్థము

పక్వాశయము. సం. వి. అ. పుం. దేహమందు అన్నముపక్వ మగుకోశము

పక్వేష్టక. సం వి ఆ. స్త్రీ కాల్చిన యిటిక, పండిటిక

పక్షకము. సం వి అ పుం ౧ పక్షద్వారము, దిడ్డివాకిలి ౨. పక్షము, ప్రక్క. ౩ పక్ష శాల (వై ని)

పక్షచరము. సం వి అ పుం. ౧ కదుపు వీడిన ఏనుఁగు, గుంపున వీడి విడిగాఁ దిరుగు ఏనుఁగు ౨ పక్షి ౩. ఒంటరిగాఁ దిరుగు జంతువు (వై ని)

పక్షచరుఁడు. సం వి అ పుం ౧ చంద్రుఁడు ౨ పార్శ్వచరుఁడు, ప్రక్కఁ దిరుగు సేవ కుఁడు

పక్షతి. సం వి ఇ స్త్రీ ౧ పక్షమూలము, ఱెక్క మొదలు ౨ పక్షమందలి మొదటితిథి, పాడ్యమి

పక్షద్వారము. సం వి అ న ప్రక్కగా నుండు ద్వారము, దిడ్డివాకిలి

పక్షధరము. సం విశ (అ ఆ అ) ౧ ఱెక్కలు దాల్చినది ౨ ఒక పక్షమును అవ లంబించినది (వి అ పుం పక్షి)

పక్షధరుఁడు. సం వి అ పుం. ౧. చంద్రుఁడు ౨ పక్షపాతి ౩ పక్షస్థతిథిమానాదిధారణా శక్తి గలవాఁడు ప్రసన్నరాఘవనాటక చింతా మణ్యాలోక కృతికర్త యగు జయదేవుని బిరుద నామము (వాచ)

పక్షనాడి. సం వి. ఈ. స్త్రీ. ఈఁకయొక్క గొట్టము

పక్షపాతము. సం విశ (అ. ఆ. అ) ౧ పక్ష ముందు పాతము కలది, పక్షపాతము కలది ౨. పక్షముయొక్క పాతము కలది.

వి. అ. పుం. ౧. ఒక ప్రక్క కొఱఁగుట, ఒక ప్రక్కకు ప్రాలుట)
౨. ఒక్కదానియందు అభిమానము; అసాహాయ్యమగు సాహాయ్యము ౩. పక్షులకు ఱెక్కలూడుట ౪. ఱెక్కలు ప్రాలుట

**పక్షపాతి.** సం. విణ. (స్త్రీ. నీ. స్) ౧. పక్షపాతము కలవాఁడు, ఒక పక్షమునం దభిమానము గలవాఁడు, సహాయుఁడు ౨. ఱెక్కల పాటు గలది

**పక్షపాళి.** సం. వి. ఇ. పుం. పక్షద్వారము, ప్రక్కవాకిలి

**పక్షబిందువు.** సం. వి. ఉ. పుం. (ఱెక్కలపై చుక్కలు గలది) కంకము రాపులుఁగు.

**పక్షభాగము.** సం. వి. అ. పుం. ఏనుఁగు పార్శ్వభాగము (అమరకోశము)

**పక్షము.** సం. వి. అ. పుం. ౧. పతత్రము, ఱెక్క, వాజము, అంపగఱి, బాణ పుంఖమునఁ గట్టు ఱెక్క
౨. (పాడ్యమి మొదలు పూర్ణిమవఱకుఁ గాని అమావాస్యవఱకుఁ గాని) పదునేను దినముల కాలము
౩. పార్శ్వము, ప్రక్క
౪. దేహార్థము, దేహముయొక్క చెరిసగము వైపు.
౫. తెగ, వర్గము
(ఉదా: ఉభయ పక్షముల సైనికులు, ఉభయ పక్షములవారు.)
౬. (కేశార్థక పదములకు పరమైనచో) సమూహము.
(ఉదా: కేశపక్షము, కచపక్షము, మొ.)
౭. (తర్క) సందిగ్ధ సాధ్యవంతము
("పర్వతో వహ్నిమాన్ ధూమాత్" అను చోట ధూమహేతువుచేత సాధింపఁదగినది వహ్ని - అదిగల పర్వతము - పక్షము)
౮. వాదముయొక్క పూర్వోత్తరావయవములలో నొకటి, కోటి పూర్వపక్షము, ఉత్తర పక్షము.
౯. (జ్యోతి) రెండు అను సంఖ్య.
౧౦. దేహము
౧౧. నృపకుంజరము, రాజెక్కెడి ఏనుఁగు
౧౨. బలము, సేన
౧౩. విప్రతిపత్తి, విరోధము
౧౪. గోడ
౧౫. గృహము, ఇల్లు
౧౬. ప్రొయ్యి రంధ్రము
౧౭. అంతికము, దాపు.
౧౮. కంకణము, వలయము.
౧౯. శుద్ధి
౨౦. సహాయుఁడు
౨౧. సఖుఁడు, చెలికాఁడు
౨౨. పిచ్ఛము, నెమిలిపురి
౨౩. పార్శ్వద్వారము, ప్రక్క గుమ్మము
౨౪. విరోధము (వై. ని.)
౨౫. వికల్పమునందలి కోటి.
క. ఇదియొక పక్షంబున మం, చిది యగు నగుఁ గాక యేమి చిరవిక్రమ సం, పదగలరాజున కుచితమె, పదన త్యాగంబు మానువచ్యుతి గలదె ... కేం పంచ. ౩. ౧౪.

**పక్షమూలము.** సం. వి. అ. న. ౧. (పక్షతి) ఱెక్కయొక్క మొదలు. ౨. పక్షమున మొదటి తిథి, పాడ్యమి.

**పక్షవాదము.** సం. వి. అ. పుం. ఒకపక్షము నవలంబించి వాదించుట

పక్షవాహనము. సం వి అ పుం. (ఱెక్కలచేఁ గొనిపోఁబడునది) పక్షి

పక్షశాల. సం వి ఆ స్త్రీ పక్షకము, పార్శ్వ గృహము

పక్షసుందరము. సం. విశే. (అ ఈ అ) ఱెక్కలలో అందము కలది, అందమైన ఱెక్కలు కలది (వి అ పుం) లోధ్రము, లొద్దుగ చె

పక్షహతుఁడు. సం. విశే (అ ఆ అ) ౧ ఒక పార్శ్వము రోగముచేత పడిపోయినవాఁడు. ౨. ఱెక్కలపై కొట్టఁబడినవాఁడు ౩ ఱెక్కలతోఁ గొట్టఁబడినవాఁడు

పక్షాంగము. సం వి అ పుం. అహోరాత్రము, వాసరము (వై. ని)

పక్షాంతము. సం వి అ పుం ౧ పక్షము యొక్క అంతము, పక్షముయొక్క తుద ౨. పున్నమ ౩ అమావాస్య ౪ పక్షాగ్రము, ఱెక్కకొన.

పక్షాంతరము. సం వి అ న అన్యపక్షము, మఱియొక పక్షము

పక్షాఘాతము. సం వి అ పుం ౧ శరీరము యొక్క ఒక పార్శ్వము పడిపోవునట్లు చేయు రోగము. ౨. వాదమందలి యొక పక్షమును ఖండించుట

పక్షి. సం. విశే (ఇ ఈ ఇ) ౧. ఱెక్కలుగలది ౨. ఒక పక్ష మవలంబించినది.
(వి. ఇ పుం ౧ పులుఁగు, పిట్ట. ౨. అమ్ము, బాణము.

పక్షికీటము. సం వి అ పుం అల్పపక్షి, నీచ పక్షి.

పక్షిణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుపిట్ట. ౨. రెండుపగళ్లతోఁ గూడినరాత్రి, తొంబది గడియలకాలము. (పక్షిణ్యాకాచము చూ) ౪. పున్నమ

పక్షిపుంగవుఁడు. సం. వి అ పుం. పక్షిశ్రేష్ఠుఁడు, (జటాయువు, గరుడఁడు, సంపాతి. మొ)

పక్షిబంధనము. సం. వి. అ. న. ౧. పంజరము ౨ పక్షులనుబట్టు వల (వై. ని)

పక్షిరాజు. సం వి. ఉ పుం పక్షులకు రాజు (గరుడఁడు, జటాయువు, సంపాతి మొ)

పక్షిశాల. సం వి ఆ స్త్రీ ౧ నీడము, గూడు ౨ పెంపుడు పక్షుల నివాసమునకై కట్టిన గృహము

పక్షీకరించు. సం స క్రి (తనపక్షముదిగాఁ జేసికొను) అభిమానముతోఁ గాని ప్రేమతోఁ గాని స్వీకరించు.

గీ. ధర్మజాని కార్య మఖిల బృందారకులకు,
సానవము నీవు నీకుఁ బ్రియంబు గాఁగఁ,
జేయఁబూనిన క్రతువుఁ బక్షీకరించి, కరుణ
దలఁకొత్త రక్షించుకాక యనుచు ...

జై భా ౪ ౨౬.

వ. రతిబడలిక వాయఁ గరంబురఁబులఁ జల్లాడు
పువ్వుబోఁడుల శయక్షకశయ సమాక్షిప్త
ఘనసారక్షోదంబులం బక్షీకరించుచు ...

చంద్రి. ౪ ౧౦౪

పక్ష్మకోపము. సం. వి. అ పుం. నేత్రరోగ భేదము. (ఱెప్పవెండ్రుకలు కనుగ్రుడ్డు నందంటుకొనఁగాఁ గలుగు కంటిమంట)

పక్ష్మము. సం. వి. అ. న. ౧. ఱెప్పవెండ్రుక. ౨ పక్షియీఁక. ౩. నూలిపోఁచ. ౪. కింజల్కము, పుష్పకేసరము ౫. పుష్పచ్ఛదము. ౬. తంతు తూలాదులయొక్క మిక్కిలి చిన్న భాగము. (శ. ని.)

సీ. పసిఁడి సలాకపైఁ బగలు చాటుట గాక ...
విక్ర. ౭. ౪౪.

౨. దూషించు.

క. కన కత్తి ముక్కుడుస్సిన పసరమువలె రేఁగి, పరుషభాషల నన్నుక, విముపక పగఁ చాటుచుం బో, మ్మసమున, నన దండపాలుఁ డట్లొనరించెఁ గేం కంచ .. ౧ ౬౦౦

పగటిఱేఁడు. వి (పగలు + ఱేఁడు) అహర్పతి, సూర్యుఁడు.

గీ కవులమురంగొంగుపతొన్న లోకములకున్న, పచ్చగుఱ్ఱపువక్రీఁడు పగటిఱేఁడు
ఇందు ౪ ౮౧.

పగటివే (లుపు) ల్పు. వి (పగలు + వేల్పు) సూర్యుఁడు

ఆ చాలకపముఁ బూని సంయముల్ వనముల, నిన్నుఁ గాంచువేడ్క నున్నవారు, దగ్గనం బొసంగఁ దగు రామ యని మేలు, కొల్పు వనగఁ బగటివేల్పు బోడిచె ...
అధ్యా అయో. ౪౬. పొ ౧౭ సం

పగటు. స క్రి ౧ ప్రకటించు, బయలుపఱచు

క. ధర పెచ్చారలు చేసిన, దురితంబులు మచ్చరింప డోస మంటమహో, పురుషుల కొకకొద రెకికఁ, బోరసిన నది పగటు పాపము వృధాసనుకే . కళా ౭ ౧౮౮.

సీ. వారినీలసోపానసరణి గాఁచోలను బగటు చున్నది నల్లపాఁపపోరు. ప్రభా ౧ ౬3

సీ. పన్నీర పూరమిళన్నేత్ర యొగళంబు పద నిచ్చు మదనునంబకముఁ బగటు
రా వి ౪. ౮౭.

౨. తిరస్కరించు.

సీ. పద్మరాగప్రభం బగటికర్ణంబులు కాంచన దీధితి మించుతనువు. వారిక్చ ... ౨. ౪౧.



సీ పవడంపు సుసగొంపుఁ బగటు కెంజెడగుంపు జిగి యొకపఁ జెట్టుఁ జిగురుఁ గొలుప.
వాల్మీకి ౧. ౪౧.

(పై రెండు ప్రయోజనములందు ఔపమ్యద్యోతకము)

వి (సం ప్రకటమ్. ప్రా పయడం త పకట్టు) కాంతి, శోభ; చక్కఁదనము, సౌందర్యము.

సీ అవయవసరసభావవములఁ బంపొందుమృగ విశాలేక్షణల పగటు మాప ...
హ న ౫ ౧౭.

గీ అభినవాలోకనోత్కంఠ నధిపుఁ దలఁగ, నల రుఁబోఁడి సమగ్రలజ్జానుభావ, భావ రైతెరమాటునఁ బగటు చూపఁ, జూపఱకుఁ గోఁచెఁ బరిణయనన్యాప్తి యనుడు ...
వసు. 3. ౮౦.

(ప్రకాశము. అని శ ర)

౨ విధము, రీతి.

క మృగమదమున రుచి పుట్టిన, పగిదిన్ జెలికా నను బండు పండివరీతిం, దగ సురభి పసిఁడి నాదవిన, పగటున యౌవనము దనర బాలా మణికిన్ ...
బిల్హ. ౧ ౫౦.

3 వైరము

గీ పేరి, మనఁగఁ బగ టన నొంటమి యనఁ బగ యన, నొప్పమి యనంగఁ గంటు నా నొప్పు వైరము ... ఆం. భా. ౧. ౧౩౪.

౪. విప్రలాపము. విరోధోక్తి.

గీ. ... కచ్చు పగటు కంట, సమ్మ సాఁగను విప్రలాపమ్ము చెలఁగు ..
ఆం. భా ౧. ౧౧౬.

౫. (సం. ప్రకటః, ప్రా పయడం.) ప్రకాశము, ప్రాకట్యము

గ్యా. ఎన లేనిపాద వైన యీ మేనితోడఁ, బగటున నీపురిఁ బగలు చొచ్చినను, బగ లౌను

రాజ్యసభటులకు వాకు
రం. రా. యం. ౪౮౧ పా. ౫ పం

విణ. కాంతి గలది, మనోజ్ఞము.

గీ పగటిముత్యాలముగ్గులు పచ్చతోరణములు.
ల వి. ౫ ౨౨

సీ పగటుపావలు మెట్టు బట్టు కైవారముల్ జోడింప వారగాలసీద కేగు .
కువల ౫ ౯.

సీ హిమువారి యధికశైత్యము గుణం బయ్యెను పగటువాకోయిల పత్రి మయ్యె ...
ప్రబంధ ౫ ౨౦

జా ః పగటుఁదనము

పగటుఁదనము. వి (√పగటు) ౧ మనోజ్ఞము, ఒప్పిదము

సీ వరనువర్ణాస్పృశ్యవర్ణభామలు భజింపఁగఁ బ్రౌఢిమను మనుపగటుఁదనము
హ న ౨ ౧౮ (నలపక్షము)

౨ ఉద్ధతి, ఉదుటు

సీ వరనువర్ణాస్పృశ్యవర్ణభామలు భజింపఁగఁ బ్రౌఢిమను మను పగటుఁదనము . .
హ న ౨ ౧౮ (హరిశ్చంద్ర పక్షము)

పగడ. వి (సం పటికా క పగడె త పగడై)

౧ పాచికలమీఁది చుక్కలు (కర)

౨. (క పగడె = అక్షము) పాచిక. (చూ. పగడసాల.)

3 (స) పాచికల ఆటయం దుపయోగించు ఒకటియను సంఖ్య

గీ. పాచిక యనంగ నవర నా పాశక తగుఁ, బగఁగు నేకవచనమునఁ బగడ యనఁగ . .
ఆం భా. ౨. 30౫.

(పగడ పంటిదొర = ఏకదంతుఁడు, వినాయకుఁడు.)

సీ బొరియపాగా జక్కి సెరరాకు పిల్లారి పగడ పంటిదొర గొప్ప మెయిబ్రోడ
వేంక. దేవ. ౬.

జ : పగడసాల.

పగడంపుజిట్ట. వి (పగడము + జిట్ట) ఒకజాతి పక్షి.

సీ ... పగడంపు, జిట్టగొబడి దాబకీనువ వద్రంగి గున్నంగి పోపిట్ట కూడబాకు

గీ అనఁగ నిట్లని పక్షిభేదాఖ్య లలరు
ఆం భా ౨ ౯౭

పగడపుఁ దీఁగెలు. వి ఒ (√పాదము) ధాన్య విశేషము

సీ మణిసరు ల్మసరులు ముంకెన ల్బగడంపు తీఁగెలు మడ్రిపాలు దేవసరులు
హంస. ౪ ౧౭౭

పగడపురిక్క. వి (పగడము + రిక్క) ఆర్ద్రా నక్షత్రము (? )

పగడము = పవడము వి నవరత్నములలో నొకటి, విద్రుమము

క పగడపు గొమ్మౌ విపయుఁ, నగ వుదయించిన విధంబునం బ్రస్ఫుట మై .
హర ౪ ౧౯

ద్వి. పగడంపువాతెఱ పద నింకి వాడ, జిగి దక్కి పాపట సీకాకు వడఁగ .
ద్వి కల ౪ ౧౮౫ పం.

చ పగడపుఁ జాయచెందిరముఁ బ్రామిన పాండ్య వధూకుచంబుల, న్నగు నరుణంపు బొండ్ల ముల నారికెడంబులు .. ఆము. ౧. ౫౪

జ : పగడంపుజిట్ట, పగడపుఁ దీఁగెలు, పగడపురిక్క

పగడసాల. వి (పగడ + సాల). త. పగడైచ్చావై ) ౧. ఇష్టజనద్యూతము, తెచ్చెలు లాడెడు జాదము.

సీ. ... ఇష్టజనద్యూత మెసఁగుచుండుఁ బగడ
సాల యవంగ అం. భా ౨. ౩౦౫

(ప్రాఁత ప్రతిపా. "అష్టజనద్యూత" మలరు
చుండు. క్రొత్త ప్రతి. పా)

౨. పాచికల యాట

గీ. పందెములు గోరి వైచుచు పగడసాలఁ,
దారతో నాడు హారణాంకుఁ జేరి మ్రొక్కి
శశాం ౪ ౧౬౬

గీ. మగిపోగిఱుఁ జూపె నాయింతి మరునిదంతి,
పగడసాలను గెల్చిన పంతమునను
శశాం ౪. ౬౬

3. జూదపుఁ బలక

చ కురుఁజాలు సారె లచ్ఛమణి కుట్టిమభాగము
లిండ్లు మధ్య గోపురము పణంబుగా నిడిన
భూరి సువర్ణముగాఁ జటుర్ధిశా, సరసిజనేత్ర
లర్థిఁ జపుసారెల నాడఁగ నుత్కటాత్మసం,
చరణము మీఱఁ బూ న్పగడసాల యనం
జపువీథి చెల్వగున్ . చంద్ర. ౧ ౬౪

౪ (పగడ + సారె) పాచికలు సారెలు గల
సొగటాల పలక (శ ర)

ద్వి పగడంపు పలకపై భవ్యరత్నముల, జగ
దంబు గులికెడు సారెలు వన్ని, కనకకేలిత
పాశకములతోఁ దెచ్చి, యునిచె వారల
చెంత నొక దివ్యకాంత, జగదీశుఁ డపుడు
శ్రీసతి మోముఁజూచి పగడసాలిద తెచ్చెఁ
బడఁతి నీచెలియ, యాడెదవే యొకయాట
నాతోడ . విష్ణు. పు. ౨. ౯ (శ ర)

ద్వి. ... నలుండు కడఁక నిట్లనియె., బగడసా
లాడంగఁ బ్రమదంబు నొంది, జగదీశ యుచ
టికిఁ జనుదెంచినపుడు, నినుఁ జిన్న పుచ్చుట
నీతిగా దింక ...
ద్వి. నల. 3 ౧౩౭. పా. ౧౪ పం.

పగతుఁడు = పవతుఁడు. వి. (√పగ పగ
+ అతఁడు అని. శ. ర - వి. పగతురు)
శత్రువు.

క. మొగయొనెడ నగ్గమైనను, వీగియారుఁ
వీఁడు సనినఁ బడికిటఁ గొఱసం, బి గడు
బెడిదముగఁ బొడిచెం, బగతుఁడు గను
మిడిసి నేలఁ బడి తన్నికొనన్
భార వివా ౨ ౩౫౧

క తెగనిండఁ దిగిచి యొకయా, శుగ మప్పాం
ద్రకునియురము సౌనిపెఁ దొలుత నా, నగ
ధరు తమ్ముఁడు దానం, బగతుఁడు వడవడ
వణంకి భ్రమగొని తిరుగన్
హరి ఉ ౬. ౧౬౪

చ. పగతురు మెయ్యొరు న్బిరదుపాటలలో గెడ
గూడఁ .. కవు 3. ౭౭.

క. పగవారియింటఁ గుడిచిన, పగుఁ దమ కను
మాన మమృతమైనను దారుం, బగతురకుఁ
గుడువఁ బెట్టఁగఁ, దగ దొడళుల కెప్పు
డెవ్విధము వాటిలునో .
భారం. ఉద్యో 3. ౨౨౪.

పగతురాలు. వి (√పగ) శత్రురాలు (శ ర,
చి ని)

పగతువాఁడు. విశే (√పగ) శత్రుసంబంధి,
పగతురకు సంబంధించినవాఁడు

చ ... ఎందునుం, బరసతిఁ గోరువాఁ డధిక
పాతకుఁ డీ చెడుబుద్ధి నీకు నె, వ్వరు మది
కింపుగాఁ బగతువా రయి చెప్పిరి రాక్ష
సేశ్వరా ... భా రా ౭౮ ౨౫౫

పగదాయ. వి. (పగ + దాయ) పగతుఁడు,
శత్రువు

చ. తగిదా పగదాయవెన్నెల, న్మానిఁగెడుపూల
నెత్తి నయముం బ్రియమున్ దయ మున్నుగాఁ
గవన్ . వసు. ౪. ౪౫.

సీ. తోరంపుసాంబ్రాణి ధూపధూమము గట్టు
పగడాయి బాకాలబారు దీర్చ ...
దశా. ౧ ౨౬౫

**పగడాయతనము.** శత్రుత్వము.

చ ... మానఁదగదా పగడాయతనంబు లింత
టన్ ... హ. న. 3 ౨౪

**పగదారి.** విశ. (పగ + దారి) పగ ధరించువాఁడు; శత్రువు. (చూ దారి.)

సీ. ఆవెనుగొలుకు యాయావరవ్రతధారిఁ బగ
దారి యని దన్ని పండ్లు గొలుకు ...
నైష. ౭ ౧౩౦.

**పగదెంచే.** స క్రి (√పగ) వధించు

సీ. ... పగదెంచె నెలుముఁజేసె

గీ నణఁచెఁ జెండె ననంగఁ బొం దగు విధించె
ననుటకు సమాఖ్య లై అం. భా. 3 ౧౨౩

**పగప (వ) ట్టు** = పగగొను అ క్రి. సం క్రి (పగ + పట్టు) వైరమువూను, ద్వేషించు.

ఉ. ... తా, నే పవిదారిబారిఁ బడిరొం బగ
పట్టెను దత్తినూజుఁడుఙ ... కకు. ౪ ౧౪౩.

(వ్యవ) పాము దానిని పగపట్టినది

(పంటఁ బగపట్టు = పాముపలె తీక్ష్ణవైరము వూను).

క మచ్చరమున నమ్మదనుఁడు, పచ్చనివిలుఁ
బూని పంటఁ బగపట్టె చెలీ.
శుక ౧. ౩౯౭.

ఉ. ఓర్వదు బంధుజాల మదకొత్తున నొత్తును
మామగా రిదే, పర్వినమాత్ర పంటఁ బగ
పట్టును బావ శశాం. ౩ ౬౭.

**పగెఱ.** వి (√పగ ఈ పగర) శత్రువు. (చి. వి. ద్రా)

సీ. అద కోకిలాలాప యనియాడు వడు మని
యేసుంగుపగఱశేఁగొనుఁ జూచు ...
రామా. ౫. ౨౪౧.

వ. ... సౌత్తిమ్మలపగఱ వుత్తెంచినయుడుంగర
లని ముంగిళ్ల రంగు మీాఱు ముత్యాలయరుం
గుల చెఱంగులం దుఱంగలించు మెఱుంగులు
కరాంగుళుల విప్పి కప్పుకొనఁ బోరువారు
నై . వసు ౪. ౨౩.

వ. ... పొగిరు వితెగి గాదు మఱుంగునం
బఱఁగు పగఱలం గావు మని కరతలంబుల
వ్రాలిన కాంతిరసంబురీతి
చంద్రా ౫ ౧౨౪.

సీ . వైరి గీ మనును నొంటనివాఁ డన
మూర్తిఁ డనఁగఁ, బగతుఁ డనఁ బగి అనఁ
బగివాఁ డనంగ, గం టనఁగ గొంగ యన
నూడుకాఁ డనంగ
ఆం. భా. ౨. ౧౭౫

**పగలు** = పవలు. వి. జా. (క. పగలు, హాగలు త. పకల్, పవాల్. బ. పగళులు, పగళ్లు) ౧ దివాభాగము.

క పది దినము లైదు ప్రొద్దులుఁ బదపడి
రెవ్వాళ్లు నొక్క పగలుఙ రేయుఙ
భార. ఆది. ౧. ౬౭

శా. గురు నట్టినారు పదివే, వురు గాచిన శాల్లి
సైంధవునిఁ బగలిటిలోఁ, బొరిగొనునట్లుగ
నరునకు, వర మిండి వేల్పులార వారని
కరుణన్ ... భార. ద్రో ౨. ౩౪౬.

సీ. మర్యోదువాసరంబు లశాలవర్షంబు గురి
యింపఁ బంపు కెంగుళ్లగిములఁ, బగళులు
రేలు కుంభద్రోణములు గాఁగ ...
హార. ౨ ౧౫

గీ. పగ అనంగను బవ లనఁ బరఁగు నహము
ఆం. శా. ౧. ౯౩.

ద్వి. ప్రేమతో నాపగల్ చేయుమ భామ,
భామున కర్చునల్ సల్పెడు వారు . .
పండితా. పర్వ ౧౬. పా. ౨౪. పం

౨. మధ్యాహ్నము.

క. పగలిటిభానుఁడు వోలెను, ధగధగ యను
మెంగము దివుర .. ఉ. హరి. ౧. ౧౬౨.

పగలింటికడ. దినాంతము, సాయంకాలము.

సీ. పగలింటికడ నాడు తిగికింటిరొుకమాని గడి
తంపునిడువాలుజడ లనంగ ...
ఆచ్చరా ఆరా ౧౩.

చ: పగటికోఁడు, పగటివేల్పు, పగలువత్తి, పట్ట
పగలు.

పగలువత్తి. వి (? హగలు బత్తి, త పగల్
వర్తి). ౧. పగలువలెఁ జేయువత్తి, ఒక విధమగు
బాణసంచు.

గీ. రోదసీ సరసీ జాలపాద పద్మ, కుముద
రూపము లైతంచె కోలగములు, చెలఁగు
చిరుమలు పగలువత్తులును నమరఁ, బరఁగు
బహుచిత్ర బాణవైభవము గనుచు ...
ప్రబంధ ౨౪

గీ. భూరికైరవవనరమా ముఖవివర్ణ, భావసంప
త్కరం బైన పగలువత్తి, కలట లేద
ప్రుక్కఁ జోరులు గుట్ట లెక్క, వేగ జని
యించె జిగి నిక్క లేగుఁజుక్క
హంస. ౫ ౨౮౪

గీ. పగలువత్తులు దినకరప్రభల వెలుఁగఁ వచ్చెఁ
బెండ్లికుమారుండు . కృష్ణ. ౪ ౧౧౬

పగవాఁడు. వి. (√పగ - త పగైవన్)
శత్రువు, విరోధి.

క. పగవారియింటఁ గుడిచిన, నగుఁ దమ కను
మాన మమృత మైనను ...
భార. ఉద్యో ౩. ౨౭౪.

మ. పగవాఁ డల్పుఁడు గాఁడు సంగరవిధిం
బలోత్కలం బోయినాఁడు గణింపం డెదిరిన్.
హరి. ఉ. ౪. ౨౭౩.

మ. పగవా రై నగధారితోఁ దొడరి తద్బాహా
బలక్షీణులై, తెగి కేయూత్న ముఖానురా
గణులు ముక్తిం జెందరే ..
ఉ. రా. ౫. ౧౪౭.

పగడి[1]. వి (క పగడి. త పగుడి.) ౧. ఉపద,
కానుక

సీ. చెంగావివలిపెంపు చీరంచుసరిగ దాల్పదే
శోణఘృణులకుఁ బగిడిఁ బెట్ట .
హంస. ౪. ౭౫.

౨. కప్పము, పన్ను

ద్వి. నాసీమపగిడి రొుంతియు నాఁడు నాఁడె,
చేసేత మునుపుగాఁ జెల్లించినాఁడ ..
ద్వి పరమ. ౬. ౪౬౧. పా

(చి. ని. పా. 'పనిఁడియంతయు' ముద్రి. పా)

పగిడి[2]. వి వట్రువపండ్లు పండుదోసజాతి. †.
(చి. ని. కిరబుజము † క ర.)

పగిది[1]. వి (సం ప్రకృతి ప్రా పకతి) ౧
రీతి, విధము, ప్రకారము

సీ. మదనసముజ్జృంభితమండలాకారు లై భద్ర
ద్వీపంబుల పగిదిఁ బొల్చి .
భార కల్య. ౨. ౨౩౩.

గీ. జలదరేఖాయుతం బైన చంద్రుపగిది ...
పార. ౪. ౭౨

క. ఈపగిదిన్ పాత్రాబితి, కోపోద్యాగమున
వగలఁ గుందుచు ... పారి. ౧. ౧౦౨.

పగిది[2]. వి (క త పగది) కప్పము, పన్ను

ఆ. సందుఁ జాదిగాఁగఁ గొందఱు గొల్లలు,
పగిదిధనము దీర్పఁ బాలుఁజమురు, సులుపఁ

గొంచు, గంటుఁడున్న చోటికిఁ బోవ్వ వారిఁ
గాంచె ననతిదూరమునను. వి. పు ౭. ౭౩

సీ. అరి బడి యప్పన మప్పన పంగంబు పంటె
గన్నాడి కో ల్పగిది బెడిగ కో రనఁగాఁ
జెలఁగురు భాగధేయంబు ...
ఆం. భా ౨. ౧౯౨.

పగిలించే = పగులంచే స క్రి (√పగులు).
ఛేదించు, బ్రద్దలుకొట్టు

సీ. బ్రహ్మాండభాండంబు పగిలించి భూతినిచ్చె
తన్య మొనరించె శంఖరవము ...
భార. విరా ౪. ౧౨౦.

సీ. భాండసంభారంబు పగిలించి గోడలు గోరాడి
గరిపెలు కూలఁద్రోచి ...
హరి పూ ౬. ౧౩౮

క. నరుఁడు ధనుర్గుణరావ, స్ఫురణంబును దేవ
దత్తభూరిరవము నం, బరము పగిలింప
జాజా, శరముల గురుసైన్య సరభసత్త్వం
బుడిపెన్ . .
భార. భీష్మ ౩. ౧౫౩, ఉ రా ౨ ౬౧.

౨. చించు.

క. కనుఁగొనెడు రోగివల్లభు, ఘనతర మైనట్టి
ధైర్య కంచుకము దలం, ప నితర సాధన
ములచేఁ, జినుఁగునె యని మరుఁడు విరు
లచేఁ బగిలించెన్ ... చిత్రభా. ౩ ౭౫.

పగులఁగొట్టు. స క్రి. (పగులన్ + కొట్టు)
పగుల్చు, ఛేదించు.

సీ. ఒకయింత యేమఱియున్నఁ గవ్వము దీసి
పక్కన భాండముల్ పగులఁగొట్టు ..
దశా. ౯ ౧౯౪.

సీ. పగులఁగొట్టించి యుద్భటవివాదప్రౌఢి గాఢ
డిండిమభట్టు కంచుఢక్క.
(శ్రీనాథుని చాటువు.)

పగులు. అ. క్రి. (క. పగు). ౧. బ్రద్దలగు, ఛేదిల్లు

క. కాటించి నిటలనయనుఁడు. హాటకగిరిచాప
వల్లి నహీశంజని బ్బా, స్ఫోటించెఁ దక్కటో
రమ్ము, హాటంకృతిఁ గమలజాండ మట పగు
లఁగన్ భీమ. ౪. ౧౩౨.

సీ. కొగ కొగతోఁ దాఁకి పగులంగ నొరదంబుఁ
బఱచి యాతేరిపై కుఱుకువారు ...
భార. విరా. ౩. ౧౬౯.

క. భువి పగిలెన్ రవి వాగిలెన్, దివి పిగిలెన్
దిగ్గజముల ధృతి సన్నగిలెన్, గవిఁ దగిలెన్
హరుఁడున్ ధృతి, పవి మొగిలెన్ భూరి
భేరిభాంకారమునన్ ..
రా. వి. ౨. ౪౨ దశా. ౨. ౩౮.

౨. తెగు

వ. ...అప్పుడుదండ వాస్తోష్పతి పట్టిన యేమంగు
వలన . క్రుస్సియు వాగిలియుఁ బగి
లియుఁ దీనదశకు వచ్చినం గనుంగొని ..
హర. ౬. ౧౬.

౩. చినుఁగు

క. మొగివిరిసి కొఱకు గూడక, పగులక పెదలం
పున నిడుపుఁ బసిమియుఁ గలశేఁ, జిగు
రరఁటాకులు పెట్టిరి, దిగదిగ నద్దేవియాజ్ఞ
దివ్యపురంధ్రుల్ .. భీమ ౨. ౧౨౮.

౪ భయపడు.

గీ. భయము గొందుము నిర్ఘాతపాతమునకుఁ,
దలఁకుదుము భీషణోల్కాప్రపాతమునకుఁ,
జంచలింతుము పటుదండ చండిమలకుఁ,
బగులుదుము పాశవల్లరీబంధములకు ...
సైద. ౭. ౯౦.

౫ చెదరు.

గీ. వచ్చె నాకస్మికముగ దేవస్రవంతి, నవతి
జలరాశిరాణివాసంబు సహ్య, తనయ
కావేరి శ్రీరంగధామ వసతి, దిగులుపడి
తీరవాసులు పగిలి పోఁ ...
శ్రీరం. మా. ౨. ౫౧.

చ. కాలంబున కేఁగి శేత్రధరకోటి నిజాయత దృష్టి వాఱుచో, బలసి తటాలునం బగిలి పాఱ బరాబరిసేయ . .

సారంగ. 3. ౧౫౪.

వి. ౧. చీలిక. (బ. పగుళ్లు, పగుళులు - చూ. పగుళ్లువాఱు కెం.)

౨. స్ఫోటము. బీఁట.

సీ. ... పగు లన బీఁ టన వంగు దనఁగ

గీ. స్ఫోటము దనర్చు . ఆం. భా. ౨ ౧౩౦

జ : పగిలించు, పగులఁగొట్టు, పగులుచు, పగుళ్లు వాఱు.

పగులుచే (ల్చు) = పగిలించే స క్రి (√పగులు)

౧ బ్రద్దలుచేయు, ఛేదించు

చ . వెస దగ్గతి రోఁగ పాలముం, బగులు తునాగదా నిహతి ...

భార. కర్ణ. 3 ౭౬౩.

మ. ధర దివ్యాస్త్రహతిం బగిల్చి కోల నుత్పా దించి శే దానికి, స్వరజాలంబుల నిల్లుగట్ట మనసైన్యంబుల్ వెలుం బొందె ...

భార ద్రో 3 ౧౬౨

గీ. తలుపులు పగిల్చి గుడిసెలు దల్లు గూల్చి ...

నీలా 3 ౫౫. దశా. ౨ ౧౬౧

౨. విఱుచు, ముక్కలుచేయు.

చ. తలకొని సైనికుల్ గవిసి తాకొని చే రొక్కని పాసి డాసి యం, కిలిగొనకమ్ములఁ బగిల్చి నొగిల్చి ... భాగ. ౧౦. ఉ. ౯౪౯.

పగుల్లువాఱు. అ. క్రి. (√పగులు). చీలు, బ్రద్దలగు, విదారితమగు. (శ. ర)

పగ్గము = ప్రగ్గము. వి (సం. ప్రగ్రహః. ప్రా. పగ్గహో. క. హగ్గవు.)

౧. (గుఱ్ఱము లోనగువాని కళ్లెము మున్నగు వానికిం దగిల్చి లాగిపట్టెడు) పెద్దత్రాడు.

సీ. ధరణితలంబెల్ల నరదంబు చంద్రార్కబింబ ముల్ చక్రముల్ పృథుజవాశ్వ, ములు వేదములు పగ్గములు చతుర్స్వరములు . .

కా. సం. ౨. ౧౬౦.

క. అగ్గలిక నతఁడు హయముల, పగ్గంబులు సడల విడిచి ... భార. విరా. 3. ౧౯౦.

గీ. గ్రహావిభుని తేరి హరులపగ్గములు వదలి

ఉ. రా ౨ ౪౪

౨. రజ్జువు, త్రాడు.

సీ ఎఱుఁగనివానికి నే దేవుఁడు జగంబు గాఁడు పగము పాము కానికగని .

ప్రబోధ. ౧. 3౨

సీ వలపగ్గములు త్రెంచి కలఁబడఁ గొందఱు బొజ్జలు వ్రయ్యంగఁ బొడిచి పొడిచి ...

నీలా. ౨. ౬౬.

3. సాలివాఁడు పడుగు నీడ్చి కట్టెడుత్రాడు

సీ కుంచె మగ్గపుగుంత గూటంబు పగ్గంబు పరికె త్రొక్కుడుపట్టె పలక దోనె ...

హంస. ౨. ౧౧.

౪ తరిత్రాడు, కవ్వపుఁద్రాడు.

ఉ. ... ఆదిమ, వ్యాళము దీనిపగ్గ మయినట్టి యవస్థఁ దలంతు నెప్పుడుం ...

మనుచ. ౫. ౫౦.

పగ్గించే. అ. క్రి. (√పగ్గ) ప్రజ్ఞలుపలుకు, డంబములుకొట్టు.

వ. ... చూప బగ్గింపఁ బగ్గించియు నొగ్గించియు ...

ఉ. హరి. ౬. ౧౦౯. (శ. ర. పా.)

గీ. కటకటా రొట్టె వింత లాకాశవాణి, యూడఁ బలికిన దెటుపోయె నీకఁ బలుక, రాదె యిపు డని పగ్గించి రాజకీర, వాణి పలికిన నాకాశవాణి పలికె. సారంగ. 3. ౨౦౯.

**పగ్గ (గ్గియ).** వి (సం ప్రజ్ఞా ప్రా పణ్ణా) సామర్థ్యము, శక్తి

చ. ... అసమాస్త్రకేళిలోఁ, బలుచెంన లాని మాఱ్ముగల పగ్గెలు తగ్గులు సేసి ప్రోలునన్, గలసి చరింతు రవ్యిలుపకత్తెలు మారుని కత్తులో యనన్ ... ప్రబంధ ౧౬.

సీ నీపుస్నె మిచ్చుట నీపగ్గె కొంయించి బోరు దీర్పకుఁ మంచుఁ గొందుపఱిచి

కువల. ౫ ౫౯

౨. లేని సామర్థ్యమును ఉన్నట్లు ప్రకటించెడు మాట, దంభోక్తి

క. అప్పారాయనిసభలో, మె చ్చొంగితి సాటి లేని మేళంబులలోఁ, జెప్పిఁ బగ్గెగి నీమగి, కిప్పుడు తోఁచును .

చంద్ర వి ౨ ౧౫.

గీ. పట్టి తల నొవ్వ నవ్వగాఁ బవలు రేలు, పట్టి పగ్గెలు ప్రేలు నవ్వారి జరగ .

శుక ౩ ౨౨

గీ కోఁతు లెచ్చుట జాదంపుఁజేఁత లెచట, పగ్గె లటు పెట్టి తిన్నంగఁ జాటి చనుఁడు ...

అచ్చ రా యు ౧౭౮

(సామర్థ్యము - అని శ ర)

జః పగ్గించు.

**పచ.** సం. వి. ఆ స్త్రీ ౧ పాకము, వండుట ౨ పాకముచేయు స్త్రీ

**పచంపచ.** సం. వి ఆ స్త్రీ. ౧ ప్రమానిపనువు ?. ౨. చంపకము. ? (శే ని)

**పచత్.** సం. శత్ర వండుచున్న

**పచతభృజ్జత.** సం వి. ఆ. స్త్రీ. ఎడతెగక వండుఁడు. వేఁపుడు అని ఎప్పుడును చెప్పుట.

**పచత్రము.** సం. వి. అ. న. వంటపాత్రము (శే. ని)

**పచనము.** సం విణ (అ ఆ అ) ౧. పాకము చేయునది, వండునది. ౨. పరిపాకమునొందించు నది - (ఆ. ఈ. అ) పాకసాధనమైనది, (వి. అ పుం. అగ్ని - న పాకము వండుట.

**పచని.** సం వి ఈ స్త్రీ వనబీజపూరకము, అడవిమాదిఫలము

**పచము.** సం విశే (అ. ఆ అ) ౧ వండునది ౨. జీర్ణింపఁ జేయునది.

**పచేరణ.** వి (సం ప్రచారణమ్ క పసరణ) ౧ ఉపచారముకొఱకు పలికెడుమాట, ముఖ ప్రీతివచనము, ఇచ్చకము

క సుచంద్రతి కేఁడు నీచే, తి చలిగి భుజియింపఁ జాలఁ దృప్తి యొదవెడిం, బచరణాగా గిమ్ముల మును, రుచియింపదు కబరిబిందు గ్రోవదివిందుర్ . పాండు ౪. ౧౯౯

౨ నటన. (శ ర)

ద్వి కట్టెండతాఁకునఁ గమలె దేహంబు, ... గొడు గిచ్చి రక్షింపు కువలయాధీశ, యుచిత సవాలక్ష లాం డొల్ల మేము, పచరణ గాదు మీ పాదంబులాన.

ద్వి హరిశ్చ. పూ. ౧౦౦౦.

**పచేరించే** = పచారించే అ క్రి (సం ప్రసరః. ప్రా. పసర క పసరిను) ౧. ప్రవర్తించు, మెలఁగు

చ. ... సత్యభామయుం, గులమును రూపము న్మగనికూరిమియుం గలదాన నంచు నా, వలఁ బచరింపఁగా ... పారి. ౧. ౪౨.

గీ చేలపై నిల్చి తమరేపు నిలుపలేక, బెడి దనమునఁ బర్వుపిడుగుల కడిమి యొంత, యనుచు గేలిగ రచ్చల నాడుకొనుచు, చేది పచరింతు రచ్చటి రాచవారు ...

యయా. ౧. ౭౬.

౨. విహరించు.

సీ పొరలు గన బయల్ పచరింపఁ జనువేళ
  నారామములఁ గేళి నలరువేళ ...
    శుక. ౧. ౧౪౬

(స క్రి ౧. ప్రసరింపఁ జేయు, వ్యాపింపఁ జేయు

ఆ. ఆకసంబునఁనుండి విహంగరాజు, భక్తిసెఱ
  కల నీడ నప్పద్మనాభు, మీఁదఁ బచరించె
  బీరెండ మెఱయకుండ.
    హరి పూ ౭. ౧౮౯

(రాముని మేని కాంతి) సీ నిగిడి చేరువశిల్ల
  నీలోత్పల ద్యుతుల్ పచరించు హరినీల
  రుచులకంటె . భా రా అర ౧ ౧౩౫

ఉ . ఆత్మలో, మండెడు కోపవహ్ని నరి
  మండలిపైఁ బచరించు పోలికన్ ..
  విక్ర. ౪. ౧౧౫. భార విరా. ౨. ౨౪౦

౨ (అమ్ముటకు అంగడియందు సరకులను) అమర్చు

చ. కొనుఁడు పరార్థ్యరత్నములు గోరినవానిన
  యిత్తు మత్తెఱం, గునఁ బచరింతు గంగిడుల
  గోమటు లప్పురి సిద్ధరత్నముల్ ...
    భార ఆది. ౭. ౭౩.

గీ. అప్పురమున వణిగ్జను లాపణములఁ, గలయఁ
  బచరించియున్న నిర్మలనరత్న, రాసు లొప్పెఁ
    కు. సం. ౭. ౪౪, విక్ర. ౭. ౧౧౭.

౩. (వల. కొం.) పఱచు; పడునట్లుచేయు

సీ. పాయంతనం బను జాలరి జలధిలోఁ బచరింప
  వల డిగఁ బాడినట్లు ...

గీ. భానుమండల మంతఁ జాపట్టదయ్యె ...
    ఉ హరి. ౪. ౨౭౧.

సీ. పచరింప కేర్తురు పదియాఱు వన్నె యపరంజి
  పాదంబులఁ బట్టుచేల ...
    కాశీ. ౩. ౧౦౯. మనుచ. ౪. ౬౦.

౪. ప్రయోగించు. (క.) బాణము - ఏయు.

ఉ. అంబకపంచకంబుఁ గలయం బచరించుచు.
    వసు. ౫. ౬౦.

(వ) ఉపాయము - తెలుపు

సీ అడరి రెండవయుపాయం బైన భేదముఁ బచ
  రించుఁ బుణ్యపాపములయందు ...
    భోజరా. ౭. ౧౪౩.

(పలుకుట)

సీ ఉసికొల్ప శబ్దంబు లొకకొన్ని పచరించి
  క్రూరమార్గాన్వేషరూఢి గాంచి . .
    చంద్రా ౧ ౧౬

శా. శాపోక్తుల్ పచరింపకున్న సెదిరించం రాద
  యంటేని నిం, దాపారంపరి మున్నుగా
  మృతుఁడవే నా కిట్టి పీనుంగుపై, సేపుణ
  జూపఁగ నర్హమా సె ఉ రా ౩. ౭౪

౫ చాఁచు చాఁపు

క కాఁగిలింపఁ జే, తులు పచరించు న ట్లు ..
    కుం సం ౫ ౫౯౭

చ అలరుమొుగంబుతోడఁ గడు నిర్మలి నా కడు
  కేల రావు చే, తులు పచరించుచుం దనువు
  ధూళిమెయిం దొరయంగ నేల ...
    మార్కం. ౧. ౨౫౧.

౬. నవరించు, సిద్ధపఱచు ; విప్పు.

సీ మందారతరుపుష్ప మంజరీమండితమ స్తకరైయొ
  ఱుప్పుమహితవీణ, పచరించి త్రిస్థానబంధు
  రశ్రుతిభేదములతోడ షడ్జంబు మొదలు
  గాఁగ, సప్తస్వరంబులు ...
    హరి పూ. ౫. ౫౨.

క. కనుకని కమలమునై దువు, లనువునఁ బచరించు
  కొనుచు నభిముఖు లై ...
    హరి. ఉ. ౬. ౨౩౦.

సీ. చెట్టుపల్ పచరించి చుట్టుఁ గ్రుమ్మితి మనో
  రమ నియ్యకొలుపుమరాళవిభుని ...
    భార. విరా. ౨. ౩౦౬.

క చేయు, కావించు.

చ అనవుడు వాతఁ డిట్లను మహాత్మ భవ త్ప్రియ మెట్టు లట్ల రే, ననుపమశిల్పకల్పన మనర్ఘ్యమగాఁ బచరింప నోపుదుణా ... హరి. ఉ. ౬. ౧౫౮

సీ శుచివృత్తి కన్నాళ్లు పచరించెనో తీర్థసం వాస మిచటి హంసవ్రజంబు ... వసు 3. ౭౫

సీ పులకించె మే నేమి తలఁచుకొంటివె యంచు మేలంబు పచరించె మిత్రవింద ... విజ వి 3 ౭౮

౩. ప్రకటించు, కలుగఁజేయు.

సీ మేలంపు మాటల మెచ్చులు పచరించి తోరంప సెప్పిను గొంఁగఁగోలి . విక్ర ౪ ౭౩

(క్రి) సీ. జగడాలు పచరించు జడదారిఁ గాదంటిఁ దలవాకిట నెపుగు మెలఁగు పొలఁతి గెబ్బు రామ ౭౦౩

౯ ప్రకటించు - (౪) బయలుపఱుచు

వ .. కొందఱు దుష్టమతులు లేమిఁ గుందు వడినర్థ నదికకార్పణ్యంబు పచరించి సర్పి గ్లవణ తైలతండులాదులకై సిబ్బితిపడుదురు కాశీ. ౬. ౩౯.

గీ కంబ విజయము పచరించుఁ గాంతగళము ప్రభా. ౬. ౩౮

(చ) చూపు, కనఁబఱచు.

వ అయ్యదుపీరు లిద్దఱు నమ్మహాసమరం బుల నాత్మీయదేవతా రూపంబులుం దక్కి నయప్పగు మారుసాకాగంబులుం పచరించి హరి. ఉ. ౬. ౬౯.

క. తలిరాకుసుత్తిఁ దమిఁ గో, యిల చంచువఁ జించి క్రోశె నీరీతి విరహు, సల గుండియ లవియింపుడు, బలువిడి నని మరునిరొమడుటఁ బచరించె ననా ... పా. ౭. ౪౯.

సీ పయ్యెద గగజార్చి పాలిండ్లు పచరించు దిమ్మవాఅఁగ నవ్వుఁ దీఁగనవ్వు ... క్రీడా. ౬౭.

(ట.) (లేనిదానిని ఉన్నట్లు పైకి) చూపు, అభిన యించు.

సీ. వన్నెలు పచరించి కన్నుసన్నల చేసె కెర మాటలను ప్రేమ గడలుకొలిపి ప్రబోధ ౧ ౭౫

చ మనమున మాటలం గ్రియల నన్నన లీ నొకి నాఁడు సెట్టికా, మినులకు గాంపంబు కెఱ మెచ్చులకై పచరింతుఁ గాని పారి ౧ ౧౧౦ మను చ 3 33

(౧) ఒ సుపు, ఒలుకు

క . . ఓసు, దాలాపంబులు పలుమఱు, నోం పచరింప నిప్రడు హేలానిమిషా సైప ౭ ౧౦౯

చ తెరువరు లైనయట్టి పరదేశమహీసురు లర్థ వాంఛఁ ద, త్పురమున కేగు దేర కెడదోన్య ములం బచరించి వారి ని, ర్భరగతి నోడఁ గూయు ... శుక ౬ ౪3౭ సారంగ 3 ౫౭.

జ: పచేరింపు.

పచేరింపు. వి (√పచేరించే) ప్రసగణము (౪ ౧)

చ. . గొనబుం బచరింపులనిగ్గుఁ బ్రేమయుం, దెనఁగొని వాలుఁ గన్నుఁగవ విత్తరిచూపుల నాదరింప కొ, హాస మధురోక్తి నుత్తరము లాడుచు నుండె భవాని శంభుతోడా .. కవిరా. ౬. ౧3౫.

పచారము = పసారము. వి. (సం. ప్రసారః, ప్రా. ప. అర. క. హిం. పసార.)

౧. అంగడి.

ద్వి. మెఱుఁగు ముత్తెపుఁజాళ మించు పచారము.
విష్ణుపు. ఉ. ౪. ఆ. (శ ర)

౨. నడక.

ఉ. ఆ లంట చంటిపాపఁ దంట యంగడి లేద పచారముల్ గృహం, బెల ప్రవాసి గాఁడె ... వేం పంచ ౪. ౪౫౦.

జః పచోరించే.

**పచోరించే** = పచేరించే, స. క్రి (√పచోరము. సం. ప్రసారః).

౧. ప్రసరింపఁజేయు, వ్యాపింపఁజేయు

వ. పిపాలించు చంచలదృగంచల ప్రభలఁ బచారించి మనుచ ౫ ౧౦౧

శా. ఏలా చూచెద రుజ్జ్వలజ్జ్వలము లౌ దృష్టుల్ పచారించి యీ, లో లాక్షుల్ చెదుజంతువుల్ . . మల్లభూ. శృం ౬౩.

౨. చేయు.

మ. వనితారత్నము నాదువర్తనము దా వాక్రువ్వఁగాఁ బ్రీతిచే, విశెనో లేక వినండొ కర్ణములకుఁ బిందుల్ పచారింపఁగా ననుఁ జేపట్టెడివార్త .
ప్రద్యుమ్నచరిత్రము. 3 ౪౫.

మ. నిజక్రీడల్ పచారింపుచో, దనుజాధీశుఁడు కేయిదీవియలతో ధర్మేతరక్రీతితో, వనితల్ వట్టిన పైఁడిపల్లకిపయిఁ బచ్చెఁ నికిధంబునఁ రామా. ౬. ౧౪౪.

3. పుట్టించు, కలిగించు.

మ. తలిరుంగేలికి నీలకంకణము లై తళ్కుల్ పచారించు కు, ట్మలదంతావళి కప్పుఁ గప్పయి ... చంద్రా. ౪. ౩౭.

౪. ప్రకటించు - (౩) చూపు.

శా. ... పే, లా చాతుర్యము, చాపలస్ ఇల పలఁ లా పై పచారింప ...
ఉ. హరి. ౬. ౨౫.

(చ.) పలుకు, చెప్పు.

మహాస్రగ్ధర కవణింపం ముమ్మరిం బై కవణిమల హారుల్ ధాకిటాడంబరిస్ఫూ, ర్తి విజృంభింపంగ రంగోర్విని బిరుదు పచారించి .. వైజ. ౧. ౧౭౭.

మ. అశ్యాస క్తి లేనట్టి మా, ట పచారించిన నవ్వ ధూటిఁ గవుఁగింటుం జేర్చి లాలించెదఁ ...
బిల్హ 3 ౧3౪.

౫. (కి. పచారిను = నిందించు) తిరస్కరించు.

ద్వి సైకతంబులను బచారించుఁ బిఱుఁదు, నా కరభంబుల నణఁగించుతొడలు
ప్రభులిం. ౨ ౭౪ పా. ౧ పం

౬. (పంతము) పట్టు.

ద్వి. నభమున కెగసి పంతము పచారించి, గుభులు గుభు ల్లనఁ గుప్పించి దుమికె
అ. మ క ౨ ౬౩. పా. ౧౦ పం

**పచి.** సం వి ఇ. పుం ౧ అగ్ని ౨ పాకము, వండుట.

(త్రి. బుభుక్ష, ఆఁకలి) (కే ని)

**పచేరము.** వి (సం. ప్రచారః ప్రా పయారో) విహారము. (శ. ర)

**పచేలిమము.** సం విశ (అ ఆ ఆ.) ౧ తన్నుఁ దానే పక్వము చేసికొనునది తినంతెట పక్వమగునది. ౨. పక్వముచేయఁ దగినది
(వి అ పుం. గుజ్జము.) (కే ని.)

**పచేలుకుఁడు.** సం వి అ. పుం వంటవాఁడు పాకకర్త. (త్రి. ని)

**పచేలిముఁడు.** సం. వి. అ. పుం. ౧ అగ్ని. ౨. సూర్యుఁడు.

**పచ్చే.** వి. (క. పచ్చె త పచ్చై) ౧ ఆకుపచ్చని వర్ణము, హరితవర్ణము.

గీ. పంటవాల్గంటి గబ్బిగుబ్బలఁ జెలంగు, తళుక్కు
జిగిచిల్కుపచ్చరాతాళిఁ బోలి, పచ్చ గందని
పైరుల నిచ్చ మెచ్చు, దెచ్చు హెచ్చుగ
ద్రావిడదేశ మధిప .. దశా. ౧ ౧౧౩.

౨. పసుపువన్నె, పసుపుపచ్చ వన్నె

సీ. పచ్చన పచ్చ పసిమి నాఁగఁ బీతవర్ణం
బగు ... ఆం. భా. ౧ ౧౦౭.

౩. మరకతమణి, గారుడమణి

ఉ. వింగడ మైన రొక్కవనవీథిఁ గనుఁగొనె
నీడ నున్నపుస్, రంగుటరంగుపచ్చలయరం
గయిపో . ఆము. ౫ ౪.

ద్వి చనుకట్లమీఁదఁ బచ్చలబన్నసరము, లను
దారహారంబులును బొందుపఱిచి
రం రా బాల ౮౫ పా ౩ పం

సీ మున్నీటిపెన్నీటి ముదురుచిల్వలయలజడిఁ
బచ్చలజోడు దొడిగె ననఁగ
వసు ౫ ౩౬ ఆం భా ౨ ౨౮౬.

౪. ధనము

ఆ. పచ్చఁ జూచువారు బచ్చ మెచ్చెడివారు,
బచ్చబడెడువారు పచ్చవారు, బచ్చ విడుచు
వానిఁ బ్రభువుగాఁ జూతురు, విశ్వ .
వేమన. ౩ ౧౪౨.

౫. వృక్షవిశేషము

(ఉద్యానవర్ణనము) - వ . రాలచ్చికి రచ్చ
యగుపచ్చయు విప్ర. ౨. ౨౫

౬ (పసరువన్నెగల) తృణాదికము

సీ పసి జేదు దర్పించుఁ బైరుపచ్చ ...
పాండు. ౩. ౪౬.

గీ పయిరుపచ్చలు మేసి యప్పాటఁ జోక,
పల్లియలఁ జొచ్చి. తోఁటలు పాడుచేసి,
కావరంబునఁ గదుపు లై గావి చేసె ...
యయా. ౧. ౩౫.

౭. కరచరణాదులయందు పొడుచుకొనుటచేత
నేర్పడు పసరువన్నెరేఖ (శ. ర.)

(విశే.) ౧. పసరు రంగు గలది, ఆకుపచ్చ రంగు
గలది.

ఉ. పచ్చనివృక్షవాటికల పండులభిక్ష భుజించి.
సైప. ౩. ౧౮౮.

సీ పచ్చనిహారుముంజె పనివాగె పక్కెర పారసి
పల్లంబుఁబట్టమయము ... మనుచ. ౪. ౨౭.

ఉ. పచ్చమెఱుంగు టెక్కె జిగి పక్కెరచక్కని
రౌతు తూపులన్ .
దశా. ౨. ౨౪౦. సైప. ౬. ౭౨.

౨ పీతము, పసుపువన్నె కలది.

గీ. మిగుల నామనిఁ బచ్చచాంపేయకముల,
నమ్మి .. ఆము. ౪. ౯౪.

చ అలరెడు కూర్మి వాఁడు పడు చాపపడుంగడ
యంచుఁ బచ్చపోఁ, గులు గల చీర యంప
నొనఁగూడదకపోయెనె యేమి చెప్పుదున్
శుక ౨ ౫౨౦

(పచ్చపైకము = తృణమాత్రపు ధనము )

గీ క్షితితిలేశ్వర నన్ను నీచేతి హేతిఁ, బూని వధి
యించి మఱి కొనిపొమ్ము ధనముఁ, బచ్చ
పైకంబు నిందులో వెచ్చపఱుప .
హరిశ్చ. ౪ ౧౯౯.

ద్వి. అచ్చుగామాగురుఁ డవనీశనీకు, నిచ్చినమితి
నేఁడు సెల్లియుఁజిక్కఁ, బచ్చపైకముగూడఁ
బడినది లేదు ... ద్వి హరిశ్చ. ఉ. ౧౫౩.

గీ. ఇట్లు బాధించి శోధించి యొందు నొక్క,
పచ్చపైకంబుఁ గానక వాల్మీకి. ౨ ౯౬.

పచ్చతోరణము = ఎడతెగకుండు శుభములందు
వాడకుండకయే కట్టు తోరణము. (చూ.
నిత్యకల్యాణము).

ఉ. పాణితవాణి పంకరుహపాణి రమాఘన
వేణి నిత్యక, ల్యాణము పచ్చతోరణములం
దగి ... దశా. ౧. ౨.

జ : పచ్చఁబ్రాలు, పచ్చకట్టె, పచ్చకన్నుల
మొకము, పచ్చికన్నులకేల్పునూఁడు, పచ్చ

కప్పురము, పచ్చకర్పూరము, పచ్చగన్నేరు, పచ్చ గోరంట, పచ్చచేమంతి, పచ్చజనము లోం.

పచ్చేఁబ్రాలు. వి. బ (పచ్చ + ప్రాలు) - పచ్చని యక్షింతలు. - శోభనాక్షతలు, పాలి బ్రాక్షతలు.

ఉ. ఎల్లియ సోఁకుటొజ్జ యతిఁ డేపునఁ జేయును గూఁతుపెండ్లి యం, చల్లనఁ బైఁడిపళ్లెరము లందును గందముఁ బూలుఁ బచ్చఁబ్రాల్, పెల్లగ నించి   యయా. ౪. ౧౪.

పచ్చేకట్లు. వి (పచ్చ + కట్టె) మృగయాసాధన విశేషము

సీ. పచ్చకట్టెలగుదుల్ ౨ లుతుపాశలు
శుక. ౧ ౧౬౫

పచ్చేకన్నుల మెకము వి (√పచ్చే) హర్యక్షము, సింహము

(ఇది శ్రేష్ఠవాచకముగాఁ గూడ నుపయోగింపఁబడును.)

గీ. అట్టు లెదరులఁ గుండెదు చెట్టునట్టు మెకపు బంటులఁ గని యడ ల్మ్రలి రాచ, పచ్చ గిన్నుల మెకము రావణునితోడఁ, బుట్టువును డాయఁ బిల్చి తా నిట్టు లనియె
అచ్చ. రా. యు. ౧౪౨

పచ్చకన్నుల వేల్పునూఁడు. వి (√పచ్చ) పంగా (గళా) క్షుఁడను పేరుగల రాక్షసుఁడు (ఒకానొక రాక్షసుఁడు. అని. శ ర)

గీ. క్రేలిమిడిఁ బచ్చకన్నుల వేల్పునూఁడుఁ, జెదిమిపైచిన మ్రగ్గక చిక్కియున్న, బిరుదు లోకకొంద లెంచి వరుసమెడల, నల్ల ద్రావుడుదొరకు విన్నప మొనర్ప ...
అచ్చ. రా. సుం. ౧౦౪.

పచ్చేకప్పురము = పచ్చకర్పూరము. వి. (√పచ్చే) చల్లఁదనమును పరిమళమును గల సుగంధ ద్రవ్య విశేషము.

చ. దల మగు పచ్చకప్పురపుఁదావులు పైపయి పోడుముట్ట . .   వి క్ర. ౧. ౧౩౭.

వ. హాయలపనా పాణిపల్లవ విక్షిప్తంబు లైన పచ్చకప్పురంబు పలుకుల వలనను ...
భీమ ౫ ౧౭౦ దశా. ౧ ౧౪.

(పచ్చకప్పుగ మగు = అలభ్యమగు)

సీ. అజ్జనుండను నేసె యని తెల్పినంతనే మిట్టిమీ పైపడె మెలఁకచూపు, గాంధర్వమునఁ బెండ్లిక మ్మన్న నంతనే పచ్చకప్పురమయ్యె భామపలుకు ...   విజ. వి. 3. ౧౨.

పచ్చేకప్పూ(ర్పూ)రము = పచ్చేకప్పురము. (√పచ్చే)

వ. అఖణ్డ వర్తి లోహదణ్డు దివియలు రెట్టికి నాచంద్రార్కము నిత్యపడి .. సార పచ్చకర్పూరపు ...
ద శా. ౪. ౧౦౪౯.

పచ్చేకర్పూరసరులు. మి. వి. ల. ధాన్య విశేషము

సీ. పచ్చసరుల్ రెడ్డిపాల కంకలు సుఖభోగులు పచ్చకర్పూరసరులు ... హంస. ౪. ౧౨౭.

పచ్చేగన్నె(న్నే)రు. వి. (√పచ్చే) పుష్పవృక్ష విశేషము, పచ్చని పూలుగల కరవీరము. శ్రీ.

(పువ్వుతోఁట పరమున) - మ. సొరిదిం జేర్చిన తీఁగమల్లియలు ఖర్జూరంబులంటా బువ్వమం, జరులు న్మామిడి గుత్తులు న్గనుమము ల్పొంపెంగలు న్పచ్చగ, న్నెరులు ...
ఆము. ౧. ౭౭.

(చైత్రుని పక్షమున) - గీ. పచ్చగన్నేరు కస్తురి పట్టియలును, గుత్తిమల్లెలు. భాను. ౧. ౯.

(ఙ.) ధాన్య విశేషము. (చేల పత్త్రమున) .
ఆము. ౧ ౨౭.

(పాళిక పత్త్రమున) ... భాను. ౧ ౯

సీ నన్నుబాడులు పచ్చగశ్నేర్లు గోదండరామము
శ్కేసర్లు రాయసర్లు హంస. ౪. ౧౭౮.

**పచ్చేగోరంట.** వి (√పచ్చే) పసుపు వన్నె పువ్వులు గల గోరంట ¶ (కురంటకము ¶ అని. శ ర)

**పచ్చేచేమంతి.** వి (√పచ్చే) పసుపు వన్నె పువ్వులు గల చేమంతిలతి ¶ (శ. ర)

**పచ్చేజనము.** వి (√పచ్చే) ఒక జాతి జనుము. ¶ (శణపుష్పి ¶. శ ర)

**పచ్చేజువ్వి.** వి (√పచ్చే) కొండజువ్వి, కలు జువ్వి. ¶ (శ. ర)

**పచ్చేడము.** వి (సం ప్రచ్ఛదః ప్రా. పచ్ఛదం శ పచ్చడవు)

౧. వస్త్రము

ఉ. ఏనికతోలు పచ్చడము సొమ్ములు గుబ్బ
సరంబు . ఉ హరి ౫. ౧౩౭

గీ అమరవందిత శూలాయుధమునఁ జీరి, మొదలు
ది త్త్రోల్చి తోలుపచ్చడము చేసి, యుత్తరా
సంగముగఁ జేసి యుండవలయు, నోడిగిలి
రక్తబిందువు లట్టిపడఁగ ...
కాశీ. ౬. ౧౭౪.

సీ. పాతకంబులు నీలిపట్టు జొండడములు పగ
లింటి నిద్రలు పచ్చడములు ...
శైవ. ౩. ౬౧.

క. కదకదలి కేడికెలుఁ గను, జడదార వడిన్
ముసుంగఁ జని జేగురు ప, చ్చడ మాలఁగట్టి
దరి నవఁ, బడమట కొలుసంజ నిండె బలు
పుగ మతియున్ . . యయా. ౫. ౫౯.

౨. (వస్త్ర విశేషము). (క.) అంతరీయము, కట్టు బట్ట

సీ. గజచర్మ మెన్నఁడో కాని నిచ్చలు గట్టు
పసిఁడి కమ్ముల పట్టు పచ్చడంబు ...
భీమ ౧. ౧౧౫.

(చ) ఉత్తరీయము, పై బట్ట. (అంగవస్త్రము. అని. శ. ర.)

సీ. కటిమండలమున నీర్కావిధోవతి మీఁద
జెలిపట్టు పచ్చడం బలవు మిగుల .
రుక్మాం ౧ ౧౫.

సీ. గడితంపు మేలుపచ్చడము గప్పట మాని
దుప్పట్లు సైకాలఁ గప్పఁ దొడఁగె
నిరం. ౫. ౧౬.

(ట) పాలువు

దరువు. పరకాళియంగిలు పట్టుపచ్చడములు, . .
బూని, గిరిమెతో వచ్చిరి కవిబుధోత్తములు.
రఘు ౯. పా.

సీ. .. జడకుచ్చుమీఁదఁ బచ్చడపుఁ గండ ...
హర. ౫. ౯౩.

(పచ్చడపుఁగండ = పాలువు ఖండము.)

(ఠ.) . కప్పికొనుట, పఱచుకొనుట కుపయోగించెడి, దుప్పటి.

ఉ. వెన్నెలవెల్ల పచ్చడము విచ్చిన యంబర
శయ్యమీఁద ... నృసిం. ౩. ౭౯.

గీ. ప్రచ్ఛదపటంబు వెలయును బచ్చడ మన ...
ఆం. భా. ౫. ౧౫౬.

**పచ్చేడి.** వి (శ. శ. పచ్చడి). ౧. ఉపదంశము, పప్పుదినుసులను గాని కూరగాయదినుసులను గాని ముద్దగా రుబ్బి చేసెడు వ్యంజన విశేషము.

సీ. ఉపదంశ సంజ్ఞ రైయి యొప్పు పచ్చడి యన.
ఆం. భా. ౫. ౫౪౭.

మ. . . ముకురుం బై రొయర్చు నాదం బెగు,
రొక్కుపచ్చళ్లను ఆము. ౧. ౭౨

సీ మధురేక్షు గోక్షీర మధుపానములతోడ సర
సంబు లైన పచ్చళ్లతోడ ...
సా పంచ. ౧ ౩౧౩

౨. అల్పఖండము.

ఉ ... కౌరికరాసిభారచేఁ బచ్చడి చేయఁగా
జమునిబానసముంబురుడించు చోటికిన్
ఉ హరి ౪ ౧౯౬

సీ పెదద గొడ్డండ్లఁ బచ్చడిసేయఁ బడువారు
క్రమమిఁ బాఁతిన నుక్కుపోవువారు
కవిక ౫ ౧౧౩

పచ్చత త్తడులవజీరుఁడు. వి (√పచ్చే) (హరి
దశ్వుఁడు) సూర్యుఁడు.

క. హనుమంతుం దను పేరిం, దనరారెడువాఁడెఁ
బచ్చతి త్తడులవజీ, రుని కొమరున కెంతయు
న, మ్మిన బంటఁ గడిందితేజా మీాటిన
వాఁడన్ అచ్చ రా కిష్కిం. ౧౭

(ఇట్లే పచ్చ గుఱ్ఱముల రౌతు)

గీ. ప్రాఁబలుకుకొంకి పచ్చగుఱ్ఱముల రౌతు,
కేవలుం గిన సూర్యుఁడౌ ...
ఆం. భా ౧. ౭౧

పచ్చేతలపిచ్చుక. వి (√పచ్చే) పక్షి విశే
షము (పీతముండము. శ, ర)

పచ్చేతామర. వి. (√పచ్చే) స్థలపద్మము, మెట్ట
తామర. ‡

సీ. స్థలపద్మ మగు మెట్టతామర యనఁ బైఁడి
తామర యనఁ బచ్చతామర యన ...
ఆం. భా. ౨. ౬౯.

పచ్చేదినసరులు. వి. బ. (√పచ్చే) ధాన్య విశే
షము.

వ. .. దాళువాలు జారట్లు రామబాణాలు
కటకసరులు రత్నసరులు జీనిసరులు రాయ
సరులు పచ్చదినసరులు గంధసరులు ..
ప్రబంధ ౧౧౨

పచ్చేన. వి (√పచ్చే.) ౧ పసరువన్నె. ౨.
పసుపువన్నె

సీ ... పచ్చన పచ్చ పసిమి వాఁగెఁ బీతవర్ణం
బగు .. ఆం భా ౧ ౧౦౭

పచ్చేనికోకవాఁడు. వి (√పచ్చే) పీతాం
బరుఁడు, విష్ణువు

వ తద్వ్యాగిపాలకులు కుచేలు నచ్చట
నునిచి పచ్చకోకవాని కీ ముచ్చట తెలిఁ
గించువా రై చని ... కుచేల. ౨. ౫౩

పచ్చేని వింటిజోదు. వి (√పచ్చే) మన్మ
థుఁడు

ఉ నెచ్చెలిఁ జూచి పల్కెఁ దరుణీ వినవమ్మ
మనోహరాకృతిం, బచ్చని వింటిజోదు
గెలువం గలరొక్క వరోరువిలాసగుణ .
చెన్న ౪ ౨౪౩

పచ్చేనీరుల్లి. వి (పచ్చ+నీరుల్లి) పలాండు
విశేషము. (దుద్దురిమము. శ ర)

పచ్చేపచేన. వి (పచ్చన + పచన) మిక్కిలి
పచ్చన

ఉ అంతటఁ బండి పచ్చపచ నైనదళంబులు
రాలెఁ దద్వన, ప్రాంతములన్ ...
చమ. ౧. ౪౩.

పచ్చేపట్టు. వి (√పచ్చే) ౧. స్త్రీలు ధరించు
వస్త్ర విశేషము.

గీ. ... మేఘువన్నెలు పచ్చపట్టు, గరుడ
పచ్చలు ... మొదలుగా వల్వలు ధరించి
ముదిత లపుడు ... ప్రబంధ. ౨౩౨.

వ. ... తోఁపులు మేఘవర్ణంబులు పచ్చపట్టులు చీనీలు శాలువలు . . ప్రబంధ. ౬౦౫.

౨. పచ్చని పట్టుబట్ట, పీతాంబరము.

వ. ... శ్రీకాళోలని శ్రీవల్లభరాయనికి సమర్పించిన వస్తువులు ..

జప్పడి ౧ పట్లు పచ్చపట్లు ౨. శ్రీ ౯౪౫

**పచ్చేపిట్ట.** వి (√పచ్చే) ౧ పసరురంగు రెక్కలు గలపిట్ట, చిలుక.

సీ. పచ్చపిట్టలకేను పలపి యాడెదు వాఁడు పాంథజనంబుల పాలదోంగ
ధనాభి ౧ 3౪

౨. (= పచ్చపులుఁగు) పసుపువన్నె రెక్కలు గలపక్షి విశేషము, హారీతము.

**పచ్చేపులుఁగు** = పచ్చేపిట్ట వి (√పచ్చే) పక్షివిశేషము, హారీతము (శ ర)

**పచ్చేపూస.** వి (√పచ్చే) పచ్చరంగు గలపూస (పచ్చపూసగు = పచ్చపూసవలె సదృశ్యమగు, ప్రయత్న దృశ్యమగు)

సీ పాలపుఁ బయ్యెదఁ దేటిచూరు నన్నంతనే పచ్చపూ సాయెఁబో పడఁతియారు ...
విజ. వి 3. ౧౨.

**పచ్చే పెసలు.** వి బ (√పచ్చే) ముద్గధాన్య విశేషము. (ఖండేరము శ ర)

**పచ్చేబొట్టు** = పచ్చేపబొట్టు వి (పచ్చ + బొట్టు) పచ్చాకు పసరుతో పొడిచెడు బొట్టు

సీ. ముంజేతులను ముఖాంబుజమున నొక వింత పొలుపు దెల్పెడు పచ్చబొట్టు లెసఁగ .
కుశ. ౧. ౧3

**పచ్చేముపాడు.** విశే. (పాడు + పాడు . తి. పంజై ప్పాట్టు = దారిద్ర్యము, లేమి.) మిక్కిలి పా డైనది, బిగ్గముపాడు.

ఉ. ... పదేసి బాణములో, హెచ్చిన రూపీర ధుల పయిఁ బిగిడించిన సేనలెల్లనుం, బచ్చముపాడుగా వితిగి పాఱ ధనంజయుఁ డగ్గించుచున్ . జై. భా. ౪. ౨౦

**పచ్చేయగు.** అ క్రి (√పచ్చే) ధనవంతి మగు

ఉ అల్లన మందభాగ్యుఁ డగువాతఁడు వేవిధులం గృశించియున్, వల్లను పచ్చగాకి వసివాడిన మోముఁ దావృత్తుఁ డై
వేం. పంచ ౧ ౪౪౪

సా . పొరుగు పచ్చగా నుండిన ప్రొయ్యిలో నీళ్లు పోసికొనును

**పచ్చేయరఁటి.** వి (√పచ్చే) పసరువన్నె పండ్లు గల కదళీ విశేషము ∗ (మహాగంధ ∗ శ ర)

**పచ్చేయిరుగుడు.** వి (√పచ్చే) పచ్చపువ్వులు గల యిరుగుడు ∗ (పారిణి ∗. శ ర)

**పచ్చేయెన్ను.** వి (√పచ్చే) త్రీ వశీకర ణౌషధములలో నుపయోగించు, ఓషధి విశేషము ∗.

సీ జాజికాయయుఁ గురాసాని యోమము వస చెంగల్వ మర్గిమాతంగి పచ్చ, యెన్నులు
ప్రబంధ ౬౪౦.

**పచ్చేరెక్క.** వి. (√పచ్చే) పక్షివిశేషము, ఒకానొక పిట్ట.

గీ పసిఁడి ముద్దయుఁ బాలయుఁ బచ్చరెక్క .
రసిక. ౧ ౧౧౫

**పచ్చేరెక్కలపక్కి** = పచ్చేపిట్ట వి (√పచ్చే), చిలుక.

వ. .. చక్కెర వింటి చక్కనిసామి టెక్కెంబలర నుక్కు మిగిలి పచ్చ రెక్కలపక్కి నెక్కి .. ప్రద్యుమ్న చరిత్రము. 3. ౪౫.

**పచ్చేజా(రా)యి** = పచ్చే. వి (√పచ్చే). మరకతమణి

గీ పచ్చకామానికంబుల పల్లెరములఁ, బచ్చ గం
దనికూర లేర్పదమిఁ జూచి, పెట్ట రని పెం
పెద్దలు పెదము కట్టఁ, బెట్టుటకు నంగనల
కును బట్టెఁ దడవు  సైవ. ౬. ౧౨౨

గీ పచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకు
మనుచ ౨. ౮౩

సీ పెళవంకఁ బచ్చరావిడిదంకి బొంకింపఁ జాలి
కట్టిన నీలిచాయదట్టి ... దశా ౧ ౨౬౦

పచ్చేనలువదారి వి (√పచ్చే) (పీతాంబర
ధారి) విష్ణువు, (శ ర)

పచ్చేవార్వ(రువ)పుజోదు = పచ్చేవార్వపువ
జీరు. వి (√పచ్చే)

౧ హరిదశ్వుఁడు, సూర్యుఁడు

సీ పచ్చవార్వపుజోడు పచ్చవార్వపుజోదు వల
కన్న కొడుకు నై వలపు బలుక
అచ్చ రా పీఠిక 3

౨ చిలుకతత్తడి రౌతు, మన్మథుఁడు
అచ్చ రా పీఠిక 3

పచ్చేవార్వ(రువ)పువజీరు = పచ్చే వార్వపు
జోదు వి (√పచ్చే) హరిదశ్వుఁడు,
సూర్యుఁడు.

గీ. అనినఁ దద్దయుఁ బొంగి యయ్యాదవిమన్కి,
పట్టుబల్దిట్ట యమ్మేటి పచ్చవాటు, వపువజీరు
కొలంపు కల్యాలయతుంగుఁ, గాంచి నును
దియ్యపల్కులు గదురఁ బలికె .
అచ్చ రా బాల ౯౮.

పచ్చవా (పా, ఁబా)లు. అ క్రి (పచ్చ +
పాలు) పసుపు వర్ణము కలదియగు

చ ద్రవిడకుటుంబినుల్ పసుపురాచిన రత్నపుఁ
దాపక్రింద నం, బువు తెరవాఁగా నిదుర
బోయి గరుత్మతి పచ్చవాటినన్, భవన సరో
వరాళములు ...  అము. ౧. ౭౮.

గీ అంత నవ్వాన తరువాతియదను దోఁపఁ, బంట
పూఁబోఁడి తన ముద్దు పట్టికొంటకుఁ, బిలు
వగలఁ గుంద మేకెల్లఁ బచ్చవాటు, ననఁగఁ
బరువంపుఁ జైరులు గొనజమీలె
అచ్చ గా. కిష్కిం ౭౮

పచ్చేవింటిదొర = పచ్చే విలుతుఁడు వి.
(√పచ్చే) చెఱకు వింటివాఁడు, మన్మథుఁడు

మ  అల్లుటిం, తిగమిం గూరుపఁ బచ్చవింటి
దొగ హత్తింపండు వి ర్లోలచే .
అచ్చ భా 3 ౭౫

పచ్చే(ని)వింటివాఁడు = పచ్చేవిలుతుఁడు వి
(√పచ్చే) మన్మథుఁడు.

ఆ పచ్చవింటివాఁడు పరఁగఁ బల్విపుటమ్ము,
గలుగువాఁడు ప్రౌఢగతులవాఁడు ...
వీర ౨. ౯౧

ఉ పచ్చని వింటివాఁడు తెగఁబాఱక నిన్నువు
డింతదవ్వు రా, నిచ్చ నె గాజశేఖర నరే
శ్వర యంచు శుకంబు పల్కినన్
రాజ చ 3 ౪౫.

పచ్చవిలుతు(ల్తు)ఁడు. వి (పచ్చ + విలు
తుఁడు) ఇక్షుధన్వుఁడు, చెఱకు విలుకాఁడు,
మన్మథుఁడు

గీ .. పరసతీసంగమున వచ్చు పాపమునకు,
నోరుతును గాని పైరింపనోపఁ బచ్చ, విలుతు
తూపులతాఁకున కలరుఁబోఁడి
భార విరా ౨. ౫౩.

వ  పచ్చవిలుతుండు విచ్చలవిడిం దనకైదు
వులు ముప్పగిరెంటం దోఁడుకూపె ...
పారి. ౨. ౫౨.

గీ పచ్చవిల్తుని గాయుధాభ్యాసకాల, యనఁగ
నొప్పారు పెప్పుడు నప్పురంబు ..
విక్ర. ౧. ౧౦౦.

పచ్చే (ని) విల్కా (లుకా)ఁడు = పచ్చేవిలుకుఁడు వి. (√పచ్చే) మన్మథుఁడు.

ఐ పచ్చవిల్కాఁడు గురియించు విరివానలంబోశాఁ గరువలిచేఁ దొరఁగు పరువంపు వనలంబుం గలిగి ... యయా ౪. ౧౩.

గీ దాని సౌందర్యమున కీ విధాతృసృష్టి, సరిసమం బీడు నోడెన్న సతులుగలరె, పచ్చవిల్కానితో నల్గి వచ్చి గంగి, భూపసతి నున్నరతిదేవి దేవదేవి ...

వైజ ౧ ౧౦౭ మృ వి ౧ ౩౫

మ వనజ శ్రీధన పక్ష్మతోహరుఁడు జీవం జీవజీవంబు ప, చ్చని విల్కానికి మామ చల్వగని పక్ష్యాత్మాల జూటాగ్రమౌ, హా ...

... వీధి నా, య్యనఁ దోతెంచె

పారి ౪ ౪౪

మ ... స, చ్చని విల్కాని జయాస్పదం ... సంలోకి తేజీ విధం, బున నవ్వేళ ప్రభావతీ సుదతి మాపుల్ వన్నెలం బ్వ్యఁగెన్

శుక ౨ ౨౬౫

పచ్చేవిల్తునయ్య. వి (√పచ్చే) మన్మథుని తండ్రి. విష్ణువు

గీ లచ్చి వాడమినపోటికిఁ బచ్చవిల్తు, నయ్యనెయ్యంపువీటి కింపారునేల, కోటిమగమానికపు మెలుత్రాటి కెన్న, మేటి రౌమిం చుపాలమున్నీటి కరిగి ..

అచ్చ రా బాల ౬౦

పచ్చేసరులు వి బ (√పచ్చే) ధాన్య విశేషము.

సీ పచ్చసరుల్ రెడ్డిపాలవంకలు సుఖభోగులు పచ్చకర్పూరసరులు ... హంస ౪ ౧౫౦

పచ్చోకు. వి. (పచ్చ+ఆకు). ౧ హరితపత్రికాపత్రము, పచ్చాకు చెట్టుయొక్క ఆకు.

మ. తుటు మై యొక్కటఁ గూడి గూడెపుఁ గిరాతుల్ సేను లీక్షింపఁగా, వట శాలానవాంటూవాలటం బుంచి పచ్చాకుల్ ద్రవ ఘ్రానముల్, గిటిదంష్ట్రికల్ చేకానుకల్, సేయుచుక్ . శేం. పంచ. ౨. ౧౯౨.

సీ. గాళ్ళముల్ పచ్చాకు కచ్చూరములు చాల నించినకొట్టడే ల్మించి యేఁగి ...

గీ చూచె నొక దివ్యరత్న నిష్కులగృహంబు

హంస ౧ ౭౧

గీ పవివలపులిచ్చు పచ్చాకుపసిఁడిపట్టు, బటువుకోడును బటువు పైపుటము గుటుకఁ, బూని రండల మెంతియు బోయ లంత

నా వి ౨ ౪౩

౨ బాలక్రీడా విశేషము

(పచ్చని ఆకును ఇసుకలో కప్పి బాలురు సెమ్మదిగా నూఁదుచు ఎవరికి కనుపించునో వాఁడు గోష్టి రౌను ...లేన్నుచు నాడుకొనునట్టి ఆట)

పచ్చోకుబొట్టు = పచ్చేబొట్టు (√పచ్చే)

పచ్చోరె. వి (పచ్చ+ఆర) ఆరెచెట్టు భేదము

ద్వి బలుసుముల్ మోదుగు పచ్చార యారె, వలిచంద్రములుచంద్ర వాడగన్నేరు ..

ద్వి. శ. పా ౨. ౭౦. పా. ౩ పం

పచ్చి. విశ. (క హసి). ౧. ఆర్ద్రము, తడిగలగి; ఎండనిది

సీ. మంచి పల్కినది యోా మగువ యా యెల పాగ మెడఁ బచ్చికస్తురి మెలఁచి యలఁదు

యయా ౫. ౩౪.

వ. . చింపచింపని సెత్తురుల బో త్తిల్లిన పచ్చి యేనికతోలు పచ్చడంబును ...

భీమ. ౪, ౧౭౩.

గీ అవిశ విరియించు నదియును నవల వైచి, కుంకుమపుఁ బూఁత చిమచిమ గొనెడుచిన్ని,

పచ్చికొనగోటి కాఁకలం రచ్చసేయు, గుబ్బ
యుర గాన రాఁ బైఁట కొంగు వైతు
కవిల. ౪. ౧౮౮

చ రమణభుజానిపీడనఁ గరంగిన కాంతల విన్ను
ర న్నితం, బములఁ దలిర్చు సన్నవలిపంబులు
వీడియు జాఱవయ్యెఁ జె, న్నమరు వినూత
నక్షతినఖాంకము వింపెనలారఁ గ్రమ్మనుం,
జెమటలఁ జాలఁ బచ్చు లయి చిక్కఁగ
నంటికొనంగఁ జేసినన్ .. నృసిం ౩. ౭౧

సీ ఉత్సాహ మొదవ మై నుబ్బించుకొనియఁ
బచ్చిగోడలజాడ విచ్చు దిశలు
ఉ. గా ౨ ౧౯౬

ద్వి పచ్చిచెక్కులఁ దలఁ బగులంగ నడిచి,
చచ్చినపీనుఁగుఁ జఱజఱ నీడ్చి .
బస పు ౪ ౪౮౦ పం

ఉదా : పచ్చికసవు మొ

౨ ఉడుకనిది; గ్రాఁగనిది

గీ బోరుసుమోముల బిట్టుబోఁ బచ్చిపసపున
మేదించినూనెచే మెఱుఁగుపెట్టు
వైజ ౩ ౭౦

సీ బానలోపలఁ బచ్చిపా లుండ మించి
చేరిమి యిడ్డపాల్పాయిమీఁదఁ బెట్టి
శుక. ౨ ౫౬౧

సీ విరహులమై పోఁకి కేఁడి యాకెన్నెలఁ
బచ్చికెన్నెల నులివెచ్చఁ జేసి
పారి ౨ ౪౮

౩. వేఁగనిది.

సీ పెరుఁగు వడియంబులును బచ్చివరుగు .
ఆము. ౨. ౯౭

౪ కాలనిది.

ఉదా : పచ్చిసుండ, పచ్చియిటుక మొ.

౫ ముదరనిది.

ఉదా : పచ్చికాయ మొ.

౬. నూతనము, క్రొత్తది.

గీ సొబగు కాటుకబొట్టుతోఁ జాద నొప్పు,
వింతచెలువునఁ బచ్చిబాలెంత యపుడు ...
శివరా ౨ ౭౭.

గీ పదాఱువర్షముల వయసు, పచ్చిబా
లెంతరాలు తాపసిపురంధ్రి
హంస. ౨. ౯౩

౭ (రోగాదులనుండి) తేఱనిది

ఉదా : పచ్చిరొయిదలు మొ

౮ మఱుఁగు లేనిది రహస్యము వెలిబుచ్చునది.

ఉత్సాహము ఇంతెనుండి మిక్కిలిన్,
బచ్చి గాఁగ వలపు తేటపఱిచి వ్రాసి
నాఁడో నీ, యిచ్చఁ జదువు కొనుము వెనుక
నిపుడు దాఁచి నావుడున్
ప్రభా ౩. ౧౪౧.

క అచ్చటి కయ్యెడ వచ్చిన, కొచ్చెలు లచ్చె
లంపఁ దెచ్చి నృపుతోఁ జదురుల్, పచ్చిగ
నాడుచుఁ బాడుచు, మచ్చిక నోకరొకర
పనులమఱుఁగున జరుగన్ ...
రా వి ౫. ౮౭.

సీ జారకర్ణగ్గానిచేర నారిజనుగాఁ బలుకు
నొకొక్కకసారి పచ్చిపలుకు ..
వేం పంచ. ౩. ౨౫౧.

౯ కటిసాత్ముఁడు

చ .. గోవధ మాచరించు పెం, పదర లతాంగి
పచ్చితురకాఁగద యమ్మదినుంకు చూడఁ
గన్ ... విజ. వి. ౩. ౬౬.

క. జన్మమున శివుని దక్షుఁడు, మన్నింపమిఁ
జేసి పచ్చిమాలం డయ్యెన్
శివ. పా. ౪౭౨. బస. పు. ౭. ౪౧ పం

(వి. ౧. కల్లు లోనగువాని యార్ద్రత్వము,
పచ్చితనము).

(వ్యవ.) ఆ కల్లులో పచ్చి పోసింపున మండుట
లేదు.

౨. శృంగారాదిరసస్ఫురణము, రసము పైకి స్ఫురించుట (చూ పచ్చితేరు)

(పచ్చిగిక్కనుఁడు = కఠిన రాక్షసుఁడు

ద్వి. భక్తుని మ్రింగిన పచ్చిగిక్కనుఁడు, భక్తుని జంపఁ బొల్పడుననాగాఁడు

బస పు ౪ ౭౪౪ పం

గ్ర్వి ౯౦కెత్తిల్ ౙంకెత్తిల్ పచ్చిగిక్కనులు, రొమ్ములకుంపట్లు కోఁతప్రామిండ్లు

పండితా పురా ౧౧౬ పా

జ : పచ్చిక పచ్చితేరు, పచ్చిబియ్యపుమావి డి, పచ్చిబియ్యము

**పచ్చిక.** వి (√పచ్చి (పచ్చి = పచ్చిగి) స్వార్థ మందు 'ఇక' ప్రత్యయము) పచ్చికసవు. కాదము (పచ్చికలకి అని శ ర)

చ కిరఁగినవింటియప్పసరుకై వడిఁ పట్టెలు పెట్టు పచ్చికల్ అము ౪ ౧౦౦

సీ. పచ్చలగనులకైఁ ఒనివి పచ్చిక యంచు వడి మేయ వచ్చినప్పుడుకోఁఒనులు

యయా ౨. ౩౫

(పచ్చికడాల్ మేనిసామి = దూగ్వాశ్యామాం గుఁడు, విష్ణువు

క. ఇచ్చట పెన్నాళ్లకు నా, పచ్చికడాల్ మేని సామి ప్రత్యక్షం బౌ. టచ్చెరువు విన ఁడు వే ట్కొ, నుచ్చట సెజిఁగింకు మీకు శోడం బొదవన్ ఘటికా ౨ ౧౫౪

**పచ్చిదేరు(బు).** అ క్ర (పచ్చి + తేరు) ౧ పచ్చియగు. (శ ర)

(వ్యవ) అపుండు పచ్చిదేరెను

**పచ్చిపట్టె.** వి (√పచ్చి) తడియారని విభూతి రేఖ.

సీ. కన్నుప్ప విభునివక్త్రము మజ్జనపుబిందు పంచ పాయకు మేను పచ్చిపట్టె

రుకా్మం ౫. ౭౫.

(పచ్చపట్టె. ముద్రి. వ్రాతప్రతుల పా. పంచ పట్టె. శ ర పా పంచపట్టు. చి. ని. సా. ఇంకను విచార్యము )

**పచ్చిబియ్యపుమామిడి.** వి (పచ్చి + బియ్యము + మామిడి)

నార లేక కండ గల మామిడి (శ ర)

**పచ్చిబియ్యము.** వి (పచ్చి + బియ్యము) ౧ తడియారని బియ్యము

(నానఁబ్రాలు అని శ ర)

(వ్యవ) పచ్చిబియ్యముతూడు తినిన కడుపు నొప్పి వచ్చును

౨ ఉప్పుడుచేయని బియ్యము (శ ర)

**పచ్చియము** = పచ్చెము వి (సం పశ్యతో హరణమ్) పశ్యతో హరణము, చూచు చుండఁగా దొంగిలించుట (శ. ర)

(మోసము చి ని)

**పచ్చెకాఁడు.** వి. (పచ్చెము+కాఁడు) పశ్యతో హరుఁడు, చూచుచుండఁగ నే దొంగిలించు వాఁడు. (శ ర)

**పచ్చెము** = పచ్చియము

ఒ : పచ్చెకాఁడు

**పచ్యమానము.** సం విశ (అ. ఆ అ.) వండఁ బడుచున్నది.

**పచ్ఛము.** సం. వి అ. పుం శిల, ఱాయి. (శే. ని.)

**పజే.** వి. (సం ప్రజా ప్రా. పజా.) ప్రజలు, జనము.

సీ వానలు లేక పెన్వడిఁ బైరు లన్నియు వాడఁదొడంగిన నోడి ప్రజలు ...

అచ్చ. రా. బాల. ౫౪.

గీ. ఒక గొడుగునీడ నీవు కి దుండగనడుపు,
గుడుసుకొండకు లోనైన పుడమిఁ గలుగు,
ప్రజలకెల్లను జీర మైనపగిదిఁ బోలను,
బిందుఁ గావించెదను కోఁటవెదలు సామి
చంద్రా ౨ ౬౬.

పజ్జ. వి (సం పశ్చాత్ ప్రా పచ్ఛా క పజ్జై)

౧ వెనుక, పశ్చాద్భాగము

అ అప్పుడ, వ్వనితిపజ్జ నరిగె వాసవుండు
భార ఆది ౭ ౨౬౯

గీ సింహబలుఁ దత్క్షుద్రుఁడై చిగురుఁబోఁడి,
పజ్జఁ గడువడిఁ దగిలి కోపంబు గదుర,
నొడిచి తల పట్టి తిగిచి
భార విరా ౨ ౧౨౫ కర్ణ ౨ ౨౭౩

సీ తన తల్లి కైకసీధవళాక్షి ముత్యాలపల్లకీపై
వారపజ్జ నరుగ ఉ రా ౨ ౨౫౭

౨. సమీపము, చేరువ

చ ... భ్రమదమహాస్వరూపమునఁ బజ్జయు
దవ్వు నెఱుంగనని, భ్రమనముల
కళా ౩ ౧౨

క .. ఆ, హా భారత్రావఁత యని కగి, బాధం
గలఁగెఁగెను వారి పజ్జకుఁ జనిరొకఁడు

౩ ప్రాంతము, సమీప ప్రదేశము.

సీ రామాయణాది సద్గ్రంథముల్ వెలయఁగాఁ
బజ్జఁ బుస్తకరాజి పరిఢవిల్ల
బిల్హ ౧ ౫౬

క . పాదపద్మముల జిగిజాళ్వా, గజ్జెలు
మొగయఁగఁ బజ్జల, హజ్జ లిడుం గుజ్జా
తల్లి యానందింపన్ దశా ౫ ౬౭

చ కులుకుచుఁ జేరి యాటలకుఁ గూరిమి నెచ్చెలు
లచ్చెరువందినం, బలుక వదేమి యేమఱక
పజ్జల నిల్చిన యాడిగింపుటిం, కులఁగని...
నీలా. ౨. ౯౨.

౪. అనుసారము, వెంబడించుట.

గీ. ... అచ్చెఱువచెలువుఁ, దగిలి తన యిచ్చఁ
బాఱుచిత్తంబుపజ్జ, నరిగి యిట్లను నక్కుచ
కాధముండు భార. విరా ౨. ౧౫౯.

ఉ సుందరి రాజనందనుని జూచిన చూపులపజ్జఁ
బోయి . దశకు. ౩ ౧౩౧

సీ కొంచెపుటశనంబు గొనుచు సంగంబులఁ
బాసి యింద్రియములపజ్జఁ జనమి ...
భార. శాం. ౬. ౩౯.

౫ ఒద్దు, కడ

చ సకల కలావిభూషితులు శబ్దనిదుల్ నయ
తత్త్వబోధకుల్, ప్రకట కవీంద్రు లేఱ్పతి
పజ్జను నిర్ఘను లై చరింతు రా, వికృతపు
జాడ్య మాదొరది భర్తృ ౧ ౧౨.

ఉ పైఁదలి ప్రాణవల్లభునిపజ్జఁ జరింపక పాయు
నేర్చునే విక్ర. ౨. ౭౨.

ద్వి అరిగి యాచిత్రకూటాద్రి నెక్కుటయు,
భూతుండు రఘురామపజ్జ వచ్చుటయు
రం రా బాల ౭ పా. ౭. పం.

౬. చోటు, స్థలము

సీ పాళెంబు డిగి యొక్కపజ్జ నిల్వక మున్న
కూచి చేసిననాఁటి గుండెదిగులు
రా వి. ౨. ౬౯.

గీ ... చిడిముడి పడుచుఁగాపు, పడుచు నగి
యుప్పు దప్పజ్జఁ గదిసి ...
శుక. ౧ ౨౯౭

ఉ పంగిడిఁ జిక్కి కోదములపజ్జలఁ ద్రొక్కక
యూఁకఁ దోలుమా, తింగము నొక్కఁ
డొంటి మెడఁ దట్టి పయింబడి నిల్పి ...
కళా. ౪. ౯౯.

౭. త్రోవ, మార్గము.

గీ. రండువనుగూడి యోపరివ్రాట్టులార, వత్స
లత గల్గి మీ రేల వత్తు రయ్యా, పరమ
నిర్భాగ్యుఁ డైన నాపజ్జ వట్టి, కటకటా

శాఖ్యజలరాశి శాశిఁ శాని .
శాశి ౧. ౧౪౦

వ . విదర్భభాత్రి పతిపుత్రి విభిపజ్జను నిచే ధంబు త్రోవనం బోవనితలంపున ...
నైష. ౫. ౧౪౦.

ఁ కొన్నియెడల 'అందు, లో' యున్నగు నర్థములనిచ్చును

క. ఈరీతి నిలిచి యచ్చటఁ, గోరికి లలరం బతంగకులమణి చరమాం, భోరాశి కినుఁడు చేరెక్, భారద్వాజాశ్రమంబుపజ్జ న్నిలిచెక్.
రామా. ౫. ౫౦.

ఉ. బాలిక చెక్కుటద్దములపజ్జలఁ గోమలమంద హాసరే, ఖాలవ మంకురింపదు ...
నైష. ౧. ౧౧౨.

క. బాగాలు వేసికొని తన, బాగా లున్నట్టి మేడపజ్జకు జేఁగెక్ ...
శారంగ. ౨ ౧౯౪.

పజ్జాఁడు. సం విణ (అ ఆ. అ) పాదములనుండి పుట్టినవాఁడు వి అ పుం శూద్రుఁడు

పటకము. సం వి. అ పుం ౧ శిబిరము, దండు విడిసినపట్టు ౨ పటము, మాలిబట్ట ౩ గ్రామార్థము. (విల్యమ్సు)

పటకర్మము. సం వి క్ న. బట్టలపని, నేఁత

పటకారుఁడు. సం వి అ పుం ౧. బట్టలు నేయువాఁడు, సాలెవాఁడు. ౨ చిత్రకారకుఁడు, చిత్తరువు వ్రాయువాఁడు.

పటకుటి. సం వి. ఈ స్త్రీ దూష్యము, గుడారము, డేరా.

పటచ్చరము. సం వి అ న జీర్ణవస్త్రము, ప్రాఁతగుడ్డ.

పటచ్చరుఁడు. సం వి. అ పుం. పాటచ్చరుఁడు, దొంగ. (వై. వి.)

పటచ్చోరుఁడు. సం. వి. అ. పుం. పటచ్చరుఁడు, దొంగ (వై. వి)

పటత్కుఁడు. సం వి. అ పుం చోరుఁడు, దొంగ (వాచ.)

పటపట = పటపటపట వి. (క పటపట త. పడపడ )

౧ పగులుట బ్రద్దలగుట యందలి ధ్వని కను కరణము.

క. ఖురనిహతి నొరలు దుష్కృతి, భరమునఁ గికటుతిలలు పటపట పగులక్ ...
చంద్రా ౧ ౧౫.

వ అప్పుడు కకుప్పుటలంబులు పటపటం బగుల వరాహ ౬. ౬౨.

ద్వి అట జినప్రతిమరూ పప్పుడ బ్రస్సి, పట పట బ్రక్కలై పడఁగ మధ్యమున పండితా.
వా ౨౦౧ పా వరాహ 3 ౨౬.

౨ కొఱుకుట నమలుట యం దగుధ్వని కను కరణము

గీ పటపటఁ గపాలపంక్తులఁ బగులఁ గొఱికి, బలము చెల్లను గడియలోపలను మ్రింగె .
మనుచ. ౪. ౧౧౩.

౩ ముండ్లు మొదలగునవి గాలి మొదలగు వానిచేఁ గదలుట యందలి ధ్వని కను కరణము.

గీ పడి యుడఁగి యుండఁగాఁ బటపటన ముండ్లు, గాలిఁ గదలుటఁ గని పంట్రకోలఁ బొడిచె.
మనుచ. ౪. ౫౪.

౪. పండ్లు కొఱుకుట యందలి ధ్వని కను కరణము.

క ఒండొరుఁ గదవం, బఱచుచుఁ బంతులు పటపటఁ, గొఱుకుచు సారథ్ర సైనికులు ధార్తరాష్ట్రులు ... భారా. ౫ ౧౧౪.

చ. ... అందఱిమీఁద నొక్కుటన్, బటపట పండ్లు గీటుచు ...

చెన్న. ౫ ౩౪ ఉ. రా. ౩. ౬౦

౫. చినుకులు వడగండ్లు మొ. పడుట యందగు ధ్వని కనుకరణము.

సీ పటపట యని మైనిఁ బడుచుండు వడగండ్లు వికసిత మల్లికా వృష్టిగాఁగ ...

పార్వ ౩ ౧౬

చ. చిటిపొటిమబ్బు లాకసపుసీమఁ గనంబడ గొప్పగొప్ప వై, పటపట వ్రాయుచు న్నగిన పాండవు బింబముఁ గప్పికొంచు చినుకుల్ .. శుక ౨. ౩౪౦

౬. కాలుట వేఁగుట యందగు ధ్వని కను కరణము

వ . కమలకు దుంగంబులపై వేఁడి వెన్నె లలు చిటచిటం గాఁచినఁ బలపటం గమలి భుగభుగం బొగ వెళ్యుగితి

సానందో ౫ ౯౧ పొ

జ: పటపట లాడించు

పటపటపట = పటపట వి పగులుటయం దగు ధ్వని కనుకరణము

క. పెటపెటపెటఁ గాసెన్ గవి, పటపటపట మనుచు గిరులు పగిలెన్ రగిలెన్, చిటచిట చిట మనుచున్ వని, గిటగిటగిట మనుచు జనము కృశియించె సెగన్ ...

గా వి. ౫. ౯౭

క. మిటమిటని కటికిరొయిందం, బటపటపటఁ బగిలి పాయవడిన పెదురులం, బుట పెంగ యుచు ముత్తియము, ల్చిటిలినగతి నాడె శాల్మలీతూలంబుల్ చంద్ర ౧ ౧౫౨.

పటపటలాడించే. స క్రి (√పటపట) పట పట యనుధ్వని కలుగునట్లు నములు . (వ్యవ) వాఁడు సెనగలు పటపట లాడించుచున్నాఁడు.

పటపటాత్కారము. సం. వి అ పుం పటపట మనుధ్వని

పటభాసము. సం వి. అ. పుం జాలాంతరము కిటికి సందు, ప్రేక్షణికము (వై. ని.) సం దశకు. ౨. ౨.

పటమయము. సం. విణ. (అ ఈ. అ ) ౧. పట ములతో - వస్త్రములతో నిండినది ౨ వస్త్ర వికార మైనది (వి అ న ) ౧ గుడారము ౨. కాటి

పటము. వి (సం స్ఫుటా కి పటవు త. పడం ) పాఁపపడఁగ. (శ. ర )

పటము. సం. వి అ. పుం న. ౧ ఆవరించునది . వస్త్రము. ౨ చిత్తరువు వ్రాయువస్త్రాదికము ౩ తెర ౪. చిత్తరువు, ఆలేఖ్యము.

సీ బలుజాళువాగట్టు విలుకానికిఁ బటాంతరంబు లేనగరంబులు (పటాంతరము = మతిరొుకి చిత్రము )

పుం. ప్రియాలము, మోరిటు ? (న-ఛది, పట లము, ఇంటికప్పు (వాచ.)

పటరకము. సం వి అ పుం గుంద్రవృక్షము, కాకివెదురు. ?.

పటరుఁడు. సం విణ (అ ఈ అ ౧ గతి శీలుఁడు, నడచు స్వభావముకలవాఁడు ౨. వస్త్రదాత, బట్ట లిచ్చువాఁడు

పటలము. సం వి. అ న. ౧ ఛది, ఇంటికప్పు ౨. నేత్రరోగవిశేషము, కన్నులకు పొర క్రమ్ము రోగము ౩ సమూహము. ౪ పిటకము, చిన్న గంప ౫. పరివారము. ౬ తిలకము, నొసటి బొట్టు ౭. వృక్షము. ౮ వృంతము, తొడిమ కాఁడ. (పుం. న.)

౧. గ్రంథభాగము. ౨. రత్నదోషము.

సీ. చిదురుప లైనయట్లొదవినపటలంబు ఘన
శోకవనధిలో మునుగఁజేయు
రత్న పరీక్ష. ౧౫.

**పటలము.** వి మల్లవిద్యావిశేషము లగుదండలలో
నొకటి

వ ... వామపార్శ్వభృంగి దక్షిణపార్శ్వ
భృంగి పటలము . . మల్లపు ౩౬౯

**పటలి.** సం వి ఈ స్త్రీ ౧ ఛగి, ఇంటికప్పు
౨ సమూహము

**పటవణి.** వి విజృంభణము

వ . కాలుబలంబులపైఁ బైకొనకి యెక్కి
పటవణి విప్పలేక ... తిరుగవచ్చినంజొచ్చి
చిక్కుడఁ చుటయుం జాఁపకట్టువడి
ఘోటకంబులక్రింద మిలమిల మెలంగెడు
గావుతులును
ఉ హరి ౩ ౨౪

(వావిళ్ల. ప్రా " పటవణింపలేక " శైశ్రా
ప్రా )

జ : పటవణించు

**పటవణించు.** అ క్రి. (√పటవణి) విజృం
భించు ('వ్యాపించు' అని. శ ర )

గీ పటవణించినయరిగెల పొఁజామీఁదం .
శవిశ. ౨. ౧౪౯

**పటవాపము.** సం వి అ పుం దూష్యము,
గుడారము, డేరా

**పటవాసము.** సం వి. అ పుం ౧. గుడారము.
౨ వస్త్రములకు పరిమళము కలిగించు సుగంధ
ద్రవ్యము, బుక్కా.

**పటహఘోషకుఁడు.** సం. వి. అ. పుం తప్పెట
గొట్టి చాటువాఁడు.

**పటహభ్రమణము.** సం. వి. అ న. జనులను
ఒకచోటికి ప్రోగుచేయుటకై తప్పెట వాయిం
చుచు తిరుగుట

**పటహము.** సం వి అ. పుం న. తప్పెట (పుం)
౧. హింసనము ౨. సమాగంభము, ఉద్యమము

**పటా** = పట్టా వి ౧ ఆయుధ విశేషము, పట్టా
కత్తి

గీ గడలు బాణా ల్పటాలు నగ్గలికఁ బూని,
పరువడుల్ ద్రొక్కుకొనుచు ...
గవిశ. ౧ ౭౧

గీ పసిఁడి కమరుపటా యొక్క కిసలయోపి,
మొలను ధరియించి
గవిశ ౧ ౩౪

(శ ర పా " పసిఁడి కమ్మరుపట " అని
ముద్రితము )

౨. ఇనుము మొదలగు లోహములతోఁ జేసిన
బద్దె

(చూ కమరుపటా )

**పటాకి.** సం వి ఆ స్త్రీ పతాక, జెండా
(వాచ )

**పటాకము.** సం వి అ పుం పక్షి (వాచ )

**పటాక్షేపము.** సం వి అ పుం (నాట్యశ్రీ)
తెరను త్రోయుట

(ఇది పాత్రముయొక్క ప్రవేశ గమనమును
సూచించును. (చూ. అపటీక్షేపము )

(ఇట్లే : పటీక్షేపము, పటీక్షేపము

**పటాణము.** వి ధాన్య విశేషము

గీ . అలసందె లుబ్బడాల్ నల్లతెల్ల, యుల
వలు ఎటాణములు పుట్లకొలఁది గిలవు .
హంస. ౪. ౧౨౪.

**పటాణి** = పటాణీ, పటాని. వి (క. పటాణి, త.
పట్టాణి, హిం. పఠాన్).

౧ యవనదేశపు గుఱ్ఱము; వాహనము.

సీ. యవనాశ్వభేదంబు లలరఁ బటాణి సా
ఆం. భా 3. ౫౮

గీ .. అయ్యభిమాన ధనుని, రెండవ కుపాణి
మరుని కూరిమిపటాణి, మంజువాణి
శుక 3 ౫౮౪

చ అలయలి నీలవేణి విగహాశుగ నైరి కుఱు
నాఁటిరాత్రి నా, చిలుకపటాణి నెక్కుడి
వజీరునిఁ బోలి యానృపాలునిం, గలయఁ
దలంచి . శుక ౧ ౨౫౮

(గాడ్పు పటాణి = లేడి, హరిణము)

సీ గవగాలువకు పాటిగాక గాడ్పుపటాణి
పొదలునిగ్గునఁ బోయి పొదలఁ జొచ్చె
ఉ రా ౧ ౭౮

గిబ్బపటాణి బలురౌతు = వృషభ వాహనుఁడు, శివుఁడు

సీ తెలుపుగిబ్బపటాణి బలురౌతు కనుసన్న మణి
మీఁద నుండు సన్మానమెల్ల .
చం. రా ౨ 30

(చిల్కపటాణి పాదుషా = మన్మథుఁడు)

ఉ. . పవడంపు వాతెరయె యూరము చిల్క
పటాణి పాదుషా, తూపులకోపు నూపు
దశా ౪ ౨౧3.

(చిలుకపటాణిరౌతు = మన్మథుఁడు)

చ పలుకులు వేయు నేల నిను వాల కనుంగొని
నంత నుండియుం, చిలుకపటాణిరౌతు త్యాగ
నేసె . ఉ రా ౪. ౨౦౦

పటా(ణి)ణీ. వి. యవనుఁడు.

సీ. చేతి కైదేసికేల్ శివరాయులవరాల కెలకట్ట
దల పటాణీల్ గరిబు, లు .
రా. వి ౫ ౧3.

పటాని = పటాణీ. వి. గుఱ్ఱము, వాహము

ఉ . దా, సానిపగానిఁ దెచ్చె ఖహిజాఱకి
రాతెలగంటి ఓనిక్ రా వి. ౨. ౪౭.

శ . పోదుగు కుగ్గనిగ్గు చోక్కటంపు
ముక్కు మిటారంపుపటాని నెక్కువానిఁ
గిన్నతంద్రి ప్రబంధ ౨౧౭.

(చిలుకపగాని తేరిగాఁగ = మన్మథుఁడు)

చ చిలుకపటానితేరగాఁ గన్నన నంతిపురంబు
నెల్వోకన్ శుకల ౨ ౭.

పటాపంచే(ము). విశే (పటాపంచ, త పటా పంజనమ్)

౧ మిక్కిలి చెదరినగి, చెల్లాచెదరు.

సీ కిన్నరి గతి గాఁగఁ గిన్నరు లరిగిరి పన్న
గేంద్రులు పటాపంచ లైరి
పారి ౫ ౩౪

ద్వి భంగంబు లై పటాపంచ లై పాఱి,
ముంగల మగవారి మోఁకి మోదించి ..
ద్వి భాగ విగా ౪. ౫౭. పా

గీ అప్పు డతికాయుఁ డలుకతోఁ దిప్పగిమ్మ,
రులఁ బటాపంచలుగఁ దోలి ...
అచ్చ రా యు. ౨౫౩

౨ అగోచరము; నశించినది

శా .. జగంబులందును జముం జేరొన్న
మాత్రం బటా, పంచం బై దురితంబులెల్లఁ
జనఁగా ... విజ వి. ౨. ౭౫

సీ తెలిసి మాద్రాసనంబులఁ బోనిఁ బనిగొని పాప
పూరుషుఁ పటాపంచ చేసి
పాండు. ౨ ౮

గీ కపటరాజన్య మంత్రిదుర్గర్వభాగ, తివిగ
పటలంబు లేమకీత్రిప్రభాను, భానుడాలి
కచేఁ బటాపంచ చేసి, వెలసెఁ దన
నప్పన విభుతిఁ గాంచె ...
రాజ చ. ౧ ౩౧.

3. చిరిఁగినది, కునిసినది, తెగినది.

ఉ. గుత్తిపుఁ దావిశాలిశకుట్టు పటుక్కున విచ్చె రంభకున్
శృం. శకుం పీఠి ౧. ౭౦

క. అని పలికిన వాఁడె నఖములఁ, జెన పటుకునఁ ద్రెంచివైచి బెబ్బులి పఱచున్
శుక ౨ ౩౨౩

౩ పాత్రాదులను, భూమిపైఁ బడవైచుట కొట్టుట మున్నగు వానియందలి ధ్వని కను కరణము

క. అటు పోగ వీతి చక్కటి, పటుకునఁ బడవైచి క్రోధ పరిపాటి మెయిన్
భీమ ౨ ౧౦౯

చ. ని, షణ్ముగతి మేఁగసీష్ఠలిఁ ఽటుక్కు పటుక్కునఁ గొట్టె నప్పుడున్
వరాహ ౧౨. ౪

**పటుచ్ఛదము.** సం వి అ పుం, అఁగారకి †

**పటుజాతీయుఁడు.** సం విణ (అ ఆ అ) పటుప్రకారుఁడు, సమర్థునిరీతి కలవాఁడు, పూర్తి సమర్థుఁడు కానివాఁడు

**పటుతాళించు.** స క్రి ఉటు నట బిఱుకుగఁ జాచు.

క. పటుతాళించి నటింగిను, నట నిటు బెళుకంగఁ జూచి సమటఁ దోఁచున్
ఆం భా ౩ ౧౩౮

(ఫ్రా. ముద్రి ప్రాఁతప్రతుల పా)

మ. . కర్ణాటి క్రొవ్విన్నలన్, బటుతాళింపుచు నవ్వే నీలకబరీభారంబు కంపింపఁగన్
క్రీడా ౫౧

**పటువ్రణితము.** సం. వి అ న ఉప్పునీటి ముక్క. †

**పటుదేశీయము.** సం = పటుకల్పము

**పటుపర్ణి.** సం వి. ఈ. స్త్రీ. రెడ్డివారి నానఁ బ్రాలు †. (శ ర "కంకోష్ట" అని గురు బాలప్రబోధిక)

**పటుపత్రిక.** సం వి. ఆ స్త్రీ క్షుద్రచంచువు, చిట్టియాముదపుఁ జెట్టు

**పటురూపుఁడు.** సం విణ (అ ఆ అ) పటిష్ఠుఁడు, మిక్కిలి సమర్థుఁడు

**పటువ.** వి (తు పటవు) భిక్షాపాత్రము

గీ. భవతి భిక్షాం ప్రదేహి యన్పలుకు వలికి, పటువ సాఁచినఁ గాశికాపదమునందు, వాఁకొనినవారి కిడు సుధాహారభిక్ష, గౌరి కంకణములు ఘల్లుఘల్లు మనఁగ
కాశీ ౬ ౧౨౨ (చి ని. పా)

(పటువుసాఁచిన అపముద్రితము)

**పటు(ట్టు)వలి.** వి (పట్టు² + వలిపము) పట్టుతోఁ జేసిన సన్నని వస్త్రము

ద్వి. అలరుచుఁ గైకొని యఖిలంబు వెలుఁగ, బలువుగా నొకపటువలి చించి యొక్కఁ, దిక్కసుతోడ సంధించి చేతొక్క, దిక్కవస్త్రంబుతోఁ దిగిచి బంధించి
బస పు. ౪ ౭౫౦ పం

(పటవలిపుట్టము = పట్టుతో చేసిన సన్నని పుట్టము)

ద్వి. అట్టి దివ్యాంబరం బఖిలలోకములఁ, బుట్టదు బసవయ్య పట్టంపుదేవి, కట్టినపటువలి పుట్టంబు చూచి, వెట్టన వచ్చితి నీ కొఱఁగింప ... బస. పు. ౩. ౩౮౭. పం.

(పటవలి, అపముద్రితము)

**పటువు.** సం విణ. (ఉ. ఊ. ట్వి. ఉ.) ౧. శక్తుఁడు, సమర్థుఁడు ౨. చతురుఁడు, నేర్పరి. ౩. ధూర్తుఁడు, జిత్తులమారి. ౪ నీరోగుఁడు,

తెవులులేనివాఁడు. ౫. నిష్ఠురము, కఠినము (మాట మొ) ౬ తీక్ష్ణము, వాఁడియైనది (బుద్ధి మొ.) ౭ కటువైనది ౮ స్ఫుటము, స్పష్టమైనది; పెద్దది. (ధ్వని మొ) ౯ ఉప్పనిది (వై ని.) ౧౦ పుం న ఛత్రాకము, కుక్కగొడుగు ౧౧ పుం ౧ పటోలము చేఁది పొట్ల. ౧౧ ౨ చోరకము, కచోరము ౧౧ ౩ కారవెల్లము, కాఁకర ౧౧ ౪ కొండీరలత ౧౧. ౫. ఉప్పుదనము (వై ని) న ౧ ఉప్పు ౨ ఇందుప్పు, సైంధవలవణము

పటుసాలె = పట్టుసాలె (√పట్టు²)

వ ... అర్వీటి మేటిసాలె యగసాలె పటుసాలె వాసె వైజాతి సాఁతులేతుల కోమిరెలు .

ఆము ౪ ౩౫

పటేలు. వి (మహా, హిం పటేల్) గ్రామాధికారి. (శ ర గ్రా)

పటోటజము. సం వి అ న ౧ (మూలమునుండి బట్టవలె బయలు దేఱునది) పుట్టగొడుగు, కుక్కగొడుగు ౧౧ ౨ (పట + ఉటజము) వస్త్రగృహము, గుడారము

పటోలకము. సం వి అ పుం ౧ పటోలము, పొట్ల ౧౧. ౨ (పొట్లకాయవలె గుల్లగా నుండునది.) శుక్తి, ముత్తెపుఁజిప్ప (వాచ)

పటోలము. సం వి అ పుం. ౧ చేఁదిపొట్ల ౧౧ ౨. పొట్ల. ౧౧.

(న. వస్త్రభేదము, ఘూర్జరదేశపు చిత్రవస్త్రము.)

పటోలి. సం వి. ఈ. స్త్రీ పటోలిక, పొట్ల ౧౧

పటోలిక. సం వి ఆ. స్త్రీ పొట్ల ౧౧

పట్ట. వి. (క పట్టె, త పట్టై) ౧. చెట్టు మొ కానిచర్మము, తొక్క, నార.

సీ . . తొడు పట్ట తోలుక తోలు చెక్క.

ఆ. తొంట చెక్క తడప యంట త్వగాఖ్యయా ...

ఆం. భా. ౨. ౩౭.

ఉ గట్టిగ పట్ట లత్తి పలిగాడ్పుతరుల్లను గొట్టి సారెకున్, బొట్టలు చీల్చి జీవనముపొం దెడ సేయక పోవనిచ్చునే

ఉ హరిశ్చ. ౩. ౫౯.

౨. గోఁగు మొ. వానినారతో నేసినగుడ్డ మొ ఉదా: గోనెపట్ట, కమ్మరపట్ట మొ. (శ. ర.)

౩. ఇనుము మొ వానిబద్ద

ఉదా: ఇనుపపట్ట.

(ఈ యర్థమందు పట్ట = పట్టా అని వా)

౪ పట్టెడ, నవారు

సీ సరి లేనిమంచిగుజ్జరి నేతపట్టయుఁ బఱు వైన రాయంచ గఱులపఱుపు ...

ఉ రా ౬ ౧౭౦

ఉ. వి. ౫ ౧౦౭ (కేలిపెట్టి అపముద్రితము)

జ . పట్టసారాయి

పట్టకము. సం వి అ పుం. ౧ రాజశాసనాదులు వ్రాయు రాగి లోనగు వాని రేకు. ౨ వస్త్రాదులకుఁ గట్టుకట్టు ౩ తమ్మ పడిగము.

శ్లో అధ మాతిరుసీరవాసితం, నిజతాంబూలగ సేన గంజితమ్, తపనీయమయే హి పట్టకే, ముఖగండూషజలం విధీయతామ్

(దేవీమానసికపూజ)

పుం. న (వ్యవ.) పత్త్రము.

పట్టజము. సం. వి. అ. న (పట్టువలనఁ గలిగినది) పట్టువస్త్రము,

పట్టడ. వి కుమ్మరి వడ్రంగి మొదలగు శిల్పులు పనులుచేయుచోటు; ఆశేకనము. (వి ని. శ ర)

పట్టణము. వి (సం. పత్తనమ్ ప్రా. పట్టణం) నగరము.

క. ఇట్టిది యగుc గాన్యం బని, గట్టిన నింతిc గానిపోయి కతిపయదినములం, బట్టణము సొరంగc గోమటిసెట్టియు ..

భోజరా 8 88.

క. ఇ ట్టట్టన చేటికి అత్తిపట్టణమున న్నూ యట్టి ప్రజలు .. కళా ౧. ౨౨.

పట్టనము. సం వి. అ న ౧ కోటచేతను అగడ్తచేతను దుర్గము మైన ప్రధాననగరము పత్తనము ౨ క్షుద్రగ్రామము 3 లండ్లు గుఱ్ఱములు ఓడలు అనువానిచేc బొందcదగిన పురము (శే ని)

పట్టపగ(వ)లు. వి (పగలు+పగలు) మధ్యాహ్నము

గీ. పట్టపగలింటి సూర్యునిపగిది నెరcడు, గోవ భారి ఆను ౧ 3౫౯

గీ అని తలంచుచు నున్నరు మనుచుc బట్ట, పగలుగా వెన్నెలలుగాయc దోగలనేని, నట్టె చూచుచు విరహార్తిc దగుచు మస్త, గుమ్మరొక్కటై రాc గోరుకొనుచు నుండె

ఉ. రా ౪ ౧౪3

గీ. పట్టపగ లన మధ్యాహ్నవాచకము

ఆం. భా. ౧ ౯3

గీ పటుచె బలువింటc గర్ణుండు పటుశరములc, బట్టపవలింటి సూర్యునిప్రభలు వోలయు

భార. ద్రో ౪ ౨3౧.

పట్టపయ్యా. వి. (పట్టము+అయ్య) రాజు, అధికారి. (చూ నీరు)

పట్టపే(పు టే)నుగు. వి. (√. పట్టము) భద్రగజము.

సీ పట్టపేనుగుc బైడిపల్లకిలేలిని దగజాయి తియుచేసి దండc బెట్ట . కళా. ౧. 3౦.

గీ పట్టపేనుంగుమీcదటc బెట్టి యతినిc, బురము గెలయ నేcగింపcగ . పరి ౪ 3౫.

ద్వి భరతుc డప్పుడు రాముపాదుకంబులను, సరి ప్రదక్షిణ నమస్కారముల్ చేసి, పట్టంపు టేనుంగుపై నొప్పc దెచ్చి, పెట్టి లోకములెల్లc బ్రీతిc గీర్తింప ..

౧౦ రా అయో ౧౪౨ పా ౨౭ పం.

పట్టపుదంతి. వి (పటము+దంతి) భద్రగజము, పట్టపుటేనుగు.

సీ కంతుపట్టపుదంతి కాదేని యీయింతి ఘన మనస్సరసులc గలcచు టెట్లు ...

దశా ౨ 3౦౨.

పట్టపుదేవి. మి వి మహిషి, కృతాభిషేక యగు రాజపత్ని

వ ... శంకరుండు ... యన్యజన్మంబునం గాశిరాజు పట్టపుదేవికిం గూcతురై పుట్టు నట్లుగా వరంబొసంగె ...

కాశీ ౫ 33౨.

ఉ ని, నృట్టపుదేవిc గాc బడసె భానుకులోత్తముc డంబుజాననా ..

హరిశ్చ 3 ౧౫౧.

(ఇట్లే: పట్టపురాణి)

సీ బ్రహ్మకుc బట్టంపు రాణివాసం బయ్యు రాజసక్రీడాభిరతులc బోక .

కాశీ ౨ 8.

పట్టభంగము. సం. వి అ పుం. ౧. సోపానము, మెట్టు.

చ. లలిత మణిపట్టభంగసంకిలా ధరణీసురుc డేcగి చెంగటన్ ... మనుచ. ౨. ౨౧.

౨. సింహాసన భ్రంశము, రాజ్యము పోవుట.

పట్టమహిషి. సం = పట్టపుదేవి

పట్టము. వి (క పట్ట. త. పట్టం) ౧ బిరుదు. (పట్టపుపేరు అని క ర)

౨. (సం. పట్టనం) రాజ్యము

శా రావణుఁ డనంగా మీఁటి రాకాసి పెన్, బట్టం బేలి నతండు తమ్ముగవ యొప్పట్లన్ దమం గొల్వఁగన్ . .

యయా ౨ ౬౩

చ . నీకు సురేంద్ర పట్టమున్, నిలిపినభాత దూఅవలె ని న్నఁ సేఁతికి గోత్రభేదనా .

దశా ౨ ౩౧ భా ౪ ౨౯

౩ అధిపత్యము, అధికారము

సీ . . శేశేల దోశ వాయి నాయఁక ప్పుఁ, బట్ట మున నిల్చి శాగకుఁగిట్టి

పాండు ౧ ౧౪౫

జ . పట్టపయ్య, పట్టపేరుఁగు, పట్టపుదంతి, పట్టపుదేవి, పట్టముగిట్టు

పట్టము. సం వి అ పుం న ౧ ఫలకము, వ్రాయుట లోనగువాని కుపయోగించు పలక (శిలాపట్టము, ఫాలపట్టము)

౨. సింహాసనము, పీఠము, పీఁట

౩ భూమ్యాదికరగ్రహణ లేఖ్యపత్రము, రాజు రైతుల కిచ్చెడు పట్టా

౪. రాజ్యాభిషేక కాలమున నొసటఁ గట్టెడు పట్టి

౫ పట్టునూలు

౬ కౌశేయము, పట్టుబట్ట

౭. ఉత్తరీయము, శైరవాసము.

౮. తలపాగా ; పాగా

౯. చెట్టుమీఁది పట్ట, అ పట్టవలె నుండు వస్తువు. (నిశ్శ్రేణిపట్టము)

౧౦. ఫలకము, డాలు.

౧౧ పేషణపాషాణము, సన్నికల్లు

౧౨ (వ్రణము లోనగువానికిఁ గట్టెడు) కట్టు

౧౩ పట్టణము, నగరము

౧౪ చతుష్పథము, చదుకము, నాలుగుద్రోవలు కలియుచోటు

౧౫ క్షేత్రము, కయ్య. (వై ని)

పట్టముగిట్టు. స క్రి (√పట్టగు) గాఁగ కేయు ; అధ కారగాఁయు

క పరమభక్తి నిశ్శాహిత్య కులఁ జూపి, బిరికిని సైన్యములకును మీగా యొనయు, లను మేఁ బట్టంబుగట్టి గంతెనుతనూజు

భార ఉద్యో ౪ ౧౪౯

ఉ . అ, య్యంబుజనాభి యోపధుల నప్పుల విప్రుల నేలువానిఁగాఁ, బంచిన జేష్ఠుతో నతనిఁ బట్టముగట్టిన భక్తుదగ్రతన్ హరి భూ ౩. ౮

గీ సాయుకంబులు మూఁటి ముజ్జగము గెలువఁ, బాలు పెట్టి శేషించిన బాణయుగళి, మదనుఁ డెత్తి గ్రాగం భోజపదమునందు, గారవం బొప్పఁ బట్టంబుగట్టఁబోలు

నైష ౩ ౧౨౨

(కొన్నిప్రయోగములందు పదాంతరవ్యవధాన మును కొన్నిట పదవ్యత్యయమును గాను వచ్చుచున్నది)

క. ... వాలిం దునిమి న్య, పాగ్రణి కిష్కింధఁ బట్ట మగ్రజుఁ గట్టెన్ ...

భా రా. సుం. ౨౬౮.

గీ. వివిధరణశోవిదుఁడు వయోవృద్ధుఁ డధిక, బలుఁడు కూరుండు గట్టుము పట్ట మతని

భార. ద్రో. ౧. ౬౨.

పట్టవస్త్రీఁడు. సం. విం. (అ. అ. అ.) పట్టు బట్ట గలవాఁడు.

౧. గ్రహింపఁజేయు, చేకొనఁజేయు.

ఉ. పాప మొంది మీఁదఁ బటు కార్ష్యఁ బట్టించు, దండధరుని బాధ తాకఁగలదె ...
సారంగ. ౨. ౧౧౧.

సీ. మలకఁ బట్టినవాఁడె రూపప్రభావ, భావనమ్మునఁ గామినీ పంక్తిచేతఁ, బలుకఁ బట్టించె సజ్జనకులవిరోధి, రాధికమురారి ...
ఘటికా. ౧. ౪౫.

౨. లాగించు.

సీ. చూపఱచిన్నవారిఁ బీడించి పెనుబాముఁ బట్టింప నింతైనఁ బాలు దయ్యె . .
శు. క. ౨. ౧౨.

౩. (శంఖాదులను) ఊఁదించు, ఒత్తించు.

మ. . . మనోభవుండు కోదండం బెక్కుడించి సంగ్రామ విరామసూచకంబుగాఁ గుక్కుట కంఠకాహళంబులు పట్టించె ...
నైష. ౪. ౧౯౭.

సీ. అపుడు కోఁతుల ఱేఁడు శివి మొలయంగ బూరి పట్టించి తరలి . .
అచ్చ. రా. కిష్కి. ౪౧.

౪. ప్రారంభము చేయించు.

(వ్యవ.) ఉపాధ్యాయుఁడు మా పిల్లవానికి పుస్తకము పట్టించెను.

౫. అనుసరింపఁజేయు.

క. నరసీరుహ సంభవుచే, నరకుం డేవరము వడసి సమ్మెన వాఁడో, పురములు గైకొని కొలఁదుల, తెరువులఁ బట్టించె నన్నదిక్పాలకులన్ ...
ఉ. హరి. ౧. ౧౨౯.

(కొలఁదుల తెరువులఁ బట్టించెను = పారిపోఁ జేసెను. భావము.)

౬. పూనఁజేయు, యత్నింపఁజేయు.

క. శ్రుతరాజా రతియుఁ దమయిమ్ము, బలమున దశకంఠముఖులఁ బట్టించిరో నాఁ, గలయఁ గయిసేయు గిటుబిటోకలు విరిచిరి పురము వీధి కల పతివర వై ... హ. సం. ౭. ౧౨౦.

౭. అంటించు, ప్రాయు.

క. తల విప్పుకొండ్లు మొదలుగఁ, బలుగులు పట్టించి పుష్పములు సంజనముల్, తెలుపొప్పుఁ బూని కడు వి, ర్మల హృదయము తోడ మదక మద్యంబునకున్ ...
వి. పు. ౪. ౧౯౪.

(రుద్దు. అని భావము.)

౮. సత్తము చేయు, తగులొక్కనఁజేయు.

దండకము. . ఈ మానవాధీశుపై మానసం బేల పట్టించెదే ముద్దుపట్టీ ..
భోగినీ దండకము.

ప్రయోగ విశేషములు:

(i) శేషు సీతాకము పట్టించెదను.

(ii) వాఁడు దానిపని పట్టింపక మానఁడు.

(iii) ఆపిల్లలు నన్ను ఎగతాళి పట్టించిరి.

పట్టించుకొను. స. క్రి. (√పట్టించు.) కొనియించుకొను.

వ. ... నిర్వారితమ్ము గుసుకు బాద లాదిగాఁ గలుగు వస్త్రధాన్యంబులు ముడియలం గావర్లం బెట్టించి పట్టించుకొని ...
పి. శకుం. ౩. ౧౨.

వ. ... చిలువ రాచకొడుకులచేత కోశరత్న సింహాసనముఁ బట్టించుకొని భూదేవి ...
ఉ. రా. ౭. ౯౪.

పట్టింపు = పట్టుట. వి. (√పట్టు[1]). ౧. విద్యార్థులకు నూతన పఠనమును ప్రారంభింపఁజేయుట. (శ. ర.)

౨. పట్టుదల, పంతము.

సీ. తెలి పట్టింపు వెల్లవ పూని దాన, తేజ మొందు వైనఁ గాని యుంచైనఁ గాడ, తలపునకఁ

ఆ ద్రుపదు పట్టిలోన బొమ్మిగ లయ్యాయు లేచెం,
ఒనులంబుట్టె విరటు పట్టణమున
జై భా ౧ ౯౨

సీ క్రొల్వులిషైన నుక్కుననంబట్టి మీసాల
నురెమ్మల లాంగెడు కోపికలును
విక్ర ౧ ౪౪

౩ అవలంబించు ఊంతగాంగొను ఆశ్రయించు
వివాహముగాం జేసికొను

న ఎవూతనికి ఓత్య పితామహులను మా
పట్టిన యవ్వరు గంట జేశ్లింగాలుండు
మూషిక వ్యాజంబునం దరతరంబ కొటికిన
భార ఆది ౨ ౧౪౩

ఉ బాలకుంబట్టి రే సురలు బల్విడి నాపయి
నెత్తిరి షు సం ౧౦ ౫౧౪

ఉ ఎన్నగతల్ప నిన్నె తింగి పట్టిన నాపద గల్గ
జేర్చుకే భాగ ౮ ౭౩౦

ఉ కెండియు నుపేంద్రు పదాంబు
రుహాంబు పట్టెదన్ అము ౫ ౮౦

ఉ బంధులం బిట్టి ఎల్లనుల బాధలం బెట్టి
శరములుపట్టి పదంబుల ౯ట్టి
భాగ ౭ ౧౦౪

౪ (శంఖాదులు) ఒత్తు ఊదు పూరించు

౯ ఇటు గాక విను జవంబుల పటిమను కెక్కు
డుగ విద్య పచరించుట యక్కట విఫలము
గాదె రేచ్చుటం జెవిటికిం బట్టినట్టి సంకును
బోలెక కళా ౨ ౯౦

సీ పాపవా చెవిటికిం బట్టినసం కమునాపుడి
బధిర వినంగం జేసి గా వి ౧ ౩౭

౫ పిసుకు మర్దించు

సీ తంభా ప్రభాసాప్సరః పృథూరోజకుంభంబు
లెచ్చుటం గన్నుం బట్టి పట్టి
అము ౧ ౪౧

సీ నడుము పట్టిన నందు సాధుని చిటుకోడి
ల్బుడికిన ఫీ యుని పొరలు నడుము
హంస ౩ ౨౦౧

౭ (కెట్టు కి తెతింగి కరచరణాద్యవయవము
అను ఇటు నటు కదలకుండ) అదుము (కర)

౪ ధారణముచేయు జ్ఞప్తియం దుంచుకొను

చ అ, పురహితోపదేశములు పాటుగం
బట్టి వసుంధరాధురా ధరణి నెంనర్పుము
భార శాం ౧ ౧౪౩

౪ ఎంచు తలంచు ఆలోచించు

చ ఓ ఎడంతుక దాని నీవ యనుగ్రహింతిం
గరం బిటు లాదరించి రేఖ వృడినం బరిత్య
జించితివి ఒట్టంగ రా దిది తప్పాగా మదిన్
కళా ౩ ౨౪౨

చ కన్యల నిచ్చెద మంచు నెందరే బడిం
బడి చె ప్ప పంప వది పాటిగం బట్టక
కళా ౨ ౪౪

ఉ నెట్టిన నన్ను సత్కరుణ నీరధిశేష్టిత రైన
ధాత్రికిం బట్టము గట్ట దేని నొకబాస
పితామహ యాత్మ నెగ్గుగాం బట్టక
విస్మ శాం ౫ ౨౪౧

౯ నిలుపు అంపు నిగ్రహించు

ఉ భూ వల్లభ నీవు శాసననివాసము
గోరి చనంగ నెట్టు లే, నుల్లము పట్టి హస్తి
పురి నుండంగ నేర్తు
భార అశ్ర ౧ ౩౨

చ అత్మజాం డిలిగిన శోకవేగమున గ్రంత
యుం గోపము పట్టలేక
గా రా యు ౧ ౪౦౮ విజ వి ౧౪౨

౧ పలుచుహాయిముల సారథి పట్టజేమిం దత్త
రించుచు నున్నది తరణిరథము
దశా ౧ ౧౪౪

క. ... మనము పట్టం, జాలక పరపురుషభోగ
సంగతి కోరుక్ . . శుక. ౨. ౫౫౩.

౧౦. గుఱ్ఱము మొ. వానిని నడపు, తోలు.

సీ. తాను దక్కిణియయ్యెఁ దగ దన దాత్మ
జాతునకుఁ జోళకరుద్రుండ హయులఁ బట్టు..
నను. ౧. ౬౫.

సీ. సంగరంబున ధనంజయరథస్థాయియై ధవ
ళాశ్వములఁ బట్టు దంటతనము
శశా. ౧. ౯౪. విప్ర. ౨. ౯.

౧౧. (పతిజ్ఞాదులు) పూను.

ఆ. పార్థుఁ డిట్లు ప్రతినపట్టిన నదినిర్వ్యాహించు
పనికిఁ గృష్ణుఁ డివ్వ్యథమునఁ, బూని .
భార. ద్రో. ౩ ౩.

క. ... ఏవేళ నే పదార్థంబువేఁడిన నే దన
కిచ్చుట వ్రతంబు గాఁబట్టి .
హర ౧. ౧౪.

శా. ... నా, తోడఁ వైరము పట్టి నిట్టిజనక
ద్రోహిఁ దుహిం గంటిరే .
భాగ. ౮. ౧౬౫.

౧౨. ప్రారంభించు, మొదలుపెట్టు.

ఉ. పట్టిన కార్యముల్ విడువఁ జూడరొ పాడి
రొయుంగ వోటు. . చంద్రా. ౩. ౬౨.

సీ. దుడుకు చేయఁగరాదు దూరంబుచూడఁగాఁ
బట్టినపని కడముట్ట వలయు . .
రామలిం. ౪౭.

౧౩. పోలు, ఆవేశించు.

ఆ. బ్రహ్మహత్య దన్నుఁ బట్టిన నమరేంద్రుఁ,
డజ్ఞాని కడకు నేఁగి ..
భార. శాం. ౫. ౪౩౧.

మ. వినుఁడీ వాఁడు ప్రతిజ్ఞ చెల్వులు జగద్వి
ఖ్యాత చారిత్రుఁ డా తని చేఁబట్టెడ నెగ్గిరోని
కాముక రంధ్రం బచ్చెపుంగాక ... .
నైష. ౭. ౧౧౭.

క. ఇట్టట్టు చూచి యూచెలిఁ, బట్టినవల రాచ
గబ్బిబలు భూతంబుల్, కొట్టుకొని పీడఁ
జేయఁగ .. సారంగ. ౨. ౧౩౧.

౧౪. అనుసరించు, అనుసరించిపోవు.

క. మనదేశమునకుఁ బోదము, మన మల్లన తెరువు
పట్టి . భార. విరా. ౫. ౨౨౦.

ఉ. పక్కన నేసరం జన దుపాయములన్ దగు
నిచ్చకంబులన్, జిక్కఁగఁ జేసి డాసి సతి
చిత్తముఁ బట్టి సుఖింపఁగాఁ దగున్
మనుచ. ౩. ౬౯.

గీ. గోదావరీ సింధుతటము పట్టి, దండ
కారణ్య వీథిమధ్యంబు దరిసి ...
కాశీ. ౧. ౭౫.

౧౫. చేరు, కూడు

క. నినుఁ బట్ట పాండుపుత్రులఁ, దనమొనగల్లురఁ
దొలంగ ధరణీశ్వర . .
భార. శల్య. ౧. ౮౯.

చ. గొనకొన చేరఁడయ్యె నినుఁ గూడ మరా
ధనుఁబట్ట యట్టి క, ర్ణునకయి నీవు నేటికి
మనోవ్యథఁ బొందఁగ నిట్లు పుత్రకా .
భార. శాం. ౧. ౩౯.

౧౬. పశువుల వృషణములుకొట్టు, వట్టలు కొట్టి
చేయు.

సీ. పొలఁతి నపుంసకుల్ పూర్వభవంబున నెద్దుఁ
బట్టినవారు భార. అను. ౫. ౧౦౫.

(మూ. పశు పుంస్త్వోప ఘాతేన జీవంతిచ రమం
తిచ . . సం. భార. అను. ౨౨౧. ౩౧.)*

౧౭. రమించు, రమింప నుద్యమించు.

క. మనుజాంగనలం బట్టుచు, దనుజాలకుం బెల్లఁ
గాక దనుజాంగనలన్, మనుజాలు పట్టుచు
నుండు తొరల, కొనికె ...
ఉ. హరి. ౫. ౨౦౯.

సీ. మునిపత్ని యన కహల్యను పట్టఁడే నీదు
పదపారి యగు పాకశాసనుండు ...
కళా. ౩. ౭౧.

ఉ. నీ విభు డెన్ను రంధరతి నీవలెఁ బ్రముఁడుఁ
బల్మిఁ బట్టెనే ... సారంగ. ౨. ౧౨౦.

౧౮. (రాహువు కేతువులు సూర్య చంద్రుల) మ్రింగు, కబళించు.

క. అమృతరస మింత సోఁకఁగ, నమృతం బై
రాహుశీర్ష మది భయదముగా, నమృతకరా
ర్కులఁ బట్టెడి ... దశా. ౨. ౩౪౮.

సీ. కర్కటి మర్కటి గాద పట్టినచోటఁ
గప్పులు గొప్పులు గలవు మ్రింగ .
దశా. ౧. ౧౩౪.

౧౯. (భృత్యాదులు ప్రభువులు మొ. వారికి ఛత్రచామరాదులను) చేయు.

సీ. ధవళాతపత్రముల్ దలఁచుగాఁ జెలఁగొ
పట్టరు మౌక్తికప్రభల వెలుఁగ ..
భార. విరా. ౧ ౧౭౬.

సీ అమృతబిందువులు పైనందందఁ జిలుకంగఁ
బద్మాతపత్త్రంబుఁ బట్టఁ గమల ...
హర. ౪. ౯౨.

చ. నలువకుఁ గుంచె పట్టు వెలనాఁగ ..
హైమ. ౬. ౧౧౧.

౨౦. చాఁచు

క. ఓయి వెలయాల తలకోవఁ, జేయుము విరులికి జవాదిచెయి పట్టుము ...
సారంగ. ౨. ౭౩.

సీ. ఒకతె కప్రపుకళాచిక చేంట్లు పుందడింపఁగ
మిట్టిపడి కేలు బయలుపట్టు ...
వసు. ౪. ౩౫.

౨౧. (అభ్యంగముల మొదలు మొ. వానికి వాఁడి పెట్టుకొనుట మొదలుగు పెట్టుటకు) కాఁచు, ఒరపెట్టు, ఘర్షణము చేయు.

చ. ... కేల్బుఁదో, యన్యాలి మనసానఁ బట్టిన,
యనంగుని మోహనబాణమో యనక ...
మనుచ. ౬. ౨౪.

సీ. కారుణ్య మసృణాంగధారఁ బట్టిన మహోక్షుని
తూపు లనఁగ లోచనము లమరె ...
బాహ్ని. ౧. ౯౯.

వ. ... అతండు గీర్వాణమృత్తాయమానం బగు
మార్తాండుని తేజంబు గరపానం బట్టి తెచ్చిన
నచ్చెరు వంది ... మార్కం. ౫. ౩౫౩.

౨౨. (నీరు లోనగునవి పాత్రాదులలో) గ్రహించు.

గీ. కుంకుమాగురు మృగనాభిపంకములను, గంధ
కర్పూర నీహార కర్దమముల, నలఁది రమరాసు
రులు భక్తి యతిశయిల్ల, నభవుపట్టికిఁ బసిఁడి
కుంభములఁ బట్ట .. హర. ౬. ౫౪.

సీ. పునఖం పుగాచేతిపుడుకకప్పెర నిండ బ్రాణి
కోటుల నల్లఁ బట్టవాఁడు ..
మనుచ. ౪. ౪౩.

సీ. కవకుఁ బుట్టినవానిఁ గడుమతింతు రదేమొ
పాథోధిఁ బుక్కిటఁ బట్టు టరుదె ...
శుక. ౩. ౨౩.

౨౩. (కానుక, మొ. నవి) ఇచ్చు, అందిచ్చు, అందించు.

మ. ఉలుపాల్ పట్టినయిండ్ల మజ్జనస్పృహో
దార భుక్తిక్రియా, జ్వాలు నై ....
అము. ౪. ౩౬.

చ. ... ప్రమదంబునఁ గృష్ణుఁడు పట్టిపెట్ట నఁ,
ప్పురముల నీడనే యరిగెఁ బట్టినకానుక
తెల్లఁ జూచుచున్ .. విజ. వి. ౨. ౯౫.

౨౪. పొందు.

గీ. పేద లయ్యును గడు బిట్టుబిగిసి యుంద్రు,
పట్టి యధికమానములను గర్వములఁ బట్టి,
యట్టివారికెల్ల నెయ్యమైనయంత, నెన్న డొకఁ
బెట్టని యంత విమలులు. కాశీ. ౩. ౫౦.

వ. . ఒక రొులశాగ వక్షోజ భాగంబునం
బద్మరాగ పతాకంబుఁ బదిలపఱిచె .
నైష. ౨. ౪౪

సీ. నిజవిరుదాత్త రాన్విత హేమపట్టిక ఫాల
భాగంబునఁ బదిలపఱిచి
హై భా ౩ ౨౭౦

గీ అలరుఁబోఁడి, పురుష సౌవ్వనిఁ
జిత్తంబు చొరఁగనీక, బ్రహ్మచర్య వ్రతస్థితిఁ
బదిలపఱిచి, యుత్తరార్యునికడఁ జేసె నుగ్ర
తపము .. కాశి ౫ ౩౩౧

౨. సవరించు, చక్కఁబెట్టు

సీ తలఁకు డెందముతోడఁ దాలిమి గీలించి
పఱ్యోద్యదఁ జనుదోయిఁ బదిలపఱిచి .
విక్ర ౧ ౧౫౭

౩. ఏర్పఱచు.

క పదిచుట్లు సాలు రేకులు, పదిలపఱిచి సుకవి
పేరు పతిపేరును లోఁ, బొదలఁగ సేవం
విధగుణ, విదితం బగుచక్ర బంధవిధ మెట్ల
న్నన్ నగస ౪ ౭౩

పదిలము. వి (సం భద్రమ్ ప్రా భద్దం) ౧
స్థైర్యము, నిలుకడ

మ. . శాహసం, పద సొంపారఁగ నన్న
దమ్ముల మిమ్ముం బ్రాణంబులం బాపుడుం,
బదిలం బేది తొలంగి లేని దివియుం బాశాళ
ముల్ లోనుగాఁ, దుది నీచొచ్చినచోటఁ
జొచ్చి ... హరి ఉ. ౧. ౧౧.

క. కదలి గళసమున ధర గ్ర, క్కదలఁగ
శేషుండు శిగము లల్లన వంపం, బదిలంబు
లేక కూర్మము, చదికిలఁబడ దిగ్గజములు పరి
భ్రమగ్గతిలన్ భా. రా యు. ౧౩౧౦.

మ. . సాలుకటుదిన్ బంచాక్షరీ మంత్రమున్,
బదిలం బొప్పఁ జపింపు మన్న ...
హర. ౨. [illegible]

౨ జాగరూకత, అవధానము, అప్రమత్తత

గీ ఎచ్చరిక యొచ్చరిం పేవ యేద పదిలము
హావణిక పోటిమి యన నొప్పు నవధానము
ఆం భా. ౧. ౧౩౭

చ ఎదురుగఁ బోవనిమ్ము రథ మింతని తేరితి
నన్న సాతఁడుం, బదిలముతోడ రథ్యముల
పగ్గము లేత్తిఅ నూలుకొల్పి ...
భా విరా. ౫. ౧౨౧.

చ పదిలముతోడ నా హంతులు పావకులో
హరివైరి నాటతో, మ్మిది దగ చేర్చి ...
భా రా. యు. ౧౩౨౪

(విశే) ౧ స్థిరము, అచంచలము

క తనయునికి పదిలముగ నా, తనయునికిం
గలుగ దితని తనయులకైనన్, వనజోదర
యాదరమునఁ, గనుఁగొని ప్రాగ్జ్యోతిషంబు
గరుణింపఁ దగున్
ఉ హరి. ౧ ౧౭౩.

గీ. కొదలు దెలియంగవలె ననుకొర్కెఁ దేర్చి,
కొదలఁ బొదలిన పదిలంపుటి సమర్చి
హై. భా ౨. ౭౩

క ఇది యేమికంత నీవు, న్మదవృత్తిని కంత
దక్కి నాగద్దియపైఁ, బదిలంబుగఁ గూర్చుం
డితివి భార విరా ౫ ౩౧౭

చ పదిలపుఁ బ్రేమ యారతులభంగులు చాల
విరాళి గొల్పఁగన్ .. కళా. ౪. ౧౨౧

౨. దృఢము

(క ) అసందిగ్ధము.

ఉ చేసట లేక భీమపృథివీ పతినందన యాన
నాంబుజో, ల్లాసవిరక్తిముద్ర పదిలంబుగఁ
గన్గొని ... నైష. ౫. ౧౬౩.

చ. ... ఆసతి విప్రునియింటి కేఁగి యు, ల్లస
వతిఁ దొంటియునికిఁ బదిలంబుగఁ జూచి
సమీపమందు ని, ల్చిన ..
భోజరా. ౪. ౩౦౯

(ఉ.) గట్టిది.

క. మది నయ్యిరువుర మాటలఁ, బదిలంబుగఁ బట్టికొనుటఁ బట్టియు నెట్లుం, దుగి నది యట్టుల కాఁగల, యది దైవ యొందుటను దానికతఁ డొదఁబడియెన్.

భార. ద్రో. ౫. ౩౧౨

ఉ. ధీవరులార గాలముకుదిం బిగిలంబుగ నెజ్జి గ్రుచ్చి మీ, రీవగ వైచి

దశా. ౧. ౨౭౦

చ జడలు మలంచి చొళ్లెముగ సన్నపుఁ గొ... నడుంగఁ జుట్టి చ, ల్లడములు పూని మీఁదఁ బిగిలంబుగఁ గట్టినమట్టి కాసెలన్, చిడి యము లంట దోఁపి ... మను చ ౪ ౩౦

౩. సురక్షితము

క. వెండలఁ గలిగించి జగములఁ, బిగిలంబుగ మనిచి వానిఁ బదపడి తనయం, దొనఁగించి మతియు నెమ్మెయి, సుదాగతి నదప్ర చిన్మయునిఁ గొలుతు మాటెన్.

భార శాం ౬ ౪౧౪

చ భవత్తనయున్ గృహంబునన్, బదిలము చేసి వచ్చి ... ఆము ౬ ౧౧౩

చ. అదితి మెఱుంగి కుండలము లానరకుండు హరించె వాని నేఁ, గదనములోనఁ ద్రుంచి యవి గైకొని దాఁచితి నాఁటనుండియుం, బదిలముగాఁగ ...

పారి. ౨. ౨౭ విప్ర ౫. ౧౬

౪. లోఁబడినది, అధీన మైనది

సీ. కళ్యాలఁ బదిలంబు గాని గుఱ్ఱంబులఁ ద్రొక్కిమట్టున కియ్యకొలుపు నెరవు ...

భార. విరా. ౧. ౯౫.

౫. జాగరూకము.

ఉ. ... గొ, ల్లని బిలికించి నీవు పదిలంబుగఁ గోడెలఁ బట్టుకొన్న ... నీలా. ౨. ౫౯.

జ: పదిలపడు, పదిలపఱుచు, పదిలించు, పదిలుఁడు

**పదిలించే = పదిలపఱుచే.** స. క్రి (√పదిలము.) ౧. స్థిరపఱుచు, కుదురుపఱుచు (దృఢపఱుచు శ ర)

క ఎన్ని మాటలు ధైర్యం, బొదవఁగఁ దను బోధించిన, హృదయము పదిలింపలేక యొదపని చింతన్

భా రా అర. ౨ ౨౪౦.

ఉ స్రత్రవితర్ద్రికాస్థలి విశంకి దృఢాసనుఁ డై ముకుందులో, కత్రయవంగితున్ హృదయ కంజమునం బదిలించి

జై భా ౩. ౨౨౧

ద్వి ఇగి యేల భూపుత్రి యింత శోకింప, హృదయంబుఁ బదిలింపు హితబుద్ధి వినుము

రం. రా ఉ. ౧౨౩ పే. ౫ పం

౨ నిలకొలుపు, స్థిరముగా నుంచు

క జననీ రఘుపతిఁ గొల్వం, బనిచినయొద నీవు దాల్మి పదిలించి మనం, బున దీనికి శోకింపకు, మనవుడు మూర్ఛిల్లి తెలిసి యాసగి సుతుతోన్. భా రా యు ౧౯౯

స్వా తినలోన వెఱఁ గంది దశరథాత్మజుఁడు, తాలిమి పదిలించి తగుమాట లాడు, జాలోన నినజాధుఁ దస్త్రాద్రి కరిగ ...

గం గా ఉ ౧౨౫ పే ౧౪ పం

**పదిలుఁడు.** విశే (√పదిలము - సం భద్రః)

౧. (యుద్ధాదులందు) స్థిరుఁడు, అచంచలుఁడు

శి ఇదె యేను గూడవచ్చితిఁ, బదిలుఁడ వై పోరు మింక బకమర్దన యీ, కదిసినవీరుల నెల్లం, గుదియించెద ననుచుఁ గవిసె గురు నికతిపయిన్. భార భీష్మ. ౨. ౩౬౧

క. పదిగద ల్ద్రుమపఁగ జార్చుచుఁ, బవిశాఖముల తోఁడు గలనఁ బదిలుం దగుచున్, బదిని

దులం గైగొని యు, ప్పుడి కేరలకేని కొడుకు
బదలంగ జేసె

అచ్చ. రా. యు ౫.౭.౭. క్రి శతం. ౧ ౪౦

క పదిరువ్వంబులు భక్తిం, బదిలం డై వినంగ
వలయు భారతము ...

హరి ఉ ౧౦. ౭౬౩.

౭. అక్షుబ్ధుఁడు, చిత్తక్షోభము నొందనివాఁడు.

క ఆచేప లిపుడు మీరలు, పైచినవలతెల్ల
మ్రింగి వైచెఁ జామీ రౌరా, రాచల్వ కోఁద
పదిలుఁడ, పై చెచ్చెర నవఁ గట్ట నంపుము
నలునిఁ .. అచ్చ. రా యు. ౨౪

మ. .. తా విషము సాహ్వానించుచో డాకు
చోఁ బదిలుం డై కడి సేయుచోఁ ~ఖ
చుచో భక్షించుచో మ్రింగుచో ..

భాగ ౧౦ ౭౪౪.

క. ఇది యేమిచంద మేఁటికి, మది యిట్టిది
యయ్యె ననుచు మతి రొయ్యన నేఁ, ౧
లుఁడ పై నలుదిక్కులు, వదలక పరికించు
నపుడు వల నొప్పంగన్

హరి. ఉ. ౬. ౬౭

౩. నిపుణుఁడు, జాగరూకుఁడు

క అది లెన్నగ విడిచి ప్రకృతి, కుదక నిభాళలన
మున ఝుషోపమ దనుకుం, బదిలుఁ డయి
చూడ నేర్చిన, విదితిం బగు దానితోడి
కేర్పా టనఘా

భార. శాం ౬. ౧౨౧.

క. విదితయశుఁ డైన పురుషుఁడు, పదిలుం డై
కూడి నడుపఁ బకయుక్త సోమం, బొదవంగ
రాయుట యేఁటికి, కెదిరిం దనయట్లు కాద
యే కార్యములన్.

హరి. ఉ. ౯ ౪౪. నిర్వ. ౪. ౧౭౭.

పదివేలు. స. బ. (పది + వేలు.) ౧. అయుతము,
దశ సహస్రము.

సీ. పటుజవస్ఫురణ మై పదివేల హయములు
పూనంగ నేతేరు పొలుపు మిగిలి ...

విక్ర. ౭. ౧౦.

౨. అసంఖ్యము.

గీ కీర్తి యిటు పెల్ల నంద్రు దాక్షిణ్య మలరు,
దారు గల్గినఁ బదివేలు దమకుఁ గలవు ...

హైమ. ౪. ౧౧.

గీ. సత్యు లనిలజుఁ బదివేల చందములను, బ్రస్తు
తింపఁగ శ్రీరామభద్రుఁ డలరి ...

ఉ. రా. ౫ ౧౪౩.

౩. మిక్కిలి గొప్ప లాభము.

వ నాకు మంగళసూత్రం బీపాటి కుభస్థితి
నుండుటయ పదివేలు . కళా ౪. ౪౩.

క మీ కరుణఁ జేసి వంధ్యత, లేక మదీయో
దరము ఫలించినఁ జాలుఁ, నా కంతియ
పదివేలు ని, రాకులమతి నైతి ననిరెు నని
చెప్పుటయున్ భోజరా ౭. ౭౧౯.

క ఘనులతపంబులు చెఱుపం, బనిచిన నిఁకఁ
జనఁగవలదు పదివే లైనన్ .

వాల్మీకి ౩. ౧౩౫.

ద్వి. ఇంపార సైరంధ్రి నిట నుండనీక, పంపుడ
మిఁకఁ జాలు పదివేలు వచ్చె ..

ద్వి. విరాటపర్వము. ౧. ౪. ౭.

(ఇట వ్యతిరేక లక్షణచే 'గొప్ప నష్టము' అని
అర్థము )

పదివేవురు. స. (√పది) పదివేలనను మహాన్మహ
త్వర్థక రూపము.

క. నీ వొకట వేల యిలఁ బది, వేవుర నే వలచి
పట్టి కెదకిన వర్గం, బై వచ్చి వలదు నా
నిం, దేవాఁడు మగండు దీని కెఱుఁగవ
కంటే. భార. విరా. ౭. ౭౫౬.

ఉ. వేయి విధంబులందుఁ బదివేవురు పెద్దలు.

విక్ర. ౧. ౧౭.

**పదుంద్రు** = పదుగుంద్రు, పదుగురు. స (√పది) పదికి మహాన్మహాత్త్వార్థక రూపము

క. పదలక పెనఁగి పదుంద్రం, బదిరేవురు నొక్క-పెట్ట . భార. ఆది ౫ ౧౬౫

వ. ... శ్రీ భీమేశ్వర మహాదేవరకుం దిరవిళం బనియ తిపన్నులు పదుఁడ్రిక నిరుపూట .. ద. శా. ౪ ౧౦౪౭

సీ. శివతేశ్వరునకు శివశైశ్వర్యల కాఁ బదుం ద్రను బరిణయము నేసె ... శు. సం. ౧ ౪౪ ఉ హరి. ౧ ౭౬.

**పదుగు.** వి ౧ వంశము.

సీ. సంతు కొలము వంగసము వంగడము పదు గన వంశసంజ్ఞ రైయలరుచుండు . . ఆం భా ౨ ౧౪౦

౨. = పదువు. (సజాతీయప్రాణి సముదాయము శ ర)

**పదుగుంద్రు** = పదుగురు. (√పది) - (శ ర)

**పదుగు(ద్గు)రు** = పదుంద్రు, పదుగుంద్రు, పదురు, పదువురు. స (పది) పదికి మహాన్మహాత్త్వార్థకి రూపము

గీ. పావురంబులఁ బట్టెడువారిఁ జేరి, యుద్ధవిడి ర మ్మనిన భృత్యు లాశవిఁ బట్టి, పదుగు రత్తఱి బడి బడిఁ బాఱుతెంచి సారంగ. ౧ ౧౫౫.

సీ. . అతవిపుత్రులు పద్గు రధికబలులు భాగ. ౭. ౧౭.

**పదునల్లుము.** వి. (పది+నాలుగు+తూము) పదునాల్గు తూములు. (శ. ర)

**పదునాలుగు(ల్గు)** = పద్నాల్గు. స. ౬ (పది+నాలుగు) పదియు నాలుగును, చతుర్దశార్థకము.

చ. ... గాథమతి న్నిగమాదు శైవవి, ద్యలు పదునాలుగింటికి నరం డొనరించెఁ జతుర్దశత్వముక్ శైవ. ౧. ౪౫

క పదునాలుగు లోకంబులు, సదరస్థములుగఁ జరించుచుండెడు లక్ష్మి, వ్యాదరేశుఁడు నిజు వేఁడఁగ, బ్రదికితి నీ బ్రదుకు బ్రదుకు బలిభూపాలా విక్ర. ౨. ౧౫౦.

ఉ. ఉండుదుఁ బోశభూమి నొకయూరఁ గళ ల్పదునాల్గు నేర్చి ... ఆము ౬. ౬౪.

క. పదునాల్గు మహాయుగములు, ముదు కగు భీమేశ్వరునకు మెఁగచాపై యుం, దదు సానిపెండ్లి యుప్పుడు, నది దక్షారామ మహిమ మగునో కాదో భీమ ౧ ౧౧౨

**పదునిద్దఱు** = పన్నిద్దఱు, పన్నిరుగురు. స. (పది+ఇద్దఱు)

సీ. రూఢి నేకాదశరుద్రులతోఁ బదునిద్దఱు సాధ్యు లద్వ్యక్తి నడుమ .. ఉ. రా. ౪. ౨౭౯.

**పదును.** వి (పది+ఊను) పది యంగుళముల వఱకు నేలయందు తడి చొచ్చునంతటి వర్ష ప్రమాణము. (శ. ర)

**పదునెనమండ్రు.** స. (పది+ఎనమండ్రు) పదు గురును ఎనమండ్రును, పదునెనిమిదికి మహాన్మహాత్త్వార్థక రూపము

క. తునియలు తొమ్మిది యటఁ పదు, నెనమండ్రటఁ బోచుబారు ... ఆము. ౧. ౩౫.

**పదునెనముందుము.** (పది+ఎనిమిది+తూము) స. పదునెనిమిది తూములు. (శ ర.)

**పదున(ద్ధ)నిమిది.** స. (పది + ఎనిమిది) పదియు నెనిమిది, అష్టాదశార్థకము.

గీ. పృథివిఁ బదునొకొండు రోఁగపీఠశక్తి, గణ
ములో నొంత సర్వశృంగార యగుచు, భీమ
నాథుని సన్నిధిఁ బ్రేమపెలయు, మాణిక్యా
దేవి సకల కల్యాణమూర్తి.
భీమ. ౧. ౧౦౭

సీ. బంధురబలుం జరాసంధుఁ బద్నెనిమిది
మాఱులు రణభూమిఁ బాఱఁ దోలి
చిత్రభా. ౬ ౬౪.

పదునేడ్దుము. వ (పది + ఏడు + తూము) పదు
నేడు తూములు. (శ ర)

పదునొకఁడు = పదునొకొండు, పదొకండ్రు,
పదొకొండు. స ఔ. (పది + ఒకఁడు) పది
యును ఒకటియు, ఏకాదశార్థకము, పదునొక
టికి సమాన్యవాత్యర్థక రూపము

క. విదితం బై యుద్యోగము, పొందలుగఁ బదు
నొకఁడు పర్వముల నంతయు నొ, ప్పిద
మై యేసవపర్వం, బిది నా నుద్యోగపర్వ
మిమ్మగుసభలన్ భార ఆది. ౧ ४३

క ... శ్రీ, పర్వంబు పదునొకం డగు,
పర్వము నా వెలయు .
భార ఆది. ౧ ౫౧

పదునొకొఁడు = పదునొకఁడు. స ఔ

చ ... వ్వా, కొనరిన సైన్యముస్ పదునొకొం
టికిఁ బ్రాభవ మాచరింపఁ దో, చ్చిన సక
లంబు నొప్ప నభిషేకము సైకొనఁ దుత్స
వంబుగన్ భార. ఉద్యో ४. ౧४౦

('పదనొకఁడు' అని అకార ఘటితముగ నీ
క్రింది ప్రయోగమునఁ గనఁబడుచున్నది.)

క. ఎనిమిది తొమ్మిది పదియుఁ బ, దనకొం
డ్రుం బ్రెండు గాఁగఁదగ నేర్పడుచుణ . .
ప్రబంధ. ౧౬౬.

(ప్రయోగాంతరము లేదు.)

పదునొకొల్తుము. (పది + ఒకొఁడు + తూము)
వి పదునొకొండు తూములు

గీ పొదలు నేకాదశాఢకి పదునొకొల్తు, మనఁగ
ఆం భా. ౨. ౨౪౧

పదునొక్కఁడు = పదునొకఁడు.

గీ. అస్తమించినయప్పుడీ యమృతకరుని, కళలు
పదునొక్కఁ డొక్క రుద్రులశిరంబు
సైవ ౭ ౧౭౭

పదుపు = పదువు. వి ౧ సజాతీయ ప్రాణి
సముదాయము

గీ శితగిరిమీఁద మదకరుల్ సీత్కరించు,
నెలుఁగు నవఘు నారవమని యొసఁగి యాడు,
నమ్మి పదుపులు గడు నొప్పు . .
శు సం 3. ౨౫౦

(పదవు ప్రాఁతప్రతి పా)

గీ అల్లనల్లన పతి నడయాడెనేని, గలికిపలుకుల
వాల్గంటి పలికెనేని, యంచ లంచల వచ్చు
రాయంచకదుపు, కూరనేతెంచుఁ గేరంపుఁ
గొదమపదుపు రాజ చ ౨. ౧४४.

చ. . మిండతు, మ్మెదపదుపు ల్మదోదయము
మిక్కిలి నేడుకయు స్మనంబులన్, బొద
లఁగఁ బ్రోత్తియామనికిఁ బొచ్చెములే కదు
లేఁగుచాడ్పునన్ . సైవ. ४. ౧४.

౨. పంక్తి, వరుస

సీ. ... బారు బంతి, పదుపు చాల్ చాలుపు
పొఁజు సోరిది చాలు సాఁగిను బంక్తికి
నామ మగును ఆం. భా. ౨. 3४.

(పదువు. ప్రాఁతప్రతి. పా.)

పదుముగ్గురు = పదుమువ్వురు. స ఔ.
(√పది) పదుగురును ముగ్గురును, పదుమూఁడు
నకు సమాన్యవాత్యర్థకరూపము.

**పదురు²** = పదుగురు. (√పది.) (పదిమంది.)

గీ. పదురు గొడుకులు పుట్టిరి భవ్యయశులు ... భా. 3. 38౬

క అక్కమలజా కర్ణంబులఁ, జక్కనికి వ్యకలు పదురు జనియించిరి ... వరాహ. 8. 3

౨. అగ్రేసరులు.

చ. ఎదురుగ వచ్చె హేమరథ మెక్కి కృతాంతుఁడు సౌమ్యమూర్తి యై, పదురు నిజాప్త కింకరులు పార్శ్వముగంబున భక్తి గొల్చి గా కాశీ 3. ౧౪౭

**పదురుచే** = పదురుమే. స క్రి (√పదురు¹) పదురఁజేయు (శ. ర.)

**పదువు** = పదువు. వి సజాతీయప్రాణిసముదాయము ; సముదాయము, గుంపు

క వెడగోతల కెత్తు రాలుకఁ, బడఁద్రోచిన వచ్చి కుక్కపదువు వెనుకనుక, జడిసెఁ గలభింప నొల్లక ... భార. శాం 3 ౫౦౭

చ చుట్టపుం, బదువును దక్కసంగలుగు పార్థివకోటిని బిల్వఁ బంచి ... హరి. ఉ. 3 ౧౫౭.

క నెచ్చెలులు దాను ధరణికి, వచ్చెలువ కృత ప్రయాణ యయ్యె నపుడు యా, యచ్చర పదువు వెడలంగ వి, యచ్చర పదవికి మెలుం గులై కనుపట్టెన్. కళా. ౨. ౧౫౫.

౨. అయంపపదువు పొగివినఁ, జేయార్వఁగ శేశ హరి. ఉ ౪ ౩౦

సీ. బలుసంజదంబు కెంబట్టు పల్లముగాఁగ కొందటిపక్కులు ముప్పపదువు గాఁగ ప్రబంధ ౫౦ యయా. ౪. ౧౧

**పదువురు** = పదుగురు. (√పది). (శ ర)

**పదేను.** స. (పది+ఏను) పదునేను, పదియు బదును.

ఉ పంచమవేద మై పరగు భారతసంహిత సంద్రభాషఁ గా, వించెఁ బదేనుపర్వములు ... భీమ. ౧ ౯.

**పద్దుఁడు.** సం. వి అ పుం కాలిబంటు.

**పద్దియ(ద్ది)ము** = పద్దెము. వి (సం. పద్యం ప్రా పద్దం) పద్యము, ఛందోబద్ధమగు పదసముదాయము

సీ చిలుకబోదల మచ్చికలుచేసి ముద్దులు చిలుకఁ బద్దియములు చెప్పరాదె . నీలా. ౨. ౯౧

ఉ. అచ్యుతుసంగు పద్దెమొకటైనను గబ్బము లోన నుండినన్ ... యయా. ౧ ౧౨.

**పద్దు¹.** వి. (సం. స్పర్ధా ప్రా పద్ధీ) ౧ పంతము, ప్రతిజ్ఞ

క ముద్దులకౌమరుని ప్రేతల, రద్దులకై కల్లితోల రజ్జులఁగట్టం, బద్దులకు మిన్నుముట్టిన, మద్దుల వడిఁగూల్చె జనసమాజము పొగడన్ . భాగ ౨ ౧౪౪

గా అరిదిన్ జయలక్ష్మిఁ గైకొని మహోల్లాదంబుతో నవ్విభుం, డారూఢిం దనపద్దు చెల్లె నిఁక రాజ్యం భాగధేయంబు, దేరం జల్లుచు నేలుఁగాక ... కృష్ణ ౪ 3

౨. తిరస్కారము.

ద్వి. పుట్టుగొడ్రాలిని పురవీధి నడుముఁ, బట్టి యీడ్చుచు రద్దుపద్దు చేయఁగను ద్వి క పా 3 ౧౦౬ పా ౧౬. పం.

3. లెక్క, గణన.

(క) అంకెలు అడ్డముగా వ్రాయుట (అంకెల కట్టెను అని శ ర)

క పద్దునుమీ యిదికూడని, పద్దునుమీ నాడుమాట పాలించితివా, ముద్దునుమీ యూసానిది, కొద్దునుమీ దానిమీఁద కోపాంబేలా, చంద్ర. వి. 3. ౪౨.

(పూచునిపద్దు = అరుణాగ్న్యకాలు.)
౪(తె.) ఎన్నిక, ప్రసిద్ధి.
చ తనకిదికోళ పద్మమయి కేద్దయుఁ బద్దు వహించి . హంస ౧. ౨
క జగతి బయకారిపద్దున, సెగడెడు మాకింత చింత నిజకాళంబుల్, దిగవిడిచిపోవు టుచితం, బగుసేయన యాంజకేయుఁ డాడిన వారస్
సమీర ౬ ౨౨౦ ఇందు ౧. ౪౧.

పద్దు². వి (క పద్దు, పద్దు = గృధ్రము) గ్రద్ద. (చూ పద్దువాడేగ)

పద్దువాడేగ. వి గృధ్రముఖము గలడేగ, శ్యేన విశేషము
సీ పద్దువాడేగలు పావురాయలు నెమ్మి పిం చెంపుఁ గుంచెలు పికిలిచెంబ్లు
రసిక. ౧ ౬౪

పద్ధతి. సం వి ఇ ఈ (స్త్రీ). ౧ మార్గము, త్రోవ ౨ వరుస, పంక్తి, శ్రేణి 3. విధము, రీతి
ద్వి వలినాప్తకుల నాధ నా తోడనీవు, పలికిన మాటల పద్ధతిదప్పి
ద్వి హరిశ్చ ౬ ౧౪౪౨

పద్ధిమము. సం వి అ న. పాదశీత స్పర్శము, కాళ్లు చల్లఁబడుట

పద్నాల్గు(లుగు) = పదినాల్గు, పదునాల్గు.
ప (√పది) పదియు నాలుగును
మ .. భవత్తుమారి పదికేల్ వర్షాలు జీవించు గాం, టక పద్నాల్గవ యేటఁ జెందుఁబతి గండంబంచు వాచించిరన్ ...
చంద్రా 3. ౧౪
మ ... రాఘవునిఁ బద్నాల్గేండ్లు కాంతార మం, దుమ వర్తిల్లఁగఁ బంపఁ ..
కొల్ల. రా. అరో. ౨౯. వాల్మీకి. ౧. ౨.

పద్నోకఁడు = పదునొకఁడు.
గీ మాసములు పద్నొకండి క్రమమున నడచి.
వరాహ. ౯, ౧౪.

పద్మ. సం వి. ఆ స్త్రీ ౧ లక్ష్మి. ౨ లవంగము ౯ 3 భంజిక, గంటుబారంగి ౯. ౪. మెట్టదామర ౯

పద్మకందము. సం వి అ పుం. తామర దుంప. ౯

పద్మకము. సం వి అ న ౧ ఏనుఁగునిబ్బెము, ఏనుఁగుమొగమున యౌవనకాలమునందు బయలు దేఱు మచ్చలు ౨ పద్మకాష్ఠము, ఔషధవిశేషము ౯ 3 చెంగల్వకోష్టు ౯ ౪ పద్మము, తామర ౯. ౫ పద్మవ్యూహము ౬ పద్మాసనము

పద్మకర. సం వి ఆ స్త్రీ లక్ష్మి. (ఇట్లే: పద్మహస్త మొ)

పద్మకర్కటి. సం వి ఈ స్త్రీ తామరగింజ (వై ని)

పద్మకర్ణిక. సం వి ఆ స్త్రీ ౧ తామరదుద్దు ౨. పద్మమువలె పన్నిన సేనావ్యూహముయొక్క నడిమిభాగము

పద్మకళిక. సం. వి ఆ. స్త్రీ తామరమొగ్గ.

పద్మకాష్ఠము. సం వి అ న. పద్మకమను ఓషధీవిశేషము ౯

పద్మకి. సం వి న్ పుం ౧. (పద్మకముఁ గలది) ఏనుఁగు ౨. భూర్జము, బూజపత్త్రి ౯.

పద్మకేస(శ)రము. సం వి. అ పుం. న. పద్మకింజల్కము, తామరయకరము.

పద్మకోశము. సం వి. అ. పుం. ౧. తామర మొగ్గ. ౨. అభినయ హస్తవిశేషము. .(అజుంకు

(శ్లోకను కొనలు కూడ కందునట్లు విల్లువలె వంచి రొమ్ము గిలవానిగాఁ బట్టునది)

**పద్మగంధి.** సం విణ (ఇ) తామరవంటి వాసన గలది వి. ఇ న పద్మకాష్ఠ మను ఓషధి శ

**పద్మగర్భుఁడు.** సం వి అ పుం ౧ పద్మము జన్మస్థానముగాఁ గలవాఁడు బ్రహ్మ, తమ్మిచూలి ౨. పద్మము గర్భమునఁ గలవాఁడు విష్ణువు, అంబుజోదరుఁడు

**పద్మగుణ.** సం = పద్మగృహ

**పద్మగృహ.** సం వి అ స్త్రీ ౧ లక్ష్మి ౨ లవంగము. శ

**పద్మచారిణి.** సం వి ఈ స్త్రీ కాశ్మీరదేశమునఁ బుట్టుమెట్టదామర శ

**పద్మజుఁడు.** సం వి అ పుం పద్మమునఁ బుట్టినవాఁడు. బ్రహ్మ

(ఇట్లే: పద్మజాతుఁడు, పద్మభవుఁడు, పద్మసంభవుఁడు. మొ)

**పద్మతంతువు.** సం వి ఉ పుం ౧ మృణాలము, తామరతూఁడు, ౨ తామరకాఁడలోని నార.

**పద్మతడుకులు.** వి వి అర్థగణవిశేషము

వ. ... శ్రీకాకొలని శ్రీ వల్లభరాయనికి సమర్పించిన సువస్తువులు ... సన్నంపూసపేటలు ౧. ఘంటలు ౩ తోసుపిన్నవి ౧. ఒత్తులు ౨ పద్మతడుకులు ౨. ముత్యాల తిరుణామం. ౧ దశా. ౪. శాస

**పద్మనాభుఁడు.** సం. వి. అ పుం. పద్మము నాభియందుఁ గలవాఁడు. తమ్మిబొడ్డువాఁడు, విష్ణువు

**పద్మనాయకులు.** సం వి అ. పుం బ. వెలమలను ఒక జాతివారు.

**పద్మనాళము.** సం. వి. అ. న. తామరకాఁడ.

**పద్మపత్త్రము.** సం. వి. అ. న. ౧. తామరాకు. ౨ తామరకోక. ౩. పుష్కరమూలము. శ.

**పద్మపుఁదీఁగె.** వి. (పద్మము + తీఁగె) చారపుష్పి, కట్లతీఁగ శ (శ ర.)

**పద్మపుష్పము.** సం వి. అ పుం. ౧. తామరపువ్వు. ౨ కర్ణికారము, కొండగోఁగు శ. ౩. పికాంగ మనెడు పక్షి.

**పద్మబంధువు.** సం. వి ఉ. పుం. ౧. సూర్యుఁడు. ౨. అర్కము, జిల్లేడు శ ౩. తుమ్మెద ౪. దినము, పగలు (వై. ని)

**పద్మబాంధవము.** సం వి. అ పుం. ౧. అర్కము, జిల్లేడు శ ౨. తుమ్మెద

**పద్మబాంధవుఁడు.** సం వి అ పుం పద్మబంధువు, సూర్యుఁడు

**పద్మబీజము.** సం వి అ. న పద్మాక్షము, తామరగింజ, తామరపూస.

**పద్మము.** సం విణ (అ ఆ అ) పసుపు నలుపు తెలుపు కలిసినరంగు గలది (శే ని) వి. అ న. ౧. తామరపువ్వు ౨ పుష్కరమూలము శ. ౩ ఏనుఁగునకు యౌవనకాలమున మొగము నందుఁ బుట్టు మచ్చలు ౪. పద్మాకారముగాఁ బన్నిన సేనావ్యూహము ౫ పదియర్బుదములు ౬. సీసము. ౭. (తంత్రి) శరీరమందలి నాడీచక్రము. ౮. పద్మకాష్ఠమనెడి ఓషధి శ. ౯. శరీరమందుఁ బుట్టు ఒకజాతిమచ్చ, పాద. ౧౦. ఒకరకము వస్త్రము.

గీ. హంసవళ్లును పద్మాలు హరిణమళ్లు, కొండలుగా వల్వాలు ధరించి ముదితలపుడు ..
ప్రబంధ. ౨౩.౨.

౧౧. ఇంద్రియము ౧౨. అష్టకాక్షరార్థము. (కే. వి) పుం ౧ కుబేరుని నవనిధులలో నొకటి. ౨ రతిబంధవిశేషము.

శ్లో॥ హస్తాభ్యాం చ సమాలింగ్య నారీ పద్మాసనోపరి, రమేద్గాఢం సమాకృష్య బంధో అయం పద్మసంజ్ఞకః (వాచ)

౩. తామరపూవు. ౪ పసుపు నలుపు తెలుపు కలిసినరంగు

**పద్మముఖి.** సం వి ఆ స్త్రీ = పద్మముఖి.

**పద్మముఖి.** సం. వి ఈ స్త్రీ ౧ తామరవంటి ముఖము గలస్త్రీ; స్త్రీ ౨. దూర్వాలత ||.

**పద్మయోని.** సం వి. ఇ పుం. (పద్మము జన్మస్థానముగాఁ గలవాఁడు) బ్రహ్మ, తిమ్మిచూలి

**పద్మరవి.** సం వి ఇ పుం ఉంగరములలో భేదము.

ద్వి రాజితం బగు పద్మరవియుంగరములు, తేజంబు పిడికిట దీటుకొనంగ

నవ ౫ ౨౩౨ పా ౯ సం

**పద్మరాగము** సం వి అ పుం న మాణిక్యవిశేషము, తామరకెంపు (ఇది సింహళమునఁ బుట్టునదిఁ గ్రక్తవర్ణము కలగి ఉత్తమజాతి రత్నము

**పద్మరేఖ.** సం వి ఆ స్త్రీ చేతియందలి పద్మాకార మగురేఖ

(ఇది ధనలాభసూచకము)

**పద్మలాంఛన.** సం వి ఆ స్త్రీ ౧ లక్ష్మి ౨ సరస్వతి

**పద్మలాంఛనుఁడు.** సం. వి అ పుం ౧ బ్రహ్మ. ౨. కుబేరుఁడు ౩ సూర్యుఁడు. ౪. రాజు.

**పద్మవర్ణకము.** సం వి అ పుం పుష్కరమూలము.

**పద్మవాస.** సం. వి ఆ. స్త్రీ లక్ష్మి.

**పద్మవృక్షము.** సం. వి. అ పుం. పద్మకాష్ఠము, పద్మక మగు ఓషధి ||

**పద్మవెలములు.** ఎ వి పద్మనాయకులు (శ ˙)

**పద్మషండము.** సం. వి అ పుం న పద్మసమూహము, తామరతంపర

**పద్మాకరము.** సం వి అ. పుం. పద్మములకు స్థానము

౧. తామరకొలను ౨ కొలను, జలాశయము; తటాకము, చెఱువు ౩. తామరతంపర, పద్మసమూహము.

శ్లో॥ "పద్మాకరం దినకరో వికచీకరోతి"

సం. భర్తృ నీతి. ౭౩.

(ఆకరః = సమూహము అని వ్యాఖ్య)

**పద్మాక్షము.** సం వి అ న, పద్మబీజము, తామరపూస, తామరగింజ

**పద్మాక్షుఁడు.** సం విణ (అ ఈ అ.) తామరవంటి కన్నులు గలవాఁడు

(వి అ పుం విష్ణువు)

**పద్మోటము.** సం వి అ పుం. చక్రమర్దము, తగిరిస ||

**పద్మాలయ.** సం వి. ఆ స్త్రీ. ౧. లక్ష్మి, తమ్మి యింటిగరిత ౨ లవంగము ||.

**పద్మాలయుఁడు.** సం వి. అ. పుం. పద్మము నివాసముగాఁ గలవాఁడు బ్రహ్మ.

**పద్మావతి.** సం. వి ఈ. స్త్రీ. ౧. పద్మచారిణి, కాశ్మీరదేశపు పెట్టదామర. ||. ౨. మనసాదేవి. ౩. ఒకానొకనది.

**పద్మాసనము.** సం వి. అ న ౧. పద్మమనెడు ఆసనము, తమ్మిగద్దియ. ౨. (పద్మమువంటి ఆస

నము) ఆసనభేదము కుడికాలిని ఎడమతొడ మొదటను ఎడమకాలిని కుడితొడ మొదటను వైచి కూర్చుండుట ) 3 దేవనిమిత్తము పద్మాకారముగా చేయించిన పీఠము.

పద్మాసనుఁడు. సం వి. అ. పుం ౧ బ్రహ్మ ౨ సూర్యుఁడు.

పద్మాహ్వా. సం వి. ఆ స్త్రీ పద్మచారిణీలత, కాశ్మీరదేశపు మెట్టదామర శ్రీ

పద్మాహ్వము. సం వి అ న లవంగము శ్రీ

పద్మి సం విణ (న్ నీ న్ ) ౧ పద్మములు గలది, తామరలు గలది. ౨ మొగముమీఁద బొట్లు గలది (ఏనుఁగు) వి న్ పుం ౧ ఏనుఁగు ౨ విష్ణువు

పద్మిని. సం వి ఈ స్త్రీ. ౧ తామరతీఁగ శ్రీ ౨ పద్మాకరము, తామరకొలను 3 పద్మ సమూహము, తామరతంపర ౪ తామర తూఁడు ౫ తామరపూవు. ౬. స్త్రీజాతివిశేషము

(స్త్రీజాతులు నాలుగు : పద్మిని, శంఖిని, హస్తిని, చిత్రిణి పద్మినీజాతి స్త్రీలక్షణము

శ్లో. భవతి కమలనేత్రా నాసికాక్షుద్రరంధ్రా, అవిరళకుచయుగ్మా చారుకేశీ కృశాంగీ, మృదువచనసుశీలా గీతవాద్యానురక్తా, సకలతనుసువేశా పద్మినీ పద్మగంధా (రతిమంజరి )

౭ ఆఁడుఏనుఁగు. ౮ లక్ష్మి.

పద్మినీకంటకము. సం. వి. అ పుం. (వైద్య) కుష్ఠభేదము

పద్మినీకాంతుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

(ఇట్లే: పద్మినీశుఁడు, పద్మినీ వల్లభుఁడు. మొ)

పద్మేశయుఁడు. సం వి. అ. పుం. (పద్మమునఁ బరుండువాఁడు) విష్ణువు

పద్మోత్తరము. సం. వి. అ. పుం (రంగులో పద్మముకంటె నుత్కృష్టమైనది) కుసుంభము, కుసుమ శ్రీ.

పద్మోద్భవ సం వి ఆ స్త్రీ మనసాదేవి

పద్మోద్భవుఁడు. సం వి. అ పుం బ్రహ్మ

పద్యా. సం వి ఆ స్త్రీ ౧ పథము, త్రోవ ౨ (పాదములను హింసించునది) శర్కర, మోఁపటాయి 3 స్తుతి

పద్యము. సం. విణ (అ. ఆ. అ.) ౧ పదమునకు హితమైనది. ౨ పదమునఁ బుట్టినది

(వి అ న.) ౧ గణపాదబద్ధ మగు కవికృతి, పద్దెము ; శ్లోకము. ౨. మిక్కిలి రొండని అడుసు.

పద్యుఁడు. సం వి అ పుం. (విష్ణువుయొక్క పాదమునఁ బుట్టినవాఁడు) శూద్రుఁడు.

పద్రథుఁడు. సం వి అ పుం (పదములే రథముగాఁ గలవాఁడు )

౧ పాదచారి ౨ పదాతి.

పద్రము. సం విణ (అ ఆ అ) శూన్యము, వట్టిగ (కే ని )

(వి. అ పుం ) గ్రామము

పద్రుచే = పదురుచే. (ఇందలి ' అ ' కారము లఘువు.) స క్రి. (√పదురు¹) అదరించు, అతిశయింపఁజేయు

చ. ఎద్రిచిన కాలపాశమున నీగతి నీమదిఁ గ్రోధవల్లికం, బద్రిచినవారు మన్నిశితబాణపరంపర పై మిణుంగురుల్, విద్రుపఁగఁ

దళ్ఫలంబులచదిం జరితార్థులఁగా శరీరఘం,
జిద్రుపలు చేరఁ దళ్సరులచేతులఁ గాళ
కులంబు వాకులన్

ఉ హరి. ౪ ౧౦౯

**పద్యము.** సం వి. న్ పుం. మార్గము, పథము (అ. పుం) ౧ భూలోకము. ౨. రథము

**పన.** వి కోసి చేలలో వేసిన ఓదలప్రోగు.

గీ. ... ఓద యఁగ దీర్ణయావపాళి, కాదులు
చెలంగఁ బన యన పలరుచుండుఁ, దాదృశ
వ్రీహి సస్యాఖ్య ధనదమిత్రి

ఆం భా ౨ ౨౩౪

**పనఁటి** = పంటి, ఎరఁటి వి ౧ ఘటము, కుండ

చ ... ఎసరు పెట్టిన పెద్ద పనంటివోల

ఆము ౧. ౯

చ పనఁటులవారి మూఁతి యిడి పాలను
నేతులఁ బుక్కిలించి రొంపు దు నుమియు

హరి ఫూ ౫. ౨౦౨ (చి. ని పా)

గీ. పగడ మిగురాకు నిల చట్టు పనఁటులు కరి,
కుంభములు ...

వసు. ౨. ౩౩

౨ అతిజవగ్రాహ్య జలానయనార్హ భాండము,
చప్పున నీళ్లు ముంచి తెచ్చుకొనఁ దగినకుండ,
కడవ

సీ . . అతిజవగ్రాహ్య జలానయనార్హ భాం
డంబు పంటి

గీ. పనఁటి యనఁ దగు .

ఆం భా. ౨ ౨౪౬.

(గాజుపనఁటి = గాజుకుండ.)

రగడ. గమ్మ రని పన్నీరు తోలఁకెడుఁ గంటికె
యిడి గాజు పనఁటులు, చిమ్మి రేఁగెడు
కప్పురపురవఁ బెండు నీరోఁడా కుటనఁటులు.

కుక. ౧. ౧౩౩.

(నలువగ్రుడ్డు పనఁటి = బ్రహ్మాండ భాండము)

గీ నలువగ్రుడ్డు పనఁటులు వగులఁగ సార్చ

అచ్చ. రా. యు ౩౫౧

(ఇట్లే :) పసిఁడి పెన్బొజ్జగా గ్రుడ్డు పనఁటి
యౌ

గీ. కినిసి తిట్టినఁ బతియ రై చనక యున్న,
పసిఁడి పెన్బొజ్జ రాగ్రుడ్డు పనఁటిగములు

అచ్చ. రా బాల ౧౦౯.

గీ తెక్కలిదగారి గాయుంచ జక్కిణోదు,
గ్రుడ్డుబనఁటులు నిండారు గొప్ప బొజ్జఁ,
బూను పెనుదంట

నీలా ౧ ౪౪

జ : పనఁటిచూలి

**పనఁటిచూలి.** వి (పనఁటి + చూలి) ౧ కుంభ సంభవుఁడు, అగస్త్యుఁడు

సీ మున్నీటి పెన్నీటిచెన్ను బన్నమున కేలి
కాలి కరకేలి పనఁటిచూలి .

చం రా ౧ ౪౧

౨ ద్రోణుఁడు

**పనఁత** = పణఁత.

ద్వి పనఁ తంత యాజాల బలగంబుపాలు, వెనుక
చట్టంబు చతుర్వేదుల పాలు

బస. పు ౪ ౩౫ సం

**పన(ను)వు.** స క్రి ౧. తలఁచు, స్మరించు, కోరు, వాంఛించు

(ఈ పదము అన్మధ్య మని శ. ర ఉన్మధ్య మనిచి ని నిర్ధారితములు కానరావు)

ఆ అవరి పెలుచ కేడ్చి వాఁడిఁ బోయిన,
ప్రజలఁ జేరు గ్రుచ్చి పనవి పనవి

భార. మా. ౧౦౪.

శ్లో రుదతో దాథ స్మరన్ కారిం విలలాప మువి
హ్వలః, భ్రాతౄన్ పుత్రాంశ్చ పౌత్రాంశ్చ
దౌహిత్రాన్ సఖీనపి ...

సం. భార. మా. ౪. ౪.

పనసవాండ్రు. వి. కమసాలివారిని యాచించి బ్రతుకువారు. (శ. ర. బ్రా)
(వారి కిచ్చుకూలి పనసవర్తన యందురు బ్రా)

పనసిక. సం వి అ స్త్రీ పనసా రోగము

పనాయితము. సం విణ (అ ఆ అ.) ప్రణుతము, పొగడఁబడిన.

పని. వి ౧ వ్యాపారము, చేష్ట

క. అని నిశ్చయించి యపుడ, మ్మని యాసలు వీడి చిత్తమును బలవంతం, బున నిల్పి యింద్రియంబులు, ననల నణఁచి చిరసమాధి పదమున నుండెన్

వా రా ౪ ౨౪౧

౨. కార్యము, కృత్యము

క. . నరుఁడు విలు గొని, యరిగెను ముచ్చుల పిఱుంద నవ్విప్రు పనికి ...

భార ఆది ౮ ౧౧౯

క . నాపనిచినపని, బ్రాకటముగఁ జేయు మహితభంజన శక్తిన్ . .

భార అర ౪. ౫౪

క మనరాజు విదూమకుఁ గొని మనమేఖల కొనసపుచ్చె మన మిత్రు డాబాఁ, పనిమాలు నేఁత యిది యొక, పనియే చెప్పెట్ట వలదు పార్థివ తిలకున్

కేయూర ౧ ౧౬౫

3. శిల్పము.

(ప్రయాణ సన్నాహము )

సీ. కలివాడఁ బనిక్రొత్త మలకడా ల్గాని మూస యిడి తంగెడాకు గట్టెడు తమాతమా

ఆము ౬ ౭౧

చ. విగనిగలాడు కుందనపు విద్దపుఁగోడల నాఁడె మైనము, త్రిగగతనంపు జిల్గుఁబని తిన్న యలుక ...

నీలా, ౧. 30.

చ. మినుకుఁ గడాని కాయొతు సమేళపుఁ గ్రొవ్విరి దిండుదండదా, ల్పనివరి వాటు చల్వవలి పంపురుమాలుపు గట్టి .

కువల. ౨. ౫౪.

౪ కారణము.

క కనుచాటు తిండి నడపిన, పనులకు ...

శుక. ౨. ౨౦౮.

చ . నిర్నిమిత్తి మీ, క్రమమున శేఁతనవ్వు చిఱుకం బని యయ్యాది యేవధూటిపైఁ, దమిఁ గనువేసితో .. వి పు. ౪. 3౮

క నాకల యొవ్వఁడు నిక్కుల, గాకుండఁగ నీటు పరాకుగాఁ బని గలదే

వి పు 3 ౪౫

౫ ప్రయోజనము

క సంబంధులఁ బని లే దీక, తలపెట్టక పోరు వారదగ్రత చేసుం, జలము మెఱయఁ బాంచాలురఁ, బాలియింపక కర్తకంబ పుచ్చ నరేంద్రా.

భార ద్రో ౫ 3౮

క. మునులాగ నన్ను విధియే, మని మును పుట్టించె నట్టు లయ్యేడుఁ గాక, విన చవిగాని పలుకు లకుఁ, బని గలదె యుడుగుఁ డింక బహుభాషణముల్ భార ఉద్యో. 3 3౭౫

౬ అవసరము, అక్కఱ

క పాలఁతి యోగం, బున నింతచోఁ, యిమ్మెయిఁ, బనుపడియెం జెపుమ దాఁగఁ బని లే దింకన్ . భార శాం ౬ ౧౮౮

గ్వ వినుము కౌశిక యింత విపరీతతపము, పని లేదు చాలింపు బ్రహ్మర్షివైతి

రం. రా. బాల. ౬౪. పా. ౭ పం

క ఓకౌరి నీవుచేసిన, గోరపుఁబాపములు నీవుఁ గొడుకులు నాలిం, జేరఁబడి పంచుకొం దురొ, వారికిఁ బనిలేక నీక వచ్చునొ చెపుమా

వాల్మీ. ౨ ౧౦౦.

౭. బ్రదుకు, జీవితము.

చ. ... పోయి వచ్చి నీ, పని మఱి చక్కఁ
జేసెద నెపంబు సహింపుము వేగ పోఁటికిన్
భా. రా. సుం. ౭౩.

క అతనిపనిఁ దీర్ప రాజ్య, ద్వితయము నిమఁ
జేరు ... అము. ౩ ౩౫

శా గంగానందను గూర్చి ద్రోణుపని సక్కం
జేసి కౌరవ్యులీ, రాంగమ్మున్ సమమాడి
భార భీష్మ. ౨. ౧౫౩

౮ అవకాశము, వీలు

ఉ దేహమనిత్యమాటసం, పన్న తనిత్య
మంచుఁ దలఁపం బనిలేదు దశా. ౨. ౧౩౩

౯ సంబంధము

వ. . . ఎవ్వరితో నేమియు నెవ్విధంబునుం
జెప్పిన నీకుఁ బాకునుం బనిలేదని
శుక ౩ ౨౬౧

౧౦ నియోగము, ఆజ్ఞ

గీ ... విప్ర, వరుల కతిథి జనులకు సవారత
ముగఁ, దంద్రిపని విష్టమృష్టాన్న దానమొన
రఁజేయుచు ... భార ఆది ౫ ౧౪

క. మున్నుగల గోపవర్గము, నిన్నుంగని కొలిచి
భక్తి నీ పని సేయన్, మన్ననమానిసివై నీ
వున్నంగడు పేలకాళ రొప్పమిగలదే
భార విరా ౧. ౨౭౭

౧౧ సేవ, కొలువు

ఉ పాయక తొమ్మునందెపుడుఁ బాములమో
వను వారికింబనుల్, సేయను నేమి కార
ణము .. భార ఆది ౨. ౪౭.

సీ అపరంజి మెఱుఁగు నిద్దపుఁగీలు బొమ్మలు పరి
చారికలరీతిఁ బనులు సేయ .
కవిరా ౫. ౧౯౦

క. ... నీగుణగణముల్, వినినయవి చెవులు
నీకుం, బనిచేసినయవియె పాణిపద్మము
లనఘా. ద్వా ౭ ౧౦౯

౧౨ ప్రసాధనము, అలంకరణము

సీ అనులోమమునరెస్స పనిఁ జేసికొంటిష్టు భగవ
దారాధన ప్రాప్తినిధిని సైష. ౬ ౧౧౦

౧౩ చంద్రుకళలు

సీ తెలిచుక్కటరచందురులఁ గోఁచుఁజిగి కొప్ప
గొనబువాఁ జిరుచెంపపని దనర్చ
చంద్రా ౨ ౧౧

సీ గీఱునామము చిన్నికోమీసలు చెంపపని
మట్టు పికబొండు పట్టుమాలు, వెనుకకట్టురు
మాలు ... శుక ౨. ౨౪౧

౧౪ క్షారము

సీ అనులోమమున రెస్సపనిఁ జేసికొంటిష్ట
భగవదారాధన ప్రాప్తనిధిని
(శ్లేష) సైష ౬ ౧౧౦

క నక్షత్రవారదినముల, లక్షణ మారయక నీఁ
దలంకారకళా, పేక్షక నాపితుఁ దచ్చిన,
నాక్షణ మాపనులు సేయు మను నసఘాత్మ
సానందో ౨ ౩౨ పా

౧౫ విజృంభణము

ఉ. ఉ, దృట మై యీ నెడు బాణసంతి
తులచందంబుం ద౦ం జూడు మం, తటిలో
నీపని సక్కనయ్యెదు నపేతప్రాణుఁ గా
వింతు హరి ఉ ౬ ౧౪౩

పనిలేదు = ౧. తగదు, కూడదు

శా మాగధు నెదన్ సామంబు దానంబు
సం, ఫేదింపం బనిలేదు ...
భాగ ౧౦ పూ ౧౦౫౩

మ చదుచోఁ గొండలఁ గానలన్ వెదకుచున్ ...
వేసరన్, బనిలే దంచుఁ \ పుల్
రామా. ౬. ౬౩.

౨. వలదు, అక్కఱలేదు.

ఉ పట్టపుదేవి పై గఱువబాగున సుందర
పాఱువారితో, గట్టిననంబులో నవయఁగాఁ
బనిలే దిటఁ దల్లి పోఁగదే
భాగ. ౯. ౬౨౨.

సీ. రాజ్యంబు పనిలేదు రాజధనంబుపై నాస
యుం జొరదు ... పారి ఫ్రూ ౯ ౧౪౯

ప్ర: పని చేయనివాఁ డింటిదొంగ, ప న్నీయని
వాఁడు గివాణముదొంగి పని తక్కువ
ప్రాతలాట రొక్కువ ఎనిలేని మంగలి
పిల్లితల గొఱిగి నట్లు

పనికివచ్చు = ఉపయోగించు

గీ. గాలములు వైచువా రది కా దటంచుఁ
జెనువలలు వేయువా రవి పనికిరా వ
టంచు   దశా ౧ ౨౭౯

పనిసేయు = నివేదించు

ఉ. లోకనుతుండు పాండుఁడు సాటి భక్తిఁ
బనిసేయుచు సర్వజగజ్జిగీషుఁడై
భార ఆది ౬ ౧౨౪

శ్లో. క్ష్మేశోఽయమితి రాజ్యే చ స్థాపితో విశ
లోఽపి సన్, నిర్జిత్య పరరాష్ట్రాణి పాండు
ర్ధృతరాష్ట్రం న్యవేదయత్
సం భార ఆది ౧౩౯. ౬

జ: పనిగొను, పనిగొలుపు, పనిచెఱుపులదొంగ,
పనిచెఱుపువాఁడు, పనిపంచు, పనిబడి
గూడారు, పనిముట్టు, పనిలేనిపని, పనివంజ,
పనివడు, పనివాఁడు, పనివిను, పనులు
గొను

పనిగొను = పనులుగొను అ క్రి (పని +
కొను) ౧ యత్నించు, పూను.

చ. . వీరలఁ దోడ్కొని వత్తు నంచు నేఁ,
బనిగొని వచ్చి రా మనిన బందువు లెల్లను
గెలిచేయఁగాఁ, జను టుచితంబె ..
చెన్న. ౩. ౧౭౫

చ. పనిగొని కాలమాంత్రికుఁడు పాంథవిదారణ
రాత్రి శక్తికిన్, బ్రువస్పృశయింపఁగా ...
చెన్న. ౨. ౨౫౭

౨ అతిశయించు, విజృంభించు.

ద్వి. మునిని మారిక చూడఁ జూడ నెల్లెడలఁ,
బనిగొని బహు మహోత్పాతంబు లొదవె.
ద్వి. హరిశ్చ పూ ౧౧౭౫.

(మన్మథుఁడు.)

కు. తనతేజము తనబలమును, దనగర్వము తన
మదంబు దన సంపదయున్, ఘనతరముగ
నచ్చెరువుగఁ, బనిగొనఁ బరపెనుమీఁదఁ
బైనం బయ్యెన్   పీఠ. ౨. ౯౨.

౩ సేవచేయు

రగడ తోరాగ్రిష్ఠలిఁ దుంగ శయానస్వామికి
నిత్యోత్సవములఁ బనిగొని
హంస ౪ ౨౧౩

స క్రి ౧ ఆజ్ఞాపించు, నియోగించు

కి. పనిగొనుము నన్నుఁ గైకొని, యనుతప్పులుకు
లకు మానవాధీశుఁడు సం, జనితబహు
మానుఁడై యి, ట్లనియెం బుష్పకవిమాన
మానందింపన్   నిర్వ ౧ ౯

గీ. కొడుకు తండ్రి నాజ్ఞాపించుఁ గోడ లత్త,
నాదరింపక పనిగొను
హరి ఉ. ౯ ౪౧

౨ ఏర్పఱుచు, ఏర్పఱుచుకొను

చ. అనవరతంబు నెచ్చెలి దిగంబరుఁడై చిక
రంబు లెత్తిఁ దా, ధనదుఁడు నంచు నెక్కు
డౌకట్టువ రైనను లేక మానిసిన్, బని
గొనెఁ గల్మికల్మి కిది మార్గము కాదని
ఘటికా ౨ ౨౦౪

క. అది మొదలుగ సంజీవకు, వదలక మృగ
నాథుఁ డధిక వాత్సల్యం బిం, పొదవఁగఁ
దనయొద్ద సచివ, పదవిఁ దగుబిభవ మిచ్చి
పనిగొనునంతన్.
నా పంచ. ౧. ౧౫౭.

3. సేవింపఁ జేసికొను, కొలువఁజేసికొను; సేవ
నేర్పఱుచుకొను.

గీ. ఒడలు సిరియును నాకు నీ రొసఁగినవియు,
గానఁ దగ నమర్పించెదఁ గరుణ నీవు,
సమ్మతించి యిమ్మర్త్య దేశంబుఁ గావు,
పంచి పనిగొని నన్ను రక్షించి కొనుము
భార. విరా. ౩. ౨౨౩.

క. ముసురు వరించిన భ్రష్టుఁడు, దనకవయుని యుష్ట్ర
యున్నతని దానునిగా, జనపతి ఒలిపిం
గైకొని, పనిగొనఁదగు వాని ప్రాణపర్యం
తంబుగ. విజ్ఞా ప్రా ౩౩

సీ. ప్రాయంపుఁ బడుచులఁ బనిగొంటివే దూది
యాసెడు పాటలఁ దేసెచినను
వస శుక ౨. ౪౨౧

క. చనుదెంచి కాంచి నాకే, ర్పిన తెఱఁగున
విన్నపంబు సేసితి నన్నుం, బనిగొనఁ దలఁ
చిన కేలెడి, దనుమానము గలిగాసేని యతి
గద వధిపా భార. విరా. ౧. ౨౮౦

మ. . . సే సెమ్మెయిన్, బనిగొందున్ దగ
నింతులెం దగిలి నీపైఁ జూడ్కి సోక్కొల్పి
సె, మ్మనముల్ విస్మయ మందఁ జూచెదరు
భామా పల్కు లిం కేఁటికిన్
భార. విరా. ౧. ౩౨౧

గీ. వదలి సాంజలి రైయి వనూర్వీ కళత్రి, నన్నుఁ
బనిగొమ్ము నావుడు నిన్నుఁ బనిగొ, నంగ
నేఁటికి నాకు నీసాము పేమి, యేకతానను
వచ్చితిరా కిరాత వరాహ. ౨. ౪౬

౪. వశపఱచుకొను, స్వాధీనము చేసికొను.

చ. నినుఁ గొలువంగ నిర్జరులు నీ కరిఁ బెట్టుదు
గన్యరాజులం, బనిగొను టెంత ..
భాగ. ౧౦ పూ. ౧౩౯౫

చ. ... కామధేనువుం, బనిగొనివట్లు కట్టుదు
నపారము లైనయర్థిప్సితార్థముల్ ...
కాశీ. ౪. ౧౨౨.

సీ. తెలిసి ముద్రాసనంబుల మేనిఁ బనిగొని
పాపపూరుషుఁ బటాపంచ చేసి . .
పాండు. ౨. ౯.

౫. సేవించు.

ఆ. మనసు నింద్రియములఁ బనిగొని పురు
షుండు, ప్రచురశిక్ష లేని రథ్యసమితి, వడ
పురథికుమాడ్కి నడపడి నలి యాడ్చి, గట్టు
లైన నశుభ మావహిల్లు
భార. శాం. ౫. ౧౫౩.

౬. నడపు, ప్రవర్తిల్లఁజేయు.

మ. అని దేవర్షి బహుప్రకారమధుర వ్యాహార
సందర్భముం, బనిగొం చుండఁగ . .
పార. ౪. ౬౬.

౭. పూనుకొను (చూ. పనిగొల్పు)

పనిచేయు = ఉపయోగించు, కార్యకారి
యగు

క. అశ్వేళ దివ్యబాణము, లెవ్వియుఁ బనిసేయ
కున్న నెదవడి మదిలోఁ, గవ్వడి దూలఁగఁ
గని యెలు, నవ్వుచుఁ జిత్రాంగదాకనయుఁ
డిట్లనియెన్ జై. భా ౭. ౪౨.

పనిముచ్చు = పనిచేయుటలో దొంగ.

క. ఇది యేమి సెట్టి యొఱఁగఁడె, కదపెంచిన
చనువుబలిమిఁ గదఁబనిము చ్చై, యెుఱ
పాకుచున్న వాఁడని, మది నెంచుచు .
శుక ౨. ౨౦౯.

పనిఁకిమాలు = ప్రయోజనశూన్యమగు.

క. కైదువచేతం, గొని యుండియు ననురాధము,
పనిమాలినరజ్జు లాడఁ జొరదవమగుకే.
కవిక. ౨. ౨౧౫.

క. మదనారియు సాక్షి యింకం, బదిబేలును
సేల పనికిమాలిన మాటల్ ..
సారంగ. ౨. ౨౪౫.

పనిపాటలు = సేవ, శుశ్రూష.

ఉ. ఆద విధాతకుం జనువులమ్మ సదా పనిపాట సేయఁగే, దోడుగఁ కెంచెక ల్పులుకొత్తొడుగ రాజకుకీదంబములో, గూడి చరింపఁగా .
కాశీ. ౨ ౪౧.

మ నవ్యారీదజ్ర్ణేణిచేఁ, బనిపాటల్ గొనఁజాలుకో మఱికుదో ప్రఖ్యాతకాయ క్రియల్ వసు ౪. ౪౨.

పనిదీఱు = తీరికయగు

క తనయులకును మనుమలకును, దనసేరుపు నూరిపోసి తాల్చిన గర్గం, బున భరము వారిఁ బూనిచి, పని దీఱి విధాత యీ పథం గొలుపుందుక్ కకు. 3. ౧౨

పనిగొలుపు(ల్పు). క్రి (√పనిగొను) పూనుకొనఁజేయు.

క. తాత్రున వింకం గ 'ంకక, యీాపెదగుంగొమ్మ పొకము నిపు దద లాదకజ, దావిమల చక్కరాయని, తాత్రున కసుపుఁ దని బంట్లఁ దగఁ బనిగొలిపెజ
అచ్చ రా సుం ౧౬౯

వ. . ప్రోఢ లగుపైదువరాంద్రం బనిగొల్పిన వారు నర్యాద .. నీలా 3 ౧౪

పనిచెలువులదొర. వి (పని + చెలువులు + దొర) విఘ్నేశ్వరుఁడు.

సీ. ఇద్దరు తల్లులముద్దుబిడ్డడు పనిచెలువులదొర చేటచెవులవేల్పు ఆం సం దేవ ౧౨

పనిచెలువువాఁడు. వి (పని + చెలువువాఁడు) విఘ్నేశ్వరుఁడు.

గీ. భోజదేవర రేణుఁగుపెుంగముసామి, పని చెలువువాఁడు వెనకయ్య యన విసాయ, కుఁడు వేల్పోప్పవను ఆం. భా ౧ ౪3

గీ. జమలితల్లులబిడ్డ పెద్దపొయ్యప్రోద, చేట చెవులవేల్ పని చెలువువాఁడు, ... అనఁ దగు గణపతి వేల్పు ... పాం. ని. దేవ. ౨.

పనితము. హా విణ. (అ. ఆ. అ) ప్రణుతము, పొగడఁబడినది

పనిప(వ)ంపే = పనిగొను. స. క్రి (పని + పంచు) నియోగించు, ఆజ్ఞాపించు

గీ వివిధవర్ణరత్నప్రభావితతి మెఱయుఁ, దమ్ముఁ బనిపంచు మనిస మాధవుఁగు భూధ, రములఁ గృపఁ జూచి ... ఉ హూ ౨ ౪౪

గీ తెలుప చిడిముడిపాటు మదేష్ణ రయిఁతేగి, వేన్కఁ బనిపంచు గుడిగి గాని మ నాకొక్క భార విగా ౨ ౨౯౫.

పనిబడిగుడారు. వి (√పని) గొల్లెన, ఒకవిధ మైన గుడారము.

సీ. పనిబడి గుడారు పరగుగొల్లెనయన ...
ఆం భా ౨. ౧౫౯

పనిముట్టు. వి. (పని + ముట్టు) కొలముట్టు, ఉప కరణము (క. ర)

పనిలేనిపని. క్రి. విణ. ద్రు (√పని) అనవసర ముగా, నిష్ప్రయోజనముగా.

క. పనిలేనిపని ముఖాంబుజ, మునకుం జెన్నగ్గ లింప మునిమునిఁ నగినన్, వనరుహాగేహిని విభునిం, గనుగొని యిట్లనిరి నర్మగర్భము గాఁగన్ విప్ర ౪. 3౬.

సీ పనిలేనిపనిఁ బట్టి పాలార్చి పన్నిదం బనిఁ ద్రొక్కిటి సేరమునకుఁ దోడు ...
విప్ర 3 ౪౬

ద్వి. ఎదిమిదియుఁ పట్టిరయి కాక పీనిఁ, బనిలేని పనిఁ జంపఁ బని యేమి యనుచు ...
అ మ క ౧ ౧౪ పా. ౧౨. పం.

పనివంజే. విణ (పని + వంజ) = పనికి వంధ్య పనిచేయఁగానిది.

సీ. పనికంజకొరా యింటి కానిసబిడ్డరారా కెట్టి
శైవములదో చిట్టిగొట్టొ .
చెన్న. ౪. ౩౯

**పనివడు.** అ క్రి. (పని + పడు) ౧ పూను, యత్నించు

సీ. పనిపడి తోలఁ గొట్టినలీలఁ గొన్నింటిఁ
జెఱసుగ్గగాఁ బొడి సేసి చేసి ...
భార విరా. ౫. ౩౫

క పనిపడి యహింస వ్రతిముగఁ, గొని వనమున
నున్న మునులకుం దొడరదహిం, సనము ..
భార అర ౫ ౫౯

కె కనికరముతోడ నిటువలెఁ, బనిపడి సెప్పొమ్ము సఱచి పఱచినఁ గానీ, కనరాని కటిఁ
చీకటి, యనకి సనుం గానవచ్చునా యొయఁ
దైనక. విప్ర ౪ ౫ విక్రి. ౨ ౧౨

౨. కోరు

సీ పనిపడి త్రవ్వి కూపమునందు నుదకంబు
పానంబు సేయనివాని భంగి
భార. శాం ౧. ౬౪

కె పనిపూని కాశికిం జని, వనరుహాలోచనుఁడు
పెదఁదవాలికి కన్నుల్, తనకుఁ గలఫలము
గనిరొయం, బనివడి తద్వ్యథవలక్ష్మిఁ బరికించు
నెడక కాశీ ౬ ౪౦

కె మును పరమహంస వాసనఁ, బనిపడి సామీ
ప్యపదవిఁ బంకేరుహాముక, గనిరొయనొ
యనఁగా వరవ, ర్ణిని పాదయుగంబు పద్మ
రేఖం బొలుచున్ రాజ. చ. ౩ ౪౧

౩. కొన్నిరొయెడల నిది వాక్యా లంకారముగా
నుపరొయాగింపఁబడును.

చ. పనివడి నారికేళ ఫలపాకమువక జవి రైన
భట్టహా, ర్షుని కవితాను గుంభములు సోమరి
పోతులు కొండ అయ్యె లా, నని కొనియాడ
కేరు నైష. ౧. ౧౪.

చ. పనివడి సాధుపంథునఁ బ్రభావతి భామిను
లక్షిఁ గొల్వ . కై. భా. ౨. ౯౫.

**పనివాఁడు.** వి. (√పని) భృత్యుఁడు, సేవ
కుఁడు; కర్మకారుఁడు.

సీ పనివాఁడు గాఁబోలుఁ బటుఘోటిపాలంబు
బలుకొరార నివ్వరికలంపుఁ దీయు .
కువల. ౨. ౬౩.

గీ. ఏమిపనివార మనుచుఁ దద్భూమిపాలు,
కదకు మన కేఁగువార కేతరణి నతని,
యుల్లమున కెదయక ప్రవర్తిల్ల కేర్తు, మను
విచారంబుచే నాకులాత్ము లగుచు.
రాఘవ ౩ ౧౩౧.

సీ. ... పనివాఁ డనంగఁ, గర్మకారుం డొప్పు.
ఆం భా. ౩ ౬.

విణ. పనిచేయువాఁడు

గీ ఏమిపనివార మనుచుఁ దద్భూమిపాలు,
కదకు మన కేఁగువారము ..
రాఘవ ౩ ౧౩౧.

**పనివినుు.** అ క్రి. (√పని) ౧ అజ్ఞావశవర్తి
యగు ; వశవర్తి యగు.

క. ఏ వెంటకు మిమ్ము రమ్మన, దేవర కెంచేవి
కేవి తిరువడిఘుకు సే, సేవింపఁగఁ బనివిని
రొయద భావింపఁగ నింతకంటె భాగ్యము
కలదే వైజ. ౩ ౬౦.

క అనవుడు నాదయని కి ట్లను, వనజానన నీదు
మనకు వచ్చినరీతిం, బనివినిరొయెద మాటల
కేఁకఁ, బని కేదీతలఁపు నాదుభాగ్యము
కాదే. కాశ. ౧ ౩౭. వీర. ౪. ౯౪.

క. మునివర మీ, రిచ్చోటికి బదలికమై,
విచ్చేయుట యేమి తెలుపకే పనివింటుక.
రామా. ౪. ౪.

౨. కొలవు పుచ్చుకొని కళ్లు; కళ్లు, అరుగు.

చ. అనయము నొచ్చుచున్నయది యంగము తెల్లను వేగ వచ్చుటన్, మనము వశంబు గాదు జననాయక ప్రొద్దును వోరుు నిప్పు డే, బనివిని . భార. ఉద్యో. ౨ ౧౫

చ. అని పరమేష్ఠి పంప నతలాదిపదంబులకున్ భుజంగముల్, పనివిని వరాహ ౬. ౩౩

క అని దశకంఠుఁడు పంచినఁ, బనివినిరొంద ననుచు లేచి ప్రణమిల్లి ...
బా రా యు ౧౨౭౪

చ చని విభుఁ గాంచి పల్కు బలశాసనసన్నిభ నీదుపంపునం, బనివిని తీవెగుం పనక పాండు రమైశత నిర్ఘరీతటం, బనక దరీపుటం బనక యన్నియు నారసి ... వసు ౨ ౭౭

3. వచ్చు.

వ. . మీమామ లైన హోతప్రహోతులు పుత్తెంచినం బనివింటిమి మమ్ముం బాడు మని వరాహ ౫. ౭౫

క వినిభయము ప్రియము మనమున, నెనయఁగ నవ్విభుఁడు వినయ మెసక మెసంగన్, నను నీపాలికిఁ జను మని, పనిచినఁ బనివింటిఁ గార్యభంగి ఘటింపన్ వి్ర ౧ ౧౮౧

క తెడవం బోయిన దైత్యులు, పొదగని యూర్వశి తొలంగి పో సేల నిచుం, దోడితె మ్మని మారా జద, ఒడిబడి వచ్చెదరు వేగ పనివిను మనిరన్ ఉ హరి ౧ ౫౧

౪. చచ్చు, మృతినొందు

చ కినుఁగొనఁ జాల వే తోకతెకాఁగిట నీవు సుఖింప నిప్పుడే, పనివిని వాసనావశతి భావిభవంబునసైనఁ జెందెదవ్, నిను ...
శుక ౨ ౪౮.

౫. అంగీకరించు.

సీ. అని గారవించి సెయ్యము మీఱఁ బలికినఁ బనివిని యా మహాబ్రహ్మచారి ...
విప్ర. ౪. ౭౧

పనుకు. అ క్రి కోపించు, అగ్రహించు.

క అనుచుఁ గదలి పోవచ్చిన, నసుహూనము మాని హొంకుఁ దమ్మునిఁ జేప, ట్టినచంద మేమి చెప్పుదుఁ, బనికినకాలోరగంబుఁ బట్టుట దోఁచెన్ ఉ హరి. ౪ ౬౩

పనుగొను. అ. క్రి (పన్ను⁴+కొను) ౧. ఒప్పు, కలుగు

తరలము కనిరొ ముందట నమ్మహీపతి గాంగి సైకతభూములం, బనుగొనన్ ధను వభ్య సించుచు భార అది ౪ ౧౬౪

(తెప్పగా అని భావము)

ద్వి పనుగొన నిభ్భంగిఁ బాడుచు బొగడు, చును నాల్కు కపివోవ శూలిఁ గీర్తింప ...
పండితా. దీక్షా ౬౨ సా

౨. జాగరూకతకలుగు

మధ్యా .. అన్నదియుఁ, దనదివ్యశక్తి నపాప శముల విడిచి తిమ్మనిసాధుఁ, బనుగొనఁ దీగంబు సేరఁబెట్టి విపాశనాఁ బరగ ..
భార అది. ౪. ౧౨౨

ద్వి పనుగొన మృగము దప్పక చూచి చూచి, కను మూయ కునికి నిక్కపుజాగరమున ...
పండితా పర్వ ౩౬౪

3 కలుగు, ప్రాప్తించు, లభించు.

క. ధనమునకై ధర్మముదెస, ననాదరము సేసి సేని నానృపతికి న, ధ్ధనమును జెడు దుర్య శముం, బనుగొనుఁ దుది దుర్గతియును బాటిలు ననఘా భార. శాం. ౨ ౪౦౯

ద్వి. పనుగొన్నసామ్రాజ్యభారంబు మాని, పొను పదని క్లేల పోడు రక్ష్యారు ...
రం. రా. అయో. ౧౧౫.
పా. ౪ కం. (చి. వి. పా.)

౪. జనించు, పుట్టు

క. వినుఁ నృప పార్థుంబు ప్రియం, బనూనసుఖ
యుక్తి నిర్భరానందము గాం, దినిరూఢి
యగుఁగ మనమునఁ, బనుగొను నది సాత్త్వి
కాఖ్యభావంబు లగుఁ
భార. శాం. ౪. ౩౫౦

క. విను నృష్టశోణితంబునఁ, బనుగొనుశుక్లంబు
వలనఁ బ్రాణులు దగ న, ర్తన పొందుఁ
బ్రాణశుక్లము, లనూనహేతువులుగా నహా
నుఁడు నదచుఁ భార. ఆశ్వ. ౨. ౪౬.

**పనుచే(న్చు)[1] = అంచే[1], అంపు, అనుచే[1], అనుపు.** స. క్రి. (√పొవు) పంపు, అరుగఁ జేయు

క. హైడింబుం, డనిఁ గర్ణుని నొర్చుఁ బనుత
మతని నతనికిఁ ...
భార. ద్రో. ౫. ౧౯౭

క. అన విని సత్యవతికిఁ జె, ప్పిన నాయమ
పనుప నంబఁ జెంపుగ వృద్ధాం, గనలం
దోడుగ నప్పుడ, పనిచి యనిచితిని జనంబు
ప్రస్తుతిసేయఁ భార. ఉద్యో. ౪. ౨౬౬
భార. ఉద్యో. ౪. ౧౫౭

గీ. జనులసంకెళ్లు విడిపించి పనిచినారు, వరుణ
లోకమునం దున్నవారి లనఘు ..
కాశీ. ౪. ౬౮

చ. పనిచినఁ దద్దయుం బొదలి పాఱుడు పేద్యాల
వెల్గఁ బెల్లుగా, మునుఁగుచు తేలతేల్చు
తలముందరిపల్లియ కేఁగె . .
నీలా. ౧. ౧౦౦

**పనుచే(న్చు)[2] = అంచే[2], పంచే[2].** స. క్రి.
౧. ఆజ్ఞాపించు, నియోగించు.

క. తనయుండు తల్లిదండ్రులు, పనిచినపని సేయఁ
జేని ... భార. ఆది. ౩. ౧౯౯.

క. ఏను మఱవక పనుపందగు, పనుతెల్లను బనుపు
శిష్యభావ శుభము నా, కనఘా కలిగెను
నీదన ... భార. శాం. ౬. ౬౧౨.

వ. ... అధర్మం బైన నూరుభంగంబు సేయు
మని కృష్ణానుమతి జిష్ణుండు పనిచె
భార. శల్య. ౨. ౨౮౩.

(సంజ్ఞచేయు - అని భావము)

౨. (ఇది 'వచ్చు, పిలుచు' మున్నగు కొన్ని
ధాతువులకున్నంతములకు అనుప్రయుక్తమై ప్రేరణార్థము నిచ్చును)

క. గురుగుణయుతు లగుకొడుకులఁ, గురుకులము
వెలుఁగ నయినకొడలిఁ గృష్ణం, బరమపతి
వ్రత గొంతిని, గరుణను రాఁబనిచె రాజు
గజపురమునకుఁ భార. ఆది. ౭. ౫౪

క. రాఁబనుపుఁడు పార్థివులఁ, దేఁబనుపుఁడు
తెఱఁగు పఱచి తేరిట సఱువం, గాఁబను
పుఁడు జయభేరిఁ, వేఁబనుపుఁడు కర్మకరుల
తేగిరపఱుపఁ
కృ. శకుం. ౧. ౪౯. పారి. ౨. ౩౫

జ. పనుపరి, పనుపు.

**పనుప(న్ప)డు.** అ. క్రి. ౧. కలుగు, ఉండు

చ. తనువు దొఱంగ కిట్లు సుకృతంబుల పెంపున
వచ్చి తిప్పుడం, బునకు మహాత్మ యిచ్చటను
బోవదు నీమదిఁ బాసి మర్త్యతం, బనుపడి
యున్న తెయ్యము ... భార. మహా. ౩౨

క. ... నస నీపైఁ, బనుపడుప్రీతిం జెప్పితి, నని
తరసుల భాతిగుహ్య మగునిప్పదముఁ
భార. ఆశ్వ. ౨. ౨౨౨.

క. మా రాజుకు యనిఁ బోరుము, పొరువ వెంక
కొంత రైనఁ బనుపడి యున్నఁ .
శశాం. ౫. ౧౦౧.

౨. పొడము, సంభవించు.

క. కనుఁగొని యించుక సేపున, దనువడు నని
పలికెఁ బిదపఁ దనువడుటయునుం, బను

పడిరి నప్పు డద్దే, పుని వదనాబ్జమున
నాచెవుల కింపారఁగ.

భార శాం ౬. ౧౩౫

3. తగు, అర్హమగు.

క ఘనసారకరండమునకు, ఘనసారస్వారము నిచ్చి
కథ చెప్పింపం, బనుపడిన నేర్పు గలిగియు,
జనవర యిటు తప్పఁ జెప్పఁ జను నే నీకున్

విక్ర ౭. ౧౭౩

చ లనహృదయంబు వెంబడిని తప్పక ఘోటక
మంత నంతనే, పనుపన నిల్చి ముందటికిఁ
బాఱి . .   ప్రభా ౨ ౩౦.

ఉ . అంబుజసంభవుండుఁ జే, త్రోభవవైర
యున్ గ్రమముతో భవదీయకృపాసమర్పిత,
ప్రాభవులై ఇదా కనిరి పన్వద సర్గలయాది
కారముల్   కళా ౮ ౨౩౭

౪ ప్రకటమగు

క అని యొక పద్యము హృద్యం, బును నిఁ
వద్యమును జోద్యమును గా రచియిం,
చిన మించిన కారుణ్యము, పనుపడఁగా
నతని యగ్రభాగము నందున్

పరమ ౨ ౧౩౪

౫ వశమగు, లొంగు

క   గోష్ఠికిఁ, బనుపడి యేపారి యచటఁ
బ్రభుఁ డున్న తిటిన్ ... హరి ౬ ౫ ౯

క గాంధారగ్రామశ్రుతి, బంధురతన్ మానవు
లకుఁ బనుపడని మహా, గాంధర్వవిద్య
దైవత, గంధద్విపయాన నెఱపెఁ గౌశల
మొసఁగన్   పరమ ౫ ౧౩౦

౬. సిద్ధపడు.

చ. ... వాదముం, దనుకఁగ నంచితాధర
సుధారస మిచ్చి మనోజకేళికిం, బనుపడఁ
జేసి కుంజ మృదుభావములఁ దేలిచి

శాగి. ౧౦. ౬ ౩౪౩

చ.   ఫచ్చుతనిన్ శశిప్రభా, వనరుహ
పత్త్రనేత్రయును వాఁడును వేడుక మీఱఁ
గేళికిం, బనుపడి సౌఖ్య మొందిరి ప్రభా
వతి వింటె యశోద నైపుణిన్.

శుక. ౨. ౫౧

౭ ఆలవడు

క విను మంతర్నాడిం జనఁ, బనుపడి పవనంబు
బ్రహ్మపద మొందఁగ శాం, తినిరూఢ
మైనచిత్తము, గను నానందంబునంద కల
యుఁగ బిదపన్   భాగ శాం. ౪ ౧౨౮

సీ వనవాస మిం మొకయును నాకు దుఃఖంబు
సేయదు దేహంబుఁ జిత్తమును దం, ంక్రియ
లకుఁ బనుపడి యున్నయవి

భార ఆశ్ర ౨ ౮౦

౮ ఒప్పు

చ అనువగునుర్ల నొప్పునులయా నిలవాహము
నెక్కి తేంట్ల న,ల్లిన నిడువాగెఁ బూని
లవలీనవవల్లిక లెమ్మె సొమ్ములై, పను
పడఁ   మనుచ ౬ ౨౬.

క వనిత యనియెడు సరసున, మనసుం గన్ను
లను ప్రాశ వన సది బరువై, యనువు
కొని మునిఁగెఁ గన్నులుం, పనుపడ నెల్లెడల
నిలిచి పైపైఁ దేలెన్   గంధ ౨౧౭

చ పనుపడఁబూని సారె తెలిపావడపై నెరి
పట్టు కుంచెఁగ, ట్టినయపరింజి పువ్వులు
ఘటించెడు చందురు కావిఁగట్టి

రా వి ౩ ౧౨౩ శశా ౬. ౨౧౨

౯. కదఁగు, పూను

క. నిను నీనుతిచే నెవ్వఁడు, పనుపడి నుతి
యించు రాత్రిఁ బగలును ...

వి పు. ౧ ౨౦౯.

౧౦ అడఁగు. నిగూఢ మగు.

ఉ .. ము, నృను పడియున్న తాపతిభ
ప్రజ్వలభావము నొంది వింత రై
అని. ౨ ౧౩౧.

క. ఘనజఘన స్తనయుగములు, వెనుకను దను
త్రోవల నుద్దవిడి నొత్తంగాఁ, జవలేక యూరు
మరుఁగులఁ, బనుపడ దాఁగె నవఁ గొను
భామకుఁ దనరుచ్ హంస ౪ ౬౯

౧౧ దృఢమగు

క జను లాగరించిన పాపము, పనుపడ జన
నాథుఁ బొందఁ
భా రా కిష్కిం ౨౪౯

ద్వి పనుపడ మొగిలిలోపలినీళ్లు నమ్మి, కొననీళ్లు
చల్లువేఁడుట లెందుఁ గలరె ..
ద్వి హరిశ్చ ౬ ౪౨౦

౧౨ అగు, పరిణమించు

సీ నడుమఁ బ్రమాదంపునడకఁ జేకుతివశాపము
రాజ్యఫలముగాఁ బనుపడుటయు ..
కళా ౫ ౧౭౪

స క్రి పొందు

క. విను నాకీర్తి జగంబులఁ, బొనుఁగుపడిరొ
నీవు భువనపూజితవృత్తిం, బనుపడితి గానఁ
దగు నీ, యనలపదవి నీక నాకు నలవడ
దింకన్ భార ఆర ౫ ౧౫౨

చ. .. వర్ణధ, ర్మనిరతి చిత్తపాకము గ్రమం
బునఁ దెచ్చుఁ గషాయపక్వతం, బనుపడ
కర్హుఁ డే లగు నృపాలకుమారుఁడు సన్న్య
సింపఁగన్ భార శాం ౫. ౩౯౮

క. విను ప్రణవా దికరూప, శ్వనిరూఢిం బుట్టు
వాక్కు దానివెను చనున్, మనము పురు
షార్థబుద్ధిం, బనుపడి యని చెప్పె నతికి
బ్రాహ్మణుఁ డనఘా
భార అశ్వ ౨ ౧౪

జ : ఘనుపఱుచు.

పనువ(న్న)రి. విశే. (పనువు+అరి³) ౧. ఆజ్ఞకు
లోఁబడినవాఁడు, పరతంత్రుఁడు

గీ. ... పనుపరి యనఁగను భాసిలుఁ బర, తంత్రి
నామంబు అం భా. ౩ ౫

౨. నియామకుఁడు, ప్రభువు.

ఉ. .. పల్కులచేడెరాయఁడున్, గిబ్బవయూ
ళిదిట్ట తమిఁ గ్రేవ మెలంగఁగ నేలుపన్నరీ
అచ్చ భాగవ. ౪ ౬౦

(వాఁతప్రతి. పా)

పనుపఱు(అ)చే. స క్రి (పనుపడు) పనుపడఁ
జేయు (పొడమఁజేయు)

చ. .. అట్టి సమంచితచిత్తధర్మమున్, బనుపఱు
పంగఁ జాలు కలభావణపంక్తి నను గ్ర
హింపవే. భార శాం ౫. ౩౭౨

(ప్రకటించు)

వ .. పెనురొదలు పొదల మెదలు కొదవ
తుమ్మెదలపదువు లినుపసరిపెణలపెనుపును
బనుపఱుచుచు కళా ౬ ౨౨౪

(బద్ధము చేయు, బంధించు)

క అని పలికి కరుబు బిగియం, బనుపఱిచి
వెఱంగుఁ జెక్కుపయ్యెద లాడిగా, నొనరిచి
రొండొరు మీఱన్, వనజాక్షులు కుచము
హారిణవాంఛాపర లై. చంద్ర ౪ ౦౯

(వాడుకపఱుచు, అలవడఁజేయు)

క అని సుకవీంద్రులగుణములు, గొనియాడుచుఁ
గుకవి సరకుఁగొనక మహిఁ బురా, తనసుక
వుల సాహిత్యము పనుపఱచిన యట్టిసరస
భాషాగణిక్ ప్రబోధ ౧ ౩౧

క దినముఁ గనుమిందు చేయఁగ, మునిగృహ
ముల వన్యభోజ్యములఁ దృప్తుం డై మను
తనయుం డంత నయం, బునకుం బనుపఱచి
దేహమున్ దైవమతిన్. కవు ౧ ౧౭౦

(కుదురుపఱుచు, స్థిరపఱుచు)

క. నిను సుఖదుఃఖంబులకును, మనసే కార ణము దానిమాటికి నెటకుగ్, జనకీయక హరియందును, బనుపఱుపుము కాతుకంబుఁ బాటిలఁ జేయుచ్ శివ. ౧ ౫౦

**పనుపు(న్పు).** వి (√పనుచే2) నియోగము, ఆజ్ఞ; ఆజ్ఞాపించినపని

ఆ ... తండ్రి, పనుపుఁజేసి ముదిమి గొని జవ్వనం బిచ్చె . భాగ ఆది. ౩. ౭౫.

గీ .. దివిజపిత్రు విధివిశిష్ట, మైనదయిలచిఁ గీ డొలయుడు యజ్ఞములకుఁ, బహువిధా ంబు వేదంబు పనుపు గాన .
భార అను ౪ ౩౦౪

క మీపనుపుగ రాజ్యముపా, సీ పాండుతనూ భవులకు నీకున్న భుజా, టోపభయంకరుఁ దర్జును, కోపానల మశరి ముట్టుకొ౦దే వారిన్ భాగ ఉద్యో ౧ ౪౬

సీ మానుపాడుఁ,

ఆ వసుజఁ జూచి కష్టమనుజాలఁ గూడి నా, పనుపు సేయకుండఁ జనునె నీకు ..
భార ఆది ౬ ౨౦౧

సీ అంబికాతనయుఁ జూచ్చి, తండ్రియు గురువును దైవంబు నీతఁడ మాకు మీరెల్ల నీమనుజవిభుని, పనుపు సేయుటయు నీతనికిఁ బ్రియంబు గావించుటయును మమ్ము చేవ చేల

గీ విధులఁ బ్రీతులఁ జేత .
భార శాం. ౧ ౩౪౬.

ఉ. . . మీకు మారొసగన్, విగ్రహాకేల, నెయ్యమున విద్యుఁడు కౌరవరాజుఁ బార్థివ, ప్రాగ్రసరుండు ధర్మసూతు ప న్పిదిమీకు నలంఘ్య మి శ్రతికిన్. భార. అర. ౫. ౪౧౬.

పనులుగొ(ల్గొ)ను = పనిగొను. స క్రి. (పనులు + కొను) సేవింపఁ జేసికొను, కొలువఁ జేసికొను.

వ ... కద్రువ గర్వంబున మఱిక గరుడుని వినతసుం బనులు గొనుచున్నంత ..
భార ఆది ౨ ౪౪

గీ కపటచటవాపరుం డైన కంసవైరిఁ, బరమ ముని నవ్వుటాలకుఁ బనులుగొనిరె . .
పారి ౫. ౭౬

గీ శాల్మలీవృక్షగతుఁ డైన సంచరింపుఁ, బ్రీతి లఘుపతనుం డను పేరు వాఁడు, గాకు లెల్లను నా భృత్యగణము గాఁగఁ, బనులుగొందును సామ్రాజ్యపదవి నొంది
నా పంచ ౨ ౩౦

వ నిగమాంత ప్రతిపాద్యు . పరము నిత్యం తం బనుల్గొంచు వహా, నిగరష్ఠుండు కృతార్థుఁ డయ్యె ... పారి ౭ ౪

**పన్న** వి (సం పతితః కి పన్న) దాసుఁడు, భృత్యుఁడు

ద్వి యిట్టిల చూడవా యీపన్నకాళ్లు ..
పండితా పురా ౯౪ పా

గ్వి మన్నించి యిప్పు డీపన్నఁ గైకొన్న, నున్న పన్నలు వత్తు రిన్నియు చేల ...
పండితా పురా ౯౫ పా

(విణ ౧ నీచుఁడు; మూర్ఖుఁడు)

ఉ పెన్నిధిఁ గన్నవాఁడు మఱి పెంపునఁ బ్రాణ సమానమిత్త్రిఁ డై, యున్న మహా త్మునిం గదిసి యియ్యవఁ జెప్పినఁ జెప్పఁ గాక యే, పన్నలకైనఁ జెప్పిన విపద్దశ నొందఁడె . శివ ఉ. ౧ (శ. ర.)

రగడ పతిచె మరుఁ డురుల ముదిపన్నలను విన్న లను . రాఘవ. ౨. ౩.

ద్వి. ఎలుకలఁబన్నులం గన్న తేలుర నీన్నుఁ,
  గలకంఠ కూపల్లెఁ గలదెల్ల మఖము
  బస పు 3 ౬౫౯ పం

ద్వి మ న్నెందుఁ జటిక్రేల ముద్రికయగుచు,
  సుశ్నాఁడె యహిపుఁ డీ పన్నలకెల్ల
  పండిత పురా ౯౫ పా

3. దీసుఁడు

౩. ఇరువురఁ గట్టియుఁ గొట్టియుఁ, బరిభవములు
  పెట్టఁ బేదపన్నల మనుచుం, గరుణముగఁ
  బలుకఁగాఁ గృప, రొయరగిన చిత్తముల
  వార లాండోరుతోదగ్.
  కేయూర 3 3౭3

౪. వృద్ధుఁడు, ముదుసలి

సీ. ముదివాఁడు ముదుసలి ముసలి పెద్ద ముదుక
  ధొక్క డొక్క ముదురు పక్క పన్న,
  పలుకు వృద్ధాభిధ
  ఆం. భా ౨ ౧౧౯

పన్నకము. వి. (√పన్ను[1]) పన్నుగడ, పన్నిక,
  రచన (శ. ర)

పన్నగము. సం. వి అ పుం ౧ సర్పము,
  పాము ౨ పద్మకాష్ఠము ? (వ నీసము)

పన్నగారి. సం వి. ఇ. పుం. గరుడుఁడు

పన్నగాశనుఁడు. సం. వి. అ. పుం గరుడుఁడు

పన్నద్ధ. సం. వి. అ. స్త్రీ. = పన్నద్ధి.

పన్నద్ధి. సం. వి ఈ. స్త్రీ. (కాలికి కట్టఁబడి
  నది, కాలికి తొడుగుకొనునది) పాదరక్ష, చెప్పు

పన్నము. సం విణ (అ ఆ అ) ౧ చ్యుతము,
  జాఱి పడినది ౨ గతము, పోయినది. (వి. అ
  పు. ౧. జేలను ప్రాఁకులాడుట. ౨. క్రిందుగాఁ
  బోవుట, నీచగమనము; దిగుట, ప్రాఁకుట.
  3. జిహ్వా, నాలుక. (శే. ని.)

పన్నము. వి. (సం ప్రశ్న: ప్రా పణ్హో.)
  వేదమునందలి అష్టములలోని భాగము.

గీ. చెలఁగి తొలుదాఁడు తరవాయిఁ జెప్పి
  నట్టి, యుల్లపన్నంబు లేకరు విడి పదంబుఁ,
  గ్రమము గుణియించు నైష్ఠిక బ్రహ్మచారి,
  నికరములు గొల్వ వచ్చె శాండిల్యమౌని
  రా వి. ౨ ౭౫.

పన్నరు = పన్నారు.

చ. తరుణులు చిల్కబొమ్మలును దంతపు
  బొమ్మలు కేలిగాజుప, న్నరులును బ్రూని
  చొప్పికలు నల్లఁద నోలిన పేర్చి ...
  కు సం. 3 ౨౬౯.

పన్నస. వి (క పణ్ణియ త పణ్ణై = వరిపండు
  పొలము)
  పొలము, క్షేత్రము.

వ. అస్య క్షేత్రద్వయ స్యావధయః.
  ఉత్తరతః కొల్వకేను. తూర్పున పన్నస
  పూర్వతః దామపియపన్నస
  (Ep Ind. 5. No. 16.)

వ . . అస్య క్షేత్రస్యావధయః, పూర్వతః
  స్థాపిత శిలాగుణ్డసీమా దక్షితః పన్దిపెద్దేది
  పన్నస సీమైరసీమా ...
  నముూరుశా. Ep. Ind. 12.

వ కాశ్యప గోత్రమున చక్రగొట్టమున
  మల్లరాణి వెంగినాట్టిలోన గుద్దవాదిలోని
  క్రిందూటి పన్నసబల్లహుణ్డు సాకిచ్చినదాని
  శ్రీ భీమేశ్వర మహాదేవరకిచ్చిన భూమి
  ఖ ౧౪ ఈ పన్నసకు నైరుతిమూల ..
  దా. శా. ౪. ౧౧౦౧.

పన్నా. వి (క. మహా. పన్న త. పన్నా.)
  వస్త్రము మున్నగువాని వెడల్పు.
  (వ్యవ.) అచాఁపుపన్నా మూఁడు మూరలు.

పన్నాగము. వి (√పన్ను[1] - క పన్నంగ, త. పణ్ణాగు, మరా పన్నగ.)

౧. అందలము మొదలగువానికిఁ మీఁదకట్టు కప్పు.

(మన్మథుని యందలము వర్ణనము)

సీ. పొన్నాకు మేల్ పచ్చ పన్నియ పన్నాగ మనఁటి క్రొవ్విరిగుత్తి గొనలుకుచ్చు

చంద్రా 3 ఉ

సీ రేఖ లై మీఁదటి రెప్పలయొప్పు పన్నా గంబు కడపట్ల బాగు సెలఁగ, ... వెలయింపఁ బన్నాగములకుఁ బై నిడిన యబ్బురపు దండెలువోలె బొమలు దనర ..

కళా. ౩. ౧౭౪

సీ పచ్చ మార్కుపటంపుఁ బన్నాగమును మేలి పట్టెచట్టంబు కెంబట్టు పడము, ...

గీ ... చొప్పడు కొమారి, పందలం బెక్కె శ్రీరఘు నందనుంగు

దశా ౭ ౧ ౬౯

౨ అందోళి కావ్యవయనము, చత్రము

సీ పన్నాగ మనఁగిను భాసిలుచుండును సాం దోళి కావ్యవయన సమాఖ్య ...

ఆం. భా. ౨. ౨౦౨

3 పన్నిక, ఎత్తుగడ.

(వ్యవ.) వాఁడు ఈ వ్యవహారమందు మంచి పన్నాగము పన్నెవాఁడు

పన్నారు = పన్నరు. వి (బాలిక లాడుకొను) గురిగి, చిన్నపిడుక, పాత్రవిశేషము

సీ పాఁపకొంపరి పచ్చ పన్నారులోవుల గజ్జెవ గూళ్లను గుడుంబు టుడిగి

యయా 3 ౧౭౯

క. కన్నార మిసుచంబులు, కన్నారతి మరని తోడఁ గళవళపడు వా, పన్నారుదొంతు

లిడి రై, కొన్నారో యీ పసిండి కుండల టంచున్

రామా. ౭. ౭౪.

ద్వి పిన్నపన్నారులు చిన్నిబొమ్మలును

బస. పు. 3 ౪౩౭. పం

ద్వి ఇతికిల్లఁ గుమ్ములయెడలకు దలుపు, మఱుఁ గునఁ బన్నార్లమాటున నడ్డ, గోడలపట్టెను

పండితా దీక్షా ౪౪. పా.

పన్ని. వి (సం పంక్తిః. క పన్ని) పంక్తి, వరుస

ద్వి ఎఱ్ఱదామరల, రొబులపు కెల్లిదవాడు మన్న పాదములు పన్నికాలియల పంపద ముట్టుకోలు, గొన్న నిగ్గలసోనఁ గురియు లేఁదొాడలు ... ద్వి. పరమ ౧. ౧౫.

పన్నించే. స క్రి (√పన్ను[1]) ౧. రథవాహ నాదులను ఎక్కుటకు సిద్ధపఱచించు.

మ ఏ, పరివాగంబును జీఁ చక్రగపతిం బన్నింపఁడు ..

బాగ ౧ ౯౨ (పల్లించు చి ని పా.)

౨ ధరింపఁజేయు

ద్వి పసిఁడి పల్లంబులఁ బన్నించి పసిఁడి, పక్కెరి చేసిన ..

పల్నాటి వీరచరిత్రము. ౫౭.

(బ్రా 'కట్టు' అని భావము.)

3 నిర్మింపఁజేయు.

సీ కోట సింగారించి కొత్తళంబులకెల్ల నట్టళ్లు పన్నించి యాళుకొసెలె, బంగిళ్లు కట్టించి

౬. హరి ౨. ౯౨

పన్నిక = పన్నుగడ, పన్నుట. వి. (√పన్ను[1]).

౧. రచన.

సీ. ... పన్నిక యనఁగను బన్నుట దగు ...

ఆం. భా. 3. 3౨.

౨. ఒప్పు, అందము.

పరశ్శతము. సం విశే (అ ఆ అ) నూటికంటె అధిక పరిమితిగలది. (సంఖ్య సంఖ్యేయము)

పరష్షష్టి. సం. విశే (ఇ) అఱువదికంటె ఎక్కువగు (సంఖ్య, సంఖ్యేయము) .

పరస-పరుస. వి. ౧. తిర్నాళ్లకు వచ్చు జన సమూహము. (శ. ర) ద్వి బసవలింగం బేరు పరగ యనంగ, బసిగాని యిలఁ గ్రిక్కిరిసి వచ్చు వారు. బస. పు ౨. ౧౪౫ పం.

౨ ఒకజాతి బిచ్చగాఁడు

వ... పరసలు పడిగెవారు కంచికావళ్ళవారు పరంగు లింగివీసులు పరానులు...

హంస. 3. ౭౯

పరసాత్కృతము. సం విశే (అ ఆ. అ) పరుని యధీనముగాఁ జేయఁబడినది

పరసు-పరుసు. వి విధము.

క. నరకాతురుఁ డగు కిల్బిషు, పరసున నరకందు దలఁకి . హరి ౬ ౪ ౧౫౭

క. క న్పెసఁగుచున్న సున్నని, చిప్పలలో స్వాతి వానచినుకులు ముత్తె, చొప్పునఁ బడు నప్పరసున, నొప్పెదవును మూ క్తికంబు లొక్కొక్క భంగిన్ రత్న ౪౫.

పరసేవ. సం వి. అ స్త్రీ ఇతరుని సేవించుట.

పరస్త్రీ. సం వి ఈ స్త్రీ పరకీయ, పరుని భార్య

పరస్పరజ్ఞులు. సం వి. అ పుం. బ —అన్యోన్య మెఱిఁగినవారు - స్నేహితులు

పరస్పరము. సం విశే—అన్యోన్యము

పరస్మైపదము. సం. వి. అ. న. క్రియాఫల మన్యుని చెందునని తెలుపు క్రియాపదభేదము— (వ్యతి-ఆత్మనేపదము)

పరస్వంతము. సం. వి. త. పుం. అరణ్య మహిషము. (శై. వి.)

పరస్వథము. సం—పరశ్వథము.

పరస్వము. సం. వి. అ. పుం న పరుని ధనము

పరస్సహస్రము. సం విశే (అ ఆ అ.) సహస్రముకంటె ఎక్కువ పరిమితి గలది. (సంఖ్య, సంఖ్యేయము)

పరహంసుఁడు. సం. విశే (క్ రఘ్నక్) పరులను జంపువాఁడు.

పరా. సం అవ్య ౧. వెనుక (పరావృత్తము—వెనుకకు మరలినది)

౨ ప్రాతికూల్యము, వ్యతిరేకము (పరాజయము)

3. పోవుట (పరాసువు—పోయిన ప్రాణములు కలది.)

౪ అత్యంతము (పరాహతము—మిగుల గొట్టఁబడినది)

పరాంగము. సం. వి అ పుం దేహముయొక్క వెనుకటి భాగము

పరాకము. సం విశే (అ. ఆ అ) వరాకము, అల్పము, కుత్సితము - వి అ పుం. ౧ కత్తి

౨ ప్రాయశ్చిత్తరూపమగు వ్రతభేదము 3. రోగ విశేషము

పరాకరణము. సం. క అ న నిరాకరణము, త్రోసిపుచ్చుట

పరాకు. వి (హి పరాహ్) ౧ ఏకాగ్రత, సావధానత .

గీ. తమ్మలము సేయుచో నొక్క తలిరుఁబోణి గాఁకమాఱునిఁ జూచు పరాకుకతన,. .

హైమ. ౬. ౬3

(శ్లో: విలోకి హైశాగ్ర విలోచనోత్పలా-

సం హైమ. ౧౫. ౪౪)

శా భూజాదంభమున న్పరాకుమెయి ము న్నాఁ బోఁడి తే ర్పాఁది చే, తో జాతావల మూర్ప శాస్త్రనటిత్ దూలి న్నరి ప్రాప్తి...

ఆము. ౫. ౧౪౯.

గీ. రమణిరయయ్యారములపైఁ బరాకుచేతఁ, జవి దొఱంగఁడు వద్దించు నవి యెఱుఁగఁడు,...
విజ. వి ౨. ౧౫౪, కళా 3, ౧౫౪

౨. తత్పరతను దెల్పుమాట, హెచ్చరికను దెల్పు మాట

గీ అంతకంతకు నతివేగ మగ్గలింప, రాగ వాగ రొచ్చరిక పరాకు జియ్య, యనుజనులు తిచ్చపడి తమ పని మఱవఁగఁ, బరగు నమ్మేటి కెఱరాకు ప్రాధికతన
ప్రభా ౨ 33

గీ. రాజవర్గ పరా కజారమున దొరలు, గాచినా గని హెగ్గడిక త్తె దెలుప. కువల ౨ 3
ఉ ా ౧ ౧౪౦

3 అనవధానత, ఏమఱిపాటు.

సీ. ఏమఱిపా టన గేమఱిక యన హెూస మనఁ బరా కనఁ జనుఁ బ్రమాదము
ఆం భా ౧ ౧3౯

క. వనిత నృసింహేంద్రుఁ బరా,కునఁ జూ్చ్కని శిరము వంచుకొనుట ... నరస 3. ౨3.

ఉ. అయ్యొ పరాకు మాని దలియక విను ..
సారంగ. ౧. ౬౬.

సా అడిగిన చిరాకు అడుగకున్న పరాకు

౪. ఉపేక్షాభావము, ఉదాసీనత

వ... అని వర్ణించుచుండ దమయంతి... పరాకు వహించియుండె నవ్విధం బా శాకీరాణనకుం గ్లానవహ మయ్యె... నైష. ౫ ౧౦౬

సీ మఱిసిన కెంగ కెత్తి చూడకుండు పగాకు కనుఱుచూరాఱని కైనఁ గుదిటుఁ జేయు.
ఆము. ౧,౫౯, విజ. వి. ౧. ౬౫

౫ మైమఱపు, విపరీత్వము.

ఉ...అచ్చిసరాకు(జోండ్ల కెఱయందమునంద మనంబు నిల్పి పై, యచ్చర దానవప్రవరు లచ్చెరుపాటు పరాకుఁ జెందుచుక్.
భా. ౨. ౨౪౧.

(వ్యవ) వానికి సంధి యొత్తినగ పరాకుమాటలు ప్రారంభించినవి.

౬. అసత్యము

క. ఈకల నిజమో కాక వ, రాకో చోద్యముగ ...లుగలదే, నాకల యెన్నఁడు నిక్కల, గాకుండఁ గ నిటు పరాకుగాఁ బనిగలదే
విప్ర 3 ౪౫

పరాకుదెల్పు= పరాకు పరాకను

సీ సాగిను నిద్దపుఁ గమ్మమగణాల ధళధళక్ ప్రబలాక్షిరుచిశిఁ బరాకు దెల్పు. శుక. ౧ ౨౦౦ (సేవచేయు అని భావము)

జ: పరాకుచేసికొను, పరాకుపడు, పరాకుచేయు

పరాకుచేసికొను. అ క్రి (√ పరాకుచేయు) ఉపేక్షాభావము వహించిన ట్లుండు, వినిపించు కొన నట్లు నటించు.

వ అని యనేక ప్రకారంబులఁ దనమనో మ రాగంబు తేటపడం బలికినఁ జెలుల నరయు నెపంబునం బరాకుచేసికొని ..
విజ. వి ౨. ౨౦౦

పరాకుపడు. అ క్రి (√పరాకు) ప్రమాద పడు (క.ర)— స. క్రి. మఱచు. (వ్యవ) ఈ తొందరలో ఆ విషయము పరాకుపడితిని

పరాకు(చే)సేయు. స. క్రి. (పరాకు+చేయు)

౧. ఉపేక్షచేయు.

చ చెనక నుపక్రమించుఁ బతిచెంతఁ దొలం గఁగఁ జూచు నాతి యవ్వనితఁ బరాకు చేయు జనవల్లభుఁడు .. కకు. ౪ ౧౨

శి. నీవా ర్తఁ దెలిపినప్పుడె, భావమునఁ గృపా వివేకపద్ధతి మెఱయం,గా విశెఁ బరాకు సేయక, శ్రీవల్లభుఁ డానమునఁ జెఱుక వ్రాలయక్.
కుచేల. ౨. ౬౦

క...కెంజిగు, రాకుఁ గని పరాకుసేయు నార పదంబుల్ విజ. వి. ౧. ౬౫. (ఇట కొపమ్య ద్యోతకము)

౨ ప్రకృతవిషయమునుండి మరల్చు, మఱపు కలిగించు

క. మనసిజాం దదయుఁడు శరమేసిన సేమగనో
పరాకుసేయుద మనుచును.

కువల. ౩ ౧౧౫

౩. (సేవకులు ప్రభువులను) హెచ్చరించు

సీ. చూడకు మెఱుంగుబు ద్రిప్పి మాటాడ విప్రుడు,
చేదిగిచి పట్టుక పరాకుచేసినపుడే, యేమి
పుట్టునో కైలాట మింకమీఁద, మగువ దయ
లేక విడవాకఁ దగునె నీకు

విజ వి ౨ ౧౯౭

**పరాక్పు.** సం విణ (చ్ చీ చ్) ౧. ప్రతిలోమగామి. వెడమొగమైనది, వెనుకకు తిరిగినది, పరాఙ్ముఖము ౨ ప్రతికూలము, వ్యతిరిక్తము ౩ మీఁదనున్నది (ఊర్ధ్వలోకము) ౪ పరగామి, మఱొకటిని బొందునది ౫ బాహ్యపదార్థములను దెలుపునదై ప్రత్యగాత్మకు భిన్నమయినది. (శ్రోత్రాదీంద్రియములు) వి. చ్ పు ప్రత్యక్షగమ్యముగానిది (పరుని ఆత్మాది)

**పరాక్పుష్పి.** సం వి ఈ స్త్రీ ఉత్తరేను, అపామార్గము

**పరాక్రమము.** సం వి అ పుం ౧. వీర్యము, శౌర్యము ౨. దేహబలము దేహసామర్థ్యము ౩ ప్రయత్నము, పూనిక

**పరాక్రమి.** సం విణ (న్ నీ న్) పరాక్రమము కలవాడు.

**పరాక్రమించు.** సం అ క్రి విక్రమము చూపు, శౌర్యముచూపు, బలముచూపు.

చ. తన భుజశక్తి లేక యొరులదర్పము యూఁది
పరాక్రమింపవచ్చిన నది సెల్లునే...

భార. ఉద్యో. ౪. ౨౦౬.

ఉ. మాల్యవంతుఁడే, కితి ముకుందు నొంచి
యగరే నిలు మంచు ఖగేంద్రుమోము
నిర్ఘాతముఁ బోలు ముష్టిహతి ఘట్టన సేసి
పరాక్రమించినన్ ఉ. రా. ౨. ౧౦౩.

**పరాక్రాంతి.** సం వి ఇ. స్త్రీ పరాక్రమము

**పరాక్రాంతుఁడు.** సం విణ (అ ఆ. అ) ౧ పరాక్రమించినవాఁడు. ౨. పరునిచే ఆక్రమింపఁబడినవాఁడు. ౩ ప్రతి నివృత్తుఁడు, వెనుకకు మరలిన వాఁడు

**పరాగతము.** సం విణ (అ ఆ అ) ౧. వెనుకకుఁ బోయినది ౨ మృతము, మరణించినది ౩ వ్యాప్తము; క్రమ్మఁబడినది ౪ (పర+ఆగతము) వెనుకకు వచ్చినది, తిరిగి వచ్చినది

**పరాగమము.** సం వి అ పుం ౧ వెనుకకుఁ బోవుట ౨. చావు ౩ (పరా+ఆగమము) వెనుకకు వచ్చుట, మరలి వచ్చుట ౪ శత్రువుల రాక, పగవారు దండెత్తి వచ్చుట

**పరాగము.** సం వి అ. పుం ౧. పుష్పరజస్సు, పుప్పొడి. ౨. పొడి, ధూళి, దుమ్ము ౩. స్నానీయ ద్రవ్యము, నలుఁగుఁబిండి. ౪ ఉపరాగము, గ్రహణము ౫. చందనము ౬. స్వచ్ఛందగతి, విచ్చలవిడిగాఁ దిరుగుట ౮ ప్రసిద్ధి, ఖ్యాతి

**పరాఙ్ముఖుఁడు.** సం విణ (అ. ఈ. అ) ౧. విముఖుఁడు, వెడమొగము పెట్టినవాఁడు (వ్యతి - అభిముఖుఁడు). ౨. క్రియాదులందుఁ బ్రతికూలముగా ఆచరించువాఁడు ౩ పనిసేయకుండువాఁడు. ౪. ఒల్లనివాఁడు

**పరాచేకము**=పరియాచేకము. వి. పరిహాసము ఎకసక్కెము. (గ్రా. వి అని శ. ర.)

గీ. అని పరాచికమాడుచు వరుల వీటఁబుత్తెంచె

శుకచరిత్రము. ౧. ౮౧

పరాచితుఁడు. సం విణ (అ. ఆ అ.) పరపుష్టుఁడు, ఇతరులచేతఁ బెంపఁబడినవాఁడు - వి. అ. పుం. బానిస వాఁడు.

పరాచీనము. సం విణ. (అ. ఆ అ) ౧. పరాఙ్ముఖము, పెడమొగము పెట్టినది. ౨. ఉత్తరకాలభవము, భావికాలమునఁ గలుగునది

పరాజయము. సం. వి. అ. పుం ౧. పరాభవము, అపజయము, ఓడుట ౨. ఓడించుట ౩. డయ్యుట, ఆలయుట (అధ్యయన పరాజయము = చదువువలన డయ్యుట)

పరాజితుఁడు. సం. విణ (అ ఆ అ) పరాజయము నొందినవాఁడు

పరాజిష్ణువు. సం విణ (ఉ) ౧ ఓడించువాఁడు, జయశీలుఁడు ౨. ఓడువాఁడు

పరాణస. సం వి ఆ స్త్రీ. (పరా + అన్ + అస — మిక్కిలి బ్రతికించుటకు సాధన మైనది), వైద్య-చికిత్స (వాచ)

పరాత్పరుఁడు. సం వి అ పుం — ఉత్కృష్టుల కంటె ఉత్కృష్టుఁడు-పరమేశ్వరుఁడు

పరాత్ముఁడు. సం వి న్ పుం ౧ పరమాత్ముఁడు ౨ పరుని జీవుఁడు.

పరాదనము. సం వి అ న. (పరము=ఎక్కువగా — తినునది) పారసీకదేశపు గుఱ్ఱము (అరేబియా దేశపు గుఱ్ఱము, అని కొందఱు)

పరాధి. సం. వి. ఇ. పుం. ౧ (పరబాధాకరము) వేఁట. ౨ అధిక మగు మానసిక వ్యథ.

పరాధీనుఁడు. సం విణ (అ. ఆ. అ.) అస్వతంత్రుఁడు, ఇతరులకు లోఁబడినవాఁడు,

పరాన్నభోజి. సం విణ (న్. నీ. న్.) పరుల అన్నమును భుజించువాఁడు.

పరాన్నము. సం. వి. అ. న. ఇతరుల యన్నము.

పరాన్నుఁడు. సం విణ (అ. ఆ. అ) = పరాన్నభోజి.

పరాపరము. సం. స. (అ. ఆ. అ.) — పరాపరములు — ౧. వెనుకటిదియు ముందటిదియు, ౨. గొప్పదియు తక్కువదియు వి అ న. పరూషకము, పేరీఁదు, ఖర్జూరము ౩.

పరాభవ. సం వి అ పుం ఒకానొక సంవత్సరము

పరాభవము. సం వి. అ. పుం. ౧ తిరస్కారము, అవమానము ౨. నాశము ౩ ఓడుట.

పరాభవించు. స. సం. క్రి. ౧ అవమానించు,

ఉ కౌరవకోటి దర్పమునఁ గానక నిన్నుఁ బరాభవించి దుర్వారభవత్ప్రకోపశిఖఁ గ్రాఁగ మదిన్ వగ పేల దీనికిన్

భాగ కాం ౧ ౯౩.

౨ ఓడించు

వ...ఇట్లు నివాతకవచులఁ బరాభవించి భవ్యతేజో దుర్నిరీక్ష్యుం డై పాండవేయుండు మరలి వచ్చువాఁడు... భాగ ౪ ౧౭౦

పరాభూతి. సం. వి ఇ. స్త్రీ పరాభవము.

పరాభూతుఁడు. సం. విణ (అ. ఆ. అ) ౧. అవమానింపఁబడినవాఁడు. ౨. ఓడింపఁబడినవాఁడు.

పరామరిక = పరామరిస. వి. (సం. పరామర్శః) ౧ వివేచనము, మంచిచెడ్డలను జక్కఁగా విచారించుట.

గీ మహిత చారిత్రుఁడు గురుఁడు బరామరిక లేక, చంపుమని పంపఁదగునయ్య సదయహృదయ

విక్ర. ౩ ౬౩

౨. విచారణ, పరిశీలనము.

సీ. పైఁ బరామరిక చొప్పడమిఁ గాకము దప్పి పండఁబాఱిన పాల మెండఁబోకె.

మనుచ. ౩. ౧౭౯.

చ... కర మరుదార శేఖరము కామరుపాపరు
హారి కోటులకా, దరియఁగనీయ దన్నలవ
సాల్గొ మొంగాల పరామృశింపఁగకా.
అహ. ౧ ౧౧౯.

**పరామృష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) పరా
మర్శింపఁబడినది పరామర్శము చేయఁబడినది

**పరాయణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧.
అత్యంతాసక్తము, మిక్కిలి తగులు గలది, తత్ప
రము. (ధనపరాయణుఁడు) ౨. అభీష్టము, ప్రియ
మయినది.—వి. అ. న. ౧ తత్పరత, అత్యంతా
సక్తి, మిక్కిలి తగులు

౨. ఉత్తమమైన ఆశ్రయము, మేలైన ప్రాపు

గీ. కినుకెలుంగు వేదవ్యాస మునివరుండు, నధిప
కృష్ణుండు నకుఁ బరాయణంబు..
భార అను ౫ ౪౩౮.

౩. ఉత్తమ స్థానము

౪. ఒరు లేమేమి రొనర్చిన, నరవర యప్రియము
దనమనంబున కగుఁ దా, నొరులకు నవి సేయ
కునికి, పరాయణము పరమ ధర్మపదముల
కెల్లకా. భార. శాం. ౫ ౨౭౦

౪. నాలుగుమాసము లుపవసించు వ్రతము
(వై. ని.)

**పరాయత్తము.** సం. విణ. (అ. ఆ. అ.) పరా
ధీనము, పరునకు లోనైనది

**పరాయి.** విణ. (హి. పరాయి) ఇతరము, ఇత
రుఁడు. (వీఁడు పరాయివాఁడు ఇది వాడుకలో
నిది. శ. ర.)

**పరారి.** విణ. ఎత్తుపడి ఊరు విడిచి పాఱిపోయిన
వాఁడు. (శ. ర.)

**పరారి.** సం. వి. ఇ. పుం. గొప్పశత్రువు, కోటి
విరోధి.—అవ్య. కడచిన సంవత్సరమునకు పూర్వపు
సంవత్సరము, ముందుపేఁడు (దీనికిఁ దెనుఁగున
వ్యస్తప్రయోగము లేదు.)

**పరారిక.** సం. వి. ఆ. స్త్రీ. పదివిధములగు ఉల్లి
పాయలలోని ఒకానొక జాతి. (వై. ని.)

**పరారిత్నము.** సం. విణ. (అ. ఆ అ.) పూర్వ
తరవత్సరమునది, మొంటటి యేఁటిది.

**పరారుకము.** సం. వి. అ. పుం. ప్రస్తరము,
ఱాయి

**పరారువు.** సం. వి. ఉ. పుం. కారకెల్లము,
కాఁకర ?

**పరార్థము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మఱి
యొక ప్రయోజనము గలది ౨. మఱియొకనికొఱ
కైనది, పరునిమిత్తకము.—వి. అ. పుం. ౧ ఉత్తమ
మైన యర్థము, ఉత్తమ ప్రయోజనము ౨. మఱి
యొకని యర్థము (వ్యతి స్వార్థము)

**పరార్థ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) శ్రేష్ఠము.

**పరార్ధము.** సం. వి. అ. న. ౧ వెనుకటిసగము,
రెండవ యర్ధము (వ్యతి - పూర్వార్ధము)
౨. సంఖ్యావిశేషము, తుది సంఖ్య - (100,000,
000,000,000,000 - ఏకాద్యాది పరార్ధాంతా
సంఖ్యా - తర్క. సం.), బ్రహ్మయొక్క వయసునందు
రెండవ సగము

**పరావతము.** సం. వి. అ. పుం. పరూషకము.
పేరీఁదు, ఖర్జూరము ?.

**పరావరదృక్కు.** సం. విణ. (శ) భూతభవిష్య
ద్విషయములు ఎఱిఁగిన వాఁడు, ముందువెనుక
లెఱిఁగినవాఁడు

**పరావరము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. దూర
మునదియును దగ్గఱదియును.

౨. (దేశకాలములందు) ముందటిదియును వెను
కటిదియును.

౩. ఎక్కుడదియును తక్కుడదియును. ౪. శ్రేష్ఠ
తమము.

**పరావర్తము.** సం. వి. అ పుం. ౧ ప్రత్యావృత్తి, మరలుట, వెనుకకు మరలుట ౨. వినిమయము, మాఱుపు 3 మరల ఇచ్చుట, పరివర్తము. ౪. (వ్యవ) తీర్పుమార్పుట

**పరావహము.** సం వి అ పుం సప్తవాయువు లలో పరివహవాయువునకు మీఁదిది

**పరావిద్ధము.** సం. వి అ పుం అంతఃపురము (వై. ని.)

**పరావిద్ధుఁడు.** సం. వి అ పుం. ౧. కుబేరుఁడు ౨ ఒకానొక సంకీర్ణజాతివాఁడు

**పరావృత్తము.** సం విణ (అ ఆ అ) ౧ మరలి నది; వెనుకకు మరలినది. ౨ వినిమయము నొంది నది 3 (వ్యవ) వేఱువిధముగా మాఱినది (తీర్పు)

**పరావృత్తి.** సం వి ఇ స్త్రీ=పరావర్తము

**పరావేది.** సం వి ఈ స్త్రీ ౧ బృహతి, వాఁకుడు ‡ ౨. ములక ‡.

**పరాశరుఁడు.** సం వి అ పుం ౧ ఒక ముని, వేదవ్యాసుని తండ్రి ౨ దేవేంద్రుఁడు (శే ర)

**పరాశ్రయ.** సం వి. ఆ స్త్రీ—మఱియొక చెట్టు మీఁద మొలచు లతాది—బదనిక, వంద ‡.

**పరాశ్రయము.** సం వి అ పుం పరునాశ్ర యించుట, పరుని యాశ్రయము

**పరాశ్రయుఁడు.** సం విణ (అ ఆ అ) పరుని ఆశ్రయము కలవాఁడు పరుని ఆశ్రయించిన వాఁడు

**పరాసంగము.** సం. వి. అ. పుం. ౧ పరునాశ్ర యించుట. ౨ పరులకూడిక.

**పరాసనము.** సం. వి. అ న. మారణము, చంపుట

**పరాసము.** సం. వి. అ. న. తగరము, వంగము (వై ని.)

**పరాసుఁడు.** వి. క్రౌంచివాఁడు.

శా...కళింగంబు రాజ్యశ్రీలక్ ఘనుఁ డాప
రాసునకు మూసాబూసియన్వాని కత్యుల్లా
సంబున నాధిపత్య మొసఁగన్ రూపించి
రాఁబంపుచున్.

రంగా ౧ ౧౩౭, ౧౪౦ రంగా 3 ౧౧౭

**పరాసువు.** సం విణ (ఉ.)—పోయిన ప్రాణ ములు కలవాఁడు—మృతుఁడు, చచ్చినవాఁడు.

**పరాస్కంది** సం వి. న్ పుం దోఁపుడుదొంగ, బందిపోటు దొంగ

**పరాస్తము.** సం విణ (అ ఆ అ) ౧ త్రోయఁ బడినది, త్రోసివేయఁబడినది ౨ తఱుమఁగొట్టఁ బడినది 3 నిరాకరింపఁబడినది, ఖండింపఁబడి నది (వాదాది) ౪ ఓడింపఁబడినది

**పరాహతము.** సం విణ (అ ఆ అ) ౧ కొట్టఁ బడినది ౨. వెనుకకుఁ గొట్టఁబడినది 3 వెను కకుఁ దఱుమఁబడినది - వి అ న. దెబ్బ, కొట్టు

**పరాహము.** సం వి. అ పుం మఱునాటి దినము, మఱునాఁడు.

**పరాహ్ణము** సం వి అ పుం దినమునందు మధ్యాహ్నమునకు పిమ్మటి కాలము

**పరి** వి ౧ సైన్యము, దండు

చ. పరి సనుదెంచి గోగణముఁ బట్టు రివన్
విని ..   భార విరా. ౪ ౪౭

గీ ...ఈతఁడు పరి చాఁపకట్టు వడఁగఁ, గొట్టి
చతురంగబలముల వెట్టు గలఁప...చంద్రా.
౬ ౯౪,   భార విరా. ౨. 3౪

౨. మూఁక, గుంపు, సమూహము

గీ అంతపరియయునల వై ప్రజ కలికి పాఱి, పోవ
వాఁడును వెడపోట్లు పొడిచి చనిరొ...
ఆము. ౬. ౧౨౨.

ఉ. పరికెంపుఁ జాతి వానిఁ గనిపట్టి నడిం
జెరకేలుఁ గట్టి తె, చ్చిరి ...

భార. శాం ౩. ౫౦౫.

(శేష్టనము-అని శ ర)

౩. (= పఙ్క్తి) బోల్ల

గీ. డామరం బగుఁ జాలు బోల్ల పరి యనఁగ,

ఆం. భా ౨ ౨౨౩

౪. పర్యాయము, మాఱు, సారి (ఈ యర్థమునఁ దఱచుగ 'ఒక' శబ్ద పూర్వకముగఁ గాన వచ్చును.

క కేకయ పాల్పులు దోడుగ, నా కీచకుఁ డాజి నన్ను గపటకుఁ జేసెం, జాకుండ మున్న రొకపరి, నా కాతనితోడ భండనము లేదయ్యెన్ భార విరా ౩ ౧౧౭

క ఆ పలుకు తా విదల్చిన, తాపసి పలు కనుచు లంజ తల్లి యుఁ గోపో, ద్దీపిత యై యుఁక నాచే, నీపరి చెట్లఁ బడ కరుగుచే వీఁ దనుచున్ విప్ర. ౪. ౫౭

మ కదియం గర్గొని మత్స్య మొక్కపరి శృంగం బట్టిటుం ద్రిప్పఁగా, నుదరంబుల్ శిరముల్ దెగం బడిరి దైత్యుల్ జేసకే లొక్కటన్

దశా ౧. ౨౮౩

మ .. వారి యేతెంచుట లెస్సగా నెఱిఁగి తీవ్రాటోపయుక్తంబుగాఁ, బరిమై వర్తిమ గాక యున్నఁ గడిమిం బ్రత్యర్థి నా హారాతిపే, ని రణక్రీడఁ జలంబు నూపు దము... హరి ఉ ౭. ౧౭౭

(ఇట 'పరిమై' వంతిరొక పర్యాయము-భావము)

వ ... నాలవపరి ధర్మ భార్యాసర్గంబునందు నర నారాయణాభిధానం బై దుశ్చరం బైన తపంబు సేసె భాగ. ౧. ౭౩.

౫. తఱచు పట్టుదల.

ఉ. పరికెంపు మెట్టి తొత్తు బహుళకంపులఁ గ్రాలెడు మిత్రుఁ జైత్రుసునిం, బారిగొన వచ్చు గ్రీష్మ మనుపొచ్చెపుఁ జేరఁ బురారిఫాలభా, సురపటువహ్ని యంచు వెఱఁ జొచ్చిన మన్మథుఁ గాచె నత్తతిస్, సరసశిరీషకేసరల సన్మహిళా మృదులాలకాగ్రముల్.

నృసిం. ౩ ౭౨.

౬. (క పరి.) ప్రవాహము, ఒక విధమగు జలా శయము.

క...బుగ్గ వాగు దొన తల,పరి గుండము కాల్వ డిగ్గి బావి దొరువులన్. హంస ౪ ౨౧౦.

ఆలపరి-ఆవులమంద

మ కలఁచెన్ శాలివనప్రదేశములు వీఁక న్మార్గముల్ గాచి పాంథులఁ గూల్చెం బొలి యుంచె నాలపరిఁ దోడ్తో నూళ్ళలోఁ దోచ్చి పె శకుం ౧ ౧౦౧

గూఁబపరి-గుడ్లగూఁబల గుంపు

చ. . ఇరు శ్నబసెు విరోధి భీశరగతి నంతి గూఁబపరి గాఢమహీధరభూజ దుర్గకో,టర ములు విర్గమించె వికటప్రకటాననముల్ ముడుంచుచున్ శేం పంచ ౩ ౧౫౩

చీమపరి-చీమలగుంపు

వ...అక్కటబిలంబు... రయసముద్ధూతధూళి ధూసరితధారాధర పథం బగుచు నొక్క పరియ చీమపరి యనఁగ గవిసె నందు

మనుచ. ౪. ౧౧౦.

మిడుతపరి-మిడుతలదండు

వ శిలీముఖంబులు నిగుడ మిడుతపరి గవియున ట్లంబరంబు నాచ్ఛాదించుచు. .

భా. రా. యు. ౭౯౫.

క...మిడుతపరి చిచ్చువాతం, బడిపడిఁ బోడి యైనయట్లు పంకజనయనా.

పద్మ. ౪. ౨౭౪ హరి. ఉ. ౭. ౯౭౫.

ఓ. (క) క్క-పరిక్ = ఒక్కుమ్మడిగా, యాని పద్యమున.

గీ శరభజాంబవదాదులు శైలతరులు, నొక్క-పరి మీఁద నడరింప నురశౌనిముల

భా రా యు. ౧౭౫౦.

సీ శరశరంబులు చాలకమకముల్ మార్తిక చాలికల్ నవ్యప్రవాళములును గీ క గన జలనిధిలోనుండి కలసియొక్క-, పరియ తొరిఁ గొనో యనఁగఁ జూపఱకుఁ దోఁచె,

వాల్మీ 3 ౯3

జః పరకాఁడు, పరిగొను, పరిగొలుపు, పరిచిచ్చు పరిమార్చు, పరిమార్చించు, పరిమార్చు, పరిమాఱు, పరిమొగము, పరియోత్తు, పరివెడలు, పరివోపు

పరి. సం అవ్య (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు) ౧ అంతట (పరిభ్రమణము) ౨ వ్యాప్తి (పరిణతము) 3 దోషకథనము. (పరివాదము) ౪ పూజన (పరిచర్య) ౫ అలంకారము (పరిష్కారము) ౬ మేర, కొలఁది (పరిచ్ఛేదము) ౭ కొన్నిచోట్ల నిరర్థకముగానే యుండును. (పరికల్పితము = కల్పితము) ౮ మిక్కిలి (పరికృతము, పరిక్లిష్టము) ౯ వర్జనము (పరిత్రాట్టు) పరికాంక్షితుఁడు)

పరిఁజించు=పరుఁజించు. స క్రి పరుఁజునఁ బట్టుకొను, కత్తిపిడియందుఁ బట్టుకొను

క. అని కైదువు పరిఁజించుచు, నమపరిగదఁగన్న సంభియని నీతిజ్ఞుల్ వినీ మెచ్చవలదె పదకిముఁ గొనిరొ నతఁడు నాకు దీనిఁ గొనుట నుచితమే భోజరా. ౫ ౪౫,

చ. చెదరక బంటుమీఁదఁ బరిఁజించుచు దగ్గరకూరుకై పడిక్. ద్వా. ౧౦ ౫౪

పరిక. వి. ౧. పక్షి విశేషము, ఒక జాతిపిట్ట.

సీ గిజిగాఁడుఁ పూరేడు కోర్జంబు బొన్నంగి జెన్నకాంబు పరిక ...

గీ. యనఁగ నిట్లని పక్షిభేదాఖ్య లలరు.

ఆం. భా ౨. ౯౦

౨ (ముగ్గు క ర) గంగవల్లీ విశేషము, ఒకవిధ మగు ముగ్గు.

వ...వికళిత ప్రసవపరాగపరంపర యనుపరికముగ్గులడగ్గర . కవల 3 ౧3౧

చ. పరికలు దృష్టిదీపములుఁ బన్నినగద్దెలు పెట్టి యేమిటన్,గర మగు పుత్రవాంఛ కడగానఁగ లేక విచారఖిన్ను లై హంస ౨ ౧౫౪

3 తృణ విశేషము

గీ పరికి ముల్లూచి మొదయను బైటికుంగ, మొదలుగాఁ బూచి రవళింపఁ బొదలు వెడలు ప్రబంధ ౨౦౧

౪ మస్క్విరిశేషము (చి ని.)

౫ పరక మొట్ట రెయ్య పరిగ యుంగిలికము, చీరజింపుజెల్ల నారజెల్ల, ద్వా ౧. ౨౫౧

(వ్రాఁతప్రతి పా)

పరికంపము. సం వి అ పుం ౧ భియము. ౨ అంతటను గలకంపము, కంపము, వడఁకు

పరికథ. సం వి ఆ. స్త్రీ వాఙ్మయభేదము

శ్లో అథ వాఙ్మయభేదాస్స్యుః చంపూః ఖండకథా కథా, ఆఖ్యాయికా పరికథా కలాపక విశేషకాః (త్రి. ని.)

పరికరము సం వి. అ పుం. ౧ పరివారము ౨ ఉపకరణము, పనిముట్టు 3 సమూహము. ౪. సమారంభము, ఉపక్రమము ౫ పర్యంకము, మంచము ౬ నడికట్టు ౭ రోగాపట్టె ౮ వివేకము ౯. ఒక యర్థాలంకారము

క. సాభిప్రాయవిశేషణ,మై భాసిల్లినను బరికరాలంకృతి నా,కోభిల్లు నూరికవిచంద్రాలోకము. ౫౫.

౧౦. (నాట్య) బీజమును విపులముగాఁ జేయుట.

క. గిరివనదుర్గములం బ్రజను, పరిదుర్త్తరణంబు నప్రదు శ్రాద్ధవిధి సమాచరణా సముదయముం పేరిం, బరికీర్తించినయతండు వడయు శుభం బుల్ ॥ భార. అను. ౩. ౧౯౩.

౨. పొగడు, స్తుతించు

మ. వరరత్నాకరమేఖలాకలన నీ వా మూక్షి యత్యంతవి, స్ఫురణాలంబనిలంబబింబమున నీకా భూచక్రముకా పాటిగాc, బరికీర్తిం పుచు... గాధేయోపాఖ్యానము. ౫. ౯౩

పరికీర్తితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧ చెప్పcబడినది; పేర్కొనcబడినది ౨ చాటcబడినది ౩. పొగడcబడినది

పరికూటము. సం. వి. అ. న. హస్తినఖము, దుర్గద్వారమునొద్ద నుండెడు మట్టిదిబ్బ (వా. చ.)

పరికృశము. సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి చిక్కినది

పరికె. వి. ౧ ఒక తినుబు గడ్డ, త్రిశృంగము (శ. ర.) ౨ (సం. పరిఖ తె. పరికై) కందకము, అగడ్త

క. పరిఖజలంబులు మెండలను సురనది నీరాడు పరికె చుట్టున నుండన్, పి శకుం ౧. ౫౫.

పరికోపము. సం. వి. అ. పుం. మిక్కిలి కోపము

పరిక్రమణము. సం. వి. అ. న. = పరిక్రమము

పరిక్రమము. సం. వి. అ. పుం. ౧ నలుగడలc దిరుగుట ౨ ప్రదక్షిణముసేయుట, వలcగొనుట. ౩ విహారము, క్రీడార్థము నడచుట. ౪. క్రమము, వరుస; ఒకటి వెనుక నొకటిగా వచ్చుట.

పరిక్రమసహము. సం. వి. అ. పుం.—పరిక్రమణమును సహించునది—మేక. (త్రి. ని.)

పరిక్రమించు. సం. అ. క్రి. ౧. బయలుదేఱు, నిర్గమించు...



వ. అని పరిక్రమించి వెలిపాళెంబుకట్టకడపటc గుటకారుకుటీరవాటికc బ్రవేశించి క్రీడా. ౨౨.

(పరిక్రామ్యత్, పరిక్రామమాణుcడు. వెం. అతిక్రామ్యత్, అతిక్రామమాణుcడు. వెం. వాని వలె గ్రహించునది)

౨. సంచరించు.

వ. అని బహుప్రకారంబుల బహుమానతత్పరుం డగుచు నటc బరిక్రమించి .. హరి. ఉ. ౨. ౧౪. (క్రొత్తప్రతి. పా)

పరిక్రయణము. సం. వి. అ. న. = పరిక్రయము.

పరిక్రయము. సం. వి. అ. పుం. ౧. వినిమయము. సరకులమార్పు, వస్తు విచ్చి వస్తువు పుచ్చుకొనుట ౨. కూలి, వేతనము. ౩ జీత మిచ్చి పనిచేయించుకొనుట ౪ ధన మిచ్చి చేసికొన్న సంధి

శ్లో॥ కోశాంశేనార్థకోశేన సర్వకోశేన వా పునః, శిష్టస్య ప్రతిరక్షార్థం పరిక్రియ ఉదాహృతః॥ హితో. ౧. ౧౨౨.

౫ క్రయము, కొనుట.

పరిక్రాంతము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రదక్షిణము చేయcబడినది. ౨. సంచరించినది. (ప్రదేశము. వెం.) వి. అ. న. = పరిక్రాంతి.

పరిక్రాంతి. సం. వి. ఇ. స్త్రీ. పరిభ్రమణము చుట్టును తిరుగుట

పరిక్రియ. సం. వి. అ. స్త్రీ. ౧. (అగడ్త, కలుగుటెం) చుట్టువాఱుట; చుట్టుకొనుట, వేష్టనము. ౨. (నాట్యోక్తి) బీజమును విపులముగా చేయుట.

పరిక్రీడించు. సం. అ. క్రి. క్రీడించు, విహరించు.

వ...అప్రతిమప్రభావ బీజంబులు వెదవెట్టునది యుసు హై పరిక్రీడించు వసక్రోడంబులను... హ. వ. కి. కి.౨.

పరిక్రీతము సం విణ (అ ఆ అ) క్రీతము, కొనఁబడినది

పరిక్లాంతము సం విణ (అ ఆ అ) ౧ దలి నది, డస్సినది

పరిక్లిష్టము సం విణ (అ ఆ అ) మిక్కిలి క్లేశము పొందినది వి అ న మిక్కిలి క్లేశము

పరిక్లేదము సం వి అ పుం తడి చెమ్మ

పరిక్లేశము సం వి అ పుం మిక్కిలి బాధ, మిక్కిలి క్లేశము

పరిక్వణనము సం విణ (అ అ అ) మిగుల మ్రోగునది వి అ న పెద్ద ధ్వని

పరిక్షతి చూ క్షతి

పరిక్షయము సం వి అ పుం ౧ తఱుగుట, క్షీణించుట ౨ నాశము, చేటు ౩ నాశము చెందుట

పరిక్షామము సం విణ (అ ఆ అ) మిక్కిలి చిక్కినది, బక్కచాతినది

పరిక్షాళనము సం వి అ న కడుగుట

పరిక్షితుఁడు సం వి అ పుం అభిమన్యుని పుత్రుఁడు

ఉ ఉత్తర గర్భాగర్భమువనుండి భవజ్ఞుకుండు పూరుషవం శోత్తరుఁ డాదిరాజగుణరాశి పరీక్షితుఁ డుద్భవించె

భా ఆశ్వ 3 ౯౬

పరిక్షిత్తు సం వి త్ పుం చంద్ర వంశపు రాజులలో నొకఁడు (అభిమన్యుని కొడుకు, జనమేజయుని తండ్రి)

గీ అత్మకులము పరిక్షీణ మైన జనన, మొందె గాన విష్ణురథిమన్యునందనునకు, నర్హ మగు పరిక్షిన్నామ మనిరొకఁ గృష్ణుఁ, డఖిలజను లలరు విజఁ బొరవాధిజాధ భార అశ్వ

పరిక్షిప్తము సం విణ (అ ఆ అ) ౧ చుట్టు విసరఁబడినది, నలుగడలఁ జిమ్మఁబడినది నలు ప్రక్కల చుట్టఁబడినది ౩ త్యక్తము, విడువఁ బడినది

పరిక్షీణుఁడు సం విణ (అ ఆ అ) ౧ ఆగ్గిన వాఁడు, చిక్కినవాఁడు, క్షీణించినవాఁడు ౨ నశించినవాఁడు ౩ నిర్ధనుఁడు, పేదపడిన వాఁడు

పరిక్షీబుఁడు సం విణ (అ ఆ అ) మిక్కిలి మత్తుగొన్నవాఁడు

పరిక్షేపము సం వి అ పుం ౧ చిమ్ముట, చుట్టునుపఱచుట ౨ విత్తుట ౩ చుట్టుగాచుట ౪ అంగుళ, అగడ్త మొ. ౫ త్యజించుట, విడు ౬ ౭ శ్రోత్రాదీంద్రియము ౮ హస్తిపాద పార్శ్వము, ఏనుగుకాలిప్రక్క (వై ని)

పరిఖ సం వి అ స్త్రీ—చుట్టును త్రవ్వఁబడి నది—౧ అగడ్త, ఖేయము ౨ అంబుధి, సంద్రము ౩ భూభృత్తు, పర్వతము (శ ని)

పరిఖాతము సం వి అ న ౧ పరిఖ, అగడ్త ౨ (నాగేలు, బండిచక్రము మొదలని) చాలు, గాడి ౩ చుట్టును త్రవ్వుట

పరిఖిన్నుఁడు సం విణ (అ ఆ అ) దుఃఖి తుఁడు, మిక్కిలి ఖేదము నొందినాడు

పరిఖేదము సం వి అ పుం ౧ దలిక, అల ౨ ఖేదము, దుఃఖము

పరిఖ్యాతము సం విణ (అ ఆ అ) ౧ చెప్పఁబడినది ౨ ప్రసిద్ధి నొందినది

పరిఖ్యాతి సం వి ఇ స్త్రీ ౧ ప్రఖ్యాతి ప్రసిద్ధి ౨ చెప్పుట

పరిగ వి మత్స్యవిశేషము

ఆ పరిగ పెంట్ర రొయ్య పరిగ యాంగిలి మను ద్యా ౧ ౨౦౧

పరిగణన. సం. వి. అ. స్త్రీ. ౧. ఎన్నుట. లెక్కించుట; అంతయు లెక్కించుట. ౨. తలఁచుట, ఎంచుట.

పరిగణనము. సం. వి. అ. న.=పరిగణన.

పరిగణించు. సం. స. క్రి. ౧ ఎన్ను, లెక్కించు,

గీ. తపములును యజ్ఞములు నీవు ధర్మములుగఁ, బలుకవైతివి యార్యసంభావనీయ, పదము లగు కర్మములలోనఁ బరిగణింపఁ, బడవొకో వేదశాస్త్ర తత్పరులచేత.

భార. శాం. ౫. ౨౩౧.

౨. తలఁచు, విచారణచేయు.

౪ ధరణిని గృతప్రతిజ్ఞా, పరిపాలనదక్షుఁ డెందుఁ బరమోత్కృష్టం, డరయంగ నిదియ ధర్మువు, పురుషునకుం బరిగణింప భూరిప్రాభవ. భా. రా యు. ౧౭౧౭.

పరిగణితము. సం విణ. (అ. ఆ. అ.) పరిగణింపఁబడినది

పరిగతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వేష్టితము, చుట్టఁబడినది. ౨. పరివ్యాప్తము, అంతటను వ్యాపించినది. ౩ గతము. కదలిపోయినది. ౪. జ్ఞాతము, తెలియఁబడినది.

శ్లో. ప్రథమపరిగతార్థస్తం రఘుస్సన్నివృత్తం

సం. రఘు. ౫ ౫౧.

౫ చేష్టితము, చేయఁబడినది ౬. స్మృతము, తలఁచుకొనఁబడినది. ౭. విస్మృతము, మఱవఁబడినది ౮. ప్రాప్తము, పొందఁబడినది. ౯. చుట్టును ద్రిమ్మరునది, అంతటను దిరుగునది.

పరిగదితము. సం. విణ. (అ. ఆ. అ.) పూర్తిగాఁ జెప్పఁబడినది. వి. అ. న. పరికథనము, పూర్తిగాఁ జెప్పుట.

పరిగమనము. సం. వి. అ న. ౧. చుట్టుకొనుట. ౨. పర్వుట, వ్యాపించుట. ౩. పొందుట. ౪. తెలియుట.

పరిగమము. సం. వి. అ. పుం.=పరిగమనము.

పరిగర్హణము. సం వి. అ న మిక్కిలి నిందించుట.

పరిగళితము. సం. విణ (అ ఆ అ.) మిక్కిలి గళిత మైనది

పరిగహనము. సం విణ. (అ ఆ అ.) మిక్కిలి గహన మైనది

పరిగూఢము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి గూఢ మైనది.

పరిగృహీతము. సం విణ. (అ. ఆ. అ.) ౧. స్వీకృతము, కైకొనఁబడినది. ౨. పట్టుకొనఁబడినది. ౩ ఒప్పుకొనఁబడినది, అంగీకరింపఁబడినది. ౪ పెండ్లాడఁబడినది.

పరిగృహ్యా. సం. వి అ. స్త్రీ. పాణిగృహీతి, పెండ్లాడఁబడిన స్త్రీ

పరిగె(గియ). వి. వృక్షవిశేషము.

సీ. ఇక్కర గుడితనార్పుదిక్కునఁ బరగచట్టున్నది దానికి మ త్తిరమున, ద్వా. ౫ ౧౬౪.

వ ...పరిగె పక్కి పలుకురు రేఁగు రేవు పులు గుడు గురివింద యీఁదు గేదంగి...వెంద లగు పొదలను... మనుచ. ౪. ౩౮.

౨. క్షుద్రమత్స్యము, మత్స్యవిశేషము

గీ. అల్లిదము సుప్పుచేఁపయు గొల్లదొండు, పరిగె రొయ్యాదియగు మీలఁబట్టు వలఁదు

హంస. ౪. ౧౬౮.

౩. కోసిన చేనిలో దిగఁబడిన వెన్ను.

ఆ. ఇంటియాలు విడిచి యిల జారకాంతల వెంటఁ దిరుగువాఁడు వెఱ్ఱివాఁడు, పంట చేను విడిచి పరిగె యేరినయట్లు...

వేమన. ౧. ౫౪.

క్రి. విణ. శీఘ్రము. (చి. వి. శ. ర.)

పరిగొ(కొ)ను. అ. క్రి. (√ పరి) వ్యాపించు, చాలుకట్టు

చ. పరిణత దివ్యగంధఫలభార సమగ్రలతాపరం పరా, పరివృతకాయమానములఁ బర్వు ఫలావళిఁ జూచి వైపరింబ్, బరిగొనివచ్చు రాజ శుకపంక్తుల చొప్పున నొప్పు...ఘోరి మారి న్మణితోరణావళుల్ వసు ౫. ౬. ౫.

(శాంద్ర ఘూపాలు సేన) చ పరిగొని వచ్చి యూదవులపట్టణ మెక్కుటఁ జుట్టుముట్టి... ఉ. హరి. 3 ౨౫

వ ... ఉటజప్రఘాణంబుల వేదీడింభంబులు సంభ్రమంబున నక్కడక్కడ జాతి పరి కొను కామధేనుధన్యధారా సారంబులు చవి గొని... వాల్మీ ౨ ౬౪.

౨. పరివేష్టించు, వలయాకారముగ చుట్టునిలుచు.

చ. కరముల నూఁపు లూఁదుకొని కన్నులు చన్నులజంటి కొండొరుల్, పరిగొని విల్వ వసు 3 ౧౫౬. ఆం. భా 3. ౧౧౪

3. చలపట్టు

చ. కురుబల మేఁగుదెంచె నదె గోవుల బిట్టలఁ బట్టి దానిపై బరిగొని కార్యసంపదయు బాహుబలంబునుఁ జూపఁబూని యే, వరిగ ద నట్టె
భార. విరా. ౪ ౨౦

చ. ఇరువురు రక్కసుల్ సవన మెప్పుడు సే నొరఁకొంటి నంతలోఁ, బరిగొని వచ్చి వేది కలపై రుధిరంబులు సల్లి...
భా. రా. బాల ౧౪౨.

క...ఒక యినుపద్రుద్దునఁ, బరిగొని యుక్కన తెంకిజట్లఁ బడుముచున్.
అధ్య. రా యు. ౨౪౪.

౪. కవియు, పడు.

వ...ప్రజాపతినికరంబు...కాందిశీకు లై కను కనింజని సకలభువనాధీశ్వరుపైఁ బరిగొని
కా. సం. ౨. ౨౦౯.

౫. దండుపెడలు

క అరవాలు గొనక పెట్టుగఁ, బరిగొని యుక్కడిఁది మగలపై నడరుట. .
భార. పా ౧ ౨౩

వ ఇట్లఖిలగుణ పరివృంతుండై గణాధీశ్వరుం డతిరయంబున దక్షప్రజాపతిపైఁ బరిగొని దక్షాధ్వరావాసంబు గని...
కు సం ౨ ౧౯౯ ౬ ౪౭౦

౫. అతిశయించు, అధికమగు

ద్వి. హరిభక్తనికర దయామృతవృష్టి, పరిగొని కురియఁ దొప్పునఁ దోఁగితోఁగి
బస. పు. ౨. ౧౬౭

౬ ఉత్సాహయుక్తుఁడగు.

ద్వి. విరిదమ్మివాసన విహరించుకేఁటి, పరిగొని నుడియుసే బబ్బిలివిరుల
బస పు 3 ౨౧. పం

ద్వి. పరిగొనివచ్చుచోఁ బురవీథికవులు
బస పు. ౪ ౧౬. పం.

స క్రి చుట్టుముట్టు

సీ తిరిగినఁ బోవీక పరిగొని యున్నింట నద గంటఁ బొదిలోన వాఁగి యూఁగి
హరి పూ. ౬. ౧౬౫.

చ...చొచ్చె బిసాంతర మాతఁ డందునం, బరి గొని యుగ్రవృత్తి నది పట్టెఁ జలంబున నమ్మహాత్మునిన్ భార. శాం. ౫. ౧౩౦

ఉ గురుతరవిక్రమస్ఫురణఁ గోటుల సంఖ్య మహోగ్రకింకరుల్, పరిగొని పాపకర్ములను బట్టి కరంబులు గూడఁ గట్టి...
రుక్మాం. ౧. ౧౬౬.

పరిగొలుపు. స. క్రి. (√ పరిగొను) పొచ్చు చేయు, అధికముచేయు.

క. ధర దుష్టసఖులగుణములు, పెరపున కేళింఁ జేయు జేయుట తప్పు, బ్బరిగొలుపుట మర్మాంతర పరిహాసము సేయుచునికి పంకజ వదనా. కేయూర. 3. ౨౭౪.

**పరిగ్రహణము.** సం. వి. అ. న. పరిగ్రహించుట

**పరిగ్రహము.** సం. వి. అ. పుం. ౧. పట్టుకొనుట; ౨. స్వీకారము, చేకొనుట; పుచ్చుకొనుట ౩. (పరిగ్రహార్హమైనపదార్థము) ధనము, అలంకారము, కానుక మొ

శ్లో. కుంభయోనిరలంకారం తస్మై దివ్యపరిగ్రహమ్ దదౌ ..సం. రఘు. ౧౫ ౫౫. (పరిగృహ్యత ఇతివ్యుత్పత్త్యా దివ్యపరిగ్రహః దివ్యానాంపరిగ్రాహ్య ఇత్యర్థః అని. మల్లి. వ్యాఖ్య)

౪. పెండ్లాము, భార్య. ౫ పరిజనము, పరివారము ౬. ఉపకరణము, సాధనము ౭. గ్రహించుట, తెలిసికొనుట ౮ శాపము. ౯ సంచిమొదలు, మూలము ౧౦. గ్రహణము, ఉపరాగము. ౧౧. శపథము, ఒట్టు ౧౨ సేన వెనుకటిభాగము

**పరిగ్రహించు.** సం. స. క్రి ౧. పుచ్చుకొను, ప్రేమతో పుచ్చుకొను

వ .సకలమహీరాజ్యవిభవం బంతయు సమర్పించినం బరిగ్రహించి యయ్యగ్రతేజుం డారాజుం జూచి. మార్క. ౧. ౧౬౩

౨. స్వీకరించు, చేకొను

చ...భవదీయపాదవందన మొనరించి మీవలన్ దారుణపాపము ల్వాచికొందు నేనసుమది వచ్చినాఁడ సదయుం బగుమాడ్కిఁ బరిగ్రహింపవే. భార. శాం. ౩. ౩౪౯

౩. పట్టుకొను

చ...మీ, సకియవివాహవేళఁ బరకాపనపాణిఁ బరిగ్రహించుచో, మెకమున బున్నమంచు నహిగ్రహాఁగిన నెట్లు భయంబుచెందునో హర. ౪. ౨౮.

**పరిగ్రహీత.** సం. విశే. (పు. స్త్రీ. పు.) పరిగ్రహించువాఁడు, వి. పు. పుం. ౧. పెనిమిటి, భర్త. ౨. పెంచుకొను తండ్రి.

**పరిగ్లానము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి బడలినది, మిగుల డస్సినది.

**పరిగ్లాని.** సం. విశే. ఇ. స్త్రీ. మిక్కిలి బడలిక, మిక్కిలి డయ్యుట

**పరిఘ.** సం వి ఆ స్త్రీ=పరిఘము

ద్వి. పరిఘల పరిఘలఁ బట్టసంబులను. ౪౦ రా యు. ౪౭౬. టీ. గా. సం.

**పరిఘటించు.** సం స. క్రి. కలిగించు, చేయు.

సీ చిటచిటార్భటి నేత్రశిఖి నిప్పులారాఁ బడ నఖాంకురహతుల్ పరిఘటించి సమీర ౬. ౧౬౦.

**పరిఘట్టన.** సం వి ఆ. స్త్రీ=పరిఘట్టనము

**పరిఘట్టనము.** సం వి అ న ౧. చుట్టును గదల్చుట ౨. చుట్టును ఒత్తుట. ౩ మిక్కిలి కొట్టుట, గట్టిగా మోదుట.

**పరిఘట్టించు.** సం. స. క్రి ౧ గట్టనచేయు, గిట్టించు. ౨ మోదు, కొట్టు

వ...పరిఘంబులఁ బరిఘట్టించియు ముసలంబుల మోదియుఁ గుంతంబులఁ బొడిచియు భా. రా. యు ౧౮౪౬

**పరిఘము.** సం. వి అ పుం. ౧ లోహబద్ధలగుదము, ఇనుపకట్లగుదియ ౨ ఇనుపగుదియ, లోహమయ లగుడము. ముద్గరము. ౩. శూలాయుధము ౪ అర్గళము, తలుపుగడియ; ప్రతిబంధము, అడ్డు

శ్లో ప్రత్యపద్యత తథేతి రాఘవః ప్రాఙ్ముఖశ్చ విసర్జ సాయకమ్, భార్గవస్య సుకృతోపి సో భవత్ స్వర్గమార్గ పరిఘో దురత్యయః.

సం. రఘు. ౧౧. ౮౮. (పరిఘః = ప్రతిబంధః అని మల్లివ్యాఖ్య)

౫. అస్త్రము. ౬. (జ్యోతి) పందొమ్మిదవ యోగము. ౭. ప్రాకారము. ౮. కోట గుమ్మ

లాశిపరు వాని గవను గా గ్ర్యహము ౧౦ కంభము, కలశ ౧౧ కాపఘటము, గాజాకుండ ౧౨ చంపుట, కొట్టుట, దెబ్బ ౧౩ మూఢ గర్భము (వై ని)

పరిఘూర్ణించు సం అ క్రి ఎదురాడు

ద్వి గగనంబుతోఁ బరిఘూర్ణించు నడుము
ద్వి పారిశ్చ ఉ ౩౫౨ పం
క మగలనము సెలుపఁబూనియుఁ, బగ దేయి.య
లేని ఛాటఁ బరిఘూర్ణింపం, దగ దతనికి
ద్వా ౩ ౩౬

పరిఘాతనము సం విణ (అ అ అ) అంతటను కొట్టునది వి. అ న అంతటను కొట్టుట పుం పరిఘము, ఇనుపకట్ల గుదియ

పరిఘాతము సం వి అ పుం ౧ హననము, కొట్టుట, చంపుట ౨ పరిఘము, ఇనుపగుదియ

పరిఘోషము సం వి అ పుం ౧ ధ్వని, పెద్ద ధ్వని ౨ ఉఱుము ౩ అవాచ్యము, పలుకఁదగని మాట, నిందావచనము, పైగచేఁ దలొపెడుమాట (శ ర)

పరిచయనీయము సం విణ (అ అ అ) ౧ ఎఱుఁగఁదగినది, తెలియఁదగినది ౨ అభ్య సింపఁదగినది ౩ ప్రోగుచేయఁదగినది

పరిచయము సం వి అ పుం ౧ పోగు సేయుట ౨ స్నేహము, మచ్చిక, ప్రణయము ౩ అభ్యాసము అవృత్తిచేయుట ౪ ఎఱుక

పరిచయించు సం అ క్రి స్నేహముచేయు, మరగు, అలవాటుపడు

సీ కాపాలికులకు ఎక్కారంబుఁ గావించుఁ బరిచయించుచు దిగంబరుల తోడ
సైమ. ౩ ౧౭౮

ఉ ఎంతయు పేర్మితోఁ బరిచయించిన విద్యలు యట్లు పేదకే, దాంతరపాస్యమార్గములు నమ్మ హితాత్ముని కార్యఁ దోఁచె విక్ర ౧ ౧౯౨

పరిచరణము సం వి అ న ౧ కొలువు, సేవ ౨ చుట్టును తిరుగుట, అంతటను తిరుగుట

పరిచరము సం విణ (అ ఆ అ) చుట్టును తిరుగునది, అంతటను తిరుగునది వి అ పుం సేవ, కొలువు

పరిచరించు సం అ క్రి ౧ శుశ్రూష చేయు, సేవచేయు

వ పార్థుం డోడ్కొని చని వానికి నన్నపానాది విధులం బరిచరింప మద్రదం బంచి కన్యాపురంబు నందు నివాసంబు సేసిన
భారా ఆది ౮ ౧౮౦

క వాలు ఎయి నడచున ట్లు, బ్యాలిక నడుపడ నడుంగి భయమున నియమా, భీలుఁడగు ఎతికిఁ బవ కుల్, కేలును సేమలుకి పరిచరించుచు నుండెన్,
భార ఆది ౨ ౧౧౪

౨ ఉపాసించు, మరల పఠించు

సీ పంచాక్షరీ మంత్ర పారాయణంబును బ్రణవ మంత్రింబును బరిచరించి కాశీ ౪ ౭౨

పరిచిత సం విణ (బు స్త్రీ బు) పరిచరించు వాఁడు, సేవించు వాఁడు

పరిచరుఁడు సం వి అ పుం ౧ భృత్యుఁడు భటుడు కావలిబంటు, చుట్టును కావలి కాచు భటుఁడు

పరిచర్య సం వి అ స్త్రీ ౧ కొలువు, సేవ ౨ పూజనము, ఆరాధనము

పరిచాయకుఁడు సం విణ (అ యికా అ) పరిచయము చేయువాఁడు

పరిచాయి సం విణ (న్ నీ న్) పరిచయము చేయువాఁడు

పరిచాయ్యము సం వి అ పుం యాగీయ స్థండిల విశేషము

పరిచారకుఁడు. సం. విశే. (అ. రికా. అ.) పరిచర్య సేయువాఁడు, ఊడిగము చేయు వాఁడు, సేవకుఁడు.

పరిచారము. సం. వి. అ. పుం. ౧. కొలువు, సేవ. ౨. సంచరించుట కైన స్థలము

పరిచారి. సం. విశే. (న. ణీ. న.) పరిచారకుఁడు, సేవ చేయువాఁడు

పరిచారిక. సం. వి. ఆ. స్త్రీ. ఊడిగపుది, సేవకురాలు

పరిచారికుఁడు. సం.=పరిచారకుఁడు

పరిచారుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) భృత్యుఁడు, సేవకుఁడు

పరిచార్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పరిచర్యకుఁ దగిన వాఁడు, సేవింపఁ దగిన వాఁడు

పరిచాళిక. వి. మల్లబంధ విశేషము (శ. ర.)

వ... అర్ధభ్రమణంబున గదినేయుం బరిచాళిక చేసిన. ఉ. హరి. ౩. ౭౪

పరిచింతనము. సం. వి. అ. న. ౧. పర్యాలోచనము, బాగుగా ఆలోచించుట ౨. తలఁచుకొనుట, స్మరించుట (పరిచింతనీయము మొ. చింతనీయము మొ. వానివలె గ్రహించునది.)

పరిచిచ్చు. వి. (√ పరి) గ్రామాదినిరోధార్థమై పెట్టిన నిప్పు

క. పురిటి పొందవు లాఁచోరులు, నూరిము రూ విడిచి తొలఁగు చొచ్చిన యువిదయుం, ఒర దిచ్చిన బెదరినయది, పరిమేసిన బంద గొనుట చన దధిపతికిన్. విజ్ఞా. ప్రా. ౧౩.

పరిచితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రయోగము చేయఁబడినది. ౨. పరిచయము గలది. ౩. అభ్యసింపఁబడినది. ౪. తెలియఁబడినది. ఎఱుఁగఁబడినది.

పరిచితి. సం. వి. ఇ. స్త్రీ.=పరిచయము.

పరిచిన్వత్. సం. శత్ర. పరిచయము చేయుచున్న.

పరిచిన్వానము. సం. విశే. (అ. ఆ. అ.) పరిచయము చేయుచున్నది.

పరిచీయమానము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. అభ్యసింపఁబడుచున్నది ౨. తెలియఁబడుచున్నది, ఎఱుఁగఁబడుచున్నది ౩. ప్రయోగము చేయఁబడుచున్నది.

పరిచుంబనము. సం. వి. అ. న. అంతటను ముద్దిడుట

(పరిచుంబనీయము మొ. చుంబనీయము మొ. వానివలె గ్రహించునది.)

పరిచేత. సం. విశే. (ఋ. త్రీ. ఋ.)=పరిచాయకుఁడు

పరిచేతవ్యము. సం.=పరిచయనీయము

పరిచేయము. సం.=పరిచయనీయము

పరిచ్యుతము. సం.=చ్యుతము.

(పరిచ్యోతత్ మొ. చ్యోతత్ మొ. వానివలె గ్రహించునది)

పరిచ్యుతి. సం.=చ్యుతి

పరిచ్ఛత్తు. సం. వి. ద. స్త్రీ.=పరిచ్ఛదము.

పరిచ్ఛదము. సం. వి. అ. పుం. ౧. ఆచ్ఛాదనము, కప్పు. ౨. బట్ట, వస్త్రము ౩. పరిజనము, పరివారము ౪. ఉపకరణము, సాధనసామగ్రి (ఛత్రచామరాది, రథ గజ తురగ పదాతాది.)

పరిచ్ఛన్నము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. కప్పఁబడినది. ౨. దాఁచఁబడినది. ౩. సంవృతము, చుట్టుకొనఁబడినది

పరిచ్ఛిత్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ఛేదించుట. ౨. వేఱుపఱుచుట. ౩. (గుణదోషములను) వివేచించుట. ౪. అవధారణము, నిశ్చయము. ౫. అవధి, హద్దు. ౬. కొలత, పరిమాణము.

**పరిచ్ఛిన్నము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. భేదింపఁబడినది. ౨. అవధారితము, నిశ్చయింపఁబడినది, నిర్వచింపఁబడినది. ౩. వేఱ యిడఁబడినది, కొలఁది పెట్టఁబడినది

**పరిచ్ఛేదకము.** సం. విశే. (అ. దికా. అ) పరిచ్ఛేదము చేయునది. వి. అ. పుం. పరిచ్ఛేదము

**పరిచ్ఛేదనము.** సం. వి. అ. న. ౧. భేదించుట ౨. విభజించుట. ౩ వివేచించుట. ౪ నిశ్చయించుట ౫ గ్రంథభాగము

**పరిచ్ఛేదము.** సం. వి. అ. పుం. ౧. భేదించుట ౨. వేఱుపఱచుట. ౩ (గుణదోషముల) వివేచించుట ౪ అవధారణము, నిశ్చయము, నిర్ధారణము. ౫. గ్రంథభాగము (సంధిపరిచ్ఛేదము, కావ్యపరిచ్ఛేదము వెం) ౬. అవధి, సీమ, మేర ౭ పరిమాణము, కొలఁది

**పరిచ్ఛేదించు.** సం. స. క్రి. భాగించు

వ. మన్వంతరకల్ప మహాకల్పాదిభేదభిన్నం బైన పదార్థంబులం బరిచ్ఛేదించుకాలంబు
కాశీ. ౨. ౯౭

వ. .లోపరసాభరితాకుంచిత భ్రూలతార క్తనయనాంబుజ తాధర యగుచు గిరినందన పరిచ్ఛేదించి.
కు. సం. ౬. ౬౫.

**పరిచ్ఛేద్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. అంతటను భేదింపఁదగినది ౨. అవధార్యము, నిశ్చయింపఁదగినది. ౩. పరిమేయము, కొలఁది పెట్టఁదగినది (పరిచ్ఛేదనీయము, పరిచ్ఛేత్త వెం. భేదనీయము, భేత్త వెం. వానివలె గ్రహించునది.)

**పరిజనము.** సం. వి. అ. పుం. ౧. పరివారము, బలఁగము; చెలికత్తెలు లోనగు జనము. ౨. భృత్యుఁడు, సేవకుఁడు.

**పరిజయ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) అంతటను జయించుటకు శక్యమైనది (దేశాది)

**పరిజల్పితము.** సం. వి. అ. న. ప్రభువుయొక్క నిర్దయత్వశాఠ్యాదుల నుపపాదించు మూలమునఁ దన సేవ్యరితనమును వ్యక్తీకరించుట. ఇది దశాంగములు గల చిత్రజల్పములలో రెండవ జల్పనము

శ్లో॥ ప్రభోర్నిర్దయతా శాఠ్యచాపలా ద్యుపపాదనాత్ స్వవిచక్షణతా వ్యక్తిర్భంగ్యా స్యాత్పరిజల్పితమ్. ఉజ్జ్వలమణి

**పరిజేయము.** సం. విశే. (అ. ఆ. అ.) జయింపఁదగినది (ఇంద్రియాది)

**పరిజ్ఞ.** సం. వి. అ. స్త్రీ. = పరిజ్ఞానము

**పరిజ్ఞప్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పూర్ణజ్ఞానము. ౨. పూర్ణస్మృతి

**పరిజ్ఞానము.** సం. వి. అ. న. పూర్ణజ్ఞానము, నిండు తెలివి

**పరిజ్ఞేయము.** సం. విశే. (అ. ఆ. అ.) చక్కఁగా గ్రహింపఁదగినది, తెలిసికొనఁదగినది.

**పరిజ్మఁడు.** సం. వి. న్. పుం. ౧. చంద్రుఁడు ౨. అగ్ని ౩. వాయువు. (వే. ని.)

**పరిడీనము.** సం. వి. అ. న. వలయాకారముగా తిరుగుచు ఎగురుట. (ఇట్లే. పరిడీనకము)

**పరిభవము.** వి. (సం. ప్రథిమా. క. పరిటవ, పరుటవ = విస్తృతి) అతిశయము, విశేషము (శ. ర.)

ఆధిక్యము, గొప్పతనము.

(వ్యవ) స్వాములవారు పరిభవముతో వేంచేసి యున్నారు.

క. దొర కట్టున మారు పెట్టిదొ, యరు దావా విడుదలున్న హావణికలు లుపా, పరిభవము నింద్రభోగము దొరకెను దమ కననిజారు కుండి కెూరరుళ్. విజ. వి. ౩. ౧౬౯.

పరిణమనము. సం. వి. అ. న. పరిణామము, పరిణమించుట

పరిణమించు. సం. అ. క్రి. ౧. మాఱు, వికారము నొందు.

సీ. మంజుల మంజరీ మహిత సౌభాగ్యంబు పరివృత్తికుచవృత్తిఁ బరిణమింప
మనుచ. ౩. ౯౩.

వ. పురుషునిం జెంది పురుషునియందు రేతోరూపంబునం బరిణమించి యోషిత్కుక్షిం బడి యందు గర్భంబై పాదలి క్రమ్మఱ జీవత్వంబునం జన్మించు.
కవిక. ౫ ౧౦౦.

౨. లయించు, లీనమగు.

వ...ఉత్క్రాంతిరూపంబైన మరణ దశయందు ప్రాణంబులు దనయందుఁ దాను భూతతన్మాత్రలయందుఁ దన్మాత్రంబులు పరమాత్మయందును బరిణమింప..
కవిక ౫ ౧౦౦

ఆ. క్రి. స. క్రి. సంతోషించు

వ. అనిన నచ్చాతుర్యకిం బరిణమించి ధరణీరమణుం డారీతి రత్నమాలిక యతని యంతరంగిడి
ద్వా ౪ ౨౨౨

సీ. పరిణమించిరి ధరామరపురంధ్రీ హస్తఘటితచేలాంచల గ్రంథికలన మనుచ. ౫ ౯౫

ఆ. కపటమునుల కెంత కాలంబునకునైన, సంతసింప జేసు జలజగర్భు, చిరతపస్సమాధిఁ జెంది విసర్గేచ్ఛ, మెలఁగునిప్పుఁ బరిణమింతుఁగాని.
భాగ. ౨. ౨౪౨.

స. క్రి. సంతోషపెట్టు, అలరించు

ఉ...అవంతికాయతుఁ, నిష్క్రమింపఁ బరిణమించి యుత్సుకత నొందె... ద్వా. ౯ ౩౭
పరిణమత్, పరిణామ్యము, మొ. నమత్, శాస్త్ర.

పరిణయనము. సం. వి. అ. న. వివాహము, పెండ్లి

పరిణయము. సం. వి. అ. పుం. వివాహము, పెండ్లి.

పరిణయించు. సం. స. క్రి. వివాహమగు, పెండ్లాడు

వ. నీ సహోదరికిం బుట్టిన నీలకేశుండు నీసుతం బరిణయించి యుప్పాతాళలంకారాజ్యంబు నకుఁ బట్టభద్రుండై పెగడం గలవాఁడు
మై. ౨. ౧౩౯

సీ. ఖచర వల్లభుఁ డొక కనకవతీసంజ్ఞఁ బరగెడు కన్యకఁ బరిణయించి, ప్రీతి సంధిల్ల జీమూతవాహుం దనఁదగునట్టు పుత్రరత్నంబుఁ బడసె
ద్వా. ౫ ౯౧.

పరిణాహనము. సం. వి. అ. న. చుట్టును కట్టుట

పరిణామకము. సం. విణ. (అ. మి. కా. అ.) మార్పు కలిగించునది, పరిణామమును కలిగించునది

పరిణామదర్శి. సం. విణ. (పు. నీ. న.) ఏకార్యము చేయఁగా పెట్టి ఫలము గలుగునో కనుఁగొనువాఁడు, దూరదర్శి, కార్యపర్యవసానము ఎఱుఁగువాఁడు

పరిణామదృష్టి. సం. వి. ఇ. స్త్రీ. పర్యవసానమెఱుఁగుట

పరిణామపథ్యము. సం. విణ. (అ. ఆ. అ.) పర్యవసానమందు హితముగా నుండునది చివఱకు మేలు చేయునది

పరిణామము. సం. వి. అ. పుం. ౧. మాఱుపాటు, మాఱురూపు, వికారము. ౨. జీర్ణమగుట, అఱుగుట. ౩. ఫలితము, పర్యవసానము. ౪. పరిపాకము, పరువు. ౫. తుది, ముగియుట. ౬. ముదిమి, వార్ధకము. ౭. ఒకయర్థాలంకారము.

క. ధరిలో నుపమేయమునను, నరుదుగ నాతో
పమ్యమాణ మగునుపమానం, బగుయు బ్రకృతో
పరూాగా, కరముగ బరిణామ మర్యోగ
గజు మె ట్లన్నక.

క నైలింప సతుల కౌఁగిటఁ, దేలుట కై బిబిక
సేఁగు దృప్తారులకుక, నీలాలనిచ్చ వారొను,
నీలాలిక హేతి రూబ నృప నగసింహ

నరస ౫ ౫౦ ౫౧

౫. అడ్డముగా విసరఁబడిన యేనుఁగు కొమ్ము
దెబ్బ. (క. ౯)

పరిణామముఖము. సం. విణ. (అ ఆ అ.) పలో న్ముఖము, ఫలింప సిద్ధముగా నున్నది.

పరిణామశూల. సం వి అ న ఆహారము జీర్ణించునపుడు కలుగు మిక్కుటమైన నొప్పి, శూలరోగభేదము

పరిణామశూలము. సం = పరిణామశూల

పరిణామి. సం విణ, (న్ నీ న్) పరిణామము గలది, వికారము నొందునది

పరిణామించు. సం స క్రి పరిపక్వము చేయు, విరక్తము చేయు

ద్వి. సేమించి మదిఁ బరిణామించుకొనినఁ, గామించునే రొమ్మదల్ దా మించుఁగాక.

పండితా. పురా. ౧౩౦ పా.

పరిణాయకుఁడు. సం విణ (అ. యికా అ) ౧. నడపువాఁడు, నాయకుఁడు ౨. పెండ్లాడు వాఁడు వి. అ. పుం. భర్త, పెనిమిటి

పరిణాయము. సం. వి. అ. పుం. సారెలయొక్క సవ్యాపసవ్యప్రసారణము, సొగటాలుకచ్చుట.

పరిణాహము. సం. వి. అ. పు. వైశాల్యము

పరిణాహి. సం. విణ. (న్. నీ. న్.) విశాలమైనది, పెద్దది.

పరిణింస. సం వి ఆ స్త్రీ. ౧ ముద్దిడుట. ౨. చవిచూచుట.

పరిణింసకము. సం. విణ. (అ. సికా. అ.) ౧. ముద్దిడునది, చుంబించునది. ౨ చవిచూచునది.

పరిణిష్ఠ. సం వి ఆ. స్త్రీ. ౧. పూర్ణకౌశల్యము, నిండు నేర్పు ౨. నిష్ఠ, స్థితి. ౩. పర్యవసానము, అంతము. ౪ పూర్ణమైన ఆసక్తి ౫ పూర్ణసిద్ధి, పూర్తిగా నెఱవేఱుట.

పరిణిష్ఠితము. సం. విణ. (అ.ఆ.అ.) ౧. సిద్ధము, పూర్తిగా నెఱవేఱినది. ౨ నేర్పుకలది, సమర్థము. ౩ అత్యంతాసక్తి కలది. ౪. నిశ్చయింపఁబడినది.

పరిణిష్ఠుఁడు. సం విణ. (అ ఆ అ.) ౧ నేర్పరి, కుశలుఁడు; సమర్థుఁడు ౨ అత్యంతాసక్తి కలవాఁడు, ఆస్థ కలవాఁడు ౩ నిష్ఠుఁడు, ఉన్నవాఁడు.

పరిణీతుఁడు. సం విణ (అ. ఆ అ) పెండ్లాడిన వాఁడు

పరిణేత. సం. విణ. (ఋ. త్రి. ఋ) వి. ఋ. పుం = పరిణాయకుఁడు.

పరిణేయుఁడు. సం విణ (అ ఆ.అ.) ౧. నడపఁదగినవాఁడు. ౨ పెండ్లాడఁదగినవాఁడు.

పరితపించు. సం. స. క్రి. ౧. సంతాపము నొందు, క్రాఁగు. ౨. దుఃఖించు, బాధపడు.

గీ. పలికిరో పెట్టె యుఁక నేల పరితపింప, గిరి
జతోఁ గూడి శివుఁ డీడఁ గ్రీడసేయ,
వచ్చినాఁ డింకలో నిండఁ జొచ్చుపురుషుఁ,
డింతి యాఁగాక యని శాప మిచ్చినాఁడు.

భా. రా. కి. ౪౨౫. (పరితాపకుఁడు. పెం. తాపకుఁడు. పెం. వానివలె గ్రహింపఁదగినది.

**పరితప్తము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కాల్పఁబడినది; కాఁగింపఁబడినది, వేఁడిమి కలిగింపఁబడినది. ౨. బాధింపఁబడినది, తపింపఁజేయఁబడినది.

**పరితప్తి.** సం. వి. ఇ. స్త్రీ. పరితాపము

**పరితము.** వి. (సం. పరభృతము) కోయిల, పికము.

సీ. వినఁ గూడ మదనదేవుపైఁ జాటలువాడు
  లేఁజాయంపుఁ బరితములను
   యయా. ౪. ౧౧

**పరితర్కణము.** సం. వి. అ. న. బాగుగా ఆలోచించుట, బాగుగా ఊహించుట

**పరితర్పణము.** సం. వి. అ. న. ౧. తృప్తిపడుట ౨. తృప్తిపఱచుట. (పరితర్పకుఁడు పుం. తర్పకుఁడు పుం. వానివలె గ్రహించునది)

**పరితళించే.** అ. క్రి. విచారించు, ఆలోచించు.

సీ. పంచాంగశుద్ధిగాఁ బరితళించెను భృంగి మతి
  వాడు కొండేనిఁ బ్రతిదినంబు భీమ.
  3 ౧౩౭ (చి. ని. పా. పరితపించు
  మద్రి. పా)

**పరి (రీ) తాపము.** సం. వి. అ. పుం. ౧. అత్యుష్ణత, మిక్కిలి వేఁడిమి ౨. బాధ; దుఃఖము, శోకము 3. భయము ౪. కంపము, వణఁకు. ౫. నరకము

**పరితాపించే.** అ. క్రి. ౧. దుఃఖించు; బాధనొందు. ౨. సంతాపము నొందు, క్రాఁగు

వ. ఇవ్విధంబున మహావ్యధం బరితాపించుచున్న
  నన్ను రూక్షేక్షణంబుల నిరీక్షించు..
   కై. భా. ౪. ౨౧౧

**పరితుష్టి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. మిక్కిలి తృప్తి, తనివి. ౨. మిక్కిలి సంతోషము.

**పరితుష్టుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి తుష్టినొందినవాఁడు, మిక్కిలి తృప్తుఁడు. ౨. మిక్కిలి సంతోషించినవాఁడు.

**పరితృప్తి.** సం. వి. ఇ. స్త్రీ. మిక్కిలి తృప్తి

**పరితృప్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మిగుల తృప్తి నొందినవాఁడు

**పరితోషణము.** సం. విశే. (అ. ఆ. అ.) తృప్తి పఱచునది, సంతోషపెట్టునది వి. అ. న. ౧. తృప్తి ౨. సంతోషము

**పరితోషము.** సం. వి. అ. పుం. ౧. మిక్కిలి తృప్తి, తనివి ౨. మిక్కిలి సంతోషము.

**పరితోషి.** సం. విశే. (న. తి. న.) ౧. తృప్తి పొందువాఁడు. ౨. సంతోషించువాఁడు.

**పరితోషించే.** సం. అ. క్రి. సంతసించు, మిక్కిలి సంతోష మొందు.

గీ... పూజార్హవస్తువు లపుడు దెచ్చి, వంటలకుఁ
  గొండపాడువుగా నైచుటయును.

మ. పరితోషించి శివార్చనాకుతుకసంబద్ధాత్ముఁ
  డై తెచి..  ఉ. గా. 3. ౨౦౨.

**పరిత్యజి (జియి)ంచే.** సం. స. క్రి. విడుచు

వ. మంకి యివ్విధంబునం గోడెలు నచ్చినం బుట్టిన నిర్వేదంబున సకల కామంబులం బరిత్యజించి దేవసమూం డై యుండె.
   భార. శాం. ౪. ౫౪

మ. అజవత్సుం డిది పోలఁ బోల దని కార్యాకార్య నివృత్తికిన్, నిజ మాహాంప నశక్తుఁడై యపుడు వానిం జంప నొంపం బరిత్యజింపక మది వోడి ... భోజ రా. ౫. ౧౪౦. (పరిత్యజక్, పరిత్యాజకుఁడు పుం. త్యజక్, త్యాజకుఁడు పుం. వానివలె గ్రహించునది).

పరిత్రస్తము. సం. విణ (అ ఆ అ) మిక్కిలి భయపడినది, మిక్కిలి వెఱచినది.
(పరిత్రాసకుఁడు వెం. త్రాసకుఁడు వెం. వాని వలె గ్రహించునది)

పరిత్రాణము. సం. విణ (అ ఆ అ) ౧. రక్షించునది ౨ పరిత్రాతము, రక్షింపఁబడినది (పరిత్రాత,పరిత్రాయమాణము. వెం త్రాత, త్రాయమాణము. వెం వానివలె గ్రహించునది) వి అ. న. రక్షించుట

పరిత్రాణి. సం. వి ఈ. స్త్రీ త్రాయంతి,-కలుగానుఁగు[?].

పరిదరము. సం. వి అ పుం పంటియిగుళ్లలో పుట్టురోగము (దీనివలన ఇగుళ్లనుండి నెత్తురు కాఱును.)

పరిదహనము. సం వి అ న పూర్తిగా కాల్చుట, అంతటను కాల్చుట.

పరిదానము. సం. వి. అ. న ౧ వినిమయము, ప్రతిదానము, ఒకవస్తువు ఇచ్చి మఱియొకవస్తువు పుచ్చుకొనుట. ౨ దానము, ఇచ్చుట

పరిదాయి. సం. విణ (పు నీ పు.) ౧ ఇచ్చువాఁడు ౨ పెండ్లికొడుక్కు యన్నగలవానికి కూఁతు నిచ్చువాఁడు. ౩. వినిమయము చేయువాఁడు
(పరిదాత వెం. దాత వెం వాని వలె గ్రహించునది)

పరిదాహము. సం వి. అ. పుం ౧. కాల్చుట ౨. తాపము, బాధ

పరిది. వి (సం. పరిధిః) సూర్య చంద్రుల పరివేషము.
సీ. పరివేషబాహుంబు భాసిల్లుచుండును గుడియునఁ బరిది శా గుడుసు గాఁగ.
అం. ఖా. ౧. ౭౨.

పరిదిష్టము. సం విణ. (అ. ఆ అ.) తెలియఁబడినది; చూపఁబడినది.

పరిదీప్తము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి దీప్తమైనది

పరిదృఢము. సం విణ. (అ ఆ. అ) మిక్కిలి దృఢమైనది

పరిదేవకుఁడు. సం విణ (అ వి కా ఆ.) ౧ విలపించువాఁడు ౨. పశ్చాత్తాపపడువాఁడు

పరిదేవన. సం వి ఆ స్త్రీ=పరిదేవనము.

పరిదేవనము. సం వి. అ. న ౧. విలాపము, దుఃఖముతో గూడినమాట ౨. అనుశోచనము, (చేసినపని తగని దని తెలిసిపడు) అనుతాపము, పశ్చాత్తాపము

పరిదేవము. సం వి అ పుం విలాపము, ఏడుపుతోఁ గూడిన మాట.

పరిదేవి సం విణ (పు నీ. పు) ౧ విలపించువాఁడు, ౨ పశ్చాత్తాపపడు వాఁడు

పరిదేవితము. సం. విణ (అ ఆ అ) ౧ విలపించినది ౨ పశ్చాత్తాపపడినది వి అ. న.=పరిదేవనము

పరిదృష్ట. సం. విణ (ఋ స్త్రీ. ఋ.) అంతటను చూచువాఁడు; చూచువాఁడు.

పరిద్రోణి. సం. వి. ఈ. స్త్రీ. నారికడపు పాత్తి (శ ర.)

పరిధానము. సం వి అ. న. ౧. (వస్త్రములు) ధరించుట. ౨. దోవతి, అంతరీయము, కట్టుబట్ట.

పరిధానీయము. సం. విణ (అ. ఆ. అ.)ధరింపఁదగినది, కట్టుకొనఁదగినది. వి. అ. న. కట్టుబట్ట, దోవతి.

**పరిధాయము.** సం. వి. అ పుం ౧ పరిచ్ఛేదము, భాగము. ౨. మడుగు, జలస్థానము. ౩. నితంబ ప్రదేశము, పిఱుఁదు.

**పరిధారణ.** సం. వి ఆ. స్త్రీ=పరిధారణము.

**పరిధారణము.** సం వి అ న. ౧ ధరించుట ౨. ధరించుట.

**పరిధావనము.** సం=ధావనము.

**పరిధావి.** సం విణ (శ నీ. శ.) చుట్టును పరుగిడు వాఁడు

**పరిధి.** సం. వి. ఇ. పుం ౧ ఆవరణము, చుట్టునుండు గోడ, కంచె మొ ౨ పరిధి, సూర్యాగ్ని పరివేషము, గుడి ౩ కాంతిమండలము, వలయాకారముగఁ జుట్టును క్రమ్మియున్న కాంతి ౪ చుట్టువాఱిన మేర, వృత్తక్షేత్రముయొక్క చుట్టుకొలత ౫. బండి కంటి కదకమ్మి ౬. యజ్ఞాగ్నికి చుట్టునువైచు మోదుగు మొ. వానికొమ్మ ౭. యజ్ఞమునందు పశుబంధనార్థము నాఁటిన పలాశాదిశాఖ

**పరిధిస్థుఁడు.** సం వి అ పుం ౧ పరిచారకుఁడు. ౨. యుద్ధాదులందు గడికి చుట్టును కాపుగా నుండు సైన్యాది; చుట్టుకొని కాచియుండు భటుఁడు; సేనచుట్టును కాచువాఁడు; చుట్టును వలయాకారముగ నిలుపఁబడిన కావలి బంటుల సమూహము

**పరిధూపితము.** సం. విణ (అ ఆ. అ) సుగంధద్రవ్యముతో పొగవైవఁబడినది

**పరిధూమనము.** సం వి అ న (వైద్యక) దప్పి గొన్నవానికిఁ గలుగు నొక విధ మగు శ్రేఁపు

**పరిధూయమానము.** సం=పరిధూమనము.

**పరిధూసరము.** సం. విణ. (అ. ఆ అ) మిక్కిలి బూడిదవన్నె గలది.

**పరిధృతము.** సం=ధృతము.

**పరిధేయము.** సం విణ (అ. ఆ. అ.) ధరింపఁదగినది, కట్టఁదగినది. వి. అ న. దోవతి, కట్టుబట్ట.

**పరిధ్వంసనము.** సం=ధ్వంసనము. (పరిధ్వంసితము మొ. ధ్వంసితము మొ. వానివలె గ్రహించునది.)

**పరినందనము.** సం విణ. (అ ఆ అ) సంతోషపెట్టఁబడినది వి. అ. న. సంతోషపెట్టుట.

**పరినిర్వపణము.** సం వి. అ న పంచియిచ్చుట, కేలుకేలుగా ఇచ్చుట

**పరినిర్వాణము.** సం. విణ (అ ఆ అ) పూర్తిగా ఆఱినది, పూర్తిగా నశించినది వి అ. న ౧ ఆత్యంతిక నాశము, పూర్తిగా నశించుట ౨ నిర్వాణము, ముక్తి

**పరినిర్విణ్ణుఁడు.** సం=నిర్విణ్ణుఁడు

**పరినిర్వృతి.** సం వి ఇ స్త్రీ. పూర్ణసుఖము, మోక్షము.

**పరినిర్వృత్తి.** సం వి. ఇ స్త్రీ. మోక్షము.

**పరినిషేవణము.** సం=నిషేవణము

**పరినిష్ఠ.** సం=పరిణిష్ఠ.

**పరినిష్ఠితము.** సం=పరిణిష్ఠితము.

**పరినిష్ఠుఁడు.** సం=పరిణిష్ఠుఁడు.

**పరిన్యాసము.** సం=న్యాసము. (పరిన్యస్తము మొ. న్యస్తము మొ. వానివలె గ్రహించునది.)

**పరిపంథకుఁడు.** సం. వి. అ పుం. పరిపంథి, శత్రువు.

**పరిపంథి.** సం విణ (శ. నీ. శ.) అడ్డగించువాఁడు, నిరోధించువాఁడు. వి. శ. పుం. ౧. శత్రువు. ౨. తెరువాటుదొంగ, దారి కొట్టు దొంగ.

**పరిపంథికుఁడు.** సం॥ పరిపంథకుఁడు.

**పరిపంథుఁడు.** సం వి అ. పుం. (త్రోవ కాచి యుండువాఁడు. త్రోవను విడిచి ప్రక్కల నుండువాఁడు.) ౧. శత్రువు, పగవాఁడు ౨ దారికొట్టు దొంగ.

**పరిపక్వము.** సం. విణ. (అ. ఆ. అ) పరిపాకము నొందినది. (చూ పరిపాకము)

**పరిపణనము.** సం వి అ న ౧ ప్రతిజ్ఞసేయుట ౨. పందెము మొ ఒడ్డుట

**పరిపణము.** సం వి. అ. పుం న మూలధనము, సంచి మొదలు

**పరిపణితము.** సం విణ. (అ. ఆ అ) ౧. ప్రతిజ్ఞాతము, ప్రతిన చేయఁబడినది

శ్లో సతతమనభిభాషణం మయా తే పరిపణితం భవతీమనానయంత్యా, త్వయి కదితి విరోధ నిశ్చితాయాం భవతి భవత్యనుమ్యాజ్జనస్స కామః॥ శకు ౩ ౯

౨. ఒడ్డఁబడినది (పందెము మొ.)

**పరిపతనము.** సం. వి. అ న. ౧ చుట్టును పడుట; అంతటను పడుట; పడుట ౨. చుట్టును తిరుగుట, చుట్టును సంచరించుట. (పరిపతితము మొ. పతితము మొ వానివలె గ్రహించునది

**పరిపత్తు.** సం వి త్ పుం. పంకము, బురద (వై. ని.)

**పరివత్రము.** సం. వి. అ. న. భోజనము, తినుట. (వై. ని.)

**పరిపరి.** విణ (√ పరియు. క పరిపరి) ౧ అనేకము; వివిధము.

చ వాహకులే, పరిపరిలాగులం గుఱియఁ బట్టుచు రా వలన త్రియుంబులున్, దురగము లేఁగుదెంచె... వై. భా. ౨. ౧౫.

ఉ. మురభిత్ తులసీ పరిమళ, పరిమిళితములుగ నొనర్చి పరిపరిగతులం, గర మురుముగ నతి చతురతఁ, గరతలకలిత మెఱయ మాలికలు గట్టు తగన్. విప్ర. ౨. 30

క ఖరనిహతి నొంటు దుష్కృత, భరములఁ గీకటుల తలలు పటపట పగులన్, బరిపరి గతులం దురగముఁ, బఱపెదు నెఱరాకు నిన్ను భక్తిఁ దలంతున్ చంద్రా॥ ౧. ౩౬.

సీ పరిపరి ధూపంబుల నర, వీరుల తెరల రత్న దీపవితతుల మార్గా, స్తరణములఁ బొలుచు రాత్రులఁ, బరమబుధులు నృపులు వరుస బంతులు పొఁగన్ వై భా ౪ ౨౦౧

౨ మిగుల చెడినది; క్షుబ్ధము, కలత నొందినది. (చూ. పరిపరియగు)

క్రి విణ. చిందఱవందఱ, ముక్కలు ముక్కలుగ

గీ పరిపరి యనంగఁ జిందఱవందఱ యన, నలరుచుండును గణకోర్థి మగుచు...
ఆం. భా ౩ ౬. ౪

జ పరిపరియగు

**పరిపరియగు.** అ క్రి (√ పరిపరి) క్షుబ్ధమగు, కలఁగు

క గిరిజాకరంబు సోఁకినఁ బరమేశుని చిత్తమెల్లఁ బరిపరి యయ్యెన్ హీర ౨ ౧౦౦

**పరిపవనము.** సం వి అ పుం ౧. పవిత్రము చేయుట, శుద్ధము చేయుట. ౨. ధాన్యమును చెరుగుట ౩ చెరుగు చేట

**పరి(రీ)పాకము.** సం వి. అ. పుం. ౧ పూర్ణిపాకము, పూర్తిగా పక్వమగుట. ౨. పూర్తిగా జీర్ణమగుట, పూర్తిగా అఱుగుట, (భుక్తాన్న పరిపాకము మొ.) 3. పరిణామము, పర్యవసానము. ౪. బుద్ధి, మనస్సు. మొ. వాని పరిపూర్ణత; నైపుణ్యము. ౫. పరువము, ఫలోన్ముఖత్వము (పండుటకు సిద్ధముగా నుండుట; ఫలము నిచ్చుటకు సిద్ధముగా నుండుట.)

పరిపాటిని. సం. వి. ఈ. స్త్రీ. త్రివృత. తెగడకి

పరిపాటలము. సం. విశే. (అ. ఆ అ) అంత టను పాటలవర్ణము కలిగి, మిక్కిలి పాటల వర్ణము కలది. (చూ పాటలము)

పరిపాటి. సం. వి. ఇ. ఈ స్త్రీ ౧. అనుక్రమము, అనుపూర్వి

క. పురగురుడుతును శుక్రుండును, బరిపాటిగి దండనీతిఁ బలికిరి.

భార శాం. ౧ ౧౦౬.

ద్వి. పవిపతి రొంటిడును బరలోకవిధులు, తినయు లానర్చురు తల్లిదండ్రులకుఁ, బరిపాటి దప్పించి పరలోకవిధులు, పరలించి విధి నీవు మఱచేయఁ బనిచె. రం. రా అయో ౧౨౬. పా ౨౨. పం

౨. పద్ధతి, విధము

గీ. వేదపారంబు సత్యంబు వినఁడు సత్య, సార మూర్తి దమము దమపార మనఘు, లార పొత్తు మీపరిపాటి గారవమున, సాదరించు నమ్మంటాల కొండు మూర్తి.

భార, శాం. ౫ ౧౪౮.

సీ. మునిశ్రేష్ఠ లారొమ్ముయొత్తు పొవి చప్పుడు గాని పరిపాటిఁ బవనంబు బట్టి నడచి.

కాశీ. ౪. ౧౨౧

3. సామాన్యము, సాధారణము.

సీ ... కూర్చుఁబో పరిపాటిగొంపలోఁ గూల్పక యాదుర్గమునఁ ద్రోయనేల యనుచు

శుక 3 ౫౭౭

ద్వి. జనమనోహరుఁ డైన సారంగధరుఁడు, మను శేశ! పరిపాటి మనుజుండు గాఁడు.

ద్వి. తి. పా. ౪౫ పా.

(తెనుఁగునందే యీ యర్థము కనఁబడుచున్నది)

పరిపాఠము. సం. వి. అ. పుం. అంతయుఁ జెప్పుట, సవిస్తరముగాఁ జెప్పుట.

పరిపాలకుఁడు. సం విశే (అ. లిశా. అ.) చక్కఁగా కాపాడువాఁడు, చక్కఁగా పాలించు వాఁడు (ప్రభువు వెం)

పరిపాలన. సం వి. ఆ. స్త్రీ = పరిపాలనము

పరిపాలనము. సం. వి. అ న ౧ చక్కఁగా రక్షించుట, చక్కఁగా కాపాడుట. ౨. పోష ణము, పోషించుట.

పరిపాలించు. సం స క్రి రక్షించు, ఏలు, కాపాడు, సత్యవ్రతాదులు రక్షించు, ప్రతి జ్ఞాదులు నిలఁబెట్టుకొను

వ తన సత్యవ్రతంబు పరిపాలింపం దలంచి...

మార్క ౧ ౩౯

పరిపాలితము. సం విశే (అ ఆ. అ) చక్కఁగా పాలింపఁబడినది.

(పరిపాల్యుఁడు వెం పాల్యుఁడు వెం వాని వలె గ్రహించునది)

పరిపిష్టకము సం వి అ. న. సీసము

పరిపీడ. సం = పీడ

పరిపీడన. సం వి ఆ స్త్రీ = పరిపీడనము

పరిపీడనము. సం. వి. అ. న ౧ పిసుకుట ౨ పిండుట, పీడుచుట. 3 బాధించుట.

(పరిపీడితము వెం పీడితము వెం. వానివలె గ్రహించునది.)

పరిపుటనము. సం. వి అ న. భేదనము, వేఱు పఱచుట. ౨ (వాచ) సంపుటీకరణము; కూర్చుట, కలుపుట.

పరిపూజ. సం. వి. అ. స్త్రీ = మిక్కిలి పూజించుట, మిక్కిలి గౌరవించుట.

పరిపూజన. సం. వి. అ. స్త్రీ = పరిపూజనము.

పరిపూజనము. సం. వి. అ న. మిక్కిలి పూజించుట, మిక్కిలి గౌరవించుట.
(పరిపూజితము వి. పూజితము వి. వాని వలె గ్రహించునది)

పరిపూతము. సం విణ. (అ. ఆ. అ.) ౧ అత్యంత శుద్ధము, మిక్కిలి పవిత్ర మైనది ౨ చెరుగఁబడినది (ధాన్యాది)

పరిపూరణము. సం. వి అ న చక్కఁగా నిండించుట, పూర్ణ మైనదిగాఁ జేయుట

పరిపూర్ణత. సం వి అ స్త్రీ ఆభోగము, సంవృద్ధి, నిండు.

పరిపూర్ణము. సం. విణ. (అ ఆ. అ) పూర్తిగా నిండినది, పూర్ణ మైనది, సమృద్ధము, సమాప్తము (పరిపూరకము వి. పూర్ణకము వి. వాని వలె గ్రహించునది.)

పరిపూర్తి. సం వి ఇ స్త్రీ పూర్తిగా నిండుట ౨. సంపూర్తి సమృద్ధి; సమాప్తి

పరిపృచ్ఛ. సం. వి. అ స్త్రీ పరిప్రశ్నము, చక్కఁగా అడుగుట, చక్కఁగాఁ బ్రశ్నించుట

పరిపేలము. సం వి అ న. కైవర్తీముస్తకము, కైవడిముస్తె

పరిపేలవము. సం. విణ (అ. ఆ. అ) మిక్కిలి పేలవ మైనది. (చూ. పేలవము.) వి అ. న. కైవర్తీముస్తకము, కైవడిముస్తె

పరిపోటనము. సం. వి అ న. ఛేదనము, ఛేదించుట

పరిపోటము. సం. వి. అ పుం. ఒకానొక కర్ణపాళీరోగము, చెవితమ్మివీఁద బయలుదేఱు రోగవిశేషము.

పరిపోషించు. సం. స. క్రి. చక్కఁగా పోషించు, పూర్తిగా పోషించు.

పరిపోషితుఁడు. సం విణ (అ. ఆ అ) చక్కఁగా పోషింపఁబడినవాఁడు, పూర్తిగా పోషింపఁబడినవాఁడు. (పరిపోషణీయము వి. పోషణీయము వి. వానివలె గ్రహించునది)

పరిప్రశ్నము. సం. వి అ పుం. చక్కఁగా అడుగుట, బాగుగా ప్రశ్నించుట (పరిపృష్టము. వి. వానివలె గ్రహించునది.)

పరిప్రాప్తి. సం. వి స్త్రీ. చక్కఁగా పొందుట, పూర్తిగా పొందుట

పరిప్రేషణము. సం. వి అ. న పూర్తిగా పంపుట, పంపివేయుట.

పరిప్రేష్యుఁడు. సం. విణ (అ. ఆ అ.) పంపఁదగినవాఁడు వి అ. పుం భృత్యుఁడు, సేవకుఁడు

పరిప్లవము. సం విణ (అ ఆ అ) ౧. చంచలము, కదలునది ౨. తేలునది వి. అ పుం ౧. పొంగిపాఱుట ౨. విప్లవము. ౩. జలాదుల మీఁదుగా దాటుట. ర. పీరుతోడి. (ర. ర)

పరిప్లవించు. సం. అ క్రి గంతులువైచు.
ఉ...ఇంక వారలన్, మిక్కిలి శక్తి మీఱ దిగ్ర్మింగెద నంచుఁ బరిప్లవింపఁగన్.
దశా. ౨. ౨౦౨.

పరిప్లావి. సం. వి. న్ పుం హంసము, అంచ. (వై. ని.)

పరిప్లుతము. సం విణ (అ. ఆ అ.) ౧. ఱెల్లువ పొంగి పాఱినది.
౨. (జలాదులచే) తడుపఁబడినది. వి అ న ౧. గంతు, దాఁటు

పరిప్లుత. సం వి. అ. స్త్రీ. ౧. మదిర, సారాయము ౨. మైథునవేదనాయుక్త మగు ఆఁడుగుఱ్ఱి.

**పరిప్లుష్టము.** సం విశే (అ ఆ అ) దగ్ధము, కాల్పఁబడినది

**పరిబ(వ)ర్హణము.** సం వి అ న ౧. పరిజనము ౨ వేషము, వస్త్రాద్యలంకరణము ౩. వృద్ధి, పెనుపు, ౪ పూజనము

**పరిబర్హము.** సం వి అ పుం ౧ శ్వేతచ్ఛత్రాది రాజయోగ్య వస్తువు ౨ పరివారము. ౩ ఉపకరణములు, సామగ్రి ౪ ధనము ౫ కుటుంబ (పిల్లవాండ్లు)

**పరిబృ (వృ)ంహణము.** సం వి అ న పెనుపు, అభివృద్ధి

**పరిబృ (వృ)ంహితము** సం విశే (అ ఆ అ.) ౧. వర్ధితము, పెంపఁబడినది ౨ చేకొనఁబడినది, కూడఁబడినది

వి అ న ఏనుఁగు గీఁక

**పరిభంగము.** సం వి అ పుం తునుకలుగా విఱుచుట, తుమురుసేయుట.

**పరిభజించు.** సం స క్రి సేవించు

సీ స్థిరతరం బగు తు`ర్య, సింహాసనం బొప్పఁ బ్రహ్మాది మంత్రులు పరిభజింప

శుకచరిత్రము ౧. ౭౦

**పరిభర్త్సనము.** సం వి అ న బెదరించుట, అదలుపు

**పరిభవపడు** మి అ క్రి (పరిభవము + పడు) తిరస్కారము నొందు; అపజయమునొందు

క సురవరులు పెక్కుమాఱులు, పరిభవపడిరి. .

కు సం ౧౨. ౯౩౧.

**పరిభవపదము.** సం వి అ న పరిభవమునకు విషయభూతము, పరిభవమునకు అర్హమైనది ౩. పరిభవము కలిగించునట్టి స్థితి

**పరిభవము.** సం వి. అ పుం ౧ అనాదరము, తిరస్కారము. ౨. ఓటమి, అపజయము

**పరిభవి.** సం. విశే (పు సీ న) ౧ పరిభవించువాఁడు ౨. పరిభవము నొందువాఁడు

**పరిభవించు.** సం. స. క్రి. అవమానించు.

ఆ .విప్రు, రాజుఁ బరిభవింపగాదు విప్రుల కొల్వు, కల్పవృక్షసేవ కరణి యధిప

భార అను ౨ ౧౫౫..

ఉ. కేవలు శత్రునిం బరిభవించుట కీర్తికి కీర్తివిరముం, దా మదిఁ బెట్టుకోలు సుఖ తంత్రము గాదు . భార శాం ౩ ౨౨

**పరిభాళించు.** సం అ క్రి (√ పరిభల్ల్) కలహించు, జగడమాడు

౧ ఏగా ముంపటి గానకి, కేరము మై దెచ్చుకొనుచు నీ మీసలు నా, చేరువ వడిఁ బెట్టెద విటు,లాకే రేకొంగవీరుఁ డుంటె యుఁగవకో

౨ నావుడు పరిభాళించెద, వీ వుండుట రమ్మిఁగి కాదె యిటు కేటుగ నేఁ, గావించితిఁ జేరిఁ దగ,- వించుక గలిగనేని లటవట్టు లేలా. ద్వా ౩. ౨౯

౪. మగతనము సెలుపఁ బూనియుఁ, బగ యేమియు లేకపోటఁ బరిభాళింపం, దగదు.. ద్వా ౪ ౩౬

(పగ గలిగింపక - పాఠాంతరము)

**పరిభావనము.** సం వి అ న చింతనము, ఆలోచనము

**పరిభావము.** సం = పరిభవము

**పరిభావి.** సం విశే (పు. సీ న) ౧ అవమానించునది ౨ నిరాకరించునది

**పరిభావితము.** సం విశే (అ ఆ. అ) లోపల ధరింపఁబడినది, లోపలఁ జేరి పడియున్నది. ౨. వ్యాప్తము ౩ ప్రకాశింపఁబడినది ౪. చక్కఁగా భావింపఁబడినది.

**పరిభావ్యకము.** సం విశే (అ ఆ అ.) పరిభవించునది.

**పరిభాష.** సం. వి. ఆ స్త్రీ ౧ ఆలాపము, మాటలాడుట. ౨. నిందావచనము దూఱు మాట ౩. వివరణము. ౪ శాస్త్రకారులు లాఘవమునకై చేయునట్టి సంకేతవిశేషము

**పరిభాషణము.** సం. వి. అ. న ౧ సంభాషణము, మాటాడుట, ఆలాపము ౨. దూఱు మాట, నిందించుట యైన దుష్టవచనము, సదూషణాపహాసవచనము, ౩ నియమము.

**పరిభాషించు.** సం. అ. క్రి ప్రవచించు, చెప్పు

వ. అని పరిభాషించి.

భార. అను ౪ ౯౭

**పరిభాసిల్లు.** సం అ క్రి ప్రకాశించు

మ ఉద్ధతిం, బరిభాసిల్లఁ జతుర్వ్యాధుని
చమూ భద్రప్రయాణం బిలన్

కావ్యా ౩ ౧౭౬

**పరిభిన్నము.** సం. విశే. (అ ఆ అ) ౧ చక్కఁగా భేదిల్లినది, చక్కఁగా పెటిలినది, విరిసినది. ౨. వికృత మైనది

**పరిభుక్తము.** సం. విశే (అ. ఆ అ) ౧ చక్కఁగా భుజింపఁబడినది. ౨. చక్కఁగా అనుభవింపఁబడినది. ౩ పొందఁబడినది

**పరిభుగ్నము.** సం. విశే. (అ ఆ అ) మిక్కిలి వంకరైనది, చాల వంగినది.

**పరిభూతము.** సం. విశే (అ ఆ. అ) ౧ తిరస్కృతము. ౨. అనాదృతము, పాటింపఁబడనిది.

**పరిభూతి.** సం. వి. ఇ. స్త్రీ. పరిభవము.

**పరిభూషణము.** సం వి అ. పుం ఒక దేశముయొక్క సిస్తు వంతయు కట్టుటచేత పొందఁబడిన సంధి.

**పరిభోక్త.** సం విశే (ఋ స్త్రీ ఋ) ౧ చక్కఁగా తినువాఁడు; చక్కఁగా అనుభవించువాఁడు ౨. పరిపాలించువాఁడు ౩. గురుస్వభృత్తు, గురుద్రవ్యము ననుభవించువాఁడు. (వై. ని.)

**పరిభోగము.** సం వి అ పుం ౧ అనుభవము. సంభోగము.

**పరిభ్రంశనము.** సం. వి అ న. ౧. భ్రంశము. ౨. నష్టము.

**పరిభ్రంశము.** సం వి అ పుం ౧ జాఱి పడుట ౨ తప్పించుకొనుట

**పరిభ్రమణము.** సం. వి. అ న ౧ అంతట తిరుగుట ౨ చుట్టు తిరుగుట ౩ పరిధి, కైవారము, వర్తులమురొక్క చుట్టు కొలఁత.

**పరిభ్రమము.** సం వి అ పుం ౧ అంతట తిరుగుట ౨. పొరపాటు, భ్రాంతి

**పరిభ్రమి(యి)ంచు.** సం అ క్రి. సంచరించు తిరుగు

సీ ..మహావిపినభూమిఁ, బత్నితోఁ దన పరి
భ్రమియించుటయు నష్టదలఁచి శోకించి .

భార అర. ౨. ౮౭.

ఉ .అవ్విహంగాంగనయు . అమ్మహాయుద్ధ
మధ్యంబునం బరిభ్రమించుచున్నంత .

మార్క ౧౯ ౪౫.

**పరిభ్రష్టము.** సం విశే (అ ఆ అ) ౧ పరిభ్రంశము నొందినది, క్రొత్తగా పడిపోయినది ౨. తప్పించుకొన్నది ౩ కీడ్పుఱుపఁబడినది. ౪ లేనిది ౫ సన్నపేయనిది. ౬. నశించునది ౭ పోఁగొట్టుకొనఁబడినది (విల్యమ్సు)

**పరిమండలము.** సం. విశే. (అ ఆ. అ) అంతట గుండ్రనిది, వర్తులాకారము. వి అ పుం న ౧ వృత్తము, వర్తులము ౨ బంతి, చెండు ౩ గోళము. ౪ (తర్క) పారిమాండల్యము, అణుపరిమాణము.

**పరిమంథరము.** సం. విశే. (అ. ఆ అ) ౧. మిక్కిలి మెల్లనిది.

**పరిమందము.** సం విశే (అ. ఆ. అ) ౧. మిక్కిలి మెల్లనిది. ౨. మిక్కిలి బలహీనము. ౩ మిక్కిలి చిన్నది

**పరిమరము.** సం వి అ పుం. యుద్ధము

శ్లో. చిరాత్ క్షత్రస్యాస్తు ప్రలయఇవ ఘోరః పరిమరః మహావీరచరిత్ర. ౩. ౪౧,

**పరిమర్దనము.** సం వి అ. న ౧ నూఱుట. ౨. నలియఁగొట్టుట. ౩ నాశనము. ౪ గాయు పులుచుట ౫. బిగ్గనదుముట

**పరిమర్దము.** సం = పరిమర్దనము

**పరిమళము.** సం వి. అ పుం. ౧. మెదుపుట వలనను రాయిడివలనను బుట్టిన జనమనోహార మగు తావి. ౨. మిక్కిలి సంబంధము. ౩. పండిత సమూహము (వా చ)

**పరిమళించె.** సం. అ క్రి వాసించు, వ్యక్త మగు

గీ... బ్రాహ్మణుండు, పలికె నిష్పచ్చరం బయిన భావణముల, పరమ సాత్త్విక భావంబు పరిమ ళింప హార ౩ ౧౪.

**పరిమళితము.** సం. విశే. (అ. ఆ అ) పరిమ ళించునట్లు చేయఁబడినది

**పరిమాణము.** సం వి అ. న తూము లోనగు వానికొలత; ప్రస్థమానము, కొలఁది, ప్రమా ణము.

**పరిమాధి.** సం. విశే. (ఇ ని ఇ.) మిక్కిలి మథించునది, త్రచ్చునది; మిక్కిలి కలంచునది, చాల బాధించునది.

**పరిమార్గణము.** సం. వి. అ. న. ౧. అంతటను వెదకుట. ౨. అంటుట, స్పర్శము. ౩ తుడు చుట, శుద్ధము సేయుట.

**పరిమార్గము.** సం = పరిమార్గణము.

**పరిమార్చు.** స. క్రి (√ పరి). ౧. ఖండించు నశింప.

క. కరములు నాలుగు నిక్కం, బరిమార్చితి వీఁడు నీదు భక్తుల కగ్గే, నరుఁడై పొగ డొంది జరా, మరణాదిభయంబు దక్కి మను నిటమీఁదన్. భాగ. ౧౦. ఉ. ౪౪౪.

౨ చంపు, వధించు

క ఒరుఁ డర్యోధను మామక, శరాసన క్షిప్త దీప్తసాయకపంక్తిం, బరిమార్చెద...

భార విరా ౪ ౧౦౨

సీ. గురుభీష్మకర్ణసైంధవ, గురుతనయులతోడఁ గూడఁ గురుపతిబలముం, బరిమార్చునట్టి సత్వము, పురుషోత్తమా యిమ్ము కరుణ పొంపిరివోవన్

హార ౩ ౨౪; మనుచ. ౬. ౧౧౪.

**పరిమార్జనము.** సం వి అ న ౧. తుడుచుట ౨. జలగోమయాదులచే భూమ్యాదులను శుద్ధి చేయుట ౩ మధుమస్తక మనుభక్ష్య ద్రవ్యము (వాచ)

**పరిమార్జము.** సం వి. అ పుం శుద్ధిచేయుట.

**పరిమార్పించె.** స క్రి (√ పరిమార్చు) చంపించు

క ఒడలు బడల్ పడఁ గఱచినఁ, గడు నెవ్వడి నదరి కేచి కంకటి వడి న, ల్గడలు వెదకించి కానం, బడ నరపతి నిన్ను నన్నుఁ బరి మార్పించున్. కేం. పంచ. ౧. ౪౧౩.

**పరిమార్పు.** వి. (√ పరిమార్చు) హింస, చంపుట.

త్రి. త్రుంచుట చిదుముట తెగటార్చు పరి మార్చు, పొరిగొనుట పిల్కుమార్చు చంపుడు తునుముట, యణఁగఁ దగు హింస

ఆం. భా. ౨. ౨౨౪.

పరిమారు. అ. క్రి. (√పరి) ఖండితమగు; రూపుమాయు, చచ్చు మ. శౌరి మర్దింతు నెఱు, . ఇంద్రాద్యష్టదిక్పాలురకు, బరిమారు వ్యధియింతుకొనా...కు. సం ౨ ౧౭౭

పరిమితకథుఁడు. సం. విణ (అ. ఆ అ) కొలఁదిగా మాటాడువాఁడు, మితభాషి

శ్లో: తాంజానీథాః పరిమితకథాం జీవితం మే ద్వితీయకు మేఘ ౨ ౨౦.

పరిమితము. సం. విణ (అ ఆ. అ.) ౧ మిక్కిలి మిత మైనది. ౨. కొలఁది యిడఁబడినది. 3 మితి పెట్టఁబడినది. ౪ చేర్చఁబడినది. (శ ర.)

పరిమితి. సం వి ఇ. స్త్రీ. ౧. కొలత, కొలఁది ౨. మితి, మేర.

పరిమిళనము. సం. వి అ న ౧. అంటు, సంబంధము ౨. కూడిక, కలిసికొనుట

పరిమిళితము. సం విణ (అ ఆ అ.) ౧ చక్కఁగా కూర్పఁబడినది. ౨. నింపఁబడినది.

పరిముగ్ధము. సం విణ (అ ఆ. అ.) ౧ అవ్యాజ మనోహరము, స్వభావముచేత అందమైనది. ౨ వెల రైనది, మూఢము

పరిమూఢము. సం. విణ (అ ఆ. అ) మిక్కిలి మోహము నొందినది

పరిమృదితము. సం విణ (అ ఆ. అ) ౧. అడఁగఁ ద్రొక్కఁబడినది, నలఁపఁబడినది; బిట్టు పిసుకఁబడినది. ౨. కౌఁగిలింపఁబడినది 3. పూయఁబడినది.

పరిమృష్టము. సం.విణ. (అ. ఆ. అ.) ౧. కడుగఁబడినది, శుద్ధి సేయఁబడినది. ౨. తోమఁబడినది, రుద్దఁబడినది. 3. తాఁకఁబడినది. ౪. కౌఁగిలింపఁబడినది. ౫. వ్యాప్తము, పర్వినది.

పరిమేయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మితమైనది, కొలఁదిఁబాటిది. ౨. కొలఁది యిడఁదగినది 3. కొలఁది గలది.

పరిమెంగము. వి. (పరి+మెంగము) ౧. నేరాముఖము.

వ...సురవరు లతిసంభ్రమంబునం బరిమెంగంబు దప్పం గనుకని జను నవసరంబున...

కు. సం. ౨. ౨౦.౨.

౨. అభిముఖ్యము, సామ్ముఖ్యము

వ. తదవసరంబునం బ్రజాపతినికరంబు దక్ష ప్రజాపతిం బరిమెంగంబుఁ దప్పించుకొని

కు. సం. ౨. ౨౦౯

పరిమోక్షణము. సం. వి. అ న. విమోచనము, విడుదల

పరిమోక్షము. సం. వి. అ పుం ౧. సమ్యక్మ్ముక్తి ౨ మోచనము, విడిచిపుచ్చుట, విడుదల. 3. రిక్తగాఁ జేయుట, శూన్యము గావించుట. ౪. తప్పించుకొనుట ౫. తొలఁగఁ బుచ్చుట

పరిమోషము. సం వి. అ. పుం. ముచ్చిమి, దొంగతనము, చౌర్యము.

పరిమోషి. సం. విణ (క. నీ. క.) దొంగిలించువాఁడు వి. క పుం. దొంగ, చోరుఁడు.

పరిమోహనము. సం. వి. అ. న ౧. మిక్కిలి మోహపెట్టుట, ఆకర్షించుట. వలలం బెట్టుట. ౨. వేడుక పుట్టించుట.

పరిమ్లానము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి వాడినది. ౨. సోలినది; మందమైనది, దిట్టతనము లేనిది. 3. తఱిగినది, క్షీణించినది. ౪. చెడినది, దూషితము.—వి. అ. న. ౧. భయశోకాదులవలని ముఖవికారము. ౨. మరక, కఱ.

**పరియంకము.** వి. (సం. పర్యంకః; ప్రా. పరియంకో, క. పరియంకవు) శయ్య.

చ. తనపరియంకమందు వనితామణి రైన రమాల లాము పొంగుదువను...

భాగ ౧౦ ఉ ౯౦౩.

(చి. ని. వ్రాతప్రతి పా. "తన మృదుతల్ప మందు" ముద్రిత పా.)

**పరియజ్ఞము.** సం. వి. అ. పుం. గౌణమగు యజ్ఞము. (బృహస్పతిసవసాది)

**పరియల.** వి. (క. పరియళ, పరియణ, పర్యాణ, హారియాణ, హారివాణ మొ.) దేవాలయమునందలి పూజోపకరణవిశేషము, హరివాణము, ఒక విధమగు పళ్లెరము.

వ. చోడగంగదేవని పెమ్మండు పెమ్మసాడి రాజా పెట్టినవెండిపరియల ౧ ట్టిగ

ద. శా. ౪. ౧౧౯౦.

**పరియలము.** వి. దేవస్థానము

వ. శ్రీ భీమేశ్వర మహాదేవర పరియలమున సా(మా)ణ్ణి అయిన శ్రీ కరణమాణికము కొడుకు కుడియణ్ణునుం...

ద. శా. ౪. ౧౭౭౭.

**పరియష్ట.** సం. వి. ఋ. పుం. అగ్రజుడు యజ్ఞము చేయకయుండగా తా యాగము చేసిన యనుజుడు. (వై. ని.)

**పరియాచేకము.** వి. (సం. పరిహాసః) పరిహాసము, ఎగతాళి.

ద్వి. పరియాచకము లాడెc బద్మనాభుండు విష్ణు పు. ౨. ఆ. (శ. ర.)

—విణ. పరిహాసయుక్తము (శ. ర.)

(వ్యవ) నామాట పరియాచక మనుకోకుము

క. నావుడు నది భోగస్త్రీ, గావునc బరియాచకంబుగా గుబ్బలినం, డావలికొందకు నుఱుకం, బోవుటc గాలు విఱుగc బోరc బడె నని నగి. జ్యా. ౯. ౪౩. (చి. ని. పా.)

**పరియాచకముచేయు.** స. క్రి. (పరియాచకము + చేయు) పరిహసించు.

సీ. బ్రాహ్మణాచారంబు పరియాచకముసేయు నగ్నిహోత్రవిధాన మన్నc గవలు...

శా. ౪. ౧౧.

(శ. ర. పా., 'పరిహాసకముసేయు' ముద్రిత పా.)

**పరియు.** అ. క్రి. ౧. విఱుగు, తునియ లగు.

క. పరిఘమున నురము శిరమును, పరియ నడిచి ధనదు మూర్ఛపాలుపఱిచి

హరి. ఉ. ౪. ౧౫౩.

(చి. ని. పా. 'పరియునడచి' ముద్రిత పా.)

౨. తప్పు

గీ. అన్నదానంబు చేసిన యమ్మహాత్ము, నకును బలము నారోగ్యంబుc బ్రకటసుఖము, నై యరిష్టాత్మకము లైన యరులవలని, భయము నఖిలాగకృత్యముల్ పరిసిపోవు

వి. పు. ౪. ఆ. (శ. ర.)

ద్వి. మురవిసశక్తులు ముద్గరంబులునుc, బరిసిన పరిఘలుc బట్టిసంబులును

గం. రా. యు. ౩౫౬. పా. ౧౩ పం.

౩. చెడు.

ఉ. నీ, వీరసమృద్ధి యూపనికి సేటికి వచ్చితి వింద్ర నాకు నీ, భూరుహ మిచ్చినం దఱిcగి పోయెడిసే భవదీయసంపదల్.

వి. పు. ౧. ౧౪౧. (శ. ర.)

౪. మీcదిభాగము సారహీన మై చెక్కులు వాసి రాలు. (శ. ర.)

చ. పరిసిన వృక్షమూలములc బట్టునమవ్వపుc బువ్వుc దీcగెలన్,...

భాను. ౨. ౩౪ (శ. ర. పా., 'పరిసర' ముద్రితము)

జ. పరియు, పరిసిపాఱిపోవు, పరిసిపోవు.

**పరిఎత్తు.** అ. క్రి. (పరి + ఎత్తు) అతిశయించు, బహుగుణిత మగు.

చ కెంపు నలంతికంపమును వీడని బ్రీడయు మాటుసేయఁగా, నెఱుఁగమి రూపులేమి పరిరూక్తిడు చొక్కులకోలు

కవిక 3 ౧౧౧

పరిరక్షణము సం వి అ న ౧ చక్కఁగా రక్షించుట ౨ పరిపాలనము, తప్పక నిర్వర్తించుట (ఉదా సమయ పరిరక్షణము) 3 ఆపద నుండి విడిపించుట, ఉద్ధరణము ౪ హెచ్చరిక, జాగరూకత (పరిరక్షకుఁడు పుం రక్షకుఁడు పుం వానివలె గ్రహించునది)

పరిరంభణము సం వి అ =పరిరంభము

పరి (రీ) రంభము సం వి అ ౧ కౌఁగి లింత, కౌఁగిలి, ఆలింగనము

పరిరంభించే సం క్రి కౌఁగిలించు, ఆలింగనము చేయు

క గరళము గినుటయుఁ బ్రేతముఁ బరిరంభించుటయు నగ్నిభావుఁ డవుటయున్

భాగ ౧౦ పూ ౧౩౦౧

క కష్టతారము విరియ పాగ, బ్రచయం బల్లాడఁ బట్టి పరిరంభించెన్, రుచిరగతి రూపవతి నిజ, కుచలికచాగ్రములు నాఁటుకొనఁ బ్రాణేశున్

తెం పంచ 3 ౨౦౧

పరిరక్షించే సం స క్రి బ్రోచు

మ పరమాత్మ్యం దశాఁడి జగింబుఁ బ్రతికల్పం బందుఁ గల్పించుఁ దాఁ, బరిరక్షించును బ్రుంచు

భాగ ౨ ౧౧౧

పరిరథ్య సం వి ఆ స్త్రీ చతుష్పథము పుం

పరిరాటకము సం విణ (అ టికా అ) అంత టను కూసెట్టునది, జట్టు అఱచునది

పరిరాటి. సం విణ (క నీ క) అంతటను దిగ్గున కూసెట్టునది, దిట్టు అఱచునది.

పరిలంఘించే సం స క్రి దాఁటు, ఎగురు

మ పరమర్షుల్ అంబరమధ్యంబున నావహాంబుజగర్వాళిగా ప్రవాహంబుపైఁ, బరిలంఘించిరి భీమమండలము సర్వంబు న్విలోకింపఁగన్

భీమ 3 ౪౧,

పరిలఘువు సం విణ (ఉ) ౧ మిక్కిలి తేలిక యైనది (వస్త్రాదిధి) ౨ మిక్కిలి చులుకనిది, సులువుగ జీరించునది (ఆహారాది) అతి స్వల్పము, మిక్కిలి చిన్నది

పరిలుప్తము సం విణ (అ ఆ అ) ౧ మిక్కిలి లోపించినది, కొఱతపడినది ౨ మఱుఁగుపడినది

పరిలేఖనము సం వి అ యజ్ఞస్థానాదులందు చుట్టు రేఖాదులు వ్రాయుట

పరిలేఖము సం వి అ పుం చుట్టురేఖ, సంక్షేపవర్ణము ౨ చుట్టవ్రాయుట కగు ద్రవ్యము 3 చిత్రపటము

పరిలోపము సం వి అ పుం ౧ హాని ౨ లోపించుట, మఱుఁగుపడుట, లేకపోవుట

పరివట్టము వి (సం పరివేష్టనం ప్రా పరివట్ట, త పరివట్టం) విష్ణు ప్రసాదముగా గ్రహించి తలఁ జుట్టుకొనుపట్టు (శ ర)

పరివదనము సం వి అ న తిట్టుట, నిందించుట

పరివపనము సం వి అ న = పరివాపము

పరివర్జనము సం వి అ ౧ పూర్తిగా విడుచుట, దిగవిడుచుట, త్యాగము ౨ మానము, చంపుట 3 మానుట, వదలుకొనుట

పరివర్జించే సం స క్రి విడుచు

మ శాంతి స్వాంతులై సంగముం, బరివర్జించి విశుద్ధచిత్తులగుచున్

భాగ 3 ౧౦౧౭.

**పరివర్జితము** సం. విణ. (అ. ఆ. అ.) బొత్తిగా విడువఁబడినది

**పరివర్తకము** సం. విణ. (అ. ర్తికా. అ.) ౧ చుట్టు త్రిప్పునది ౨ వస్తువుల మార్చుకొనునది ౩ చుట్టి వచ్చునది, చుట్టి తిరుగునది

**పరివర్తనము** సం. వి. అ. న. ౧ (ఎదుటి లోనగు వానిమీఁద, ఇటు అటు పొరలుట ౨ చుట్టి వచ్చుట ౩ తిరుగుడు, భ్రమణము ౪ వినిమయము, వస్తువుల మాఱుపు

**పరి (రీ) వర్తనము** సం. వి. అ. పుం. ౧ చుట్టి వచ్చుట, రాశిచక్రమందు ఏ స్థానమునుండి గ్రహము చలించెనో మరల నా స్థానమునకు వచ్చుట ౨ యుగాంతకాలము ౩ వినిమయము, వస్తువుల మాఱుపు ౪ ఆవృత్తి, మరలి వచ్చుట ౫ సంవత్సరము (వై. ని.) ౬ సంసారభ్రమణము ౭ గ్రంథవిచ్ఛేదము (అధ్యాయాది) ౮ కూర్మావతారమూర్తి యగు విష్ణువు

**పరివర్తి** సం. విణ. (న్. నీ. న్.) ౧ చుట్టు తిరుగునది, మరలి వచ్చునది ౨ మాఱునది ౩ దగ్గఱ వర్తించునది ౪ మార్చుకొనునది

**పరివర్తించు** సం. అ. క్రి. చుట్టి వచ్చు, తిరుగు

"వ. కాలచక్రంబు యుగమన్వంతర పరార్ధ రూపంబునం బరివర్తించుచు నుత్పత్తి స్థితిసంహారంబులకుఁ దా నొక్కరుండ హేతువై"

హరి. పూ. ౪. ౮.

**పరివర్తింపించు** సం. స. క్రి. ప్రవర్తింపఁజేయు

"వ. ద్వాదశారచక్రంబుం బరివర్తింపించుచున్న వారి శార్వరిఁ గుమారుల"

భార. ఆది. ౧. ౧౦౭.

**పరివర్తిక** సం. వి. అ. స్త్రీ. మేఢ్రగత మగు రోగభేదము

**పరివర్తితము** సం. విణ. (అ. ఆ. అ.) ౧ చుట్టు త్రిప్పఁబడినది త్రిప్పఁబడినది ౨ మార్చుకొనఁబడినది

**పరివర్ధనము** సం. వి. అ. న. ౧ చక్కఁగాఁ బెరుఁగుట, హెచ్చుట, అధికమగుట ౨ చక్కఁగా పెంచుట ౩ కోయుట, ఛేదించుట

**పరివర్ధితము** సం. విణ. (అ. ఆ. అ.) ౧ చక్కఁగాఁ బెంపఁబడినది ౨ కోయఁబడినది, ఛేదింపఁబడినది

**పరివర్మఁడు** సం. విణ. (న్. నీ. న్.) కవచము ధరించినవాఁడు

**పరివసథము** సం. వి. అ. పుం. గ్రామము

**పరివహము** సం. వి. అ. పుం. సప్తవాయువులలో ఆఱవవాయువు (ఇది సప్తర్షులను స్వర్గంగను వహించును) ౨ అగ్నిజిహ్వలలో నొకటి

**పరివాదకుఁడు** సం. వి. అ. పుం. ౧ (వ్యవ.) వాది, వ్యాజ్యెగాఁడు ౨ వీణ వాయించువాఁడు ౩ నిందించువాఁడు

**పరి (రీ) వాదము** సం. వి. అ. పుం. ౧ నింద ఎడి ౨ వీణ వాయించెడు కోడుపు

**పరివాది** సం. విణ. (న్. నీ. న్.) ౧ ఎడిగట్టువాఁడు, అపవాదము చేయువాఁడు ౨ బిగ్గర నఱచువాఁడు వి. న్. పుం. (వ్యవ.) వాది, వ్యాజ్యెగాఁడు

**పరివాదిని** సం. వి. ఈ. స్త్రీ. ఏడు తంతులు గల వీణె

**పరి (రీ) వాపము** సం. వి. అ. పుం. ౧ ముండనము, గొఱుగుట, ఛేదించుట ౨ వపనము, పెడఁబెట్టుట, విత్తుట ౩. జలస్థానము, నీటిపట్టు

౪ పరిచ్ఛదము, పరివారము (దీనిచే పరిచ్ఛేద మని పఠించి 'కొలఁది' అని యర్థము శ ర) ౫ పొదు ౬ కనివి (శ ర) ౭ లాజలు, పేలాలు ౮ ఆరోహము (శ ని)

పరివాపితము సం విణ (అ అ అ) ముండితము, గొఱిగింపఁబడినది

పరివారకము సం వి అ పుం లాజలు, పేలాలు

పరివారణము సం వి అ న ౧ మునుఁగు, గవుసెన ౨ పరిజనము ౩ చక్కఁగా వారించుట, బాగుగా తొలఁగఁజుచ్చుట

పరి (రీ) వారము సం వి అ పుం ౧ పరిజనము ౨ సేన ౩ గవుసెన, ముసుఁగు ౪ కత్తియొఱ ౫ పరివరణము, చుట్టుకొనుట

పరివారితము సం విణ (అ అ అ) పరివేష్టితము, చుట్టుకొనఁబడినది

పరివాసము సం వి అ పుం ౧ కాఁపు, వసించుట ౨ సుగంధము, మంచివాసన

పరి (రీ) వాహము సం వి అ పుం ౧ పొంగి పొరలెడి వెల్లువ ౨ శ్వేతచ్ఛత్రాది రాజార్హ వస్తువు (సుధ) ౩ చెఱువులోని నీరు అధికమైనది పోవుటకును కావలసినది నిలుచుటకును కట్టు దాతి కట్టడము

(శ్లో॥ "తనోతు క్షేమం న స్తవవదన సౌందర్యలహరీ, పరీవాహస్రోతస్సరణిరివ సీమంతసరణిః", సౌందర్యలహరి ౪౪)

పరివాహి సం విణ (ఈ నీ ఈ) పొంగి ప్రవహించునది

పరివి సం వి ఈ స్త్రీ ద్యూతవిశేషము (వై ని)

పరివిత్తి సం వి ఇ పుం తమ్మునికిఁ బెండ్లియైనపిదపఁ గాకున్న యన్న

పరివిత్తుఁడు సం వి అ పుం=పరివిత్తి (వై ని)

పరివిద్ధుఁడు సం వి అ పుం కుబేరుఁడు

పరివిన్నుఁడు సం వి అ పుం=పరివిత్తి

పరివిహ్వాలము సం విణ (అ అ అ) మిక్కిలి విహ్వాల మైనది

పరివీతము సం విణ (అ అ అ) పరివేష్టితము, చుట్టఁబడినది

౨ పర్వినది, వ్యాప్తము వి అ న బ్రహ్మ యొక్క విల్లు (విల్యమ్ను)

పరివృక్తి సం వి ఈ స్త్రీ గౌరవింపఁబడిన రాజభార్య (వై ని)

పరివృ(బృ)ఢము సం విణ (అ అ అ) ౧ దట్ట మైనది, నిబిడము, ౨ పెద్దది

పరివృఢుఁడు సం వి అ పుం అధిపతి, ఏలిక

పరివృతము సం విణ (అ అ అ) ౧ చుట్టఁబడినది ౨ ఆవరింపఁబడినది—వి అ న (వైద్య) యజ్ఞశాలయొక్క ఆవరణము

పరివృతి సం వి ఇ స్త్రీ చుట్టుకొనుట

పరివృత్తము సం విణ (అ అ అ) ౧ చుట్టు త్రిప్పఁబడినది ౨ వెనుదీసినది, వెనుకకుఁ దిరిగినది ౩ మార్చుకొనఁబడినది ౪ సమాప్తము, ముగిసినది

పరివృత్తి సం వి ఇ స్త్రీ ౧ పరివర్తము, చుట్టు తిరుగుట, వినిమయము ౨ ఒక యర్థాలంకారము (ఒకవస్తువు నిచ్చి తక్కువదానినో యెక్కువదానినో పుచ్చుకొనుట)

శ్లో॥ పరివృత్తి ర్వినిమయో యో౽ర్థానాం స్యా త్సమాసమైః, దత్త్వా కటాక్ష మేణాక్షీ జగ్రాహ హృదయం మమ, మయాతు హృదయం దత్త్వా గృహీతో మదనజ్వరః॥

**పరివెడలు.** అ క్రి (పరి+వెడలు) దండువెడలు

గీ. పడఁతు చేపునఁ బద్మిని యొడమియొల్లఁ,
జాఱఁగొని పేర్చి మనమునఁ బొక్కి మిగిలి,
విటజనంబులపైఁ బరివెడలునట్లు, కొలను
వెలివి జలకేళి వలనఁ దనిసి.

కు సం ౯. ౨౯౦

**పరివేత్త.** సం. వి. బు పుం అన్నకన్న ముందు పెండ్లాడిన తమ్ముఁడు

**పరివేదనము.** సం వి అ న ౧ అన్నకన్న తమ్ముఁడు ముందు పెండ్లాడుట ౨. చక్కఁగా తెలియుట ౩ పొందుట ౪ అగ్న్యాధానము

**పరివేదిని.** సం వి ఈ స్త్రీ =పరివేదనీయ.

**పరివేదనీయ.** సం వి అ స్త్రీ అన్నకు ముందు పెండ్లాడిన వాని భార్య (వాచ)

**పరివేధించే.** సం స క్రి బాధించు

మ వాయంబె భీతాత్ములన్, బరివేధించుట...

ఉ రా. ౩ ౩౦౫.

**పరివేషకుఁడు.** సం. వి అ పుం వడ్డించువాఁడు

**పరివేషణము.** సం వి అ న ౧ (అన్నాదులు) వడ్డించుట ౨ చుట్టుకొనుట, పరివేష్టించుట ౩ గాలిగుడి, పరివేషము, ౪ పరిధి

**పరి(రీ)వేషము.** సం. వి అ పుం ౧ వడ్డించుట ౨ పరిధి, వృత్తముయొక్క చుట్టుగీత ౩. పరివేష్టనము, చుట్టుకొనుట ౪ గాలిగుడి, ఉపసూర్యకమండలము ౫ రెండు గజ్జావుల పరిమాణము. (వై. ని)

**పరివేషించే.** సం అ క్రి. పరివేషము కట్టు.

క పరిదివసంబున భానుపు, లరయఁగ భువిఁ బొన్నె నేని యట సప్తములం, బరివేషించిన శ్రావణిఁ, బరగిన గర్భంబువలన బహువృష్టి యగున్. సస్యానందము ౩ ౧౧.

**పరివేష్ట.** సం విణ. (బు స్త్రీ) బు) వడ్డించువాఁడు

**పరివేష్టనము.** సం వి అ న ౧. చుట్టి వచ్చుట ౨ పరిధి, చుట్టుకొలత ౩ గవుసెన, ముసుఁగు ౪ పరివట్టము

వ పూజకులచేఁ బాదతీర్థ ప్రసాద పరివేష్టనంబు విప్పించి విడిది కనిపిన . ఆ. ము. ౬ ౧౦౪.

**పరివేష్టించే.** సం స క్రి చుట్టి వచ్చు, చుట్టు వాఱు

వ .మసద్వ సుగంధద్వి ప్రిదాదులు పరివేష్టింప నింద్రుం డైగావతారూఢుం డై...

భార శాం ౪ ౪౨౨

వ. .అమ్మహీపాలుండు అమ్మునిపాలికి సూజన సమేతంబుగాఁ జని పరివేష్టించి యుండి కేలు మోడ్చి భార శాం ౬ ౨౪౧

వ.. సరససాహిత్య విద్యావిశారదు లైనకవివరులును బరివేష్టింప. . మార్కం పీఠి ౧. ౧౩

**పరివోవు.** అ క్రి (పరి+పోవు) కొల్లపోవు

క పొరిఁ బొరిఁ జోరులవలనన్, ధరణీసురులు సంపదలు సకలంబున్, బరివోయి గత్తిఘారలు, దొరఁగడు దేహములతోడఁ దూలుచుఁ బెలుచన్ వి పు ౨ ౧౨౪

**పరివ్యాధము.** సం వి అ. పుం ౧ కర్ణికారము, కొండగోఁగు. [?] ౨ నీరుప్రబ్బ, జలవేతసము [?]

**పరివ్రజ్య.** సం. వి అ స్త్రీ ౧ త్రిమ్మరుట, తిరుగుట ౨ సన్న్యాసము

**పరివ్రాజకుఁడు.** సం వి. అ పుం=పరివ్రాట్టు.

**పరివ్రాజుఁడు.** సం వి. అ పుం=పరివ్రాట్టు

**పరివ్రాట్టు.** సం. వి. జ్. పుం. పుత్రదారాదులను సర్వకర్మములను ద్యజించి యాశ్రమాంతరము నొందిన భిక్షువు, యతి.

పరిశంకి. సం. విశే. (శా. సీ. న.) మిక్కిలి శంకించు వాఁడు.

పరిశిష్టము. సం. విశే. (అ. ఆ అ.) ౧. కడపట శేషించినది. మిగిలినది —వి అ పుం అను బంధము.

పరిశీలనము. సం వి అ. న ౧. సంబంధము ౨ ఎడతెగని సంబంధము, నిత్యసంబంధము 3 శోధనము

పరిశీలించే. సం స క్రి శోధించు

వ...ఉదంచితం బగు కవిత్వ తత్త్వంబునం గల గరిమంబు పరిశీలించి... పాండు ౧ ౧౭.

పరిశుద్ధము. సం విశే (అ ఆ అ) ౧ మిక్కిలి శుద్ధిపొందినది, ౨ చెల్లింపఁబడినది (ఋణాది)

పరిశుద్ధి. సం వి ఇ స్త్రీ ౧. మిక్కిలి శుద్ధి ౨. నిర్దోషత్వము.

పరిశుష్కము. సం. విశే. (అ ఆ అ) ౧. మిక్కిలి ఎండినది ౨ వాఁడినది, ముడిఁగినది. (చెక్కులు. మొ)- వి అ న. పరిపక్వ మాంసభేదము

శ్లో: మాంసం బహుఘృతైర్భ్రష్టం సిక్తం చేదంబునా ముహుః, జీరకాద్యైస్సమా యుక్తం పరిశుష్కం తదుచ్యతే॥

పరిశూన్యము. సం. విశే (అ ఆ అ.) మిక్కిలి రిత్తది, బొత్తిగా లేనిది.

పరిశేషణము. సం. వి. అ న. అవశేషము

పరి (రీ) శేషము. సం వి. అ పుం మిగులు, అవశేషము.

పరిశోధనము. సం. వి. అ. న.—పరిశోధము.

పరిశోధము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలి శోధించుట. ౨. దోషము పోఁగొట్టుట, తప్పులు దిద్దుట 3. (ఋణాదులు) చెల్లించి పుచ్చుట.

పరిశోధించే. సం. స. క్రి. వెదకు

వ...పశ్చిమదిగ్భాగంబు పరిశోధించి ..
ఉ. రా 8. ౨౦౪.

పరిశోభిల్లు. సం అ క్రి మిక్కిలి ప్రకాశించు.

మ పరికింపం గిటికోరదంతమయదీపస్తంభ మై యొప్పెఁ దై, పరిశోభిల్లెడుధాత్రి పాత్రి వలెఁ జూపట్టెం దదగ్రాల్పపుష్కరముల్ ...
దశా 3 ౨౦౫

పరిశోషము. సం వి అ పుం మిక్కిలి యెండుట

పరిశ్రమము. సం. వి అ పుం. ౧. వ్యాయామము, మిక్కిలి శ్రమము.

పరిశ్రాంతము. సం విశే (అ. ఆ అ.) ౧ మిక్కిలి ఆయాసము చెందినది ౨. మిక్కిలి ఊఱట చెందినది

పరిశ్రాంతి. సం వి ఇ స్త్రీ. ౧. మిక్కిలి ఆయాసము ౨. మిక్కిలి ప్రయత్నము. 3 మిక్కిలి ఊఱట, విశ్రాంతి

పరిశ్రితము. సం విశే (అ. ఆ. అ) సమాశ్రితము —వి. అ న ఆశ్రయము

పరిశ్లేషము. సం వి అ పుం. కౌఁగిలి

పరిషత్తు. సం. వి. ద్ స్త్రీ ౧. సభ; ధర్మ నిర్ణయార్థము విద్వద్భేదయుక్తమగు సభ. (వాచ)

పరిషదుఁడు. సం. వి అ పుం ౧ పరిషత్తులోని వాఁడు, సభ్యుఁడు ౨. అనుచరుఁడు (వాచ)

పరిషద్బలుఁడు. సం వి. అ పుం. సభ్యుఁడు, సభాసదుఁడు (విశే అని వాచ)

పరిషద్యుఁడు. సం వి అ పుం సభార్హుఁడు. (విశే. అని. వాచ)

పరిషేవణము. సం వి అ న చక్కఁగా కట్టుట, ముడి వైచుట (వాచ)

పరిషేకము. సం వి అ. పుం=పరిషేచనము.

పరిషేచనము. సం వి. అ న ౧ చల్లుట, తడుపుట. ౨ చెట్లకు నీరు కట్టుట

పరిష్క(స్క)ందత్. సం శత్ర ౧ అంతటను వెళ్లుచున్న ౨ అంతటను రొండుచున్న

పరిష్క(స్క)ందుఁడు. సం విణ (అ ఆ అ) పరపుష్టుఁడు, ఇతరులచేఁ బెంపఁబడినవాఁడు—వి అ పుం ౧ పెంపుడుకొడుకు ౨ వానిస వాఁడు ౩ రథగోపకుఁడు తేరిని గాచు బంటు

పరిష్క(ష్ణ)ణ్ణ(న్న)ఁడు. సం. విణ (అ ఆ అ) మఱియొకనిచేఁ బెంపఁబడినవాఁడు.—వి అ పుం పెంపుడు కొడుకు

పరిష్కరము. సం వి అ పుం అలంకారము, వైచేఁత. (వాచ)

పరిష్కరించే. సం స క్రి ౧ చక్కఁబెట్టు ౨ అలంకరించు ౩ శుద్ధిచేయు

పరిష్కారము. సం వి అ పుం ౧ చక్కఁ బెట్టుట, సంస్కారము ౨ భూషణము, తొడవు ౩ శుద్ధి ౪ విద్యమాన (ఉన్న) వస్తువునకు గుణాంతరమును గలిగించుట మొ

పరిష్కృతము సం విణ (అ ఆ అ) ౧ అలంకరింపఁబడినది, భూషితము ౨ చేష్టితము ౩. మార్జనాది సంస్కారము చేయఁబడినది, కడుగుట లోనగువానిచేతఁ జక్కఁబెట్టఁబడినది, శోక, శుద్ధి చేయఁబడినది ౪. చక్కఁగా మెఱుఁగు పెట్టఁబడినది ౫ సిద్ధము చేయఁబడినది. ౬. పశుబంధనమునకు సంస్కారము చేయఁబడినది. (భూమి) ౭. లక్షణముచేత నిర్దుష్టముగా నిర్వచింపఁబడినది.

పరిష్కృతి. సం వి ఇ స్త్రీ=పరిష్కారము.

పరిష్క్రియ. సం వి. అ. స్త్రీ=పరిష్కారము.

పరిష్ఠలము. సం వి అ న. చుట్టు నున్న ప్రదేశము

పరిష్వంగము. సం. వి అ పుం ౧ కౌఁగిలింత ౨ కూడిక, సంబంధము, కలయిక.

పరిష్వ(స్వ)ంజనము. సం వి అ. న =పరిష్వంగము

పరిష్వక్తము. సం విణ (అ. ఆ అ) కౌఁగిలింపఁబడినది

పరిస. వి నదీగిర్భమునఁ ద్రవ్విన నుయ్యి (గ్రా)

పరిసంఖ్య. సం వి అ స్త్రీ ౧ లెక్కించుట, గణించుట ౨ (మీమాంస) విధిభేదము.

శ్లో॥ విధిరత్యన్తమప్రాప్తౌ నియమః పాక్షికే సతి, తత్రచాన్యత్రచ ప్రాప్తౌ పరిసంఖ్యేతి గీయతే

౩ అర్థాలంకార భేదము

గీ. ఒక్కచోట నిషేధించి యొకట వస్తు యంత్రణము చేయఁ బరిసంఖ్య యనఁగఁ బరగు, లేదు స్నేహత్యయంబు నాళీకముఖుల, డెందములయందు దీపములందుఁ గాని

ఆంధ్ర చంద్రాలోకము. ౧౧౨.

పరిసంఖ్యాతము. సం. విణ. (అ ఆ అ) పరిగణితము, చక్కఁగా లెక్కింపఁబడినది

పరిసంఖ్యానము. సం. వి అ న ౧ పరిగణనము, లెక్కించుట. ౨ విశేషించి యెన్నుట, ప్రత్యేకగణనము

పరిసమాప్తము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ చక్కఁగా ముగిసినది. ౨. గర్భితము, లోపలఁ జేర్చుకొనఁబడినది, అంతర్భావితము.

పరిసమాప్తి సం వి ఇ స్త్రీ ముగించుట, ముగియుట

పరిసమాప్తించు సం స క్రి ముగించు, పూర్తి చేయు

వ అప్పుమహాధ్వరంబు వేదోపదిష్టవిధి బరిసమాప్తించి ఋత్విక్సికాయంబుల బహుదక్షిణలఁ దనిపి భాగ ౧౦ ఉ ౧౧౨౯

పరిసమూహనము సం వి అ న ౧ పోగు సేయుట, గుమిగూర్చుట ౨ అగ్నిహోత్రము చుట్టును జలము ప్రోక్షించుట, జలముచే మార్జనము సేయుట, యజ్ఞాదియం దగ్నిహోత్రము మీఁద నూరక సమిధలనుంచుట, అగ్నిహోత్రము చుట్టుఁబడిన తృణాదికమును ద్రుంచి యగ్ని నడుమ వైచుట (వాచ)

పరిసరణము సం వి అ న చుట్టుగాని అంతటఁగాని తిరుగాడుట

పరిసరము సం వి అ పుం (నదీనగర పర్వతాదుల) పర్యంతభూమి, సమీప ప్రదేశము, సమీపము ౨ మృత్యువు ౩ విధానము (విల్యమ్సు) ౪ పెదలువు, విరివి, వైశాల్యము

పరిసర్పణము సం వి అ న ౧ అంతటఁ దిరుగాడుట, రేకి, ప్రాఁకుట ౨ అంతటఁ బరుగిడుచుండుట, ఎప్పుడును దిరుగాడుచుండుట

పరిసర్పము సం వి అ పుం ౧ అంతటను దిరుగుట, చుట్టును ప్రాఁకుట ౨ అనుసరించుట, వెంబడించుట, వెదకుట ౩ జలాదివేష్టనము వి అ న సారస్వతయాగభేదము

పరిసర్పించు సం అ క్రి చుట్టి వచ్చు

మ కరిసంఘంబులు లేవు రావు తురగౌఘంబుల్ రథవ్రాతముల్, పరిసర్పింపవు రారు కూరులు. భాగ ౧౦ పూ ౧౨౧౪

పరి(రీ)సర్య సం వి అ స్త్రీ అంతట తిరుగుట

పరి(రీ)సారము సం వి అ పుం=పరిసర్య

పరిసిపాఱిపోవు = పరిసిపోవు అ క్రి ౧ మాసిపోవు ౨ తగ్గిపోవు (వ్యవ) పథ్యము సరిగాఁ జేసిన రోగము పరిసిపాఱిపోవును

పరిసిపోవు = పరిసిపాఱిపోవు అ క్రి (√పరియు)

౧ తప్పిపోవు, తొలఁగిపోవు

గీ అన్నదానంబు చేసిన యమ్మహాత్ము, నకును బలము నారోగ్యంబు ప్రకటశుభము, నైయరిష్టాత్మకము లైన యరులవలని, భయము నభిచారకృత్యముల్ పరిసిపోవు

వి పు ౪ ౨౦౯

౨ క్షీణించు, తఱుగు (చెడు అని శ ర)

ఉ ఇంద్ర నాకు నీ, భూరుహ మిచ్చినఁ బరిసిపోయెడినే భవదీయసంపదల్

వి అ ౮ ౧౪౧

(తఱిగిపోయెడినే అని ముద్రిత పా)

చ సత్యశౌచముల్, పాద పదగుం గలింబరిసిపోవు మహాత్త్వము దేవకోటికిన్

వరాహ ౬ ౧౨౭

పరిసెనము వి ఎల్లటి, కొంగ్గ (గంతు శ ర)

వ పడి దప్పకట్లు త్రాళ్లం గట్టుపడి పొట్ట లదరంగ నిక్కి పరిసెనంబులు వేయునది యును మనుచ ౪ ౨౬

ద్వి తిరముగా దేవ భూదేవసన్నిధిఁ బరిసెనంబుగఁ దిబ్బఁ బట్టించి గాని, యొండు విచారంబు లూహింపఁ గాదు

నవ ౨ ౭౫ పా ౧౩ పం

పరిస్తంభించు సం అ క్రి ఘనీభవించు, గడ్డకట్టు

వ జలంబులు శిలాసదృశంబులుగాఁ బరిస్తంభించె భార కల్య ౨ ౪౨

ఆ చీర నపహరించి సిగ్గులం విడిపించి, పరిహసించి దైన్యంబరగ మనకు, ఘనుఁడు నోము కొఱఁత గాకుండ మెచ్చికొంచె, ననుచు హరి నుతించిరబల లెల్ల.

భాగం ౧౦ పూ ౮౮౯

**పరిహాణి.** సం వి ఇ స్త్రీ ౧. తగ్గుట, కీడ్పాటు, ౨. క్షీణించుట, నాశము ౩ విడిచిపెట్టుట, అసడ్డచే వదలుట

**పరి(రీ)హారము.** సం వి అ పుం ౧ విడుచుట, విడుపు ౨ తొలఁగఁ బుచ్చుట, త్రోసి పుచ్చుట ౩ ఊరు పట్టనము లోనగు వాని చుట్టు గల సామాన్యప్రదేశము ౪ పన్ను లోనగు నిర్బంధములు లేనిది (మాన్యము మొ) ౫ అవజ్ఞ, అనాదరము ౬ ఆక్షేపము ౭. పాపాదులకుఁ జేయు ప్రాయశ్చిత్తము ౮. చేయి (శ ర)

**పరిహారి.** సం విశే. (న. త్రీ. న) పరిహరించువాఁడు

**పరిహార్యము.** సం విశే (అ ఆ అ) పరిహరింపఁ దగినది, విడువఁదగినది

—వి అ పుం హస్తవలయము

**పరి(రీ)హాసము.** సం వి అ పుం ౧ నవ్వులాట, వేడుక, నవ్వు ౨. గేలి, వెక్కిరింత, పరియాచకము

**పరిహాసవేది.** సం విశే (న నీ న) హాస్యగాఁడు (విదూషకాది), వేడుకకాఁడు

**పరిహీణము.** సం విశే (అ ఆ. అ) ౧ తక్కినది, క్షీణించినది ౨ లేనిది, మాలినది ౩. తక్కువైనది, కొఱవడినది

**పరిహృతము.** సం విశే (అ ఆ అ) ౧ పరిహరింపఁబడినది, విడువఁబడినది మానఁబడినది. ౨ ఖండింపఁబడినది (ఆక్షేపాది) ౩. పట్టుకొనఁబడినది.

**పరిహ్రుతి.** సం వి ఇ. స్త్రీ పరిహారము

**పరీక్ష.** సం వి అ. స్త్రీ ౧ పరీక్షించుట, వస్తుతత్త్వమును నిశ్చయించుట, పరిశీలనము ౨ (వ్యవహారమందు) దివ్యభేదములచే దుష్టత్వాదుష్టత్వములను విచారణ చేయుట

**పరీక్షకుఁడు.** సం విశే (అ ఆ అ) ౧ పరీక్షించువాఁడు, విచారణకర్త ౨ (వ్యవహారాదులందు) ఆయా దివ్యభేదములచేఁ బరీక్షించువాఁడు ౩ తర్కముచేతను ప్రమాణములచేతను నిర్ణయింపరాని దానిని నిర్ణయించుటకై శాస్త్రపరిశీలనము చేసి బుద్ధిప్రకర్షము నొందిన వాఁడు

**పరీక్షణము.** సం వి అ న ౧ (రాజు అపహార్తాదులయొక్కయు చోరాదులయొక్కయు) దుష్టాదుష్టత్వములను నిరూపించుట ౨ (తర్కముచేతను ప్రమాణములచేతను వస్తువుల) తత్త్వమును నిర్ణయించుట

**పరీక్షించు.** సం స. క్రి పరిశీలించు

క చతురాశ్రమములవృత్తి, స్థితులు పరీక్షించి యందుఁ గడచఁ దలఁచినఁ, దగతి సూక్ష్మదృష్టిఁ గనుఁగొని, యెంతయుఁ బ్రవర్తనచరిత సౌమ్యుం డగుచున్, భా శాం ౫ ౪౫౦

సీ జిహ్వాగ్రమునఁ బరీక్షింపంగ లవణాబ్ధి కల క్షారత్వంబు దెలియవచ్చు వగావ ౧౪౧

**పరీక్షితుఁడు.** సం విశే (అ ఆ అ) పరీక్షింపఁబడినవాఁడు

—వి అ. పు = పరిక్షిత్తు

క తిక్షకుఁడను పన్నగుఁడు పరీక్షితుఁ గఱచె నట నేఁ డరిందము నతనిన్, రక్షింపఁగఁ బోయెద శుభ, దక్షిణు మామంత్రతంత్ర దాక్షిణ్యమునన్ భార ఆ ౨ ౧౭౭

**పరీక్షిత్తు.** సం = పరిక్షిత్తు

క. తనతల్లికడుపులోపల, మును నూచినవిభుఁడు విశ్వమునవెల్లఁ గలం, డనుచుఁ బరీక్షింపఁగ నను, లనఘుఁ బరీక్షిన్నరేంద్రుఁ డంద్రు మునీంద్రా. భా౧ ౧ ౨౯౨

**పరీణామము.** సం = పరిణామము

**పరీణాయము.** సం = పరిణాయము

**పరీణాహము.** సం = పరిణాహము.

**పరీణాహుఁడు.** సం. వి అ పుం శివుఁడు

**పరీతము.** సం విణ (అ అ అ.) ౧ చుట్టుకోఁబడినది, వేష్టితము, ౨ కడచినది, జరిగినది ౩ పోయినది ౪ ఆవరింపఁబడినది, ఆక్రమింపఁబడినది — వి అ న పగలు

శ్లో॥ పరీతంతు దివా ప్రోక్తం విపరీతంతు శర్వరీ. (రామాయణ వ్యాఖ్యానము.)

**పరీదాహము.** సం = పరిదాహము

**పరీధావి.** సం వి న్ పుం ఒక సంవత్సరము

**పరీపాకము.** సం = పరిపాకము

**పరీప్స.** సం వి అ స్త్రీ పొందుటకు నిచ్ఛ

**పరీరణము.** సం వి అ న ౧ కమఠము, తాఁబేలు ౨. దండము, కఱ్ఱ, కోల ౩ పట్టశాటకము. (మే ని)

**పరీరము.** సం వి అ న ౧. హలము, నాఁగలి ౨ హలముఖము, నాఁగటికఱ్ఱు (శే ని) ౩ ఫలము. (వాచ)

**పరీష్టి.** సం. వి ఇ స్త్రీ ౧ అన్వేషణము, (ఆమంత్రణార్థము) వెదకుట ౨ పరిచర్య ౩ ఇష్టపడుట ౪ ప్రాకామ్య మను ఒక ఐశ్వర్యము. ౫. పరీక్షించుట (శే ని)

**పరుండు=పడు.** అ క్రి. (√ పడు - రేఫాదేశము-పడి + ఉండు. అవి. క ర) ౧.పరుండు, పడినవాఁడగు

చ...ద్భుగ్ధరశరరమండలిం గనపి ధండనపీఠఁ బరుండ నుంతు... దశా ౨. ౧౧౯.

౨. శయనించు

గీ ఒప్ప శయనించుటకును బన్నుండెఁ బండెఁ, బవ్వండించెఁ బరుండెను బవ్వళించె, నత్తమిల్లె ననన్ .. ఆం సం మాన. ౩౨.

గీ అలసతఁ బరున్నమనుజుండు కలియుగంబు, ద్వాపరం బెన్నఁ గూర్చున్నవాఁడు త్రేత, యుద్ధితుఁడు యాయి మఱి కృతయుగమటన్న, నముచిదమనోక్తి బుధ్రాహ్మణమున వినవె ఆము ౩ ౪౯

గీ తోడిబ్రాహ్మణౌఘు, ముబునుపోకకుఁ జదువఁ బరున్నవేళ ఆము ౨ ౪౪ ఆం భా. ౩. ౯౩

౩ నిగ్రించు

గీ పనులలోనన రెుుువులిప్పలఁ బరుండి,కేలు కని యాలఁబిడుకఁగ మెలఁగుగోష్ఠపతులు హరి పూ. ౯ ౧౭౨.

**పరుఁజించే.** పరుజించే స. క్రి (√ పరుఁజా)-

కత్తిరి-పరుఁజానం బట్టుకొన

సీ బరువుడించి కటారి పరుఁజించి నిల్పియుండెందు వచ్చెదరని రెుుదురువారు ఆము ౨ ౪౪

మ రమణీరత్నము రంభఁ జూడ బురుసారుంగుస్ జెఱుంగుస్ జెటా, కొమరుండుప్పటి శాసెగా బిగిచి జగ్గుల్ మీఱు గ్రొంబైరుమాల్, జము దాడిం బరుఁజించి రెుుది మఱి రాజా రెమ్మువాల్గొ మ్మనన్, బొమ లల్కన్ ముడివెట్టి వీరరసవిస్ఫూర్తిన్ విజృంభించుచున్. అహ ౧. ౯౯.

(పరుఁజంది - ముద్రిత పాఠము.) ప్రబంధ. ౩౯౯.

**పరుఁజు.** వి. (శ. పరజా, పరుజా) ఖడ్గాగ్ర ముష్టి సంగ్రామ్యాకలము, పిడి

సీ ..ఖడ్గాదిముష్టి సంగ్రామ్యాకలము.

గీ. పరుఁజు జనఁ బరుం జనంగను బరగు...

ఆం. భా. ౨ ౨౧౫.

ద్వి కర మభేద్యం బగు కవచంబు పసిఁడి, పరుఁ జులఁ జెన్నొందు పటుశ్రపాణములు

గం గా అరో. ౧౦౬ పా ౧౫ పం

క తరతరమవ్రాసనుండియుఁ, బరుఁజులు దట్టాడి మధ్యపద్ధతి ధారా, పరివృతి నుపదేశక్రమ, పరిచితిఁ బఠియింప ఖడ్గబంధంబరుఁడ్యాన్.

కావ్యా ౬. ౪౦

జ: పరుఁజించు

**పరుఁడు.** సం విణ (అ ఆ అ) ౧. ఆసక్తుఁగు, తిగులు గలవాఁడు (ధ్యానపరుఁడు, చింతా పరుడు మొ) ౨. భిన్నుఁగు, వెఱవాఁడు, లాఁతివాఁడు.వి అ. పుం పగవాఁడు, శత్రువు

సీ పాశుపతాస్త్రోపదేశంబు సేసెదఁ బరులఁ గెల్వము ప్రతాపంబుమీఱ

కాశ ౪ ౧౯౪.

— న - పరమాత్ముఁడు.

**పరుగు=పరువు.** వి ౧. ప్రధావనము. (చూ. పరుగెత్తు) ౨. కోసుదూరము. (చి ని శ. గ) జ = పరుగెత్తు.

**పరుగెత్తు.** అ. క్రి (పరుగు+ఎత్తు) ప్రధావనము చేయు.

గీ ..మెకములు గరలి చెదరి, గొంతిఁజదాటుగఁ బరుగెత్తి తిరిగి చూచె. కవల. ౧. ౯౫

సీ. పందులఁ బోడిపింపఁ బరుగు శక్తిఁగ వచ్చుఁ బులులను శిక్షింపఁ బోవరాదు.

రాఘలిం. ౫.

**పరుత్.** సం అవ్య శ. నిరుడు, పోయినయేఁడు (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగము కన్పడదు)

**పరుత్నము.** సం విణ. (అ.ఆ.అ) నిరుటి,పోయిన యేఁటిది.

**పరుద్వారము.** సం. వి. అ. పుం. అశ్వము. (వాచ.)

**పరుమగు.** అ క్రి (పరుము+అగు) చూర్ణ మగు

క. పరిచూర్ణ మయ్యె ననుటకు, పరుసన్ నామంబు లగుచు వర్తిలుచుండున్, దంఱు మయ్యెన్ బరు మయ్యెన్, నుఱుమయ్యెన్ బిండి యయ్యె నుగ్గయ్యె ననన్.

ఆం. శ ౫౯.

**పరుము.** వి. నుఱుము, నుగ్గునుసి, చూగము (చూ పరుముచేయు)

జ ‧ పరుమగు, పరుముచేయు

**పరుముచేయు.** స క్రి (పరుము+చేయు) నఱుముచేయు, చూర్ణముచేయు; పాడుచేయు

సీ చేలకావలవారిఁ జెంచి చిందఱకేఁగి పండిన సస్యముల్ పరుముచేసి...రకామ్రం. ౩. ౧౦

**పరుల.** సం. వి ఆ స్త్రీ సర్వమంగల, పార్వతి; (శే. ని.)

**పరులము.** సం. వి అ పుం. గుఱ్ఱము, అశ్వము (వై ని. శే. ని)

**పరువడి[1].** వి. (పరువు[1]+వడి) ౧. పర్యాయము క్రమము, వరుస; మరల.

క. నరబాధ సుఖము దుఃఖముఁ, బరువడి మెయిఁ బొరయుఁగాక పన్నగ నరునిం, బొరయునె యం దొక్కటి,...

భార. శాం. ౪. ౧౭

క. పరులనిజకర్మములఁ బ, ర్విరులం గావించు ధరణిపాలుఁడు దాన, న్నరుల సుకృతముల లోనం, బరువడిఁ గొనుచుండు షష్ఠభాగము పుత్రా మార్క. ౩. ౧౪౦.

పరువడి³. వి. మల్లవిద్యావిశేషము, మల్లుఁడు వేయు అడుగులభేదము; అశ్వగతిభేదము. (భేదములు)

గీ... తద్విద్య సాధన యనఁగ నెగడు, పరుస పరువడి గాయమానంబు విసరు, మొన లనం గను... చెలంగు... ఆం భా. ౨. ౨౦౫.

వ... చిట్టడుగుకత్తెర పావుపావులు జోగినపావు మొదలుగాఁ గల పదిరెండు పరువళ్ల యగణ్య ప్రావీణ్యం బెఱింగి... హంస. ౨ ౨౦౬. ప్రబంధ. ౪౭

క ..మురిలి గొని యురవణమునను, బరువడి గోమూత్రికాది భంజళులఁ గడుస్,గరలి... పాండు. ౧ ౧౬౪.

౫. పరువళ్లు దుముకు, పరువళ్లు ద్రొక్కు.

పరువము=పరువు². వి (సం. పర్వ ప్రా. పరువ) ౧ (సస్యము, పుష్పము మొదలగు వాని) పరిపాకము, పక్వస్థితి

గీ. అంత నవ్వాన తరువాతియుదయ దోఁపఁ, బంటపూఁబోఁడి తన ముద్దుపట్టికొఱకుఁ, బలువగలఁ గుంద మేసెల్లఁ బచ్చవారె, ననఁగఁ బరువంపుఁబైరులు గొనబు మీరె. అచ్చ. రా. కిష్కి. ౬౭.

సీ. పరువంబు దప్పినవిరుల రాలుచుఁ దరు చయము చుక్కలు లేని చదలఁ బెనయు. భార. ఉద్యో. ౨. ౧౧౨.

క. పరిమళము పెడదు వాడదు, పరువము దప్పదు... పారి. ౧. ౫౯

౨. ప్రాయము, వయసు.

గీ... ఇపుడు, దేవకీరాసుఁ డై యున్న దేవకేవ్వఁ, డితఁడు పూతనాప్రాణపాయితఁ దలిర్చెఁ, బురిటిపాపఁ డై యొప్పారు పరువమునను. పారి. ౪ ౫ ౨౨౫.

గీ. జాను మీఱిన చాయయు మేనమామ, యూఁకు రును లేఁత పరువంపు గుబ్బెతయును. నీలా. ౨. ౧౩.

౩. యుక్తసమయము

వ... అని సప్తమం బైన యవస్థాంతరంబు దేట పడం బలికిన నులికిపడి పాలికయు నిశ్చాలిక మనః పరిపాకంబుఁ బరికించినం గార్యంబు పరువంబు దప్పినయది .. కవిక ౩, ౧౦౭.

గీ. కలికిచూపులఁ బరువంబుగా వొనర్చి,తిలక మునఁ బూవు లొకకేల్పుకెఱవ గోసె. పి. శకుం ౨. ౧౩౭

సీ. పరువంబుగాక చొప్పదనిమామిడిలేఁత లాన నాపాన నక్షాదునవిరుయ పారి ౩. ౫౧.

గీ ప్రోదిసేయంగ నలయించుఁబోణి కెలయు, మలయు పరువంపుజవ్వనం బలముకరిన. శుక. ౧ ౩౪౭.

౨ మనోజ్ఞము

సీ. పరువంపుఁబుటప్పుడి బాగుగాఁ దీర్చిన యల కలపై బొలుపార నలికి పారి. ౪ ౪ ౨౫౦.

సీ గుజ్జ లేమావిమ్రాఁకుల నంటఁ ద్రాఁకెనపరు వంపుఁ దలిరాకు పందిరులును. అచ్చ. రా. బాల ౧౧౪.

పరువళ్ళుదుముకు=పరువళ్లుద్రొక్కు.

ద్వి. పరువడి వెనుకకుఁ బరువళ్లుదుమికి, ద్వి. శ పా. ౨౫౯ పం

పరువ(డుల్)ళ్ళుద్రొక్కు= పరువళ్లుదుముకు. అ. క్రి (√ పరువడి.) మల్లవిద్యావిశేషము చూపు

వ... కళోరశరాకరశాకరకంత ప్రభృతి సాధ
నంబుల సాధనమొంబడినరుపడిం బరువళ్లు
ద్రొక్కుచు... కవిరా. 3. ౨౫.

గీ. కదలం బాణాల్పటాలం బొగ్గలిశఁ బూని,
పరువడుల్ ద్రొక్కుకొనుచు నిబ్బరపు రీఁగ,
ములం గవంబడ పాపరుల్ ద్రోలఁ
జెలఁగి,సాదన లానర్ప జెట్లు పెచ్చరిలఁ
జెనఁగ రసిక. ౧ ౭౧

పరువీఁడి. విశే (పరువు² + ఈఁడి) గౌరవ
హీనుఁడు

సీ. పరమేష్ఠి నీకంటెఁ బరువీఁడిరేఁ కిగ మెప్పించి
నిత్యుఁడై యున్నవాఁడు.
శు. సం ౨. ౧౬౪

పరువిడు. అ క్రి (పరువు¹ + ఇడు) పరుగెత్తు.

క. అంబరమణి పొంబరుఁ డయ్యెం బరువిడుఁ
జరమగిరికి ఉ. రా. ౫. ౨౭౦

గీ తరణి మెఱుఁగారు గారుడధ్వజముఁ గాంచి,
కలఁగి పరువిడు చిలువపగ్గములు నడలి
దశా ౧. ౧౭౫

పరువు¹ = పరగు, పరవు, అ. క్రి. వ్యాపించు

రగడ. తరణి తరణిశఁ జేరు కొచ్చలి దరము
దరమున నాహ్పవీవలి, పరువఁ బరువముఁ
బొందె వావిలి బాలబాలచ్చదనమావళి
చంద్రి ౪ ౬3

గ్వి ప్రాగంగ సాకతు ప్చరివిచదృష్ట్లు, కరము
నైవేద్యంబు గరపినదృష్ట్లు.
పండితా. దీక్షా. ౬౧ పా.

౨. (=పర్వు) ధావనముచేయు, పరుగెత్తు.

వి (=పరుగు—క పరి.) ౧ ధావనము, పరు
గెత్తుట.

క. భగదత్తు సేనఁ గదరిన, వెగడునఁ బాండవుల
సేనలు విఱుగుటయు మహా, నగ మేటిమేగ
మాలిన, పగిది ఘటోత్కచుండు బానిపరు
వుడిగించెన్. భార: భీష్మ. 3. 3౫.

క తెరువి వృష్ణి యటు లడుగుచు, నరభరగతి
నుదక మిరుదెసలఁ బాయఁ గడుం, బరువునఁ
బోవఁగ నద్యోధుఁ, దరుణి యమున మఱి
కాలం తడి గాకుండన్ భోజరా. 3. ౨3.

౨. కోసుదూరము

సీ. శతకంతుయూలను శ్రీనివాసునికిఁ దక్కవ
యయి నాల్గుపరువుల కేఁగ.
శేష. ౪ ౧౯౧.

సీ. పరికెఁడుదవ్వున బరికెంత పడుమటి పాల
వునఁ దొమ్మిదినిధుల విరాటి, దనుజాఁడు
దాఁచిన ధనము, పెక్కున్నది
ద్వా ౫ 3౨౨

3. అశ్వగతిభేదము.

గీ ..జోదన సద్దకేడె, మురవవడ చుట్టుపేరెము
పరువు లనఁగఁ, బంచధారల పేర్లగుఁ బంక
వాడ్క. వెంక తిర్య ౯౧.

క పరువున మురు లై యుండును, మురపురమునఁ
గల్పతరులు చూపఁ కింపై, పరువున మురు
లై యుండును, దురగంబు లరూఢ్యఁగల
ప్రతోలికలందున్ పెం రా. బాల ౫.

జ పరువడి 1, పరువళ్లుదుముకు, పరువళ్లు
ద్రొక్కు, పరువిడుఁ పరువుగొను, పరువులు
వాఱు, పరువులుపెట్టు, పరువెత్తు.

పరువు²=పరువము. వి ౧ పరిపాకము

ఉ కొంత ముఖంబునం గలదు కోమలి నా
కిటఁ బర్ణశాలికా, ప్రాంతమునందు నీవు
పెనుపం బరు వొందిన మాలతీలతా, క్రాంత
మనోజ్ఞమైన సహకారముఁ గన్గొనునప్పు
డెల్ల దుష్యంతుఁడు మాకమంతలయు సంగడి
నుండుటగాఁ దలంపఁగన్.
వి. శకుం, ౪. ౯౧.

౨. గౌరవము, మర్యాద.

(దీనికి సందర్భానుసారముగా 'క్రూరత్వము, తైక్ష్ణ్యము. లేది' మున్నగు నర్థములు వచ్చును)

క. శరముల వేగంబున గద, పరుసఁ దనంబునను గలఁగఁబడి చేష్టదప్పా, గురులం ద్రోలెను భీముఁడు,... భార. భీష్మ. ౨. ౨౧౫.

సీ. అత్యంతచిరకాల మదవులఁ గొండల బాధలఁ బెట్టిన పరుసఁదనము. భార. ఉద్యో ౧ ౩౮౬

క పరుసఁదనము మెయి నరిగొనఁ, బోరఁ దగదగి బొదుఁగు గోయుచో ప్పగు విను... భార శాం. ౨ ౨౯౯

సీ. నరి కాగ్ని శరముల పరుసఁదనం బంతయును నొక్కటఁ గూడి తనర ననఁగ. హరి. పూ ౬. ౮౩.

గీ నయము కొద యాక రొల్ల బెంటలన బెఱచు, మాట పరుసఁదనంబు కుమారచంద్ర వి శకుం ౪ ౧౬౮.

రగడ. భారసు విరహిణుల కురుష్పులకములఁ దిలకములఁ, బరుసఁ దనము కపోల ఫలకముల నలకముల. రాఘవ ౨. ౬.

పరుసన=పరుసఁదనము. వి. (√ పరుస 2)
కాఠిన్యము.

సీ. తురగసముద్ధతి ఖురశాదనంబుల పరుసన దహిరాజు శిరము లదర భా రా యు ౨౧౦౮.

సీ పలుకు ప్రల్లదమునఁ బారవులును బరుసని దండమున జరాసంధనృపతి కేయూర. ౪. ౨౦౩.

సీ. వక్షంబు గుంతరై వక్త్రంబు పరుస నై తెలినోరఁ ద్రేవుడు తీఁగ సాఁగ. కాశీ. ౬. ౪౧.

(విరుసుతనము. అని భావము)

గీ. పైత్యదోషోదయంబునఁ బరుస నైన, జిహ్వకుఁ బంచదారయుఁ జేఁదు గాదె. హైమ. ౨ ౧౨. (దోషము అని భావము)

౨. (=పరుసము) నిష్ఠురోక్తి, కాఱులు.

సీ. కఱకు కరుసు కాఱు కాఠోర్యము పరుసము పరుసన యనఁగ నిష్ఠురము వెలయు. ఆం భా ౧ ౧౧౪

పరుసము¹= పరుసన. వి (సం పరుషం)

౧ కాఠిన్యము.

గీ వెత్తినీ రామశరమున వెదలునట్టి, చొక్కఁ బోఁదట్టి రొంకకన్న తెక్కఁ బెట్టి, దడిఁ గఱవఁబోవు వేసిఁ చందమునఁ బట్టి పరుస మెచ్చఁగ మానుజప్రముఖుఁ బలికె. కుశ. ౩ ౩౨.

౨ నిష్ఠురవాక్యం, నిష్ఠురోక్తి

వ...మీకు నగ్ని పరిగ్రహంబును బ్రాహ్మణ సంగ్రహంబును లేమిం జేసి పరుసంబులు పలికితి భార ఆది ౭. ౫౭.

క పురుషుండు రెండుదెఱఁగుల, ధర నుత్తముఁ డనఁగఁ బరగుఁ దా నెర్యోధలం, బరుసములు పలుకి కునికిన్, దురితంబులు వొరయుపనులు దొఱఁగుటకతనన్. భార. ఉద్యో. ౨.౪౧.
—వి॥ దుష్టము; కఠినము, క్రూరము.

క...ఇప్పరుసమునఁ బరుసపునడవడిఁ, గురువంశ ప్రవర యిట్లు గూడునె చేయన్ భార ఉద్యో. ౪. ౩౫౦.

పరుసము²= పరుసవేది. వి. (సం. స్పర్శః, శ. పరుష) స్పర్శమణి

ద్వి. తొడిఁబడఁ బరుసంబుతో నిమ్ము సోఁకి, కదుపది కొల్మి బంగార మైనట్టు. ద్వి. హరివ. ఉ. ౨౯౦.

౩. (మాట) ఉచ్చరించునట్లు చేయు, వదింపఁజేయు.

వ. ..ఆ బింబోష్ఠి మౌనవ్రతనిష్ఠాగరిష్ఠ రై యుండ హృదయపుట భేదనంబు గావించి మూఁడు మాటలు పల్కించుట యత్యంత దుర్లభం బని తలంచెద... విక్ర ౬. ౩౧.

వ...జిహ్వాద్యష్ట స్థానంబులవలన శబ్దరూపంబుగాఁ బలికించుచు... సీతారా ౧ ౧౬౩.

౪. వాయించు.

గీ. ప్రౌఢిఁ బలికించు గీత ప్రబంధములకుఁ, గ్రమకరపంకరుహారత్నకటక ఝణఝణా ధ్వనిస్ఫూర్తి దాళమానములు గొలుప, మనుచ ౬ ౨౮.

౫. పలుకరించు, పలుకఁజేయు

సీ. వలసినప్పుడు వచ్చి యలిగి యున్నట్టిచోఁ బలికించుదాఁక దవ్వునను నిల్చి కువల ౪ ౧౯౪

సీ. పలికించుఁ దలఁకించుఁ బొలఁతి విచారించుఁ జేరి పువ్వులఁ బూజసేయు నబల వీర ౧. ౨౦౭

పలిక్ని. సం. వి. ఈ. స్త్రీ. అఁడుమేఁక. (వై. ని.)

పలిక్ని. సం. వి. ఈ. స్త్రీ. ౧ వెంట్రుకలు నరిసినయాఁడుది, ముదిసినయాఁడుది ౨. బాలగర్భిణి యగుగోవు. (వాలా. ని.)

పలిఘము. సం. వి. అ. పుం. ౧ కాచఘటము, గాజుపాత్ర. ౨. ప్రాకారము. ౩ పరిఘము, ఇనుపగుదియ. ౪. గోగృహము, పసులకొట్టము.

పలితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ నరసినది ముదిసినది. ౨. బురద కలది. వి. అ. పుం. న. ౧. నర. ౨. నరవెంట్రుక. ౩ తాపము. ౪. శిలాజము, రాతిపువ్వు. ౫. బురద, కర్దమము (కే. ని.) ౬. మరీచము, మిరియము. (వై. ని.) ౭. అంకము. (శే. ని.)

పలు[1]. విణ. అనేకము. (వృత్తియందు పొల్లు పరమగుచో నుత్వలోపము వికల్పముగా నగును)

వ. పలుచోట్లంబడిన శస్త్రంబులును . ఉ. హరి. ౧ ౫౩

కి. పలుదెఱఁగు ముల్లమాటలు, కలహామె కల్యాణ మని జగంబులవెంట, న్మెలఁగెడు మానికి సహజము పారి ౧ ౭౫

క. పలుమాఱు బిట్టు నవ్వుట, పలుగొఱుకుట యనుచితములు వి. పు ౪. ౨౩౩

క. ధనువు దునిమి నవ్వెన నీతనయుఁడు పటుశక్తి నైచెఁ దలఁకక యది సల్లనియులుగెఁ జేసె సాత్యకి .. భార. ద్రో. ౪. ౧౦౭

ఉ. మైనపుటంటు పల్వగలమచ్చులచా లొగల్గి కట్టెలన్ శుక ౧ ౪౨౧.

—పలుమంది=అనేకజనులు

ఉ...లోకవిభుండు దాన రై యున్నాఁడు దురాత్ము లైన దితినందనులన్ బలుమంది గూడుకొన్నాఁడు... ఉ. రా. ౨. ౨౪౭.

మ. ఎలప్రాయంబున జెల్వముస్ జతురతిల్ హేలావిశేషంబులన్, గలికిన్వ్యామ బెరవ్వరొక్క బలిమిన్ గాంక్షానుకూలంబుగాఁ, బలుమందిన్ జెఱఁదెత్తు... ఉ. రా. ౪ ౭౯.

—పలుగూడు=మధుకరాన్నము

ద్వి. తిరిసినపలుగూడు దెచ్చి నిచ్చలును,వరుసనొక్కొకకడి వనరుచుఁ గుడిచి ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౫౦,

ద్వి. పలుగూడుగాక యే పట్టున నైనఁ,గలదె పాయసము భిక్షాం దేహి యనిన. ద్వి. హరిశ్చ. ఉ. ౧౨౩౪

జ: పలుఁబోకలు, పలుమఱు, పలుమాటు, పలుమాఱు, పలువ, పలువిత్తు, పలువురు.

**పలు²**=పల్లు². (దీనికి వృత్తియందు పల్లుపరి మగుచో నుత్వలోపము వికల్పముగా నగును)

సీ. పలు రాల మును వచ్చి బాలు వేలుపు మన్నఁ బండ్లులేకుంట సిగ్గొప్పఁ దనిరెు

భాగ. ౯ ౧౯౬

ఉ. ఆయజుఁ దప్పు దంగినముఖాబ్జము బల్మిని వంచి మోవిపైఁ, జే యటు పొఁ ద్రొబ్బి పలు చేర్చి నొక్కించుకొ నాఁటునట్లుగా

కళా. ౫ ౧౬.

**పలుకెంపు**=దంతక్షతము.

సీ. చిగురుఁ గెంగేలపోవి నొగిలించి పలుగెంపు లదరఁజేయుచుఁ దేరి లాని యాని

ఉ. రా. ౪ ౨౧౪

**పలుగ(ల్ల)ంటి**=దంతక్షతము.

ఉ. అంటిఁ గందునో యనకి యంగము నిర్దయ వృత్తి మీఱఁ గొఁ, గింటికిఁ దార్చి వు జ్జగునో కెంజిగు గట్టిది నాకి మోవిఁ బ, ల్లంటు లొనర్చి చన్నవ నలంగుని నాకి నఖాళిఁ గెర్చి వా, ల్గంటి రమింగా

ఉ. రా. ౪ ౪౪౪

**పలుగజనే(చె)యు**=దంతధావనము చేయు.

సీ. పలుగజేసేయు ననుప్రభు నలిపించుకొనకి మొగముఁ గడనము లేక...

ప. ౫ ౬౬

**పలుగట్టుఁబుడుకిలు**=పల్లుకట్టుకొను పుడు కల వంటివి.

కి. కిలకూపు లేవి చేయుము, పలుగట్టుంబుడుకి లివిరెు పార్థివ సాకం, బలుగ్రోఁతులం దంష్ట్రాంతర, ములలోఁ జిక్కుకొని యూడిపో విడ రెుపుడుఁడ్

రామా. ౭ ౧౫౭ (మిక్కిలి యల్పములు అని భావము)

**పలుగుఱుపు**=దంతవ్రణము.

కి. తెలనొప్పి కిడుపుగట్టుం, బలుగుఱుపుం గాల్లుతీఘ పాటించుచు కుక. ౨. ౨౧౫

—**పలుదాఁకు**=దంతక్షతము

సీ. వాడు చూపినకేఁతవాతెరపలుదాఁకు జిలుఁ గు కెందలఁ జిమచిమ యనంగ

విరం. ౨ ౨౧

—**పలుదె (ద్దె) ర**: రదనచ్ఛదము, వాతెర.

క. పలుకులు కెంపుఁగఁ గీరము, పలుదెర పం దనుచు నొడిసిపట్టగ వెగయన్,

(శృంగార గోపాలవాలము ౧. ౬ (శ గ)

వ. మధురామృతంబులు వడయం బలుదెఁ సొబగు లానుచు వసు. ౨. ౧౪౦

చ. కిళ గిలమోము కెంపుసిరి గాంచిన పద్దెర కేశిలొల్కు ప,ల్కులు

చంద్రి. ౨ ౧. ౨౪.

...**పలునొ (ల్నొ)క్కు**=దంతక్షతము.

సీ. దంతక్షతాభిధ తనరుచుండుఁ, బలుగంటు పలునొక్కు పలుగెంపు లనఁగిను

ఆం. భా. ౨. ౧౬౦.

సీ. పలునొక్కులను జిక్కుపఱపకు మని క్రొంక్కు కుసుమకోమలి గనిబిసి రెుునర్చి

మృ. వి. ౧ ౪౫

ఉ. చెక్కులచుంబనాంకితములు చెందొగిచాయల మోవిమీఁది పల్నొక్కులు...

కవిరా. ౫. ౨౩౦.

జః పలుకిప్పు, పలుకిలు, పలుగొఱ్ఱు, పలు వరుస, పల్గొమ్ముల మొకము.

**పలుఁగు.** వి (సం స్ఫటికః, ప్రా. ఫలిహో, క. పలిఙ్గు)

౧. స్ఫటికము

ఉ. ఏనికతోఁ బుచ్చుదము కొమ్ములగుబ్బనరంబు సంపఁగఁ, జేనియ తియ్య విల్లుఁ గొని ద్రెంచినబోట్టు పలుంగు సెట్టెమున్... ఉ. హరి, ౨. ౧౬౨. (పలుంగుసెట్టెము 2 స్ఫటికపు శావళముచుట్టు.)

ఆ పలుఁగురాలకుడ్యములరుచుల్ గప్పి న, జలములున్నయెడలు వెలయఁ జూచి, యవన నుపస్థలంబు లని జను శెలుఁగఁ, యుండు నట్లుగా మయుండు నేసె

భార. సభా. ౧. ౧౨

కి. ఒకచోటఁ బువ్వుఁబందిరి, యొకచోఁ జప్ప రము దూఁగుటుయ్యెల యొకచో, సకినల గిలిగిలిమంచం, బొకచోఁ గప్పరపుఁబలుఁగు టోవరి యొకచోన్

హైమ. ౩. ౧౪౭, హర ౫. ౪౦.

౨. స్ఫటికభేదము.

సీ పటికమం చనఁగను స్ఫటికంబు విలసిల్లఁ బరగుఁ దద్భేదంబు పలుఁ గనంగ

ఆం భా ౨. ౨౭

జః పలుఁగుఱాయి.

పలుఁగురా(ఱా)యి. వి. పాలరాయి, తెల్ల రాయి

వ ... ఝల్లికంబుల యూత్రోశంబుల బెదరి గుములు వాసి యులికి టంపుక మమతెఱవులం బఱచుతతి బలుపలుఁగుఱా త్రొక్కుటంబుల గిట్టలు పగిలి వాగిలి చాఁపకట్టుగాఁ బడు సారంగంబులకు .. చంద్రా ౨. ౭౪.

సీ. పలుఁగుఱా లొల్లక తొలఁగి వచ్చినఁ గంటె పలుఁగుఱా లివి గానఁబడియె నిందు.

రామా. ౫. ౪౧.

సీ. పలుఁగురా యనఁగను పాండుశిలాఖ్య యౌ... ఆం. భా. ౨. ౨౯.

పలుక[1]. విణ (√పలుకు[2]) విదర్ణమైనది, పదలి నది. (వి శైవర్ణ్యము అని శ ర) చ. పలు కినిపోయెఁ డొత్రుపడు పాదములున్ వగ గంపుటూర్పులున్, వలవల నైన దంతములు వంగిన మేను. విక్ర. ౨. ౧౫౫

పలుక[2]=పలక. వి ౧ డాలు, అడ్డనము

గీ విరథుఁ డై చక్కురుండు దోర్వీర్య మెసఁగ, వాలుఁ బలుకయుఁ గొని శీఘ్రలీల గదిరి

మార్క. ౭. ౯౭

ఆ. పలుకి పగుల జేసి యలుంగు కుత్తునియలు, గా నొనర్చి హరి ఉ. 3 ౧౫౧ రా వి ౫ ౨౦

౨. జూద మాడు బల్ల

వ సైరంధ్రిం గనుంగొని సారెలు దెమ్మని పనిచి పలుకి ముందటికిఁ దిగిచికొనుచు ర మ్మనవుడు భాగ విరా ౫ ౨౪౪

3 (జూదము) ఆట.

వ .కింపు సాలోకించి సెత్తం బొకపలుకి యాడుదమే . భాగ విరా ౫ ౨౪౪

క ఆపలుకియు రుక్మి సమ్ముద్దపతుఁ డై గెలిచె నలుకి దీపంపఁ జలంఁబేపార నిట్లు పలు మలు, నోపక సాడుచును బలుఁద యోడుచు వచ్చెన్. హరి ఉ 3 ౨౩౨

పలుక[3]. వి వృత్తివిశేషము

సీ. పేరుపనస గుత్తి పెట్టి నారువ శేల పనస కిరికి కొమ్మిత్ర పలుకి రేణి.

హంస ౪. ౧౧

పలుకఁబండు. అ. క్రి (పలుకన్ + పండు) మిగులఁబండు

వ...పలుకంబండిన మాతేడుపండ్లగారాముఁ జెఱచు గబ్బిగుబ్బలబెడంగులును

హర. 3. ౨3.

**పలుకఁ(ల్క)బాఱు.** అ క్రి (పలుకన్ + పాఱు) తెల్లనగు, వివర్ణ మగు; వెలవెలవోవు, రంగుమాఱు

సీ నీరంధ్ర మగు దీనినీడను పెరిఁగిరా మలయ జద్రుమవాటి పలుకఁబాఱె
వరాహ ౧౨ ౪౭.

గీ తారమైఁదీఁగ విచలోద్ధ్రప్రసూన, పాండు చ్ఛాయ సొయ్యెయ్యఁ బలుకఁబాఱె
కాశీ ౪ ౨౦౬

ఉ చెక్కు ల పల్కఁబాఱెఁ గడుఁ జిట్టుము లయ్యె మొగంబు వాడెఁ జన్మొక్కు లు ల్లవ్వగూడె ద్వా 3 ౫౮. (ప్రాఁచి ప్రతి పా)

చ పలుకఁబాఱె నిశాంతనిశాంత దీపముల్
పార ౨ ౫౯

చ తెలయూఁచెం గిలకించె యచ్చెరువునం దాటంకగత్నప్రభల్, పలుకంబాఱెన చెక్కు టద్దములపైఁ బైపై విలంఘింపఁగాన్..
కాశీ ౫. ౧౬౭

సీ తిమిరాంభాగర్భదళ తాళవృంతంబు పైగాలి వెక్కని పలుకఁబాఱె .
నైష ౨ ౧౧౯

(మ్లాన మగు, వదలిపోవు అని భావము)

పలుక(ల్క)న. వి (ప లుక[1]) వైవర్ణ్యము, తెల్లన (దీని యామ్రేడితరూపము 'పలుపల్కన')

సీ పలుపల్కపై మ్రానుపడి పండ్లు చూపెడు పుడుకఁ జట్లను వేఁడఁ బోవనేల యయా
౧. ౫౯. (శ ర పా, 'పలపలనై' ముద్రిత పా)

**పలుక(ల్క)ప్పు.** వి (√ పలు[2]) రదనచ్ఛదము, పెదవి. (శ. ర.)

గీ పరగఁ బల్కప్పు పొవి వాతెర పెదవియు, వాఁగ నోష్ఠంబు... ఆం. భా ౨. ౧౪౨

**పలుకమి.** వి. (√ పలుకు[1]) మౌనము (పలుకు ధాతువుయొక్క వ్యతిరేక క్త్వార్థకరూపము.)

సీ...మౌనంబు పలుకమి వాకెసంగు
ఆం. భా. ౨. ౧౬౪.

**పలుక(ల్క)రించే.** అ క్రి. (√ పలుకు[1]) మాటాడు

సీ పలుకరించినను జెంతలఁ జేరరాకుండ వాతుం పురలు చిత్తవానగురియ విప్ర ౪ ౧౯.

మ సొలయున్ జూచు నగున్ బయల్ బలుకరించున్ బల్కు నూఁకొట్టు బి, ట్టలుగున్ బ్రొంకుఁ బ్రియంబుఁ జెప్పు నధరం బల్లార్చి కోశా మ్మనున్ చంద్రా ౨. ౪

చ కలయఁగఁ బల్కరించి రుపకారులు నై రని నమ్మి యుండఁగా, వలవదు బుద్ధిమంతులు నవప్రియు లైన ధరాధినాథులన్
భార. ఆది. ౪ ౭౯

—స క్రి (=పలికించే) ౧. మాటలాడఁ జేయు, మాటలాడించు

గీ మొలకనగవులు మొగమునఁ గులుకరింపఁ, దళుకుఁజేనియు నుడువులఁ దొలకరింపఁ, గలికిచూపులు వీనులఁ బలుకరింప, సొలపు నడపుల నందియల్ గిలుకరింప చంద్రా 3 ౯౨ (దగ్గఱఁ జేరి యోగక్షేమము లడుగు భావము)

గీ జపము హోమంబు ధ్యానంబు సలుపుచుతేని. భక్ష్యపానీయ చూష్యముల్ పాయసంబు బుచ్చుకొనువేళ శూద్రులఁ బొసఁగఁ బలుక రించువారలపాపంబు తెంచ వరిది
శివ. ౩. ౧౯

ఉ . ఏ, కాంతమునందు నున్న జవరాంద్ర పెపం బిడి పల్కరించు లా, గింతయు కాక నీ పెటుఁ గకె మును వచ్చిన త్రోవచొప్పు...
మనుచ. ౨. ౪౧.

సీ. ఒడలెఱుఁగనిదప్పి నుదరిపాటునఁ బల్కరింపఁ బుట్టెడు కీకరింత దలఁప. ఆము. ౫. ౭౦

౨ అడుగు, ప్రశ్నించు.

గీ. కస్తూరి లాక్కొని రతికేళిమీఁద, మనసు పాటినఁ గంకటి మైలదీరఁ, బిఱిచి విడె మెల్ల రే యంచుఁ బలుకరింపఁ, గుక్క కూఁతుర వలదంచు వెక్కిరించు.

శుక. ౨ ౪౫౬.

౩ పెచ్చరించు. (శ ర.) ౪. ఉచ్చరించు.

అన్ని నామంబులఁ జతుర్థ్యంతంబులఁ జేసి నమః పదంబులఁ గూర్చి పలుకరింపుచు నావాహనంబుఁ జేసి . హల్లిపు. ౩ ౬౦

౫ పిలుచు

౬ ఒక్క పెనుదయ్యము న న్నగలించి పట్టి యాశ్రితు వింత చేసి పెఱకించి చూచి న్నన బల్కరింప వాగ్జాలత, చాల దయ్యె...

శుక ౧. ౨౩౪

౭ విలసించు.

చ అనుచును బల్కరించు వసుధామరివల్లభుఁ బిల్వఁజాచు నిమ్మును లతికోపను ల్వరము మార్గులం తాళుకొనంగ జేర కేమని కవి యింతురో యని భయంపడు...

విప్ర ౩ ౬౧

పలుక(ల్క)రింత. వి (√పలుకు) వాచనము, మాటలాడించుట

(౧. మాటాడుట ౨. పెచ్చరించుట అని శ ర.)

సీ . పలుకరింత యనంగ వాచస్థ సంజ్ఞ రైయి పఱలుచుండు. అం భా. ౧ ౧౧౧ (ప్రాఁత ప్రతి పా)

౯ నియాగారవృదమిఁ గపట, ప్రియముల మెఱ మెచ్చుఁ బల్కరింతను మిథ్యాచయములను బై వదారవు నయమున మానిఁ గూడి కొన్ని జాల్లు రచియింపన్. వి్రపు. ౪. ౧౩.

పలుకరింపు. వి (√పలుకు¹) పలుకరించుట

సీ. వీనుల నరసాఁకు వీద్యంపుఁదావుల పలుక రింపుల మేను పులకరింప అని ౩. ౯౫

పలుక(గ)ఱ. వి. (√పలు²) దంతకాష్ఠము

ద్వి కరమున నఖకాంతి కలిత మై నిలుచ్చుముర డించుపలుకరఁ బూని తాంబూల, రసనిరం తరరాగరంజితం బగుచుఁ వవ. ౫ ౨౫౮ పా ౧౮. పం (క్రొత్త ప్రతి పా)

పలుకాడు. అ. క్రి. (పలుకు¹ + ఇడు) మాటాడు

సీ దెసల నొందినయట్టితీరు గానఁగఁగచ్చెఁ బలు కాదరేమి దిక్పాలులాగ దశా ౨ ౭౫

పలుకు(ల్కు)¹. స క్రి ౧ అను, వచించు

కొలఁది రెఱుఁగకట్టి పలుకుల్ పలుకందగుఁ గాదు వాక నన్, బలుగుఁదనంబునం బలుకఁ బాడియె నీసుకి నంచు...

భార అని. ౫ ౨౦౩.

క. అతఁడి నొకకాతరస్త్రీ, శ్రాతిలకము కలికిఁ బలికెఁ బ్రాభాతిక కో, భాతిశయవతుక్క కేళయ, నూఁన మధుమధురతామనోహా ఘణితిన్ వసు ౪ ౧౨౭

చ...మానిని యిట్టిజితాత్మ నన్ను ని, ట్లని పలు కంగ నీకగునె యన్యులఁ బల్కినయట్ల చేల వై భార ఆది ౪ ౧౩౭

క. కవితామధురిమ డెందముఁ, దవులం గొలు వుండి సదయతన్ వనుఁ బల్కెన్

మనుచ. ౧ ౧౩ నైష. ౩. ౧౪౪.

౨. నిందించు, దూషించు.

సీ...కృతవీర్యు ధవ మెల్లఁ గ్రుప్పి వేసి, కొని డాఁచి యున్నవా రని భార్గవులమెల్లఁ బలి కిన భార్గవుల్ భయమువొంది.

భా౯ ఆది ౭. ౧౩౨.

గీ. అంతఁ దెచ్చితి సీతాడు కవిక రథము, తోలఁగఁ దెచ్చుటఁ గనుఁగొని యలిగి నూతుఁ, బలికి పరభసముగ నడుకలని కేఁగి యొలుఁగు నాపిన బలములు నిలిచి పాదికె

భార. భీష్మ. ౨ ౧౧౬.

చ... అనివార్యుల బాహ్లీక సోమదత్తులం, బరు లవలీలఁ జంపిరి కై. పల్కఁడు కే మని యేఁగు దైవమున్. భార శల్య. ౧ ౨౧

చ పురఘస్మరుఁ బల్కుట నీకు బుద్ధియే. కు. సం ౪. ౯౬౦.

3. ఆక్షేపించు.

గీ రూపవిహీనులు దారు రూపు గలిగి తోలు మేనఁ గొనటులఁ బలికినారు

భార అను ౫ ౯౩

౪ ఉచ్చరించు

సీ లలిఁ దొక్కుఁబల్కులు పలుకఁ నేర్చినవాఁడె పరికించి సత్యంబు పలుక నేర్చె.

విక్ర. ౧. ౪౯

ఆ పలుకు లెవ్వి యైనఁ బలుకుచో హరిపేరు, పలుకఁబడియె ననుచు బ్రమసి పలుకు.

భాగ. ౧౦ పూ. ౯౪.

౫ (కథ మొ.) చెప్పు

క మదిరాక్షి యేతత్కథ, కాదవ యగుట తగదు కడమగూడఁ బలికెద, న్మదమున విని పొ మ్మని... శుక. ౧. ౨౩౯.

౬ (గ్రంథము) రచించు.

సీ. పలికె కుక్షేత్రీపమలజాతి పెంపెక్క రచించు కానవ మదాలసచరిత్ర.

ఆము. ౧. ౧౩

ఉ. ఏసు పరాశరుండు రచియించిన విష్ణుపురాణ మాంధ్రభాషా నిపుణోక్తులన్ బలుకఁ జాలెద నంచుఁ దలంచినాఁడ...

వి పు. ౧. ౧౦.

౭. తెలియఁ బలుచు, బోధపరుచు.

క స్నేహపరుఁ గథాదుల కోకటం బడి దోఁపం, బలికె మైత్రి వాపుట యొప్పన్.

ఆము. ౪. ౧౯౧

౮ భర్త్సించు, బెదరించు.

క పెలఁకుక చిలునగవులు పెన్నెలలం గని నవ్వు లేపు నిద్దపుఁ గులుకుం, బలుకులు చిలుకల నలుకఁగఁ, బలుకుం బలుకుదురు కోలుఁ బలుమగకాలన్ నీలా ౧. ౫౮ (ఇం జొపమ్యదోషితకము)

౯. స్తుతించు, పొగడు

గీ తీర్థదైవతకోటిఁ బ్రార్థించి పలికి.

కాశీ 3. ౯౯

ఉ పాండవపక్షపాతిమునఁ బల్కఁడు నోరికి వచ్చినట్లు ని, న్నొంవ దనరామిఁ జేసి యిది యొప్పదె భార విరా. ౪. ౯౭

—అ. క్రి ౧. ప్రతివచన మిచ్చు.

ఆ... కేమ, ధారి మిన్నకేని తిపముసేయు, చున్న యట్టు పలుకకున్నవాఁ డని యొగ్గు, లాడి యాకలు నయంబు లేక.

భార. ఆది. ౪. ౨౨౨.

వ. అని పలికి యతఁడు పలుకకుండం దమలోన.

ఉ. హరి ౪. ౪౫.

సీ. పాలయల్క నొకవేళఁ బలుకని పార్వతి వెఱ పించి కూర్తువు విశ్వనాథు. దశా. ౨. ౧౪౯.

౨. (పక్షులు మొ.) కూయు.

క. తెలతెలవాఱెడివేళం, గలకలమని పలికెఁ బక్షిగణ మెల్లెడలన్. భాగ. ౧౦. ఉ ౧౦౦౨.

గీ ..సర్వేరువాములఁ, బక్షులు గలకలంబునఁ బలుకఁదొడఁగె. భోజరా. ౨. ౧౧౪.

చ. చిలుకలు వల్కనో చెవులు చిల్లులువోవఁగ నంచు మెన్నఁడున్, కెలఁకుడు నందనోప వనవీథుల కై. హైమ. ౪. ౨౪.

క. తొల్లి శివుఁ గదవఁ బలికిన, కల్లరిఁ దన తండ్రిఁ దునిమి కడుభక్తిమెయిన్, దల్లమిగ ముక్తిఁ దయ్యోను, గొల్లఁడు గాఁడయ్యె కాటకోటఁడు రుద్రా. శివత త్త్వ ౪. ౭౧

జః పలికించు, పలుకమి, పలుకరించు, పలుక రింత, పలుకరింపు, పలుకాడు, పలుకుఁగలికి, పలుకుఁజిలుకలకొలికి, పలుకుఁజెలి, పలుకుఁ దత్తడి, పలుకుఁదొయ్యాలి, పలుకుఁదోడు తెం.

పలుకు². అ. క్రి ౧ తెల్ల నగు; వివర్ణ మగు.

సీ. పలికి రొంతయుఁ గ్రుయ్యఁబాఱిన మమఁ జెక్కు లందంద తడిపెడు వక్రువారి
హరి. ఉ ౩ ౪౪.

౨. రంగుమాఱు (చూ. పలుకఁబండు.)

జః పలుక¹, పలుకఁబండు, పలుకఁబాఱు, పలు కన, పలుకెక్కు.

పలుకు³(ల్కు). ముక్క, శకలము.

గీ...కప్పురంపుఁ, బలుకు లెదఁ బెట్టి - కట్టిన యలరుదండ. నైష ౩ ౧౨౩

సీ. కన్నీరు పన్నీటఁ గడిగి కర్పూరంపుఁ బలుకులు పెవులలోఁ బాఱనూది.
భాగ. ౧౦. ఉ. ౨౪౧

ద్వి. పలుకుల సేసిన ప్రాసంగుఁ బ్రాలు, నల వద మాన్పూఁటయఖండివుట్లు.
బస. పు. ౫ ౬౧౧. పం
(ఇట 'ముక్క' అని భావము)

చ. పలికె లతాంగి కనగవుపల్కులఁ గప్పుఁ బల్కులొల్కఁగా...దశా. ౪. ౧౦౪
ఇందు. ౪ ౨౨.

ఉ...మంచికప్పురపుఁబల్కులు ముల్కులు వచ్చ వెచ్చ. హరిశ్చ ౩. ౧౬౨.

జః పలుకుటీగి.

పలుకుఁ గలికి = పలుకుఁజెలి. వి (పలుకు¹ + కలికి.) సరస్వతి.

క లోకైకపాలకుండు దయాకరుఁ డెన్నంగ రఘుమహారాజా జయ, శ్రీకాంతుఁ డతని మతు నజాఁ, గైకొని చెలఁగితివి పలుకుఁ గలికియుఁ బోలెన్ ఇందు. ౬ ౭౧.

— ఇట్లే: పలుకుఁగొమ్మ, పలుకు(ల) వెలఁది

సీ పలుకుఁగొమ్మకు కోరిఁ గలిగించులోలిపెద్ద యీరేడుజగముల కేలుకోఁడు
ఉ రా ౧ ౭౦

చ పలుకువెలందికిన్ మనికిప ట్టగు చాలుపు మోముదామరల్, గలిగియుఁ బ్రాఁత ప ల్కులు చొకారముగా నుడువంగ నేర కే, తల తెగవ్రేటులం బడిరొ
ఆం. భా ౧ ౩౯

గీ పలుకులవెలంది తళుకుఁజెక్కుల విచిత్ర, పత్రముల వ్రాయ స్వేచ్ఛపాణి సనిల,సుతుని నెమ్మేను నిమిరిన కోప దీటి,వాడు శేఁబైరు వానచేవశెఁ జెలంగె ఉ రా ౫ ౧౨౩

పలుకుఁజిలుకలకొలికి వి (√పలుకు¹) సరస్వతి

మ పలుకుంజిల్కులకొల్కి గాచిలుక బాబా సాహిబూ సెయ్యపుం, గలవన్ సౌఖ్యము గాంచి మై బడలఁగా దశా ౧ ౨౬౯

పలుకు(ల్కు) జెలి = పలుకుఁగలికి. వి (√ పలుకు ¹) సరస్వతి.

క. పలుకుఁజెలి లచ్చికోడలు, కలని కనికెల్లి తూఁటిగాసపుఁదేజీ, గలబోటి యుసఁ(?) భాషా, జలజాక్షికిఁ జేరుగా ..
ఆం భా ౧ ౬౨.

మ. సకలామోదక తాళవృత్తగతులన్ సంగీత సాహిత్యనాట్యాత్మక విద్యాయుగళంబు పల్కుఁ జెలికిం బాలిండ్లతో దై వియల్, ప్రక టింపన్ వసు. ౧. ౩.

—ఇట్లే : పలుకుఁజేడియ.

సీ. పలుకుఁజేడియ తెరి వాలుఁగుల లందముఁ
జెట్టు లన్నియుఁ జెట్టుచెట్టు లయ్యె
అచ్చ రా అయో. ౨౦

**పలుకుఁదత్తడి.** వి. (పలుకు¹ + తత్తడి)
చిలుక.

మ పలుకుందత్తడి నెక్కి దర్పకుఁడు దర్పం
బేర్పడ న్నూకినన్ చంద్రా 3 ౬౪
(శ. ర.)

**పలుకుఁదొయ్యలి** = పలుకుఁ జెలి. వి
(పలుకు¹ + తొయ్యలి) సరస్వతి

వ .అని పలికి పలుకుందొయ్యలి యూర
కుండె... నైష ౫ ౭౬

క వలరాయని దేవియుఁ, పలుకుందొయ్య
లియు కాక బలరిపుసతియో
రాజ చ ౨ ౧౭౪.

మ. పలయన్ గాదిలిపుత్త్రి చందమున కేవేళంగు
లన్ ప్రోచుచుం, బలుకుందొయ్యలి చేతి
రాచిలుక పెంపన్ బెర్గి...
విక్ర. ౪ ౫౦.

**పలుకు (ల్కు) దోడు.** విశ (పలుకు¹ +
తోడు) మాటాడుటకు సహాయము

సీ. శృంగార పెనుమంబు చిన్నిచుక్కలరాజు
పసిఁడి కిన్నెరవీణ పలుకుఁదోడు
నైష. ౧ ౫

సీ. పలుకుఁదో డై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునకు శ్రీనాథుని
చాటువు

సీ. గంభీరరసగుంభసంభృతప్రౌఢిమతో సరస్వతి
పల్కుఁ దోడు గాఁగ. వసు. ౨. ౧౦౬.

**పలుకుఁబంతము.** వి. (√ పలుకు¹) ప్రతిజ్ఞా
వాక్యము.

ఉ ..ఏల కామసం, చీనిబుధాధినాయక మహీరు
హాము కొలించి లోకసం, భావిత మైన నీ
పలుకుఁబంతము చెల్ల మదీయగేహాశ, శివన
వాటి వేడుక దలిర్పఁగ నిల్పుము శివ
శేశ్వరా పారి. ౪. ౧౧.

**పలుకుఁబూఁబోఁడి(ణి)** = పలుకుఁగలికి. వి.
(√ పలుకు1) సరస్వతి.

గీ. తద్గుణంబులు వర్ణింప ధరణినాథ, యజ్ఞ
నూతికి నైన శక్యంబు గాదు, పలుకుఁ
బూఁబోఁడికైనను నలవికాదు. నైష. ౨. ౯.

సీ కెందమ్మిగద్దె యొక్కినవేలుపుల పెద్ద పలుకుఁ
బూఁబోణికిఁ బ్రాణపదము. దశా ౨ ౬౨.

**పలుకుటీగి.** వి. (పలుకు³ + తీగి) స్వల్పవస్త్ర
దానము.

సీ. కలువరేకులకోకగడ సత్తపాలముల్ పలుకు
టీగియొకదా తలఁప లంక.
వాల్మీకి. 3 ౧౫౫.

**పలుకుటెలనాఁగ** = పలుకుఁజెలి. వి.
(√ పలుకు¹) సరస్వతి

గీ కప్పు గలవాఁడు గొ ప్పైనకొప్పు గాఁగ,
మేఁతి లిడి నంచ లిరువంక మూఁతిఁ గఱవ,
రాణఁ దులకించుపూఁదీఁగె వీణె గాఁగఁ,
బలుకు టెలనాఁగయునుబోలె నలరిమతియు.
యయా. ౨ ౪౨.

**పలుకు(ల్కు)బడి** = పలుకు¹. వి (పలుకు¹ +
బడి) ౧ వాక్యము, మాట.

సీ. కలువంబు విదళింపఁగల ధర్మశాస్త్రప్రపం
చంబు లెవ్వానిపలుకుబళ్లు. వరాహ. ౧. ౯.

సీ. తలఁపుకెంబడి గానివలకారిచిన్నెలు కల
కూజితము గాని పలుకుబడులు
ప్రబంధ. ౬౪౨.

౨. మాటతీరు, ఉచ్చారణపద్ధతి.

గీ. పడఁతు లారాజనందనుని పలుకుబడియు, జూచుచాయయుఁ గని తొంటిమునిదొ కాఁగ, నరసి... వసు. 3 ౬3

వ. సొగసులు గుబ్బ పల్కుబడి సోయగ ముస్.. శశాం. 3 3౯

3 ఒడంబడిక, అంగీకారము.

గీ .అప్పనంబు, పలుకుబడి దప్పి కొనిరొండు పతియు గోవు, ముక్కుఁ గుట్టెడువాఁడుఁ దమ్ము మృష్టఘాతి,యగు నతిండు నథోగతి కరుగువాడు. భార. అను ౬ ౬౯.

సీ గజపతిరాష్ట్రదుర్గవిశేషముల నుండి మెలఁ పుగాఁ బలికినపలుకుబడుల,తీరు వ్రాసితిరి... కృష్ణ. 3. ౧౦౮

౪ వాక్యము.

క అమరఁగ శబ్దార్థంబులు, క్రమతుల్యము లయ్యు భేదకథనముచే వ్యస్త్యము నతిరిక్తముఁ జేయుట,నమితవ్యతిరేక మనఁగ నగుఁ బలుకుబడిక్. కావ్యా. ౫. 3౫.

౫. మాటచెల్లుబడి. (వ్యవ) అయనకు గ్రామ మున మంచిపలుకుబడి యున్నది

పలుకుబోటి=పలుకుఁ జెలి. వి పలుకు[1] + బోటి) సరస్వతి.

సీ. కించిద్విగంబరి కృతరదద్యుతిసొంపు పలుకు బోటికిసైన ప్రాతి గాఁగ.

శైవ. ౫ ౬.

పలుకురాయి. వి. (పలుకు[1] + రాయి) ప్రతి ధ్వని యిచ్చు శిలావిశేషము. (శ. ర. ప్రా)

పలుకులముద్దరాలు = పలుకుఁ గలికి. వి. (పలుకు[1] + ముద్దరాలు) సరస్వతి.

ఉ...పలుకుల ముద్దరాలి మిహింబంగరు టంకె రవల్ కెలంగఁగక్. ఖండ. ౧. 3౪.

పలుకువాలు. వి. (పలుకు[1] + వాలు) గీర్వాణుఁడు, వేలుపు.

సీ పలుకువాల్ మగలయాఁకలిఁ దీర్చుచలువయే మగువలఁ గనిపించు మంత్రసాని. చంద్రా. 3. ౧౦౦

౨. (శాపాయుధుఁడు) ముని, ఋషి.

గీ పలుకు వాల్దార నిర్వేల్పుపడఁతుశెల్ల వికృతి సేయంగనిటుని గావింపకేని, నజరకులమునఁ బుట్టితి నంచు నిచ్చఁ, బలుకఁగా సిగ్గుగాదె యర్జ్జాతజన్మ చంద్రికా ౨ ౪౮

పలుకుమై చు. అ. క్రి (పలుకు + మై చు) నిందమోపు.

సీ. చెన్నార నొకరిపై (జెలువవ్వ చికిలించి యలరుచు నొకరిపైఁ బలుకుమైచి శేయూర. ౨ ౫౮

పలుకె(లె)క్కు. అ క్రి (√ పలుకు[2]) పండు

సీ...పల్కెక్కనఁ దగుఁ బండె నటు అం భా. 3 ౧౦౧.

పలుగాఁడి. వి. ౧. పశువుల దొడ్డి లోనగువానికి పెట్టెడు తలుపు

ద్వి...దొడ్డిఁ, బలుగాఁడిలిడి ప్రవిద్ధప్తులదక్క, పలుకట చూచుట పాతికంబునుచు. బస. పు. ౩. ౭౧౬. పం.

ద్వి. పలుగాండ్లు దెఱపింప నలరుచుఁ బసులు. బసవు. ౩. ౭౨౩. సం. శైవ. 3. ౬౪.

౨. కోట లోనగువాని ద్వారమునకు పెట్టెడు తలుపు.

సీ. ప్రాఁకిలోపలఁటొచ్చి పలుగాఁడిఁ దెఱ చిన... ఉ. హరి. 3. 3౪.

3. శకటావయవ విశేషము. (బండిపరము అని శ. ర.)

సీ. . పలుగాఁడితోఁ గూడైన యంగముల కొకట, నెడలించినాఁడట నెసఁగెడు పరశల్లఁ బనఁ ద్రోచియడఁకునో .
హరి. పూ. ౫ ౧౭౨

సీ. అందఱునొక్క పెట్ట కద్రథము వొదివి, పూను లతోఁ గాడియు పూరికెలు నొగలును బలు గాఁడియును గండ్లుబట్టి పెలఁగ...
భార. కర్ణ ౨ ౨౭౯

సీ. కంబీగముల పలుగాఁడి జాదుల సతుఁ గొయ్య లకోకిముల్ గోడిపీఁటు,... గీ గా వసంతుండు మూతుఁడై పూవుఁదేర,
కు. సం ౪. ౪౩౯

—విశే. పెక్కు గాఁడులు గలది (శ ర)

సీ. దంచనంబులును దద్దడములు నెత్తంది బంబు గాఁడి తిలుపులు బలుపుచేసి
ఉ. హరి. ౨. ౯౨

చ... పసవంపుమావిక్రొ, వ్విరి బలుగాఁడి తూపు లిడి వీరపుగర్వము నెమ్మనంబులోఁ, బిర గాని తోలితొప్పగలఁజెట్టి వనంగుఁడు పాంథలోకముస్.
నృసిం ౨ ౪౪.

పలుగా(ల్గా)కి. విశే (పలుగు + కాకి)
౧. దుష్టుఁడు, తుంటరి.

గీ ఉద్ధతులు గొంట్లు పలుగాకు లదయు విడుతు, లాకతాయలు శఠులు గియ్యాళు లగుచు.
హర. ౫ ౧౧.

క. పలుగాకుల పెంచిన కో,కిల పంక్తికఁ గలికి మీఁదఁ గృప రంజిలునే. భాను. ౩. ౭౦

ద్వి. పలుగాకు లై బహుళంగుల నిట్టుపులు గాకు లానరింప బోలదే మాన్ప ద్వి.
హరిశ్చ. పూ. ౧౨౧౭
అచ్చ. రా. బాల. ౪౩.

గీ. అకనుదర్శాంథకార మంతంతఁ గవియఁ, గన్నుఁగానక పొద్ది రాఘవుని దేవి, జనకకన్య జగన్మాన్యఁ జెనక వచ్చి, కన్నుఁగానక చనియెఁ బల్గాకి కాకి
రామా ౫ ౪౦ (శ ర పా)

౨. సంకరుఁడు

సీ... సంకరుఁడు రాజులను బల్గాకియనఁగ.
ఆం. భా. ౩ ౧౩.

పలుగు. వి ౧ ఫాలము, నాఁగటికఱ్ఱు

సీ... చతుఁ బలు గవఁగను ఫాలాభిధానంబు...
ఆం భా. ౨ ౨౩౩

క ఎఱుఁగుల మలుగుల పలుగుల, గులగులలుగఁ జేసె పట్టుకొని బిట్టులకం, బలుగుల సలుగుల ములుగులఁ, గలఁగంగాఁ గట్టిరట్టి గట్టి కిరాతుల్
రా వి ౩. ౭౦

౨. గుంటకగుజ్జులకును పాపటపుగుజ్జులకును— తగిలించెడు దళమైన యినుపకఱుడు (శ. ర)

—విశే ధూర్తుఁడు, మోసగాఁడు

చ నస్, బలుగుఁదనంబునం బలుకఁ జాడియు నీసతి నంచు... భార ఆది ౫. ౨౦౩.

క కల దానన్మాక్షికి బహు, కలధౌత సుకర్ణపూర్ణకంఠసదా యు,ప్పలుగుయతి మఱపు మోసముఁ గలజేసియు లేక దానిఁగని రక్షింపుస్
జె. పంచ. ౧. ౨౧౪.

జః పలుగాకి, పలుగుగుంటకి, పలుగుడుఁబాము, పలుగుపిట్ట, పలుగూఁతలు, పలుపడి, పల్గాపక.

పలుగుంద్రు = పలుగురు. (శ. ర.)

పలుగుగుంటక. వి (√పలుగు) పలుగు అమర్చు గుంటక (శ. ర)

పలుగుడుఁబాము. వి (√ పలుగు) సర్పవిశేషము. (చి. ని శ. ర. బ్రౌ.)

పలుగుపిట్ట. వి. (√ పలుగు) ఘూకము, గుడ్లగూబ. (శ. ర)

పలుగురు = పలువురు. (శ ర)

పలుగూఁతలు. వి. బ. (√పలుగు) దుర్భాషలు.

క. పలుగూఁత లాడువానిన్, గలు ద్రావెడు వానిఁ జెవులు గఱచెడువానిన్, బొలఁ తులఁ దెచ్చెడువానిన్, దొలఁగింపక సంతరింపుదురు రాజన్యుల్

వేం. పంచ ౧. ౪౪౫.

పలుగొఱ్ఱు. వి. (పలు²+గొఱ్ఱు) పైరులోని గాదము పెల్లగించుటకై పండ్లవలె మేకు లమర్చినపలక (శ ర)

పలుచ(ల్చ). విశే. త పలచై (దీనికి నిగాగమము వికల్పంబుగా నగును—)

౧. దళసరికానిది, సాంద్రముకానిది

గీ. ధరణి నెత్తుటఁ దోఁగి యాభరణకాయ, శస్త్రఖండజాలములఁ జాలనొప్పెఁ, బలుచ గాఁ దుండఁ గుంకుమ మలఁది పెక్కు, దెఱఁగు తొడవులు దొడిగిన తెఱవబోలె.

భార. భీష్మ ౩ ౧౭౨

గీ. తారకాధీశుకిరణకదంబకంబు, చిలికెఁ, బలుచని వలిపంపు జిలుఁగుమంచు.

పారి. ౨ ౪౪

సీ. పలుచనిమాత్రవల్కలము గట్టి.

దై భా. ౭. ౬౫

౨. స్థూలముకానిది.

సీ. జాంబూనదచ్ఛాయచందంబు వర్ణంబు గలిగి పలుచని గాపడెను. భార. ఆశ్ర. ౨.౪౦.

క. పలుచనిశాలెలు మెఱుఁగువఁ, బలుమెఱుఁ గులు సందడింపఁ బాపటపై వం, జలిఁ జేర్చి జిలుకుఁ జూపులఁ, బలుకులఁ బులకండ మొలుకఁ బలికెన్ గలఁకెన్.

మనుచ. ౪. ౮౦.

౩ అల్పము, తక్కువైనది.

ద్వి పరిమళమిళితమై పలుచనిగాలి, పొరిఁ బొరి సభలోనఁ బొలుపార నపుడు ర౦. రా ఉ ౧౪౭ పా ౨౦ పం. (పలుచనిగాలి=మందమారుతము)

౪. తేలికయైనవాఁడు, గౌరవహీనుఁడు.

క మతిమంతుఁ డౌ సుమంతునిఁ, బతిమన్నన సేయ నన్నుఁ బలుచగఁ జూచున్, సతతంబు జ్ఞానగర్వాన్వితుఁడై యున్నాఁడు వాఁడు నీగజపుత్రా. సారంగ ౩ ౧౩౨

ద్వి పతి నన్ను సెప్పుడుఁ బలుచగాఁ జూచు మతిమంతుఁ డనుచు సుమంతు మన్నించు.

నవ. ౨. ౧౦౯. పా ౭. పం.

౫ అనుకు, చిక్కన కానిది

సీ ఏడు సాగరములు నిక్క దక్కడఁ బెట్టి పలుచనిరొంపి మై నలఁదికొనఁగ.

భార. విరా ౨. ౧౩౪

చ పలుచనియంబరుల్ చెఱకుపాలెడనీళ్లు...

ఆము ౧ ౯౧

జః పలుచఁజేయు, పలుచఁబడు, పలుచఁబాఱు, పలుచన, పలుచనగు, పలుచని చూఁ, ఱు పల్చన, పల్చనగు

పలుచఁజేయు. సం. క్రి (√పలుచే)

౧ తగ్గించు; పోగొట్టు

గీ, దృశ్యముల సంత్రయంబును దెలియఁజేసి, పరఁగ రాగాదివిశృతులఁ బలుచఁజేసి, చెలఁగి యుపరతి నుదయింపఁజేయ నొద్ది, యదియు బ్రహ్మానుసంధాన మనఁగ బరఁగు.

వాసిష్ఠ. ౨. ౪౪.

౨. చులకనఁజేయు, ఎల్లిదముచేయు.

గీ. ప్రాణవిభుఁడౌని యతిథిసపర్య ప్రోసి,బంధు
వుల గోని పుత్రులఁ బలుచఁజేసి, యట్టు
డిగఁదీసి యిట్టి నా రదవి డాసి, గాసిఁ
జెందఁగ నిం కేమి గలిగెవాని

దశా. ౫ ౩౮

ఉ. పావనదృగ్విలాసములు బాహ్యగతిం బచ
రించి చంద్రికా,శ్రీవిభవంబులం బలుచసేయు
ముఖప్రభ లుల్లసిల్లఁగా, పాండు. ౨ ౧౬

పలుచఁబడు. అ క్రి (√పలుచే) పలుచ నగు—
చూ. పలుచఁబాఱు (పలుచపడు శ ర)

పలుచఁబాఱు. అ క్రి. (√ పలుచఁబడు)
పలుచఁబడు, కృశించు

సీ. ప్రత్యర్థి నరరాజభయములతోఁ గూడఁ
దళుకు లేఁజెక్కులు బలుచఁబాఱె

దశా ౪ ౧౨౬

పలుచన=పల్చన. విశ (√పలుచే) లఘువు,
బరువు లేనిది; గౌరవశూన్యుఁడు

ఉ. ఒలము చెడి నీళ్లకంటెను,బలుచన య్యెలి రిఁక
మిమ్ము బాధింపఁగ . ఉ రా ౩ ౪౦౨

సీ. ఆగువరుం డని తార తడవి కూర్పక మున్న
బంధుల కే నేల పలుచ నైతి...

ఉ హరి. ౫ ౧౧౪

చ ..రాజకన్యకలధర్మము గా దిది యంచు
బంధువుల్, పలుచన గాఁగఁ జాతురో కా
పాయపుఁగోరిక లేమి చేయుదుస్

రాజ. చ ౩. ౯౯.

—వి ౧ లాఘవము, బరువులేమి, చులుకఁ
దనము

చ. జలజదళేక్షణోయములు సందులక్రిందుగఁ
దోఁచుమింటి నీడలుఁ గనుపట్టె నక్తెఁ
దటాకముల న్లఘింపుంబు రెంటిలోఁ, దెలియఁ
దరంగఁ బై కొగయు తేఁటులచేయుఁ దూప్పఁ

దోఁయుఘ్యల్పలాతనఁ జేరి మి న్నదుఁగఁ
బట్టె గదుం దళ కూటపో యతఁడ్.

ఆము. ౪. ౧౫౧

౨. సన్నదనము. ౩. నిలితిఠనము. ౪. అవుకు
దనము (శ. ర.)

పలుచనగు. అ. క్రి (√పలుచే) అల్ప మగు,
తక్కు వగు, ఎల్లిద మగు, చులక నగు.

ద్వి. చులుకై నై తోఁచె నిచ్చో దౌంతనము,
పం చనయ్యెను వాని ప్రజ్ఞ లనం౭ ద్వి తి
సా ౨౨౫ పా ౧౭. పం

గీ. కీడి తనయుంటెటౌ జాలెు నీరజాక్షి,కార
యభిమానరక్షకు లైనవారు, దొలఁగు సమ
యంబునను దాము తొలఁగి పోక,పరులచేఁ
గ్రోఁపుఁ బడుదురె పలుచ నగుచు

దశా ౩. ౭౫

(పలచనగు - అపముద్రితము)

గీ. ఆకులాహార్యనందన యులసపవన, జాలములఁ
దూలగితిఁ జాఁఁ దూఁ దొడఁగె, గరిమఁ
దా నెంతయుచలేంద్రకన్య యైనఁ, బలుచ
నగుఁగాదె ఘనవనుప్రార్థనమున.

వసు ౩ ౧౦౩

సా. మంచి రొుక్కువైన మజ్జిగ పలుచ నగును.

పలుపట్టెడ. వి —సంకరజాతిజనము.(శ ర ప్రా.)

పలుపు. వి (సం పలాపః) పసులు గుఱ్ఱములు
మొదలగువాని మెడఁ గట్టెడుత్రాడు, తలుగు.

సీ. దా మెనలును వల్లెత్రాళ్లును బలుపులు గవ్వము
ల్గాడవలికత్తి. హరి. పూ ౭. ౨౧.

శ. పలుపులుఁ గాండ్లుం బగ్గం, బులుఁ దన
యుస్త్రంబులునరి పాడి సేసిన ని, చ్ఛలబిడిఁ
బొలుడు స్వర్గం, బుల నేయుఁడు దివిజరాజ
పుత్రుఁడు గృహతోడ. భార.విరా. ౫. ౫౩.

(మన్మథరథ వర్ణనము.)

సీ. ఫలరసంబులఁ జొక్కి పలువలై పక్కికు
చిలుకల పలుకుల పలికియలికి
విగ్ర. 8 ౬౦

౨. దుష్టుఁడు, దుర్మార్గుఁడు.

గీ కిరటి యడిగొట్టు పలువ... మొండి, కట్టె
వాఁ గను కుజనాఖ్యగాఁ కొలంగు
ఆం. గా 3 8

క కలఁకయు నలుకయు నెదలో, మొలవఁగ
న మ్మేటి సోకుమూఁకలకోఁ డో, వెలియల
ని న్నిటుచేసెన, పలువలతెఱఁ గెల్ల నేఱు
పఱుపు మటన్నన్
అచ్చ రా ఆర ౧౬. కు సం ౧ ౬

పలువడి. వి (√పలుఁ) దౌష్ట్యము

సీ పలువలై చిలుకల పలువకు లుడిగింతు నని
పల్కు నట్ట యింపొగఁబల్కు
కు సం ౧. ౬

పలువరింత. వి పక్షివిశేషము హంస 3 ౧3.

పలువిత్తు. విణ (పలు[1] + విత్తు) పలువునకుఁ
బుట్టినవాఁడు, సంకరుఁడు, దుష్టుఁడు

పలువ(ల్వ)రుస. వి (పలు[2] + వరుస) దంతపం క్తి

వ... భూషాగిత్యుని పలువరుస యింతెంబున నుప్ప
ఉల్లు త్రుళ్లు మెఱుంగులు .
భీమ ౫. ౧

సీ. వీడెంపుఁ బలుకెంపు విరిసి వెన్నెలగాయ
వరిగింజ నొకటఁ బల్వరుస దోమ
ఆము ౧ ౬౦ యయా ౪ ౩౧.

—ఇట్టి పలుచాలుపు మొ

పలుపుం(డ్రు)దు=పలుగుం(డ్రు)దు. (శ ర.)

పలుపురు=పలుగురు. స బ (√ పలు 1—
పలు శబ్దమునకు మహాన్మ రూపార్థక రూపము)
అనేకులు.

క. అప్పురమునఁ బెరిగిన నృపు, లిప్పుడు భారత
రణోపహృతు లై పలుపుర్, గుప్పలు గొనఁ
బడి రనికిం, దప్పినవాఁ డొకఁ డొకండ
ధర నంతంతన్ భార. శాం. ౨. ౯౬.

క పలువురు కొడుకులు విప్రుఁడుఁ, బలు
పాటులు పడుట తేటపడ విని కరుణం,
దలకొని తన చిత్తమునకు, వెలిమిగ నా చేతి
రత్న మిచ్చితిఁ బ్రీతిఁ దశకు ౪ ౧౧

చ...అయ్యలఘుఁడు దాని నీ కునికి నాగ్రహా
మూఁది మదీయభృత్యులన్, బలువురఁ
బుచ్చితిన్ ఽలమిఁ బట్ట సమర్థత గల్గు
వారలన్ పె శకుం ౨ ౧౨౨

పల్కు(లుకు)జవరాలు. వి (పలుకు[1] + జవ
రాలు) వాగ్దేవి, సరస్వతి

ఉ అంచలతేరఁ బల్కుజవరాలును బొక్కటి
తమ్మిగచ్చ క్రొ, మ్మించుల నీనుమేను...తీ,
వంచమొగంబులుం గలుగువాఁడు చెలంగును
వేల్పుఁబెద్ద యై. విప్ర. ౧. ౨3

పల్కు(లుకు)తేజి. వి (పలుకు[1] + తేజి) చిలుక,
శుకము.

గీ ప్రాణనాయక యిదె చూడు పతులఁ గూడి,
పాయకుఁ డటంచు సతులకుఁ బల్కుతేజి,
పాడుసాహి శికాచేసి పంపు కాగి, తంపు
పరమానువోలె సుధాకరుండు.
దశా. 3. ౪౫.

పల్గొ(లుగొ)మ్ముల మొకము=(√పలు - దంత
ము లే కొమ్ములుగాఁ గల మొకము.) ఏనుగు,
ద్విరదము.

సీ. మేటిపల్గొమ్ముల మొకపురాతుటుములు బలి
తంపు బఱపుగుబ్బలు గాఁగ
నీలా. ౧. ౨౪.

పల్చన=పలుచేన. (√పలుచే)
(చూ. పల్చ నగు)

పల్చనగు=పలుచేనగు. (√పలుచే)
(చిక్కనిది కాని దగు)

శా. పూ వై తిన్నకరండమై కరంగెంబోలెబో
నీర్గళం బల్చ నై వైజ ౨. ౧౩౯.

(సాంద్రము కాని దగు,దట్టము కాని దగు,దళము కాని దగు)

సీ. అగరుగంధము చెక్కలందుం బల్చ గలంగి
రొమ్ము లింగపేటికం గుదురుకొల్పి
చెన్న ౧. ౨౩౩.

(చిక్కు, కృశించు)

చ మనమున కుత్సితం బొసంగ మంత్రికిం బట్టపు
దేవి గర్భిణో,ధనమునం బల్చ నై వెలవు
పైకొను ముప్పిలాకెమ్మె గంబుతో
శివరా ౨ ౪౪

సీ పరమాన్నరుచి గ్రోలం బరపదార్థములందు
నరుచి పుట్టెనో పల్చ నయ్యెం దనువు
దశా ౭ ౧౪

పల్చోక=పలుచోక వి (√పలుగు) చెడ్డపేనము, దుష్టత్వము

మ ఇది యే మిచ్చటి కేల వచ్చితివి నీ కింటం
బను లేవె యెప్పుడు పోపో పతి యూర
లేనియెడ నీ పల్చోకశృంగారముల్, నుడ
తుల్ సేయుదురే . శశాం ౩ ౫౧

పల్యంకము. సం వి అ పుం ౧ పర్యంకము, మంచము ౨ బృసి, యత్యాదులయాసనము ౩. యోగపట్టె ౪ మంచె (శ ర)

పల్యయనము. సం వి అ న ౧ గుఱ్ఱపు పల్లము. ౨. గుఱ్ఱపువాగె, రశ్మి (వాచ)

పల్యయనుఁడు. సం వి అ పుం కూటస్థుని నుండి యాఱవపురుషుఁడు, ప్రపౌత్రుని మనుమఁడు. (వై ని)

పల్ల=పాల. విశ. (సం పాటలః) ౧. పాటల వర్ణము గలది, ఎఱుపు మించిన తెలుపురంగు కలది

క నానాతీర్థసతతను, స్నానంబులం బల్ల లైన జడలును భిక్షా, నూనోపవాసకృశ మగు మేనులు నై వారతపము మిక్కిలి మెఱయన్ భా. అను ౫ ౨౫.

గ్వి పల్లమీసములు కేస్పు కుకాయకిన్ను
బస. పు ౩. ౧౦౧౬. పం ఈ హా ౨ ౧౭౭

౨. ఎఱ్ఱ నైనది

సీ పల్లచీమల వర్త్రిత తికియుంబోలె స్త్రీ
దుప్పటి నొప్పుకి తైవాని. అను ౬ ౧౯

సీ పై నుండి క్రింకికిం బర్వ సీగరుటేలు గూడల
వ్రేలెడుపల్లజాలు గాంగి యుగా ౨ ౩౬.

జః పల్లకిట్టు

పల్లకట్టు. విశ (√ పల్ల) పలసన్నె మాపట్టు
నగి (శ ర) పల్లవన్నె కలిగి కనంటను గది

పల్లకి(కీ)=పాలకి, పాలని. వి (సం పల్యంకికా ప్రా పల్లంకో కి పలకి తె పల్లక్కు) మనుష్యులు మోసెడి యానవిశేషము

సీ పల్లకి పల్లకీ పాలకి పాల్కి వాం బల్యంకి కాఖ్యలు పరగు...సాం ని స్థావ ౬౪.
ఆం భా ౨ ౨౦౧

చ శకునమనోజయంబుగం బ్రశస్తముహూర్తమునందు వేడ్కం బ, లకులు గదల్చి పెట్టెల కెలంకుల పాల్కికిం బోసం బంచి...
వై. భా ౩ ౬౧.

ఉ. పల్లవపాణి యిందుమతి పల్లకిలోపల బంధుకోటి రం, జిల్ల స్వయంవరస్థలికిం జేరెను నందు ముదంబు భాసిలన్.
ఇందు. ౫. ౧౦౫.

క. అంచలవె స్తలవడిబం, కించుచు బంగారు
పల్లకియెక్కి ప్రయా, ణించుచు వెదంగాంతలక,
ప్రాంచలమున నొకమహో గ్రఫణి యెదురగు
చుక్ శై. భా. ౨. ౭౫

సీ అల్లంతఁ గని నంత పల్లకిల్ డిగ్గి భూవల్లభుల్
మ్రొక్కి దీవెన లొసఁగుచు.
దశా. ౪. ౧౯౦.

పల్లగించే=పల్లించే. స. క్రి (√పల్లము²) పల్లముకెట్టు (శ ర.)

పల్లట=పల్లటము. వి (సం పర్యస్తం ప్రా. పల్లట్టో, పల్లత్థో శ పల్లట) ౧. వ్యత్యాసము ౨. చలనము (శ ర.) 3 కష్టము
(చూ. పల్లటపెట్టు)
జ° పల్లటపెట్టు, పల్లటించు, పల్లటిలు.

పల్లటపెట్టు. స క్రి (పల్లట+పెట్టు) బాధపెట్టు, కష్టపెట్టు.

చ. పరువగతి స్మహాముసులఁ బల్లటపెట్టవె
యట్టు నీకు నో, కరువలి మేఘవేణికల గావి
రొనర్చుట ధాత్రిఁ జిత్రమే
వేం పంచ ర ౧౪౪.

పల్లటము=పల్లట. వి ౧ కష్టము

గీ. చోద పల్లట మల్లట చోడుమ బడ,ప
యిడు మగచాటు బా మనఁ బరగుఁ
గష్టము... ఆం భా ౧. ౧౫౦.

ఉ. నీ,పైరుగదమ్మ మల్లికలు పల్లట మందఁగ నేల
వానికిన్ వేం. పంచ ర ౧౭౯

౨. చాంచల్యము

ద్వి. భూతింబు సోఁకెనో బుద్ధిపల్లటమొ,
పైత్యంబు హెచ్చెనో భ్రమసెనో కాక,
చిత్తవైకల్యంబు చెందెనో ...
ప్రభులిం. ౨. ౬౯. పొ. ౨. పం. 3.
వ్యత్యాసము. (శ. ర.)

పల్లటి=పల్లటీ. వి. (శ పల్లటు) ౧. మల్లవిద్యావిశేషము.

వ . మొగ్గిప్రాలుంటలును నురటి పల్లటి మొదలగు లాగు పరుసలును. . మల్లపు 3 ౬౯.

౨. నాట్యభేదము

సీ లాగు మైపిరియుఁ బల్లటియు కేత్రియు
వెళ్కు విలవీఁజు ఒక్క శికిధ ముక్కిగ్గు
ఉ రా ౬ ౧౩౯.

గీ లాగు మైసిరి వెళుకు పల్లటియు గులుక,
జక్కిణి నటించి... సమీగి 3 ౨౧౪

3 (పల్లటులు గొట్టునది) పావురము, పారావతవిశేషము

ద్వి భావించి నీమదిఁ బల్లటిఁ దేగఁ, బోవల
దట్టి పావురములు లేవె
ద్వి శ పా ౧ ౧౯ పొ. ౧౦ ౫౦

పల్లటించే=పల్లటిల్లు అ క్రి (√ పల్లటి) పరితపించు.

క పలవించు బల్లటించుక్, ఊలపల కన్నీరు
నించుఁ బసివాఁ డంచుక్, విలపించుక్
బోలు వెంచుక్, దలవరులకు నప్పగించుఁ
దిల యటు వంచుక్ సారంగ 3 ౧౦౩.

పల్లటిలు=పల్లటించే. అ క్రి (√ పల్లట)
౧ పరితపించు, దుఃఖించు

గీ వగచె దుగపిల్లి వందురెఁ బల్లటిల్లెఁ,
బొక్కె నన నంగలార్చె నాఁబొల్చి యుండు.
ఆం. భా 3 ౧౦౨.

౨ చలించు, అదరు.

ఉ .సమగ్రబలంబుతోడ భూ, భాగము పల్లటిల్లె దశకు ౨. ౯.

ఉ తల్లి ధరిత్రిపై నొఱగి తల్లడపాటునఁ జెంది
చిత్తము, బల్లటిలంగఁ బ్రాణములు వాసినఁ
జాచి కలంగక... భాగ. ౧. ౧౧౯.

ఉ. అనుచు ముదంబునం బలికి యంతటఁ దానా
రయుచెంగి పల్లటిల్లిన హృదయంబు నిల్పికొని
ద్వా ౧ ౧౬౯ భా రా. కిష్కిం ౫౫

౩. చెదరు, చెల్లాచెదరగు

క పల్లటిలం దొడఁగె నపుడు పాండవ బలముల్
భార భీష్మ ౧ ౨౪౦

మ. ఒకమా రెవ్వని పేరు కర్ణములలో నొయ్యా
రమై సోఁకినన్, సకలాఘంబులుఁ బల్లటిల్లి
తొలఁగున్ భాగ ౯ ౧౪౨

గీ ఉలుకు వారాద్రికర్మని కిరము సోఁకఁ, బ్రేత
బేతాళ మోహినీపిశితభోక్త్ర, కామినీ శాకినీ
ఢాకినీ మదాంధ, భయకర బ్రహ్మరాక్షసు
ల్పల్లటిల్లి హంస ౩ ౭౩

౪ స్వస్థానమునుండి తొలఁగు

గీ జలధరంబులు గురిసె నాసారవృష్టి, యటఁ
బద్మాసనస్థుఁ డై పల్లటిలని, యత్తపోధన
పర్యపై నవని కరిగియు, చిరతపోరాజ్య
పట్టాభిషేక మయ్యె కవిక ౬ ౨౫

ఉ .ఇదే మిదేమయా, యిప్పుడు దీనిచంద మని
రయం గలభాషిణి మే చెమర్పఁగాఁ, గొల్ప
విడంగఁ బొఱఁ జనుగుబ్బలఁబయ్యెద వాయు
సుస్థితిం, దప్పి పిఱుందు పల్లటిలఁ దా మర
గొ మ్మిరుగేలఁ బట్టుచున్. కళా. ౩. ౭౦

౫ చెడు. వ్యత్యస్త మగు (క ౧)

గీ అవనిఁ బడనీక శాఖఁ జంచువునఁ బట్టి,
పట్టి వారల నుస్థితుల్ పల్లటిలక, యుండ...
భార అను. ౧ ౨౩౭

౬. తగ్గు, క్షీణించు.

చ. కినుఁగొని యర్ధ్ర క్రొత్త యగు శాతుకవృత్తి
మునింగి పల్లటి, ల్లిన ధృతితోఁ గ్రిమం బరియ
లేనిమనంబు చలింప .
భా. విరా ౨. ౨౪౮.

గీ కారణం బేమి దీనికిఁ గలుగు మెట్లు, వాటి
లెనొ ధర్మ మేవంకఁ బల్లటిలెనొ.
కాశీ ౬. ౬౪.

క ఆవిధము నించుకించుక, భాష్పంబునఁ దోఁచె
నానృపాలుఁడు నిన్నన్, గేవలము మన
చెలిం గని, లేవ దొలఁగి మిగులఁ బల్లటిల్లిన
చెలువున్ పి. శకుం. ౩. ౬౭.

౭. ఎత్తఁబాఱు, ఎత్తువడు

వ .అచ్చేరువ నున్నయున్న అవృత్తుంబు నిరీ
క్షించి యాననంబు పల్లటిల్ల ధర్మతనయుం
గనుగొనిన .. భాగ విరా ౨. ౧౩౫.

౮ వివర్ణ మగు, వెలవెలపోవు.

గీ ఆననము పల్లటిల్లంగ నజుఁడు గలఁగ
భార శాం ౬. ౪౪౪.

వ ..అట్లు ధర్మతనయుండును దమ్ములుఁ గొడు
కులును ద్రుపదపుత్రులును బొదువుకొని
యుధుపలుకుటకుఁ జిత్తం బుత్తలపడ నాన
నంబు పల్లటిల్లఁ గరంబులు విదిర్చి దురం
బొనర్చువారై . భా కల్య ౨ ౭౩

౯ పర్వు, పెరుఁగు

ఉ .నావు దులస, తొక్కుకపల్లి పల్లటిలఁగా
నతఁ డాతనిఁ జూచి యిట్లనున్
కేం. పంచ. ౧ ౨౧౪.

పల్లటీ=పల్లటి. వి ౧ ఉడ్డీనము, పక్షులగతి
విశేషము; పావురములగతివిశేషము.

గీ బొల్లి పెమ్మాము దనరారు పుల్గొటని, పల్లటీ
లను పెల్లుల్లసిల్లువాని, దాని వరదానిఁ గని
కేళి తలఁపు మాని. ప్రబంధ ౭౦౨.

౨. పారావతవిశేషము

క. మేలైనలకోరి లాఁడ్డీలుం బదటీలు పల్లటీల్
పక్కువలున్. సారంగ. ౧. ౧౦౯.

గీ. బలసి కూళీలు వొడ్డీలు పల్లటీలు,. .
హంస. ౫. ౧౪౩

3. ప్లుతగతిభేదము, గంతు, దుముకు

గీ... ప్లుతగతిభేదంబు జంగ గంతు,దాఁటు పల్లటి దుముకు నాఁ దనరు నభవ
రా ఆం భా ౨ ౧౯౭

జ. పల్లటీల్గొను, పల్లటీల్దాఁటు, పల్లటీల్ద్రొక్కు, పల్లటీల్వైచు.

పల్లటీ(లుగొ)ల్గొను. అ క్రి (పల్లటీలు + కొను) ౧ ఎగురు, దుముకు.

గీ పల్లటీల్గొని కవ గూడి పావురంబులు ..
భాను ౪ ౭౭

ఉ ఆవ్వీరవరుల్ మిథోవితతవీరగసాగ్ర కటాక్షభావగంభీరతఁ బల్లటీల్గొనుచుఁ బేరెమువాఱుచు . కళా ౭ ౯౯

ద్వి పనజపంక్తులమీద పడిఁ బల్లటీలు,కొనుచుఁ గుందమలపైఁ గునిసియాడుచును,
ద్వి పరమ ౪ ౨౩౬

౨ కవియు,కూడు

గీ అంగుళీయకఖచితంబు లైనమణుల,డాలు నఖరుచితోఁ బల్లటీలుగొనఁగ
విప్ర 3 ౭౫

పల్ల టీ(లు)ల్దాఁటు = పల్లటీల్గొను.
(√ పల్లటీ)
(దుముకు )

సీ తెగనిండఁ దిగిచి ఎల్దెనలకుఁ బొట్టిలొలలు చూపి పల్లటీల్దాఁటువారు. కళా. ౭. ౪౧.

పల్లటీల్ద్రొక్కు. అ క్రి (పల్లటీలు + ద్రొక్కు) దుముకులాడు.

సీ. సారెసారెకు దంతచకచాకల్ బయలెక్కి కిచి గిక్కులఁ బల్లటీలుద్రొక్కు. చమ. 3. ౯౦. (ఇట వ్యాపించు అని భావము.)

పల్లటీ(లువై)ల్వైచు. అ. క్రి. (పల్లటీలు + వైచు) పల్లటీలుగొను

ద్వి. తెల్లపావుర మిది తెలివి గల్గినది, పల్లటీల్ వైచు ..ద్వి శ. సా (శ. ర. గ్రా. పా.)

పల్లణించు. అ క్రి (క పల్లణిసు) జీనువేయు.

గీ త్రాళ్లు వైవక దంతులఁ దఱుమువారు, సిడెము లెత్తిక గథముల నడుపువారుఁ, బల్లణింపక హాయములఁ బఱపువారు
చంద్ర. ౫ ౧౨౯.

పల్లన(ము)=పల్లము. వి ౧ పల్యాణము, గుఱ్ఱపు జీను

ఉ. అంగన నాదరించి వసుధాధిపుఁ డాక్షణ మాత్రలోఁ బుర,ప్రాంగణభూమి సాహిణి రియంబునఁ బల్లనకట్టఁ బట్టసా, రంగజవంబుఁ గల్గినతురంగము నెక్కి కదల్చి కాళవా,స్తిం గదియంగ వచ్చి డిగి చిద్వనధి న్మొగలేటఁ గ్రుంకుచున్ కాళ ౪. ౨౦౧

గీ హాయముఁ బల్లన కట్టు లెం దతిరయమున
పరమ. 3. ౧౧౧

సీ. బంగారుమెఱపడి పల్లనంబులతోడఁ గెంబట్టు కీలుపక్కెరలతోడ, పి. శకుం. ౧. ౧౧౧.

౨ పల్యాణము, అంబారి.

శా .కుముదస్తంబేరమం బగ్రతో, భూమిం ఱల్లనఁ గట్టు రానసిరుచిస్ఫూర్తిల్విజృంభింప సం,గ్రామోచ్చం బలలాశ రేఁగ ననుజన్మ,ం ధాంతిగారూఢుఁడై. పారి. ౪. ౭౦.

ఉ. ఏనుఁగుపల్లనం బడిన కేడికబుస్ వళమే వహింపఁగా.
విక్ర. ౫. ౧౩౨.

పల్లపుఁబంటు. వి (పల్లము[1] + పంట) నీరాన రాను పండెడిపంట (శ. ర. గ్రా ) కాలువలు చెఱువులు మున్నగుజలాధారముల బహోయమునఁ బండెడుపంట.

పల్లము¹=పల్లు, పల్లుడు. వి (సం. పల్వలమ్. తె. పళ్లం) నిమ్నస్థలము, గుంట.

గీ అకట జాహ్నా(ప్రయాణాంతరానువృత్తి, నుదక మున్నతి భూమిపై నుండలేక, పల్లమున కోడిగిల్లినపగిది నతిండు, కదలెం దీర్ఘాంతరము నకుం గాశినుండి కాశీ. 3 ౧౦౦.

వ...మిట్టపల్లంబులు సరిగా సంపజాలంబుపగిదిం గురిసి .. హర ౨ ౨3.

వ. ఇట్లు క్రిమంబునం దమంబు నిగిడి మిట్టపల్లంబు నియ లోలం బని యేర్పఱుపగా కున్న సమయంబున విక్ర ౬ ౬౬ విణ నిమ్నము.

సీ...పల్లము నవుకుం బల్లనంగ నిమ్నంబు దనరు ఆం. భా. ౧ ౧౫౭

ఉదా : పల్లపునేల.

జ : పల్లపుంబంట

పల్లము²=పల్లన, పల్లనము. (సం పల్యాణమ్ ప్రా. పల్లాణం)

మ మదదంతావళదంతిముల్ నఱుకునమ్మావంతు లుద్భ్రాంతతన్, బెదగం బల్లము గుట్టమున్ గవుతునన్ వేటాఱుకుండెంబు లై, చెద రంగా . విక్ర. ౬ ౭౯

సీ అరిదిసింగపుంబల్ల మమరించి పేరాజా మేలుం దేజికిం బదివేలు సేయ విజ ౨ పీఠి. ౨3

మ కెలవ పూపల్లంబు కురువేరవాఱులును తమ్మితూండ్లప్రక్కల పల్లంబులును గల పచ్చ కొక్కలహుమాయి సెక్కి...
పానందో. ౫ ౯౧ పా

సీ ..పల్యాణ మొప్పును బల్ల మనంగ ఆం. భా. ౨ ౧౯౯.

జ : పల్లగించు, పల్లించు

పల్లము. సం. వి. అ. పుం పెద్దగాదె, ధాన్యము బోసెడి పెద్దగరిసె.

పల్లఅపులు. వి. బ. (పలు+అఱపులు) సీచపు మాటలు, దుర్భాషణములు.

క. అని యీగతిం బల్లఅపులు, గొనకొని యడు వంగ విప్రకులజునితో నమ్మను శేంద్రుం డధిక ధైర్యంబున ని ట్లని పల్కి శంకం బొందక తెలివిన్. హరిశ్చ ౪ ౧౯౯.

క ఓరి దురాత్మక కామా, రారామలతోడ నీ వఱచు పల్లఅపుల్, సైరించితి మింక నూ కి, నో రత్తితివేని మిగుల నొత్తువు నుమ్మీ వరాహ. ౧౧ ౯౧.

చ. .పతివ్రతాగుణం, బేఱుంగుటంజేసి నాకు సురగలిచ్చిరి మక్కిటి చక్కంజాగు పల్లఅ పులు మాని... నా పంచ. ౧ ౧౯౪.

పల్లవకము. సం వి అ. పుం ౧. ఒక దినుసు చేప ౨ అశోకవృక్షము పుం న నవకి సలయము, క్రొంజిగురు

పల్లవద్రువు. సం వి ఉ పుం. అశోకవృక్షము.

పల్లవము. సం వి అ పుం న ౧ నవపత్త్రము, చిగురు. ౨ చిగిరించినకొమ్మ, కొమ్మ, విటపము 3 విస్తారము, వివి ౪ అలక్తకరాగము, లత్తుకరంగు ౫ శృంగారము ౬ చాపలము. ౭ బలము ౮ ఆకు, పత్త్రము ౯. ముంజేయి. (వై. ని) వి. అ. పుం. వెనుకటిచరణముల యందలియర్థము ననుసరించి సంగీతము మొదటం జెప్పెడువాక్యము, గీతావయవము

మ.. కే, ల్గదలింపన్ సుకుమారపల్లవనవైలా లక్ష్మి వీక్షింప మ, ట్పదియం బొల్పు... గేయవాక్ప్రౌఢిమన్ వసు. 3. ౫౯.

పల్లవుండు. సం. వి అ పుం. జారుండు, విటుండు.

పల్లవాదము. సం వి అ పుం. లేడి, హరిణము.

పల్లవాధారము. సం. వి. అ. పుం. శాఖ, కొమ్మ. (శాచ.)

పల్లవాస్త్రుఁడు. సం వి. అ. పుం. మన్మథుఁడు, చిగురుఁగైదువువాఁడు.

పల్లవి. సం వి ఈ పుం—పల్లవములుగలది— వృక్షము, చెట్టు. పల్లవము

పల్లవించు. సం అ క్రి. ౧ చిగిరించు, విరివి యగు, అతిశయించు

క గిరులెల్ల జలము లయ్యెన్, దరులెల్లను పల్ల వించె ధరణిగిగఃభూ, చరులెల్లను జొక్కి రి హరి, మురళీరవామృతము సోఁక ముద్దియ కంటే భా. ౧౦ పూ. ౭౯౫

సీ. పాటలాడుదు రొక్కచోట మోటులు పల్ల వించి కోయిలలకు విందునేయు

ఉ రా ౧ ౧౭౦.

ఉ... మోదమున న్మగి పల్లవింపఁగా...

దశకు 3 ౧౬౫

చ. గిజభుటలం గనుంగొని వికాసము మోమునఁ బల్లవింపఁగా భార భీష్మ ౨ ౨౦౬.

గీ బహుళకారుణ్యసంపద పల్లవింప

భార శాం ౫ 3 ౧

౨. రాగిల్లు, రక్తిని పొందు

సీ ఒకకొంతప్రొద్దు ఖాండికజనంబు లానర్చు పరిహాసగోష్ఠికిఁ బల్లవించు శివరా ౨ ౯౭

అ. లీల నంది నెక్కి లే వ్వ దొలుకాడఁ, బణఁతి కథయ మీయఁ బల్లవించి,భక్తకాంక్ష వుండు భవుఁడు ప్రత్యక్షమై, శైలరాజ పుత్రి మోలనిలచె వీర. ౨ ౨౦౭

పల్లవికుఁడు. సం వి అ పుం కాముకుఁడు, విటుఁడు. (వాచ)

పల్లవితము. సం విశ. (అ. అ అ) ౧. చిగి రించినది. ౨. విరివిగలది, విస్తారయుక్తము 3. లాక్షారక్తము, లత్తుకచే నెఱ్ఱబడినది. (శే. వి.)

పల్లవిలు=పల్లవించు.

క. జనపతి మునిపతిఁ బూజా, వినతి నతి క్రియలఁ బల్లవిలఁజేసి ప్రియంబున వీడు కొలిపి తానుం,జనియెఁ గొలువు విరిపి రత్న సదనంబునకున్. వెం పంచ. ౪. ౧౦౯.

పల్లాండు. వి (త పల్లాంటి = ఆశీర్వచనము, కావ్యము) గీతము.

ద్వి మఃవిజజనకుండు మధురాపురమునఁ, దన దేవితోడఁ బ్రత్యక్షమై మున్ను, చేడియ కూర్మి నాచేతఁ బల్లాండ్లు, పాడించుకొన్న శ్రీపతిసొంపు మీఱు.

ద్వి సాము ౫. 3౯3 పా

పల్లాడు=పాలాడు.

(చూ. పల్లార్చు)

జ • పలార్చు.

పల్లాయనము. వి (సం పల్యాణమ్: క. పల్లణ త. పల్లాణం) జీను, పల్లము.

(చూ పల్లాయనంబువాఁడు)

జ • పల్లాయనంబువాఁడు.

పల్లాయనంబువాఁడు. వి (√ పల్లాయనము) రాతు; భృత్యుఁడు (ఆప్తుఁడు శ. ర.)

వ...౩న పల్లాయనంబు వారితోఁగలసి మఱు నడి యున్న కారవేశ్యుం డమ్మాటలు విని .

భార ఉద్యో. ౧ ౯౪.

పల్లార్చు=పాలార్చు. స క్రి (√ పల్లాడు) ఇది పట్టుభాతుక్త్వార్థ కానమాపక క్రియాపూర్వకము గాఁగే ఠేఁచుగాఁ బ్రయోగములందుఁ గానఁబడు చున్నది. ౧. పాడుచేయు, ధ్వంసముచేయు.

గీ॰ లేమ నీదయ నామీఁద లేమి నింత, సకలఁ కొల్పడవలసెను వీనిచేతఁ, గాక నీప్రాపు గలిగినఁ గడఁగి వీనిఁబట్టి పల్లార్చగాఁజా నిపాదమాన. కవిరాజ. ౨. ౧౪౭.

సీ. పట్టిపల్లార్చిరి బహుదుర్గవర్గముల్ పరభ
  భూభర్తృ పాశ్చాత్యచయము.
  సిం. శాగ. ౪. ౫.

౨. మిగుల బాధించు, పీడించు.

సీ పట్టిపల్లార్చ శేపట్టున దయఁ జిల్కు మనసు
  గల్గినయట్టి మగఁడు గలిగె.
  హంస. ౪ ౧౮౬.

3 ఎక్కువగా విమర్శించు

వ్యవ. నే నాడినమాటనే పట్టి పల్లార్చు
  చున్నాఁడు.

పల్లి. సం వి ఈ. స్త్రీ ౧. పల్లె, క్షుద్ర
  గ్రామము ౨ కుటి, వ్యాధమందిరము 3 ఆశ్ర
  మము. ౪ బల్లి, గృహగోధిక

పల్లించే=పల్లగించే. స క్రి (పల్లము[2]+
  ఇంచు=పల్లము గలదిగాఁ జేయు) ౧ (గుఱ్ఱము
  మొ. వానిని) పల్లము కట్టు సిద్ధపఱుచు

వ అత్తెఱంగ దత్తడులం దత్తడంబునం బల్లింప
  నేను చెప్పగంబున నెక్కంబోవువారును
  పారి ౪. ౬౬

క అల్లవ కిచ్చెను బచ్చల, పల్లకియును దమ్మి
  కెంపు బదికపుకోడుక, జల్లులసమక ట్లల
  రగ, పల్లించినవారువమును బంగరుగొడు
  గుగ యయా. ౪. ౧౭3

౨ (గుఱ్ఱము మొ. వానికి పల్లమును) కట్టు.

వ మూర కొక్కండును కేవ కొక్కండును
  గా...కట్టునడొల్లుటుల్లారు బల్లసిల్లఁ బల్లిం
  చినపల్లంబు పై. . ఆము. ౪ ౩౫.

పల్లిక[1]=పల్లిక. వి ప్రసేవవిశేషము, వెదురుబద్దలు
  మున్నగువానితో అల్లిన పెడల్పయినసంచి, దాగర
  సీ. సిబ్బి పల్లిక శాఁ బ్రసేవవిశేష నా. ,
  ఆం. భా ౨. ౨౪౦.

పల్లికలు. వి. తామరసవలె బయలుదేరెడి చర్మరోగ
  విశేషము.

ద్వి...వయను, గిగిపోయి పల్లికదే బెరూపముకు
  వగ మాలి బ్రతికి రొక్కరి నుద్ధరింప. ద్వి. ౪.
  పా. ౨ ౬౯ పా. ౫ పం.

(వ్యవ) వానికి ఒడలెల్ల పల్లికలు బయలుదేఱినవి

పల్లికతట్ట. వి మత్స్యవిశేషము

ఉ. పల్లికతట్ట మారువము వాలుగ చేదస కొఱ్ఱ
  మీను... ప్రబంధ ౧౯౫

(వల్లికతట్ట ముద్రి. పా.)

సీ. వాలుగు మొదుగొమ్మ పల్లికతట్ట పుత్తడికాను
  పూమీను కడిసెలంబు . హంస. ౪. ౧౨౪.

(వల్లికతట్ట. ముద్రి పా.)

పల్లియ=పల్లె[2]. వి (క పల్లి త పల్లి) చిన్న
  యూరు

గ ఎల్లుండి సమారాధన, చిల్లర వెచ్చములం
  గొనఁగ శీఘ్రము మె యిది యీ, పల్లియసంతకుఁ
  జని... శుక. ౨ ౧౭3

మ. విను లోచూపున చేలపై నడువులం బ్వాళ్లు
  న్మల ల్సాంద్రము, శ్పనువీవు ల్దగుపల్లియ
  ల్పదకి... యయా 3 ౧33.

గీ పల్లియచోటినుండి రొలపాపెను వట్కులం
  చక్కలంబులు, స్పల్లపుటచ్చులు...
  హంగ ౨ ౯౧. నీలా ౧ ౧౦౦.

పల్లివాహము. సం వి అ. పుం తృణభేదము.
  (రా. ని.)

పల్లు[1]=పల్లము[1].

పీ .పల్లము నవుకుఁ బల్లవఁగ నిమ్నంబు దనరు.
  ఆం భా. ౧ ౧౫౮

పల్లు[2]=పన్ను[3], పలు[2]. వి. జా. (క. పల్లు,
  పొల్లు. త. పల్లు.) ౧. దంతము, రదనము.

(చూ. పల్లొత్తు)

(బ. పల్లులు, పండులు. పండ్లు.).

ఉ. ఒజ్జలు గొట్టినన్ బడఁగ నోరవ కింటికిఁ బాఱి తెంచినన్, దజ్జననీవరంపమును దం(డియు నిర్దయచిత్తులై మఱుక్, నజ్జగ మౌది పల్లెకుఁ జన స్వాదలించిన వాఁడు సేద్యిన్, బొజ్జ కలంగ నాఁకొనుచు భోజన మేమియు లేక దీనుఁడై

సిద్ధిశేషధర్మము 3. అ (చి ని)

జ॰ పల్లెకూటము, పల్లెటూరు, పల్లెమాటు

పల్లెకూటము=పల్లికూటము. వి (√ పల్లె 2) చదువులబడి

చ తనమతు లోఁగిట స్వాదకి తల్లి దిగుల్కొని పల్లెకూటముం,దూఁ దిలకించి.

చెన్న 3 ౧౬౭.

సీ. పంచాగములు మోపి బసివాదనముచేసి పల్లె కూటము చెప్పి పసులఁగాచి వేణు ౪౧

పల్లెటూరు=పల్లె 2 వి (పల్లె 2 + ఊరు)

(చిన్నయూరు, కు(గ్రామము)

గీ చిన్నచిన్న రాళ్లు చిల్లర దేవుళ్లు, నాగులేటి నీళ్లు నాఁపరాళ్లు, సజ్జజొన్నకూళ్లు సర్పం బులును దేళ్లు, పల్లనాఁటిసీమ పల్లెటూళ్లు (శ్రీనాథుని చాటువు)

పల్లెత. వి (పల్లె1) ౧ పల్లెది, పల్లెజాతిది (శ.ర.) ౨. మాతంగి, మాతంగ జాతి స్త్రీ

గీ పల్లెత యనఁగ మాతంగి పరగుచుండు

ఆం భా ౨ ౧౦౫.

పల్లెమాట. వి (గ్రామ్యవచనము (శ.ర)

ప(ల్లె)ల్లేరు. వి. పలంకష, శ్వదంష్ట్ర స్త్రీ

సీ...పల్లే గనశ్వదంష్ట్ర పరగుచుండు

ఆం భా ౨ ౫౫

జ: పల్లేరుఁ బువ్వులు, పల్లేరుఁ బూవులు.

పల్లేరుఁగాయ. వి. భూషణ విశేషము. (శ. ర.)

పల్లేరుఁబువ్వులు=పల్లేరుఁ బూవులు. వి. బ. (√ పల్లేరు) స్త్రీ కర్ణ భూషావిశేషము.

క ముల్లు దలకొనని వదకిపుఁ, బల్లవములతోడ ముత్తిభామ చెవులకుం, బల్లేరుఁబువ్వు లగు పువు, లల్లసిలుచలర్కఁ జాకి మెండుగుగఁ గొనుచున్

ఆము ౪ ౧౯౫

పల్లేరుఁ బూ(వు)లు = పల్లేరుఁ బువ్వులు. వి బ (√ పల్లేరు) —పల్లేరుపువ్వు వంటిది. స్త్రీ కర్ణభూషా విశేషము

ద్వి పౌజాలకమ్మలు పల్లేరుఁబూలు, రాజిల్లు గత్నాలరాకిడి పెట్టి

ద్వి శ్వ పా ౧ ౧౩ పా ౧౭ పం. (పల్లేరు పూలు ము(ద్రి పా)

సీ దండి తీరైన చింతాకుఁ దీఁగెయు నాను పల్లేరుఁ బూవులు బన్నసరము

హంస ౪ ౧౩౫

పల్లొత్తు. అ (క్రి. (పల్లు2+ఒత్తు) పంటితో కొఱుకు, దంతక్షతములు సేయ.

సీ పంకనిశ్శంకుఁడై పారదారిక వృత్తి వదలక పల్లొత్తువాని సెడసి వసు ౧ ౭౬.

సీ విటుఁడు పల్లొత్తినఁ గటకటపడు మోవి యినుప కెళ్లెములకు నొట్టు లొర్చు

చి(త్రి భా 3 ౯౫

వి. దంతక్షతము

సీ. కద లేని వీర్యంపుఁ గప్పుచందురు కావి మోవి పల్లొత్తుల మునుఁగుదన్న

పాండు. 3 ౧౦

సీ పెలరొంత యీ మల్లికల కని పలికించి గుత్తంపుమోవి పల్లొత్తుఁ గాంచి.

రా. వి. ౧. ౫౭.

పల్లలము. సం. వి. అ. న. నీళ్లు గల చిన్న పల్లము, అల్పసరస్సు.

పల్వలావాసము. సం. వి. అ. పుం. తాఁబేలు.

పల్వ(లువ)ల్వ=పలువలువ. వి. (√పల్లు²) రదనవాసస్సు—వాతెఱ, పెదవి

క. కేదార కుంగమున కన చివు, రే దొర పల్వల్వతోడ నిఱిగుబ్బలయా,డే దొరయుం జక్కవకవఁ, బైదలినలు వెన్న నలుపపడఁ జిక్కఁ దరకో. అచ్చ. రా. బాల. ౧౩౫. (పల్వరున అపముద్రి.)

పల్వురు=పలువురు. (శ ర)

పళ పళ. వి ౧. చెట్టు, అప్పడములు మొ. విఱుగు నప్పుడు కలిగెడుధ్వని కనుకరణము.

క. జలసేవన ఘలఘుల లప్పలముల పళపళలు భోక్తృభళభళ లబలా, వళిపట బెళబెళ లంగద, ఝుళఝుళ లేకేళివిఁ చె జనము సుతింపన్. బహు ౪ ౨౪

౨. ప్రకాశించుటయం దగు ననుకరణము. (శ ర.)

పళ్యము=పళ్ళెము. వి భోజనపాత్రము

ఉ. భోజనశాలలోనఁ బళ్యం బిడివారు పంక్తి జదళాన్నులు కెండవజామునంట శ్రే, యంబడె సారగింప సమయం బని చెచ్చెర విన్నవించినన్. కాశీ ౫. ౩౦౭.

పళ్ళిక=పల్లిక¹. వి. ఒకరకమగుతట్ట

సీ. ఎడమచేఁ బళ్ళిక నిడినబండా రవ్యపాణిఁ బట్టినసాగపడిగలోల. శుక ౨. ౪౨౪.

పళ్ళియరము=పళ్ళెము. వి. భోజనపాత్రము.

చ. విశిష్టభూజలోఁ, బస నగు పచ్చడంబు నొక పళ్ళియరంబున గల్గఁ దప్పితిన్. హ్యా. ౨. ౧౭౨.

పళ్ళు. వి. ౧. కుండ పెందలగునవి పగిలినప్పు డగు ధ్వని కనుకరణము.

క. పవిశాణము కొండఁ దాఁకి పళ్ళున విఱిగెన్. కళ. ౫ ౧౭౯.

౨. చెంపను కొట్టునప్పుడు కలుగు ధ్వని కనుకర ణము

(వ్యవ) వాఁడు పళ్ళున ఒకచెంపకాయ కొట్టి నాఁడు.

పళ్ళెము=పళ్ళియము, పళ్ళియరము, పళ్ళెరము, పళ్యము. వి ౧ భోజనపాత్రము.

సీ కెండియొడ్డవలపై కెలిచి తెచ్చినపైఁడి పళ్ళెంబు లాయత్తపఱచువారు సైవ. ౬. ౧౧౯

౨. తాంబూలము మున్నగునవి ఉంచుకొను పాత్రవిశేషము.

చ ఘనతర రత్నదీపకళికా శతమానమనోహ రంబు లైౖతనరునివాళి పళ్ళెములు తామర సాక్షు లొసంగ కేక్కతో, భార ౪ ౬౧

క ఇల్లలికి ముగ్గువెట్టి మృహోల్లాసము పల్లవింప నొక్కమెఱుంగుం, బళ్ళెమునఁ గోసి పైచిన, యల్లజటాఖండ మిడియు నలరులతోడన్ శుక ౨ ౨౩౦.

గీ. పళ్ళెరము పళ్ళె మనఁగను పాత్ర మొప్పు ఆం. భా. ౨. ౨౪౪.

పళ్ళెరము=పళ్ళెము. వి. ౧. తాంబాళము, తాంబూలాదు లుంచుకొను పాత్రవిశేషము

వ... దాక్షారామ శ్రీ భీమేశ్వర మహాదేవరకు నైవేద్యానకు బిక్కవ్రోలను రెండుపుట్ల క్షేత్రముంను నైవేద్యము సమర్పణసేయం బళ్ళెరమును సమర్పణ సేస్తిమి... ద శా. ౪. ౧౩౪౩.

దండకము...జాత్యనారాయక్ భయం చేది చేది క్షమావల్లభుం డెంతయుం బ్రహ్లనం బ్రల్లదం

ఖాడీనం బళ్లెరం శెత్తి చిత్రంబుగాఁ
దచ్చిరణ ర్తవ(శ్రా)ధి వర్తించి...

పారి ౩. ౩౯

గీ పసిమి పదియాఱువన్నె యపసిఁడిపళ్లెరమున
శివునిపదాబ్జంబు లమర నునిచి, కేలుఁదమ్ముల
(ర)తనంపుగిండి వంచి, యనుఁగుటిల్లాలు నీరు
వోయంగఁ గడిగి

జాహ్నవీ ౧ ౧౫౪ దశా ౪. ౧౪౮.

౨ భోజనపాత్రము

గీ పచ్చకప్పురానికిఁ బులపళ్లెరములఁ, బచ్చ గందని
కూర లేర్పడమిఁ జూచి

నైష. ౬. ౧౨౨

క. ఆనీలవేణి యాదవభూనాయకుఁ డారగింపఁ
బోరెడువేళన్, దా నయి పళ్లెర మిడిరెండు,
దానఁగదా యనఁ దపసితగులన నుండెన్.

కాశి ౧ ౪౪

గీ మాదువు మీఁదిపసిఁడి పళ్లెరమునందు, రస
రసాన్నము లిడి యొక రాజవదన,

రసిక ౧. ౩౬

౩. పళ్లెరముపెట్టు.

పళ్లెరము పెట్టు. అ క్రి భోజనపాత్రములో పదార్థము లన్నియు సిద్ధముచేసియుంచు

చ అతివినయంబునన్ సరసిజాక్షులు కొందఱు
పళ్లెరంబుపెట్టితి మని పిల్వఁగాఁ...

వరాహ ౪. ౧౩౨

చ. అతనికి సత్యభామయు మురాసురవైరియు
నాతిథేయసత్కృతు లొనరించియుండఁగ
సతిమణు లిద్దఱు పళ్లెరంబుపెట్టితి మని విన్న
వింపఁగ...

పారి. ౨. ౧౮.

పవ=పగ. వి. విరోధము.

క. పరమాన యుండు నీతలఁ, పవమానప్రదము
యనద లంచును దయఁజూ, పవ మానవచరితా
త్మై, పవమానప్రవృత్తి గాదు పవ మాన
వజా.

రా. వి. ౪. ౬౧.

పవడము=పగడము. వి. (సం. ప్రవాళః, ప్రా.
పవాళో క. పవళవు, హవళవు. త. పవళం.)
ప్రవాళము, విద్రుమము

సీ. పవడంపుజొత్తులఁ జెవుల రూ పడఁగంగఁ
బాపటఁ దలకట్టుభంగి గప్పు

భార. విరా. ౧. ౨౭.

సీ పవడంబుమీఁది కోపమునకో యాకాంతి
పాదంబు లత్యంతపాటలములు.

నైష ౩. ౨౦౨. శివల. ౩ ౨౨

పవడపుఁదీవె(ఁగె)=విద్రుమలత

గీ తెలివయధరంబు పవడంపుఁదీవెయరవు.

విక్ర. ౬. ౨౫

సీ తెలిదమ్మి విరియింటి తెలిగంటి కెంపువా
తెఱసొంపె పవడంపుఁదీఁగెగుంపు.

దశా ౧ ౧౬౪.

పవ(వ్వ)ళించు=పవళించు. అ క్రి (క పవ
డిసు) ౧ శయనించు, పరుండు.

క ఘనభుజగ శతఫణావృత, తనుఁడై బాలుఁడు
పయోధితరఁగలమీఁదన్, బెనుశాపసెజ్జఁ
బవళిం, చినవెన్నునిపాటి యగుచుఁ జెన్నెస
లారన్.

నృసిం ౪ ౧౩౫.

వ...అచ్చిత్రరేఖ యమ్మచ్చకంటి పచ్చవిలుతు
రిచ్చప ట్టయిన పాన్పునం బవళించియున్న
నచ్చోటికిం బోయి తప్పక కనుంగొని,

ఉ హరి ౫. ౧౩౯

౨. నిద్రించు

గీ. అతఁడు పవళింప మును కౌరవాధినాథుఁ,
దరిగి తలయంపిదెస నున్నతాసనమున,
నుండె...

భార. ఉద్యో. ౧. ౬౫.

శ్లో. సుప్తం దదృశతుః కృష్ణం...

శ్లో. ప్రతిబుద్ధస్సవార్ష్ణేయా దదర్శాగ్రే కిరీటి
నమ్.

సం. భార. ఉద్యో. ౭. ౮౧౦.

సీ. దుగ్ధాంబునిధి నిట్టఁ బోఁచెనో యని శేషుఁ
బాన్పుగా హరి నీటఁ బవ్వడింప
కు. సం. ౭. ౧౧౭.

వ... శింశుమారాకారంబునం దారకావీథిఁ బవ్వ
ళించిన వాంఛజన్యధరు నారసి...
కాశీ ౨ ౯౭.

పవతుఁడు=పగతుఁడు.

క. యువతికిఁ బ్రాణం బయ్యెం, బవతుగతిం
బ్రోఁది సేసె మలయక్షితిభృత్పవమానుఁడు
దూరితశైౖ, పవమానుఁడు కూహాదావ
పావక శిఖలన్ వేం. పంచ. ౪ ౧౭౧.

క మలద్రిమ్మరిరాయఁడ దిటు, మలరఁగ నీప
వతుపిఁచ మడఁచి పుడమి కి, మ్మల నొడ
యనిఁ జేసెద నినుఁ, దలఁపున మామాట
నమ్మఁ దలఁకకు మింకన్.
అచ్చ రా కిష్కిం ౨౪.

పవనతనయుఁడు. సం వి అ పుం ౧ హను
మంతుఁడు. ౨ భీముఁడు
(ఇట్లే, పవనసుతుఁడు మొ.)

పవనము. సం. విణ (అ. ఆ అ) శుద్ధము, నిర్మ
లము. వి. అ. పుం. ౧ గాలి. ౨. గార్హప
త్యాగ్ని.
న ౧. ధాన్యాదులశోధనము (చెరుగుట కడు
గుట మొ వానిచే శుద్ధము గావించుట)
౨. తూర్పెత్తుట. 3 నిష్పావము. ౪ జలము
పుం. న. కుమ్మరిఆవము

పవనవ్యాధి. సం. వి ఇ. పుం. ౧. ఉద్ధవుఁడు.
(కృష్ణునిమంత్రి.) ౨ వాతరోగము.

పవనాలము. సం. వి. అ. పుం. ధాన్యవిశేషము.

పవనాశనము. సం. వి. అ. పుం. గాలితిండి,
పాము.

పవనాశనాశుఁడు. సం. వి. అ. పుం—పాము
దిండి—గరుడుఁడు (పాలా. ని.)

పవనేష్టము. సం వి. అ. పుం. మహానింబము,
పెద్దవేము ?

పవనోంబుజము. సం. వి. అ పుం పరూష
ఫలము, ఖర్జూరపుపండు.

పవమానుఁడు. సం వి. అ పుం. ౧. గాలి,
వాయువు ౨ గార్హపత్యాగ్ని. 3. సోముఁడు.
(వాచ)

పవము. సం వి అ పుం ౧. గాలి ౨. బియ్యము
లోనగువానిని శోధించుట (శుద్ధముచేయుట)
3. తూర్పెత్తుట, నిష్పావము ౪. చిత్తడిబోలె,
బురదనేల వి. ఆ. స్త్రీ. శోధనము, శుద్ధము
సేయుట అ. న గోమయము, పేఁడ.

పవలు=పగలు. వి జా. (త పగల్.) వాది
భాగము.

సీ లోనిజొంపము పవలును వెసచీకటి వొద
వించి పొందలంగ నొప్పుదాని
భార. విరా. ౧ ౧౭౨.

చ పవలును రేలు దుఃఖపడి బాలుని నొయ్యన
బుజ్జగించి దా, నవకులనాథ యేను జత
నంబునఁ జెప్పితి రాజనీతి...
నృసిం ౪. ౧౫౨.

గీ ఉష్ణశీతాన్నకబళంబు లొకఁడు వరాకఁ,
బవలొ రాత్రియొ గడగూడ నవసర మని,
దాని కుత్తర మొకలతాతన్వి యిచ్చె, నధర
బింబంబు విచిది సంధ్యాగమ మని
హైమ. ౭. ౧3౭. భార కర్ణ. ౧. ౭౨.

పవలింటినిద్ర=దివాస్వాపము.

చ. దిటమున రెడ్డి పాటుపడి తెచ్చి యిడంగను
గూటిపొద్దు సంకటితటి చెన్నమల్లెగలు కంత
టిపైఁ బవలింటినిద్రలును, జెటుకు లుఁ
జెల్లిరా...జారసంగమసుఖంబునకే తమకింతు
రిద్దఱున్. శుక. ౨. 33౪.

పవాడము?=పావాడము. వి. (క. పవాడక్కె. త. పావాడం) ఒక కార్యము నెరవేరినచో నని దేవునిఁ బ్రార్థించుకొని యాప్రార్థనము నెర వేరినిమీదట దేవునియెదుటఁ జేయు జిహ్వాచ్ఛేద నాది సాహసకృత్యము. (శ ర. బ్రౌ.)

పవి. సం వి. ఇ పుం ౧. ఇంద్రుని వజ్రాయుధము, కులిశము ౨. గాలి ౩ ఆయుధము యొక్క తీక్ష్ణమైన అంచు. (వై ని)

పవితము. సం విణ (అ ఆ అ) పవిత్రము, శుద్ధము చేయఁబడినది వి అ న మిరియాలు.

పవిత్రకము. సం. వి. అ. న జనపనారతో పల్లిన వలత్రాడు. వి. అ పుం. ౧. మేడి చెట్టు. ౨. రావి చెట్టు. ౩ దమనకము, దిమనము చెట్టు ౪ దర్భ, కుశ చెట్టు.

పవిత్రధాన్యము. సం వి అ. న యవలు

పవిత్రము. సం. విణ (అ ఆ అ) ౧ పరిశుద్ధము; వ్రతశౌచాదులచే శుద్ధమైనది ౨. శుద్ధి గలిగించునది (పాపాదులను బోఁగొట్టునది) వి అ పుం. తిలవృక్షము,నువ్వుచెట్టు. ౨. పత్త్రిజీవము ౩. అగ్ని. ౪. కిరణము, ఘృణి. న ౧. బంగారు. ౨. ధనము. తెల్ల తామరపువ్వు ౪ కలశము (వై. ని.) ౫. యాగములందు నెయ్యి చిలుకునట్టు రెండు దర్భపోచలు, ఆజ్యసంస్కారక మగు కుశద్వయము. ౬. కొన్ని కర్మవిశేషముల యందుఁ అనామికయందు దాల్చు దర్భ యుంగరము. ౭. జందెము. ౮. జలము. ౯. రాగి, తామ్రము. ౧౦. వర్షణము, వానకురియుట. ౧౧. ఘర్షణము, రాచుట, తోముట. ౧౨. అర్ఘ్యము నర్పించెడి యుపకరణము. ౧౩. నెయ్యి, ఆజ్యము. ౧౪. తేనె, మధువు. ౧౫. గోమయము, ఆవుపేఁడ. ౧౬. మంత్రము. ౧౭. దధి, పెరుగు. ౧౮. క్షీరము పాలు.(శ.ని.)

అ.స్త్రీ. ౧ తులసి ౨. నదీభేదము. ౩. పసుపు. ౪. అశ్వత్థవృక్షము, కండ్లరావి చెట్టు.

పవిత్రారోపణము. సం. వి. అ. న (విష్ణుప్రభృతి దేవ సంప్రదానకమగు) యజ్ఞోపవీత దానము. (ఇదిరెండుక యుత్సవము)

పవిత్రారోహణము. సం=పవిత్రారోపణము

పవిత్రి. సం విణ. (క. తి. క) ౧ శుద్ధము చేయునది. ౨ పవిత్రము చేయునది.

పవిత్రీకరించే. సం స క్రి పవిత్రముచేయు

సీ ఏ దయాహృదయుల పైదోడు జగములఁ
  ద్రిస్రోత రైు పవిత్రీకరించు
    శ్వే. శతం ౧ ఆ.

పవిది=పగిది. వి. (సం ప్రకృతిః) విధము

క శివునంగయష్టి నిరియఁగ, నవిరళముగఁ
  బట్టి ప్రాఁక నని కడుసొమ్మ్రి, న్నిపుడు నవ
  కల్పలతికల, పవిదిని మృదుబాహులతలు
  పార్వతి కొప్పెన్. కు. సం. ౩. ౭౯.

ద్వి భవుఁ బాద వానందబాష్పంబు తొలుకు,
  పవిది నేడుచుఁ గముఁగవ వ్రకు లాలుకి.
    బస పు. ౧ ౪౧౩ పం.

పవీరము. సం వి అ న ౧. హలము, నాఁగలి ౨ రంగస్థానము (శే. ని)

పవుఁజో=పౌఁజు. (క పవుజా త. పవుంజా.) (శ. ర)

పవుఁజోలుతీర్చు=పౌఁజులుతీర్చు. (శ. ర)

పవుఁజోలునేయు=పౌఁజులునేయు. (శ ర)

పవులు=పౌలు, పగులు. అ క్రి. ౧. బ్రద్దలగు, భేదిల్లు.

చ. కవిసి యుగాంతదండ ధరుపైఁ బడిఁ గోలు
  ముసంగి కుంభమున్, పవులఁగఁ దుండముల్
  దునియఁ బ్రక్కలు బ్రక్కలు గాఁగ...
    భార. భీష్మ. ౨. ౬౭౦.

పశువు. సం. వి. ఉ. పుం—అన్నిటి నొక్కరీతిని జూచునది — ౧ సింహాదిగజాదిజంతువు. ౨. ప్రాణి, జంతువు. ౩, మృగము. ౪. యజ్ఞపశువు, యజ్ఞమున వధింపఁబడు జంతువు. ౫ భాగము, మేఁక ౬. యజ్ఞముభేదము ౭ యజ్ఞోదుంబరము. ౮ ప్రమథగణము

పశుహరీతకి. సం వి ఈ స్త్రీ ఆమ్రాతక ఫలము, అంబాళపు పండు

పశ్చాత్. సం అవ్య. (దీనికిఁ దెనుగున వ్యస్త ప్రయోగము లేదు) ౧ వెనుకనుండి ౨ వెనుకకు. (వ్యతి. పుర) ౩ పిమ్మట, అవ్వల; వెంట, పిఱుఁద. ౪. కడపట ౫ పడమటినుండి. ౬. పడమరగా, పడమరవైపుగా.

పశ్చాత్తాపము. సం వి. అ పుం అనుతాపము, తానుచేసినది తప్పని యెఱిఁగి దానినిగూర్చి పిదప దుఃఖపడుట

పశ్చార్ధము. సం. వి అ పుం ౧ (దేహాదుల) వెనుకటిభాగము. ౨. రెండవసగము. ౩ పడమటిప్రక్క.

పశ్చిమ. సం. వి ఆ. స్త్రీ. పడమరదిక్కు

పశ్చిమము. సం. విశ. (అ. ఆ అ) ౧ వెనుకటిది. ౨. (దేశకాలములందు.) ౩. కడపటిది

పశ్చిమరాత్రము. సం వి అ. పుం. రాత్రి వెనుకటిభాగము, రాత్రి శేషభాగము.

పశ్చిమాధ్వరము. సం. వి. అ. పుం. ఉత్తరక్రియ.

గీ. అధిప నీ వింక న న్నిప్పు డడుగనేల, కాని కార్యంబు చెప్పెదఁ బూని నీవు, కంసునికిఁ బశ్చిమాధ్వరకార్యసరణు, లకట నడపంగ వలెం దంటినయ్య యేను.

హరి. పూ. ౮. ౧౩౬.

పశ్చిమోత్తర. సం వి. ఆ. స్త్రీ పశ్చిమోత్తరముల మధ్యదిక్కు.

పశ్చిమోత్తరము. సం విశ. (అ. ఆ అ) పడమరగాను ఉత్తరముగాను నున్నది.

పశ్యంతి. సం. వి. ఈ. స్త్రీ. వాగ్విశేషము.

పశ్యత్. సం. శత్రి, చూచుచున్న

పశ్యతోహరుఁడు. సం విశ (అ. ఆ. అ.)— చూచుచుండఁగానే దొంగిలించువాఁడు—పచ్చి కాఁడు, కన్నులయెదుటనే మ్రుచ్చిలించి కొని పోవువాఁడు

వి' కమసాలివాఁడు

పశ్యత్ఫాలుఁడు. సం వి అ పుం, శివుఁడు, ముక్కంటి

పశ్యల్లలాటుఁడు. సం వి. అ పుం నొసలికంటి దేవర, శివుఁడు.

పస. వి (క. పాస త పసై) ౧ సారము, చేవ.

సీ పాతాళమున నున్న ఫణిరాజులోఁ బల పసయొల్ల రూప మై యొఁపగ నవఁగ.

హరి పూ. ౬. ౪౮.

మ. పస సంసారమునందు లే దొకటియున్ భావించి చూడంగఁ బుణ్యాసముల్లాసము నార్తిదంబు... మల్ల భూ. వై. ౧౧.

సీ... ధరణీశ తాతలతరమునాఁటి, పాతఁ పంచారంబు పస లేదు పేటెత్తె నిది వృథాస్థూల మిం దేది బలము...

దశా. ౪. ౨౦౬.

చ. తెనుఁగున దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందు లేదు మెత్తన పస చాల దంద్రుం విశదంబుగ సంస్కృతశబ్ద మూఁతఁ

కొ,ప్పిన నవి దర్భముం ద్లనుచుఁ బెట్టరు
బీసుల .. ద్వా ౧ ౩౨.

౨...అతిశయము, సమృద్ధి, ఆధిక్యము.

చ అగజ యూరపి యెవ్వని ప్రాసునో సురూ,
పశపస నీకుటో దయినభవ్యుఁడు దుర్లభుఁ
డెల్ల సృష్టిలోన్ ప్రభా ౧ ౧౩౬

సీ. మునీంద్రమాఁకునఁ బండ్లు పసమీఱఁ గల్గించి
యించున కేల పుట్టించదయ్యె.
శ్రీం ౧ ౧౧౧

ఆ అని దశాశ్వమేధ మంత్ర్యంబు తీర్థంబు,
పంచనదము కాశిఁ బసగలయని. వానికంటెఁ
బెద్ద వాతాపితాపస, చక్రపుష్కరిణి యసం
శయంబు కాశి. ౭ ౨౩ కళా. ౧ ౩౩

౩ చాతుర్యము, నేర్పు

రగడ పొలఁతి ప్రేంకణంబు చూడఁ బుచ్చఁ
బుచ్చడేకి మసలు, నెలఁత చైత్రమాసమున
జనించు నించువిలుతు పసలు
వరాహ ౩ ౯౨

పంచచామరము ఇసీ యిసీ కొంగంబు నూడ
కిల్లు వెల్వరించిరన్, వెస న్విసింగిపోవు సిగ్గు
వీసమంత లేదు గీ, దెసం బసల్ ఘటించె
దేర త్రిమ్మరీ మ తిల్లు వచ్చి సారె సారె
నన్నుఁ గెర్లఁ జేయరాక పొమ్మికన్
విప్ర ౪. ౫౯.

విశ్వ. ౧. ౧౧,

౪. స్ఫురణము

గీ మధువుఁ గాంతల పుక్కిటి మధువుఁ జెల్ల,
యార్ష్యఁ బస మూపఁ బొగడపై వెలయ
దాన, విరిపెఁ దొల్లిటి దళములు విరులు
జడిసె, దీన నగ్గెల్పునకు నబ్బి తేఁటు లార్చె
ఆము ౫. ౧౩౦.

పీ ..పస యన స్ఫురణంబు పగగుచుండు
ఆం. భా. ౩ ౩౦.

౫ శక్తి, సామర్థ్యము.

శ. అపురా ధర్మవిశేష, ప్రవరులపస గానఁ
బడియెఁ... భాగ ౬ ౧౧౧

సీ...వెదకి నీ కివ్వరు కాదురు లేగ,పార్థ దర్ప
మున నీపస గాన కి ట్టైదిర్చినవారిదోవంబు
గనిరెు ఫలము. రాఘవ ౪ ౭౧.

సీ ఆదిత్యపస యాఁచి హాలహాలంబును లోఁచి
హుతవహుఁ గర్వ ముజ్జాఁతలాఁచి
కళా. ౧ ౭౬.

౬ వలపు, (స్త్రీపురుషులకు పరస్పరముకలుగు)
ప్రేమము

క చిక్కనిచక్కనిచన్నుల, మక్కువయిల్లాలి
విడిచి మాయలు గలయా,వెక్కసపు,మద్య
పానపుఁడొక్కపసం దగిలి దుర్వ్యటుఁడ నై
చెడితిన్. భాగ ౬. ౧౩౬

గీ వలచివచ్చివనిల్లాలిబలె భరించి,పసఁ జిక్కిం
చి విలసవపౌఢ నిజభు,జాపతీరంభమును
ములచవులు సూపె,విశ్వధాత్రిఁ దిమ్మయ
యీశ్వరుండు వరాహ ౧ ౩౨

గీ అటువలె నిశాధినాయకుఁ డన్యమృగదృ,
గానుకూల్యగ్రచిత్తుఁ డై యహరహంబుఁ,
దిరుగఁ దనమీఁద పస లేనితెఱఁగుఁ జూచి,
వసుమతియుఁ గాంచె జారాంకవాహనంబు.
హంస ౨. ౨౪౨.

౭ పరిమళము, వాసన

సీ. పన్నీటితోఁ గదంబముఁ జేసి పూసిన మృగ
నాభిపస రాచనగరు దెలుప ఆము ౨ ౭౫

గీ...అవ్వనజగంధి, కేనిజవ్వాదిపస కదంబించు
నొడలు, గడిగికొని... మనుచ. ౨. ౭౪.

వ...పునుంగుపసం బిసాళించుగొజ్జంగినీటి కాత్తా
వియును భీమ ౧. ౧౧౭.

౮. ఒప్పిదము; అందము; కాంతి

సీ తెలిమొలామాపస మెచ్చి తలయూఁచు బొజఁగి
మానికి నవ్వు నేర్పు దెండములఁ గరఁప.
ఆము. ౨. ౫౦.

శ. కలికి రాయశ్రొత్త రాజుని జగత్రయజిరాపాన దివ్యరూపమం, గళపటులుగ్రరాంబుపసఁ గాంచుటమిక్ గటిఁ బూని మేఘాలా, వల యమై నెలకొల్ప మణిపస్...
దాసూ. ౪. ౧౪౭.

సీ. పసపపంటికి మంచిపన రొందఁగూర్పక మాసిఁడిపండ్లకు దద్ద రొసఁగినట్లు
రసిక. 3 ౪౦

వ...మిరియంబు పెరిమయు, బహుపుపసయు కొంతిసాబగు నావరే వయు...
కాశీ. ౭ ౧౭౫.

గీ. ఆసమసాయశ జనకాథ నతిశయించి, పసిమి పొచ్చినపచ్చికపస నడంచి
ఉ రా. ౬ ౧౪

౯. విధము, పద్ధతి, రీతి

సీ తమవిహారముల నాదట రాలుచేతికాళునుమ ముల్ వదగండ్లపస వహింప
ఘటికా. ౨. ౧౦౨.

ఆ. చనుచు నుండి తనదుసంగీతచాతురీ, గరిమ పసకు మున్న సరసిజాక్షు, చెలువ లాత్మ మెచ్చి సలిపిన యట్టిప్ర, శంసచందముల ప్రసంగ మైన. కళా ౨ ౪౦ ప్ర. భా ౧. ౭౦.

౧౦ బండాలము, సామగ్రి గ్రా.

౧౧. (బ) చతురోక్తులు

ఉ ఈ నయగారిపుం ద్రియము లీపస లీమెంగ మిచ్చమాటలే,లా. పారి. ౧ ౧౭౫.

జ. పసగరగొను, పసచెడు, పసదనము[1], పస దప్పు, పసపడు.

పసందు. వి. సొగసుఁ దనము, అందము. (శ. ర విశ. (హిం. పసంద్) చక్కనిది, మనోజ్ఞము.

గీ. పులికలును నిండుపళ్ళలు బొదలు పద్ధులును హరిణకళ్ల హంసపల్లులును రంగళ్లు బొద లును సామంతపళులు నసఁగఁ, దనరెడు పసందుపటములు గొనిరెు పెలకు.
హంస ౫. ౩౫౫.

పసగరగొను. స. క్రి (పస + గర + కొను) పీడించు, పాయఁజేయు

క. పసులకు నొడ్డినవలరైు, మసఁగిన యవ్వాన పశుసమాజము వెల్లన్, బసగరగొని యంతటఁ బోక సమస్తప్రాణిబాధకంబై పేర్చెన్
హరి పూ. ౭ ౧౬౭

పసచెడు. స. క్రి (√ పస) రూపుమాయు, నశించు

చ పసచెడ కేల యుండు హరిపాద పరిష్కృతి సేయ నాపదల్ ... భాగ ౭. ౩౪౩

పసదనము[1]. వి (సం ప్రసాదనం. శ పసా యన) ౧ పారితోషికము.

గీ యుద్ధవాటంబుఁ దక్కిట్టి యాలయములు, లలితభంగి గమ్యములు సలక్షణములుఁగా నొనర్చినశిల్పిని కాయమునకుఁ, బసదనం బిచ్చె సంతసం బెసక మెసఁగ
శారి అశ్వ. ౪ ౧౩౯.

గీ. ఇంతటన మెచ్చి వీరి నుర్వీశ్వరుండు, పస దనం బిచ్చి యాస్పుట పాడి యింక
హరి పూ. ౯. ౧౧౩.

ద్వి కరివరాహాజయూత్రికములఁ గస్తూరి, పరగ నిచ్చినఁ దనభామిని కిచ్చి, పరుపడి వారికిఁ బసదనం బొసఁగి
ద్వి. హరిశ్చ. పూ. ౬.౩౭.

౨. (సం. ప్రసాధనమ్ శ. పసదన) అలం కరించుట.

గీ ..చెలయును బసదనము నై సేఁత యనఁ బ్రసా ధనము. ఆం. భా. ౨. ౧౪౬.

పసదనము²=పసాదము. వి. అన్నము.

సీ. బువ్వ మెతుకు కూడు బోన మోరెము పసాదము వంటకము పసదనము బాకు, పాదమోగిర మన జరుగు నన్నముపేళ్లు ..

సాం ని. మాన. ౨౨.

పసదప్పు. అ. క్రి (పస + తప్పు) క్షీణ మగు, చెడు

సీ. పదఁతి నా వేదసంపద రేల పసదప్పె నింతి నాశాస్త్రంబు లేల తూలె.

వరాహ. ౧ ౯౮

పసనారు. అ. క్రి (√పస) ౧ ఒప్పారు.

సీ. రమణీయశృంగారరసమునఁ బసనారుమురిపెంపు వలపుల మొలకవోలె విక్ర ౬. ౪౪

ఉ. అంటినఁ గందుమేనుఁ బసనారెడు జవ్వనముస్ హరి ఉ ౭ ౮౧.

పసను. వి (శ పాసను-వృత్తియం దంత్యవర్ణము నకు ఇకారాదేశము) ౧ అందము, చక్కఁదనము.

సీ. నక్తంచరీలోచనంబులపోలికి నసితోత్పలంబులపసను పొలియ

భా రా యు ౧౪౩౧

౨. ఎఱుపుమించిన పసుపువన్నె. (శ. ర)

క. కుసుమం బొద్దినవిధమునఁ,బసుపున మార్తించినట్లు బంగారమునం,బస నిచ్చినగతి సంధ్యా,వసరంబున నింగి యరుణవర్ణం బయ్యెన్.

సైమ. ౮ ౧౫౭.

3. వర్ణము, రంగు.

ఉ. అంటిటఁ బండి పచ్చపస సైనదళంబులు రాలె..

చమ. ౧. ౪౩

విశే. ౧. సుందరము, అంద మైనది, బాగైనది.

సీ. చికచటీరజపత్త్రిమకరందరసభాతిఁ బసని తూపులఁ గృపాగసము దొలఁక.

విక. ౨. ౫౭.

ద్వి. వసువు నిమ్ముల గిరివ్రజ మను పేరఁ,బస్ల సుగా నిర్మించెఁ బట్టణం బొకటి.

రం. రా. బాల. 33. పొ. ౫ పం.

ద్వి. అసమానజయశరానల్పశిల్పములఁ, బసను గాఁ దీర్చిన పసిఁడికంబములఁ.

రం. రా. ఉ 3౪. పొ. ౧౭ పంక్తి

ద్వి ఇప్పుడే పంపువాఁ డీల్గకమున్నె, మసలక తెప్పించి మందు పోయించి,పసనుగా నొనరింపు ప్రాణదానంబు. ద్వి మారిచ్చ ఉ ౧౯౨౦ వవ ౧ ౪౦. పొ. ౧౭ పం.

౨. ఎఱుపుమించిన పసుపువర్ణము కలది

ద్వి పసని మొంగంబులు పసిఁడియద్దములుగా గురుకుచములు పూర్ణకుంభములుగ

కు. సం. ౧౨ ౯౨౫

గీ ప్రియుము శోభిల్లఁగా సమర్పించె గౌరి పసని పర్యోద జాతి దోఃపల్లవమున, భాను దీప్తుల నీరారి ప్రస్న మైన, పృథులమందాకినీపద్మబీజమాల

హర. 3 ౭౮

3 నిర్మలము, స్వచ్ఛము.

సీ. క్రొమ్మించుపస గ్రమ్మకొనఁ గెలంకులఁ జిమ్ము పసనిరత్నపుసొమ్ము పరిఢవించి.

రాజ చ. ౨. ౧౭౬.

సీ....పర సైన చిల్వరాపటుపుపైని గీ. పసని కుబుసంబు చలువదుప్పటి వసించి

దశా. ౪. ౧౦3.

౪. మృదువైనది, మెత్తనిది.

చ ఒసపరి జాణఁ డొక్కఁ డొకయుగ్మలిచేరువ మాటుపెట్టఁగాఁ, బసనికురంగికాపలలఫాలి నిశాధరపల్లవంబుపైఁ, బసిఁకొని చేరఁబట్టి మునిపండుల నొయ్యన నప్పళింపఁగా.

సైమ. ౬. ౧33.

శ్లో. మృదువ్యంజనమాంసఫాలికామ్.

సం. సైమ. ౧౬. ౭౭.

సీ బంగారుపస మించు పసనిపుప్పొడిరేఖఁ
జూపట్టుపాపట సొబగుతోడ.
కళా. 3 ౨౦౪

౫. పరిపక్వ మైనది, చక్కఁగా పండినది
క పస నగుసంతానవృక్షఫలము గరుణతో,
వసుమతికి వాసుదేవుం, డొసఁగెన్ .
దశకు ౨ ౧౮

ద్వి. పసనిపం డుండఁగఁ గసుగాయ దించ
పండితా పురా. ౧౬౦ పే

జః పసవారు

పసపడు. అ. క్రి (√ పస) అభిలాష పడు, వాంఛించు

ద్వి. కుసుమవాసనచెప్పఁ గూడునే కేఁటి, పస
పడి తిరిగెడుతాగు భావించి, రసికుఁ డై
శివభక్తిరసమగ్నుఁ డగుచు
ప్రభులిం ౪ ౧౧౧ పా. ౧౧. పం

పసపాడు=పసుపాడు. అ క్రి (పసపు+
ఆడు) పసుపు పూసికొని స్నాన మాడు; పసపు
పూసికొను

మ...పసపాడి పొగడపుఁబొడం బొప్పు జెం
బ్బడి, గ్గియనీ రచ్యుతమజ్జనార్థము కిటి
గీలించి... ఆము ౧.. ౫౬

ద్వి. కొమ్మలు పసపాడి కోరి నీరాడి, కట్టిరి
పుట్టముల్ ... ద్వి. పరమ ౫ ౪౩౪. పా

పసపార్చు. స. క్రి (√ పసపాడు) ౧. పసుపు
పూసి స్నానమాడించు; పసుపుపూసికొను

క...గుత్తంబు లగు మిగుల మెత్తని జలపోఁతి
తోలు పట్టెడలు మెండల సమరం బసపార్చి.
మనుచ. ౪. ౨౪

ద్వి. చెన్నుగాఁ బస పార్చి చేయుమజ్జనము.
బస. పు. 3. 3౪౦ పం

పసపు=పసుపు. వి (క. పచప్పు) హరిద్ర,
పసుపు.

గీ. పసపు పసు పసంగ, వలుబు హరిద్ర...
ఆం. భా. ౨. ౫౫.

క పసపు నలుఁ గిడి రైదువ, వినయమాలోచ
నలు పెండ్లిపెద్దల యాజ్ఞన్.
మను చ. ౫ ౫౬. ౫. ౧౦౨.

గీ. కలిమి ముద్దియనిద్దపుఁ గమ్మ మేని, పసపు నిగ్గు
లటంచు జేర్వలుపలేక, కటితటంబునఁ
గట్టిన కనకపటికి, వింతయిచ్చి వచ్చె నని
కెంద్రు కాంతినిధులు. దశా. 3. ౧౫౦.

జః పసపాడు, పసపార్చు, పసపుగన్నెర్లు,
పసపుముద్ద.

పసపుగన్నెర్లు. వి (√పసపు) ధాన్యవిశేషము.

వ. పసపుగన్నెర్లు గుత్తిబలుగుత్తులు రావిపూ
రాజబాలు... ప్రబంధ. ౧౧౨.

పసపుముద్ద=పసిరిక. వి (√పసపు) పచ్చపిట్ట,
పక్షి విశేషము

గీ. పసపుముద్దయుఁ బాలయు బచ్చెకొక్కు,
పసిఁడికం టెయుఁ బరజయుఁ బసులపోలి,
గాఁడు ననువానిపై జలకట్టియలను, బంచి
క్రుంచియు... రసిక. ౧ ౧౧౫. ౧. ౬౪.

పసరము. వి (సం పశుః ప్రా. పసు.) పశువు,
గొడ్డు, గోమహిష్యాది

సీ. గోమహిష్యాదుల సామముల్ పని తొత్తి
తొడుకు పసరము జా నదరు .
ఆం. భా. ౨. ౨౬౧.

చ. పసరపుటొంపపోవులును బందులడొక్కలుఁ
గుక్కుగుట్టలున్... భార. శాం. 3. ౨౮౪.

క. కదవఁగ నొకళ్లు పసరము, నడిచిన నొక్క
కులుఁ చెయ్యి నడువ వలయుఁ జే.
భార. ఉద్యో. 3. ౯౧.

క. పని యటఁ బసరపు రక్కసు,లను బయికొని
దోసకారులారా కడుఁ గ్రొవ్వునఁ గలఁచితి
రిచ్చాళ్ళను, బనిపడి జగమెల్ల నింకఁ బల
వక తిలుఁడే. సీలా. 3. ౪౨.

**పసరించు.** స. క్రి. ౧. చెప్పు, పలుకు, రచియించు.

ద్వి. బసవన్నమహిమ శుంభద్భక్తియుక్తిఁ, బస
రించితివి గద్యపద్యాదికృతుల.
పండితా. దీక్షా. ౪. పా

ద్వి. బంధురతన్మహోత్కృష్టమహిమఁ, బసరింపు
మసమహాశ్చాటవశక్తి
పండితా. దీక్షా. ౪. పా

క. వ్యసనంబులు విడువక మానసము వికా
రంబులెల్ల నశియింపక మ, వ్వైస ఫల
రాగప్రమాటలు, కొసరక పసరింతు రేలకో
హీనమతుల్. శివరా. ఆ. ౧ ౧౪౦.

౨. వ్యాపింపఁజేయు.

ద్వి. బసవచరిత్ర మివ్వసుమతిలోనఁ, బసరింతుఁ
దత్కథాప్రౌఢి రెట్లనిన.
బస. పు ౧ ౧౫౦

అ. క్రి (క పసరిను సం. ప్రసరించు)

౧. వ్యాపించు.

సీ. పాదశిల్లఁ గారొక్కని పొరిఁ బొరిఁ బస
రించెఁ బ్రాసంగువరిచేలఁ బసలు మించె
అచ్చ రా. కిష్కిం ౭౮.

౨. పాఁగు.

ద్వి. నీ యతులితదయాన్వితదృష్టి యిట్లు, నా
యందు, నాఁటికొనలు పసరింప
బస. పు. ౩ ౭౭౨. పం

౩. ముందఱకుఁబోవు.

ద్వి. మసలి రెండోరులతో మాట లాడుచును,
పసరించి శిరిగిరిఁ బ్రబలిత సేయుచును.
పండితా. పర్వ. ౩౫౬. పా.

౪. చలించు, చంచల మగు.

క. అసమానంబు మశబ్దము, రసగంధస్పర్శ
రూపరహితం బనుటం, బసరించు నింద్రియము
లకు, తనంబు గాకొండఁ బరమపదస్ఫూర్తు
లక్రా. భార. శాం. ౪ ౧౬౪.

౫. భావించు. విచారించు.

ద్వి. ముక్తి రాజఁ జూ ముద్దియ సేయు, భక్తి
రాజసూ బసవఁ దీక్షింతఁ, బసరింపఁగ లింగ
పట్టభద్రుండ, బసవండు సద్భక్తి పట్ట
బద్ధుండు. బస. పు. ౨. ౭౨౧ పం.

**పసరిలు = పసరించు.** అ. క్రి. ఆలోచించు,
భావించు

చ. అసురు లవశ్యవధ్యు లని యాడినకాడ
మహేశ యేను, ద, ద్వ్యసనము నిర్ఘ
యించితి భవత్కృప యేటికి నిట్లు వీరిపై,
పొసఁగదుకృష్ణతోడఁ దగుపో పెనఁగంగ
నోకింత బుద్ధిలోఁ, బసరిలి చూడుమా
హరియు భర్గుఁడు నా కొకఁడో విభిన్నులో
హరి ఉ. ౭. ౧౫౭ (క్రొత్తప్రతి పా.
పసరిచిమాడు చి ని పా పసరిడిచూడు.
శ ర ప్రాఁత ముద్రి. పా)

**పసరు = అసరు.** వి (క పసురు. త పచ్చు)

౧. ఆకురసము

గీ. తరుణశైవాలజలజపత్రములు వోదువ, మరక
చ్ఛాయ బోల్పఁ దత్పరిఖజలముకోట
బంగరు సేయుటకొఱకు మున్ను బ్రహ్మ
పిడిచిన మందాకుపసరనంగ అము. ౨. ౭.

క. అనుటయు రసలింగమునిడు, తనచట్టువ
ప్రేఁప సజ్జదంతపుబరణిన్, నినిచిన రెయిపస
రిడి యదియని చెప్పక పూసెఁ దత్పదాంబుజ
యుగళిన్ మనుచ. ౧. ౪౭.

౨. అకుపచ్చనిరంగు.

క. పొంగులు విరిరొందకేఁడివి, నిగుడ కుశ్రేణి
పసరు నింగి న్నిండన్, పొగడెఁ బ్రబల హరిత
వాజాలు, గగనమణిస్యందనంబు నగదిచెబో
యచుచున్. అము. ౪. ౧౭౭.

౩ వీర్యము, రేతస్సు.

సీ... పర రస వీర్య పొందుప్పు... ఆం. భా. ౨. ౧౩౧.

విశే. ౧. అకుపచ్చనిది.

క. పులిచేఁ బసులు వాఁచినక్రియ, నలవుఁ జెలఁగు పిగ్గ బిడిచి యట్లొక్కరికిన్, త్తల కోర్వక విఱిగినవు, క్రులఁ జే మని విందు సేసు కోయక యింకన్ భార ద్రోణ ౪. ౨౦

చ తెఱుఁగనిధాన్యముల్ పసుల దాటులు దోటలుఁ గట్టుపందులున్...తెఱుచుగ నీను గోడిగలుఁ దప్పుదిశూద్రుల కొప్ప చెప్పెడున్. విక్ర ౧ ౬౮

క. మసమసక నఱ్యు దిక్కులు, పసి గ్రేపుఁ దలంచి తిరుగఁబడెఁ గూండ్ల కరుం, తస మాజము కలకలము లే, గసె చెదవెదకున్న మొగిచెఁ గమలవనంబుల్.

జై. భా. ౨ ౧౦౧

౪ సింహము; ఆవు మొదలగు చతుష్పాజ్జంతువు

సీ .సింగంబు మొదలుగా నావులు మొదలు గాను పసు లనఁదగు

అం. భా. ౨. ౭౬.

జ° పసికొలపుగొరడాలు, పసిగాఁడి, పసిగాపు1, పసిదిండి, పసిబిడ్డ2, పసులకాపరి, పసులమారి, పసులవాఁడు

పసి2. ౧. వాసన, తావి

చ కుసుమపుగుత్తి చూచి రొయికోమలి డగ్గఱి కోయఁ బోయినన్, బసిబడి నందు నున్న మధుపంబులు వచ్చి ముఖంబుతావికిన్, ముసరఁగఁ .. భోజరా. 3. ౧౬౮.

౨. పశ్వాదులమీఁది గాలి

క. పసిబడి మాటికి మాటికి, వసుధాస్థలి మూరు కొనుచు వదసాంచల ముఖకసమున కెత్తుచుఁ జవిగొని,యినుమంతయుఁ జొక్కపుండ నింత యుఁ గ్రోలెన్ వరాహ ౧౧ ౭౩.

సీ పసి యన ధేనువు పదన మొసఁగు.

అం. భా. 3. ౪౬.

జ: పసిగొను, పసిపట్టు.

పసి3. వి. (క. హసి. త. పచి.) క్షుత్తు, ఆఁకలి,

శా...,ఆ,చండాలేతరశీలుఁ డుత్పలికి రైచాండాలిక న్మీఁటుచున్, గుండె న్నీరుగ నొండ గాలి పసిశాఁకుం జూద శాఁద్రాప్లామున్. అము. ౬. ౪.

పసి4. విణ (క పసు, త పచుం) శైశవదశయం దున్నది, లేఁత

(చూ పసిబిడ్డ, పసిమొగ్గ మొ)

జ: పసికందు, పసిగాపు2, పసివాఁడు, పసిపాప, పసిబిడ్డ1, పసిమొగ్గ

పసి5. విణ (పసిమి శబ్దమునకు వృత్తియం దంత్య వర్ణము లోపింపఁగా మిగిలినది) పచ్చనిది.

సీ. భామ నీ పాలిండ్లు పసినిమ్మపండ్లంచు నీటుగాఁ గొనగోట మీఁటు నొకట

కృ. శతం. 3. ౪౭.

పసిండిసీటిత్రాఁత. వి. (√పసిఁడి) ద్రవరూపమగు బంగారముతోఁ జేసిన చిత్తరువుపని.

సీ సెటిక వట్టి పసిండనీటిత్రాఁతచెఱుంగు వెలిపట్టు రహిఁ గట్టి వెలఁది యొాత్తు అము. ౬ ౧౨౭ (బంగరుజలతారు అని భావము)

పసిండిబొజ్జదొర. వి. (√పసిడి) హిరణ్యగర్భుఁడు, బ్రహ్మదేవుఁడు

ఉ...పసిండిదొరబొజ్జ కైన నినుం గొనియాడఁ బోలునే. అచ్చ. రా. బాల. ౧౫౪.

(ఇట్లే పసిఁడిబొజ్జవేల్పు మొ.)

పసిఁడి = పయిఁడి, పహిఁడి, పైఁడి. వి.—పచ్చదనము కలది—౧. బంగారము, స్వర్ణము.

సీ శృంగారకుసుమంబు చిన్నచుక్కలరాజు పసిఁడికొన్నరవిణ పలుకుఁదోడు.

శైవ. ౧. ౫.

క. మందూకమకరకచ్ఛప, గందూపదధులికశీర కలహంసకకా, రండవబకముల మెండేఁ బసిండిని గావించి గంగఁ జిదుముదముఁ బ్రకటల్. కాశీ. ౫. ౫౩.

**పసిఁడికొండ.** వి. (√పసిఁడి) కనకగిరి, మేరు పర్వతము.

ఉ. కొం దని కేర్చుతోఁ బసిఁడికొండ ధరా ర్థుల కెల్లఁ బంచి యీ, కొండుట...

నైష. ౧. ౫౧.

ఆ. కొండకోఁడు మూవ కొండపూఁతురౌ యాలు, కొండ యిల్లు పసిఁడికొండ విల్లు, కొండ వంటిదొరకుఁ గుంటెన నడుతురా...

వేమ ౨. ౨౨౨

**పసిఁడిగట్టు.** వి (√పసిఁడి) బంగారుకొండ, మేరుపర్వతము.

ఆ. ఇట్టిరాచపట్టి యొనసిన ప్రేమ నీ, చెట్టఁ బట్టఁ బసిఁడిగట్టుగన్న, నేదపగిది మదిఁ బ్రమోదంబు గాంచితి, నింతకంటె శుభ మ దెద్ది నాకు.

శె శకుఁ ౩ ౩౮

గీ పసిఁడిగట్టున కోకవింతపసిమి నించి, సెలపెఁ గడపాటిముడుసలికెలపరయొండ

పారి ౪ ౪౩.

(ఇట్లే పసిఁడిగుబ్బలి సెం.)

**పసిఁడిగద్దియ.** వి (√పసిఁడి) బంగారుపీఠము

వ...కదవన్ని పసిఁడిగద్దియ నధివసించి...

దశా ౧ ౧౪.

**పసిఁడిగేదఁగి.** వి. (√పసిఁడి) బంగారువన్నె పచ్చని రేకులు గల మొగిలి.

ద్వి. పసిఁడిగేదఁగి రేకులు పసమించు మేని, కుసుమ కోమల నిత్తు కొనరయ్య మీరు.

ద్వి. పారిజ్ఛ ఉ. ౩౯౨. పం.

**పసిఁడినీరు.** వి. (√పసిఁడి) ద్రవరూప మైన బంగారము, బంగారునీరు.

గీ. పసిఁడినీట లిఖించిన ప్రతిను లమర.

మనుచ. ౬. ౩.

**పసిఁడిపురువు(గు).** వి. (√పసిఁడి) పాత్తి మాలుకాయపురుగు.

వ...సెరుగు ప్రముచ్చిలినవాఁడు క్రిమి యగు. . పాత్తిచీరగొని పసిఁడిపురు వగు కలిపట్టు గొని నకార్గం బగు. . మార్క. ౭ ౧౧౭.

**పసిఁడిపెన్బొజ్జరా.** వి. (√పసిఁడి) బ్రహ్మదేవుఁడు

గీ కినిసి తిట్టినఁ బతియ లై చనకయున్న, పసిఁడిపెన్బొజ్జరాగ్రుడ్డు పనఁటిగములు

అచ్చ రా బాల ౧౦౭.

**పసిఁడియాకు.** వి (√పసిఁడి) బంగారుకమ్మ, స్త్రీ కర్ణాభరణము

ద్వి. బసవన్న యప్పుడే భార్యకర్ణంపు, పసిఁడియా కిప్పించె భార్యను గినిసి.

పండితా దీక్షా ౮౩ పా

**పసిఁడివత్తి.** వి (√పసిఁడి) స్త్రీల ఆభరణ విశేషము

గీ పసిఁడివత్తులు సేసరాల్ బన్నసరులు, చేరు బొట్లును ధనాభి ౩ ౩౮.

**పసిఁడివ్రాఁత.** వి (√పసిఁడి) బంగారు చిత్తరువు పని

చ తొలఁకుపసిండి వ్రాఁతచెలితో సెలకావుల మేలుకట్టుతోఁ, జలువలు చిందు ముత్తియపుఁ జప్పరమంచముపై మహోన్నతిన్.

వసు. ౪ ౭౭.

**పసికందు=పసిబిడ్డ.** వి. (పసి[4] + కందు)

సీ. కలశాబ్ధికాయి పాక్కులి తిమ్మిపసికందు తోయజాకాస్త్రుని తోడఁబుట్టు.

ఘటికా. ౧. ౨౨.

**పసిగోలవుదోరడాలు.** వి. (√పసి[1]) వృషభ ధ్వజము.

లయవిభాతి. గెలుపు గొనఁజాలు పసిగోలవు దోరడాలు చలిసెలుఁగు సెనగోలువగఁ బోలుచు సెలఁడాలున్

అచ్చ. రా. బాల. ౨౧౬.

పసిగ(క). వి ౧. సమృద్ధి.

ద్వి. బసవపురాణంబు పాటించి వినిన బసిగమై
 బ్రావించు భక్తులకిరుణ.

బస. పు ౪ ౧౦౭. పం.

ద్వి ఇప్పాటఁ బసిగమై నీశ్వరుఁ బూన్పఁ,
 గుప్పలుగాని కలల్గడి పిక్కటిల్ల

బస పు ౬. ౫౬ పం

౨. ఉత్సాహము.

ద్వి దర్పం బెలర్ప సమర్పణచేసి, పసిగమై
 దారగింపఁగ నార్చిపేర్చి .

బస పు. ౪. ౬33 పం

ద్వి పసిగమై మంచెన భట్టారకుండు, నసదృశ
 మహిమ దొల్కాడ చేతేర

బస పు ౬ ౪౭౯ పం

3. పారము, చేవ.

సీ ఖడ్గలం బై పేర్చు వీరంబు గుఁ గల పసిక
 రొల్లను మేను వడసె ననఁగ

నృసిం ౨ 3 (శ ర పా)

పసిగాఁడి. (పసి[1] + గాఁడి) పశువులను గట్టెడి చోటు.

ఉ. .కేఁ, డీపసిగాఁడిదండ వసియించి ప్రభా
 తమునందుఁ బోయెదన్.

కేం. పంచ ౪ ౪౪౭.

సీ. పడసాలముంగిలి పందిరి పసిగాఁడి కాయ
 ధాన్యము లున్న కణజములును

శుక. 3 ౪౮౧

పసిగాపు[1]. వి (పసి[1] + కాపు[1]) గొల్లజాతి

ఉ. గోపిక యొూర్తు తొల్లి హరిఁగూర్చి తపం
 బొనరింప దానవి, స్థాపరతన్ మదిం గరఁగి
 శార్ఙ్గియుఁ దోఁచినఁ జూచి చెక్కతో,
 నాపసిగాపు రూపవయసా కె శ్రీలోకవిమో
 హనక్రియా, కోపవిరూపణాం బగు సరోరుహ
 లోచనురూపుఁ జూచుచున్

పాండు. ౨. ౧౨౮.

సీ. దయచేసి తత్పాద్రికమం తైన వరముల
 నొసఁగి యప్పసిగాపుటసరబుద్ధి.

పాండు. ౫. ౧౫౪.

పసిగాపు[2]. వి. (√పసి[4]) బాలిక.

అ బాల ముద్దరాలు పసిగాపు గనుగండు,
 కూన ముద్దుగుమ్మ గోల యబల, యీాటి
 తాటలాడ నెట్లు నో రాజనో,రామ రామ
 నిరపరాధనుమ్మ   కృ. శతం 3 ౨౪.

పసిగొను. అ క్రి (పసి[2] + కొను) తావిని
 గ్రహించు, వాసనపట్టు (గాలిపట్టు శ. ర)
 ఆఘ్రాణించు, మూర్కొను.

సీ మొన లావులించి వాసన పల్లఁ బసిగొని లేఁ
 దేఁటిగము లెంగిలింపకుండ గీ గిరిజ
 పూజించెఁ బసిఁడితామరల వరదు.

కు. సం 3 3౫౧.

క పసిగొనుచు మేయ వచ్చిన,పసిగొనుచుం
 గోలుపులులు బలిసెన్ నృపసి,యని యాడు
 చేని యచ్చట్టునసియాడం దఱచు పెఱచు
 నఱచుం బఱచున్.   రామా. ౨ ౧3.

సీ లీలావతీ హస్తలీలాబ్జ కేసరంబులకును బసి
 గొంచు మలసి మలసి. ప్రభా. ౨. ౧౦౭.

ద్వి .. అమత్తిఁ,బాయక వసయించు బహు
 పిశాచములు, మానిసిగొలుఁ బల్మఱుఁ బసి
 గొనుచు, నానాముఖంబుల నలి దిగఁబాఱి

ద్వి. హరిశ్చ. పూ. ౨౦౭౯.

సీ. కుతుమాళి మూర్కొనఁజూచు ఘ్రాణం
 బున కెవ్వియుఁ బసిగొన చేవ మయ్యె.

కవిక. ౧. 3౭.

పసిదిండి. (పసి[1] + తిండి) వ్యాఘ్రము, పులి.

సీ జాతి హస్తసరోజసన్నిరుద్ధాంత మై తెర
 దెఱఁ బసిదిండివలెను మెఱయు. నిరం. 3. 3౫.
 (పసిదిండివలెను=వ్యాఘ్రమాతన వస్త్రము.)

సీ. పసిదిండి మెకపురకె బాలింత లాఁకొన్న జింక కూనలకుఁ బాలేసి యొసఁగు.

అచ్చ. రా బాల. ౧.౨౨.

సీ... పసిదిండి పులి... వ్యాఘ్రంబునకు సమా ఖ్యలు చెలంగు...

ఆం. సం తిర్య ౩ా. కేంశ. ౬౦

**పసిదిండి మెకపురక్కసి=వ్యాఘ్రాసురుఁడు.**

సీ పసిదిండి మెకపు రక్కసితోలు మెలఁ జుట్టు శేల ముమ్మొనవాలు గీలుకొలిపి

నీలా ౧ ౧౩.

**పసినాఁడు.** వి (√పసి[4]) పసితనము, శైశవము

సీ పసినాఁడు గట్టిన పాలపూసలకాని పెట్ట సొమ్ములు లేవు బిడ్డలకును కుచేల ౧ ౩౬

(ఇట్లే —పసిపాపనాడు)

ఆ పసులఁ బిల్చుకేర్పు పసిపాపనాఁటనుం, డియును దనకు నైజ మయినకెలఁగు, గానఁ బసులఁ బిలువఁగా సుత్సహించి వి, హంగ గమనుఁ దదరి యద్ద కేఁగె

హరి. ఉ ౮. ౨౪౮

**పసిపాప(ఁడు).** వి. (పసి[4]+పాపఁడు.) శిశువు పసిబిడ్డఁడు

మ .మాయాపటూ, క్రియకెళ్లిం బసిపాపఁడై యలరి శశ్వత్సింయమిధ్యానస, త్క్రియలం, బొందఁడు దేవు బాహ్యకరణీ దృష్టింపఁగా నొప్పదే. హరి ఉ ౫ ౧౯౪

క. పాండురుచి మించినది యీ, పండు హరింతు నని తీవ్రపడి కడుఁబసిపా, పం దగుటఁ దెలియ కిఁడు, చండాంశుని విడిచి యల గజముపై కరికి. ఉ. రా. ౫. ౧౦౬.

ఉ... పంచ శిలీముఖుండు పసిపాపఁడుకో వల సంగమంబునకు. నైష. ౪. ౧౪౧.

(ఇట అప్రౌఢుఁడు అని భావము).

(ఇట్లే పసినిమువు కం.)

క పసినిము వగు మామగునకు, విసికింపకు మకుచు కొంత కేఁడినఁ బైపై, ముసరుచు మతి మతి కొరకెడు, భసలమ నీ కింత యొగపిపా కేమిటికి. రసిక. ౪. ౧౪౧.

క అకటా పసినిముపులఁ గొంగశక శాఖడపులకుఁ బంపఁగావలెనని కోరితోఁ బతికడ పెద నిం,చుకయుం గనికరము నీకుఁ దొప్పదదు గదా అచ్చ రా బాల. ౧౦౧.

**పసిపాపరెయొండ=లేయెండ, ఈరెండ.**

క పసిపాపరెయొండ కొనలును, మసమునకని యిరులు గలిసి మన మలరించెన్.

నైష. ౭. ౧౨.

(మా. కుమారతరైః భాసాంశ్రత్తికరైః

సం. నైష. ౧౯. ౩౭.)

**పసిబిడ్డ(డు)[1].** వి (పసి[4]+బిడ్డ) చిన్నబిడ్డ

సీ. . స్తనపాయి పరగును జంటివాఁడు, పసిబిడ్డ చంటిపాపఁడు పాలపాపఁ డనంగ

ఆం. భా. ౨. ౧౧౭.

మ... వానిపెంపొద నిర్పిం బసిబిడ్డచందంబున రుద్రుం దర్కకోటిప్రభక

వరాహ ౧. ౧౪౪.

క పసిబిడ్డవె వాయి దెఱచి పలికెదవు చెలీ.

యయా. ౩. ౪౬.

**పసిబిడ్డ[2].** వి (పసి[1]+బిడ్డ) క్రేపు, గోవత్సము.

గీ పెలయు శిశువత్సములు పసిబిడ్డ యనఁగ

ఆం. భా. ౩. ౫౬.

**పసిమి.** వి (త. పచ్చమై) ౧. ఆకుపచ్చన.

గీ. పసిమి పెచ్చిన పచ్చికపస వదించి, మసృణ హరిదశ్వహరికాంతిమహిమ పెంచి, పసరు చాయల కముగాయ లెసకమెసఁగె.

ఉ. రా. ౬. ౧౪.

గీ. ప్రచురమాధవోద్యానంబు పసిమికెల్లి, పాటు పట్టిది యని గరుడాశ్మరుచులు, మెచ్చి చూచుచు నేమఱఁ బిచ్చలింపు,రచురకన్యక లకుల హిమాచలమున. కుసం. ౩. ౨౭౧.

సీ. పసిమి పో సెండినకసవు బుట్టయుఁబోలె
నరి కెంద్రంకలు బర్యాశిరమువలన.
కళా. 3. ౧౩

౨ ఎఱుపు మించినపసుపువన్నె; పసుపువన్నె.

గీ మంజారుచిపుంజఁ గనుపొన్ను మంజివాని,
పసిమి గనుపట్టు మనుఁబట్టుపంచెవాని, శాస
వధ్యజనిభవాల వల్లివాని, నక్కుమారునిఁ
గని తల్లి యాత్మ నలరె. ఉ రా. ౫ ౯౫

సీ. మెఱసి నిల్కడచూపు మెఱపులో యొఱపు
లి త్తిరువులో శరము నిద్దాపనిండి, పసిమిలో
మిసిమి... ఘటికా. ౨ ౧౪

గీ. పసిమిపదియాఱువన్నియ పసిఁడిపల్లెరమున
శివునిపదాబ్జంబు లమర నునిచి, కెలందమ్ముల
గతినంపుగిండి వంచి, యమఁగుటిల్లాలు నీరు
వోయంగఁ గడిగి. జాహ్నవి ౧. ౧౫౪

వ పదియాఱువన్నె కడానికుందనంబు హెచ్చు
కుందాడుపసిమిఁ బచేళిమంబు లగునవియు
బ్రాసంగుచేలు . కాశీ ౪ ౭౬

3. ఒప్పు, అందము, నవకము

గీ. ఎన్నిమన్వంతరంబులు చన్న చెడుదు,బసిమి
దప్పదు కాశికాపట్టణంబు. కాశీ. ౨. ౪౧.

జః పసిమిచెడు, పసిమిడి, పసిమిపడు

పసిమిచెడు. అ. క్రి. (పసిమి + చెడు) నవకము
చెడు, ఎండు.

లయవిభాతి విసరెఁ బెనుగాడుపులు మసలె
జలదాగమము పసిమి చెడె సస్యములు కసవు
దినకేమిం, బసరములు వట్టె
వరాహ. ౧౦. ౭౧

పసిమిడి. విశే (√పసిమి) పసిమిరంగు కలది.

గీ. మడఁతపసిమిడిగింటెమూల్ మంజిడీబిగి, దోమ
తెఱమంచములు కౌసంతులు జవాది, యగరు
సిరులు చిన్నెలు గాఁగ నతఁడు గడపెఁ,
జలికాలలు తద్వ్యధూతిచకరణుఁ దగుచు
కళా. ౪. ౧౧౧.

పసిమివడు. అ క్రి (√పసిమి) పచ్చనగు.
(సమృద్ధమగు).

క జడి గాక పెట్ట గాకయ్యవడ గాకయుఁ
జలియుఁ గాక నల పిడి యని యేర్పడక
యిల పసిమి పడఁగాబడుగులు బ్రియ
మంది రనఁగఁ బ్రభులకుఁ దగదే.
ద్వా. ౪. ౯౨. (వ్రాఁతప్రతి పా. పసిమి
వడంగ. ముద్రిత పా.)

పసిమొగ్గ. వి (√పసి4) క్షారకము, పసరుమొగ్గ.

సీ. పసరుమొగ్గ యనంగఁ బసిమొగ్గ యనఁగను
క్షారకనామ మై మీఱును .
ఆం భా ౨ ౪౦.

పసిరిక=పసపుముద్ద, పసరు. వి (పసరు + ఇక
స్వార్థమున, సంధినివర్ణవికారము) ౧. పసరు
వన్నె, ఆకుపచ్చవన్నె (శ. ర) ౨. వృక్ష
విశేషము.

సీ జువ్వి మామిడి జీడి మునుగుడు మెలుగు
పాపట చంద్ర పసిరిక పాల రేల
కేం పంచ. ౪. ౫౨౨.

3. పచ్చపిట్ట, హారీతము.

గీ. పచ్చపిట్ట యనంగను బసిరిక యన,హారితకం
బొప్పు... ఆం. భా. ౨. ౯౬.

సీ. పసిరిక లకుముకి పావురాయి.
పార్వ. ౬. ౪౪

సీ బంతము కోకిల పసిరిక తంగేడు గొరవంక
జక్కువ చెలువుకోడి హంస. 3. ౧౨.

౪. కామల రోగము

సీ...పసిరిక యనఁగా మాల యనఁగను గామ
లాభిధ విరాజు. . ఆం. భా. ౨. ౧౨౪.

విశే. ఆకుపచ్చ వన్నె కలది. (శ. ర.)

పసిరికపాము. వి (౧ పసిరిక) పసరువన్నె గల
పాము, సర్పవిశేషము.

చ పసిరికపాముబంటి దని పల్కుడు కేయలికేళి
కుశి... కుశ, ౧. ౫౩౪.

పసిరిక తొఙ్గ. వి. (√పసిరిక) పసరు తొఙ్గ. (శ. ర)

పసివట్టు. అ. క్రి. (పసి2+పట్టు) పశ్వాదులపై గాలిని గ్రహించు, జాడ పట్టు

గీ మున్ను జాగిలములఁ గూడి చన్నయట్టి, యుదుపతుక్కలు కుందేళ్ల నందురువుల, నుదుముల గ్రహింపఁ బుట్టలకడలఁ బొదలఁ గిరులసతియలఁ బసివట్టి తిరుగుచోట

మనుచ ౪ ౫౧.

సీ. పసివట్టి నలుగడఁ బఱచిన మెకములఁ పచ్చి తోళ్ళను బండ్లఁ గ్రుచ్చి పెఱుకఁ బలు జాగిలంబులు... వాల్మీకి ౨ ౭౫

స. క్రి. ఆఘ్రాణించు, మూర్కొను.

వ . కొనసాఁగి పోగ లై ముంగిసవారలం బోనివారలు పారెసారెకు పెత్తె బయలు పసివట్టుచు . మనుచ. ౪. ౨౪.

పసుపాడు=పసపాడు. అ. క్రి. (పసుపు+ఆడు) పసుపు పూసికొని స్నానముచేయు; పసుపు నలిచికొను.

సీ. పద్మాకరమునకుఁ బసుపాడఁ దెచ్చినదైవంబు చలము సాధ్యంబుగాఁగ. శివరా. 3 ౧30

సీ. ఒరసి రొమ్ముత్తివమణుం గొందక మేన నిగ్గులు దేఱఁ బసుపాడి జలకమాడి. అను. ౧ ౬౦

పసుపార్చు. స క్రి (√పసుపాడు) పసుపు పూసి జలకమాడించు.

తరువోజ. అలరుఁబ్రప్పాడి పసపార్చి మృణాల హారం బమర్చి కహ్లారంబు లేతు, లలకల నమర్చి... హరి. ఉ. ౪. ౪౫

పసుపు=పసపు. వి ౧. హరిద్ర.

(దీని భేదములు. కస్తూరి పసుపు, కూరపసుపు, మ్రానిపసుపు, చాయపసుపు, పిండిపసుపు.)

చ. ద్రవిడకుటుంబినుల్ పసుపు రాచిన రత్న పుదాఁక ద్రింక... ఆము. ౧. ౬౪.

గీ...తల్లి కంద పసుపుఁ దోటలు...

నీలా. ౨. ౫౪.

సీ. పసుపునిగ్గులు దేఱు పాపజన్నిద మొప్ప .

మనుచ. ౨. ౧౧.

౨ హారిద్రావర్ణము (శ. ర.)

విణ హారిద్రావర్ణము కలది,పసుపువన్నె కలది

సీ దానవమానినీ స్తనకుంభములతోడఁ బసుపు పయ్యెదలకుఁ బాయు తెరువు.

ఉ హరి. 3 ౧౪౪.

జ. పసుపాడు, పసుపార్చు, పసుపుఁబిట్ట,పసుపు గోఁచి, పసుపుముద్ద, పసుపుకొమ్ము.

పసుపుఁబిట్ట=పసుపుముద్ద. వి పసిరిక పిట్ట, హారీతము. (శ. ర )

పసుపుగోఁచి. వి (√పసుపు) ఉపనయనాదులందు మంగళార్థము పసుపుతోఁ దడిపిన కౌపీనము.

గీ అతఁడు మృగకృత్తి వెళవెళ యనఁగఁ బసుపుగోఁచి గట్టిన పొదుగుకోల వెగయ.

ఆము ౪ ౬౬

(ఇట్టి పసుపుబట్ట యె)

పసుముముద్ద=పసపుముద్ద. వి (√పసుపు) పసిరిక పెట్ట, హారీతము (శ. ర )

౨. వ ధాన్యవిశేషము.

వ సుఖభోగులు సన్నబూదులు గౌరవంకరాజనాలు కాటుకశేకులు ముంగురమెటికలు పసుపుముద్దలు మంచివిరులు...

ప్రబంధ. ౧౧౨.

పసుపుకొల్లు. వి (√పసుపు) పచ్చపూవుల కొల్లు, హేమపుష్పి కే.

పసురు. వి. ఆకు పొందలగు వానిరసము.

సీ...పసురు పస రసంగ స్వరస మొప్పు.

అం. భా. ౨. ౪౦.

విణ. పసరువర్ణము కలది, ఆకుపచ్చరంగు కలది.

ద్వి. మనుదేశభయకరాకారణుఁ దగుచుఁ, బసురమూపుల్ఁ బోని పగిది శేషుండు, తెడి దంబు లగు కొరవిరదముల్ దాల్చ్పపడగల గతిఁ బొల్చుపడగలఁ బొదుగ అ మ. క ౧. ౨౨ పా. ౧. పం.

పసులకాపరి. వి (√పసి[1]) గోపాలకుఁడు, గొల్లఁడు.

ఉ ఎఱుంగుఁడే పసులకాపరి భావజమర్మ కర్మముల్ పారి. ౧. ౧౫౪.

సీ ఏబాము తెఱుఁగక యేపారుమేటికిఁ బసుల కాపరియింటఁ కామగలిగె భాగ. ౧౦ పూ ౧౯౪

గీ యక్కె గోవిందు తోడివిరోధి గాన,నాతఁ డడిగినఁ జెలియలి నతని కీఁడ,గొల్లపల్లెలోపల నందగోపువింటి,పసులకాపరియగుచె నాపాటి యనుచు. హరి ఉ 3. ౧౦.

పసులపోలిగాఁడు. వి ఏట్రింత, భరద్వాజపక్షి

పీ ..పరగు కేట్రింత నాఁ బసులపోలి, గాఁ డనినను వ్యాఘ్రఘాటాఖ్యయగుచు... ఆం భా ౨ ౯౧

గీ పసిఁడికంటియుఁ బరజయుఁ బసులపోలి, గాఁడు ననువానిపై జలకట్టియలను, బంచి క్రుంచిరి... రసిక. ౧ ౧౧౪

పసులమారి. వి (√పసి[1])—పశువులకు మారి వంటిది—పులి, శార్దూలము.

క. కని దీని కత్తెఁ దోర్పడు, మనుజాని దలఁ పంగఁ బసులమారియె వచ్చెనమ్మన గండ మాలమీఁదను, కొంనకురుపుం బుట్టె నన్న కాసం బౌరయెన్. ద్వా ౧౦. ౪3.

పసులవాఁడు. వి (√పసి[1])గొల్లవాఁడు, గోపాలకుఁడు.

క. నరి భగదత్తుఁడు కడువుల, కలంచుమనుల వానియట్లు విలసద్గతిన, బ్బలము కెగువ... భార. ద్రో. ౧. 3౩౨.

గీ. అకట మోమోట లేక తా రంత చేసిఁ బ్రదికిపోయిరె పులిపేదపడినఁ బసుల,వాఁడె తెక్కాడె నమకత వచ్చె నాతఁ, డునుల లోపల నాలుకముల్లు విడిగె. ఉ. హరి. ౪. ౧౦౭.

పసుపు. వి (సం పశుః) పసువు

ఉ...ఏ, విద్యలు నేఁడేనిఁ బృథివిం బసు వాతఁడెగాఁ గణింపఁగన్ ద్వా. ౪ ౧౪౧

పస్తు. వి ఉపవాసము, ఏట్టు.

సీ. వస్త్రంబు గొండు దేవగ దొరాయి యిగి చన్నఁ బస్తని దయ పుట్టఁ బలుకువారు. ఆము. ౬. ౪౪

క. ఎక్కెండ్లనుండియో పస్తుకాన్నఁ డీ యడవి లోన నొంటి మహాకుండు... కాశీ.3. ౧౫

ఆ. తనువుఁ బొదలనీఁడు తాపంబుఁ బుట్టించుఁ, బస్తు పెట్టు మూలఁ బాఱవైచుఁ, గొలుచు సజ్జనులకుఁ గుత్సితవమువటీ, వల్లభుండు లేఁకి వంటివాఁడు శేం. పంచ. ౧. ౪3౦

పస్త్యము. సం వి అ న. గృహము, వస్త్యము.

పస్పశము. సం వి అ. పుం. (శాస్త్రారంభ సమర్థకమగు) ఉపోద్ఘాతము.

పస్సె. వి పాటలవర్ణము

గీ ..పాటలాఖ్యలు చెలంగుఁ,బల్ల యనఁ బస్సె యనఁగను బయ్యి యనఁగ. ఆం. భా. ౧. ౧౦౭

విణ పాటలవర్ణము కలది ఆం భా. ౧ ౧౦౭.

పహిణి (హిండి)=పహిణ్డి.

(బంగారము)

వ ..శ్రీకాకొలని శ్రీవల్లభరాయనికి సమర్పించిన వస్తువులు (సైపి)...పహిండి కాయలతోడి కెంజామరలు ౨ పహిణికాను అలవటం ౧ పూంతకమేత్తిలు ౪ కెండిదివ్యకొంబు ౨... దా. శా. ౪. ౯౨౪

పహిణ్డి=పసిఁడి.
(బంగారు)

వ...శ్రీ భీమేశ్వర మహాదేవరకు ..బ్రత్తించిన ...మాణిక్యములు రెణ్డుగట్టిన పహిణ్డిపాణి సంక్క్రులు ౧ నవరత్నములంగ్గట్టిన పహిండి పానలు రెణ్డు
ద శా. ౪ ౧౧౯౦ ౪ ౧౦౩౮.

వ...శ్రీ భీమేశ్వర మహాదేవరకుం బెట్టిన కనక వలయముగద్యా ౧౦౨ పహిణ్డి...
ద శా ౪. ౧౩౩౩.

వ...పహిణ్డి నీరు వఱడినకో(ము)ల వెంజా మరలు ౧...   ద శా ౪ ౧౧౯౦

(ధనము)

వ...యిభూమి కృషి సేసి యతియిచ్చి నదపంగల వారు గాంబహిండియిచ్చి యిరువంణ్డ్రి బ్రాహ్మణులకు నా చంద్రార్క్కతారముగ కస్రత...నిల్పిరి. . ద శా ౪ ౧౩౭౧

పహ్లావులు. సం వి అ పుం. జన విశేషము

పహ్లికులు. సం=పహ్లావులు.

# పా

పా. సం వి. ఆ స్త్రీ. ౧. అంబుధారక. ౨ సుధ ౩ సంపతి శా. వి. దీనికి తెనుఁగున వ్యస్త ప్రయోగము లేదు

పాంక్తేయుఁడు. సం విశ (అ అ. అ.) ౧ బంతి కుడుపునఁ గూర్చుండి తినఁ దగినవాఁడు ౨. పావాసమునకుఁ దగినవాఁడు. (విల్సను.)

పాంక్త్యుఁడు. సం=పాంక్తేయుఁడు (విల్సను)

పాంగుల్యము. సం. వి. అ. న. కుంటుట. (విల్సను)

పాంచజన్యము. సం. వి. అ. పుం. కృష్ణుని శంఖము; శంఖము.(శ. ని.)

పాంచజన్యుఁడు. సం. వి. అ. పుం. అగ్ని విశేషము.

పాంచదశ్యము. సం. వి. అ. న పద్దెనిమిది సమూహము. పుం పదియేను సామిధేని మంత్రములచేత ప్రకాశింపఁజేయఁదగిన అరాకీగము అగ్ని

పాంచభౌతికము. సం విశ (అ ఈ అ) పంచ భూతములచేఁ జేయఁబడినది (దేహాది)

పాంచాలము. సం. విశ (అ. ఈ అ) పంచాల దేశభవము. వి అ పుం. ౧. ఒక దేశము. ౨ శాస్త్రము

పాంచాలి. సం. వి. ఈ. స్త్రీ ౧. పాంచాల దేశస్త్రీ; పాంచాలదేశరాజకన్య ౨ ద్రౌపది. ౩ (అలం) రీతిభేదము.

పాంచాలిక. సం. వి అ. స్త్రీ. వస్త్రదంత కాష్ఠాదులచేతఁ జేయఁబడిన నరమృగాదిరూపము, బొమ్మ

పాంచాలుఁడు. సం వి అ పుం ౧. పాంచాల దేశపురాజు. ౨ (కామశాస్త్ర) ఒక జాతి పురుషుఁడు. ౩. శిల్పి (వడ్రంగి, సాలె, మంగలి, చాకలి, మాదిగ మొ)

పాంజేబులు. వి. బ (స్త్రీలు) కాలికి ధరించు కొను గొలుసు. (శ. ర)

పాండరము. సం విశ. (అ. అ. అ) తెల్లనిది. వి. అ పుం. తెలుపు, శ్వేతవర్ణము న. కుంద పుష్పము, మొల్లపువ్వు ౨. గైరికము. (వాచ)

పాండవబీడు. వి. చిరాప్రహతభూమి, చాల కాలమునుండి దున్నని బీటినేల.

సీ. పాండవబీడు నాఁ బరగుఁ జిరాప్రహతము...
ఆం. భా. ౨. ౩.

పాండవుఁడు. సం. వి. అ. పుం.—పాండురాజు కొడుకు—(ధర్మజ భీమార్జునాది).

**పాండవేయుఁడు** సం వి అ పుం పాండవుఁడు

**పాండితి** సం వి ఈ స్త్రీ పాండిత్యము

**పాండిత్యము** సం వి అ న ౧ పండిత భావము, చదువరితనము ౨ సామర్థ్యము, నేర్పు ౩ పండితకర్మము

**పాండిమ** సం వి న్ పుం తెలుపు

**పాండిమము** సం వి అ న తెలుపు

**పాండియము** సం=పాండ్యము (వై ౧)

**పాండియుఁడు** సం=పాండ్యుఁడు (వై ౧)

**పాండీఁడు** వి (సం పాండ్య త పాండియన్) పాండ్యదేశపు రాజు

ఉ ఱేఁడు మహామతి మధుర నేవు యఱుఁ గొంచ్చి యందు బాంఁడు గివాణము న్నైజయ నించినఁ బ్రెబెడి దుమ్మ దా భుపలన్ బోఁడిమి చూన్పి హాంపు కుల్కమున్ ఆము ౨ రా

**పాండుకంటకము** సం వి అ పుం అపామార్గము, ఉత్తరేను ౹

**పాండుకంబళిము** సం వి అ పుం ౧ తెల్ల కంబళి ౨ ఎట్టపేనుఁగుపై వేయుకంబళి, తెల కుధ ౩ ఒకజాతిఱాయి

**పాండుకంబళి** సం విశ (న్ న్ న్) ౧ తెలకంబళిచేత కప్పఁబడినది (రథము) ౨ తెల్లకంబళి గలది

**పాండుకర్మము** సం వి న్ న వ్రణమును తెల్లఁబారునట్లు చేయు చికిత్సాభేదము

**పాండుకుఁడు** సం వి అ పుం చండాల స్త్రీయందు శూద్రునివలన పుట్టిన సంకరజాతి వాఁడు

**పాండుతరువు** సం వి ఉ పుం ధవవృక్షము

**పాండునాగము** సం వి అ పుం ౧ పున్నాగము, పొన్న ౹ ౨ తెల్లయేనుఁగు ౩ తెల పాము

**పాండుపత్త్రి** సం వి ఈ స్త్రీ రేణుక అనెడి గంధద్రవ్యము ౹

**పాండుఫల** సం వి అ స్త్రీ చిర్భటి, దోస ౹

**పాండుఫలము** సం వి అ పుం పటోలము, పొట్ల ౹

**పాండుపృష్ఠుఁడు** విశ (అ ఆ అ) దుర్లక్షణుఁడు

**పాండుభూమము** సం విశ (అ ఆ అ) తెల్లనినేల గలది వి అ పుం తెల్లనిబలపు భూమి ఆ స్త్రీ ౧ శ్వేతమృత్తిక, తెల మన్ను ౨ ఖటిక, బలపము

**పాండుమృత్తిక** సం వి ఆ స్త్రీ ౧ ఖటిక బలపము ౨ తెల్లమన్ను

**పాండురంగము** సం వి అ పుం శాకవిశేషము, (పాటరాంగా)

**పాండురద్రుమము** సం వి అ పుం కుటజము, కొండమల్లె ౹

**పాండురఫలి** సం వి ఈ స్త్రీ ఒక దినుసు క్షుద్రక్షుపము (పొట్టియాకులుగల చెట్టు)

**పాండురము** సం విశ (అ ఆ అ) ౧ తెల్లనిది, ౨ తెలుపు మించిన పచ్చనిది వి అ పుం ౧ తెలుపు ౨ తెలుపు మించిన పచ్చన ౩ కామాల, కామిల న ౧ శ్విత్రరోగము, తెల్లపులుము ౨ మరువకము, మరువము ౹ ఆ స్త్రీ మాషపర్ణి ౹

**పాండురాగము** సం వి అ పుం ౧ తెల్లఁదనము, తెలుకి ౨ దమనకవృక్షము

**పాండురిమ** సం వి న్ పుం తెల్లఁదనము, పాండిమ

పాండురేక్షువు. సం. వి. ఉ. పుం. శ్వేతేక్షువు, తెల్లచెఱుకు †.

పాండులోమ. సం. వి ఆ స్త్రీ. మాషపర్ణి †.

పాండులోమశ. సం = పాండులోమ.

పాండువు. సం. విణ (ఉ. ఉ. ద్వి. ఉ) ౧. తెల్లనిది ౨. తెలుపు మించిన పచ్చనిది వి. ఉ. పుం. ౧. తెలుపు ౨. తెలుపు మించిన పచ్చన ౩ ఒక రోగము. ౪ తెల్లయేనుఁగు ౫ ఒకరాజు (ధర్మరాజాదు లగు పాండవుల తండ్రి) ౬. పటోలము, పొట్ల. †. ౭ ఒకా నొక దేశము. ౮ మాషపర్ణి, కారుమినుము † ౯. ఖర్జూరము †

పాండుశర్కర. సం వి ఆ స్త్రీ సిత యను ప్రమేహరోగము

పాండుసోపాకుఁడు. సం వి అ పుం సంకీర్ణ జాతిభేదము.

శ్లో చండాలాత్పాండుసోపాక స్త్వక్సారవ్యవహారవాన్, అహిణ్డికో నిషాదేన వైదేహ్యామేవ జాయతే మను. ౧౦. ౩౭

(చండాలునికి వైదేహియందుఁ బుట్టినవాఁడు)

పాండ్యము. సం. వి. అ పుం ఒక దేశము (శ ర.)

పాండ్యుఁడు. సం. వి. అ. పుం ౧. పాండ్యదేశపువాఁడు. ౨ పాండ్యదేశపురాజు, పాండీఁడు.

పాంథుఁడు. సం. వి అ. పుం ౧ పథికుఁడు తెరువరి, ౧. సూర్యుఁడు. (విల్యమ్సు).

పాంశుకీలము. సం. వి. అ. న. నిరుపపద మగు శాసనభేదము, ఎవరిపేరిట వ్రాయఁబడినదో వాఁడు తెలియఁబడని పత్రము. (త్రి ని)

పాంశు(సు)రాగిణి. సం. వి. ఈ. స్త్రీ. మహామేద. †.

పాంశు(సు)లము. సం విణ. (అ. ఆ అ ౧. పాంశువు (దుమ్ము) మిక్కిలి గలది. ౨. పాపము గలది, చెడినది ౩. చెఱుపునడి దూషించునది ౪. శివుని యాయుధవిశేషము

పాంస(శ)నము. సం. వి అ. న. తిరస్కారము. (త్రి. ని)

పాంస(శ)నుఁడు. సం. విణ (అ ఆ, ఈ అ) ౧ దూషకుఁడు, చెఱుపువాఁడు. ౨. అవమానము కలిగించువాఁడు. ౩. దుష్టుఁడు, నింద్యుఁడు ౪ దుష్కీర్తి గలవాఁడు (ఇది తఱచుగా సమాసాంతములం దుండును)

పాంస(శ)వము. సం విణ (అ ఆ అ) పాంసువులు గలగి వి అ పుం — పాంశువికారిమైనది — లవణభేదము

పాంసు(శు)కాసీసము. సం వి అ న కాసీసము, అన్నభేది

పాంసు(శు)క్షారము. సం. వి అ. న. క్షారలవణము

పాంసు(శు)చందనుఁడు సం. వి అ పుం. శివుఁడు (త్రి ని, వై ని)

పాంసు(శు)చత్వరము. సం వి అ పుం. ఘనోపలము, వడగల్లు.

పాంసు(శు)చామరము. సం. వి అ పుం. ౧. పటవాసము, గుడారము ౨. గఱిక మొలచిన భూమి ౩ వర్ణాపకుఁడు, నాడీవిభాగము చేయువాఁడు ౪. ప్రశంస ౫. పురోటి, తెక్కల ఝుంకారము ౬. ధూళిగుచ్ఛము, పటవాసము.

పాంసు(శు)జము. సం = పాంశుక్షారము.

పాంసుజాలికుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు. (విల్యమ్సు)

పాంసు(శు)పత్త్రము. సం. వి అ. న వాస్తూక శాకము, చక్రవర్తికూర. (వాచ.)

పాంసు(శు)మర్దనము. సం వి అ. పుం. కేదారము, వరిమడి

పాంసు(శు)రము. సం వి. అ పుం. ౧ దంశము, అడవియీఁగ. ౨. కుంటివాఁడు

పాంసు(శు)రాష్ట్రము. సం వి. అ. న దేశభేదము.

పాంసుల. సం. వి ఆ. స్త్రీ. ౧ ముట్టుత, రజస్వల. ౨ పుంశ్చలి, ఱంకుటాలు. ౩ భూమి ౪. కేతకి, మొగలి ?

పాంసు(శు)లుఁడు. సం వి. అ పుం. కాముకుఁడు, మిండఁడు

పాంసు(శు)వు. సం వి ఉ పుం. ౧. ధూళి, దుమ్ము ౨. ధూళినలుసు, రేణువు ౩ ఎరువు, పేడ. ౪. ఒకదినుసు కర్పూరము. ౫ పర్పటము. అ న. ఒకదినుసు ఉప్పు

పాఁకు. వి శైవలము, నీటిపైన బయలు దేఱునాఁచు.

గీ. కురులతోఁ గూడ విలసిల్లు గిరిజ మొగము, జడలు దాల్చినఁ గడుచెదం గదరి పొల్చె, భృంగములు మాఁగి చెలువొందు బిసరుహంబు,పాఁకు దాల్చియుఁ గర మొప్పుభంగి వోలె. కు సం. ౭. ౪౪౨

శ్లో...సశైవలాసంగమపి ప్రకాశతే.

సం కు. సం. ౫. ౯.

సీ కడిసన్నతమ్మిఁ బాఁ కడరెనో యన దీన వదనంబుపై నెఱుల్ సెదరితూల.

కు. సం. ౨ ౨౨౧.

పాఁకుడు=ప్రాఁకుడు. వి. పండ్లపాఁచి లోనగు నవి. (శ. ర)

పాఁగు=పాఁగెము. వి. (క. పాంగు) విధము, రీతి.

౪. ఏఁగిన సాతం దక్రుఁడు, దోఁగిన నయనములఁ బాఫు దోఁపక తనలో, గ్రాఁగుచు నుండఁగ నేమీ,పాఁ గెఱిఁగినభంగి నొయ్యఁ బలికెను మతనిన్ ద్వా. ౫ ౭౭

పాఁగెము=పాఁగు. వి ౧ విధము, రీతి.

ద్వి . శివుని, నుతియించి పదసెఁ గన్నులు గాలి దాసి,యనఁగ నందులలోన వతనిపాఁగెముఁ, కనుగవల్ వదయుట కష్టంబుగాదె.

పండితా మహిమ. ౨౪౩. పా

౨ సంబంధము.

ద్వి. ఏఁ గొనిరొయిడి దేమి రొులమి నీతోడి, పాగెము నాపాల పరమేశుఁ డుండ

పండితా పర్వత ౩౯౭ పా

౩. సామ్యము.

సీ కొలముపాఁగెముఁ నపొప్పలనుదిండిని నల్పి, తెగి నీటొఁకొని సెం పిగురఁ జేసి,

యయా ౨ ౧౦౪.

౪. మైత్రి,స్నేహము (చి ని)

పాఁచి=ప్రాఁచి. వి (సం పాచీ క త పాసి. మ పాయి. తు. పాచీ) ౧ శైవాలము, నాఁచుతీఁగ.

సీ ముంచి చీకటులు కల్పించునీడలు వోవఁ బద్మాకరంబులపాఁచి విఱుగ

కువల. ౩ ౧౦

సీ నాఁచు పాఁచి యనఁగ గీ. శైవలంబగు సాం ని. స్థా. ౭౫

౨. నీరు నిలువ యుండుటచే కలిగెడి పచ్చని మురికి.

సీ. నిర్ఝరప్రబలవేణిక లింక జట్రాలఁ జేరిన పాఁచి సెన్నిట లెగయు. అము. ౨. ౪౭.

౩. పండ్లమలము.

సీ. బొక్కి–రొమ్మును నూఁదబొడ్డును మిడిపండ్లో తెఱ్ఱిసోరును బాఁచి దేఱు మొగము.

భల్లాణ. ౪. (శ. ర.)

జ: పాఁచిపడు, పాఁచిపని

పాఁచిటేఁగ. వి మజ్జిగ చిక్కన చేయు ఒకానొక తీఁగ (చి ని, ౪౮.)

పాఁచిపడు. అ క్రి. (√పాఁచి) త. పాసిపఱు నిలవ యగు

క. దాఁచగ నేఁటికి నీమది, దోఁచిన యర్థంబు నేఁడు దోడ్తో నీసుమీ, పాఁచి పడకుండఁ బలి కెదఁ, బూఁచినయది వెనుక దీయఁ బోలునె పార్థా. శేష. ౨ ౯౯

('కాలయాపనము కాకుండ' అని భావము)

పాఁచిపని=ప్రాఁచిపని. వి. (√. పాఁచి) గత దినమున నుపయోగించిన పాత్రలు శుద్ధిచేయుట మొ. పని

గీ దద్దతిలినట్లు నడుకేయి ప్రొద్దు వొడిచె, నవెడుమతిఁ బాఁచిపనులు చేయంగఁబూను, వలపువెట్టికిఁ జిక్కి యవ్వనజగంధి. శుక ౨. ౫౬౧

పాఁడి. వి ౧ క్షీరము, పాలు.

మత్త. పాఁడికుఱ్ఱల నీఁడె పీనికిఁ బాలు ద్రావుచు నుండగాన్. భార. ఆది ౫ ౨౧౭

ఉ. పాఁడియుఁ బంటయుం గలిగి పంకవిహీన మనోహరాంబువుల్, వేఁడిన నెల్లచోటఁ బ్రభవింపఁగ పాండు. ౪ ౪౩

వ...పాణ్డిమొదవులు ౧౦ ను ఈఁడులకీ బ్రాహ్మలకు... దా శా. ౧౨౪౭.

౨ గోగణము, ఆలమంద

ఆ. పాఁడి నేఁపెఁ బువ్వుఫలభరితంబులై, తిరువనంబు లొప్పె ధర్మకర్మ, నిరతిఁజేసి .. భార. ఆది. ౫. ౩

గీ. నేఁడు నా లాఁగి మామందపాఁడి చూచి, గోరసముఁ బాయసంబులు సారగించి, నిగ్రహం బయిన మము మన్నింపవలయు వి. శకుం. ౧. ౧౨౩.

పాఁత=ప్రాఁత. వి. (సం. పురాతనమ్) ౧. గుడ్డ ముక్క, చినిఁగిన వస్త్రభాగము.

ఆ. కదుపుచెంట లాల గాజంగ మాసిన, పాఁత గట్టి . వి. పు. ౩. ౨౯౫.

౨. వస్త్రము

సీ నీరాడుతటి నాఁడువారు కట్టినపాఁత లెత్తుక పోయి చెట్టెక్కి నపుడు శుక. ౨. ౫౪౪.

గీ. బొమ్మకు మసిపాఁతఁ బొదిఁగినమాడ్కి ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౭౯.

పా: తడిపాఁత గొంతుకోయు (మెత్తని మాట లచే మహోపద్రవమును గొనితెచ్చు)

చ. వనజకృపాణ చల్లనయి వర్తిలఁగా దడిపాఁత గొంతు గోసినగతిఁ దమ్మివాలు గొని చిమ్మెదు పాంథులమీద కువల ౪. ౩౦.

ఇట్లే:—తడిపాఁతఁ గుత్తుకగోయు.

గీ దూఱఁ దగునిన్ను నొకటికిఁ దొంటియట్ల, కల్లమారిమి నిరవువాక్యముల నన్ను, నిప్పుడును బయ లీఁదించె దిదియకాదె, కుటిల తడిపాఁతఁ గుత్తుక గోయు టనఁగ. ప్రభా ౫. ౧౨౪.

సా: మసిపాఁత మాణికము.

క తత్తనుసాం, గత్యము మసిపాఁతి మాణికం బై యొదుగున్. అను. ౬. ౫.

జ: పాఁతగిలు.

పాఁతగలు. అ. క్రి. (పాఁతు+అగలు) పెల్లగిలు.

ఉ. దేవనగంబు పాఁతగలి త్రెళ్లిన నం దొకఁడు గల్గొనె, యౌవనజాక్షి నిట్లు పెడబాడిన నక్కట నోరు ప్రువ్వదే. నిర్వ. ౭. ౧౧౪.

ఉ. భానుకుండు మండి గిరి పాఁతగలన్ వెస దాఁటె... భా. రా. యు. ౪౫౧.

౨. చెడు.

క. పగ పుట్టుకొనినఁ జిత్తము, పెగ డొందఁగ జేసు గలయ పెమ్మఁగ ధృతి పాఁతగల నాక తీవయింటికిఁ, దగియుండెడు చంద్ర కాంత తల్పము నేరన్.

భార. విరా. ౨. ౩౦౮.

పాఁతగల్చు. స. క్రి. (√పాఁతు) ౧. ఉన్మూలించు, పెల్లగించు.

గీ. పట్టిఁ గదలించి నవియార్చఁ బాఁతగల్చి, సొత్తె వక్షస్థలంబున పెఱియ నొత్తిఁ, దోయ జాక్షుండు లోకైకదుర్ధరుండు, దాల్చె నవ శీల నిట్లు మందరనగంబు హర ౬. ౪౪

పాఁతగిలు(ల్లు). అ క్రి (√పాఁతి) పాఁతబడి యగు. (శ ర)

పాఁతర(టి). వి (√పాఁతు) ౧. ధాన్యము పెం ఉంచుటకు నేల త్రవ్విన గొయ్యి

సీ. నగము దుమ్మునఁ బూడి చిగిరింత వామాయఁ బెరిఁగిన మాతిపాఁతర బోరియల.

ఆము ౬. ౧౩.

చ. పతిగల సేతివం గొలుచుపాఁతలటున్ గలతే తలంపఁగన్. ఉ హరి ౪ ౪౯.

ద్వి. ఉప్పుపాఁతలలోన నుంచి యామీఁదఁ, గప్పిరి పై మన్ను గానరాకుండ ద్వి శ. పా. ౩ ౧౦౭. పా. ౧౧ పం మార్క 3. ౩౫౪

౨. పాఁతునిధి

గీ. తనకుఁ దొమ్మిదిపాఁతర ల్ధనము గల దటంచు జిక్కవల కోఁడు గర్వించుఁగాని,

రవిక. ౧ ౪౪

ఆ. తోటదాల్పునతఁడు తొమ్మిది పాఁతరల్ రొక్క మున్న దనుచు నిక్కఁగాని.

నీలా. ౧. ౩౭.

ఇనుకపాఁతలు—ఇసుకనేలయందు త్రవ్వఁబడిన గొయ్యి, త్రమావహ పై ఫలిత విూఁదుని పని.

గీ. అనఘ పెర్యాయిదంబవ ర్తనము లెన్న నిసుక పాఁతలు యాజోలి రేఁపఁ ద్రవ్వ.

వైజ. ౨. ౭౭.

పాఁతికొను. స. క్రి (√పాఁతు) ౧. నిధిగాఁ జేసికొను, పూడ్చుకొను.

గీ. ఎవ్వరికి నీక తమతమయిండ్లఁ బాఁతికొని సుఖంబుండి రధము లై కొంద ఱందు.

భార. ఆది. ౭ ౧౩౨.

శ్లో ధూమాను నిదధుః కేచిత్ భృగవో ధన మక్షయం సం భార ఆది. ౧౭౪ ౧౫.

పాఁతిపెట్టు. స క్రి. (√పాఁతు.) పాఁతు, పూడ్చు

ఆ. దానములను జేయఁ దనచేతు లాదక, బహు ధనంబు గూర్చి పాఁతిపెట్టి, తుదను దండుగ నిడి పెండలు చెడునరుండు,

వేమన. ౧. ౧౨౪.

పాఁతు—ప్రాతు. స. క్రి పాతిపెట్టు, పూడ్చు

చ ఒండనిన సపుత్రమిత్రిముగ నద్దెన నందఱ గ్రోచ్చి పాఁతుదున్

భార. ఉద్యో. ౩. ౧౪౨.

ఉ...ని, పాకరణతీవ్రబాధ ననికంబును ముప్పది మూఁడుకోట్ల బృందారకులన్ మహర్షులఁ బ్రకాపగుణంబున నేఁచి పాఁతుమన్.

హర. ౩. ౩.

గీ. పాఁతినవాడికొట్టు, యూపనత్రిక్రియ కర్హ మై యుపెన్న చెపుము. హర, ౪. ౩౦.

వి. భూమి పెం బానిలో దిగినపరగతము పెం. బానికూలము (పెండలు.)

వ. ఇట్లు పదునాలుగండువేల యోజనంబుల కనర్పును నంతియ పొడవునుం గల మంథర నగంబు.. భార. ఆది. ౨. ౧౧.

క. తొమ్మన విఱిగిన రేఁసుఁగుఁ, గొమ్ములు పడి వెలఁగు పందికొమ్ముల పాఁతుల్, వమ్మై పెకలక యుండిన, యెమ్మెలకును పీఁడు తివియనీయఁడు సామీ చంద్రా. ౨ ౫౨ భార భీష్మ. ౧ ౨౨

సీ విదిత మైపదియాఱువేల యోజనములు నంతియ పాఁతు నై యతిశయిల్లు భాగ. ౫ ౨ ౧౯.

వ షోడశ సహస్రయోజన వితతస్త్రావతాం తర్భూమ్యాం ప్రవిష్టః సం. భాగ ౫. ౨

జః పాఁతిగలు, పాఁతగల్చు, పాఁతర, పాఁతి పెట్టు

పాఁపదేగము. వి (పాము+జగము) నాగ లోకము

సీ. పాతాళనామంబు పాఁపజగ మనంగ నేల యడుగ గనంగ వెగడుచుండు. ఆం. భా. ౧. ౧౪౫

పాఁపదేన్నిగట్టు. వి (పాము+జన్నిగట్టు) విశా యకుఁడు (శ. ర.)

పాఁపజన్నిదము. వి. (పాము + జన్నిదనము) సర్పయజ్ఞోపవీతము

సీ పసపునిగ్గులు దేఱు పాపఁజన్నిద మొప్ప... మనుచ. ౨. ౧౧

పాఁపతూపు. వి.(పాము+తూపు.)నాగాస్త్రము

మ...అప్పాఁపతూపు, పృదయం బుగ్రము గాఁగ చి ట్టదవి... భార. కర్ణ. ౩. ౩౨౧.

ఇట్లే పాఁపములికి. గి...పాఁపములికి, సరిని... అదఁగల చిత్రపత్త్రమునకు, ప్రబంధ. ౧౭౧.

పాఁపది. వి. (√పాము)అహిపాయము, గరళము.

సీ ..ఆహీయ యూఁ, కామదియవఁగను బాఁపది యున. ఆం. భా. ౧ ౧౪౭.

పాఁపమీసు. వి. (పాము+మీసు) ఒకజాతి ఆఁడుచేప, శృంగి (శ ర)

పాఁపమేపరి. వి. (√పాము) గరుత్మంతుఁడు. (చూ పాఁపమేపరిపచ్చ)

పాఁపమేపరిపచ్చ. వి (√పాము) గరుడపచ్చ

సీ పాఁపమేపరి పచ్చపలకలఁ కెంగల్వదోరణాలఁ దీర్చిన దూలములును. యయా ౧ ౯౪.

సీ. జిగి పెల్లి వెలయించుమగరాల తలుపులు పాఁపమేపరి పచ్చపలకగడపులింపు నింపు... ధర్మ 3. ౧౪౨.

పాఁపమేపుడు. వి. (పాము+మేపుడు) గరు త్మంతుఁడు (చూ. పాఁపమేపుడు పులుగుకల్లు.)

పాపఁర[1]. వి ౧ గోఁకుంచి, చిన్న పాఁపర. ? (శ. ర) (నిరనుస్వార మని చి ని)

ఆ. పాలు పంచదార పాఁపరపండ్లలో, జాలఁ బోసి వండఁ జవికి రావు, కుటిలమానవులకు గుణ మేల కలుగురా... వేమన. ౨. ౩౪

ద్వి మద్ది పాలకొడిసె మారేడు వెలఁగ,బొద్ది పాఁపర జమ్మి పులుగుడు వేఁడి. ద్వి శ సా ౨ ౩౯ పా. ౧౧. పం

పాఁపర[2]. వి. మత్స్య విశేషము.

సీ కొరదయుఁ గడిసి పాఁపర మల్లు మచ్చంగి కొంటెముక్కులాంపిఁ గ్రుచ్చుకొనిరొ. వేం. పంచ. ౧. ౫౯౪.

సీ. పాఁపరలను చిన్న పదవాళ్లకును నిచ్చె మాదు పులను జమ్మవారి కిచ్చె. ద్వా ౧. ౨౨౧.

పాఁపరమ్ము. వి (పాము+అమ్ము) నాగా స్త్రము.

చ...పాఁపరమ్ము వ్రాఁత కెగయు ఘోరరూప
భయద(ప్రభవమాన విషాగ్ని జిహ్వికల్, దని
కి౯ బెల్చ మండుచు నిలాస్థలి డొల్లె...
భార. కర్ణ. 3. 3౫౫

పాపరాసెజ్జ=శేషశయ్య.

సీ బహుతర బ్రహ్మాండ భాండపూరిత మైన
బొజ్జతోఁ బాఁపరాసెజ్జతోడ
మ్మ వి. 3 3౭

పాఁపరాకన్నియ=నాగకన్య.

క అకన్నియసోయగ మ్మారాకానులమాడ
పాఁపరాకన్నియలం,దేకడ నరసిన లేదు .
నీలా. ౨. ౧౪

పాపరాయిక్కు. వి (√ పాము) పాతాళ
లోకము, నాగలోకము

దండకము...మన్నంతయుం గొంచుం బల్పాఁ
పరాయిక్కుడుం బ్రాఁకు బంగారపుంగంటి
కేల్(దిమ్మరిక జన్న పుంబంది పై చెండి వైళంబు
వార్ధొమ్మువం గ్రమ్మవా...
అచ్చ రా యు ౧౩౧.

పాళ. వి దూలము లుంచక కట్టినయిల్లు,శాల.
(శ. ర)
ఉదా :—పసులపాళ

పాకకృష్ణఫలము. సం=పాకకృష్ణము.

పాఁకకృష్ణము. సం వి అ. పుం. ఓఁక చెట్టు.

పాకజము. సం. విణ (అ ఆ. అ) ఉష్ణము
(తాపము) చే గలిగినది.

వి అ న ౧. కాచలవణము, గాజుప్పు.
౨ పరిణామశూలరోగము.

పాకద్విట్టు. సం వి వ్. పుం. ఇంద్రుఁడు

పాకనాఁడు. వి. (శ. పాకనాడు) దేశవిశేషము.

క. కెలనాఁడు వేఁగినాఁడును, బులుగుల
నాడ్వాకనాఁడు పొత్తపినాఁడు౯ అల
మురికినాఁడు రేనాఁ, డలయక గనుగొంటి
నచటి యతిబలుల౯ గంటిన్. హంస. ౧. ౫3.

పాకపాత్రము. సం.వి.అ న. వంటపాత్రము, స్థాలి

పాకపుటి. సం. వి. ఇ ఈ స్త్రీ. కుమ్మరిఆవము

పాకఫలము. సం వి అ. పుం. ౧ ఫలపాకము
నీటి ఉసిరిక ౨ ఓఁక చెట్టు, కరమర్దము.

పాకఫలకృష్ణము. సం. పాకకృష్ణము.

పాకమండలము. సం. వి అ. న. = పాకపుటి
(వై. ని)

పాకమత్స్యము. సం వి అ పుం ౧ చేఁపల
కూర. ౨ ఒకవిషము కీటకము. 3. సముద్రపు
చేఁప

పాకము. సం. విణ (అ. ఆ అ) ౧. అల్పము
౨ ప్రశస్యము, పొగడఁదగినది. 3 పరిపక్వ
మైనది.

వి అ పుం ౧. పచన, వంట ౨. (ఇటికలు
లోనగు వానిని) కాల్చి పక్వముచేయుట.
3. (అన్నాదుల) జీర్ణము. ౪. పరిపాకము,
పండుట ౫ నిండుగా ఎదుగుట, చక్కని
వృద్ధి. ౬. పరిణామము,ఫలము ౭ ధాన్యము.
౮. నర, నరయుట, పలితము. ౯. గుడ్ల
గూబ. ౧౦ ముదిమి ౧౧. రాష్ట్రభంగము
౧౨. భయము, దేశోపద్రవము కలిగించునట్టి
భయము. ౧3. వ్రణము. ౧౪. వంటపాత్ర
౧౫. ఓఁకచెట్టు. (వై. ని)

పాకముదప్పు=ఉచితస్థితితప్పు; చెడు.

క. నీకడుపునఁ బుట్టినయుణ,మే కరణింబాతు
కొక్కు రేచునిపడితిక్, గైకొనవేనాపలుకీ,
పాకముదప్పడును భయము వాటిల్లఁజామీ.
నృసిం. ౫. ౧౫౦.

చ. వారలఁ బంపుచేయ కేఁ, జతురుఁడఁగాను
ప్రశాధనము చాలదు నా డెసఁ దప్పు లేమి
మీ, మతిఁదేలపోసి యీ పలుకులాడుఁడు
పాకము దప్పెఁ గార్యముల్,

భార. భీష్మ ౧ ౧౩.

పాకయజ్ఞము. సం వి. అ పుం. చరుపాకముచేఁ జేయఁదగు యజ్ఞము

పాకరంజనము. సం. వి అ న. తేజపత్రము, ఆకుపత్రి. శ.

పాకలము. సం వి అ పుం. ౧ అగ్ని. ౨ వాయువు ౩ ఏనుఁగులకుఁ గలుగు పిత్త జ్వరము, కూటపాకలము ౪. గుల్మము. (వై ని) ౫. చెంగల్వకోష్టు

పాకలి. సం వి ఇ. ఈ స్త్రీ. ౧ కర్కటి, దోస. శ. ౨. రోహిణి. అను వృక్షము.

పాకశాసని. సం వి ఇ పుం ౧ జయంతుఁడు ౨. వాలి. ౩ అర్జునుఁడు

పాకశాసనుఁడు. సం వి. అ. పుం ఇంద్రుఁడు

పాకశుక్ల. సం వి. ఆ. స్త్రీ మహాశ్వేత, బల పము (వై. ని)

పాకాతిసారము. సం వి. అ. పుం చాల దినము లుగా ముదిరిన అతిసారరోగము, జీర్ణాతిసారము.

పాకాన్నము. సం వి. అ న. పాకెన, వడుగు పెండ్లిండ్లలో తృతీయదినము. (శ ర)

పాంచాలీ. ౪. ౩౦.

పాకారి. సం. వి. ఇ పుం ౧ పాకాసురారి, ఇంద్రుఁడు ౨. శ్వేతకాంచనము. శ.

పాకి. వి. మలముఁగు పెరటిలిప్పు ఎత్తెడువాఁడు, పాకి వాఁడు. (శ. ర.)

పాకి. సం. విశే. (క. నీ క) సమాసాంతము లందే, ౧. పండునది, పక్వమగునది. ౨. పాకము చేయునది, జీర్ణింపఁజేయునది.

పాకిమము. సం. విశే (అ. ఆ అ) ౧ పండఁ బడినది ౨. (స్వభావముచేతఁగాని ఇతర సాధనములచేతఁగాని) పండినది, కాఁచుటచేఁ గలిగినది (ఉప్పు మొ)

పాకీ = పాకి. (చి ని, శ. ర.)

పాకుఁడు. సం. వి. అ పుం ౧. చన్నుకుడుచు శిశువు. ౨. ఒక రాక్షసుఁడు ౩ సూర్యుఁడు

పాకుకుఁడు. సం విశే (అ. ఆ. అ) వంట వాఁడు, పాచకుఁడు

పాకువు. సం వి ఉ పుం. వంటవాఁడు, పాచ కుఁడు.

పాకెన = పాకెన్న. (చి. ని, ప్రా, శ ర)

పాకెన్న = పాకెన, ప్రాకెన, ప్రాకెన్న. వి. (సం పాకాన్నము ప్రా. పాకన్న) వడుగు పెండిండ్లలో తృతీయదినము. ("పెండ్లియందు మూఁడవనాటి బువ్వము" అని శ. ర.)

సీ గ్రంథత్రయీవిదుల్ ఘనమువర్ణ క్రమా
భ్యున్నతిఁ గనిరి పాకెన్నవాఁడు.

రా. వి. ౫. ౭౦.

సీ వడుగు పెండిండ్లలోపలఁ దృతీయదినంబు
పాకెన్న యనఁగను బరగుచుండు

ఆం. భా. ౨. ౧౪౭.

పాక్యము. సం. విశే (అ. ఆ. అ) పాకము చేయఁదగినది. వి. అ. పుం. యవక్షారమున. ౧. అట్టుప్పు, బిడలవణము. ౨. సాంబరలవణము, చవుటియుప్పు.

పాక్షికము. సం విణ (అ. ఈ అ) ౧. పక్ష కాలమునఁ గలిగినది ౨. పక్షాంతరమునఁ గలిగినది. ౩ సంశయమం దొకకోటియందుఁ గలిగినది, వైకల్పికము ౪ పక్షికి సంబంధించినది వి. అ పుం వికల్పము.

పాక్షికుఁడు. సం వి. అ పుం పిట్టల వేఁటకాఁడు (విల్యమ్సు.)

పాగ=పాగా. వి (క పాగు ౩ పాగై) శిరోవేష్టనము

సీ కట్టెను రై పెరిగిన కుఱువెంట్రుకలతోడ బట్ట యాదలఁ గావిపాగ యమర శైవ. ౪. ౯౩

సీ గొబ్బుగొబ్బునఁ దల శిత్తి కొందఱుండుఁ, జాడఁ జాడంగఁ బాగలు వీడి పడిన
శారంగ ౧ ౧౨౩.

సీ బా గైన తగటంచు పాగలోఁ జెక్కిన కమ్మ పువ్వులబంతి రొమ్మె్మగులుక
చెన్న. ౧ ౧౩౭.

పాగడ=పడగ, పడిగ. వి (సం స్ఫటా)

మ...పాగడల్ విప్పి త్రిమిం, గు వధించుచున్ నృపహ స్తనిర్ము ణఘటాకోటీచపేటంబులన్.
వరాహ. ౭. ౪౧

పాగడము¹=పాడగము. వి (సం. పాటక, ప్రా పాదక)

౧ స్త్రీపాదభూషావిశేషము, పాదాభరణవిశేషము

మ. కియపూజాంభుజముల్ ఘటిం దడఁబడన్ జక్కోయి కేఁగొనునపై, దయ దప్పన్ బస పాడి పాగడపుఁబాదం బొప్పు
ఆము. ౧. ౫౭.

వ...మాణిటదుగుల జోడించిన పాలవెండిపాగ డమ్ములు ప్రబంధ. ౪౮.

౨. పౌరుషసూచకముగా కాలిని ధరించు భూషణము.

గీ. కలుపుకలిపెనుదండయుఁ గమ్మితిఁగ, పాగడము పూస హాస్యపై బలిక పడిగ,
వేం. పంచ ౪ ౪౧౭.

పాగడము². (క పాగుడ, పావడ = ఉత్తరీయము) వస్త్రవేష్టనము

గీ. జడలఁబాగడ చొల్లెంబు సంతరించి
హర ౫. ౫

పాగలు=పాగాలు, పావలు. వి బ. (సం పాదుకా) పావకోళ్లు
(దారుమయపాదరక్షలు చి ని)

క పాగలు దొడుకొని యొక రొుల, సాగయుఁ దాను
పోద. ౨. ౩౫.

ద్వి పాదవగుసంభవుల్ బెదఁగగుపసిఁడి, గొడుగులపాగలు గూడులోహంపు, పాగలు దంతపుపాగలు రాగి, పాగలు పాదాలపాదరక్షలను పండితా. పర్వ ౩౩౩. పా.

పాగలుఁడు. సం. విణ (అ ఆ అ) ఉన్మత్తుఁడు. (వా చ)

పాగ్రా. వి ౧ అశ్వాదిశాల, మందుర

క భండారముతో హయమద, కుండాల ఘటాళి తనదుసామ్మై పాగా, నుండిన...
ఆము ౪ ౩౨.

సీ యవనాధిపతి యుపాయనముగా నొసఁగిన పాగాహయంబులు వాగెవచ్చు
భీమ ౧ ౩౪ కాశీ. ౧. ౩౪.

గీ పాగ, లాయమనఁదొప్పు వాజిశాలకును.
సాం. ని తిర్య ౪౩.

౨. అశ్వసముదాయము, అశ్వములవరుస, అశ్వపంక్తి; వాహనము లగు జంతువుల సమూహము.

క. శ్రీకృష్ణుఁ డలఁచి పనీ కేఁడయుచుఁ, జేవినపాల్
గలయు కొండచేఁ కొంధజనుల్ దూషింపమి
కేఁ డంపిన, యాపాగా యనఁగ నదుల
నంచలు కొలుచెన్. అను ౪. ౧౭౭

సీ. పాగాయనఁగ నక్వపం క్తిబిరాజిల్లు
అం భా ౨. ౧౯౭.

౩. తలపాగ (శ ర)

పాగాలు = పాగలు. వి. బ (సం. పాదుకా.) పాదజోళ్లు, పాదరక్షలు

సీ. ప్రక్షాళితము లైన పదియాఱువన్నియ కన కంపు గొడుగుఁ బాగాలు దొడగి.
సైక. ౭. ౧౦౩ పూర ౮ ౧౩౮.

సీ. తమరాక ప్రియుల కెంతయు దాల విదరాఁ
విపాలించు కెజ్జుపాగాలు మెట్టి (గీ) విటులు
విహరింతు రవ్విటి వేశ్యవాటి
సైజ ౨ ౪౫.

పాగు. వి (సం. పాకః) గుడపాకము (చక్కెర లోనగునవి కాఁచగా నగు ద్రవపదార్థము అని శ. ర)

సీ...పా గనఁగా గుడపాక మెసఁగు.
అం భా. ౨. ౨౫౧.

ఉ. బెల్ల పుఁబాగునం దడిపి పెట్టితి.
చంద్రా ౨. ౮౪

పాచకము. సం. విణ (అ. ఆ. అ) భుక్తాన్న మును జీర్ణింపఁజేయునది. (మందు మొ.) వి అ. పుం. అగ్ని అ. న పిత్తము

పాచకుఁడు. స. విణ (అ. చికా. అ) పాకము చేయువాఁడు. వి. అ పుం. వంటలవాఁడు, సూపకారుఁడు.

పాచనకము. సం. వి అ పుం టంకణము, వెలిగారము.

పాచనము. వి. (సం. పాచన) పాసనము, వికే చనము. (శ. ర.)

పాచనము. సం. విణ. (అ. ఈ. అ) ౧. పచనము సేయునది, వండునది ౨. పక్వము సేయునది, పరిపాకము నొందించునది. ౩. జీర్ణము సేయునది, అరగించునది ౪ (వ్రణాదులను) మెత్తగిలఁ జేయునది

వి. అ. పుం ౧ అగ్ని. ౨ అమ్లరసము, పులుసు. ౩ ఎఱ్ఱఆముదపుచెట్టు.

న ౧. వంట. ౨ పరిపాకము నొందుట, పరి పక్వ మగుట ౩ అన్నాదులను జీర్ణింప జేయుఁ మందు ౪ వ్రణమునుపండించుట. ౫. ప్రాయశ్చిత్తము. ౬. పిత్తాదిదోషము లను పక్వముచేయుద్రవ్యభేదము (క్వాథా దులు) ౮ కషాయము ౭ వ్రణమునుండి చీము మెందలగువానిని దీయుట. ౯ గాయ ములను మాన్పుటకును కొత్తరుకాఱుట నిలు పుటకును నుపయోగించు ద్రవ్యము. ౧౦. పుండునకు కట్టెడు ఉడుకఁబెట్టినపిండి.

పాచని. సం వి. ఈ. స్త్రీ హరీతకి, కరక. కీ

పాచలము. సం విణ (అ ఆ అ) పాకము సేయునది వి అ న. ౧. పాచనము, వంట. ౨ రంధనద్రవ్యము, అగ్ని లేక పక్వము సేయఁ బడినద్రవ్యము.

పాచలుఁడు. సం. వి. అ పుం. ౧ వంటవాఁడు. ౨. అగ్ని. ౩ వాయువు

పాచి. సం. వి. ఈ స్త్రీ. ౖలతావిశేషము.

పాచిక. వి (సం పాశకః) ద్యూతక్రీడ కుపయో గించుసాధనము, అక్షము, జూద మాడెడి అర్ధ సారె.

వ...సభామండపంబునఁ బ వీం డి ప ల క యు సారెలుం బాచికలును నమర్చి.

క. ద్యూతమునకు బలభద్రుని, ప్రీతిసమేతంబు గాఁగ పిలుచుటయుం... హరి. ఉ. ౩. ౨౨౭.

సీ. చేసచ్చినట్టిపాచితల గావున గాల్చి దని వద్ద నుచు శేషుల యత్నములను, గ్రీడింప వారి గెల్చి గెలుపు లన్నియు దక్కి శా దని వాదింప .. దశా. ౮ ౧౩౮.

పాచితము = ప్రాచితము. వి (సం ప్రాయశ్చిత్తము) పాపమును పోఁగొట్టుటకై చేయు కర్మవిశేషము, ప్రాయశ్చిత్తము

సీ బహిఃవద్ధద్విజాన కల్పవృఁశాచితం బిడి పసిఁడి కైశావానిబంతిఁ గుడిచి అను ౬ ౬౯.

గీ ధారుణీవల్లభులకంటెఁ దక్కుచోట, నశ్వమేధంబు నిష్ఫలం బగువిధమున, నర్థవంతంబు గాదు సత్యాకళత్రు, సేవకులఁ బూని సేయుపాచితము కతిము

పాండు ౫ ౪౭

పాచిపుచ్చు. స క్రి. (√ పాయు. స్వార్థమున) పోఁగొట్టు

ద్వి. ఆచార్య గెలిచిన యాబీరమెల్లఁ, బాచి పుచ్చెద నీవు బంట వై నిలువు

ద్వి విరా ౪ ౭౦. పా

పాచు. స క్రి (√ పాయు) ౧ పాయఁజేయు, తొలఁగించు

ఆ. పరుషవిషమభూరి పాషాణభీషణ,గిరులు వచ్చి నన్నుఁ దెరలఁ గప్ప, వజ్రబాణ మేసి వాని నన్నింటిని, బాచి యున్న నన్నుఁ జూచి యపుడు. భార అర. ౧. ౧౯౫.

క. ఆమూపు మరగి చిత్తం, బేచవికిం బోదు పోయుకేని మరలుపను, గోచర మగువెలి చపులం, బాచిన లోచవిన నిలిచి పరమాత్మఁ గనుమ్. భార.శాం. ౪. ౩౦౪. భార. ఆది. ౪. ౨౬౭.

౨. (త. పాయ్చు) చిక్కడలించు. విప్పు.

క. బలరిపుఁ డిచ్చిన కుండలములు సుస్థిరంబుఁ జిత్తమున భక్తిమెయిం, దలఁప నవి వచ్చి చెంద్రుక, లలవడఁగాఁ బాచి ముడిచె సమర దృఢముగన్. భార. విరా. ౪ ౧౬౪.

ఆ. బలియుఁ డపుడు చెంద్రుకలు పాచి ముడిచి గం,టెసఁగఁ దాల్చి నిలిచె...

భార. సభా. ౧ ౨౦౦.

౩. అప్పు తీర్చు.

ఆ .పితృగణంబువలని ఋణంబుఁ బా,చిన మహోపకారిఁ జెలుతవాని.

భార ఆది ౬. ౨౪౮.

౪ నీకడుపునఁ బుట్టినఋణ, మెకరణిం బాతు నొక్క నృసిం ౫ ౮౭

౪ పోఁగొట్టు, నశింపఁజేయు.

గీ కీచకులదెసఁ బుట్టిన కిల్బిషంబు, పాచి నన్ను రక్షించిన పరమధర్మ, రతికి...ప్రణమిల్లి ప్రకుకుదాన భార. విరా ౩ ౩౯

క అలసినెడ దస్సినెడ నాఁ,కలి తృష్ణయు నైన యెడలఁ గడుకొని ధరణీ, తలనాథ పురుషునకు నిమ్ముల భార్యయ పాచుఁ జిత్తమున దుఃఖంబుల్

భార అర. ౨. ౭౪

భార. అను. ౩. ౯౬

పాచు[2]. వి. గుండె లదరుటయం దగు ననుకరణము.

(భార్గవుఁడు) గీ తోఁచుటయు గుండె కడుఁ బాచుపాచు మనఁగ...దిగులుపడి సంక్రి రథుఁడు చింతింపఁ దొడఁగె.

- శం. రా. ౩. ౧౪౦

(‘గుండెలు పీచుపీచుమనుచున్నవి’ అని వాడుక.)

పాచ్యము. సం విణ (అ ఆ. అ) అవశ్యాపచనీయము, తప్పక వండఁ దగినది.

పాజము. సం వి అ. పుం. అన్నము. (వై. ని. వి. వ్. వ. ౧. అన్నము. ౨. బలము. (శే. ని.

పాటు[1]. వి. (క. పాటి) ౧ విధము, రీతి.

క. బలవంతుల బలముఱుఁగా, మలవకమాస్త్రాని పాట మాయాధముని, మ్ముల్ఁ జేసినవా పెట్టగ, కొలఁదిరి యనిడాయ రైరి కొందఱు దానిన్. భార. ఆది ౪ ౧౪౬.

(ఇది ప్రాయికముగా త్రికపూర్వకముగను 'అట్టి, ఇట్టి, ఎట్టి, ఎల్ల, ఒండు' శబ్దపూర్వకముగను, భూతార్థక క్రియాజన్యవిశేషణపూర్వకముగను ప్రయోగములందు గానవచ్చుచున్నది )

సీ ఇపాటఁ బాండువంశజుల వసుమతీరాజ్యార్హు లగుదురు రాజ్యమునకు భార ఆది ౬ ౧౨౪.

మ...ఈ, కిస టిప్పాటఁ దొలంగు పెట్టు లగుదుం గల్యాణ కల్యాత్మ్ముఁడన్ పాండు ౫ ౪౧

క పాపంబు బుద్ధిపూర్వ, వ్యాపారము గాక తొడరినప్పుడు మనుజుం, డేపాటు దాని నంతయుఁ, బాపికొనం జాలు సుజనబాంధవ చెపుమా భార శాం ౩ ౩౪౩.

క చెప్పితిఁ దెలియఁగ నీమతి, యొప్పినక్రియ నాచరింపు మెరులకుఁ గాఁ దప్పొమ్మొప్పించువారు గలరే, యిప్పాట న్నిన్నుఁ గలప నేలా నాకున్ నుద ౨ ౬౪

ద్వి బసవఁడు తారు నప్పాట వర్తింప బస పు ౪ ౯౦౩ పం

౨. స్థలము, ప్రదేశము.

గీ. అడుగవలసిన యర్థంబ యడిగి తీవు, క్రాఁగి యుండెడు శివభక్తి కలియుగమునఁ, బాపకర్ముఁడ గాని యెప్పాట లేఁడు, పుణ్యకర్ముఁడు వికసితాంభోజనయన. భీమ ౫. ౧౫౪.

క. దప్పిగొని నీరమరయుచు, జప్పుడు గాకుండ ధరణిఁ జరణము విడుచుం, దప్పురముగ శోధించెను, నప్పాట వసించుటేవు లటజడి పడఁగన్. బ్రహ్మాండ పురాణము. ౩. ౫౫

౩. సమయము.

గీ పూర్వజన్మకృతం బైన పుణ్యరాశి, పాకదశ నొందు నెప్పు డప్పాటఁ గాని, సకల సంసార దురితనిస్తార మైన, శివకథాగోష్ఠి చెవులకుఁ జెలువు గాదు. భీమ. ౩. ౪౨.

ఉ ..నిన్ను నుపమింపఁ ద్రిలోకములందు రాజకప్పాటను లేరు... విక్ర ౭. ౧౦౪. భీమ. ౫. ౧౭౫.

అట్టిపాట :—

ఆ. అశ్వమేధముఖము లైనరాజార్హయజ్ఞములు సెక్కు సేసి సకలజనులుఁ, బొగడునట్టి పాట నెగడె మహోగ్రుఁడు భార ద్రో. ౨. ౧౯౭.

ఇట్టిపాట :—

ఆ ఇట్టిపాట గాదృపట్టిచే దుశ్శాసనాదు లెల్ల బాధితాత్ము లైరి. భార. ఆది. ౫. ౧౬౬.

ఎల్లపాట :—

క మఱచినఁ దలఁపింపఁగ నగు, నెఱుఁగనిశాఁ డెల్లపాట నెఱిఁగింప నగున్, మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని, కఱటిం దెలుపంగఁ గమలగర్భునివశమే భార ఆది ౪. ౪౧.

?ండుపాట :—

ఉ ..శోభిత మైనయీసభా, లాభము నొందు పాట సఫలత్వముఁ బొందునె కారవేశ్వరా భార. సభా ౧. ౧౨౪.

ఆ బిండుపాటఁ బాండవోన్నతి నేల్పుల, కయిన నసహరింప నలవి గాదు. భార. సభా. ౨. ౧౪౪.

చెందినపాట :—

క. ఎం దుండి వచ్చి తిండుల, కిందుల కేఁగెదు మహామునీశ్వర విద్య, ద్వంద్విత, సామ్రాజ్యం బునఁ, జెందితి ని న్నిష్టఫలముఁ జెందిన పాటన్. భార. ఆది. ౪. ౨౩౧.

పాటు[2]. వి. (సం. పారా.) అగఱుపొంటి. క్రీ. (క.ర)

పాటు౩. వి (తి. పాట్టు) ౧ గానము

సీ. తిరుణాంగుళీధూతి తంత్రీస్వనంబుతో జిలిబిలి
పాట ముద్దులు నటింప మనుచ ౨. ౨౩.

వ...మిక్కుటంబగు నక్కోలాహలంబున జేపా
టియుఁ బాట విన రాక. ఆము. ౪. ౩౫
ఉ. రా. ౭. ౭౪.

౨. పల్లవితోను అనుపల్లవితోను చరణముల
తోను గూడియుండు గేయవిశేషము.

సీ. బొమ్మ పెండిలిపాటఁ బ్రొద్దుపుచ్చు పెలుంగు
నీలకంఠస్తోత్ర నియతిఁ గూర్చు
హర ౪ ౧౧

సీ. ప్రాయంపుఁబడుచులఁ బనిగొంటిపే దూది
యొపెడి పాటలఁ దేపచిమకు లీన
శుక ౨. ౪౨౨

౩. సంగీత ఫణితివిశేషము

గీ. చక్రతిక్రతబోధారణి ఝుంకె సరళి, పాట
సైనిక . . . ప్రబంధ ౧౦౦

పల్లవిపాట = గాయకులు తమప్రావీణ్యమును
బ్రకటించుటకై తాళగతులతో స్వరప్రస్తా
రముచేసి పాడెడు పాట

సీ. ధర్మార్థకామశాస్త్ర ప్రపంచంబులు పల్లవి
పాటగాఁ బరిచయించె విక్ర. ౧ ౧౯౦.

పాటకము. వి. (సం. స్ఫోటకః ప్రా. పోటకం)
స్ఫోటకము.

సీ. పోటక మంచవఁ బాటక మంచన స్ఫోటక
నామ మై పొలుపు గాంచు.
ఆం. భా ౨ ౧౩౦.

పాటకము. సం. విణ. (అ. టి శా. అ.) ఛేద
కము, చీల్చునది. వి. అ. పుం. ౧. పాదగము,
శ్రీపాదభూషావిశేషము ౨. మహాకిష్కువు,
పెద్దకేక, లేక మూర. ౩. వాద్యము. ౪
అక్షాదిచాలనము, పాచికలు పెందలగునవి
వైచుట. ౫. మూలద్రవ్యావచయము, పెండటి
సొమ్ము తఱుగుట ౬. శోధము, దరి, గట్టు,
౭. గ్రామైకదేశము, ఊరియం దొకభాగము.
౮ నీళ్లకేవున గట్టినమెట్లు. ౯. సేనానివేశము.
౧౦. పటాకత్తి (శ. ర) ౧౧. కటకాంత
తము, రాచనగరు వడిమిభాగము. (కో. వి)

పాటకుఁడు. వి. (సం. పాఠకః) పాటకాఁడు.
గాయకుఁడు

సీ. తమకుఁ గల్గిన యట్టితమిఁ జూపి కిన్నరుల్
దండిపాటకులచందమునఁ గొల్వ.
యయా. ౫ ౧౫౫

పాటచ్చరుఁడు. సం వి. అ పుం దొంగ

పాటన. వి ౧ అదరణపాత్రము, అదరణము.
(శ ర.)
౨ అలంకారము (శ. ర.)
౩. సంస్కారము (శ. ర), చక్కఁబఱచుట.
ఉ. పాటన సేయమిం గురులు సైబడి.
మనుచ. ౩. ౫౩.
౪. సొంపు, సౌందర్యము
ద్వి. మాటనఁ బగులు నీపెలఁతచన్దోయి,పాటన
బయలయ్యెఁ బయ్యెద దొలఁగి.
ద్వి. పారిశ్చ. భా. ౧౪౦౩

పాటనము. సం వి. అ న చీల్చుట, ప్రచ్చుట.

పాటపాట. విణ కొంచెముకొంచెము.

గీ...పాటుపాట యనఁ గొద్దిగొద్ది య స్మాట
పెలఁగు. ఆం. భా. ౩. ౭౬.

క అట మున్న పెంగలు బలియుచుఁ, జటిపాట
మని పాటపాట చిమకులు వడిఁ బో,చ్చుట
యాదిగాఁగఁ దనపెని,మిటి దతియునో యని
మూగాత్రి మింగుల వలపుతోఁ
కళా. ౪. ౯౯.

ఉ. పేలి పాటపాట వరపెంద్రుణకోఁ దిల
తండులాన్వయు, శ్రీ నటియింప .
కాశీ. ౬. ౧౫౯.

**పాటపాలము.** వి. చిలుకలు పై రయ్యెడుకోల. (శ. ర.)

**పాటబండి.** వి. (శ. పెట్టెబండి.) కంబళివాహ్యకము, ఎడ్లబండి.

సీ. కంబళివాహ్యకాఖ్యలకుఁ గొల్లార్బండి, పాటబండి వహోయలుబండి యనఁగ

ఆం. భా. ౨. ౨౦౧

గీ. తాను ప్రియసతియును, మేటి గుజ్జులఁ గట్టిన పాటబండి, రొక్క శ్రుంబ మదికిఁ జేగ కెలమి. హరి పూ. ౫ ౧౪౧

సీ. ఆటతిప్పలు ద్రచ్చి పాటబండులు గూల్చి కట్టువ లన్నియు గాలు చేసి.

అచ్చ. రా. యుం ౯౫

**పాటము.** వి. కెంపులు నాణెముచూచుటకుఁ దగిన తెలుఁగు గల కోల.

సీ. ప్రభ పేరు తెలయును పాట మనఁగ.

ఆం. భా. ౨. ౨౩౩. (ప్రాఁతప్రతి పా)

(కెంపులు నాణెము చూచుటకుఁ దగిన రొంత అని శ. ర.)

—విశే. తగినట్టి.

ఉదా:—ఇది కెంపులు నాణెము చూచుటకు పాట మైనకోల కాదు. (బ్రా.)

**పాటము.** సం. వి. అ. పుం. ౧. విరివి, వెడలుపు. ౨. (క్షేత్రగ) లంబరేఖ (విల్యమ్సు.)

**పాటల.** సం. వి. ఆ స్త్రీ. ౧. కలిగొట్టు శ్రీ. ౨. ఎఱ్ఱలొద్దుగ. శ్రీ. ౩. కలిగొట్టుపువ్వు. ౫. దుర్గ.

**పాటలద్రుమము.** సం. వి. అ. పుం. పున్నాగము, పొన్న. శ్రీ.

**పాటలము.** సం. విశే. (అ. ఆ. అ.) తెలుపు మించిన రొంపుగలది, శ్వేతరక్తము. వి. అ. పుం. ౧. తెలుపు మించిన రొంపు. ౨. ఎఱ్ఱవడ్లు.

**పాటలాపుష్పసన్నిభము.** సం వి. అ. న. పద్మకాష్ఠము, ఓషధివిశేషము. (రాజ. ని.)

**పాటలావతి.** సం. వి ఈ స్త్రీ. ౧ దుర్గ. ౨. ఒకానొకనది. (వాచ.)

**పాటలి.** సం వి ఇ. స్త్రీ. పుం కలిగొట్టు. శ్రీ ఈ. స్త్రీ. కటభి, మాచెపటిఁగ. ఇ పుం ముష్కకము, కొక్కుపుఁజెట్టు

**పాటలికుఁడు.** సం. విశే. (అ ఈ. అ) ౧ పరధర్మజ్ఞుఁడు ౨. దేశకాలజ్ఞుఁడు. వి అ పుం. శిష్యుఁడు, విద్యార్థి (విల్యమ్సు) - న - పాటలీపుత్రము (విల్యమ్సు.)

**పాటలిపుత్రము.** సం వి అ న. (పాట్నా) అను నగరము, కుసుమపురము

**పాటలిమము.** సం వి. న. పుం తెలుపుమించిన రొంపు, పాటలవర్ణము.

**పాటవము.** సం వి అ. న ౧. ఆరోగ్యము. ౨. దక్షత, నేర్పు. ౩ శక్తత, ఓపికకలిమి. ౪ తైక్ష్ణ్యము, వాడిమి, చుఱుకుఁదనము

**పాటవికుఁడు.** సం విశే. (అ. ఈ. అ) ౧ దక్షుఁడు, చొరవకాఁడు ౨ ధూర్తుఁడు.

**పాటహిక.** సం వి ఆ స్త్రీ గుంజ, గురిజ.

**పాటి.** వి ౧ ప్రమాణము

(క) కొలత, పరిమాణము.

గీ. నీవు నాకు మూఁ డడుగుల నేల యిచ్చి, తమల చారిత్ర సత్యచయం బెఱుంగ, నేను నా యడుగుల పాటి నిజగత్త్రయమ్ముఁ గొలిచి కైకొంటి నాసామ్ము గాఁగ.

హరి. ఉ. ౧౦. ౨౫౯.

(చ) కొలఁది, మాత్రము.

సీ...ఇది రూపిమాటలు మనపాటి వరింపకేరఁడే యురవికోర. అ. కాలి యకేఁడు...

రాఘవ. ౪. ౪౩.

(ట) (లోతు, ఎత్తు మొ. కాని) పరిమితి, పరిమాణము.

క. కోటయు మిన్నును దమలోఁ, బాటికి జగడింప నడ్డపడి నిల్చిన వ్యాఁచాటులరుచిఁ దారకములు, కూటువ లై కోటకుదలఁ గొమరారుఁ బరిజ్, భాగ ౧౦ పూ ౧౫౯౪ (¹సామ్యము ౪ ౯.)

౨. (సం పాటీ=పరిపాటీ.) రీతి, విధము.

సీ. కాన వసంతంబు భానునిచాడ్పునఁ దగిరొదు పాటితో ధరణి ప్రజల, సుచితవర్తనముల నొందించు నది యిది రాజధర్మములకు రాజా మమ్ము భార శాం. ౨ ౧౪౭

సీ కన్నగాం ద్రగుచు నగళ్లు ప్రవేశించి యందు నెంతటివార లడ్డమైనఁ ఆ జక్కడఁచుచుఁ జేసు గ్రుక్కినపాటిగా. ప్రభా ౧ ౧౦౭

౩. న్యాయము

ద్వి పాటి దప్పితి వయ్య పాపపుణ్యములు, నేటుసేయఁగ లేక నిష్కారణముగ
ది ౪ సా ౩ ౧౦౦ పా. ౧౫ పం.

గీ. మాటిమాటికి వేఁడు నీమాటి యొదలఁ, బాటి దప్పినవార లేపాటివారు.
హంస. ౫ ౨౭౪
పారిశ్చ ౮ ౨౭౧

౮ తగవు, జగడము.

౪ ఆ పదవాలుండును భటుఁ, గోపించుచుఁ గవులఁ బాలకుల కూరుల వా, లోపలఁ గూర్చుండఁగ నిడి, యాపాటి తగంగఁ దీర్పుఁ డని నియమించెన్.
ద్వా. ౪. ౩౦. (ప్రాఁతప్రతి పా.)

౫. ఆచారము, వాడుక.

మీ. పాటిగా నెమ్మెనఁ బసుపు పూయునె కాని యందమా కలపము లలఁదఁ బోదు
దశా. ౮. ౫౭.

౬. శక్తి సామర్థ్యము.

సీ. మానరివాఁడవా మా పాపఁ గొనిపోవ నేపాటి గలవాఁడ వేదివంశ,ము
, భాగ, ౧౦ పూ. ౧౪౬౮.

శా...మతి మద్వ్రతాన్వ యాచారముల్, నీవా పేర్కొను పాటివాఁడవు...
మకుచ ౬. ౮౯.

ఉ. వీని జయించుపాటి రణవీరులు గల్గుదు రమ్మహాముని, కానిభార్యవై యతని సాధు మతిన్ భజియించి తేనియున్
ఉ రా. ౧౧౭

౪ పెంపు, ఔన్నత్యము

ద్వి. కొందల గోతులువోవ మురిసిపడ్డట్టి, పదటి కొండలపిండుపాటి దా నెంత
పండితా. పర్వ. ౩౧౧. పా.

—విశే. (క. పాటి) ౧ విధ మయినది.

(ఇది యీ యర్థమునందు ప్రాయికముగా 'ఆ ఈ, ఏ' శబ్దపూర్వకముగానే ప్రయోగము లందుఁ గానవచ్చుచున్నది )

ఆ. పెదఁగ యిట్టిపాటి వెలివించుటలును మా, యలును నేమిసేయు నస్త్రవిదులఁ, బెక్కు లయ్యు నీబిభీషికల్ మఱువులు, విరియునట్టు లిందు విరియఁ జూచె భార ఆది ౪. ౮౩.

౨ కొలఁదిది, పరిమాణముగలది

క. అన విని యీ పాటిగ మీ,యనుగ్రహము గల్గి యుండ నక్కట యిఁక నేఁ, జనుదేక రేమి యని తన, కనువుగ మారి, నతఁడు నిలుప నంగన రొక్కన్. కళా. ౩.౬౩.

గీ ..కళవళించి, పాపకర్ముఁడైన యీపాటి నేలుఁ, జూడఁజాలక నిస్తంద్ర సుఖవిహార, మునకు విఘ్నంబు గావించె ననుచు వగచి.
వరాహ. ౩. ౧౨౫.

(క) తగుపాటిది, తగిన పరిమాణము గలది.

వ...గంధశలజాతులు ప్రస్గ్రథవాదుల సాం
ధ్యంబు లే కలరు నంధ్రదేశీయులగు గంధ
కారులు పాటిపాటి పద్యంపు ప్రౌఢిక్కి
లతో వెట్టివెట్టి వైవారంబులు గాయకర్త
దులపై వచ్చు రాచవారిపై నాఁడువారిపై
సాకువారిపైఁ జల్లగాఁజల్ల...

ఆము ౪ ౩౫

ఒకపాటి = ౧ సామాన్యుఁడు; సామాన్యము

గీ పుట్టె మహాప్రతములు పెక్కు భువిని దివిని, విడిచిపోయిరి యొకపాటి విబుధమునులు
కాశీ ౬ ౬౭.

క ఒకపాటి పేదసంసారికిఁ దగ దమ్ముద్దుగుమ్మ .. శుక ౧ ౨౫.

౨. ఒకరీతిగనుండునది,వృద్ధిలేనిది

ఉ...వినుకు మొకపాటియై చిల్కల కేమి చేర్పినన్ కళా. ౫ ౪౬.

౩ సామాన్యముగా

క. పవడించె నందుపై మానవపతి మణికటక ఝణఝణత్కారంబుల్, చెవికి నొకపాటి వినఁబడఁ, బ్రవాళహస్తలు నిజాంఘ్రి పద్మము లొత్తఁగా వరాహ. ౪ ౧౫౬
(కొంచెముగా అని తాత్పర్యము)

ఈపాటి = ఇంక, ఈపైని

ద్వి...తలవరులార, ప్రాణంబు లుండ నీపాటి మీరైన,చేకొంచి తలద్రెంపుఁడే నొప్పిలోర్వ
నవ ౨ ౬౬ పా ౨౬ పం

నిడుపాటి = నిడుపైన పరిమాణము గలది

గీ. పాశుపతదివ్యదీక్షఁ జేపట్ట గౌరి, చంచరీకాంగనాగరుచ్ఛాయ చేలు, కుటిలకోమలతర దీర్ఘకుంతలములు, మడమ లంటఁగ నిడుపాటి జడలు గట్టె. హర ౪. ౧౦

కొంచెపాటి = (కొంచెము + పాటి) ౧ అల్పప్రమాణముకలది,

గీ. పటుభ్రుకుటింగడిపిశు తెరవులచి కొంచెపుపాటి నడగని త్రొక్కి యూపాల మెల్లవిడియా నియమించి తిరిగి వేవేల దివ్యటీల తెలుఁగున సంగీతమేల మమర. కవల ౨. ౧౫.

చ. చిటిపాటి మబ్బులు...కొంచెపాటి చినుకుల్ దొరఁగించె ధరాతలంబునన్
శుక ౨ ౩౪౦

౨. లఘువు, తేలిక

సీ తోటివా రని కొంచెపాటిగాఁ జూడక నవతులరొయద మైత్రి నలుపవమ్మ
ముకుంద. ౩. ౩౦౭.

(ఇట 'తోటివారు' అనునది తోడివారు అనుటకు అపరూపము)

పాటివెట్టు = లక్ష్యపెట్టు, లక్ష్యముచేయు; ఆశించు

సీ ఆయుతంబు గల్గిన నాశించు లక్షకు లక్ష గల్గినఁ బదిలక్షలకును, పాటివెట్టుచు నుండుఁ, బదిలక్ష లబ్బినఁ గోటి కావలె నని కోర్కి సేయు రామలిం. ౨౦.

జ: పాటించు, పాటిగొను, పాటిసేయు.

పాటి, సం. వి. ఈ స్త్రీ ౧ అంకగణితము. (గణనాదుల స్పష్టక్రమము.)

౨. కాలావృత్తము ౩ పరిపాటి, అనుక్రమము.

పాటించే1. స క్రి. (√ పాటి) ౧ ప్రమాణముగాఁ గొను, లక్ష్యముగాఁ గొను, ప్రధానముగాఁ జేసికొను

సీ బాహ్యపదార్థముల్ పాటించి నిజవంశ ధర్మముల్ వదలక తగఁ జరింపు.
భార. శాం. ౧. ౫౫

క. మగ లడఁకువ నుండక తమ, తగులము పాటింతురు... భార. విరా. ౨. ౨౭౧.

౨. ఆదరించు.

క. అన్నలఁ దమ్ములఁ గలుగుట, యున్నతిఁ జేయు వృద్ధి నెంతయుఁ జీల్చియునన్, మన్న నయు నీగియునుసంపన్నంబులుగాఁగ వారిఁ బాటించు టురక్. భార శాం. ౨. ౩౫౭. పారి. ౧. ౧౧౯.

శా. పాటించం బతి విన్న నీ వడిగినం బ్రాణంబు వంచిపఁ డీ, వ్వీటం బట్టము గట్ట సీతనయునిన్ జే రాము సుగ్రాటవీ, వాటిం బోయి చతుర్దశాబ్దము లాగిన్ వర్తింప... భా. రా అయో. ౧౩.

క. పుత్రులకలిమిరొ శుద్ధిక, శత్రములను లక్ష్ణంబు లక్షణవతులై, పుత్రవిహీనతఁ బోఁ సినఁ, బాత్రముశే సతులు పతులు పాటిం చుటకున్. ఉ హరి ౨. ౭౧

౩. చూపు, కనఁబఱచు; ప్రకటించు.

క. తగనిపని యని తలంపక, పగగొంటి వటయ్యు లైన పాండుసుతులతోఁ, దగి యుంక నీవు రణమున, మగఁటిమి పాటింపు రిత్తమాటల నగుచే. భార. భీష్మ. ౩. ౧౪౭

శా. ఎంచం బల్లనివాఁడి నై నరములం దిప్పంబు వాటించుచుం, బంచప్రాణము లై పెలం గుడువు మా పద్మాక్షియం దిట్లు బా, ధించం బొచ్చితి విద్యుద... అని. ౩ ౩౩.

మ. .భారతీ, పతి యస్మద్రసనాగ్రరంగమున లాస్యప్రౌఢిఁ బాటించుతవన్. దశా. ౧ ౪. భార. విరా. ౨. ౩.

౪. ధరించు.

మ... పాటింపకే, కపటశ్రీజనరూపమున్ భువన రక్షాకాగరూపేక్షణా. పారి. ౩. ౩౭.

ఆ. పతిప్రవాసవేళఁ బాటించుకొనవు సె, మ్మైన గరగరికలు మెఱుగుబోఁడి. కళా. ౪. ౧౭౯

౫. పూను, అవలంబించు; పొందు.

మ. సకలారాతిభయంకరం బగుచు నుత్సాహంబు పాటించి చే, లక క్రేఁ గయ్యొడు భంగి వచ్చె. భార. ఉద్యో. ౧. ౨౧౭.

ద్వి. పాటించి మణిఘటాపంక్తులచేత, హాటకగిరిఁ గప్పె నపుడు చేమండు. రం. రా. ఉ. ౧౦ పా. ౧౧. పం.

క. పరకాంతపొందుఁ గోరక, పరధనముల మీఁద నాస పాటింపక యెవ్వరితోఁ దగ్గ లాడక, నరకుం డై యుండవలయు సజ్జనుఁ డధిపా. వి. పు. ౪. ౨౨౭.

మ. వికలత్వం బిఁక యేల రైవపనికిన్ విశ్రాంతి పాటింపఁగన్ ఉ. రా ౨. ౨౦౫.

శా. పీట న్నిటగు జోటు కేటివఱదన్ చేమాఱు గ్రీడింపఁ, దశాపటీరాంకసపంకశంఖగత ముక్తాశ్రేణి యవ్యాసనన్, బాటించున్ మృగనాభిపంకయుతభామాంకంబు కంఠాస్థికన్ వసు. ౧. ౧౧౧.

౬. పరిశీలించు.

సీ. కోట యేమఱి చెప్పఁ బాటించి గడ్డియు భాణంబు గొల్చును గట్టియలును, భార శాం ౨. ౨౭౪.

౭. విచారించు, ఆలోచించు

క ..ఈ, సన్నపుఁ దలఁ పుడిగి మసంపన్నమగు నుపాయ మెంకటి పాటింపు తగన్. హరి. పూ. ౧. ౧౨౪.

క. శరణాగత పరిపాలన, పరమవ్రతపరుఁడ వనుచుఁ బాటించి భవచ్చరణములు గన్న శుభతర, చరితు విభీషణుని మఱువఁ జనునె నరేంద్రా. భా. రా. యు. ౧౭౧౯.

గీ. తగవు పాటించి యల్పంబు దండ్రి యిచ్చె. కాశీ. ౨. ౭౨.

౮. ప్రతీక్షించు, నిరీక్షించు.

ఆ. నృపకులాగ్రగణ్య నీవు వాలుండ వైన
నాఁడు వాల వైన నాకరంబుఁ, బట్టినాఁడ
వదియుఁ బాటిసేయవు దీని, కగ్నిసాక్షి
యగుట యరయఁ దగదె
భా. రా. యు. ౨౩౫౦.

ఉ. ఈక్షితి మున్న సత్కవు లనేకులు వాక్కవితా
లతాంగులన్, లక్షలు సంగి యున్కియ
ధుజాతన కావ్యవధూటి వేంకటాధ్యక్షుఁడు
పాటిసేయఁడుగదా యన నేటికి...
రా వి ౧ ౨౫.

పాటీగణితము. సం. వి. అ. న. అంకగణితము. (వావ.)

పాటీరము. సం. వి. అ. పుం. ౧. చందనము. ౨. వెదురుచేవ. ౩. జల్లెడ, తితఉవు. ౪. వరిమడి. ౫. మబ్బు. ౬. తగరము. ౭. ముల్లంగి. ౮. పోవింత. ? (విశ్వ)

పాటీలు. వి. బ. (ఆ. పాట్టిల్.) గ్రామస్థభూపా విశేషము. (శ. ర.)

పాటు¹. వి. (√. పడు. సం. పాత. క, త. పాటు) ౧. పతనము, పడుట.

క. అక్కడ యీ సమరతలం, బెక్కడ నీ యంద
జంబు లెక్కడ నీ ప్రా, పెక్కడ నీ ఘంటా
శ్రయ, మెక్కడ దైవంబు ఘటన రేఁ మన
వచ్చున్. మార్క. ౧ ౫౧.

సీ. తనకు లాగయిన క్షాత్త్రంబు గైకొని పన్ని
పాటిక దాళించి పాటుటెంగి.
ఉ. హరి ౩. ౧౨౦.

సీ. తనయాభ్యుదయకేళిఁ గని పోటు సెలపుచుఁ
బాటు చూపినయట్టి ప్రబలకీర్తి.
రా. వి. ౫. ౮. ఉ. రా. ౩ ౨౪౪.

౨. కష్టము, బాధ; పరిశ్రమము.

ఉ. పాండుతనూభవుల్ పడినపాటులు బంధుల
కెల్లఁ దెల్పుచుం...
భార. ఉద్యో. ౧. ౫౯

క. కలిగె నొకజాంబవతి కృష్ణుల వదలుబడి
చేల వలపు నీతల వేగన్, బులియుకు చే ఘన
కులగలు, పాలఁకులకే పాటు వడకపోరా
దనిరయ్యెన్. ఉ. హరి ౩ ౧౧౫.

శా. పాపాత్ముం డగు దైత్యుచేఁ బడినమీ పా
టంతయుం జెప్పఁగాఁ, గోపం బుక్కటమై
మనంబునకు సంక్షోభంబు ప్రాపించె. .
హరి. ఉ ౪ ౯౩.

ఉ. పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక
నీవు ప్రోవ నిచ్చోట భవన్నఖాంకురము
సోఁకె .
మనుచ. ౨. ౭౦. దశా. ౨. ౨౦౬.

చ. దిటమున రెడ్డి పాటుపడి తెచ్చియిదంగను. .
శుక. ౨. ౩౩౪.

ఉ. .అతండొనర్చు నప్పాటునఁ జెన్నుమీఱెఁ
బరిపాటిగఁ గంజగురక్కడక్కడన్, పాటిక
శక్తి క్రొవ్విరులు మొగ్గలు వగ్గల మర్యో
నర్యోదన్. విప్ర. ౨. ౨౩.

౩. ఆపద, ఇడుము.

సీ. ..విభుండు దండనొందవ్పఁ బూనికేశ
పాటునకులోఁబడఁ జేయమునకొనియది,
కలితకోపమునఁ దక్కకేయము గ్రహించి
యతిరథసమున మిన్నందిపలికె.
హ. వ. ౩. ౨౩.

వ... జక్కవ పెంటి కూటివలపాటు గనుంగొని
వెంచి పొలయులకలు మలచి పలచి వగ
లనిటియుం గాఁగిలించుకొను ముగుదవ్వూఁ
బోఁడులును. నీలా. ౩. ౧౦.

౪. సముద్ర జలోల్బణాకమనము, సముద్రము
పొంగు తీసిపోవుట.

మ...ఒక్కరొక్కొద్దన కాపాడంబురుఘరంబులుప్ప
తిరిఁ బోటుం బాటుగా నెంతయున్.
మనుచ. ౩ ౧౩౬.

(పోటుంబాటుగా = హెచ్చుటయు తగ్గుటయు కలుగునట్లు)

ఉ...పోటును బాటునంచు జనముల్ గణియిం
చును వారిరాశికిన్ దశా. ౧ ౬౦.

సీ. నిను గడుపారఁ గాంచిన వారిరాశికిఁ గడలేని
పాటులు గాంచవలసె. కువల. ౪ ౨౪
(ఇది. ౨ ౪. అర్థముల కుదాహరణము)

౫ చావు, మరణము.

క. మాటలు పెక్కాడితి వీపోటుమగలు వినఁగ
నింకఁ బోవుట దగ దప్పాట నదిగాక
తమ్ముని, పాటును గన్నారఁ గంటి పాలికి
మింకన్. భార. విరా ౫. ౨౯౯

ద్వి. బ్రహ్మతేజంబునఁ బాటేలకల్గు, బ్రహ్మకు
మనుమఁడా పంక్తికంఠునకు, నకైన నీచేత
నగునట్టి మరణ, మెట్లును గీర్తి నాకెల్ల
లోకముల రం. రా ఉ ౯౯ పా ౨పం.

ఉ. వారలపాటుఁ జూచి యనివారిత కోపక
షాయితాత్ముఁడై, వీరవతంసుఁడై నముచి.
దశా. ౨. ౪౩౨.

౬ దురవస్థ, దుస్థితి.

గీ సత్యపరులు దయాఢ్యులు నిత్యదానరతులు
బహుదక్షిణాంచిత క్రతువితాన,పాలకాత్ము
లనర్హంపుఁబాటు వడిరి
భార. స్వర్గ. ౨౪.

సీ. ఓ దండకాటవి నున్న తాపసులార నాపాటు
చెప్పఁడే సాధులార
భా. రా. అర. ౨. ౧౧౫.

సీ...అనయమును బ్రతి. అ. కోటి లేని నాదు
కొమరుని కిప్పాటువలసె నకట యిది

యపార్థ మనుచు,వేఁగ కాని చావు విని
యంత జిష్ణుండు, ఖండితారిపంక్తికంధరుండు.
రాఘవ. ౪. ౧౪౩.

(ఇది 'దురవస్థ, చావు' అను రెండర్థములకు నుదాహరణము)

౭ స్థితి, మంచిస్థితి

గీ తోన యారూఢపాతిత్యదోష మింద,సంత
వించు భవద్బ్రహ్మచర్యమునకు, వైష్ణవో
త్తమసాంగత్యవలనఁ జిక్కె,మొదటిపాటుకు
వచ్చినఁ గొదువలేదు వైజ. ౨ ౨౦

సీ. రాజ్యాంగములయందు రమణ మమత్వంబు
ప్రబలమై పాటునఁ బడఁగనీక,డెందంబు
నెవ్వఁగఁ గొందలపెట్టెడు నకట...
మార్క. ౬. ౨౨.

విణ. ౧ మేలు, శక్యము; అర్హము

గీ పరుల కటు తొంగి చూడను పాటుగాని,
దుర్గమస్థలి నుండెడి తోయజాక్షు, లివ్వ
నంబున కేకితి నెమ్మి మెఱసి,వచ్చినా రవు
సందియం బిచ్చఁ బూని
హంస ౫ ౩౧౬.

గీ భయము దోడ్తోన ముక్కునబంటి యర్యోఁ,
గొరలు జరరాగ్నిఁ గుములుచుఁ గింకరోమి,
అగతోస్మి కృపాసాగర యని యడలితిఁ,
బలలపారణ కరుగంగఁ బాటు గామి
వెం. పంచ ౧ ౧౯౧.

ఉ పాటలగంధి చిత్రమునఁ బాటిలు కోప
భరంబు దీర్ప నెప్పాటను బాటు గామి...
పారి. ౧. ౧౨౦

౨. తుల్యము, సమానము.

సీ. పడఁతిమాడ్కులతోడఁ బాటనవచ్చునే లేఁ
జిగురైన నీ రేఖయహములు, తపతీ, ౨. ౧౭.

జః పాటుపడు. పాటుమానిసి, పొట్లమారి.

పాటు² వి (క పాటు) పరిమాణవిశేషము
ద్వి. ంతకత్రమత్రచారంబు లవియు,పాటెంట
శాకొ్కక భవనంబు గలదు
పండితా పర్వ 3౨౪ పా

పాటునఁబడు అ క్రి కుదురుకొను, యథాస్థితికి వచ్చు
గీ వృద్ధు వచ్చు నపుడు విను బాలు ప్రాణంబు, తెగయఁ జూచు నతని కెదురుజూచి, ప్రణతిఁ జేసె నేనిఁ బాదునఁ బడి యవి, దొంటి యట్ల నిలుచు దురితదూర
భార అను ౪ ౧౦౧

పాటుపడు అ క్రి (పాటు+పడు) శ్రమపడు

పాటుమానిసి వి (√పాటు) పాటుపడు మనుష్యుఁడు (శ ర)

పాటూరము సం వి అ పుం చతుర్దశి

పాటేరు వి ఎక్కి విశేషము
సీ పట్టుజీనువుకొంగ పాటేరు పిచ్చిక పోలుక పిక్కిలి మాల ముచ్చు, ఆదియైన పక్షు లతఁడు దీర్చు హం౦ 3 ౧౨ (శ ర క్రొ త్త్రపతి పా పాటేరు ప్రాంత ప్రతిపా)

పాట్యము ం విణ (అ అ అ) ఛేద్యము, గిల్లఁదగినది పట్టశాకము, ఒక దినుసుకూర శ్రీ

పాట్లని విణ ఖలుఁడు, దుష్టుఁడు
సీ ఖలుండొప్ప పాట్లనియ ఁ కెట్లకొ అ
వివా ఆం భా 3 ౧3

పాట్లమారి విణ (పాటులు+మారి) మిక్కిలి శ్రమపడు స్వభావముగలాఁడు (శ ర)

పార సం వి అ స్త్రీ విద్ధకర్ణి, విసబొద్ది, చిటుబొద్ది శ్రీ

పారకవ్రాతపుత్రకుఁడు వి ఒకానొక బిరుదము

మ. సకలాధీశనతోత్త మాంగ్యమణిభూసారమ్య పాదాంబుజం బౌ,టక నారాయణు భాను వంశన్యపచూడారత్ను సిష్టేష్టబం,ధు కవీంద్ర ద్విజరక్షుం గాన్యపసుగోత్రుం బారకవ్రాత పుత్రకు మారయాపిలి సిద్ధింజెప్పందగు సుదృ ఢ్గండ గోపాలునిని శా ప మ ౫ ౨ ౨౨ ప (౧౧౮౬ కొణిదెన శాసనము)

పారకుఁడు సం విణ (అ రికా అ) ౧ నకవు వాఁడు (తద్విశేషములు—అజప్రఁడు, శాఖా దండుఁడు శ ర) ౨ చదివించువాఁడు, అధ్యాపకుఁడు, ఉపాధ్యాయుఁడు 3 పురా ణాది వాచకుఁడు, జనులకుఁ బురాణములు చదివి వినిపించువాఁడు ౪ ఆచార్యుఁడు, ధర్మ ధ్యాణకుఁడు

పారనము సం వి అ న అధ్యాపనము, చదివించుట

పారనుఁడు సం విణ (అ ఈ అ) పాఠకుఁడు, చదువువాఁడు

పారభువి సం వి ఈ స్త్రీ పారిస్థానము (త్రి ని)

పారమంజరి సం వి ఈ స్త్రీ శారిక, గోరువంక

పారము సం వి అ పుం ౧ పఠనము, చదువుట, వల్లించుట ౨ అధ్యాపనము, చదివించుట

పారశాల సం వి అ స్త్రీ బాలురు చదువుచోటు

పారశాలము సం పారశాల

పారశాలి సం విణ (న్ నీ న్) చదువువాఁడు, విద్యార్థి

పారశాలిని సం వి ఈ స్త్రీ = పారమంజరి

పాఠాంతరము. సం వి అ న పుస్తకమందలి యొక గ్రంథమునకు మాఱుగాఁ గల గ్రంథము, పాఠభేదము

పాఠి. సం విణ. (న్. సీ. న్) ౧ పఠించువాఁడు, పాఠకుఁడు. ౨ ఎఱిఁగినవాఁడు పరిచయముగల వాఁడు

వి న్ పుం చిత్రమూలము ?

పారితము. సం విణ (అ ఆ అ) చదివింపఁబడినది, కఱపఁబడినది

పారీకుటము. సం వి అ పుం చిత్రమూలము ?. (రాజని)

పారీనము. సం వి అ. పుం ౧ సేయిశోఱల చేఁప, కొఱ్ఱు ౨. గుగ్గిలపుఁజెట్టు

పాగీనుఁడు సం విణ (అ ఆ అ) పురాణాది వాచకుఁడు, పాఠకుఁడు

పాఠ్యము. సం విణ (అ ఆ అ) పఠింపఁదగినది

పాడగము. వి (సం పాటకః, ప్రా. పాదక) స్త్రీ పాదభూషా విశేషము, అందెలలో భేదము

గీ పాదాంగదం బొప్పు నందె యనఁగ, బెండె మనఁ బెండియుం బనఁ బెండెగ మన, గాను బెండేగ మనఁగఁ దద్గతవిశేష, మొనఁగుఁ బాడగ మనఁగ బాలేందుమౌళి.

ఆం భా. ౨ ౧౫౦

పాడఱు. విణ (√ పాఱు) పాడువడినది.

సీ వినయహీనతఁ గాపు విచ్చి పోనిచ్చిన నచిరంబ పాఱిడ యగు ధరిత్రి, ధరణి పాడఱైన నరి గోరు మొదలుగాఁ దనకు ఘటిల్లు బాదాయనష్టి

పి శకుం ౪ ౧౬౭ (పారద ముద్రి)

పాడఱు. అ క్రి (పాడు² + అఱు) ౧ ఉచిత స్థితిచెడు, పాడువడు

చ ..సఖా, మఖనయన యుగ్మకంబులును బాడఱు మోములు హైన కారవాం, గనల యలంతఁ గాంచిన పగల్ మిగులుం బగ వారికెనియున్ భార ఆశ్వ, 3 ౧౭౬ భార ఆశ్రమ ౨ ౧౪

చ మహిషాసురుండు దోర్గర్వలమున నాకముం గొనినఁ బాడఱి పోయి ధాత్రి నిష్ఠ మర్త్యుల క్రియ నున్నవారము సురోత్తములార ..

మార్క ౬. ౪౨

చ . మా సవనశాలల మూత్రమురాస్రవుాయవి, ట్పలలము లోలిమైఁ గురిసి పాడఱఁ జేయును యజ్ఞవాటముల్.

భాగ ౧౦ ఉ ౯౩౪.

౨ నశించు.

చ అలఁచివి, పత్త్రపరాగత మహాత్ముల ధైర్యమదంపఁ జూతురీ, యలవియ ..అమ్మవో, ప్రళయము వచ్చినందలఱి పాడఱి క్రాఁగఁగ వారి ధైర్యము న ౦ ౪ ౦౪౦ (వ్రాతప్రతి పా క్రాఁగఁగ రా ని ముద్రి పా )

ఉ ..మునీశ్వర నేఁడును శిదుధీరతల్, పాడఱి పోరుసే భీమ ౨ ౧౧౬

3 శూన్యమగు (పాడువడు. శ ర.)

గీ...రాదు, చిక్కు సేతాల పాడఱు సీమఁ జనుచు అము ౬ ౧3

సీ. విలసితతారకవిభవంబు చెడి కడుఁ బాడఱియున్న నభంబు కరణి

మార్క ౧ ౧౬౭.

పాడి. విణ. ౧. న్యాయము, న్యాయము తప్పనిది; ధర్మయుక్తము (శ ర 'విశేష్యముగా' గ్రహించినది )

చ...నన్ను నధోభువనప్రపాతసం, భ్రమ వివశాత్ముఁ జేసె నది పాడియె యొందును నల్పమయ్యు దర్పము బహుకాల సంచితతపః ఫలహాని నొనర్పకుండునే.

భార. అది. 3. ౨౧౪.

ఆ. ఇట్టు లాడఁ దగునె యిది నీకుఁ బోలు ని,శ్చి | మనంగ కీర్తి నిత్తుమంగు,పాడి గాఁగఁ బూని పలుకంగఁ జెవి యొడ్డి,యాదరించు వారి నందు గాక. భార ఉద్యో ౧ ౨౩.

మ. ప్రతివేళం దగ మర్త్యుఁ డేక్రియఁ జరింపం బాడి యంగీకృత వ్రతుఁడై భీమ ౬ ౩౪ విప్ర ౫ ౧౫.

౨. సదృశము

గీ. పాటి పాటువ తిరబడి సవతు తరము,దీటు సరి పాటి పోటి యుద్ది యనఁ బాడి,యీ దనఁగ సదృశాఖ్యలై యొసఁగుచుండు ఆం భా ౨ ౩౦౨.

—వి (త పాడు) ౧ ధర్మశాస్త్రమందలి వ్యవహారము.

(క) అభియోగము, వివాదము

ఆ. బుద్ధిహీన బాలవృద్ధ కన్యాదుల, కర్థిఁ బూని పాడి యాడ వలయు, నన్నదమ్ముఁ డొండె నాత్మసంభవుఁ డొండె, జనకు డొండెఁ బ్రేష్యజనుఁడు నొండె
విజ్ఞా వ్యవ ౧౧ (సం విజ్ఞా ౧౧౪ పా)

(చ) తీర్పు

గీ. పాడి నోడిన యాతండు పదిట నొకటి,పాడి గెలిచినవాఁ డిరువదిట నొకటి,పాడి దీర్చిన యట్టి భూపతికి దండు,వచ్చు టది ధర్మ మని చెప్పి రాదిమునులు విజ్ఞా వ్యవ ౪౫.

గీ. ఇవ్విధంబున సాక్షుల కెల్లఁ దెలిపి, ప్రాఙ్ము ఖంబుగ నిల్పి యేర్పడఁగ నడిగి,మంచివారలు చెప్పిన మాట యూని,పాడి చెప్పుట నీతి సభాసదులకు. విజ్ఞా వ్యవ ౧౦౭

(ట) వివాదము

క. ఓడి నతఁ డింత యిచ్చును,పాడిన యని పల్కి లేనిఁ బలికిన ధనముం,బాడి ధనం బును దామ,న్నోడినతం డరువవలయు నుచిత స్థితితోన్ విజ్ఞా. వ్యవ ౨౭. (సం. యాజ్ఞ ౧౨౨ పా ౧ శ్లో)

(త) తగవు

ఆ. తండ్రితోడఁ గొడుకు ధరణీశుతో బంటు, పురుషుతోడ భార్య గురునితోడ, శిష్యుఁ డోట లేక చెనసి పైఁ బడి సభఁ, బాడి యాడఁ జనుట పాడి గాదు
విజ్ఞా వ్యవ ౫౩

శా. ఆకర్ణింపుము మత్సమాగమనకార్యం బష్ట దిక్పాలకీ, లోకంబున్ విదళించి వచ్చితివి గల్గుం బాల్గఁ జిక్కంగ న్నాలోకంబుల్ మనుపోలె నుండ మది నాలోకించి మాకీ వృథా,పోకార్పం బని లేదు నావుడు దృంగంభోజంబుల న్నవ్వుచున్
వరాహ ౩ ౬౪

౨. న్యాయము

ఆ. పాడి దప్పకుండఁ బడయు సొమ్ములక్ష్మ న,పాత్రములకు నీగి పాత్రములకుఁ, బెట్ట కునికి యనఁగ పెట్టన రెండువి,ధములఁ గీడు దొదవు ధరణినాథ
భార ఉద్యో. ౨ ౮౩

చ. భరతకులంబు ధర్మమును పాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం, గుణయుఁ గల్గి యుండు ననఁగా నుతి గన్నది...
భార. ఉద్యో ౩. ౨౫౯.

ఉ. దైవముచేత యొ ట్లగునో దాని నెఱుంగ సుయోధనుండు సం,భావనసేసి పాలొసఁగు పాడియ కల్గిన బాల్య మాదిగా,నేవిధ నైనను జెఱుప నింతలు పాపము లాచ రించునే భార. ఉద్యో ౩ ౭౩.

౩. ధర్మము (క ర)

సీ... పార్థుచేసిన సన్న సైగాని గదా సంగరంబు, పాడి దొఱంగి యి ప్పాపకర్ముఁడు సైచెఁ గాక... భార శల్య. ౨. ౩౭౫.

శ్లో॥ కంసదాసస్య దాయాద న తే లజ్జా స్తథేన
పై,అధర్మేణ గదాయుద్ధే య దహం విని
పాతిత సం భార శల్య ౨౧ ౨౮ శ్లో

౪ ఆచారము, పద్ధతి

ఆ. కులముపాడి నడపఁ దలపఁడు పతి పెద,
దలఁచె నేని కొడుకువలచినట్టివాఁడు గాన
యతనివక్రత మాన్పలేఁడింతకంటెఁ గలదె
యొదరు మాకు. భార ఉద్యో. ౩. ౯.

౫. స్వభావము

చ. అరివ యపాయముం బొరయు నప్పుడు
గావక తక్కఁ జేని యా, పతి పతియే తలంప
మగపాడియె లోకముపాడియే
భార ఉద్యో ౩ ౪౧

వ...లోకంబుపాడి విచారించి నాకుం దోడు
గావలయు... భార ఉద్యో ౧ ౬౧

పాడిమానిసి=న్యాయము గలవాఁడు

సీ. అస్త్రగురుండుఁ దత్తనయుండుఁ గృపుండు
రాధాసుతుండు

గీ. పాడిమానిసు లంద్రు నిన్నాలు నోకని,
బోదివిరి భార. స్త్రీ. ౬౨.

పాడివాఁడు=అర్హుఁడు, తగినవాఁడు

గీ. ఆజ్ఞ పెట్టిన గాని రాజ్యంబు సేయ, బహు
ముఖం బైన రాజ్యంబు పదిలపడదు, ఘనులు
పాతాళమున నుండఁ బాడివారు, నిర్జరులు
నాకమున యందు నిల్పువారు.
కాశీ. ౫. ౨౬౬.

పాడిని. సం. వి. ఈ. స్త్రీ. మట్టికుండ. ౨. కాఁగు. (విల్యమ్సు.)

పాడియ=పాడె. వి. శవవాహనము.

క. భూను నుదయాస్తమయములఁ, బీనుఁగుఁ
బాడియను రతులఁ బెనఁగెడు వారిన్,
మానిసుల నగ్నరూపుల, భూచాయక చూడఁ
జనదు పుణ్యాత్ములకున్. వి. పు. ౪. ౨౩౭.

పాడు1. అ. క్రి. (త. పాడు) గానముచేయు, సంగీతముపాడు

సీ. ఇందుబింబానన యొలుఁ గ్రొత్తి పాడిన దాన
వేంద్రులకు గద్గదిక పాదమె
దశా. ౨ ౩౦౧.

వ...మూలస్థాన శేశవదేవర నివేద్యము.
౫ ౨ బీర మద్దలియమండె ఖ. ౪. బీర
మద్దలియకేతె ఖ ౪ పాడిదేమె ఖ. ౪.
(కొ)ండిపాఁడివా (జి) ఖ. ౩...
ద. శా. ౪. ౨౬౬.

స. క్రి ౧ (రాగమును) ఆలాపించు, గానము చేయు.

చ. అలరెఁ బ్రియాళు వొత్తు ప్రియ మాట వసం
తముఁ బాడ నప్పుడ, వ్వేలఁది సపత్ని
భక్తికిని వేల్పులం మెత్తురు గాన రాగమున్,
ఫలమునఁ దన్నుఁ బాడఁగ వసంతుఁడు దా
దయచేసెఁ గాక యా, యతె నిజశక్తి నా
యతుచు నీపసకుం గొదకొట్టె నీమనస్.
ఆము. ౫ ౧౩౩.

సీ. పాట పాడుదు రొక్కచోట మోటులు
పల్లవించి కోయిలలకు విందుసేయ.
ఉ రా. ౧. ౧౬౦.

ల ను గ్రాహి వేడుదము శ్రీధరునిఁ గూడుదము
సద్భటులఁ బాడుదము గీతముల...
భాగ. ౭. ౩౨౪.

౩ కీర్తించు, స్తుతించు.

ఉ. ఆడఁగఁ బోయినప్పు దమరాత్మజుఁ డంబు
జనాభు నవ్యయుం, బాడుద మాదిదేవు
పదపంకజపూజలు సేసి భక్తిమై,పాడుద
మచ్యుతైక శరణాగతులం గని కర్మబంధ
ముల్, వీడుదమంచుఁ బల్కుఁ గదు
విస్మయ మందఁగఁ దోడిబాలకుల్
నృసిం. ౩. ౧౪౯.

క నరసతి గంధర్వయువతుల్, వరుసతో పారిఁ
బాడి రపుడు వసుధాధీశా
భాగ ౧౦స్క ౧౦౭౬
పాండు ౨ ౧౪౨

3 (ధాన్యాదులు కొలుచు నపుడును వేలము లోను బిగ్గఱగా సంఖ్యను) చెప్పు

ఉదా :- కొలగాఁడు ధాన్యము కొలుచునపుడు ఒకటి రెండు మూఁడు అని పాడినాఁడు

వేలములో వాఁడు వస్తువులను మూఁడు రూపాయలకు పాడినాఁడు

పాడు² విణ (క పాళు) ౧ శూన్యము, కాపురములేనిది.

సీ ఈలోక మెల్లఁ బాడెల్లనం బోక నై
యున్నది నీవు లేకునికిఁ జేసి
భాగ ద్రో ౨ ౩౧౪.

చ .ఏమని వివరించు దాన జగమంతియుఁ
బాడయి తోఁచెఁ జాడ్క్రికిన్
ఉ రా. ౬ ౨౩౬

ద్వి భరత శత్రుఘ్నులు బలసి వచ్చెదరు,
పరికింప నీవు నీపాడూరి నుండు
రం రా అయో ౧౧౨ పా ౬ పం
మల్లభూ ౯ ౪౬

౨. పాతికము, దుష్టము.

ఉ. పాడయినట్టి చిత్త మొకపాటుఁ నిల్పఁగ
మాటిమాటి కప్డాడుచు నుండగా
పాగ ౨. ౬౩

క. పాడైన నియతి యత్నము, వీడం ద్రోయంగ
వశము వేధకు నైనన్.
సుద ౩. ౧౨౩

3. నిష్ఫలము, పనికిమాలినది.

క. ఇక్కడ నిను వీఁ డెవ్వఁడో, యిక్కరణిన్
బొసపుచ్చి యేలుకొనంగా, నిక్కట వల
వనిశంకల, నక్కడ నే పాడుకాపు లాగతి
నుంటిన్. కళా. ౩ ౨౬౦.

సీ రసికులు విూ గానరస మాన వచ్చిరి పాడకే
శివభక్తి పాడుగాను కాళ ౪ ౩౫

పాడుబావి = ఉపయోగములేని నుయ్యి, గడ్డిమొలచిన నుయ్యి

మత్తకోకిల పాడుబావులు నుప్పకాల్వలు బండలావులు బందరాళ్లు దయ్యము లాడి
సెత్తురు లాను వృశ్చిక మేటులున్...
సానందో ౨ ౨౩ పా

(ఇట్లే పాడునుయ్యి, పాడుచెఱువు మొ)

పాడునొసలు = అలంకారములేని ఫాలభాగము
శుక ౨. ౪౨౬

(ఇట్లే పాడుమంగిము)

—వి ౩ా (త పాటు) బ. పాడులు, పాళులు, పాళ్లు) ౧ గ్రామము నశించిన ప్రదేశము

చ చిగిరింత గింటగిమి రాతిలు గప్పిన పూడు
పాఁతేలుల్, గల దొుక యూరి పాడు బొడ
గట్టినఁ జేరఁగఁ బోయి యక్కడన్,
శేం పంచ ౧ ౪౬౪

గీ పుట్టలను దిట్టలను గట్టఁ బొల్లు గట్లు, వంకలను డొంకలను బీళ్లఁ బాళ్ల తాళ్లఁ, గుప్పలను గిప్పలను మళ్ల గుళ్ల మాళ్లఁ, దిరిగి యాహారమందక సొరిగి యరిగె
హంస ౧ ౧౯౯

౨ అప్రహతి ప్రదేశము, దున్ననిభూమి

సీ పాడు సాఁగిను దసరు నప్ర, హతి విశేషము .
ఆం. భా ౨ ౪

గీ గుడును పెనుచట్టు రాకొట్టకొనలు దొనలుఁ గోనలును కాసలును తళుక్కు గులుక్కు చిలుక్కు, ముత్తిముల్ సెత్తియుల్ గొప్ప ముదురు
పెదురు, జోళ్లు పాళ్లను మే ముండు వీళ్లు
రాజు. చంద్రా. ౨. ౪౫.

ద్వి. పోవంగ రాముఁడు పుణ్యశీలుండు, లీల
నున్నది. యూటు లేనిది పాడు.
రం. రా అయో. ౧౧౨. పా. ౪. పం.

౩. నివసించుట కేర్పఱచుకొనిన స్థలము. (చూ. పల్లెరుదుడిచిపాడెక్కు.)
పోడుకొట్టి పాడుకట్టిరారుజుప్పలతో నిండి యున్న చిట్టడవి నతికి పల్లెను నిర్మించుకొని కాపురముండిరి, ఆదిమనివాసులయిరి
పాడూరిసంతఱనిరుపయోగమైనది.
గీ చేసిఖపుగట్టిజంత పాడూరిసంత, చలము సాధించు దిట్ట కోసాలపుట్ట,లోకముల కెల్ల నూచి యల్లుం(డబూచి,యొంచఁగల యుచ్చ మల్లి యయ్యింతి తల్లి ఉక. ౩ ౧౭
జ' పాడఱు, పాడువడు, పాడువఱుచు, పాడు వాఱు, పాదట్టు, పాదట్టుపురుగు, పాడు(ట్టు, పాదొట్టుపురువు.

పాడుపాతరమాళ్ళు. వి బ. బాల(క్రీడా విశే షము
సీ పాడుపాతరమాళ్లు పాతరల్ బంతులు చిమ్మన (గోవులు చిఱ్ఱుబుఱ్ఱులు హంస ౩ ౧౪౬.

పాడువ(ప)డు. అ (క్రి (పాడు² + పడు) శూన్యమగు, పాడగు; నశించు
సీ. తిరు (ప్రామినుకుటొదలబాట సరిమాయ భాస్కరమధ్యంబు పాడువడఁగ చంద్రా. ౧ ౧౭.
లయ(గాహి వీఁడు కెడు(త్రోవ దయతోడ వెలిఁగించు ఘనుఁడోడక నురాలయము పాడువడ దింకన్ భాగ ౬ ౩౨౪.

పాడువఱచు. స (క్రి (√ పాడువడు) పాడు వడునట్లుచేయు
క. మృదమందిరోత్సవంబులు, నడకుండం బాడు వఱచి నగచాపుని పెన్నుడిరాళ్ళు వెతికి యిండ్లం, గడపలఁ బొగఁగింపఁ దలఁచు కొప్పఁడు వీఁడే. పానందో ౪. ౪౩.

పాడువాఱు. అ (క్రి. (²+వాఱు) పాడుపడు, శూన్యమగు.
అ అవనితనయ కేని యాకాసమంతయుఁ, బాడువాఱి యుండ పార్థివుండు భా. రా ౭౪. ౨ ౨౫౫
ద్వి పాడువాఱినయట్టి పట్టనవీధి,నాడాడ నిలు చుచు...రం రా ఆయో ౧౩౦ పా ౯ పం ((శ్రీ త్రి(ప్రతి పా) బస. పు ౪. ౩౭౬ పం
వ కోలాహలమయంబులగు చ్చోట్లను వెడి తూలి యడఁగి మడఁగి (మగ్గి మడిసి యులివు లడఁగి పాడువాఱు (ప్రదేశంబులును.. హరి ఉ. ౧౦ ౯౦

పాడె=పాడియ, పాడెగట్టు. వి శవ వాహ నము
ఉ తలదిక్కుగవలుఁ బాదం, బులదెస ధృత రాష్ట్రి పొందు భూపా(గతనూ, జాలుఁబట్టి యధికవిభవో,జ్వల మగు పాడెపయి నిడిరి శవరత్నంబున్ భార ఆను. ౫ ౪౩౨
గి అడరు శవయానముగఁ బాడె బడయ యనఁగ అం భా ౨ ౨౭౫ భార మాస ౧౪౬

పాడెగట్టు=పాడె వి. శవవాహనము
విశ. ఒకానొకతిట్టు (మూర్ఖుఁడు, అమాయ కుఁడు. (గ్రా.)
సీ బడిమి కూళ్లకు మిత్తి పడిసె రొంగిలికాయ బడుపుగూ డెనగొట్టు పాడెగట్టు. హంస. ౫. ౧౧౩

పాద్యమి. వి (సం. (ప్రథమా. (ప్రా. పాడివయా. పాడివ ఆ క. పాడియ తత్సమమని యొక నిఘంటుకారుఁడనెనని శ ర) (ప్రతిపత్తు, పక్ష ములో మొదటి తిథి.
సీ పాద్యమిఁ బిత్ర్యయజ్ఞపరుఁ డైనఁ జారు కాంతాపతి విదియఁ గాంతలకుఁ దండ్రి. భార. అను. ౩. ౧౨౧.

గీ పంచపర్వంబులందును శాద్యములను, జన్మ దినముల వ్యతిపాతివష్ఠినవమి, శ్రాద్ధకాలంబులను వ్రతచర్యలందు, దంతకాష్ఠంబు కొఱుకుట తగవు గాదు విజ్ఞా అచా ౪౫ (౧౦౭-౦. శ్రీ. ౮౮౦)

**పాణము.** సం. వి అ పుం ౧ వ్యవహారము, వాణిజ్యము ౨. పణనము, పందెము, పందెపు సొమ్ము ౩ జూదము ౪ సమయము, ఒడంబడిక ౫. స్తోత్రము ౬. పాణి, చేయి

**పాణసి.** వి (క పాణస్) మాలజాతి, మాలజాతిది

క పాణసివారము కమ్మని, ప్రాణముసెఱ బాణ దేవరా దినవలదా శివ రా ౩ ౫౭

ఉ క్షోణితలేశ నా యనుఁగుఁగూతుల వర్ణిన సేయ నొప్ప న,ప్పాణసి పువ్వుఁబోఁడులను బల్లవపాణులఁజా జారుసైకత, శ్రోణులఁ గీరవాణుల మరున్మణివేణుల సర్వలోకకల్యాణుల నీకు నిచ్చెదఁ బ్రియంబున వారిఁ బరిగ్రహింపుమా పారిశ్చ ౨ ౧౮౪

కవిరా. సరసిజలోచన యొక్క మహాముని శాపవశంబునఁ బాణచిపై ధర జనియించిన దానవు శివరా ౩ ౬౪ (పాణచి,ముద్రి)

**పాణి.** వి. (సం పానీయమ్ ప్ర. పాణి అ హిం పానీ. త పాణి=నీరు) — ముత్తైపు — నీరు (చూ. అణి)

గీ ..చందనమునఁ బరిణయాగార మలంకంగఁ బాణి యాణి,గలుగు ముత్తియముల ముగ్గుగా నొనర్పఁ, జతురపుణ్యాంగనా జనతతిఁ బొనర్చి శార విరా. ౫ ౩౭౬

ఉ. ఇందునిభాస్య యూర్తు గదియించెఁ గుమారుని పేరురంబునన్, గందకయాణి పాణియును గల్గిన తోరపుఁ దారహారముల్ సైవ. ౬. ౫౫.

**పాణి.** సం వి ఇ పుం ౧ మణికట్టు మొదలు కొని వ్రేళ్లతోఁ గూడిన చేయి ౨. కులిక వృక్షము (వాచ)—స్త్రీ ౧ అంగడివీధి, బజారు ౨ పదునారు మాషముల పరిమాణము (వై ని)

**పాణింధమము.** సం విణ. (అ ఆ అ) ౧ చేతులతో తాళము వైచునది ౨. చీఁకటి గలది వి అ పుం ౧. కొలిమితిత్తి ౨ చీఁకఁటి. ౩. వాద్యవిశేషము (శ ర)

**పాణింధయము.** సం=పాణింధమము.

**పాణికచ్ఛపిక.** సం వి ఆ స్త్రీ కూర్మముద్ర

**పాణికము.** సం. విణ. (అ ఈ అ) పందెమొడ్డి యాడుటచే పొందఁబడినది వి అ పుం ఎనుబది గవ్వల పరిమాణము, పణము

**పాణికర్ముఁడు.** సం వి న్ పుం శివుఁడు —విణ (చేతులలో మద్దెలము) వాయించువాఁడు.

**పాణికుఁడు.** సం వి అ పుం వర్తకుఁడు

**పాణిగృహీతి.** సం వి. ఈ స్త్రీ అగ్నిసాక్షిగా పెండ్లాడిన పెండ్లాము, భార్య.

**పాణిగ(గ్రా)హము.** సం వి. అ. పుం వివాహము, పెండ్లి.

**పాణిగ్రహణము** సం. వి అ న = పాణిగ్రహము

**పాణిగ్రహీత.** సం. వి. ఋ. పుం. పెండ్లికొడుకు, మగఁడు.

**పాణిగ్రాహుఁడు.** సం. వి అ పుం=పాణిగ్రహీత

**పాణిఘాతము.** సం వి అ పుం. చేతిపెట్టు, చపేటము. ౨. గ్రుద్దులాట, ముష్టియుద్ధము.

**పాణిఘుఁడు.** సం. వి. అ పుం ౧. చేతులతో తాళము వేయువాఁడు. ౨ చేతిపనులు చేయువాఁడు

**పారావతాంఘ్రిపిచ్ఛము.** సం వి అ పుం ఒకదినుసు పావురాయి (ఆ ని)

**పారావారము.** సం వి అ న ఈవలియావలి దరులు పుం సముద్రము.

**పారావరము.** అని కొన్ని ప్రయోగములందు కన్పడుచున్నది. కాని యీ రూపము చింత్యము )

ఉ.. పా, రావరదుగ్ధవాఃకణసుగంధరబంధుర మంగళానిల, శ్రీశైలయాత్రా ౧౦౪

మ పవనుండుగ్ గరుడుండు దుగ్ధసాగర బాగావరీలంఘన, ప్రవణప్రక్రియలు నవీనా ౩ ౧౩౦

**పారాశరి.** సం వి ఇ పుం ౧ శుకుడు ౨ వ్యాసుడు ౯ పుం సన్యాసి

**పారాశరుడు** సం వి అ పుం పరాశరుని కొడుకు—వ్యాసుడు

**పారాశర్యుడు** పుం =పారాశరుడు

**పారి[1]**=పగి. వి ౩ఔప, ప్యాయము

క ఎవిని పవపా విగన్, మనుజునకు గాజ ఆయుమఖసిద్ధియ చే, సెను హం ఉ ౧౦. ౨౯౯

ఉ మా తనను ల్య శిక్షా, మీరి పు ష్కరం డి తివి స్మగళు మ్మదనాశ సిగిణిం, గాదుకొనంగ కేళి యొక పారియ మీఱెను ఋష్యదూపులన్ గంధ ౧౪౫

సీ ఈపారిజాతంబు లేపారవి కొంత యీపారి చూతమే యిందువదన. గా వి ౩ ౧౪

**పారి[2]**=ప్రహరి.

సీ. చుట్టుగంపరయోకాని పెట్టగా వెలుతురు ప క్షైన కోటలు పారిమగలు. చంద్రా ౧ ౫౦

(శ. ర పా పాటిమగలు. మ ద్రి. పా) శుక ౨ ౧౪౫.

సీ అచ్చమై వాకిట గచ్చుతాయి మెఱుంగుపంచ తిన్నెలు గొప్పపారిగోడ శుక ౨ ౪౦౮

జ: పారికాపు, పారితిరుగు, పారిగాగు, పారి వెలుగు

**పారి.** సం వి ఇ ఈ స్త్రీ ౧ స్వర్ణిగుణము, అంకుశగజ్జావు (వై. ని) ౨ ఏనుగుకాలిసంకెల. ౩ గళంతిక, గిండి ౪ పాలుపిదుకుపాత్రము, ౫ ఉదకుంత ౬ గిరి ప్రబ్బ శ్రీ (శ ర) ౬ పూగ ౭ గం (కై ని)—౯ పుం ౧ చిత్రమూలము ౨ జలమార్గా, నీటి పిల్లి

**పారిందుడు.** సం వి (అ ఆ అ) గాఢ కుడు

**పారింద్రము.** వి అ పుం సింహము.

**పారికాంక్షి.** సం వి ౯ పుం. తాపసుడు, తిబిసి

**పారికాపు**=పారివాడు. వి (√పారి[2] త పారి కాపు) ౧ ప్రహరికాగువాడు

గీ నిర్జరాపగ యీకొండనిర్ఘంబు, పద్మబా ధవుడు కొం పారికాపు విక్ర ౨ ౧౫

౨ పరచగుడు

సీ పారికాపులతోడ బలగడెంబులు వచ్చి యున్నవాగలని నో ంచి వి ౨ ౭ ౬౫

**పారిక్షితుడు.** సం వి అ ౹ ౧ —పరిక్షిత్తు కొడుకు—జనమేజయుడు

**పారిజేము**=వారిజము. వి పారిభద్రము, పారి జాతము శ్రీ. ('వృక్షవిశేషము, కొండబూరుగు' అనికొందఱు. శ ర.)

సీ వారిజ మంచవ బారిజ మంచవ శారి భద్రాఖ్యమై మీఱు...ఆం. భా. ౨. ౪౩.

పారిజాతము ం వి అ ప్రం ౧ దేవతావృక్ష భేదము ౨ పారిభద్రము ౹ ౩ ఒక ధాన్య విశేషము (శ ర)

పారిణాహ్యము నం వి అ న గృహోప కరణములు (శయ్యాసనాది)

పారిణి ం వి ఈ స్త్రీ ఎచ్చయిరుగుడు ౹

పారితథ్య ం వి అ స్త్రీ ౧ జడబిల్ల ౨ సిగపువ్వు (శ గ) ౩ పాపటయందుఁ బెట్టుకొను బంగారులోనగువానిబిల్ల (వాచ)

పారితిరుగు అ క్రి (పారి2 + తిరుగు) ప్రహరి తిరుగు కో చుట్టుగా తిరుగు

క్రూరాత్ములైన రాక్షసు లేరూపముతోడనైన నేతెంతు రోగిక పారితిరుగంగ నే గది, మారుత ఎగిలు దవగ చు మఱువకు మెందుక్ మైరా ౭ ౩౩

పారితోషికము నం వి౦ (అ ఈ అ) సంతో షముకొఱకు నియ్యబడునది వి అ న బహు దనము

పారిపంథికుఁడు నం విణ (అ ఈ అ) పథ మును వర్జించికాని దానియందు వ్యాపించి కాని యుండువాఁడు వి అ ప్రం దారి నడ్డగించి కొట్టుదొంగ

పారిపార్శ్వకుఁడు నం విణ (అ ఈ అ)— పార్శ్వమునఁ గొలిచి యుండు సేవకాది వి అ ప్రం (నాట్య) స్థాపకునియొక్క అను చరుఁ డగునటుఁడు

పారిప్లవము నం విణ (అ ఈ అ) ౧ చంచ లము, కదలునది ౨ ఆకులము, కలఁగినది వి అ న చాంచల్యము, కలఁత

పారిప్లవ్యము నం వి అ ప్రం ౧ హంస (విల్యమ్సు) ౨ చాంచల్యము, కదలిక ౩ కలఁత

పారిభద్రము నం వి అ ప్రం ౧ పారిజము, పారిజాతము ౹ ౨ దేవదారువు ౹ ౩ సర ళము ౹ ౪ కాల్మలిద్వీపవర్ష భేదము ౫ చెంగలకోష్టు ౬ దాడిదము ౹

పారిభావ్యము నం వి అ న ౧ చెంగల్వ కోష్టు ౨ పూఁటపడుట, ప్రతిభూభవనము

పారిభాషికము నం విణ (అ ఈ అ) పరి భాషవలన ప్రాప్తించినది

వి అ ప్రం పరిభాషతో గూడిన శబ్దము ఈ స్త్రీ పరిభాష ంజ్ఞ

పారిమాండల్యము అ ౧ రి మండల ౨ (న్యాయ) పరమాణు విశేషము

పారిముఖికము న వి (అ ఈ అ) ముఖ సమీపమందు వర్తించునది

పారిముఖ్యము వి అ న ముఖ సమీ పమందు వర్తించుట సాన్నిధ్యము

పారియాత్రము నం వి అ ప్రం ఒక కుల పర్వతము

పారియాత్రికము నం వి అ ప్రం పారియాత్ర పర్వతము

పారిరక్షకుఁడు నం వి అ ప్రం భిక్షుకుఁడు

పారివ(బ)ర్హము నం వి అ ప్రం పెండ్లి కట్నము, పెండ్లికానుక (ఆ ని)

పారివాఁడు = పారికాఁపు వి ($\sqrt{}$పారి2)

౧ ప్రహరికాఁచువాఁడు

చ పతి వింతగుడారపుపారివారిగంటల రొద కల్కి లేవ కువల ౨ ౧౧౦

౨ పరిచరుఁడు

సీ పారివాఁ డనఁగను బరిచరుం డొప్పను ఆం భా ౨ ౨౦౪

**పారుపట్లు.** వి బ బాలికాక్రీడా విశేషము

సీ. గుజ్జెనగూడులు గోలుగోలన్నలు గీరనగింజలు
పారుపట్లు — హంస. ౫ ౧౫౫

**పారుపత్తెగాఁడు.** విణ (√ పారుపత్తెము. త పారిపత్త్యకార్ + కన్) ౧ ఆయవ్యయాదులపై నధికారి (దొరతనమువారి కీయవలసిన ధనము జనులవలన రాఁబట్టెడి యధికారి శ ర)

క. కరణమును గ్రామరెడ్డిని, గ్రామం బిగుపారు
పత్తెగానిఁ దలారిన్, లెక్కిగ్గైనవేళ నీ సలుఁ,
గురతోఁ బొలివోని తులఁ గూడి సుఖించున్
— హంస ౩ ౭౯

౨. సేవకుఁడు.

గీ. అంత రక్కసిరొజ్జ తా నానతిచ్చి, పంప
వృషపర్వుఁ డప్పుడు సొంపు మెఱయఁ,
బలు తెఱంగులఁ దనపారుపత్తెకాండ్రఁ,
జెలువు మీఱంగ నడు గైసేయఁ బనుప
— యయా ౪ ౩౭.

**పారుపత్తెము = పార్పత్తెము.** వి (సం. పారిపత్త్య, త పారుపత్తియం) ౧ ఆయవ్యయాదులపై అధికారము, అధికారము

క... ఎంతయు, వా కలిగినశిష్యుఁ డనుచు వనుఁ
డనుమునికన్ గైకొలిపి పారుపత్తెం,బ కణ్వుం
డిచ్చె నూళ్ళు కన్నిటి కలమిన్.
— శేష ౪ ౧౬౦.

౨. ఏపాటియదియుఁ గాక వృథాపీడల వీరిఁ
బఱచెదర పోరాదా, నీపారుపత్తె మిచటం,
జూపకుము — పరమ ౩ ౨౨౬

ఉ. ఈవిధిఁ గానుపించి నిముశేంద్రుని కీటను
నాడుగెన్నైకై, నీ వొకపారుపత్తెమును
సేర్పనఁ జేయఁగఁబోకు మిమ్ముఁహీ, దేవ
వరేణ్యకోరికలం దీర్చుట కిచ్చినవాఁడ
నేను. — ఐ. మ. ౩. ౩౦౦.

సీ. పాపాత్మునకుఁ బారుపత్తె మియ్యఁగరాదు
చాలనిపనికిఁ గాల్చాఁచరాదు — రామలిం.
౫౧. చంద్రా ౧ ౧౪

౨ రోగక్షేమము.

క. ముల్లోకముపారుపత్తెము విచారింపన్
— వరాహ ౧౧. ౬.

సీ. బ్రహ్మాండకోటుల పారుపత్తెములెల్లఁగని
యున్కి నిద్దంపు మనసుతోడ పాండు ౧
౩ వైజ ౪ ౧౩౪.

జ. పారుపత్తెగాఁడు

**పారువ**[1]. వి గుఱుతు, ఆనవాలు (జాడ అని శ. ర)

సీ. కలికి జక్కవలు నీవలిగుబ్బలకు నుబ్బి పఱ
తెంచెఁ బారువ పట్టికేము
— ఉ రా ౬ ౬౩

జ పారువఁజూచు

**పారువ(వా)**[2]. వి పారువము, పావురము

సీ. కివకివఁ బారువక్రియఁ బల్కు పల్కంగ నల
కళాదేశంబు లంటి యంటి. విప్ర. ౩ ౯౦.

చ పలువగి పారువాపటకు పల్కఁగ వచ్చునో
కుల్కువచ్చునో — శుక ౧ ౪౩౯.

వ... నీలంపు దూలంపు సొంపులఁ బెంపొనరు
సున్నంపుగోడల జాడల మెలంగుపారువా
వారువాసారు వాటిల్లుసోరణగండ్లకెమ్మ
లం... — ఇందు ౧ ౧౭.

**పారువంపుగందులు.** వి బ వస్త్రవిశేషము.

వ పారువంపుగందులును తోఁపులును శ్రీరామ
తోఁపులును — ద్వా ౩. ౨౦౬.

**పారువఁజూచు.** స క్రి (√ పారువ[1]) చక్కఁజూచు

గీ చనుచు బారువఁజూచె నాఁ జక్కఁగాను,
జూచు చనుటకు... — ఆం. భా. ౩. ౧౩౭.

పారువము = పారువ, పార్వ, పావురము, పావురాయి వి పారావతము, పావురము.

శా ఉ, డ్డీనం బర్యొ్య నదుంప్రజంబు పరిపాటిం బారువాలోయనక్ సైవ. రా రా
లయగ్రాహి దూర మెగ బాఱుచు జోకార మయి యన్నలవ, పారువముచందము చ బారువము మించెన్ సారంగ ౧ ౧౭౧
సీ పారావతం బగుం బావురాయి యనంగి బారువ మనఁగను బావు మ
ఆం భా ౨ ౮౯

పారువు సం వి ఉ పు ౧ గ్ని క ౨ అగ్ని

పారుషుడు సం వి అ పుం బృహ ౨త

పా రుష్వేటు
పారుష్యము సం వి అ న —పరుషభావము— ౧ పరుసందనము, మెత్తదనములేమి క్రూరత్వము దయలేమి 3 నిష్ఠురత్వము ౪ దుర్వాక్యము, పరు నిమాట ౫ ఇంద్రుని వనము ౬ అగలుచందనము.

పారుష్యుడు వి అ పుం బృహస్పతి (వే ని విల్సన్)

పారేవతము సం వి అ పుం ఈతిచెట్టు

పార్ష్ఫటము సం అ న పాంసువు దుమ్ము

పార్థక్యము సం వి అ పృథగ్భావము చేర్పాటు

పార్థము సం వి అ పుం అర్జునము తెల మద్ది ?

ఉదా.—పార్థారిష్టము వెం

పార్థవము సం వి అ న పృథుత్వము, గొప్ప తనము

పార్థసారథి సం వి ఇ పు కృష్ణుడు

పార్థివము సం విణ (అ ఈ అ) పృథివీ వికారమైనది, పుట్టినది ౨ పృథివీభవము, భూమి యందు గలుగునది, భూసంబంధి 3 పృథివి యందు విదితము. వి అ పుం మృత్పాత్రము (త్రి ని) ఒక సంవత్సరము న తగర పుష్పము

పార్థివి సం వి ఈ స్త్రీ ౧ కుశాక్షి, తక క్షీరము ౨ సీత 3 లక్ష్మి

పార్థివుడు సం వి అ పుం రాజు

పార్థుడు ౦ ౧ అ పుం పాండవుఁడు యుధిష్ఠిరా అర్జునుడు ౭ రాజు

పార్శ్వత్రము=పారువ త్రము (శ ర)

పార్వరము ౦ వి అ పుం ౧ అన్నపా కి ఇము, మెదుకు ౨ క్షయరోగము 3 కిదం కేసరము, కిడిమి, పూవుటకరువు ౪ భస్మము బూడిద (వేని)

పార్వరుడు ౦ వి అ పుం యముఁడు వి (అ ఆ అ) వృద్ధుఁడు

పార్యాప్తికము సం విణ (అ ఈ అ) సంపూ ర్ణము, పర్యాప్తము వి అ పుం మృగభేదము

పార్వణము ౦ విణ (అ ఈ అ) ౧ పర్వ సంబంధి ౨ పర్వమందు విహితమైనది (శ్రద్ధాది), పర్వమునందు గలుగునది వి అ పు మృగవిశేషము

పార్వతము సం విణ (అ ఈ అ) పర్వతి మందు పుట్టినది, పర్వతమం దుండినది వి అ పుం నింబము, వేము ?

పార్వతి సం వి అ స్త్రీ ౧ గౌరి ౨ ద్రౌపది 3 జీవంతి, పాలతూర ? ౪ పల్లకి, అందుగు ? ౫ క్షుద్రపాషాణభేదకము ధాతకి, ఆరె ? ౭ సౌరాష్ట్రమృత్తిక ౮ అన్నము. కీగిగము

**పార్షదుఁడు.** సం వి అ పుం పారిషదుఁడు, సహోదరుఁడు. ౨. దేవతలయొక్క పరిజనము. 3. సభాసదుఁడు, సభ్యుఁడు

**పార్షద్యుఁడు.** సం వి అ పుం పారిషదుఁడు, సభ్యుఁడు (వాచ)

**పార్షీ.** (సం పారశీకః, పారసీకః.) ఒక దేశము; ఆదేశభాష

సీ మీఁగాళ్లపైఁ గ్రిందు బాగైనదోవతుల్ తెఱ తఱం పైన పార్షీ మెయిపాగ్లు హేలు ౫౯

**పార్ష్ణి.** సం వి ఇ పుం స్త్రీ కాలిమడమ, గుల్ఫమునకుఁ గ్రిందిభాగము దండువెనుక, సైన్య పృష్ఠము (మే. ని) పుం జిగీష, జయింపనిచ్ఛ. వి ఇ. స్త్రీ వేదు కౌత్తినయాఁడుది, ఉ శ్రుతి స్త్రీ ౨. కుంతి

**పార్ష్ణిగ్రహణము.** సం వి అ న శత్రువును పృష్ఠభాగమునఁ దాఁకుట

**పార్ష్ణిగ్రాహుఁడు.** సం విణ (అ ఈ అ) అనుసరించువాఁడు

**పార్ష్ణిగ్రాహుఁడు.** సం వి. అ పుం ౧ దండెత్తి పోవురాజునకు వెనుకదిక్కు నందుశత్రువు ౨ దండువెనుకభాగమునకు దళవాయి

**పార్ష్ణిఘాతము.** సం వి అ పుం తాఁపు, తన్ను

**పార్ష్ణిత్ర.** సం. వి ఆ స్త్రీ అడుకాలు మీఁగాలు మడమలను మూసికొనియుండు కుచ్చెం.

**పార్ష్ణిత్రము.** సం వి అ న. వెనుకనుండు కావలి దండునకు వెనుకనున్నదండు, ముందటనుండి రక్షించెడి సేన

**పార్ష్ణివాహుఁడు.** సం వి అ పుం. వెనుకనుండి కార్యము నిర్వహించువాఁడు. (వాచ.)

**పాఱ.** వి (త పా. ఱ) అపసారణము, (భూమిని త్రవ్వెడు సాధనవిశేషము. (ఖనిత్రి అని శ. ర)

సీ పాఱ వాఁగను నపసారణంబునకుఁ బేరు
ఆం భా. ౨ ౨౩౦

జ పాఱమ్ము, పాఱవాతిరూపు, పాఱవాతియమ్ము

**పాఱఁజల్లు.** స క్రి (√ పాఱు¹) కలయఁజల్లు, అంతటనుజల్లు

చ కినుఁగొని పాషచిత్రపులకంబులు మేషుల నివ్వటిల్ల నీ, వనితకునైకదా ధనము వంగస నేయక పాఱఁజల్లితివి భోజగా ౬ ౬౬
(విశేషముగా వ్యయముచేయు అని భావము)

వ. పూవుదండ మహీమండలంబునం ద్రోచి యేచి చెలంగి నలంగునట్లుగాఁ బదంబులం ద్రొక్కి చిక్కుచీఱుతంజేసి చెల్లాచెదరుగాఁ బాఱఁజల్లిన వి పు. ౧ ౧౩౯

**పాఱఁజూచు.** స క్రి (√ పాఱు²) ౧. కలయఁ జూచు (దృష్టించిచూచు అని శ ర)

గీ పాఱఁ జూచినఁ బరసేన బాఱఁజూచు
విజ వి ౧ ౭౯. హంస. ౪ ౨౬

సీ ప్రాణేశుఁ జేరేరఁ బాఱఁజూచుచు వాని కాదు రేఁగి కాఁగిటఁ నిదఁగరేదా
కలు. ౪. ౫౯

గీ ఏఁగి తనమాఁటుసింగాని మెల్లఁ బెక్కు, మాఱు లెగదిగఁ గ్రేఁగంటఁ బాఱఁజూచి
కళా ౬ ౬.౬

౨. తప్పకచూచు.

గీ. పాఱఁజూచె ననంగఁ దప్పకరెు చూచెనతు టకును దోఁచు... ఆం. భా. 3 ౧33

**పాఱఁదట్టు.** స క్రి. (√ పాఱు²) చిమ్మివైచు.

ఉ...అవ్వీరవరుల్ మిథోవితతవీర రసోగ్రకటాక్షభావగం, భీరతఁ బల్లటీల్లనుచు శోఱముపాఱుచు నింత నంతనుం, జేయచు నంది చాఁపులను జిమ్ముకటా ర్లటు పాఱఁదట్టుచున్. కళా. ౭. ౯౯.

**పాఱఁ(గఁ)దో(ద్రో)లు.** స క్రి ($\sqrt{}$ పాఱు[2]) దూరముచేయు, తఱుము

గీ. ఆ శకేంద్రుని యాటోప మపనయించి, మాఱు కొన్న విదర్భుఁ బాఱఁదోలి
విక్ర ౪. ౧౧౭

శా సంపద్గర్వముఁ బాఱదోలి రిపులన్ జంకించి.. కాశీ ౪ ౮౭

సీ శతమఖ ప్రముఖనిర్జరులఁ బాఱఁగఁద్రోలి యెల్లలోకములఁ గా సేఁ దలఁచు
దశా 3 ౧౧౮

**పాఱఁబట్టు** స క్రి ($\sqrt{}$ పాఱు[4]) బిగియఁబట్టు, అపుకొను, నిరోధించు

క... మెలపున నెదురుగఁ జని ప్రస్ఖలితవచన గచన గొసఁగఁ గాయో ప డో, కలరూపు చెప్పు మనవుడు పలియించుచు గోర్కి పాఱఁ బట్టుము వగలన్ భోజరా 3 ౭౫౯

గీ బాల్యమూర్ధాదినాథునిఁ బాఱఁబట్టి, జవ్వనపురాజు పెలవిడ్డకంబరారి, బలము లాత్మాంగములనంగఁ బంతుమీఱె బహు ౫౪౯.

**పాఱబోఁత.** వి (పాఱన్ + పోఁత) పాఱఁ బోయుట. (శ ర)

**పాఱఁబోయు.** స. క్రి. (పాఱన్ + పోయు) కుమ్మరించు (శ ర)

**పాఱనొత్తు.** స క్రి ($\sqrt{}$ పాఱు2) పాఱఁదోలు.

గీ. ముదురుప్రాయంపుఁ బడతుల మదనకథలు, బొడముచో నిగ్గుపడి పాతిపోవఁబోచ్చె, శైశవముఁ బాఱనొత్తుచు జవ్వనంబు, క్రమముతో నంతకంతకుఁ గానిపింప.
శశా ౯. ౭౦3.

**పాఱమ్ము[1].** వి (పాఱ + అమ్ము) పాఱవాతియమ్ము, పాఱవంటి పెదదముఖము కలబాణము.

వ పెలయోటిబొంకులన్ బాఱమ్ములు తోమ్ము కలంకులం గాఁడ... మనుచ. ౪. 38

క పారమ్ము లనివడిగల, పాఱమ్మున రఘువరుండు వడ సేసె నమ్మ, పారమ్మునఁ గుటిలవ్యా, పారమ్మున మెలఁగునలఘుబలు మారీచున్
ఉ రా ౧. ౯౫

**పాఱమ్ము[2]** వి ముప్పదిరెండు విన్నాణములలో నొకటి

సీ వింటాలము పఱమ్ము పెల్లాగు పాఱమ్ము డొక్కరముత్తి డొక్కరమ్ము గీ ... నాఁగఁ జెన్నలరుచుండు, ముప్పదియు రెండు విన్నాణములకుఁ జెల్లు ఆం భా. ౭ ౭౦౯

**పాఱవాతితూపు.** వి ($\sqrt{}$ పాఱ) విశాలముఖ సాయకము అడ్డవాతియమ్ము

గీ ఉరువు మీఱంగి మావిర్మా నొకటి పొలికి, గక్కసుని పైవ బెదరిక యుక్కుతునియ, లిమిమై నది రయిం దొడ్డె పాఱవాతి తూపునఁ గడంగి నడుమసె తునియ వైచె
అచ్చ రా. ౧౬3

**పాఱవాతి(త)యమ్ము.** వి (పాఱ + వాయి + అమ్ము) పాఱయొక్కవాదర వంటివాదరగల బాణము

సీ...అచ్చెట్టువిడారు బొబ్బమెకంబుపై నగ్గలంబుగఁ బాఱవాతి, యమ్ములు నినుప...
అచ్చరా సుం. ౧౧౯. (శ ర పా)

పాఱవాఁడియమ్ములు (ముద్రి పా.) రామా ౭ ౫

**పాఱవిడుచే.** స క్రి ($\sqrt{}$ పాఱు) ప్రసరింపఁ జేయు

సీ అంతర్విలోకన వ్యాప్తి యుద్భాసించి బాహ్యంబునకు దృష్టి పాఱవిడిచి.
కాశీ. ౨. ౯౪.

పాఱవేయు. స. క్రి (√ పాఱు²) ౧. విక్షేపించు, విసరివేయు

ఆ ఆళ లొకెదుర్రాళ్లు నమగఁ గోయఁగఁ జేసి, పాఱవేయఁ గాని పరము లేదు, కొక్కు తిండియాసఁ జిక్కి చచ్చినయట్లు
వేమ ౧ ౨౦౧ ౩ ౧౬

(వ్యవ) ఆ కుళ్లుపండు పాఱవేయుము

౨ పోఁగొట్టు, (వ్యవ) వాఁ డా పుస్తకము పాఱవేసినాఁడు

పాఱ(ఁగ)వై చే. సం క్రి (√ పాఱు) ౧ విక్షేపించు, దూరముగాఁ బడవైచు

వ కని యయ్యోగ కళేబరంబుఁ బాఱవైచి తక్షణంబ ప్రబుద్ధనయనుం డైన తండ్రి కభివాదనంబుసేసి భాగ ఆది ౨ ౧౪౨

చ ఎగురఁగవైచి కొట్టు టగి రొంత భవం బని బంతి యుగ్రగా, మిగ వడిఁ బాఱవైచి
ప్రభా ౨ ౩౧

గీ నిత్యంబు లైన, కృత్యములఁ బాపి దైవంబ కిచ్చక గట్టు. పాఱవైచితే మిన్నులు వడ్డచోట మనుచ ౨ ౧౪

౨ విసర్జించు, నిరసించు

చ. పుత్త్రిని నటు పాఱవైచి నిజధుర్యత యంతెయు నుజ్జగించి కాననమున కేఁగె భూవిభుఁ డనాథతఁ గుందె ధరిత్రి యంత యయ్యె హరి పూ ౨ ౩౮

గీ పాణియాహారకబళంబుఁ బాఱవైచి, పూర్వరము నాకు పెనువెట్టికూళవోలె, భోగమోక్షములకు జన్మభూమి యైన, కాశివిడిచి నరుం డన్యదేశ మరుగు కాశీ. ౨. ౧౧౦

పాఱాడు=పాఱు². అ క్రి పరుగెత్తు; సంచరించు

గీ. అఁకలిని కెంది యదవిఁ బాఱాడునట్టి, బెబ్బులిని జేరి ముద్దులు పెట్టవచ్చు
పార్వ. ౩ ౩౯

సీ కొమ్మోవి చాటునం గమ్మి పేరముపెట్టి కొదుకళ పాఱాడెఁ గొంతసేపు
చంద్రా ౬ ౧౭౪ భాగ ౫ ౨. ౧౫౮

పాఱించే స క్రి (√ పాఱు) ప్రవహింపఁ జేయు

సీ. వినుఁ గీశ పెనఁగినఁ బెద్ద నొంపక రొయ్యి పాఱించి చేఁగలపాటి నాఁచి
ఆము. ౬. ౪౮.

పాఱిగంతులు వి. బ (√ పాఱు²) పరుగు లెత్తిగంతులు వైచుట, బాలక్రీడావిశేషములు

ద్వి బంతు లాలంకి యప్పలములు పాఱి, గంతు లుద్దులు గుచ్చకాయలాటలును
అ మ క ౧ ౫౦ పా ౨౬. పం

పాఱిపోవు. అ క్రి (పాఱి+పోవు) వెడలిపోవు, పరుగెత్తిపోవు

చ ను బ్బొకయించుక నిప్పు విచ్చువెుగ్గయి మఱి పాఱిపోదురు సమస్త దిశాగతు లైన యధ్వగుల్ ఆము ౪. ౧౩౧

ఉ ఇందుల కొక్కగాథ కల దింతటిలోఁ బఱి పాఱిపోవఁడో, యిందునివాసనా వినుము...
శుక ౨ ౯౯

ఉ ఇమ్మెయి నిప్పు దగ్గ మయి రొప్పటి యట్టుల డాఁగురించి నీవిమ్ములఁ బాఱిపోవ కొకయించుక నిల్చితి కేని
హరి ఉ ౨. ౨౯

సీ తరిత్రాడువిడిచి బృందారకాసురకోటి పంచబంగాళమై పాఱిపోరు భీమ ౪ ౬౧

పాఱు[1]. వి (త పాఱ్ప) బ్రాహ్మణజాతి. చూ. పాఱుత

జ పాఱుఁడు, పాఱుటక్క, పాఱుటయ్య పాఱుటమర, పాఱుత, పాఱుబాఁపు.

పాఱు². (దీని తుమున్నంతరూపము కొన్ని క్రియా పదములకుఁ బూర్వమునఁ బ్రయుక్తమయి, మిగులన్, కలయన్ అను నర్థముల నిచ్చును. ఉ.దా పాఱఁజూచు మొ॥

ఇది కొన్ని క్రియలకు స్వార్థమందును కొన్నిటికి ఆరంభార్థమునను అనుప్రయుక్త మగును

ఉదా అవియఁబాఱు, మాగఁబాఱు మొ.

(ఇంచుక్ స్థానమునఁగూడ వచ్చు నని శ ర)

అ. క్రి.=పారు (క. త పాఱు) ౧ పరుగెత్తు, వడిగాఁబోవు

మ...పాఱెన్ మనోవేగఁ దైపతగేంద్రుండమృ తాంతికంబునకుఁ దశాపలు ర్భయం బందఁ గన్ భార ఆది ౨ ౯౧

ఉ. పాఱినఁ జూచి కౌరవ నృపాలుఁడు భార కర్ణ ౩ ౧౦

గీ వివిధబాణపరంపర వెల్లిగొలిపె, భయరసము వఱ్ఱువెట్టునఁ బగఱు పాఱ భార విరా ౫ ౩౭

గీ ఓరిదుష్టాత్మ యే నిట్లు పోరఁ బెక్కుమాఱు లెగువంగ సిగ్గఱి పాఱుచుండు, నట్టినీకు.. భార. అర ౬. ౩౪౫.

౨ (కి వెళ్లు) పోవు

గీ. అనుచుఁ గొందలపడుకొర్కు లగ్గలించి, చిఱ్ఱుముఱ్ఱాడుచుండు నచ్చెలువచెలువుఁ, దగిలి తనయిచ్చఁబాఱుచి త్తంబుపజ్జ, నరిగి యిట్లను నక్కచకాథముండు భార. విరా ౨. ౭౫

మ భయమే పెట్టనివారిఁ బిల్వమనఁగాఁ బై వచ్చి మీ రిన్నిబూ, మియ లాడం బనిలేదు పాఱు మవుఁబోమే లయ్యో... కు. సం. ౭. ౧౩౯.

ఉ. పామరతఁ బట్టఁబాఱుకు,పామర కవిరాజ నివధపతిమదలీలా, పామరసాకేశంబునఁ బామరవిందారిఁ బట్టఁబాఱినభంగిన్.

హైమ. ౪. ౧౦౭.

(చ) జలాదులందు కొట్టుకొనిపోవు.

గీ వీరరససారకాసారవిహారణంబు, విన్నవకు నొప్ప నతనితో విగ్రహింప, దొరకొనిన వచ్చు మనకు ముద్దులుమునింగి, పాఱు వెంపల్లు తమ కెంతిబంటి యనుట ఉ హరి ౪. ౧౨౪.

గీ కళ్లాన కూర్పవాత, ఘట్టనలఁ బాఱువెను పొల్లకట్టువోలె ఆము ౪. ౧౩.

(ట) ఉన్మూలితమగు, పెల్లగిల్లిపోవు

సీ. స్వాంతధరాచక్ర మంతయు వశముగాఁ బావకోపతృణంబుఁ బాఱదున్ని శివధ ౧. ౧౦౪

(త) మీఁదికిపోవు, ఎగయు

వ...పన్నీరు నించిన తన్నీరుతిత్తులొత్తి వియత్తలంబునం బాఱి కైవ్రాలుధారల వాద్యంబులు దడిసి ఆము. ౪ ౩౫

౩ ప్రవహించు.

క చేటొకవిలు గొని రొమ్ముల, గీఱ మెఱుఁగు నారసములు గిటికొలిపిన నో,ఱాతి మెయిం గ్రొన్నెత్తురు, పాఱ నతఁడు దేరిమీఁదఁ బడి మూర్ఛిల్లెన్ భార ద్రో ౫. ౧౩౭.

గీ మలఁక లై పాఱు నిర్ఝరామలజలంబు హైమ ౫. ౬౩

చ అనయము ఝుమ్మఝుమ్మని కలయంగఁ బాఱువివిధారుణధారలు కు సం. ౧౧. ౩౨౧.

౪ సంచరించు, తిరుగు.

సీ గ్రహరాజు వాఱెడు ఘంటాపథము దాఁటి... హైమ ౩ ౩౪.

గీ. అంబరంబునఁ బాఱుతీవ్రాంశురథము. కాశీ ౧ ౧౩౫.

౫. ప్రసరించు

ఉ. చేటొకచాప మెత్తి యదువీరుఁడు డెబ్బది రెండుబాణముల్, మీఱిన పౌండ్రభూవిభుని

మేను కలంతట నాఁటి నల్గడం, బాఱఁగ
జేసె.. ఉ. హరి. ౩ ౫౭

గీ గస్తురా లాకపరి రతికేళిమీఁద, మనసు
పాఱినఁ గంకటి మైలచీరఁ, బఱచి విడె
మెల్లరే యుంచుఁ బలుకరింప
శుక ౨ ౪౫౪ కళా ౪. ౧౯౭

౬ పడు

ఆ అనువు నింద్రియములు మనము ధృతియుఁ,
దనంకంబు గాక అల్లడపడి సింహ, బలుఁడు
విషమబాణు బాఱఁ బాఱె
భార విరా. ౨ ౩౧౫

గీ ఇఁక వరింపక చనిరాదే యీవు చనిన,
చోటు లన్నియు నాబలమ్మూర్తిచేతఁ,
బిడుగుపాఱినడొంక రైయి వెంపడంగు.
కళా ౬ ౬౭

౭ తొలఁగు

క అత్తఱి గంధర్వవిభుం డత్తామరసాక్షివదన
మక్కునఁ గృపతో, నొత్తిమెుగ మెత్తి
యశ్రులు మెత్తినఁ గొనగోఁ బాఱమీఁ
టుచుఁ బలికెన్ మనుచ. ౩ ౧౩౪

౮. పూను, కడఁగు

ఉ బంటుతనంబుమాటలకుఁ బాఱకు పాండు
నృపాలుపాలు గై, కొంటయ చాలు..
భాగ ఉద్యో ౩ ౫౯

చ వల పని రెుంత సెప్పినను వారికి పై కడు
వేగపాటు మైఁ, బలుమఱు నాల్గెడం దొడరఁ
బాఱెదు... భార. విరా ౨ ౨౬౦

౯ (మనమునకు) వచ్చు, స్ఫురించు.

ఉ... మణికంధర యేక దేశసా, మ్యావగుణంబుచే
నతని వాతనియన్నను మద్దిచెట్లు గా, దైవత
మాని దిట్టినవిధంబు మనంబునఁ బాఱె
నంతటన్ కళా ౪ ౧౯

క. తనప్రాణము ప్రాణము లై, యనవరతముఁ
దన్నుఁ గూడి యాడెడుధూర్తుల్, మననునఁ
పాఱిన నూరికిఁ జనిరెుద నని మామతోఁ
బ్రసంగము చేసెన్ విక్ర. ౪ ౯౬

౧౦ కలుగు, ఉండు

చ మనసిజాఁ డా విలాసవతిమానధనం బెడ
నూఱఁగొన్నక్రం, దునఁ గుటిలాలకద్యుతులుఁ
దుష్మొద లంగవిభాతిఁ దీఁగ లా, నవకింజాఁ
రాజ పిఱునవ్వు వెలుంగు నిశాబ్జముల్ విలో
కనరుచు లుత్పలమ్ములును గైకొనిరెుం దన
యచ్చు పాఱఁగన్. కు. సం ౫ ౬౪౬

౧౧ కదలు, చలించు

సీ. చూడవచ్చినవారిఁ బీడించి పెనుపోఁ
బట్టింప నింతైనఁ బాఱదయ్యె
శుక ౨ ౧౧

౧౨ రాలు.

సీ. అమ్మహోగ్రవ్యాఘ్ర మమ్మహీజముక్రింద
కుద్వృత్తి నేలించి అదరులు వాఱ నో
రంతయుఁ దెఱచుచు... విక్ర ౩ ౭౦

మ గద సారించి త్రిదంష్ట్రినామఁ డగు రక్షో
పాలుఁ డొక్కండు బిట్టదరుల్ వా
మురారి రెుమ్మబరి క్రేయన్...
పాండు ౨ ౧౦౩

౧౩ నిండు

మ సెలవిం బాఱఁగ నవ్వుచుం బలికె నాత్మ
పించి.. హరిశ్చ ౨ ౧౯౦

క అని తన కథ సెప్పఁగించినఁ, దన కనుఁగవ
మెఱుఁగు లుబ్బఁ దాటంకములున్, జనుఁ
గవయు నడుము వడఁకఁగ, వనిత సెలవి
వాఱ నవ్వి వానికి ననిరెున్
మనుచ ౨ ౪౦. చెన్న ౧. ౧౪౪

ఇయ్యఁబాఱు-ఇచ్చుటకు సిద్ధముగా నుండు

ఆ తనకు మీఁదుగట్టి తగనియ్యఁబాటిసాఁ,
దనుచు సీరపాణి యానతిచ్చె.
వి. పు. ౬ ౩౪౧.

స. క్రి. పాఱించు, ప్రసరింపఁజేయు.

క. మఱచితిఁగాముని వలగొన, కొఱఁగితి నని
మఱల వచ్చి రొలసాగ మునిం, జెఱకువిలు
కాఁడు వాఱిన, మొఱఁగుంబోఁగనఁగఁ
బొట్టె మెయి జిగి నిగుడక్. కళా ౧ ౧౧౪

క అటవీస్థలమున శైరవ్యకటి నుండెడురుండ
మాలికల చందముగా, నటదవిరళనావాళిగ,
పటమంగం బైన పోఁగువాఱిర కలయక్
వరాహ ౪ ౩౭

విణ జీర్ణమైనది చూ పాఱుటాకులు.

వి = పాఱుడు ౧ పరుగెత్తుట చూ పాఱఁ
బోతు

౨ ప్రవహించుట చూ. పాఱుటేఱు వెం

సా పాఱెడుబండ్లకు (ఎదురు) గాళ్లసాఁచు—
కోరి యనర్థమును దెచ్చికొను

చ పిలిచితి నన్న నిన్ను నతిభీతుఁడ విప్రుఁడ
నమ్మినాఁడ నీ, పలు కనృతంబుగాఁ దగునె
పాఱెడు బండ్లకుఁ గాళ్లసాఁపఁగా, నలవడు
నన్నపోటు మగఁడై యిటు చేసితిగాక
యాసతో, నిలుతు మురారి నన్నచట నీకుల
ముంచిన... ఉషా ౨ ౩౧.

గీ ఐన సేమాయెఁ గాక ధరాధిపతులు, చేయఁ
దగినట్టి యీ దుష్టశిక్షనీకుఁ, బడిన భారంబె
పాఱెడుబండ్ల కెదురు, కాళ్లు సాఁతురె
యో వెఱ్ఱికాన వినుము పవల ౨. ౩౮
మైరా ౨ ౨౪

జ. పాఱఁజల్లు, పాఱఁజూచు, పాఱఁదట్టు,
పాఱఁదోలు, పాఱఁబట్టు, పాఱఁబోఁత,
పాఱఁబోయు, పాఱనొత్తు, పాఱవిడుచు,
పాఱవేయు, పాఱవైచు, పాఱించు, పాఱి
గంతులు, పాఱిపోవు, పాఱుఁబోతు, పాఱు
టాకులు, పాఱుడు, పాఱుతెంచు, పాఱు
పోగు.

పాఱుఁడు = పాఱువాఁడు. వి. (పాఱు[1] +
వాఁడు క పారుద త పార్వక్) బ్రాహ్మ
ణుఁడు.

చ పేదవిప్రులకును ధారుణీశులకుఁ బోలఁగ
సఖ్యము సంభవించునే, పలుకక వేగ పొమ్మ
కట పాఱుఁడు సంగడికాఁడె యొండునుక్.
భార. ఆది ౫. ౨౦౩

గీ అరుగుదెంచితి ననియు ధనార్థి ననియు, నిట్లు
వినుతించుటయు రాజ్యనేశ్వరుండు, కేఱ
కొనఁజూచి నగియు నీపాఱుఁ దధముఁ, డగుట
తోఁచుచున్నది ..
భార. శాం. ౩ ౪౮౯

ఉ పాఱుల పేరు చెప్పికొని బానెడుపప్పునుఁ
బాయసంబునై, దాఱుపరంట్ల వంటకము.
భోజరా ౭. ౧౩౩.

ఉ పాఱులు గ్రోవ్వి యిట్లుఱచు పాపపుమాటల
నుబ్బి నీవు నీ, కాఱులు ప్రేలెదోరి...
పద్మ ఉ. ౩ ౭౦.

పాఱుఁబోతు. విణ (పాఱు[2] + పోతు)—పాఱి
పోవు స్వభావముగలవాఁడు — పిఱికి, భయ
శీలుఁడు; సమరభీరువు

ద్వి నీవు వచ్చినవేళ నిలువక మాయ, పోవక
వని పాఱుఁబోతుఁ జేసితివి
ప్రభులిం ౪. ౧౧౨ పో ౩ పం.

సీ పంద కోఁచ పఱికి పాఱుఁబో తనఁగను
సమరభీరుని పేరు లమరుచుండు
సాం ని. మాన. ౩౮.

పాఱుటక్క. వి (పాఱు[1] + అక్క, పాఱుఁడు
+ అక్క క. ర) బ్రాహ్మణజాతి స్త్రీ.

సీ కారవి పోనీదు పై నిద్రఁ బాఱుటక్కలు
వాడు మత్పుణ్యకథల ద్రోయు,
ఆము. ౪. ౫౦.

పాఱుటయ్య. వి. (పాఱు[1] + అయ్య.) బ్రాహ్మ
ణుఁడు.

చ. తోడితఁబడ వచ్చి పొచ్చరికతో మును జన్నము లెన్నియేని యే,గ్రడ నొనరించు పుణ్యమున బాంధవ కొంఱదిన పాఱులయ్యా లకా, వెదలు నదల్చి ఽంగా ౧ ౬3

పాఱుటసుర వి (పాఱు¹ + అసుర) బ్రహ్మ రాక్షసుఁడు

గీ అనిఁ దత్సత్యమునకు నేత్రాంబు లుపలఁ, బ్రమదపులకిత గాత్రుఁ డై పాఱుటసుర, యనుని మధ్యందినపు టెండఁ దనదు పెద్ద, బట్ట కల మించఁ బ్లవు కేరఁ బాఱుతెంచి

అము. ౬. ౪౬

పాఱుటాకులు. వి బ (పాఱు² + ఆకులు) పండుటాకులు, జీర్ణపర్ణములు (పాఱుఁడు + ఆకు మునులులోనగువారు వన్యముననకు మాఱుగా కట్టుతోనిడి యొకి దినును అకులు అని శ. ర)

సీ పర్యోదమాఱుగాఁ బాఱుటాకు లమర్చి చాఁదునఁ దిలకంబు సంతరించి ..

వా ౪ 38

ఉ మంచెలమీఁద నెక్కి కటిమండలిఁ బట్టిన పాఱుటాకు లిం, చించుక చంచలించి మరు నిల్లు బయల్పడఁ కేయఁ బిట్టలక్, జెంచెత లార్చి బ్రేయుదురు చిత్రము గా నొడిసెల్ల బాహంమూ, లాంఛితదీధికుల్ చిఱుత యైన వనుంగవమీఁదఁ బర్వగకా.

కాళ 3 ౧౦

సీ. చెవుల కీతెల్లయుచ్చితికాయ లంతేని పారు టాకులది కప్పసమి దప్ప

యయా. ౧ ౧౨౦

పాఱుడు¹. వి ($\sqrt{}$పాఱు²) ౧ ధావనము, పరు గెత్తుట.

వీ... పరువు పాఱు డన ధావనము చెలఁగు,

ఆం. భా. ౨. ౨౪౪.

౨ ప్రవాహము

గీ పాఱు డనఁ గఁ బ్రవాహ మా

ఆం భా ౨. 30

పాఱుతే. వి (పాఱు + త) (క పార్వతి, త, పార్వాన్) బ్రాహ్మణభార్య, బ్రాహ్మణి. (శ. ర)

పాఱుడెంచు = పాఱొంచు. అ. క్రి (పాఱు తెంచు అని శ ర పాఱు² + తెంచు, స్వార్థ మున) ౧ పరుగెత్తు; ఎగురు

గీ ధూళి పెల్లు గ నెగయంగ నేల గోడి, వడఁ గఁ జనుమాఁకఁ గని వడివడ వడంకి, పాఱుదేరంగ నమ్మహాభాగుఁ డప్పు, డోడ కోడకమని నన్నుఁ గూడవచ్చి

భార విరా. ౪ ౨౦౬

మ తలయుం జీరయు వీడ సంభ్రమముతో దైవోపఘాతంబు న, గ్గలికం గ్రుక్కుమఁ బాఱు డెంచి కెప నాకష్టుండు తత్పూతికా,నిలయ ద్వారమునందు నిల్చి శిశువుం దేతెమ్ము తె మ్మంచు నా,కులుఁ డై పల్కగ...

హరి. పూ. ౪ ౧౭౩

ఉ తెక్కలు నేడు గల్గిన నెఱింగి జవంబునఁ బాఱుడెంచి బి, ట్టెక్కెని కూటకోటితటు లెల్లను నుగ్గులు గాఁగ మేరువున్

కాశీ ౧ ౧౧౩

౨. పఱతెంచు, పరుగెత్తివచ్చు

గీ అట్టియాలోచు కడురయం బారఁ జొచ్చి, యొయ్యఁ దలయంపి దిక్కున నొడిఁగి యుండెఁ, బగతుఁడును వెనువెంటన పాఱు డెంచి, కనియె నిద్రాయమాణు నమ్మహుఁ బాహు హరి ఉ ౨ ౧౦౩౬.

క. వారును సంభ్రమమున న,వ్వారిరుహాశ్రమ పొంత వదలక క్రీడా,గారములు గట్టఁ దొడఁ గుదు, కారింపుచుఁ బాఱుడెంచి వడి గంధ ర్వుల్. భార అర. ౪. ౩౧౧.

గీ. మన్మథుం డేయుకింశుకమార్గణములు, చన్నుఁ
గవ వాఁటుటయేఁ బాంథసతియుఁబోలెఁ,
బాఱుడెంచి కీరంబులు పండ్లు గఱవ, వణఁకు
దాడిమిఁ జూచె భూవరుఁడు వేడ్క.

వైజ. ౧ ౯౪

3 ప్రవహించు

ఆ. అంతఁ దెలిసి రాముఁ డతికుపితాత్ముఁడై,
యేఱు వాఱుడెంచు నెసకమెసఁగ, నప్ర
మేయశరము లడరించె

భార ఉద్యో ౪ ౩౭౪

గీ రాజవంశజాఁ డగు భగీరథుని వెనుకఁ, బాఱు
డెంచిన చదలేఱు పాటియగునె

భీమ ౩ ౧౬

౪. వ్యాపించు, ప్రసరించు

ఉ. అవిపవృక్షగంధము రయంబెసఁగం బయిఁ
బాఱుదేర వ్యాసవిధ రోగబాధలు జనంబు
నకున్ జనియించె హరి పూ ౬ ౬౪

పాఱుపోఁగు. వి (పాఱు2+పోఁగు) దూరదూర
ముగా పోయు నాలిపోఁగు (శ. ర)

పాఱువాఁడు=పాఱుఁడు.

వ...మాయట్టిరాజులకు మీయట్టి పేదపాఱువాఁ
లతోఁ గార్యకారణం బైనసఖ్యం బెన్నఁ
డును గాదేరదు... భార. ఆది ౫ ౭౦౬.

మ త్తకోకిల రాజయోగ్యము లైనయాహయ
రత్నముల్ జవసత్త్వవిఖ్యాతకంబులు వాని
కేఁటికిఁ బాఱువానికి నంచు...

భార అర. ౪ ౩౪౦

గీ. వాదుల మటంచుఁ జెప్పించి వత్తు రోట,
మైన దయ నీరదే మైన నని విలజ్జ, జాటు
దనమున సభ లెక్కుచొరవకాంద్రుం, పాఱు
వారలనుద్ది చెప్పంగ నేల అను ౪ ౬౧

పాఱువేఁట. వి దేవోత్సవవిశేషము. (శ. ర.)
వేఁట. (శా)

పాల1=పాలగుమ్మ. వి చామము, పక్షివిశే
షము

సీ. పరువుసేలకు వచ్చెఁ బాల పయ్యెరవంక
కుడినుండి యెడమకు నడిచె నక్క.

వి. శకుం ౧. ౧౩౭ ఆం భా ౭ ౯౧

సీ నరియఁడు తెరు వాఁగె గరుడియఁ బాలయు
దెడమనుండియ వచ్చి కుడిని నిలిచె

ఉ. రా ౬ ౭౩౫ చంద్రా ౭ ౧౦౬

పాల2. వి క్షీరక ?

సీ జాప్య మామిడి జీడి నురుగుడు వెలుగు
పాపట చంద్ర పసిరిక పాల కేల,

వేం పంచ ౪ ౫౭౭

కి నిర్వర్త్రపాలు తేనియ పాలసంకులు తారెకు
ములపెర్గు చాలపప్పు

శుక ౧ ౧౫౩. ఆం భా. ౭ ౪౩.

జ. పాలగుమ్మడు, పాలమడ్డి

పాల3 వి శేత్రరోగవిశేషము

ద్వి పాల గట్టినకన్ను ప్రంగుడుకన్ను ద్రాలు
కన్నును నీరు గారెడికన్ను.

పండితా మహిమా. ౭౫౩ పు.

పాల4. విశే (√పాలు2 ?) ౧ తెల్లనిది, శ్వేతము.
ఉదా. పాలకోడిపె ఱు (శ. ర.)

౨. (సం పాటలః) పాటలవర్ణము కలది. తెలుపు
మించిన యెఱుపు గలది. (శ. ర.)

పాలంకి. సం వి ఈ. స్త్రీ. కుందురువు ? ఒక
గంధద్రవ్యము.

పాలంక్య. సం వి. ఆ. స్త్రీ. కుందురుకము

పాలంక్యము. సం వి. అ న శ్యేనము, డేగ.

పాలక(ల్క-)డలి. వి. (√పాలు2) క్షీర
సముద్రము.

పాలకుప్ప. వి (పాలు2+కుప్ప) క్షీరసాగరము, పాలసముద్రము.

ఆ గొల్లవారి(ఇకుకు గొలఁ కనవచ్చుచే, గొల్ల కిలిఁ పాలకుప్పఁ (దచ్చి, గొల్ల శైరి సురలు . భాగ. ౮. ౨౦౪.

పాలకూడు. వి. దే, (పాలు2+కూడు,) ౧ పరమాన్నము, క్షీరాన్నము

క ఆపాలకూటనే నిజ, మేపాటియుఁ దప్ప రాడిరేని... ఆము. ౪ ౨౭౪.

౨. వింకు.

సీ పాలకూళ్లు గుడిచి పాలను మన పొమ్మ చేసి రం డనువారిఁ జేసి రండు. వీర 3 ౨౫.

ద్వి. పాలకూ ళ్లడిచి వాపాలి కేతెంచి, జాలి దీర్పఁడటన్న సంయము లలరి.

మృ ౬ 3. ౬.

పాలకూర. వి. (పాలు2+కూర) మధు(సవ ¶ (శ. ర బా౧)

పాలకొడిసె. వి (√పాల4) శ్వేతకుటజము, వృక్షవిశేషము.

ద్వి. మద్ది పాలకొడిసె మారేడు వెలఁగ, బొడ్డి పాపర జమ్మి ప్రుబుగుడు కేండి.

ద్వి శ పా. ౪౯ పా. ౬౪౫ పం

సీ. కడప కొడిసె పాలకొడి సెబ్బలొద్దుగు హంస ౪ ౧౧.

సీ. పాలకొడిసె యనఁబడు శ్వేతకుటజంబు..

ఆం భా ౨ ౫౧

పాలకొయ్య. వి యూపము (శ ర)

పాలగచ్చు. వి సన్నకున్న పుష్పాఁత. (శ.ర. (బా)

పాలగరువు. వి. మిాఁద ఇసుకగలదాతిపాలుచేల (శ.ర. (బా.)

పాలగారి. వి. (√పాలు2) పాలగచ్చు, పాలకుక్కపుష్పాఁత.

క అనఁగ (బహ్మాండమండపాభ్యంతరమునఁ, బాలగార రెచువర్చినలీల కెలుసి, పుడమి పిం డారఁబోసినపాలువు మిగిలి, పండు వెన్నెల విండె దిబ్బండలమున.

కృ శకుం. ౨. ౧౯౬.

పాలగారి. వి (√పాలు2) భక్ష్యవిశేషము.

ద్వి వడలు మండెగలు లడ్వములు ఫేణీలు, కడుమెత్త నగు పాలగారెలు

(పభులిం ౪. ౧౫ పా. ౨౧ పం.

పాలగుంజే. వి యూపము, పాలకొయ్య, (శ. ర. బా౧)

పాలగుమ్మ = వాల. వి పాలపిట్ట (శ ర బా౧.)

పాలగుమ్ముడు. వి (√పాల2) నల్లకేలగుమ్మడు క్షీరవిదారి ¶.

(ఇటవ్యతిరేకలక్షణ అని శ ౬ శుక్లభూకూష్మాండస్య, అని రామా(శమివ్యాఖ్య, తెల్ల పేల (పాల)గుమ్మడు అని లింగాభట్టీయము.)

పాలగొలిమిడి. వి. (పాలు2+గొలిమిడి) పయస్విని ¶. (శ ర)

పాలగోఁకుడు. వి. (పాలు2+గోఁకుడు) పాలకుండలోని అడుగంటు (శ. ర)

పాలఘ్నము. సం. వి అ పుం ౧ గుడ్డికామంచి.

¶ ౨. కుక్కగొడుగు, ఛత్ర (అ ని)

పాలచేఁప. వి (√పాల4) ఒకవిధమగు తెల్లచేఁప. (శ ర. బా౧)

పాలచే(ర్లు)రులు. వి బ పాలనరము, పీర్యనాడి, (గజ్జీరములు. శ. ర.)

సీ. పాలచేరులు వట్టి తూలింప బలిమి సీద్చుకొని డొంకలఁదూటి చుట్టుఁ బెట్టు.

మనుచ. ౪. ౪౨.

సీ కటికిసొత్తురులతోఁ గంద ఉర్లిపదంగఁజేరి పండులపాలచేర్లు గఱచు కుక. ౧. ౧౭౦

ఉ పారకుఁ బాలచేర్లు బలుజాగిలముల్ కబళించి యీడ్వఁగా. కడిందిపంది నొకటోయ వికెంబునఁ గ్రుమ్మఁ గూలఁగన్

ఉ. రా. ౩ ౪౧౩

పాలచోటి. వి (√పాల⁴) సముద్రమునం దుండి మనుష్యులను భక్షించెడి తెల్లచోటిమీను. (శ. ర బ్రౌ)

పాలజీనువ. వి (√పాల⁴) పక్షివిశేషము

గీ పాలజీనువ డాబయుఁ బైఁడికంటి, నీర్ల ముచ్చును నుల్లంకి చల్లపిట్ట ప్రబంధ ౨౩౪

పాలటేఁకు. (√పాల¹) తెల్లటేఁకు. (చి.ని. బ్రౌ)

పాలడ. వి (√పాలు² త పాలడై) బిడ్డలకు పాలుపోయుట కుపయోగించు శంఖాకారమగు చిన్నగిన్నె

ఉ పాలడలోనఁబోసి చనుఁబాలు నెయిం గిలకొట్టి కాళ్లపై బాలకునుంచి వ్రేల్ నెల విపై నెడగా నిడి యుగ్గు పెట్టి...

సారంగ. ౧ ౪౪.

పాలతుత్తము. వి అంగడి మందు దినుసు ఖర్పరి ఒక విధమగుమందు వస్తువు (శ ర బ్రౌ.)

పాలతేఁకు=పాలటేఁకు.(బ్రౌ) వి తేఁకుదినుసు, గృహద్రుమము (శ ర)

పాలనము. సం వి అ న ౧ రక్షణము, పోషణము.

౨. (ప్రతిజ్ఞాదులు) తప్పక నిర్వర్తించుట, అనుష్ఠించుట

౩. అప్పు డీనినయావుపాలు, పేయూషము

౪. ఒకజాతిచేప (వై ని)

పాలనీయము. సం విశే (అ అ అ) ౧. పాలింపఁదగినది రక్షింపఁదగినది ౨. తప్పక యనుష్ఠింపఁదగినది.

పాలపండ్లు. వి బ. (పాలు²+పండ్లు) పాలు త్రాగుపిల్లలకు పొడమెడు దంతములు.

గీ కృతపయఃపాన నవమేఘ పృథుకములకు, రాశి నొయ్యన వడగండ్ల పాలపండ్లు

ఆము. ౪ ౭౨

పాలపండ్లు². వి (పాల²+పండ్లు) పాలచెట్లు పండ్లు

సీ పనసపండ్లును ద్రాక్షపండ్లును బదరికాఫలములనంటులు పాలపండ్లు

హేం మా ౧ ౨౭౯

పాలపాపఁ(డు). వి (√పాలు ²) ౧ (స్తనంధయుఁడు) పాలుద్రాగెడి శిశువు; చిన్నవాఁడు, కుఱ్ఱవాఁడు

ఆ పాలపాప వోయి బంటుగా నీవానిఁ జేసి యతని మీఁదు పేతఁ బట్టి.

కు సం ౧౦ ౫౩౧

సీ . స్తనపాయి పసగును జంటివాఁడు,పసిబిడ్డ చంటిపాపఁడు పాలపాపఁ డనంగ...

ఆం. భా. ౨ ౧౧౭

౨. చంద్రుఁడు, (పాలలోఁబుట్టినపాపఁడు)

సీ అనిఁ బాఱుఁబోకురాకు నడంచి కొనుగెల్వ పాలపాపనిఁ దాఁచుప్రాభవంబు

చంద్రా ౧ ౨౦.

సీ జనకక్షేత్రఫలం బయిన పాలపాపఁడు వరవృద్ధిఁ గాంచుచై వార్ధికుండు.

వసు. ౧ ౨౧

పాలపూస. వి (√పాల⁴) తెల్లని గాజుపూస

సీ పసివాఁడు గట్టిన పాలపూసల కాని పెట్టసొమ్ములు లేవు బిడ్డలకును .

కుచేల. ౧ ౩౬.

పాలబిళ్ళలు. వి బ (√పాలు²)=పాలుమూంటలు.

వ్యవ: మాపిల్లవానికి పాలబిళ్లలు చాల ఇష్టము.

పాలయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) పాలించు వాఁడు.

పాలవెల్లి[4]. వి. (పాలు[2]) ౧. క్షీరాబ్ధి.

క తెల్లని మేనును నవ్యుతము జిల్లన జల్లించు పొడుఁగు శిరశృంగములుం, దెల్లగ నర్థుల కోర్కులు పెల్లిగొలుపు మొదవు పాలవెల్లిం బుట్టెన్ భా. గ. ర ౨౫౨

గీ పొడమె, వెల్లవారవ మాపాలవెల్లియందు దశా ౨ ౨౭౬

౨. అంబుధి, సముద్రము

సీ సస్యభేదాంబుధు ల్పనుఁ బాలవెల్లి నా ఆం. భా 3. ౪౭

3 కాయమానవిశేషము, దేవునిపీఠముపై వ్రేలఁ గట్టెడు నొక విధమగు పందిరి

సీ మొల్లపూ మొగ్గల ముగ్గ విగ్గఁ బెట్టి మల్లె పూవులఁ బాలవెల్లి గట్టి తపతీ ౪. ౨౪

పాలవెల్లి. వి బ సస్యభేదము.

సీ పెద్దవంకలు పాలవెల్లులు ముత్తెపుసరులు సంకావులు చంద్రవంకలు... శాలి (గీ) ధాన్య మెసఁగుచు శాం వి కూన ౫౨. ఆం భా 3 ౪౭

పాలయోరెము. వి (√పాలు[2]) క్షీరాన్నము.

క. సరసాల్కుల జేజేయపు, డరవిరఁ బొగరట్టి పసిఁడిపూరివాణమూతో, డుతఁ దెచ్చి పాల యోరెం బతివలు ముప్పురకుఁ బెట్టు మని యిడి చనుదుస్. అచ్చ రా బాల ౭౪.

పాలరాయి. వి ఔ (√పాల[1]) పాలవలె తెల్లగ నుండెడిరాయి

వ్యవ. ఆ బుద్ధవిగ్రహమును పాలరాతితో నిర్మించినారు.

పాలవంక=పాలవాఁగు. వి (√పాలు) పాల వెల్లువ

ఉ చేవలి పాటపాట నరేంద్రుకతోఁ దిల తండులాన్వయశ్రీ నటియింపఁ గైసడలి వ్రేకనిచన్నులు పాలవంకలై, క నసి యార్చు... కాశీ. ౭ ౧౫౯

పాలవాఁగు=పాలవంక. వి (√పాలు[2]) ౧ క్షీరాబ్ధి, పాలసంద్రము

క ఇసుదక్కు మేను లాకుబలు, దొరకోలపుం బాల వాఁగుతో గలయనుంగై అ చ్చ రా బాల ౧౨౭

౨. క్షీరప్రవాహము, పాలవెల్లువ

పాలవిఱుగు(డు) వి (√పాలు[2]) కూకు, ఆమిక్ష.

సీ...ఆమిక్షసంజ్ఞ నై యలరుఁ గూకు,పాల విఱుగు నాఁగ.. ఆం భా ౨ ౧౩౨

పాలవెండి. వి (√పాల) తెల్లని వెండి, స్వచ్ఛ మైన వెండి.

వ మాణిటడుగుల శోధించిన పాలవెండి పాగ డమ్ములు... ప్రబంధ ౭౮

పాలసంద్రము. వి (√పాలు[2]) క్షీరాబ్ధి

గీ. చంద్రుఁ డుదయించె నప్పాలసంద్రమునను దశా ౨ ౨౪౨

సీ. పాలసంద్రములయ్యె నోలిఁ జెర్ల న్నియు నలుస బాబాలయ్యెఁ బుఱుఁగుశిల్ల అచ్చ. రా అయో ౨౦

పాలసముద్రము. మి. వి (√పాలు[2]) క్షీరాబ్ధి

చ . పరగు (బురిందటాకములు పాలసముద్రములో సమంబులై. విక్ర. ౧. ౯౦

పాలసుఁడు. విణ. (సం. పాలిశః ప్రా. పాలిసో, ౧ మూఢుఁడు, అవివేకి, యుక్తాయుక్త వివేకశూన్యుఁడు.

క. ఏలినవానిని దైవము, వాలిని బంధులను సమ
చితారాధన సంస్థితిఁ బ్రీతులఁ జేయని, పాల
సుఁడా ఫలములానవడు మనుజేంద్రా
భార. ఉద్యో. ౨ 33.

ఉ. కరుణాతిశయంబుఁ బ్రజా, పరిపాలనరతియుఁ
బెనఁగువడియుల్లములో, విరిగొన నిశ్చయము
నకుం, జోరఁజాలక తలఁకు పాలసుండును
బోలెన్ నిర్వ ౧౦. ౪౪

క. చేతోజాతవిమర్దన, భూతిగ నినుఁ గొలువనట్టి
పాలసునకు సం, ప్రీతింగుడువంబెట్టిన, దాతకు
యమదండనంబు తప్పదు రుద్రా. శివతత్త్వ.
౨౬౫ నీలా ౧ ౧౧౦

౨. పాపాత్ముఁడు

క. ఆలరిరైు శివుఁ బలికిన, పాలసుఁ డని తిదివి
వీరభద్రుఁడు ఫాలా, భీలవిలోచన దహన,
జ్వాలల మును దత్తు జన్నపాలను గాల్చెన్.
శివతత్త్వ 30౨.

౩. దుర్జనుఁడు

గీ. ..మేలితత్త్వ, లానివైచిక్కి కొంవనిపాలసుల
చెల్లఁ, జెదుమఁగల బల్లిదుఁడ వీవెగదవె
తండ్రి. అచ్చరా వాల ౧౫౯

పాలసున్నము. వి. (√పాల[1]) పాలగచ్చు.

సీ. పటుహీరములె చాలఁ బాలసున్న కెంపర్చ
శక్రాశ్మములె చాలు జాదు వ్రాయ.
వసు. ౪ ౪౧

పాలాడు=పల్లాడు. స. క్రి (√పాలు + ఆడు)
ఖండించు.

క. పలఁబాటినవానిని భటు, లలుఁగులఁ బాలా
డిరి... మనుచ. ౪. ౫౦

క. ఇలఁ దమకే సరి కేసరియులఘు పరాక్రమ
విరూఢి గనియుద్భటులై, రొలుఁగులఁ
బోవఁగనీయక, యలుఁగులఁ బాలాడి రప్పు
డవ్వీరభటుల్. రామా. ౨. 33.

పాలానుగు. వి.(పాలు[2] + అనుగు) దుగ్ధకుంభి. శ్రీ.
(శ. ర)

పాలారుచే(ర్చు)=పల్లార్చు. స. క్రి
(√పాలాడు ఇది పట్టుధాతుస్వార్థకరూప
పూర్వకముగా నేకటుచుగాఁ బ్రయోగములందుఁ
గానవచ్చుచున్నది). ౧ ఉద్దీపింపఁజేయు

మ. కాంతలం, గరఁగించె రతిలీలఁ గృష్ణుఁడు
గృపం గందర్పుఁ బాలార్చుచున్
భాగ ౧౦ పూ ౧౦౦౨.

౨ పీడించు, బాధించు

ఉ. మార్పుడు కాలయాపన మమర్పక యప్పి
శాచిఁ బట్టి పాలార్పఁగ నేల
భార ఆది ౭. ౨౧3.

సీ. కలువగ ల్పట్టిపాలార్ప కోరవేశ తగతెంచి
చనుదెంచు మగఁడు గలిగె శుక 3 ౭౦౪.

౩ క్రీడింపఁజేయు, ఆడించు

శా. ఈ రంగంబున వారు మీకు నెదురై యేకేనిఁ
జెద్దుంబుమైఁ, జేరం జూతురు మీరు గైకొన
మితోఁ జేపట్టి పాలార్చుచున్, గారింపకావల
నొక్కపూఁపునన యూమాలించి
హరి పూ ౯ ౫౫

క. బాలుఁడు గరమున నగ్రవ్యాళము దరి
యించి యాడుబడువున రక్షకపాలునిఁ
ద్రుంపక యూరక, పాలార్చుట నీతియె
శుభప్రద యింకన్. భాగ 3 ౭౭౯.

౪. చంపు.

గీ. పులులఁ జట్టలు చీరి దుప్పులను తెగ్గ, వేసి
లమ్ములఁ గ్రుమ్మి కూరాకువేసి, యమరఁ
జమరులఁ బట్టిపాలార్త్తు మిత్రుడు, సామి
చూచుము నీబంట్ల సత్త్వ వమచు.
పారం ౫ ౧ ౯౦.

౫. ఉపేక్షించు

ఉ. అట్టియెడ నీ కొడుకు గురునిం గదిసి యతని
కిట్లనియు.

గీ. పట్టిపాలార్చిదరు మీరు పాండుసుతులు, నీవు భీష్ముండు నలిగిన దేవతలకు, నైన మార్గాన వచ్చుచే.. భార భీష్మ. ౨. ౧౮౦

౬. ఎక్కువగా విమర్శించు

సీ. పసిబిడ్డనేమి పట్టిపాలార్పంగఁ దగవు గాదని రోల తలఁపఁ దర్యో కాశీ ౪ ౨౬౬.

వ్యవ. ఆమాటనే అంత పట్టిపాలార్చిద వేల

**పాలావు.** వి (పాలు² + ఆవు) ఎక్కువగా పాలిచ్చెడి ఆవు, పయస్విని (శ ర)

**పాలాశము.** సం విణ (అ ఈ అ) ౧ పలాశ వికారమైనది, మోదుగుది (శోల మొ) ౨ పలాశముయొక్క అవయవమైనది ౩ ఆకుపచ్చనిది ౪ పలాశసంబంధి,వి అ ఎం ౧ ఆకుపచ్చన ౨ తమాలపత్రము, చీకటిచెట్టుకాకు, హరిద్వర్ణము

**పాలాశమం(ఖ)డము.** సం వి అ ఎం మగధదేశము

**పాలాస్త్రత్రాళ్లు.** వి బ అశ్వబంధనరజ్జువు (గుఱ్ఱము కాళ్లు కట్టెడి త్రాళ్లు అని శ ర)

సీ ..కైజా కొరు యన హయశిక్షకంపనము వెలయఁ బాలాస్త్రత్రాళ్లన బంధరజ్జువు లొప్పు ఆం భా ౨ ౨౦౦

**పాలి.** సం వి ఇ ఈ స్త్రీ ౧ చెవితమ్మె, కర్ణలతాగ్రము ౨. అశ్రి, అంచు; కోణము ౩ శ్రేణి, వరుస ౪ అంకము, గురుతు ౫. ఎల్ల, హద్దు ౬ ఉత్సంగము, ఒడి ౭. ఛాత్రాదిదేయము, గురువధ్యయనకాలమున విద్యార్థిని పోషించుట ౮ యూక, పేను ౯. పోటు, మీసమూలుగల యాఁడుది ౧౦ ప్రశంస, పొగడిక. ౧౧ వంతెన ౧౨ చదరపుకొలను. ౧౩. ప్రస్థము, కొండచొత్తము ౧౪ పరిధి. ౧౫ ప్రదేశము. ౧౬ కత్తిపిడి, వాబా (శే. ని.)

వి. ఈ. స్త్రీ. ౧ స్థాలి. ౨. ఆతరన్య. ౩. ఒక విధమగు కాశా. (శై ని.)

**పాలించు.** సం స క్రి ఏలు

మ. ధరణీచక్ర మవక్రవిక్రమ కళాదర్పం బెలర్పంగ నేర్పరియై నిర్మలసత్య ధర్మనియతిఁ బాలించె... మార్క ౧ ౧౪౩.

**పాలిం(డులు)డ్లు=పాలయిండ్లు.** వి బ (పాలు² + ఇండ్లు.) స్త్రీ స్తనములు

సీ పసిఁడికుండలఁ బోలు పాలిండ్లభరమున సన్నపు గౌఁదీఁగె జలదరింప కాశీ ౧ ౩

కీ ఏ వీటిసతుల పాలిండ్లపై గంబూరనవహారములు చిప్పకవుచున్నాను. ఆము ౨. ౩

ద్వి ఎనయజక్కవలు పాలిండులు గాఁగ ద్వి హరిశ్చ ఉ ౨౬ వీర ౧. ౧౪౫

**పాలిందము.** సం వి అ పుం కుందురుకము. నల్లతెగడ, కాలమేషిక. శ

**పాలింది.** సం వి. ఈ. స్త్రీ నల్లతెగడ, కాలమేషిక శ

**పాలింపించే.** సం స క్రి పరిపాలింపఁజేయు.

క. క్రమమున సమస్తరిపులన్, సమరమున జయించి యగ్రజన్ముని మాన్యున్, విమల మతిన్ ధర్మాత్మజుఁ బ్రమదమునన్ విశ్వమెల్లఁ బాలింపించెన్ హర ౪. ౧౯౩

**పాలింపిరము.** సం వి స్త్రీ మండలి సర్పవిశేషము

**పాలిక.** వి అంకురార్పణ శరావము, వివాహాదులందు నవధాన్యములు మొలపించునట్టి మట్టిమూకుడు.

సీ. పాలిక జాజాల పాలిక జాఁగను నంకురార్పణ శరావాఖ్య దనరు. ఆం. భా. ౨ ౧౪౯.

జ: పాలాడు, పాలారుచు, పాలికాఁపు, పాలి చుట్టము, పాలివాఁడు, పాలుగోలుపు, పాలుగొను, పాలుపడు, పాలుపఱచు, పాలుపుచ్చు, పాలుపోవు, పాలుబాస, పాలుపెట్టు, పాలుసేయు, ఇం.

**పాలు².** వి. బ. (సం. పయః. క. హాలు. త. పాల్.) ౧ క్షీరము.

(దీని నొకొకవి ఏకవచనముగాఁ బ్రయోగించి నాఁడు)

ద్వి...కొడుకుఁ, బా యరి యక్కునఁ బట్టి పాలిండ్ల, నొత్తి
ద్వి. హరిశ్చ. ఉ. ౭౦౩౭

గీ. పాలఁ బుట్టినమాత్రాన మేలిగుణము, లేదు నీ కేల గల్గు నోనీరజారి. మనుచ. ౩ ౪౧

సీ...పోసవాల్ పాలు వాఁ బొల్చు బహుళ, క్షీర మగు .. ఆం. భా. ౨. ౭౧౮.

౨ పత్త్రిమొదలగు చెట్లయందుఁగలిగెడి తెల్లని రసము; రసము (శ. ర.)

(చూ. చెఱకుపాలు)

—చిదిమినపాలువచ్చు = మిక్కిలి మార్దవమగు; దయారసముతో నిండు

గీ. ..ఒడల్ చిదిమినఁ బాలువచ్చు, అతఁ డిది కార్య మని నిశ్చయంబుసేఁత నాయభాగ్యంబ యెుండొక చేయునేల
నిర్వ. ౯. ౭౨

—పాలఁజల్లిన నీరుంబలె = ఎరమఱిక లేనట్లు

క. కలలోపల వాలుక పూసలలో వారంబుఁ బాలఁజల్లిననీరుం, బలె వెలి యొఱుఁగక...
పాండు ౩. ౪౯.

**పాలవంటికులము** = స్వచ్ఛమైన కులము, అకలంకమైన వంశము.

గీ. కాఁపురగోడలు కంచుంత కాఁపురంబు, పాలవంటి కులంబుఁ గాచ్చుఁబాడి యుతికె,
పాండు. ౩. ౭౧.

ద్వి. అలయుల్ప ముఖమునకై పాలవంటి, కులము మాలగఁ జేసికొని మనుచుంట. ద్వి. హరిశ్చ పూ. ౧౩౫౫. శకాం. ౩. ౭౭.

**పాలలోఁబండ్లుపిసుకు** = కీడు గలిగించు, అనిష్టమును గలిగించు.

పాలలోఁ బండ్లు పిసుకగానే పాలు విఱిగి పోవును.

సీ. గడ తేదనఁగ దేవకీదేవి బలఁగ మొప్పినఁ బాలలోఁ బండ్లు పిసికి రమ్మ
ఉ. హరి. ౫. ౭౬౦

**పాలేటిచూలి** = లక్ష్మి.

సీ. పాలేటి చూలి రైయాలగాపరి యయి, తద్దయు మేల్వాడు ముద్దరాలు.
అచ్చ. భా. ౧. ౫

(ఇట్లే పాలేటిరాచూలి, పాలేటి రాచకన్నియ. ఇం.)

సీ. ఏ సుందరాంగి పాలేటిరాచూలన నమృతంబుతోఁగూడ నవతరించె బ్రహ్మ. ౧. ౪.

క. పాలేటి రాచకన్నియ, మేలారెడు చూపు లేక మిడుమిడు కంచున్, జాలిం బురపురఁ బొక్కుచుఁ, దూలిరి రక్కసులు కీడు దోఁచిన నధిపా. భాగ. ౮. ౭౯౦.

**పాల ముంచినను నీళ్లను ముంచినను** = రక్షించినను శిక్షించినను.

ఉ. నీ విఁకఁ బాల ముంచినను నీళ్లను ముంచిన మేలటంచు నిటా, లావిరిఁబోణి కన్నుఁగవ కాత్రికవృత్తి వహించి...చం. రా. ౩ ౪౮.

పా: పాలలోఁ బడిన బల్లివిధంబున.

చ. ఉమ్మలికంబునఁ గొంత యుంతకున్, బడుగయి పాలలోఁ బడిన బల్లివిధంబున నుండ కుండునే. భార. ఉద్యో. ౩. ౧౩౫.

జ: పాలకి, పాలకడలి, పాలకుప్ప పాలకూడు, పాలకోడిసె, పాలగార. ఇం.

పాలుఁడు. సం విణ (అ. ఆ అ) రక్షించు వాఁడు, కాచువాఁడు ఉదా : గోపాలుఁడు, నరపాలుఁడు.

పాలుకము. సం. వి. అ పుం మాపము (శే ని)

పాలుకుఁడు. సం. విణ (అ ఆ. అ) సూప కారుఁడు, వంటవాఁడు వి అ. పుం అధ్వ ర్యుఁడు (శే. ని)

పాలుకొలుపు స క్రి. (√పాలుకొను)—పాలు గొనఁజేయు—పంచిపెట్టు

సీ ఏపరాత్పరు దివ్యరూపానుభావంబు భాగం బులకు మేలు పాలుకొలుపు

కృ శతకం పీఠి ౯౪

పాలుగాఱు. అ క్రి. (పాలు$^{2}$ + కాఱు)
౧ పాలుస్రవించు ౨ మృదువగు

సీ పాలుగాఱుచుఁ జంద్రుమేలు గానఁగ నొప్పు మోహనంబగు నగుమోముగోము

వాల్మీకి 3 ౧౧౯

పాలు(ల్)గొ(గొ)ను. స క్రి (పాలు$^{1}$+ కొను) పంచుకొను, విభాగముచేసికొను

ఉ ఆదిమశక్తి యైన తుహినాచలరాజతనూజ వోలె మ్ము, త్రైదుప పై నికేశ్వరునియర్ధశరీరము పాలుగొమ్మ

శైవ ౬ ౧౪

సీ ఎత్తి పాల్గొనిరి శచీంద్రునంటివానిఁ గల గుండుపెట్టిరి కలశవార్ధి

శైవ ౭ ౫౧

క మనుమలు తారతనము పాల్గొన యోగ్యతి గల్గి పంచుకొనుచోఁ దమకున్, జనకులు పెక్కం డ్రైనను, జనకులయంశములు గొనుట సద్ధర్మ మిలన్

విజ్ఞా వ్యవ ౧3౪

పాలుసు. వి (√పాలు$^{2}$) పాండురోగము, తెల్లఁబడుట

సీ. పాలుడు జాఁగఁ బాండువు విలసిల్లు .

ఆం భా. ౨. ౧౨౭

పాలుప(ల్పు,వ)డు. అ క్రి. (√పాలు$^{1}$)
౧ భాగముకొను, సిద్ధపడు.

గీ దౌని ప్రత్యక్షముఖ్యప్రమైకసిద్ధ,బహు విరుద్ధార్థములు చెప్పఁ బాలుపడిన,యట్టి వేదాంతమే శాస్త్ర మయ్యెనేని, గాద్ధమతి మది చేసినపాప మేమి ప్రబోధ. ౨ ౭

ఆ కమలలోచనుండు ఖలుల శిక్షింపంగఁ బాలుసేయ నీవు పాలుపడితి,వి .

భాగ. ౯ ౧33

౩. . . పరిఘూ,కారములు కందమూలాదా యులకుఁ బాలువడెఁ గదా నీకరమల్.

హర ౭ ౧౧

సీ పాలుఁడ నని పట్టపగలు నట్టేటిలోఁ బలుఁ చేఁతలకుఁ బాల్పడినవాని. విప్ర ౪ ౪౪

క అల్పముల కేమి కృతనం,కల్పుల మై యదు గఁద్రొక్కఁ గలపా లేమో,పాల్పడి గమ్మనుమా యల,కల్పాంతము దాఁటియేడ్ గాడ్పుల నిటకున్. రామా ౭ ౪౦

చ పలుమఱుఁ దప్పులే పెకకఁ బాల్పడి యుండుటగాక దుష్కృతుల్, తెలియఁగఁ జాల పెట్టు రసదీపకకావ్య కళాకలాపమ్య ములే కవిరా ౧ ౧౭

౨ కలుగు, సంభవించు

క నృపధర్మ పై క్వధర్మ ము,లపాపకర్మ ములు జీ నాభావముపా,లుపడినబ్రాహ్మణునకు

భార శాం ౫ ౪౯3

గీ కులము నెల్లను బొలియింపఁ గుత్సితంపు బ్రదుకు వచ్చెను యనుపగ పాలుపడఁగఁ బ్రమద మొసఁగుడు దైవలోక్య రాజ్యమైన

భార శాం ౧ ౪౫

ఆ. ఎచట నున్న నెచటి కేఁగిన నీపాద,పద్మ భక్తి మాకుఁ బాలుపడును, గాత మనే యగుడు...రామ... అధ్యా. ౧౫. పా (స్వాధీనమగు. అని శ. ర.)

క. అలసటలే కనుమ్మాగుణ మందక తగ్గక
తొట్రుపాటునం, గలంగక పాలుమాలక
వికారముం బొందక యాలసింపకం, దొలం
గక నిద్రమబ్బుగాని కూలక నిద్దఱు గూడ
కొంతతోం, దలియకటారివాని బెడిదంపు
డాగం బొనరించి రంతయుచా.

హంస. ౩ ౨౩౧

ఉ. కూలికి నూరె లంటి కిలగూరలకై పాల
మెల్లం జుట్టి పా, ల్మ్రలకి యాత్మబంధు
జనులం దరియం జని ప్రాంకలబ్బ్లకై, కూళ
తనంబునం బ్రభులకుం దమమర్దన మాచరించు
చుణ్ణా. శుక ౨ ౩౬౩.

౩ లొంగు, వశమగు

సీ. పాలుమాలింపక పంచేంద్రియోద్వృత్తి నడిం
చినకాండిల్యనంతవాని చంద్ర ౨ ౪౮.

పాలువె(ల్వ)ట్టు. స. క్రి. (పాలు + పెట్టు) ౧ భాగించు, పంచు.

సీ. తండ్రి యీహాస్తగతం బైనయర్థంబు పెట్టి
వానికిం బాలువెట్ట పేల.

వా. పంచ ౧. ౫౧౫.

వ ..కామక్రోధలోభ మోహంబులకును
వెలువేల యధికారంబులు పాలువెట్టిత నవి
రొయ్యాడి యుంటేని... నైష. ౪. ౧౩౪.

౨. నిర్ణయించు, స్థిరపఱచు (శ ")

౩. నియమించు, ఏర్పఱుచు

సీ. కోదండగమి గూర్చుకొని దేవకీదేవి భక్తిం
గంతి భజింపం బాలువెట్టి.

జై. భా. ౩. ౭౧.

ఆ. పగఱలోన నొకనిం బాల్వెట్టు మెట్టుకాం,
దైన సమయం జూచి యడగువాడ.

భార. కర్ణ. ౧. ౨౭౯.

పాలుమి. సం. వి. ఈ. స్త్రీ. భార్య, ఆలు. (శై. ని.)

పాలుసేయు. స. క్రి. (√పాలు1) పంచుచేయు, నియమించు.

ఆ. కమలలోచనుండు ఖలుల శిక్షింపంగం, బాలు
సేయ నీవు పాలుపడితి, వైన నింకం గాలు
జాపనుం దైయున్న, తపనిం గాపు మీవు
ధర్మవృత్తి భాగ. ౯ ౧౩౩

పాలూఁకుఁడు. సం. వి. అ. పుం. కింకరుఁడు.

పాలూరము. సం వి అ న గోత్తిపలము, ఎఱ్ఱ కలువ (శ ని)

పాలూరుఁడు. సం వి అ. పుం దూత. (శ ని)

పాలెలు. వి బ. పిల్లల మొలత్రాటియందలి వెండి బంగారముల బిల్ల (శ., ౬ ప్రా)

పాలెము = పాళెము1. వి ౧ పరివారము, సేన

గీ. పాలె మేమని గిరిం జూడం బవరి యుంపు వారి
మడికావుమలకు నిపాలె మిడుగా.

పార్వ. ౨. ౪౦.

వ రాజవాహనపాలెంబుం దివియించెద నని
చలము పట్టి... రా. వి. ౫. ౨.

౨. సేనానివేశము, దండువిడియుచోటు.

గీ. బంటు పెఱుంగవు గాస మి మ్మంటెం గసరె,
దవసరము వచ్చె మముం జూడు మనెడు
వారు, వైరి మగధేంద్రుపాలెంబునందు రిపులు,
డాసి చేవాసి యెలతాలు జేసిరపుడు.

రా. వి. ౫ ౫.

౩. చిన్నయూరు, చిన్నగ్రామము.

ఉదా: రావులపాలెము, వాదపాలెము.

పాలెంబులుండు. అ. క్రి. (√పాలెము) కావలి యుండు.

సీ. పాలెంబు లున్నట్టిభయదానవకావలిం గిట్టి
మూర్కొనంకుండం గిటదంచి. హై. ౩. ౨౪.

పాలెముండు. అ. క్రి. (√పాలెము.) కావలి యుండు, కాచుండు.

సీ పండువాహురశాలి పావడం బిచ్చినభద్రేభ ములం బిఁకఁ బాలెముండు భీమ ౧ ౩౪.

ఉ. నందివినాయకాదిగణనాథులు గూడిధృతా స్త్రశస్త్రులై రెండలు పాలెముం దురు మహీధరకన్యకు సావధానులై నంది వినాయకాది గణనాథులుగూడి ధృతాస్త్ర శస్త్రులై యందలు పాలెముందురు మహా ప్రభుపీఠికి దక్షవాటికిన్ భీమ ౩ ౧౬.

ఆ పాలెమున్న వారిపై నొల్కి బూడిదమందు చల్లి. ద్వా ౧౦. ౧౨౧

పాలేరు=పాలేరువాఁడు. వి. (పాలు[1]+ఏరు[1]) పేఁడిపాలికిదున్నెడుమదఁకవాఁడు. (శ. ర.)

ద్వి ఏకేళ భూమి పాలేరులు గలిగి,కూర్మి సస్యంబులఁగూడి రహించు.

ద్వి నల ౧ ౨౩౦

పాలేరువాఁడు = పాలేరు. వి (√పాలు[1]) పేఁడిపాలికి దున్నెడి మదఁకవాఁడు (శ. ర.)

పాలేఱు. వి జా. (పాలు[2]+ఏఱు[2]) ౧ కాంచీ పురప్రాంతమందలి ఒకానొకనది.

క... మూరుకేరి కలహంసీమండలకాండవఖండన, పాండిత్యంబునఁ దనర్చుపాలేటిదరిన్.

పరిమ ౪ ౨౨౩

౨. పాలసంద్రము.

దండకము తొల్వేల్పులు వేల్పులుం గూడి పాలేఱు బే ద్రచ్చుచో. నీలా ౨. ౪౧.

గీ. అట్టిదంతులలారి,కౌలఁపుపాలేటి నిండుజాబిలి యనంగ. అచ్చ. రా. బాల. ౧౧.

పాల్లకుఁడు. సం. విణ. (అ. పల్లికా. అ.) పల్లె యందుఁబుట్టినవాఁడు, పల్లెటూరివాఁడు, జాన పదుఁడు.

పాల్లవ. సం. వి. ఆ. స్త్రీ. పల్లవములతోడియాట.

పాళ. వి. (క పాళె) పోఁకలోనగు చెట్లకొక్క కప్పడిప్పతోఁగూడిన పూలగుత్తి.

రగడ పాళ కల్లది పోఁకఁ బ్రాఁక బందము దొగియ,నాళి యది దిగజాఱునట్టిదందము నగిరెయి మనుచ. ౩ ౧౪.

(బ) ధాన్య విశేషము.

మ. సారిదిం బేర్చినతీఁగమల్లియలు ఖర్జూరంబులు న్పుప్పమం,జరులు న్మామిడిగుత్తులు న్గుజు మతు ల్పంచెంగలు న్పచ్చగ,న్నెరులుం శాళలు గల్గి రాజవపుఁగాంతిం దారు ముబ్బాసి చేఁలరుదార న్నగుఁ బూవుఁ దోఁటల బలాకానీకదంభంబునన్.

ఆము. ౧. ౬౬.

(ఇది రెండర్థములకు నుదాహరణము.)

పాళము. వి (సం ఫాలమ్, పారమ్, క పాళ, త. పాళం, మ. పాళం)

౧. (బంగారుమొదలగువాని) ముద్ద

ఉ. పాళము మీఱు పెద్దపెదపాళము లై బలి తంపుఁగాఁగులన్,మూలుగుచున్న ప్రాఁబసిఁడి ముంచి ధనార్థుల కిచ్చు

పాండు. ౪. ౨౧౧.

౨ సమయము

రగడ భామ కోయకు వేగపడి పూఁబాళఁ బాళము గాదు సేఁటికి. పారి. ౪. ౧౬.

౩ విధము (శ ర.) ౪. (=పాళా) బంగారు. మొ. వానికడ్డీ. (శ. ర.)

౫. హద్దు, మేర, అవధి.

ఉ. భవత్తమూజునకు నే మొనరించినయట్టి దేమి యా, పాళము దప్పఁ గ్రొవ్వినయభాగ్యుల కూరక యొడ్వవచ్చునే. కాశిఖ. ౫. ౫౧.

పాండు. ౪. ౨౧౧.

పాళా = పాళము. వి. (త పాళం)—బంగారులో నగువాని—కడ్డీ. (శ. ర)

పాళి. వి. (సం పాళికా.) ౧ జూదమాడెడు పలక

ఉ...ప్రాణివితతుల్ పాలెల్ పగల్ రేయి పా,చికలున్ లోకము లెల్లఁ బాళియును గాఁ జేకూర్చుకాలంబు.

మల్లభూ. వైరా ౪౭

చ. బలితపుఁబద్మజాండ మనుపాళి ఘటిం చట మీఁద బద్ధజీవు లనెడిసారె లుంచి రహి పుట్టఁగ నమ్మిహిలేందుజాముల్,గల బలు పాచిక ల్గొని చవు ౧. ౯౬

౨. పారెలపోఁత.

గీ. సకలనుతమాతసాక్షమాలికలొ గుప్త, మనుజ పాళులొ దేవసంప్రార్థనములఁ,బూను గొత్త మ్ములో రాజ్యధూరిభగము,లిల సదాపాళ వృత్తుల కేల సెపుమ హ. న ౩. ౧౪.

పాళియ=పాళె. వి. ౧ జూదమాడుపలక (శ ర.)

౨ పాత్రము, పళ్లెము

గీ తఱుసుద్యాహమునకమ కేంద్రదిగ్వి, లాసవతి పైఁడిపాళియఁబోసి తెచ్చు పాదములొనాఁగ రాగపూర్వోదయొండు,బింబ మునఁబొండుకి రణాంకురంబు లెసఁగె. కు. సం ౫ ౧౧౭

పాళియము=పాళెము. వి (త పాళియ) (శిబిరము, సేనానివేశము 1)

ఉ...పూ, ర్వావనిభృత్తటాటవుల నాఁటవికుల్ మృగయా విహారముల్, చేవ దలిర్పఁజేయు టకు శిఘ్రమ పాళియ మెత్తి కుంభజ, గ్రామనుతాప్రతీరగిరికాననమధ్యమునన్ వసిం చుచున్. కాశ ౩. ౫౨.

శ. అప్పుడుఁ జెల్లెలు బలె మన్నమెప్పుడు నిలిఁ గూడియుండ నిద్దఱమును సొం, పొప్ప నని బాఱ పాళియ, మప్పడె యెత్తి వడి నరిగె రిమకావతికిన్.

బాల్మీకి. ౩. ౧౩౯.

పాళి[1]. వి. ౧. వ్రాసెడి యినుప కలముకొనక్కు- కొన (శ ర) కలమునకు కొనను తగిలించి వ్రాసెడి యినుము మొదలగువానిముక్కు.

ఉదా: బంగరుపాళి, ఇత్తడిపాళి మొ.

పాళి[2]. వి. ౧. జూదమాడెడు పలక. ౨. వాదము.

పాళి[3]. వి మల్లయుద్ధ విశేషము

మ. జవసత్త్వంబులు మేలె సాము గలదే సత్రా ణమే మేను భూప్రవరుం బోసన మి మ్మనంగి వలెనే పాళి లభిష్టంబులే

భాగ. ౧౦పూ ౧౩౩౧.

పాళి[4]. వి. కాలనియమము

(వ్యవ) సప్తాహములో పాళి లేర్పఱచుకొని భజన చేయుదురు

జ. పాళిజ్వరము

పాళిజ్వరము. మి. వి. (√పాళి4) కాలనియమ మునుబట్టి తగులుచు విడుచుచు నుండెడిజ్వరము

గీ. కటుకరోహిణిఁ జనుఁబాలఁ గలయ నూఱి, కడుపునకుఁ బోసి రాయిడ లెల్లఁ గలయఁ జమురఁ,దీఱుఁ బాళిజ్వరంబులంతియు వసయు, గరిఁటె తామరసంబునఁ గలిపి చముర

(వై శి. చి. ని.)

పాళె=పాళి, పాళియ, పాళి. వి (సం పాళికా) జూదమాడెడు పలక.

సీ పాళె యుం చన కారిఫలము పేరు

ఆం. భా. ౨. ౩౦౫.

పాళెగాఁడు. వి (√పాళెము) ౧. దొర, ప్రభువు; సేనాపతి.

సీ. పాలుపొందుపండుకావలిపాళెగాండ్రకుసున్న దాడిమ మిచ్చి కుడురుపఱిచి.

చంద్రా. ౪. ౯౪

చేసినంతయు విని పాళెముననుండి మరలి విభునిఁ గని భజించె.

రామా. 8. ఉ. కిష్కి 1. 108.

8 రాజగృహము, దివాణము

కు. కుంభోద్భవుపాళెమున వి, కుంభు దివాణమున భృంగి కులపతి గాఁగాఁ, గుంభోద్భవువగఁ దెలిసి, శంభుని కింకరులు గర్వాంగంధమునన్

హర 16.

6 చోటు, వాసస్థానము

చ కలువలమేలికందువలు కాముని యొయ్యపుఁ బాళెముల్ విరోధ్యులఁ జలఁకించువేళలు

భాగ 10 పూ 62.

రగడ వేంకటశైలము విగతికరాశము, వేంకట శైలము విష్ణునిపాళెము ప్రబంధ 36.

6. తావలి, కాఁపు చూ పాళెముండు

జ పాళెగాఁడు, పాళెపట్టు, పాళెముండు, పాళెముడిగు, పాళెమువెడలు

పాళెముండు. అ క్రి (√పాళెము) కాఁపుండు,

సీ పండువాఁడురకొణి గావడం బిచ్చినభద్రదేహములు వీథిఁ బాళెముండు క 1 36

పాళెముడిగు. అ. క్రి. (√పాళెము) దండు విడియు.

క. ఈలీల వెండిమలకడఁ, బాళెముడిగి

ఉ. రా. 4. 148.

సీ. పాళెంబుడిగి యొక్కపజ్జ నిల్వకమున్న కూడిచేసినవాఁటి గుండెదిగులు

రా. వి 3 62

వ. ఇవ్విధంబున రఘునాథుండు పాథోనిధిం దాఁటి సువేలనగంబునఁ బాళెంబుడిగిన ..

దశా 6. 116.

పాళెమువెడలు. అ. క్రి. (√పాళెము) దైత్రయాత్రకు బయలువెడలు.

రగడ పచ్చబింటిదొర పాళెమువెడలెఁగా, కెచ్చు నూర్చి కడు విరహిణి బెదరెఁగా.

బహు. 2. 13.

పావంచ. వి మెట్టు, సోపానము (శ. ర., గ్రా —"పావంచా" అని వా)

పావకము. సం విణా (అ విగా అ) పవిత్రము చేయునది, పరిశుద్ధము చేయునది, శోధకము— వి అ పుం 1 నిప్పు 2 వైద్యుతాగ్ని, మెఱపునిప్పు 3 అగ్నిమంథము, నెల్లి చెట్టు 4 చిత్రకము, చిత్రమూలము చెట్టు 5 భల్లాతకము, జీడి చెట్టు 6 విడంగము చెట్టు. 8 రక్తచిత్రకము, ఎఱ్ఱచిత్రమూలము చెట్టు 9 కుసుంభము, కుసుమ చెట్టు 6. మూఁడు అను సంఖ్య. 7 - సోమపానము. (వై వి)

పావకాత్మజుఁడు. సం వి అ పుం 1. కుమారస్వామి 2 సుదర్శనముని

పావకి. సం వి ఈ. స్త్రీ 1 అగ్నిభార్య 2. సరస్వతి

ఇ పుం 1 కుమారస్వామి 2 సుదర్శనముని

పావకుఁడు. సం వి అ పుం 1 వరుణుఁడు. 2 సూర్యుఁడు

పావకోడు. వి (పావలు + కోడు—౩ పావకోల్) పాదుక.

సీ పావాలు పావలు పావకోళ్లనఁ జెల్లుఁ బాదుకాభిఖ్యలు

పాం. వి. మాన. 44.

గీ. అలరు పావాలు పావకోళ్లనఁగఁ గోడుగు, పావ లనఁ బావ లనఁగను బాదుకములు, దనరు ..

ఆం. పద. పరి. 104.

పావటీలు. వి. బ. మెట్లు, సోపానములు. (శ ర., గ్రా)

పావడ[1]. వి. (క. పావడ, త. పావాడై, మ. పావాడా).

౧. స్త్రీలుకట్టుకొనెడు వస్త్రవిశేషము, అంగదట్టము, గాగరా.

సీ. లుంగి,యన నంగదట్ట మం చనఁ బావడ యనంగ దోపాంతరీయ మై యొప్పుచుండు. ఆం. భా. ౨. ౧౫౭.

చ. తొడవులు పుచ్చి నిర్జరవధూటులు పెలుపు ప్రాని చీనిపావడలు ధరించి... పారి. ౪. ౨౭.

సీ శశిశదళోదరచ్ఛదపుఁబావడ లూరుచక్రచకఁ బట్టి పాలికిఁ బెనంగ. ఆము. ౫. ౧౪౩. చంద్రా. ౪. ౨౩౯.

౨ ధౌతవస్త్రము

సీ బంగారుచెఱఁగులచెంగావిపావడ నొయ్యనొయ్యనఁ దడి యొత్తి నొశశి వరాహ ౯ ౧౩౯

చ చెలికి మెఱుంగుఁబావడలచేఁ దడియార్చిను ధూపవాసనల్‌,దలకొలిపెన్‌ ... ప్రభా ౪ ౧౩౦. చంద్ర. ౫. ౧౫౧.

౩ వస్త్రము, గుడ్డ

వ. అక్కాంత యిక్కడ నొక్కచిగురుం బోదరుటేఱుమి నిడినదాన నని యాత్మణంబు తెచ్చి పెచ్చెలియుం దాను నప్పులకకప్పు పావడ దొడలించి... ప్రభా. ౧ ౧౩౪.

సీ. కమ్మబాతెఱకుఁ జెంగావిపావడ చల్లఁ గంత పీతకపు శంఖములు చెల్లు. బహు. ౫. ౪౭. భీమ. ౫. ౧౧౦.

౪. ఒకవిధమగుచుఱఁటి.

గీ. దండిభవధూటినిభు లైనదండికవులు,సరస విద్వత్కవుల్‌ దనసరస పెలయ,వనిత లిరుగడఁ జెంఁడిపావడలు వీవఁ,బ్రబుధమలరంగఁ బేరోలగమునసుండె. కృష్ణ. ౧. ౭౧.

మ......ఘూరమణు లత్యంతప్రమోదంబునం, గనఁగాఁ బల్లకిలోన నిందుమతి శృంగారాంగసంపత్కళల్‌,దనరన్‌ బంగరుతళ్కుపావడలు చెంతన్‌ పెచ్చెలుల్‌ పేయఁగన్‌. ఇందు. ౫. ౧౦౪.

పావడ [2]. వి. పాదభూషావిశేషము.

చ. చరణతలంబునన్‌ బసపుసన్నపుపావడపెట్టు గంటలున్‌,బిరుదులు గాఁగ... రా. వి. ౨. ౫౪.

పావడము[1] = పావడ [1], పాగడము [1].

వి. వస్త్రము.

సీ. ఏ పేమ యని దోలి పెత్తినపరదేశిగొంల పావడములు తోరణముగ. భార. విరా ౩. ౪౪.

పావడము [2]. వి. (క పావడ, పావుడ) కానుక, ఉపద

సీ. పండువాఋరశాణి పావడం బిచ్చినభద్రేభములఁ బిలిఁ బాలెముండు. భీమ ౧ ౩౪

గీ. తనకుఁ బ్రబ్లోవ యనుదేవతాపురంధ్రి,పావడముఁజేసి పెద్దాని భయముతోడ,వట్టితన పారిజాతమాల్యంబు పూరికి,దరిసెనం బిచ్చి దీవించి తాపమండు పూర. ౭. ౧౫.

గీ. అనుచు నీలాల్గొమణులను నంబురాశి,పావడంబుగ నాచేతఁ బనిచె మీకు. విక్ర. ౫ ౧౧౫.

పావనకము. సం. వి. అ. పుం. టంకణము, వెలిగారము.

పావనధ్వని. సం వి. ఇ. పుం. శంఖము.

పావనము. సం. విశే. (అ. ఈ. అ.) ౧. పవిత్రము చేయునది, పరిశుద్ధముచేయునది (సాధనము). ౨. పవిత్రము, పరిశుద్ధము, నిర్మలము.—వి. అ. పుం.—౧. అగ్ని. ౨. సిద్ధాశము, బిల్లమఢ్డి,

అందుగుబంకతోఁ జేసినధూపద్రవ్యము. ౩. పీత భృంగరాజము, పచ్చగుంటగలిజేరు. శ. —న—౧. పవిత్రముచేయుట. ౨. ప్రాయశ్చిత్తము. ౩. జలము. ౪. గోమయము. ౫. రుద్రాక్షము. ౬. చెంగల్వకోష్టు. శ ౭. చిత్రకము, చిత్రమూలము. శ.

పావని. సం. వి. ఈ. స్త్రీ ౧ హరీతకి, కరక శ ౨. తులసి. శ. ౩. గంగ. ౪ గోవు, ఆవు. ౫. గ్రాసము, కబళము (వై ని)—ఇ. పుం ౧. భీముఁడు ౨ హనుమంతుఁడు, ఆంజనేయుఁడు

పావనుఁడు. సం వి. అ. పుం ౧ వేదవ్యాసుఁడు ౨. విష్ణువు. ౩ సిద్ధుఁడు.

పావమాని. సం వి. ఈ స్త్రీ పవమానాదులను గూర్చి ప్రవర్తించుఋక్కు.

పావర. వి. (క. పావల) అడుగు, పాదము.

సీ. పావర పైచుచో భామాకరాంచన్మణీకం
కణాళి ఘణిల్లు రనఁగ. ఇందు. ౨ ౧౨౩

పావరము. సం. వి అ పుం. పాచికయొక్క రెండుచుక్కలు గలపార్శ్వము; ఆపాచిక యొక్క ఒకదినుసుద్రోపు.

పావలు = పాగలు, పావాలు. వి బ. (క పావల్) పాదుకలు, పావకోళ్లు

క...అరుణ,శ్రీ మించువలెనిపదములు,భామామణి
యూర్తు పైఁడిపావలు దొడిగెన్.
పారి ౨ ౭.

చ...దువ్పటిపై వలెవా టమర్చిపావలు ముని
ద్రోల్ల బెట్టి శుకవర్యునిద్రోవాల లకాంగి
నిల్చినన్. శుక. ౧. ౩౪౪.

క. పావలుఁ జెప్పులుఁ దొడుగొని,దేవ శివాలయ
ములోనఁ ద్రిమ్మరుచుపాపుల్. శివపా. ౨౯౧.

౫. పావకోడు.

పావళము. వి. పక్షివిశేషము, ఒకానొకపక్షి.

సీ. బలితభుజబలిచె పావళము చేకుర చింద
కక్కుర రేఁత్రింత కాలుకోడి.
యయా. ౨. ౨౪.

పావాడము = పవాడము². (క పావాడమ్) (పావడము. చి. వి. పా) ఒకకార్యము నెఱవేఱవలె నని దేవుని ప్రార్థించుకొని యాప్రార్థన నెఱవేఱినయెడ దేవునియెదుట చేయుజిహ్వాచ్ఛేదనాది సాహసకృత్యము. (శ ర. ద్రా)

పావాలు = పావలు. వి బ. పావకోళ్లు.

సీ అడుగుబెత్తమ్ముల నపరంజిపావాలు కరమునఁ
గెదారకంకణంబు కాళ. ౧ ౩౦

శా కెలన్ గూఁతలు పెట్టువాలు పురిచక్కన్
మించుపావాలు ముం,గాలన్ జాలుజెలంగు
దాలు .. ప్రబంధ ౧౫౪

గీ. బెలుఁగుచెంగావిదట్టిపైఁ జెక్కుకొన్న,వంకి
దులకింపఁ బసిఁడిదువ్వలువ వల్లె,వాటు
నెఱినీటు గులుకఁ బావాలు మెట్టి, రాజ
దేవేంద్రుఁ దంతఃపురంబు వెడలె.
ఉ. రా. ౮ ౩౯౫

పావి. విణ (సం పాపీ,ప్రా. పావి. క. పావి.) పాపాత్ముఁడు.

ఉ దేవుఁడొ కానిరో యని మదిం దలపోఁతలు
సాకకొని ని,స్పృహ చేయుచందముల నింద
యొనర్చెద రిష్ట మూఁగ యన్,బావులనోరు
నీరొదవపాదకలంబునఁ దన్నినట్టుగా,నీ
వొకయింత యూవు రని యుద్వేఁగదన్న
కుమారరత్నమా. పరమ. ౨. ౧౭౬.

పావిలి. వి. చిన్నజాతిగోళికూర, పిచిల్లిక. శ.

గీ. మిరియములును వెన్నయును దిన మేలి యైన,
తిలజమును లక్కబోడియును మలయజంబు,
స్వీకరింపంగ నూనె పావిలిరసంబు,బుచ్చు
కొనఁ జోవు ప్రదరము లొప్పడిమిగను.
చికి. ౨. (చి. ని.)

సీ. కుచ్చలి యుం చనఁగుచ్చలి యనఁగను గోలి
యటన్నను గోలి రాముప్పఁ, బావిలి యంచనఁ
బరగుఁ దద్భేదంబు...
ఆం. భా. ౨. ౪౮. (పావలి. ఆం. శ. ర)

పావు. వి. (సం. పాదః, క. త. పావు) వరపాలో
నాల్గవభాగము; నాల్గవభాగము
సీ...పాదదీనారంబు పా వనఁ దగు
ఆం. భా. ౨. ౨౪౩

జ: పావులా.

పావుపావు. వి. మల్లబంధవిశేషము.
వ చిట్టముగు కత్తెర పావుపావు జోగినపావు
మొదలుగాఁ గలపదిరెండుపరువములును...
ప్రబంధ. ౪౭

పావురపుఁబలుకు=పావురాపలుకు. వి (పావు
రము + పలుకు) మణితము. (శ ర)

పావురము=పారువము. వి (సం. పారావతః)
పక్షివిశేషము, కపోతము
సీ మురిగాలి దవదగ్ధతరుపర్ణతతి రేఁపఁ బావురా
లని డేగపడుపు దూఱి. ఆము. ౨ ౪౬.
రగడ. ఇంతి పావురపురొద రోల విను దారి
జము. మనుచ. 3 ౭౪
జ: పావురపుఁబలుకు.

పావురాపలుకు=పావురపుఁబలుకు. (√పావు
రాయి).
సీ. మణితవాచకము లై మనుఁ బావురాపల్కు
లనఁగఁ గూకిపల్కు లనఁగ...
ఆం. భా. ౨. ౧౭౦.

పావురాయి. వి. (సం. పారావతః) పావురము.
ద్వి నీవు నెమ్మనితో నిలిచితివేని, పావురాయులు
లక్ష పదివేలు గలవు.
ద్వి. తి. పా ౧. ౬. పా. ౧౪. కం.

ఆ. కికిలి కేలకొమలి పెనుగువ్వ బకదార, పావు
రాయి నీవడు పలువరింత, చెదరుకోడి గువ్వ
వదరుతోఁకలకేడి, యాదిరైనపక్షు లతఁడు
దీర్చు. హంస. 3. ౧౩. ఆం. భా. ౨. ౭౯.
జ: పావురాపలుకు.

పావులా. వి. (√పావు-సం. పాదః, క. పావల్)
రూపాయలో నాల్గవభాగము—ఉదా: రూపా
యను నాల్గుపావులాలు.

పాశకపీఠము. సం. వి. అ. పుం. ౧. శెత్తపలక.
౨. జూదపుటిల్లు.

పాశకము. సం. వి అ. పుం. ౧. పాచిక,
అక్షము. ౨. బంధము, ఉరి. (ఉదా: కంఠ
పాశకము. మొ.)

పాశక్రీడ. సం. వి. అ. స్త్రీ. పాచికలాట.

పాశనము. సం. వి అ. న ఉరి, వల, బంధనము.

పాశపాణి. సం వి ఇ పుం ౧ వరుణుఁడు.
౨. బ్రహ్మదేవుఁడు

పాశబంధకుఁడు. సం వి అ పు. పిట్టలను
బట్టువాఁడు.

పాశబంధనము. సం. వి అ. న. వల, ఉరి.

పాశబంధము. సం. వి. అ. పుం. ఉరి, వల.

పాశబద్ధుఁడు. సం విశ. (అ. ఆ. అ.) వలలోఁ
దగిలినవాఁడు, చిక్కుకొన్నవాఁడు.

పాశభృత్తు[1]. సం. వి. త్. పుం.—పాశమును
దాల్చినవాఁడు—౧. వరుణుఁడు. ౨. బ్రహ్మ
దేవుఁడు.

పాశము. సం. వి. అ. పుం. ౧. త్రాడు; మృగ
విహగాదిబంధన మగురజ్జువిశేషము ౨. వరు
ణుని శస్త్రము. 3 బ్రహ్మదేవుని శస్త్రము.
౪. పాచిక. ౫. కేశవస్తువులయొక్క అంచు.

౨. (సమాసమందు శేషపర్యాయములకుఁ బర మైనచో కాని) సమూహము. (ఉదా. కేశ పాశము. మొ.) ౩. కర్ణశబ్దపూర్వక మైనప్పుడు శోభ. (ఉదా. కర్ణపాశము = సుకర్ణము) ౪. కుత్సితము (ఈయర్థమున నిది ప్రత్యయము గాన మునుంటిపూర్వక మయినదే యుండును— ఉదా. భిషక్పాశుఁడు, వైయాకరణపాశుఁడు)

పాశముద్ర. సం. వి. ఆ. స్త్రీ. ముద్రాభేదము. (తంత్రసార) వామముష్టేస్తు తర్జన్యా దక్షముష్టేస్తు తర్జనీమ్, సంయోజ్యాంగుష్ఠకాగ్రాభ్యాం తర్జన్యగ్రే స్వకే క్షిపేత్, ఏషా పాశాహ్వయా ముద్రా విద్వద్భిః పరికీర్తితా)

పాశరజ్జువు. సం. వి. ఉ. స్త్రీ. సంకెల; త్రాడు

పాశవపాలనము. సం. వి. అ. న —పశుసమూహమును రక్షించునది—ఘాసము, లేఁతపచ్చిక.

పాశహస్తుఁడు. సం. వి. అ. పుం. వరుణుఁడు.

పాశి. సం. విణ. (న. నీ. న) పాశముగలవాఁడు. వి. న. పుం. ౧. వల్లెదాలుపు, వరుణుఁడు. ౨. యముఁడు. ౩. వ్యాధుఁడు, మృగపక్ష్యాదులఁబట్టువాఁడు. ౪. బ్రహ్మదేవుఁడు

పాశికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) పిట్టల వేఁటకాఁడు; మృగయువు, వేఁటకాఁడు. (వాచ.)

పాశుపతము. సం. విణ. (అ. ఈ. అ.) పశుపతి దేవతగాఁగలది. (అస్త్రాది); పశుపతిదైవతము గాఁగలది. (హవిరాది). ౨. పశుపతిసంబంధి. —వి. అ. పుం. ఒకవృక్షము —న—పశుపతి రచితమగు శాస్త్రభేదము, పాశుపతమతము.

పాశుపతుఁడు. సం. విణ. (అ. ఆ. అ) శివ భక్తుఁడు; పాశుపతాగమానుయాయి.

పాశుపాల్యము. సం. వి. అ. న. గోమహిష్యాది పోషణవృత్తి. (ఇది వైశ్యులకు విహితము.)

పాశుబంధకము. సం. వి. అ. పుం. యజ్ఞశాల.

పాశుబంధిక. సం. వి. అ. స్త్రీ. యజ్ఞవేది.

పాశ్చాత్యాకరసంభవము. సం. వి. అ. న. లవణభేదము.

పాశ్చాత్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పడమటిదేశపువాఁడు, పడమటివాఁడు. ౨. వెనుకటివాఁడు. ౩. తరువాతివాఁడు.—వి. అ. పుం. వరుణుఁడు.

పాశ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. వల. ౨. పాశముల సమూహము.

పాషండుఁడు. సం. విణ. (అ. ఆ అ) వేద బాహ్యుఁడు, వేదాచారత్యాగి.

పాషకము. సం. వి అ న. పాదాభరణవిశేషము (వాచ)

పాషాణగర్దభము. సం. వి. అ. పుం. క్షుద్ర రోగభేదము.

పాషాణగర్భ(క)ము. సం. వి. అ. పుం. నీల రత్నదోషము.

క. పాషాణగర్భ మనిరెయిదు,దోషము నీలమున నిసుక దోఁచుట దానిన్ భూషణయోగ్యము గా దని,దూషింతురు. రత్న. ౫౪

పాషాణచతుర్దశి. సం. వి. ఈ. స్త్రీ. వృశ్చిక మాస శుక్లచతుర్దశియందు గౌరీనిమిత్తము జరుపు నొకయుత్సవము.

పాషాణదారకము. సం. వి. అ. పుం. కాసె యులి, టంకము.

పాషాణదారకుఁడు. సం. విణ. (అ. రికా. అ.) రాయిత్రొలుచు పనివాఁడు, కాసెఁడు.

పాషాణదారణము. సం. వి. అ. పుం. కాసె యులి, టంకము.

పాషాణభేదన(క)ము. సం. వి. అ. పుం. వృక్షవిశేషము, కొండపిండిచెట్టు.

పాషాణభేది. సం. వి. న్. పుం = పాషాణభేదనము.

పాషాణము. సం. వి. అ. పుం. ఱాయి, శిల, గ్రావము.

పాషాణి. సం. వి. ఈ. స్త్రీ. తూనికగుండు. (వాచ)

పాసఁగు. వి (క. పాసగి) శాలిధాన్యవిశేషము. (శ. ర)

పాసనము = పాచేనము. వి. (సం. పాచనం) విరేచనము (శ. ర)

పాశి. సం వి. ఇ. పుం సూర్యుఁడు. (వై. ని)

పాసిక = పాచిక. వి. (సం పాశకః, క. పాచికె) జూదగాండ్రు చేతులంబట్టి దొర్లించెడి ద్యూతసాధనవిశేషము, అక్షము.

ద్వి. పాసికల్ సెత్తంపుఁబలుకపైఁ బెట్టి,యాసతి యంతట నాట చాలించి
పండితా. పురా ౧౭౫. పా

సీ తనకు లాగయినసెత్తంబు గైకొని పన్ని పాసిక దాకించి పా టొడిగి.
ఉ. హరి. 3. ౧౭౦.

పాసెము. వి. (సం. పాయసం, ప్రా. పాఅసో, పాసో) క్షీరాన్నము.

మ. కలమాన్నంబును నొల్పుఁబప్పు ఘృతముక్ గజ్జంబులుం బిండివంటలుఁ బాసెంబులు నానాఫలములు ...
శై. భా. ౬. ౧౨.

క. అరుదుగ నప్పు డొక్కొక్కరుండు,మరకతమణి పాత్రి గగనమండల మద్యోఁక్, జిరుపదములు పాసెము కళ్ళధరుఁ డొయ్యెం జక్కులర్యోద్రాక్షఫలంబుల్. హైమ. ౬. ౧౨౩.

సీ. ఖండశర్కర జాఁపన్న కండశర్కరలు దోసెలు వడ శ్వేత పాసెములతోడ. భీమ. ౧. ౬౦.

పా: పాసెం బడిగినవారే పేదలా ? :—అనగా వస్తువు గుణమునుబట్టి దాని పెక్కువగాఁ గోరినంతమాత్రమున దానికై వారు పేంగమువాడినవా రవరా దని భావము.

క. విడువక విాగానము సాగ,నిదంటయు మతి పాడుఁడనుట యొగ్గే పాసెం,బడిగినవారే పేదలె, కొడిమెలుఁగట్టుఁడి యతనిఁ గొని పని యేలా. ఆము. ౫ ౫౭.

పాహాతము. సం వి అ. పుం. బ్రహ్మదారువృక్షము.

## పి

పింగ. సం వి ఆ స్త్రీ ౧ గోరోచనము. ౨ ఇంగువ 3 నాడి, పింగళనాడి. ౪ హరిద్ర, పసుపు ౕ ౫. చండిక, దుర్గ. ౬. త్వక్, క్షీరి, శవక్షరము ౮ కుంకుమపూవు ౯ అల్లెత్రాడు. (విల్యమ్సు)

పింగకపిశ. సం. వి. ఆ స్త్రీ. తైలపాయిక, బొద్దిక.

పింగచక్షువు. సం వి. ఉ. పుం. కుంభీరము, మొసలి .

పింగజటుఁడు. సం వి. అ. పుం. శివుఁడు.

పింగడించే. అ క్రి. శోభాయుక్తమగు, ఒప్పు.

వ......ధరానురాంబుదనికురుంబంబు పెంబడిం బడి ... అంగడియుంగడిం గడుఁ బింగడించిన...... నానావిశానకాయమానవిశానంబు లవలోకించి... పాంచాలీ. ౨. ౬.

పింగము. సం. విణ. (అ. ఆ. అ.) పింగళవర్ణము కలది, గోరోచనమువంటి వర్ణముగలది. వి. అ. పుం. ౧. గోరోచనపువర్ణము. ౨. దున్న, మహిషము. ౩ ఎలుక, మూషికము. (విల్యమ్సు)

౪. మండలి సర్పభేదము. ఒకవిధమైన పాదపాము. (వై. ని.) ౫. సర్షపము, ఆవ కీ. (శే. ని.) న. ౧. కురువేరు. ౨. చిన్నజంతువు, అల్పమృగము. (నిఘంటువు) 3. శిశువు.

పింగలి. వి (త. పింగళి, క. పింగడె) వెనుకటి భాగము, వెనుకటి ప్రదేశము.

చ. ఎలమిఁ గుమారుముంగలి సురేంద్రుఁడు రాసుదధీశ్వరుండు పింగలి నడవన్...
కు. సం ౧౧. ౫౬౪.

ద్వి. ముంగల నిజగురుమూర్తి రాఁగంగ, పింగలి గోవిందప్రెగడ దచ్చాయఁ, ద్రొక్కుకొంటక తొలఁగి ప్రొక్కుచును
పండితా మహిమ ౨౯౪ పొ.

విశే. వెనుకటిది; వెనుకటివాఁడు.

ఉ. మోదమునం దమాభవుని ముంగలి గా నడిపించి తాను దుర్భేదబలాన్వితుం డగుచుఁ బింగలి దైైచన... నిర్వ. ౬ ౧౪౬.

చ. అరదము సత్వరంబుగ శరావళి పెల్లుగఁ బర్వఁ బాండవాగ్రజుఁడు పోవనీక పొదవన్ వడిఁ బింగలివారు పోరిరిం బురికొని
భార కల్య. ౧ 3౯౨.

క్రి విశే క్రియా అనంతరము, పిమ్మట.

ద్వి. ఓనరారుమూర్తి గ్రావోదరజీర్ణ, మనఁగ నంతకముఖా దానీతవా న్యనంగ తెంపలి కడ్వుమను జీర్ణమైన,పింగలి నొకవిప్రుఁ బ్రియపుత్రు నంచి, పానరునంతకముఖంబునకు రప్పించి, కాని రాఁగ...
పండితా. మహిమ. ౨౯3 పొ.

పింగళ. సం. వి. అ. స్త్రీ. ౧ (రూఁగ) ఒకానొకనాడి. ౨. వామనమను దిగ్గజముయొక్క భార్య. అమరకోశము; యాదవనిఘంటువు. 3. కుముదమను దిగ్గజముయొక్క భార్య. (కే. ని. హేమ. ని.) ౪. ఒకానొకవేశ్య. ౫. మైఁడికంటి. పక్షివిశేషము ౬. కర్ణిక. ౭. శింశుపావృక్షము, ఇరుగుడుచెట్టు. పుం. ప్రభవాది సంవత్సరములలో నొకటి

పింగళము. సం. విశే. (అ ఆ అ) నలుపు పసుపు కలిసినవన్నెగలది, గోరోచనపు వర్ణము గలది. వి. అ పుం ౧. గోరోచనమువంటి వర్ణము ౨ క్రౌంచి. 3. ముంగిస ౪. చిన్న గుడ్లగూబ, క్షుద్రోలూకము. ౫ ఒకనిధి. ౬ స్థావరవిశేషము. ౭. పిల్లి, మార్జాలము. న. ౧. పిత్తళి. ౨. హరిదళము, 3. కురువేరు. (వై. ని.)

పింగళలోహము. సం. వి. అ. న. పిత్తళి, ఇత్తడి

పింగళాక్షుఁడు. సం వి. అ. పుం శివుఁడు.

పింగళిక. సం. వి. అ. స్త్రీ బలాక, ఒకజాతి కొంగ.

పింగళుఁడు. సం వి. అ. పుం. ౧. రుద్రుఁడు. ౨. సూర్యునిపారిపార్శ్వకుఁడు 3. ఒకానొక నాగుఁడు సర్పవిశేషము. ౪. ఒకానొక యక్షుఁడు ౫ బ్రహ్మదేవుఁడు. ౬. విష్ణువు. ౭ అగ్ని. ౮. ఛందోగ్రంథకర్తయగు ఋషి

పింగసారము. సం. వి. అ. పుం. హరిదళము.

పింగస్ఫటికము. సం. వి అ. పుం. గోమేధికము, రత్నవిశేషము.

పింగాఁడి=పీంగాఁడి. వి (త. పింగాళము) ఒకవిధమగు లోహపాత్రము.

మ...తట్ట లొడ్డికలు గంగాళాలు పింగాండ్లు ఘృతకరికల్ బిందెలు కొప్పెరల్ మొదలుగా గాంగేయమాణిక్యభాస్వరముల్ కోటులు గ్రక్కునం జూడ మెఁ దత్స్వాధాంతరాళంబునన్. వరాహ. ౪. ౧౧౨.

పింగాక్షుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) పింగళవర్ణపు కన్నులుగలవాఁడు. వి. అ. పుం. శివుఁడు.

**పింగాణము.** సం. విశే. (అ. ఆ. అ.) వలుపు పసుపు తెలుపు కలిసిన రంగుకలది. వి. అ. పుం. వలుపుపసుపు తెలుపు కలిసినరంగు. (వై. ని)

**పింగాణి.** వి. (క. పింగాణి) ౧. ఒకదినుసు తెల్ల చీనామట్టి; ఆమట్టితోఁ జేసిన పాత్రము

వ...జాలవల్లికలు పింగాణి గిన్నియలు పన్నీరు చెంబులు...

ప్రబంధ ౨౦౫. మల్లాపు ౪ ౧౩

సీ. వటిప్రోల్లమురటి జవ్వాది పచ్చ్కైన కట్టు పుమఁగుఁబింగాణి కపురపుఁగ్రోవి.

వైజ. ౩ ౪౮.

౨. (గిన్నె. చెంబు) పాత్రము

సీ. గాజుపింగాణి గిల్కులపావలదపంబు వన్నెలగిన్నె... రుక్మాం. ౪. ౩౫.

సీ పచ్చలపింగాణిఁ బన్నీరు గులికినచందన పంకంబు సవదరింప వరాహ. ౪. ౧౫౬

౩. గాజుపాత్ర

సీ .కాచము విలసిల్లు గా జనంగఁ బింగాణి కుప్పి కుప్పియు కుప్పె యనఁగను దళ్కుృకచవ కాఖ్య తనరుచుండు ఆం. భా. ౨ ౨౦౭.

**పింగాశము.** సం. వి. అ. పుం. ఒకజాతిచేప.

న. కుందనము, అపరంజి,పరిశుద్ధమైన బంగారము. (శే ని.)

**పింగాశి.** సం. వి. ఈ. స్త్రీ నీలిచెట్టు (శే ని.)

**పింగాశుఁడు.** సం. వి అ. పుం. గ్రామాధికారి. (శే. ని)

**పింగి.** సం. వి. ఈ. స్త్రీ. శమి, జమ్మి. (శే. ని.)

**పింగు**[1]. వి. మగగుఱి.

క. ఇంగిత మెఱుఁగనితోత్తును,...నవకీర్తి వచ్చు జేహాను కొచ్చుకా, పింగుకు పడిచెను పట్టుకు... కవిచా. ౪. ౧౨౧.

చంద్ర. వి. ౨. ౯౦.

**పింగు**[2]. వి. ధనము.

(వ్యవ) పింగు లేనివాఁడు పీనుఁగుతో సమానుఁడు.

**పింగేక్షణుఁడు.** సం వి. అ. పుం. శివుఁడు.

**పింగేశుఁడు.** సం. వి. అ. పుం. అగ్ని.

**పించేము**[1]= పించెము. వి. (సం పింఛమ్. త. పిచ్ఛమ్) నెమిలిపురి, బర్హము.

సీ. గురిగెంజపేరులు గుబ్బచన్నులఁ దాల్చి నెమిలిపించెంపుఁబుట్టములు గట్టి. హర. ౫. ౩౪.

జ: పించేము (లు) సేయు.

**పించేము**[2]=పీఁచేము. వి. (సం పింజమ్) మదము, గర్వము (శ. ర)

విశే ౧. మగించినది, బలవత్తరము.

ఉ ఆలలితాంగి ... నునుమించుతురుల్ సరుశై తనర్చి యుం,బించము లై చరించె నవిపించె ఘనాఘనజిద్విలాసరేఖ విప్ర. ౨ ౪౫.

(పించెము. ముద్రి. నెమిలిపురియని యర్థాంతరము.)

౨. కలఁతనొందినది. (చూ పిట్టపించము.)

జ: పిట్టపించము.

**పించేము(లు)సేయు.** స. క్రి (√పించము1) నెమిలిపింఛము విప్పినట్లు విప్పు.

(పికిలిపిట్టలు) వ లవిటిలఁ ద్రిప్పుచుఁ బించములు సేయుచుఁ దల లాడింపుచుఁ గటుకు గటుక్కునఁ బల్లు సోఁక విరవిరం జొట్టు కొని .. ప్రబంధ. ౪౭౭.

**పించెగొడుగు.** వి. (పించెము+గొడుగు) నెమిలి పురితోఁ జేయఁబడినగొడుగు.

క. ఆవటమహీరుహాం తాదీవి ఫలపత్ర చిత్ర దీప్తిస్ఫురణా, భూవల్లభవరనందన, భావిం పఁగఁ బించెగొడుగుభంగి ఫలించున్.

హైమ. ౫. ౩౪.

పించె(చియ)ము=పించేము[1]. వి.(సం. పింఛమ్. దీనికి వ్యుత్పత్తియందుఁ గొన్నిచోట్ల మువర్ణము లోపించును. చూ పించెగాడుగు) నెమలిపురి, బర్హము.

గీ తలను వలగొన్న పించెపుదండవాఁడు
 ఉ రా. ౧ ౧౯ నీలా. 3 ౧౦౬

పీ చిప్పకూఁకటివానిఁ జిన్నినవ్వులవానిఁ జెరి
 వినమంచిపించియమువాని.
 పాండు ౧ ౨౧3

జ పించెగొడుగు

పింఛము. సం వి అ. పుం. పిచ్ఛము, నెమలిపురి

పింజె[1]. వి (పిచ్ఛమ్, పింఛమ్) పుంఖము, అల్లె త్రాటికికూర్చెడుబాణమూలము

ఆ. వెండిపింజఁ బోలుచువెడఁదయమ్మున మిత్ర,
 సేన ధరణివాగి శిరముఁ ద్రుంచి
 భార. కర్ణ ౧ ౧౭౪

చ రథ వరనేమిఘట్టనతురంగఖురక్షతధూళి
 గ్రాలఁగాఁ, బృథివి పగిల్చి బంగరుపుఁ
 బింజలతమ్ములఁ లీల సేయుచున్
 భా. రా. యు ౨౦౦౭.

చ... పసిఁడిపింజ లమర్చిన తూపులిట్టలం, దునిమి
 అచ్చ. రా యు. ౨౦౭

జ. పింజలుగొను

పింజె[2]. వి. (సం పింజ.) దూదేకులవానివిల్లు. (చూ. పింజారి)

జ. పింజనగ్రోలు, పింజనగ్రోవి, పింజారి, పింజించె[1]

పింజ. సం వి ఆ స్త్రీ ౧ దూది, తూలము. ౨. పసుపు, హరిద్ర. కీ. 3. భట, సమూహము

పింజటము. సం. వి. అ. పుం. కంటిపుసి, నేత్రమలము.

పింజన. సం. వి ఆ స్త్రీ. సంగ్రహావాక్యము. (వై. ని)

పింజనగ్రోలు. వి. (పింజె[2]+గ్రోలు) పింజనగ్రోవి.

ద్వి పింజించి వెదలెఁ దాఁ బృథుభస్మధార,
 పింజనఁగ్రోళ్లను బింజించినట్లు
 పండితా. పురా. ౧3౪. పా.

పింజనఁగ్రోవి. వి. (పింజె+గ్రోవి) దూదేకు విల్లు దూదిని చిమ్మునట్లు జలాదులను చిమ్ము గొట్టము

చ నరపతి యొండు విల్గొని గుణధ్వని చేసి
 కుమారుమీఁద నిర్భరగతి నేసె నర్వాని
 శరంబు లురంబునఁ గాఁడ నెత్తు రా,బిన నసు
 గంటులం దొరఁగి పింజనఁగ్రోవులరీతిఁ
 జాలుఁగా, నరునాయకిచిమాలిక్రియ నర్కజా
 పట్టి వెలింగనాఁటిలోన్ జై భా ౨. ౬౯.

పింజనము. సం. వి. అ న ౧ దూదేకువిల్లు, తూలస్ఫోటన యంత్రము. ౨ దూది లోనగు వానినేకుట 3. ఒకజాతిచందనము కీ (వై. ని)

పింజము. సం విశే. (అ ఆ. అ) వ్యాకులము, మనస్సుకలగినది, కలఁతపాటినది. వి. అ పుం. ౧ ఒకదినుసు కర్పూరము ౨. మారణము, చంపుట. న. బలము.

పింజరము. సం. విశే. (అ. ఆ అ) ౧.ఎఱుపు మించినపసుపువర్ణముకలది, పీతరక్తవర్ణముగలది. ౨. పసుపువన్నెగలది, బంగారువన్నెకలది. 3. వ్యాకులము, కలఁతపాటినది.

(శ. ర.) ౪. ధూళిపొందలగు వానిచే వ్యాప్తమైనది. వి. అ. పుం. ౧. పీతరక్తవర్ణము, ఎఱుపుమించిన పసుపువన్నె. ౨. పీతవర్ణము, పసుపువన్నె. 3. తామ్రము. ఎఱుపు. (శ. ర.)

౪. అశ్వభేదము. ౫. సర్పభేదము. న. ౧. బంగారు. ౨. హారిదళము, ౩. దేహమందలి అస్థిసమూహము, ౪. పంజరము, ౫ నాగకేసరము.

**పింజలము.** సం. విణ. (అ. అ. అ.) మిక్కిలి కలఁతపాఱినది, అత్యంతాకులము. (సేవ. కౌ.) వి అ. న. ౧ హారిదళము. ౨. కుశపత్త్రము, దర్భగడ్డియాకు.

**పింజలి.** సం వి. ఈ. స్త్రీ. మడిరెండుక కుశచేఁ జుట్టఁబడినదై ప్రాదేశమాత్ర మగుకుశపత్త్ర ద్వయము

**పింజేలుగొను.** అ క్రి (పింజలు,+కొను) పుంఖానుపుంఖమగు, (బాణప్రసారము) ఎడతెగకుండు.

చ అలుఁగుల దట్ట మైపొదమునగ్నికణంబులు పోఁకి పైగముల్, వొలిసియుఁ దొంటికేగ మడివోక క్రమంబున నొండొకంటఁబిం,జలు గొని క్రోచిరాంచు శరసంఘము లక్ష్యముఁ దాఁకు... పారి ౫. ౨౫ ౪ ౩౬.

ఇట్టే. పింజపింజగొను, పింజపింజఁగఁజూచు కొను, పింజపింజఁగాఁడు, పింజపింజతోఁదాఁకు కొను.

గీ. కరలి మరుఁ దూర్ధ్వలోకముల్ గెలువ పింజ, పింజఁ గొన సేయు పుష్పాస్త్ర వితతి యనఁగఁ గన్నులకుఁ బండు గై తోఁచె గగనభాగ, మండనం బైనతారకామండలంబు. అని. ౨. ౧౨.

గీ. వార లతిచిత్రశరలాఘవంబు పేర్చి పేర్చి రొండొరులయి సేయఁ బింజపింజఁ, గఁజూచు కొని పాఱుతూపు లొక్కటియు పోకఁ, గానిపించుచుఁ దలఁపించెఁ గదలపోరు. కళా. ౬. ౧౨౪. భా. రా. యు. ౬౩౮.

క. ఏణాక్షి నపుడు వెడనిం,గాణింగొని యలరుఁ దూపుగమిఁ జక్కెరయే, భాణముగాఁ గలిగి నకం, భాణప్రదోర పింజపింజఁగాఁడఁగ కేసెన్. విజ. వి. ౧. ౭౨.

ఉ ..ఓ, తన్కాఁడున కేయుచేతుల మహోగ్రశరావళి పింజపింజతోఁదాఁకఁగ కేసెనా... భాగ. ౧౦. ఉ. ౪౩౭.

**పింజానము.** సం. వి. అ. న. బంగారు. (రా. వి.)

**పింజారి.** వి. (పింజే[2]+అరి[3]) దూదేకువాఁడు, ఒకానొక జాతివాఁడు.

సీ. అఁడు బిడ్డనుకారి యల్లుఁడు పింజారి మరదలు కోడలు మారువాడి. కేయు. ళ. ౬౯.

వ...మైలారి మన్నెరి తలారి తురక పింజారి విప్రవినోదులును... హంస. ౨౯.

**పింజించే[1].** స క్రి (√ పింజే[2]) చిమ్ము, విక్షేపించు.

మ. ఇథలోకేంద్రుఁడు హస్తరంధ్రముల నీ రెక్కించి పూరించి చం, దళమార్గంబున కత్తి నిక్కి వడి నుద్ధాడించి పిండింప నా, రథటిన్ నీరములోనఁ బెల్లెగసి నక్రగ్రాహపాఠీనముల్ నథమం దాడెదుమీనకర్కటములన్ బట్టెన్ సురల్ ప్రాన్పదన్. భాగ. ౬. ౪౭.

సీ కెంజాయ దిక్కులఁ బింజించుచిగురులు కాలానలార్చు లై కాఁకఁ బెనుప. కలిక. ౪. ౧౩. పండితా. పురా. ౧౩౪. పా.

అ. క్రి. చిమ్ముఁబడు, విక్షిప్తమగు.

ద్వి. అరగించినభస్మమంగంబులోనఁ,బూరించి... పింజించినవెరలెఁదాఁబ్రభుభస్మధార. పండితా. పురా.౧౩౪. పా.వాద.౨౦౨.మా.

**పింజించే[2].** స. క్రి. (√ పింజె) పింజెలుపోయు, తుచ్ఛ్లుపోయు.

సీ. పింజించి కట్టినబిగువుపచ్చనిపట్టు లోఁజుకారుమెఱుఁగులఁ దుఱుఁగలింప. కవిక. ౭. ౧౯౦.

**పింఛిక.** సం. వి. ఆ. స్త్రీ. తూలిచుట్టు, తూలపాళిక, ఏకు.

పింజాఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు. (విల్సన్సు.)

పింజాలము. సం. వి. అ. పుం. కళవర్తిక.

పింజూషము. సం. వి. అ. పుం, గులిమి, కర్ణమలము.

పింజె(జియ). వి. ౧. వస్త్రపుకుచ్చె, మడత.

సీ. సరి శేనిరాశకట్టుజూకుపా వెలకట్టు చెడఁ గాడనీర్కావిపింజెతోడ. మనుచ. 3 ౪౧.

(నీర్కావిపింజె = పింజెపెట్టికట్టిన నీర్కావి దోవతి.)

క. పెంజెమట జార దోవతి, పింజెలు మాటికిని గాళ్లఁ బెనఁగొన... వాల్మీ 3 ౭౧

చ... మ్మల్లర మగువావిపింజయ .. వాల్మీ. 3. ౧౩౦.

౨. మడత పెట్టి వెనుక దోఁపుకొనుదోవతి కొంగు, కచ్ఛభేదము.

సీ...కచ్ఛభేదాభిధాన మెసంగుఁ గాసె కుచ్చెల కుచ్చె కచ్చె పింజె . ...అనంగ... అం భా ౨. ౧౪౩.

మ తగుచే నాయిలు సొచ్చి నామెుదవు సద్దం డంబుతోఁ గొంచుఁ బాఱుఁగఁ జోరత్వము గాక యుత్తెఱఁగు ధీరత్వంబె యం చుద్ధతి క్రాసిగ పిడక వెనుచక్కపింజె వదలక చేపట్లకుక వచ్చినక.
ఉ. రా. ౬ 3౬౧. (పింజమూర్తి)

జ: పింజించే2, పింజెపట్టు

పింజెపట్టు. అ. క్రి. (పింజె+పట్టు) కుచ్చెళ్లు పోయు.

సీ. మొలఁ బింజెపట్టి చెంగులు మాఁటి కట్టినవలి పనీర్కావిదోవతి పెలంగఁ నీలా ౧. ౬౦

(ఇష్టే. పింజవిడుచు. పింజెపెట్టు.)
(గోవింద మంచనశర్మ)

సీ. గన్నెరువులూఁజాయ కర కెంపు నీర్కావి మడుఁగుదోవతి పింజెవిడిచి కట్టి. క్రీడా. ౪3.

సీ. కడి యాఱి యాఱు కుండెడు ప్రాంతదోవతి బిట్ట చేమన పింజెపెట్టి కట్టి శుక ౨. ౪౭౬.

పింజేటము. సం. వి. అ పుం. నేత్రమలము, కంటిపుసి

పింజోలం. సం వి అ. స్త్రీ. పత్త్రశబ్దము, ఆకుల చప్పుడు.

పింర. సం. వి అ స్త్రీ. విటజన సమాశ్రయము, వేశము (శ. ర)

పిండ. సం. వి అ స్త్రీ. ౧ పిండాయసము, ఉక్కు, ౨. కస్తూరీభేదము, 3 వంశపత్త్రి, వెదురాకువలెనుండు తృణవిశేషము. కై.

పిండకము. సం. వి అ పుం. న ౧ పిండాలువు ౨. బిష్లాకము, చిల్లమడ్డి, 3. చోళము, ౪ అలిందము. వాకిలికి వెలుపలనున్న నలు చదరపుచోటు (వై. ని) ౫. గుండ్రని వస్తువు. (చెండు, గోళీ, మెు) ౬ జంఘు, పిక్క.

పిండఖర్జూరము. సం. వి. అ పుం. ఒకదినుసు ఖర్జూరవృక్షము

పిండగోసము. సం. వి అ. పుం. గంధరసము.

పిండతర్కులు. సం. వి. అ. పుం. పిండలేప భాగులగువృద్ధ ప్రపితామహాదులు మువ్వురు.

పిండతైలము. సం. వి. అ. న. తురుష్కమను గంధద్రవ్యము.

పిండనము. సం. వి. అ. న. పిండముచేయుట ముద్దచేయుట,

పిండనిర్వపణము. సం. వి అ. న. పితృదేవ లకుఁ బిండములు పెట్టుట.

పిండపదము. సం. వి. అ. న. (జ్యోతి.) అంక విశేషము.

పిండపాతము. సం వి. అ. పుం కూడు లోనగు నవి (భిక్షము) పెట్టుట

పిండపాతికుఁడు. సం. వి అ పుం. భిక్షపు కూటిచే బ్రదుకువాఁడు

పిండపాదము. సం వి. అ. పుం. గజము, ఏనుఁగు

పిండపాద్యము. సం. వి. అ. పుం = పిండ పాదము.

పిండపితృయజ్ఞము. సం. వి. అ పుం గృహస్థుఁడు సాగ్నికముగాఁ బితరుల నుద్దేశించిచేయఁదగిన పిండదానమనెడియజ్ఞము.

పిండపుల. సం. వి. అ. స్త్రీ. చేఁతిసాఁబు, కటుకుంబి. కీ.

పిండపుష్పకము. సం. వి అ. పుం. వాస్తూకశాకము. చక్రవర్తికూర. కీ.

పిండపుష్పము. సం. వి. అ న. ౧. తామర పువ్వు, ౨. తగరపుష్పము, ౩. మెట్టనూయి. (శ. ర.)

వి. అ. పుం. ౧. అశోకము కీ ౨. దాసనము. కీ.

పిండభాక్కు. సం. విశే. (న్.) పిండముపొందు వాఁడు, పిండముపొందఁదగువాఁడు. (మృత పిత్రాది.)

పిండము. సం. విశే. (అ. ఆ. అ) ౧. ఘనము, గట్టి. ౨. సంహతము, చిక్కఁగాఁ గూడుకొన్నది, దట్టమైనది.

వి. అ. పుం. న. ౧. గోళము, గుండ్రనివస్తువు. (అయఃపిండము.) ౨. పితృదేవతలకిచ్చెడు అన్నపుముద్ద. ౩. కూడు, అన్నము. (ఈ యర్థమున నిదితఁబడు నీచలింపయము గానుండును.) ౪. జలము. ౫. శరీరము. ౬. శరీరమునందు ఏకదేశము. ౭. గృహమునందుఏకదేశము. ౮. బోళము. ౯. సిహ్లకము, చిల్లముద్ది. ౧౦. జపు, దాసనపుపువ్వు, ౧౧ మదనవృక్షము. ౧౨. బృందము, గుంపు. ౧౩. గర్భము. (ఈ యర్థమునందు కేవల "పుం" అని వాచస్పత్యము.) ౧౪. బ్రతుకు.

వి. అ. న. ౧. ఆజీవనము, బ్రదుకుఁదెరువు. ౨. ఇనుము ౩. బలము,

పిండముస్త. సం. వి ఆ. స్త్రీ. నాగరముస్త కీ.

పిండమూలకము, పిండమూలము. సం. వి. అ. న గర్జరము, ముల్లంగి. కీ.

పిండరోచణము. సం. వి అ న. నాగరంగము, నారింజ. కీ.

పిండలము. సం. వి అ. పుం. సేతువు, ఆనకట్ట. ౨. వంతెన.

పిండలి. వి. (సం. పిండః.) ముద్ద

సీ. దిక్కులు నాలుగు త్రొక్కి-చోటికిఁ దెచ్చి పిసికి పిండలి సేసి పిడుచగొనఁగ.
భార విరా. ౨. ౧౩౪.

వ...కసిమసంగి మారి పసికి పిండలి చేసినచందంబున. ఉ. హరి. ౪. ౨౭౯.

(శ. ర. వ్రాఁతప్రతి పా. "పిండలివండుచేసి" ముద్రి.)

జ. పిండలివండు, పిండలివండులగు.

పిండలివండు. వి. (పిండలి + వండు.) ముద్దగా నున్న బురద, చిక్కనిబురద

సీ. తురగఖురోద్ధూతధూళి ద స్పురసిన వనవిధి పిండలివండుగాఁగ. భార. విరా. ౩. ౧౫౬.

గీ. అడవు లడఁచి కొండలమీఁద నదరి యక్షుల, వారినిధులను బిండలివండు సేసి, కనుల పింతు బ్రింగి దెసలు చీకట్లుగొలిపి, పరగె యచవనోద్భవక్షోళితబహుళరజము.
హరి. ఉ. ౨. ౧౧౯.

గీ. ఖానుదీక్షలకోడిచే బల్యాలంబు, కొండి
పిండలివండు గా నింకిపోయె.

వి. పు. ౪. ౨౧౭.

పిండలివండులగు. అ. క్రి. (√ పిండలివండు.) ముద్దగట్టినబురద కలవియగు

గీ. అతనితపమున లోకంబు లద్రి గిరులు,
వదలె జలధులు పిండలివండు లయ్యె.

చిత్రభా. ౨. ౫౩.

గీ. వారినిధు లెల్ల బిండలివండు లయ్యె.

సీతా. వి. ౨. ౭౧.

పిండలేపము. సం. వి. అ. పుం. చేతికి అంటు కొన్న పిండాంశభేదము.

(దీనిని ముత్తాతమొదలుగా మువ్వురు పితరులు కైకొందురు.)

పిండలోపము. సం. వి. అ. పుం. ౧. పితరులకు సంతతిలేమిచే బిండములేకపోవుట. ౨. పితరులకు బిండముపెట్టకవిడుచుట.

పిండసంబంధము. సం. వి. అ పుం. ౧. దేహము తోడి (జన్యజనకరూప) సంబంధము. ౨. పిండమునిచ్చువాడు పుచ్చుకొనువాడు అగు సంబంధము.

పిండసుడు. సం. వి అ పుం పరులపిండముచే గాని, భిక్షచేగాని జీవించువాడు.

పిండాతము. సం. వి. అ. పుం సిహ్లకము, చిల్లమద్ది.

పిండాన్వాహార్యకము. సం. వి అ. న. పార్వణ శ్రాద్ధము.

పిండాభము. సం. వి. అ. పుం. సిహ్లకము, చిల్లమద్ది.

పిండాభ్రము. సం. వి. అ. న. కరక, వడగల్లు.

పిండాయసము. సం. వి. అ. న. ఉక్కు.

పిండారకము. సం. వి. అ. పుం. ౧. చిత్రాంగ వ్యాఘ్రభేదము, చిఱుతపులి. (కే. వి.)

పిండారము. సం. వి. అ. పుం. వికంకతము. ముళ్లు వెలమ. శ. ౨. సర్పభేదము. న. ౧. తీర్థభేదము ౨. శాకభేదము. శ.

పిండారి. వి. (హిం. పిండారి.) ఒకజాతివాడు, (ఈజాతివారు పూర్వము బందిపోటులుచేసెడివారని వాడుక.)

గీ. ఏనుగులు కేయి బొందిలీ లెంచి చూడ,
లక్ష పిండారు లాకలక్ష లక్షతురక, లిచటి
బల మూన్పాలున కెంచ భటులు.

కృష్ణ. 3 ౨౫.

పిండారుడు. సం. వి. అ పుం. ౧. క్షపణకుడు. ౨. గోపుడు, గొల్లడు. (హే. వి.)

పిండాలక్తకము. సం. వి. అ. పుం. ఒకదినుసు లత్తుక.

పిండాలుకము. సం. వి. అ న. ఒకదినుసు ఆలువు (గెనుసుగడ్డ)

పిండాలువు. సం. వి. ఉ పుం. ౧. చిరుగడము. శ ౨. కందగడ్డ చూచి శ.

పిండాశుడు. సం. విశే. (అ. ఆ అ.) బిచ్చగాడు, భిక్షుకుడు

పిండాహ్వా. సం. వి. అ స్త్రీ. నాడీహింగువు, ఒకవిధమైన యింగువ.

పిండి. వి. (సం. పిండిః) ౧. పిష్టము, బియ్యము లోనగువానిపొడి, (దీని యామ్రేడితరూపము పిండి పిండి.)

గీ నన్ను గాచుట యెఱయంగ నిన్ను గాచి,
కొనుట యిప్పుడు యిన్నుకొన్నుమనః నిచ్చి,
కావనే నన్ను... భార. అశ్వ. ౪. ౨౩౭.

శా...పైఁ బందురుం డొప్పగాఁ, గాసెక
కొన్నెల పిండి చల్లినకదంకణ -గల్యతా
పండుపై, యయా. ౫ ౧౦౯.

చ కదళిగభీరపుష్పపుటికాచ్ఛటఁ జేతుల నిప్ప
పిండిపైఁ, గుదురుగ నిల్పి...
ఆము. ౧. ౭౩

సీ. చేసికొండలు పట్టి పిండిపిండిగఁ గొట్టి
జలధిలో వెదజల్లఁగలబలంబు
ఇందు. ౧. ౧౫౨. నీలా. ౧. ౬౩. ౩. ౧౦

౨. నువ్వులు మొ, వానినాడించి, చమురు
తీయఁగా మిగిలిన పిండి, ఉదా: తెలికపిండి మొ.

కొట్టినపిండి=బాగుగా వలఁగినది; మిక్కిలి
పరిచితము.

(వ్యవః) విరాటపర్వము నాకు కొట్టిన పిండి.

పిండియిడు=దేహమును పిండిచేయు.

గీ. ఒండొకఁడ పైన నిపుడ నీపిండియిడమొ,
బ్రాహ్మణుఁడ వౌట మాచేత బ్రదుకఁ
గంటి. మను. ౬ ౪. ౯౦

జ. పిండికూడు, పిండికూర, పిండికొండ. పిండి
దొండ, పిండిపించు, పిండిపీఁచము, పిండి
పీఁచు, పిండిపోఁకలు, పిండిబొద్దికూర, పిండి
మిరియము, పిండివంట, పిండివంటకము,
పిండివడియము.

పిండి. సం. వి. ఇ. ఈ. స్త్రీ ౧. గుండ్రనివస్తువు,
ముద్ద, ౨. బండికంటి నడిమికూము, నాభి,
౩. శాలిపిక్క, ౪. మంగ, పిండీతకము,
౫. పీతము; పీతవిశేషము, ౬. పిండీతగరము,
౭. సాఁబ్రాణి, ౮. ఒకదినుసు ఈఁదు, ఖర్జూర
భేదము. ✝. (వై. ని.)

వి. ఇ పుం. ౧. చూర్ణము, పిండి, (వై. ని.)
౨. తెలికపిండి. (వై. ని.)

పిండిక. సం. వి. అ. స్త్రీ. ౧. శాలిపిక్క
మాంసము ౨. తురుష్కదేశమందు అందును
బంకతోఁజేసెడు ధూపద్రవ్యము. ౩. బండి
కంటి నడిమికూము, ౪. ఇల్లుకట్టుటకు ఏర్పర
చినస్థలము, నివేశస్థలము (వై. ని.)

పిండికూడు. వి. (√పిండి) సంకటి, చిక్కని
యంబలి

క ఒక తల్లఁ బిండికూడు గఁ బొడిచి రొంగయ
నెత్తి త్రిప్పి భూస్థలి మఱియుం, బడపైచి
యొరము మొంగమును, నడిచెను వడముడి
తలప్రహారకుశలుండై.
భార. ఆర. ౬. ౨౪౭

క కటుకంరు భక్తి వెలిగాఁ, గొటుగా వెవ్వియును
నవియుఁ గొన్నిటివాల్లల్, మఱి పిండికూడు
పెట్టిన, మెఱియలక్రియ మెరచు మీసమెడు
కుల మెఱుపుల్. శివ. సా. ౧౯౬.
(పిండకూడు, ముద్రి)

పిండికూర=పిండిబొద్దికూర. వి (√పిండి) ఒక
జాతికూరాకు. ✝

అ ఉల్లి పుచ్చకాయ ముల్లంగి సొఱకాయ పిండి
కూర సెతిబీఱకాయ జై. భా ౪ ౯౬

పిండికొండ. వి. (√పిండి) కొండపిండి. ✝

సీ. కొండపిండి యనంగఁ బిండికొండ యనంగ
నగభేదసంజ్ఞ గా వలరుచుండు.
ఆం. భా. ౨. ౬౫.

పిండితము. సం. విశే. (అ. ఆ అ.) ౧. పిండ
ముగా చేయఁబడినది, ముద్దగాఁజేయఁబడినది.
౨. సంహతము, చేర్పఁబడినది. ౩. గణితము,
ఎంచఁబడినది. ౪. గుణితము, గుణింపఁబడినది.
౫. దట్టము.

వి అ. పుం తురుష్కమను గంధద్రవ్యము.

పిండిదొండ. వి. (√పిండి) తుర్యకుండి. ✝

సీ. కుర్యకుండి వెలఁగుఁ బిండిబొండ యనఁగ.
ఆం భా. ౨. ౬౦.

సీ .శెకన్నెర విమబొద్ది పిండిబొండ
హంస. ౪. ౧౦.

పిండిపించే[1] = పిండిపీచే[1]. విశే. (√ పిండి) మిక్కిలినలఁగఁగొట్టఁబడినది, విమర్దితము.

మ. తరుగుల్మాదులు పిండిపించుగ మహాధాత్రీ ధరశ్రీధరా, శర్కరముల్ పెంపరి నుగ్గునూవ ముగ... కు. సం. ౧౧. ౫౬౦

పిండిపీఁచేము. విశే. (√పిండి) పిండియైనపీచేము కలది, నిస్సారము

సీ. పిండిపీఁచేంబు గాఁ బ్యాధిపీడరమ్ము లడంగు నే కాలదండమున నదెవ కాశీ ౩ ౩౮. (ఇట గుండగుండగా అనిభావము)

పిండిపీఁచే=పిండిపించే.

గీ విరుదుమగలకుఁ బుత్తములను బిండిపీఁచే,సేయు బలితంపుఁ జేర్పు లచ్చెరువుఁ బెనుప
భార. శల్య. ౧. ౧౩౨. (పిండిపిండిగా. కరాలప్రతి. పా.)

పిండిపోఁకలు. వి. బ. (పిండి+పోఁకలు "గుడ పిండములు" (శ ర.) భక్ష్య విశేషము.

పిండిబొద్దికూర=పిండికూర. (√పిండి) ప్రా.?

పిండిమిరియము. వి. (√పిండి) పులుసుచేయక పిండితోను మిరియముతోను పలుచగా వండిన వ్యంజనవిశేషము (శ. ర.)

పిండిలము. సం. వి అ. పుం. ౧. వంతెన, సేతువు. ౨. మేఘము, న హిమము, మంచు. (శే. వి.)

పిండిలుఁడు. సం. విశే (అ. ఆ అ.) ౧ మిక్కిలి పిక్కకండగలవాఁడు. ౨. గణకుఁడు, లెక్కించు వాఁడు.

పిండివంట = పిండివంటకము. వి. (√ పిండి) పిండితోచేయు భక్ష్యము.

తరలము. పలుతెఱంగులపిండివంటలుఁ బప్పుఁ గూడును నేతికుండలు...
భార. ఆది. ౬. ౨౪౪.

సీ. పెనుపాయకడియంపుఁ బిండివంటలతోడఁ గమ్మని సద్యోఘృతమ్ముతోడ.
వి. కథా. ౧ ౧౩౫.

అ ప్రియము లేనివిందు పిండివంటలచేటు.
వేమన. ౨. ౪౮.

పిండివంటకము=పిండివంట. (√పిండి)

గీ వారయాత్రికు లనుపెరదవంతు లగుచువలచి భుజియించి రొగిఁ బిండివంటకములు.
సైమ. ౬. ౧౨౦

శా ..నిఖిలముల్ సంపూర్ణ మై పత్రిపాత్రీ మధ్యంబునఁ బిండివంటకములుల్ దివ్యాన్న ముల్ ...సంధిల్లె నొక్కమ్మడిన్.
భీమ. ౨ ౧౩౮.

పిండివడియము. వి (√పిండి) పిండితోచేసిన వడియము, కూరవడియము.

గీ. ఎండు గుడి మ్రింగువానికి నంది పిండివడియ మనప త్రెంకగ జే పుడమిలోన
విక్ర ౨. ౨౩౮.

పిండీకృతము. సం విశే. (అ. ఆ అ.) ముద్దగా చేయఁబడినది. (శ. ర)

పిండీతకము. సం. వి. అ పుం. ౧ మదనము. మంగ. ? ౨. తగరము. 3. ఘటిజ్జకము, మరు వము ?.

పిండీపుష్పము. సం. వి. అ. పుం. అశోకము. ?

పిండీభూతము. సం. విశే. (అ. ఆ. అ.) ముద్ద రైనది, ఘనీభూతము, గట్టిరైనది.

పిండీరము. సం. విశే. (అ. ఆ. అ.) నీరసము, సారములేనిది.

వి అ పుం ౧ దానిమ్మ ౯ ౨ డిండీరము, సముద్రపునురుగు

పిండీశూరుఁడు సం వి అ పుం తిండియందు మాత్రముశూరుఁడు, పనులయందసమర్థుఁడు

పిండు[1] స క్రి (సం పీడ్ క పిండు) పాలు పితుకు

గీ మున్ను కాఁ గొన్నదూడతో పొందవు నప్పుడు, ఎదసమున కొప్పఁ దెప్పించి పొదివి దాని మేను మెల్లన నివురుచుఁ దాను దానిఁ బిండఁ బోవఁగఁ బాలు లేకుండ గాను

వేం మా ౪ ౧౫౯

సీ కలదండిఎసీఁ బిండి కాఁచి చేమిరిఁ బెట్టి తొయిఁగ కుండఁగఁ బట్టి యట్టి గొట్టి

వేం ఎంచ ౪ ౪౫౯

౨ ఆవుం బెయి పాలిచ్చు

సీ పాలు పిండనిగొడ్డుబట్టి కార్పులు మెండు కల్లఎపిండికిఁ గాంతి మెండు

వేణు ౪ ౧౮

౩ (రసాదుజు పైకివచ్చునట్లు) నులుపు

మ దంభగవిమీదం దజ్జటాఖండ కెంపయ్యన బిండక్ విమలాంబువుల్ పెడశె

వరాహ ౧౦ ౫౯

పిండు[2] వి (సం పిండమ్, క పిణ్డు) సమూహము, గుంపు

గీ మొఱయు నాయూడుమాటలు తెఱవపిండు, పుల్లములకు నిం పొరెడునురలు గాక

భార విరా ౨ ౩౩౫

సీ మున్నూటయఱువదిమూర్తిభేదములతో విహరించు టేటేట వేల్పుపిండు

భీమ ౨ ౫౨ రామా ౨ ౧౦౧

జ పిండుగట్టు, పిండుగొను

పిండుగట్టు[1]=పిండుగొను అ క్రి (√పిండు[2]) గుమిగూడు, సంఘీభవించు

గీ కంటె గాంగేయు నతనిచక్కటికిఖండిఁ, బెట్టు మీతని మన పెల్లఁ బిండుగట్టి, పొదవి కొనివచ్చెము భార భీష్మ ౩ ౧౯౦

గీ అనుచుఁ దద్యత్నలత కప్పు దళిలనురలు, పిచ్చలించిరి విహగోఁ బిండుగట్టి

రామా ౮ ౧౦౦

పిండుగొను=పిండుగట్టు[1] (√పిండు[2])

మహోగ్రధర సాధ్యుల్, మహి తపాంతం బులక్ బెల్లలమికొనఁగ నత్యాదరోత్కర్షముల్ పొందుచుతో పాంతంబునం బిండుగొని నిలిచి చూడ్కుల్ తదంగంబు గప్పగా

భార స్వర్గా ౩౪

ఉ కరిమదగంధమునకు మధుకరములు పిండుగొని సుసరి కటకటములభా హరమరుత్య్

కు సం ౧ ౭౭

పిండురము=పిండు వి సమూహము, గుంపు

ఉ కాపున నీవసంతమధుగర్వితకోకిలకీరకారికా, రావముఁ దేటపిండురపురావము మెల్లని చల్లగాడ్పుఁబూ, దావులసొంపు మిగుల బాలికకాలిమి కొల్లలాడెడిన్

కళా ౬ ౨౪౮

పిండోలి సం వి ఇ స్త్రీ కుడుచునపుడు నోటి నుండి పడినయన్నాంశము, కుడువఁగా మిగిలిన యన్నము

పింద్రము వి॰ అధికము, మిక్కుటము

శా అంతంతకును బింద్రం బయ్యెఁ గపెండి కోఁత వలదా మీకుక్ విచారింపఁగన్

వరాహ ౫ ౯౩

పిందె(దియ) వి మిక్కిలి లేఁతకాయ, బాల కలాటువు

సీ తల్లిదండ్రులరొద్దికనయులగతి నాకుమఱుఁగు పిందెలరీతి నాతి వహించి

పారిజా ౧ ౨౧౨

గీ పిందియలు పూలు ముత్తెములం దనర్చు,
కల్లచెట్టులు వలర నబ్బల్లిదంపు,రావిరాకారి
కెలమన్కి గోన మెఱయు
అచ్చరా కాల ౧౧౭

పింపిణీ వి స్త్రీవేణీవిశేషము, స్త్రీల యొక విధ మగుజడ, (నాలుగుపాయలజడ అని బ్రౌ)

మ జడి గొన్కొర్కుల నింతి తాను మగవేషం
బూనిన న్పింపిణీ,జడలన్ కాఁపట రావికేళ
జేగి పెచ్చన్ గొప్ప పొంకించి
సత్య పాం ౩ ౧౦౪

పింపిళులు,(ళ్లు)=పింపెసలు వి బ పెదవి మీఁదుగా నొకవిధ మైనధ్వనిని గలిగించి నర్తించెడుబాలక్రీడావిశేషము

మ దినముల్ కొన్ని చనంగ నంతఁ గడు నర్థిం
బొమ్మపెండ్లిండ్లు గుజ్జెనగూ ళ్లచ్చనగండ్లు
పింపిళులుం లాగైన ఖేలనముల్ మీఱఁగ
బోంట్లతో నలరు బాలాకన్య మెల్లప్పుడున్
కళా ౬ ౨౦౨

సీ పింపిళ్లు చెండుగోరింపులు నోమనగుంటలు
వెన్నెలకుప్ప లాది దశా ౯ ౭౧

సీ పింపిళ్లు త్రొక్కుళ్లు బేడిసెతిరుగుళ్లు నచ్చన
గండ్లు హం ౫ ౧౫౫

జ పింపిళ్లాడు, పింపిళ్లుగూయు

పింపిళ్లాడు అ క్రి (పింపిళ్లు+ఆడు) ౧ పింపిళ్లాటయాడు (చూ పింపిళ్లు) ౨ నర్తనముచేయుచు నమస్కరించు

రగడ మణికుట్టస్థలి మలయుమణిప్రభుపెరు
మాళ్లకుఁ గడుఁ బింపిళ్లాడుచు
హంస ౪ ౨౧౩ (నర్తించు అని శ ర)

పింపిళ్లు(ళులు)గూయు అ క్రి (పింపిళ్లు+కూయు, గునియు అని శ ర)
౧ పింపిళ్లాటయాడు

సీ మాటికి నాత్తమ్మిమఱుపునఁ బింపిళ్లుగూయు
భోగురరాచకొమ్మ గములు
యయా ౩ ౫౪

వ యువజనంబులకుం గన్నులపండువులు గా
గుంపులుగుంపులై పింపిళ్లుగూయుబాలి
కలును వరాహ ౪ ౧౫౫

౨ నర్తించు, చిందులుత్రొక్కు, ఎగిరిపడు

వ భావిపుంభావసంభావనాపరిచయంబు
సంపాదించుపెంపునం బింపిళ్లుగూయుకలికి
కొమిరెల మొలకచనుమోసులం దులకరించిన
తళుకుసిబ్బెంపు తళతళల దళముకొనకో
యవన్ వసు ౪ ౨౩

మ బిగిచన్గుత్తులుం గుత్తపుంబయటలోఁ బింపిళ్లు
గూయుంగ కళా ౬ ౬

(ఇది యితరపదవ్యవధానము తోడను గనుపట్టుచున్నది)

ఉ అలవేఱుపదంతులకెమ్మనంబు పింపిళ్లొగిఁ
గూయఁ జొచ్చె)
కవి క ౨ ౧౫౦

౩ (భారముచే) వంగియాడు

సీ గంపెఁడుకైలైనఁ బంట కబ్బనిచేను బింపిళ్లు
గూయని గుంపులైరు, గీ పన్నిదమునకుఁ గాన
కుప్పట్టునందు పాంచాలీ ౫ ౮౫

౪ (పింపిళ్లాటయందువలె పెదవులతో కూకూ యని ధ్వని చేయుచు) చలించు

గీ పిన్నబిడ్డ లెయ్యెడలఁ బింపిళులుఁగూసిరి
హరి పూ ౮ ౧౬౦

సీ అలిబాలికలుముదం బెలరారఁ బింపిళ్లు
గూయుచు మధుపులు గ్రోలి సోల
నృసిం ౨ ౬౮

పింపిసలాడు అ క్రి (పింపిసలు + ఆడు) ౧ బాలికలు పెదవిమీఁదుగా నొకవిధ మైన ధ్వని చేయుచు నర్తించు

గీ. కేడుకలు మీఱఁ బింపినలాడు.

రుక్మి. ౧. ౭౬.

౨. నర్తించు, చిందులుద్రొక్కు.

సీ కురులు బొమ్మలమీఁదఁ గులికి పంపిన

లాడ... రసిక. ౬. ౧౧౯.

(పెంపెనలాడు, అపము(ద్రి.)

పింపినలు=పింపిళులు. వి. బ.(చూ.పింపినలాడు.)

జః పంపినలాడు.

పికపికలు = పికాపికలు, పకపకలు, పకా

పకలు. విణ బ. చెల్లాచెదరు.

క పు గ్గయినయతనిఁ గనుఁగొని, బెగ్గలమున నచటిభటులు పికపిక లైనన్, దగ్గతే పికి కాళను లాక, పెుగ్గర మై కోట సొర సముద్ధతు లయినన్. నిర్వ. ౪. ౫౪.

క ఒక ధూము రేఁగిలన్కరు, పికపిక లై తమ లరణము పెంపున నన్యోన్యశరాని సంపాతు లచ్చే, వికలతఁ గని రారులు తమరు వీ రను కొనక౯ రంగా. 3. ౭౦3.

పికప్రియ. సం. వి అ. స్త్రీ. మహాజంబువు, పెద్ద నేరేడు. శ.

పికబంధువు. సం. వి. ఉ. పుం. ఆమ్రము. మామిడి. శ

పికము. సం. వి. అ. పుం. కోకిలము, కోయిల.

పికవర్ధనము. సం. వి. అ. పుం. కాకము, కాకి.

పికాంగము. సం. వి అ. పుం. పక్షిభేదము.

పికాక్షము. సం. వి. అ. పుం. రోచని. శ.

పికానందము. సం. వి. అ. పుం. వసంతకాలము.

(ఇక్లీ పికబాంధవము.)

పికాపికలు = పికపికలు, పకపకలు, పకా పకలు. విణ. ౧. పిక్కలి కలిగినది, చెల్లా చెదరు.



సీ. కవిసినవిందుచీకటి పికాపికలుగాఁబోఁగ దోలినబంటుకేసము. వరాహ. ౪. ౧౫౪.

చ. ఎలయఁగ లంకఁ గాల్చి తను కేఁచిన కోఁతిరు కేఁడు గ్రమ్మరన్, గలని వచ్చి నంచును పికాపికలై పఱతెంచి రందఱున్. అచ్చరా. యు. ౯౯. ప్రబోధ. ౫. ౧౦౦.

౨. పికాపికలు చేయునది, చెదరగొట్టునది.

ఉ సిగ్గునకుం బికాపికలు చిత్తసమున్నతి పేరి వార్తకున్, గగ్గులకాండ్రము.. అగ్గజయానకుం బతికి నర్యుయ్య యథేష్టరహః ప్రసంగముల్. కవిక. 3. ౨౭౯.

పికిలి=పిక్కిలి. వి ౧ పక్షివిశేషము.

సీ వంగపండు పికిలి ...గి అనఁగ నిట్లని పక్షిభేదాఖ్య లలరు. ఆం. భా. ౨. ౯౭.

అ. పికిలి కేలకొమిలి పెనుగువ్వ బకదారి... ఆది రైనపక్షు లతఁడుదీర్చు.

హంస 3. ౧౭. ఇందు. ౨ ౬౯.

౨ పికిలిపిట్టలతూలికలతోఁ చేసినకుంచె.

సీ పికిలిచేఁ జెక్కులఖరికల్ వ్రాతుఁ గా నిఁక కెండు వ్రాతుకే యిగురుఁబోణి

దశా. ౧. ౬౧; ౪. ౨.

జ : పికిలిచెండు, పికిలిపుా.

పికిలిచెండు. వి. (పికిలి+చెండు.) పికిలిపిట్ట యీకెలు సన్నవియీఁకలతో కందుకాకారముగా చేసినకుచ్చు

గీ. అట్లు తమకంబుచే వేఁటలాడి మృగము, దంబుఁ జామరములు గజదంతములును, బిల్లి గడ్డలు పులిగోళ్లు పికిలిచెండ్లు వాదిగాఁ దెచ్చి యిచ్చి రయ్యవనిపతికి.

రసిక. ౧. ౧౧౭.

సీ... కస్తూరిలప్ప పొంపారుపికిలిచెండు.

నీలా. ౨. ౨౭.

పికిలిపుా. వి. (పికిలి+పుా.) పికిలిపిట్టతోఁక క్రిందియీఁకలవిధమైనపుాలమొక్క.

మ. పులిగోరుల్ పెరకేసి కస్తూరిమెకంబుల్
పుష్కలవ్యాఘ్రపి, ల్లులు గోరోజన మిఱ్ఱులున్
బికిలిపూలుం జైకానుక లిచ్చి బోయ
దొరబిడ్డల్ గాంచి రాఘవవిభున్
రామా. ౨ ౫.

మ తడవిండ్లున్ గటిమేనులున్ బికిలిపూదండల్
మిటారించుపెన్, బిడెముల్ ... పిసాళిం
పఁగాఁ, దుడుముల్ గూడుక వచ్చి చెంచులు
వరేంద్రుం గాంచి హర్షంబునన్.
శు రా. ౪ ౩౭౪.

పికిలు = పిగులు, పీలు. అ క్రి. ౧ (వస్త్రము మొ॥ బిగువుచే) చినుఁగు

చ పికిలి యజాండకర్పరము చీఁటలువాఱఁ గ
మేను పెంచి యా, మకరనికేతనోదరనిమగ్న
మహీమహిళాలలామఁ గే, తకముకశాగ్ర
సంగతమదభ్రమరీసమరీతి గాఁగఁ గొమ్ము
కొనఁ దగిల్చి యుత్తఁ గిటిమూర్తిని దాల్చితి
గా జనార్దనా పారి ౩ ౩౧

౨. పగులు, బ్రద్దలగు.

క గూటగ్రుడ్లం బెట్టెన్,
గీ పెట్టి ముదిగ్రుడ్లు వదకుండఁ గట్టు గాచి
పొదుగుటయు నెరకొని కొన్ని పొఁటలకును,
బికిలె వేం పంచ. ౧ ౪౫౦

పికేక్షణ. సం. వి అ స్త్రీ కోకిలాక్షము ? క
దిమసుగన్నేరు ?

పిక్క[1]. వి (సం పిండికా) జంఘ, చిఱుతొడ

క. పిక్కలతొడల నడుములం, దొక్కటఁ బద
తలము నిడి సమున్నతి నొదలిన్, నిక్కించిన
నీయాసన, మక్కజము గ స్వస్తికాహ్వ
యంబగు జగతిన్ పీతారా. ౧ ౯౭.

సీ. చిఱుతొడ యనంగఁ బిక్క నాఁ జెలఁగు
జంఘ. ఆం. భా ౨. ౧౩౭.

జః పిక్కచెదరు.

పిక్క[2]. వి (సం. స్పృక్కా) ఒకానొక చెట్టు.

సీ. తొవపువ్వుశాఖలతో లిమ్మగాఁ బుచ్చు
పిక్కమూలంబులపెనఁగు వాపు.
శు సం. ౫ ౭౧౭. ౭౧౮.

పిక్క[3]. వి గింజ ఉదా॰ చింతపిక్కలు (వా.)

పిక్క[4]. వి చిన్న నాశము.

(వ్యవ) చేతిలో నాలుగుపిక్కలున్నవని వాఁడు
మిక్కిలి గర్వపడుచున్నాఁడు.

పిక్కచెదరు. అ క్రి (పిక్క[1] + చెదరు) భయ
పడు, బెదరు.

వ.. సమీపాటవీమధ్యంబుఁ దోచ్చి యాస్ఫో
టించి పిక్కచెదరక దిక్కులు పరిభ్ర
మించి... పాండు ౩ ౭౯

వి భయము, బెదరు

ఆ. పేర్మి నదురుగుండె పిక్కచెదరు లేక,
యుండ వచ్చుఁ బేద యులుకుఁ దక్కి రమణి
గోఁచిపాఁతరాయఁడు దొంగల, మిందఁ
దపెడుమాట మేలు దలిసి కుచేల ౩. ౭౪

ఆ అంటి పొడిచి పోటుగంటి వెంబడిఁదూఱు,
వీరవరులు పురుషకారపరులు మేర మీఱు
సంఖ్య మెఱయుదు రవ్వేట, నదురుగుండె
పిక్కచెదరు లేక రంగా ౧. ౧౦౨

పిక్కటము. విణ బిగువు

ఉ. ఆపలుకుల్ సుధారససమంచితసారము లై
చెవుల్ సోఁకన్, భూపతి యాత్మహర్షరస
పూర్తికి నేమన వచ్చుఁ బూర్వసంతాప
దశాకృశశ్లథకసత్కనకాంగద ముద్రికాదిర,
తోన్నపలభూష లంగముల యుబ్బునఁ బోల్చెను
బిక్కటంబు లై కవిరా. ౫. ౧౧౫.

జః పిక్కటిలు.

పిక్కటిలు.(ల్లు) అ. క్రి (√ పిక్కటము) ౧.
నిండు, పూర్ణమగు.

క. దిక్కులు మేఘపథంబును, బిక్కటిలంగ
నవయవములు భీషణములు గా
భార మహా ౨౭

శ్లో॥ అగ్నిం తేదదృశు స్తత్రస్థితం శైలమివాగ్రతః
మార్గమావృత్య తిష్ఠంతం సాక్షాత్పురుష
విగ్రహం సం భార మహా ౧ ౩౬

సీ. బిగువుఁ బయ్యెదలోనఁ బిక్కటిల్లుచుఁ జాలఁ
దళ్లుచన్నుల నొప్పుముల్లె పేరు
శశా ౪ ౧౦౩ నిర్వ ౧౦ ౧౦

౨ వర్ధిల్లు, పెరుఁగు

చ. మతి లావు గూడఁ గ్రైఁ, బొదలె ననంగిఁ
బిక్కటిలెఁ బొల్తుకచన్నులు నాఁడునాఁటి
కిఁ అము ౫ ౨౧

గీ. అతివచన్నులు జక్కవ లగుట లేమి,
యెందియుం బింత దండలచాయ నిగుడి, రెక్క
లైయుండ సొంపునఁ బిక్కటిల్లి వలిపె
పయ్యెద యనుచిన్నివలను దగుల
యయా ౪ ౪౩

౩ అతిశయించు, విజృంభించు

ఆ. పగరు పుట్టె నంతఁ బెగలె దంతంబులు,
నుక్కియయును దగ్గఁ బిక్కటిల్లె, శిరము
వొవ్వఁ దొడఁగెఁ జెదరె మనం బంతఁ,
గడిఁది రైనముప్పు కాలమునకు
భాగ ౬ ౬౧

క. సెరవయును పిక్కటిల్లఁగ, సురతం బొక
పేళసైనఁ జొప్పదమి మది, బరపురుష
వాంఛ వొదమిన విరహంబున లేయి పవలు
వేఁగుచు నుండున్ హంస ౫ ౧౫౬

వ. పిక్కటిల్లినమక్కువ జై భా ౨ ౧౩

౪ వ్యాపించు, ప్రసరించు

క. దిక్కులఁ దనబాణంబులు, పిక్కటిలఁగ
నుల్లసిల్లి భీష్ముఁడు
భార భీష్మ ౧. ౨౯౨

చ. విమలదరస్మితామృతము వెల్లువ చిక్కులఁ
బిక్కటిల్లినన్ మమతను జేరఁగాఁ బిలిచి
ప్రభా ౧ ౧౨౫ వైజ ౨ ౪౪

౫ పిగులు, చినుఁగు

సీ. బిలుఁగుపైరాణికించెల ఎక్కటిలి వలి
కలుకుని బ్బెపుగబ్బిగుబ్బ లుబ్బ
రసిక ౩ ౪౭

సీ. నవరవిపనిచన్నెరవిక ఎక్కటిలంగఁ గులుకు
పాలుబ్బుగుబ్బలు చెలంగ శుక ౧ ౧౩

౬ ప్రకటితమగు, బయలు మెఱయు

క. మిక్కుట మైన యక్కటికము, ఎక్కటిలన్
వెఱవు మానిపినరొక్కటికిన్,
అచ్చరా బాల ౨౪

౭ బీఁటలువాఱు, బ్రద్దలగు

వ. గాఁడీవగుణగర్జాడంబరంబున నంబరంబు
పిక్కటిల్ల హార ౭ ౬౭

సీ. దివి పిక్కటిల మ్రోయు దివ్యదుందుభుల
నారావంబు లభ్రగర్జనలుగాఁగ
దశా ౭ ౧ ౧౯

పిక్కము సం వి అ పుం ౧ ఇరువదియేండ్ల
వయసుగల యేనుఁగు, ౨ యేనుఁగుగున్న వి అ
స్త్రీ ముక్తాపరిమాణభేదము, ఒక విధమగు ముత్యముల తూనిక

పిక్కారు వి (పిదప+కారు¹) దాళువా, శర
దృతువు మొదలుకొని నీటియానరాను పండెడు
ఎల్లపుఁబంట (శ ర)

పిక్కిలి=పికిలి వి ౧ పక్షివిశేషము (బ పిక్కి
ళులు, పిక్కిళ్లు)

సీ. పట్టుచేసుపు కొంగ పిక్కిలి మాలముచ్చు,
ఆ ఆది రైనపక్షు లతఁడు దీర్చ
హంస ౩ ౧౨.

౨ ఒకానొక యడవిజాతివాఁడు.

సీ. కెనుగొందగు ప్రాలి పిక్కల్లో కొందరైన
ప్రతిపక్షులను హతాహతము చేసి.
హై. భా. ౧. ౪౫.

(ఇది రెండర్థములకు నుదాహరణము.)

పిక్కు¹. అ. క్రి. తెనుదేయు. (శ. ర. ప్రా)

స. క్రి. ౧. అపహరించు, దొంగిలించు.

సీ. దాఁచికొన్నను బలిశంపుఁజెంపుడు గాశ
పిక్కిన నొకపోక వక్క గాశ.
విప్ర ౫. ౧౯.

౨. మోసపుచ్చు, వంచించు. (శ. ర. ప్రా.)

వి. ౧. వంచన, మోసము.

సీ. వంచనఁ మెసంగు గీ. జాడుఁగు ప్రక్కు
కికురు పిక్కు ఆం భా ౨ ౨౯౨

౨. మర్మము, కిటుకు.

చ. పలుకులలోనఁ బిక్కు లాకపానుపునఁ
బొలయల్క చిక్కులన్, కలఁకలు దీఱు
ప్రమొక్కులను గాటపుఁగౌఁగిటిలోని
పొక్కులు. అహల్యా. ౨. ౩౭.

3 మల్లవిద్యావిశేషము.

వ.. ఏకసరము పైసరము ఝుంప పిక్కు కరలా
ఘవంబు మొదలగు విశంబులను.
మల్లుపు. 3. ౬౯

వ నయనపుపారువ లివ రాశడ యేకసర
పైసర ఝుంపు పిక్కు కరలాఘవమ్ము మొద
లగువిశమ్ము రెజీఁగి ప్రబంధ. ౩౭

పిక్కు². వి పెంపు, అతిశయము.

వ...పానెంబు లగుతూణంబులజాణతనంబు లాడి
ధిక్కరించునిక్కుల కిక్కు కాని క్కులరు
పిక్కులు .. ప్రబంధ. ౪౦

పిగులు=పికులు, పీలు. అ. క్రి. (వస్త్రము.
మొ. చినుపుచేపగుట; చినుఁగు.)

క. భువి పశిశశ రవి శౌగిశశ, దివి పినిశౌ
దిగ్గజములధృతి సన్నగిలెశా.
రా. వి. ౨. ౪౨.

౬. పినిశెఁ బీశ నవఁగఁ బెంపొందుచుండును,
జినిఁగి నవుటకాభ్య... ఆం. భా. 3. ౯౧.

పిచండకుఁడు. సం. వి. అ. పుం. ఔదరికుఁడు,
తిండిపోతు, ఉదరంభరి.

పిచ(చి)ండము. సం. వి. అ. పుం. న. ౧. కడుపు.
౨. పశువు. (వై. ని) 3. మృగములవీపు (శ.ర.)

పిచ(చి)ండిక. సం. వి. అ స్త్రీ జంఘ, పిక్క.
(వై. ని)

పిచండిలుఁడు. సం విణ (అ. ఆ. అ) పెద్ద
కడుపుకలవాఁడు తుందిలుఁడు

పిచేపిచే. వి పిచ్చుకలధ్వని కనుకరణము.

వ...చతుర్ఘటికావశేషంబు గా రాత్రి చనియె,
దిక్కులు ప్రకాశప్రకటింబొందెఁ, బిచ్చు
కలు పిచపిచమనియెఁ గాకంబులు గూశ
లిడియె... హం. పంచ ౪. ౫౦౪.

పిచవ్యము. సం. వి. అ పుం ప్రత్తిచెట్టు,
కార్పాసవృక్షము.

పిచుకము. సం. వి. అ. పుం మంగచెట్టు, మదన
వృక్షము.

పిచుతూలము. సం. వి అ. పుం. తూలము,
దూది.

పిచుమంద(ర్ద)ము. సం. వి. అ. పుం. వేము,
నింబము. శ్రీ.

పిచులము. సం. వి. అ పుం. ౧. ఝూబుకము. శ్రీ.
౨. ఇజ్జలము, ఎఱ్ఱగన్నేరు. శ్రీ. 3. తూలము,
దూది. ౪. నీరుకాకి, జలవాయసము. (వాచ.)

పిచువు. సం. వి. ఉ. పుం. ౧. దూది. ౨. కర్ప భేదము ౩. కర్షము

పిచ్చి[1] = పిచ్చి. వి (సం. పిత్తజ. త. పిచ్చు.)

౧. ఉన్మాదము, పిచ్చి

సీ. వెఱ్ఱి యనంగను పిచ్చి యనంగ నున్మాద మనంగ నున్మాదసంజ్ఞ. అం. భా. ౧. ౧౩౭.

౨ అల్పము, తక్కువది.

ఉ కొన్ని గోణంగి కొన్ని గ్గినిసి కొన్నికుటారము లాడి మానరా, కన్నిక నిన్నివాళ్ల కిది యి న్నని కూటికిఁ బిచ్చపాటిఁ గొ, మ్మన్న మహా ప్రసాద మని హర్షరసోల్లసదానసాబ్జు డై, యన్నలినాక్షి భర్త యిడునన్నియ గైకొను ముక్కధాన్యముల్

పాండు. ౪ ౧౪౭.

జ. పిచ్చేటిలు, పిచ్చేపట్టు, పిలుపిచ్చే

పిచ్చే[2]. వృషణము, ముష్కము.

క పిచ్చలు వడివడి రాయఁగ...

చంద్రి. వి ౨ ౪౦.

పిచ్చ. సం. వి. అ స్త్రీ ౧ ధరణముఎత్తుగల ౧౨ ముత్తెములహారము, ఒకానొకముత్తెముల తూనిక, ముక్తాపరిమాణభేదము.

పిచ్చటము. సం. విణ. (అ. ఆ. అ) చదునుగా అదుమఁబడినది

వి. అ. పుం. ౧ ఒకానొక కంటిజబ్బులు, నేత్ర రోగవిశేషము.

న. ౧. తగరము, వంగము. ౨. సీసము, నాగము.

పిచ్చటిలు. అ. క్రి. (√పిచ్చే) వడఁకు, కంపించు.

లయగ్రాహి. వచ్చెమురభేది ధరపిచ్చటిల సైన్యములు హెచ్చినదవక రిపులు రిచ్చవడి చూడక. ఆదిలక్ష్మీవిలాసము ౪. ౧౨౩. ప్రా.

పిచ్చపట్టు. వి. (√పిచ్చే[1]) ౧. ఉన్మత్తత్వము. (శ. ర. ప్రా.)

౨. మూర్ఖపుపట్టు.

వ్యవ. ఈ విషయములో వాఁడు పిచ్చపట్టుపట్టి నాఁడు.

పిచ్చేలము. విణ. అతిశయించినది, అధికము.

ఉ. సొంపరయంగనొక్కరుఁడె పిచ్చలమయ్యెను జేన ఘర్మముల్. రస. ౧. ౩. ౨౦.

జ. పిచ్చేలించు.

పిచ్చేలించు. అ క్రి (√పిచ్చేలము) ౧ అతిశయించు.

ఆ. అంతఁ బోక శౌరి యగ్రజుండును దాను, జక్రమును హలంబుఁ జటులగదయు, భుజము లందుఁ దాల్పఁ బోరిఁబోరిఁ గదిరెదు, భీతి మానసమునఁ బిచ్చలింప. ఉ.హరి ౭ ౧౯౧.

ఆ. దేవతరువుమాడ్కి తెల్లనిగొడుగుతోఁ, గూడఁ బసిఁడి కామకుంచె లచట, నిలిపి పొంతఁ గైదువులుసేర్చి యర్చనలిచ్చె నుత్స వంబు పిచ్చలింప. ద్వా. ౨. ౩

౨. భయపడు, భీతిల్లు.

చ... దైత్యవిభుండు సవిస్మయంబు గాఁ, దలపడి భూమిపాలుపయి దట్టముగాఁ బఱపెన్ శిలీ ముఖం,బులు సురసిద్ధసాధ్యులు నభోవల యంబునఁ బిచ్చలింపఁగన్.

భా. రా. యు. ౨౧౪౯.

ఉ... వెన్నుఁడు నిర్వాణ నొందె నందునన్, మేలని యార్చి రానురులు మింట సుపర్వులు పిచ్చలింపఁగన్.

ఉ. రా. ౨. ౩౭.

క. ఒసరింపఁ బిచ్చలింపక, ముసుకొని యయ్యదక మనికి మొనగాంద్రతనిన్, జెనసి పెనుగట్లు ఔట్లును, బెను పొదవఁగ రువ్వుటయును వెగ డక వాఁడున్. అచ్చరా. యు. ౧౪౧

3 కంపించు, కదలు

చ విగిచన్గవ యూరాద్పులఁ బిచ్చలింపఁగా
నిరం ౪ ౪౮

౪ ఆనందించు

గీ మెచ్చిచూచుచు శేమఱుఁ బిచ్చలింతు, రమర
కన్యక లతులహిమాచలమున
కు ౦ 3 ౭౬౧

సీ ఒకకాంతప్రొద్దు లాంశకథాప్రహేళికా
బిందుమత్యాదులఁ బిచ్చలించు
శివరా ౨ ౧౮

౫ క్రి అతిశయించఁజేయు, ప్రశంసించు

గీ విశిఖనవకంబు నాటించి వెగడుపఱిచి, పేర్చి
యార్చిన సురకోటి ఎచ్చలించె, మెచ్చి
భీష్మాదు లెల్ల విన్వచ్చుఁ బోలు, నెక్కు
డగుఁ గాని యస్దు గాఁ డీతఁ డనిరి
భార భీష్మ ౧ ౨౩౭

మ సుందరతుఁ దేశోపానిగావించినన్, ఎభిక
ప్రాతము ఎచ్చలించె నను నానాస్తోత్ర
వాక్యంబులన్ దశకు ౫ ౫3

పిచ్చి=వచ్చు[1] వి ఉన్మాదము, వెఱ్ఱి

ఉ ఎచ్చటనైనఁ గంటిమె మహీస్థలి నిట్టి
విచిత్ర మెన్నఁడున్, బిచ్చపువానిఁ బిల్చి
తనప్రేయసి నిచ్చె నితఁడు వీనికిం, బిచ్చి
జనించనో యిదిరెు వెం పగుభక్తి యటంచు
వెంచనో, యిచ్చట నేరి కింకఁ దలచూత్తి
కనన్ మన సొప్పు దెంతయున్ హరభక్తి
విలాసము ౧ (చి వి)

విణ హీనము, నీచము

గీ నీకులస్థానపౌరుషములు, కొచ్చెముగ నేల
చొచ్చితి విచ్చిపనికి
రామా ౩ ౭౫౯ (పిచ్చపనికి శ ర పా)

జ పిచ్చివాఁడు

పిచ్చిక=పిచ్చ్యిక వి చటకము, ఒకజాతిపిట్ట

సీ చలనంబు లేక జాజలి తపోనిష్ఠ నానీసుఁడై
యుండఁ బిచ్చికలు గూడు, గావించె
తన్మస్తకంబున భార శాం ౫ ౨౭౪

జ పిచ్చికకుంటు, పిచ్చికుంటు

పిచ్చికకుంటు=పిచ్చుకకుంటు వి (√పిచ్చిక) (శ ర)

పిచ్చికుంటు=పిచ్చుకుంటు వి (పి చ్చి క) అనూరుఁడు (శ ర)

విణ కాళ్లులేనివాఁడు (శ ర)

పిచ్చిటము ౦ వి అ పుం కీటభేదము, ఒక జాతిపురుగు

పిచ్చిలిపోవు అ క్రి (√ ఎచ్చిలు) చిప్పిలు

ద్వి పుడమి మోచిననాగపుంగవుఁ బట్టిపిడు
కుసా విష మెల్లఁ బిచ్చిలిపోవ
రం రా యు ౭౯౪ పా ౭౨ పం

పిచ్చిలు(ల్లు) అ క్రి చిప్పిలు (నీటిబొట్టు మెం) లోపలినుండి పైకివచ్చు

ఉ గ్రుచ్చి కవుంగిటం బొదివి కొ బ్బొక
యించుక దువ్వి చెక్కులన్, బిచ్చిలుమాత్న
ఘర్మజలబిందువు లొత్తి
చంద్రా ౬ ౧౪3

చ సాలవక మేను కంటకము సోఁకినఁ గొండొక
శోణితంబు ఎచ్చిలి తనకెంతనొప్పి యగు
హేం పంచ 3 ౧30

ద్వి పిలిపిలిపోవ పచ్చికల ఎచ్చిల్ల, బిలిబిలి
లజ్జల బిరుదు లఱంగ, పండితా మహిమా
౭౫౦ పా పురా ౧౭3 పా

జ పిచ్చిలిపోవు

పిచ్చివాఁడు విణ (పిచ్చి + వాఁడు) ఉన్మత్తుఁడు (శ. ర)

పిచ్చె. వి. (సం పైత్యమ్) పిత్తరోగము, చేఁదు కట్టు.

సీ. గోనాగజంబుకగోధాఘుమార్జారముల పిచ్చు కనయాత్మబలమువలన (చి. కి చి. ని.)

పిచ్చ్చుక=పిచ్చిక. వి ౧ చటకము, ఒకజాతిపిట్ట దీనిభేదములు: వెదురుపిచ్చుక, కొండపిచ్చుక, చెఱకుపిచ్చుక, ఊరఁబిచ్చుక, పొదపిచ్చుక, పేదపిచ్చుక, బంగారుపిచ్చుక. మొ

ఆ పెంచినట్టికోడిఁ బిల్లిభక్షించినఁ, గొందు వగపు పిచ్చుకందుఁగలదె ప్రబోధ ౫ ౨౮

ఉ తూనిగ లాడఁ దోచ్చె దివి దూటి భ్రమిం పఁగఁ దోచ్చెఁ బిచ్చుకల్. హర ౨ ౧౭

పిచ్చుకపైబ్రహ్మాస్త్రము = అల్పుని దండింప నధికప్రయత్నము చేయునపుడు దీనిని వాడుదురు.

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము, విచ్చలవిడి నిగుడఁ జేయువిధ మింతేకదా. ఉ. రా ౩ ౩౦౨

క. పిచ్చుకపై బ్రహ్మాస్త్రము, నచ్చుగఁ దొడిఁ గినవితాన నబలపయిన్ మీ, కిచ్చుగఁ గోపం బటు రా, వచ్చునె కోపైన పైఁపవలయు నటంచున్ కళాం. ౪ ౨౧.

(పిచ్చుక చిన్నపిట్టయగుటచే ఈపదము కొన్ని యెడల అల్పార్థ ద్యోతకముగాఁ బ్రయుక్తము

ఉదా పిచ్చుకయాహారము, పిచ్చుకంత మొ

జ. పిచ్చుకకాలు, పిచ్చుకకుంటు, పిచ్చుక గోళ్లు, పిచ్చుక బియ్యము, పిచ్చుకబీఱ, పిచ్చుకుంటు

పిచ్చుకకాలు. వి (√పిచ్చుక) పర్పాటము. క్రి

గీ. పర్పాటకంబు మనును బిచ్చుకకాలు నా మాత్ర భూత. ఆ. భా ౨ ౬౫

పిచ్చుకకుంటు=పిచ్చికకుంటు. వి. (√పిచ్చుక) అమాయకుఁడు.

సీ. ఉత్తానుఁ డై కన్న కొరగి పిచ్చుకకుంటు విప్రతిపంబు గా వినుతిసేయు. కాశీ. ౧. ౧౨౬.

విశ. పిచ్చుకవలె కుంటుచు నడచువాఁడు, కుంటివాఁడు.

క విను పిచ్చుకకుం టతిరయ,మునఁ జోకకుఁ బడుట పేదముదుకఁడు పేర్వాట,జనముం గోరుట దుర్యోధనుఁ డింక జయంబుఁ గొనఁగఁ దలఁచుట యరయన్ భార కర్ణ ౧. ౩౨.

క. చీకుం బిచ్చుకకుంటును, మూకు శిఖండి యును నిక్కముగఁ దమపొల్లం, జేకొనఁ జాలరు వారిం జేకొనఁగా వలయు ధనముఁ జేకొన్నజనుల్. విజ్ఞా వ్యవ. ౧ ౪౪.

ఉ...ఈ, పిచ్చుకకుంటుమీఁదఁ గృపపెంపున చామరలోకవాహినిం, దెచ్చితి... పసు. ౫ ౨౦.

పిచ్చుకగోళ్లు. వి బ. ధాన్యవిశేషము

సీ ..గౌరికుంకుమల్ రణపెండ్లికొడుకులు పిచ్చు కగోళ్లు ప్రయాగలు గొజ్జఁగ్రోలు హంస. ౪. ౧౭౯.

వ...ఏలకిరాజనాలు పిచ్చుకగోళ్లు బంగారు బుడమలు ప్రయాగలు. . ప్రబంధ. ౧౧౨.

పిచ్చుకబియ్యము. వి తృణవిశేషము

చ.వెనుకుర ప్రాల్ల బూదియును వీదలి పిచ్చుక బియ్య మెంద్రయున్ ప్రబంధ. ౨౦౦.

పిచ్చుకబీఱ. వి. (√ పిచ్చుక) ఒకవిధమగు బీర క్రి.

గీ బీఱపండ్లును బిచ్చుకబీఱపండ్లు, గొమ్మిపం డ్లీఁతపండ్లును గొంజిపండ్లు. కాశ. ౩. ౬౯.

వ కొడుగు ములుకొడుగు బీఱ పిచ్చుకబీఱ కొండ బ్రహ్మకొండ జాబ్వి కలజాబ్వి...కొండ లగుతరుల... ఇంకు. ౨. ౬౦.

**పిచ్చుకు(గు)ంటు**=పిచ్ఛికుంటు. వి.(√పిచ్చుక వృత్తినివర్ణలోపము.) ౧. అమూరుఁడు, సూర్యుని సారథి

సీ. ప్రీతి నింతకు నేఁగుఁ బిచ్చుకుంటుకు ద్రొక్కి వినుతసౌభ్రాత్రుండు వినతపట్టి
సైవ. ౮ ౧౩.

చ. ప్రగ్గములన్ గవియాజ్ఞ మాటికిన్ ముడి యిడఁ బిచ్చుకుంటురథమున్ నిలుపన్
ఆము ౨ ౪౯. ఉ రా ౧ ౬౭

౨. గొల్లలను యాచించి జీవించునొకజాతివారు (కమ్మవారిని అడిగికొని జీవించుజాతి అని బ్రౌ)

సీ. బలిజేలవిత్తంబు పట్టెదాసరిపాలు గొల్లవిత్తము పిచ్చుకుంటుపాలు రామలిం ౨౩

విశే. పంగువు, కుంటివాఁడు

గీ అవలఁ గొంటగాక పిచ్చుకుం డై యనంగుఁ డనుపుఁ గొనఁజొచ్చె. ఆము ౨ ౫౮.

పా పిచ్చుకుంటుమీఁదిభాగీరథి = కుంటివానిని గంగయేవచ్చి స్నానము చేయించె ననుట (అర్హతకుమించిన ఫలము లభించెననుట)

సీ పైతృకంబు. గీ పెట్ట సమకట్టువేళకుఁ బిచ్చుకుంటు, మీఁది భాగీరథియుఁ బోలె మీర లేఁగు, దెంచితిరి... వరాహ. ౪ ౯౪

ఉ. మీర లిందులకు వచ్చుట సామది సెంచి చూడ భా, గీరథి పిచ్చుకుంటు పయికిం బ్రవహించుట సూ నృపాగ్రణీ
కృ కసం. ౨. ౬౧.

**పిచ్చె.** వి. చింతగింజ

సీ. చింత యనంగను ంచ యా పిచ్చె యనంగఁ దద్బీజంబు విలసిల్లు... అం. భా ౨. ౪౪ (పిచ్చు, అని శ. ర బ్రౌ)

**పిచ్ఛ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కోశము, ఒఱ. ౨. గంజి; గంజిమీఁదిమీఁగడ. ౩. పంక్తి, వరుస. ౪. ఛటు, సమూహము. ౫. శాల్మలీ వేష్టము, బూరుగుబంక. ౬. అరఁటి. శ. ౭. పోఁక శ ౮. శింశుప. ఇరుగుడు. శ. ౯. వీక్క, జంఘ. ౧౦ ఫణిలాల, పాము చొంగ. ౧౧. గుజ్జుపుకాలిపుండు.

**పిచ్ఛకము.** సం వి. అ. పుం. (సెమలిలోనగు వాని) పురి.

వి ఆ స్త్రీ సెమలిపురులకుంచె

**పిచ్ఛతిక.** సం వి ఆ స్త్రీ శింశుప ఇరుగుడు శ.

**పిచ్ఛనద్ధము.** సం వి అ పుం ఒకజాతియుల్లి. శ (వై ని)

**పిచ్ఛబాణము.** సం వి అ పుం డేగ, శ్యేనము.

**పిచ్ఛము.** సం వి అ న ౧. నెమిలిలోనగు వాని తోఁకయందలి యీఁక; నెమిలిపురి; ఱెక్క ౨. సిగ, చూడ ౩. శివుని త్రిశూలము. పుం తోఁక లాంగూలము

**పిచ్ఛలదళి.** సం వి ఆ స్త్రీ బదరి రేఁగు. శ. (త్రి ని)

**పిచ్ఛిల.** సం వి ఆ స్త్రీ ౧ పూతిక. శ. ౨. శింశుప, ఇరుగుడు శ ౩ బూరుగు. శ. ౪ ఒకానొకనది, (మే ని) ౫ కోకిలాక్షము, ములంగొరిమిడి శ ౬ లేలుమణి శ ౭ అగిసె. శూలీతృణము శ కటుకరోహిణి. శ. (వా. చ)

**పిచ్ఛిలకము.** సం వి. అ. పుం. ధన్వనము, తడ. శ.

**పిచ్ఛిలచ్ఛద.** సం. వి ఆ. స్త్రీ. ఉపోదకి. దుంపబచ్చలి. శ

**పిచ్ఛిలత్వక్కు.** సం. వి. చ్. పుం. నాగరంగము. నారింజ. శ.

**పిచ్ఛిలము.** సం. విశే. (అ ఆ. అ.) (జిడ్డులోనగు వానిచే) జాఱుడుగలది. (శేల.)

౨. చిక్కనగలది, కేరినది. మీఁగడకట్టినది. (ముద్దపప్పు మొ, స్నిగ్ధపదార్థాది.)
3. పిచ్ఛము (పింగ) గలది. చూడాయుక్తము.
సం. వి. అ. పుం. ౧. సరసపక్వంజనాదిపలుచగా వండిన కూర మొ. ౨. స్నిగ్ధపదార్థాది, చిక్కనగుముద్దపప్పులోనగునది.
3. శ్లేష్మాతకవృక్షము, విరిగిచెట్టు
అ. పుం. అ. స్త్రీ. బింబచ్ఛద, ఇరుగుడు. క్రీ.

పిటంక్కోకి. సం. వి. ఈ. స్త్రీ. పెద్దపాపర, ఇంద్రవారుణి. క్రీ.

పిటక. సం. వి అ. స్త్రీ. విస్ఫోటము, బొబ్బ.

పిటకము. సం వి. అ. పుం న. ౧ పొక్కు, బొబ్బ, స్ఫోటకము.
౨. ఇంద్రధనిధ్వజముమీఁది యలంకారవిశేషము
పుం. చిన్నపెట్టె. చిన్నగంప

పిటక్య. సం. వి. అ స్త్రీ. పటకసమూహము, పెట్టెలగుంపు.

పిటపిట. వి (ఎండమొ॥వాని) తీక్ష్ణతను తెలుపు అనుకరణము.
క. కటికిలో గరాచయొండలు,పిటపిటఁ గాయంగ మేను బీఁటలువారెన్. బహు 3. ౬౨.

పిటము. సం. వి. అ. పుం. గంప, కండోలము.
న. చాలము, ఇంటిపూరికప్పు.

పిటాకము. సం. వి. అ. పుం. పెట్టె.

పిటాక్య. సం. వి. అ. స్త్రీ. పిటాకసమూహము, పెట్టెలగుంపు.

పిటిలు(ల్లు). వి. పిడుగులు పడుటయం దగుధ్వని కనుకరణము.
చ. పిటిలుపిటిల్లనం బ్రిదిలి బ్రేలి పడం దొడఁగెం బెకుర్ద్రిశాతటములు మందుమం పిడుగు లెండము... పార. ౨. ౨౧.

పిట్ట[1]. వి. (సం. పిక్కక) పక్షి, విహగము.
మ. వలరాయం డనుకేటకాఁ డలయువ్రాతంపు రేఁడాపువిట్టలఁ బట్టన్ వెలినాభి యన్గెలనుదండ స్థానుగ్రామ్యించుడాల్,వల రొయింకేసుటియించి చన్నుగవక్రీవం బొంచె...
చంద్రా. ౪. ౧౭౯.
సీ. కాకిపిట్టకుఁ జాలఁ గద లేనిబ్రతుకు కిడి చిలుకకుఁ దద వేల చేయఁదయ్యె.
నీలా. ౧. ౧౧౧.
సీ పిట్ట పక్కి పులుఁగు జిట్ట గువ్వ యనంగఁ బక్షిసామాన్య మై పరగుచుండు.
ఆం. భా. ౨. ౯౭.

పిట్టదొర=పక్షిరాజు, గరుడుఁడు.
గీ. చట్టుపలఁ బట్టులేగాడ్పుకొట్టునకును, కెట్టు కాయలు రాలినయట్టువిట్టు, లొట్టులొట్టునఁ దారక ల్బిట్టు దుల్లఁ, బిట్టదొర కొరకట్టడ కట్టిపడియె. బహు. 3 3
ఇట్లే పిట్రాజు
సీ. ఇలభోగిరాజును నిమ్మడి పిట్రాజు పడకనడకలఁగాపాడుచుంద్రు.
ఉ వారక్ప్ ౨. ౬౪.
సా: పిట్టకొంచెముకూఁతఘనము = చిన్నవాఁడు పెద్దమాటలాడుట

పిట్ట[2]. వి. (సం. భిత్తం) మంటిగడ్డ, బెడ్డ.
ఆ గురునిమాట సరకుగొనమి దుశ్శీలత, పిట్ట పుడుక గోరు పినుకఁ ద్రుంపఁ, గఱవ మరుగు టుదయకాలాస్తమయసమయముల భాషఁ జాచు టాయు వడఁచు.
భార. అను. ౪. ౯౦.
సీ... తెలయు లోప్పము పెల్ల పిట్ట పెట్టు, గడ్డ బెడ్డ యఖంగ... ఆం. భా. ౨. ౨30.

పిట్టకము. సం. వి అ. న. దంతకిట్టము, పండ్లపాఁచి.

పిట్టపించేము(లు). విశే. (పింఛము + పించము.) కలంకనొందినది.

సీ. కెమ్ములికందంబు పిట్టపించము లయ్యో నలుం గులపా లయ్యె కెలంగు లెల్ల.
తపతీ. ౪. ౩౯.

పిట్టపిడుగు. వి (పిడుగు + పిడుగు క. పిట్టు పిడుగు) పెద్దపిడుగు.

వ ..ఉద్భ్రాంతంబు లై యంబుధు, ల్వారలం గట్టలమీఁదఁ బిట్టపిడుగు ల్మ్రోసెన్ మహో దగ్రతన్.
భార. ద్రో. ౫. ౩౪౪.

ఆ పిట్టపిడుగువంటిదెబ్బదంపు బొబ్బ విన్న మాత్ర భూకంప మైనట్లు కకవికించె సకల కాననంబు
తపతీ. ౪. ౩౫

క్రి. విశే. అనివార్యముగా, తప్పక.

ఆ. ఘనుఁ డటంచు వేడఁగాఁ బోయినను బెట్టుపిడుగు వైచి చంపుఁ బిట్టపిడుగు.
చంద్రా. ౪. ౨౪.

గీ పిడుగు మొత్తినగతిఁ గూలుఁ బిట్టపిడుగు
కవిస. ౧ అధికారము (౪ ౮)

గీ పిట్టపిడుగుగ మగనిఁ జంపింప కిల్లు వెడల దిల్లాలు కలియుగవిలయవేళ

సీ రాహుపూజాభిచారవిధాన మొనరించి శశిఁ బిట్టపిడుగుగఁ జంపవైతు. కవిక ౩. ౧౧౦ (పిట్టబిరుగుడు, అపముద్రి)

పిట్టు. వి. (సం పిష్టమ్, ప్రా. పిట్ఠం క. త. పిట్టు) వానెవమీఁదఁ బక్వముచేసినపిండి; పిండి

పీ. పిష్టము చెలఁగుఁ బి ట్టన
ఆం. భా. ౨. ౨౫౬.

వ... పేకులఁ దేనెలోలఁ బిట్టును గట్టును దోఁపలుఁ బూపలు మొదలగుంబులు.
కాశీ. ౩. ౧౯౫.

పిట్టముదు=పిట్టురూపమైనన్న వైద్యము.

వ... శ్రీభీమేశ్వరమహాదేవరకు ఉపటిసంధ్యమం (క)బోనముసప్పటికిం బిట్టముదుసకుం బెల్ల ప్రాలకుంచము లిరవదొకును...
ద. శా. ౪ ౧౨౫౫.

పిఠరము. సం. వి అ. పుం. న. స్థాలి, వంటకుండ. పుం. గృహభేదము.

న. ౧. కవ్వపుకోల, మంథానదండము, ౨. ముస్తె.

పిఠరి. సం వి. ఈ. స్త్రీ. స్థాలి, వంటకుండ.

పిడక=పిడుక. వి (సం. పిష్టక, ప్రా. పిట్ఠఅ)

సీ... పేడ నాఁ దనరు గోమయసంజ్ఞ పిడక నాఁ దనరుఁ దత్పిష్టకంబు.
ఆం. భా. ౨. ౨౯౮.

పిడక. సం వి ఆ. స్త్రీ. పొక్కు, బొబ్బ

పిడకము. సం వి అ. పుం. పొక్కు, బొబ్బ

పిడి[1]=పిడికిలి. వి (౪ త. పిడి) పిడికిలి, ముష్టి

సీ. పిడికిలి పిడి యన నడరును ముష్ట్యాఖ్య...
ఆం భా ౨. ౧౪౧.

౨ వింటినడుము, లస్తకము.

క. అతనిచనుమర విశిఖన్యూతము సేయుటయు నొచ్చి స్రుక్కి హాలాంతం డాతతకోప సముద్ధతుఁ డై కుంచెం బిడికోలఁదికి నహితుని ధనువున్.
హరి. ఉ. ౬. ౧౭౩.

౩. పిడికిటితో పట్టుకొను ఖడ్గాదులభాగము.

గీ. పిడి యనంగను త్సర్వాఖ్య వెలయు చుండు.
ఆం. భా. ౨. ౨౧౬.

సీ. నగవుఁజెన్నులజాలు మ గ రా ల పి డి జా ఱ సొగసుసొమ్ములజాలు సోలపూవిలయ.
చెన్న బ. ౪. ౨౬౪.

క. మారుమను పేదిమధ్యగమై, యారతియద్దంబు
పిడికిరాయి యన నెంతయుఁ బొల్పారుఁ గడు
వలికమై మకమారికి మధ్యంబు సింహ
మధ్యమునకొలఁదె

కా. సం. 3. ౭౫౮. ఉ. హరి. ౧ ౧౭౧

వలకపిడి = పిడియాకారముగాఁ జుట్టినవలక
(గ్రా)

జః పిడికట్టు, పిడికిటికట్టు, పిడికోల, పిడిగంట, పిడిగొట్టు, పిడిగ్రుద్దు, పిడిగ్రుద్దులాట, పిడిపట్టు, పిడిమూర, పిడియము, పిడివాఁటు, పిడివాదము కొం

పిడి². వి. (కి. త. పిడి) ౧. ఆఁడేనుఁగు.

గీ. పసిఁడికోకల నించి యిం పెసఁగ మదపు,
గ్రోలుచును జుట్టు నలివలు గ్రాల నడమ,
నమరుపిడిపిండులో నిమహాగజేంద్రుడు, కాంతి
నలరుకుమారు నంతంతఁ గనిరి.

హరి. ఉ. ౩. ౧౪౩

వ. ఇట్లున్న పరమేశ్వరుకాంతరూపంబు దనకుఁ
గ్రూరరూపం బైనం గని వనంబుఁ జొర
నుల్కి యిభంబున కోజపిడి నడ్డంబు సేర్చి
సాత్త్వికచేష్టితంబుండునుం బోల
మరుండు గౌరికాకయు వార్చుచు నుండె.

కా. సం. ౫ ౪౯౭.

౨. ఆఁడుమృగము.

వ.. తొడిగినయమ్ముననఁ పడి పొరలుపిడుల
విడువక విడి ముడిపడుకదఁకులును...

ఉ హరి. ౪ ౭౯.

సీ. లాఁచి తప్పినజాగిలము గొట్టుకొట్టునఁ
గూడినపిడిఁ గూర్చఁ గొమ్ములాడు.

కకు. ౪. ౩౩.

విశే. ఆఁడుజాతిది; ఆఁడుది.

క. వడిఁ దేఁకఁ దోలి రా జార్యడి డొంకనపోటు
గా మరస్థలి వత్తు డ్రాపిడికిటి గొరకఁ
దేయం, బిడికిటి బిట్టుగని బిల్లమిఁటు గఁ
బఱిరెను. శారంగ. ౧. ౯౭.

సీ. అద్దంబునిడుపుటాఁబద్దలగతి మనుఁబిల్ల డొం
కలనుండి గ్రోళ్లఁదాఁట. మనుచ. ౨. ౩.
(మనుఁబిల్ల=ఆఁడుమన్నులు)

జ. పిడియేనిక, పిడిచేయు

పిడి³. వి. (క పిడి) వాద్యవిశేషము.

సీ. తారలు బిమ్మటతారలు శంఖముల్ కాహ
కాల్ పసిఁడిఢక్కలును బిరుదులు, గాలి
కొమ్ములు జోళ్ళు కైముళ్లు రుంజలు

కొ. రా. యు. ౩. ౨౭.

పిడికట్టు=పిడికిటికట్టు. వి. (పిడి + కట్టు) పిండి
పడుము, లస్తకము (క ర)

పిడికిటికట్టు=పిడికట్టు. వి (√పిడి1) పిండిపడుము.
లస్తకము

సీ... పిడికిటికట్టు వాఁగను లస్తకనామ మొప్పు.

ఆం. భా. ౨. ౨౧౧.

పిడికిలి=పిడి¹. వి దే. (బ. పిడికిళులు, పిడికిళ్లు)
ముడువఁబడినవ్రేళ్లుగల అఱచేయి, ముష్టి.

క మాను మీఁవలవవిగ్రుళ్లట వజ్రము నీవును
బిడికిటికాఁకున నొఱగు దేను గినిసితి నేనిక.

భార. శాం. ౪. ౩౯౭.

ఉ. చామనిమేనులు స్న నుపుఁ జల్లెడుకొమ్ముల
లోనఁ గల్గుబల్గోములు మానవపుంబొద
వులుం బిడికింట నడంగుకొనులంక.

శుక. ౨. ౩౩౧.

చ... రేల్చనిరొమ్ముడిరిక్కి మొత్తమును జక్కఁగఁ
జాఁచి మెఱుంగుఁబోఁడు లిచ్చను బిడికిళ్లఁ
బట్టి యవి జారి చనం దమగోళ్లు చుక్క
లంచుచును .. సీలా. ౧. ౭౯.

చ.. అర్థికోటికిఁ, బిడికిళు లాదిగాఁగ బలి
పెట్టుచు రత్నవడు వైశ్యభామినుల్.

విక్ర. ౧. ౩౪.

మ. జను లెల్ల న్వ్యాళ గంధి చూడఁగఁ బటు
జ్యాపాదపూర్వంబు గా, నొనరించెం బరి
పూర్ణముష్టిఁ బిడిప ట్టొక్కింత విశ్వంభుఁ
డ్రై, యవయంబుల్ వదలించి విల్లు వితిచెన్
హరి పూ ౬ ౪౩

పిడిమూర వి (పిడి[1] + మూర) పిడికిలికి మోచే
తికిని నడుమనుండు కొలత, ముడువఁబడిన వ్రేళ్లు
గల మూర రత్న (శ ర బ్రా)

పిడియ(ౘ)ము వి ($\sqrt{}$పిడి[1]) కటారి, బాకు

సీ. కుఱుచగాఁ గట్టినకరకదట్టీదిండు, వంతరిమ్మునఁ
బిడియాలు దోఁపి పి శకుం ౧ ౧౧౩

సీ. మెఱుపు పచ్చని దట్టి రొంటిపుగాఁ గటిఁ
జుట్టి, యపరంజిపిడిపిడియంబుఁ జెక్కి
వాల్మీ ౧ ౧౭

మ. పులితోల్కాసెల నంట దోఁపినపిరంబుల్
సీలిపూఁదావళంబులు బల్సింగపుఁజుంచు
దండకడియంబుల్ సారంగ ౧ ౬౩

క. పొద నుండి రొప్పుచెబ్బులి,కోదమం జే
యిచ్చి పిలిచి కొఱవంజి రొయ్యం, దదరక
గపచెదరక మది,బెదరక పదరక యు కుఱుచ
పిడెమునఁ గడచెన్
చంద్రా ౨ ౬౦ సారంగ ౨ ౨౩౩

పిడియేనిక వి (పిడి[2] + ఏనిక) అఁడేనుఁగు

క. పిడియేనికపదుపు పొదువఁ గడుపేదుకఁ
గ్రాలుగంధగజపతిమాడ్కిన్
హరి పూ ౭ ౨౪

సీ. పిడియేనిక యనంగ వెలయుఁ గరిణి
ఆం భా ౨ ౧౬౪

పిడివాటు వి (పిడి[1]) ౧ పనకట్టలను చేతికోలఁది
ఎత్తి గింజలరాలఁగొట్టుట (శ ర) ౨ ఒడం
బడిక. ఉదా పిడివాటుచీటి (శ ర, బ్రా)

పిడివాదము వి ($\sqrt{}$పిడి[1] క పిడివాదము)
మూర్ఖపుపట్టు, మొండితనము (బ్రా "మూర్ఖ
వాదము" అని శ ర)

పిడివాలు వి (పిడి[1] + వాలు) ఎన్నని తోలు
ముక్కలతోఁ దయారుచేసిన గూడుచెప్పు, పాద
రక్షావిశేషము

గీ. కాళ్లఁ బిడివాళ్లు నికటమార్గప్రపాన్న, రస
సముత్క్రమజనిత మూరాగ మమర, నృపతిచే
నంపకము గాంచి యిల్లు సేర, వచ్చె నాదారిఁ
దన్మనోవల్లభుండు శుక ౩ ౧౪౦

పిడివేయు అ క్రి ($\sqrt{}$పిడి[2]) పనులకతిలో
చేయిపెట్టి త్రిప్పు, (శ ర)

పిడిసాన వి కొయ్యలకును రత్నములకును రంధ్ర
ములు చేయు సాధనము, బరమా, ఆస్ఫోటని

సీ. పిడిసాన యనఁగను వేధిని వెలయును
ఆం భా ౨ ౨౬౬

మ. పాక్షనకు నుత్కంఠంబు వాటిల్ల గ్రుచ్ఛిర
యంచుం బిడిసానచందమున ధాత్రీభాగముల్
గ్రొచ్చె న్వయ్యారదం బారభసంబు మానుపఁగ
లేడయ్యెన్ మురారాతియున్
కై భా ౫ ౬౪

పిడిసె వి ఒకజాతి పావురము

చ. ఎడిసెను చేనిమీఁద నొకబిన్నన వ్రాలఁగఁ
జూచి శ్రీనాథుని చాటువు (బ్రా)

పిడు(ఋ)ఁజో(దు) వి పశువులదేహమందుఁ జేరి
రక్తము పీల్చెడుక్రిమివిశేషము, గోమారి

గీ. పిడుఁ జనంగను బిఱుఁదా నాఁ బిడుఁదునాఁగ
వఱలు గోమారి ఆం భా ౨ ౭౭

గీ. కర్ణకంఠోదరాధారకంబు లగుచు, నమరు
మురయూర్వరు పిడుఁదుశతండములతోడ, నచ్చ
టికి వచ్చె నొకయశ్వము
శుక ౩ ౩౬౭

సీ. పాలు చాలఁగఁ గ్రోలఁ జాలుచో తగ జాల
 పొదుఁగులఁ బిదుఁదులు పొదలుచున్న.
 పీఠారా. ౩. ౪౩.

ద్వి. క్రమ మెట్లు నా కెఱుంగఁగఁ జెప్పవలయు, నమితప్రభావ రోయాల్లను యనిన, పీఠుఁ దులు పొదుఁగునఁ బెద్దకాలంబు, గణుతింప నున్న దుగ్ధము గ్రోలఁ గలదె
 ప్రభు ౪ ౧౧౮ పా. ౧౫ పం

**పిడుక=పిడక.** వి (√పిడుచే) ౧ కరీషము, గోదమున్నగువానికి చఱచి యెండఁబెట్టిన పేఁడ ముద్ద

వ ..పిడుకగొఱపంబుతో మకంబునఁ బుటపుట నై... బెదరుకొదమకట్టువగుంపు
 ఆము ౪ ౩౫.

౨ పెలిమిడి, భస్మము. (చూ. కంటఁబిడుకఁ ద్రాము)

కంటఁబిడుకఁద్రాము = కంటిలో బూడిద పోయు, వంచించు.

ఆ. కంటఁ బిడుకఁ ద్రామి కడిమిఁ ద్రికూటాద్రి, యాక్రమించిరి భా. రా యు. ౩౦౦

ఆ. కంటఁ బిడుకఁ ద్రామి గర్వంబు గిర్వంబు, నడుప నైతిపోని నొట్టుపెట్టు.
 దశకు. ౭. ౫౪

జః పిడుకమొసలి

**పిడుకమొసలి.** వి (√పిడుక) చిన్న మొసలి

గీ. పెలుక నిర్ఘాత కోచు తాఁబేలు పిడుక, మొసలి కింకుమారము—పెద్దమొసలి...
 హంస. ౪ ౧౭౭.

**పిడుగు(డ్గు).** వి. (క. త పిడుగు) అశని, మేఘములరాయిడిచేఁ గలిగిభూమిపైఁబడు తేజఃఖండము.

క. కదునలుకయుఁ గూర్మియు పేర్పడ నెఱిఁగించుటకు దానిఫలకాలము పెన్పిడుగువ గాడ్పును జనులకుఁ, బిడుటయు బీచుటయు కెఱుకపడిరెండుభంగిన్.
 భార. ఆది ౭. ౧౧౩.

చ. పిటిలుపిటిల్లనం ద్రిదిలి ప్రేలి పడం బొడఁగెం జతుర్దికా,తటముల మండుచుం బిడుగు తండము .. భార. ౨. ౨౧.

గీ ప్రమతపాత్రుండు గద వైవఁ బిడుగువోలె, నదరు పెదఁ బొడి గాఁ జేసె నస్త్రగురుఁడు.
 భాగ. భీష్మ ౨. ౫౪.

ఉ ..రా జీవవినోధిమండలము చిచ్చులపిడ్గును బోలె పేచినన్. పాద. ౨ ౧౦౫.

విశ (పిడుగువంటిది) అతిబాధకము, మిక్కిలి బాధించునది.

సీ. వాదకుఁ బగ యూరివారలతలనొప్పి పెంపుడుకూఁకుంద్ర పెద్దపిడుగు...గీ.అనఁగ విఖ్యాతిఁ గాంచు వాయాఁడుఁగూడి.
 కుశ ౩. ౨౦.

జః పిట్టపిడుగు, పిడుగుకైదువు, పిడుగుతునుక.

**పిడుగుకైదువు.** వి. (పిడుగు+కైదువు) వజ్రాయుధము.

సీ. పిడుగుకైదువుపెట్టు తడకట్టు గాఁ బరోధి మహాపధిరసంబు చమర ననఁగ.
 వసు. ౫ ౩౭.

**పిడుగుతునుక(న్క).** విశ. (పిడుగు+తునుక) అశనిఖండమువంటివాఁడు, మిక్కిలి సమర్థుఁడు.

సీ. ఆపన్నరక్ష చేయఁడు గాని సజ్జనపీడనం బొనరింపఁ బిడుగుతునుక. రామలిం. ౧౩.

చ. ఉదిరిపసిండిచాయగల యొప్పుల కుప్పలు పేఁడికేలుపుం, గొదమలు దానపావకుని కజ్జలు చిచ్చులకంటిపెచ్చులల్, తుదజము పేఁడుముల్ పిడుగుతున్కలు వానరవీర లొక్కటన్, బొదివిరి లంక చుట్టునను భూగగనంబులు నిండ నార్చుచున్.
 రామా, ౬. ౧౯౦.

పిడుచే. వి. (√పిడుచే) ముద్ద, కబళము.

సీ. పిడుచ ముద్ద యనంగఁ బిండంబు వెలయును.
అం. భా. ౨. ౨౭౦

పిడుచేగట్టు. అ క్రి. (పిడుచ + కట్టు) ముద్దగట్టు, దప్పిచే ద్రవహీనమై ముద్దవలెనగు.

గీ. పెదవి చేపెత్తు నాలుక పిడుచగట్టు, గొంతు తడిలేయు నెక్కటఁ గొంతతదవు, దాహ మున నుదకము లేక దరి సెనేని.
దశా. ౨. ౧౩౭.

పిడుచేగొను. స. క్రి (పిడుచ + కొను) కబళించు, మ్రింగు.

సీ. దిక్కులు నాలుగు నొక్కచోటికిఁ దెచ్చి పిసికి పిండలి చేసి పిడుచగొనఁగ.
భార విరా. ౨. ౧౩౪

పిడుచేపాఁత. వి. (√పిడుచే) అలుకుగుడ్డ (శ ర.)

పిడుచే. స. క్రి (క. పిళుగు, త. పిళ్)
౧ పసరు మొ॥ పిండు.

గీ. బ్రహ్మ పిడిచినమందారసపన రనంగి.
ఆము. ౨. ౮

సీ. పడిచినఁ జమురు గారెడుమాంసములతోడఁ దేటతియ్యనిజాంటి తేనెతోడ,
పి. కథం. ౧ ౧౩౫.

౨. ముద్దవలె నదిమి దిగఁదుడుచు.

వ. అచ్చటిభూరజంబు వుచ్చి పిడిచి నైచి తూటాడిచిరి... హరి. పూ. ౫. ౧౮౯.

జః పిడుచే, పిడుచేగట్టు, పిడుచేగొను, పిడుచేపాఁత.

పిడు(డ)త. వి. (త. పిడియల్) మిక్కిలి చిన్న కుండ.

శ...మస్తకపీడుఁదక్రకపుం, గదవరాయితపర్యో దకేఁగా కరదోఁచునరోజ మూజ్యకుం, విడుతవిశాంగనో త్కిపలపించుమొలుంగు...
శేం. పంచ. ౧. ౫౯౧.

క. నిక్కుపాగపిడుత గదరా, ముక్కు మొగం బెన్నఁ గోఁతిముఖమున కెనయా...
చంద్ర. వి. ౧. ౪౨.

సీ...ముష్టిమానభాండాఖ్య పిడుత, యవఁ దన రారు. అం. భా. ౨. ౨౪౪.

సీ...కుండలు చట్లు మూఁకుళ్లు బుడ్లు, కడవలు కానలు పిడతల్ పెన క్లన భాండముల్ తగు... పాం. ని. స్థావ. ౬౫.

పిడువరించే. అ క్రి. (√పిడువు) (పిడుగువలె) అతిశయించు. మిక్కుటమగు.

గీ ఈరునిదాఘవాతాహతిఁ గరులతలలు, బ్రవస్ని లోపలి ముత్యముల్ పగుల విరివి, మంగలము లోని ప్రేలలభంగిఁ దూలి, ప్రేలిపడఁ గాసెఁ గట్టెండ పిడువరించి.
కు. సం. ౬. ౪౯౫.

పిడువు=పిడుగు. (చూ. పిడువరించు.)

జః పిడవరించు

పిణ్యాకము. సం. వి అ. పుం. న. ౧. తెలిక పిండి, తిలకల్కము, ౨. హింగువు, ఇంగువ. ౩ సిహ్లకము, చిల్లమడ్డి. ౪. కుంకుమపువ్వు. బాహ్లీకము (వై. ని.) ౫. కిణ్వము, బెల్లము మొదలగు సారాయి కుపయోగించు వస్తువు. (వై ని.) ౬. యవాని, ఒక దినుసుజీమము. కై. (వై ని)

పిత. సం వి ఋ. పుం. తండ్రి. (తండ్రులు అయిదుగురు. చూ. పంచపితలు)

ద్వివ. తల్లిదండ్రులు. బ. పితరులు, వంశమందుఁ బుట్టి మృతులైన పూర్వులు, పితృదేవతలు.

పితర=పితరుఁడు. వి. (సం. పిత. క. త. పితర),
౧. తండ్రి, జనకుఁడు.

వ...పితరయుఁ బితామహుండును బ్రపితా మహుండును ననఁగఁ బిండసంబంధులు ముప్పురు...మార్క. ౩. ౧౩౩, (శ. ర. పా.)

౨. (=పితర) పితృదేవత. (చూ. పితరదొర.) పితయము ద్రి. పా.

జః పితరదొర.

పితరదొర. వి (పితర + దొర.) పితృపతి, యముఁడు.

క. పితరదొర కేటఁ ద్రాటన్, జతనంబునఁ దివియ మిగుల జడుపున నెదలో, వెత కుదుచు తపసిబిడ్డని, బ్రతికించి యనంబుఁ గిన్నబల్లి దున కోగిన్. నీలా. ౧. ౨౨.

—ఇశ్లే:- పితరుల కోఁడు.

క. మిత్తియుఁ బితరుల కోఁడు, నృత్తిలి తిరుగంగఁ జూచి నలిఁ బోగ రదఁగన్, మెత్తిన తెలిగిత్తరవా, ల్తత్తిడి పెఱరాత నల్లలలదొర తాతా. అచ్చ. రా. కిష్కి. ౧౦౯.

పితరుఁడు.=పితర. వి. (సం. పితా.) ౧. తండ్రి, జనకుఁడు.

క సతియుం బతియును సుతుఁడును, బితరుఁడు నొండొరులతోడఁ బెనఁగడుచో సాక్షితఁ గైకొని మాన్పక యున్నతఁడు పత్రయము దండు వరువఁగ వలయున్.

విజ్ఞా ప్రాయ. ౬౬

౨ (బ పితరులు, పితాళ్లు) పితృదేవతలు, వంశమందుఁబుట్టి మృతినొందినవారు.

సీ పితరులబుణము దీర్పదునతనుఁ జెందని దౌర్భాగ్యశీలుఁ గొత్రమ్ము త్రమ్ము.

రాఘవ. ౧ ౪౬.

శి. కృతమతి యై యేడేఁడులు హుతవహు భృతమునను ప్రీతి నొందించినను బ్రతుఁడీ రేడుతరంబుల, పితరులఁ గొని దివికి నేఁగుఁ జెంపెసలారన్. భార అర. ౪. ౨౧౩.

జః పితరులచుక్క.

పితరులచుక్క. వి. (√పితరుఁడు) పితృదేవతాకము నగు నక్షత్రము, మఘ, (శ. ర.)

పితలాటకము=పితలాటము. వి. (త. పిత్తలాటకమ్) ౧. వంచన, మోసము, (శ. ర.) ౨ లోభిత్వము. (వా.)

పితలాటము=పితలాటకము. వి. (త. పిత్తలాట్టమ్) ౧. మోసము, వంచన, (శ. ర) ౨. లోభిత్వము.

(వ్యవ.) వాఁడు పట్టి పితలాటపుమనుష్యుఁడు.

పితాపుత్రులు. సం. వి. అ. పుం. ద్వి. (పితయుఁ బుత్రుఁడును) తండ్రికొడుకులు.

పితామహి. సం. వి ఈ. స్త్రీ. తండ్రితల్లి.

పితామహుఁడు. సం వి. అ. పుం. ౧ తండ్రి తండ్రి. ౨ బ్రహ్మ.

పితాళ్లు=పితరులు. వి బ. పితృదేవతలు, మృతి నొందిన పితృవర్గమువారు.

ద్వి విడువఁడే యొకఁడైన వృషభ మటంచుఁ గొడుకులఁ గాంచుట కోరి పితాళ్లు.

రం రా అయో ౧౪౧. పా. ౬. పం.

ద్వి తండతండములు పితాళ్లు నొక్కొక్క, తరములవారు తత్క్షణమ యేతేర.

పండితా. మహిమ. ౭౩. పా.

పితుఃపుత్రుఁడు. సం. వి. అ పుం. ప్రసిద్ధుఁడగు తండ్రియొక్క కొడుకు.

పితుకు=పిదుకు. స క్రి. (త. పిళుక్కు) ౧. (పాలు) పిండు.

గీ. ఇద్ధరాధోగ్ధ్రిఁ గ్రేపుల నెలమిఁ జేర్చి, పితికికొనుఁ దని పనిచె సమ్మతము మిగుల.

హరి. పూ. ౦. ౧౩౧.

ఆ. అడిగెఁ బితికి వండె నర్దగించెను గోవు, నవఁగ నిట్లు కొన్ని యనుద్వితర్మ, ధాతువులు గఁ దెలియఁదగు తాని నెల్లను...

అం. శా. ౩. ౧౩౯.

౨. (పశువులు పాలు) ఇచ్చు, స్రవింపఁజేయు.

చ. సతతము నగ్నిహోత్రములు సాగఁగ భూరి హోమఁబుల్ ఫలించునే, పితుఁడుగ ధేనువుల్ జలగభీరము లై చెలువొందునే సర, స్తతులు... హ. వరాహ. ౧౦3. పా.

క. తరియు వెలయూఁడువానలు, సురభులు చన్నవసి పితుఁడు సుకృతము జరుగున్, ధరిఁ గొంద్ర తేలు పండును, బరగుం బురుహ యోషములు ప్రజలకు వెల్లన్

కాశీ. ౪. ౨౯౯.

పితువు. సం. వి. ఉ పుం. ౧. బ్రహ్మదేవుఁడు. ౨. అన్నము 3. సూర్యుఁడు. (శ. ని)

పిత్రుకల్పము. సం. వి అ పుం. పితరులనుద్దేశించిచేయుశ్రాద్ధాదికము.

౨ పితరులయుత్పత్త్యాదికమునుదెలుపు గ్రంథభేదము.

పితృకాననము. సం. వి అ. న. శ్మశానము.

పితృకుల్య. సం. వి. ఆ. స్త్రీ. మలయపర్వతమునఁ బుట్టినయొకనది.

పితృగణము. సం. వి అ పుం. ౧. వంశమునందలి పూర్వులసముదాయము.

౨. పితృదేవతలగు అగ్నిష్వాత్తాదులు (వీరు ప్రజాపతులవలనఁ బుట్టినవారు)

పితృగామి. సం. విశే. (పు. స్త్రీ. న.) ఎతనువెందునది, పితృసంబంధి.

పితృగృహము. సం. వి. అ న. ౧. శ్మశానము, వల్లకాడు. ౨. తండ్రియిల్లు.

పితృతర్పణము. సం. వి అ న. ౧. పితరులనుద్దేశించిచేయు జలతర్పణము. ౨ పితృతీర్థము. 3. తిలలు, నువ్వులు. ౪. శ్రాద్ధాదులందుఁ జేయుదానము.

పితృతిథి. సం. వి. ఇ. పుం. స్త్రీ. అమావాస్య.

పితృతీర్థము. సం. వి. అ. న. ౧. తర్జనికిని అంగుష్ఠమునకును నడిమిచోటు, చూపుడుప్రేలికిని బొట్టనప్రేలికిని నడిమిచోటు, ఉప్పలవారి. ౨. గయాదితీర్థము.

పితృదాయము. సం. వి అ. పుం. తండ్రిసొత్తు, పైతృకధనము.

పితృదినము. సం. వి. అ న. అమావాస్య.

పితృదైవత్యము. సం వి. అ. న. అష్టకాదినమందు పితరుల నుద్దేశించి చేయుయజ్ఞము.

పితృనల్వము. సం వి. అ. పుం. రెండువందలనలువది యంగుళముల పరిమాణము. (వై. ని)

పితృపక్షము. సం వి అ. పుం ౧ తండ్రివంశ, తండ్రితెగ. ౨. భాద్రపద కృష్ణపక్షము.

పితృపతి. సం వి. ఇ పుం. యముఁడు.

పితృపైతామహము. సం విశే (అ. ఈ. అ) తండ్రితాతలనుండి వచ్చినది (ధనాది.)

వ... పితృపైతామహం బయిన రాజ్యంబునకు నీయట్లు వారు సర్వులు .. భార. ఆది ౭. 30.

మ. పితృపైతామహ మైనరాజ్య మరి విశ్వద్యంబు... భార ఆర. ౧ ౨3౬.

శ్లో పితృపైతామహే రాజ్యే వోఢవ్యే తేఽన్య థామతిః సం భార ఆర. 30. ౧.

పితృప్రపా. సం వి ఆ స్త్రీ గయయందుఁజేయు తర్పణరూపమగు ఆమ్రసేకము.

శ్లో గయాయాం పిండదానం య త్పితృకార్యం త దార్యకమ్, ఆమ్రసేకస్తయ స్తత్ర పాచారీ పా పితృప్రపా. (వై. ని.)

పితృప్రసువు. సం. వి. ఊ స్త్రీ. ౧. తండ్రితల్లి. ౨. సాయంసంధ్య, మలుసంజ. ప్రొద్దు పొడుచుటకు ముందై దుగడియలవఱకును, ప్రొద్దు గ్రుంకినవెనుక మూఁడు గడియలవఱకునుగల కాలము. (శ. ర.)

పిత్రుప్రియము. సం. వి. అ పుం. భృంగ రాజము. గుంటగలగర. శ్రీ.

పిత్రుభోజనము. సం. వి. అ. పుం. మాషములు, మినుములు.

పిత్రుమందిరము. సం. వి అ. న. ౧ తండ్రి యిల్లు. ౨. శ్మశానము

పిత్రుమేధము. సం. వి. అ. పుం. పితరుల నుద్దేశించిచేయు కర్మవిశేషము

పిత్రుయజ్ఞము. సం వి. అ పుం. ౧ పితృతర్పణము. (ఇది పంచమహాయజ్ఞములలో నొకటి) ౨ పితృకర్మము.

పిత్రుయానము. సం వి అ పుం పితరుల యొక్క చంద్రలోకగమనమార్గము.

పిత్రులోకము. సం. వి అ పుం చంద్రలోకమునకు మీఁదనుండు నొకలోకము. ౨. అగ్నిష్వాత్తాది పితృదేవసమూహము.

పిత్రువనము. సం వి అ న శ్మశానము

పిత్రువనేచరుఁడు. సం. వి అ. పుం ౧. శివుఁడు. ౨. భూతప్రేతాది.

పిత్రువ్యుఁడు. సం వి అ. పు ౧ తండ్రితోఁ బుట్టినవాఁడు

పిత్రుశ్రాద్ధము. సం వి అ. న. పితనుగూర్చి కాని పితరులనుగూర్చి కాని చేయుశ్రాద్ధము.

పిత్రుష్వ (తుఃస్వ,తుఃష్వ.) స సం. వి. ఋ. స్త్రీ తండ్రితోఁబుట్టినది. మేనత్త.

పిత్రుష్వస్రీయుఁడు. సం. వి. అ. పుం. మేనత్త కొడుకు

పిత్రుసువు. సం. వి. ఊ. స్త్రీ. ౧. తండ్రితల్లి, ౨. సాయంసంధ్యాసమయముసంజ.

పిత్రువాహ్వు. సం. వి. ఊ. పుం. కుడిచెవి, దక్షిణకర్ణము.

పిత్తకోశము. సం వి. అ పుం. పిత్తధాతువుండు దేహమందలితిత్తి.

పిత్తఘ్ని. సం. వి ఈ. స్త్రీ. గుడూచి, తిప్పతీఁగ

పిత్తడి. వి (సం. పిత్తలమ్, క. పిత్తళె, త. పిత్తళై) ఇత్తడి

సీ...మను సారకూటంబు, పిత్తడి యంచన నిత్తడి యన. ఆం. భా. ౨. ౨౪౯.

ద్వి. పిత్తిడికడియముల్ పికిలిపూదండ, పొత్తంబు లగు నల్లముడుక గాజులను.

ద్వి. పరమ. ౪. ౩౨౩. పా.

పిత్తడికాసు. వి మత్స్యవిశేషము.

ఉ ఇనుకదొందువ పిత్తడికాసు మల్గుమీఁ, నల్లెయు గిండె రొయ్యపర కాదిగఁ జేపలఁ బట్టి బెట్టుగన్. ప్రబంధ. ౧౯౫

పిత్తద్రావి. సం వి న్ పుం. మధురజంబీరము, తీయనిమ్మ శ్రీ

పిత్తధర. సం. వి. అ. స్త్రీ. కలాభేదము.

శ్లో. షష్ఠీ పిత్తధరానామయాశకాపరికీర్తితా, పక్వామశయమధ్యస్థాగ్రహణీసాప్రకీర్తితా. (సుశ్రుత)

పిత్తము. సం వి అ న. దేహమందలి ధాతువిశేషము (చూ. ధాతువు.)

పిత్తరక్తము. సం. వి అ. న. రక్తపిత్తరోగము.

పిత్తల. సం. వి. అ. స్త్రీ. నీరుపిప్పలి. శ్రీ

పిత్తలము. సం విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి పిత్తముగలది, పిచ్చగలది, వి అ. న. ౧. ఇత్తడి. ౨. భుజపత్రి, భూర్జపత్రము శ్రీ ౩. అరిదళము.

పిత్తాతిసారము. సం. వి. అ. పుం. పిత్తమువలనఁ గలుగు అతిసారరోగము.

పిత్తాభిష్యందము. సం. వి. అ. న. పిత్తమువలన కంటనీరు కారెడి రూుక రోగము

పిత్తారి. సం. వి ఇ. పుం. ౧. లాక్ష, లక్క. ౨ బర్బరచందనము, పీతచందనము.⚕ ౩. పర్ప టము, పర్పాటకము ⚕

పిత్తు. అ. క్రి. అపానవాయువువిడుచు.

క. బడబడ పిత్తులు పిత్తుచు, బడిబడి బహు భంగి మీఱుఁ బాఱుచు మఱి తా, నోడ లెఱుఁగక పెనుమూర్ఛం, గడు పోలఁగఁ దల్లి గాంచి కటకటపడుచున్

చంద్ర. వి ౨ ౪౪.

వి. అపానవాయువు చంద్ర వి. ౨ ౪౪ కవిచా ౧౫౦.

పిత్ర్య. సం. వి ఆ. స్త్రీ ౧ మఘానక్షత్రము. ౨. అమావాస్య. ౩. పూర్ణిమ. (వై ని)

పిత్ర్యము. సం. విణ (అ. ఆ. అ) ౧. తండ్రిది పితృసంబంధి. ౨. పితరులది.

వి. అ పుం. మాషము, మినుము

న. మఘానక్షత్రము. ౨. పితృతీర్థము (చూపుడు వ్రేలికిని, బొటనవ్రేలికిని నడిమిచోటు, ఉప్పల వాయి. ౩. తేనె, మధువు

పిత్సత్. సం. శత్రృ. పడనిచ్ఛగలది. ఇది సమాస పూర్వావయవముగానేయుండును.

పిత్సత్తు. సం వి త్. పుం. పక్షి.

పిత్సలము. సం. వి. అ. పుం. మార్గము, త్రోవ.

పిత్సువు. సం. విణ. (ఉ) పడనిచ్ఛగించువది; క్రిందపడనిచ్ఛగించునది. శబ్ద. ౩. ౪౪.

వి. ఉ. పుం. పక్షి, పిట్ట.

పిదప. వి ఔ. అవ్య వెనుక.

సీ... పదపడి పిదప తర్వాత పిమ్మట. గీ. టవలఁగఁ బశ్చాత్సమార్థ మై యలరుచుండు.

ఆం. భా. ౩. ౪౩.

శా. వీరశ్రీనరసింహశౌరిపిదపన్...కృష్ణరాయఁడు విభుం డై రాజ్యసింహాసనం, బారోహించె పారి. పీఠి. ౧౭.

గీ మొదలఁ దేనియ లుట్టుసంభోరుహాక్షి,ముద్దు పల్కులు శ్రుతిపుటంబుల భుజించి, పిదప భుజియింపఁ దొడఁగిరి త్రిదశవరులు, దైత్యులును దధ్యమిథ్యాముథారసములు

హర. ౬ ౧౨౧ సైవ. ౩ ౧౧౫.

విణ ౧ వెనుకటిగి, పిమ్మటిది, తర్వాతిది

ఆ ఇవ్విధమునఁ గృష్ణుఁ డేవపిదపటి, కథ వినంగ నాకుఁ గౌతుకంబు ..

భార. ఉద్యో. ౩ ౪౧౨.

క అట్టిరొమ మాద్రిపిదపటి, పట్టి...

భార కర్ణ ౨ ౩౪౭

క మొదలిటిపత్రము లెల్లను, ముదమున విలుచుటకు దానమున వాడికి నిం, పొదవఁ బ్రమాణము లైనను, బిదపటిపత్త్రంబుచెల్లఁ బెనఁకువ లందున్ విజ్ఞా వ్యవ ౩౪.

౨. తక్కువ, నీచము

ద్వి. మద మఱి నాతోడ మాట లాడినను, పిద పగునే భక్తి పెద్దతికంబు.

పండితా. పురా. ౧౦౧. పౌ.

జ: పిశ్కారు.

పిదపిద. వి అనుకుగా నుండుటను సూచించు ననుకరణము.

గీ. అంతఁ జలచల పిదపిద మనుచు నవిచి, కలల పై విప్వ వాఱుచుఁ గరుడుగట్టి, తల దలిర్పఁగ గర్భ మై తరతరంబు, నెల మసలెఁ జిరచిక్కా నన్నెలఁత కధిప.

కృ. శకుం. ౨. ౧౪౪.

విశే. ౧. (దీనికిఁ గర్మధారయమునందు నిగాగమం బగును) అనుకు, పలుచనిది. (చూ. పిద పిదన.)

౨. మృదువు, మెత్తనిది.

ద్వి. చెదరక యదరక చిడిముడిపడక, బెదరక వదలక పిదపిద గాక, క్రొవ్వాడి మూపక క్రూరత లేక. పండితా దీక్షా. ౬౧ పా.

వ... అమృతాహవాహినీప్రవాహం బెడబెడఁ బొడవడినయెడలఁ బొడవడునినుము పిద పిదనిపద వెగని మూలుదరలును...

శ్రీరం. ౧. ౧౩౭

జః పిదపిదన.

పిదపిదన. వి (√పిదపిద) ౧. అనుకుఁదనము, పలుచఁదనము. ౨. మార్దవము. మెత్తన. (క.ర) విశే. అనుకు, పలుచనిది.

సీ. కలికిచేష్టలు భావగర్భంబు లైనను బ్రియుని మీఁదనుగూర్మి బయలుపఱుపఁ, బిదపిద నై లజ్జ మదిఁ బదనిచ్చినఁ జెలిమేనఁ బులకలు చెక్కులొత్త భాగ. ౧౦ ఉ ౩౩౧, ౮౯౩

వ... శీకరపరంపరలచేఁ దొగులు మదుగులుగొనినఁ బిదపిద నగుచుఁ జిదుకుచిదుకు మనుచొంపు లును... భాగ. ౧౦. పూ ౬౫౭.

పిదుకు=పితుకు. స. క్రి. (క పిదుక్కు) ౧. (పాలు) పిండు.

సీ. తనపేరఁ బృథివి నాఁ జనఁ జేసి గోరూప, యైనయవ్వసుమతి నమరగణముఁ, బని చి రోషధులను బహురత్నములుఁ బిదికించి జగమ్ముఁ బోషించెఁ బృథుఁడు.

భార. ద్రో. ౨. ౨౧౧.

చ. పిదికినయాలపా ల్వెడురుబియ్యము కావడి కుండ నించి యయ్యాదుపతికిం బ్రియం బుగ .. కుక. ౨. ౫౯౭.

౨. (పశువులు) పాలు ఇచ్చు

క... పొందవుల్, చన్నవిసి పాలు పిదుకును...

వి. పు. ౧౯౪.

సీ. పాదపంబులు పుష్పఫల సమృద్ధి వహించె, నఖిలధేనువులు చన్నవిసి పిదికె

హై భా. ౬. ౯.

సీ. అదనుతోఁ జేఁపి చన్నవిసి యోషధుల మన్మోదవు కొండల కల్లఁ బిదుక నెఱిఁగె.

మనుచ. ౨. ౧౧.

పిధానము. సం. వి అ. న. మఱుఁగు, తిరో ధానము ౨ ఛాదనము, కప్పు, మునుఁగు. ౩ ఒఱ ౪. మూఁత, మూఁకుడు.

పిధాయకము. సం. విశే (అ యికా. అ) కప్పు నది, మూయునది, మఱుఁగుపుచ్చునది.

పిన=పిన్న. (దీనికి వ్యస్తముగాఁ బ్రయోగము లేదు) విశే. చిన్న.

మ గయలోఁ గాశిఁ బ్రయాగ శ్రీగిరిని గంగా ద్వారనీలాచలో, జ్జయినీ ద్వారకలం..., దర్పణ, క్రియచే వానీనతమ్ముఁ డెఱ్ఱిన యొవర్చెం దంట్రి కాష్టోదముస్

ప్రభా. ౧. ౮.

(దీనియామ్రేడితరూపము. "పినపిన"=మిక్కిలి చిన్న.)

సీ మొనలు చూపెడిపినపినమొలచ్చుదోయి యలఁతిపయ్యంటకు వాసచేయ.

దశా ౯. ౨౧౦.

క. పినపిన మెఱుపులు పాటిపాటి, చినుకులు మసమసక లెసఁగుచీకట్లుం దోఁచిన కొరికి కొరరు గానక, చని రాలోఁ బనియుఁ గన్న చాయల బఱచెరా. వేం. పంచ. ౧. ౪౮౧.

జః పినగుమ్మడు. పినతండ్రి, పినతల్లి, పిన వాఁడు, పినపిచ్చి.

పినగుమ్మడు. వి. (√. పిన.) ఒకజాతిగుమ్మడు. కీ. (కుటు.అని. క.ర.)

పినతండ్రి. వి. (√ పిన) తండ్రితమ్ముఁడు.

సీ. పినతండ్రి యని తండ్రిఁ గనమి జయంతుండు వచ్చినఁ జెఱసాల వైచువారు.
దశా. ౩. ౯౭.

౨. తల్లిచెల్లెలిభర్త. (గ్రా)

పినతల్లి. వి. (√ పిన) తల్లిచెల్లెలు.

చ. మనపినతల్లిపట్టి ధరమానవభోజవరుండు దండకాననమున దూషణాద్యనుజవర్గముతో వసియింపఁ బోయెడిని, జను మతఁ డాదరించు నిను .. ఉ. రా. ౪ ౧౦౪.

౨. తండ్రితమ్మునిభార్య. (గ్రా)

పినద్ధము. సం. విణ. అ. ౧ కట్టఁబడినది, బంధింపఁబడినది (వస్త్రము) ౨ తొడుగఁబడినది ధరింపఁబడినది. (కవచము)

పిననాఁడు=పిన్ననాఁడు. వి (√ పిన) బాల్యదశ, చిన్నవాఁడు

చ. కనినది మాత్రమే యొకటి గాదు సుమీ పిసవాఁటనుండియున్, పెనరు వహించి పెంచి మతి నేరిపి విద్యలు చెప్పి యెప్పుడున్, నిను పెడఁబాయ కున్నయది...
ముకుంద ౩. ౩౦౪

పినపిచ్చి. వి. (√ పిన) వృక్షవిశేషము ఒకానొకచెట్టు.

వ. మఱియుం బెదపిచ్చి పినపిచ్చి నల్లింద మల్లింద యిప్ప కప్పురమద్ది.
వికటం. ౨. ౧౪.

పినాకపాణి. సం. వి. ఇ. పుం శివుఁడు.

పినాకము. సం. వి. అ. పుం. న. ౧. శివుని విల్లు. (శ. ని) ౨. మట్టివాన. ౩. త్రిశూలము. (వై. ని.)

పినాకి. సం. వి. న్. పుం. శివుఁడు.

పినాకిని. సం. వి. ఈ. స్త్రీ. నదీవిశేషము, పెన్నవది. ౨. వీణావిశేషము.

పినుఁగు=పిలుఁగు. విణ. (క. పిసుగు) ౧. దుర్బలుఁడు, శక్తిహీనుఁడు.

ద్వి. మునిశాపదగ్ధు లా పినుఁగులు సరిరొ.
బస. పు. ౬. ౨౦౧ పా. ౮౩౯. పం.

గీ. కేకి యొకకేల నొకకేల పిఁగుఁజన్నుఁ, గవయు మాదుక చనుదెంచెఁ గాంత యార్త, పినుఁగు పెన్నదు మిట్టటు బెనఁకకంద, రెండు దిక్కుల భర మాని యుండె ననఁగ.
సుద. ౫ ౧౩౧.

౨ అల్పుఁడు, నీచుఁడు.

సీ తన కమృతముఁ బోసి యనుప వంచు నదల్పఁ, బినుగురక్కసునకుఁ బ్రియము చెప్పి.
ప్రభా. ౧౪౭.

క. వనజాసనవనజోదర, సనకాదులు ముఖ్య బాహ్యసంత్యాగము సేసి,నవారు గారు తక్కటి,పినుఁగులు బాహ్యంబు విడిచి పెద్దయుఁ జెడరే శివతత్త్వ. ౨౫౬.

౩ అవివేకి, బుద్ధిహీనుఁడు.

క. అని పక్షిహితము చెప్పిన, విని వెంగలి యైన క్రోఁతి పిఁ డిరవున జాలును దాను సుండి న నొన్నిక, పినుఁగుం గాఁ దలఁచి కాద త్రేలఁ ద్రోడంగన్ కేయూర. ౩. ౨౪౭.

౪. దుష్టుఁడు, క్రూరుఁడు.

క. పులుఁగులఁ బినుఁగులఁగిరాతుఁడు, వలఁ దవ్వు లఁగఁ దిగిచి తగ్గి వగ్గెరపగ్గం, బలఘుతరకీల మున సంవలనము గావింపుచుండె వలసిన భంగిన్.
వెం. పం. చ. ౨. ౧౨.

౫ లోభి, పిసినిగొట్టు.

సీ. పినుఁ గీక పెనఁగినఁ బెద్ద సొంపక యొజ్జ, పాటించి చేఁ గలపాటి వాఁడి.
అము. ౬. ౪౭.

౬. భోయవాఁడు, లుబ్ధకుఁడు.

గీ. బిసురుహగంధులు గాలపుబువ్వలెదురు, లాది యగుసాధనంబుల నలవరించుకొని పొంటూ పొంటినడలతోఁ బిసుగు లెల్లఁ, గడసి నడ చిరి యమ్మహీకాంతునటుత.

కుశ ౧. ౧౬౫.

పిన్న=పిన. విశే. ౧ చిన్నది

క. ధవళాక్షి వయసునఁ బిన్నవు గాని వివేక గుణమునఁ మిక్కిలి పెద్దవు. .

కళా ౪ ౧౩౩.

సీ. వారి యాకేఁటిపిన్నలు తావి గ్రోలని,పువ్వు కోదండాస్త్రపుప్పకళిక. సుద. ౫. ౩౪

వ ..అనురూపలావణ్యరేఖాసంపన్నం బైన పిన్నవయసురాకొమరు నవలోకించు ..

సైప. ౨ ౭౭.

౨. (విద్య మొ వానిచే) అల్పుఁడు, తక్కువ వాఁడు.

దండకము అప్పాపహేతోఁ దట్టిరాయంచవార్యం పుజో బైన నోరార నగ్గింప లేరన్నచోఁ బిన్న లెల్లెపిన్నఁగాఁ జాలువా రెన్న

నీలా. ౨ ౪౧.

౩ తేలికయైనది, చులకనిది (చూ పిన్నపని)

పిన్నది=చిన్నది, చిన్నవయసుది.

క. ఈపిన్నది సాకూఁతురు, తాపసజనముఖ్య మిమ్ముఁ దాఁ గొలువంగా, నోపుదు నని పూజె... భార అర ౭ ౩౧౮

ఉ. ఎన్నిమఁ గూర్తు సన్న విను మే మున దాల్చినమాల్య మిచ్చున,పిన్నది రంగమం దయిన పెండిలి సెప్పము...

ఆము ౧. ౧౪.

పిన్నవాఁడు=చిన్నవాఁడు.

ఆ. సాదువల్ల భుండు నటుఁ డింత నిక్కంబు, శుద్ధవారియట్ల పిన్నవారు.

భార. విరా. ౨. ౧౫౨.

పిన్నప్పుడు=చిన్నప్పుడు.

ఉ. కప్పురగంధి యాధరణికాంతతమూజ నృపాల చంద్ర పిన్నప్పటినుండియున్ జెలువ మందినచందము లెన్న శక్యమే.

ఇంద్ర ౨. ౧౩౩.

పిన్నాతఁడు=చిన్నవాఁడు.

క. ఈన్నఁ గని యప్పుడఁతి యో,యన్న విడువు భుజగబాధు ననపుడు వతఁడీ,పిన్నాతని ప్రాణంబులు, గొన్నది యిది దీనియమలు గొనిరెయిద ననిరెన్. భార. అను ౧ ౩.

గీ అతినిదర్శనమున విలయార్ణవమున, మడిపదికి సంచరింతు సానుద్దు లేల, వాఁటిపిన్నాతఁ డీయదునందనుండు, సరవి మిమఁ గూడి తిరిగి యీచంద మరయ్యె

జై భా. ౮. ౧౪౩

జ. పిన్నఁజేయు, పిన్నకక్కెర, పిన్నగోరఁట, పిన్నగ్రద్ద, పిన్నజమ్మి, పిన్నతనము, పిన్న తుమికి, పిన్నదూలగోపెల, పిన్నపవ్వు, పిన్నవాఁడు, పిన్నమడుగు, పిన్నపేరెడు, పిన్నపని, పిన్నపాఁపర, పిన్నపాప, పిన్న పాపఁడు, పిన్నపాల, పిన్నబిద్దాటలు, పిన్నమ, పిన్నములక, పిన్నముల్లంగి, పిన్న యిప్ప, పిన్నతీకము పిన్నవరగోఁగు

పిన్నండు. వి (త పిన్నంతండు) భూసావిశేషము

వ ..శ్రీ భీమేశ్వరశ్రీమన్మహాదేవరకు ... సమ ర్పించిన వివరము, పహిండిపిన్నండున్ను .. ఆ చంద్రార్కస్థాయిగాను సమర్పణచేశెను.

ద శా ౪ ౧౩౪౪.

పిన్నఁజేయు. సం క్రి (పిన్నన్ + చేయు) లాఘవ పఱుచు, చిన్నఁబుచ్చు, అవమానపఱుచు.

ఉ. బల్లిదు నన్ను భీష్మజనపాలకుమారకుఁ బిన్నఁజేసి స్వాచెల్లెలి దక్కిణిం గొనుచుఁ జక్కనినిక్కపుబంటువోలె నీగొల్లఁడు పోయెడిన్... భాగ. ౧౦. పూ. ౧. ౭౬౨,

పిన్నకక్కెర. వి. (√పిన్న) పక్షివిశేషము, కక్కెర. (శ. ర.)

పిన్నగోరంట. వి. (√పెన్న) ఒకజాతి గోరంట, సహా. ౕ. (శ. ర., బ్రౌ.)

పిన్నగ్రద్ద. వి (√పిన్న) చిందు, పక్షివిశేషము. (శ. ర.)

పిన్నజమ్మి. వి. (√పిన్న) శేలజమ్మి, శమీరము. ౕ. (శ ర.)

పిన్నతనము. వి. (√పిన్న) ౧ బాల్యము, పసితనము.

చ. పిన్నతనావ నుండియు విభీషణుఁ డెంత పరోపకారియో. ఉ. రా. ౨ ౧౫౦.

౨. హైన్యము, కొంచెత, న్యూనత.

ఉ. ఎన్నఁడుఁ గానువీస మొక టిచ్చినవాఁడవు గావు నీట నీ,వన్నియుఁగోడెకాండ్రు తగ వారవధూటులకై యొసంగునా, చిన్నెలు నీవు చూచియు వివి తలవంపఁగ నేర వన్నిటం, బిన్నతనంబుఁ దాల్చితివి పెద్దగ నిన్నిఁక నాద నేంటికిఁ విప్ర ౪ ౨౪.

3 లఘుప్రవర్తనము, తప్పుపని, నీచకృత్యము.

ఉ తన్నిన వాఁడు తచ్చరణతామరసంబుల వ్రాలి నన్ను నే, మన్నదిలేదు నావలన నన్నియు నేరము లోర్చుకొమ్ము నా పిన్న తనం బొకళ్లచెవిఁ బెట్టకు పెట్టిన సిగ్గు వోవు నా,వన్నియ నన్న మా నగరివారికి దండుగఁ బెట్ట నివ్వగుస్. పం. పంచ. ౪ ౫౧౧

ఉ...ధనకాంక్షఁగాదె యీ, పిన్నతనంబు చేసి తిది పెద్దలు మెత్తురె రాజధర్మమే.

భోజరా. ౨. ౧౭౭.

పిన్నతుమికి. వి. (√ పిన్న) కాకితుమికి. ౕ. (శ. ర.)

పిన్నదూలగొండి. వి. (√ పిన్న) దూలగొండి కండూర. ౕ. (శ. ర.)

పిన్న(ట,టి.)నవ్వు. వి. (పిన్న + నవ్వు.) మందహాసము, చిఱునవ్వు

చ కనుఁగవఁ బిన్ననవ్వు దొలఁక స్మరనిహాథుని కన్నుసన్న... పారి. ౧ ౫౫.

ఉ. సన్నలువాఱఁ బిల్కుచుఁ గుచంబులు మూపుచుఁ గెల్లగించి క్రేఁ,గన్నులఁ జూడఁ జూచుచు మొగంబునకున్ మురిపంబు దెచ్చుచుం, బిన్నట నవ్వును న్విడుచుఁ బొన్నతిపేణులు సప్పరించుచుం, జె న్నొదవించుచుం జఱచి చెయ్యులు దాల్చిరి వారకామినుల్

కు. సం. ౭. ౧౦౧.

మ. కురుముఖ్యుండును దోడిపైనికులుఁ బెక్కుల్ దూపు లొక్కుమ్మడిం గురియం బిన్నటినవ్వుతో నతఁడు తత్కోదండమాతాశ్వకే, తురథంబుల్ వికలత్వముం బొరయఁగా దోర్దర్పదుర్దాంతుఁ డై, పెరవుం జేవయు లావునుం దలిపె నుర్వీనాథ యానేనకున్.

భార. ద్రో. ౪, ౬౨.

పిన్న(ట, టి.)నాఁడు. వి (పిన్న + నాఁడు) చిన్నతనము, బాల్యము.

గీ సకలదేశభాషావిశేషములయందు, పరుసఁ బ్రఖ్యాత మనఁగ సుత్పాద్య మనఁగ, మిశ్రమన నొప్పుసత్కథామేళనంబు, తెన్నియన్నియు విన్నాఁడ బిన్ననాఁడ.

విక్ర. ౧. ౨౪.

ఉ. మాపొరుగింటికూఁతురనికుమారికి పిన్నటనాఁటనుండియు, న్నాపయిఁ బ్రేమఁ గన్నది...

కుశ. ౨. ౫౫౪.

ఉ. పిన్నటనాఁటనుండి ననుఁ బెద్దగఁ జూచిన వంశవృద్ధులన్. జై భా. ౧ ౫౯.

ఉ. పిన్నటినాఁటనుండి తిపుభీకరుఁ డై శుభలక్షణాఢ్యుఁడై... ఇందు. ౧. ౧౧౯.

పిన్ననుదురు. వి (√ పిన్న) ఏనుఁగునొసటి బుడిపి, వాతకుంభము. (శ. ర.)

పిన్ననేరేడు. వి. (√ పిన్న) కాకినేరేడు, కాకజంబువు. శ. (శ. ర.)

పిన్నపని. వి. (పిన్న + పని) ౧. తేలికపని, మొలకపైనపని.

గీ. అక్కటా యుష్ణ దోఁచిన దొక్కమాట, యంగహీనుండు గాన వాఁ డంత కోర్చెఁ, గుహమకోమలి యిది యోర్చుకొనుట యెట్లు పిన్నపని గాదు పైదింత సెన్నవలయు.
చంద్రా. ౪. ౧౭౨.

౨. అగౌరవపుఁబని, లఘుచేష్ట

సీ. ఈపిన్నపనులకు నెట్లు వచ్చితివని బోధించి చెప్పినఁ బోవపై తి...

గీ. అకట కామాతురత్వ మెట్లడఁచె నిన్ను.
సురాభాం. ౧౩౮.

పిన్నపాఁవర. వి. (√ పిన్న) ఒకజాతిపాఁపర, గోరుంబ శ.
(వారుణి అవి. అం భా., ౹శా)

గీ. వారుణి దనర్పుఁ బిన్నపాఁప రన...
అం భా. ౨ ౩౧.

పిన్నపాప. వి. (పిన్న + పాప) బాలిక; బాలకుఁడు.

క. మాఁపిన్నపాప లిచటికి, శ్రీ పార్వతి నోము వచ్చి వెచ్చెర నోకద్వుర్వ్యాహారివదుగుఁ బోఁదఁగని, రాపాడువఁడు వారిఁ జూచి యదయాత్ముఁ డై పద్మ. 3. ౧౯౭.

సీ. పిన్నపాఁపవు నీవు పితృపరాధీనవు ..
పైమ. ౨. ౭౭.

(శ్రీ మహావిష్ణువర్ణనము.) సీ ... పెనునీటఁ దేలాడు పిన్నపాప. ఉ. రా. ౧ ౭౦.

పిన్నపాపఁడు. వి. (పిన్న + పాపఁడు.) బాలకుఁడు.

చ ఉరువ్యథాభరా్ర౯త పుంకవృద్ధవిప్రమీథు నంబు మృతుం దగుపిన్నపాపనిఁ, బిత మృతి కొంచువచ్చి రఘవీరునివాకిట పైచి దీనతన్.
ఉ. రా. ౩. ౧౯౧.

ద్వి. మీ కృప్రసాద మిమ్మెయి దేరవతాస్యపనిఁ బూని యొకపిన్నపాపనిచేత, వనిపివం జాలదే... ద్వి పరమ ౯. ౭౨౩. బా.

పిన్నపాల. వి. (√పిన్న)మనుపాల, జీవంతి. శ.

గీ పరగు మనుపాల యనఁ బిన్నపాల యం చ, టన్న జీవంతిక. . అం భా ౨. ౭౯.

పిన్నబిడ్డాటలు. వి బ. (√పిన్న) బాలక్రీడలు.

ఉ కోటిగృహాఖ్య బ్రహ్మ యని మిక్కిలి నమ్మితివమ్మ చూడ కేపాటియు లేదు మాకుఁ బరిపాలకుఁ డైవసరోజసేత్రుఁ ని, చ్చోటఁ వసింపనీక యొకచోటికిఁ బో విధి యించి పిన్నబిడ్డాటలు చేసి నీవుడుకు లక్కట భారతి కైనఁ జెప్పరే. భాగ. ౧౦. పూ. ౧౨౧౨.

పిన్నమ (మ్మ). వి. (పిన్న + అమ్మ) ౧ పిన తల్లి, తల్లిచెల్లెలు, మాతృష్వస

ఉ ... ఈ, పుత్తడిబొమ్మ కన్నుఁగవ పోలిక వాలిక గండుమీల కీ, బిత్తరిముద్దుచెమ్మె గను పిన్నమ పున్నమచందమామకున్. విజ. వి. ౨. ౧౧౯. (ఇటనా పమ్యద్యోతకము.)

౨. తండ్రి తమ్ముని భార్య. (శా)

పిన్నములక. వి. (√పిన్న) చేలములక, కంటకారిక. శ. (శ. ర.)

పిన్నముల్లంగి. వి. (√ పిన్న) క్షుద్రమూలకము. శ. (శ ర)

పిన్నయిప్ప. వి. (√పిన్న) మధూలిక. శ. (శ. ర.)

పిన్నతనము. వి. (√పిన్న) పిన్నతనము, బాల్యము.

గీ. బాల్య మగుఁ జిన్నతికె మనఁ బడుచుఁ
దనము నాఁగఁ బిన్నతికం బన...
ఆం. భా ౨ ౧౦౪.

పిన్నలి. వి ౧. ఆభరణవిశేషము

వ...శ్రీకాకొలని శ్రీవల్లభరాయనికి సమర్పించిన వస్తువులు...రు ౧౦ా తోను సన్నంపూస పేటు ౧ ఘంటలు 3 తోను పిన్నలి ౧ ఒత్తులు ౨. పద్మకడుకులు ౨ ముత్యాల తిరుణాము ౧ . ద శా. ౪ ౯౨౫.

౨. పిరి, మెలి.

ద్వి. మున్ను గా మొల నున్నముమ్మాలకావి, పిన్నలి వడి మెడం జెనచి అగిల్చి...
ద్వి. పరమ ౪ 3౨౧ పా ౧౪ పం

ద్వి...నంబులు నచటిస్థానంబులవారుఁ బంచిన ధీతిఁ జేపట్టి గొబ్బునను, బిన్నలి దప్పించి పెనఁకువఁ గేల, నున్నట్టికైదువు నాడిసి కైకొనుచు
ద్వి పరమ ౪ 3౨౧ పా ౧౯ పం

పిన్నవరగోఁగు. వి. (√ పిన్న) కమలవల్లభ ₹ (శ. ౦)

పిన్ని. వి (త పణ్ణి) ౧. పసతల్లి, తల్లిచెల్లెలు ౨ పినతండ్రిభార్య (వా)

పిపతిషత్తు. సం వి. త్ పుం పక్షి. (మే ని)

పిపతిషువు. సం. విణ (ఉ) పడుటకునిచ్ఛకలది వి. ఉ. పుం. పక్షి.

పిపఠిష. సం వి. ఆ. స్త్రీ పఠించునిచ్ఛ

పిపఠిషితము. సం. విణ (అ. ఆ. అ.) పఠింప నిచ్ఛేగింపఁబడినది.

పిపఠిషువు. సం. విణ. (ఉ) పఠింపనిచ్ఛగించు వాఁడు.

పిపాస. సం. వి. ఆ స్త్రీ నీరుత్రావనిచ్ఛ, నీరు వట్టు, దప్పి.

పిపాసి. సం విణ (న్. నీ న్)= పిపాసువు.

పిపాసితుఁడు. సం విణ (అ. ఆ. అ.)= పిపాసువు.

పిపాసువు. సం విణ (ఉ) నీరుత్రావనిచ్ఛగొన్న వాఁడు, దప్పిగొన్నవాఁడు

పిపీతకి. సం వి ఈ. స్త్రీ వైశాఖశుద్ధద్వాదశి (వాచ)

పిపీతకుఁడు. సం వి. అ పుం. బ్రాహ్మణభేదము (వాచ)

పిపీలకము. సం వి. అ పుం చీమ

పిపీలము. సం వి అ. పుం చీమ

పిపిలి. సం వి ఈ స్త్రీ = పిపీలిక.

పిపిలిక. సం వి ఆ స్త్రీ ఆఁడుచీమ

పిపీలికము సం వి అ పుం ౧ చీమ. ౨. చీమ లచే కూర్పఁబడినఒకదినుసుబంగారు (విల్యమ్సు)

పిపిలికామధ్యము. సం. వి. అ న. చాంద్రాయణభేదము

పిప్పట. సం వి ఆ స్త్రీ = పిప్యట. గుడశర్కఱ, పటికబెల్లము (త్రి ని)

పిప్పలకము. సం వి అ న ౧. స్తనవృంతము, చనుమొన, ౨ సీవననూలైము, కుట్టునూలు.
పుం. ౧. గుండునూది, ౨ బండి, శకటము. (విల్యమ్సు)

పిప్పలము. సం వి. అ. పుం. ౧. రావి. ₹ ౨. బంధనములేనిపక్షి; శాకు (శ. ౦) 3. చొక్కాలోనగువాని మూఁతేయి.
న ౧. చూచుకము, చనుమొన, (వై. ని) ౨. జలము, 3 వస్త్రఖండ భేదము. ౪. ఫలము, పండు. (వై. ని.)

పిప్పలాదుఁడు. సం. వి. అ. పుం. ఒకఋషి.

పిప్పలాశనము. సం. వి అ పుం. ఏనుఁగు, గజము

పిప్పలి. సం వి ఇ పుం రావి. 1

ఇ ఈ. స్త్రీ ౧ పిప్పలి, కణ 1 ౨ గజకర్ణమూలము. (వై ని)

పిప్పలీమూలము. సం. వి. అ. న గ్రంథికము, పిప్పలికట్టె.

పిప్పి=పిప్పిరి. వి. (క హిప్పె త. తిప్పి) రసము పిండివేయఁగా మిగిలిన చెఱకు, ఆకు, మొదలగునది

గీ. చెఱకు విడిచిరసమున కొఱఁగి రాక, పిప్పి కరిగాదు నీఁగలపెల్లువోలె

కు సం ౧ ౩౦.

సీ పిసరు పిప్పి యున నిష్పిష్టతుషం బగు...

ఆం భా ౨. ౨౩౯

సీ పద్యానభిజ్ఞతౌథంగిఁ బంగువుఁ బోలు ఖిన్నమాదుర్యుఁడై పిప్పిఁ బోలు,...గీ సుకవి వాసర ధవ దివాంధ కవి కుకవి.

బహు ౧. ౧౦

పిప్పిక. సం వి. అ స్త్రీ. ౧ ఆఁడుకాటుకపిట్ట, (వై. ని) ౨ పల్లపాఁచి, దంతిమలము.

పిప్పిరి=పిప్పి. వి సారము తీసివేయఁగా మిగిలిన చెఱకు, ఆకుమొదలగునది.

ఉ...విరోధిసేనలం, బిప్పిరి సేసెదన్ సెలవు పెట్టుము నీవు గదంగు మాఱికిన్

జై. భా ౫. ౧౫౪

పిప్పీకము. సం. వి. అ పుం పక్షివిశేషము, (ఇది ప్రయాణముగువానికి దక్షిణదిక్కుగా నుండిన యెడల శుభసూచకము, బృహత్సంహిత.)

పిప్యలు. సం. వి. అ. స్త్రీ పిప్పట.

పిప్లువు. సం వి ఉ. పుం పుట్టుమచ్చ, జటులము.

పిమ్మట[1]. వి. జా ఏ (క పికటు. మ పిన్. త పిన్ను) ౧ వెనుక, అనంతరము, (చూ. పిమ్మటిప్రేలు )

౨ మునుపు, పూర్వకాలము

శా ఈవారం బొకమాటు పిమ్మటికి నే నెచ్చో టనో కన్నయ, ట్లూహాం బయ్యెడి...

వసు ౪ ౯౪.

—పిమ్మటిప్రేలు. (పిమ్మట+ప్రేలు ) వి బొటనవ్రేలి తరువాతిప్రేలు, తర్జని, చూపుడు వ్రేలు

చ నడుఁకక బాల్యచాపలమున న్దనపిమ్మటి వ్రేలఁజొక్కుపున్, గడియుపుట ట్టటంచుఁ ద్రిజగజ్జను లచ్చెరువంది చూడ నక్కడపటి కొండ సొంపు లెఱుగం దవిలించి నటించు కూలిపె, న్గాడుకు . వేం. పంచ. ౧. ౪.

అవ్య. క్రి ౧ అనంతరము, పిదప

మ...అయ్యారవిందాక్షికిఁ బక్షిపుంగవగతిప్రాయంగ వీవంబు న్విగ్రహాగ్నంబు నొనర్చ మున్న రుచిసౌరభ్యంబులం బిమ్మటన్, మఱియం ద్రోయుచు నించె నెమ్మనమునన్ మూర్ఛాసముచ్ఛ్రాయమున్

హైప ౨. ౯౯.

తే తండ్రిపిమ్మట నివి రేము తగినభంగిఁ, బంచుకొనసేర కిమ్మెయిఁ బ్రతిదినంబుఁ, బోరుచున్నారము...విక్ర ౨ ౮ ఆము. ౩.౪౫

౨. పరోక్షమందు, చాటున.

సీ. తులువ పిమ్మట నిన్ను దూషించుపలుకులు కులజాలు నిజముగాఁ గొనుట...

భార. అను. ౪. ౩౮౪.

శ్లో. పరోక్షవాదిభి ర్మిత్రా ద్దోష స్తైః సంప్రదర్శితః పం. భార. అను. ౧౭౪ ౧౩. ౨౦

సీ. ఎదుటఁ బిమ్మటనైన చెప్పు డేనియు భర్తృ సేయునే న న్నింతసేయ నేల.

చంద్ర. ౧. ౧౩౯.

పిమ్మట$^{2}$. వి. ౧. బాధ, దుఃఖము

క ఆరీతి నంతిపురమున, నారీతిలకము సఖీ జనంబులు గొలువం, జేరినపిమ్మట మదిలోఁ, గూరిన పిమ్మట విరాళిఁగొని నరుఁ డుండెన్.

(విజ వి 3 3 మనోవ్యథ అని క ర)

క. అలజడి సెంజలి పిమ్మట పిలు గుత్తలపాటు కుందు నా నమరు దుఃఖాఖ్యల్

ఆం శే. ౧౦

౨ భయము.

చ పిడుగులు బిట్టు ప్రేలిపడఁ బిమ్మటఁ బొంగి సమస్తజీవులుం, బడఁకఁగ ..

పద్మ ౯. ౨౩౧

—పిమ్మటగొను అ క్రి (పిమ్మట$^{2}$+కొను) బాధపడు

క ఈరీతి నుండువాతని, గారాబుంటారి తలిరుకైదువులదు స్నే, దారికటారి సులక్షణ, పేరింటి వధూటి శేమిఁ బిమ్మట గొనుమా

శుకి ౨ 3౭౪

వ...తొరు దిగ నిమ్ముశేక పిమ్మటఁ గొని నలు దెసలం జూడ... ఆము. ౪ 3౫.

పియ్యి=పీయి. వి విష్ఠ, మలము

వ. .యీపుణ్యాలకు యవండు అపించి కీ డాడిన కూడుకి పియ్యి తిన్నవాండె .

సె శా. 3 ౧3౯3. పా.

పిర. వి రూపాయలో రెండువందలయేఁబదియారవ వంతు, కానిలో నాల్గవభాగము.

(శ. ర ప్రా.)

పిరంగి (గీ). వి (హిం ఫిరంగి. మ పీరంగి, క. పిరంగి) లోపల మందును గుండును వేసి దట్టించి కాల్చెడి పెద్దలోహపుఁ గ్రోవి.

ఉ...అచ్చమూపాళి గలంగ...రాలఁ దుపాకు లం బిలుఫిరంగుల భంగము నొందఁజేసి...

కృష్ణ. రా. 3. ౫౧.

గీ ద్రుమము వహి నున్నచోటఁ బాఁదుకొని యుండి, కురకైవడి నల్లమందుపొడి పెక్కు, రాజవిధమున వరిపురిరాజి వేచి, వలుల నొదకాని పరంగి వగపిరంగి.

ప్రబంధ. ౭. కుక. ౧. ౧33.

శా కీలాభీలము లిప్పరానులపిరంగి లగ్నిమూర్తుల్, రంగా. ౨ 3౮, 3. ౫౨.

౨ ఖడ్గము, పెద్దకత్తి

సీ వాలు ఖండా కరవాలు మేల్కత్తి తరవళి నరాజి పిరంగి యడిద, మనఖడ్గనామ మై యలరుచు నుండును...ఆం. భా. ౨. ౨౧౪.

పిరము. విణ (సం ప్రియమ్ క. పిరియ) ౧. ప్రియము, ఇష్టము.

గీ. ఒకగొడుగునీడ నీవు కీ దుడుగ నదుపు, గుడును కొందకు లోనైనపుడమిఁ గలుగు, పజలకెల్లను బిరమైనపగిదిఁ బొలుచు,విందుఁ గావించెదను వేఁట వెడలుపాపి.

చంద్రా ౨. ౭౭.

౨ హెచ్చువెలగలది (వ్యవ.) ఈనడుమ బెల్లలు చాలపిరమైనది

౫ పిరపడు

పిరపడు. అ క్రి (పిరము+పడు) ఇష్టపడు, ప్రియపడు

గీ .కాఁచురారూపుచట్టు చేస్తంభు జెయ్యి, యయినరాసనక్కరవతి యడె పిరపడి, నూనె ప్రబం. ౧౯౪.

పిరి=పురి. వి మెలి

సీ తనరు సూత్రము నూలు దార మనఁగఁ, బురి పిరి యనఁగఁ దక్కరణవేష్టన మొప్పు...

ఆం భా. ౨. ౨౯౫.

మ. అనమబ్రహ్మకరోగ్రకాగ్రసనలీలాకారుఁ దగ్గింధవా,మానుకుం దగ్గతి నున్న ఘోరభవ పాశాయాసవిధ్వంసనవ్యసనుం డిప్పిరిత్రాళ్ల

నిల్వఁ దనివాక మ్మెఘవాడుండు పాళసమా
కేశతుఁ జేసె... సమీర ౩. ౧౧౧
(ప్రథమ పాదమున యతిచింత్యము)

౨. వెంటి, గడ్డిపిరి.

క. పాల మిల్లు తోఁట గ్రామము, కలవు
పసులు మేయుకొఆను కాల్చిన నృపకాం,
తిలతో సంగము చేసినఁ గలయం బిరి సుట్టి
వానిఁ గాల్పఁగ వలయున్
విజ్ఞా. ప్రా ౧౦౪

౩ గోనెలుమున్నగునవి కట్టెడుత్రాడు (శ ర)

పిరివెంటి=మెలిపెట్టిపేనిన గడ్డిత్రాడు

ద్వి కసవుఁ బిరివెంట్లు గాఁ దాల్చి చేత, నస
లాఁ గవగివియలభాతిఁ బట్టి
బస. పు. ౩ ౫౭౯ పం

జః పిరిగొను, పిరిచుట్టు.

పిరిగొను. అ క్రి (౧ పిర+కొను) ౧ మెలి
గొను, పెనఁగొను, చిక్కుపడు

చ. సొశము గాఁగి బావములు జాడఁదెనుంగున
నింపు పెంపుతోఁ, బిగొన ఆర్యులకుఁ గ్గ
సాయశీలఁ గ్రాలఁగాన్ కు సం ౧ ౩౫

తే విటుఁ దడలును గినుకయుఁ బిగొనంగ,
ముక్కై నాతని నాతండు మూర్ఛవోవ
భారి ద్రో ౫. ౧౭౪.

చ కాఁగినపూఁతచేఁ గనకకందుకకాంతి వెలుంగు
చన్నులం, బిరిగొనుగొడ్డ ముత్తియపుఁ బేరులు
వాయఁగ... ఉ హరి ౫ ౭౮.

౨ సాంద్రమగు, దట్టమగు, అతిశయించు

తే ఇవ్విధంబునఁ బలికినయింతిపలుకు, గాన
కేరక తన యప్పకదకు మగుడ, నరిగ
నెవ్వగ మనమునఁ బిరిగొనంగఁ, జిన్నఁ
బోయిన మొగముతో సింహాబలుఁడు.
భార విరా. ౨. ౫౯.

చ . అంత నకామనుఁ డైనకర్దముం, దరయ
విమోహి యై మనమునందలి ముందటవచ్చు
కోరికల్, పిరిగొనుచుండఁ దక్షిణమ బిందు
సరంబున కేఁగి... భాగ. ౩ ౪౭౧

క పిరిగొను తొలకరి మొగుళుల, భరితాంధం
కరిణమునకు బాసటయయ్యెక్, బురివిచ్చి
యాడునెమళుల, నిరస్తతాపింఛ పింఛ నిర్మల
దీప్తుల్ ౪ విక ౭ ౨౧

౩ గుంపుగూడు, సంక్షోభవించు

క నందయశోదలు గోపక, బృందంబులు గోపి
కలును బిరిగొని పగమా, నందంబునఁ జను
దెంచిరి భాగ ౧౦. ఉ ౧౦౫౯

పిరిచుట్టు. వి (పిరి+చుట్టు) (స్త్రీ పురుషులు
కట్టుకొను) నడికట్టు

తే దర్భ ప్రేలియుంగగము మేఖావిబోట్టు,
మడుఁగు పిరిఁదికిఁ బిరిచుట్టు బెడఁగు గాఁగ,
వడుగుచందంబు దన నెడిమడుగు గాక
కొమరు గా నేఁగి నెలకజ్జిగుజ్జువేల్పు
హరి ఉ ౧౦ ౨౪౩.

చ పయఁట బిగించి పెన్నడుముపైఁ బిరిచుట్టుగఁ
జుట్టి కుంతలా, చ్ఛయము దృఢంబుగా
ముడిచి ..వెల్వడియె శక్తినివాసము.
కళా. ౭ ౭౦

పిరుపీ(ర్వీ)ఁకు. వి (పీఁకు+పీఁకు) ౧ పీఁకు
లాట, పెనఁగులాట

క తరుణీ యేరికిఁ జెల్లునె, యరయఁగనే మింత
వార మనుకొన నిదిగో, పిరుపీఁకుగ నున్నది
కాఁ, గిర మద్భుత మైన సవతికయ్యము
చేతన్. కళా. ౧ ౪౨.

౨. బాధ, కష్టము

క. ఈరాత్రి యకారణపుం, బేరలుకఁ దదాత్మ
కాదని పిరుపీ కగుచో, బ్పారయ భాగ్య
విహీనులు, తె రెవ్వరు నవని యుండలిన్ ననుఁ
బోలన్. ప్రభా. ౫. ౧౫౫.

శా...స్వ, శ్చారిత్రవత్యగుణాభిరామ యశశ్శాభా మాలలామంబు సంప్రీతిం జేయునసహ్య దర్పవములన్ బిర్వీఁకులం బెట్టుదుర్జాతుల్ వీతదయానయుం దదుచితాచారంబులన్నిచ్చ లున్ పాండు ౪ ౧౪౬.

**పిరుపీఁకులాడు.** అ. క్రి (పిరుపీఁకులు + ఆడు) పెనఁగులాడు

గీ ఒండొంటితోఁ బిరుపీఁకులాడు శబ్దపదం బులు ఆము ౬ ౧౩ (శర, పా)

(పోరిఁకులాడు చేదంపా)

**పిరుపీఁకులుపెట్టు.** స క్రి (√పిరుపీఁకు) బాధ పెట్టు, కష్టపెట్టు

ఉ అమణిచిత్రిణీసుదతి యన్యజనోత్కటసంగ మంబుపైఁ, బ్రేమ జనించి యాత్మ పిరు పీఁకులంబెట్టఁగ . హంస ౫ ౨౦౭

**పిరుపీఁకు(లు)సేయు.** స క్రి (పిరుపీఁకు + చేయు) ౧ పెనఁగిలాడు, పట్టిలాగు

క. కని చుట్టువారుకొని యిట్టునటుం బిరుపీఁకు సేయుచు వృధాత్వరకుం, బని యేమి నిలుపుఁ డని యొయ్యన వారలపట్టు పదిల మగు టరసి మదిన్. పగమ ౫ ౫౪

ఉ. బింబఫలోష్ఠికన్నులను జేడిసమీ బిరు దిక్కులన్ సమానంబుగఁ బర్వుచున్న శ్రుతినామ సరోయుగశోభ లిట్టునట్టుం బిరుపీఁకుసేయఁగఁ గడున్ నమి కెందుకుఁ గాక కెంటిమధ్యంబునఁ బారడింబరువు లారయఁ జాపల మట్టిదే కదా ప్రభా ౨. ౪౧

ఉ. కే లగలించి పట్టి రతికిం బిరుపీఁకులుసేయు వల్లభుల్. వేం పంచ ౪ ౩౫౦

౨. బాధించు, పీడించు

తే. తగిలి పిరుపీఁకుసేయ నుద్దండవృత్తిఁ జెలఁగు టయె కాని మనమువచ్చిన మిటారిఁ, గూడి తమి మీఱ సయ్యాట లాడికొనుచు, నడువఁ గూడునె మేదినీనాయకులకు కువల. ౪ ౭౩.

చ...అవ్వనరుహాక్షిత్ర కన్నుఁగవ వాలిక రెప్పలఁ గప్పి పెద్దయుం, బెనఁగొన మన్మథుండు పిరుపీఁకులుసేయఁగఁ దత్తరించు చున్ వి పు ౬ ౨౩ వేం పంచ ౩ ౧౨౪.

**పిఱికి.** విణ (సం భీరుకః) భయశీలుఁడు పంద

క విఱిగినచో నిలువక వెఱ్ఱిమతికిం దసరథము మీఁది కోడితి పోపో, పిఱికి యని పలికి నురుముగ, నతికిం దత్సేనఁ బార్థనందనుఁడు వడిన్. భార ద్రో ౧ ౧౩౪.

చ పిఱికివి గాక నీవు నొకప్పెగ్గడవే, సభలందు భంగి ము న్నెఱుఁగనివాఁడ వైఁద్రుమని ఉ హరి ౪. ౧౭౯.

చ పెఱుకులు కాని బానుజవిభీషణులు ఉండఁగ నీకు నగ్నమే దై భా ౬. ౬౯. ఆం. భా. ౨ ౨౨౧

జ. పిఱికికండ, పిఱికితనము, పిఱికిపంద, పిఱికి మెకము, పిఱికివాఁడు

**పిఱికికండ.** వి (పిఱికి + కండ) అధైర్యము, భీరుత్వము

తే. పిఱికికండ యొకింత లే కతిమి చేర్కఁ, జిచ్చుఱకఁ బోవుదికచరాజివశేత్ర, కళ్య మేధంబు ఫలము తథ్యంబు గలుగుఁ, బదము పదమున కిది వేదభాషితంబు కాశీ ౨. ౭౬.

ఆ. తమకుఁ దామె ప్రల్లదంబునఁ బని లేని, కయ్యమునకుఁ బనరు గాని తగిన, దురము లైనఁ దిపురుడును తమయంతిన, పిఱికికండ లేని బిరుదుమగలు. ప్రభా ౨. ౬౦.

**పిఱికితనము.** వి. (పిఱికి√తనము) భీరుత్వము.

క. తెలి పెట్టిదిరూ రున్నదు, తెలియఁగని
నీయట్టివాని కెవ్వ రోకో యీ, పిఱికితన
మింత యేలవదఁ, గలిపిన వా రనుచు కొరి
కలకల నవ్వెన్ భార ఉద్యో 3 ౫౪

సీ. పిఱికితనంబున గుఱి దప్పి చనుటయు వెలి
పును మఱపును గొఱికొఱయును
అచ్చరా శాల ౪౫

పిఱికిపంద. విణ = పిఱికివాఁడు (√పిఱికి) వ్యవ (వాఁడు వట్టిపిఱికిపంద)

పిఱికిమెకము. వి (√పిఱికి) జింక, హరిణము (చి. ని ౪. ౮)

పిఱికివాఁడు. విణ (పిఱికి + వాఁడు) భీరుఁడు, భయశీలుఁడు

పీ. విరుదులనైనను బిఱికివాండ్రనునైనఁ జంపు
చోఁ గడపడుజముఁడు
భాగ స్త్రీ ౧ ౫౫

పిఱు. వి (√పిఱుఁదు త పుఱ) వృత్తియం దును కొన్ని క్రియలనుప్రయుక్తములగునపుడును 'పిఱుఁదు' శబ్దమునకు అంత్యవర్ణములోపింపఁగా మిగులు రూపము

ఉదా. పిఱుదెస, పిఱుతివియు, వెం

పిఱుఁదిచ్చు. అ క్రి (పిఱుఁదు + ఇచ్చు) వెన్ని చ్చు, వెనుకకు మగలు

గీ. ప్రథనభూములఁ బిఱుఁదీక పగఱనోడించి,జయ
ముఁ జేకొన్న సత్కీర్తి జగమెఱుంగు.
రంగా ౫ ౧౭౭.

పిఱుఁదు. వి దే. (క పిఱె) నితంబము,స్త్రీల కటి ప్రదేశమునకు వెనుకటి భాగము; వెనుకటి భాగము.

గీ. పదఁతి సంభ్రమించుచు నిట్లు పనులుసేయఁ,
బిఱుఁదు పాలిండ్లుఁ గొప్పుఁ గంపించు
చొప్పు, గనుఁగొనుచు కళా ౪. ౯౪.

గీ. గిఱుకుటందెలు ఘల్లనఁ గిరవాణి, మరలి
సురపంక్తి కరుగుచోఁ బిఱుఁదు చక్కఁ,
దనము కెఱివేణి చెలువు గన్గొని బలీంద్రుఁ,
డాది కన్నను మిగుల మోహంబుగాంచె.
దశా. ౮ ౩౯౫ నృసిం ౫. ౭౫

కా. ద్రోణాచార్య పిఱుందనొప్పి కృతహ
స్తుల్ భార ఆది ౬. ౯.

ఉ. ముందరరాజుఁ బుద్ధిబలముల్ గలయంబడి
గోవ్రజంబులన్, దండడివెట్టకుండఁ బిఱుఁ
దన్ నడపింపఁగఁబంచి
భార విరా ౪ ౧౭౪

ఈ క్రింది యుదాహరణమున మాత్రము కటి పురోభాగము అను నర్థము కానవచ్చు చున్నది

ఉ. .నునుఁజెక్కిలినొక్కుచు గుబ్బలంటుచున్,
గిప్పుగవీడెమిచ్చి తమకంబున నీవి వదల్చి
యంత నీ గొప్పపిఱుందుపై నొలసికూడిన
మేటికి స్వర్గమేఁటికిన్ ఉ రా ౪ ౧౯౯

జ పిఱు, పిఱుఁదిచ్చు, పిఱుఁదుకొన, పిఱుఁ
దెక్కు, పిఱుతివియు, పిఱుతివుచు, పిఱు
దీయు, పిఱుదెస, పిఱువడు, పిఱువెట్టు,
పిఱువోవు, పిఱుసను

పిఱుఁదుకొను. స క్రి (పిఱుఁదు + కొను) వెంబడించు, తఱుము

సీ. రథ్యాప్రతీకోత్థవముచే గిరికోటి పిడుగుల
వెఱవిడిఁ బిఱుఁదుకొనఁగ.
ఉ హరి. 3 ౫౪

పిఱుఁదెక్కు. అ క్రి (పిఱుఁదు + ఎక్కు) వెనుకపడు, వెనుకచిక్కు

క. తఱిఁదఱి వినుతో నడవక,పిఱుఁదెక్కిన
రుచులు దమము బిట్టదరుదు ని,వ్వెఱ నిండ్ల
లోన డాఁగిన, తెలుఁగుడు సుద్దీప దీప దీప్తులు
వెలిఁగెన్. కు. సం. ౮. ౯౫.

సీ ఉత్సాహ మెదలి నీ వునికియుఁ గని కురు
సంతతి యార్వఁ బాంచాలకోటి, పిఱుసని
పోవంగ సెఱుఁగవో
భార కర్ణ. ౩ ౨౯౫

ద్వి పిఱుసని యొక్కింత మఱువున నిలిచి, మఱి
వచ్చి చూచుడు గతి గంటి గామి
బస. పు. ౩ ౪౦ పా ౮౧౬. పం

౨. వెనుదీయు, జంకు

క వెలి నుఱికి వైరివీరుల, వెఱఁకులు దూఱంగ
చేయునృపపుంగవునం,పఱ కోర్వక పిఱుసని
రని, వెఱచి విషణ్ణు లయి సకలవిషయాధి
పతుల్ భార ఆది ౮ ౨౦౨

కి. మఱితురె యాడినమాటలు, పిఱుసని పోఁ
దగునె మీకు బెదరక యెదురై, తఱుముఁడు
భీష్ముని గీష్ముని, సెఱుఁగరె ము న్నేను
గలుగ కేలా వెఱవక
భార భీష్మ ౨ ౧౫౦.

**పిఱ్ఱ.** వి ౧ పిఱుఁదు, నితంబము (శ ర)
౨ గుదము, ముడ్డి

సీ గాఁడు గుద్ద పిఱ్ఱ యనంగ గుదము దనరు
సాం ని మాన. ౧౯

సీ గుదసమాహ్వాయము లౌ గుద్ద గాఁడు, పిఱ్ఱ
యనగను. . వేంక మాన ౮౦

**పిలకము.** సం వి అ పుం చర్మరోగ విశేషము

క. పిలకాదులఁ గంతులచే, నలమటఁ బడు
వారు భార అను ౫ ౧౦౧

శ్లో. గ్రంథిభిః పిలకై శ్చైవ క్లిశ్యన్తే భృశ
దుఃఖితాః సం భార. అను. ౨౨౦ ౩౪

**పిలపిల.** వి మూఁగుటయందును వచ్చుట పోవుట
మున్నగు క్రియలయందును చెవులు తిక్కించుట
యందు నగునను కరణము.

చ...ఈఁగలును జీమలు దొంతర గాఁగఁ బైప
యిన్ పిలపిల మూఁగ. పారంగ. ౩. ౧౧౪.

గీ. జంటఁ బిలపిలఁజను శుకశారికాము, యూర
కాదంబవితతుల... రసిక ౮ ౩౧.

చ పిలపిల నాజయధ్వజానిఁ బెద్ద కెదుర్కొని ..
శుక. ౧. ౩౨౨.

చ...పక్షులు వృక్షశాఖలక్, బిలపిలఁ జేరఁ
జొచ్చె . ముకుంద ౩ ౧౮౬.

ద్వి...మృగావళి భీతిల్లి కలఁగి, పిలపిల చెవు
లల్ల బిక్కరించుకొని, సొలపి నల్దిక్కులు
నూచుచునుండ ద్వి. నల ౩. ౨౪౯

**పిలాటము.** సం వి. అ పుం వాహిత్థపార్శ్వ
భాగములు, ఏనుఁగుముఖ మధ్యమునకు ప్రక్క
చోటు (వై. ని)

**పిలిపి(ల్పి)ంచు.** స క్రి (√పిలుచే) ౧ పిలువఁ
జేయు, ఆహ్వానింపఁజేయు

చ జలరుహనేత్రుఁ గాంచి సరసత్వము మీఱఁగ
నొక్కపేలుపుం, జెలుకలకొల్కి రాదిలు
కచేఁ బిలిపించిన సత్యభామ కా,కలికి
తెఱంగు కొరి కడకన్నులసన్నలఁ జూపె...
పారి. ౩. ౨౦.

౨ రప్పించు, వచ్చునట్లుచేయు

సీ ఆచటిరాజులు బంటు నంపి భార్గవుసైన
బిం కానఁ బిలిపింతు రంకమునకు
మనుచ. ౧. ౫౦
నీలా. ౩. ౫౬.

గీ ఇట్లు పిల్పించి సన్మాన మెసక మెసఁగ.
భీమ. ౧. ౨౨.

**పిలిపిలి.** విణ. చిన్నచిన్న.

ద్వి. అంత బంగరుగజ్జియలు నందియలును,గలకల
రవణింపఁ గారుమెఱుంగు, పిలుప వా
నింటిలోఁ బిలిపిలిపదల, మెలఁగుచు .
ద్వి. పరమ. ౫. ౩౪౭. పా.

**పిలు=పిల్లు.** పులు, పుల్లు. వి. తృణము, గడ్డి.

క. అలఁతులఁ బొరిఁగొనరు మహాబలు లాహా
ఘనులఁ గాని పవమానుఁ డిలం, బిలు
కెఱుకునె బహుశాఖా, కులగగనస్పంది
వృక్షకోటులు దక్కన్
వేం. పంచ. ౧. ౨౦౪.

పిలుఁగు=పినుఁగు. విశ అబ్బుఁడు, పిసినిగొట్టు.

క. కల దానస్యాపికి బహు,కలధౌతసువర్ణపూర్ణ
కంధ సదా య,ప్పిలుఁగుయతి మఱపు
పోసమ్ము, కలనేనియు లేక దానిఁ గని
రక్షించున్
వేం పంచ. ౧ ౨౧౪

(క. ర పా. 'పలుఁగుయతి' ముద్రి పా)

పిలుక(ల్క)=పిలువ. వి (సం పీలుకః)
పశుపక్ష్యాదుల పిల్ల.

చ... కేటికేఁ, బిలుకల వెంటఁ ద్రిప్పికొని పెంచుచు... రామా ౨ ౪౧

ఉత్సాహ . చిలుకపిలుక ముచ్చటలు గులుక
చంద్రా ౩ ౯౪

ఉ... పాంథవర్గమ్ముల నేచు తేఁటిపిలుకల్ పెద
లెల్ల సమాజాపికచ్ఛవిల్ వసు ౪ ౧౩౪

ఉ... తెమ్మెరపిల్క లచ్చటన్
చంద్రా ౨. ౩౨

ఇట్లే అరఁటిపిలుక, కందపిలుక, జొట్టుపిలుక
మొ

విశ. చిన్నది ఉదా. పిలుకజొట్టు. మొ

జ. పిలుకవాటు

పిలుకవాటు. విశ. (పిలుక+వాటు) పిల్లలను
పెట్టునది, ఈనునది.

వ.. పిలుకవాటుగోడిగలజావడంబులకుం బుట్టి ..
బెదరు కొదమతట్టువగుంపు...
ఆము. ౪. ౩౫.

పిలుకు(ల్కు). వి. గర్వము, మదము. (చూ.
పిలుకుమాఱు. మొ.)

ఐ. పరుషవాక్కులు.

సీ పిలుకు లాడినపోల్కి బెక్కు మీసలఁ జల్కు
చిలుకపల్కులబాధ మొలఁగ రాదు.
ఇందు. ౩. ౧౨.

జ. పిలుకుమాఱు, పిలుకుమార్చు, పిలుకుమార్చు,
పిలుకుమాలు

పిలుకు(ల్కు)మాఱు(రు;లు). అ క్రి.
(పిలుకు+మాఱు) చచ్చు; నాశమొందు.

చ (కర్ణుఁడు) పరకుఁగొనండు పాండుసుతసైన్య
నికాయము నించుకేనియుం, గరులు రథంబు
లశ్వ హయులఁ గాల్బలముల్ దనవీఁక
విచ్చియుఁ, మరలియుఁ దూలియుం బిలుకు
మాఱియు నల్గడఁ బాఱియున్ వియచ్చరు
లకు వేడ్క సేయ...
భార. కర్ణ. ౧. ౫
('పిలుకుమాలియు', శ ర పా)

చ ఇవి యరయంగ సెంతపను లింద్రజుచావుఁ
దలంప వాని వ్యాహవమున కూలిరైనఁ జెన
యన్ ధర మాతఁడు పిల్కుమారినన్, భువ
నము లెల్ల నిర్భయతఁ బొంది మహాద్భుత
మంది లక్ష్మణ, స్తవనకథావిధాచరణతా
పరతంత్రము లయ్యె రాఘవా.
నిర్వ. ౨. ౧౩.

గీ పెలపేలంపు పేలిటినేమములకు, పెలవు చెలు
వపుగమితాఁడు పిలుకుమారి, రక్కసుల
చేతఁ బోయెను నక్కచునకు, వగవ కట్లొత్తు
మై రొల్ల నొగులఁ దండ్రి.
యయా. ౩. ౧౩౧.

ఉ... నేఁడు వ్యామంచితనంబునం బిలుకుమాలిన
నాథుని నుగ్రశత్రులన్, మంచు నిసుండు
కోశఁ బరిమార్చుమహాబలుఁ జూచి.
భార. అశ్వ. ౪. ౬౩.
('పిలుకుమారిన', శ. ర. పా.)

**పిలుకు(ల్కు) మార్చు (ుచే) = పిలుకు మాలుచే(ల్చు)** స క్రి (√పిలుకమాలు) చంపు; నాశముచేయు.

క. విలు దుమురు సేసి గుఱ్ఱం,బుల సూతునిఁ బిలుకుమార్చి భుజగనిభశరం, బులఁ జేద్పఱచిన నీ గ్గతి, కలఁగి పఱచి రొండు రథము కర్ణుండెక్కెన్. భార ద్రో ౪. ౧౩౩

గీ తవిలి యప్పుడు మల్లయుద్ధమున వానిఁ, బిలుకుమార్పింపవచ్చును భీముచేత భాగ ౧౦ ఉ ౪౧౮

గీ...తద్రథంబు లొక్కట,పెట్ట కవిసిన నన్నిటిఁ బిలుకుమార్చి భార శల్య ౧ ౩౩౯

సీ. సముచితం బైనలజ్జాభరంబునుబోలెఁ బ్రియసఖీసఖ్యంబుఁ బిలుకుమార్చి కవిజ ౩ ౪౦ అచ్చ రా ను౦ ౧౫౪

**పిలుకు(ల్కు)మార్పు(ుపు)** వి (√పిలుకుమారు) హింస, చంపుట

గీ పొరిగొనుట పిల్కుమార్పు చంపుడు తును మట, యనఁగఁ దగు హింస అం. భా ౨. ౨౨౪

**పిలుకు (ల్కు) మాలుచే (ల్చు) = పిలుకు మార్చుచే(ర్చు)** స క్రి (√పిలుకుమాలు) చంపు, నాశనముచేయు (శ ర)

**పిలుచే(ల్చు)** స క్రి ౧ ఆహ్వానించు రమ్మను. (దీనికి పిలువమి, పిలమి, పిలువక, పిలక, పిలువుము, పిలుము, పిలువుఁడు, పిలుఁడు, పిలువఁడు, పిలఁడు, పిలువని, పిలని, మొ. రూపములు సిద్ధించును)

సీ త్రిపదీగతత్రివేదీధర్మకలిత మష్టాక్షర మంత్రంబు హరిపరంబు.

గీ. పిలిచి యాదలవలకేలు నిలువరించి, చదివె నాశనిదక్షిణశ్రవణవీథి, నపుడు తచ్చిత్త మానంద మనుభవించె, నమ్మహాముని యంతర్నిరతిగమించె. కపు. ౧ ౧౫౭.

మ రమణం బిల్చె సరోవరం బనిలజాత రాజీవ రాజీవన, త్సమదాళివ్రజచక్రవాకబక హంస క్రౌంచ నాదంబులన్. భార. అది. ౬. ౧౪౭

చ...నేఁ, గుడువఁగఁ బిల్తుఁగాని తనకుం గల యాఁకటి ప్రొద్దుటంగఁ డీ,కొడు కిటు వోక కడ్ మనము గుండెదు ని న్నని యూఱడిల్లెడున్ భార విరా ౨ ౨౧౩.

సీ రథముపై నున్న వార్తాండుఁ జూడఁగ లేమి గరుడాగ్రజుఁడు పెట్టుగాఁగఁ బిల్వ

గీ గాఢ మై నిండె గాఢాంధకార మెంకటి దశా ౩. ౧౧౦.

గీ అనిమిషాధీశ్వరుని చెంత కనుపఁ దలఁచి, పుత్రుఁ బిలు మన్న మూడిగంపుభటు లపుడు సవల ౪ ౨౦౫.

౨ కేకొను.

ద్వి ఇల నింద్రజి త్తని యువ్వాని జనులు, పిలుతు రెప్పుడు నట్టిపృథులవిక్రముని. • రం రా ఉ ౨౯. పా ౯. పం.

క...ఆటవికుని బ్రాహ్మణభర్తన్, గరుణం బిల్చిక యీ కే,వర మిం పన వారు కృత్తివాసునితోడన్ కాశ ౩. ౧౨౨

సా. ఊర లేనిది పేరఁబిల్చుటః లేనివస్తువును నిర్దేశించి ప్రస్తావించుట

ఱః పిలిపించు, పిలుపు, పిలుపుడు, పిలువఁబంచు.

**పిలుని.** సం వి. ఈ. స్త్రీ. మూర్వ, చాఁగ కీ.

**పిలువ=పిలుక.**

ద్వి. అంత బంగరుగజ్జియలు నందియలును, గల కల రవణింపఁ గారు మెఱుంగు,పిలుప నానింటిలోఁ బిలిపిలినడల, మెలఁగుచు... ద్వి. పరమ. ౫. ౩౪౭. పా. (పిలుక చి. ని. పా.)

పిలుపిచ్చ. విశే. (పిచ్చ + పిచ్చ) మిక్కిలి పిచ్చ.

సీ. పిలుపిచ్చవిద్యలు పేరవన్నియలును జెలుచఁ దనంబులు ప్రేలడములు. పాండు. ౩. ౪౩.

పిలుపు(ల్పు). వి (√పిలుచు) ఆహ్వానము, పిలుచుట.

సీ. ఫెళఫెళారవభగ్నభీమకోదండంబు భృగు రాముపింటికిఁ బిలుపుదీము.
చంద్రా ౧. ౭౧

చ. విలిపెఁడుభి_త్త మిత్తు నని నీతికిఁ బాసినఁగాని పూని యప్పెలి కలనేనియుం బిలుపుఁ జెప్పు దనీతికిఁ దుచ్ఛజాతికిఁ
వేం పంచ ౧ ౧౧౪.

సీ. పదిపిల్పులకును దాఁ బలుకఁ గొంకెడు కాంతి పలుమాఱు వింతఁగాఁ బలుక నేర్చ
కవిజ. ౩. ౧౨౪

పిలుపు(ల్పు)డు=పిలుపు. వి (√పిలుచు) ఆహ్వానము, పిలుచుట (శ ర)

పిలున(ల్వ)(బంచు. స క్రి (పిలువన్ + పంచు) పిలిపించు, రప్పించు

ఉ. పాండుకుమారులన్ బిలువఁబంచి...
భార. ఆది. ౬. ౧౩౩.

గీ...పిలువఁబంపె, జెండపూడన్న మంత్రీశ్వ రుండు నన్ను. భీమ ౧. ౨౧.

మ...నను...సంగీత కళారహస్యనిధిఁ బిల్వం బంచి పల్కెన్ గృపన్. వసు. ౧. ౧౬

పిల్ల. వి. (సం. పీలుకః ప్రా. పిల్లకో, పిల్ల, త. పిళ్లై.) ౧. పశుపక్ష్యాదిశాబకము.

గీ. నిజు వనంగను బిల్ల నా...తిర్యగర్భకములు గాను దెలియవలయు. ఆం. భా. ౨. ౯౯.

గీ. మీను పిల్లలజన్మంబు చే లనంగఁబడు నె... దశా. ౧ ౧౩౭. పీలా. ౧. ౧౩.

౨. ఆఁడు శిశువు.

వ్యవ : మాపిల్ల కింకను వరుఁడు కుదురలేదు.

౩. బిడ్డలు; మగపిల్లలు

శా...పిల్లలుం బిల్లగో, ర్వ ల్లో యంచు బయల్లనుం జెడుగుడుల్ ప్రేరేఁచి రవ్వే కలన్.
రా. వి ౩ ౧౪.

సా : పిల్లలకుఁ బీఁటకోళ్లకుఁ జలి లేదు.

విశే. ౧ చిన్న ఉదా: పిల్లకాలువ, పిల్ల కెట్టి కొలు.

క అని కామక్రోధాదులఁ, గనుఁగొని యావిష్ణు భ_క్తి గడుఁబిల్లది దా,నిని మీరు సావధానం, బున గెలువఁగ వలయు ననుచు బోధింపం గన్
ప్రబోధ. ౨. ౫౦.

గీ బిరుదుటందియ వెంబడిఁ బిల్ల కెట్లు,నవర... గేహమున కేఁగు...మల్లమాళి.
శుక. ౨. ౩౫౭

౨ న్యూనము అల్పము.

సీ విక్కుపువరుఁ దని నీ వింత నీవింత పల్లచేతలు చేసి బేలవైతి. చిత్రభా ౩. ౧౦౫.

జ : పిల్లఁగ్రోలు, పిల్లఁగ్రోవి, పిల్లఁడు, పిల్ల కాయ, పిల్లగడ్డము, పిల్లగాఁడు, పిల్లగిలుబు, పిల్లగోరు, పిల్లగోల, పిల్లజాట్టు, పిల్లకెట్టి, పిల్ల దీవి, పిల్లనూయి, పిల్లపిల్లతరము, పిల్ల పేఁచర, పిల్లపెసర, పిల్లపేగులు, పిల్ల మెఱము, పిల్లత్రేలు, పిల్లసన్నాయి, పిల్ల సిగ, పిల్లేరుగంతు

పిల్ల(న)(గ్రోలు=పిల్లనగ్రోవి. వి. (పిల్ల + గ్రోలు.) (వ్యుత్పత్తియందు వర్ణాధిక్యము) మురళి, ఊఁదుటకు అనువుగా బెజ్జములు చేసినవెదురు గొట్టము.

ద్వి. కొమ్మ యాతఁడె పిల్లఁగ్రోలూఁది వ్రజము, కొమ్మలఁ గడు వెఱ్ఱి గొల్పినవాఁడు.
ద్వి. భాగ. ౩. ౪౯. పూ.

మ...దివ్యాప్సరో, లలనాబృందము లాడ దావ
వులం పిల్లం(గ్రోళ్లు పట్టంగ .
భీమ. ౪. ౧౯౧

సీ...కేలం జొక్క-పుంబిల్లం(గ్రోలం పట్టి
నీలా ౧ ౭౧
యయా. ౪ ౧౫౮

పిల్ల(న)(గ్రోవి,=పిల్లన(గ్రోలు. వి (√పిల్ల) వృత్తియందువర్ణాధిక్యము, మురళి

సీ. పిల్లం(గ్రోవులం సెక్కు-పెట్టినవిండ్లు కంబళ్లు పప్పట్లును నల్లె(త్రాళ్లు కుక. ౨ ౫౪౫

సీ పెనువంతం గుండెనో పిల్లం(గ్రోవి
నీలా ౧. ౧౦౯

వ .పిల్లన(గ్రోవులం గిన్నరలు
ఉ రా ౫ ౨౪౭.

క. తలచీరకోల కిరుచె, ప్వులం బిల్లన(గ్రోవి యు మరం బొలము దిరుగుచున్ చెన్న 3 3౧.

బ. బాల(క్రీడావిశేషము

సీ కోలాటములు పిల్లం(గ్రోవులు గుమ్మడి(క్రోవి కూంతలు నూందం(గ్రోవులు...
హంస 3 ౧౪౬

పిల్లండు. వి (√పిల్ల) పురుషశిశువు, మగబిడ్డ.

ఉ మాధవనాథ నేను గృహమార్జన చేసుక పిల్లం దేర్చంగన్, వానికిం బాలు పోసి కొని
ఆనందసుందరీవిలాసము ౨ ౧౭౪ (బ్రా )

పిల్లక. సం. వి ఆ. స్త్రీ పిడియేనుంగు.

పిల్లకాయ. వి. (√పిల్ల) బాలుండు (శ ర )

పిల్లగడ్డము. వి (√పిల్ల) నడుమమాత్రముకొం చెము వెం(డుకలుగల గడ్డము.

సీ. పిల్లగడ్డము మించి పెరిగిమీసలు కుక్షి గోళంబుమీంద సంయూల లాంగ
ఆము ౬. ౭౦.

పిల్లగాండు. వి. (√పిల్ల) బాలుండు. (శ. ర.)

పిల్లగిరులు. వి బ (√పిల్ల) బాల(క్రీడావిశేషము. (శ ర.)

పిల్లగోరు. వి (√పిల్ల) బాల(క్రీడావిశేషము.

శా . పిల్లలుం బిల్లగో, ర్పొ ల్లో యంచు బయళ్ల , నుం జెడుగుడుల్ (పేర్చేంచి రక్వేళలన్.
రా వి. 3. ౧౪.

పిల్లగోలు. వి (పిల్ల+కోల) చిన్నకఱ్ఱ.

భ(ద్రకవృత్తము - పంచినపిల్లగోల కరయుగ్మ పాదములం బట్టి యూంది పశువ,ర్గంబు నర ణ్యమధ్యమధరి(త్రిం గాచునమయంబునన్...
అప్ప ౪ ౨33. పా.

పిల్లజొట్టు వి (√పిల్ల) ౧ చిన్నజుట్టు

గీ. కావితిరుకాసెదట్టులం గావుబొట్లు, పొల్ల సరు లొప్పు చరి(త్రాటిపిల్లజుట్లు,పెద్దచే(త్రాళ్లు గలకోడుబిరుదుజెట్లు (ప్రబంధ. ౭౨

౨ బాలురముందజెసిగ (శ ర )

పిల్లదీవి వి (√పిల్ల) బాల(క్రీడావిశేషము

సీ తూరనతుంకాలు గీరినగింజలు పిల్లదీవాలంకి బిల్లగోడు కాశ. 3. 33.

సీ కుప్పిగంతులు పిడి(గుద్దులాటలు పిల్లదీవులు గొబ్బిళ్లు గూవనాలు.

గీ ఆదిగా శైశవక్రీడ లాడి రపుడు, రామ కృష్ణులు గోపదారకులం గూడి.
వి పు. ౩. ౨౦౨.

గీ విమలచం(ద్రోదయారంభవేళయందు, బిల్ల దీవాటలను మల్లు పెనంగుటలును.
శివరా. ౨. ౭౩.

పిల్లనూయి. వి (√పిల్ల) నూతిలోపలి చిన్న నూయి. (శ. ర.)

ఇట్లే: పిల్లబావి.

పిల్ల పిల్లతరము. క్రి. విశే. (√పిల్ల) పుత్రపౌత్ర పారంపర్యముగా.

క. అవమతిఁ బితృఘ్ను లగుభూధవుల పెదకి పిల్లపిల్లతరము దునిమి భార్గవుఁడు మునియయ్యె... ఆము ౩. ౪౧

మ. గుడి ద్రింగేవానికిం దల్పు ల,ప్పుడముల్ గావుఁ బిల్లపిల్లతరముల్ భక్షింతు దాయాదులన్ ప్రబోధ. ౨. ౭౪

పిల్లపీఁచేర. వి. (√పిల్ల) పీఁచర,శతావరి [illegible].

సీ. పిల్లపీఁచర యనఁ బీఁచరి యనఁ బ్రబలును శతావరి... ఆం. భా. ౨. ౫౫.

పిల్లపెసర. వి (√పిల్ల) కాకిపెసర,ముద్గపర్ణి. [illegible]

గీ. పిల్లపెస రనఁగాఁ గాకిపెస రనఁ దగు ఆం. భా. ౨. ౫౭

("పిల్లి" అప ముద్రి, ధాన్యవాచకమైనచో బ "పిల్లపెసలు" అని శ. ర.)

పిల్లపేగులు. వి బ (√పిల్ల) చిన్నప్రేగులు (బ్రౌ)

పిల్లము. సం విశే అ అ అ. తడికన్నుగలది, చిల్లము, క్లిన్నాక్షము వి అ న. తడిసినకన్ను, క్లిన్నాక్షి

పిల్లమెట్టులు. వి బ. పాదరక్షావిశేషము, ఒంటియట్టచెప్పులు

గీ. పిల్లమెట్టులు మొలవంకి చిల్లకోల. సానందో ౫ ౫౪.

పిల్లమొలము. వి. (√పిల్ల) తలక్రిందుగాపెట్టెడు మొగ్గ; పల్లటీలాఁగు,

గీ. పిల్లమొలములఁ బోడు తప్పించ రాదు, దీని పేలాగునఁ దరింపఁ దీరు మనకు. రామా. ౭. ౪౨.

ఆ. మీఁదనుండి పిల్లమొలములు వేయుచు, వచ్చి పుడమి నిలిచె వనిత యార్త. చెన్న. ౨. ౨౨౪.

ఉ. క్రొన్నెలదాల్పువేల్పు జిలుగుల్ వెలుఁగుల్ గొన తటిఘోటిఁజే,కొన్నవలంతిపిల్లగమి కొల్లఁగఁ బిల్లమొలమ్ము లేసె... అచలా ౨. ౨౪.

పిల్లరీ. వి ఒకవిధ మగుపాట

ద్వి. పిల్లరీ పాడెడు పెనుపిశాచములు. పల్నాటివీరచరిత్ర ౨౪౧ (బ్రౌ.)

పిల్లప్రేలు. వి (√పిల్ల) చిటికెనప్రేలు.

ఉ. కోటికాంద్రు కృపన్ వలకాలిపిల్లప్రేల్, మట్టెఁగఁ గోసి. జై భా ౮ ౪౧.

పిల్లసన్నాయి. వి (√పిల్ల) చిన్నసన్నాయి. (బ్రౌ)

పిల్లసిగ(క)=పిల్లజుట్టు. (√పిల్ల) చిన్నజుట్టు

సీ. ప్రతిమాన వపనముండిత మైనమస్తంబు పెద తలఁ దూలాడుపిల్లసిగయు. వైజ ౨ ౫

క. తనవంటిపిల్లసికయే,తనకుం బలెఁ దలసి పేర్లు... వైజ. ౪. ౭౩

పిల్లాడి(ణి). వి ఆఁడుదాని కాలి నాలుగవప్రేలి యాభరణము

ఉ. కేఁడు దలంప నీవరుఁడు తలపోయఁగ నిం కొకవింత యాకవి,ల్లాఁడి కరంబుప్రేలఁ బదిలంబుగఁ దాల్చినవాఁడు చూడకే. కళా. ౪. ౨౦౩.

గీ. కెలఁది మట్టెలు పిల్లాండ్లు వీరమద్దియలును నందెలు...తొల్చె మార్చి మార్చి. ప్రభా. ౪. ౧౩౭.

సీ. వయ కలప్రోల్ల మట్టియలుఁ బిల్లాం డ్లిడి పాయవట్టము పెట్టెఁ బై తొకర్త. ఆము. ౬. ౧౨౮.

సీ... పిరమద్ది నా మట్టె యనఁగఁ, బిబ్బిరికాయ నాఁ బిల్లాణి యనఁజెటి, బొద్దు నాఁగను గ్రమంబుగఁ బదాంగు,శివిభూషలు .

ఆం. భా ౨ ౧౫౧

పిల్లాశము. సం. వి అ పుం పిట్టపిల్ల,పక్షిశిశువు

పిల్లి[1]. వి. (సం బిడాలః, క పిల్లి) మార్జాలము (దీనిభేదములు, జంగుపిల్లి, జవాదిపిల్లి, సీరుపిల్లి, పునుఁగుపిల్లి, బావురుఁబిల్లి, బూతపిల్లి, మాను పిల్లి మొ.)

సీ. జన్నిరోగికి బల్లైజాన్నం చేసినయట్లు పిల్లి కత్తిని వెన్న పెట్టినట్లు కేయు క 38

సీ పిల్లి యం చనఁగను జెల్లు బిడాలాఖ్య ..

ఆం. భా ౨ ౭౮

ఈ రా ౨ ౧౬౫

సా:—కాలుగాలినపిల్లి, అస్వస్థచిత్తుఁడు

ద్వి. కడు భయంకరమహాగహనముల్ గడచి, కాలుగాలినపల్లికరణి నీవెంట, కేల నీబంట నై యెల్లెండుఁ దిరిగి

ద్వి మారిక్చ ఈ ౧౨౪౫ పం

జః పిల్లికవ్రతనము, పిల్లికోల, పల్లిగడ్డ, పిల్లిశిలము

పిల్లి[2]. వి ధూళియందుపల్లముకావించుకొని దాని నడుమను అణఁగియుండు నల్లివంటి కీటము (బి వి)

పిల్లికవ్రతనము. వి ($\surd$పిల్లి[1]) వైదూర్యము.

సీ. పిల్లికవ్రతనంపుబిగియోడుబిళ్లలు పులుఁగురా పచ్చమేలొప్పిదియలును

అచ్చ. రా అయో. ౪.

పిల్లికోల. వి. ($\surd$పల్లి[1]) మార్జాలహత్య, (ఇదిమహా దోషములలోనొకటి)

ఉ. మోఘము గాక నీవు తల మోచి యొనర్చిన యట్టియుద్ధరం,శాఘము కేఁడు పిల్లికోల యై చరణంబులఁ బ్రాకు...

కేం. పంచ. ౪. ౨౭౭.

పిల్లిగడ్డ. వి ($\surd$పిల్లి[1]) పునుఁగుచట్టము,బిడాల కము, పునుఁగుపిల్లి శరీరమున పుట్టుఁగుండు కోశము

గీ. అట్లు దమకంబుచే వేటలాడి మృగము, దంబుఁ జామరములు గజదంతములును, బిల్లి గడ్డలు పులిగోళ్లు పికిలిచెండ్లు, నాది గాఁ దెచ్చి యిచ్చి రయ్యవనిపతికి

రసిక. ౧. ౧౧౬.

సీ పిల్లిగడ్డకుఁ దావి పెల్లుగా నొసగూర్చి కుంద నంబున కేల కూర్పఁడయ్యె.

నీలా. ౧ ౧౧౧, ఆం భా ౨. ౧౬౧

పిల్లిశీలము. వి ($\surd$పిల్లి[1]) కపటవర్తనము.

గీ శీల మఖిలంబు నిది పిల్లిశీల మనుచు, చదువు లివి యెల్లఁ జెల్కాలచదువు లనుచు.

పాండు 3 3౬

పిల్లు—పిలు, పులు, పుల్లు. (కసవు,తృణము)

అ పల్లు గిట్టు నలకువేరుండు దా నైన, నాయ మునకు వెచ్చ మధిక మైనఁ, బేద యైన ధనదు పెన్నద్ది యై చను, నాయమునకు వెచ్చ మల్ప మైన. వి[క. ౨. ౧౩౧.

పిల్లేరుగంతు. వి ($\surd$పెల్ల) పిల్లమెలుము, తలక్రిం దుగా వేసెడులాఁగు, పల్లటి (శ. ర.)

పిళ్ల. వి. (క. పిళ్లె, త. పిళ్లై) అఱవదేశమందలి వెల్లాలజాతికిడిన పేరు

ఉ. ఎక్కడఁ బోయితో యొఱుఁగ కేసును వెంటనె వచ్చి యప్పు డేదిక్కున నిన్నుఁ గానక మదికి వెఱ గందుచు దేవుఁ డాన నీ,బిక్కిర మెత్తు నయ్యలవిళ్లలవాడల నింత నేవు నీ,యిక్కువ లన్నియుఁ వెదకి యే నిట వచ్చితి లేచి రావయా. హైజ. ౪. 3౭.

పిళ్లారి. వి. (త. పిళ్లైయార్) విఘ్నేశ్వరుఁడు, వినా యకుఁడు.

గీ. గజ్జెకేలంపు పిళ్లారి కొక్కరాకు, బొజ్జదేవర యేనుఁగుమొగముసామి, అన వినాయకు నకుఁ జేల్మొక్కు .. ఆం. భా. ౧. ౪౩.

గీ. చేరి యాచేవ(బ్రా)నిపిళ్లారి నఱకి, చెక్కు లొవ రించి యంగడిఁ జేర్చి యమ్మి, యింటి కేఁగుట కార్య మిం కేటిదేవుఁ, డేను గూటికి వగవఁగా నేమి కలదు శుక ౩. ౫౪౭.

క. పిళ్లారిజియ్య కేజానఁ, జల్లంబుగ జంకమావు దేవరకతనకా, బెల్లదరారఁగఁ బుట్టిన, బల్లిదుఁడవు నీకు గద్దుపనులం గలవే. అచ్చ రా. కిష్కిం ౯౩.

(పిళ్లాఁజియ్య=వినాయకునితండ్రి, శివుఁడు)

పిల్లు. వి ఐ దూడలనుకుడువనీనియావులను, దూడ లుచచ్చిన ఆవులను, మరులుకొలుపుటకై వాని యోనిమార్గమున చొప్పించి లాగెడు కుఱుచ కసవుపెంటి.

వ...(శ్రే)పులం గొనవియావులం దొలంగిం గట్టి పిల్లు పెట్టియు మందులు సల్లియుఁ జాల దుఃఖపఱిచి చేఁ పెఱేంగించువారును... హరి. పూ. ౫ ౧౪౨.

పిశంగకము. సం. వి. అ పుం. ౧. పిశంగవర్ణము. ౨. విష్ణువు, ఒకానొక విష్ణుదేవుని యనుచరుఁడు.

పిశంగము. సం. విణ. (అ. ఆ. ఈ. అ.) తామర పుప్పొడివన్నెగలది, పింగళవర్ణముగలది.

వి. అ. పుం. కపిలవర్ణము, పింగళవర్ణము, గోరో చనవర్ణముగలది

పిశంగిల. సం. వి అ స్త్రీ. ఇత్తడి,రీతి.

పిశ(స)ము. విం విణ (అ. ఆ. అ.) పాపము నుండి విడివడ్డది.

వి. అ. న. బహురూపము, సర్జరసమను గంధ ద్రవ్యము. (వాచ.)

పిశాచకి. సం. వి. ఈ. పుం. కుబేరుఁడు.

పిశాచద్రుమ్రు. సం. వి. ఈ. పుం శాఖోటవృక్షము. తపసిచెట్టు.

పిశాచభాష. సం. వి ఆ. స్త్రీ. ఒకానొక ప్రా కృత భాషాభేదము

పిశాచము. సం వి అ పుం ౧ దేవయోని విశేషము ౨ ప్రేతము ౩ పిల్లి, మారారము. (వై ని.)

పిశాచసభము. సం వి. అ. న. ౧. పిశాచముల కూటువ. ౨. పిశాచముల కొలువుచావడి, (శేశ) సభ

పిశాచాలయము. సం వి అ పుం వేడిమికి కుండఁ బ్రకాశించు గుణము, వేడిచూపకయే వెలుతురునిచ్చునట్టి గుణము (విల్యమ్స)

పిశాచి. సం వి ఈ స్త్రీ ౧. పిశాచజాతి స్త్రీ. ౨. ఒకవిధమగు జటామాంసి. శ్రీ.

పిశి. సం వి ఈ స్త్రీ జటామాంసి. శ్రీ.

పిశితము. సం. వి. అ. న. ౧. మాంసము. ౨. చిన్నముక్క, స్వల్పాంశము.

పిశితి. సం. వి ఈ. స్త్రీ జటామాంసి. శ్రీ.

పిశీలము. సం వి అ. న. అంసద్వయాంతరము, రెండు భుజశిరస్సుల మధ్యభాగము (శే. ని.)

పిశున. సం. వి ఆ. స్త్రీ ౧ స్పృకయను గంధ ద్రవ్యము, ౨ కొండబెండ శ్రీ

పిశునము. సం. విణ అ ఆ. అ. ౧. సూచించు నది, తెలుపునది, వెల్లడించునది, ప్రకటించునది. ౨. కొండెముచెప్పునది ౩. పట్టియిచ్చునది, మోసపుచ్చునది. ౪. క్రూరము. ౫. దుష్టము. ౬. నీచము. ౭. మూఢము

వి. అ. పుం. ౧. దూది. ౨. కాకి.

వ. ౧. కుంకుమపువ్వు. ౨. పట్టియిచ్చుట, పోసమున వెలిపుచ్చుట.

పిష్టకము. సం. వి. అ. పుం. వ. ౧ పిండివంట, అపూపము.

పుం. నేత్రరోగవిశేషము ౨ కించిజ్జఘునాధిక్యమును, స్థనాంత విస్తృతియుఁ గల గజవిశేషము (శ ర)

న మాఁబొడి, తిలచూర్ణము

పిష్టపచనము. సం వి అ న బుజీషము, పిండి వంటచేసెడు పాత్రము, బూరెలమూఁకుడు

పిష్టపాకభృత్తు. సం. వి త్. పుం. వంటచేసెడు పాత్రము

పిష్టపూరము. సం వి అ పుం ౧ వటకము, వడియము ౨ ఘార్తికము, నేతియందు పక్వమైన గోధుమపిండి ముద్దగువానితోఁ జేసిన భక్ష్యము

పిష్టము. సం విణ (అ ఆ అ) ౧ చూర్ణితము, పొడిచేయఁబడినది ౨ పిసుకఁబడినది

వి అ న పొడిచేయఁబడిన ద్రవ్యము పిండి ౨ సీసము.

పుం న పిష్టకము, నూఁబిండి

పుం పరిమాణవిశేషము (వై రి)

పిష్టమేహము. సం వి అ పుం ప్రమేహరోగభేదము

పిష్టవర్తి. సం. వి ఇ పుం పెసలు, మినుములు లోనగువాని పొడి, ముద్గమాషాది చూర్ణము.

పిష్టసౌరభము. సం, వి అ న పొడిచేయఁగా సౌరభముకలది, చందనము ?

పిష్టాతము. సం. వి. అ పుం ౧. పటవాసము, వస్త్రములకు వాసనకట్టెడు బుక్కా-మ. ౨ కర్పూర కుంకుమ మిశ్రచందనచూర్ణము.

పిష్టికము. సం. వి అ. న బియ్యపుపిండితోఁ జేయు ద్రవరూపముగు నొక వంటకము.

పిష్టోడి. సం. వి. ఈ. స్త్రీ. శ్వేతామ్లిక, తెల్లచింత. ?

పిష్టోదకము. సం వి అ న బియ్యపుపిండి గలిపిన నీరు

పిస. వి (త పిచ్చుక పిచ్చి) ౧. అవివేకము, తెలివిలేమి

చ రసికుఁడు గాని యర్థమధురం బగుకావ్యగభీరభూరివాఙ్నిసర మెఱుంగ నేరఁ డవివేకి యొకానొకకారణంబునన్, వెసఁ జని రాజగేహమున విద్రుమపంజరకీరిఁ జూచి తాఁ, బిస పెలతన్గూడ యని పిల్చును గొల్లఁడు జాతిభావలన్ చను ౧ ౪.

౨ క్రౌర్యము, క్రూరత్వము

గీ ఇట్లు బాధించి శోధించి యెందు నొక్క, పచ్చపైకంబుఁ గాన కప్పుచ్చిపోయె, నేఁటి తెరవాటు పస లేక దాఁటిపోయె, ననుచు వెసఁ బాటి పిస మాని యవలి కేఁగి. వాల్మీకి ౨. ౯౬.

3 కామము చూ పిసవెఱ్ఱి

జః పిసవెఱ్ఱి

పిసక. వి (త పిచ్చుక్క) తలవెంద్రుకలందు చెమటచే బందవగొను మురికి (శ ర)

పిసపిస. వి (క పిసిపిసి) గుసగుసస్వరహాస్యము చెప్పుటయం దగుధ్వని కనుకరణము

వ...కర్ణంబునకు బిసపిస ననుమకరమంత్రంబు చెప్పి... ప్రబోధ. 3. ౫౧.

పిసరు. వి (క. పిసరు) ధాన్యాదులనుండి కడిగి తొలఁగించిన మలినపదార్థము.

(నిద్రించుచున్న కలహకంటకివర్ణనము) ద్వి... చెమట,దొరఁగుకక్షంబుల దుర్గంధ మెసఁగఁ, బిసరు గాఁచినకుండ పేర్పుచందమున, పెసఁగినపాఁకినో రెంతయుఁ దెఱచి.

ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౫౧. పం. (కడిగినధాన్యము లో తోపుడుపడినది. అని శ. ర.)

౨. వ్యాపనముకలది, వ్యాపించునది.

చ. మొకరి పిసాళితుమ్మెదల మూఁకకు గందపు
గాలిరాకకుఁ, జకితమృగాక్షి యౌర్వ్యనిఁకఁ
జాలఁ గృపామతి నాదరింపుమా.
రుక్మా ౩. ౧౫౪.

చ తొడరి పిసాళిజక్కవలఁ దుమ్మెదదాఁటుల
నంచబోదలన్, మదువునఁ బాఱఁదోలుచు.
రసిక. ౩ ౪౮.

౩ పరిహాసయుక్తము, ఎగతాళితోఁగూడినది.

చ. కలికిపిసాళినవ్వు లెసఁగన్ పటుధూర్తులు
కొంద ఱొండొరుం, దలకొన నెచ్చరించి...
ప్రభా ౧. ౧౦౨.

౪ మూర్ఖము, వివేకములేనిది

ఉ ఆఁకలిదప్పులం బకలినందుకుఁ దోడు పిసాళి
కోయిలల్, కూఁక లొనర్చి...
తపతీ. ౪ ౪౯

ఉ. ఈమక్కిడిజంతకుం దగినవొండివిటుండు
నిశాటజాతియం, దొక్కఁడు లేక లక్కఁ
దని యూహపరుల్ నగఁ జేటగోటిబ,
ల్మొక్కలపుంబిసాళి ఖరుమ దటికిం జని
నిర్చి నిల్చినన్
చం రా ౫ ౪౧. ఆం భా ౩ ౬

౫. వంచకము, దొంగయెత్తుకలది.

శా. చాలుం జాలు పిసాళినేఁతలు పదాబ్జాతం
బుపై మాటికిన్, వ్రాలం బోకు భవత్త్రివి
యానఖవిమిశ్రం బైననీవక్షము...
నరస ౨. ౩౨

ఉ. అర్ధమరేయిదాఁక బాల మారవి మారకేళీ
ముఖావహతిన్, నిద్దురఁ గాచి యున్నమగ
నిన్ జగనీలిపిసాళిజంత యమ్మద్దియ సేవ
సేయ దొకముచ్చట యాడదు మాఁగవోలె.
పాండు. ౩. ౮౧; కళా. ౭. ౨౩౧

పిసాళించు. అ క్రి (√పిసాళము.) ౧. ప్రకా
శించు, వెలుఁగొందు.

క. అక్కమలజాకర్ణంబులఁ, జక్కనికన్యకలు
పదురు జనియించిరి లేఁ, జెక్కులదాలుపు
తళుక్కుతళుక్కు మనఁగ వాలుఁజూపులు
పిసాళింపన్. వరాహ ౮. ౩

వ పిసాళించుచంచలదృగంచలప్రభలన్ బచా
రించి. మనుచ ౫ ౧౦౧

౨ బయలుపడు, ప్రకటితమగు

మ...ఇష్టం బెద్ది చే నిత్తు నన్న నిజస్వాంత
విచింత్యమానగిరిజానాథస్వరూపంబు వ్యక్తి
నయ మైన భయంబు భక్తియుఁ బిసాళింపం
బ్రహర్షంబునన్ కాళ. ౧. ౮౭

౩ వ్యాపించు, ప్రసరించు.

శా చంచల్లీలల హస్తకంకణమణిచ్ఛాయల్ పిసా
ళింపఁ బూజించున్ వేమమహీవిభుండు
నవరాజీవంబులం గల్వలన్.
కాశీ. ౧. ౪౦

సీ. సతులమైపూఁతఁ బిసాళించువెన్నెలఁ దనుపు
వెన్నెల రసాయనముఁ గూర్చి
పారి ౨ ౪౬ జై భా ౮ ౧౯౬

౪ పరిమళించు

సీ సద్యోవినిర్భిన్నసారంగనాభికాహృత మై
పిసాళించు మృగమదంబు మనుచ ౨ ౫౫.

వ ఘుమఘుమం బిసాళింప నలందుకొని...
పారి ౨ ౬౮

౫. చలించు, కంపించు

క సంపంగినూనె యంటన్, కింపొంగి కేకిటి
కొకలె చనదోయి పిసాళింపన్
విజవి. ౩. ౮౯.

౬. దొంగయెత్తువేయు, కపటముగాఁ బ్రవ
ర్తించు

ద్వి. నీకంటె మిక్కిలి నెఱజాణ నేను, కొడుకునై
విలపించుకొనుచు నీ వున్న, నాదప లవ్య
రొనర్త రీపను లెల్లఁ, జాలు లేలెమ్మ పిసా
ళింప కనుచు ద్వి. మారిక్పు. ఉ. ౧౯౦౯.

అ. క్రి. స క్రి. పరిహసించు, వేళాకోళములాడు.

స్వీ. లేఁతచందురుఁ బిసాళించుచెన్ను దురు.

ద్వి. పారిజ్ఞా. ఉ ౩౪౦.

వ ఓండొరులతో ననేకవిధసరససల్లాపంబులం బిసాళింపుచు నింపు దళుకొత్త.

కళా. ౧. ౩౯ కాళి ౪ ౧౭౫.

పిసాసి. వి (సం పిశాచీ ప్రా పిసాఇ, పిసాచో, త. పిచాచమ్) పిశాచి, పిశాచము

క. ఆసపడి చుప్పనాతి పిసాసి తనుజా డాసి హృదయజాతానీతా, యాసముఁ దలిపిన విని పరిహాసము దోలఁకంగ నాతఁ డాసతిఁ బలికెజా.

చం రా. ౫ ౩౭.

విణ దుష్టుఁడు; దుష్టురాలు

సీ సం దెఱింగినదొంగ సాకెనగొట్టు పిసాసి దిమ్మరి తోఁజము బజారి

చెన్న ౨ ౭౪ ప్రబంధ ౪౭౭

పిసి. వి (కి పిసి) ౧ తొలియందుబిగఁగొట్టుటకై చెక్కిన స్తంభము, పట్టెలోనగువాని చివరి, కసి (శ ర)

౨ కేఁటయం దుపయోగించు సాధనవిశేషము

చ. కలలు నురుల్ సిడుల్ పిసలు వంకరదుడ్డులు పందిపోట్లు... చంద్ర ౨ ౨౧.

పిసికిళ్లు. వి. బ. (√పిసుకు) పిసుకుటలు, మర్దనములు

మ... కాఁపురుబ్బ్యెతలపెన్గుబ్బల్ పునాసల్ పెలిం, బిసికిళ్లుం బిసికిళ్లు హాళికుల కర్పించెజా నభస్యంబునజా.

ఆము. ౪. ౧౩౩.

వ... గోవాళ్లకుఁ దిరువాళ్లఁ జూచువేడుకలలోఁ బిసికిళ్లఫలము గల్పించునుపాయంబు లెంచి...

ప్రబంధ. ౪౭.

౨. జొన్నలోనగువాని లేఁతకంకులను నలుపఁగా వచ్చు బియ్యము, ఊఁచబియ్యము.

సీ. కాచేనఁ జొచ్చి తిన్నన్నిజొన్నలు గోధుమలు పిసికిళ్లుగ నలఁచి తిన్నఁడు.

ద్వా. ౧ ౧౪౧.

మ... కాఁపురుబ్బ్యెతలపెన్గుబ్బల్ పునాసల్ పెలిం, బిసికిళ్లుం బిసికిళ్లు హాళికుల కర్పించెజా నభస్యంబునజా

ఆము. ౪. ౧౩౩.

పిసిడి=పిసిని. విణ లోభముకలవాఁడు, లుబ్ధుఁడు.

సీ పిసిడి యర్థముఁ గూడఁబెట్టిన ట్లావంకఁ బోకుటీగకునైనఁ బొలయ రాదు.

శై. ఖా ౧. ౭౪.

ఆ పందులాడి చెడుగుమానిసి బూతంబు, పిసిడి బిచ్చగాండ్లపెన్నుగుదియ. చెన్న. ౨. ౨౪.

ద్వి పరమ ౪. ౫౪౫. పా

జ: పిసిడితనము

పిసిడితనము వి (√పిసిడి) లుబ్ధత్వము, లోభము.

చ రసికపుమాటలజా మనను రంజిలఁజేయఁగ నేర్చు నీగులం, బిసిడితనంబు లేదు వలపించి యలంపఁడు...బసవయ లక్ష్మణుఁడ్ రతులఁ బాయుట కంతునిబాయుటే సుమీ.

వి. పు. పీఠి. ౪౪

సీ పిసిడితనం బది పిమ్మటఁ దిట్టించుఁ గను నహంకారంబు కష్టపఱుచు. నీతి. ౪౩.

పిసినారి. విణ (పిసిని[1] + ఆరి.) వృత్తియందు వర్ణవికారము, లుబ్ధుఁడు, లుబ్ధురాలు.

సీ వితరణశౌర్యప్రవిష్టునకేకాక మీసము పిసినారి కోసకేల. వేమ. శ. ౭౪.

పిసిని =పిసిడి. విణ. (త. పిసినీ.) లోభి, లుబ్ధుఁడు.

క. అపిసినినక్క చాపము, కోపంగిట నిఱికి నరముఁ గొఱికిన రభసం, బేపార ఖిడిసి మర్మనిరూపణ మొనరింప నక్క కోఁజాచుఁ గూలెన్.

పేం. పంచ. ౨. ౧౦౯.

జ: పిసిచారి, పిసినిగొట్టు, పిసినిపురుగు, పిసిని వాఁడు.

పిసిని². వి. ఒకజాతి పండ్లచెట్టు. (గ్రా).“పిసినిగ” వాడుక.

పిసినిగొట్టు. విణ. (పిసిని + గొట్టు. స్వార్థమున.) లోభి, లుబ్ధుఁడు.

(వ్యవ.) వాఁడు వట్టి పిసినిగొట్టు.

పిసినిపురుగు=పసిఁడిపురుగు. వి. ($\sqrt{}$పిసిని[1]) పట్టుపురుగు, పొత్తిమాలి గూఁటిలోనిపురుగు. (గ్రా.)

పిసినివాఁడు. విణ. ($\sqrt{}$పిసిని$_1$) లోభి, లుబ్ధుఁడు.

ఆ. పిసినివానియింటఁ బీనుఁగు వెడలిన, కట్టె కోలలకును గాను లిచ్చి, వెచ్చ మారొ నంచు వెక్కి వెక్కి యేడ్చురా. వేమన ౧. ౩౭.

పిసుకు. క్రి. (క. పిసుకు.) ౧. పిండిలోనగు వానిని చేతితో మర్దించు, మెదించు; గట్టిగా నలుపు.

సీ. దిక్కులు వాలుగు నొక్కచోటికిఁ దెచ్చి పిసికి పిండలి చేసి పిడుచగొనఁగ.

భార. విరా. ౨. ౧౩౪

గీ. గగనలక్ష్మి నిజోరునక్షత్రమాలి, కలు వియన్నది జలములఁగడుగఁబిసుక, పెరయు కంకుడుపండులనరువనంగ .

ఆము. ౪. ౧౫౪.

చ...మంచునం, బిసికినపంచదార లన...

వైజ. ౬. ౧౭౯

వ...శాపరీదధి మందమూపరంబులుగాఁ బిసికి యూరం బెట్టిన...కలమాన్నంపుఁజల్ది

ఆము. ౪. ౩౫.

౨. (భయాదులచే చేతులు) నలుపు. ఈయర్థమున అర్మెసేపదరూపమే ప్రయోగము లందు కానఁబడుచున్నది.

సీ. భాగ్యదేవతలార యీశారి గదవఁ, బెట్టికి యుంచుఁ జేతులు పిసికికొనుచుఁ, గన్నుదీర్చి నించుచు వార్తకంటి రైన, యూర్మిపల్లఘుఁ గనుఁగొని యల్ల నగుచు.

హరి. ఉ. ౪. ౧౯౧.

మ అకటా యూరొయిద నీకు వండి యిడఁ బుత్త్రీలు లేరైరి యేఁ, టికి నాయింటికిఁ దెచ్చి తన్నియఁ గొనంటిక దోషి నే నంచు నిం,చుక కంకించక హస్తముల్ పిసికి కొంచుఁ ... శుక. ౩. ౧౯౨

గీ. వెగడి యేడ్చుచుఁ జేతులు బిసికికొనుచు.

సారంగ. ౩. ౪౦.

౩ (పాదములు వెం. చేతులతో) ఒత్తు, పట్టు.

క. ఒడ లంటఁ గాళ్లు పిసుకం, గడవెఁడు వేన్నీళ్ల నీయఁ గంచము పెట్టఁగ.

శుక. ౩. ౩౪౪.

౪. (చేతులతో) అదుము, నొక్కు.

ద్వి కదలక మెదలక కాలితో మాఁది, కదియంగ వెసఁ బట్టి కుత్తుకఁ బిసికి.

ద్వి. హరిశ్చ. ఉ. ౨౨౯

౫ గట్టిగా కలుపు

ద్వి వన గూర్చు కృతులు నావద్దును బెరుఁగుఁ, బిసుకుచందపు బిలిబిలికృతుల్ కృతుల.

పండితా. దీక్షా. ఒ. పా.

పిహితము. సం. విణ. (అ. ఆ. అ) ౧. కప్పఁబడినది, ఆచ్ఛాదితము. వి. అ. న. ౧. ఒక అర్థాలంకారము

శ్లో. పిహితం పరవృత్తాంతజ్ఞాతుః సాకూత చేష్టితం,ప్రియే గృహాగతే ప్రాతః కాన్తా తల్ప మకల్పయత్.

# పీ

పీ.=పీయి, పియ్యి. వి (క. పీ. త. పీ) పురీషము, మలము. చూ. పీగ్రద్ద.

పీఁగాఁడి=పింగాఁడి. వి. లోహపాత్రవిశేషము.

క. ఘుర్ఘురికలును బింగాండ్లు తాంబాళం
గిన్నెలు పింగాణిగిన్నెలు కొప్పెరలు ..
హంస. ౫. ౩౪౩.

పీఁక. వి. ఆటవికులు ధరించు శిరోభూషణ విశేషము, పక్షియీఁకలతోఁ జేసిన ఒకవిధమైన తురాయి

మ. పులితోల్కాసెలనంటఁదోఁపిన పిడెంబుల్
పిలిపూఁదావ కంఠంబులు బల్ సింగపుఁజూంచు
దండ కడియంబుల్ చెంపలం జెక్కు పీఁకలు
కెం జేగురుబొట్లు జుంజురుసిగల్ శారింపు
మైపూఁతలున్... శారంగ. ౧. ౬౩.

సీ. చారుసుధాధామశకలావతంసంబు పెదకొ
ప్పుపైనుండు పీఁకగాఁగ. హర. ౩. ౪౧.

సీ. జడకొప్పు కెవిపింఛపుఁ ద్రాటి చుట్టగా విర
వాహితరేఖ పీఁకగాఁగ. కాళ. ౪ ౧౩౭.

సీ. పాలకంపు బొందారు తలపీఁక బొమిడికతోలు
చల్లడముపై నిలిడట్టి.
సానందో. ౫. ౭౩. పా.

పీఁకవని(న్ని)యలు. వి బ. పైపై వన్నెలు, పైపై మెఱుఁగులు.

సీ. పిలుపిచ్చు విద్యలు పీఁకవన్నియలును బెళు
చదనంబులు ప్రేలడములు

గీ. దుర్గుణంబుల ప్రోవులు ద్రోహమతులు, వార
కాంతలఁ దడవిన వచ్చుఁ గీడు.
పాండు. ౩. ౪౩.

గీ. ద్రవిడ పరిచారకులు వోలెఁ దరుణికొక్కు, లద
పములు పూనిరాఁగొండ ఉబ్బెలంది, వెన్నెల
లవారణపుఁ బీఁక వన్నెలలరఁ, గంతు గురు
పల్లకీసేవగాంతు రందు. హైజ. ౨. ౪౪.

పీఁకు. స. క్రి. (క. కీళు) ౧. పెఱుకు, పైకిలాగు.

ఆ. తక్క రేఁ మెఱుంగు గురులింగజంగంబు,
చిక్క రొండిసిపట్టి పీఁకుఁగాక.
కేయన. ౨. ౩౩.

వ్యవ. వాఁడు చేనిలోని గడ్డియంతయుఁ బీఁకి వేసినాఁడు.

౨. పీడించు, బాధించు.

వ్యవ. తన కైన బదులిమ్మని వాళ్ళు దినముల నుండి వాఁడు నన్ను పీఁకుకొని తిను చున్నాఁడు (ఇట ప్వార్థమున, 'కొను')

వి. పెనఁగుట. (చూ. పీఁకులాడు, పీఁకులాట)

జ. పిరుపీఁకు, పిరుపీఁకులాడు, పిరుపీఁకులుపెట్టు, పీఁకులాట, పీఁకులాడు, పీఁకుపీకాడు.

పీఁకులాట. వి. (√ పీఁకులాడు) పీఁకులాడుట, పెనఁగులాడుట; చిక్కు, బాధ.

వ్యవ. వానితో నాకెంతో పీఁకులాటగా నున్నది, ఈ వ్యవహారములో పీఁకులాట పెట్టకుము.

పీఁకులాటబేరము = తెగకుండ చిక్కులు పెట్టు బేరము.

పీఁకులాడు. అ. క్రి. (పీఁకులు+ఆడు) పెనఁగులాడు.

గీ. తునిసిన వరాంగకములఁ బొత్తులను గమిచి,
పాశ రొండొంటితోఁ బోరి పీఁకులాడు,
శ్వాపదంబులు...
ఆము. ౬. ౧౪ (వేదం. పా)

పీఁకుపీఁకాడు. స. క్రి. (పీఁకు+పీఁకు+ఆడు. క. ర.)

సీ....పితవికారమై పిరయాధ, చాల శరీర
సంచయముండఁగా దీనిఁ గంకశివాగృధ్ర
కాకకులము, లాదిగాఁ గలుగు క్రవ్యాద
ములు పీఁకుపీఁకాడుట పెంగిలియదొవ్వ
నకట. భార. స్త్రీ. ౨. ౧౪.

౨. మిక్కిలి వికలముచేయు, పెఱుచు.

శా. ..లొంటియు, కృష్ణవర్త్మంబును దక్కి
వ్రుక్కి పగ బుద్ధిం బీఁకు పీఁకొదఁగాఁ
జేష్టాహీనతఁ బొంది యగ్గురుఁడు సంక్షి
ప్తాంగుఁడై యున్నెడన్.

భార. ద్రో. ౫. ౩౨౦.

పీఁకె. వి ౧ కంఠనాళము.

వ్యవ దొంగలు ఆశిశువు పీఁకె పిసికి చంపినారు.

౨. కంఠధ్వని; కూఁక, అఱపు

శా. ఈలల్ పీఁకెలు దిక్కులం జెలఁగఁగా మెచ్చో
మృగశ్రేణిపై, గాలింబోవక సన్నదప్పు
టయు... కాశి ౩ ౫౮

ఆ. పీఁకెపెట్టి యీలవెట్టుచు బడిబడిఁ, బాలు
కెంచి చుట్టు వాలుకొనిరి, దివ్యరత్ననికర దీ
దీప్యమానమై, యతిశయిల్లు రాజసుతుని
యిల్లు పారంగ ౩ ౨౮. ("కూఁకపెట్టియీల
గొట్టుచు" ప్రాఁతప్రతిపా)

౩. సన్నాయి మున్నగు ఊదెడువాద్యముల
ముఖమునఁబొప్పించెడి తాటాకుతోఁ జేయఁ
బడిన ద్విదళరూపమైన సాధనవిశేషము

(నాగసరములోనగు వాద్యముఖమునఁ బొప్పిం
చెడు క్రోవిపుల్ల అని శ ర)

౪. ఊఁదుట కుపయోగించు ఆకుచుట్ట, బూర.

సీ. నిడుపున వాకులుమడిచి పీఁకెలుచుట్టి
యూఁదుచు నటియింతురొక్కచోట

వి. పు. ౮ ౧౫౧

౫. కాల్పఁగా మిగిలిన పొగచుట్ట.

(వ్యవ.) వాఁడు వీధిలోఁ బాఱవేసిన చుట్టపీఁకె
తీసికొని పోవుచున్నాఁడు.

క. పీఁకెపొగ యమృతపారము, చేకొని పొగ
చుట్టమహిమఁ జెప్పం దరమా, వాకొనఁగ
రాదు గుడిగుడి, యాకునఁ బొగద్రాగు
వాఁడె దొరఁడో మాతుఁడో. (చాటువు.)

చూ: పీఁకెపాలు.

పీఁకెపా(వా)లు. అ క్రి. (పీఁకె+పాలు)

౧. పీఁకెవశగుల్లయగు.

౨ కృశించు, చిక్కు.

గీ. కలమగర్భంబులామపాకోత్పలదళాక్షి, చిక్కి
లకు నోడి తద్దయుఁ బీఁకెపాలి, కన్ను చూపి
తృణం బూని యున్నరాని,వానఁ దల వంచు
చుండె ససారతంబు రసిక. ౨ ౧౦౧

సీ. బలురాజనంపుఁబొట్టులు పీఁకెవాలెఁ బో
ముద్దియపిక్కల కుద్ది గాక

అచ్చ. రా. అర ౨౨

(౧ ౨. అర్థముల కివి యుదాహరణములు)

౩ చప్పటయగు, (శ. ర ప్రా.)

పీఁచేమడఁగు. అ క్రి (పీఁచేము+అడఁగు)

ఉక్కడఁగు, నశించు

ఆ. ఇతఁడు పరమహంసుఁ డే నిక్కముగను
గాకున్న సుగ్రగతిని నుండు పెట్టు, లిమ్మ
హాత్ము తేజ మెనసినఁ గువలయం, బెల్లఁ
బీఁచమడఁగదే తలంప చిత్ర భా. ౨ ౫౩

గీ. ఎచట దైత్యులు మెలఁగెద రచటఁ గదిసి,
పీఁచమడగింతు

భార అర ౧ ౫౧

పీఁచేమడ(ణ)ఁచే. స క్రి (పీఁచేము+అడఁచు)

ఉక్కడఁచు, చంపు, వధించు

సీ. చక్కడై సురమాడెఁ జాఁగి అలాడెను
బిలుకుమూర్ఛను ద్రుంచెఁ బీఁచేమడఁచె...

గీ. అడఁచెఁ జెండె ననంగఁ బొందగు వధించె,
ననుటకు సమాఖ్య లై...

ఆం. భా. ౩. ౧౨౩.

క. అకట తమమహిమ తా రెఱుఁ, గ కరయా
మతి యేలా తెగరుగాక మరుత్కం,టకు
బీఁచేమడంపఁ బె వ, న్నౌకనిగ పంపినన
దమనిరోగము బలిమిన్. ప్రభా. ౨. ౫౨

సీ. తగరుశైఖరిఁ దూటి తెగువ నీటరగాలి
పీటపెట్టినపందిఁ బీచేమడఁచు.
పారంగ ౧. ౯౨.

చ. .అచ్చటికూరుల వానితోడుతకా, నలివడఁ
కెండి పీఁచేములణంచి నను గ్రమదాత్మఁ
జేయవే. వీర ౪. ౪౭.

పిఁచేము=పింఛేము. వి (సం పింజమ్) ౧ శక్తి
బలము

సీ లావు సత్తి సత్తువ బల్మి పీఁచే మోవిక
యన వెలయు శక్తి అం భా ౨ ౨౨౧

౨. గర్వము, మదము.

ఉ తమ్ములదిక్కుఁ గన్గొనుచు దైత్యులపీఁచ
మడంగిదయ్యెడుం, గ్రమ్మఱఁ దోఁచె పీఁ
డోళఁడు .. నిర్వ ౯. ౯౨.

క నిఖఁ దొలంత సస్సైన్యముగా, వనిలోఁ
దగటార్చి పిదప యాదవుల జనార్దన
పూర్వాజపూర్వకముగఁ, దనుముడు నీపీఁచే
మడఁగ దుర్దమశక్తిన్
హరి. ఉ ౨ ౨౨

ద్వి. పెక్కండ్రు దైత్యులపీఁచేంబు లడఁచి,
పెక్కుచందంబులఁ జేర్చనా జానిఁ, దప్పక
విక్రమధనుఁడు కోపించి, విప్రైనవానర
విభునివక్షంబు, శూలంబు గొని పొడుచుట
యును. రం రా యు. 3౫౪
పా. ౨౭ పం

జ: పీఁచేమడఁగు, పీఁచేమడఁచు.

పిఁచేర. వి. శతావరి, పిల్లపీఁచేర. ?

సీ...పిల్లపీఁచేర యనఁ బీఁచేర యనఁ, గి బ్రబ
లును శతావరి అం. భా. ౨. ౫౫.
హంస. ౪. ౧౦.

పెఁచే. వి. (క. పీచు) ౧. పెనఁచుకొని కొన్ని
పదార్థముల లోపలనుండునార.

(ఉదా! కొంకాయపీఁచు, బీఱకాయపీఁచు)

గీ ఏఁచమాటలు జరగొన్న పీఁచుఁగురులు,
గలుగుపెఱుకులు దగఁ బొదగనఁగ వచ్చి.
యయా. ౧. 30.

౨. మీఁదిచర్మము, పైపొర

ఉ వాలుకబంతి గ్రేలఁబడి నంజానఁ దోఁగి
తమాలపల్లవ్రశ్రీల హసింప నుబ్బి కనఁ
గ్రేవల కేవులు పుక్కిలింపఁగా,వాలిక మెనిపీఁ
చెగయ వాడినమాల్యమువోలె వాదిమ,
వ్యాళము దీనిపగ్గ మయినట్టియవస్థఁ దలంతు
చెప్పదుకా మనుచ. ౫ ౫౦.

(వ్యవ) వారందఱు ఆదొంగను పీఁచు కేఁగఁ
గొట్టివారు

పీఁట. వి (సం. పీఠః) కట్టి మున్నగువానితోఁ
గూర్చుండుట కుపయోగపడునట్లు చేయఁబడిన
పలక. (చూ. పీఁటమీఁదపెండ్లి)
—పీఁట(అ)మీఁద(టి) పెండ్లి=సిద్ధమైన పెండ్లి

గీ జారయను పేరు విన్నంత జాఱుటయును,
బీఁటమీఁదటి పెండ్లిండ్లు పెక్కు లెడసె.
శుక ౨. ౧౫3.

జ: పీఁటవెట్టు

పీఁటవెట్టు. స క్రి (పీట+పెట్టు) నిలువరించు,
నిలుపు, ఆఁపు

వ ..ఒక్కపురాణ వృత్తాంతంబు కల దంచు
మాటలఁ బీఁటపెట్టి యాపెట్టిపట్టితోఁ జల
పట్టి పచ్చచట్టుపలపిట్టదిట్ట యి ట్టనియె...
శుక. ౨. ౨3౭.

అ. క్రి. లేవక యొకచోటనే పాదుకొని
యుండు, స్థిరముగానుండు

గీ. ఈఁకెటపోటులఁ బడి ప్రేవు లీఁదులాడఁ,
బోయి పోలేక దగ దొట్టి పాదలు సాచ్చి,
తెండువడియును బోరనీదు పీఁటపెట్టి,
చూపులవె యొప్పఁ బ్రజ కొక్కుతూకరంబు.
మనుచ. ౪. ౪౨.

పీతపర్ణి. సం. వి. ఈ. స్త్రీ. వ్యాఘ్రఘ్ని, తేలుమణి. ‡.

పీతపాద. సం. వి. ఈ. స్త్రీ. శారిక, గోరువంక.

పీతపుష్పము. సం. వి అ. పుం ౧. కాసమర్దము, కసివెంద. ‡. ౨. కూశ్మాండము, గుమ్మడు. ‡ (శ. ని)

పీతప్రసవము. సం. వి అ పుం పచ్చగన్నేరు. ‡.

పీతఫల(క)ము. సం వి అ పుం ౧. శాఖోట వృక్షము ౨. కర్మారము, వెదురు. ‡

పీతభద్రము. సం వి అ పుం కర్ణికారము, కొండగోఁగు. ‡.

పీతభృంగరాజము. సం. వి అ. పుం పచ్చ పుష్పాలగలిగేరు. ‡.

పీతమణి. సం వి ఇ పుం. పుష్యరాగము

పీతము. సం విశ (అ. ఆ. అ) ౧ త్రాగఁబడినది ౨. పసుపువర్ణముగలది

—వి అ పుం. ౧ పసుపువన్నె. ౨. పుష్యరాగమణి. ౩ కుసుంభము, కుసుమపూవు. ౪. గంధకము. (వై. ని), ౫ అంకోలము ఊడుగు ‡. ౬. శాఖోటము. ‡ ౭. ఎండ్రకాయ.

—న—౧ బంగారు. ౨. హరిదళము ౩. పానము, త్రాగుడు.

పీతముండము. సం. వి. అ. పుం. బంగారుపచ్చుక, పచ్చతలపిచ్చుక. (వై ని)

పీతముద్గము. సం. వి అ పుం. పచ్చపెసర. ‡.

పీతమూలకము. సం. వి. అ. న. ముల్లంగి. ‡.

పీతయూథి. సం. వి. ఈ. స్త్రీ. పచ్చమొల్ల,స్వర్ణయూథి. ‡.

పీతరక్తము. సం. విశ. (అ. ఆ. అ.) పసుపుగలసిన యెఱుపువన్నెగలది.

—వి. అ. న. పుష్యరాగము.

పీతరాగము. సం విశ. (అ. ఆ. అ) పీతవర్ణము గలది.

—వి అ పుం. పీతవర్ణము —న—౧ కింజల్కము, అకరువు. ౨ సిక్థకము, మైనము.

పీతరోహిణి సం వి. ఈ. స్త్రీ. కాశ్మరి, గుమ్మడు. ‡

పీతలకము. సం వి అ న పిత్తళము, ఇత్తడి.

పీతలము. సం విశ (అ. ఆ అ.) పీతవర్ణముగలది.

—వి అ పుం. పీతవర్ణము.—న—ఇత్తడి.

పీతలోహము. సం వి అ. న ఇత్తడి. (వై. ని.)

పీతవాలుక. సం వి ఆ స్త్రీ పసుపు ‡.

పీతవాసస్సు. సం వి స పుం పచ్చవలువదాల్పు, శ్రీకృష్ణుఁడు. (హాలా ని.)

పీతబీజ. సం. వి ఆ స్త్రీ. మెంథిక, మెంతిచెట్టు

పీతవృక్షము. సం. వి అ. పుం. శ్యోనాకభేదము. ‡,

పీతసారకము. సం. వి. అ పుం ౧. సర్జకము. వేగిస. ‡. ౨ అంకోలము, ఊడుగు ‡. ౩. నింబము, వేము. ‡.

పీతసారము. సం. వి. అ. పుం. ౧. గోమేదకమణి. ౨. బర్బూరము, తుమ్మ. ‡. ౩. అంకోలము, ఊడుగు. ‡. ౪. తురుష్కమను గంధద్రవ్యము.

—న—౧. మలయపర్వతపుపచ్చ చందనకాష్ఠము. ౨. హరిచందనము. ‡.

పీతసారి. సం. వి. ఇ. న. స్రోతోంజనము.

పీతసాల(క)ము. సం. వి. అ. పుం. వేగిస.

పీతస్కంధము. సం. వి. అ. పుం. ౧. పంది. ౨. పీతవర్ణముగల బోదెతోఁగూడిన వృక్షవిశేషము.

పీతస్ఫటికము. సం. వి. అ. పుం. పుష్యరాగమణి.

పీతహరితము. సం. వి. అ. పుం. పసుపుగలపిసవ యాకుపచ్చ.

పీతాంగము. సం వి అ పుం శ్యోనాకభేదము. శ.

పీతాంబరుఁడు. సం విశ (అ అ అ) పచ్చ బట్టలుగలవాడు

—వి. అ. పుం. ౧ విష్ణువు, పచ్చవలువవాఁడు. ౨. శైలూషుఁడు, నటుఁడు.

పీతాశ్మము. సం వి న్ పుం పుష్యరాగము.

పీతి. సం వి ఇ పుం పీతి,గుఱ్ఱము.—స్త్రీ. ౧. పానము,త్రాగుట ౨ గతి,పోక. 3 కల్లు దుకాణము ౪ ఏనుఁగుతొండము,కుండ

పీతిక. సం వి ఆ. స్త్రీ ౧ ద్రానిపసుపు. ౨. స్వర్ణయూథి శ ఒకజాతిపచ్చ అడవిమొల్ల.

పీతిగోరువంక. వి (పీయి+గోరువంక) విట్చాతిక, ఒకజాతి గోరువంక పిట్ట. (శ. ర.)

పీతిరిగద్ద=పీగ్రద్ద. వి (పీయి + గద్ద) ఆతాయి, చీపరపిట్ట (శ ర)

పీతిరిగుంట. వి. (పీయి+గుంట) మురికిగుంట. (శ ర.)

పీతిరిడొంక. వి (పీయి + డొంక) మలమువరి దుర్వాసనగొట్టు డొంక.

ఉ. పోడుల బ్రోవులార కడుఁ బూచిన పీతిరి డొంకలార బల్, కాడిదచెట్టులార.
చంద్ర. వి. ౨. ౧౦౦.

(పీతిరికుప్పలార. ప్రాంతప్రతి పా.)

పీతువు. సం. వి. ఉ. పుం. ౧. సూర్యుఁడు. ౨. అగ్ని. 3. యూథపతి, ఏనుఁగుల గమి కాఁడు. ౪. పక్షి. (వై. ని.) ౫. ఉగ్గగిన్నె. ౬. కన్ను. (కే. ని.)

పీత్వాస్థిరకుఁడు. సం విశ. (అ. ఆ. అ) త్రాగిన పిదప కదలక మెదలకుండువాఁడు.

పీథము. సం. వి అ. పుం. ౧. అగ్ని, ౨. కాలము. 3. రక్షణము. ౪ పానము—న.౧. జలము. ౨. కేయి 3 పాలు (వై ని)

పీథి. సం వి ఇ పుం. గుఱ్ఱము

పీథుఁడు. సం వి అ పుం సూర్యుఁడు.

పీనక్రోష్ఠి. సం. వి ఈ స్త్రీ. పెసలు మొదలగు వానిపొట్టు, ఊక. (వై. ని)

పీనము. సం విశ. (అ. ఆ అ) ౧. స్థూలము, బలిసినది, బలుపుగలది. ౨ పెరిఁగినది, వృద్ధము. 3. నిండయినది, సంపన్నము. ౪. మిక్కుటమైనది, అధికము

—వి. అ పుం స్వేదము, చెమట (శ ర)

—న ౧ స్థూలత్వము, ౨. సంతోషము (శ.ర)

పీనస. సం వి ఆ స్త్రీ కర్కటి, దోస శ

పీనసము. సం. వి అ పుం రోగవిశేషము, పడిసెము

పీనస్కంధము. సం. వి. అ పుం. అడవిపంది. (వై ని)

పీనాహము. సం. వి. అ. పుం. ఇటికలోనగువాని చేత కట్టఁబడిన నూతిపాతికట్టు, కాగాఁడి.

పీనుఁగు(న్గు). వి. (క. పేణ, త. పిణం) శవము, మృతకళేబరము, ప్రాణముపోయిన బొంది.

క. నానాస్త్రంబులు మొందలు, తేని గుడాక్
బదలుపడిన వీరభటాలపై, సేనుంగుల గుత్తం
బుల, పీనుంగులమీఁదఁ దేరు పెలుచం బఱ
పెన్. భార ద్రో ౪ ౬౫

క పీనుఁగు నంటరు మాదృశు, లై నెగడెడు
పెద్దవాండ్రందును జూడం,గాను మహా
మహోన్నత, యీనీయెడు పూజనంబు
సేయము నాకున్ హరి ఉ ౫ ౨౪౦

క తనయొకలం గలసెత్తును, ధనహీనుని విడిచి
పోవు దారాదులువ్వా, జ్జనములు విడుచుట
యరుదే, మనుపీనుఁగు నిర్ధనుండు మదిఁ
బరికింపన్ విక్ర ౨ ౧౩౨.

—నడపీనుఁగు = (నడచునట్టిశవము), జీవచ్ఛ
వము, నిస్సారుఁడు

క గడెన గలమగనిఁ జూచి, నడుపులకును
మడుఁగు లిడుదు గతివలు లేరులో, గడ
నుడుగుమగనిఁ జూచిన, నడపీనుఁగు వచ్చె
నను నగుదురు సుమతీ సు శ ౪౩

—పీనుఁగుపెంట = శవముల ప్రోవు

క. పీనుఁగుపెత్తుట గదయుం, దానుఁ దడిసి
విలయకాలదండధరునిచం, బానం బావని
మాగధ, సేనం బీనుంగుపెంటఁ జేసి చెలం
గన్ భార భీష్మ ౨ ౨౧౪.

ఉ. పీనుఁగుపెంటలై యొకటి పేరును పొందును
లేకయుండున, బ్లీనుఁగులున్ హయంబులు
సమృద్ధ జనావళియుం బకంగ
హరి పూ ౫ ౪౭.

జః పీనుఁగుదిండి

పీనుఁగుదిండి. వి (పీనుఁగు + తిండి) పిశాచము
(శ. ర.)

పీనోధ్ని. సం వి ఈ స్త్రీ బలుపయిన (పెద్ద)
పొదుఁగుగలయావు

పీవరి. సం. వి. ఇ. పుం. హ్రస్వప్లక్షము, పొట్టి
జువ్వి చెట్టు

పీయి=పీ, పియ్యి. వి. దే (క. త పీ.) పురీ
షము, మలము

(వృత్తియందుఁ గొన్నిపట్లవర్ణాధిక్యము—చూ.
పీతిరిగద్ద, పీతిరిగుంట)

చ ఉదరమునం ధరించి ప్రసవోద్భవవేదనఁ
బొంది పిమ్మటన్, ముదిముది రైనపీతఁ బడి
మూత్రిమునం బడిలజ్జ వందుగా, నదనద
గ్రైన తల్లికిఁ బ్రియంబొ సుతుండు వృథాభి
మానదుర్మదుఁ దగుతండ్రికిం బ్రియుఁడో
మానసవీథిఁ దలంచి చూడుమా
హర. ౨ ౫౭

జ. పీతిగోరువంక, పీతిరిగద్ద, పీతిరిగుంట, పీతిరి
డొంక

పీయువు సం వి ఉ పుం ౧. కాకి
౨ సూర్యుఁడు ౩. అగ్ని ౪ గుడ్లగూబ
౫ కాలము. ౬ బంగారు (విల్యమ్సు)
౭ కిరణము. (శే ని)

పీయూషమహస్సు. సం వి స్ పుం ౧ చం
ద్రుఁడు ౨ కర్పూరము (వాచ)

పీయూషము. సం. వి. అ. న. ౧. అమృతము.
౨. ఈనిన యేడునాళ్లలోని యావుపాలు.

పీయూషవర్షుఁడు సం వి అ పుం. చంద్రుఁడు.

పీయూషవర్షము. సం వి అ పుం. ౧ అమృ
తపువాన ౨. కర్పూరము.

పీరంగి=పిరంగి. వి. యుద్ధమునందు మందుగుండ్లు
వేసి పేల్చెడు పెద్ద లోహపుఁగ్రోవి, యుద్ధ
సాధనవిశేషము.

గీ...సంగ్రగ్రోవి పీరంగి బాణము గుంటుగ్రోవి,
జబురుజంగి తుపాకి జజా యనంగ, వెలయు
నగ్నిప్రసారకాఖ్యలు మహేశ
ఆం. భా. ౨. ౨౧౭.

పీరి. వి. తృణవిశేషము, ఒకజాతిగడ్డి

చ. పొను కెద పీరి తోఁణఁగియు పాత్తరము... ప్రబంధ ౨౦౦

పీరు[1]. వి. శృంగధార, గుమ్మ (శ. ర)

పీరు[2]. వి తురకలు మొహరము పండుగలోఁ బూజించు విగ్రహము (గ్రా)-శ ర పీర్ల అని. బ.గా గ్రహించెను)

జ: పీరుజాదా

పీరు[3]=పీలు. అ క్రి పిగులు, చిట్లు. (శ ర, గ్రా)

పిరుచే(ర్చు)=పీలుచే. (శ ర)

పీరుజాదా. విణ (పీరు[2]+జాదా—హిం జా దా=కొడుకు) పీర్లను బూజించువాఁడు

సీ. పూతాత్ము లగువనుస్థాతలు నీ కేల తఱుచుగా పీరుజాదాలె కలరు సిం వా౨ ౪. ౪౧

పేల. విణ (క పేల) బక్క, కృశము

ఉదా॰ పీలచేతులు, పీలపంట, పీలగింజ

(వ్యవ) పెండ్లికూతురికన్న పెండ్లికొడుకు పీలగా నున్నాఁడు

పేలకము. సం విణ (అ వికా. అ) శోధకము, అష్ఠగించునది

—వి అ పుం పిపీలిక, చీమ.

పీలి=పికిలి,పిక్కిలి,సిగిలి. వి ౧ ఒకజాతిపక్షి

ఆ. ఒక్కఁడొయికపోఁడు నక్కకొమ్మును నిల్చి, గోఁటిజంబు దొన్నఁ జాఱపప్పుఁ, బీలిగఱుల యొప్పులు చెలవిడ్డుఁ, గాను కిచ్చి కర యుగంబు మొగిచి. మనుచ. ౪. ౧౪.

౨. (క. త. పీలి) నెమిలి 3. నెమిలిపురి, బర్హము; నెమిలియీఁక. (చూ. పీలిగరగ, పీలిగొట్టము. మొ.)

౪. ఓడనడపుచుక్కాని. (శ. ర, గ్రా.) చూ. పీలికాఁడు.

జ: పీలికాఁడు, పీలికుంచె, పీలిగరగ, పీలిగరగవాఁడు, పీలిజల్లి, పీలిజల్లెడ, పీలిదండ, పీలిగొట్టము, పీలినురఁటి, పీలిక్కుంచె

పీలిక. వి (√పీలు) చినిఁగినబట్టముక్క, శీర్ణవస్త్రఖండము (శ ర, గ్రా)

పీలికాఁడు. వి (పీలి+కాఁడు) ఓడచుక్కాని త్రిప్పువాఁడు, మాలిమికాఁడు

చ కవి కవితాబ్ధిలోన ముఖగహ్వర మోదయు జిహ్వ త్రెడ్డు హృత్పవనుఁడు పీలికాఁడు మృదుభావలు రత్నములు...శివరా. ౧ ఆ. ౭౦ భా ౧ ౧౫౮.

గీ వాకు మినీతిపదమ మంత్రికి నెలవు, మంత్రి లేకున్న రాజ్యంబు మనుజపతికిఁ, జెక్కువది యొంత గలిగినఁ బీలికాఁడు, లేని పోఁడ చక్రంబు లేనిరథము.

పి శకం ౪ ౧౪౯, వరాహ ౫ ౮౭.

పీలికుంచె. వి (√పీలి) పికిలిపిట్ట యీఁకలతోఁ జేసినకుచ్చు

గీ పీలికుంచెతలాటంబు వేరజంబు, మణులపొగ ముట్టువన్ని పాహిణి యొకండు, కర్తయొద్దకి గొనివచ్చె గంధవాహబాంధవం బగు నొకమహా సైంధవంబు మనుచ. ౪. ౨౭.

పీలిగరగి. వి (√పీలి,క.పీలిగరగ) నెమిలి యీఁకలతో నలంకరింపఁబడిన జలకుంభము. చూ. పీలిగరగవాఁడు.

పీలిగరగవాఁడు. విణ (√పీలి) పీలిగరగ మోయువాఁడు

వ ..పీలిగరగవానికి ౫౦ (వృత్తి.) చే. శా. శక. ౧౧౩౫. Ep Ind Vol 5.

**పీలిజల్లి.** (పీలి+జల్లి) నెమలిపింఛముతోఁ జేసిన జల్లి, నెమలిపురితోఁ జేసినకుచ్చులజాలరు.

గీ. కటికరటి కంఠపీఠమైఁ గంటుఁ దగిలి, బిరుదు మావంతుఁ జేసినపీలిజల్లి, పెంపుగను పెన్నె ములగుంపు ప్రిదిలి జార, వచ్చె నొకపతి వసుమతీపతునిఁ జూడ వసు ౬. ౧౧

**పీలిజల్లెడ.** వి (√పీలి) పీలికుంచె

ద్వి విరిసి మైఁ దూఁగు నీపెలఁదులజడలు, పెరయు విరోధుల పీలిజల్లెడలె.

ద్వి మారిశ్చ. పుం ౧౦౮౮.

**పీలిదండ.** వి. (√పీలి) నెమలిపురిదండ, నెమలి యీఁకలమాల.

గీ. ఆదిదేవుఁ డిప్పుడు గొల్లఁడై ముదమునఁ, బీలిదండసెట్టైము మట్టి పిల్లఁగ్రోలు, కేలఁ బట్టి గోవులబడిఁ గేరి సలుపఁ, జూడఁ గంటి నా కిది యేమి సుకృతఫలమొ

హరి పూ ౮ ౮౦

**పీలిసిట్టెము.** వి (√పీలి) నెమలిపింఛముతోఁ జేసిన తలపాగ, బర్హావతంసము

ఉ విచ్చినకన్నుఁదమ్ములకు విందులు పెట్టు పెడందకన్నులున్, బచ్చనిపట్టుఁ జేరురముఁ బ్రాఁకినమచ్చయుఁ బీలిసెట్టెమున్, బచ్చిక చాయయున్ జిటులిపాయము గల్గిపెలుంగు నిచ్చలో, రచ్చ రొయునర్ప నందలిపరాకునఁ దేలుచు నేర్కు నేలుచున్

పాండు. ౪. ౪౯

**పీలిసురఁటి.** వి. (√ పీలి) నెమలిపింఛముతోఁ జేసిన వట్రువ విసనకఱ్ఱ

సీ. అలఁతి దంతంపుఁగామలపీలిసురఁటులు తో ధించి వడిచిన జాంటి లేనె.

పి. శకుం. ౧. ౯౮.

**పీలు**=పిఱులు, పిగులు, పీరు౯. అ. క్రి. వస్త్రము కొందలగునటు బిగువుచే చినుఁగు.

ఆ పిగిలెఁ బీలె ననఁగఁ బెంపొందుచుండును, జినిఁగె ననుట గ్రామ్య పితసమాఖ్య.

ఆం భా. ౩. ౯౧.

జ: పీలిక.

**పీలుకము.** సం. వి అ న ౧. చీమ, క్రిమి భేదము.

—పుం పక్షిపిల్ల. (శ ర.)

**పీలుచే (ల్చు)** స క్రి (క త. పీర్, హీర్.) ౧ జుఱ్ఱు, చప్పుడు కలుగునట్లుగా త్రాగు, పానముచేయు, (దీనికి పీలుపక్, పీలుపమి, పీలువక, పీలుపకుము, మొ॥ రూపములుసిద్ధించును.

సీ అరవింద మందిర యామోదముగఁ బీల్చు కొందటీర క్రీడమించు ముద్దుకోడి

దశా. ౩. ౧౪౫.

గీ. ధరణిపాథానకేందుమధారసంబు, సౌధ జాలమ్ములాలికాజాలకముల, సుశ్వలాక్షి కటాక్షనీలోత్పలములు, ప్రేమమునఁ దప్పి పోవంగఁ బీల్చికొనిరి వైష. ౪. ౨౭

సీ కడఁకమై తే నాని కనపుబొందములట్ల చెట్టి దంబుగఁ దల ద్రిప్పిల్చికొనుచు

అచ్చ. రా యు. ౨౪౫.

(తలలు=తలలోని రసము) అనిభావము.

౨ ముక్కుతో లోనికి ఎగలాగికొను.

సీ. మును నసల్ దమిఁ బట్టి ముంగాళ్ల ముక్కు జోడనలఁ బీలిచి పసర్కొనిన విడిచి.

ఆము. ౫ ౧౧౪.

(వ్యవ.) చెడుగాలి పీల్చుటచే ఆరోగ్యము చెడును

ఏనుఁగు తొండముతో నీళ్లు పీల్చుకొనిత్రాగును.

౩. మ్రింగు, కబళించు.

మ. ఇలకుం గల్గినజీవనంబుల నిజానిష్టోగ్ర మార్తండమండల మానం దనవైరవైరి నఖుఁ డాటం ద్రవింబీల్చి యవ్యయాల కొక్కు

పున్మడిఁ గ్రుమ్మరింపఁ దగుఁ దా నెం తైన
నం తైనమం్తలముల రాహు బాసంగఁ
దాల్చుగతి మింటం బర్వె నీలాభ్రమాల్.
ఆము. ౪. ౮౭.

౪. ఇంకఁజేయు; హరింపఁజేయు.

వ... తప్తాయఃపిండం బాక తోయకణంబుం బీల్చి
నకైవడి బడబాగ్ని విజృంభించి యమ్మహాం
భోరాశిఁ బానంబుసేయు ..
సీతారా. ౨. ౧౫౮

తే. అతని రావించి నావిచారానువృత్తిఁ, జెప్ప
దనా దీనిజేటివిచార మింకఁ, గమిచి
నామేనిర క్తమాంసములఁ బీల్చ,సాఁగె నతి
గాఢతరబరజ్వరరాగ్ని శుక. ౨ ౨౫౧.

పీలుని. సం. వి. ఈ. స్త్రీ. చాఁగ, మూర్వ. కీ.

పీలుపర్ణి. సం వి. ఈ. స్త్రీ ౧ మూర్వ,
చాఁగ. కీ. ౨ బింబిక, దొండ. కీ.

పీలుపత్త్రము. సం. వి అ పుం వెఱరట,చాఁగ. కీ.

పీలుపాకవాది. సం. వి న్. పుం వైశేషి
కమతమువాఁడు. ఇతఁడు ఉష్ణము పదార్థము
యొక్క అణువులయందే వర్తించునుగాని పదార్థ
సమష్టియం దుండదనువాఁడు.

పీలుమూలము. సం. వి అ. న. పీలువుయొక్క
వేరు.

వి. ఆ. స్త్రీ. ౧ శతమూలి, చల్లగడ్డ కీ
౨. శాలపర్ణి, మయ్యాకుపొన్న. కీ ౩ అశ్వ
గంధ, పెన్నేరు. కీ. ౪ తఱపియావు.

పీలువు. సం. వి. ఉ. పుం ౧. బాణము ౨. పర
మాణువు ౩. కృమి. ౪ ఏనుఁగు ౫ పువ్వుము
౬. అస్థిఖండము, ఎమ్ముకతునుక. ౭ గుడఫల
వృక్షము, గోఁగు. కీ. ౮. చేయివడిమిభాగము
౯. కట్టులము, కోఁకు, కీ (శే. వి)
౧౦. ఉ. న. గోఁగుపండు.

పీల్కుంచె. వి (పీలు + కుంచె—వృత్తిని వర్ణ
లోపము.) పెనిమిటియొఁకటితోఁ జేసినకుంచె.

మ. పెలవిం డ్లేమఁగుదంతముల్ వికిలిపూచెండ్లున్
బునుం గిత్తిమె,యొలుపుశ గస్తురి కప్పురంబు
పులితో ల్లొడ్డిలు జవ్వాదిబీ,ల్లులు పీల్కుం
చెలు పుట్టచేను సవరాలుఁ జల్లులున్
బందితో,మ్మలు ధాబువ్వను జీకిపప్పు
మయినంబున్ గోరజం బాదిగ
ప్రబంధ. ౧౩౬.

పీవ. సం. వి ఆ స్త్రీ. జలము

పీవము. సం. విశే. (న్. వరీ. న్) ౧ పీనము,
స్థూలము, బలువు గలది. ౨ బలవంతము,
బలిమిగలది

వి. న్. పుం వాయువు.

పీవరము. సం విశే. (అ ఈ అ) ౧ బలిసి
నది, స్థూలము, అవయవముల పెనుపుగలది,
కండపుష్టిగలది ౨ క్రొవ్వినది

వి. అ పుం. తాఁబేలు.

పీవరి. సం వి ఈ స్త్రీ ౧. కుమారి, శేఁబ్రా
యపు స్త్రీ ౨ ఆవు, 3 పిల్లపీఁచేరి కీ.

# పు

పు. అవ. ౧ కొన్నిధాతువులకుఁ బ్రేరణార్థమున
ఆగమముగా వచ్చువర్ణము ఉదా: మాను,
మానుపు, మను, మనుపు.

౨ కొన్నిధాతువులపై భావాద్యర్థములందు
వచ్చుకృత్ప్రత్యయము ఉదా: చూచు,
చూపు; బ్రేఁచు, బ్రేఁపు, విడుచు, విడుపు;
ప్రోచు, ప్రోపు మొ.

3. కర్మధారయంబునందును కొన్నిచోట్ల తత్పు
రుషమునందును "ము" వర్ణకములకు బిం
దువు ముందు కలిగి కాని, లేకగాని ఆదేశ
ముగా వచ్చునది ముగాగమము.

చ అరుణంపు బొండ్ల — ఆము ౧ ౫౪

క మధ్యపుసమయము మానుపార్శ్వపార్శ్వం ఖరయుక్ — భార ఆను ౨ ౫౪

సీ దివాకరులు నాఁ దగుమరాళకపుంగరులు — ఆము ౧ ౫౩

**పుంఖము** సం వి అ పుం న ౧ బాణముక్రింది చివర, పింజ ౨ డేగ

**పుంఖించు** సం అ క్రి పుంఖానుపుంఖముగాఁ దోఁచు, వెంబడిగాఁ దోఁచు

క క్రమ మొందఁ బాణజాలవళి, గమకముగా శుద్ధ సాళగములును సంకీర్ణము లాగిఁ బుంఖింపఁగ మంద్రము మధ్యము తార మత్యుదారత మీరుచు — సమీర ౬ ౨౦౫

**పుంఖితము** సం విణ (అ ఆ అ) పుంఖము గలది, పుంఖానుపుంఖముగాఁ జేయఁబడినది

**పుంఖీభవించు** సం అ క్రి పుంఖానుపుంఖమగు

సీ అఖిలదేశంబుల నమరుశాలెములఁ బుంఖీభవించినచిత్రగేహములును — హంస ౨ ౨౩౧ (అధికమైన అని భా)

సీ యజ్ఞతంత్రములందు హవిరన్నములచేతఁ బుంఖీభవించినపొట్టక్రొవ్వు — నిరం ౪ ౩౮ (అధికమైన అనిభా)

**పుంగము** సం వి అ పుం న సమూహము (వాచ)

**పుంగవకేతువు** సం వి ఉ పుం వృషభధ్వజుఁడు, శివుఁడు

**పుంగవము** సం వి అ పుం ౧ ఎద్దు, వృషభము ౨ ఓషధివిశేషము విణ శ్రేష్ఠము (ఉదా వానరపుంగవము)

**పుంగాహము** సం వి అ పుం నల్లగుజ్జిము (వై వి)

**పుంగుడు** వి ౧ పులివిరికాయ, అల్పగ్రంథి

తే పుంగుడు పులివిరి యనఁ నల్పమైనట్టిగ్రంథిగా నలరుచుండు — ఆం భా ౨ ౧౩౦

౨ తెల్లపొడలకుష్ఠము (శ ర)

**పుంజె** వి మెట్టభూమి, వర్షాధారమునఁ బండెడు నేల (గ్రా) (వ్యతి నంజ)

**పుంజెము** వి (సం పుంజః క పుంజ) అరువది పోగులనూలు (ముప్పదిరెండికలనూలు అని శ ర)

సీ షష్టితంతువులు పుంజ మన వెలయు — ఆం భా ౨ ౨౯౫

సీ పుంజపుచిట్లు దంపుటకుఁ బర్వెత్తుచో — హంస ౨ ౨౨

తే ఎన్నికలు ఎట్టి పుంజంబు లేర్పరించి — శుక ౨ ౪౨౪

సా పిండికోలదిట్టోట్టి, పుంజముకోలదిబట్ట

జ పుంజాలదండ

**పుంజము** సం వి అ పుం రాశి, ప్రోగు

**పుంజాలదండ** వి (పుంజాలు + దండ) స్త్రీలు మెడను ధరించెడి యొకవిధమగు నగ

తే దండ సకిమెడఁ బుంజాలదండ వెట్టు, వనిత చిన్నారిపొన్నారివయనువాని, విప్రనందనుఁ గిన్నంత వెకిలి యగుచు — పాండు ౩ ౬౨

సీ మొలనూళ్లు నొడ్డాణములు సేవకంబుఁ బుంజాలదండయు బన్నసరము మెంగపుఁ, దీఁగయు — కళా ౪ ౬౬ క్రీడా ౯౩

**పుంజి** వి సమృద్ధి, పెంపు

శా చెల్లెం గింతునిపంత మద్ధిపాగ రచ్చం గల్యరాజాలు రం, జిల్లె న్మంచులపుంజితోడ వినమించెఁ భోగినీరాజి రా, జిల్లెన్ — రా వి ౩ ౧౪

తే తాలెమున్న వసంతునిరాజుపిల్లఁ, గన్ను గుట్టెడుఁ గడుపుంజి గనుటవలన — శివల ౩. ౯౬

సీ... ధుంజరీటంబులపుంజిఁదెలుప.

దశా. ౮ ౧౮౫.

—విశే. (ధనాది) సమృద్ధి గలది,సంపన్నము

ఉ: ఆ గ్రామ మిపుడు పుంజిగా నున్నది. (శ.గ.)
ఆ గ్రామమును పుంజిచేసినాఁడు. (గ్రా)

జ. పుంజికొను.

పుంజికా(క)స్థల. సం. వి అ స్త్రీ ఒకానొక యచ్చరి (విల్యమ్సు)

పుంజికొను. అ క్రి (పుంజి+కొను) గుబురుకొను,పుంజీభవించు (జరావర్ణన)వ పుంజికొని వెదలి నిడుదలై యుండుకఱకుఁగిలు నానాకేశంబులును . కవిక ౫ ౧౧౦

పుంజితము. సం. విశే (అ ఆ అ) ౧ పుంజముగాఁ జేయఁబడినది ౨. ఒక్కటిగా అదుమఁబడినది

పుంజీ. వి (సం. పుంజః) నాలుగు, చతుష్కము (శ ర.)

వ్యు: మూఁడుపుంజీలు,నాలుగుపుంజీలు.

పుంజీభవించే. సం అ క్రి రాశిపడు,ప్రోఁగుపడు

సీ. పుంజీభవించినభువనగోళముభంగి సంకులాంగణమైనవంకదార క్రీడా. ౧౧౭

సీ. వింతగాఁ బుంజీభవించి నానాధాన్యముల రాసు లుండెడి నిలయములును.

హంస. ౨. ౨౩౧.

పుంజీలము. సం. వి. అ. పుం. తృణస్తంభము. (వై. ని.)

పుంజో. వి. ౧. పశుపక్షులలోఁ బురుషజాతి

ఉదా: పుంజా, కోడెఁ పుంజా పావురము, కోడి పుంజా, (చూ. పెట్ట)

౨. పుంగోడి, కుక్కుటము.

మ. గురుకంఠస్వరయుక్తిమైఁ దగ పెనఁగ గో యంచు ఘోషించుచుపై,ఖురిఁ బుంజా ల్మాఱు పెన్ ద్రిలింగగతి పెక్కుల్ పౌర కల్లార్చుచున్. చంద్రా. ౫. ౧౧౫.

సీ పె రపాల్య యటంచు రోశనాఁడు వేలుపు టొడయఁ డెమ్మె, నతఁ గోరి పుంజా రూపునఁజేరి నడురేయితతి నింటిదరిఁ బొంచి యఱచుటయును అచ్చ. రా బాల ౧౮౭.

ఆం. భా ౨ ౯౨.

జ ' పుంజోదాలుపు

పుంజోదాలుపు. వి (పుంజా+తాలుపు)కుక్కుటధ్వజుఁడు, కుమారస్వామి (చూ భీమ ౨ ౩౯. పాం ని దేవ ౪)

సీ పుంజాదాలుపు వేలుపులకోని దళవాయి జంటముమ్మోములదంటవేల్పు.

ఆం సం దేవ. ౧౩.

పుంట=పూఁట,పురఁట. వి సంధ్య.

సీ సంధ్య యొప్పుచునుండు సంజనఁ బూఁటనఁ బుంట యంచనఁగఁ బురంటయనఁగ

ఆం భా ౧ ౯౪.

పుండరి. సం వి న్ పుం కాలపత్త్రవృక్షము యొక్క ఆకులవంటియాకులుగల యొక వృక్షము.

పుండరీకప్లవము. సం వి అ పుం గుంపుగా తిరిగెడు నొక పక్షివిశేషము

పుండరీకము. సం. వి అ న ౧ తెల్లదామరపూవు, ౨. తెల్లగొడుగు. (అ.ని) ౩. భేషజము, మందు, ౪ తీర్థవిశేషము ౫. మదవతిమను గంధద్రవ్య విశేషము. ౬. ౭. ఒకజాతి విషము. (వై ని) ౮. ఆమ్రఫలము

వి. అ. పుం. ౧. తెల్లవర్ణము ౨. ఆగ్నేయ దిక్కునందలి యేనుఁగు. ౩. బెబ్బులి, వ్యాఘ్రము.౪. రాజిలసర్పము ౫.ఆమ్రము, మామిడి. ౬ ౭. తెల్లపాదల కుష్ఠము.

౮. హస్తిజ్వరవిశేషము, ఏనుఁగులకు వచ్చు జ్వరభేదము. ౯ దమనకము. శ. ౯ కమండలువు ౧౦ తెల్లచెఱకు శ. ౧౧ ఒకదినుసు బియ్యము ౧౨ అగ్ని

పుండరీకముఖ. సం వి ఈ స్త్రీ నిర్విషమగు నొకజాతి జలగ

పుండరీకాక్షుఁడు. సం వి అ పుం విష్ణువు.

పుండరీయకము సం వి అ న స్థలపద్మము, మెట్టదామరపూవు ౨ ప్రపౌండరీకము శ

పుండర్యము. సం వి అ న ౧ తీఁగ+లత ౨ శాలపర్ణియాకులవంటి యాకులుగల యొక క్షుపము

పుండలించు. అ క్రి. అభూతకల్పనముచేయు, లేని మాట కల్పించు (చి ని శ ర)

పుండు. వి దే ౧ వ్రణము, కుఱుపు

సీ. క్రవ్యాగతోగ్రకాకవిధూత మక్షికాపుంజ
మై తగువెన్ను పుంటితోడ
శుక ౩ ౩౯౭.

సీ పుంటిమీఁదను నీఁగ గంటు వెట్టును గాని
గిట్టి సెమ్మెని పైఁ గదియలేదు
రామలిం ౧౭ ఆం భా ౨ ౧౭౯

౨ మర్మము, గుట్టు

తే ఒక్కట యవనరాజ్ఞ్యన చక్కఁజేసి,
యొక్కటనప వెందుచేత నీవోపలేవు, పేదపుం
డెల్ల బయలను బెట్ట వలయు
సిం. వార ౩౩

పుండ్ర. సం వి ఆ స్త్రీ తెల్లయావు, శ్వేతగోవు

పుండ్రకము. సం వి. అ. పుం నలుపుగలసిన యొఱ్ఱచెఱకు, ౨ నుదుటిబొట్టు ౩ మాధవి, బండిగురివెంద. శ. ౪. తిలకము, బొట్టు గు. శ

పుండ్రకుఁడు. సం. వి. అ పుం పట్టుపురుగులను పెంచి బ్రతుకువాఁడు (విల్యమ్సు)

పుండ్రకేళి. సం వి. ఇ పుం ఏనుఁగు (వాచ)

పుండ్రము. సం వి అ పుం. ౧. నలుపుగలసిన యొఱ్ఱచెఱకు ౨ తెల్లదామర. ౩ పురుగు. ౪ పువ్వులగురివెంద, పుండ్రకము ౫ వంగదేశము ౬. పులి ౭ తిలకవృక్షము ౮ హ్రస్వప్లక్షము పుం న. నుదుటిబొట్టు (శ ని)

పుంత వి (సం పంథాః) ౧. ఊపరథ్య, పశ్వాదుల రాకపోకలచే నేర్పడిన ఊరిముందటిదారి

మ జాబిల్లిరానిద్దపుంజిగి దళ్కొత్త వితర్దిఁ
దెమ్మెఁగలు మై నిండింపఁ గర్పూరధూళిఁ
గరం బూనిన పుంతలుం బొదలు నాళీకాక్షి
వీక్షింపుచున్ వి సం ౨ ౨౬

౨ మార్గము

(వ్యవ) పెద్దలు త్రొక్కినపుంత మంచిగి

పుందాసుఁడు. సం వి అ పుం దాసుఁడు, బానిసవాఁడు

పుంధ్వజము. సం వి అ పుం. ౧ ఏజాతి యందుఁగాని మగది ౨ ఎలుక, కొక్కు

పుంఫిక. సం. వి ఆ స్త్రీ గుహ్యాజమలము (వై ని)

పుంభావము. సం వి అ. పుం ౧ ప్రౌఢత్వము ౨ పురుషత్వము

పుంరాశి. సం వి ఇ పుం (మేషాదులందు) పురుషరాశి (మేషమిథునసింహాదికములు విషమరాశి)

పుంలింగము. సం విణ. (అ.అ.ఆ) పుంలింగము గలది (శబ్దము.)

వి. అ. న. పుం. ౨. మగతనము, పుంస్త్వము ౩ మగగుఱి, పురుషచిహ్నము ౪ ఒకానొక శబ్దధర్మము

పుంవృషము. సం వి అ పుం. ఛుచ్ఛుందరము. చుంచెలుక (విల్సన్సు)

పుంశ్చలి. సం వి ఈ స్త్రీ ఱంకుటాలు

పుంశ్చలీయుఁడు. సం వి అ పుం పుంశ్చలి కొడుకు.

పుంశ్చలుఁడు. సం వి అ పుం మిండఁడు

పుంశ్చిహ్నము. సం వి అ న మగగుఱి (వాచ)

పుంసవనము సం విణ (అ ఆ అ) మగబిడ్డను బుట్టించునది (శ్రీ)

వి అ న గర్భచిహ్నము తెలిసెనతోడనే పురుషప్రజగాఁబుట్టవలెనని చేసెడి యొకానొక శుభకర్మము (చూ కర్మము)

౨. క్షీరము. (వై ని)

పుంసానుజుఁడు. సం విణ (అ ఆ అ) అన్న గలవాఁడు. (వాచ)

పుంస్కోకిలము. సం వి అ పుం మగకోయిల, గండుఁగోయిల

పుంస్త్వము. సం వి అ న పురుషత్వము, మగతనము ౨. రేతస్సు ౩ పుంలింగము

పుంస్త్వవిగ్రహము. సం వి అ పుం. భూతృణము. ? . (వాచ)

పుంహాలము. సం వి. అ. పుం. వ్యంగరోగము, ముఖమందు ఒకవిధమగు నల్లనిమచ్చలు బయలుదేరురోగము.

పుకిలించే=పుక్కిలించే. స. క్రి. నీళ్లు లోనగువానిని గండూషించు.

చ. పరిగొనఁ దాల్చి వెట్టముగఁ బ్రేవులు చుట్టి కపాలపాత్రలో, విరియఁ గలంచుఁ గ్రొమ్మెదడు వెంద్రుకలేరి తొలంగవైచు నెత్తురు పుకిలించుఁ గండలు తుథూ యని క్రాయుఁ ద్రికూల ధారలం, జెరివిన ప్రేతమాలికలఁ జిమ్ముఁ బిశాచవిభుండు వేడుకన్

ఉ హరి. ౨. ౧౨౪.

(చి ని శ ర పా "నెత్తురు చవిచూచు" ముద్రి)

జః పుకిలింత.

పుకిలింత=పుక్కిలింత. వి (√ పుక్కిలించే) పుక్కిలించుట, గండూషము (శ ర)

పుక్క=పుక్కిలి. వి బుగ్గలోపలి భాగము.

సీ...పుక్క పుక్కిలి బుగ్గ నాఁగ గండూషమా. ఆం భా. ౨ ౧౪౩.

పుక్కటిల్లు. వి బ బాలక్రీడా విశేషము, రూపము విచార్యము)

సీ గొబ్బిళ్లు పుక్కటిల్లు, గుజ్జెనగూడులు...

హం స ౫. ౧౫౫

పుక్కశి. సం. వి ఈ స్త్రీ ౧ కలిక, మొగ్గ ౨ నీలిచెట్టు. ౩ చండాలస్త్రీ (మే ని)

పుక్కశు(సు)ఁడు. సం విణ (అ ఆ. అ.) అధముఁడు వి అ పుం ౧ చండాలుఁడు ౨ క్షత్త్రియస్త్రీయందు శూద్రునికిఁ బుట్టినవాఁడు ౩ నిషాదునికి శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు

పుక్కిటిపురాణము. వి. (పుక్కిలి + పురాణము) నిరాధారమైనకథ అసత్యవార్త

తే. పుక్కిటిపురాణములఁ బ్రొద్దుఁ బుచ్చునతఁడు, చాలగ పురాణములు విప్పి చదివి చెప్పు. రామలిం. ౭౩.

క. పతిశయము రాగిల్లఁగఁ బ్రన్నవతులం బొంగఁగ
నృత్యభాసనం బీయ నొక, త్తెత నిట్టన వివి
రాక్షస్యక యిది పుక్కిటిపురాణ మయి
తోఁచెఁజూడా. రామా. ౧. ౧౯౩.

పుక్కిలి=పుక్క. వి. ౯ో బుగ్గలోపలి భాగము.

పుక్కిటిబంటి. పుక్కిటివఱకు వచ్చునంత లోఁతు
గలది.

తే సఖులు ప్రార్థించుతతిని లజ్జాప్రవంతి
పద్మగంధికి మోఁకాలిబంటి యయ్యెఁ,బడ
కయిలు సేరుతతి మొలబంటి యయ్యెఁ,
బతిని డాయంగఁ బుక్కిటిబంటి యయ్యె
కవిజన ౩ ౯౫

వ...శిశిరకాలంబునం దివశాలించు కొలంకుల
లోనం బుక్కిటిబంటినీట నివాసమయంబుల
నిలిచియు... హార ౪ ౧౪

సీ. హిమవాతదారుణ హేమంతదినముల నిర్వఁ
బుక్కిటిబంటి నీరనుండి పద్మ ౪ ౩

క. ఒక్కనిమేషము రాహువు, పుక్కిటిలోఁ
దగులుపడక పోయొడుభానుం, డిక్కొండ
ప్రక్కఁ జిక్కక కాశీ ౧ ౧౩౪
బస. పు ౩ ౭౧ పా ౬. ౯౭ పం

తే. కమ్మకస్తురిగుళికలు తమ్మిరేమ, నిదుర
మంపువఁ బుక్కిట నించి మేలు, కాంచి
కేతువ నుమిసె నాఁగమలముకుళ, కోట
రంబుల నెలదేఁటికొదమ లెగసె
పారి ౨ ౬౩ అం భా. ౨. ౧౪౩

జ: పుక్కిటిపురాణము, పుక్కిలించు, పుక్కి
లించుకొను, పుక్కిలింత

పుక్కిలించే. స.క్రి (√పుక్కిలి) ౧ పుక్కిటఁ
బట్టు.

చ పెదలుపు గల్గునోళు లొకకేయి ధరించి
వియన్నదీజలం, బదరఁగఁ బుక్కిలించి రయ
మూఁగఁ దెచ్చి మహానలంబుపై, నెడ పద
కుండఁ జల్ల .. హరి. ఉ. ౭. ౩౨.

సీ. (సుందరమూర్తికము) తిలకంబు బలుకేని
యలఁ బోఁకమోకల పుప్పొఁబోఁకులతావి
పుక్కిలించి భీమ. ౧. ౯౩.

౨. పుక్కిటఁబట్టి చప్పుడగునట్లు కదల్చు.

ద్వి. చెలులార విలసిల్లు శీతలోదకము, అలరుచు
గ్రుక్కుగ్రుక్కునక ద్రావుచును, పూరించి
గళగళఁ బుక్కిలించుచును, పారించి యుమి
యుచుఁ జప్పుడు గాఁగ.
పండితా. దీక్షా ౪౨. పా.

౩. పుక్కిటఁబట్టి ఉమియు, గండూషించు.

సీ కిడుపార నెత్తురు ఘనముగాఁ గొని త్రావి
దిక్కులు నెరయంగఁ బుక్కిలించు.
భా రా యు ౨౨౧౬

ద్వి కొండొక ప్రొద్దుండి కోమలి తల్పు,
గ్రక్కునఁ దెఱచి యకాక్కంతుపై నీళ్లు,
పుక్కిలించుటయును..
పండితా. పురా. ౧౨౩ పా.

౪ వెదలఁగ్రక్కు, వెలువఱుచు

వ వేచినమేచకద్యుతులు పుక్కిలించు కద్రో
పల సోపానంబులు పి కకు ౧ ౭౯

అ. క్రి వెడలు, వెలువడు

ఉ కనుఁగ్రేవల జేవులు పుక్కిలింపఁగా,
మనుచ ౫. ౫౦.

పుక్కిలించుకొను. స క్రి (పుక్కిలించు+
కొను స్వార్థమున) పుక్కిటఁబట్టికొను

వ ..గరుడుండు...సకల నదీజలంబుల నెల్లఁ
బుక్కిలించుకొని వచ్చి యయ్యవలంబు
నాఱంజల్లి. భార ఆది. ౨. ౧౦౧.

పుక్కిలింత. వి (√పుక్కిలించే) పుక్కిలించుట,
గండూషము. (శ. ర.)

పుచ్చే. వి. కళింగము, కాళింగి. ?

అ. గురువునకును బుచ్చకాయైన వీయరు,యరయ
కేశ్లకిత్తు రర్థ మెల్ల. వేమన. ౨. ౨౭.

మ. అలుక స్ఫోటకధట్టికాఘురపుటీహాల్యక్ష స్ఫురా
పానిపుచ్ఛంబు వో దున్ని చలచ్ఛయాగజ
మదాపారఫ్లుతి స్త్రీపుమ్యక్లసస్యం చిడి
ఆము ౧. ౪౨. ఆం. భా. ౨. ౩౨.

జ: పుచ్చకాయ.

పుచ్చేకాయ. వి. (పుచ్చ+కాయ) కళింగము, ఒకవిధమగుకాయ

సీ. పుచ్చకాయలు దిన్న బోయెడి మంత్రంబు
లిచ్చునే ఫలము లెందేరికైన నీతి ౬౯

పుచ్చేటిక=పుచ్చేడిక. వి లజ్జ, సిగ్గు

తే... పురులోట, సిగ్గు పుచ్చటిక యు నాన
సిబ్బితి యన, వెలయు లజ్జాహ్వాయంబులు .
కేం. ఆం మాన. ౪౨.

తే. సిగ్గు నా లజ్జ యనఁగను సిబ్బితి యన, నాన
యన పుచ్చటిక యనఁగానులజ్జ.
సాం. ని. మాన ౨౨. ఆం. భా. ౧. ౧౩౨.

పుచ్చేడిక=పుచ్చేటిక. వి ౧. సిగ్గు.

రగడ—పాలఁతి ప్రేంకణంబు చూడ బుచ్చఁ
బుచ్చడిక మసలు, కెలఁత చైత్రమాసమున
జనించు నించువిలుకుపసలు
వరాహ. 3. ౯౨

౨. స్త్రీ.

క. కిచ్చడి పండ్లరపావళి, పచ్చడి యొక పుచ్చడిక
బంతుల కిడియెడ్. బహుళా. ౪. 3౭.

—విణ. సిగ్గరి, లజ్జాళువు. (చూ. పుచ్చడిక తనము.)

జ: పుచ్చడికతనము.

పుచ్చడికతనము. వి. (పుచ్చడిక+తనము) లజ్జ, సిగ్గు.

సీ. పుచ్చడికతనంబు పోఁబెట్టి గిరికన్య పతిఁ
గొల్వ జాయనుపదినపోటు. మనుచ. ౨. ౯.

పుచ్చియ(చ్చ). వి. ౧ (తల) పుర్రె, పునుక.

ద్వి. ఈయింతిఁ గొని వచ్చు కొఱఁగిన వన్ను,
బోయినప్పుడె తలపుచ్చియ ద్రెంగు.
ద్వి. మారిచ్చ. ఉ ౧౦౧౫. పం. (చి. ని.
పా. "పుచ్చెను" ముద్రి)

తే. తనరుచు గరోటి కప్పెర పునుక పుర్రె,
పుచ్చె యన . ఆం భా. ౨. ౧౩౩.
సాం. ని మాన. ౧౭.

౨. (కొబ్బెర మున్నగువాని) పెంకు. (శ. ర. గ్రా.)

(వ్యవ:) ఈయెండకు కొబ్బెరపుచ్చె లన్నియు రాలిపోవును.

పుచ్చివై చే. స క్రి (పుచ్చి+వైచు) ౧ పూర్తిగా తొలగించు మిక్కిలి పోఁగొట్టు.

తే ఇంత నాకిక్కెంతసేపున కల్లవగవుఁ, బుచ్చి
వైచెదనని పల్కె .. కళా 3 ౯౧.

చ తను నెఱిఁగించి చిత్తమునఁ దార్కొని
యున్నకృపాంబురాశిలో, ననయము నోల
లార్చి చటులామావభేదము లెల్లఁ బుచ్చి
వై,చిన... వి. పు ౬ ౨౪౦.

౨. తీసివేయు, ఎడలించు.

వ ఇట్లు విరథుండును వికలహస్తుండును నై
విషణ్ణుం డగునన్నరనాథుండు వెడం గగుటం
గటకటంబడి యాకంకటబు విప్పులం బను
బుద్ధిం బుచ్చివైచి యొండొకకవచంబు
దొడిగ .. భార. ద్రో. 3 ౨౦౯.

చ. కలికిపిపాలినవ్వు లెసఁగఁ బటుధూర్తుల
గొండ తొండొరుం, దలకొన కెచ్చరించి
తమదండపుఁగోలల నున్నమాయుంగోఁచులు
వెసఁ బుచ్చివైచి... ప్రభా. ౧. ౧౦౨.

పుచ్చ్చె¹=ప్రుచ్చ్చె. అ. క్రి. (త. పుళు) ౧. పుచ్చి పట్టు, (పురుగు పట్టుటచే పండ్లు, కల్లులు, మున్నగునవి) చెడిపోవు.

(వ్యవ) పుచ్చినపండు దానము చేయఁగూడదు

౨. మిక్కిలిపండు,పరిపాకమునకువచ్చు.

(వ్యవ) నీపుణ్యము పుచ్చినది

వి ౧ పుచ్చుట, పుచ్చి

(వ్యవ) పుచ్చున్నభాగము తీసివేసి మిగిలిన కాయ కూర కుపయోగింపుము

౩ ఆముదపుమడ్డి

గీ పప్పులోన నుప్పు మిక్కిలిఁ బారజల్లి, నేతిలోన నాముదపుపుచ్చు నిండనించి, పులుసులోన గంజి మిక్కిలి గలయఁ బోసి, భక్ష్యము లలోన మిరియంపుఁబదడు కలిపి.

చంద్ర వి ౧ ౬౫ (బ్రౌ పా)

జ. పుచ్చి, పుచ్చిపురుగు, పుచ్చు

**పుచ్చు².** స క్రి (√పోవు) ౧ పోవఁజేయు పంపు

శా వీటన్ వీథుల నెల్ల నేనుఁగులపై విస్ఫార ఘంటాధ్వనిం,జాటం బంపుఁడు పేర్మి నుత్తర జయాశ్చర్యంబుఁ బుణ్యాంగనా, కోటిం బుచ్చుఁ డెదుర్కొనంగ. .

భార విరా ౫ ౨౪౨

ఆ భూరిభుజుఁడు దాని పోయెనో నీ వెట, యేని పుచ్చితో నిజేచ్ఛ నతని

భార. అర. ౩ ౩౭౨. మనుచ ౪ ౪౦

౨ పోగొట్టు, పాపు

క పరిభవకరుఁ డగుకీచకుఁ, బరిమార్చుట యిపుడు గడవఁబడియె నె యిమ్మై, దురపిల్ల నేల పేర్మిడిఁ, బొరిగొని నీమనముకలఁక పుత్తు లతాంగీ భార విరా ౨. ౧౯౩

ఉ...ఆత్మసం,తాపము లెల్లఁ బుచ్చి విదితం బగుసంపద లిచ్చి ..ప్రోవ ల,క్ష్మీపతి యున్నవాఁడు . వి పు ౧ ౧౫౯

క దినమున మూఁడవయామం,బున నపరార్థంబు యోగ్యముగ నాహారం,బునకుం గల్పించితి నా, కనిమిషు లటుగాన మూన నాఁకలి పుత్తున్ భార. అశ్వ ౩. ౯౨. (ఆకలి పుత్తుఁబుచ్చెంతును అనిభావము)

౩ తీయు; పైకితీయు

క పకపక నవ్వుచు నౌకవి, ప్రకశేఖరమాంస మెల్లఁ బుచ్చి పునుకపా,త్రికలోనఁ గడిగి పెట్టుచు... ఉ హరి. ౨. ౧౪౯.

ఉ ఆవులచేతిఁ బాలుగొని యందు క్రమంబున నెయ్యి పుచ్చి య,య్యావుల కాఘృతం బిడి ప్రియం బొనరించినయట్లు కాద...

వి పు ౨. ౯౦.

సీ పెనుఁగూపమునఁ బడ్డపృథుకుం డుకము బాణ తతిఁ బుచ్చి యిచ్చినధన్వి దక్క.

విక్ర. ౪. ౧౭౯

౪ వెల్లించు, కడపు

వ ఆరాత్రి పుచ్చి మఱునాఁ డమ్మనులు

భా. రా బాల ౨౨౪

చ దినముల్ పుచ్చుచునున్నవాఁడు విబుధాధీశుండు... నైష ౪ ౨౭ ఇందు ౭ ౧౨.

౫ ఎదలించు, తొలఁగించు

క...పాంచాలురఁ, బొలియింపక కర్తకంబు పుచ్చ నరేంద్రా భార ద్రో ౫ ౩౭

ఆ. మునుఁగు పుచ్చ వేల మొగ మేల యల రింపవు భా రా అయో ౧౬

మ ఈ,ద్విజదేవాదులకుం గపాలకవచాస్థి వ్రాతముల్ మేచులన్, నిజమై యున్నవి రుద్రచిహ్నలివి వీనిం బుచ్చి రా కేర్చికే

కు సం ౨ ౧౫౯

౬ (అస్త్రాదులు) ప్రయోగించు, ఏయు

చ మురదనుజుండు పౌరవసమూహమునుం గని రాజరాజుపై, శరనికరంబు పుచ్చి...

ఉ. హరి. ౧. ౪౦

క పిచ్చుకపయి బ్రహ్మాస్త్రము, పుచ్చిన చందాన... పార్వ. ౩. ౭౭.

**౭. తొడుచ్చు, తుడుచు.**

ఉ ...కృత్తలతాంగి కోపెదురక్కట్టున ముంగిటం గసవు గాంద్రయుఁ బుచ్చుచుఁ జేతిచీపురుం, గట్టయుఁ దానుఁ దెచ్చెఁ గఱకంఠుని నోంకృతి నాదిదేవునిన్ కాశీ ౬. ౨౬౨

౮. (తలపు చూ) తెఱచు

ఉ. వి, ద్రోత్తముఁ డొయ్య లేచి తలు పోరఁగఁ బుచ్చి నభోవి మగ్మనా యత్తత... పరమ 3 ౨3౫

ఆ వానిఁ బిలిచి నీవు వాకిలిఁ బుచ్చు మం, దఱము మొగ్గగంబు దఱియఁ దెచ్చె, దము భార ద్రో ౨ ౨౭0

౯ విడుచు,త్యజించు

క నావార్త వినక యింతకు, నావృద్ధులు భిన్న హృదయులై ప్రాణంబుల్, పోవిడుతురు గా కచటికిఁ, బోవం బనిగలదె యేచుఁ బుచ్చెద నమువుల్ భార ఆగ. ౭ ౨౬౮

గీ .నలువపట్టి, యొండ నాక యొక్కింతనే పూరకుండి, యున్న గనుచున వేఁడినిట్టాప్పు పుచ్చె కాశీ ౧ ౧౦౧

౧౦ తీసివేయు

తే కుడుచునెడ వానిపెనుద్రేలు కూటిలోన, దునిసి పడి యున్న ద్రేలుపుచ్చి తోయజాక్షి భార అగి ౭ ౨౧౬

తే మనుజకృతతటాకాదులమున్నముద్ద, లైదు పుచ్చక నుస్నాన మాచరింపఁ, జనదు వాగ్క 3 ౨౧౭ ఆను ౫ 3౯.

౧౧ పిలుచు,పిల్లగించు.

తే కోఱ, లల్లఁ బుచ్చిన నురగంబు లేమి సేయు భార ఉద్యో 3. 3౯౦

వ ..రాజానుం బఱతెంచి కూలప్రోతుండయి యున్న మాండవ్యునకు నమస్కరించి నాచేసిన యజ్ఞానంబు సహించి నాకుం బ్రసాదింప వలయు నని గూలంబువలన నమ్మనిం బాచు చో నది పుచ్చరాకున్న . భార. ఆది. ౪. ౨౬౭ భాగ. ౪. ౧౦౫

౧౨. చెఱచు,పాడుచేయు.

ఉ పతివ్రతామణుల్, వావులు పుత్తురిమ్మ తలవంపులు చేతురటమ్మ జాతికిన్. శుక ౧ ౭౦.

౧3 పుచ్చుకొను,గ్రహించు

క ధనధాన్యపశుసమగ్రుం, దనఁ బరగడునట్టి వైశ్యుఁ దధ్వరముం జే,యనినాఁడు బ్రాహ్మ ణాధ్వరి,మునకు నతనిసొమ్ము గాజా పుచ్చి యిడఁ దగున్ భాగ కాం 3 ౪3౧

చ పుడిసెఁడు గాని లే దిపుడు పుచ్చుక త్రాగిన మద్య మింతలో, నొక తెఱుగండు . కాశీ 3 ౪3 నా పంచ ౧ ౨3౮

౧౪ ఇగి కొన్ని సకర్మక క్రియలక్స్వార్థకరూపము లకు అనుప్రయుక్తిమగుచు (చూ కప్పిపుచ్చు, విడిచిపుచ్చు చూ )

జః పుచ్చివైచు,పుచ్చుకొను,పుచ్చుకోలు, పుత్తెంచు, పుష్పించు

పుచ్చే(చ్చి)కొను. స క్రి (పుచ్చు2 + కొను, స్వార్థమున )

౧ స్వీకరించు,తీసికొను

సీ ద్రౌపదీసహితుఁ డై ధర్మరా జాయుభాగా గంబునం దున్నఁ గార్ముకంబుఁ ఆ బుచ్చి కొనఁగఁ దనకుఁ బోలమి యెఱిఁగియు .. భార ఆగి ౭ ౧౧౭

చ మన మురియాడుచుండ ననుమానముతోన సుశ్లేష్మఁ జూచి నీ, వనయముఁ గోరినట్టిపని యర్థి మెయిం జని చేయుదానఁ గా, కనుతన మాటకాపాలఁతి హర్షముఁ బొందుచు నంది యిచ్చుకాం,చనచషకంబు పుచ్చికొని చారు విలోచన యార్తమూర్తియై భార విరా ౨ ౧౦౨.

౨ లాగు,ఆకర్షించు

మ చెలికత్తెల్ ధ్రువదర్శనంబుకొఱకుం జే ముట్టి పల్మారు నెత్తు లిడంగా వెంగ మెత్తి

నొయ్యనఁ దడస్తోత్రపాఘారముల్, వెల
దోడ్తేదన మైకఁ బుచ్చుకొనుచుండెంబోరె
బ్రీడావతి, తిలకం బానతివ్రమభావము,
గ్రహింతీర్ణంబుఁ గావించుచున్

కళా ౪ ౪౯

౩ ఆరగించు, (తిను, త్రాగు)

తే చంద్రికాపోకఁ బరిపాండుసౌధవీథి, శక్తిఁ
బూజించి దేవీప్రసాదమధువు, పుచ్చుకొని
విప్రుఁ డాశంకరపూరితమగ—

శివరా ౩ ౧౭

తే జపము హోమంబు ధ్యానంబు సలుపుతతని,
భక్ష్యపానీయమాన్యముల్ పాయసంబు,
బుచ్చుకొనువేళ శూద్రులఁ బొంగఁ బలుక,
రిం మవాగలపాపము రెంచ నరిది

శివ ౩ ౧౯

౪ అపహరించు,దొంగిలి చు

చ ప్రియ మతి యజ్ఞసేనియు దరిద్రునిసేనియు
విప్రుఁ గిందఁ జేఁ,త యుభయలోకసౌఖ్య
ములు దవ్వుగఁ జేయు అతనిసొమ్ము పుచ్చి
కొం,టయుచు మదర్థము గొనుట

భార అను ౫ ౬

శ్లో బ్రాహ్మణాస్వోపమస్యేత నిందేచ్చ క్రోధ
యేచ్చ వా,ప్రహారేత హారేద్వాపి ధనం
తేషాం నరాధమః

సం భార అను ౭౦౯ ౯

౫ స్వాధీనపఱచుకొను,వశముచేసికొను

చ ముష్ను విశాలమేదినీ,ధవుఁడు సమస్త
రాజ్యము నితాంతబలోద్ధతులై సగోత్రులా,
హవమున గెల్చి పుచ్చుకొన

వరాహ ౯ ౪౯

తే పారుఁ డొక్కండు పెం డైవబాలఁ దాను,
బాల్యమున నీఱునకు జెల్లుబడిని బుచ్చు,
కొనిన హరి భా ౭ ౩౪

౬ కొను,విలుచు

(వ్యా) ఆపెద్దయిల్లు నాయుడుగారు చాల
చౌకగా పుచ్చుకొన్నాఁడు

పుచ్చుకోలు వి (√పుచ్చుకొను) పుచ్చుకొనుట,
గ్రహణము (శ ర)

పుచ్ఛకంటకము సం వి అ న తేలు

పుచ్ఛజాహము సం వి అ న తోఁకకొందలు

పుచ్ఛటి సం వి ఇ ఈ స్త్రీ నెటికవిఱుచుట,
అంగుళిమోటనము

పుచ్ఛద సం వి అ స్త్రీ లక్ష్మణాకందము
(రా ని)

పుచ్ఛము సం వి అ పుం న ౧ లాంగూలము,
తోఁక, లోమముగలతోఁక ౨ వెనుకప్రక్క

పుచ్ఛి సం విణ (౯ ౯ ౯) పుచ్ఛముకలది
వి ౯ పుం ౧ కోడి ౨ అర్కము,జిల్లేడు †

పుటకందము సం వి అ పుం కోలకందము
(రా ని)

పుటకము సం వి అ న ౧ దొప్ప,దొప్పవంటి
పాత్రము ౨ పద్మము,తామరపూవు ౩ జాజి
కాయ

పుటకిని సం వి ఈ స్త్రీ ౧ తామరతీగ,పద్మ
లత ౨ తామరలసమూహము

పుటగ్రీవ. సం వి అ స్త్రీ =పుటగ్రీవము (శ ని)

పుటగ్రీవము. సం వి అ పుం ౧ గర్గరి, తరి
గడవ, పెరుఁగుచిలికెడుకుండ ౨ తామ్రకుం
భము, రాగికడవ (శ ని హేమ ని)

పుటచెండు=పుట్టచెండు. వి (పుటము + చెండు
శ పుటచెండ్లు) ఎగురఁగొట్టి ఆడెడివస్త్రాదికృత
మగుబంతి, దానితో ఆడుఆట.

సీ. సరివేసి పుటచెండు చాటిమాటు గీ. ఆకట
యగచాల్లపోఁతసై యాడుకొనుచు

పాండు ౩ ౧౪౬

పుటపాకము. సం. వి. అ. పుం. ౧. ఔషధపాక మునకై పుటముపెట్టుట. ౨. కత్తిఅరుగుదల.

పుటపుట. వి. ౧. అదరుటయందగు నమకరణము.

ద్వి. పుటపుటఁ గటములు బొరిఁబొరి వదర.
ద్వి. పారిజా. ప్ర. ౧౧౫౨. పం.

౨. సంతోషము, ఆనందము.

వ... విటవిటీజనంబులకుఁ బుటపుటయును, విర హులకు పెరపెరయును...
ప్రబంధ. పీఠి ౬౨

విణ. సుందరము, విలాసయుక్తము.

క. చిటిపొటిసొమ్ములు పెట్టుక, పుటపుటగా వీథి వెంటఁ బొరిగిండ్లబడికా, విటులనిమిత్తము మట్టెలు, చిటుకు-చిటు క్కనఁగఁ దిరుగు...
హం. స. ౫. ౨౫.

ద్వి. పుటపుటగా జాజిపూవులు దాల్చి, బటువులు గలమించుబటువు లింపొంద.
అ. మ. క. ౩. ౧౬౪. పొ. ౩. పం.

పుటపుటన. విణ. (సం. స్ఫుటమ్) అధికము

వ... చదువ దొరఁకొనినవరునకుఁ గాలంబు కాలంబు, విఘ్నంబులు సకలోద్యమఘ్నంబు లందులకు సామగ్రి గిటగిటనఁగొం తెఱుంగ నగుమదంబు పుటపుటన... ఆము. ౧. ౭౮.

జః పుటపుటనగు.

పుటపుటనగు. అ. క్రి. (√. పుటపుటన) ౧. స్ఫుట మగు, స్పష్టమగు.

చ. కిటకిటనయ్యె నెన్నడుము కేసరిమధ్యకు నాఁ డునాఁటికిం, బుటపుటనయ్యె నారు కడుఁ బొల్పు వహించెఁ దనూలతాద్యుతుల్.
వి. కథం. ౪. ౫౪.

౨. మున్నగు, నిగనిగలాడు, మెఱపడియగు.

వ... మాపుమాపున మేపునక్కొరవణంపు మేపునఁ బిడుకగొఱసంబుతోమకంబునఁ బుటపుటనై కతించుకంబడి ప్రాఁకఁగనిర్గమనం బెదరణొదను కట్టుమగుంపు... ఆము. ౪. ౩౫.

౩. అధికమగు.

క. ఇట నట మిట భూవలయం, బిట బలిసద్మంబు సుందువిరవు లని యనక, బటువులగుమకుల చెఱువునఁ, బుటపుటనై యున్నచిన్నిబొజ్జ గదలఁగక.
పాండు. ౨. ౩౫.

వ. చేమంతిపూబంతులం బుటపుటనై మిటమిటం గాయుదట్టంపుఁబండుపెన్నెల...
మనుచ. ౩. ౭౯.

పుటభేదనము. సం. వి అ. న. నగరము.

పుటభేదము. సం. వి. అ. పుం. ౧. ఏటికినీరువచ్చు మార్గము, నదీముఖము. ౨. నీటిసుడి. ౩. పత్త నము, ౪. ఆతోద్యము, చతుర్విధవాద్యము. ౫. పైనిమూసికొనియున్న కప్పువిరియుట. ౬. ఏటి వంపు. (శ. ర)

పుటము¹. వి. (సం. ప్లుతమ్, ప్రా. పుఅం, క పుట.) అశ్వగతివిశేషము. (దీనికి ఏకవచనమునందు ప్రయోగము కనఁబడలేదు.)

ఉ. ధీరనితత్తడిక్ జవగతిన్ బుటముల్ దుమి కించుచాడ్పునన్, దీరనితత్తడిక్ జవగతిన్ బుటముల్ దుమికించు వాగెఁ బెం, పార బిగించి.
చంద్రా. ౨. ౧౩౦

౨. మల్లవిద్యావిశేషము.

సీ. కవ్వాతులు పుటము గ్గస్తాలు మండీలు దాళా లు డింకీలు దండెములును, లాఁగు లవంగను రాజిల్లు...
ఆం. భా. ౨. ౨౦౪.

విణ. (క. పుదైప్ప) అధికము, హెచ్చైనది.

క. హరిభక్తియు గురుభక్తియు, సురరక్తియుఁ బుటము గాఁగ యోగీంద్రశిఖా, భరణము ముక్తామయతా, స్ఫురణము భువనప్రశస్తముగ జగిదిగొనెన్.
పాండు. ౨. ౧౩.

జః పుటచెండు, పుటముగుఱ్ఱము, పుటముబ్బు, పుటమురిత్తు, పుటమెగయు.

**పుటము².** వి. జలనిర్గమమార్గము, తూము.

సీ తూపరాజు పుటమ్ము తూ మొప్పరము జల
దారి యంచనఁగును దనరుము జలనిర్గమము...
ఆం. భా. ౧. ౧౫౪.

**పుటము.** సం. వి. అ. న. ౧. దొప్ప, దొన్నె.
౨. దొప్పవలెనున్నట్టి పాత్రము ౩ లేఁత
మొలకలను గప్పియుండు దళసరిపొలు. ౪
ఆచ్ఛాదనము,కప్పు. ౫. కనురెప్ప ౬. గుఱ్ఱపు
కాలిగొరిజ. ౭. పూలబుట్ట. ౮ మిథఃశ్లేషము
ఒండొంటితో గుత్తముగా హత్తికొనుట ౯ జాజి
కాయ. ౧౦. ఔషధపాకమునకై మన్నులోనగు
వానిచే రెండు దొప్పలుచేసి యొకటిక్రిందను మఱి
యొకటి మీఁదనుబెట్టి కూర్చి చేసిన పాత్రవిశే
షము.

వి. అ. పుం. ౧. దొప్పవలె ముడుఁగుకొనుట.
౨. ద్వాదశాక్షరకమగు వృత్తభేదము. ౩
ప త్తనము. (వై. వి.)

**పుటముగులుకు.** అ. క్రి. (√పుటము¹) పుట
మెగయు,పైకెగురు

గీ పసివలపులిచ్చుపచ్చాకు పసిఁడిపట్టు,బటువు
కొడుము బటువుపై పుటముగులుకఁ,బూవి
రందల మెంతయు బోయ లంత.
రా. వి. ౨. ౪౩.

**పుటముబ్బు.** అ క్రి. (పుటము¹+ఉబ్బు) పైకి
ఉబ్బు, ఉద్గమించు.

చ. అలికులవేణియూరు నవయౌవన మహావలరాచ
తోఁటజాఁ, బొలుచునితంబవేదికఁ బొక్కి
లిడిగ్గియచెంత నీలసం, కలితనవాంబుయంత్ర
మగుఁ గానిదొరక రసగుంభనంబు సంధిఁ
బుటముబ్బునై నడుమ నిల్చి ఘన స్తనమూన
గుచ్ఛముల్. వసు. ౨. ౪౦.

**పుటమెత్తు.** స. క్రి. (పుటము¹ + ఎత్తు)
మీఁదికెత్తు,పైకెత్తు.

సీ. గుహముఖంబులలె చాణఁ బరిపోవ మొనరింపఁ
బూగుత్తు లేటికిఁ బుటము లెత్త.
లేం. పంచ. ౧. ౬౨. (బయటఁబెట్టు అని భావము)

సీ. ఉడుగక గుండెయు దడదడ మనుటఁ గెంపుల
దంటఁ జనుదోయి పుటము లెత్త.
కువల. ౫. ౬౭.

**పుటముపెట్టు=పుటమువేయు.** మి. స క్రి.
(శుద్ధిచేయుటకై లోహములను, ఔషధములకై
గంధకాది ద్రవ్యములను) అగ్నితప్తముచేయు,
నిప్పులోఁ బెట్టికాల్చు.

తే. మేటిజక్కొటియనఁ గ్రొమ్మించుమించుఁ,
బొదివి మదనప్రతాపాగ్నిఁ బుటముపెట్టి,
తమ్మిగద్దియదాశట గ్రమ్మి యట్టి,కొమ్మఁ
గావింపఁబోలు నెత్తమ్మిచూలి.
వసు. ౨ ౩౨.

**పుటమువేయు=పుటముపెట్టు.**

సీ. రస మంటె ననుచు నీరసముతోఁ బుటంబుఁ
జేయ మేనవు చేర విశ్వకర్మ.
దశా ౧. ౨౨.

**పుటమె(ము లె)గయు.** అ క్రి (పుటము+ఎగ
యు) ౧. మీఁదికెగయు,పైకెగురు

క. పుటమెగసి తాళవృక్షము, చటులోద్ధతిఁ
బూని పెలికి సారథి నవనికా,విటకటముగఁ
బడవైచెను, బటుభుజసత్వంబు మెఱయఁ
బవనజుఁ డల్కన్. హై. ౩. ౮౨.

మ జలగుంబయ్యెదకొంగు జాఱి మెనుకకా
జేరాడ ముత్యాలపేరులు వక్షోజకటిం బుటం!
బెగయఁగాఁ ద్రోపదిఁ జన్నల్...
పారంగ ౩. ౪౬.

సీ. ఒండొంటితో రాయుచుత్తుంగకుచకుంభములు
మొగంబులకును బుటము లెగయ.
భాగ. ౧౦. ఉ. ౬౮౯.

౨. దూఁటు, లంఘించు.

క. ఇటు నిశ్చయించి యతఁ డటు,నిటుఁ జూచి
మహేంద్రశైల మెక్కి న లంకా,పుటభేద
నంబునిరాదికిఁ, బట మెగయను వాయుసూతి
పో వ్మని కదలెఁ. రామా. ౬. ౯౪.

పుటానిలము. సం. వి. అ. పుం. శిశిరర్తువందలి వాయువు. (వై. ని.)

పుటాపుటిక. సం. వి. ఆ. స్త్రీ. పూర్వము సంశ్లిష్టమై పిదప వీడియుండుట

పుటాలువు. సం. వి. ఉ. పుం. కోలకందము. శ్రీ.

పుటి. సం. వి. ఈ. స్త్రీ. ౧ దొప్ప, దొన్నె, ౨. పూలబుట్ట. (వై. ని.)

పుటిక=పుట్టిక. వి. (త. పుట్టికల్. క పుటికె) పిటకము, గంప

చ...కంబడిచింపులు నీలిపాఁత లీఁ,కలుఁ దగు
పాపురంపుఁబుటికల్ గొని వచ్చి కుమార
సన్నిధిన్. సారంగ. ౧ ౧౧౬.

సీ...బుట్ట పుట్టిక పుట్టి పుట్టిక యనఁగఁ, దన
రుచు విటకంబు... ఆం. భా. ౨. ౨౪౦.

పుటిక. సం. వి. ఆ. స్త్రీ. ఏలకి. శ్రీ.

పుటితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. రెండుగా చీల్పఁబడినది, పాటితము, ౨. కుట్టఁబడినది, స్యూతము, ౩. ముకుళితము, ముడుఁగుకొన్నట్లు చేయఁబడినది; దొప్పుగాఁ జేయఁబడినది. ౪. ఆద్యంతములందు ప్రణవాదియుక్తమైనది. (మంత్రము.)

వి. అ. న. దొప్పవలె కూర్పఁబడిన రెండు చేతులు, దోసిలి, హస్తపుటము.

పుటుక్కు. వి. తెగుటయం దగుధ్వని కనుకరణము.

మ...గంట పుటుక్కునం దునిసె పృథ్వీం
బడెన్ జాలె విస్ఫుల్ల ప్రకాశన్ సుర
మండలుల్ గురిసె మోనై విరు
ల్పోరదన్. ఆము. ౪. ౩.

పుటోటజము. సం. వి. అ. న. ఛత్రము, గొడుగు, (త్రి. ని.)

పుటోదకము. సం. వి. అ. పుం. నారికేళము, కొబ్బరి శ్రీ.

పుట్ట. వి. ౧. వల్మీకము.

చ. తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరు
పాముల ద్రోసి ద్రోసి నిష్ఠురతరదీర్ఘదంత
ముఖ డొల్లఁగ వ్రేయుచు వచ్చివచ్చి...
భార. ఆది. ౧. ౧౫౨.

శా. పుట్టం బుట్టె శరంబునన్ మొలవ వంశో
ద్యాన పాత్రంబునన్, పెట్టం గల్గను...
భాగ. ౧. ౭.

సీ. ఆయుధంబులు చేసి హుంకారములు ద్రోసి
ద్రెంకుల్దారును బుట్ట కెక్కువారు.
వరాహ. ౩. ౪౭.
కళా. ౧. ౧౬౨. ఆంధ్ర. ౨. ౯.

౨. స్థానము, నెలవు.

క. ప్రియములపుట్ట లనంగ వినయములకుఁ
బెట్టె లనఁగ... వరాహ. ౯. ౧౩౭.

గీ. చలము సాధించుదిట్ట కోపాలపుట్ట.
కుక. ౩. ౧౯.

౩. సమూహము, (ఉదా) కోనుళ్ళపుట్ట మొ.

(వ్యవ) అమంచములో వల్లులు పుట్టపుట్టలుగా నున్నవి.

౪. చిన్నపాద. (శ. ర.)

౫. పుడాడి, గోదబలమునకై తోఁకునుండి కట్టుటకు త్రవ్వపల్లము.

(వ్యవ.) గోదలకు పుట్టలు త్రవ్వినారు.

జః పుట్టకాఁపు, పుట్టకాలిబాఁడు, పుట్టకాలు, పుట్టకూడు, పుట్టకూడుమేసరి, పుట్టకొక్కు, పుట్టకోట, పుట్టక్రోవి, పుట్టగొడుగు, పుట్ట గోఁచి, పుట్టచెంబు, పుట్టచూలు, పుట్టచేరు, పుట్టజొన్న, పుట్టతమ్మ, పుట్టతేనియ, పుట్ట

తేలు, పుట్టపుట్టాణు, పుట్టపురుగు, పుట్టకొద్ది, పుట్టబంగారము, పుట్టముంగి, పుట్టలమ్మ.

పుట్టంధుఁడు. వి. విశే. జన్మాంధుఁడు, పుట్టుగ్రుడ్డి.

శా. పుట్టంధుండవు పెద్దవాఁడవు మహాభోగంబులా లేవు నీవ ట్టిల్లం జెడిపోయె... కౌరవ్యవంశాగ్రణీ. భాగ. ౧ ౩౧౧.

సీ. తనకొమ్మునాగముఁ గన్గొనుచు పుట్టంధుండు మించుటద్దంబు చేనుంచుకొన్న.

పీఠాపు. ౩. ౮౩.

పుట్టకాఁపు. వి (పుట్ట+కాఁపు) ఛల్లాకము, ఎలుఁగుగొడ్డు (శ. ర గ్రా)

పుట్టకాలివాఁడు. విశే (√. పుట్ట+కాలు) వల్మీకపాదుఁడు, పుట్టవలె దుర్మాంసము పెరిఁగిన కాలుకలవాఁడు

సీ. వల్మీకపాదుఁడు వరలుఁ బుట్టకాలివాఁడనఁగను. ఆం. భా. ౨. ౧౭౭.

పుట్టకాలు. వి. దే (౮ పుట్ట) వల్మీకపాదము, పుట్టవలె దుర్మాంసము పెరిఁగినకాలు.

సీ పుట్టకాల్ సొట్టకేల్ వట్టి గ్రోలుంజెవుల్ పట్టుకే కట్టికు బిట్టుగదల.

చంద్ర. వి. ౧. ౫౧

పుట్టకూడు. వి దే. (√పుట్ట) పుట్టలో లభించునాహారము (చీమగ్రుడ్లు మొ.)

సీ...పట్టిమాటలుగాపు పుట్టకూటికి దాయుకెలుఁగుపై నమబట్టి నిలుపఁగలము.

చంద్ర. ౨. ౨౫.

వ...పుట్టకూటికిం జేయలకున్ జెదలునకు కెలుంగులు గులగులన్ బుట్టలు నిశితనిజనఖరములకొట్టులన్ గోరాడ. మనుచ. ౪. ౩౮

(చీమగ్రుడ్లతో కలిసిన పుట్టమట్టిముద్ద. అని. శ.ర. కుక్కగొడుగు అని గ్రా.)

పుట్టకూడుమేవరి. వి. (√పుట్టకూడు) ఛల్లాకము, ఎలుఁగుగొడ్డు.

ఆ. అనిన సంతసిల్లి యద్దొర యంతయు, గారవించి యనుప గట్టకూఁడు, కొడుకుకొడుకుఁ బుట్టకూడుమేవరి యేఁడుఁ, దోఁడు గాఁగ కెలమితోడఁ జనిరి.

అచ్చ. రా. కిష్కి. ౨౭.

ఇట్లే. పుట్టకూడుమేపరుడు, పుట్టకూడుదిండి. మొ. (శ. ర)

పుట్టకొక్కు. వి. (√పుట్ట) పుట్టగొడుగు, భూస్ఫోటము.

గీ. ఒదవువృత్రురక్తమున బుద్బుదము లెసఁగి, పుట్టకొక్కులై యవి జనభోజ్యభావమందె...

భార. శాం. ౫ ౪౩౩.

సీ. పుట్టకొక్కనఁగను భూస్ఫోటసంజ్ఞయా ..

ఆం. భా. ౨. ౭౬.

పుట్టకోట. వి. (√పుట్ట) కోటకు బలమునకై దానిచుట్టు చేసినమట్టిగోడ్ను, అండగోడ. (శ. ర. గ్రా)

పుట్టక్రోవి. వి. (√పుట్ట) వల్మీకనాళము, పుట్టకలుఁగు.

సీ. పుట్టక్రోవుల సైతమును దేచి గలిగించి గేదంగి కేల కల్గింపఁడాయె.

వైజ. ౩. ౧౨౧.

ద్వి. కటిలోద్ధతిని బుట్టక్రోవులఁ జేరి, ఘుటఘుటఁ జీమలఁ గ్రోలు భల్లూకములు...

ద్వి. సా. ౪౬౧. (గ్రా.)

పుట్టగొడుగు. వి. (√పుట్ట) పుట్టకొక్కు, పుట్టయందు తెల్లఁగా గొడుగువలె మొలచుమొలక, భూస్ఫోటము, కుక్కగొడుగు. శ్రీ. (శ. ర. గ్రా.)

పుట్టగోఁచి. వి. (√పుట్టు. క. పుటగోసి.) గుహ్యాంగము మాత్రము కప్పునట్లు ఉపయోగించు వస్త్రఖండము. (పెద్దకౌపీనము. అని శ. ర. గ్రా.)

చ. వల నగు పుట్టగోఁచి బిగువాళ్లను గుంతపుఁ గాసెలుఁ విభ్రాజితంబురసాన గోడ్డలియు... కుక. 3. ౨౪౮.

సీ. నీ పుట్టగోఁచియు నీ కావిచేప్పువల్ వార కాంతకు బట్టుచీర లౌను. హైమ 3. ౧౦౩.

పుట్టచేమ్మ. వి (√పుట్ట) వల్మీకశింబి. ?

సీ. వల్మీకశింబిరై వరలుఁ బుట్టచెమ్మ యటంచన .. ఆం. భా. ౨. ౪౨.

పుట్టచూలు. వి. (√ పుట్ట) వాల్మీకిముని. (వి. ని. గ్రా.)

పుట్టచెండు=పుటచెండు. వి. (పుట్టము + చెండు) (వస్త్రము, మొ. తో చేయఁబడిన) ఎగురఁగొట్టియాడెడు బంతి.

క. ఎవ్వనితల దునిమిన నది, చివ్వునఁ బట మెగయఁ బుట్టచెండుం బోలెన్, నవ్వు నొకనవ్వు పెత్తుకు, చివ్వున లోఁబడఁ గబంధసీమన నిలుచున్. కళా. ౫. ౧౬౩.

క. కుటిలాలక నీగుబ్బలు, బటువు లయి పొంగాని కొగయు బంగరు నిగ్గుల్, పోటుమరిలఁ బుట్టచెండ్లొ, నటుగాదే నింతపట్టి యాడుదు నఁట మే. సారంగ. ౨. ౨౦౮.

రామా. ౮. ౫౧.

హ: బాలక్రీడా విశేషము.

సీ. పుట్టచెండ్లుప్పనఁ బట్టె లాలంకుట గుడుగుడు గుంచాలు గుంటిచాళ్లు. వి. పు. ౪. ౨౦౨.

సుదంశా. ౧. ౪౩.

పుట్టచేర్పు. (√పుట్ట) పాము, సర్పము.

సీ. చెలితో మలక పుట్టచేర్పులమున్నిడు చూపులఁ గరుణించు వనితచాళి. హా. న. ౪. ౪౩.

పుట్టజోన్ను. వి. (√పుట్ట) పుట్టలో వట్టెడు తేనెపట్టు.

గీ. పుట్టతేనియ పెరతేనె పుట్టజొన్ను, తొఱ్ఱతేనియ గల వందుఁ... శాళ. 3. ౬౮.

పుట్టతమ్మ. వి. (√పుట్ట) ఒకజాతి తంబటిఁగ, శింబి. ? (శ. ర.)

పుట్టతేనియ(నె). వి (√ పుట్ట) పుట్టలో పట్టిన తేనెపట్టులోని తేనె.

గీ. పుట్టతేనియ పెరతేనె పుట్టజొన్ను, తొఱ్ఱతేనియ గల వందు... శాళ. 3. ౬౮.

సీ పుట్టతేనియఁ గ్రోలఁబోదలు చీమల పెక్కు లూటి నైకొనదు భల్లూకగణము.

చంద్రా 3 ౪౨.

పుట్టతేలు. వి. (√పుట్ట) ఒకజాతి పెద్దతేలు, మండ్రగబ్బ (శ. ర)

పుట్టనిమ్మ. వి. (√పుట్ట?) గడియారము. (వి.ని)

పుట్టపు(ఁబు)ట్టువు. వి. (√పుట్ట) వల్మీక సంభవుఁడు, వాల్మీకి.

చ... ఆప్రచురకవిత్వ తత్త్వనిధి భక్తి భజించెదఁ బుట్టపుట్టువున్. విక్ర. ౧. ౯.

గీ... అమృతమూర్తి, శ్రీ రఘూత్తముఁ దతని చారిత్ర మరిది, పుట్టఁబుట్టువులకుఁ గాక పొగడఁ దరమె. హా. న. ౧ ౧౪.

(క.) ఎదఁ గుదురగు వేదుకఁ బొగడుదుఁ బదియరదముల దొర కొడుకు కథ నింపాదవఁ గదియించి యనమునఁ, బొదవిన బల్లిదునిఁ బుట్టఁబుట్టువు కవివిన్.

అచ్చ. రా. బాల. ౯.

పుట్టపురుగు. వి. (పుట్ట+పురుగు) పాము (వి.ని.)

చ. కదుఁ దొడు నైన యుద్ధరితకర్మము నిక్లోని ముంచుఁగాక దొక్కుఁడఁ జన నిచ్చుఁ

బుట్టపురుగా కొఱగా కెపు దస్యతంత్రతతో,
మదుంగు భజించి శేకముల మస్తమున స్ఫురి
యించి కొల్చి రొయి, ఫ్రుదవి దయామతిం
గడుపు పోయఁగ నుండు పొకాలి పా
మ్మనటో. కేం. పంచ ౩. ౩౫౫.

పుట్టపెద్ద. వి. (√పుట్ట) సర్పము. పాము.

సీ. జక్కవపులుఁగుల జత విప్పకొద పుట్ట
పెద్దల మలకలఁ బెట్టురట్టు.
అచ్చ. రా. అర. ౨౧.

పుట్టబంగారము. వి. (√పుట్ట) ౧ పుట్టలో
పాలుపోసికొనునప్పుడు తడివిచెవులకు రాచి
కొనుపుట్టమన్ను (వా)
౨. మొలకబంగారు, పుట్టలలో పురుగులవలనఁ
గలుగు బంగారు.

పుట్టము. వి (సం పటః త పుట్టమ్) వస్త్రము.
బట్ట.

క. చెలఁగె సురదుందుభిస్వనములు ముదమున
భూసురోత్తములు పయిపుట్టంబులు విడిచి
వీచి రార్చిరి... భార. ఆది. ౪ ౧౯౭.

సీ. పొంబట్టుపుట్టంబు పొట్ట నందంబుగా ఘన
జటా జూటంబు గలయఁ బొదవి.
విక్ర ౨. ౯౪.

సీ. వలిపక్రొందళుకుమేల్ వెలిపట్టుఁబుట్టముల్
గట్టినయట్లు దిక్కాంత లలర.
ఉ. రా. ౧. ౫౪ ఆం. భా. ౨. ౧౫౧

జః పుట్టచెండు.

పుట్టముంగి. వి (√పుట్ట)వకుల విశేషము. ఒక
జాతిముంగి.

(వ్యవ.) ఎన్ని తిట్టినను వాఁడు పుట్టముంగివలె
ఊరకుండును.

పుట్టలమ్మ. వి. (పుట్టలు+అమ్మ) ఒకానొక
గ్రామదేవత, గర్భిణిస్త్రీలు మొంగములాఁపు అను
రోగముల కధిదేవత. (గ్రా.)

సీ. పుట్టలమ్మ యటన్నఁ బో రొంత లేదను...
గీ...వినివినియయ్యాలి బసివి. శుక. ౩. ౪౯.

పుట్టి¹=పుట్టిక. (క తు పుట్టి) వి. ౧. బుట్ట.

సీ ..బుట్ట పుట్టిక పుట్టి పుటిక యనఁగఁ, దన
రుసు విటకంబు .. ఆం. భా. ౨. ౨౪౦.

గీ. చెట్టుచెట్టునఁ బిట్టలు పుట్టికొలఁది, కేతి
ముద్దలవంటివి దీకు మెపుడు.
ఇంటు. ౨. ౫౨.

౨. పేముతో గంపవలె అల్లి మీఁదఁ దోలు
కప్పి కట్టి యేఱు దాఁటుటకు పయోగించు
సాధన విశేషము

సీ పుట్టి నావలగోలు నాఁ గోల మలరు
చుండు. ఆం. భా. ౧. ౧౫౪.

గీ. ఈఁదుకొయ్యలు తెప్పలు నీఁదుకాయ,
లదర లరిగోల్లు పడవలు తరులు పుట్లు,
చేపడవ లోడ లాదిగాఁ జెలఁగువట్టి, యంబు
తరణంబులకు వెల్ల నధిపుఁ డతఁడు.
హంస. ౪. ౧౯౨.

చ. సుజనజనైకభూషణము కూరత దుర్జనదూష
ణంబు పద్మిజనిబుధాశ్రితప్రతతి పేదుకఁ
బ్రోపును రాజ్యచిహ్న కాక జలమహోభి
షేకమునఁ గట్టినపట్టము వీజనంబు భూ,
భుజాలక కాక యిన్నియును బుట్టికిపైనను
లేవ చూడఁగాన్. కు. సం. ౧౦. ౫౭౪.

పుట్టిముంచు=చెఱచు, ధ్వంసము చేయు.

క. మట్టొకటి కలద నీకుం, దొట్టినమదమునఁ
దపోధనుఁ బరాశరునిన్, వట్టిటఁబుట్టి
ముంపవె, కట్టా కందర్ప కుసుమకాండ
ములవడిన్. కకు. ౩. ౧౧౪.

పంచచామరము ...గాఢప్పు కూర్మి పట్టి ముట్టి
వానిపుట్టి ముంచెగట్టులన్.
రాము. ౯. ౫౫.

పుట్టిముణుఁగు—చెడు, ధ్వంసమగు.

వ. వదలక కృష్ణరాయకరవాలమునం దగుధార నీట వ్యభ్యుదయము నొంది శాత్రవులపుట్టి ముణుంగగ... మనుచ. ౧. ౪౧.

(వ్యవ.) అంతపుట్టి మునిఁగినప్పుడు చూతముకే.
(...) ఏమిపుట్టి మునిగినదని నీవిటుకు పఱుగెత్తు కొని వచ్చితావు.

జః పుట్టిమునుక, పుట్టివాఁడు

పుట్టి². వి ౧. ధాన్యమాన విశేషము
(ఈ పరిమాణము మండలభేదమునుబట్టి మాఱు చుండును.
బుట్టెపుట్టి, తూర్పుపుట్టి ౨౦ కుంచములు.
పల్లెపుట్టి—౨౦ కుంచములు.
మలకపుట్టి—౨౦౦. కుంచములు
ప త్త్రిములలో దీనికి గుఱుతు "ఖ", ఖండి యొక్క లు ప్తరూపము (బ్రౌ)

గీ. తల్లిచను బాలు గ్రుక్కెఁడు తక్కనయుని, పుట్టెఁడును బొక్కరూ పను భూమిఁ బరగు, నాడువు బొం కర్యే...
హరి. పూ. ౫. ౨౩౫.

గీ. కట్టుకొని కొల్చి పోఁతకుఁ బుట్టెఁ దమ్మె, శ్రీ రఘుస్వామి రాజ్యంబు సేయునపుడు.
ఉ. రా. ౭. ౧౪౧.

వ .చేతికాయ(కు) కూంతురు జయమయిండ్దు లయ మినీశ్వర మహాదేవరసన్నిధానమున నుత్తరాయన సంక్రాంతి నిమిత్తమునంబెట్టించ్చిన కులోత్తుంగచోడ శక్రమునకుంబ్రోలు నాట్టి కుంకటూరి దక్షణామున చెఱువు దక్ష ణామున ముప్పదిపుట్ల విత్తుపట్లు సర్వాకర పరిహారముగా శ్రీచోడ (గ)ంగ్గదేవరిచ్చి.
ద. శా. ౧౦౧౫.

౨. భూమాన విశేషము.
వ...గొల్లపల్లు తూర్పున పీలమదేవి...యుపపరకాముల్లతోట కేలికపుట్టి...
ద. శా. ౧౦౧౬.

3. తులామాన విశేషము. ఇరువది మణుగుల యెత్తు.
ఉదాః పుట్టెఁడుబెల్లము, పుట్టెఁడు పొగాకు. కెం.

పుట్టించే. స. క్రి (√. పుట్టు) ౧. కను, జనింపఁ జేయు.
వ ఆ దీర్ఘతముండును దానివలనఁ గాక్షీవదాదుల నేకాదశపుత్త్రులం బుట్టించిన..
భార. ఆది. ౪. ౨౩౪.

సీ .అతఁడు సర్వకర్తృనిఁ బుట్టించె ననరణ్య భూపతి యతనినుతుఁడు.
హరి. పూ ౨. ౩౨.

౨ సృజించు, నిర్మించు
సీ అన్యోన్యధనకాంక్షులై పోరు ధరణీశులకు నెల్ల సాదకాదకును శైల, దుర్గంబులను వనదుర్గంబులను జలదుర్గంబులను మహీదుర్గములను, బుట్టించి... వి. పు ౧. ౧౦౦.

గీ బ్రహ్మ పుట్టించు మనుచు నారాయణుండు, హరుఁడు హరియించు భువనంబు లవసరమున
కాశీ 3. ౪౪.

3 కలిగించు, ఒదవించు.
గీ ఇంపుఁ బుట్టించుఁగాక మీ యిద్దఱకును.
శైవ. ౫. ౩౨.

వ...బదలికలు పుట్టించుచు ..
ఉ. రా. 3. ౨౪౬.

౪ కల్పించు, కల్పనముచేయు.
సీ...ప్రబంధములు క్రొత్తలు పుట్టించుకొని లిఖింప. విక్ర. ౧. ౨౦.

(వ్యవ) వాఁడు నామీఁద లేనిపోనిమాటలు పుట్టించి చెప్పినాఁడు

జః ప్రసంగమునకుఁ దెచ్చు.
వ. పాండవపక్షంబువారల తారతమ్యంబులు వినువాఁడై యమ్మాట పుట్టించిన నతనికి భీష్ముఁ డిట్లనియె.
భార. ఉద్యో. ౪. ౨౭౨.

పుట్టిక=పుటిక.

చ. పొగడలు దూసి పుట్టికలఁ బోసి రసాలయ
పక్వఫలంబు, చిగురులు దాసి ..
హంస. ౨. ౨౭.

ఉ. భూవరముఖ్యసన్నిధిఁ బోరెండు మామిడి
పండ్లపుట్టికల్, పెందగ
కళా. ౬. ౧౫౭. ఆం. భా. ౨ ౨౮౦

—బద్దలపుట్టిక=అబద్ధములగంప; మిక్కిలి యసత్యమాడువాడు

ఉ. పైనపుదట్టి గట్టుకొని బద్దలపుట్టిక వెంట
రాఁగ రా,పాసిప పాని నవ్వు వెలజవ్వని
రాఁ గని యొక్క-సాని యా,సాని మిటారి
నీకు దొరసానికి నీ దన చెల్ల దంచు భూ,
జాని పటానిగా యవక జిక్క- వెసం దిగి
కొమ్మ కొమ్మ నెక్కె. రా. వి. ౨. ౫౯.

—బోనపుట్టిక=అన్నపుబుట్ట

చ అమరులబోన పుట్టిక సహస్రమయూఖుని
కోడుకోడె సంతమసముచేయనిత్తు కుముదం
బుల చిక్కిలిగింత .. పాండు. ౨ ౪౦

పుట్టినయిల్లు=పుట్టినిల్లు, పుట్టిల్లు. వి జా
(పుట్టిన+ఇల్లు)

౧. ఆడువారి జన్మవంశము.

సీ. ఈకీతిఁ బుట్టినయింటికిఁ జొచ్చినయింటికి
చెప్పరాదు వెలుబలుంబు. వరాహ. ౬ ౩

౨. జన్మగృహము, జనకగృహము.

క. కడుబలవంతుం డైనను, బుధమిని బ్రాయం
పుటాలిఁ బుట్టిన యింటన్, దడ పుండ
నిచ్చె కేనియుఁ, బడయఁగ నంగడికిఁ దాపె
కొపుట నుమతీ. సు. క. ౨౧

పుట్టినిల్లు (లు)=పుట్టినయిల్లు, పుట్టిల్లు.
(జనకగృహము.)

ఆ. పుట్టినింటి కేమ పోయి రొక్కించుచు,
యూఁడిల్లి వత్తు .. పాండు. పూ. ౧. ౧౬౦.

(జనన కారణము)

వ. అపుణ్యాశ్రమంబులు కంసాసురధ్వంసిచరణ
పల్లవంబు దనకుఁ బుట్టినిల్లు గావున కారణ
గుణ సంక్రమంబునఁబోలె చాతురతోఁ బర
చ్చత్రధనుః ఖడ్గాది చిహ్నోపశోభితంబై.
భీమ. ౧. ౩౧.

(నెలవు, స్థానము.)

ఉ. నెట్టన పాపగాముఁడు నేలకు బ్రాహ్మ
ణవంగ విన్నఁ డా, కట్టెఁడిమీఁద లేమి విను
కాతియ కోర్వవు దుర్వినీతిఁ, బుట్టిన
యిల్లు నై వినాశపోవఁగ వచ్చునె యింక
నాకు... భార. భీష్మ. ౧. ౬౫.

క...ఇది పుట్టినయిల్లు సిరుల కెల్లఁదలంపన్.
కళా. ౨. ౧౧౪.

సీ. ఏము ప్రముచ్చులమె యూహింప ప్రముచ్చుఁ
దనాలపుట్టినయిండ్లు మీకోండ్లై కాక.
ప్రభా. ౧. ౧౦౭.

పుట్టిమునక. వి. (√పుట్టి[1]) నష్టము, చెఱుపు.
(వ్యవ)వాఁ డాపని చేసినరోజుల నీకు వచ్చిన
పుట్టిమునక ఏమి ?

పుట్టిల్లు=పుట్టినయిల్లు, పుట్టినిల్లు.
(జనకగృహము)

సీ. సిరికిఁ బుట్టింటి పెచ్చెలు కోట మనసికి
డాపె నా మకరకుండలము లమర.
అము. ౪. ౧౧.

పుట్టివాఁడు. విణ (√పుట్టి[1]) పుట్టినదపువాఁడు,
నావికుఁడు.

గీ. పుట్టివాని కొక్కరునిఁ దాఁ బొందుచేసి,
వారి నదటఁ గాలేరివారియందు, ముంచు
టకు మున్నుగా నియమించిరొక్క-, వాఁడు
కావేల కెల్లను నయము మీఱ.
పరమ. ౫. ౪౯.

పుట్టు. అ. క్రి. (క. పుట్టు.) ౧. జన్మించు, జనన
మొందు.

గీ. మున్ను పుట్టుట యిది కడుఁజోద్య
ముర్వి. భార. ఆది ౩ ౧౭౦.

ఉ. పుట్టఁగఁ బుట్టఁగాఁ దునిమెఁ బుత్రుల
దేవకి గన్నయందఱం, గట్టెఁడి పాపజాతి
యగుకంసుఁడు... హరి. పూ. ౫. ౧౩౯

౨. మొలచు, అంకురించు.

గీ. చంద్రగుప్తుండు గాదించె సరసగోష్ఠి, వట్టి
మ్రాఁకులఁ జివురులు పుట్టునట్టు.
విక్ర. ౧. ౧౧౨.

సీ. పుట్టె వల్మీకంబు పాదలం బాదశె.
కాశీ. ౫. ౧౨౩.

౩. కలుగు, సంభవించు.

క తగతరమ ప్రజలఁ దునిమెదు, వరునప్పటి
యుత్తికోలనకు సురవిద్యాధర ఖేచరులను
భీతిం, బొరసిరి తమదెసకు జేమి పుట్టునో
యనుచున్ భార. విరా. ౫ ౭౪.

గీ భక్తి దివిజాలచిత్తంబు పట్ట కున్న, నంతరా
యంబు పుట్టుఁ గార్యముల కెల్ల
నైష. ౪. ౭౫.

౪. దొరకు, లభించు.

గీ. పులుఁగు పూరెడు ప్రియపడి పొలములందు,
మెలఁగి వెదకినఁ బుట్టదు మెతుకు లదఁగ.
హరి. పూ. ౭ ౫.

చ నముచినిషూదనాదులు మనంబున నొందిరి
ఖేదమోదముల్, ఖము గుడువంగ నోగిరముఁ
గట్టఁగఁ బుట్టముఁ బుట్ట కుండుటన్.
హర. ౭. ౩౧. కుక. ౨. ౫౧౧.

౫. గోచరమగు, కనబడు.

శా .దివ్యప్రభా, దట్టం బొక్కటి పుట్టెఁ గట్టె
దుర సంధ్యాలక్ష్మికిం బుట్టమై.
వసు. ౪. ౫౫.

౬. ఏర్పడు.

ఉ... వెల్లువ పుట్టెఁ దమ్మిపూఁబొట్టియులోనఁ
గానిదొంత కూరలు కాకముఁ జేరఁబోవఁ



గాఁ, బుట్టుట యెట్లు త్రోవ పరిపూర్ణదిశే
శ్వరమండలంబునన్. దశా. ౧ ౭౪.

వి.—పుట్టుక ౧ జన్మము. ఉద్భవము.

ఉ. ఇట్టిపదంబు గాంచి పరమేశ్వరునిం గృతి
నాథుఁ జేసి యే, పట్టునఁ బూజ్యమూర్తి
యగు భారతసంహితఁ జెప్పఁ గంటి నా, పుట్టు
గృతార్థతం బొరసెఁ బుణ్యచరిత్రుఁడ నైతి
నవ్విభుం, గట్టెదఁ బట్ట మప్రతిమ కారుణి
కత్వమహావిభూతికిన్
భార విరా. ౧. ౨౩.

సీ వలవంత లికువు కాంతలపుట్టు దూషించు
కారణంబులతోఁటికథలు తెలుప.
ఆము ౫ ౬౦
ఆం. భా. ౧. ౧౦౦

౨. మొలక, అంకురము.

సీ సకలదైవతబుభుక్షాపూర్తి కెవ్వాఁడు పుట్టు
గానని మేనిమెట్టపంట మనుచ ౧ ౧౭.

౩ (గ్రహాదుల) ఉదయము, పొడుపు.

శా...అప్పట్టునం, బుట్టుంగెంపున నింపు మీఱు
రవిబింబుం బెంపి దట్టంపుకెం, బట్టుంబుట్టము
రంగు నింగిరమ కాపాదించుదివ్యప్రభా,
దట్టం బొక్కటి పుట్టెఁ గట్టెదుర సంధ్యా
లక్ష్మికిం జొట్టమై. వసు ౪ ౫౫.

—పుట్టుకర్మలు = పుట్టినదిమొదలు కర్మములే
ప్రధానములని సిద్ధాంతించి చేయువారు
(పూర్వమీమాంసకులు)

ద్వి. వారు కేఁటికిఁ బుట్టుకర్మ లైనట్టి, మీర
లీయర్థ మెమ్మెయి నెఱుంగుదురు.
ద్వి పరమ. ౫. ౩౫౭.

—పుట్టుముని = పుట్టినదిమొదలుగా లౌకిక
ప్రవృత్తులందు విరక్తికలవాఁడు.

ద్వి. తనుఁజోలుపుత్రరత్నముఁ బ్రసాదింతు,
ననఁగ నమ్మితిఁ గాని యున్న యీ పుట్టు
ముని నైననిన్ను నిమ్మల నిచ్చుకొలఁగ.
ద్వి. పరమ. ౩. ౧౫౩.

జః పుట్టంధుఁడు, పుట్టించు, పుట్టినయిల్లు, పుట్టినిల్లు, పుట్టిల్లు, పుట్టుఁగల్లరి, పుట్టుఁగవచము, పుట్టుఁజీకు, పుట్టుక, పుట్టుగట్టు, పుట్టుగుగట్టు, పుట్టుగొడ్డు, పుట్టుగొడ్రాలు, పుట్టుగ్రుడ్డి, పుట్టుగ్రుడ్డు, పుట్టుచెయువు, పుట్టుపాప, పుట్టుబడి, పుట్టుబోగి, పుట్టుభోగి, పుట్టుమచ్చ, పుట్టుమాఁగ, పుట్టువ, పుట్టువడుగు, పుట్టువు, పుట్టువుకట్టు, పుట్టువెజ్జు, పుట్టిన్లు.

**పుట్టుఁగల్లరి.** విణ. (√పుట్టు) పుట్టినది మొదలు కొని కల్ల లాడువాఁడు, అజన్మానృతవాది.

గీ. పుట్టుఁగల్లరియై పాపములకు నెల్లదిట్టయై లోకములచేతఁ దిట్టువడినకట్టిడికి నిట్టికష్టంబుగా నొనర్చితిగ విధాత్రుఁడు చతురుఁడై నగడ నేఁడు. భార. అర. ౫. ౪౦౫

**పుట్టుఁగవచము.** వి. (పుట్టు+కవచము.) పుట్టుకతో నే కలిగినకవచము,సహజకవచము.

చ. సలలిత మైనపుట్టుఁగవచంబు నిసర్గజ మైన కుండలంబులయొగళంబు నొప్పఁగ నుప్రుత్రుఁడు కర్ణుఁడు పుట్టె...

భార. ఆది ౫. ౨౮.

**పుట్టుఁజీకు.** విణ. (పుట్టు+చీకు) పుట్టుక మొదలు గ్రుడ్డి యైనవాఁడు, జనుపాంధుఁడు, జనుపాంధము, గ్రుడ్డియైనది.

ఆ. పుట్టుఁజీకు వృద్ధుఁ బూతిగంధానను, జెడజడుని బొంద వెలఁది రోసి.

భార. ఆది. ౪. ౨౩౩.

ఉ. తప్పగ నే చేటు వారలకు దైవముకన్నులు పుట్టుఁజీకులే. కేయూర. ౩. ౩౩౦

**పుట్టుక=పుట్టు,పుట్టువు.** వి. (√పుట్టు) స్వార్థమునక ప్రత్యయము, అని. శ. ర. శ. పుట్టుకా. (జన్మము)

ఉ...ఈసమీరపుత్రుండు మున్నుఁ దాను కడ తొల్లిటిపుట్టుక నేకపాదరుగ్రం డితఁడంచుఁ గొండలు బుధుల్ గణింతురు... ఉ. రా. ౫. ౧౩.

(ఉదయము,పొడుపు.)

సీ సకలదైవతబుధస్థానముప్తి కెవ్వానిపుట్టుకామని రేని మెట్టపంట. ఆము. ౧. ౧౯

**పుట్టుగట్టు=పుట్టుగుగట్టు.**

అ పుట్టుగట్టుపతిని బొడమితమ్ములవిందు, కిరణి... యయా. ౩ ౧౪౧.

**పుట్టుగుగట్టు=పుట్టుగట్టు.** వి (పుట్టుగు+కట్టు.) పొడుపుఁగొండ,ఉదయపర్వతము.

చ వలపుల కోఁడు సేయుకొడువం బడ కొంతయు రాజు మీఁఅ లోనలరుచుఁ జూడ వచ్చె నన నంతటఁ బుట్టుగుగట్టుమీఁదటఁ జెలివి వలిర్పఁ దామరలదేవర దోఁచిన

యయా. ౫. ౧౫౧.

**పుట్టుగొడ్డు.** విణ. (పుట్టు+గొడ్డు) పుట్టుకనుండియు గొడ్డుతనముకలది,కేవలవంధ్య. (శ. ర.)

**పుట్టుగొడ్రాలు.** వి. స్త్రీ. (పుట్టు+గొడ్రాలు) పట్టిగొడ్రాలు,కేవలవంధ్యయగుస్త్రీ.

ద్వి పుట్టుగొడ్రాలిని బురవీథివడుమఁ బట్టియాడ్చుచు రద్దుపద్దుచేయఁగను.

ద్వి. శ. పొ. ౩. ౧౭౫. పం.

**పుట్టుగ్రుడ్డి.** విణ. (పుట్టు + గ్రుడ్డి.) పుట్టుక మొదలు గ్రుడ్డియైనవాఁడు,జాత్యంధుఁడు.

మ. కవిరాజాగ్రణి పుట్టుగ్రుడ్డనుచు నీకంజాక్షికిం జెప్పి యయ్యకవితా విమానత జిహ్వాగ్రాత్రయుని కేర్పం జెప్పి... విప్ర. ౧. ౧౧౨.

సీ. ఇలఁబుట్టుగ్రుడ్డకు హితవర్యప్రీతి...

హంస. ౩. ౧౩౪

పుట్టు(గుడ్డు. విశే. (పుట్టు+గుడ్డు) గ్రుడ్డుగాఁ బుట్టినది. (పక్షి)

సీ. పుట్టు(గు డైవనీబూ మెఱ తేజికిఁ దగి లెదుపాకి వినిత(పతితి. కేం. పంచ. 8. ౧౭౧.

సీ. అలరాదలిగి దేఱువలదళోరంబులఁ బుట్టు(గు డ్లని పల్కెఁ బొలఁతికనులు. హంస. ౫. ౭౧౦.

పుట్టుచె(య్వు)యువు. వి. (పుట్టు+చెయువు) పుట్టినప్పుడుచేయు సంస్కారము, జాతకర్మము. (శ. ర.)

పుట్టుపాప. విశే. ౧. పుట్టువునందే సర్వశరీర మందుఁ బ్రుంగుడు కలవాఁడు, పుట్టుకతోడనే శ్వేతరోగముకలవాఁడు. (బ్రౌ. చి. ని. శ ర.)

౨. పుట్టినప్పటినుండియు ధర్మపాఖ్య మెఱుఁగక పనిపాపవశి నుండునది,అజాత,

సీ. అలిగి రొంతటిరాజాన్వాంధ్రసైనకు బట్టి పుట్టు పాపలఁ జేయరట్టుకర్తి. క్రీడా. ౧౭౯.

(నెల్లూరిమండలములో నిది రొుకతిట్టుగా వాడు దురు)

పుట్టుబడి. వి (√పుట్టు) పుట్టుక, ఉత్పత్తి (శ. ర బ్రౌ.)

పుట్టుబోగి=పుట్టుభోగి. విశే (√పుట్టు) పుట్టి నది మొదలుకొని భోగము లనుభవించువాఁడు.

క. ఇది పుట్టుబోగి దీనికిఁ గొద లేమియు లేక యుండఁ గూర్పుకరమ్ము. యయా. 8 ౧౩౪.

పుట్టుభోగి=పుట్టుబోగి. వి. విశే. (√పుట్టు) పుట్టినదాదిభోగములనుభవించువాఁడు.

ఉ. బాలుర పుట్టుభోగులు నృపాలకమాధవు లెందఱొచేఁ, దూలినవారు... చంద్ర. 3. ౭3.

ద్వి. నందనుండును నీవు జాతియు లేకలఁ, బొంద నోపరె పుట్టుభోగులు వినరు. ద్వి. పారిశ్చ. పూ. ౧౯౦౭. పం.

పుట్టుమచ్చ. వి. (పుట్టు + మచ్చ) పుట్టినప్పటి నుండియు దేహమునందుండెడి నల్లనిమచ్చ,తిల కాలకము. (శ. ర.)

పుట్టుమూఁగ. విశే (√పుట్టు) పుట్టుక నుండియు మూఁగయైనవాఁడు,మూఁగయైనది.

సీ పుట్టుమూఁగను తమ్మిపుట్టుగాఁ గైసేసి పగఁ గు ప్రసాదవైభవమువాఁడు. భాను. ౧. ౩.

పుట్టువ=పుట్టువు. వి. (√పుట్టు) జన్మము.

ఆ. పుట్టుపుట్టువయనఁ బొలుచు జన్మము .. ఆం. భా. ౧. ౧౦౦.

పుట్టువడుగు. వి. (పుట్టు+వడుగు) ౧ పుట్టుక నుండియు బ్రహ్మచారిగా నుండువాఁడు,ఆజన్మ బ్రహ్మచారి (శ. ర)

౨. విష్ణువు,హరి.

గీ... పుట్టువడుగుకొమర బొక్కిలివాఁడు పనిఁ డి,వలుపతాల్పన హరి పేరులు... సాం ని. దేవ. 8.

పుట్టువు(గు)=పుట్టు,పుట్టుక,పుట్టువ.

వి (√పుట్టు) జన్మము.

క .ఇటపుట్టువుగాకుండెడు సక్తిమునవు(బ్ర హ్మాణకులమునం దయదుయ్యెడుజాతకా. భార అర. ౧. ౭౪8.

ఉ పుట్టుగుచెట్టుకున్మొలవఁబోసిన విత్తులు కాంతి ము స్తకా, మట్టియతోడి జీవములు... కవిక. ౫. ౧౭౦.

ఉ. ఏఁ,బోరచియాఁడు బుట్టువునఁబుట్టి నిరర్థక జీవనైతి సం,సారసుఖావహంబయిన నత్సుత జన్మముఁ గానఁబోలమిక. భార. ఆది. ౫. ౧౭౯.

జన్మసంబంధము.

ఉ. ఇక్కడ పిట్టకతో కలికిచన్నుల మిట్టన నేమి పుట్టువో, చక్కదిదికో వనిత సన్నపు మోవికి నేమి నాధియో... కళల. 3. 33

ఉదయము.

చూ. పుట్టుగుగట్టు

పుట్టువుకట్టు. వి (పుట్టువు+కట్టు) భవబంధము, సంసారమనెడి బంధము

రగడ ప్రాంతమిచ్చకొనల్ గనుంగొని బల్మి పుట్టువుకట్టులూడిచి అచ్చ రా. యు ౫౪.

పుట్టువెట్టి. విశే. (√పుట్టు) పుట్టినప్పటినుండియు వెట్టియైనవాఁడు,వెట్టిది (శ ర)

పుట్టెము. వి గుబురు,జొంపము

ద్వి మట్ట మై తలిరుజొంపములలో నొక్క పుట్టె మై లో నొండపొద వడకుండఁ, దలి రించి. ద్వి పరిమ ౪. ౧౫౭౦.

పుట్టిల్లు. వి జో (పుట్టిన+ఇల్లు, వృత్తివిషగ్ లోపము చి ని శ. ౯ ఘట్టిల్లు ఇంకను విచార్యము.) పుట్టిల్లు

సీ. అరిదిదీవులమేలు నవఘటింపఁగఁ జాలుచలిత కాంచీదామజఘనసీమ,గలిగి పుట్టింటి చిన్నెలఁ జెలఁగునట్టికలశవారాశిపట్టి... ఘటికా. ౧. ౨.

గీ మూఁడుమూర్తులపుట్టిల్లు మొదలివెలపు భాగ ౭ ౧౫౪.

(శ ర. పా పుట్టిల్లు ముద్రి. పా)

పుడమి. వి (సం పృథివీ, ప్రా పుడవీ క పొడవి. త. పుడవి) ౧ భూలోకము

సీ. అతఁడు గ్రమ్మఱ వాని కాధార మగుపారి జాతంబు పుడమి కేతెంచి దెచ్చె పారి. ౧ ౩౬.

గీ. ఎండు గుడి ప్రింగువారికి నంది పిండి,వడియు మనువ శ్కీఱుంగవే పుడమిలోన. విప్ర. ౨. ౨౩౭.

గీ. పుడమిలోపల మిథిల నాఁ బ్రోలు వెలయు. నీలా. ౧. ౨౬.

౨. నేల,భూభాగము.

గీ. పుడమి తిలకంబులన్యాయమున వెలుంగ. మనుచ. ౨. ౭.

ఆ పుడమి నేల యనిన భూవాచకం బగు... అం. భా ౨. 3. హర ౨. ౨౦.

3 రాష్ట్రము, ప్రజలతోఁగూడిన దేశము.

౪ పుడమియు రాజ్యము బంధుల,విడిచి .. భార. అర ౨. 3.

౪. ఒడఁబఱచి మాకు వారికిఁ,బుడమి సగము గాఁగఁ జేసి పొంది పొసఁగ యుం,డెడునట్టి తెఱఁగు సేయుట... భార. ఉద్యో. 3. ౩౬. భార. ఉద్యో. 3. ౪౧

జ పుడమికాన్పు, పుడమికాపరి, పుడమికాఱుపు, పుడమిదయ్యము, పుడమిగొర, పుడమిపట్టి, పుడమిబొట్టియ, పుడమిమగఁడు, పుడమిమోపరి, పుడమిఱేఁడు, పుడమివేల్పు

పుడమికా(నుపు)న్పు. వి (పుడమి+కానుపు)

౧ భూపుత్రి,సీత

ఆ పుడమికాన్పుమగనిఁ బొగడుచు నపు డాకు, టింటిప్రోడ యొండు నేసి జనియె. అచ్చరా బాల. ౧౯౭

౨ భూజము,వృక్షము.

గీ. మొవిచిగురును వలిగుబ్బ పూవుగుత్తు, లక్కజపుఁబల్కు తేనియ లరిదిలీల, గంటు కమ్మెదగిమ్ముసు గలిగి రాజుప్ప, పుడమికానుపుఁలేగొమ్మఁ బొగడఁ దరమె. అచ్చ రా. బాల. ౧౪౦.

ఇట్లే. పుడమిపుట్టుగు.

గీ పుడమిపుట్టుగు లతకాన పూపుఁబోఁడి, కొమ్మ పైపోడు మాకు భూజమ్ములార,

బ. బాలక్రీడా విశేషము.

గీ. మఱియుఁ బుడిశిళ్లు పెండలుగా మనసువచ్చు, నాట లన్నియుఁ దోడితో యవ్వలులఁ గూడి, పడుచుతనమున వేడుక పడుచు నాడు.

దశా. ౭ ౭౧.

సీ. బొమ్మల పెండ్లిండ్లు బువ్వపుఁబంతులు పుడిశిళ్లు పొట్టుక్కొ బొమ్మరిండ్లు, గుజుగుజ రేకులు గొబ్బిళ్లు నీగి బుడిశిళ్లు. హంస. ౫. ౧౫౫.

పుడిగ=పుదుకు. వి దానము, ఈవి

సీ ..దానవరా...గీ. పుడిశిరింతపుడిగ లేగముపుడు కనఁగ. . అం. భా. ౨. ౧౪౨.

పుడిసిలి. వి దే (బ. పుడిసిలులు, పుడిసిళులు, పుడిసిళ్లు.) ద్రవ్యమంచి దొప్పవలె కుదియఁ బెట్టిన అఱచేయి, చులుకము.

ద్వి. పిడికిట నడఁగునే పేర్చుకాలాగ్ని, పుడిసిట నడఁగునే పొంగారుజలధి.

రం. రా. యు. ౨౯౩. పా. ౨౯ పం.

సీ. ఈ జగజ్జాలంబు నోదకము చేసి చెల్లఁ గ్రోలుడుఁ బుడిసిళ్లఁ బట్టి. ప్రబోధ. 3. ౩౯.

సీ...పెట్టడఁచెఁ గాడ, గీ. యతఁడు పుడిసెఁడు నీరవ... భార. అశ్వ. ౧. ౭౪.

గీ.. పుడిసిలి యన, భాపిలు నికుబ్జచతురంగుళీ సమాఖ్య. అం. భా. ౨. ౧౪౦.

జ. పుడిసిలించు, పుడిసిరింత.

పుడిసిలించే. స. క్రి. (√పుడిసిలి.)పుడిసిటఁబట్టు.

చ...చండదిశాగజదండకాండముల్, విజురుగా వారిధుల్ పుడిసిలించుగా మందర మంగు టంబునన్, జేఱుముడాకే...

భార. అర. ౨. ౧౦౪.

ఓ...శాంతశాంతములు శేగు,రింపఁ గోపంబు చెనుట వర్షింప హాస్తమున వియద్గంగనలి లంబు పుడిసిలించి, వరాహ. ౧౦. ౬౫.

జః పుడిసిలింత.

పుడిసిలింత. వి. (√పుడిసిలించే) పుడిసిలించుట, పుడిసిటఁబట్టుట. (శ. ర.)

పుడుఁకులు=పుఱుఁకులు. వి. బ. భక్ష్య విశేషము.

వ పుడుఁకులు నడుకులు ..కాశీ. ౩. ౧౭౫.
(బుడుకులు...శ. ర. పా.)

పుడుక. వి. (√పుడుకు) ౧. తృణకాండము; సన్ననిపుల్ల.

చ. కలహము పెట్టికొంట పుడుకల్ సుఱు మాడుట పెక్కు వాక్యముల్, పలుకుట. . పెల్లలునలికే సికొంటకుశలత్వతిరిక్తము శల్ల వారికి. సిద్ధేశ, 3. ఆ. (చి. వి.)

గీ...పుల్ల, పుడుక యనఁగను దృణకాండము చను . అం. భా. ౨. ౪౬.

(అం భా. లోను కొన్నిముద్రితప్రతులలోను ఈపదము అన్యార్థ్యముగా నున్నను,వ్యుత్పత్తిని బట్టియు, చి వి. శ. ర. మతములనుబట్టియు ఈన్యార్థ్య మనుట యుక్తము.నిర్ధారకప్రయోగ ములు కాన రాలేదు.)

ఉదా. చీపురుపుడుక,పూరిపుడుక, మొ.)

౨ సమిధ,కట్టెపుల్ల.

గీ. అమరపతినందనుఁడు పాద వడఁగి చనిన, ననురిమాయయు నడిపోయె నట్ల కాన్క,యుదరి దరికొని మండుతీవ్రానలంబు,పుడక లెడగల్గ నైచినఁ బొనుఁగునదడె. నిర్వ. ౬. ౧౧౦.

గీ. అగ్గి రవులించి యావాలు గుగ్గిలంబు,కడిపుడు కలు కానుగచిదుగులు...

అచ్చ. రా. యు. ౪౩౭.

3. పుల్లవలె నుండి పట్టుకొని త్రిప్పుట కుపయో గించురాట్నముయొక్క అవయవవిశేషము.

సీ. పుడుకఁ ద్రిప్పుడురయంబునఁ దైఁట జాఱుచో మిసుకుసుబ్బులు తఱ కృతి రవింప. కుశ. ౨. ౪౨౧.

—ముక్కుపుడుక = స్త్రీ. నాసాభరణవిశేషము. (గ్రా. వా.)

—పుడుకకుఁ గొఱగాదు = పూరిపుడుక పాటిదైన నుపయోగపడనిది.

క. పొదవుడు జిక్కఁ దనంబును, గడుఁబల మైనట్టి రొమ్ములుఁ గలిగియుఁ గలకు జడబుద్ధి యయ్యె నేనియుఁ, బుడుకకుఁ గొఱగాదు వానిపుట్టువ దేలా. వా. పంచ. ౨. ౨౨౬.

(పట్టి పనికిమాలినది. అని తాత్పర్యము.)

—పుడుకవిఱుచు = కొండెములు చెప్పి మనసు విఱుచు.

తే. అని చెలి పుడుకలు విఱిచినఁ, గనుఁగొని యది క్రొత్తగుమ్మ గావున మన సొగ్గిన నదియును నేనొక్కనిఁ, గొని వచ్చెద నూరిబైటి పడికి కదలి సనుచున్. శుక. ౧ ౪౪౨.

ద్వి. పుడుకలు విఱిచి రేపును మాపు వచ్చి
ద్వి. పరమ. 3. ౨౭౦. పా. ౫. పం.

తనకొలఁదిపుడుక లేఱు = తనస్థితికిఁదగిన ప్రసంగము చేయు.

క. తఱుసంటి దన్ను నెదిరిని, నెఱుఁగఁడు దన కొలఁదిపుడుక లేఱఁడు ..
కు. సం. ౪. ౯౭౦.

సా:—ప్రజ్ఞయు పుట్టినబుద్ధి పుడుకలతోఁ గాని పోదు = సహజమైనబుద్ధి చచ్చువఱకుండును.

పుడుకబావిలి. వి. (పుడుక + బావిలి.) స్త్రీ. కర్ణభూషావిశేషము. (శ. ర.)

పుదు(ఱు)కు. స. క్రి. ౧. (వాత్సల్యముచేతఁ గాని మోహముచేతఁ గాని చేతివ్రేళ్లతో పట్టుకొను.

ద్వి. చిప్పకూఁకటి దువ్వి చెక్కిలి పుదికి, తప్పక చెక్కుంతతదళ్ళ చుంబించి.
రంగా. బాల. ౭౪. పా. ౯. పం.

సీ. కలికిరై ముద్దాడఁ గాఁగిట జేర్చుచుఁ బోఁడి కుచములు పుదికిపుదికి.
భాగ. ౧౦. ఉ. ౬౯౨.

చ ..పిఱుందునఁ గే లమర్చుఁ జెక్కిలి పుణుకఁజు గవుంగిటను గీల్కొలుపున్...
యయా. ౫. ౧౨౫.

౨. పట్టు, పిసుకు.

వ. భూసురుం జేరి లోకరక్షణప్రశస్తంబైన హస్తంబున నతనియడుగులు పుదుకుచు మెల్లన నిట్లనియె. భాగ. ౧౦. పూ. ౧౬౯౭.

సీ. మెఱుఁగసంటులవంటి చిఱుఁదొడల్ పుదికిన నంగంబు పులకించునట్టివేళ. శుక. ౧. ౨౧౧.

సీ నడుము పట్టెద నంచు సాధుని చిఱుతొడల్ పుదికిన ఛీ యనిపారలునవల.
హంస 3 ౨౦౧.

3. (క. పుదుకు) నిమురు, తడవు.

ద్వి పేలలు పుదుకుచు నిగిడినపగల, వాలుఁ గన్నుల నీరు వఱదలై పాఱ
ద్వి. పారిశ్చ. ఉ. ౧౯౪౬. పం

క. తొలిజోడి తూయ శిష్యులఁ, దెలుపుచు గాక ముఁడు నదికి దిగ్గన నరిగెన్, బలభేదియుఁ గొనఁ జీకటిఁ, బొలతుకయిలు సొచ్చి మేను పుణుకఁగ నదియున్. పద్మ. 3 3౧.

చ. కరమున రొమ్ము పుణ్కి శివుఁ గానక తోచక గతాసుఁడై ధరన్, దొరగినఁ గాంచి భీతిలుచు... చెన్న. 3. 3౨౫.

౪. చిదుము, త్రుంచు.

క. ఏకేవము ధరియించిన, నాకేవము ... నందమై యద్ధాత్రి, దేవుఁడు పెట్టునఁ బుడికిన, భావంబున నుండు రూపు ప్రాయము కలిమిన్. కాశీ. ౪. ౨3౨.

సీ. కాకోదరస్వామి కంఠ కాళంబులు పుదుకు దుకొ కొక్కఱాఁటలాగు.
రాజ. ఉ. ౨. ౫౪.

క. కలుషించి విరించిభుజ,మ్ములు ద్రొక్కి తదూ
ర్ధ్వశిరము పుడికెఁ గరరుహాం,చలమునఁ...
వరాహ. ౧౨. ౩.

౫. (చిన్ని పాతకోకవస్త్రాదులను ప్రోక్కోనలతో) పీకుకొను. (ఈయర్థమున ఆత్మనే పదరూపముతోనే యుండును)

ఉదా:—సంధిరొుత్తి వాఁగు ఒడలు పుడుకుకొనుచున్నాఁడు)

౬. కొంచెముగా గ్రహించు.

గీ. పుట్టలిసుమంత లిదనిదఁ బోదలు కొటేఁగి,
పుడుకఁ బుడుకంగఁ గాటుక పోకఁ జూచి,
విత్తసముపార్జనవ్యయవృత్తులందుఁ, జిత్త
మిడికవర్తకునకుఁ జేటు గలదె
విక్ర. ౨ ౧౪౦.

౭. ఇచ్చు,దానముచేయు.

క. అడిగెడువారలు మునుమయి,పుడికెడువాఁ
డొకఁడు లేక పురుషాల్పతయై,పడఁతులు
తఱచై కులములు,సెడి యన్యులు ప్రబలి
జగము శిథిలత నొందెన్
హరి ఉ ౯ ౪౧

గీ. భూమిసురులకు నింతైనఁ బుణుక నోప,బిడ్డ
లకుఁ బెట్టి యింకనైనఁ బెంప వలయు,
నెవ్వరైనను మనకు ము న్నిచ్చిరయ్య,యూ
రకేయుండు మింటిలో నోపవేని.
కేవ. ౧ ౯౪ దశకు ౫. ౧౪.

వి. ౧. ఈవి,దానము

సీ. దాన మాఁ బాగము పెట్టొసఁ గిగి యీవి,
పుడుకురింత పుడిగ తేగము పుడు కనఁగ.
ఆం ధ్రా. ౨. ౧౪.౨.

౨. కానుక,బహుమానము.

ఆ... మేల్మి,రతనముల దనర్చురవణమ్ములను బట్టుఁ
బుట్టములను మిగులఁ బుడుకు లంది.
నీలా. ౨. ౫.

క. పుడ్కుటలకొల కప్పదు గడు,బిడియడి యిడు
కొని కడించిచేదబములతో,వడివడి వెలవెలఁ
దుల వెం,బడి వడకెంచిరి పొరిఁబొరిఁ
బ్రాయపుఁబోఁజాఁగుల్.
అచ్చ రా. అయో. ౧౪.

—పుడి(ది)కిపుచ్చుకొను = పూర్ణముగా
గ్రహించు

క ఇలకేఁడు కొనకకమద,కులనై పుణి పుణికి
పుచ్చుకొనిరొు మురారీ. బహు. ౧ ౧౨౦.

సీ ఎగుబుజంబులవాఁడు మృగరాజమధ్యంబు
పుడికి పుచ్చుకొనుచెన్నడుమువాఁడు
విజ వి ౨ ౧౬౪.

(ఇట ఔపమ్యద్యోతకము)

జ' పుడికిరించు, పుడికిరింత, పుడికిలి, పుడుక,
పుడుకబావిలి, పుడుకుఁగల్లు, పుడుకుఁజెట్టు,
పుడుకుఁదొడుకు, పుడుకుఁబని, పుడుకుబాన,
పుడుకుమ్రాను.

పుడుకుఁగల్లు. వి (పుడుకు + కల్లు) ఈవుల
తాయి,చింతామణి

గీ పుడుకుఁగల్లలజెట్టికై పాదమినట్టి,మెట్టవా
ల్పిట్టరాకునిదిట్టకేల్పు,క్రచ్చు లొడఁగూర్చి
మము నిచ్చఁ గాచుఁగాక
అచ్చ. రా. బాల. ౭.

పుడుకుఁజెట్టు. వి (పుడుకు+చెట్టు.) కోర్కుల
నిచ్చుచెట్టు,కల్పవృక్షము.

సీ. చుట్టుఁగైదువుటోడు గట్టులరొుకిమీనిఁ
బుడుకుదొడుకు మఱి పుడుకుఁజెట్టు.

గీ గబ్బు...రామభూభుజుని యశము.
రామ. ౨౧౩.

సీ. దుగతిగకొంగములజగజెట్టితోఁబుట్టు పొగడు
వారల పట్టుపుడుకుఁజెట్టు.
అచ్చ. రా. బాల ౪.

పుదుకుఁదోఁడుకు. వి. (పుదుకు + తోఁడుకు.) కామధేనువు.

ఆ. పిన్నకోరియశము పెన్నుకేకాకాళి, విన్న
వాకఁబలుకువెలఁదిఁ బుదుకుఁ, దోఁడుకు
దక్కఁగొని వాదలిచూపాదయని, మేటితేజఁ
బోలు దీటులేమి. రామ ౧౯౪

క. ఉదుకా విడ కున్నది మది,పదుకా మిదు
కంగ నుఱక పఱవం జనుకోఁడుకా నదు
కానల కిటు, దుదుకా నాపాలిపుదుకుఁ
దోఁడుకా నీకుఁ అచ్చ రా అయో ౯౨

పుదుకుఁబసి. వి (√పుదుకు). కామధేనువు

సీ. పచ్చలగనులపైఁ బసిమి పచ్చిక యంచు వడి
మేయ వచ్చినపుదుకుఁబసులు
యయా. ౨ ౩౫

పుదుకుబాన. వి (పుదుకు+బాన) అమృతకలశము, సుధాకుంభము.

చ. కమలనిభాస్య యోర్తు చషకంబున మద్యము
నిండఁ బోసి యిం,ద మనుచు నొక్క
చంద్రముఖిఁ దార్కొని యిచ్చిన వారి
వక్త్రము, గ్మము ప్రతిబింబముల్ దనరెఁ
గంజసుధాకరు లబ్జసామలా,భములకుఁ బోరు
చుస్ బుదుకుబానకు నందు మునింగిగో
యనఁ వి. పు ౧ ౪౭

పుదుకుమ్రాను. వి (పుదుకు+మ్రాను కామితార్థమునిచ్చుచెట్టు) కల్పవృక్షము

సీ. వేల్పురాయఁడు బత్తి వెలయఁ బుత్తెంచి
నపుదుకుమ్రాన్వలితావిపూవుటెత్తులు .
అచ్చ రా. అర. ౫౯

గీ. కొండవీ డేలు వేలుపుఁగూడి పాల, కదలి
నడుచక్కి బలుమానికములదీవిఁ, బుదుకు
మ్రాఁకులు మాకెల్లఁ బొదలి పొదలు, కడిమి
పూఁదోఁటలో నాడుగరితఁ దలఁతు.
అచ్చ. రా. బాల. ౨.

పుణుఁకులు=పుదుఁకులు. (శ. ర)

పుణుకు. వి. మత్స్యగ్రహణ సాధనము.

గీ. ఉంటగాలంబు తెర దీము లుసురుగాల,
మెుసుకు గోరక పుణుకు సొక్కు లెసఁగు
చుండు హంస ౪. ౧౭౪.

పుణ్య. సం వి ఆ స్త్రీ ౧ గంగానది.
౨ అర్ఘ్యము.

పుణ్యకము. సం వి అ న పుణ్యముకొఱకయిన ఉపవాసాగివ్రతము

పుణ్యకర్మము. సం విశ (న. అ. న న) ధర్మకర్మముతోఁగూడినది వి న న ధర్మకార్యము, సత్కార్యము

పుణ్యకాలము. సం వి అ పుం శుభకరమగు కాలము.

పుణ్యకీర్తనము. సం వి అ న పురాణాదులను జదువుట, పుణ్యవిషయములను చెప్పుట

పుణ్యకీర్తి. సం విశ ఇ ఎవనిని గీర్తింపఁగా పుణ్యము గలుగునో యట్టివాఁడు
వి. ఇ. స్త్రీ పుణ్యమును గలిగించునట్టి కీర్తి

పుణ్యకృత్తు. సం విశ. (త్ ) పుణ్యమును (ధర్మమును) చేసినవాఁడు

పుణ్యకృత్యము. సం. వి. అ న. పుణ్యమును గలిగించునట్టి కార్యము

పుణ్యక్షేత్రము. సం వి అ న. పవిత్రభూమి.

పుణ్యగంధము. వి అ. పుం. చంపకము, సంపెంగ.

పుణ్యగంధి. సం. విశ. (ఇ.) శుభావహగంధ దేశముతోఁ గూడినది ఇంచుక శుభావహమైనది.

పుణ్యగంధికము. సం. వి. అ. న. తెల్లతామర పూవు, పుండరీకము. (వై. ని.)

పుణ్యజనుఁడు. సం. వి. అ. పుం. ౧. రాక్షసుఁడు, ౨ యక్షుఁడు, ౩ సజ్జనుఁడు. ౪. ఐ. ప్రాచేతసపుత్రులు (వీరు పదుండ్రు)

పుణ్యజనేశ్వరుఁడు. సం. వి. అ పుం కుబేరుఁడు, జక్కులరేఁడు.

పుణ్యతీర్థము. సం. వి. అ. న పవిత్ర మగు తీర్థము

పుణ్యతృణము. సం వి అ. న శ్వేతకుశము, తెల్లదర్భ శ.

పుణ్యదర్శనము. సం విణ (అ. ఆ. అ) ౧. పావన మైనదర్శనము గలది (దేవప్రతిమాది) ౨ అందమైనది

వి అ. పుం. చాషపక్షి, పాలపిట్ట

న పుణ్యక్షేత్రాదులను దర్శించుట.

పుణ్యఫలము. సం వి అ న పుణ్యముయొక్క ఫలితము, పుణ్యరూపమగుఫలము వి అ పుం లక్ష్మికి నావాసమగు వనభేదము (వాచ)

పుణ్యభాక్కు. సం వి ఇ (జ్) పుం. పుణ్యమును బొందినవాఁడు.

పుణ్యభూమి. సం వి ఇ స్త్రీ ఆర్యావర్త దేశము.

పుణ్యము. సం. విణ అ. ఆ అ ౧. సుకృతము గలది, శుభాదృష్టమగు ధర్మము గలది ౨. శోభన కర్మముతోఁగూడినది. ౩. పావనము, పవిత్రము. ౪. సుందరము, మనోజ్ఞము, ౫. సుగంధి, మంచి వాసనగలది. వి. అ. న ౧. శుభాదృష్టము, ధర్మము ౨ సుకృతము, సత్కర్మము, ౩ పవిత్రత, ౪. పశువులు నీరుత్రాగుతొట్టి, ౫. భర్తృప్రేమము కానపాగుటకు పుత్రుఁడు కలుగుటకును భార్య చేయువ్రతము కొందలగు కర్మవిశేషము. (జ్యోతి) ౬. లగ్నమునకుఁ దొమ్మిదవ స్థానము ౭. వర్షాకాలికమగు సహామభేదము, ౮. బంగారు. ౯. నీరు, జలము. ౧౦. పూర్వ (వై. ని) ౧౧. ఆకాశము (శ. ని) ౧౨. మేష కర్కట తులామకరములను రాసులలో నొకటి.

పుణ్యయోగము. సం. వి. అ. పుం. పూర్వకృత పుణ్యఫలమును బొందుట.

పుణ్యలోకము. సం. వి. అ. పుం. ౧. పుణ్యముచేఁ బొందఁదగులోకము, (చంద్రలోకాది.) ౨. ధర్మిష్ఠజనము.

పుణ్యవంతుఁడు. సం. విణ. (త్. తీ త్) ౧ సుకృతము గలవాఁడు. ౨. భాగ్యవంతుఁడు, మంచి యదృష్టముగలవాఁడు. ౩. సుందరుఁడు. మనోజ్ఞుఁడు.

పుణ్యశ్లోకుఁడు. సం. విణ (అ. ఆ అ) పుణ్యము కలిగించుకీర్తిగలవాఁడు. ౨. పుణ్యచరితగలవాఁడు. ౩ ప్రియంవదుఁడు

పుణ్యసహామము. సం వి. అ. న. (జ్యోతి) సహామభేదము (వాచ)

పుణ్యసాగరము. సం. వి అ. న. పుష్కరము. పుష్కరమూలము. శ. (రా. ని)

పుణ్యస్థానము. సం. వి. అ న. పుణ్యక్షేత్రము. పుణ్యమునుగలిగించు స్థానవిశేషము. ౨. (జ్యోతి) లగ్నమునకు తొమ్మిదవస్థానము.

పుణ్యాత్ముఁడు. సం. విణ. (న్. ఆ, న్. న్) పుణ్యస్వభావుఁడు. పుణ్యస్వరూపుఁడు.

పుణ్యాహము. సం వి. అ. న. పుణ్యదినము.

పుణ్యాహవాచనము. సం. వి. అ. న. దైవాది కర్మ ప్రారంభమునందు మంగళార్థము చేయు శుభకర్మము.

పుతపుత. వి. తహతహను బాధను తెలుపుటయందగుననుకరణము.

(చూ: పుతపుతమను, పుతపుతపోవు.)

జః పుతపుతమను, పుతపుతపోవు.

పుతపుతమను. అ. క్రి. (పుతపుత + అను.)
౧. తహతహపడు, తమకించు.

క. మునినాథ పురోడాశం,బునకుం గడువాఁచి నోరు పుతపుతమనఁగా, నిను వేఁడెద యజ్ఞములకుఁ, జని యింపుగ దాఁచి తెచ్చి చవి చూపఁగదే. వి పు. ౬ ౧౬౫

౨. నొచ్చు,బాధనొందు.

చ. ప్రతిదినకేళలంఘనపురాయిడి సెట్టనఁబట్ట గట్టి పైఁ, బుతపుతమంచు నున్నకుఱుబోడ తలన్ ధరియింప నోడియన్ సతముగ సొమ్ము గాన నిడఁ జాలవుగా శిఖపింఛవల్లి సా, గతమతధుర్యదానిఁ గటిఁ గట్టుము పుట్టము మిన్న కేటికిన్ పాండు. ౨. ౬౪.

(వ్యవ) ఆమాట విన్నది మొదలు నామనసు పుతపుతమను చున్నది

పుతపుతవోవు. అ క్రి (పుతపుత + పోవు.)
౧ తహతహపడు, తమకించు.

చ. అతులితభావగర్భితము లైన మృదూక్తులచేతఁ గరిగిక, బుతపుతవోవు చున్ననృపపుంగవు చిత్త మెఱింగి.. వి క్ర ౪ ౨౨౧.

౨ నొచ్చు,బాధనొందు

గీ ఎంత చేసిన నంతంత లెక్క లైన,బలముఁ జలమును జూప కాంథవరుజావ, రుండు రుక్మిణీపరు జ్వరరోగరాజు, భుజము లద్ధతిఁ బుతపుతపోవఁ గిఱుచి, ఉ హరి ౬. ౧౦౪

(శ. ర పా పుతపుతఁబోవ ముద్రి పా)

పుతిక. వి బిచ్చము.

సీ. జక్కరక్లిడ చౌవంచకోలములు పుతిక బోనమ్మ అచ్చ రా. యు. ౫౯౫. (ప్రయోగాంతరము కనఁబడలేదు)

పుత్త. వి. (సం. పృష్ఠమ్. ప్రా. పుట్ఠ.) పృష్ఠము (శ. ర.)

పుత్తడి¹. (౧) వి. (క. పుత్తళి. తు. పుత్తలి.) బంగారము.

చ .తమ్మికెం, పులు గదియించినట్టిజిగిపుత్తడి ముక్కలిపీఁటమీఁద .. నీలా. ౧ ౬౧

ఉ పెండ్లికొమార్తెఁ జేయఁ దని పెద్దలు బల్కమిటారితక్కువూఁ, బోండ్లు నృపాలపుత్రికను బుత్తళిమేల్జిగిపీఁట నుంచి...
కృష్ణ ౪ ౩౫ ద్వి శ. పా ౧ ౧౯౬. పం.

జ. పుత్తడిపొలదిండి, పుత్తడిబొమ్మ

పుత్తడి². వి (సం పుత్తలీ. క పుత్తలికె) వస్త్రదంత కాష్ఠాదులచేఁ జేయఁబడిన బొమ్మ, పాంచాలిక

మ పురుషాకారముతోడ నున్న శిఖియో పుంస్త్వంబు లేదో యి దే,తరువో పుత్తడి రూపొ చిత్తము ను జైతన్యంబు శూన్యంబు బోకో, విరసత్వంబులప్రోవొ నిర్భరకళా విజ్ఞానసర్వస్వమో, యను దీచందమ నంగ నిల్చె ధృతియం దస్పందమందస్థితిన్
నృసిం. ౨ ౭౭.

చదువుపుత్తడి = విద్యామయమగుబొమ్మ, సరస్వతీదేవి

ఉ పుక్కిటియోపరిం జదువుపుత్తడి హత్తిన పెద్ద సైన మ్రోగొ క్కొకపేళ పాటవము నొందమిఁ జందినఁ జక్కఁబెట్టువా రు...
పాండు. ౫ ౨౧౭.

పుత్తడికాసు. వి. మత్స్యవిశేషము.

సీ. వాలుగు మువదొమ్మ పల్లికతట్ట పుత్తడికాసు పూమీసు కడిసెలంబు. హంస ౪. ౧౭౩.

పుత్తడిపొలదిండి. వి (√పుత్తడి¹) హిరణ్యాక్షుఁడు.

సీ. పుత్తడిపొలదిండి గొత్తు రేనవలాలఁ గన్నబాలెంతకుఁ గాపుబొట్టు. చంద్రా. ౩. ౧౦౧.

పుత్తడిబొమ్మ. వి. (√పుత్తడి¹) ౧ బంగారు బొమ్మ,సువర్ణవిగ్రహము.

వ...శ్రోత్రోత్సవుంగుచ్చా,డప్పున నడ నేర్చుచిత్తిరువు పోలిక పుత్తడిబొమ్మ భాతి మెర్పువానగతి తోడ మంగళగృహంబునకు గానిపోయి యచ్చట. పి. కళం. ౪. ౧౪౨.

క. చిత్తజమహాగ్ని కాంకల,నెత్తు దతిగి పన్నె రొయిక్కా నెంతయు నెమ్మో, నత్తరుణికి జను లందఱుఁ, బుత్తడిబొమ్మ యనుమాట బొం కేల యగుట ప్రభా. ౪ ౩౭

సీ ఎదఁదఁ గాఁపురపుఁబుత్తడిబొమ్మనిడువాలు గన్నులా యీవాలుగన్ను లరయ దశా ౧. ౧౬౪.

(బంగారు బొమ్మవంటి స్త్రీ అని భావము)

పుత్తలకము. సం. వి. అ. పుం కవాదులకుఁ బ్రతిమాత్రిగా పత్త్రాదులచే రచింపఁబడిన వస్తువిశేషము (చూ. పర్ణనరుఁడు)

పుత్తలము. సం. వి అ. పుం. విగ్రహము, వస్త్రు దంతకాష్ఠమృదాదులచేఁజేయఁబడినబొమ్మ

పుత్తళి. సం. వి ఈ. స్త్రీ. విగ్రహము, వస్త్రు దంతాకాష్ఠమృదాదులచేఁజేయఁబడినబొమ్మ.

పుత్తిక. సం. వి. అ స్త్రీ పెరయీఁగ, పతంగిక. ౨. చాపిక, మెట్టతోఁటకూర. ౯. ౩. చెద పురుగు. (విల్యమ్సు)

పుత్తెంచే. స. క్రి. (పుచ్చు+ తెంచు,స్వార్థమున. దీనికి "పుత్తేరఁ, పుత్తేఁ, పుత్తేరక, పుత్తేక, పుత్తేరఁడు, పుత్తేఁడు, పుత్తెమ్ము, పుత్తెండు." మొII రూపములగును.) పుచ్చు, పంపు, పోవఁ జేయు.

అ. భూతలేశ నన్నుఁ బుత్తెంచి రిప్పుడు... భార. ఆది. ౨. ౧౮౦.

వ...చోడగంగ్గదేవర తమ్ముణ్ణు ఊలగుయ్య వందపెమ్మాడియు బిరిదేవులు వల్లవమహాదేవులును శ్రీమద్దాక్షారామ భీమేశ్వర... పూజయందుల చందన కర్పూరములకు నిశే ద్యమునకు నా చంద్రార్కస్థాయి నడమునట్టి గంగగొణ్ణచోడశైరాగి యాణ్డారిచేతం బుత్తెంచిన మాట ఇరు... (ణ్డు) మాతలపం దగు పెలగాంజేరాని ..

ద. శా. ౪. ౧౧౭౬.

క ఆసవమున కని నీదుని,వాసమునకు దివ మలోఁ నవశ్యంబును నే, నానుదతిం బుత్తెంతు ని,జాసక్తి ఫలింపఁ గొఱలు మఖి మతశేఖర. భార. విరా. ౨. ౭౧.

గీ తెలివ యిన్నాళ్లు నడుగఁ బుత్తేఁడు నిన్ను, నరయనిది తప్పుగాదె .. సైమ. ౩. ౧౨౩.

ద్వి. ఏకత్క్షణంబున నెడపక నియతిఁ, జేకొని నీమేలు చెప్పి పుత్తెమ్ము.

రం. రా బాల. ౭౨ పా. ౧౫. పం.

మ...తిరిగెడుకా దవ్వై జరాసంధుఁ డి,ట్లని మిత్తెంబు నశింప నేమిటికి మీ రారాజ సాత్త్వపరా,ధునిఁ బుత్తెం డిట నస్మదీయ సమహోద్రోక్మీల లక్ష్యంబుగన్.

హరి. ఉ. ౧. ౧౧౧.

గీ. అతఁడు ప్రార్థించి పుత్తేర నరుగుదెంచెఁ, బొలఁతిచెంతకు నందుకుఁ బ్రౌఢ గ్రంథ.

శుక. ౨. ౬౫.

పుత్రంజీవకము. సం. వి. అ. పుం. పుత్రజీవక వృక్షము.

పుత్రిక. సం. వి. అ. స్త్రీ. ౧. కూఁతురు, కన్య. ౨. పుత్తళి, బొమ్మ. ౩. యావకతూలము, లక్కదూది. ౪. పుత్రులు లేనివాఁడు ఎవతిని బుత్రికగాఁ దలంచుకొని దాని కడుపునఁ బుట్టిన కొడుకును దన వంశకరునిగా స్వీకరింపఁదలఁచునో యట్టి కన్య. ౫. స్వల్పార్థకము.

పుత్రకంద సం వి అ స్త్రీ లక్ష్మణా కందము ?

పుత్రకము సం వి అ పుం ౧ శరభము ౨ శైలభేదము ౩ వృక్షభేదము, ఉప్మొత్తె ? ౪ పతంగము ౫ బొమ్మ

శ్లో మన్దాకినీసైకతవేదికాభిస్సాకందుకైః కృత్రిమపుత్రకైశ్చ, రేమే ముహుర్మధ్యగతా సఖీనాం క్రీడారసం నిర్విశతీవ బాల్యే

సం కు సం ౧ ౨౯

పుత్రకామ్య సం వి అ స్త్రీ పుత్రులు కావలెనవెడి కోరికగలది పుత్రేప్సితం

పుత్రకుండు సం వి అ పుం అనుకంప్యజనుండు (ఇది ప్రేమ, అనుకంప మొదలగువానియందుం బ్రయుక్తము) ౨ పుత్రుండు,కొడుకు

పుత్రకృతకుండు సం వి అ పుం పుత్రుండుగాం బెంచుకొనంబడినవాండు

శ్లో యస్యాత్వయా వ్రణవిరోపణ మిఙ్గుదీనాం, తైలం న్యషిచ్యత ముఖే కుశసూచివిద్ధే, శ్యామాక ముష్టిపరివర్ధిత కోజహాతి, సాయం నపుత్రకృతకః పదవీం మృగస్తే శకుం ౪ ౧౪

పుత్రజీవము సం వి అ పుం పుత్రజీవిచెట్టు

పుత్రద సం వి అ స్త్రీ ౧ వంధ్యాకర్కోటకి ? ౨ లక్ష్మణాకందము ? ౩ గర్భధాత్రీ రూపము ?

పుత్రదాత్రి సం వి ఈ స్త్రీ మాళవదేశమందుం బ్రసిద్ధమగు లతావిశేషము ?

పుత్రభద్ర సం వి అ స్త్రీ బృహజ్జీవంతి ?

పుత్రశృంగి సం వి ఈ స్త్రీ జట్టుపు,అజశృంగి ?

పుత్రశ్రేణి సం వి ఈ స్త్రీ మూషికకర్ణి,ఎలుకచెవిచెట్టు

పుత్రి సం విశే (కా ఓ కా) పుత్రులుగలవాండు

పుత్రిక సం = పుత్రక (ఖడ్గపుత్రిక,అసిపుత్రిక, ఇం)

పుత్రిణి సం వి ఈ స్త్రీ బదనిక ?

పుత్రీయ సం వి అ స్త్రీ పుత్రుండు కావలెనని కోరిక

పుత్రుండు సం వి అ పుం ౧ కుమారుండు, కొడుకు (పుత్రులు పన్నిద్దఱు)

శ్లో ఔరసః క్షేత్రజశ్చైవ దత్తః కృత్రిమ ఏవ చ,గూఢోత్పన్నోపవిద్ధశ్చ దాయాదా బాంధవాశ్చ షట్,కానీనశ్చ సహోఢశ్చ క్రీతః పౌనర్భవ స్తథా స్వయందత్తశ్చశౌద్రశ్చషడ దాయాదబాంధవాః

మను ౯ అధ్యా ౧౫౯ ౧౬౦

పుత్రపౌత్రీణము సం విశే (అ ఆ అ) వంశపరంపరగా వచ్చినది

పుత్రి సం వి ఈ స్త్రీ ౧ కూంతురు ౨ దుర్గ ౩ వృక్షభేదము

పుత్త్రుండు సం = పుత్రుండు (ఇది ఏకతకారమును ద్వితకారముగూడ నగుటచే దీనితోం గూడిన సమాసములందు రెండురూపములను గ్రహించునది)

పుత్రేష్టి సం వి ఇ స్త్రీ పుత్రప్రాప్తికై చేసెడియిష్టి

పుదియ విశే (త పుదియ) అభినవము, క్రొత్తది ౨ పుదియబొట్టు

పుదియబొట్టు వి (పుదియ+బొట్టు) క్రొత్తబొట్టు, అప్పుడే పెట్టినబొట్టు

నీ కుదిరెల నెగసనం ద్రోచిన పుదియబొట్టురు ఫాలపట్టిక మల్లికల్ల భా రా అర ౨ ౧౨

పుద్గలము. సం. విశే. (అ. ఆ. అ) ౧. సుందరాకారముగలది, ౨. రూపాదివిశిష్టమైనది. (ద్రవ్యము). వి. అ. పుం. ౧ పరమాణువు. ౨. (బౌద్ధమత ప్రసిద్ధముగు) ద్వ్యణుకాదిపదార్థ విశేషము. ౩. జీవుఁడు, ౪ దేహము. (వై ని)

పునరుక్తజన్మున్‌ఁడు. సం. వి క. పుం. ద్విజాతి

పునరుక్తము. సం. విశే (అ. ఆ అ.) ౧. మరల చెప్పఁబడినది. (అర్థము,లేక,శబ్దము) ౨ అత్యధికము,పైపెచ్చు వి అ న ౧ మరల చెప్పుట. ౨ (అలం) శబ్దార్థదోషములలో నొకటి.

పునరుక్తవదాభాసము. సం. వి. అ పుం. ఒక శబ్దాలంకారభేదము.

శ్లో॥ యత్రార్థః ప్రముఖేకించిత్ భాసతేపునరుక్తవత్, పునరుక్తవదాభాసోఽలంకారస్సస తాంమతః. (ప్రతాపరుద్రీయము.)

పునరుక్తి. సం వి. ఇ స్త్రీ. మరలఁజెప్పుట, వ్యర్థముగా మరలఁజెప్పుట

పునరుత్పత్తి. సం వి ఇ స్త్రీ. ౧ మరలఁ బుట్టుట ; పునర్జన్మము, అసత్యము (వాచ)

పునరూఢ. సం. వి. ఆ. స్త్రీ. (మరలఁ పెండ్లాడఁబడినది) మరలఁ పెండ్లియైనది

పునర్జన్మము. సం వి క. న మరలఁ బుట్టుట, జన్మాంతరమెత్తుట

పునర్నవ. సం వి ఆ స్త్రీ. గలిజేరు తీ.

పునర్ణవము. సం వి. అ పుం. గోరు

పునర్భవము. సం. విశే. (అ. ఆ. అ) మరలఁ బుట్టినది. వి. అ. పుం. ౧. సంసారము. ౨. గోరు.

పునర్భవి. సం. వి. క. పుం. జీవాత్మ. (అ. ని.)

పునర్భువు. సం. వి. ఊ. స్త్రీ. ౧. మారు మనువుది. దిధిషువు.

పునర్యువ. స వి క. పుం. చంద్రుఁడు. (వై.ని)

పునర్వత్సము. సం. వి. అ పుం. పాలు కుడుపు తప్పి మరలఁ పాలు కుడువఁ దొడంగిన దూడ. (విల్యమ్సు).

పునర్వసువు. సం వి ఉ పుం ౧ ఒక నక్షత్రము (ఈ యర్థమున సంస్కృతమున నిత్య ద్వివచనాంతము)

సీ. ఒకచోఁ బునర్వసు పూఁగ వృక్షముకొమ్మ నుడివడ్డ ముత్యాలజోఁగుపోలె.

కాశీ. ౧. ౧౩౮.

౨ విష్ణువు ౩ శివుఁడు ౪ కాత్యాయన ముని ౫ ఒకానొక లోకము

పునశ్చరణము. సం వి అ న. మంత్రము యొక్క పునః పునః పఠనము

పునస్సంధానము. సం వి అ న ౧. మరలఁ గూడుట ౨ విచ్ఛిన్నమైపోయిన అగ్నిని మరల హోమకుండమునందుఁ గూర్చుట

పునాది. వి ౧ బలమునకై గోడ కడుగున భూమిలో లోఁతుగాఁ ద్రవ్వి పెట్టెడుగోడ, మూలబంధము (శ. ర)

(వ్యవ) నాలుగు దినములలో ఆ మేడ పునాదులు లేచును

౨. బలమునకై లోఁతునుండి గోడ కట్టుటకు భూమిలోఁ ద్రవ్వు పల్లము.

(వ్యవ) ఆ మేడకు మిక్కిలి లోఁతుగాఁ బునాదులు తీసినారు

౩. ఆధారము,మూలకారణము.

(వ్యవ) అతనియైశ్వర్యమునకుఁ బునాది అయుద్యోగమే.

**పునాసలు.** వి. బ. (సం. పునర్వసుః.) సూర్యుఁడు పునర్వసునక్షత్రమునం దుండునపుడు చల్లిన రాగులు లోనగుధాన్యములు

మ... కఁ పుగుబ్బెతలపెన్గుబ్బల్ పునాసల్వోలెన్, బిసికిళ్లుం బిసికిళ్లు పోలికల కల్పించె న్నభస్యంబునన్. ఆము. ౪. ౧౩౩.

**పునుఁగు(ఁగ్గు).** వి. గంధమార్జాలమువలనఁ గల్గు నొకవిధ మగుసుగంధద్రవ్యము.

చ. ఘనగళశంపఁ గంచ మిడి కాటుకఁ దీర్చి పునుం గినోమ్మఁ దట్టినది యలంది...
ఆము. ౨. ౧౭.

మ. బురుసాకోకలు తైలకోళ్లు సవరంబుల్ పున్గుజవ్వాజి కస్తురియుక్ గుంకుమసర్వ వస్తువులు భృత్యుల్ గొంచు వెన్వెంట రా.. ఉ. హరిశ్చ ౪ ౧౭.

ద్వి. క్రొత్తకస్తూరి పున్గు గూర్చిన మంచి, మెత్తని గంధంబు మెయి నిండఁ బూసి.
ద్వి. నల ౧ ౪౪౯ పం.

జః పునుఁగుదావులు, పునుఁగుచట్టము, పునుఁగు పిల్లి పునుఁగు రాజనములు

**పునుఁగుఁదావులు.** వి. బ. (√పునుఁగు వృత్తి యం దేకవచనము) పునుఁగువాసనగల శాలిధాన్య విశేషము

వ. .కూటికుప్పలు కాటుసంపెఁగలు కందర్ప భోగులు గజపతిలాగీలు బొందడీలు పునుఁగుఁ దావులు తేనెతోలలు మోసనాలు...
ప్రబంధ. ౧౧౭

మ. పునుఁగుందావినవోదనంబు మిరియంపుం బొళ్లతోఁజట్టి చుయ్యనునా దాలనికూర గుంపు ముకుమం దై యోర్చునానం జగు, ర్కొ[illegible]నుమచ్చట్టను పాయసాన్నములు నూరుం గాయలున్ జే సురుక్కనుసేయుం బెఱు పాలవెల్లువగ నాహారం బిడు న్నిత్యమున్.
ఆము. ౧. ౮౭.

**పునుఁగుచేట్టము.** వి. (పునుఁగు+చట్టము.) పునుఁగుపిల్లి శరీరములో పునుఁగుండునట్టికోశము, పిల్లి గడ్డ.

చ. కెదురులముత్తెముల్ కెలలవిండ్లు జవాది పునుంగు చట్టముల్ ..మొదలగు కానుకల్ నృపతిముందట నుంచి జోహారొనర్చుచున్.
ఉ. రా. ౪ ౩౮౮

సీ పునుఁగుచట్టంబులు పునుఁగుకత్తి జవాజి కస్తురియును బచ్చకప్పురంబు
శుక. ౧. ౧౫౪.

**పునుఁగు(గ్గు)పిల్లి.** వి. పునుఁగునిచ్చుపిల్లి, గంధ మార్జాలము

చ. పెదపెదదంతముల్ పునుఁగుపిల్లులు జల్లులు జంటితేనియల్, మొదలగు కానుకల్ నృపతి ముందట నుంచి జోహారొనర్చుచున్.
ఉ రా. ౪. ౩౮౮.

సీ బూతపిల్లి నాఁగను గమ్మపిల్లి నాఁగను బున్గుపిల్లి యటంచనఁ జెల్లు గంధమార్జాల నామంబు... ఆం. భా. ౨ ౮౪.

**పునుఁగురాజనములు.** వి బ (√పునుఁగు) పునుఁగువాసన గలయొకవిధమగుశాలిధాన్యవిశే షము.

సీ పొన్నశ్రీరాజనా ల్పునుఁగురాజనములు ముద్దుప్రా లారబ్లు ముత్తెసరులు
హం స ౪ ౧౭.

**పునుక(క్క).** వి ౧. తలపుఱ్ఱె, కపాలము.

ఆ. పునకఁ గుక్కతిత్తిఁ బోసినపాలు నీ, క్లధిక నిండఁ బోరయునట్లు దుష్టమై యపాత్ర విషయ మగునీగి వృధవోవు.
భార. శాం. ౧. ౩౩౧

సీ. కాశికానగరోపకంఠ దేశంబునఁ బగులపై చెం గరంబు బ్రహ్మపునుక. కాశీ. ౫. ౧౭౩

చ. కరమున నున్నపున్కయును గాముని భూతియు... విక్ర. ౧. ౪

ద్వి. పాదలుచు నత్తలపుక్కయుఁ దక్క, మెద
డును రక్తంబు మేనిచర్మంబు,క్రమ్మన
భక్షింపఁగా శక్కఁ గొనక.
పండితా దీక్షా ౩౭. పా

సీ. ..ఎదఁ బుక్కపరములు కుదుటపఱచి.
నీలా. ౧ ౧౩

౨. చిప్పరొమ్ముక,రొమ్ముక.

ఉ...జాసువులపుక్కల మాడిచి కాశిఁ జావఁ
గాఁ,ల్లట్టున కూద్రకుం భ్రమలఁ గప్పుచుఁ
దద్విధి గుజ్జు మాచు నా,పట్టునఁ గొంచు
మజ్జికడఁ బ్రాణము తీసెఁ గదయ్య
భాస్కరా భా శ ౩౭.

క జలరాశిఁ దిమితిమింగిల,ములు నాఁ దగుమీల
సత్వములు వినిశేదే,కులశైలనుతుఁడె జల
చర,ములతో రావెదల నుమియుఁ బునుకల
తోడఁ. దశా ౧ ౧౫౩.

౩: పునుకతాల్పు.

పునుకతాల్పు. వి (పునుక + తాల్పు) కపాల
ధారి,శివుఁడు.

ఆ. పునుకతాల్పు విల్లు దునిమెఁ దాటకఁ
జంపె. అచ్చ రా. యు ౧౧౭.

పునుగు. అ. క్రి ౧ వెనుదీయు,సంకోచించు

ద్వి తనసేన వెనుకముందరిధనం బెల్లఁ,బునుగక
యాక్షణంబునఁ బెట్టి పొమ్ము.
ద్వి. పరమ. ౭. ౪౬౩. పా. ౯ పం.

ద్వి తనవాను మడిగిన దయతోడ నవ్వి,పునుగ
కప్పుడు పొట్టభుజకరుఁ డైన,మారహేమకశి
పుండ ననిరొ...
ద్వి. పరమ. ౩. ౫౧౨. పా. ౫. పం.

౨. త్వరపడు.

ద్వి. అతిథి స్తే నీ వన్నయట్ల వైష్ణవులఁ, బ్రతివార
మారగింపఁగఁ జేసి కాని, పునిగి రే ముందర
భుజియింప రొల్ల.
ద్వి. పరమ. ౭. ౪౫౫. పా. ౨౦. పం.

పునెము=పున్నెము. వి. సుకృతము. (శ. ర.)

క. వినవమ్మ భామినీమణి, మనమున నీ కెతరనంగ
మము ప్రియ మైనను, మును గొంతి కమల
బాంధవు, నెనసియుఁ బొసె మఱుఁగనట్టులే
వర్తిలుమీ. శుక ౧. ౪౪. (శ. ర పా.
పౌనమెఱుఁగునట్లనె ముద్రి. పా.)

పున్న=పిన్న. విశే. చిన్నది.

ఉదా: పున్నకేలు. (శ ర బ్రా.)

పున్నమ. వి (సం. పూర్ణిమా, ప్రా. పుణ్ణమా,
క. పుణ్ణిమె.) పౌర్ణమాసి,శుక్లపక్షమందలి కడ
పటిదినము.

గీ. పేనఁ బ్రాణము వానినమీఁద మొగము,
మెఱసి యుండుటె రెండు నిత్తెఱఁగు కాంతి,
తోడఁ బున్నమనాఁటిచందురునిచంద,మున
శేఁజాడు మిక్కురువృద్ధుసాననంబు.
భార. స్త్రీ. ౨. ౯౪.

ఉ. పున్నమచందురుం దెగడుపొంకపు మోములు
రాచకన్నియల్ నీలా ౧ ౨౮.
విజ వి. ౨. ౧౦౮

తపసిపున్నమ=వ్యాసపూర్ణిమ, ఆషాఢపూర్ణిమ.

ద్వి. తరళాక్షి ముందటి తపసిపున్నమను,సరిఘణి
కోయిడి గురుకట్నమిచ్చె.
పండితా. పురా. ౧౨౨. పా.

(తమసపున్నమ.అపముద్రి)

దవనపున్నమ=చైత్రపూర్ణిమ

గీ. దవనపున్నమ కాకతీయాధ్యక్షుఁడైన, తెలుఁగు
రాయఁడు...ఉత్సవం బవధరింప, నందుఁ
బోయితి... క్రీడా. ౨౦౫.

—నూలిపున్నమ=శ్రావణపూర్ణిమ. (ఈనాఁడు
తోరముల పూజింతురు)

ద్వి. నూలిపున్నమనాఁడు నూపురం బిమ్మి,బాల
భక్తుల కొప్పు బండుమఁ జేసె.
పండితా. పురా. ౧౨౨. పా.

శ్లో. ఉత్తరేవ్రతం మధౌ దోలా శ్రావణీతంతు పూజ
నమ్, చైత్రేతద్ దమనారోపణ మకుర్వాణో
వ్రజత్యధః. నిర్ణయసింధువు చైత్రవ్రతప్రక
రణము.

పున్నాగ. సం. వి. అ పుం. ముప్పదిరెండు నపుం
సకరాగములలో నొకటి.

సీ. కాంభోజి కేదారగౌళ శోకవరాళి పున్నాగ
గుమ్మకాంభోజి... హంస ౫. ౧౨౪.

పున్నాగము. సం వి. అ. పుం. ౧ తెల్లదామెనగు.
౨. పురుషశ్రేష్ఠుడు. ౩. తెల్లకలువ. ౪. జాజి
కాయ. ౫. సురపొన్న చెట్టు ౬. నాగకేసరము చెట్టు.

పున్నాగవరాళి. సం. వి. ఇ పుం ముప్పదిరెండు
నపుంసకరాగములలో నొకటి.

సీ గౌళ నారాయణగౌళ వసంత వరాళి పున్నా
గవరాళి శంకరాభరణమును ..
ప్రబంధ. ౯౬.

పున్నాట(డ)ము. సం. వి అ. పుం. చక్రమర్దము,
తంటెపుచెట్టు.

పున్నియ(న్నె)ము. వి (సం. పుణ్యమ్, ప్రా.
పుణ్ణమ్) సుకృతము.

గీ. ఎన్నడును నేగి తేనట్టియిమ్మహాక్షేత్రకాసము
వయందు గాపున్న జంతువులకు,కోటిశా
తంబు పున్నియం బెదలినప్పుడొక్కమునఁ
గూల వలయుఁగా నలాడినట్లు
కాశీ ౨. ౪౫

గీ. పురిపులుఁగుపెంత్త మెన నేనిపున్నియంబు,
తమిచేసితా... నీలా. ౧. ౧౦౯.

సీ. ఎవ్వనిమన మెవ్వఁడెఱుంగు నన్నెము పున్నె
మును దేవుఁడెఱుంగు ననెడివారు
సారంగ ౩ ౮౨

సీ. విడుమ ని న్నెన్నఁడు విశ్వసింపవె యన్న
నీసత్యమునకుఁ బున్నియము గాఁగ.
శివరా. ౩. ౧౩౦.

(ఇట వ్యతిరేకలక్షణచే పాపము = పైయర్థ శ్రీ
మ్ము,అని తాత్పర్యము.)

శా...ఆ,భూమిపై కోటలఁ దోఁటలం దిరిగి
మీపున్నెన మా కబ్బెకం, దేమిపై లేకను
ఖాన నుండుదము సారంగ. ౧. ౬౫
(ఇట మీచేసిన ఉపకారముచేత, అని భావము.)

—విశ. పుణ్యము కలిగించునది,పవిత్రము.

గీ. అప్పనంబుగ నాచేస్న నట్లొనర్పఁ, గడఁగు
నిప్పున్నియపు బలుకబ్బమునకుఁ, గలకెలం
గెట్టులు అచ్చ. రా బాల ౨౪.

—నీపున్నెము = నీకుమేలగును (ఇది అనిష్టకా
ర్యము చేయవలదు అని చెప్పుటయం దుప
యుక్తము )

సీ నీపున్నె మిచ్చట నీపగ్గె మురయించి పోరు
దీర్పుము మంచుఁ బొందుపఱచి
కువల ౫ ౫౪

పుప్పము. వి (సం పుష్పమ్ ప్రా పుప్ఫమ్ )పువ్వు.

సీ పువు పువ్వు పూ నాఁగఁ బుప్పము విరి యల
రనఁ గుసుమాఖ్య లై యలరు నీకు
ఆం సం. స్థా. ౪.

పుప్పి=ప్రుప్పి. వి (√ప్రుచ్ఛ్[1]) పురుగుపట్టి చెడి
పోవుట
(పాలకిబొంగు వర్ణనము )

వ ముక్కునొక్కు పుప్పి చీమదిండి రోకలమ్ము
సెలవు నిడుదగణుపు తేఁతయు ముడురు
సన్నము గమకంబు నీలధవళర క్తహరిద్వర్ణం
బులు మొదలుగాఁ గలదుర్గుణంబులు లేక ..
ప్రబంధ. ౬౦౫

విశ. పుచ్చినది.

తే. వివిధసంగ్రామజయరుద్రవీరభద్ర, రాజకరు
ణాకటాక్ష నిర్వ్యాజలబ్ధ, సకలసామ్రాజ్య
ఖనివిస్నీ వశటరెక్కు,పుప్పిభోగపులం జెల్లె
పొగులఁ దగునె. చంద్ర. వి. ౩. ౪౦.

సీ. పుప్పిపంటికి లేద పుట్టంబు చుట్టుట జేసు
ధరుం డెద్దుకొంట రాఁడె. రామలిం. ౧౦.

**పుష్పించే.** స. క్రి. (పుచ్చే² + ఇంచే) తీయించు, తొలగింపఁజేయు.

గీ. బాదుగుడిపొంతఁ జాల నున్నతిఁ దనర్చు, తోరణస్తంభ మెక్కి రెువ్వారు సెఱుఁగ, కుంద నిచ్చెనఁ బుష్పించి యుండు మునిద, యట్టు లైనను పేఁగెద వమరపురికి.

పాండ. 3 ఆ. (చి ని ళ ర)

౨ పుచ్చు, తొలఁగించు, తీసివేయు. (స్వార్థేం చుక్కు)

ద్వి విగతశేత్రద్వారవినిహితావృతము, లగు ప్రపాదప్రమాణాంబరావళులు, పుష్పించునంతన పురమారుకరుణ, నొప్పార నుదయించె నూర్ధ్వక్షేత్రములు. పండితా. మహిమ ౨౬౯.

ద్వి ఎల్లయ్య మధుపయ్యగార్కి తెప్పెమియును లేక చొప్ప గా దనక్కరప్పించి కన్నులు పుష్పించె .. బసవ 8 ౯౦8 పం.

**పుప్పిపురుగు.** వి (√పుప్పి) నుసిపురుగు, కఱ్ఱ తొలిచి నుసి రాల్చెడిపురుగు (చి. ని ళ, ర. బ్రా)

**పుప్పు.** వి (√పుచ్చే¹) పశువులగొరిజలు బ్రస్సి పురుగులు పడెడువ్యాధి.

ఆ. నరిడి పుప్పు కప్పవావురు కడుపూఁద, యదురుఁద్రిక్కు యనఁగ నదరి మఱియుఁ, దెవులు కన్నిరేనిఁ దవిలి రెుంతయు మహోగ్రంబు లయ్యెఁ బశుగణంబునందు. హరి పూ. ౬. ౪౫.

ద్వి. కప్పవావురుగాలి గజ్జపత్రిక్కు పుప్పు పంపరయూడు బొట్టు బొల్లాఁత... నవ. ౧. ౩౦. బా. ౨౧ పం.

**పుప్పుసము.** సం. వి. అ. పుం. ౧. ఎడమప్రక్కనుండుతూపిరితిత్తి. ౨. తామరదుద్దు.

**పుప్పొడి.** వి. (పువ్వు + పొడి—క. పూప్పుడి. క. పూపొడి.) పుష్పపరాగము, పూవులయందలి ధూళి.

సీ. పాండ్రదరుచిసహాపాళ్ళతులగు కావు లద రెడు పుప్పొడులట్లొఱయు.

భార. విరా. ౪. ౫౦.

గీ. జడియ దళులఁ గురియు పుప్పొడుల మునుఁగు మనుచ 3. 3౧. (ఇది కొన్ని ప్రయోగములందు పుష్పవాచక పదపూర్వముగాఁ గూడఁ గన్పట్టుచున్నది.)

మ... చెంగల్వపుప్పొళ్లు నింౘిన చంద్రోపల వేదిపై... పారి. ౧ 8౧.

సీ. పువ్వుఁబుప్పొడిదుమ్ము పొదరి నిప్పొద లలో సిద్ధాళులకుడు వసించు నెపుడు.

ఉ రా. 3. ౬౫.

**పుప్పొడివన్నెలు.** వి. బ. (పువ్వు + పొడి + వన్నెలు.) వస్త్రవిశేషము.

వ ..కంటకి వన్నెలునుఁ బుప్పొడి వన్నెలును రుద్రాక్ష వన్నెలును... ద్వా. 3. ౨౦౬. (ప్రాఁతప్రతి.)

**పుబ్బ.** వి సం. పూర్వా, ప్రా. పువ్వా. క. పుబ్బె.) పూర్వఫల్గుని, పదునొకండవ నక్షత్రము.

సీ. ఆశ్లేష నుత్కృష్టవీరతను జలాఢము మఖఁ దనకులమున పెంపు పుబ్బ సౌభాగ్య విఖ్యాతి సిద్ధి. భార. అను. 3. ౧౬౯.

సా: పుబ్బ లేఁగినను బూజు లేఁగినను నిలువదు. చంద్రిక.

**పుమనుజ.** సం వి. అ. స్త్రీ. అన్నగలపడుచు.

**పుమపత్యము.** సం. వి. అ. న. మగబిడ్డ.

**పుమర్థము.** సం. వి. అ. పుం. ౧. పురుషప్రయోజనము. ౨. (ధర్మార్థకామమోక్షములనెడి) పురుషార్థము.

**పుమాంసుఁడు.** సం. వి. స్. పుం. మనుష్యుఁడు, మానిసి.

**పుమాఖ్య.** సం. వి. ఆ. స్త్రీ. పురుషుని పేరు

**పుమ్ఫలము.** సం. వి అ పుం. గర్భవాయువు (విల్యమ్సు)

**పుయిలోట(ము).** వి (√పుయిలోడు)౧ లజ్జా భయాదులచేఁగలుగు) జంకు,సంకోచము; వెఱపు, భయము.

గీ నీవుఁ దమ్ములు నొక్కెడ నిలిచి చూచు, చుండుఁ దని పల్కుటయుఁ బుయిలోట తోడఁ, గీచకారాతిఁ దప్పక చూచి నగుచు, నతని కిట్లని చెప్పె ధర్మాత్మజుండు
భార విరా. ౩ ౨౦౧

గీ. పరగి పుయిలోట లందుగుటఁ బగలు రేయుఁ, బల్లెయందును వడవిలోపల విశేచ్ఛఁ, దిరిగి నట్లు కృష్ణునిఁగూడి తిరుగఁ దొడఁగి,రంగ నలు మదభరవిమూఢాత్మ లగుచు
హరి పూ ౮ ౧౪

సీ జనులు గాంచిన మానసము దూలఁ దన కసుపుయిలోటమున మోము పుల్లగిలఁగ.
భార. విరా ౨ ౪౦

సీ. తల్లడింపు తలఁకు తల్లడము తలరు జళుకు జంకెన జంకు జడుపు జాలి, పుయిలోట జలదరింపు దిగులు వెఱ పళ్కు వెఱ యుత్త లము బీకు బెదరు బెగ్గి,లుట యంబెక యుదిల యటన సధ్వృతి యగు ..
ఆం. భా. ౧. ౧౩౩

౨...సంశయము.

వ...ధర్మంబులు కేటపడ నను(గహించుచుం బుయిలోట వానీ నన్నుం గలిపికొని కృపకు భాజనంబుగాఁ జేయుట...
భార. అను. ౩. ౨.

**పుయిలోడు.** అ క్రి. (క. పుయిల్, పుంయిల్,— ఆక్రందనము —పుయిల్ + ఓడు—సాక్రంద ముగా పరుగెత్తు) ౧. (లజ్జాభయాదులచే) వెన దీయు, సంకోచించు; వెఱచు, భయపడు.

క. పీచుఁగు నంటఁగ నగుకేశ్యభూవాధకమాజాఁ దనక పుయిలోడక న, న్నీచపుఁబనిఁ బన పం,గా నీకుం దగునె పాపకర్మము గాదే.
భార విరా. ౪. ౧౦౯.

చ ..ఏ,నొకగతి విన్నవింతుఁ బుయిలోడక యిప్పుడు దాని నీ వొకిం,చుక వడి చిత్త గింపు మనసూయుఁడ వై మదిఁ గింక వాయఁగన్.
నృసిం. ౪. ౧౫౪.

క ప్రియ యిగ్ రేటిది కావుడుఁ, బుయిలో డిన పలుకుకుదల బాల్గులచేతన్, మయరసత భజనగణము లు,దయ మొందెన్ ఛంద మొందెఁ దద్గుణయుక్తిన్
కావ్యా ౪ ౮

ఉ నీవిమలప్రభావమును నీవినయాదికసద్గుణం బులున్, దేవుఁ డెఱింగి యుండియును నిందల కున్ బుయిలోడి రాజగ,ర్వావని నీవు గోరినవెపంబున నిచ్చుటి కంపికాఁడు...
ఉ రా. ౭. ౨౪౧.

జ. పుయిలోట

**పురఃపాకము.** సం విశే (అ ఆ అ) పాక మును దగ్గఱినది, ఫలోన్ముఖమైనది.

శ్లో: ఈప్సితార్థక్రియోదారం తేఽభినన్ద్య గిరే ర్వచః, ఆశీర్భిరేధయామాసుః పురఃపాకా భిరంబికామ్ సం. కుసం. ౬. ౯౦.

**పురఃఫలము.** సం విశే. (అ. ఆ. అ) (ఫలము ముంగలగలది.) ఫలమును సమీపించినది.

శ్లో: వత్సోన్ముకావి స్తిమితా సపర్యాం ప్రత్య గ్రహీత్సేతిన నన్దకుస్తా, భక్త్యోపపన్నేషు హి తద్విధానాం ప్రసాదచిహ్నాని పురః ఫలాని... సం. రఘు. ౨. ౨౨.

పురంజనుఁడు. సం. వి. అ. పుం. క్షేత్రజ్ఞుఁడు, జీవుఁడు.

పురందర. సం. వి. ఆ. స్త్రీ. గంగ.

పురందరము. సం. వి. అ. న. ౧ (జ్యోతి) జ్యేష్ఠానక్షత్రము ౨ చవ్యము, ఓషధివిశేషము

పురందరుఁడు. ౧ ఇంద్రుఁడు ౨ శివుఁడు ౩ అగ్ని ౪ విష్ణువు. ౫ చోరుఁడు

పురంధ్రి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. కుటుంబము గల యాఁడుది. మగఁడును బిడ్డలును గల యాఁడుది, ౨ ఆఁడుది, (శ. ర.) ఇ. పుం. ౧. ఇంద్రుఁడు, ౨ వరుణుఁడు.

పురఁట=పుంట, పూఁట. వి. సంధ్య

సీ. సంధ్య రెుప్పుచు నుండు సంజనఁ బూఁటనఁ
బుంట యంచనఁగఁ బురంట యనఁగ.

ఆం. భా. ౧. ౯౪

పురజ్యోతి. సం. వి. స. పుం. ౧ అగ్ని, ౨ అగ్నిలోకము.

పురటము. సం. వి. అ. న. బంగారు

వ... నికటపురటల తారూఢస్థలవిహంగమ
మిథునప్రోచ్య మానశ్రుతిభిః ..

సం. భాగ. ౫. ౨. ౪.

(పురటలతా=స్వర్ణవల్ల్యః, శ్రీధరుఁడు)

పురణము. సం. వి. అ. పుం. సముద్రము (వాచ.)

పురణి(డి)ంచే¹=పురాణించే, పురాయించే. అ. క్రి. (సం. పూరణమ్.)

౧. వర్ధిల్లు, పెంపొందు, ప్రబలమగు.

వ ..కృష్ణుండు జన్మించినది యాదిగా గోవులు
ప్రతివత్సరంబును ప్రవర్ధమానలై శ్రీపులు పుర
ణించి వచ్చుఁబా తెంతల్పితిశితి మంతయు
ఘృతం బయి పేర్చు...

హరి. పూ. ౭. ౧౪౧.

ఉ... శ్రీపాదుచు పార దూలుచుఁ గుశంశలఁ
బోవకుఁ దన్నలార మీ,పేసుపు లన్యశావ్య
నరణిం బురణింపఁగఁ జేయు టొప్పుగుక్.

కృ శకుం పీఠి ౬.

ద్వి. చింతింపఁ దగ దని చెలికాంద్ర నిలిపి,
పురణించుచును దనపూర్వకర్మంబు, తరువు
వాఁడై వెంటఁ దవిలిపునేయ

ద్వి శ. పా. ౧. ౨౦ పొ. ౧౬. పం.

౨. విజృంభించు, చెలరేఁగు

క... కురుబల మదె పురణించె బదలుపటుతము
రమ్మా భార. ద్రో. ౫. ౩౪౦

ఉ...సంతానసమృద్ధిచే శుభవితానము తానక
మయ్యె నేకసంతానముఁ గన్నదైవతవతంస
పురిం బురణించి నవ్వుచుక్.

వసు ౧. ౧౨౪.

పురణి(డి)ంచే²=పురుడించే. స. క్రి. పోలు, ఎనయు

ద్వి బుద్ధి బృహస్పతిఁ బురణించువాని,నిద్ధ
తేజంబున నినుఁ బోలువాని

రం రా. అయో. ౭౫ పా. ౧౩ పం.

ఉ పట్టెపుజొట్టు నిక్కు మెద బాగుగఁ జివ్విన
యారెపాంకముక్, రెట్టలబల్మి పెమ్మిఁ
బురణించినయీకలకోకలుక్...గణ్ణపుంజాఁ
జే,పట్టి గ్రహంబు వెన్కఁ గనుపట్టఁగ
వల్లలు దీసి యంతటక్. కువల ౪. ౨౦౪.

క. సత్త్వము సాహసమును దా,తృత్త్వమ్మును
విక్రమార్కు తెలుఁగునఁ గనకే,సత్త్వరగతిఁ
జనుదేరఁ బ్ర,భుత్త్వము ఘనమూను యతనిఁ
బురణించదవే. ద్వా. ౬. ౩.

—అ. క్రి. ౧ సాటియగు, సమానమగు.

సీ. పుండరీకములతోఁ బురణించు కన్నులఁ
గారుణ్య మనుతేనె గదలుకొనఁగ.

ఉ. హరి. ౨. ౧౪౬.

ద్వి. అరయంగ మే శైనయుతృతంబుతోడఁ, బురణింపఁ దరుపుగాఁ బుట్టించి యా.
రం రా. అర. ౧౯౫. పా. ౪. పం

౨. మార్కొను, ప్రతిఘటించు

క. గిరితోడన కరిపోతము, వారితో బుష్కరంబు చెనయుచట్టిద కాదే, వారితోడ నీవు గావునఁ, బురణించుట
ఉ హరి 3 ౫౧.

3. ఒప్పు, అతిశయించు.

ద్వి సరి లేనివవరత్న సంఘ సంఘటన, పురి ణింపఁగా బాహులు పులు ధరించి
రఘునా ౫ పా ౧౬. పం

పురతటి. సం వి. ఈ. స్త్రీ క్షుద్రవాట్టము. చిన్నయంగడివీథి

పురదేవత. సం వి ఆ. స్త్రీ పురిమునధిష్ఠించి యున్న దేవత.

పురద్వారము. సం వి అ న. పురముయొక్క వాకిలిగవను, గోపురము, పురముసు ప్రవేశించు ద్వారము

పురపాలుఁడు. సం వి అ. పుం. ౧ పురా ధ్యక్షుఁడు ౨ శివుఁడు.

పురపుర. వి. ౧. బొబ్బలేచుటకు ననుకరణము.

మహోప్రదగ్ర...పదకరకటక భ్రష్టభూషావిశేషం, బులు చొప్పడ్ దప్ప సెండం బురపుర నడుగుల్ పొక్క గా...
ప్రబోధ ౫ ౯౩.

౨. దుఃఖించుట తహతహపడుట మున్నగువానికి ననుకరణము.

క. పురపురఁ బొక్కుచు బకపతి,కరంకముం దేరఁ బనిచి...
భార. శాం. 3. ౫౧౨.

క. పురజను లెల్లఁ గనుంగొని,పురపుర బొక్కంగ సధ్యభూమిస్థలికిం, ద్వరితగతిం గొని చని యగ్గదహించ రెుునర్పుమనవనుగొలుపమిఁ దనలోన్.
వి(క 3 ౬౫.

క. పురిపురఁ బడి రేయుఁబ్బు చుండె భూభాగము నన్.
దశకు. ౪ ౬౯.

3. తహతహ; బాధ.

చూ. పురపురగొను, పురపురమను.

జః పుపురగొను, పురపురమను, పురపురిలాడు

పురపురగొను. అ క్రి (పురపుర+కొను) తహ తహపడు, తత్తఱనొందు.

గీ తల్పమునకు సఖీప్రయత్నమున వచ్చి,నభిన వోఢకు నడుగడుగామ దరొయ్యెఁదలఁపు పురపురగొనఁ దత్తరిలంతదీయ,కాంతునకుఁ దక్షణము బ్రహ్మకల్ప మయ్యె
కవిక. 3 ౨౦3

పురపురమను. అ క్రి (పురిపుర + అను) పుర పురమను,కొప్పినొందు

వ...శోకోల్లంఘనంబునం బురపుర మనుబోడితల నిమురుకొనుచు . ప్రబోధ 3. ౧౨

పురపురలాడు. అ క్రి (పురపురిలు + అడు) తహతహనొందు,మిక్కిలి అపేక్షపడు
(వ్యవ) అతఁ డాయుద్యోగమునకై పురపుర లాడుచున్నాఁడు

పురభిత్తు. సం. వి. ద్. పుం శివుఁడు.

పురమథనుఁడు. సం వి అ పుం. శివుఁడు.

పురమార్గము. సం వి. అ. పుం. పురమునందలి వీథి;పురమునకుఁ గొంపోవుదారి.

పురము. సం. విశే. (అ. ఆ. అ.) పూర్ణము, ప్రచురము.

వి. అ. న. ౧. పట్టణవిశేషము. (పెద్దపెద్ద గృహములును జుట్టు నగడ్తయు గలిగి యొక క్రోశమునకుఁ దక్కువకాని వైశాల్యముగలది); బహుగ్రామముల వ్యవహారమునకు స్థానమై పెక్కులు హట్టాదులు కలిగియున్న ప్రధాన గ్రామము. ౨ గృహము. ౩ దేహము. ౪. పాటలీపుత్రమను పట్టణము. ౫ కుసుమదళవృంతము, పూతొడిమ కాడ ౬. నాగరముస్త కీ. ౭ చర్మము. ౮ మేఢ,గృహోపరిగృహము ౯ స్త్రీ లుండుగృహభాగము. ౧౦ మూఁడు అను సంఖ్య —వి అ పుం పీతఝుంటి,పచ్చగోరంట. కీ. ౨ ధాన్యరాశి. ౩. గుగ్గిలపుఁజెట్టు

పురరక్షుఁడు. సం వి అ పుం. తలారి,ఆరక్షకుఁడు

పురరిపువు. సం వి ఉ. పుం. శివుఁడు

పురరోధము. సం. వి అ. పుం. పురముముట్టడి.

పురల. సం వి ఆ స్త్రీ దుర్గ

పురశాసనుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు.

పురశ్చరణము. సం వి అ న. ౧. ముందుగా ఆచరించుట ౨. (తంత్ర) గ్రహించిన మంత్రమునకు సిద్ధిహేతువగు ప్రయోగభేదము

పురశ్చర్య. సం. వి. ఆ. స్త్రీ = పురశ్చరణము.

పురస్కరణము. సం వి అ న. ముందిడుట. ౨. పూజనము. (చూ: పురస్కారము)

పురస్కరణీయము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ముందిడుకొనఁదగినది. ౨ పూజింపఁదగినది.

పురస్కరించు. సం. స. క్రి. ౧. పూజించు. ౨. ముందిడుకొను.

వ...అంత సమస్తసైన్యంబులు సన్నద్ధంబులు గావించి వివిధాయుధంబులు ధరియించి సుధాశనులు మహాదేవిం బురస్కరించుకొని మహిషునిమీఁదికి నురవణించిన.

మార్క. ౬. ౮౧

పురస్కారము. సం వి. అ. పుం. ౧. ముందిడుట. ముంగల పెట్టుట. ౨ ముఖ్యత్వమునిచ్చుట. ౩. పూజనము. ౪. పరిగ్రహించుట. ౫. (దీని నుండి)అయితపఱచుట,సిద్ధముచేయుట. ౬. శత్రువు నాక్రమించుట,అభిగ్రహణము. ౭. అభిశాపము, అపదూఱుపడుట ౮. సేకము,తడుపుట; మంత్రజలాదులఁ బ్రోక్షించుట. ౯. ఎదురుచూచుట, ప్రతిపాలనము.

పురస్కృతము. సం. విశే. (అ. ఆ అ.) ౧. ముందిడఁబడినది, ముందఱపెట్టుకొనఁబడినది; (దీని నుండి) అనుసరింపఁబడినది. ౨. పూజింపఁబడినది. ౩. పరిగ్రహింపఁబడినది. ౪ శత్రువుచే నాక్రమింపఁబడినది. ౫ అభిశప్తము,అపదూఱుపడినది. ౬. తడుపఁబడినది, ప్రోక్షింపఁబడినది, సిక్తము. ౭. సిద్ధముచేయఁబడినది ౮. ఎదురుచూడఁబడినది. ౯ ఏర్పఱుపఁబడినది,నియుక్తము. ౧౦. అభిషిక్తము,అభిషేకముచేయఁబడినది. (రాజకులము. మొ॥ కి వి.)

పురస్క్రియ. సం. వి. ఆ. స్త్రీ. ౧. పురస్కారము. (ముందిడుట. పూజనము. మొ) ౨. పురశ్చరణము.

పురస్సరుఁడు. సం. విశే. (అ. ఆ అ.) ముందు నడచువాఁడు, పురోగముఁడు. వి. అ. పుం. ౧ ముందుపోవువాఁడు-దూత. ౨. అనుచరుఁడు, సేవకుఁడు. ౩. నాయకుఁడు,ముం దుండి నడపువాఁడు.

పురహరుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు, ముక్కంటి.

పురా. సం. వి. ఆ. స్త్రీ ౧. గంగ. ౨. ఒకానొకగంధద్రవ్యము. ౩. తూర్పు. ౪. కోట,

దుర్గము అవ్య పూర్వమున (ఈయర్థమున తెలుఁగునందు వ్యస్తప్రయోగము కన్పడదు)

పురాకథ సం వి అ స్త్రీ పూర్వకథ, ఇతిహాసము

పురాకల్పము సం వి అ పుం ౧ ప్రాచీన యుగకల్పము ౨ పూర్వకాలము ౩ అర్థవాద భేదము

పురాకృతము సం విశే (అ ఆ అ) పూర్వము చేయఁబడినది వి అ న ఇహజన్మమందును జన్మాంతరమందును చేయఁబడిన పుణ్యపాపాది కర్మము

పురాజుఁడు సం వి అ పుం ఇంద్రునికి శాంతి కర్మములుచేయు పురోహితుఁడు (శై ని)

పురాణగుఁడు సం విశే (అ ఆ అ) ౧ పురాణ గాయకుఁడు, పురాణములను జదువువాఁడు, సం వి అ పుం బ్రహ్మము, పరమాత్మ

పురాణపురుషుఁడు సం వి అ పుం ౧ విష్ణువు ౨ ముసలివాఁడు, వృద్ధుఁడు

పురాణము సం విశే (అ ఆ అ) ౧ పురాతనము, పురాభవము, పూర్వకాలపుది ౨ చాలఁ గాలము చెల్లినది ౩ జీర్ణించినది, క్షీణము వి అ న ౧ సర్గప్రతిసర్గాది పంచలక్షణములతోఁగూడిన బ్రాహ్మాది (చూ అష్టాదశ శ్లో సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశో మన్వన్తరాణి చ,వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణమ్) ౨ పదునెనిమిది వి అ పుం న ౧ కర్ష మెత్తువెండిటంకము, కార్షాపణము ౨ ఎనుబది వరాటకములకొలఁదియగు పణము

పురాణాంతుఁడు సం వి అ పుం యముఁడు (శై ని)

పురాణించు = పురాయించు, పురణించు[1].

అ క్రి (సం పూరణమ్) ౧ వర్ధిల్లు, అతిశయిల్లు, ప్రబలు

వ తంత్రీపాలం దనం బరగినవాఁడ వాచేతం బ్రోవులు పురాణించుటం జేసి కొండొక కాలంబునన కడుపులం బెనుకు

భార విరా ౧ ౭౭

దండకము ఉల్లోక సౌందర్య ధుర్యస్థితిన్ విస్తృతం బొనరస్సీవు శీమూతమై హార వర్షోపలశ్రేణి రాణించు మించుల్ పురాణింపఁగాఁజేయు

పాండు ౪ ౩౪

౨ విజృంభించు (శ ర)

పురాణించు సం న క్రి పురాణముచెప్పు

శా పెట్టం గల్గను గాళిఁ గొల్వను బురాణింపం దొరంకొంటి భాగ ౧ ౫

పురాతనము సం విశే (అ ఈ అ) పూర్వము కలిగినది,బహుదినములనాఁటిది,ప్రాచీనము, జీర్ణించినది,క్షీణము

పురాధిపుఁడు సం వి అ పుం పురమున కధిపతి ఇట్లే పురాధ్యక్షుఁడు, మొ.

పురాయించు = పురాణించు, పురణించు[1]

అ క్రి ౧ వర్ధిల్లు (శ ర)

౨ విజృంభించు

దండకము శాశ్వరన్యంధ బంధుత్వగంధంబు రూపించు మూఁపుల్ పురాయింప

పాండు ౪ ౩౩ (ముద్రి చి ని శ ర)

పురాయోని సం విశే (ఇ) ప్రాచీన మగుఉత్పత్తి గలది వి ఇ పుం శివుఁడు

పురారాతి సం వి ఇ పుం శివుఁడు, (ఇట్లే పురారి)

పురార్ధవిస్తారము. సం. వి. అ. పుం. ౧. ఖేట కము. ౨. అస్త్రభేదము. (వాచ) ౩. పల్లెటూరు. (ఆ. వి.)

పురావసువు. సం. వి ఉ పుం. భీష్ముఁడు. (త్రి. వి.)

*పురావిదుఁడు. సం. విణ (ద్) పురావృత్తముల నెఱిఁగినవాఁడు

పురావృత్తము. సం విణ. (అ ఆ అ) పూర్వము జరిగినది వి అ న ౧ పూర్వపు వృత్తాంతము. ౨. ఇతిహాసము.

పురి. వి. (తె పురి) ౧ నెమిలిపింఛము బర్హము, నెమిలియీక

గీ. మేఘరాజాలు సరసత మీఱఁ దమ్ముఁ,దరళ విద్యుల్లతాదీప్త తరకటాక్ష,వీక్షణకలాపముల గారవింప నలరి, నెమ్మి నర్తించుఁ బురి విచ్చి నెమ్మిగములు. రామా ౭ ౧౦

క విరితేనెమేపరులకుఁ, వాటినీలపుసరుల తిరుల కజ్జాక్షికురుల్,గుఱుతై వెడవిలుకుని బెదఁ, గుఱుతై తగ నెమ్మిపురుల కొదవాఁపగుతై. చం రా. ౩. ౪౮.

క. పురి విచ్చి మయూరము ల,ప్పురిసౌధశిఖా గృహాగ్రముల నటియించున్ వరాహ ౯. ౧౫౧.

౨. పిరి, మెలి, పెన; పేనుటవలనఁగలుగు గట్టి తనము.

సీ .తనరుమార్గమునాటు దారమనఁగఁ,బురి పిరి యణఁగఁ దక్కరణిఁజెప్పన మెుప్పు . అం. భా. ౨. ౫౯౫.

వ...తళుకాడు పాపటేని రొమదలిమలఁకలు పురులు విడి... భీమ. ౪. ౭౦

౩. జిగ్గిపారము.

కా. జాజాఁటం బురి రొక్కు నంగముల నందంబై యొరఁటితి వి, పూవానెన్... చంద్ర. ౧. ౧౦౯.

వ. కలకలనవ్యూహము పురి గల్గినానెమ్మియి మూఁగుమూఁగుమీఁసలు నసరంజిడా ఎగు బుజంబులు . కవల. ౩. ౧౧౨.

౪. కవియుట, ఆక్రమణము. చూ. పురికొను, పురికొల్పు )

౫. ఉత్సాహము, ఎచ్చరిక. (చూ పురికాఁడు)

౬ ధాన్యములు పోసి యుంచుటకు గడ్డితోఁ గట్టినకూటు, వెంటిగాడె. (శ. ర.)

(వ్యవ) మాపురి నిండ ధాన్య మున్నది.

౭. గోనెలు కుట్టుట కుపయోగించెడుత్రాడు. (శ. ర.)

(పురికొస అని వాడుక )

—కోలపురులు. = బాణములకుఁ గట్టిననెమిలి యీకలు

సీ తూఁగగోలలు సాఁటి తుఱిగొని తనకుంచె పొది నమర్చినకోలపురులుఁగాగ కా. సం. ౧౭. ౯౭౩.

జః—పురికాఁడు, పురికొను, పురికొల్పు, పురి నమ్మి, పురిపులుగు, పురిరొక్కించు, పురి రొక్కు, పురివిచ్చు.

పురి. సం. వి ఇ ఈ. స్త్రీ ౧ నగరము, ౨. నది. ఇ పుం రాజు (కే వి.) వి. ఈ. స్త్రీ. ౧. కోట, దుర్గము. ౨ దేహము. ౩. సన్న్యాసుల ఉపాధిభేదము.

శ్లో. జ్ఞానరత్నేన సంపూర్ణః పూర్ణతత్త్వ పథ స్థితిః, పరబ్రహ్మరతో నిత్యం పురీనామా స ఉచ్యతే. మహానిర్వాణతంత్రము

పురికాఁడు. విణ. (పురి+కాఁడు) ఉత్సాహవంతుఁడు, ఎచ్చరికగలవాఁడు.

క. పైఁ దేమి బ్రాఁతి యదిగో,తేఁ డిచ్చెడు ముచ్చువగల నెలఁత రమింపం, బోఁడిమి

చెదదే మరిఁ బుర్పికాఁదవుగద కొదవకే
జగంబు తెలుంగుఁన్. శుక. ౩. ౩౬.

పురికొను. అ. క్రి. (పురి+కొను) ౧. ఎచ్చరిక
గొను, ఉత్సాహమునొందు;

క...బలములు దూర్యం,బులు వార్పులుఁ
జెలఁగ రెండుబురికొని చతురం,గలసద్గతు
లొప్పఁగ నడిఁ, దలపడిరి...
భార. భీష్మ. ౨. ౧౪౧.

సీ. దనుజేంద్రునిలుచుట గని సైన్య మెప్పటి
యట్టుల పురికొని యనికిఁ జొచ్చె
భార. భీష్మ ౩. ౩౬.

క. బరవసమునఁ గోత్తలచే,సిరి పురికొని కదఁగి
దైత్యసేనలు మగుడన్. నిర్వ ౩. ౧౪

చ తెరలినసేన నిల్పి సముదీర్ణరయంబున రాము
సేయుచుం, బురికొనఁ జేసె దూషణుఁడు
భా. రా. అర ౧ ౨౦౬

౨ కదఁగు, ఉద్యమించు

చ. కరకరితోడిరిత్తయలుక లృచరించి మనోజ
కేళికిం, బురికొనడీక కోపమునఁ బో
నడవం గడు నల్గి... చిత్ర భా ౪ ౫౨

౩. దట్టమగు, సాంద్రమగు

క. సెలు లనఁగ నెంత చేపే, పురికొని తెగ
కారఁడేసి పొడమెడు మీ కేశమురుపుగ
జడ యల్లెదరు . శుక. ౨. ౨౩౩.

౪. అతిశయించు.

క పరికించుచు డెందంబునఁ, బురికొనుకాతుకము
తోడ .. మనుచ. ౨. ౮.

౫. పెనఁగొను.

క. అనుటయు నచ్చరహృదయం,బున భయమును
సంభ్రమంబుఁ బురిగొనఁగా నొ,య్యనఁగర
భృతవల్లరియొక, యనుఁగుంజెలికరతలంబునం
దిడి యంతన్. పె. కళం. ౧. ౨౧౭.

౬. కనియు, కలపడు.

క. పురికొనుచుం దరలుచు నో,హరిసాహరి
నొక్కచోట నలవడు నొకచో, నిరియు
నొకచోటఁ దిరుగుం,దిరుగక యొకచోట
రెండుదెఱఁగులు నొచ్చున్.
భార. భీష్మ. ౨. ౧౪౩.

క ఉభయబలంబులుఁ బురికొని...నభశ్చరులు
వొగడ నీనునం బోరాడెన్
భార ద్రో ౩ ౧౨౩.

౭ సక్తమగు, చిక్కు

చ...వచ్చె పుండరీక,స్థలయనునప్సరోంగన ముదం
బున దానివిలాసలీలఁ జూ,డ్కులు పురి
కొన్నఁ బైఁబడి
మార్క ౫ ౫౮.

పురికొల్పు(లుపు). స క్రి. (√ పురికొను)
౧. (యుద్ధాదులకు) ప్రేరేఁచు, ప్రోత్సాహ
పఱుచు

క తిరిగినపందల నేఁటికిఁ,బురికొల్పఁగ నున్న
వారు వోదురుగాక ..
భార భీష్మ. ౨. ౧౫౨

గీ కామమోహిత యగువింతిఁ గస్తిపఱుప,
నమజుఁ బురికొల్పి తిది నీకుఁ జనునె రామ
సైమ. ౮ ౧౩౦ భార ఉద్యో. ౩ ౫౩.

౨ పంపు, పుత్తెంచు.

క సైరింపకయెత్తెఱఁగురు, వీరాగ్రణి యిరువ
దేనుపేలరథంబుల్, పోరికిఁబురికొలిపినవి,
స్ఫారగతిం గూడికవిసెఁ బార్థునిమీఁదన్.
భార. భీష్మ. ౨. ౩౩౪.

గీ. పురిగొలిపె నంచెఁ బుత్తెంచెఁ బుచ్చె
నంపెఁ,బంచెఁ బంపెను బంపించెఁ బనిచెఁ
ననఁగ,వలరు నంపించె నసుమాట కర్థ
మగుచు. ఆం భా. ౩. ౧౨౧.

పురిడిపిట్ట. వి. పూరేడు, పక్షివిశేషము (శ. ర.)

పురినమ్మి. వి. (పురి+నమ్మి. పురిగలనెమిలి.)
మగనెమిలి.

క. పురులు గలఁ డిచ్చు నని తన,పుర లెల్లఁగళ
విల్తు మేముఁ బడుకక తానం, బురులఁ
బొడకట్టి మెఱయుచుఁ,బురు లీకయు తక్కి
పోరెఁ బురిసమ్మి క్రియన్.
కు. సం. ౭. ౧౪౦.

—పురిసెమ్మి = మగసెమిలి.

సీ. పొలతిపేరలితోడఁ బురిసెమ్మి తనపురి ప్రతి
వచ్చు నని పాముఁ బట్టెనేని
వి క్ర. ౫ ౧౬౦.

పురిపులుఁగు. వి. (పురి + పులుఁగు) నెమిలి, బర్హిణము.

గీ. మక్కువాల్దాల్పనములుఁగుపై దోడుమ్రోలఁ, దొ
దరి యవయంబు నాదంగఁ బడసినట్టి,
పురిపులుఁగుసెంత్తె మెనలేని పున్నియంబు,
లేమిచేసెను .. నీలా. ౧ ౧౦౯.

క. ఇరువంకలఁ దన్నుఁ బొదివి,గొరువంకలఁ
దుమ్మెదలును గోయిలలుం దృక్కరిచిలు
కలుఁ బురిపులుఁగులు, గొరగొర రా
మరుఁడు నెడలెఁ గొమ్మ గలంపన్.
నీలా. 3. ౧౧.

పురిరొక్కించు. స. క్రి (√ పురిరొక్కు) ౧. పేని గట్టిగా పెనగొనఁజేయు, బిగిరొక్కించు. ౨. పురికొల్పు, ప్రేరేచు, (క్రోధాదులను) రేఁపు.

(వ్యవ.) ఎవరో వానికి గట్టిగా పురిరొక్కించుటచే నన్ను చెడఁ దిట్టినాఁడు.

పురిరొక్కు. అ. క్రి. (పురి + ఎక్కు) పేనుట చేత గట్టిగా పెనగొను, బిగియు.

(వ్యవ) తంత్రాడు చక్కఁగా పురిరొక్కక పోవుటచే త్వరగా తెగిపోవును.

పురివిచ్చు. అ. క్రి. (పురి + విచ్చు) బిగిచెడు, సడలు; విడిపోవు.

చ. విడువనిగాఁగిలింత పురివిచ్చనిమచ్చిక తన్ను
లేనినందడి...కల్గి రొక్కటై,వడి నెడఁబాసి
యింటికిని వచ్చితి వాతఁడు తేఁగునంతటన్.
కువల. ౫. ౩౧.

గీ. ఎదనెఁ బురివిచ్చె నెదమర్యెఁ గడనెఁ
జెంగెఁ బానెఁ గెడించె నాఁగను బరగు
చుండు, వీడెనుటకు...
ఆం. భా. 3. ౭౫.

సీ. మతిమతిఁ బురివిచ్చె మాయూరపింఛిక
యుపయశ్రీఁ జెంద నంబుజంబు...గీ. జల
జలోచన సెఱలకు పాటిరాక.
ఇందు. ౨. ౧౬౫.

(పింఛము - విడుట - అనిధ్వని)

పురీతత్తు. సం వి. త్. పుం. న. ౧ ఆంత్రము. (ఇది దేహారంభకమగు నాడీవిశేషము) ౨. హృదయమును గప్పికొనియుండు మాంసభేదము. 3. దేహము

పురీషణము. సం. వి. అ. పుం. మలము, విష్ఠ, (త్రి. ని)

పురీషమలము. సం వి. అ. పుం. మానము, మినుములు (త్రి ని)

పురీషము. సం. వి అ న మలము, విష్ఠ, ౨ మఱికి, మాలిన్యము 3 మట్టిబొడి, (వై. ని) ౪ సలిలము, నీరు (శే ని.)

పురీషాధానము. సం. వి. అ న. మలకోశము.

పురీషోత్సర్గము. సం. వి. అ. పుం మలవిసర్జనము.

పురుకుత్సుఁడు. సం. వి. అ. పుం. మాంధాత కొడుకులలో నొకఁడు.

పురుగు(వు, ర్వ)=ప్రువ్వు. వి. (సం. పులకః) ౧. క్రిమి, కీటకము.

ఆ దుక్కి నున్న పురుగు చెక్కినయున్నను, శౌచమునకుఁ గాదు సంగ్రహింప.

వి. పు. ౪ ౧౬౩.

ఉ. నాయపరాధ మేమియు మనంబున నెన్నక మానిమానసధ్యేయ కృపావిధేయ కుది దీనికి నెయ్యది రోవవంబునం, బోయి వసింతు నేఁ బురువుపుట్టువు దీకొడుదాఁక...

కాశ. ౪. ౧౪౧

చ. జరపక విశ్వనాథునకు సత్యము దప్పినరాజ రాజ్యసంహారణము నొంది దీనుఁ డయి యార్తి పెనంగొను మేనిపుండ్లనుం,బురదగు రిత్తపూరముల గ్రుంగి పయింబయి నంతకంతకున్, దొరఁగెడిపుర్వులం గలిగి తోఁడుచు నేడును రిచ్చపట్టులన్

కావ్యా. ౨. ౧౨౨.

౨. పాము.—

(వ్యవ) వానిని పురుగు ముట్టుకొన్నది

ఆ. వక్రగతిన యెపుడు వర్తించు రంధ్రముల్, వెదకుచుండు మిగుల విషము గురియు,నోఁగ పడగఁ బెట్టు నోయన్న యే మందుఁ, జెట్టు బన్ను మనెడిచెడుగుఁబురుగు.

హరిశ్చ ౫. ౭౩.

ద్వ. అపాపజాతి వ్రవ్వాదరంటఁ గఱచు, నప్పుడు నన్ను నే మని తలఁచితివొ.

ద్వి హరిశ్చ ఉ ౧౨౫౯ పం

—పురుగుఁబుట్రలు=పురుగులు (ఇందు పుట్రకు వేఱర్థము లేదు.)

గీ. అచ్చముగ నీటికందువ లరయువారు, బురుగుఁ బుట్రలు చెదరనుబ్బుచును నొక్క, పరిగ నవ్వుచుఁ జప్పట్లు చఱచువారు,హైరి తద్వేళఁ బాలెంబువార లెల్ల.

కవల. ౨. ౧౦౪.

జ:—పురుగుమేయు.

పురుగు(వు)మేయు. అ. క్రి (పురుగు+మేయు) నష్టము, నశించు.

ఆ. చదువు చట్టుపడియె శాస్త్రంబు మన్నయెయ్యె,బుద్ధి పురువుమేసెఁ బుణ్య మడఁగె.

భాగ. ౬. ౧౩౫.

ఆ. రాయ్యపుర్వు గ్రావ్వి శోధోవసుంధర, కగవి తెగినపగిది నిట్టు లేల,జలతలంబు విడిచి చనుదెంచి నాబుద్ధి, పుర్వుమేయఁ బెట్టఁబొందఁగంటి నేం పంచ. ౪ ౫౩౬

పురుజత్తు. సం. వి త్ పుం ౧. విష్ణువు. ౨. కుంతిభోజుఁడు, (అర్జునుని మాతులుఁడు)

పురుటము. సం వి అ పుం ౧ మానవదంపతులయందు ఇతర మానవులకు ఉండునసమానము ౨ సంలాపము ౩ జలజంతువిశేషము (శే ని)

పురుటాకు. (పురుడు +ఆకు) వి బాలెంతరాలికి గర్భార్థముకట్టు నొకదినుసు ఆకు. (భూతులని)

చ. అలిక విభూతిరేఖ నవహారమునం బురుటాకు మాట ..కన్పడఁగాఁ గురుమాపుచీరతో, నెలపురు డోమె నంత ధరణీవరకాంత యొకింత వింత గన్ ఇందు ౨ ౧౪.

పురుటాలు=పురుటియాలు. వి ఔ (పురుడు[1] +ఆలు) బాలెంతరాలు, ప్రసూత

క పురు డీబోటికి నిందిర,పురు డంబిక గాక యొరులు పురుడే యనుచున్, బురుటాలికిఁ బదిదినముల,పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యపుగరితల్ భాగ. ౧. ౫౧౬.

సీ. పురి క్రొత్త యీనినపురుటింటిలోనికిఁ బురుటాలితగవు గొంపోవు హరిణి.

వి శకుం. ౨. ౪౬.

పురుటిపాపఁడు. (పురుడు[1] + పాపఁడు.) = పురుటిలోని శిశువు, మిక్కిలి లేఁతశిశువు. (ఇస్లీ. పురుటిపట్టి.)

తే. పురుటిపాపనిఁ దొట్టెలోఁ బొందుగాఁగ, బెట్టి జోపించుకొని తాను బ్రియసతి యును...మందట నేఁగ పెలమి.
హరి. పూ. ౫. ౧౪౧.

తే...ఇపుడు, దేవకీసూనుఁ డైయున్న దేవదేవుఁ, డితఁడు పూతనాప్రాణపాయితఁ దలిర్చఁ, బురుటిపాపఁ డైయుప్పారుపరువమునకు.
హరి. ఉ. ౫. ౨౨౪.

వ. మేనా యు...అప్పురుటిపట్టి నల్లనల్లన పట్టి కొని
పి శకుం ౨ ౧౪౬

పురుటియాలు=పురుటాలు.

సీ. పాదివితేఁ గాననొ పొత్తులలోఁ బట్లఁ బోనాడుకొనిన తేఁబురుటియాండ్రు
రామా ౬ ౨౫౦

(పొత్తులలోఁబట్లన్=పొత్తులలోని బిడ్డలను )

పురుటి(యి)ల్లు. వి. (పురుడు[1]+ఇల్లు) ప్రసవ గృహము, బిడ్డనుకన్నయిల్లు.

తే ..సూతి,శాగృహాభిధ పురుటిల్లు నాఁగఁ దనరు.
ఆం. భా ౨. ౧౬.

మ. ఘనసంతోషము మీఱఁగా దశరథక్ష్మాపాలచంద్రుండు తే, చని కాంచెం బురుటింటిలోపలను...రాముని...
దశా ౪ ౨౦

సీ. ఆది పెవ్వానిదివ్యావతారమునకుఁ బూర్ణాం బుకంథంబు పురుటియిల్లు. కాశీ. ౨. ౪౦.

క. ఈపురుటియింటి కుద్య,ద్దీపంబును బోలె...
భాగ. ౧౦. పూ. ౧౧౫.

పురుడించే=పురణించే[2]. (√పురుడు[2].) స.

క్రి. ౧. పోలు, ఎనయు.

సీ. ఉరుబిచ్చె గంగకాబురువడి వినువారిఁబురుడించుకట్టుల సరసిజాస్య. ద. శా. ౧౦౦౪.

శా. సింగం బున్నగుహాని కేతమునకున్ శీఘ్రంబు నన్ వచ్చుమ్మాతంగంబుం బురుడించుచుం బవనపుత్రప్వీకృతం బైనయా,రంగాగారము సేర వచ్చి...
భార. విరా. ౨. 330.

సీ. బుద్ధి నింద్రాచార్యుఁ బురుడించు కూరత హానవుఁ దాలిమి వసుధఁ బోలు.
భార. అర. ౪. ౧౮౦.
హం పంచ. ౧. ౧౨౨.

౨. ఉపమించు, పోల్చు

మ వగదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁ డశ్వత్థామ గాండీవితోఁ, బురుడింపం దగువాఁడు వీని కెన యీభూలోకసంచారు లెవ్వరు లేరు...
భార ఉద్యో ౪. ౨౨౮.

క. ఖరకరకిరభిన్నములై,కర మెలమి వహించు నరుణకమలంబులతోఁ, బురుడింపఁ దగు నెగొజ్జఁగి,విరితూఁపులబంతిగములు వెలఁదికరంబుల్.
ప్రభా. ౨ ౪౯.

—అ. క్రి.=సామ్యమునొందు, పాటియగు

క...ఒండొంటితోడ బురుడించిన పెన్నుద్దుల మద్దుల ముద్దుల,నుద్దులశాలకుఁడు ద్రోచ క్షోణిం బడఁగన్. వి పు ౪. ౧౩౮ (క.ర )

ద్వి పొలఁతులు నీతోడఁ బురుడింపఁ గలరె
ద్వి హరిశ్చ. పూ ౨౪౬౪ పం.

సీ. నాతోడఁ బురుడించునాఁతు లందఱు విన
దశకు ౫. 3౫

పురుడు[1]. వి. దే. (క. పురుడు. త. పురుటు)

౧. జాతాశౌచము, సూతకము

తే పదిదినంబులు సన్నభూపాలు పతికిఁ,బురుడు వెడలె...
రామా. 3. ౧౨౪.

ద్వి. పురుడు దీఱినయంతఁ బుణ్యాహవేళ,వరున నానుతులకు వంశోన్నతులకు.
రం. రా. బాల. ౨౦. పా. ౧౪. పం.

సీ. జాతసూతకములు సమ మగుఁబురుడు నా...
ఆం భా. 3. ౫౬.

౨. పురుటిదినములు, జాతాశౌచకాలము.

క. ధరణిఁ గడుఁ బేదవారును, బురుటికి ఘృత
తైలధాన్యములఁ దెచ్చెర మం,దర సంగ్ర
హింతురు . భార. అర ౩ ౨౪౧.

సీ. నిమఁ గన్న పురుటిలోనన శంబరుఁడు దెచ్చి
యుదధిలోఁ వైచిన నాక్రమమున.
హరి. ఉ. ౩. ౧౯౭.

జః—పురుటాకు, పురుటాలు, పురుటిపాపఁడు,
పురుటియాలు, పురుటిల్లు, పురుడుపోయు.

పురుడు². వి (క. పురుడు, పురుడి త పుర్ఱై.)

౧. స్పర్థ, పోటి; మాత్సర్యము

క ధరణిఁ గలరాజా లెల్లను, బురు డనఁ
గాంపిల్యనగరమున కరిగెదరొం,డొరులం గడ
వఁగ . భార. ఆది ౭. ౨౭.

వ. ప్రభాకరుండు నభోమధ్యంబునకు వచ్చి
వెలుంగు చున్న నతనితోడి పురుడునం దేజో
మహిమ దలకొన్న ... దేవవ్రతుండు.
భార. భీష్మ. ౨ ౧౩౦.

సీ. హరి పురాంతకుతోడి పురుడున రజతాద్రి
కెన గాఁగ నిది సృజియించెనొక్కొ.
వృ. సిం ౨ ౪౦

క. రాజాలంకృత మర్కవిరాజిత మురుసింహ
మిథునరమ్యము ఘనవిభ్రాజిత మను పురుడు
ననో,రాజతగిరి మింటితోడ రాయుచు
నుండున్. కు సం ౭ ౯౭౫.

౨. పోలిక, సామ్యము.

క వరసతులఁ బతులఁ గదలడి,పురుడునఁ
దమలోనఁ జల్లఁబోరాద
కు సం. ౯ ౨౮౦

సీ. కార్యసముత్సాహధైర్యపారంబులఁ బురుడు
చెప్పఁగ రాని పురుషవరుఁడు.
శా. పంచ. ౨. ౧౫౩.

సీ. తైవడి తైవళి కయివడి కాడుపు మాదిరి
పోలిక మాడ్కి పురుడు,పోలిక యనఁగఁ
బోల్పొందు నుపమ పేరు. . .
ఆం. భా. ౨. ౩౦౨.

౩. ఉన్నత స్థితి,గౌరవము.

ద్వి. దొరయు గాఁ దనియెదే దొరకు బిడ్డండ,
పురుడు తే దనియెదే పురుషార్థపరుఁడ.
పండితా పురా. ౧౧౩. పా

—విశే. సాటి,సమానము.

క పురుషోత్తముతో నొప్పెడుఁ,బురు డితం
దంద్రుడు... హరి ఉ. ౫ ౭౦.

ఉ. పురు డిబోటికి నిందిర,పురు దంబిక గాక
యొరులు పురుడే యనుచున్, పురుటాలికిఁ
బదిదినముల,పురుడు ప్రవర్తించి కలిమిఁ
బుణ్యపురకరిత భాగ. ౮. ౫౧౭.

క హరుఁ డున్న తకరుణానిధి,శర ణన్నఁ బరి
గ్రహించు జగతి నతనికిన్,బురు డున్నదె
యజకనకాం,బరు లెన్నఁగ లేరు తత్ప్రభావం
బనినన్. ఉ. రా. ౩ ౮౭.

స. క్రి. (త.- పురివు) ప్రేమతో సమత్వముచూపు;
నిమురు

మ హరిణీవచ్చెద కానకుం దపము పేయంబోద
మంచున్ మృగం, బురుడున్
కు. సం. ౭. ౭౮౨.

జః పురుడించు, పురుడుచూపు.

పురుడుపోయు. అ క్రి. (పురుడు + పోయు )
(పురుటిలో బాలింతరాలికి) ఉపచారము చేయు.
(వ్యవ ) ఆమెకు పురుడుపోయుటకు తల్లిని తీసి
కొని వచ్చినారు.

పురుడుసూపు. స. క్రి. (పురుడు² + చూపు)
దృష్టాంతముగాచూపు, తార్కాణించు.

సీ. ఒరుఁ దొసంగినయాగి పురుడుచూపుచు లోభి
చే నర్థ మొయ్యనఁ జేఁదికొనుచుఁ, బురుడు
చూపినవైన బుడుకకేరనివాని వంగడిఁ
బొచ్చపోసాఁగికొనుచు. దశకు. ౫. ౧౭.

పురుదంశకము. సం. వి. అ. పుం. హంస.
(త్రి. ని.)

పురుదంశ(స)స్సు. సం. వి. స్. పుం. ఇంద్రుఁడు

'పురురము. సం. వి. అ. న. బంగారు.

పురుభోజస్సు. సం. వి. స్. పుం. ౧. మేఘము.
౨. పర్వతము (శే. వి.)

పురులు. వి. (త. పొరుల్. క. పురుళు, పొరుళు = యుక్తత)
౧. ధనము, వైశము.

క. పురులుగలఁ డిచ్చునని తన, పురులెఱుఁగక పిల్లమేము బుడుకక తాను౦, బురులఁ బొడకట్టి మెఱయుచుఁ, బురులీకయ తక్కి పోరెఁ బురిసమ్మక్రియన్
కు. సం. ౨. ౧౪౦.

౨. పరువు, గౌరవము, మానము. (బ్రౌను దీనిని "పురి" పదముయొక్క "బ. వ." గా గ్రహించి "గర్వము" అనునర్థమిచ్చెను)

గీ. మగలఁ గోరి తొల్లి మగువలు తపములు, వేసి నవసి రనినచెట్ట లెందుఁ, గలవె దీని కచ్చు నిలిపితి నీవ నీ, వలన సతులపురులు పొలిసెఁ గాక.
కు. సం. ౪. ౨౬౪

ద్వి. వల దని వారింపఁ జలమున ముక్కు, పాలి యించుకొన్నట్లు పురులు వోనాడి.
బస. పు. ౪. ౧౦౭. పా. ౨౦౧. పం.

ద్వి. పుట్టినాఁడ కులముపురులు వోనాడ, పె ట్టయ్యె తలఁచెడు పట్టి మాయయ్యె.
బస. పు. ౧. ౨౦. పా. ౪౫౭. పం.

ద్వి. ఇప్పాట నితరులఁ జెప్పెడి దేమి, తప్పులు దారులు దడఁబడఁ బలికి, వెలసినచదువులు వీటఁబో త్రొ, పొలిసిపోయిరి తమపురులు దూలఁగను.
బస. పు. ౧. ౬. పా. ౧౨౯. పం.

౩. స్వభావము, ప్రకృతి.

క. పురులు గలఁ డిచ్చు నని తన, పుర లెఱుఁగక పిల్ల మేముఁ బుడుకక తాను౦, బురులఁ బొడకట్టి మెఱయుచుఁ, బురు లీకయ తక్కి పోరెఁ బురిసమ్మక్రియన్.
కు. సం. ౨. ౧౪౦.

౪. శ్లాఘ్యము, పరాక్రమము (చూ. పురులోము.)
౫. సౌందర్యము
ద్వి. బుద్ధి తెఱుంగు లేఁబురులు ప్రాయమున, సిద్ధంబు భక్తుల శివునిఁగాఁ దలఁచు
బస. పు. ౧. ౪౨౪. పం.

జః—పురులోము

పురులోము. అ. క్రి. (త. పొగలోంబు. పురులు + ఓము) శ్లాఘము మెఱయించు, పరాక్రమము చూపు
క. పురులోమె నాఁగ శ్లాఘ్యము, మెఱయించె నటంచుఁ దోఁచు. ఆం. భా. ౩. ౧౦౪.

పురువు. విణ. (తు. తు., ద్వి. తు.) ౧. ప్రచురము, మిక్కిలియైనది, మిక్కుటము. వి. తు. పుం. ౧. పరాగము, పుప్పొడి. ౨. దేవలోకము, ౩. ఒకానొక దైత్యుఁడు. ౪. యయాతికొడుకులలో నొకఁడు (వీఁడు యయాతికి శర్మిష్ఠయందుఁ బుట్టిన మూఁడవకొడుకు) స్త్రీ. ఒకానొక నది

పురుషకము. సం. వి. అ. పుం. న. గుఱ్ఱములు వెనుకకాళ్లు రెంటిమీఁద మనుష్యునివలె నిలువఁబడుట.
శ్లో. దన్తాలికాధరణ నిశ్చలపాణియుగ్మ, మర్ధోదితో హరిరివోదయశైలమూర్ధ్నః, స్తోకేన నాక్రమత వల్లభపాలముచ్చైః, శ్రీవృక్షకీ పురుషకోన్నమితోగ్రకాయః.
శిశు. ౫. ౫౬. (అ. ని.)

పురుషకారము. సం. వి. అ. పుం. పౌరుషము, పురుషప్రయత్నము. (వ్యతి. దైవము.) - ౨. పురుషత్వము, పుంస్త్వము.

**పురుషకేసరి.** సం. వి. ఇ. పుం. నరసింహావతారమూర్తి.

**పురుషత్వము.** సం. వి అ న. మగవాడితనము, మగతనము ౨. పుంస్త్వము, మైథునశక్తి. ౩. పురుషస్వభావము, పురుషధర్మము.

**పురుషదంతిక.** సం వి ఆ స్త్రీ. మేదకీ.

**పురుషదఘ్నము.** సం. విణ (అ ఈ అ.) మనుష్యనిబంటి, నిలువు, (చేతులు పైకి నిలువుగాఁ బట్టుకొని నిలుచున్న మనుష్యుని పొడవుకొలఁది)

**పురుషద్వయసము.** సం=పురుషదఘ్నము.

**పురుషనాయకుఁడు.** సం వి. అ పుం ౧ సేనాపతి, దళవాయి, ౨. రాజు

**పురుషపశువు.** సం వి ఉ పుం ౧ పశుప్రాయుఁడగు పురుషుఁడు. ౨ పురుషరూపమగు యజ్ఞపశువు

**పురుషపుంగవుఁడు.** సం వి అ పుం మనుష్యశ్రేష్ఠుఁడు ఇట్లే పురుషసింహుఁడు, పురుషశార్దూలుఁడు, పురుషవ్యాఘ్రుఁడు, మొ॥

**పురుషము.** సం వి. అ పుం ౧ (వ్యాక) క్రియలమీఁది విభక్తులసంజ్ఞ. ౨ శాస్త్రము. ౩ మరపొన్న. కీ ౪. మనుష్యునిపొడవు, నిలువు (ఇదియొక యుపమాన విశేషము) ౫ పురుషకము, అశ్వస్థానక భేదము

శ్లో॥ పశ్చిమేనాగ్రపాదేన భువి స్థిత్వాగ్రపాదయోః, ఊర్ధ్వప్రేరణయాస్థానమశ్వానాం పురుషస్మృతః.

**పురుషమేధము.** సం. వి. అ. పుం. యజ్ఞభేదము (ఇందు మనుష్యుఁడు పశువుగా విశసింపఁబడును)

**పురుషవరుఁడు.** సం. వి. అ పుం విష్ణువు.

**పురుషవాహుఁడు.** సం వి. అ. పుం. కుబేరుఁడు, నరవాహనుఁడు. ౨. గరుడుఁడు.

**పురుషవ్యాఘ్రము.** సం. వి. అ. పు. గ్రద. (వై. ని)

**పురుషసూక్తము.** సం. వి. అ న. ఋగ్వేదమున 10 వ. మండలమందలి, 90 వ. సూక్తము. (ఇందుఁ బదియాఱుఋక్కులు గలవు)

**పురుషాంగము.** సం వి అ న. మగగుఱి.

**పురుషాంతరము.** సం వి అ. న తరము, పురుషజీవితకాలము

**పురుషాదుఁడు.** సం వి అ. పుం (మనుష్యభక్షకుఁడు) రాక్షసుఁడు

**పురుషాధముఁడు.** సం వి. అ. పుం. పురుషులయందు మిక్కిలి తక్కువైనవాఁడు, మిక్కిలి నిద్యుఁడు.

పురుషమృగము - A four-legged animal with a human f

**పురుషాయణము.** సం వి. అ పుం ౧. (ఆత్మప్రతిష్ఠగాఁగల) ప్రాణాది ౨ పురుషార్థము, (ధర్మార్థకామాది) ౩. పురుషకారము, పురుషప్రయత్నము.

**పురుషాయితము.** సం విణ (అ ఆ అ) పురుషునివలె ఆచరించునది. వి అ. న ౧ పురుషునివలె ఆచరించుట ౨. ఉపరతి, మగలాగు

**పురుషాయుషము.** సం. వి అ న పురుషుని ఆయుఃకాలము.

**పురుషార్థము.** సం. వి అ పుం ౧ పురుషప్రయోజనము (పురుషార్థములు నాలుగు — ధర్మము, అర్థము, కామము, మోక్షము) ౨. పురుషప్రయత్నము.

**పురుషాశి.** సం. వి. ఇ. పుం. రాక్షసుఁడు, మానిసిదిండి.

**పురుషాస్థిమాలి.** సం. వి. ఇ. పుం. శివుఁడు.

పురుషుఁడు. సం వి అ. పుం ౧ చతుర్ముఖబ్రహ్మ. (వై ని) ౨ మనుష్యుఁడు ౩ మగవాఁడు ౪ వంశమునందు ఒకతరమువాఁడు, తిగము. ౫ అధికృతుఁడు, నియుక్తుఁడు ౬ పరమాత్మ, విష్ణువు ౭ (సాంఖ్యతత్త్వములందు) ఇరువదియేనవ తత్త్వము ౮ (పురుషసూక్తమందు చెప్పఁబడిన) జగత్కారణమగు పురుషుఁడు

పురుషోత్తముఁడు. సం వి అ పుం ౧ పురుషశ్రేష్ఠుఁడు ౨ విష్ణువు, నారాయణుఁడు ౩ పరిజనశ్రేష్ఠుఁడు. ౪ జైనభేదము

పురుహము. సం విణ (అ ఆ అ.) ప్రచురము, మిక్కుటము, మిక్కిలి

పురుహూతద్విట్టు. సం వి ష్. పుం ఇంద్రుఁడు

పురుహూతి. సం వి ఇ పుం విష్ణువు, స్త్రీ దాక్షాయణి, ఈశ్వరి.

పురుహూతుఁడు. సం విణ (అ ఆ. అ) పెక్కండ్రచేఁ బిలువఁబడినవాఁడు, వి అ పుం ఇంద్రుఁడు

పురూరవుఁడు,(వస్సు). సం వి స్ పుం ఒక చంద్రవంశపురాజు (బుధునకు ఇలయందుఁ బుట్టినవాఁడు, ఊర్వశీకాముకుఁడు)

పురే=బాపురె (రే). అవ్య ౧ ఆశ్చర్యప్రశంసాదులను తెలుపును

(ఆశ్చర్యార్థము)

మ కలకంఠీ మణిసౌధజాలములఁ గాంచుం
జూడ నమ్మక్క చుక్కలరా జద్దిర కాఁడు
గా మరనదీకంజాత కోశమో పురే,యల
ఘుస్వర్ణశిరోగృహైకముకురం బంచుఁ బురీ
వాసు లగ్గలముం బందెము వైచి చూచి
రఘు డాకాంతాముఖాంభోజమున్.

రా. వి. ౫. ౬౩.

(ప్రశంసార్థకము)

శా విద్వేషుల్ మృతిం బొంది రీ,యుద్ధం
బేటికి నింకఁ జాలుఁ బని లే దోహో పురే
యంచు సం,బద్ధాలాపము లాడి మాన్చె
మరలన్... భాగ ౮. ౩౮౨.

(ప్రశంసార్థకము)

గీ కావ్యనాటకాలంకారగానమదన, శాస్త్ర
పరిచయు మహిమంబు జాలపాద,భామినీ
మణి చెలఁగె సుద్దామపటిమ, నా యనుర
భర్త మెచ్చి పురే యనంగ

ప్రభా ౪. ౬౪.

౨ (నిందార్థకము)

ఉ చాలు పురే సరోజభవ సత్పథవృత్తిఁ
దొఱంగి కూతు నొట్లాలరివై రమింప హృద
యంబునఁ గోరుట ధర్మరీతియే

భాగ ౩ ౩౮౦.

ఉ చాలుఁ బురే నరేశ్వర ప్రచండతరం బగు
నిట్టి సాహసం,బేల యొనర్చె దీవు ..

హరిశ్చ ౫ ౧౫౩.

చ ఘనకుపితాత్ముఁ డై యమునఁ గన్గొని
రాముఁడు వల్కెఁ డాయఁ జేరవఁ జనుదేశ
తక్కిటి పురే... భాగ ౧౦ ఉ. ౫౦౦.

పురోగంత. సం విణ (ఋ. త్రీ ఋ) ౧ ముందునడచువాఁడు ౨ ప్రధానుఁడు.

పురోగతి. సం. వి ఇ స్త్రీ ౧ ముందునడచుట, ముందఱపోక వి ఇ పుం కుక్క విణ. (ఇ) ముందుపోవువాఁడు

పురోగతుఁడు. సం విణ (అ ఆ అ) ముందఱనున్నవాఁడు, ముంగలనున్నవాఁడు.

పురోగముఁడు. సం విణ (అ ఆ. అ) ముందు నడచువాఁడు

పురోగామి. సం. విణ. (న్. నీ న్.) ౧. ముందు నడచువాఁడు ౨. ప్రధానుఁడు, వి. న్ పుం. కుక్క, శునకము. (శే. ని)

పురోగుఁడు. సం విణ (అ. ఆ. అ) అగ్రగామి, ముందునడచువాఁడు ౨ ప్రధానుఁడు

పురోజన్ముఁడు. సం విణ (న్ న్, అ న్) ముందు జన్మించినది వి న్, పుం. అగ్రజుఁడు, అన్న.

పురోజవము. సం. విణ (అ ఆ అ) ఎక్కువ వేగము గలది

పురోటి. సం వి ఇ పుం ౧ నదీప్రవాహము ౨. పత్త్రిశబ్దము, ఆకులచప్పుడు

పురోడాశము. సం వి అ పుం. ౧ హవిస్సు, యజ్ఞీయద్రవ్యము ౨ హుతశేషము 3 సోమరసము ౪ పురోడాశసహచరితమగుమంత్రము ౫ పిష్టపాత్రము, పిండిపాత్రము (వి ని)

పురోడాశీయము. సం విణ (అ ఆ అ) పురోడాశమునకు హితమైనది

పురోడాశ్యము. సం = పురోడాశీయము

పురోణి. వి చిన్నయుత్తరము, చీటి (శ ర, చి ని)

పురోద్భవ. సం వి ఆ స్త్రీ మహామేద ¶

పురోధ. సం వి ఆ స్త్రీ ౧ పౌరోహిత్యము ౨ నియోగము, అధికారము 3 నిరూపణము వి స్. పుం పురోహితుఁడు

పురోధసుఁడు. సం వి స్ పుం పురోహితుఁడు

పురోధానము. సం వి అ న ముందిడుట ౨ పౌరోహిత్యము

పురోధిక. సం. వి ఆ. స్త్రీ అందఱికంటె అధికురాలయినభార్య, మిక్కిలియనుంగయిన యిల్లాలు

పురోఽనువాక్య. సం వి. ఆ. స్త్రీ ఋగ్వేదము

పురోభాగి. సం. విణ. (న్ సీ. న్) ౧ తనంతటముందుపడువాఁడు, పడటముగలవాఁడు ౨ తొందరగలవాఁడు, తొందుగలవాఁడు. 3. ఎప్పుడు తప్పులేవెదకువాఁడు, దోషైకదృక్కు. ¶

పురోభాగుఁడు. సం. విణ (అ. ఆ. అ) = పురోభాగి

పురోమారుతము. సం వి అ పుం. ౧. ముందటి ప్రక్కఁగొట్టినగాలి; పూర్వదిక్కునఁబుట్టినగాలి ఇట్లే పురోహితము మొ

పురోవర్తి. సం విణ (న్ సీ న్) ముంగల నుండునది, ఎదురనున్నది

పురోషి. సం వి న్. పుం. తోడేలువంటి మృగవిశేషము (వై ని)

పురోహితిక. సం. వి అ స్త్రీ. పురోహితపత్ని.

పురోహితుఁడు. సం. విణ (అ ఆ. అ) ముందిడఁబడినవాఁడు ౨ నియుక్తుఁడు, ఒకపనిఅప్పగింపఁబడినవాఁడు —వి. అ. పుం. శుభాశుభ వైదిక కర్మములను జేయించుచు మేలు కీడులను దెలుపుచుండెడి యాచార్యుఁడు, ఒజ్జ (శ. ర. చి ని)

పుఱి.(ఱ్ఱి). విణ ఎడమది, వామము. ఇది "చేయి" పదమునకు పూర్వముగానేయుండును.

ఉదా: పుఱ్ఱిచేయి, పుఱిచేయి

జ. పుఱ్ఱిచేయి

పుఱి. (ఱ్ఱి) చేయి. వి. (పుఱి (ఱ్ఱి) + చేయి.) ఎడమచేయి, వామహస్తము

చ అరిగి మహాభయంకరతరాహవదోహలబాహ వప్రతా, పరుచులు వోలుచెందిరపుఁబావడచే బుఱిచేయి వీచి .. కవల ౨. ౧౫

పుఱికి. వి. నేయి కొలచెడిపాత్రము.

వ దివసవడిదగుంప్రలకు(ం)చాలు 3. పప్పువ ౧ నేపుఱికి (౧) వీనిసరిఋంప్పంగొ, రలు... ద. శా. ౧౦౧౪

పుటి (ట్టి) యు=పుట్టి. వి. (క. పుటు) పుఱ్ఱె, కపాలము, తల యెముక.

చ కఱచిన పీసుగు స్వాదుదక ప్పెరయు న్మొలచు బచ్చితోఁకలుఁగ్, బుటియల పేరులుగా మెదడుపూఁతయు ఘు మ్మని మూగు నీఁగలుగా ఈ. వారి ౨. ౧౨౭.

ద్వి పుటియల నటట ౖమింగి పులి ౖ తేఁపు లదర, నజుగక పొరలాడి యఱచు రక్కసులు
ద్వి. వారిశ్చ. ఈ. ౧౭౩౭. పం

పుటుడ. వి (సం పురోడాశః) భక్ష్యవిశేషము

క. ఈ క్కటుకా బుటుడలపైఁ, జక్కరకా వడలపై వొనఁగు తేనెలకా, ౖగుక్కిళ్లు ౖమింగు టరుదా, పుక్కిళ్లం బెట్టుచుండ ములు విన్నయ్యలో ఐహా ४ ३०

పుట్టు. వి ౧ చింపుటయం దగుధ్వని కనుకరణము
(వ్యవ) ఆ బట్ట పుట్టున చింపివాఁడు
౨ పలుచని మలము (శ. ర) ౩ పలుచని బురదమెం. (ౖ పా)

పుట్టె (టె)=పుటియ.

సీ. ఎలనీటి బొండలంబులువోలె మెద డెల్ల జిట్టిపై చిన డొల్ల పుట్టెగములు.
ఆము ౬ ౧४

పుల=పుల్ల. విశ. పనుపు మించిన తెలుపురంగు గలది. (శ. ర. చూ. పులకండము)
జః పులకండము.

పులకండము=పుల్లకండము. వి. (పుల+ కండము=పుల్లరంగుగల ఖండ శర్కర.) కలకండ, పటిక బెల్లము.

సీ. శర్కరాభేద సంజ్ఞలు నవాతు జావోజా పులకండ మనఁగను బొలుపుగాంచు.
ఆం భా. ౨. ౨४౧.

ద్వి పులకండ మెలుకు నీ ముద్దులమాట, లల వడ వీనుల వాలింపకున్న.
ద్వి వారిశ్చ. ఈ ౧౯౯४. పం

క పలుకులఁ బులకండ మెలుకఁ బలికెం గలకకా. మనుచ ర ४० ద్విక ౮ ४४.

క పులకండంబులు గలిపిన, నలు వగు సలిలము రసాయనం బగు పగిదికా నరస ౩ ४

పులకము. సం. వి. అ పుం ౧. ఒక దినుసు తాయి వజ్రమణి (వై. ని) ౨ మణిదోష విశేషము మణులయందలి చీలిక. ౩ కంకు వ్వము ४ గజాన్నపిండము ఏనుఁగున కిచ్చెడి యన్నపు కబళము ४. హరిదళము ౬ గల్వ ర్కము, మద్యము ౖతాగెడి పాౖత్రము ८. కదప ౯ ౮ నులిపురుగు ౯ పురుగు ౧౦ చెట్టుమీఁది నల్లపురుగు (శ ర) ౧౧. గగు ర్పాటు, రోమాంచము వి అ న ౧ రేచక మను గంధౖద్రవ్యము ౨ పుడుక ఇంధనము

పులకరము. వి (సం పులకః) ౧. గగుర్పాటు, రోమాంచము

సీ. పులక లనంగను బులకర మనఁగను గగ్గ రనంగను గగు రనంగ, గరుడా లునంగను బరఁగు రోమాంచము .
ఆం. భా. ౧. ౧४౧.

౨. జ్వరము. (శ ర)
(వ్యవ) వానికి నాల్గురోజులనుండి పులకరము తగులుచున్నది
జ పులకరించు

పులకరించు. అ ౖకి (√ పులకరము) గగుర్పాటుచు, పులకితమగు

తే. మానసాయకశరవృష్టి నానుకతనఁ, బొడము చలిచేత నెమ్మేను పులకరించు, కరణి రోమాంచకంచుకకలిత మగుచుఁ, దనువు గనవయ్యె దనుజమర్దనున కపుడు
దశా ౨. ౨౭४.

**పులకలు.** వి. (సం పులకః) రోమాంచము. (దీనికి తఱుచు బహువచనమందే ప్రయోగము కన్పడుచున్నది)

సీ. పులక లనంగను బులకర మనఁగను గగ్గురినంగను గగు రనంగ, గగుదా ల్పనంగను బరగు రోమాంచము...

ఆం భా ౧ ౧౪౧

క. తరుణీ తరుణాంగుళములు, కరమునఁ దొమలించి యహీ మకరకులజశిఖా,భరణము తను వునఁ బులకలు, దొరయఁగ వనవీథిఁ బ్రియ ముతో విహరించెన్ ఉ. రా ౬. 33

చ నలినదళాక్షుఁ జూచి నయనంబుల మోద్యఁగఁ జాల కాత్మలన్, వఁచి తదీయమూర్తి విభవంబు దలంచుచుఁ గౌఁగిలించుచుం, బులకలు మేన జాదుకొనఁ బొల్తులు సొక్కిరి

భాగ ౧౦ ఉ ౧౦౭౭

వ...మిన్ను విఱిగి పయింబడినపడువున బెడంగు వడఁ గలయం దలకొనుపులక మొలకపయి రునకుం బాఱుదుర్వారవారిపూరంబనన్

మనుచ. 3 ౯

**పులకాలయుఁడు.** సం వి అ. పుం కుబేరుఁడు

**పులకి.** సం విణ (న్ నీ న్) పులకలు గలవాఁడు వి న్ పుం. కదంబము, కడిమిచెట్టు (వై ని.)

**పులకించే.** సం అ క్రి రోమాంచితమగు, గగుర్పాటుగలదియగు

క పలుతలలు ముఖవికాసము, వొలియక పడియున్నసమరభూభాగము పై, ల్లలరినతామర కొలనిం, దలఁపించెన్ గగనచరవితతి పులకింపన్. భార. ద్రో 3. ౪3

తే. అట్లు ప్రత్యక్షమైనపద్మాక్షు నంత, రిక్షమునఁ గాంచి ముని ప్రమోదాక్షిజలము నిగుడఁ బులకించి కరటిఘంటికలశాళ, ములుగ నిట్లని యమ్మహాత్ముని నుతించె

ఆము. ౪. ౧౫

సీ పొలయల్కఁ దలఁపులఁ బులకించుఁ బులకించి బింకంపుఁగౌఁగిళ్ల బిగి భజించు.

కావ్యా 3 ౧౭౬

**పులకితుఁడు.** సం విణ. (అ ఆ అ) పులకలుగలవాఁడు, పులకించినవాఁడు, హర్షించినవాఁడు

**పులకోద్గమము.** సం వి అ పుం గగురుపొడుపు.

**పులగ(ల్గ)ము.** వి (సం పులాకః) పప్పు చేర్చి వండినయన్నము, కృసరాన్నము

క. పులగముఁ బాయస మట్టులుఁ,బలలము నర్చనకుఁ గాక పక్వము లయినం, గలుగు నభోజ్యత్వము వి,చ్చలవిడి వంటకము చేసి చనదు భుజింపన్ భార శాం ౧ 3౭౪

చ .చేసి మెం,త్తనిపులగంబు బెల్లము ఘృతంబు ఫలంబులు నారగింపు చే,సిన మది మెచ్చి యాత్మ పదసిద్ధికిఁ బాత్రముసేయు నాతనిన్ సిద్ధేశమఠ ౫ (చి.వి)

మ...మాయక్క నీ,కును బుల్గం బిడ పంచెఁ గైకొనుము. భల్లా ౫ (క ర)

సా: పులగముపైనిపప్పు=(పులగములోనే పప్పు ఉండును కావున పైగా వడ్డించినపప్పు ప్రియముగా నుండదు)=అనావశ్యకమగుటచే ఎక్కువ ప్రియము గానివస్తువు.

క...అప్పిండియుఁ బులగముపైఁ, బప్పుగతిన్ పైప కతఁడు పాఱఁగఁ జల్లెన్.

చెన్న. బ. ౭. ౫౭.

**పులపొ(ల్పొ)డుచే.** అ క్రి. పులుకుపులుకునఁ జూచు,ఱెప్పలు మూయుచు తెఱచుచు నుండు.

చ. తడితల డిగ్గి ముంప జడతం దుదకెప్పలఁ గన్ను విప్పి పుల్పాడుచుచు నీరు ముంగ అలపోలిక ముక్కులఁ గూడ నోటఁ గొం, తొడియుచు గూటికజ్జ సగ మొత్తుచు కెక్కవిదుర్చు మున్ను గావడఁకుకె కాక చేష్టుడిగ వత్సము పత్సలు జానువుల్ చొరక ఆము ర. ౧౧౮

౨ కెప్పు వేయక చూచు

క. చప్పుడు సేయక సంజ్ఞకుఁ, జప్పట్లిడు కొంచుఁ గొండసరియలవెంటన్, జప్పళ్లకుఁ బులపాడుచుచుఁ, జో ప్పరయుచు నీల వెట్టుచును శబరభటుల్.

భల్లా 3 అ (శ ర)

పులము. సం విణ (అ. అ అ) విపులము వి

అ. పుం పులకము, గగ్గురు

పులసరము. వి ౧ పాకము చెడుటవలనఁ గలి గినపులుసు, (శ ర చి ని)

౨ అజీర్ణవ్యాధి, (ౘా) 3 ఉద్రేకము (ౘా.)

జః పులసరి

పులసరి. విణ (√పులసరము) పొగరుఁబోతు

ద్వి కలవానియట్ల నిక్కుంబు నీ వొక్క, పుల సరితనమునఁ బుచ్చితి కొలుచు బస పు పురా. ర ౧౧౧ పా (శ ర ౘా)

బులుసరి. ముద్రి

పులస్తి. సం వి ఇ పుం పులస్త్యుఁడు

పులస్త్యుఁడు. సం. వి. అ పుం సప్తర్షులలో నొకఁడు (ఇతఁడు బ్రహ్మకర్ణమునుండి పుట్టిన వాఁడు. ఇతనిభార్య కర్దమునికూఁతురగు హవి ర్భుక్కు

పులహుఁడు. సం. వి. అ. పుం సప్తర్షులలో నొకఁడు. (ఇతఁడు బ్రహ్మనాభినుండి పుట్టిన వాఁడు. ఇతనిభార్య కర్దముని కూఁతురగు గతి)

పులాకము. సం వి అ పుం తుచ్ఛధాన్యము పొల్లు. ౨. భక్తసిక్థము అన్నపు మెతుకు 3. సంక్షేపము

పులాకి. సం వి న్ పుం వృక్షము, చెట్టు (వై వి)

పులాయితము. సం వి అ న అశ్వగతిభేదము.

పులాలిక. సం వి. ఆ స్త్రీ నాపాగ్రదంశమను విషోపద్రవభేదము

పులి1. వి (క. పులి హులి త పుల్ =) వ్యాఘ్రము వేఁగి

క పులి గోల వేసిన ట్టిట్టలపురయంబునఁ గడం గుటయుఁ దద్వత్స, స్థలమునఁ గిరీటి కెం ద, మ్ముల నాటఁగ నేసె బొమలు ముడి పడుచుండగ భార. విరా ౫ ౧౭౮.

సీ సెల సెప్పకొని రొప్పుపులి నైనఁ బీడించి పడవైతుఁ జొచ్చి నీపాదమాన

మనుచ ర 3ర.

మ. ..ఆపులికి దుర్వారోద్యమం డైనయా,హరి యుం దోడకె ..

భార ఉద్యో ర. ౨౪౮.

(ఇట శౌర్యగుణముచే పులివంటి వాఁడని భావము)

సా. పులికూన పూరి మేయునాశిగొప్పకుల మునఁ బుట్టినవాఁడు నీచకృత్యములు చేయఁ డనుట.

—పులి నాకి విడుచుట = గొప్ప అపదతప్పుట

తే నాకవల్లభ నీమీఁద నాటికొన్న, మాని కోపాగ్ని దివిజసంపదలమీఁదఁ, బోయె నంతియ చాలు నీపుణ్యమునను, వేయు నేటికిఁ బులి నాకి విడిచినట్లు

వి పు ౧. ౧౪౬.

—పులిమీసల నుయ్యల లూఁగుట, = ప్రాణ హానికరమగు సాహసకృత్యమును చేయుట.

ఉ. చేరకుఁ డింతి కావ్యఁ డిటుచేరిచఁ బ్రాణము మీఁద వచ్చునం, ఘోరమహాసంభవాన్వయుఁడు భూజ్యుఁడు గాన సహించియుంటిగా, కారయ నన్ను కొంతటిబలాధిపు లైనఁ దృణీకరింపకే, మీర లెఱుంగ రిట్లు పులి మీసల నుయ్యల లూఁగ వచ్చునే.

భోజరా. 3 3౮.

ఈనినపులి = అతికోపముగల క్రూరుఁడు. (ఈనిన పులికి కోపక్రౌర్యము లెక్కువయని ప్రతీతి)

సీ. కొంఱవితో నడుకొత్తి గోకి నట్టినిన పులితోడ సాముకుఁ బూనినట్లు వేఁు ౪ ౫౦

(ఈనిన పులితోడ సాముచేయుట = ప్రాణహాని కరమగు సాహసకృత్యము చేయుట)

—మెత్తనిపులి = పైకిసాధువుగాఁ గనఁబడుచు తీక్ష్ణస్వభావము గలవాఁడు

చ. . ధర్మమూర్తి మెత్తనిపులి ..

భార ఉద్యో ౨. ౧౪

జ. పులికోచ, పులిగోరు, పులిగోరుపట్టులు, పులిగోళ్ల వంకలు, పులిచెవులాకు, పులిజున్ను, పులిజాదము, పులిపెంజర, పులిమేకము, పులియడుగుకపసి, పులియాట,

పులి2. విణ. (√పులియు క. త పుళి) పులిసినది. శుక్తము.

(ఇది సమాసపూర్వావయవముగానే కాన వచ్చుచున్నది చూ పులికడుగు, పులికూడు)

పులిచేల్ల = పుల్లనిమజ్జిగ

సీ. పేరి పక్వం బైనపెరుఁ గుండఁ గవ్వంబు పులిచల్లలో నుంచి చిలుకఁబోవు

శుక ౨ ౫౭౧

—పులిచారు = పుల్లనిచేరు, చేరు.

క. పులిచారు వంచెనొక్కతె, పులిచాఱలచీరఁ గట్టి భోక్తల కేకా, వలిచారు వంచరీకా, వలిచారులక్కచాలి వహీ వహీ నొగడఁగా.

విహ. ౪. ౨౫.

జ పులికడుగు, పులికాపు, పులికాయ, పులిగంజి, పులిగాయము, పులికూడు, పులిచించలము, పులిచింత, పులిచెంచలి, పులిత్రేఁపు, పులినీరు, పులిమెట్టు, పులియంబలి, పులియఁబాఱు, పులియు, పులిరోూర, పులివరుగు, పులివోపు, పులుప, పులుసు, పులుసుఁగూర.

పులిందము. సం వి. అ. న. దేశవిశేషము

పులిందుఁడు సం. వి అ. పుం. అడవియందు వాసముచేయుచు మిక్కిలి జీవహింసాపరుఁడై తిరిగెడి యొకజాతి బోయవాఁడు (ఇంద్రుఁడదితిగర్భమును గత్తిరించుటవలని భ్రూణహత్యా పాపముచే తపశ్చర్యకుఁ బిదప తన దేహమునుండి పుట్టిన యొకజాతి; వసిష్ఠుని హోమధేనువు ఫేనమునుండి పుట్టినయొకజాతి

పులికడుగు. వి (పులి2 + కడుగు) పులిసిన కడుగునీరు, ధాన్యామ్లము. (శ. ర)

పులికాపు. వి (పులి2 + కాపు) ౧ లోహవిగ్రహములను శుద్ధిచేయుట కుపయోగించు చింతపండునీరు. (బ్రౌ)

౨ చింతపండు గలిపిన నీటితో లోహాకృతములయిన దేవతా విగ్రహములను తోమి శుభ్రముచేయుట (వా)

పులికాయ. వి (పులి2 + కాయ) పుల్లనికాయ

క పులిచెలికలోని కేఁగుం, బులికాయల కరిగి యొక్క పులిచింతపాదం, బులి యుండ జాగిలముచేఁ, బులిపులి గావించె నొకఁడు పులిపె చెల్లక.

రా వి 3 ౬౨.

పులికూడు1. వి (పులి1 + కూడు) పులియొక్క ఆహారము, వృషభము మెం.

ఆం. భా. 3. ౬౦.

పులి(కూ)గూడు2. వి. (√పులి2) పులిసిన యన్నము; పులిరోూర, ఉప్పు పులుసు,

కారము, పసుపు మున్నగువానిలో రుచికర ముగా చేసిన యన్నము.

సీ. పులిసినవంటకంబును వృషభంబును పులి కూడు వాఁగఁ జెంపొందియుండు
ఆం భా 3 ౭౦

(ప్రాఁతవ్రాఁత ప్రతులపా పులిహారంబు అని బ్రౌ వావిళ్ల. పా. పులిహారము=వ్యాఘ్రాహారము. బ్రౌ. వ్యాఖ్య)

3. భిక్షాన్నము, భిక్ష మెత్తి తెచ్చికొన్న యన్నము

క. పులిగూడు తిండి గొరగం,గలిచియు నోచెల్ల యింత గల్పించెదు... కు సం ౩ ౧౩౪

చ. చెలి పులిగూడు మానుపని శ్రీదునిఁ గాదని వసు ౧ ౯౯

పులికోచే. వి. (పులి¹+కోచ) పులి మొగవంటి మొగముగలిగిన యొక విషజాతి పాలెపురుగు. (శ. ర బ్రౌ, పురికోస అని వాడక)

పులిగంజి. వి (√పులి²) పుల్లనీళ్లు, అరవాళము, (శ. ర.)

పులిగాయము. వి (√పులి²) పూర్తిగా మానని గాయము, పులినీరు కాఱుగాయము (ఆతీన గంటిమచ్చ శ ర)

క తిలకించితివే నృప మొక్కల మగునీచెంచు మేనఁ గలపలుగంటుల్, బలుసింగపుఁ బలుగం ట్లా,పులిగాయము లెల్లఁ బెద్దపులి గాయమ్ముల్ చంద్రా ౨ ౪౭

పులిగోరు. వి (పులి¹+గోరు) ౧. వ్యాఘ్రనఖము; పులిగోళ్లుపెట్టి చేసిన పతకము; అట్టి పతకము గులహారము. (శ ర)

క. ఇవి పందికొమ్ము గాయము, లివి సింగపుఁ గోర తీర లివి యేనుఁగుపో, ట్లివి పులిగోరుల చెనకులు, సువ్వగింజకుఁ గో టిడదు తనువు గనుము నృపా రా. వి. 3. ౪౯.

సీ తీరైనగళమునఁ దోర మైనకడానిజాళువా పులిగోరు కూలియాడ. ఇందు. ౨. ౧౪౧.

చ మెడఁ బులిగోరు ఫాలమున మేలిమిపచ్చల రావిరేక .. చంద్రా. ౨. ౭.

౨. వ్యాఘ్రనఖము. శ్రీ.

సీ. పులిగోరుచె ట్టన వెలయు వ్యాఘ్రనఖంబు... ఆం. భా. ౨. ౬౨.

పులిగోరు పట్టులు. వి (√పులిగోరు) వస్త్ర విశేషము

వ...వెలిపట్టులును పహాంబట్టులును పులిగోరు పట్టులు నుదయరాగపట్టులును క్షేత్రపట్టులును... ద్వా 3. ౨౦౬.

పులిగోళ్ళ వంకెలు. వి బ (√పులిగోరు) ధాన్యవిశేషము

సీ. ఏదుకత్తులు వంక లినుకరాజనములు పులిగోళ్ల వంకెలు బొగడసరులు.
హంస. ౪. ౧౨౭.

పులిచించేలము=పులిచెంచేలి. వి. (పులి²+చెంచలి) ఒకానొక యోషధి శ్రీ.

సీ విషకంటకాలామ్లకేతసంబును నీరుచించలంబును పులిచించలంబు హంస. ౨. ౨౫౯.

పులిచింత. వి (పులి²+చింత) ౧ పులిచెంచలి, చుక్రికి, నేలపై ప్రాఁకు ఒకజాతి యోషధి శ్రీ. (చి ని. శ ర చూ పులిచెంచలి. దీనియాకు పుల్లగానుండి పచ్చడి కుపయోగించును)

౨. గుల్మవిశేషము పొదగా పెర్గెడు ఒకజాతి చెట్టు

సీ. పులిచింత కోడుగు ములుమోదుగును వెర్రి పుల్లవెలఁగ వెత్తిచిల్ల చిల్ల
హంస ౪. ౧౧.

క. పులిచెలికలోని రేఁగు, బలికాయల కరి యొక్క పులిచింతపొదం,బులి యుండ...
రా. వి. 3. ౭౨.

**పులిచెంచేలి.** పులిచింత, పులిచించేలము వి చుక్రికి కీ (చి ని శ. ర. మునిషణ్ణకమని ఆం భా. సీ. మునిషణ్ణ కాఖ్యదగును, పులి చింతయనఁగను బులిచెంచలియనంగ ... ఆం భా. ౭. ౭౮ చుక్రియను మునిషణ్ణకి మును భిన్నములని అమరము.)

**పులిచెలిక.** వి (పులు$^{2}$ + చెలిక వృత్తిని వర్ణ వికారము) క్రొత్తగా బీడుపెట్టిన నేల

క పులిచెలికలోని రేఁగుంబులికాయల కరిగి
రా. వి ౩. ౭౭.

**పులిచెవులాకు.** వి (పులి$^{1}$ + చెవులు + ఆకు) ఒకానొక మందుచెట్టు

**పులిజేన్ను.** వి (పులి$^{1}$ + జున్ను) పులిపాలతోఁ జేసినజున్ను. (శ ర)

సీ హితబహుశ్రుతధర్మరతసారశాస్త్రపూర్వతల
మన్ద్విజాలదుర్గముల నిలిపిఁ, పులిజున్ను
మొదలుగాఁ బురుషాయుషావధి కం దుండ
సవరణ ల్పొందువటిచి
ఆము ౪ ౨౬౧

తే గసగసలు వీకవిండ్లు సోగచిలుకిలును, సింగ
ములు పులిపిల్లలు జింక లేడు,గములు మానిపి
కోతులు కాఱుపోఁతు, లేడి కదుపులు పులి
జున్ను పాడిపసులు ప్రబంధ ౧. ౧౩౫

చ కమఁగొని పెమ్మనం బలరఁగాఁ బులిజున్నును
గేఁదుకన్నుఁ దె, మ్మనినను దెచ్చువాఁడ.
విక్ర ౧ ౧౬౪

మ. వశె నన్నక్ వెల యిచ్చి కొంద్రు మురజ
ద్వత్నస్థలీరత్నముక్,పులిజు న్నేనియు నమ్మఁ
జూపుదురు . వణిగ్వర్యుల్ యశోధుర్యులై
సుద. ౧ ౭౭

**పులిజూదము.** వి (పులి$^{1}$ + జూదము) ఒకానొక యాట. (గళ్లుగీసి పదుసైదు కాయలను మేఁకలుగాను మూఁడుకాయలు పులులుగాను గ్రహించి యాడెడు ఆట పులిబోను అని కొం. దఱు)

సీ. ఒడ్డు,విడుపు నెట్టుడుగాయ విండ్లమ్ము
లాటలు పులిజూదములు
హంస ౩ ౧౪౬

**పులితోఁడుగు.** వి ($\surd$పులు$^{2}$) వన్య వక్రకంటకము కీ (గురివెందవంటి యాకులుగలది చి ని)

**పులిత్రేఁపు.** వి (పులి$^{2}$ + త్రేఁపు) అజీర్ణపు త్రేఁపు, పుల్లని త్రేనుపు

ద్వి పుటియల నట మ్రింగి పులిత్రేఁపు లడర,
నటుగికి పొరలాడి యటుచు రక్కసులు
ద్వి హరిశ్చ ఉ. ౧౬౩౭ పం

**పులినము.** సం. వి అ పుం. న ౧ సైకతము, నీరువెలిసిన పిదపఁ గనఁబడు నిసుకదిబ్బ

**పులినవతి.** సం వి ఈ స్త్రీ నది ఏఱు.

**పులినీరు.** వి (పులి$^{2}$ + నీరు) రక్తము విఱిగి గాయములోనగు వానియందుండి కాఱెడి నీరు.

చ వెలుఁగుల కోని వే వెలుఁగు వేఁడిమి సుట్టిన
గ్రుక్కుపాపగా, కలశ సమస్త నీ మృదుల
కాయముల న్బులినీరు గ్రుమ్మ బొబ్బలగతి
కూపకప్రతతి భాసిలె
చంద్రా. ౭. ౭౭.

క హరునఱకాలం జొరఁబడి, శిరమునకుక్
వెడలె నీదు సితఖండము చంద్రిర యది పెల
వడి సేఁడుక్, దొరఁగెడుఁ బులినీరు గాంగ
తోయము పేరక్ చంద్రా ౫, ౪౫.

**పులిపి(ల్పి)రి=పులిపులి$^{1}$.** వి దేహమునందు మిరియములవలె లేచెడు దుర్మాంస విశేషము.

సీ...దొప్ప, చెవులుఁ బిల్లికనులుఁ జెక్కిలి పులి
పిరి గొగ్గిపండ్లును ముదికోఁతి ముఖము
హరిశ్చ. ౪. ౧౭౯.

ద్వి కఱుబోఁచు గర్దమున, బరుసు మీసముఁ
  జెక్కుపైఁ బులిపిరియు నఱుకు బొద్దుమ...
    నవ. 3. ౧౪౯. పా. ౨౩. పం.

ద్వి. మిడిపండ్లు చెక్కుటిమీఁది పుల్విరియు
    ద్వి హరిశ్చ. ఉ ౧౦౭౫. పం.

జ: పులివిరికాయ

పులివిరికాయ=పులివిరి. (శ. ర)

పులిపులి[1]. వి పులివిరికాయ (శ ర)

జ. పులిపులికాయ

పులిపులి[2]. విణ. అవవర్థితము, నలఁగినది

చ పులిపులి యయ్యె నంగలత పాక్కు మధా
  ధరబింబ మింతికిఁ, నలినలి యయ్యెఁ
  గౌను. .            శుక ౧ ౨౦౫.

సీ. పులిఁ గ్రమ్ముకొని పులిపులిగ నీఁటెలఁ
  గ్రుమ్మి యేపుతో మగఁటిమిఁ జూపువారు.
    రసిక ౧ ౧౧౨

క మిలమిలనిగోళ్లఁ జెలుపలు, గులగులలుగఁ
  గొట్టు నచటి కోల్పులులు గవిం,బోల
  వొలయ సెతిగి యెఱుకులు, పులిపులి యన్న
  పుడ కలిసి పులిపులిసేయుఁజు
    చంద్ర ౨. ౯

పులిపులికాయ=పులివిరికాయ. (శ ర)

పులిపెంజెర. వి (√. పులి[1]) కాటుక రేకు
  పాము. ఒకజాతి పొడపాము (శ ర)

పులిమిపుచ్చు. స క్రి (పులిమి+పుచ్చు) ౧
  కప్పిపుచ్చు

సీ. నందుఁ దదే మన్న నవ్వుచు మీ శేల పొ
  మ్మంచు నోకపేళ పులిమిపుచ్చు.
    దశా. ౯. ౨౭.

౨. వంచించు, మోసముచేయు.

ద్వి. అలవిఁడివారల వణఁకించినట్లు, పులిమి
  పుచ్చిన శేఁడు పోనీము నిన్ను
    ద్వి పరమ ౩ ౫౪౪. పా.

3. నలిపివేయు.

ఉ కరాళదివ్యబా,ణా వళు లెచ్చి రా వొడిసి
  యుఁగ్రతమప్రదరాగ్ని కీలముల్, వోవఁ గరం
  బులం బులిమిపుచ్చుచు మారుతి యుగ్రదాన
  వుల్, త్రోవ సెదిర్చినం గడవి త్రొక్కుచు
  మక్కువఁదూఱి గ్రక్కునఁజు
    రామా. ౬. ౨౦౩.

౪ కాటాకూటముచేయు, అకుశల పనిచేయు

క తెలుఁగుకవిత్వము చెప్పకఁ, దలఁచిన కవి
  యర్థమునకుఁ దగియుండెడు మాటలు గొని
  వకులం బ్రాసం బులు నిలుపక యొగిని
  బులిమిపుచ్చుట చదురే    నిర్వ ౧. ౩.

పులిమెకము. వి (పులి[1] + మెకము) మత్స్య
  విశేషము (శ ర. బ్రౌ)

పులిమెట్టు. వి (√పులి[2]) తేర్చినకడుగురొుక్కు
  అడుగుది (శ ర. బౌ) అభిఘతము, పులియఁ
  బెట్టిన కడుగు

తే... మెట్టనఁగ మెడు ద,నంగఁ బులిమె ట్టనంగఁ
  జెలంగుచుండు, నభిఘతాఖ్య...
    ఆం. భా ౨. ౨౫౦.

పుల్(ల్లి,ల్లె)య. వి పర్ణకృతభోజన పాత్రము,
  విస్తరి

క. సెలవాల్లు మునియుతుంద్రై,పలాశపత్రముల
  పులియఁ బాయక ద్విజుఁ డి,మ్మ భోజనంబు
  చేసిన, ఫల మిలఁ జాంద్రాయణంబు ఫలముం
  గఱుగుఁ.    విజ్ఞా ఆచా. ౩౪

సీ. అగ్నికార్యము దీర్చి హరుని నర్థ్యర్చించి
  ములు మోదుగాకులఁ బులియఁ గుట్టె
    కాశీ. 3. ౧౨౦.

తే ఇచటి కొంగిలి పుల్లియ కేలవచ్చె
కాశీ 3 ౯౫

ద్వి ప్రొద్దునఁ జని పది పుల్లెలాకులును, కేలిమి సమిధలు వెలయ దర్భలును
ద్వి హరిశ్చ ఉ ౧౫౦౪ ౫౦

పులియంబలి వి (√పులి) పులిసిన అంబలి
చ ఎతి చెప్పిన యంతఁ మంది దాని నొయ్యన దరిఁ జేరఁ బిల్చి పులియంబలి యించుక పోసి యూకుటకా చెన్నబ ౨ ౨౬

పులియఁబాలు అ క్రి (పులియు[1]+పాలు, స్వార్థమున) పులియు పుల్లనగు
సీ పూఁబోఁడికెమ్మోవి పులియఁబాలని కేసె యతిమోము కందనిచందమామ
చంద్రా ౬ ౧౩౮

పులియడుగుతఎసి వి (√పులి[1]) వ్యాఘ్రము పాదుఁ దనుమని
(గంగానది) వ పులియడుగుతఎసికొండుకు వినకొనెడు పాలకడలి వడువున వఎంతఎమయంబు ననుఎరించు కునునుఎమదయ యమృద్ధి పగిది చం రా 3 ౨౫
(ఇకనికొండుకు ఉఎమన్యువు వాఁడు కోరివఎ డెల ఆహారము లభించుటకై ఎవుడు దధి క్షీరాంబుధులు సృజించెను శివపురాణము)

పులియాట వి (పులి[1]+ఆట) బాలక్రీడావిశేషము ఒక యాట
సీ చీకటిమొటికాయ చింతాకుచుఱుదులు పులియాటలునుఁ బిల్లపొట్లకాయ
హంస 3 ౧౬౬ ప్రబంధ ౧ ౬౧3

పులియు[1] అ క్రి (√పులి[2]) పుల్లనగు
(వ్యవ) తరవాణి మిక్కిలి పులిసినది

పులియు[2]. అ క్రి ౧ క్రొవ్వు, మదించు
రగడ తఱు కొఎఁగఁ బల్లవవితానముల నూనములఁ, బులియుఁ బికమధుపములు బోన ముఁ కానముల రాఘవ ౨ ౬

౨ మరియు, గర్వించు
వ సత్యభామ సామాయంబుగా వాసుదేవున కి ట్లనియె

౪ కలిగె నొకఁతాంబవతి కె,స్నలవడఁ బడెదేఁ వలపు సీతల కేగెఁ,బులియకుచే పవతుఎం గలపాలతులచే పాటువడక పో రాదనియొక ఉ హరి 3 ౧౧౫

సీ మాటిమాటికిని మమాలించి పాడుచుఁ బులియుచుఁ దనఁ దా సె పొగడికొనుచు
విప్ర ౫ ౨౬

3 బిగియు, బింకముతోనుండు
౪ వేసాలఁ బోకు రమ్మా, పూసెజ్జకుఁ బ్రొద్దు వోయెఁ బులియుట చాలుక
హర ౪ ౧3౪

పులియోగిరము=పులియోర వి (పులి+ఓగిరము)
వ సాంగలి పులియోగిర ప్రబంధ ౧౧౨
వ సాంగలి పులియోగిరంబు దధ్యోదనంబు
హం౨ ౧ ౧౦౫

పులియో(హో)ర పులికూడు (క పులియోర హోర) వి (పులి[2]+ఓరము) పులుసుకలిపిన అన్నము (క ర) పులుసు, ఉప్పు, కారము, పసుపు వానితో రుచికరముగాచేసిన అన్నము
వ్యవ ఆ సమారాధనకు బూరెలు పులిహోర చేసినారు

పులిరికము సం వి అ పుం పాము (నిఘంటువు)

పులివరుగు వి (√పులి[2]) పులియఁబెట్టిన వరుగు
వ పడిదెములుఁ బులుపులుఁ, బులివరుగులు, వప్పడంబులు, బప్పులు కాశీ ౪ ౧౯౫

పులిపోవు (పులి2 + పోవు) అ క్రి పులిసిపోవు, పాడగు

ద్వి పాదలమెయ్యెడఁ బులిపోవనిప్రాణ,పద
మగునోగిరం బొదవ నర్పించి
పండితా దీక్షా ౩౭

పులిసరి వి (త పులిశ్చై) పులుంగుడు,వాతఘ్నికి

సీ పులుంగు దనంగను బలిసరి యనఁగను బాల
కిసింజ్ఞ పరగుచుండు ఆం భా ౨ ౬౭
(ఇందలి బాలకిసిపద మింకను విచార్యము)

పులు[1] వి లోహరత్నాదుల మాలిన్యము, మాలిన్యము (ఈ యర్థమున కదుగుధాతువుతోఁ గూడియే తఱచుగాఁ బ్రయోగము లందుఁ గాన వచ్చుచున్నది పుల్లుపర మగునపుడు కొన్నిరొడల ఉత్వలోపము)

క పదనికిరాఁ బులుగడిగిన,మదనాస్త్రము రేఖ
గలిగి మానినిమెయి చెన్నొందవఁ గయిసేసి
రప్పుడు,ముదితాజనములు ప్రమోదమున లలి
తముగన్ భార విరా ౫ ౩౫౫

ద్వి శ్రీనింకఁ బటికి నార్చినకుందనంపుఁ,గమ్మలో
మతిఁ బులుగడిగినముత్తి,యమ్ములో నెఱ
తావి నలరుగందంపుఁ,గొమ్మలో యన
రం రా బాల ౩౫ పా ౧౧ పం

సీ పెనవి రోగులఁ దగ వ్రేయఁ బుల్గడిగించి
నిలిపిన గండగొడ్డలి యనంగ
పి కసం ౩ ౧౩౨

క పడుతుకలలితాంగయష్టి పదనికిరాఁబుల్,
గడిగిన మరుఖడ్గలతిక,పడువున జాహ్నవ
విలాస వైభవ మొందెన్ నిర్వ ౮ ౬౦

సీ చంద్రబింబముఁ బాలసంద్రంబులోఁ ద్రోచి
పిండెల్లఁ బోఁ బులుకడుగ కున్న
విక్ర ౧ ౧౩౨

జ పులుగాకు

పులు[2]=పుల్లు వి (క పులు, పుల్లు) గడ్డి, కసవు

సీ పులు మేయుకమకంబు దొలఁగుట కాక
విహ్వాలబుద్ధిరై దాఁటె హరిణకులము
పాండు ౪ ౯౨

క పెలయాలివలనఁ గూరిమి,గలుగదు మతి
కలిగ జేని కదకేరదురా,పలువురు నడిచెడు
తెరువునఁ, బులు మొలవదు మొలచె జేనిఁ
బొదలదు వేమా వేమ ౨ ౧౦౨

మ మత్తవేదండకుం,భరసై కాళనకాంక్షి రైన
మృగధూపాలుండు పుల్ మేయునే
మల్లభూ నీతి ౭౧

విణ అల్పము, నీచము (చూ పులుమానిసి)

పులుదిండిచట్టు = ఇంద్రనీలశిల (ఇంద్రనీలము గడ్డితినునని ప్రసిద్ధి)

వ అప్పురంబునట్టనడుమ నిట్టలంపుఁబులుదిండి
చట్టులన్ గట్టినయభ్యంతరవక్రగోపురద్వా
రంబునన్ ఉ రా ౮ ౯౪

పులుదిండిచలువ=ఇంద్రనీలశిల

సీ చెలిమురల్ పులుదిండిచలువ కా మామక
స్వాంతతృణగ్రాహులయ్యెఁగాన
చంద్రా ౪ ౧౦౨

పులుదిండిమానికము=ఇంద్ర నీలమణి

సీ పులుదిండిమానికంబులవన్నె గలయిఁకె
లాకవంకఁ జేఁ కట్ల నునుకు కొలుప
తపతీ ౧ ౯౧

పులుదిండితా(యి) వి (పులు[2] + తిండి + తాయి) తృణగ్రాహి, ఇంద్రనీలమణి

సీ పులుదిండితామొత్తములలోవ లమరించి స్ఫ
టికసోపానముల్ సంఘటించి
ఉ రా ౨ ౯౨.

జ పులిచెలిక, పులితొడుగు, పులుకాసి, పులుకాసిపురువు, పులుకాసిపులుఁగు, పులు

గుడిసె, పులుదారి, పులుదాలినోరిము౹, పులుపంట, పులుమానిసి, పులుమ్రాఁగ, ప్రులువడు, పుల్గ్రహము

పులుఁగు(ల్గు) వి ౧ పక్షి, పిట్ట

ఆ పులుఁగుఁ ద్రాటఁ బట్టి యలయించి యాడెడు, బాలునట్లపోలె బాణసురుఁడు, గడఁగి కృష్ణునముఖాఁ గారించుచున్న వాఁడు
భార ద్రో ౩ ౨౮౩

క తొట్టినక్రొవ్వులు గలయలి, చెట్టడిచినచేటెఁ డేమి చెప్పన్ బులుఁగుల్
మనుచ ౪ ౨౪

సీ ఆదిమ పైన యండమునయం దుదయించెను గూబపుల్గు
కాశీ ౬ ౧౪

౨ ఒకజాతి పక్షి (దీనికూఁత అరిష్టసూచనము, ముఖము భీకరము,)

వ్యవ పులుఁగువలె మొగము పెట్టుకొని యెట్లు కూర్చున్నాఁడో చూడుము

జ పులుఁగుపిట్ట, పులుఁగు బొల్లఁడు, పులుఁగు ముక్కునొక్కు, పులుఁగురాడాలు, పులుఁగు రాపచ్చ, పులుఁగు రాబొల్లఁడు, పులుఁగు రాయఁడు, పులుఁగులనాఁడు, పులుఁగు టాయి, పులుఁగుఱేఁడు, పులుఁగుసాహేబు, పులుఁగు హుమాయిబోడు, పులుఁగరి, పులు రాతూపు

పులుఁగుపిట్ట వి (పులుఁగు + పిట్ట) గుడగూబ, ఘూకము (క × ద్రా)

పులుఁగుబొల్లఁడు వి (పులుఁగు + బొల్లఁడు) గరుత్మంతుఁడు, గరుడుఁడు (క ర)
(ఇట్లే పులుఁగు(ల్గు) రాబొల్లఁడు, పులుగు హుమాయి)

పులుఁగు ముక్కునొక్కు వి (√పులుఁగు) పల్లకీ బొంగునందలి దోష విశేషము

వ పాల్కిడి పులుఁగుముక్కునొక్కు ప్రవిష్టచిమదిండి మొదలుగాఁ గలదుర్గుణంబులు లేక
ప్రబంధ ౧ ౬౦౫

పులుఁగురాబొల్లఁడు వి (పులుఁగు + రాచ + బొల్లఁడు) గరుత్మంతుఁడు, పక్షిరాజు

సీ నల్లనిమేను నిల్వుతిరునామము పచ్చనిపట్టునాభిపైఁ దెల్లని తమ్మియుం గలుగుదేవుఁడు కుంకుమవన్నె పులురా, బొల్లని ఱెక్కనల్పుఁ దెలుపుం గలపువ్వులదండఁ దెచ్చి యు, త్పల్లని జాంబలిం జిగుఁబోఁడి కొసంగె వెసం గృపామతిన్
వైజ ౧ ౬౯

పులుఁగురాడాలు వి (పులుఁగు + రాచ + డాలు) గరుడధ్వజము దశా ౨ ౨౫౪

పులుఁగురాపచ్చ వి (పులుఁగు + రాచ + పచ్చ) గరుడపచ్చ, గారుత్మతము
అచ్చరా అయో ౪

(పులుఁగురాబొల్లఁడు=గరుడవాహనము)

పులుఁగు(ల్గు)రాయఁడు వి (పులుఁగు + రాయఁడు) పక్షిరాజు, గరుత్మంతుఁడు

లయగ్రాహి పులుఁగురాయనికి జో దగుజటాయువు
చం రా ౫ ౪౨

ఆ అపుడు పుల్గురాయఁ డప్పిలిఁ బుదమికి, డిగ్గి కేలుకోని డెంద మలరఁ, జేసి
అచ్చ రా యు ౧౬౪

పులుఁగులనాఁడు (√పులుఁగు) వి దేశ విశేషము

క పలనాఁడు వేఁగినాడును, బులుఁగులనాఁడ్వాకనాఁడు పొత్తపినాఁడున్, అలములికినాఁడు రేనాఁ, డలయక గనుఁగొంటి నచటి యబలలఁ గంటిన్
హంస ౧ ౫౩

**పులుఁగుటాయి.** వి (పులుఁగు+టాయి) గారుత్మతము, పచ్చ

తే క్రొత్తి పల్లోటకొమ్మలఁ బులుఁగుటాలు, గరిక యనిడాసి నీలా ౧ ౩౭

**పులుఁగు(ల్గు)ఱేఁడు.** వి (పులుఁగు(ల్గు)+ఱేఁడు) పక్షిరాజు, గరుత్మంతుఁడు

సీ ఎగసిన బలధూళి యెదురుగా రాకుండఁ బులుఁగుఱేఁ డెఱకలఁ బోవఁ జదియ. కకు ౫ ౧౫౯

**పులుఁగుసాహేబు** వి (√పులుఁగు) పక్షి రాజు, గరుత్మంతుఁడు

వ పులుఁగు సాహేబు బాబారాయఁడ ప్రబంధ ౧ ౨౧౬

**పులుఁగువాహమారాయిజోదు.** వి (√పులుఁగు—పక్షి గుఱ్ఱముగాఁగలయోధు) విష్ణువు

అచ్చరా బాల ౪

**పులుకాసి**[1] వి క్షుద్రజల జంతువిశేషము

సీ. పులుకాసి నసిమిరి బుంగ పురువు హంస ౪ ౧౯౬ క్రొత్త ప్రతి పా

**పులుకా(గా)సి**[2]. విణ (పులు[2]+కాసి)—తృణమువంటిగి—అల్పము, నీచము (చూ పులుకాసి పురువు)

**పులుకా(గా)సి పురువు(గు)పుల్గాసి పురువు.** (పులుకాసి[2]+పురువు) వి ఆకుపచ్చని చిన్న పురుగు (పచ్చ ఆక్కుల పురుగు శ ర)

ద్వి రాజులు వాటించు రాణివాసములు,నోజతో నూడిగం బొనరింపఁ దమకు, వరవులఁ గాఁ జేసి వరుస వర్తింపఁ, బురిలోనఁ బులుకాసి పురువులకరమె

ద్వి. హరిశ్చ. ఉ ౧౪౩ పా ౪౫౬ ౩.౦. పం.

తే మన్న పురుషునిఁ జెడనాడు మగువనిూఁదఁ, బోయి పులుగాసి పురు వయి పుట్టు ననుచు. కుశ. ౩. ౧౪౯.

(ఇట పులుకాసి పురువులవంటివారు, అల్పులు, అని తాత్పర్యము)

సీ చండాంశురథముతో జగతిపైఁ బ్రొల్లఁగ గన్నెఱ్ఱసేసిన గర్వరేఖ,

గీ గల మహామహులకు వికుఁ గణనసేయఁ, గ్రొవ్వఖుక్కు లనంగఁ బుల్గాసిపురువులు... వి. శకుం. ౩. ౨౩౦

**పులుకాసి పులుఁగు.** వి (పులుకాసి[2]+పులుఁగు) నీచమైనపక్షి.

తే ఇన్ని దేవళ్లఁ గొలిచి నే నేమి గంటిఁ, బోయి పచ్చని పులుకాసి పులుఁగుచేత, మోసపోయితి కుశ ౩ ౪౯

(ఇట పచ్చనిపులుకాసిపులుఁగు=పచ్చరంగుగల నీచపక్షి, చిలుక, అని తాత్పర్యము

**పులుకు(ల్కు)** వి కను ఱెప్పలు తెఱచుటయం దగు ననుకరణము.

—ద్వి కట్టిఁడిపిరి కక్కడిబిడ్డఁ దమ్ము, పుట్టి యిన్నా ళ్లాయెఁ బులుకునఁ గన్ను, తెఱవక చను ద్రావఁ దివురనిబిడ్డ ... ద్వి పరమ ౩ ౧౫౪ పా.

జ పులుకుపులుకు

**పులుకు(ల్కు)పులుకులుక్కు.** వి (పులుకు+పులుకు) భయదుఃఖాపమానాద్యుద్వేగముల చే ఱెప్ప లప్పళించుచు తెఱచుచు చూచుటయం దగు ననుకరణము.

(భయమునకు.) క అని తెలసి పులుకుపులుకునఁ దమఁ జూడం జూడఁ బట్టి కన్నెం గొట్టెక. కేం. పంచ. ౪. ౪౮౭.

(దుఃఖమునకు) ద్వి. పులుకుపుల్కునఁ జూచి
భూపాలనందనుఁడు, కొలంకులఁ గన్నీళ్లు
గ్రుక్కుచుఁ బలికెను.
ద్వి. క. పా. ౧. ౩౦. పా. ౫ పం

తే. పులుకుపులుకునఁ జూచి యక్కలికితోడఁ,
బలుకుపలుకున దైన్యంబు దొలఁకఁ బలికె.
పారంగ ౨ ౧౦౦

(అవమానమునకు) చ. అనటయు మాట లేక
హృదయాబ్జము జల్లన మోము వెల్లనై,
కనలుచు నీరు జేఱు లెలికన్నుల వాతినిఁ
బుల్కుపుల్కునం, గనగొని .
మనుచ ౨ ౬౬

(అనూయకు) సీ. భోగించువారలఁ బుల్కు
పుల్కునఁ జూచి మెల్లన గ్రుక్కిళ్లు మ్రింగు
వారు. నైష ౪ ౫౩

శ్లో. భుంజానజనసాకూతపశ్యాయస్యామలీవినః
సం నైష ౧౪ ౨౫

పులుగ(ల్గ)రి. విణ. (పులుగు + అరి³ ఆ పుల
నరివాళ్) జూద తెలుపువాఁడు, అమాకి
యిచ్చువాఁడు.

క... మాసా మృఖలం,బును వచ్చు చేని నీచె,
ప్పిన పులుగరి వెచ్చ మెల్లఁ జెట్టైద మనినక్
పరమ ౫. ౫౯

సీ. ముగురు నల్గురు పాత్రులుగ నీక్రమంబున
నిపుడు మా కొకపత్తి మిమ్ము వేగ,యేమ
నీపురమున కేఁగితెచ్చెదము పుల్గరిధనం
బనిరి... పరమ ౫ ౬౧

పులుగాకు. వి. (పులు + కాకు ఆ పుళుక్కప్)
దుండగము, దుష్టచేష్ట

ద్వి. బలిమిమై వార్చి నీబలములు పేర్చి,
పులుగాకులై బహుళంగుల నిట్లు, పులుగాకు
లానరింపఁ బోలదే మాన్ప.
ద్వి. హరిశ్చ. పూ. ౧౨౧౯. పం

ద్వి. పిలిచి యేకతమునఁ జెప్పెద వంచు నోటఁ
బలికిమాపఁగ రానిపలుకులు పలుకఁ, బులు
గాకు లేల పోపొ మ్మన్న మమ్ము, బలు
గాకు లాడు నీపలుగాకువాఁడు.
ఆ మ క. ౧ ౩౫. పా ౫. పం.

పులుగు(ల్గు). వి. ౧ గుఱుతు, చిహ్నము.

గీ. కలఁక మామీఁది పనిలేనికసరు దెలుప,
బాలఁతి లేలు నీయుక్కియే పులుగు గాద
ఆము ౫. ౬౦

గీ. గునియుజాన్నిగ చెక్కిట గోరు మోవి,కెంపు
లత్తుక సుదుర గంధంపు చిటులు, వాదపస
పంటువలువతో వచ్చినట్టి, పుత్ర యిది
కానివదతకుఁబులుగుగాద ప్రబంధ ౬౯౩

౨. జాడ, ఆచూకి

సీ. కద లేని క్షేమంబు గప్పెద మంటిమా పుల
కాంకురంబులు పులుగు చెప్ప.
వరాహ ౪. ౧౯.

వ ..చిక్కెం జిక్కె నిక్కడ నిక్కడ నక్క
యక్క యని చేటికానికరంబు పొలసిన
పులు గెఱింగి పాండు. ౪. ౨౩౬.

పులుగుడిసె. వి (పులు² + గుడిసె) పక్షుల
వేఁటాడువాఁడు తాను మఱుఁగున నుండుటకై
గడ్డితో నిర్మించుకొను చిన్నగుడిసె, కసవు
గప్పినగొడిసె.

క. పులుగుడిసెఁ బన్ని వల కా,ద్వాలధరణిం
బాదుపఱిచి ప్రస్సినకన్నుల్, గలపులు
గు దీమ మిడి యొగ్గలపుందమిఁ గాచియుం
దఁగా దైవగతిక. వెం. పంచ ౨ ౧౦.

పులుగుడు. వి. పులిసరి. వాతఘ్ని శీ. (ఇది
నల్లపులుగుడు, తెల్లపులుగుడు అని ద్వివిధము
అని. శ. ర. చూ పులిసరి.)

ద్వి. మద్ది పాల కోడిశా మారేడు వెలఁగ, బొద్ది
* పాపర జమ్మి పులుగు మేడి
ద్వి ౪ పా ౨ ౪౯ పా ౧౧ పం

పులుదాలి వి (పులు$^2$ + దాలి) గడ్డికుమ్మ
(చూ. పులుదాలినోరిముని)

పులుదాలినోరిముని మి వి (పులుదాలి + నోరు + ముని) గడ్డికుమ్మవంటి నోరుగలఋషి, తీక్ష్ణమైన నోరుగలఋషి

ఈ. బ్రాహ్మణమాత్రుఁడె యత్రినందనుం, డా పులుదాలినోరిముని కడ్డము వారయ లేదు వానికిం, గోపమెకాని శాంతియును గూర్మియు లే దటువంటివారికిన్
వి పు ౧ ౧౬౫

(దుడుకునోటిఋషి అని భావము)

పులుప=ఉలుప$^2$ వి ($\sqrt{}$పులి$^2$) పులుచగా మారిన పుల్లని యూరుఁబిండి, విరళామ్లకలిత పిష్టము

తే. ఊరుఁబిండి దన లవణభావిత పట్ట మొప్పఁ, బులుప యగు నన విరళామ్లకలితప్పు, మొనరు ఆం భా ౭ ౭౫౧

వ. చిఱుగడములుఁ బడిదెములుఁ, బులుపలుఁ బులివరుగులు నప్పడంబులు
కాశీ ౧౯౫

పులుపంట వి (పులు$^2$ + పంట) తృణధాన్యములు, పైరు (వరి, గోధుమలు, మున్నగు సస్యము)

సీ. తపశ్శ్రీ వెలుంగ, నున్నెడఁ బులుపంట లన్నియు నత్యంతవికలంబుగా ననావృష్టి దోష,

గీ. మానవహల్లిన భార అశ్వ ౪ ౭౭౦

పులుమానిసి విశే (పులు$^2$ + మానిసి) అల్పమనుష్యుఁడు, (ప్రాభవముచెడి) కొంచెపడిన జనుఁడు

సీ. మునీంద్ర యోమ్ము, గలుగంగ దన లేవి పులుమానిసికిఁ బోలె నక్కఱువృద్ధిన కట్టిచావు, పాటిల్లె భార అర ౭ ౧౬౧

క. పురిమున కేతెంచె నతఁడు పులుమానిసియై దశకు ౪ ౧౯

పులుము స క్రి ౧ రుద్దు

తే. కమ్మనూనెఁ దల యంటి పెసలు గందాన పులుము అము ౬ ౧౭౬

క. ఎన్న గజాతీరసనం, పన్నంబుగఁ దలలు పులిమి మందోష్ణం బొ, పన్నీట జలకమార్చిరి, కన్నియకును రామతునకుఁ గామిను లంతన్
బ్రహ్మో 3 ౧౫౧

౨ రాచు పూయు

తే. కేలఁ గలవంటకపుఁ దాలికని పులిమిన, ఘుసృణములు మించ అము ౫ ౧౪3

ద్వి. జలజారిగ్రుడు కప్పుచాయఁ గొంగెలఁ, బులుము కాటుక వెంగంబున దిట్టపడఁగ
అ మ ౪ ౧ ౭౫ పా ౧౫ పం

3 నలుపు, నలుచు

(వ్యవ) వాఁడు కన్నులు పులుముకొని లేచినాడు (గ్రా)

చూ. పులిమిపుచ్చు

౪ కొట్టు

(వ్యవ) వానిని బాగుగా పులిమి పంపినారు (క ర గ్రా)

౫ అంటఁగట్టు, పైఁబడఁ జేయు

(వ్యా) అన్న తాను చేసిన అప్పంతయు తమ్మునిపై త్తిని పులిమినాఁడు

౬ వంచించు (చూ. పులిమిపుచ్చు)

వి కష్టము, దోగవిశేషము

సీ. కష్టముల మనఁ గుష్టునఁ బులు మన విలసిల్లు ఆం భా ౨ ౧౭౮

జ పులిమిపుచ్చు, పులుముకొను, పులుముడు

పులుముకొను. స క్రి (√పులుము) నలిపివైచు, మర్దించు.

తే. తిరుగు భిక్షాశనులమీఁద దృష్టి యిడని, యదయరా లగు కలిమితో యిల్లిగృహంబు, లలజడికిఁ దార్చుకై వడిఁ బులుముకొనిరొ, వనజవిసరంబు హేమంతవాసరంబు
చం రా. ౫ ౭౭

పులుముడు. (√. పులుము) వి రుద్దుడు, మార్జనము

సీ. తోముడు ప్రాముడు తుడుపు రుద్దుడు పులుము దన మార్జనసంజ్ఞ పొలుచుచుండు,
ఆం భా ౨ ౧౬౦.

పులుమ్రాను. వి (పులు[2]+మ్రాను) తృణద్రుమము
(తాడు, కొబ్బెర, పోక, ఖర్జూరము, ఈఁత మొ జాతిచెట్టు)

ఉ... తాడు మున్నగుతరుల్ పులుమ్రాఁకు లనంగఁ బోలు ఆం భా. ౨ ౭౯.

పులువడు. అ. క్రి (పులు[2]+పడు) గడ్డివలెనగు, వలఁగు

క. పితేఁడికిఁ బోనిచ్చినవి, ల్లజితిక్కై యల్లఁ జాఁప నది గనుఁగొని పెల్లుతికి చను లతలు పలువడఁ, జిఱుముం గడు నాస పుట్ట శృంగాగ్రములకా.
భా రా అర. ౨. ౪౯

పులుసు[1](లు)వి. (√పులియు) ౧ ఆమ్లము, షడ్రసములలోనొకటి

చ జలధర మొప్పతోఁ బులు సొసంగు రసం బని యప్పయోధి నిం, పొలయఁగఁ గ్రోలి పై దధిపయోధియుఁ గ్రోలఁగఁ బ్రాఁచి దాటఁ బ్రెన్నులుఁగరుల్ల గ్రాయ నవిజో జడగం డ్లవ రాశిఁ గానిచో, నిలఁబడ వానిఁ దిస్స్రయపుడే చలిపండ్లు వడంగ కోటికిన్
ఆము. ౪ ౧౧౬.

ఆ. పాలలోనఁ బులుసు లీలతోఁ గలసిన, విరిసి తునక లగును విరివిగాను
వేమన ౧ ౧౬౦

సీ నెత్తిఁ దంగేడాకు మెత్తి లేచకి నిమ్మపంటి పుల్సున నూతి పట్టువెట్టి
కాళ 3 ౧౧౦

౨ చింతపండు, ఒకటి రెండు మూఁడు కాయ దినుసులు, మున్నగువానితోఁ జేయువ్యంజన విశేషము, దప్పళము

గీ పప్పులో నుప్పు మిక్కిలి పాఁజల్లి, కూరలో నాముదపుబుచ్చు నింత నించి, పులుసులో గంజి మిక్కిలిఁ గలయఁ బోసి, భక్ష్యములలోన మిరియంపుఁబొడిదడు గిలిపి
చంద్ర వి. ౧ ౬౫

3 ఉద్ధతి, గర్వము.

క. వనిత గజనిమ్మ పండ్లను, ఘనముగ నో రూరఁ జెప్పఁగా విందుము నీచనుగుబ్బల లావణ్యము, వినినప్పడె వానిపులుసు విరుగుం జుమ్మీ
సారంగ ౨. ౨౭౧.
(ఆమ్లరసము అని రెండవయర్థము)

పులుసు[2]. వి వృక్షవిశేషము ?

సీ. భూతాంకుశ మశోకభూర్జ పత్రమ్ములు బోళము మంకెనపులుసు గంగరేను .
హంస. ౪ ౧౧

పులుసుఁగూర. వి (√పులుసు[1]) పులుసు పెట్టి వండినకూర (శ ర)

పులోమ. సం వి. అ. స్త్రీ. భృగుభార్య, చ్యవనునితల్లి

పులోమజ. సం వి అ స్త్రీ శచీదేవి, ఇంద్రుని భార్య

పులోమజిత్తు. సం. వి. త్. పుం. ఇంద్రుఁడు.

పులోముఁడు. సం. వి. స పుం. ఒకదైత్యుఁడు, (ఇంద్రుని శ్వశురుఁడు.)

పుల్కసుఁడు. సం. వి. అ. పుం. ౧. బ్రాహ్మణునకు క్షత్రియస్త్రీయందుఁ బుట్టిన సంకీర్ణజాతి వాఁడు ౨ మాలవాఁడు.

పుల్గు(లుఁగు)రాతూపు. వి. (పుల్గు+రాచ+తూపు) గారుడాస్త్రము.

అచ్చ. రా. యు. 3౪3.

పుల్గృహము. వి (పులు²+గృహము) గడ్డితో చేసినయిల్లు, పూరియిల్లు.

చ ..పొగలఁగా విరిఁ బ్రుంగెడు పుల్గృహంబు లెల్లెడఁ గనుపట్టె... ఆము. ౪. ౧౭౭.

పుల్ల¹. (శ పుల్ + క్త). విణ పుల్లనిది, పులుసు గలది, ఆమ్లము.

తే. మిసిమి గల పుల్లపెరుఁగుతో మిళిత మైన, యాపపచ్చళ్లు చవిచూచి రాదరమున.

వైజ. ౨. 30.

(వృత్తియందు వికల్పముగా నిగాగమము) ఉదా పుల్లనిమజ్జిగ మొ.

జ. పులఁదీఁగ, పుల్లఁగంద, పుల్లఁ గూర, పుల్లదానిమ్మ, పుల్లనీళ్లు, పుల్లప్రబ్బ, పుల్లబచ్చలి, పుల్లమామిడి, పుల్లయుసిరిక, పుల్లవెలఁగ, పుల్లాకు.

పుల్ల²=పుల. విణ పసుపు మించిన తెలుపువన్నె కలది. (శ ర. కపిలవర్ణముకలది. అని బ్రౌ. చూ. పుల్లావు.)

జ: పుల్లకందము, పుల్లగిత్త, పుల్లగోరక, పుల్ల ప్రత్తి, పుల్లకావిడి, పుల్లపిల్లి, పుల్లావు.

పుల్ల³. వి ౧. సన్నని పుడుక.

తే ..పుల్ల, పుడుక యనఁగను దృణకాండము చను... ఆం. భా. ౨. ౯౬.

(వ్యవ) పూచికపుల్ల, పలుదోముపుల్ల. మొ.

౨. చిదుగు, సమిధ.

చ. అనవుడు పుల్ల కొంతయుఁ బ్రియంబు వహింపఁగఁ బక్షివైరి పీఁకున సకలాంగకంబులఁ బ్రకున్నము అరుణ్యాడు దీనిఁ శాపకే యనిన విహంగమంబు రయమూరఁగ నచ్చటిపుల్ల లెల్ల ముక్కునఁ గొని తెచ్చి ప్రోవిడి యతుంగిత మైనదయాగుణంబునన్.

భార. శాం. 3. 3౭౧.

3 వంటకట్టె, ఇంధనము.

(వ్యవ) పొయిలోనికి పుల్లలు లేవు

పుల్లవిఱుచు=మంత్రముల నుచ్చరించుచు పుల్లను విఱుచు

(పిల్లలు జడిసికొన్నప్పుడు పీడాపరిహారార్థము మంత్రముచ్చరించుచు పుల్లవిఱిచి పారవేయుట ఆచారము)

సీ. పెనుఁజీకటులు గ్రమ్మి పెన్ బైట వసియించి వెలిచెఁ గా యని పుల్ల విఱిచి విఱిచి.

పాండు. 3. ౧౯౬.

సా పువ్వు అమ్మినయూరనే పుల్ల అమ్మ వలసి వచ్చినది.

(ఎక్కువగౌరవము పొందినచోటనే మిక్కిలి హైన్యమును పొందె ననుట.)

పుల్లవిఱుపుమాటలు=విరసవాక్యములు, తెగువు మాటలు.

(వ్యవ) నీపుల్లవిఱుపుమాటలతో వానిమనసు విఱిగిపోయినది.

జ: పుల్లతి, పుల్లవడు, పుల్లవిఱుగు, పుల్లవిఱుచు.

పుల్లంటురాయి. వి. (పుల్లు+అంటురాయి)ఇంద్రనీలమణి

పుల్లఁదీఁగ. వి. (పుల్ల¹+తీఁగ). సోమలత, (దీని రసమును యజ్ఞములందు యజ్వాదులు పానము చేయుదురు)

సీ కమరాని సామంబు గైకొన్న విని యంచుఁ
బుల్లఁదీఁగలఁ జూచి యలఁత నొంది
పాండు ౫ ౭౯

పుల్లకండము=పులకండము వి (పుల్ల$^{2}$+కండము) ౧ కండచక్కెర, ఎటిక బెల్లము
ద్వి పుంగపుముద్దలు పుల్లకండములు, పలుకజ్జ ములు సానబా లిడ్డెనలును
ద్వి భాగ ౧ ౭ పా
౨ భక్ష్యవిశేషము
ద్వి కండచక్కెరయును గరిజలు పుల్లకండంబు లటుకులుఁ గడవల నిండ,యుండంగ
ద్వి భాగ ౧ ౧౪ పా

పుల్లకంద వి (పుల$^{1}$+కంద) ఒకజాతి కంద శ్రీ (శ ర బ్రౌ)

పుల్లగిలు(ల్లు)=పుల్లసిల్లు అ క్రి (√పుల్ల$^{2}$) (భయాదులచే) వివర్ణమగు, భయపడు
సీ జనులు గాంచిగ మానుషము దూలఁ దన కనుపుయిలోటమున కోమ పుల్లగిలఁగ
భార విరా ౨ ౩౦
క తనచేత నృపతినుతుఁ డెటఁగినఁ బైవచ్చు నని పుల్లగిలి పోఁ జూచుచా,వనత్వము లక్క్యగ్రం,బున మెదలఁగఁ జూచి పాసి పోవను వెఱచుచా భోజరా ౫ ౬౩

పుల్లగూర వి (పుల్ల$^{1}$+కూర) పులుసు పెట్టి వండినకూర (శ ర)

పుల్లగొరక వి (√పుల్ల$^{2}$) నీరకోడి, సలిల కుక్కుటము
తె సలిలకుక్కుటనామంబు వెలయు నీరుకోడి యనఁ బుల్లగొరక నన గుండఁగి యన
ఆం భా ౨ ౯౨

పుల్లతి వి (√పుల్ల$^{3}$) ౧ మల్లసాధన మగునొక విధమైన దుద్దు (బ్రౌ) సాదనకాంబ్రం గుటికై వాడెడుకోన (శ ర)

౨ కోలఁ బుల్లతియును నీలిమాలులు బూని,కేలి గతిఁ గటారికోల వట్టి,సంగడీలు గొల్వఁ జనుదెంచె గోకమ త్తకజముధంగి కలహకంట కుండు ద్వా ౩ ౭౫
౨ కెట్లు పోరునప్పుడు బరి గీచి యేర్పఱచు కొన్నహద్దు (బ్రౌ)
సీ పుల్లతిఁ బెట్టినభూమిఁకిఁ గొనరిన చెదిరిపోటు నకుఁ జే యొదుగుచున్న ద్వా ౩ ౬౦

పుల్లదానిమ్మ వి (పుల్ల$^{1}$) పుల్లనిరసము గల ఒక జాతి దానిమ్మ, అమ్లదాడిమము శ్రీ (శ ర)

పుల్లన వి పులుసు
తే ఉప్పు పైనట్టిచక్కెరలప్పు లిడె,చేఁదుదగ గలయమృతంపుఁ జెలము రొంటొ,పుల్ల నం డెడితేనెకడులు నరియె,వనిత కదుఁదియ్య నానీదుబాతెజకును సారంగ ౨ ౨౦౫
(పుల్లయం దుండెడి అని యర్థాంతరము)
—విణ పులుసు గలది (శ ర)

పుల్లనీళ్లు వి బ (√పుల్ల$^{1}$) పులిసిన కూటినీరు, తరవాణి (చి ని బ్రౌ) కూటినీళ్లు, ఆర నాళము (శ ర)

పుల్లప్రత్తి వి (పుల్ల$^{2}$+ప్రత్తి) ఒకదినుసు ప్రత్తి (శ ర)

పుల్లప్రబ్బ వి (పుల్ల$^{1}$+ప్రబ్బ) అమ్లవేతసము, చుక్కకూర
సీ అమ్లవేతససంజ్ఞ యగును జుక్క,పుల్లప్రబ్బ యనంగి ఆం భా ౨ ౬౮

పుల్లబచ్చలి వి (పుల్ల$^{1}$+బచ్చలి) అమ్లకలంబి
తే పొసగు నామ్లకలంబ్యాఖ్య పుల్లబచ్చలి యను ఆం భా ౨ ౩౨

పుల్లమామిడి వి (పుల్ల$^{1}$+మామిడి) కొండ మామిడి నానమ్రమము శ్రీ

ద్వి. పుల్లమామిళ్లు కర్పూరఖర్జూరములు,నల్లని
యరఁటులు నారికేళములు. ద్వి.నల ౧.౯౭.

పుల్లయుసిరిక. వి (పుల్ల$^1$+ఉసిరిక) కొండ
యుసిరిక Ŧ. (దీనికాయలు పెద్దవి. శ. ర.)

పుల్లరి. వి (త. పుల్వారి. పుల్లు+అరి) ౧. పశు
వులు కసవు మేయుటకై ఇచ్చెడుపన్ను, తృణ
భాగధేయము
సీ. పుల్లరి వాఁగ నొప్పును దృణభాగధేయంబు. .
ఆం. భా ౨. ౧౯౨.
ద్వి. అరి యప్పనంబు పుల్లరి కోయి పాలు,పెరు
గులు దెప్పించి పిల్చి గోపకుల
అ. మ. క. ౨. ౧౭౮. పా ౨౧. పం.
౨. గడ్డి. (చూ పుల్లరిమాన్యము)

పుల్లరిమాన్యము. వి. (√పుల్లి) ధర్మార్థము
పశువులు కసవుమేయుటకై విడిచినబీడు; గడ్డి
బీడు... దేవరపసులకు పుల్లరిమాన్యమున్ను...
ఇట్టునిచెను. ౧౨౩౨. సె. శా. ౧. ౩౩౩.

పుల్లరుజా. వి (పుల్లు+అరుజా) మత్స్యవిశేషము
తే. మోరి పక్కెర దొందును గూరముక్క,
పుల్లరుజా గచ్చె గండెయు బొమ్మిడాయ.
హంస. ౪ ౧౭౫.

పుల్లవడు. అ క్రి (పుల్ల$^3$+పడు=పుల్లవలె నగు)
౧. (భయదుఃఖాశ్చర్యాదులచే) స్తంభించు,
మ్రానుపడు.
క. తల్లియుఁ దండ్రియు వెఱఁగున, బుల్లవడఁగ
వారికడకుఁ బోయి తదయఁగా, నొల్లక
పయనపుటీడ్కోల్క, వెల్లం దనయిచ్చ నడవి
యెడ్తెల వెదకెన్.
భార. ఉద్యో. ౪. ౧౭౨.
క. పుల్లవడి చలము రోషముఁ,బొల్లయు నై
చనఁగఁ గొంతప్రొద్దు మెంగమునన్, పెల్లఁ
దనము గదుర నిలిచి,యొల్లజనులు వినఁగ
మతియు నిట్లని పలికెన్
భార. అర. ౪. ౩౫౮.

ఆ. నిప్పు ద్రొక్కినట్లు నిలువఁ డెచ్చోటను,
వాఁడుమునుకుఁ గని మహాకతోడఁ, గూడఁ
బాతి కేంకోనఁ జూచుఁ జూచి యు,ప్పొ
లఁతిగాక యున్న బుల్లవడును.
భోజరా. ౩ ౧౪౩.
౨. జంకు, సందేహించు
ద్వి. మలహరు నీగియు విలవిల యగుచు, పుల్ల
వడఁగనేల పుల్లాంబుజాత, పల్లవితాస్య...
పండితా. పురా. ౧.౨౦.

పుల్లవావిలి. వి (పుల్ల$^1$+వావిలి) ఒకజాతి
వావిలి, శ్వేతసురస Ŧ (శ. ర)

పుల్లవిఱుగు. అ క్రి (పుల్ల$^3$+విఱుగు) నిస్సార
మగుటచే పుల్లలుగా విఱిగిపోవు, నిస్సారమగు,
సత్త్వహీనమగు
(వ్యవ) ఈయేఁడు మాదబ్బచెట్టు పుల్లవిఱిగినది
క. వారలతోఁ బలుమారును, పోరాటం బాడి
యాడి పుల్లవిఱిగి యు,న్నారము...
శేష. ౧. ౧౧౩.

పుల్లవెలఁగ. వి (పుల్ల$^1$+వెలఁగ) పుల్లని
కాయలు కాచు నొకజాతి వెలఁగ. ఆమ్ల
కపిత్థము Ŧ.
సీ వెలఁగపండులు పుల్లవెలఁగపండులు మోవి
పండ్లు నంకెనపండ్లు బలుసుపండ్లు.
కాశీ. ౩. ౭౮.

పుల్ల(ల)సిల్లు.(లు)=పుల్లగిల్లు. అ క్రి.
(√పుల్ల$^2$) ౧. (భయాదులచే) వివర్ణమగు,
భయపడు, చెదరు
సీ కమలారివామంబుఁ గైకొన్న దివి యంచుఁ
బుల్లదీఁగలఁ జూచి పుల్లసిల్లి.
పాండు ౪. ౨౯౨.
మ అని భర్త్సించినఁ బుల్లసిల్లి విముఖుండై
పోరు విత్యశ్వప్రిభా, భ్యవికాటాథముఁడు.
వరాహ. ౧౧. ౯౨.

౨ కలఁగు, క్షోభపడు

ఉ ..మగవారిచిత్తముల్, పుల్లసిలంగఁ జేయఁ జోరపొచ్చెము లాడఁగ నాఁడువారికే, చెల్లును వి ప్ర ౨ ౨౩౩

తే అంత నిక్కడ మానికులాగ్రగణ్యుఁ, డావటూత్తముఁ డటు పొగ నంపి చనినఁ, దొలఁత మాటలు పడి పుల్లసిలినవాఁడు, గమకఁ గొంకుచుఁ దనయాత్మగతమునందు విప్ర ౪ ౭౪

3 నొచ్చు, నొప్పిఁజెందు, బాధనొందు

వ అగ్రహించి మహీవల్లభుండు తదీయవిగ్రహంబు భల్లంబులం జిల్లులువోవ జేసినం బుల్లసిల్లుసమయంబున వరాహ ౫ ౩౭

క పందకుఁగాక పలాయన, కందళి పాహమని యండుఁ గలుగునె యని మి, న్నందినకోపంబున పై,చెం ద్రాహ్మముఖుండు పుల్లపిల కిలనలుకన్ జైం పంచ ౪ ౧౯

౪ కుందు, దుఃఖించు

వ ఏతత్కార్యంబు సిద్ధించిన నయ్యార్యచరితుం డుల్లసిలం గాని పులసిలండు,చింత యుడిగి సంతసంబు నొందము పి శకుం ౩ ౭౬

చ పులసిల జేల మానవులపుట్టువు పావన మయ్యె నెప్పుడున్, గళవళ మేల రోగముల కాలగతిన్ గడవట్టు నీతిశాస్త్రధలును దరిద్రతావ్యథలు దప్పులకే చను వాంఛితార్థముల్, గలుగు నకేయుచేతఁ గమలాధవుచే వటపత్రశాయిచేన్ అప్ప ౪ ౩౧౪

పుల్లాకు వి (పుల్ల$^1$ + ఆకు) ౧ పుల్లనియాకు ౨ (పుల్లె + ఆకు) తినిపాఱవేసిన రొంగిలి విస్తరాకు

క తళుకులమలు విరహాలఁ, జీకాకుపడంగఁ జేయుఁ జెలియా యవి పు,ల్లాకులు పెంచిన కతమున,నో కదుఁ బుల్లాకు పేఁరనో వివరింపన్ చిత్రభా ౨ ౧౫౯

(పై రెండర్థములకు నిదియే యుదాహరణము)

పుల్లాయము వి (పుల్లు + ఆయము) గడ్డినుండి వచ్చు రాబడి, గడ్డిపన్ను హ వా ౩ ౧౦౫౭

పుల్లావు వి (పుల్ల$^2$ + ఆవు) కపిలధేనువు, పసుపుమించిన తెలుపువన్నెగల యావు

శా ఆ పెంజీకటి మ్రోలఁ గాన కడిదం బంకించి శార్దూలమం, చా పుల్లావుశిరంబుఁ ద్రుంచి తెగదో యంచున్ పులిన్ జెండియున్, వాపోవం దెగ వ్రేసి భూవరుఁడు ద్రోవన్ ఖదరక్తంబుచేఁ,బై పైగీయుచుఁ జేరి చూచెఁ దల ద్రెవ్వంబడ్డ యద్ధేనువున్ భాగ ౯ ౩౯

పుల్లి(లీ)రుసు వి (పుల్లు + ఇరుసు) మోటగూ రొుక్కతొండపుత్రాడు జరుగుటకు ఆధారముగా నుండు ఇరుసు (కదుసు శ ర ప్రా)

పుల్లు=పులు$^2$ విశే అల్పము (చూ పుల్లిరుసు) వి (త పుల్) కసవు, తృణము, గడ్డి

చ మలసి నిదాఘవేళలను మాపు వెలార్చిన తత్ప్రపాజలం,బుల వరిమళ్లలోఁ బొడము పుల్లు భుజించుభుటోద్ధిన్నకాచయం,బులు ఘటికా ౧ ౪౯

సీ గడ్డి గాదము గవతము కసవు కవన, పుల్లు పూరి యనంగఁ జెల్లును దృణసంజ్ఞ ఆం భా ౨ ౪౬

జ పుల్లంటురాయి, పుల్లరి, పుల్లరిమాన్యము, పుల్లరుజు, పుల్లాయము, పుల్లిరుసు, పుల్లుడి, పుల్లుజుకుపాము

పుల్లుడి వి ౹(√పుల్లు) అప్పుడప్పుడుమాత్రమే పొగుబడి కుపయోగించునిస్సార మగునేల (శ ర ప్రా)

పుల్లుటుకుపాము (పుల్లి+ఉటుకు+పాము) గడ్డిమండి పై కుటుకుపాము, సర్పవిశేషము (శ ర బ్రౌ)

పుల్లైన వి (త పుల్లడి) ఒకజాతిమందు వెంక్కి ? (శ ర బ్రౌ)

పుల్వాము సం వి అ పుం ౧ దర్వీకరమను సర్పవిశేషము ౨ కృమి, పురుగు (శేని)

పువ్వాటు వి (పువ్వు+వాటు) పువ్వువలె ముందువెనుకలకు ఊగాడుట (శ ర బ్రౌ)

పువ్వాన వి (పువ్వు+వాన) పుష్పవర్షము.
ద్వి కొడుకుపై పువ్వానఁ గురిసిరి సురలు
నవ ౧ ౨౪ పా ౧ ౬౦

పువ్వార వి (పువ్వు+వార) ౧ ఈఁదు, తాడులో నగుచెట్లయొక్క పూఁత (శ ర) తాటిపూవులకు తేఁతతాటియాకులకును నరి మున్నగు సస్యముల వెన్నులకును పట్టుమెత్తని బూజువంటి పదార్థము, (పువ్వారము, వా) ౨ చేఁపల యూపిరితిత్తులయొక్క లోపలి భాగము (బ్రౌ)

పువ్వారు వి పువ్వు, (√ పువ్వు)
సీ దక్షిణహస్తపద్మంబులఁ దాల్చెఁగలలితంపుఁ
బువ్వారుగళలతోడ
ఎరవ ౩ ౧౩౦ ౩ ౨౧
("గళ" ఇది తమిళభాషలోని బహువచన ప్రత్యయమగు "గళ్"నకు వికృతాంధ్ర రూపము, పూలతో అని యర్థము
పువ్వారుగళ_తిరుమణిపెట్టె అని చి ని
పువ్వారుకళ_పూరెమ్మ అని కళక్రింద శ ర)

పువ్వారుఁదీఁగ. వి (పువ్వారు+తీఁగ) పుష్పలత
సీ పువ్వారుఁదీఁగకొమ్మలు తాలువలఁ ద్రొక్కి
ప్రవహించు పన్నీరు పసరుచేసి
రామా ౬ ౨౦౧

పువ్వారుఁబోఁడి (ణి) వి (పువ్వారు+బోఁడి) పువ్వువలె మనోహర యగునాఁడుది, ఆఁడుది
క పువ్వారుఁబోఁడిపై నని, యొవ్వా రన
ధీమ్మఁ గాంచి యుంపొందితి నీ, వవ్వాని
యొఱుఁగుదువె మా, యవ్వా పోషింపఁ బాడి
యగు నను నీకున్ విజ వి ౧ ౫౦
క ఎవ్వరిదానవు నీ పే, రెవ్వతె యేమిటికి వచ్చి
తిచ్చెంగటికిన్, చెవ్వడి నీతెఱఁగంతయుఁ,
బువ్వారుంబోఁడి నాకు బొంకక చెపుమా
రసి ౩ ౪౪
క పువ్వారుఁబోణి మదిలో, నివ్వెఱపడి చూచు
చుండ
శుక ౧ ౨౨౪ అప్సరా అర ౫౫

పువ్విలు(వ్వుల)కాఁడు వి (పువ్వు + విలు కాఁడు) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు
ఉ పువ్విలుకానితోడ నరిపోలెడుచక్కనివాఁడు
భూమిలో, నెవ్వఁడు చెప్పుఁడాయనుచు
హైమ ౧ ౪౫
వ ఇవ్విధంబునఁ బువ్వవిలుకాని నవ్వుక్రొవ్వు
గలయలజవ్వని మగనిముందట ముద్దు
గురియుచు విక్ర ౭ ౬౫
క ఇవ్విధమున నాజవ్వని, పువ్వులవిలుకాని
దంతిపొలు పమరుచుడల్, నివ్వటిల మెంగ
మునను జిఱువ వ్వాలయఁగ గురునియుప
వన్యలిఁ జెందన్ చెన్న ౨ ౨౩౪

పువ్విలుతుఁడు వి (పువ్వు+విల్లు) పుష్పధన్వుఁడు, మన్మథుఁడు
క పువ్విలుతుతంత్రి యచ్చట, మువ్వంకమురు
వుల మురళి మ్రోయించె మనం, బువ్వి
ళ్లూరఁగ పాండు ౫ ౨౨

పువ్వు (వు)=పూవు,పూ వి (సం పుష్పమ్, త పూ క హూవు) పుష్పము, విరి
ఆ మవ్వపుఁబువ్వు నవ్వు జవ్వనిజాతిక
విజ వి ౧ ౭౪.

వ. పువ్వు లిడఁ గోసి తెచ్చు శివపూజ కటంచు దళాన్ముఁ దంచినాఁ ఉ రా 3. ౧౯౯.

జః పుష్పాడి, పుష్పాడివన్నెలు, పువ్వాటు, మొ.

పువ్వు(వు)బోఁడి. (ణి) వి (పువ్వు+బోఁడి బ. పువ్వుఁబోఁడులు, పువుఁబోఁడులు, పువ్వుఁబోండ్లు, పువుఁబోండ్లు పువ్వుఁబోణులు, పువుఁబోణులు, పువ్వుంబోండ్లు, మొ) పువ్వువలె మనోజ్ఞారాలగు ఆఁడుది; ఆఁడుది.

గీ... భోగభాగ్యంబులను మంచిపువ్వుఁబోండ్లు, కలిగియుండంగ . దశా 3 ౨3

సీ పుణ్యంబుముడి మోచుపాలఁతుల కెల్ల నీపువుఁబోఁడి యాఁదలభూషణంబు కేయూా ౧ 3౬.

మ. తలుకుల్ గుల్కెడు నందుమేడలతుదన్ దారొక్కన్న బంగారుకుండలు మిన్నేటను గానుపించుచును విన్నాణంపుఁ దెల్వింగడున్,విలసిల్లం గని పైఁడితమ్మ లనుచున్ వేల్పుంబువుంబోండ్లు చేఁకులఁ దేరం జనఁ జాఁచి నవ్వుదురు రంతుల్ గాఁగ లేజే దొరల్. యయా ౧ ౭౧

గీ... నాగకన్యలతోడికలహ,మనకుఁ గాల్గి వ్రేదవొ లేక బోటనర్వేలఁ, బుడమి ద్రానెద విని యేల పువ్వుఁబోణి దశా ౨ 3౨౪

గీ... భయంబు లేని,పాలుపుతో నున్న దీపువుఁ బోణిచెంత. శుక ౨ ౨౯.

పువ్వుగట్టు. స క్రి (పువ్వు+కట్టు) పరిమళము గలిగించు, వాసితముచేయు.

వ అత్యంచితకాంచనప్రసవ సౌరభసమాగమునం బువ్వుగట్టి గంధవహుండు సవరించిన యందంపుగందవొడి... వసు ౨ ౧౧

పువ్వుటమ్ము. వి (పువ్వు + అమ్ము) పుష్పబాణము.

గీ చెంతవిలుఁ బువ్వుటమ్ము లేద్దెఱ ధరించి, కట్టి బిగిసి యేతెంచె నక్కడిదిమగఁడు. హ. ఉ. ౬. ౬౪ (క్రొత్తప్రతిపా.)

పువ్వు(వు)టెత్తు. వి (పువ్వు+ఎత్తు) ఒకవిధమగు పూలదండ, మాల్యగ్రంథి

సీ... పువుటెత్తు పూలపొట్లు, మనఁగి మాల్యగ్రంథి యగు ఆం భా ౨ ౧౬౪.

పువ్వులపువ్వుఁబోఁడి. = పువ్వుల నమ్మెడు స్త్రీ, పుష్పలావిక.

గీ ఒక్కెడ డిడుచోట నలుగురు రొక్కమిడిన, విటులఁ దెలుపుమఁ దావులవిరుల సరులు, గూర్చి యమ్మెదు రవ్వీటఁ గులుకు గుబ్బ, జవ్వనపుటాంధ్రు పువ్వులపువ్వుఁ బోండ్లు రా వి ౧. ౫౪

పువ్వు(వు)వింటివోదు. వి (√పువ్వు) కుసుమధన్వుఁ డగుయోధుఁడు, మన్మథుఁడు

ఉ. ఆపువువింటిజోదు మధుపావళినారి యొనర్చి చక్కఁగా, మోపిడి పట్టి జా మ్మనుచు ద్రోయఁగ మీటుచు నున్నవాఁడు . పి శకుం. ౨ ౧3౦.

పుష. సం వి. అ స్త్రీ లాంగలీవృక్షము.

పుషము. సం వి అ పుం. ఆఁడుగుఱి (వై. ని)

పుష్కము. సం వి అ న పోషణము.

పుష్కర. సం వి అ. స్త్రీ మెట్టతామర. †

పుష్కరకర్ణిక. సం వి అ స్త్రీ. స్థలపద్మిని, మెట్టతామర †

పుష్కరచూడము. సం. వి. అ పుం. చక్రవాళపర్వతమమీఁది దిగ్గజభేదము.

పుష్కరనాడి. సం వి. ఈ స్త్రీ స్థలపద్మిని, మెట్టతామర †.

పుష్కరనాభుఁడు సం వి అ పుం విష్ణుఁడు

పుష్కరప్రియము సం వి అ పుం మైనము

పుష్కరబీజము సం వి అ న తామరవిత్తు

పుష్కరము సం వి అ న ౧ తామరపూవు, పద్మము ౨ తొండముచివర, శుండాగ్రము ౩ వాద్యభాండముఖము ౪ అసిఫలము, కత్తివాదర ౫ కత్తిరొమ్ము, ఖడ్గకోశము ౬ బాణము ౭ ఆకాశము ౮ గూఁడు, పంజరము ౯ ఉదకము ౧౦ యుద్ధము ౧౧ కూడిక, సంయోగము ౧౨ తీర్థభేదము ౧౩ గరిసె ౧౪ భాగము, అంశము ౧౫ మెట్టతామరదుంప, పుష్కరమూలము ౧౬ కుష్ఠమనెడు ఓషధి, చెంగల్వకోష్టు ౧౭ ఒక ద్వీపము, (చూ ద్వీపము) ౧౮ బ్రహ్మకృతమగు నొక సరస్సు ౧౯ వ్యాఘ్రము వి అ పుం ౧ కొలను, సరస్సు ౨ నాగభేదము ౩ రోగభేదము ౪ సారసము, బెగ్గురుపిట్ట ౫ త్రిపుష్కరఘటయోగము ౬ సౌర్యము, బడబాగ్ని ౭ వాయువు ౮ శేషాహి ౯ మేఘములకు కూటస్థమగు మేఘవిశేషము —విణ (అ ఆ అ) శోభనము (శ ని)

పుష్కరమూల(క)ము సం వి అ న ౧ కుష్ఠౌషధి, (చెంగల్వకోష్టు) ౨ తామరవేరు ౩ పుష్కరదేశ ప్రసిద్ధమగు ఓషధివిశేషము

పుష్కరవ్యాఘ్రము సం వి అ పుం నక్రము, మొసలి

పుష్కరశాయిక సం వి అ స్త్రీ నీటిమీఁగా సంచరించునట్టి పక్షివిశేషము, (నుక్రుకము నూత్రస్థానము ౪౬ ౧౦౫)

పుష్కరశిఖ సం వి అ స్త్రీ పుష్కరమూలము,

పుష్కరసాగరము సం వి అ పుం కుష్ఠౌషధి, చెంగల్వకోష్టు శ

పుష్కరసాదము సం వి అ పుం తామరలను దిగమ్రింగెడి యొక పక్షి

పుష్కరస్థపతి సం వి ఇ పుం శివుఁడు

పుష్కరాంఘ్రిజము సం వి అ న పుష్కరమూలము, కుష్ఠౌషధి

పుష్కరాక్షుఁడు సం వి అ పుం విష్ణువు

పుష్కరాఖ్య(హ్వ)ము సం వి అ పుం ౧ సారసము, బెగ్గురుపక్షి ౨ కుష్ఠౌషధి శ

పుష్కరి. సం విణ (స ఈ స) పుష్కరములు (తామరలు) గలది వి స పుం ఏనుఁగు

పుష్కరిక సం వి అ స్త్రీ రోగవిశేషము

పుష్కరిణి సం వి ఈ స్త్రీ ౧ కోనేఱు, నాలుగుదిక్కుల మెట్లుకలిగి గల నలుచదరపుబావి ౨ తామరకొలను ౩ స్థలపద్మిని, మెట్టతామర తీఁగ ౪ పుష్కరమూలము ౫ తామరతీఁగ

పుష్కలకము సం వి అ పుం గంధమృగము ౨ చీల

పుష్కలము సం విణ (అ ఆ అ) ౧ సమృద్ధము ౨ శ్రేష్ఠము, వి అ పుం ౧ ఒకవిధమగు మృదంగము ౨ పుష్కరమను మేఘాధిపతి భేదము ౩ గ్రాసచతుష్టయాత్మకమగు భిక్ష, నాలుగుకబళములభిక్షము వి అ న ౧ ముష్ట్యష్టకాష్టకము, అఱువదినాలుగు ముష్టులపరిమాణము ౨ బట్టయంచు (వై ని)

పుష్టము. సం విణ (అ ఆ అ) ౧ పోషింపఁబడినది ౨ బలిసినది, బలుపుగలది ౩ పెంపఁబడినది ౪ సంపన్నము, సమృద్ధము ౫ శ్రేష్ఠము, ఉత్కృష్టము వి అ న పుష్టి

పుష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧ పోషణము ౨ వృద్ధి, పెరుగుట. ౩. బలుపు ౪ సమృద్ధి. ౫ అశ్వగంధ, పెన్నేరు గ. ౬. మాతృకాభేదము. ౭. యోగినీభేదము ౮. ధర్మునిపత్నిభేదము.

పుష్టిక. సం. వి. ఆ. స్త్రీ. జలశుక్తి, గుల్లచిప్ప

పుష్టికరము. సం. విణ. (అ ఈ అ) పోషించునది, పెంచునది, సత్తువగలిగించునది.

పుష్టికర్మము. సం. వి. న్ న. పెంపుకలుగుటకై చేయునొక విహితకర్మము

పుష్టికాంతుఁడు. సం. వి. అ. పుం. విఘ్నేశ్వరుఁడు.

పుష్టిద. సం. వి. ఆ. స్త్రీ. అశ్వగంధ, పెన్నేరుగ

పుష్టిదము. సం. విణ. (అ ఆ అ) పుష్టినిచ్చునది ౨ వృద్ధికలిగించునది

పుష్టివర్ధనము. సం. విణ. (అ. ఆ అ) పుష్టిని పెంచునది వి. అ. పుం. చావము, పాలపిట్ట (శే. ని.)

పుష్ప. సం. వి. ఆ. స్త్రీ. చంపాపురి. (కర్ణుని పట్టణము. ఇది యిప్పటి భగల్పూరు)

పుష్పంధయము. సం. వి. అ. పుం. (ఈరూపము వ్యాకరణవిరుద్ధము) భ్రమరము, తుమ్మెద
ఉ...మత్తపుష్పంధయవేణి నిత్తు శిశుపాలు
నకు... భాగ. ౧౦. పూ. ౧౬౭౫

పుష్పకము. సం. వి. అ. న. ౧. పుష్పము ౨. కుసుమాంజనము ౩ కుబేరునివిమానము. ౪. నేత్రరోగభేదము, (కంటిలోనిపువ్వు) ౫. రత్నకంకణము. ౬. రసాంజనము ౭. లోహకాంస్యము. ౮. మట్టికుంపటి. ౯. కాసీసము వి. అ. పుం. కృష్ణుని తేరిగుఱ్ఱములలో నొకటి. (శ. ర.)

పుష్పకరండకము. సం. వి. అ. న. పూలగరిడియ. ౨ అవంతిదేశమందలియొకశివోద్యానము

పుష్పకరండిక. సం. వి. ఆ. స్త్రీ. ఉజ్జయిని.

పుష్పకాలము. సం. వి. అ. పుం. వసంతర్తువు, ననకాఱు, పూఁదఱి ౨ ఆర్తవముకలుగుకాలము, ముట్టుతఱి.

పుష్పకాసీసము. సం. వి. అ. న. ఒకపర్వతధాతువు, ఒకవిధమగువన్న భేది.

పుష్పకీటము. సం. వి. అ. పుం. భ్రమరము, తుమ్మెద

పుష్పకేతనుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు.

పుష్పకేతువు. సం. వి. ఉ. పుం. మన్మథుఁడు — న. కుసుమాంజనము.

పుష్పఘాతకము. సం. వి. అ. పుం. వెదురు. !

పుష్పచయము. సం. వి. అ. పుం. ౧ పుష్పాపచయము, పువ్వులుకోయుట. ౨. పుష్పసమూహము

పుష్పచాపుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు, పూవిలుకాఁడు

పుష్పచామరము. సం. వి. అ. పుం. ౧ మదనవృక్షము, మ్రంగచెట్టు ౨. కేఁపచెట్టు.

పుష్పజము. సం. వి. అ. న. పుష్పరసము.

పుష్పదంతము. సం. వి. అ. పుం. ౧. వాయుకోణమందలి దిగ్గజము ౨. విష్ణుదేవుని వాల్గుగుఱ్ఱములలో నొకటిఁ (శే. ని.)

పుష్పదంతుఁడు. సం. వి. అ. పుం. ఒకశివానుచరుఁడు.

పుష్పదము. సం. వి. అ. పుం. చెట్టు.

పుష్పదామము సం. వి. న. పూదండ

పుష్పద్రవము సం. వి. అ. పుం. పూలరసము, పూఁదేనె ౨ పూలనుండి తీసినరసము

పుష్పద్రుమము సం. వి. అ. పుం. పువ్వులు ప్రధాన మగుచెట్టు

పుష్పధన్వుఁడు సం. వి. న. పుం. మరుఁడు పూవిలుకాఁడు

పుష్పధారణుఁడు సం. వి. అ. పుం. విష్ణువు

పుష్పధుఁడు సం. వి. అ. పుం. వ్రాత్యబ్రాహ్మణునికి సవర్ణస్త్రీయందుఁ బుట్టిన యొకజాతి వాఁడు

పుష్పధ్వజుఁడు సం. వి. అ. పుం. మన్మథుఁడు

పుష్పనిక్షుము సం. వి. అ. పుం. తుమ్మెద

పుష్పనిర్యాసము సం. వి. అ. పుం. మకరందము, పుష్పరసము

పుష్పపత్త్రి సం. వి. న. పుం. మన్మథుఁడు

పుష్పపథము సం. వి. అ. పుం. ఆఁడుగుఱి

పుష్పపుటము సం. వి. అ. పుం. ౧ పూమొగ్గ ౨ అభినయహస్త విశేషము

పుష్పపురము సం. వి. అ. పుం. పాటలీపుత్రము. (పాట్నా)

పుష్పప్రచాయము సం. వి. అ. పుం. పువ్వులు చేతితోఁ గోయుట, (దొంగతనముగా కోయునపుడును, గడెమొదలగువానితో కోయునపుడును "పుష్పప్రచయ" మగును)

పుష్పప్రచాయిక సం. వి. అ. స్త్రీ. పుష్పాపచయము

పుష్పఫలము సం. వి. అ. పుం. ౧ కపిత్థము, వెలఁగ చె. ౨ కూశ్మాండము, గుమ్మడి చె.

పుష్పబాణుఁడు సం. వి. అ. పుం. మరుఁడు, మన్మథుఁడు (ఇట్లేపుష్పశరుఁడు మొ.)

పుష్పభూషితము సం. వి. అ. న. వణిజుఁడు నాయకుఁడుగాఁ గలరూపకప్రకరణభేదము

పుష్పమంజరి సం. వి. ఈ. స్త్రీ. ౧ పూగుత్తి ౨ సస్యవిశేషము ౩ ధాన్యవిశేషము

సీ. తెక్కపాలలు కాకితెక్కలు పుష్పమంజరులు సీతాభోగనరులు

హం. ౪ ౧౨౫

వ. ఇప్పపూరాజనాలు పుష్పమంజరులు కస్తూరి నిగరాలు ప్రబంధ ౧౧౨

వ. మాటిమాటికిఁ గొరవిదిరిగుత్తిపై వ్రాలి రొదగయుధనలంత్రిఁ గొమ్మ పుష్పమంజరులు గ్రాయుమునలం బని గుసగుస లాడుచు రా. వి. ౩ ౧౧౪

పుష్పమాల సం. వి. ఆ. స్త్రీ. పూదండ

పుష్పమాసము సం. వి. అ. పుం. వసంతర్తువు (రా. ని.)

పుష్పము. సం. వి. అ. న. ౧ పూవు ౨ స్త్రీరజస్సు ౩ పుష్పరాగమణి ౪ నేత్రరోగవిశేషము, కంటిపువ్వు ౫ పుష్పకవిమానము, కుబేరునివిమానము ౬ శృంగారవిలసితము ౭ గండివనము చె. ౮ మాచిపత్త్రి చె. పుం. వికాసము (శ. ని.)

పుష్పరక్తము సం. వి. అ. పుం. సూర్యమణి వృక్షము

పుష్పరజస్సు సం. వి. స. న. ౧ పుప్పొడి ౨ కుంకుమము (శ. ని.)

పుష్పరథము సం. వి. అ. పుం. ౧ క్రీడారోగ్య మగురథము, పుష్యరథము ౨ పుష్పనిర్మిత మగు రథవిశేషము (వాచ)

పుష్పరసము సం వి అ పుం పూఁదేనె, మకరందము

పుష్పరసాహ్వయము సం వి అ పుం మదువు, తేనె

పుష్పరాగ(జ)ము సం వి అ పుం కొంచెము పసుపువన్నెగల శ్వేతమణి విశేషము
శ్లో॥ ఆపీతపాండురుచిరః పాషాణః పుష్పరాగస్తు

పుష్పలావి సం వి ఇ పుం పుష్పలావుఁడు, మాలాకారుఁడు వి ఈ స్త్రీ పూదండలు, బంతులు, గ్రుచ్చియమ్ముడు ఆఁడుది

పుష్పలావిక సం వి అ స్త్రీ పుష్పలావి

పుష్పలావుఁడు సం విణ (అ ఈ అ) మాలాకారుఁడు పూలబంతులు సరములు లోనగునవి గ్రుచ్చి యమ్ముడువాఁడు

పుష్పలిట్టు సం వి హ్ పుం = పుష్పలిహము (రూ పుష్పలిహము)

పుష్పలిహము సం వి అ పుం తుమ్మెద

పుష్పరోచనము సం వి అ పుం నాగకేసరము

పుష్పలోలుపము సం వి అ పుం తుమ్మెద (వై ని)

పుష్పవంతము సం విణ (త్ తీ త్) ౧ పుష్పములుగలది ౨ పుష్పములతో నలంకరింపఁబడినది
వి త్ అ పుం ద్వి (పుష్పవంతులు) సూర్యచంద్రులు

పుష్పవతి సం వి ఈ స్త్రీ రజస్వల, ముట్టుత

పుష్పవాటి సం వి ఈ స్త్రీ పూలతోఁట

పుష్పవృక్షము సం వి అ పుం పుష్పములు ప్రధానమైనవృక్షము

పుష్పవృష్టి సం వి ఇ స్త్రీ పూలవాన

పుష్పశకటి సం వి ఈ స్త్రీ దివ్యవాక్కు-ఆకాశవాణి

పుష్పశకలి సం వి ఇ పుం నిర్విషమగు సర్పభేదము

పుష్పశరాసనుఁడు సం వి అ పుం మన్మథుఁడు, పూవిలుకాఁడు

పుష్పశూన్యము సం వి అ పుం ఉదుంబరము, మేడి

పుష్పసమయము సం వి అ పుం వసంతఋతువు

పుష్పసారము సం వి అ పుం ౧ కుసుమరసము, పూఁదేనె ౨ తులసి

పుష్పసౌరభ సం వి అ స్త్రీ పొత్తిదుంప

పుష్పస్వేదము సం వి అ పుం మకరందము, పూఁదేనె

పుష్పహాస సం వి అ స్త్రీ రజస్వల, ముట్టుత

పుష్పహీనము సం వి అ పుం ఉదుంబరము, మేడి

పుష్పాంజనము సం వి అ న పిత్తడితోఁ జేయఁబడినఅంజనవిశేషము

పుష్పాకరము సం వి అ పుం వసంతఋతువు

పుష్పాగమము సం వి అ పుం వసంతఋతువు

పుష్పాజీవుఁడు సం॥ మాలాకారుఁడు, మాలకరి

పుష్పాసనము సం వి అ పుం మద్యవిశేషము.

పుష్పాపీడము సం. వి. అ. పుం. పూలసిగదండ

పుష్పాయుధుఁడు సం. వి. అ. పుం. మన్మథుఁడు

పుష్పావచయము సం. వి. అ. పుం. పువ్వులు కోయుట

పుష్పావచాయి సం. వి. న. పుం. పుష్పాజీవుఁడు, మాలాకారుఁడు

పుష్పాసవము సం. వి. అ. న. మధువు, తేనె

పుష్పాస్త్రుఁడు సం. వి. అ. పుం. మన్మథుఁడు

పుష్పాహ్వ సం. వి. ఆ. స్త్రీ. శతపుష్పి, సదాప కి

పుష్పి సం. విణ. (అ. ఈ. అ.) ౧ పువ్వులు గలది, వికసించునది ౨ పువ్వులచే సమృద్ధమైనది

సం. వి. ఈ. స్త్రీ. అతిబల, ముత్తవపులగము కి (వై. ని. శే. ని.)

పుష్పించు సం. అ. క్రి. పూచు, వికసించు

గీ. గీతము వహించి, తేటి పుష్పించెఁ బ్రేంకణ మింతి మోము సమీర ౧ ౧౨౦

స. క్రి. పుష్పింపఁజేయు

సీ. చలికాఁగాఁ దన్ని యశోకంబుఁ బుష్పించి విద్రుమాధరి రోమార్త విరులు గోసె, నవ్య గీతులఁ బ్రేంకణము వికసింపించి వనిత యొక్కతె ప్రసవములు గోసె

పి. శతకం ౨ ౧౩౦

పుష్పిక సం. వి. ఆ. స్త్రీ. ౧ దంతమలము, ౨ లింగమలము, ౩ గ్రంథాధ్యాయసమాప్తి యందు, ఆయధ్యాయముచేఁ బ్రతిపాదితమగు దానిని జెప్పెడి గ్రంథాంశభేదము (ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వనపర్వణి అధ్యాయః, ఇది పుష్పిక) ౪ ఒకవిధమగు పిల్లనగ్రోవి (వై. ని.)

పుష్పిణి సం. వి. ఈ. స్త్రీ. రజస్వల

పుష్పితము సం. విణ. (అ. ఆ. అ.) పుష్పించినది, పూచినది ౨ వికసించినది, విరిసినది ౩ పుష్పములచే నలంకృత మగుదానింబోల అందము గలుగునది (వాక్క. వెం.) ౪ సమృద్ధము, సంపన్నము (సువర్ణపుష్పిత మగుపృథ్వి) ౫ ప్రవృద్ధము, చక్కఁగా ఎదిగినది

పుష్పితాగ్ర సం. వి. ఆ. స్త్రీ. (ఛంద.) అర్ధసమవృత్తభేదము

శ్లో. అయుజిన యుగరేఫతో యకారో యుజిచ నజౌ జరగాశ్చ పుష్పితాగ్రా

పుష్పోపజీవి సం. విణ. (అ. ఈ. అ.) మాలాకారుఁడు

పుష్యనేత్ర సం. విణ. ఆ. స్త్రీ. ఏరాత్రియందు మొదటినుండి కడదాఁక పుష్యనక్షత్రము కనఁబడునో యట్టిరాత్రి (వాచ.)

పుష్యమి సం. వి. ఈ. స్త్రీ. ఒకనక్షత్రము, ఎనిమిదవనక్షత్రము

(శ. ర. మాత్రము సం. ని. లలో లేదు)

పుష్యము సం. వి. అ. పు. ౧ పుష్యనక్షత్రము

వ. ఉత్తరభాగంబునఁ బునర్వసు పుష్యంబులును దక్షిణభాగంబున సార్ద్రాశ్లేషలును

భాగ. ౫. ౨. ౯౮

౨ పౌషమాసము ౩ కలియుగము (వే. ని.) ౪ కూశ్మాండఫలము, గుమ్మడికాయ (శే. ని.)

పుష్యరథము సం. వి. అ. పుం. పుష్పరథము

పుష్యరాగము సం. వి. అ. పుం. = పుష్పరాగమణి (శ. ర.)

శా. కాలాబిత్యము మీఱఁ బెక్కువలమైఁ గల్యాణ సౌమ్యాంగులై, కేలీలోలతపస్వి దారకసమాక్రీడం బ్రవర్తిల్లుచున్.
నిర్వ. ౧౦. ౧౩౫.

సీ. శివపూజ చాన త్రీఁ జెప్పిచున్నల పెక్కువయేఁ తృబ్రహ్మాంబును నయమాఁజూప .
కాశీ. ౪. ౨౩.

౨. ఉన్నతి, ఎత్తు.

గీ. మొదలి పెక్కువయును బోయి మునిఁగ నగ్రి, కలశజాని క్షేత్రమునఁ గొంపు గాన మైన, నొయని యైశ్వర్య మీక్షించి యుప తపించు, నట్టి ఖలునకు నది ఒద్దయానె తలఁప.
కాశీ. ౩. ౬.

(ఇవి రెండు నుదాహరణములు.)

౩. ఆధిక్యము, ఘనత, గొప్పతనము.

ఉ. కింజనీటంకార సింహనాదంబుల పెక్కువ యాశ్రమాఁతఁ విలుచుకొనియె
భాగ కర్ణ. ౧. ౬౨.

(పిల్చుకొనియె పాఠాంతరము)

ఉ. .. పెనంగిరి బాహుకౌర్యముల్ శ్రాముఁ దూన్పవ న్పు వనఁ దక్కువ పెక్కువలేక యుద్ధముల్ ...
జై భా. ౫. ౯౯.

(తక్కువ ఎక్కువలేక శ. ర. పా. ముద్రి. పా.)

క. పెక్కువ గల వారి యుటువలెఁ, బెక్కువ గల పేద వాని పృథుబాలంకార, మ్మక్కువ గలఁ జేయఁగ లో, మక్కువగల నిట్టు లనియె మఘువునితోడన్. (దశా. ౨. ౩౭.)

౪. ప్రేమ, అనురాగము.

సీ. హంస పెక్కువనిచ్చె హంసికి శోభన్నర కెలమాడదు మొగములు పెలమి మిగుల ...
కు. సం. ౪. ౪౬౯.

౫. సమూహము.

వ. .. మగుపల నగవు పెన్నెలలోన తక్కువ పెక్కువలుంబోలెఁ గానుపించు పొన్న మొగ్గలును . యయా. ౪. ౧౩.

విశే. ౧. పెద్దది, అధికము.

గీ. బెలుఁగు రవికెలలోపల వలుఁబోండ్ల, గబ్బి పిబ్బెంపు బిగివలిగుబ్బ లమరెఁ, జిత్తజాతుని యురులలోఁ జిక్కియున్న కలికి పెక్కువ జక్కవకవలకరణి ..
ఘటికా. ౨. ౧౨౩.

క. జక్కవకవ పెక్కువయగు, మక్కువతో రేయిఁ బగలు మనుజాధీశుం, దక్కాంతఁ దక్క కోర్వక, దక్కట కార్యంబు లెల్లఁ దక్కఁ జరించున్ . (శు ప్ర. ౩. ౩౯.)

౨. ఉన్నతము, ఎత్తయినది.

సీ. నీవు పెక్కువో లేక నేను బెక్కువో యంచు సరి నిల్చు వానిభుజంబు పోలె .
(హ శా. ౨. ౧౭.)

పెగడ = పెగ్గడ. వి. మంత్రి, ప్రధానుఁడు.
(శ. ర.)

పెగ్గడ = పెగడ. వి. ౧. మంత్రి, ప్రధానుఁడు.

వ. సర్వన్ కరపరివారపురాదారా ... ఇచ్చితిమి, స(ద్ధి)విగ్రాహి పోతన పెగ్గడ ప్రాలు . . (ద. శా. ౪. ౧౦౪౭.)

౨. ఊరి పెత్తనదారు.

వ. . పెగ్గడకు త్తు కరణాలకు త్తు ... భూమివృత్తులు గా నియ్యఁబడినవి ...
శా. Ep. Ind. Vol. V 17.
S. 1185.

పెగ్గుమ్మడు. వి. (పెద్ద + గుమ్మడు.) శ్రీ షష్ఠి. ౯. (శ. ర.)

పెగ్గురు = బెగ్గురు. వి. (సం. భృఙ్గః. ప్రా. పాక్ఖరం.) సారసపక్షి.

సీ. పెగ్గురుకొదమల బెగ్గిల మగ్గించి కొంగల పొంగెల్లఁ గ్రుంగఁ ద్రొక్కి.

ద్వా. ౧. ౨౧౯. (ప్రాచీనప్రతి. పా.)

పెచ్చేగిల్లు(లు). అ. క్రి. (√పెచ్చు.) అతిశయించు, చెలరేఁగు.

వ. ఇట్లు పెచ్చుగిల్లిన పచ్చవిల్తు పెచ్చు పెచ్చు పెచ్చులిం జూచి కలంగి ప్రబల బలదర్పితుం డగు నా దర్పకుని దూఱం దలంచి.

ద్వా. ౫. ౧౩౨.

క. పెంచ్చిరి నీళ్తికి మది, నిచ్చెద నే నేఁడు మింక నేవరమైనన్, జెచ్చెర నీమనమని కృప, పెచ్చుగిలం బల్కుటయును. శ్రీతాత్మ్యం డై.

(శ్రీరం. మా. ౪. ౯౪౩. పిచ్చిగిలు. ముద్రి.)

పెచ్చారి. విశే. (పెచ్చు + అరి, వృత్తి యందు వర్ణ వికారము. క. పెచ్చు=పిచ్చి,అవివేకము.) మూర్ఖుఁడు.

క. వచ్చిన మునిపతి కర్ణిణ, మిచ్చిన పిదపన్ మహీశు లెల్లను వినఁగా, మచ్చరపు వాసుదేవుఁడు, పెచ్చారితనంబు ప్రామిచిల నిట్లనియెన్. (భా. హరి. ౩. ౧౦.)

పెచ్చు. వి. (క. పెచ్చు, హెచ్చు.) ౧. ఆధిక్యము, అతిశయము.

ఉ. ఒప్పులుగా భుజించిరి బుధోత్తము లాకఁటి చిచ్చు పెచ్చువన్. (భీమ. ౨. ౧౩౯.)

౨. అధికప్రసంగము, దూలుమాటలు.

ఉ. వచ్చి జోహారు సేసి నిలువన్ సురనాథుఁడు చూచి రంభతో, మచ్చర మేఁటికిన్ విరుదు మాటలకుం బని యేమి నీకు నీ,పెచ్చులు వల్కులేల నినుఁ బెంచినతండ్రికిఁ గీర్తి మిక్కిలిం, దెచ్చితి .. వాల్మీ. ౩. ౩౧.

౩. అక్కరను బట్టి నాణెముల మార్పులో నగు వానియందు అధికముగా నిచ్చెడు ధనము. (శ. ర.)

౪. ఫలాదు[illegible] తోలు.

ఉదా: దానిమ్మ పెచ్చు. వా.

ద్వి. అనిమిషుల్ మిఱుపెచ్చువం దిద్ద నిప్పుకులె లవ రెక్కలు దోఁచె నత్రయున ..

ద్వి. తి. సా. ౨. ౨౯. పా. ౨౩.పం.

౫. విధము, రీతి.

వ .కృష్ణభుజంగంబునంగంబున బుసలం బోవిడుచుచుఁగార్చిర్చుపెచ్చున మండిపడుచు నంబు దంబుచందంబునఁ దిమురుచు .

చంద్రా. ౬. ౯౩.

వ. అట్టియెడ నజ్జిగజెట్టి మహారణ్యాఁ సొచ్చిన కార్చిచ్చు పెచ్చున

ఉ. రా. ౨. ౬౧.

విశే. అధికము.

సీ. ఎచ్చు పెల్లఁదనము హెచ్చు మిగిలి, మిక్కిలి యెక్కువ మెం దగ్గలము పెచ్చు దగు నాఁగ నధికంబు దోఁచుచుండు .

ఆం. భా. ౩. ౨౪.

వ. భద్రదంతావళాక్రాంతమహీంతార బెచ్చుఁ బెచ్చు వుంగదలం గదలంకొన్నకరులు చెవుడు పడ .. రా. వి. ౩. ౬౬.

(ఇట వికాలమని భావము.)

క్రి. విశే. అధికముగా, మిక్కిలిగా. (గ్రా.)

(చూ. పెచ్చుపెరుఁగు, పెచ్చురేఁగు.)

జ: పెచ్చుగిల్లు, పెచ్చారి, పెచ్చుపెరుగు, పెచ్చు రేఁగు, పెచ్చుపెచ్చు.

**పెచ్చుపెరుఁగు.** అ. క్రి. (పెచ్చు + పెరుఁగు.)
౧. మిక్కిలి అతిశయించు, పెంపెక్కు.

ఉ. వచ్చిన రాజసంఘములు వారిజనేత్రల
కండ కండముల్, పెచ్చుపెరిఁగి...ండఁ
దఱచేసు దల స్వేచ్ఛఁ గొబ్బిపట్లుగా ..
...దేల. ౨. ౧౧.

గీ. ఖలయు రత్నాకరములు సంచులుగఁ జేసి,
పాదివి నిధు లెల్లఁగొని సంచిమొదలు చేసి,
తేర మాడెదుపాటి యువారలక్ష్మి, ఇచ్చు
లప్పుడి మహాన్నరు పెచ్చుపెరిఁగి.
పాండు. ౧. ౧౧౧.

౨. విజృంభించు, చెలరేఁగు.

ఆ. అతఁడు పూజనీయుఁ డగు నేనెఱుంగుదు,
నైన ధనము లేని నవదశనము, వచ్చుఁ బెచ్చు
పెరిఁగి వైగిలు గర్వించు, తేల పగ
యుదంగు నెట్టులైన.
భార. ఉద్యో. ౩. ౧౭౪.

ఆ. ఎదురి నుండ పెఱచి మదమతి దవ్వుగా,
వచ్చి రూఢిఁగి తేల పెచ్చుపెరిఁగి, క్రేళి
దిప్పుడ పట్టి వాలుక గోసెద, మానుమాను
రిత్తమాటలేల. భార. ద్రోణ. ౪. ౨౭౧.

**పెచ్చురేఁగు.** అ. క్రి. (పెచ్చు + రేఁగు.) చెల
రేఁగు, విజృంభించు.

గీ. నలుగు రేవుర సంగడీ లలమిరోఁడఁ, బోక
లాటలు నాడిలోనఁ బోనీకొనుచు, జాణ
తనముల నట్టపోనులు నొలయఁ, బెచ్చు
రేఁగుచుఁ గొలువఁగా వచ్చె నొకయు.
హ్యా. ౧౦. ౮౩.

**పెచ్చులెచ్చు.** అ. క్రి. (పెచ్చు + ఎచ్చు.)
మిక్కిలి యధికమగు.

ఉ. ... శివుని భార్యయుఁ గాళిఁ బుట్టారాశిం,
గా డొనరింపఁ జూచెదవు కంతపుఁ
గ్రోధము పెచ్చులెచ్చఁగన్.
భీమ. ౨. ౧౧౭.

**పెజ్జటి.** వి. వి. (పెద్ద² + జటి.) గొప్పజడి.

క. ఇటు లుండి కొంతవడి తా, కుటిలాలక
పలుకు విడెడి కుచుకంబునఁ బెజ్జటి
యిటులఁ బల్కె నత్తఱి, ఇటుతర హావభావ
లేకభావ్యం దగుచున్. (వెన్నెల. ౨. ౨౪౩.)

**పెటపెట.** వి. ౧. (పండ్లు కొఱుకుట, పెటులుట,
విఱుగుట, క్రేలుట, చిటుకులు పడుట, ఈలువేయుట
మున్నగు వానియందగు) ధ్వన్యనుకరణము;
అట్టి ధ్వని.

ఆ. పెదవు లదరఁ బండ్లు పెటపెటఁగొఱుకుచు,
దట్టుఁ డాగ్రహించి తపసిఁ బలికె...
భాగ. ౬. ౨౫౦.

ద్వి. పెటపెటఁ జటిలి పె న్బిడుగులు పడిరు...
ద్వి. హరిశ్చ. పూ. ౨౧౪౭.

ద్వి. పెళపెళ ధ్వనులును పెటపెట ధ్వనులు,
కలయ దిక్కులఁ బర్వఁగా విల్లు విఱిగ ...
రం. రా. బాల. ౬౬. పా. ౧౦. పం.

(దిక్కుల ద్రువఁగా ఖిల్లు విఱిగ, ప్రాఁతముద్రి. పా.)

చ. మిటమిటఁ గాయు తాతపము మించఁగ
నోర్వక గండశైలముల్, పెటపెటఁ బ్రేలి
ప్రేలముల పెంపు వహించెను ...
చిత్రభా. ౨. ౯.

క. అం దొకకూద్రుఁడు సుమతి యనందగుఁ
బద్ధిని యపం దనర్చిన పరిపూర్ణేందువదన
యుల్లాలంగఁ, బెండపులంచోని తేమ పెట
పెటఁ జేల్పగా. శుక. ౩. ౨౪౩.

కంకపటలం,బుల వెగవేసి గొప్పకొలఁది
మొత్తము లనఁగాఁ.

పరమ. ౩. ౨౨౯. (శ. ర.)

**పెటిల్లు.** వి. పగులునప్పుడగు ధ్వని శబ్దకరణము.

సీ. పాన్పుపయిఁ బొరల నిబ్బరపు గుబ్బలపాళ
పటులి పెటిల్లునఁ జిటిలి రాల...

కువల. ౩. ౨౪.

**పెటుకు.** వి. ౧. విఱుచుటయందగు ధ్వని శబ్ద
కరణము.

(దీని ఆమ్రేడిత రూపము. "పెటుకుపెటుకు")

వ. . . రక్తంబులు గుటుకుగుటుకున
గ్రోలియుఁ గీకసంబులు పెటుకుపెటుకున
విఱిచియుఁ బ్రేవులు పుటుకుపుటుకున
బ్రెంచియు . వరాహ. ౬. ౧౧౭.

విణ. పరుషము. విరసము.

(వ్యవ.) వారితో నీవు పెటుకుమాట లాడ
వలదు.

**పెటులు(ట్లు)** = పెడులు. అ. క్రి. ౧. (వేడిమి,
బిగువు, మున్నగువానిచే) చిటులు, పగులు,
బ్రద్దలగు.

గీ. పెటిలె బ్రహ్మాండభాండంబు చిటిలె
దిక్కు, లురలెఁ బాతాళభువనంబు లదిరె
నభము . భీష్మ. ౪. ౬౧.

క. పోఁకమడి వీడఁ బులకలు, మూఁక విడక
కెమట గ్రమ్మ కాంచి చలింపక, పైకి పెటి
ల్లని పెట్లఁగ, రాకేందునిభాస్యఁ గొడెఁ
బురాంతకుఁ డంతన్. (పార్వ. ౩. ౫౩.)

౨. ధ్వనించు, శబ్దించు.

ద్వి. పెటపెట పెటిలి పెన్పిడుగులు వడిరా.

ద్వి. పూరిక్ప్. ౨౧౪౬.

౩. ఉష్ణముచేత ఉబుక్క ప్రేలు.

పీ. వాగికెదిక్కులు పెకంబుల యంగములు
పెట్లి పారగఁ బిట్టలు వదఁలిరిగ
మరుఁడు. చంద్రా. ౨. ౩౪.

వి. తుపాకివంటి అగ్నిప్రసరణాయుధవిశేషము.
(పెట్లుఁగ్రోవి. అవి. శ. ర.)

సీ. పెటులుచప్పుడు లాత్మధీయస్యయంత్రాణా
పరిరంభముఖము షేచరుల శౌనఁగ.

మనుచ. ౫. ౪౪.

జ. పెటిలించు, పెటిలిపడు, పెటులుఁగ్రోవి,
పెట్లకంబము, పెట్లగుండు, పెట్లదిమ్మ,
పెట్లమారి, పెట్లాట, పెట్టుఁగ్రోవి,
పెట్లుప్పు.

**పెటులు(ట్లు)ఁగ్రోవి.** (పెటులు(ట్లు) + గ్రోవి.)
అదరుఁగ్రోవి, తుపాకివంటిదొక
యుద్ధసాధనము.

వ. . . తుపాకుల పెళపెళలు పెట్లుఁగ్రోవుల
పెటపెటలు .. కృష్ణ. ౩. ౨౯.

**పెట్ట¹.** వి. (క. పెణ్ణె.) ౧. పశుపక్షులందలి స్త్రీ
వ్యక్తి.

గీ. కొక్కులార్పుచు లకుముకిపక్కిరీతిఁ, దెలు
పుచు ధరణి శేషమైనఁ దెలుపుటగనినఁ, బెట్ట
యని గమకించి చూపెట్టుకొనుచు, నుండెఁ
బావురము ... పారంగ. ౧. ౧౨౨.

వ. సంచారార్థంబు దిక్కులకుఁ బెదలు పక్కులు
రవంబులనక్కఁ దండనంబుపోని మక్కన
వంకకంబులంబోలు చరణనఖాంకురంబులం
బెట్టనుంబోకుమం గఱచియు, నిఱికియుం
బట్టి రమకాంతప్రదేశంబున భక్షించుచుండిరి.

కాశీ. ౬. ౨౯౩.

౨. ఆఁడుబోడి.

సీ. పుట్టినిల్లని పెట్టిపోఁతలఁ లాలించిన యక్క-
చెల్లెం డ్రెంత యడలవలయు.
నిరం. ౨. ౧౨౮.

పెట్టిపోయు. అ. క్రి. (√పెట్టు.) అన్నాదు లొసఁగి పోషణముచేయు.

సీ. పెట్టిపోసినవాఁడె చుట్టాలచేరిక కలిమి గల్గిన
వాఁడె కాంతవలపు. (రామలిం. ౪౪.)

పెట్టు. స. క్రి. (క. త. పెట్టు.) ౧. (ఆహారము, జీతము, బహుమానము, మొ॥) ఇచ్చు, ఒసఁగు.

(క.) ఆహారమిచ్చు.

చ. ప్రియమెసఁగం దగం బిలిచి పెట్టెదు కూరది
లెన్నకూడు ..
భార. ఉద్యో. 3. ౨౨౨.

గీ. అఖిలకళ్యాణగుణశీల యూ సుశీల, పెట్టెఁ జే
మీఁదుగా వెల్లచుటములకు, భర్తతోఁ
గూడ ముత్యాటిపండు దినియె, నత్తె మున్నన్న
గుజ్జుల నెందఁ కోని. పాండు. ౪. ౨౬౩.

(చ.) జీతమిచ్చు.

క. పలికిరకంఠెను వెనుకన్నఁగొలిచిన భటుఁ
డరుగు చేనిఁ గొన్నధనం బీ,వలయును బలి
దా సనిపినఁ, గొలిచినదినములకుఁ బెట్టి కొలు
వుడుపఁదగున్. విజ్ఞా. ౨. 3౪.

(ట.) బహుమానమిచ్చు.

సీ. పంచాంగమయ్యకుఁ బాగ సమర్పించు నట్టుల
కానికిఁ బెట్టు మరువు.
హంస. ౫. ౧3౪.

(త.) అధికారమిచ్చు.

క. ... [illegible] దళవాయితనము పెట్టకు సుమతీ.
సు. శ. ౯౪.

(ప.) మాల్యము (వెల) గానిచ్చు.

ఆ. .. మేను, దీనిరహిఁ బణ్యమమ్మరు కప్పు
రంబు పెట్టి యూప్ప గొనుట.
[illegible]

(గ.) ఇచ్చు, అనుభవింపఁజేయు.

క. కుడువక పెట్టక కూడ్రుఁదు, కను వెక్కుడు
కూర్చినట్టి కనకముఁగొలుచుం, బుడమిపతి
ధర్మకృతులకు, నిడ దగు సగము గాని వేఁది
నీశ్వరవర్యా. (భార. శాం. 3. ౪3౨.)

ద్వి. ఏ మందు పెట్టిన నెఁగుఁ బ్రాణములు.
ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౨౦.

సా: పెట్టిన తినువారే కాని తిట్టిన పడువా
రుండరు.

౨. ఇడు, వైచు, వేయులవలెనే ఇది సందర్భ
మును బట్టి పెక్కర్థముల నిచ్చును.

చ. .. అవ్వనంబున లతాలలనల్ మృదులా
నిలాపవర్జితకుసుమాక్షతావళులు సేసలు
పెట్టినయట్టి రైరి ..
భార. ఆది ౪. ౧౩౪. (ఇట చల్లు.)

క. అని తలఁచి యొక్కపత్త్రిక, తనతనయుని
పేర వ్రేశతమ్ము స్వహస్తమ్మున వ్రాసి
ముద్ర పెట్టి సృపినయుఁ దగుచుఁ జంద్ర
హాసుబిభునకు ననియన్.
జై. భా. ౧. ౬౪. (ఇట వేయు.)

క. .. లేఁ చిగురరఁటాకులు పెట్టిరి, దిగదిగ
న ద్దేవయాజ్ఞ దివ్యపురంధ్రుల్.
భీమ. ౨. ౧౨౮.

గీ. ఎంత చేసిన సాసింపఁ మొదటి కడుగు,
పెట్టదయ్యెను గజ్జావిభీమమముగఁ, దోఁకఁ
ద్రిప్పఁచుఁ గడు చక్కఁ ద్రొక్కఁ గాని...
కళా. 3. ౪౯. (ఇట ఉంచు.)

సీ. ఒకటి కొక్కటి చూచి యుతికి కొంకలు
పెట్టునీదల గుమిగూడి మెదురుచెట్టు.
శుక. ౨. 3౪౨.

సీ. వరుసలుపెట్టి దువాళింప నుడి పిడి పెలి
మాపు మోపదు వెనుకకాలు.
శరా. ౧౦. ౧౫.

గీ. కూరు కొంకపెట్టినట్టులు గొంద లుజ్జ్వ
లాయుధములు గంకటములు సమర మున్నఁ,
జూచి చావనివా రని చూడు చేర, నరుగ
కున్నవి కంకగృధ్రాదు లలికి.
భార. స్త్రీ. ౪. ౨౦.

గీ. ... కంకరాద్రి,కాననము పొంచి మందరా
గంబు దాకఁ, బొజ పెట్టిరి తిన్మాలబలము
దొరలు. మనుచ. ౫. ౪౪.

సీ. ప్రియుకు ధమ్మిల్లంబు పెట్టినాఁ డిక్కడ .
భాగ. ౧౦. పూ. ౧౦౭౬.

సీ. ముంగిట గోమయంబున గోముఖము దీర్చి
కడలు న్నాల్గుగ ముగ్గుకట్ల పెట్టి.
కాశీ. ౫. ౧౪౧.

౮ అలఁదు, రాచు

చ. బిగిచనుదోయిఁ జందిరము పెట్టె నివేకద
సాంధ్యకృత్యముల్ (గంధ. ౨౫. పా )

చ. . తగుమాత్రము సున్నము పెట్టి చుట్టి
యు, య్యిరుగడ నొక్క యాకుమడు
పిచ్చిన . సారంగ. ౩. ౧౩౯.

చ. సురప్రకరంబు కళింగమేదినీ,విభు నప
క్రీర్తికజ్జలము పేముఁ బెట్టి పరించు
నిచ్చలుఁ. ఆము. ౧. ౪౦.

౯. ఆభరణాదుల ధరించు.

సీ. కట్టినచీరలు పెట్టిన తొడవులు సొక్కుడి
వాపోంబులు .. విజ్ఞా. ౩. ౧౩౨.

సీ. ధరియింపనేర్చిరి దర్భపెట్టెదుంద్రవెళ్లి లీల
మాణిక్యాంగుళీయకములు. (భీమ. ౧. ౪౦.)

క. ... విరుదులు పోలికలు దున్నఁబెట్టిరొ
యనఁగఁ. ఆము. ౪. ౧౨౫.

౧౦. ధరింపఁజేయు.

సీ. ... బిసకాండహారంబు బెట్టు హరిణి.
హైమ. ౨. ౧౪౧.

సీ. పసివాఁడు కట్టిన పాలభూసర కాని పెట్ట
పొమ్ములు లేవు బిడ్డలకును.
(కుచేల. ౧. ౩౬.)

చ. .. కస్తురిం, గొని యిడు బొట్టు నా
కనుచుఁ గూర్మి నొసంగిన బెట్టుచుండ ...
ఆము. ౫. ౬౨.

(బొట్టును. అను కర్మపదమధ్యాహార్యము.)

౧౧. కలిగించు.

సీ. అనలాక్షుఘనజటావనవాటి కెవ్వాఁడు వన్నె
పెట్టునసా ర్తవంపుఁబువ్వు.
మనుచ. ౧. ౧౮.

ఉ. . మృదుపల్లవకోమలతల్పదద్వయీ,
పాటలకాంతి దూలి మణిపంక్తికి వన్నియ
పెట్ట నాజగన్నాటకసూత్రధారి యదు
నందనుఁ దర్శిలి మ్రొక్కి .
పారి. ౧. ౧౨౦.

సీ. లచ్చి యన్నకుఁ దమ్ములకును వాదులు పెట్టి
కలకల నగుమోము కళల నీన ...
సారంగ. ౨. ౪౨.

౧౨. దిగవిడుచు, విడుచు.

ఉ. ... మదీయభార్య కీ, ర్తిప్రియ దనిఁ బెట్టి
చనుదెంచుట ధర్మవో నాకు . .
భార. ఆది. ౨. ౬౩.

చ. అదలిచి లక్ష్మణుండు విజయాత్మజుఁ
దాఁకినఁ జూచి యమ్ములం, బొదవఁగఁ
బుత్రుఁ బెట్టి చన నోపక క్రమ్ములు రాజుఁ
గాంచి ... భార. ద్రో. ౨. ౮౮.

గీ. తగిలి నా జీవమునకు నాధారమైన, నీవు
ననుఁ బెట్టి పోఁ జన్నె భావజన్మ.
కు. సం. ౫. ౫౫౫.

౧౩. (పశుపక్ష్యాదులు.) ప్రసవించు.

క. కటకట మి ట్లను నీకుం, గట్టని నీదకూలు
గావె కింధిరటంబుల్, ప ట్టయినచోట
గ్రుడ్లం, బెట్టును నీ వనిన
పం. పంచ. ౧. ౫౪౫.

(వ్యవ.) ఆ కోడి నాలుగు గ్రుడ్లు పెట్టినది.

(వ్యవ.) ఆ యావు మంచిదూడను పెట్టినది.

౧౪. పక్షులు గ్రుడ్లను పొదివి పిల్లలను చేయు.

సీ. చతురభాషిణి యొకశారిక వర్తించు నది
పిల్లఁ బెట్టి యుంపారుపంక్తు, తెచ్చి యమ్మిలి
దాని కిచ్చుచో ...
భార. శాం. ౩. ౨౪౫.

౧౫. ఒప్పగించు.

గీ. చదువఁ బెట్టిరి వేదంబు పదముఁ గ్రమము,
సాంగముగ బాలకుని నుపాధ్యాయునొద్ద
కాశీ. ౪. ౧౩.

సీ. గరిమ మహాభావ్యగురువిరుద్దను దగ
శాస్త్రము లెంతయుఁ జదువఁ బెట్టె.
పరమ. ౫. ౧౬౨.

౧౬. ఉంచు.

ఉ. వార్థి లస త్తరంగహ స్తంబుల నెత్తి
పెట్టెఁ దనసైకతతీరముఁ జేర నమ్మునిన్.
భాగ. ఆది. ౩. ౧౧౯

చ. .. సర్వపితామహుఁ డబ్జసూతియున్,
సమధికదీర్ఘ జీవి యను శబ్దము పెటకఁ బిల్వఁ
డెన్నఁడున్. హరి. ఉ. ౯. ౧౦౪.

గీ. మంత్రపుష్పంబుఁ బెట్టి మన్మథవిరోధి, మూర్ధ
భాగంబునందు సమ్మోద మెసఁగ.
నైష. ౭. ౧౧౦.

క. ఆ దైవత మెన్నటి కీ, పైఁదలిపై దయను
బెట్టి ప్రత్యక్షమగున్. (పార్వ. ౪. ౭౫.)

౧౭. పెంపొల్పు, విజృంభు.

ఉ. . ఖరాంశుమూర్తి పైఁ, బెట్టినచూడ్కితో
హృదయపీఠికయం దమృతాబ్ధిమందిరుం బట్ట
మగటి ... (కవిక. ౨. ౯.)

గీ. నిండువేసవి మరుభూమి నిర్మలముగఁ, జేర్మి
సలిలాన్నసత్రంబుఁ బెట్టినట్లు ...
భీమ. ౫. ౧౫౨.

గీ. ఇటుల నయ్యంబ మనసులో నీకుఁ బెట్టి.
పార్వ. ౪. ౪౨.

౧౮. నియోగించు, పనుచు.

ఉ. కటకుఁ గాపుగా నిదుర గానఁగఁ జాలెడి
వారిఁ గొందఱం, బెట్టుచు వచ్చి ...
భా. రా. యు. ౨౫౮.

గీ. మీర లెనమండ్రు భుజగేంద్రవారు వొద్ద,
భ క్తిఁ బూజింపఁ బెట్టుఁడు పాశుపతుల.
భీమ. ౪. ౨౦౮.

౧౯. (నారు లోనగువానిని) గ్రుచ్చు, నాఁటు.

క. సుగ్రీవుఁ డయో, మీ పెట్టు పెట్టుగాఁడా,
చేపట్టినమొలకఁ గినుక నీయుందగునే.
రామా. ౨. ౪౩.

చ. భయ మను తొల్లికల్ విమలభావవసుంధరఁ
బెల్లగించి భ, క్తి యనెడువిత్తుఁ బెట్టి ప్రతిధీ
నది సమ్మదవారిఁ జల్లగా, ...
కాళ. ౪. ౧౨౨.

సీ. పేదవై కృషి చేసి పెట్టినసస్యంబు లెల్లఁ
బో లైనఁ గాపాన్నెట్ల నదని.
కవిక. ౫. ౧౩.

౨౦. చేయు, కావించు.

(ఈయర్థమున కొన్నిక్రియల కుమున్నంతరూప
ముల కనుప్రయుక్తమై వానిప్రేరణార్థ
మును తెల్పును.)

ఉదా: చేరఁబెట్టు = చేర్చు, కూడఁబెట్టు,
పరుండఁబెట్టు, ఇం.

ద్వి. కడలఁగి కన్నను పెట్టి గడియలఁ దీయ.
ద్వి. పల. ౪. ౨౫౯.

ఆ. అంతిపురములోని కన్యలఁ జేరిటి, పోకు
టేఁగ నైనఁ బోలకుండ, నాజ్ఞ పెట్టి
శారదానందగురు నాజ్ఞ,పెట్ట నేరనైతి వేల
నైతి. విక్ర. ౩. ౫౯.

గీ. పెక్కుమాటల నిటు జాగు పెట్ట నేల.
కాశీ. ౨. ౭౭.

క. మాని పెట్టినతంత్రంబుఁ గానలేఁడు.
నిగం. ౪. ౨౦.

సీ. క్రుంచుచు నీటిలో ముంచుచు నెత్తుచుఁ
గారించి తీరంబు సేరఁ బెట్టి.
భార. ఆది. ౫. ౧౬౬.

మ. ... తల్లిదండ్రులన్ మనంబు విరాజిల్లఁగఁ
గూడఁ బెట్టినధనంబులన్ ...
సారంగ. ౨. ౭౫.

౨౧. నిర్ణయించు.

క. ... దుర్యోధనుఁడు లగ్నము పెట్టఁగ ధవళ
చ్ఛత్రమువట్టఁగ దుర్జయుండు రథము నెక్కె
తఱిని. వరాహ. ౩. ౨౮.

సీ. పెలఁది యీ నీ దండవెల యెంత నా దండ
కును వెల పెట్ట నెవ్వనితరంబు.
ఆము. ౨. ౧౯.

౨౨. కట్టు, నిర్మించు.

ఉ. పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుఁ
డున్ రణంబునం, దొట్టిన మంటలు ..
భార. ఉద్యో. ౧. ౨౯౪.

చ. ... గద్దమున గూఁడులు పెట్టిన పక్షి
కోటి పెన్మొరప మెఱుంగఁడు ...
వరాహ. ౧౦. ౫౩.

౨౩. కల్పించు, పన్ను.

క. .. మదీయ సంగీతచాతుర్యంబు వార్తల
క్రమంబున విజ్ఞగన్యాయకునకు వినంబడు
నట్టి యుపాయంబు పెట్టెదం గాక ..
కళా. ౨. ౭౧.

౨౪. (దారి) నిర్దేశించు, చూపు.

చ. వా, రరిగిరి చుప్పనాతి మద
మందుచు ముందఱఁ ద్రోవపెట్టఁగన్.
భా. రా. అర. ౨. ౧౬౧.

గీ. లేచి పోవంగఁ దత్తఱ మొంది తోడి,వారు
సన సేమ ముడిమోపు పటువ కత్తి, పోవ
వాఁ డిందరం దని త్రోవ యడఁగి, పెట్టి
రొకవాఁగు డిగ నీలపెట్టుటయును.
ఆము. ౬. ౭౩.

గీ. శ్రీరంగనాయకుఁడు పెటి,వట్టిత్రోవ
యయ్యెడు ... పరమ. ౫. ౩౫౫.

౨౫. మూయు.

ఉ. ... అతం డేవిధమో యెఱుంగఁ దలు
పిమ్ముగఁ బెట్టినయట్లు యుండఁగాన్.
మార్కం. ౫. ౧౩౪.

గీ. అనుచు రాగరసార్ద్రాంతరంగ యగుచు,
నందతి కనురెప్పు పెట్టక చూచె పతిని ..
కవిరా. ౨. ౧౫౧.

౨౬. ప్రహరించు, కొట్టు, చఱచు.

చ. ... సవనాశ్వము ధేయని కక్కసంబులన్,
పదపదగాఁగ త్రేవిరయును జాటులఁ
బెట్టియు నేమిచేసియున్, గదలుపలేక
యవ్విధము కవ్వడి కేర్పడ విన్నవించిరన్.
జై. భా. ౪. ౬౬.

ఉ. ... త్రిమూర్తులఁ బట్టి కట్టి యుట్టి ట్టిన
నీక మేను సగమై పడగా కొరపెట్టు పెట్టి
తిన్. చంద్రా. ౩. ౩౪.

గీ. ఇట్లు కోలాహలంబు గాఁ బెట్లఁ బెటి ..
హై. ౪. ౬౬.

సీ. తోఁగల కెంగ్గలు నైవ దూర మేఁగమిఁ
బెట్టు చప్పట్లఁ జన్నులు జదలఁ గదల.
ఆము. ౪. ౧౬౩.

౨౯. కొన్ని సకర్మకధాతువుల క్త్వార్థకరూపముల కనుప్రయుక్తమై "అత్యంతము, పూర్తిగా" అను నర్థములిచ్చును.

ఉదా: విడిచిపెట్టుము, వదలిపెటుము, ఆ మాటలు కట్టిపెట్టుము, మొ.

వ్యవ. అత్తగారు కోడలిని కోసిపెట్టుమన్నది.

౩౦. పలుకు, ఉచ్చరించు.

ఉదా. జయపెట్టు.

శా. .. భాషా రోఁ దప మాచరించు విధి క
బ్రహ్మణ్యముం బెట్టుచున్.
మనుచ. ౩. ౧౦౨.

సీ. శరణాగతారాతిధరణీరమణు లయ్యజయ్యలు
పెట్టుచు సేవ సలుప. (సారంగ. ౧. ౬౨.)

వ్యవహారములోని కొన్నిప్రయోగ విశేషములు.

౧. నేఁడు బడి పెటి రేపు సెల విచ్చెదరు.

౨. ఎద్దు బండిని చెట్టునకు పెటినది.

౩. మే మింకను ఊరుఁగాయ పెట్టుకొన లేదు.

౪. తద్దినముపెట్టు (ఆచరించు.)

౫. నైవేద్యముపెటు (అర్పించు.)

౬. బొబ్బలుపెట్టు (అరుచు.)

౭. కనుపెట్టుకొనియుండు (వేచియుండు.)

౮. ఒట్టుపెట్టుకొను. (ప్రమాణముచేయు.)

౯. బాణము సరిగా వెందకు గురి పెట్టి వేసి నాడు.

౧౦. శాపముపెట్టు = శపించు.

౧౧. దయ్యాలపెట్టు = ప్రయోగముచేయు.

౧౨. పిచ్చెంగిమ పెట్టుకొని వాఁ డిక్కడకు వచ్చును = పిగ్గుమాలి వాఁ డిటకు రాఁడు.

౧౩. వాఁడు నామాట చెవిఁ బెట్టలేదు.

సా. చేతిలో వెన్న పెట్టుకొని నేతికై అంగలార్చుట = పరికరము సిద్ధముగ నుండఁగా కావలసిన వస్తువునకై తహతహపడుట.

ఉ. . నీవు గల్గ నే, నల్లవిధుండు రాఁ డని
మహాపరితాపము నొంది యేల చింతిల్లఁగ
వెన్నఁ బెట్టుకొని నేతికి నేటికి నంగలార్పఁ
గన్. సారంగ. ౨. ౬౦.

కంటనువత్తిపెట్టుకొనుట. = మిక్కిలి శ్రద్ధ వహించుట.

మ. బ్రహ్మమిత్రుండు కృష్ణ్యలకుఁ
గంటను వత్తిబెట్టుకొని యాయుర్వేద పా
రంత ప్రౌఢుఁడై చెప్పన్ .
మనుచ. ౫. ౭.

అ. క్రి. ౧. కలుగు, పొడము, ఏర్పడు.

క. గదగద వడఁకెడు మేనన్, నిదుపెంద్రుక
పెట్ట . ఉ. హరి. ౬. ౯౬.

ఉ. . మానిసమూర్తిఁ దయ్యె మేనిపైఁ,
బెట్టినపుట్ట నెట్టివిసి తీఁటలు వాఱ ...
పాండు. ౫. ౨౪౯.

సీ. కనుపట్టులోఁ గంగానిర్ఝరము వాఱఁ
జలుర యా నయ్యొటికలఁకులందు, నినుక
పెట్టిననేల మనుచ. ౨. ౧౯.

౨. పరిపోలు, పాటివచ్చు.

లయగ్రాహి. . ఈ చనికి నే చనియుఁ బెట్ట
దని చూచి కైకొన్నచని ...
భోజరా. ౭. ౧౨.

౩. కొన్ని సకర్మకక్రియల క్త్వార్థముల కను ప్రయుక్తమై ఆ యా పనులు పరిహాసార్థము చేయుటయును తెలుపును. పాయపడు, పోద్పడు, అను నర్థముల నిచ్చును.

ఉదా. కొనిపెట్టు, చేసిపెట్టు, తెచ్చిపెట్టు, వ్రాసిపెట్టు మొ॥

౪. కొన్ని క్రియారూపముల కనుప్రయుక్తమై ప్రేరణార్థకముగా నుండును

ఉదా చూపెట్టు—చూపు, చూపించు

(వ్యవ) నీనేర్పు చూపెట్టుము

రేఁపెట్టు—రేఁపు, రేఁగునట్లు చేయు

(వ్యవ) మఱచిన విషయములు జ్ఞప్తికి తెచ్చి యతనికోపము రేఁపెట్టవలదు

తినిపెట్టు—తినిపించు (వ్యవ) బిడ్డకు అన్నము తినిపెట్టు

నేర్పిపెట్టు — నేర్పు (వ్యవ.) నోరెఱుఁగని ముద్దరాలికి కొంటెమాటలు నేర్పిపెట్టఁ దగునా?

పెట్టు. వి ౧ దెబ, కొట్టు

క. దనుజేంద్రుఁ డాలు విసుమని, పెనఁగకు పులిగొన్న మృగము పెట్టునఁ బడునే, చనుఁ ద్రావు బాలుఁడవు నీ, వనికలవడి చక్కఁ ద్రోవ వలవదు నీకున్

కు. సం. ౧౦. ౧౩౨

గీ ఎందు నీతివిహీనునిఁ జెందునట్ట, సిరిని దిట్టుదు రెట్లు దాఁ జేరె నితని, ననుచు భూజను లందఱు నిసుముఁ గూడి,యున్న యగ్నికిఁ బెట్లు రాకుండు పెట్లు?

కళా. ౩. ౨౫౫.

ద్విపద. పుడిసియగ్గదఁ బుచ్చుకొని చిట్టుఁజేయు. బెదరివాఁడొకవింత పెట్టోసరించి .

రంగా రా సుం. ౩౮౩

(వ్యవ.) కోలలేని పెట్టు, త్రాడులేనికట్టు
పడితెము పదిరోగముల పెట్టు
గోడపెట్టు చెంపపెట్టు రెండును తగిలినవి

౨. దానము, ఈవి

(చూ పెట్టుడు, పెట్టుపోఁతలు)

(వ్యవ) మాటలు మాయమ్మవి, పెట్టు సవతి తల్లిది తేఁగుచుట్టమా? పెట్టుచుట్టమా?

3 ఆవృత్తి, తతి

చ. అతనీ నాయకుఁ జూచి రేఁచి యని వీరావేశ దుర్దాంతుఁడై, కవిసెన్ గుంతభు శుండతో మరగ దా ఖడ్గాదిశస్త్రాస్త్ర తీవ్ర విహారంబు విరోధ దుర్వ్యవహసంరంభంబుగా నొక్క పె, ట్టడిం దద్భల మెల్లవారదుఁడు వేఁడ్కం గుంచె సారింపఁగన్

భారత విరా ౩. ౧౮౨.

(ఒక్కపెట్ట = ఏక కాలమందే.)

క. ఆ మహిమ రెఱుఁగ జేరని, పామరు లా కార ణాంతఁ బరఁగుదు రొక పెట్టామదె చన నోపక యర,యామడ చని నిల్చినట్టు యార్తి విజేకి. వా రా. ౫.

చ. ద్రుపదుని సేన పై వడరి తోలినఁ జూచి కృతో దరుండు దే,వపతిసుతుండుఁ జూఁకి యనివా

రణసగ్గురు నొంపసేసి యుగ్రప్రవడి మాత్స్య
కేకయ ముఖంబగు పాండవసైన్య మొక్కపె,
ట్ట పరఁగి నీ బలంబుల కడంక యడంచి
మదించి పేర్చినన్.

భార. ద్రోణ. ౫. ౯౩

ద్వి. అంతంతఁ దప్పనిక్రాంతులై జనులు, గొంత
విశ్రమ మంది గొబ్బన చెలఁగి, కట్టలు గట్టి
నక్షత్రపర్వతము, బిట్టు గలఁగ నొక్క-
పెట్టునఁ గూడి పర్వతాగ్రంబెల్ల వథమునా
సెరవి, 'పర్వతయాత్ర మమ్మఁ బాలింప'

పండితా. పర్వ ౩౭౧ పా.

౪. మాట.

వ. కవలు గడింది మగలు సాత్యకి సత్యపరా
క్రముండు పాంచాలోత్తముండగు నుత్త
మౌజుం డుదాత్తబలుండు శిశుపాల తన
యుండగు ధృష్టకేతుండు ధీరుండు భీష్మ
పాతన హేతు వయిన శిఖండి యఖండ పరా
క్రముండు సౌభద్రుండు కంపన రుద్రుండు
యాదవ శ్రేష్ఠుండగు చేకితానుండు మాన
ధనుండు ద్రౌపదేయు లకేయులు గేకయు
లేవురు నేవుర పట్టు

భార. ద్రోణ. ౧౬౯.

మానినీ కావున నీదెస నాతనికిఁ విముఖ
త్వము గల్గదు భక్తిపెంపుం, దావినయం
బెనయం గొనియాడుట దప్పదు కాంచెద
నాతని నై, నీవును సెయ్యముఁ గారణి
కత్వము పెక్కునఁ దమ్ముల నవ్విభుండున్,
లేవుర పెట్టుగ సంతతి కల్మియు నీ మది
నిల్పుము పెంపొలయున్.

భార. స్త్రీ. ౧. ౯౦

పెట్టెఁజుట్టము. వి. (పెట్టు + చుట్టము)
చూ. పెట్టు

పెట్టెఁజెట్టు. (పెట్టు + చెట్టు) కల్పవృక్షము,
వేలుపుఁజెట్టు.

పెట్టుకొను, స. క్రి. (౧ తాల్చు), ధరించు.
నగలు పెట్టుకొను, పువ్వులు పెట్టుకొను

౨ వహించు.

వ్యవ. రామదాసను పేరుపెట్టుకొను

ఈ కార్యభారము నేను నా నెత్తిమీఁదను
పెట్టుకొంటిని.

౩ ఉంచుకొను

వ్యవ. ఈ బాలుని నేను నాయొద్దఁ బెట్టుకొని
పోషించితిని, అతఁ డొక వేశ్యను బెట్టు
కొనెను.

పెట్టుకోలు. వి. పెట్టుకొనుట.

ఉ. వేమఱు శత్రునిం బరిభవించుట కిత్తఱిఁ
గిత్తమైరముం, దామదిఁ బెట్టుకోలు సుఖ
తంత్రముగాదు సుసంధికాలమున్, నీమద
గంగ రూపడఁగఁ జేయుటయున్ పలదగ్గ
సైనవాఁ, డేమియునైన వధ్యుఁడను నిట్టి
వినిశ్చయమాత్మఁ గల్గుటన్.

భార. శాంతి. ౩. ౨౨.

పెట్టుగ్రోవి. వి. చూ. పెట్టెంగ్రోవి.

పెట్టుడు. వి. పెట్టుట.

పెట్టుబడి. వి. వ్యాపారమునందు ముందుగా వెచ్చమునకై మొదటపెట్టెడు మదుపు.

పెట్టుమందు. వి. వశ్యౌషధము.

చ. పతి నను నొల్లఁ డవ్విభునిఁ బాయుట
కోర్వఁగఁ జాల నక్కటా, గతియిఁక నాకు
నెద్ది గజగామిని యానతి యిమ్మటంచు దు,
ర్మతమున సిద్ధురాలికిఁ బ్రియంబునఁ జెప్పినఁ
బెట్టుమందు నీ,పతి కిది పాలతో నిడుము
భర్త వశుం డగునంచుఁ బల్కఁగన్

యశా్రం ౩ -౨౩౪.

పెట్టుపడు. అ. క్రి. (పెటు + పడు) దెబ్బతిను.

పెట్టుపోఁతలు. వి. ౯ (పెట్టుట + పోయుట.) చూ. పెట్టిపోఁతలు

పెట్టె. ౧ వి (మొదట రూపము పెట్టియ)

౧ సొమ్ములు లోనగునవి యుంచుకొనుటకై కొయ్య యినుము దంతము మొదలగు వానితోఁ జేసిన పేటిక.

బొట్టుపెట్టె = తిలకమునకుఁ గావలసిన వస్తుసామగ్రి యుంచెడు పెట్టె

౨. పల్లకి నడిమిపెట్టె.

చ. కదన మనోజయంబుగఁ బ్రశస్త మహార
థమునందు వేడ్కఁ గ్రొవ్విరులు గదల్చిపెట్టెల
జెలంగుల పార్శ్వకిఁ బోఁదఁబంధి యం, ధర
యమవృష్టిభోజాలు నగ్రపకరంబును గొల్చి
రా మురాంతకుఁడు మహేంద్ర శైశవము
నన్ గదలెం దురగాధిరూఢుఁడై.

శై. భార. ౩. ౬౧.

౩. బండి పరము మీఁద నమర్చిన పెట్టె.

౪. పాముగాని కోఁకటిబండపురుగుగాని చుట్టుకొనియుండు చుట్ట.

పెట్టెబండి. వి కూర్చుండుచోట పెట్టె యమర్చిన బండి (చూ. పెట్టె౩)

పెట్టెవేయు. అ. క్రి. (పెట్టె + పెట్టు) పెట్టెవలె (పాము మొ) చుట్టుకొను. (చూ. పెట్టె౪.)

సీ. ఓరరూపంబునఁ బెట్టెపెట్టినశేష ఫణిరత్న
ఘృణులకుఁ బ్రోఁకపెట్టు

పాండు ౪ -౨౬౦

పెట్రకోలికికట్టు. స. క్రి. పెడరెక్కలు విరిచి కట్టు

పెట్లకంబము. వి. (పెట్లు + కంబము) అదురు వేటుగొట్టము (చూ. పేటులు)

పెట్లదిమ్మ. వి (పెట్లు + దిమ్మ) ౧ అదురు వేటుదిమ్మ ౨ ఉత్సవసమయములందు ఊరేగింపు వేడుకలలో కాల్పు బాణసంచులందొకటి ఒక అడుగు పొడుగును రెండంగుళముల దళసరియు గలిగి ఫిరంగివలె నుండునది. దాని నడిమిగొట్టమునందు మందునించి దానిని ఒక గట్టిగడమీఁద నమర్చియుంతురు (చూ. ద్రోణ్యము.)

ఉ చేలలో పశులను దోలుటకై సర్వ ప్రకార
ముగా పేనిపెట్టుకొనుచేరు

(చూ పెటులు)

పెట్లదిమ్మె. వి. (చూ. పెట్లదిమ్మ)

పెట్లమారి. వి. (పెట్లు + మారి) దెబ్బలు తిను స్వభావముగలవాఁడు, దెబ్బలుతిను స్వభావము గలది, కొట్లమారి (చూ పెటులు)

సీ కోరి బంతులఁ జాల గుణవంతము అటంచుఁ
బెట్లమారుల నీడు పెట్టఁదగునె
చంద్ర (అని ౪ ర)

పెట్బాఁగు. (పెట్టు + ఆగు) మల్లబంధవిశేషము.

పెట్లు. అ క్రి (చూ పెటులు.)

౧ శే (డిమి, బిగువు మున్నగువానిచే) బ్రద్దలగు, చీలు, చిటులు, పగులు

క పోఁకముడివీఁడఁ బులకలు, మూఁకలిడఁగ
జెమట గ్రమ్మ మోవి చలింపఁగ, సైక పెరి
ల్లని పెట్లఁగ, రాకేంద్రుని భాస్యఁ గనెఁ
బురాంతకుఁడంతన్

పార్వ 3. ౫౩

౨ శాలి ధ్వనిపూర్వకముగ పగులు

ఉ పొగిసె దిక్కులు కుకంబుల యంగములు
పెట్లె, సారిగఁబిట్టలు పెడఁదిరిగెమరుండు
చంద్రా ౨ ౩౪

(చూ పెడులు.)

౩ తుపాకివంటి అగ్నిప్రసరణాయుధవిశేషము (చూ పెటులు ౩)

పెట్లుఁగ్రోవి. వి (పెట్లు + క్రోవి.) ౧. అదురు వేట ట్టము

సీ కటుకు లైనట్టి జాంజాబు జెంద్రుకలు నిర్ఘ
గవియు మేనులు కెంపుఁ గన్నుగవయుఁ
గుణము దశేవుణుబొట్లు కురువింద ప్రాసకేరులు
నొంటి యట్ల చెప్పులను గలిగి, వలలను
బెట్లుఁగ్రోవులుఁ బెద్దయురులును దరలును
బోనులు దీమములును, వసులుగసులు పోగు
వాఱు జెంద్రుకక్రొళ్లు బలువిండ్లు నమ్ములు
ఒల్లెములును, బందివాటులు నీఁటెలు బల్లె
సములుఁ, బంట్రకోలలు నాదిగా బహువిధ
ముల, సాధనమ్ములు ధరియించి శబరపతులు,
వచ్చిరాఖేట క్రియా వ్యసన రతులు
హరిశ్చ ౨ ౬

౨ తుపాకివంటి యొక యుద్ధసాధనము

వ తుపాకుల పెళపెళలు పెట్లుఁ గ్రోవుల
పెటపెటలు క్రొత్త 3 ౨౮

పెట్లుప్పు. వి (పెట్లు + ఉప్పు) వేడిమికి బ్రద్ద అయిన ఒకదినుసు ఉప్పు

పెరిలు. వి పెరిల్లు

పెఠిల్లు. వి ౧ పాతియఁదగు ధ్వని కనుకరణము

దండకము వ్యాయామవేళా సునాయాసలీలా
కృతాఘాతలోలా యిత స్వర్ణశైలాగ్రసాలా
పతత్ పుష్ప వృష్ట్యాత్మశక్తి ప్రవ్యాప్తా
మరోత్స ప్లుష్టమేఘా భవత్తుష్టియా ముష్టిచే

ప్రేయునంతఁ బెగ్గిలంచు నత్యంతకఠోరాంత
దుర్దాంత తంతన్యమానానలజ్వాలి దోధూయ
మానార్భట విభ్రాజితాదభ్ర శుభ్రేతరాభ్ర
చ్ఛటావిర్భవ ల్లక్ష కోట్యగ్ర ద్రోణిఖ
దుచ్ఛృంఖలాసంఖ్య పుంఖానుపుంఖోద్భవ
ద్దీర్ఘ నిర్ఘాత నిర్ఘోషముల్ మీఱి యత్యుగ్రమై
యొక్క రావంబు ప్రకటించె

గరా. ౨౩౨ నృసింహావతారదండకము

౨ పెడుగుపడుటయందగు ధ్వనికి అనుకరణము.

౪ ఛళఛళ్ పెటిపులు పెటిలఁగఁ, బెళపెళ నుఱుముచుఁ బెర్లు పెరిలునఁ బిడుగుల్, నలుగడఁ బడ బెడిదపు ధారలు గలఁ బలువాన జలధరంబులు గురిసెఁ

కళా. ౪. ౯౨

(ఆమ్రేడితనమందు పెరిల్లు పెరిల్లు, పెరిల్ల పెరిలు)

డ. వి ౧ భాగము. అరఁటిపండ్ల గొలలో నొక పెడ

వ్యత ఎడదారి పెడదారి ఎడమొంగము, పెడమొంగము చెంపపెట్టు ఎడపెడ తగిలినది.

విశే ౧ పెద్ద

సీ. నడయభ్యసించిన పెడకొండలును బోని
యాభీల సత్వ మత్తేభములును . .

పరమ. ౪ ౧౫౧

౨. వెనుకటి

వ ఆ సమయంబున మనదెస నుల్కాపాత శర్కరా వర్షాదులగు నుత్పాతంబులు గలిగె వానికి శంకింపక శకుని గడంగి యోధవరులతో మీఱు కోల్తలల సేయుం డేను బెడమట్టునఁ దాఁకి ధర్మనందనాదులను నమయించెద

భార. శల్య ౧. ౩౩౪

౩ విపరీతమైన.

ఉ. ఈ పెడబుద్ధి నీకు జనియించెనొ యేమొ జడుఁ
డైనఁ దల్పెనో!, హా! విధిఁద్రోయ నీకు
వశమా! లవణాసురుబారిఁ బడ్డవారికి వరు
కివ్వరైన మనికే! యిఁక నార్యులు బ్రహ్మ
లాఁగినఁ, జావక పోదువో టు? కాన
సాగుదు నీవిలువిద్య లిచ్చుటన్

ఉ. రా. ౩. ౧౨౩.

౫ పెడఁగేలు, పెడఁబాపు, పెడఁబాయు, పెడకంటి, పెడకంత, పెడకచ్చ, పెడకట్టు, పెడకట్టె, పెడకాలు, పెడకేలు, పెడకోరిక, పెడగంటి, పెటగాలు, పెడచెవి, పెడచేయి, పెడతల, పెడదారి, పెడదాల, పెడబొబ్బ, పెడమర, పెడమరలు, పెడముఖ, పెడమట్టు, పెడమొంగము, పెడయర్థము (పెడర్థము), పెడయుక్తి, పెడతెక్కు, (పెడ్రెక్కు), పెడవాడ, పెడవాలి

పెడఁగేలు. వి (చూ పెఁ కేలు, పెడచేయి) వెనుకకు త్రిప్పిన చేయి.

పెడకాలుగా మూర్చుండు = రెండు కాళ్లను ఒకప్రక్కకే పెట్టుకొని చతికిలఁబడి కూర్చుండు

పెడకేలు. వి. వెనుకకు త్రిప్పిన చేయి.

ద్వి. కడుఁబేర్చు వనితఁ గోల్పడి దైన్యచేతఁ
బెడకేలుగాఁ గట్టఁబడిన విధంబు, వ్రాలి
రావణుఁ జంపి వడి బ్రహ్మహత్య, పాలయి
ధరచుట్టు భ్రమియించు విధము.
పండితా. వాద. ౫౮౨. పా.

ద్వి. వడికేచి మణిపట్ట వచ్చుడు ద్విజాలు, పెడ
కేలుగాఁ బట్టి బిట్టుద్రోచుడును
పండితా. మహిమ. ౧౨౬. పా.

పెడకోరిక. వి. మూడనికోరిక.

పెడగంటి = పెడకంటి.

పెడగాలు = పెడకాలు.

పెడచెవి. వి. చెవి వెనుకటిభాగము.

పెడచె(వి)వుల బెట్టు. స. క్రి. శ్రద్ధతో వినకుండు.

గీ. బహువిధంబులఁ బలుకు నా పలుకు లెల్లఁ,
జేదకన్నిడి తన పెడచెవులఁ బెట్టి,
యీతఁ డాలు మఱుమాట లిచ్చి, యపహ
రించె దుర్యోధనుఁడు నేయఁ జెప్పు నేల?
భార. ఉద్యో. ౪ ౯౬.

గీ. చెలువ యప్పలుకులు పెడచెవులఁబెట్టి, ధీర
గాఢ్యవ విగళవికార యగుచు, వదిర
వోయింపుఁ దక్కిన రొదురుచూచు, నలుగుఁ
దపెక్కైన మగుడఁ బోవలయునవిన.
భార. విరా. ౨ ౧౨౦.

క. వను సుప్రసాదదృష్టిం, గనుఁగ నువే
నిపుడు గొన్ని కాలు లఱచితిక, మనఃశేంద్ర
వానిఁ బెడచెవులను బెట్టుము వేఱుగాఁ
దలంపక దయతోఁ గ
భార. కర్ణ. ౩ ౯౩.

సీ. గీ. శ్రీ జన సూక్తులవి పెడచెవులఁ బెట్టి,
తెరవ సురతి క్రియోక్తుల తీపిగ రు
విక్ర. ౩ ౪౧.

క. ఇచ్చుకు మెచ్చునిచ్చినవాని వరియింపుమునిన
నమ్మాటలు పెడచెవులఁబెట్ట
ప్రభా. ౩ ౯౬.

చ. పడఁతుక పెక్కుభంగులను బల్కిన యట్టి
హితోక్తులన్నియుఁ, బెడచెవిఁబెట్ట
నలచ. ౬. ౨౫.

పెడచేయి. వి. వెనుకకు త్రిప్పిన చేయి. ౨. చేతి వెనుకటి భాగము, మీఁజేయి.

పెడతల. వి. తల వెనుకటిభాగము, అవటువు.

ద్వి. అడరంగ వీఁపుల నంటికొన్నట్టి, కడుపులుఁ
బెడతలఁ బడిన కన్నులును.
పండితా. పర్వత. ౩౧౫. పా.

సీ. పెడతలఁ గెంపల నడునెత్తి ముందట వైదు
మూఁకటు లుండునట్లుగాఁగఁ, దలకోత
గావించి ... హే. ౩.

బుద్ధి పెడతలఁ బట్టినది = బుద్ధి చెడినది.

పెడతలగండఁడు. వి. ఒరులమాటలు వినక మారుఁడైనవాఁడు

సీ. పెనుపాఁప ఎగివాడు పెడతలగండఁడై యుండె నీ మదవృత్తి యుడుగ వేల?
రాజశే 3 ౧౪౫

పెడదారి. వి. తప్పుత్రోవ, అపథము.

పెడనెల. వి. తీర్పరి (అప్ర) అని శ. ర

పెడబొబ్బ. వి. ౧ పెద్దయెలుగు.

౨ యుద్ధమునం దుత్సాహముతోఁ జేయు ధ్వని

ద్వి నగరు తల్లడమంగ నాతులు బెదర, భీకరంబుగ నార్చి పెడబొబ్బ లిడిరి, యది
చాలఁ దాలించి యాయుగమంది, యోపి
కోడకు మంచు నువిదలఁ బలికి
పల్నాటి శాలచంద్రుని యుద్ధము
పం ౯౯-౧౦౦ లు

౩ విపరీతధ్వని

పెడమర. వి. వెనుకటిదిక్కు

వ కృష్ణుండు దానితోడి సమరంబు సెపంబుగాఁ దన భుజబలంబు చూపఁదలఁచి జూపుటకై యంతలోనన దక్షిణ చరణం బట్లు యుండ నపరాంఘ్రిపాతంబునం గుంభస్థలంబు నొప్పించి యుఱికి వీపు పెట్టి యక్కువాసి గజంబు దన్ను బ్రేయుటకుఁ బెడమరసెత్తిన హస్తంబు గేలఁ గుదియఁ బుచ్చి
హరివం. పూ ౯ ౯౫

పెడమరలు(ర్లు) అ. క్రి ప్రక్కకుఁ గాఁ కెనకకుఁగాని మరలు (తిరుగు)

గీ పెడమరలి చూచె నొక చంద్రబింబవదన,
వేడ్క దలకొత్త నొక రాజవిటకుమారుఁ
బెడమరలి యేసె వాని నప్పుడె మరుఁడు,
సానఁబెట్టిన మోహనాస్త్రంబుఁ దొడిగి
నైష ౭ ౧౧౩

వి ప్రక్కకుఁ గాన వెనుకకుఁ గాని తిరుగుట

పెడమర్లు. (చూ పెడమరలు) అ క్రి ప్రక్కకుఁ గాని వెనుకకుఁ గాని మరలు, (తిరుగు)

ఉ పం దీఁటెను గ్రుచ్చియెత్తెఁ గడు పోచ రికఁ బెడమర్లి గ్రక్కునన్
చంద్రా ౪

వి వెనుకకు దిరుగుట

సీ ఇలమీఁద దలతాఁకి నీప్రక్క నాప్రక్క పెడమర్లుగాఁ బొడి పెట్టిపెట్టి.
శాక. ౪

పెడమఱలించు. స. క్రి పెడమఱలునట్లు చేయు.

ద్వి ఉఱుకుచుఁ గ్రేళ్లు చూపుచుఁ బన్ని కొనుమ గంతులు వైచుచును మణికట్లఁ బెడమఱలించుచు బ్రేళ్లు విడిలించుచును..
పండితా పర్వత. ౪౩౫-౪౩౮. పా

ఆ. పైడమఱించి యరనిఁ దొడరక యాతృలి, మి త్తి భంగిఁ గుట్టిమీఁది కుటికి, మును దిలీ పుఁ డిష్టముగఁ గాచు నందిని, కొగవి పట్టు కా మృగేంద్రుకరణి. (ద్వా. ౧౦. ౫౭.)

పెడమఱలు. అ. క్రి. (పెడ¹+ మఱలు, వ్యుత్పత్తి వర్ణలోప వర్ణవికారములు.) వెనుకకుఁ దిరుగు, వెనుక మొగమగు, ప్రక్కకుఁదిరుగు.

క. పఱతెంచి కదియఁబడి యౌ, ద్ధతి ప్రేసిన మోము దాఁకి తిరిగ గరుడి యు, త్తతిఁ జక్రంబున వారి పెడ,మఱి వైచెను దనుజా సనుజా మస్తకము దెగక. నిర్వ. ౩. ౭౪.

క. . ప్ర,ల్మాటును బెడమఱి చూచుచు, సేటికి నెదురీఁదుమాడ్కి నింటికిఁజనియెఁ. దశకు. ౩. ౧౭౦.

వ. కొన్ని జాగిలములు కోలాగ్రమున నిల్వ నొక కొన్ని వెనుక కాలికిని నొడియు, నొడియు చోఁ గ్రోడంబు పెడమఱఁ దిరిగిన నవి జాతి కొమదిరికి నట్లు కదియు. (రా. వి. ౩. ౬౬.)

పెడమల్లె(ల్లియ.) వి. (√పెడ.) వనమల్లికా విశేషము. కై. ఒకజాతి అడవిమల్లె.

(ఇది మిక్కిలి గుబురయి గుజ్జయి బలుసుకంటె గొప్పవగు పత్త్రిములుగల గుల్మము. దీని కుసుమములు మల్లియలట్లు కడుసౌరభము కలిగియుండును. అవి. చి. ని.)

క. హానుమంతుమ మంకెన గిరికర్ణిక పెడమల్లె గొండమొక్కడియుఁ గోల.

హంస. ౪. ౧౧.

పెడము. వి. (√పెడ¹.) ప్రక్కకుఁ దిరిగిన మొగము, మాఱుమొగము. (శ. ర.)

(చూ. పెడము పెట్టు.)



పెడముపెట్టు. అ. క్రి. (పెడము + పెట్టు.) కోపాదులచే మొగము ప్రక్కకుఁ ద్రిప్పుకొను.

సీ. పుత్త్రుఁ బాకముఁ జేసి భోనము పెట్టినఁ గుడువంగ నొల్లక పెడము పెట్టి.

హర. ౧. ౧౪.

సీ. బింబోష్ఠి తనయందు పెడముపెట్టినవేళ నిష్టార్థములు దెచ్చి యిచ్చువారు.

వరాహ. ౮. ౧౩.

పెడమొగమగు. అ. క్రి. (పెడమొగము + అగు.) మాఱుమొగము పెట్టుకొను, పరాఙ్ముఖ మగు.

ఉ. పా మ్మనఁ జూచుఁ జూచి మదిఁ బుట్టిన ప్రేమము పెక్కి శాప్పుముల్, గ్రమ్మనఁ గ్రమ్ముఱం బెడమొగం బయి కన్నులనీరు గ్రుంగుచుం, గ్రమ్మఱఁ దా శకుంతల మొగం బగు నత్రులు నించుఁ గొంతసే, పమ్మని జాలి, బొంది ధృతియంతయు నిల్వక విచ్చి పాఱఁగన్. పి. శకుం. ౪. ౭౪.

పెడ(మోము) మొగము. వి. (పెడ¹ + మొగము.) వెనుకకుఁ దిరిగిన మొగము, మాఱు మొగము.

వ. వెండియుం జటకంబులకుఁ బెడ మొగంబు పెట్టికొని పట్టఁబట్టం బోవు ప్రాణ భర్తల వెంటంబడి (మనుచ. ౩. ౭౮.)

పెడమోమువడు. అ. క్రి. (పెడమోము + పడు.) మాఱుమొగము పెట్టు, పరాఙ్ముఖుఁడగు.

సీ. ప్రేల్చుచుఁ బఱతెంచు భిదురంబు కనికొనఁ బెడచేత బెడమోమువడఁగ నడిచి.

నృసిం. ౨. ౧౧౬.

పెడయాకులఁబెట్టు. స. క్రి. (పెడ¹+ ఆకు లన్ + పెట్టు.) విడిచిపెట్టు.

సీ. కడిఁదిగాఁ బెతరులపురము నగ్గి కప్పిల్చి
తో పరుఁబుట్టములఁ గంబువులఁ దాల్చి.
అచ్చ. రా. యు. ౩౨౩.

పెతరులసామి. వి. (పెతరులు + సామి.) పితృ
దేవతలకు ప్రభువు, యముఁడు.
గీ. జమునసైదోడు పెతరులసామి జముఁడు .
అన వంతకుం డొప్పు శ్రీమహేశ.
ఆం. షం. దేవ. ౧౯.
ఇట్లే: పెతరులఱేఁడు.
గీ. . గుదకాల్పు పెతరులఱేఁ డనంగఁ
గాలుని సమాహ్వాయము లగు ...
సాం. ని. దేవ. ౧౨.

పెత్తండ్రి. వి. (పెద్ద¹ + తండ్రి.) ౧. తండ్రి
అన్న. ౨. పెత్తల్లి పెనిమిటి (గ్రా.)
పెత్తనగాఁడు. విశే. (పెత్తనము + కాఁడు.)
అధికారి. (శ. ర., గ్రా.)
పెత్తనము. వి (పెద్ద¹ + తనము.) ౧. గౌర
వము, అధికారము.
సీ. తగవులో నాపురందరుఁడైనఁ దనప్రజ్ఞ కాఁ
జెప్పుకొనిడఁ బెత్తనము లేదు.
వేణు శ. ౩౭.
(వ్యవ.) ఇఁక నీపెత్తనము సాఁగదు.
౨ వార్ధకము, ముసలితనము
(వ్యవ.) అతనిని పెత్తనములో కొడుకులు
బాగుగా చూచుపెట్టిరి.
పెత్తల్లి. వి. (పెద్ద¹ + తల్లి.) ౧. తల్లియక్క.
౨. పెత్తండ్రిభార్య. (గ్రా.)
పెద = పెద్ద. విశే. (వృత్తియందే ప్రయోగము,
ఆమ్రేడితమున పెదపెద.)
౧. విరివియైనది, గొప్పది.

గీ. మతథభూపాలు ఘనుఁడు ఆశ్వత్థముఁ,
దను కృపాలతోం దగ్రజానుజులతయూన్యకారము
ల్పొరములు దాఁటు నరుగుడెంచి, పెదహా
రంబులదుచుక్క పెదరుకొనుదు.
సుద. ౫. ౧౪౯.
చ. హతల నొనర్చు మోహితల నల్లయరో
ముఖి నాపుల స్త్ర్యభూ, సుతను విరూప లొట
ననుచో ముసలి స్పెదనిట్టకాడుమం, టతివ
రమించెఁ దా ముసలి యయ్యు .
ఆము. ౫. ౫౩.
గీ. విమల పుణ్యోద వాహోద విష్ణుపదియు,
మొదలుగాఁ గొన్ని పెదపెదనదులు గలవు.
వరాహ. ౧౦. ౧౫౪.
ద్వి. మెదిచి తెల్లనిభూతి మేనింద వలఁది, పెద
పెద రుద్రాక్షపేరులు వేసి ...
ద్వి. హరిశ్చ. పూ. ౧౬౫.
౨. తారము, ఉచ్చము. (కంఠస్వరాది.)
క. పెదపెదమాటల నిప్పగి దొడ్డకలకలము
గాఁగ దేకేరియుఁ దా, నిది యొయ్యదిరో
చూడుము, పద మనుచున్ చేర సింధుపతి
వచ్చుటయున్. రాజ. చ ౩. ౧౧౨.
పెదగంగయుదకము = కష్టసాధ్య వస్తువు,
దుర్లభ పదార్థము.
సీ. అతనికృపారసామృతవృష్టి పెదగంగయుదక
మంచు భృశాధి మదిఁ దలంచె .
కవిరా. ౩. ౪౭.
(పెదగంగ = ఆకాశగంగ.)
ఇ. పెదనువ్వు, పెదపిచ్చి పెదముట్టు.
పెదనువ్వు. వి. (√పెద.)) పెద్దజాతి నువ్వు. కీ.
సీ. గోమను పెదనువ్వు వఱుసనువ్వు తెలినువ్వు
కునుమ పెల్లగిసియు నొగు జనుము
హంస. ౪. ౧౭౬.
పెదపిచ్చి. వి. (√పెద.) వృక్షవిశేషము,

క. ... మాతేయమునం బెడబిచ్చి పిసబిచ్చి
కల్లింద మల్లింద యిచ్చు కప్పురపుద్ది .
పి. శకుం. ౨. ౧౮.

పెదముట్టు. వి. (పెద + ముట్టు.) అత్యంతాక్రమణము, గొప్పముట్టడి.

ఉయ్యాగాపి. కట్టెదురఁ దాఁకి పడఁబెట్టి పెంగ
పెట్టుఁ బెదముట్టునని వాలములఁ బెట్టుకొని
పిడుగ్. కు. సం. ౧౨. ౯౫౩.

పెదవి. వి. వాతెఱ, ఓష్ఠము.

క. పెండియు నధిక భయంబున,దండనమస్కృతు
లొనర్చి దైన్యంబున నో, రెండం బెదవులు
దడుపుచు, కొండేమియు వనక మిన్నకున్నన్
గరుణాన్. కాశీ. ౪. ౧౫౦.

క. అని యడుగుచుండ బాలిక, కను మలుముచుఁ
బెదవి విఱిచి కటకట వాపో,యెను .
కళా. ౬. ౧౭౦.

జ : పెదవెత్తు.

పెదవెత్తు. అ. క్రి. (పెదవి + ఎత్తు.) పలుకు, మాటాడు.

సీ. బెదవెత్త వెఱచు నీబింబోష్ఠి తరువార నుకు
మార తరధీరకుకము గన్న.
కువల. ౩. ౭౨.

పెద్ద¹. విశే. (సం. పృథు. త. పెరిదు.) ౧. (పరిమాణమునందు) అధికము, ఎక్కువది.

క. ఈ యున్న పాప్యప్రోలికిఁ, బోయి కడుం
బెద్దదవ్వు వోయినయట్ల,త్యాయతవిమల
తపోమహిమా యిన్ని దినంబు లేల మసలితి
చెప్పుమా. భార. ఆది. ౧. ౧౧౬.

క. అనిన విని యాంబికేయుఁడు, మనమెంన
గడుఁబెద్ద దీని మార్కొనఁ గుంతీ,తనయులు
గొంచెం బయ్యెదు, ననుమానింపక
కదంగు టది యొ ట్లొక్కొ.
భార. భీష్మ. ౧. ౧౨౩.

గీ. మణికినాఁటివారు మెలకువలు కవపరు
లణగవారు ద్విజాల కాన పెద్ద, యనుచు
దేశభాషలను గుణంబును దిట్టు, నతఁడు
దండు వచ్చు శతపుణ్యులు.
విష్ణు. ౨. ౫౬.

చ. .. పెద్దపవంటి కోల... (ఆము. ౧. ౯.)

౨. ఉచ్చము, తారము. (కంఠస్వరాది.)

చ. కొసరి వసంతకాలమునఁ గోయిల గ్రోల్చిన
భంగి నేర్పు న, ల్పసరుహాక్షిత కొండచఱిఁ
బెద్దయెలుంగున పెక్కువెక్కు .
కాశీ. ౫. ౧౬౪.

౩. దీర్ఘము. (కాలము) చిరము.

ఆ. ఎట్టి సాధ్వులకును బుటిన యిండ్లను, పెద్ద
కాల మునికి తద్ద తగదు.
భార. ఆది. ౪. ౬౫.

ఉ. నెటన యిట్టియల్క మది నిల్పితి రక్కస
తాల్మిఁ జేచ్చాపడిం,గట్టినయట్లు పెద్దయును
గాలము దీనికి వాఱు పెన్నడుం, బుట్టదు...
భార ఉద్యో. ౩. ౧౧౭.

వి. ౧. ఘనకార్యము, గొప్ప పని.

సీ. అసుర వృత్తిఁ. అ,కట కాక కార్యసిద్ధి
గా నేర్పునే, పెద్ద యెత్తికొనిన భీతి
మగుడఁ, బడుట కష్టసరణి బలిమి దయ్యము
తోడఁ, జెల్ల దింక నేమి సేయువాఁడ.
భార. సౌప్తి. ౧. ౧౦౫.

శ్లో. తాం చాపదం ఘోరతరాం ప్రవదన్తి
మనీషిణః, య ఉద్యమ్య మహాకృత్యం
భయాదపి నివర్తతే.
సం. భార. సౌప్తి. ౬. ౨౪.

ఉ. మీదయ మాకుఁ గల్గఁగ సమిత్తుల
నోర్చుట యేమి పెద్ద ...
భార. అర. ౩. ౧౫౦.

౨. గొప్పతనము, ఘనత.

తరువోజ. ... ధర్ముండు సతిథ త్రీ నా కిచ్చె
సర్వస లక్ష్మి, నిది వారిలోనఁ దా నేపెద్ద
పొంది యీగానుఁ డేఁ దనయింటికిఁ జన్న,
నవమాన్యుఁ జేసె . కు. సం. ౨. ౧౮౧.

క్రి. విశే. అత్యంతము, మిక్కిలి.

గీ. ప్రియము పల్కెడువారిన పెద్ద మెత్తు,
రప్రియంబును బథ్యంబునైన పలుకు, వినఁగ
నొల్లరు .. భార. సభా. ౨. ౧౯౧.

క. . . అ, వ్విదురువచనంబ నిలుపుదు, హృద
యంబున నతఁడు పెద్ద యిష్టుఁడు మాకున్.
భార. ఆది. ౭. ౧౯.

ఉ. పెక్కురణంబులం గనియుఁ బెద్దయు నమ్మవు
నన్ను మద్గురుం, దక్కినవారు మేము విమ
దాఁపము ప్రాణములు ..
భార. ద్రో. ౫. ౧౨౮.

(ఇటు 'ఉను' వాక్యాలంకారము.)

ఉ. పొరఁ జెడనాడి వీరిఁ గొనియాడెదు పెద్ద
యునీవు .. కు. సం. ౨. ౧౬౬.

(ఇట ఉను' వాక్యాలంకారము

చ. బాల్యమునాదిగ దుష్టభావనం, బెరిఁ
గితి నీనిమిత్తమునఁ బెద్దయు దుఃఖితులైరి
పాండవుల్ .(భార. సభా. ౨. ౨౫౫.)

(పెద్దయుదుఃఖితులు = మిక్కిలి దుఃఖము
గలవారు.)

క. ఉద్దు లవుపెనకువలయుం, దిద్దఱు సరియైన
చోట నెవ్వఁడు పై పై, గద్దించి యరుగు
వాఁడు, పెద్దయు దండ్యుండు చలము
పెక్కువ కలిమిన్. విజ్ఞా. ౨. ౧౧౯.

(ఇట 'ఉను' వాక్యాలంకారము.)

జః పెగ్గుమ్మడు, పెద్దకాఁకర, పెద్దకులము,
పెద్దకొంగ, పెద్దగఁజాచు, పెద్దతుంగ,
పెద్దనిద్దుర, పెద్దనిద్దురవోవు, పెద్దపులి,
పెద్దపాల, పెద్దమాంసము, పెద్దమెంసలి,
పెద్దమ్రాను, పెద్దరోగము, పెద్దవీధి, పెద్ద
ప్రేవు, పెద్దాకుచెట్టు, పెద్దింటమ్మ, పెద్దిల్లు
బెబ్బులి.

పెద్ద². (సం. వృద్ధః) ౧. వృద్ధుఁడు, వృద్ధురాలు,
ముసలి.

సీ. ముదివాఁడు ముదుసలి ముసలి పెద్ద ముదుకు
డొక్కడొక్కు ముదురుపక్కు పన్ను,
యరగడం బనఁగను పలరు వృద్ధాఖ్య ..
ఆం. భా. ౨. ౧౧౯.

సీ. తల్లి మదేకపుత్త్రిక పెద్ద కన్నులు గాన
దిప్పుడు మూఁడుకాళ్ళ ముసలి.
సైమ. ౧. ౧౦౪.

౨. (వయోధికుఁడు) జ్యేష్ఠుఁడు, జ్యేష్ఠురాలు.

మ. వగఁ బొందంగ విరించి దేర్చినఁ గృపావం
తుండ వై మన్మథుం, న్మగుడం జేసితి నీకుఁ
బెద్దకొడుకై మద్భక్తుఁడై చెప్ప నొప్పుగుఁ
బ్రద్యుమ్నుఁ డనం

ఉ. హరి. ౨. ౨౦౦.

ఉ. అందఱిలోనఁ బెద్ద మహిమాన్వితరుక్మిణి
పారి. ౧. ౬౯.

౩. వయసు గడచినవాఁడు.

క. పెద్దలు లేనియెడన్ మిన్నిద్దఱు నే నొంటి
నునుచి యేఁగఁగ నగునే, పెద్దియ యే మని
చెప్పుదు . శకుం. ౪. ౧౫.

౪. తెలిసినవాఁడు, తెలిసినది, విజ్ఞుఁడు, విజ్ఞ
రాలు.

ఉ. వేయివిధంబులందుఁ బదివేవురు పెద్దలు
సత్ప్రబంధముల్, పాయక చెప్పిరి ...
విక్ర. ౧, ౧౨.

గీ. ...పండితాళి,ధాన మగుఁ దల్పికాఁడు పెద్ద చదువరి యొజ్జ్ఞుంగలుగువాఁడు నాఁగ మేచకశిరోధి ... ఆం. భా. ౨. ౧౪౦.

సీ. నొప్పులు దఱు చయ్యె నిప్పుడె చని పేగ పెద్ద లౌ ముదుసళ్లఁ బిలిచి రారె.

ఇందు. ౨. ౫. జాహ్నవీ. ౧. ౧౬.

౫. పూజ్యుఁడు, పూజింపఁ దగినవాఁడు.

సీ. పెద్దలఁ బొడఁగన్న భృత్యునికైవడిఁ జేరి నమస్కృతుల్ సేయువాఁడు ..

భాగ. ౪ ౧౧౫.

చ. . కన్నతెఱం బిటు వీటిఁబోయెఁ బెద్దల కును పెద్దయై తనరుతండ్రికిఁ దక్కువపాటు దెచ్చితిన్. హరి. ఉ. ౪. ౯౧.

౬. (గౌరవాదులచే) అధికుఁడు, గొప్పవాఁడు, గొప్పది, శ్రేష్ఠము.

చ. అసురగణంబులోనఁ బరమార్థమ యింద్రుఁడు పెద్ద ... భార. ఆది. ౫. ౧౨౦.

క. పెద్దలు హీనతఁ బొందిరి, తద్దయు హీనులు సమృద్ధిఁ దనరిరి .

భార. సభా. ౨. ౧౪౧.

ఉ. హేమధరాధరేంద్రమున కక్కటి పెద్ద ధృతిన్ నైష. ౧. ౨౮

గీ. తనదుకోడండ్రలోనఁ బెద్దయు గ నన్ను, దేవకీదేవి మన్నించు నీవు నాకుఁ, జనవు లిచ్చుటఁజేసి ... పారి. ౧. ౧౩౦.

౭. ముఖ్యుఁడు, ప్రధానుఁడు.

ఉ. పుత్రులు లేరు నాకు నిది పుత్రిక దీని నలంకరించి నీ,క్షేత్రము గాఁగ నిచ్చెద నకల్మషమానస నీకు దీనికిం, బుత్రుఁడు పుట్టఁగా నతఁడు పుత్రుఁడు నాకని పల్కి కొన్న యా,పుత్రుఁడు నొరసుండు నరి పుత్రుల కెల్లను పెద్ద లిద్దఱున్.

విష్ణు. ౧. ౧౨౦.

గీ. వీటిపెద్దతలారి బిసాళిబి కలిక, దిన్న కొంల కేల్వఁ బార్వతీదేవి పట్టెఁ. గాలభైరవుఁ గుక్కరగణ పరివృఢుఁ, వనుచరించిరి .

కాశీ. ౨. ౩౮.

వి. ౧. యజమానుఁడు.

గీ. కూరలా యిది మీయంతవారలకును, బెద్ద లున్నారె కొకఁగి వారె పెండ్లిసేయఁ, గలరు . విజ. వి. ౨. ౧౭౪.

౨ బ. వంశమందలి పూర్వపురుషులు (పితృ పితామహాదులు.)

ద్వి. మాపెద్ద లిక్ష్వాకు మనుజేశముఖ్యు, లీపృథివీ తల మేలి రిల పెసఁగ.

రం. రా. అయో. ౭౬. పం. ౨. పం.

శా. మాపెద్దల్ హరిసంశ్రయంబునకె మున్ మన్నారు తత్కీర్తనా,లాపశ్రీతిఁ గృతార్థ జన్ములము సెల్లం జేము .

హరి. ఉ. ౫. ౪౬.

౩. బ. పితరులు, పితృదేవతలు.

(వ్యవ.) అన్నిజాతులవారును సంక్రాంతి పండుగనాఁడు పెద్దలకు పెట్టుకొందురు.

పిల్లపెద్దదగు = రజస్వలయగు.

(వ్యవ.) చిన్న వారిపిల్ల పెద్దదైనది.

పెద్దలఁజేయు = (గృహస్థధర్మము నందుఁబ్రవేశ పెట్టు) భార్యాభర్తలను కలుపు.

క. పెద్దలఁజేయఁగవలె నీ, ముద్దులజవరాలి నజాని ముచ్చట లొసఁగన్, పెద్దలయనుమతిచే నని, తద్దయు మదిలోనఁ బొదముకార్య ర్యమునన్. ఇందు. ౬. ౧౧౪.

పెద్దలలోఁగలియు = చచ్చు,మరణించు.

(వ్యవ.) అతఁడు పెద్దలలోఁగలిసి మూఁడు సంవత్సరములైనది.

(ఇట్లే : పెద్దలఁజేరు.)

బడిపెద్ద = విద్యార్థులలో ముఖ్యుఁడు.

పెండ్లిపెద్ద = పెత్తనము వహించి పెండ్లి నడుపు వాఁడు.

పిన్నపెద్దలు = చిన్నవారును, పెద్దవారును.

ఇ : పెజ్జటి, పెత్తండ్రి, పెత్తనగాఁడు, పెత్తనము, పెత్తల్లి, పెద్దకాఁపు, పెద్దతండ్రి, పెద్దతల, పెద్దతల్లి, పెద్దన, పెద్ద మనుష్యుఁడు, పెద్దమ్మ, పెద్దటీకము, పెద్దవాఁడు, పెద్దవారము, పెద్దవేలుపు, పెద్దపేయు.

పెద్దకక్కెర. వి. (√పెద్ద[1].) కర్కరేటువు, పక్షి విశేషము. (శ. ర.)

పెద్దకాఁకర. వి. (√పెద్ద[1]) మహాకార వేల్లము. హి. (శ. ర.)

పెద్దకాఁచి. వి. కాకాదని హి. (శ. ర.)

పెద్దకాఁపు. వి. (√పెద్ద[1]) గ్రామాధికారి. (విణ. అని. శ. ర)

పెద్దకులము. వి. (పెద్ద[1] + కులము వ్యతిరేక లక్షణ) కడజాతి, చండాలకులము. (వా.)

పెద్దకూఁకటిమూఁగ. వి. ఒకజాతి భరద్వాజము, మాందిలవము. (అని. శ. ర)

పెద్దకొంగ. వి. (√పెద్ద[1].) బలాకము.

పెద్దగఁజూచు. స. క్రి. (పెద్ద[1] + కన్ + చూచు.) ఆదరించు.

ఉ. పిన్నటనాఁటనుండి నను పెద్దగఁ జూచిన వంశవృద్ధులన్, మిన్నక చంపి ...

కై. భా. ౧. ౫౯.

పెద్దగలిక. వి. గంధాలి. హి. (శ. ర.)

పెద్దగుమ్మడి. వి. పెండ్లిగుమ్మడి. హి. (శ. ర.)

పెద్దగుమ్ముడు. వి. శ్రీపర్ణి. హి. (శ. ర.)

పెద్దగోరఁట. వి. కురంటకము. హి. (శ. ర.)

పెద్దచేఁతరాసి. వి. మహాశ్మరసి. హి. (శ. ర.)

పెద్దచేమంతి. వి. మహాసహా. హి. (శ. ర.)

పెద్దజల్లిమొకము. వి. సృమరము. (శ. ర.)

పెద్ద(ద)తండ్రి. వి. (√పెద్ద[1].) ౧. తండ్రి యన్న, ౨. పెత్తల్లి పెనిమిటి

(వ్యవ) భీష్ముఁడు ధృతరాష్ట్రునకు పెద్దతండ్రి.

ద్వి. తలపోయ మా పెదతండ్రులై నట్టి, యల సరోభూతమహారోగులకును, బ్రత్యక్షమైన గోపాలశేఖరుఁడు

ద్వి. పరమ. ౫. ౩౯౭. పా.

పెద్దతనము. వి. (పెద్ద[1] + తనము.) ౧. పృథులత్వము, లావు

ఉ. ఎన్నడును పెద్దతనంబు వహించె, వేవిభుల్ దటము లై జనించె నిటు తామర సాక్షికి నాఁడునాఁటికిన్ .

ఇందు. ౨. ౧౩౫.

౨ గొప్పతనము, గౌరవము.

ఉ. మన్మథమతాంధత నాశ్రమభూమిఁ కొక్కొరొకోయని కూయఁడే యతఁడు కుక్కుటమై నడిరేయి గౌతము,ప్రేయసిఁ బొందఁగోరి తన పెద్దతనంబు జలంబుపాలుఁ గాన్.

సైమ. ౭. ౪౯

గీ. కలవి మా మాఁక నిప్పింతుఁ దొలఁగు డొకటి, యాఁడుదానిఁ జే నంటుకుఁ దనుచు బెద్దతనము నభిమానమును బెంపుఁ గనఁగ బలికె .

అము. ౬. ౯౩

3. వయోఽధికత్వము.

గీ. పిన్నపెద్దతనంబు చూపింప నీదు, శాంభవం
బైన దివ్యతేజంబు మహిమ ..
కాశీ. ౨. ౬౫.

(పిన్నపెద్దతనము = పిన్నతనము, పెద్దతనము.)

క. ఇది యెంత పేర్చెదరు మీ రాచదివినయాతనికె
తానఁ జదివినయది మూఁ,నుదతియు బొందల
పలించెన్, దదభీష్టము పెద్దపిన్నతనముల
వయసన్. ప్రభా. ౫. ౩౪.

౪. ముసలితనము, వార్ధక్యము.

(వ్యాక) పెద్దతనముచే నతనికి కన్నులు బాగుగఁ గనఁబడుటలేదు.

పెద్దతల. వి. (√పెద్ద¹) నాయకుఁడు. యజమానుఁడు.

(వి. పెద్దగా నుండి కార్యములు నడపించువాఁడు అని. శ. ర.)

చ. తలకొని యన్యనిష్ఠపదతామరసంబుల తావి
గ్రోలి ఘూ,తలనుతకీర్తిసంపదకుఁ దాఁ దల
కెట్టినదైన భౌమము,ఠక్కులమున కెల్లఁ బెద్ద
తల గోత్రభిదాదులపూజ గాంచి యూ,తల
మణి సాటిలేనిదిగదా ధవ నీతల యంచు
పేమటంచా. రామా. ౭ ౨౧౩.

క. పెద్దతల లేక మా కీ నిద్దపురూపముల నెచట
నిల్పిన మనకుం, బెద్దతీగము చాలదు పెం,
పద్దులు గల్పింతు రెందు మనుజులు గలరే.
కళా. ౬. ౧౫౨.

పెద్ద(ద)తల్లి. వి. (√పెద్ద¹) ౧. తల్లిఅక్క. ౨. పెత్తండ్రి భార్య. ౩. తల్లికంటె పెద్దదియగు సవతితల్లి.

శా. ఏనం జెప్పెదఁ జిత్తగింపుము మహాశాస్త్ర
తండ్రి సింహాసనా,సీనుండై కొలువున్న
నీ నవటికిం జేరంగ జాపించితిన్, దానిం
గన్గొని పెద్దతల్లి కినుకన్ దట్టించి ...
వి. పు. ౨. ౯౩.

చ. ... ధ్రువుండు దీనుఁడై, తనపెదతల్లి చేత
యును దండ్రి యుపేక్షయుఁ జెప్ప ..
వి. పు. ౨. ౧౬.

పెద్దతుంగ. వి. (√పెద్ద¹.) పెద్దజాతితుంగ, తృణవిశేషము. శ్రీ.

గీ. ... జంబు మాదర తుంగ పెక్కజంబు పెద్ద,
తుంగ . హంస. ౫. ౪౪.

పెద్దతుమ్మి. వి. మహాద్రోణము. శ్రీ. (శ. ర.)

పెద్దదవనము. వి. మహాదమనము. శ్రీ. (శ. ర.)

పెద్దదుష్పి. వి. రామము. (శ. ర.)

పెద్దదూలగోవెల. వి. మహాత్మగుప్త. శ్రీ (శ.ర.)

పెద్దదోస. వి. రాజకర్కటి. శ్రీ.

సీ. పెద్దగోస వాఁ ద్రపుసము తోఁచు ..
ఆం భా. ౨ ౩౧.

పెద్దన(న్న). వి (√పెద్ద.) ౧. జ్యేష్ఠుఁడగు నన్న, సోదరులందఱిలోను పెద్దవాఁడు.

క అనుజుఁ డొకఁడు వెంగలి య్యైనను
దప్పెడుఁ గాని పెద్దనకుఁ గార్యజ్ఞా, నని
రూఢిలేక తక్కిన, ననుజన్ములు పిక్కు
వడుదు రవనీనాథా. భార. అను. ౪. ౧౩౩.

౨. అన్న.

ఉ. ఏనిక మోముకా ల్పలుక పెక్కునరావుకు
రాజ పౌరవే,వానియనుంగుఁ బెద్దన వినా
యక దేవుఁడు . భీమ. ౧. ౨.

పెద్దనిద్దు(దు)ర(ద్ర). వి. (√పెద్ద¹.) దీర్ఘనిద్ర, చావు.

ఉ. కందఁడు భీతిఁ గుందఁడు ప్రకంపన
పొందఁడు పెద్దనిద్దురన్, జెందఁడు ... ←
భాగ. ౬. ౪౨౯.

గీ. పెద్దనిదురకు ప్రాఁగన్ను పెట్టుచున్న, మాన
వులఁ దెచ్చి దక్షిణమ స్తకంబు,గా మహీ
శయ్య మనిచి యుత్క్రాంతిదాన, మవని
దేవో త్తమున కొక్కయావు నిచ్చి.
వి. పు. ౪. ౨౫౦.

గీ. దక్షిణశ్రుతి మోఁదుగా ధాత్రిఁ జెంది,
పెద్దనిద్రకు ప్రాఁగన్ను పెట్టువేళఁ, బంచ
జనులకుఁ దారకబ్రహ్మవిద్య, యభవుఁ
డుపదేశమొనరించు నప్పుడు కాశి.
కాశీ. ౨. ౫౩.

**పెద్దనిద్దు(దు)రవోవు.** అ. క్రి. (√పెద్ద¹.) చచ్చు, మరణించు.

సీ. ... చవి గంతుగొనెఁ గూలెఁ బెద్దనిద్దుర
వోయి బిడ్డఁ డ్రెళ్లె, ... డింకపోసిన
ప్రగ్గ నరఁ జచ్చె ననుమాట కాఖ్య
లయ్యె. ఆం. భా. ౩. ౭౪.

సీ. పెద్దనిద్దురవోయి బిడ్డదోరను గంతు
గొనియెఁ జనెఁ దరలెఁ గూలెఁ జచ్చె ..
బ్రుంగె నరఁగను మృతుఁడయ్యె ననుట
కలరు. వెంక. మాస. ౫౪.

**పెద్దనువ్వు.** వి. మహాతిలము. వై. (శ ర.)

**పెద్దనెల.** వి. జ్యేష్ఠమాసము. (శ. ర.)

**పెద్దనేరెడు.** వి. మహాజంబువు. వై. (శ. ర.)

**పెద్దబల్లెరు.** వి. మహాపలంకష. వై. (శ. ర.)

**పెద్దపాఁపర.** వి. ఇంద్రవారుణి. వై.

గీ. ... ఇంద్రవారుణి చెలంగుఁ బెద్దపాఁపర
యనంగ. ఆం. భా. ౨. ౪౧.

**పెద్దపీఁచర.** వి. పీవరి. వై. (శ. ర.)

**పెద్దపులి.** వి. (పెద్ద + పులి.) బెబ్బులి, వ్యాఘ్రము.

క. పెద్దపులి కదలిచెను మరి, గద్దరికనముల
నక్కకమృగలు పొదలో, నుద్దవిడిఁ
బొచ్చి చిఱుతల,రొద్దం బడినట్టులయ్యె
నో యమకేంద్రా. దశా. ౪. ౪౦.

ఇట్లే : పెద్దమెకము.

సీ. పెద్దమెకముతోఁలు నిద్దంపుపట్టును పెంల
దిండుగాఁ గట్టి మరియువాఁగు.
ద్వా. ౧. ౩౯.

**పెద్దపులుఁగు.** వి. పెద్దజాతి గ్రద్దగూబ. (దీని కూఁత అరిష్టసూచకము అందురు.)

ఆ. ఎలుఁగు చేసెఁ బెద్దపులుఁగు పా మటఁ
దోఁచె, దబ్బి బొబ్బ లిడిరి నుబ్బు లడఁగ.
ద్వా. ౧. ౨౩౧.

**పెద్దపెన్నేరు.** వి. మహాశ్వగంధ. వై. (శ. ర.)

**పెద్దపోల.** వి. (పెద్ద¹ + పోల.) ౧. మనుష్యమాంసము, నరమాంసము.

వ. . మాటిమాటికి మానిసికాటు మరిగి తెరు
వులఁ గాచికాచి దగ్గఱిక వచ్చిన దిను పెద్ద
పోలవలనఁ బుటపుటనై క్రుప్పుకుల్లి
క్రుల్లి గింతులిడు గబ్బి బెబ్బులుల వోడ్ల
జనంబులు మంత్రించి పారక దిగిచిన నీరు చే
పుడిగి గిరులఁ గ్రక్కదల వాపోవుచుఁ
దిరిగి తిరిగి ... మనుచ. ౪. ౩౪.

౨. (పూజ్యమైన జంతువు మాంసము) గోమాంసము. (శ. ర., బ్రౌ.)

**పెద్దబీఁకి.** వి. రాజకోశాతకి. వై. (శ. ర.)

**పెద్దబోడతరము.** వి. మహాముండిని. వై. (శ. ర.)

**పెద్దమనుష్యుఁడు.** వి. (√పెద్ద¹) పూజ్యుఁడు, మర్యాదగలవాఁడు.

(వ్యవ.) పెద్దమనుష్యుఁ డగువాఁ డెవ్వఁడును
ఇట్టి అవాచ్యసంభాషణము చేయఁడు.

పెద్దమాంసము = పెద్దపోల. ౨.వి. (√ పెద్ద¹.) గోమాంసము. (గ్రా.)

క. ఎనుబదిరేడులవార్ధకమునఁ బ్రాక్తనత్రి
యెఱిఁగి పో దాతనికిన్, దినిరెడిది పెద్ద
మాంసము, కొనియెడియది కల్లు మనుజుఁ డ్రొ
క్కట్టుఁడుఁగున్. శివరా. ౪. ౧౫.

పెద్దమానేరు. వి. మహాజ్యోతిష్మతి. శీ. (శ. ర.)

పెద్దముత్తవపులగము. వి. అతిబల. శీ. (శ.ర.)

పెద్దములక. వి. మహావార్తాకి. శీ. (శ. ర.)

పెద్దముల్లంగి. వి. మహామూలకము. శీ. (శ. ర.)

పెద్దముసలి. వి. (√ పెద్ద¹.) పెద్దజాతిముసలి.

గీ. పెలుక నిర్ఘాత కోచు శాఁకేలు పిడుక,
ముసలి శింశుమారము పెద్దముసలి.
హంస. ౪. ౧౭౬.

పెద్దమ్మ. వి. (పెద్ద² + అమ్మ.) ౧ పెదతల్లి.
౨. జ్యేష్ఠాదేవి.

(అభాగ్యదేవత, ఈమె లక్ష్మీదేవిఅక్క యని ప్రతీతి.)

క. పెద్దమ్మ నాట్యమాడుత, దిద్దిమ్మని వత్స
వాంఛితమ్మనియింటన్. (చాటువు.)

౩. (తల్లులలోగొప్పతల్లి) జగజ్జనని, (లక్ష్మి, పార్వతి.)

ఉ. మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ
గదమ్మ మేటిపెద్దమ్మ దయాంబురాశివి
గదమ్మ .. భాగ. ౧౦. పూ. ౧౭౪౨.

పెద్దప్రమాను. వి. (√ పెద్ద¹.) మహానింబము. శీ.

సీ. ... పెద్దప్రమా ననఁగను చిన్నప్రమా నన
మ్మహానింబనామములంగా నెగడుచుండు.
ఆం. భా. ౨. ౪౯.

పెద్దయీఁడ. వి. స్వర్ణపారేవతము. శీ. (శ. ర.)

పెద్దయేలకి. వి. బృహదేల. శీ. (శ. ర.)

పెద్దరోగము. వి. (√ పెద్ద¹.) దేహమునఁ గాని పెరుగువ్యాధివిశేషము, కుష్ఠరోగము. (శ. ర.)

పెద్దరికము. వి. (పెద్ద² + రికము.) ౧. ఘనత, గొప్పతనము.

క. ఎఱుఁగమిచేఁ గటి నీపెద్దరికంబు దలంప
కేమి తప్పు గలిగినన్, మంచి దయచూడు
మి ట్లంచు, దలు నీకుం బనులు సేయఁదగుదురు
పేరల్. భార. విరా. ౫. ౩౪౪.

ఉ. శీలతనంబులో ఘనులు పెద్దరికంబు
గణించుకొందురే, యాలములోపలన్ జలి
యు నందఱికము అంచుఁ బల్కుచున్.
ఉ. రా. ౩. ౧౫౭.

౨. గౌరవము.

శా. నావాఁడిక రుణఁ గాడే, యీ పెంపుఁ బెద్ద
రికము మిచ్చి యిట్లాడంట నీ, తే మమ్మాదనఁ
బ్రసన్నుఁడ, నా మనుజాఁడ చూపె ధన్యుఁ
డభిలమునందున్. హరి. ఉ. ౫. ౧౨౭.

సీ. తనకుఁ బెద్దరికంబు మున సేయు వని దూఱ
నిగమ రాతమునకు వర్ప లాసఁగి.
ప్రభా. ౧. ౬౭.

౩. వివేకము.

క. ఏలిక నాదు మఖాంకత్రీలకు కొఱఁ దడవ
నేల కిర మండఁగ పెం, కాలికే సేసుల
పెట్టుట, పేలతనముగాక మిమ్ముఁ బెద్ద
రికంబే. ఉ. హరి. ౧. ౯౩.

పెద్దవరగోఁగు. వి. బృహత్పీలువు. శీ. (శ. ర.)

పెద్దవాఁడు. విశే. (√ పెద్ద¹.) (బ. పెద్దవారు, పెద్దవారలు.)

౧. ఘనుఁడు, గొప్పవాఁడు, పూజ్యుఁడు.

గీ. పెద్దవారికి స్త్రీపురుషభేద మేల, మాన నీయంబు పుణ్యాకర్షంబుగాక ...

హరి. ౪. ౪౨.

ఉ. కొమ్మయు మా కెటువంటి పెద్దకా, కెంచ రోకింతయుం గలనియింతుల నంచుఁ బేనంగ . కళా. ౩. ౩౭.

౨. వయోధికుఁడు, జ్యేష్ఠుఁడు.

ఉ. నీవు గుణాంబురాశివి వినీతుఁడ వెంతయుఁ బెద్దవాఁడవున్, భావనమూర్తి వాదరణఁ బాయవు . ఉ. రా. ౫. ౭౫౯.

ఆ. ఎత్తి కౌఁగిలించి యా వేల మ్రొక్కుదు, పెద్దవాఁడ వనుచుఁ బ్రియము మీఱ.

దశా. ౨. ౧౭౫.

౩. వృద్ధుఁడు, ముసలివాఁడు.

సీ. మనయమ్మ కడు ముఖమున నున్నదే యయ్య పెద్దవాఁ డాయెఁగా పేర్మి నతనిఁ, బోషించుకే మీరు శుక. ౨. ౫౧౯.

పెద్దవాకిలి. వి. గోపురద్వారము, (దేవాలయాదుల) ముఖ్యద్వారము. (శ. ర.)

పెద్దవారము. వి (√పెద్ద².) బుధవారము.

(శ ర, బ్రౌ)

పెద్దవిన్నపము. వి. చెవుడు, బాధిర్యము.

(శ. ర)

జ : పెద్దవిన్నపమువాఁడు.

పెద్దవిన్నపమువాఁడు. విశే. (పెద్దవిన్నపము.) పెద్దచెవిటివాఁడు, బధిరుఁడు. (శ. ర.)

పెద్దవిరి. వి. మహాలిలి. ? (శ. ర)

పెద్దవీథి. వి. (√పెద్ద¹) రాజమార్గము, రాచబాట. (శ. ర.)

పెద్దవేము. వి: మహానింబము. ? (శ. ర.)

పెద్దవేలుపు. వి. (√పెద్ద¹.) సురజ్యేష్ఠుఁడు, బ్రహ్మ. (శ ర.)

పెద్దవ్రేలు. వి (√పెద్ద¹) బొటనవ్రేలు, అంగుష్ఠము.

సీ. పొసఁగు నంగుష్ఠంబు పెద్ద. గీ. వ్రేలు నాఁగను ఆం. భా. ౨. ౧౩౮.

పెద్దసేయు. స. క్రి. (పెద్ద + చేయు.) ౧. గౌరవించు, గొప్పచేయు.

సీ. సవినయంబుగఁ గృతాంజలు లయి మమ్మింత పెద్దసేయుట నీవు పెద్దలకును, బెద్దవు .

భార. అను. ౪. ౪౧౦.

౨. స్తుతించు, పొగడు.

చ. ముదమున నిమ్మహీశుఁ డొకముద్దియ మాటఁగ నొక్కకాంతితో, సదమదమై కదంగి రతిసల్పుట తెల్లమిగా నెఱింగియున్ మది వివరించి కోయు కభిమానము దక్కిన వీరికూరుముల్, వదలక పెద్దసేసి దివ్య వందిగతిశా దగ వీ విచారముల్.

మనుచ. ౬. ౬౯.

౩. ఉన్నదానికంటె ఎక్కువగాఁ జేయు.

ఉ. ఎన్నఁడు నేర్చినాఁడవుర యీమటుమాయపు మాటలీవు నా, కిన్ని దలంప నేమిటికి నివ్వకు గోపము పెద్దచేసి యొయ్యదున్న పయ్యాళికాఁగ నకు దొడ్డగఁ జెప్పి భయంబు నాపి సారంగ. ౨. ౧౧౪.

పెద్దాకుచెట్టు. వి. (పెద్ద¹ + ఆకు + చెట్టు.) ఒకానొకయదవిచెట్టు. (శ. ర.)

పెద్దాపురి. వి. పెద్దాపురమందు చేయఁబడు శర్కర. (శ. ర.)

పెద్దారుగ. వి. వరకము, సస్యవిశేషము. ? (శ. ర.)

**పెద్దింటమ్మ.** వి. (√పెద్ద.) ఒకానొక గ్రామ దేవత. (శ. ర.)

**పెద్దిల్లు.** వి. (√పెద్ద.) పూజ్యగృహము) - వివాహగృహము, పూజాగృహము.

వ. ఇట్లుశృంగారించి శైలవల్లభు పెద్దింటిలోనికిఁ గొంచితెప్పించి రంత . ధీర. ౩. ౧౬.౩.

గీ. తలుపుఁ బుచ్చి లంజతల్లి పేలుపులపెద్దింటి లోని తలని నింపుతోడ. ఉ. తోడ్కొని పోయి .. పరమ. ౩. ౨౬.౭. ౨౬.౩.

**పెన.** వి. ౧. మెలి, మెలిక.

సీ. ఊడుపథంబున జాఱుమరరత్న తతిభాతి మెద హారముల పెన పుడమిఁ దాఁక.

పాండు. ౫. ౨౬.౮.

సీ. కొనలఁ జుట్టినతీఁగ పెనచేఁ జమరవాలపు కరంబ లఁ జుట్టి పట్టి తిగిచి.

పాండు. ౧. ౧౨౬.

౨. (పాము.) చుట్టు, బంధము.

క. వచ్చినఁ జూడ గాంచి పెనల్, విచ్చుకొని కడుం దిలంకి విసదారిగముల్, విచ్చున్మా గ్గయి కదలక, ఓచ్చలవిడిఁ ఒఱచెఁ గట్లు వీడం బజకుల్. (ఉచ్చ రా యు. ౧౬.౩.)

క. అప్పుడు గరుఁడుని కొక్కుల, చప్పుడు మాఁ మున సెజీఁగి పైరింపఁగ లే, కి పెనలు విడిచి రాఘువు, లాప్పఁగ భుజగంబు లొక్కయొరపడిఁ బఱచెన్.

బా. రా. యు. ౬.౨౮.

౩. రెండుపశువులను చేర్చికెడుకట్టు, లంకె. (శ. ర., బ్రౌ.)

౪. గ్రుద్దులాట, నియుద్ధము.

సీ. తనరును బెనఁకువ పెనఁగులాట యనంగఁ బైన యువ గుద్దులా టన నియుద్ధము . .

అం. భా. ౨. ౨౨౨.

జ : పెనఁగప్పు, పెనఁగొను, (పెద్గొను, పెనలు గొను.) పెనఁగొలుపు, పెనకట్టు, పెన వేయు, పెనవైచు.

**పెనఁకు(న్కు)వ.** వి. (√పెనఁగు.) ౧. మెలి గొనుట, చుట్టుకొనుఁ, అల్లిక; మెలి, మెలిక.

సీ. లల్లిబిల్లి యుబంగ నలరును బెనఁకువ . .

అం. భా. ౩. ౨౯.

చ. . నూతనలతికాలతాంగుల నుదారగతిం జలివాపి సెయ్యపుం, బెనఁకువ నేర్పు దక్షిణ సమీరణుఁ డొయ్యనఁ దావు లంటుచున్.

వసు. ౧. ౧౨౮.

వ. అంకుశపుటలుఁగుల క్రిందికొంకుల ములుకులుంగ తగులుకొనిన యనుపసరిపెణల పెనఁకువగల యిత్తికొమ్ము పింగోటల గుప్ప దులును . ప్రబంధ. ౪౭.

౨. సమ్మేళనము, కూడిక.

క. వినుసత్త్వరజస్తమముల, పెనఁకువ కవుల వెలుఁగొందు పెంపుగలుగు తుర్యావిరంజన తత్త్వము పర, మనమూ యది భావనీయ మను వేదంబుల్ (భార. శాం. ౪. ౩౩౨.)

ఉ. ఇంద్రశిలావిభూషణాస్యంతరుచిచ్ఛటల్ పెనఁకువై తనవ పుల నంటి కొల్వఁగన్.

కళ. ౨. ౫౫.

౩ (స్త్రీ పురుషుల) కలయిక, కూటమి.

సీ. పెనఁకువఁ దనిసిన తనువు లొండొంటితోఁ గీలించి నిద్రించి మేలుకాంచి.

భోజ. విరా. ౨. ౨౩౭.

సీ. బిడని పెన్కువ ముట్టు గిడచిన బుసకొట్టు బొందుతుఁ దొడఁదట్టు బందికట్టు.

చంద్రా. ౬. ౧౫౧.

పెనఁగాడు = పెనఁగులాడు. అ. క్రి. (పెనఁగు + ఆడు, పెనఁగి + ఆడు. అని. శ. ర.). పెలిగొను, పెనకేసికొను.

ఉ. పవనజచాపముక్త శరులకుగ్గములుం దును
మాడి కాఁడితో, నని పెనఁగాడఁగా వడఁద
యమ్మునఁ గేతువు గూల్చి సూతుమే,
నవియఁగ జేసినం బిఱిచె నాతఁడు ...
భార. ద్రో. ౪. ౨33.

ఉ. సారథి వద్ద నశ్వములు సంచలతన్ బెనఁ
గాడి యీడ్చినం, జే రను పేది యగ్రజాఁడు
ద్రిప్పికొనం గని మాలి యడ్డమై, పోరవ
వచ్చి యు వ్యూహగపుంగవకేతను జేసి
నిర్వ. 3. ౨౫.

సీ. దోర్మూలములకుఁ, దొడికి భుజంబులతోఁ
బెనఁగాడుచు లీల మోములు గబళించి ...
హరి. పూ. ౭. 3౭.

పెనఁగు. అ. క్రి. (క. పెణగు, త. పిణంగు.)
౧. పెనఁగొను, పెలిగొను, చిక్కుపడు.

సీ. నెత్తమ్మిమూలిజన్నిదము శియ్యావర్తన
లావహించు నూత్రములఁ బెనఁగి.
వసు. ౪. ౬౯.

౨. కూడు, కలయు.

కవిరాజ. చనిచని ముందట నాట్యవిద్యాప్రతి
సౌరభధూమలతాతతులం బెనఁగిన ప్రాఁ
కుల . భార. ఆది. ౪. ౨౧.

(లతలతో కూడుకొన్న. భా. ల. వ్యా.)

క. అనుపలుకులకు విషాదము, పెనఁగిన మోదం
బుతోడ ..
ఆం. భా. 3. ౧౧౯. దశకు. 3. ౧౪౫.

3. (స్త్రీపురుషులు) కలియు, సంభోగించు.

క. మనసిజరాగంబునఁ బెనఁగిన యుత్తమ కడఁ
జూచి .. భార. ఆది. ౫. ౪౯.

సీ. పాతాళభువనాధిపతికి శేషాహికిఁ బ్రియులతో
ముసకానఁ బెనఁగఁగలిగె. భీమ. ౧. 3౪.

౪. పోరు, యుద్ధముచేయు.

క. గిఱుపు నెడ శేయు నెడ వడిఁ, బిఱుచు నెడం
బెనఁగు నెడ నపారబలంబుల్ ...
భార. ఆది. ౫. ౧౬౪.

చ. వశులుఁడు సూతపుత్రుఁడు పెనంగు నెడన్
వశులుండు సూతపుత్రకునకు నిట్లనున్ ...
భార. కర్ణ. ౧. ౧౨3.

౫. వివాదపడు, తగవులాడు.

క. కడుసన్నపుఁ గార్యము నెక్కుడుగా నెవరు
తోడఁ బెనఁగి కుతుకులు మార్గింగం, బుడుగక
పెద్దయు వేగిం, బడుదురుచుమి లాటనృపతి
సౌరులవోలెన్. కేయూర. ౨. ౧౧౭.

వ. . అలు వచ్చిన (అ) యాలికిం గలట్టిపాటి
తోడవు మగనిద కాని యాలివారు పెనంగి
కే(ని) మహాపాతకము ..
ద. కా. ౪. ౭౧౨.

౬. ఎదురాడు, మారాడు.

ఉ. సావుడు భామతోడ నరనాథవరేణ్యుఁడు
పల్కె నింక రా, కవదశాక్షి యూహితవు
చెప్పకు మి పృథివీబూచి బ్రహ్మయున్, దేవ
విభుండు కేఁ దరుగుచెంచి ప్రతిప్రతికూలు
రైన న్, నావిధ మేల మానుదుఁ బెనంగక
తక్కు కుటుంచుఁ ద్రోయుచున్.
రుక్మా. ౫. ౧౬౧.

సీ. అనవుడు వారితోఁ బెనఁగుట కొల్లక ...
దశకు. ౨. ౪౨.

౭. (లాంగరీ) పెంకితనముచేయు.

సీ. పెనఁగుకూకలముల విరుదుతనంబులఁ జలము
డింపక తీర్పఁజాలుటయును ...
భార. విరా. ౧. ౯౫.

౮. గుంజులాడు, లాగులాడు.

గీ. నిగనిగల్ గుల్కు నధరమాణిక్య మొసఁగ,
గుబ్బచనుదోయి బంగారుకుండ లొసఁగఁ,
బెనఁగఁ దగపోఁకముడికిఁ గాఁ బ్రియుని
తోడ, కిరిజాక్షులు ముగ్ధలు గారె
యెప్పుడు. దశా. ౩. ౭౪.

ఉ. కొమ్మయు నా కెటువంటి పెద్దవా,
రంచ రోకింతయుం గలనియుంటుటెంచుఁ
బెనంగ పాత్మ చేలాంచ ముం దదీయ
మగు హస్త మశోజము లూఁదిపట్టుచున్.
శశా. ౨. ౩౭.

౯. శ్రమపడు, ప్రయాసపడు.

చ. పెనఁగక ప్రాణరక్షణ మొనేత్రియొనర్పుట
పాపము ఆము. ౬. ౨౮

౧౦. అడ్డపడు.

సీ. కటకారివములకుఁ గాళ్ళు ద్రెళ్ళఁ బెనంగు
నంచలచే నడ యలసపడక.
దశా. ౨. ౨౯౬.

౧౧. అంటు, పట్టు, సాటు.

క. అని తమ కెక్కటియు బోధించిన జారకపట్టి
పఱుకఁ బెన్నాభోగంబునఁ బెనఁగి నీశ ప్రయో
తుని, తనయుండు తనయుండుబిగి వదల
కెట్లనియెం. పాండు. ౫. ౨౧౪.

౧౨. అలముకొను, వ్యాపించు.

చ. అమటయు దేవభూత వదనాబ్జమునం దన
చూడ్కి నిల్పి యౌవనమున మదనాసము
పెనఁగఁగ ని ట్లను ...
వి. పు. ౮. ౧౧౫.

౧౩. ప్రబలు, అతిశయించు.

గీ. ఎలమి మఱి కొన్ని చెట్టుల కత్తియుత్తి,
యలతి ముంగిసబ్రాతితో జాని యుండఁ,
గుండ నిండారఁగా ముంచి కూడుదినఁగ,
నింటి కేఁగెను బడలిక లంటి పెనఁగ.
హంస. ౧. ౧౮౪

స. క్రి. ౧. చుట్టుకొను.

క. విని కోయ తీఁగ గాళ్లం, బెనఁగెం దా
ననుచుఁ గాంగి భీష్ముఁడు
భార. ఆది. ౫. ౨౨౦.

సీ. శ్రీకృష్ణురు మెఱుఁగు కళుక్కని మెఱ
యఁగాఁ బాపియుఁ జేడు చూపుఁ బెనంగ.
ద్వా. ౩. ౯౪.

౨. (రతియందు) కూడు, కలియు.

గీ. పఱవ నోపకయున్న పై మఱచి పెంటిఁ,
బెనఁగియున్నను బ్రసవింప నొనసియున్నఁ,
గావులు గొనియున్న మృగముల దిఁడి
యేమ్, తెంచి యాహారముగ మను కెఱుకి
లయిన. భార. ఆది. ౫. ౫౩.

గీ. పడియు వడగంట్లు నింద్రగోపములు కూర్మి,
ఘనపతిఁడు శ్రీ మెఱుఁగు గను జవ్వనిఁ
బెనంగ, బన్నసరమున సడలి పైపై నరాలు,
కమలము కాఫలాబ్జరాగము లనంగ.
రామా. ౬. ౧౪.

౩. తలపడు, తాఁకు.

మ. అగ్గలికక దాగ్గాని తీవ్రబాణతతి
యాకాశంబునన్ జేకటుల్ గొలుపన్ నిల్చి
పెనంగి ర య్యహితులన్ ఘోరప్రకారం
బునన్ ... హరి. ఉ. ౩. ౧౧౦.

వి. పెనఁకువ, పెనఁగులాట.

(రాముని విశ్వామిత్రునితోఁ బంపుటకుఁ దండ్రి
విచారించుట.)

సీ. పెన్నుద్దికొమరుల పెనఁగులా పలలాశన ద్వంద్వబంధురానందనములు.

చం. రా. ౨. ౬౫.

సీ. తొవపువ్వకాపులతో లిమ్మగాఁ బుచ్చ పిక్కమూలంబుల పెనఁగు వాపు ..

కు. సం. ౬. ౧౮.

గీ. కానివస్తువుఁ బట్టికోఁ గాంక్షచేతఁ, బెనఁగు మాత్రంబె కాని లభించ దేమి .

రామలిం. ౫౪.

జః పెనఁకువ, (పెన్కువ) పెనఁకువవితములు, పెనఁగఁబడు, పెనఁగాడు, పెనఁగులాట, పెనఁగులాడు, పెనఁగువడు, పెనఁచు.

**పెనఁగులాట(ము).** వి. (√పెనఁగులాడు.)

౧. గ్రుద్దులాట, నియుద్ధము.

వ. ... వెనుక ముందరఁ జూపి మెలఁగుచుఁ బెనఁగులాటలం జెలంగుచుఁ బిక్కటిల్లు మర్కటంబులును .. ప్రబంధ. ౧౮౬.

౨. పెలిగొనుట, అల్లుకొనుట.

రగడ. . తరులతల పెనఁగులాటములు కోట ములు . గాంధవ. ౨. ౬.

**పెనఁగులాడు = పెనఁగాడు.** అ. క్రి. (పెనఁ గులు + ఆడు) ౧. మల్లాడు, పోరు, గుంజా లాడు.

సీ. (సమీరబాలకుఁడు) హేలావిచిత్రపుష్పమాలా విచితకేశభృంగ మల్లములతోఁ బెనఁగు లాడు . కవిరా. ౧. ౬౭.

ఆ. పిన్నవాఁడుబోలెఁ బెనఁగులాడుచు నుండి, బాలుఁడైన కపటబ్రహ్మచారి, మాయమయ్యె నభ్రము నుడువక మందట ..

వీర. ౨. ౨౧౫.

(పెనఁగులాడు. అపభ్రంశ)

౨. పెలిగొను, చిక్కుపడు.

వ. కొనలను మంగురులఁ చెదర మాలగ్నా చీ మక్కారదాలు పెలివైచి, పెనఁ గొనపోఁగఁ బున్నఁగవ విక్కుచు నట్టింత్రొక్కు తార ముల్, మూసరి పెనంగులాడ పరుపాయా చెమర్చ కొర్త చంపకప్రసవముగంధితైల మున భర్ఘనకుం దలయంటె తీర్చునట్.

జాహ్నవి. ౧. ౧౪౬.

**పెనఁగువడు.** అ. క్రి. (పెనఁగు + పడు.) చేరు, కలియు.

క. కరుణాతిశయంబుఁ బ్రజా,పరిపాలనరతియుఁ బెనఁగువడి యుల్లములోఁ, బిరిగొన నిశ్చయ మూనకుం, జోరఁజాలక తలఁకుపాలనుండుచును బోలన్.

నిర్వ. ౧౦. ౭౭.

**పెనఁగొను, పెన్గొను, పెనలుగొను.** అ. క్రి. (పెన + కొను.) ౧. పెలిగొను, పిరిగొను, అల్లుకొను.

శా. అనుడు ముదంబు నమ్మమియు జాత్మఁ బెనం గొన నన్నతోడ నిట్లను విదురుండు ...

భార. ఉద్యో. ౨. ౯౭.

చ. తిన్న నికన్నమానిగుం,భనఁ బెనఁగొన్న మల్లియులఁ బూచిపతోనలు గాంచిరామక్క చోన్.

వసు. ౨. ౨౦.

౨. దట్టమగు, అతిశయించు.

చ. .. శంకరుని లోకశరణ్యుని భక్తవత్సలుం, బెనఁగొను భక్తి వ్యాక్యమలచే దృఢం బుగ నిల్పి యుండఁగన్.

సారంగ. ౩. ౧౧౨.

సీ. రణభీతులై శిబిరములు సొచ్చినవారి జంపు పెన్గొనఁ బూరిఁ గఱచువారి ...

సానందో. ౪. ౩౬.

క. అనుకంపలు చిత్తమునన్, బెనలు గొనఁగ మానివరు పృథివీతలనాథునికడకు వచ్చి

సంభ్రమనల వదలి యధిక గౌరవము దీపిం
పన్. వి. పు. ౫. ౧౦౪.

3. ఒండొంటితో కలియు.

ఉ. కనిరయిదు సైంధవుం గదిచి క్రందుగ నాతు
పెదుర్చు రాజులం, దునుముఁగ భూమిశో
ర్కరముతోఁ బదహ స్త శిరంబు లర్వివైఁ,
బెనఁగొని చారుభంగియును భీషణరేఖయుఁ
దాల్చ పెత్తురున్, గొనదుము గ్రోలి భూత
ములు నిక్కుచు సీల్గుచుఁ జొక్కుచుండఁ
గాన్. భార. ద్రో. ౨. ౩౧౨.

స. క్రి. ౧. చుట్టుకొను, ఆవరించు.

ఉ. పంచిన కోపమున్ సమయభంగ భయంబును
నగ్గలించి యుల్లంబు పెనంగొనంగఁ బతులం
దగ సభ్యులఁ జూచుచూడ్కి రూక్షం బగు
చూడ్కి నా ద్రుపదకన్నియ వాచి ...
భార. విరా. ౨. ౧౩౯.

గీ. మలఁకలై పాఱు నిర్ఝరాముల జలంబు,
లేఁప తరిత్రాడు పెనఁగొన్న భావ మొంద.
హైమ. ౫. ౭౩.

౨. (రతియందు) కలియు, కూడు.

క. నను దూఱుమ గౌతమముని, వనిఁ
దూఱుచుఁ గుసుమలసితవల్లీవిలసద్ధ్వనిఁ
దాఱుచు వచ్చెలిఁ బెనఁగొనఁ గోరుచుఁ
జొంచి ప్రొద్దు గ్రుంకినయంతన్.
ఉ. రా. ౫. ౨౯.

పెనఁగొల్పు. స. క్రి. (√ పెనఁగొను.) పెనఁ
గొనఁజేయు. (అతిశయింపఁజేయు)

మ. తన వాక్యంబులు తత్సభాజనుల కుత్సా
హంబు నాశ్చర్యమున్, బెనఁ గొల్పంగఁ
బలిందిబొమ్మ నగి గంభీరంబుగాఁ బల్కె.
ద్వా. ౨. ౧౯.

పెనఁచు. స. క్రి. (√ పెనఁగు.) ౧. పెనవేయు,
మెలిపెట్టు.

క. ఈఁచి రూపెల్లఁ గూర్మముఁ, జేలుచేత
గజంబుఁ బటి పెనఁచి ...
భార. ఆది. ౨. ౭౯.

చ. బలితపు శాఖయందుఁ బదపద్మయుగంబుఁ
బెనంచి పార్శ్వశాఖలఁ గరకాండము
లొప్పనిపి కిన్నలు మోడ్చి యధోముఖాబ్జుఁ
డై, తలకొని క్రేలుచున్న యొక శాపబిఁ
గాంచె విభూతిభూమశోభ్యులఁ దగువాని
భోజనృపస తముఁ డా వటభూరుహంబు
పైన్. భోజరా. ౨. ౭౪.

౨. నిర్మించు.

ద్వి. ఊక్కునఁ బెనఁచిన నట్లున్నాఁడు వీఁడు
ద్వి. హరిశ్చ. ఉ. ౧౫౦౭.

3. గట్టిగాఁగట్టు, బంధించు.

చ. ఉమియఁగఁ దన్ను నవ్వ నన నొచ్చెము
గాంచిన కొన్ని ప్రాఁకు లా, ప్రమదల నప్పు
గింపఁ దని రంజలునేఁతలు గన్న చెట్లకున్,
దమ కలిశృంఖలన్ బెనఁచి నమ్మక మట్టెఁ
బురంబుఁ గంటు సైన్యముఁ గాని నా పలిన్
శుకపికాదులఁ గెలితనాలి పాల్పగున్.
ఆము. ౨. ౩౪.

౪ కూర్చు, చేర్చు, కలుపు.

చ. తెనుఁగుతెఱంగు సంస్కృతమునీరును గాని
యపప్రయోగముల్, బెనఁచిన కబ్బముల్
సభలఁ బెద్దతికంబుగఁ దెచ్చి ..
వాల్మీకి. ౧. ౧౩.

సీ. నందుండు కొమరునిఁ బొందుగాఁ గొంగిటఁ
బెనఁచి తద్దయును దీవన లొసంగ ..
లీలా. 3. ౩౩.

సీ. పలుచఁగా వండినవలిపంపుఁజాఁపట్లు పెసర
పప్పులతోఁ దఁ బెనఁచి పెనఁచి.
హైమ. ౬. ౧౭౦.

౫. మెలిపెట్టుకొను.

సీ. పుంశ్చలీకృతకన్నె పాఘారిపొరాపాపకర్త అను
రాగకలికలఁ బెనఁచు కరణి.
వసు. ౬. ౮౩.

పెనపరి. విశే. (పెనవు + అరి.) వివాద
శీలుఁడు, జగడగొండి, వివాదశీలురాలు.

క. అప్పు గొని పెట్ట నొల్లక, త్రిప్పి యుశార
ణాకు వసుమతీపతిసభకుఁ, జెప్పఁగవచ్చిన
పెనపరి, నప్పుడ దండించి ధనము వరువగ
వలయుఁ. విజ్ఞా. ౩. ౮౩.

ఆ. ముతికినాఁటివారు మొఱకులు పెనపరు,
లుబ్ధవారు ద్విజాల కాన పెద్ద యనుచు దేశ
భాషలను గులంబును దిట్టు,నతఁడు దండు
వచ్చు శతపణములు. విజ్ఞా. ౨. ౫౬.

చ. . అ పెనపరి ఎక్కరాలు మొఱ పెట్టుచు
నీడిగిలంగ నంపలం,బున వడిఁ గట్టివైచి
కానిపొం దని చెప్పి నుదేవుఁ డంతటఁ.
జై భా. ౨. ౧౧౧

పెనపు. స. క్రి. (√పెనయు.) ౧. కలుపు,
కూర్చు, చేర్చు. (శ. ౯) ౨. పెనఁచు.
(శ. ర.)

వి. ౧. వివాదము, తగవు. (ఆ. ౦.) ౨. భేదము.
(శ. ౦.)

పెనము. వి. ౧. దోసెలు లోనగునవి కాల్చెడు
ఇనుప ఓడు, స్వేదని.

ఉదా : అట్లపెనము. మొ.

క. వనరాను లేదు నుప్పురి,పెనమున నీరులును
బోసెఁ బెల్లున నుడిగెఁ.
కు. సం. ౬. ౭౧౨.

౨. చెంబురసము మున్నగునవి కాఁచుట కుప
యోగించు పెద్దయినుపపాత్రము.

ఉదా : చెంబుపెనము మొ.

గీ. లిట్టు కాలినపెనములఁ బెట్టి కేప, మిట్టి
పడి యట్టె మూర్ఛిలునట్టివారి . .
ఉ. రా. ౩. ౩౨౩.

పెనయు. అ. క్రి. (త. పిణై.) కలియు, కూడు,
పెనఁగు.

ఉ. ... అనితేతుకార్ముకో ద్రేకయుచుల్ మహో
గ్రశితేషుచయుం బగు వల్లగల్యపూరేకుల
విగ్గులు స్పెనయుకేకను గ్రమ్మను శిమ్ము
చీకటుల్. ఉ. హరిశ్చ. ౩. ౧౦౪.

ఆ. పేరురూపుక్రియను బెనసియుండు ..
వేమ. ౧. ౩౩౬.

(శ. ర., బ్రౌ. పా. పెనఁగియుండు ముద్రి. పా.)

జ. పెనపరి, పెనపు.

పెనవెట్టు. స. క్రి. (పెన + పెట్టు.) పిరిపెట్టు,
మెలిపేయు.

సీ. వినువూనములు గాఁగ వసతోడఁ బెనవెట్టి
నెట్టెంబుగాఁ ద్రేవుఁ జాటినాఁడు ...
మనుచ. ౪. ౮౩.

సీ. పెనఁచి చంద్రుకలతోఁ బెనవెట్టి చుట్టిన
ప్రాఁతచంద్రికవన్నెపాగ యమర .
క్రీడా. ౧. ౨౨౩.

పెనవేయు = పెనవైచు. స. క్రి. (పెన +
వేయు.) ౧. మెలిపెట్టు (శ. ర.)

౨. పశువుల నొకదానితో నొకటిఁ జేర్చి
బంధించు, లంకెవేయు. (శ. ర.)

పెనవైచు = పెనవేయు. స. క్రి. (పెన +
వైచు.) మెలిపెట్టు.

గీ. అనుచు నక్క విజాతీయు కుటులకొర్య,
మెనయ బోధించి పెన వైచికొనుచుఁ
దద్చు ... కుక. ౨. ౨౯౬, ౨౫౯.

**పెనిమి(న్మి)టి.** పు. (పెనువు + మేటి, వృత్తిని వర్ణ వికారము.) మగఁడు, భర్త.

క. పెనిమిటి చేతను పెండ్లామని కాదు విశ్వ్రష్ట దాసి యనియును విలువంగను జాలని మర్త్యగు రాలను ... భాగ. ౪. ౨౩౦.

ఉ. . . ఇట్టి డీ వనంబోడి కందర్పా, పెనిమిటిఁ గూర్చి పొంపలరఁ బెండ్లి యొనర్పు మదిం దలంచెదన్. నీలా. ౧. ౭౯.

ఉ. . . మిటారి యీ నిశాకాంతునివంటి పెన్మిటి ముఖంబుఁ గనుంగొను నోరచూపు లన్. కంధ. ౫౩.

సీ. మగని స్వతంత్రంబు మగువకుఁ జెల్లదు మెలఁత విధంబు పెన్మిటికి వలదు. నీతి. ౬౨.

**పెను.** = వి. విశే. ("పెనువు" శబ్దముయొక్క తుదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము. దీనికి అచ్చు పరమగునపుడు ద్విత్వము వచ్చును. ఉదా. పెన్నిద్ది, పెన్నూనె మొ. పరుష సరళములు పరమగునపుడు "పెనుఁగొమ్మ, పెనుఁబాము, పెనుగాడ్పు" మున్నగు రూపములు సిద్ధించును. స్థిరవర్ణములు పరమగునపుడు, "పెనుమిన్కు, పెనువేట, పెన్నేరు, పెన్మొసలి, పెన్సెగ" మున్నగు రూపములు నిష్పన్నము లగును.) పెద్దది, గొప్పది.

(చూ. పెనుద్రెళ్లు, పెన్నిద్ది మొ.)

**పెనుఁగొమ్మ.** వి. (పెను + కొమ్మ.) చెట్టు మొదటి కొమ్మ, స్కంధశాఖ, కవట. (శ. ర., చి. వి.)

**పెనుఁబాము.** వి. (పెను + పాము.) ౧. అజగరము, కొండచిలువ.

చ. ఇది పెనుఁబాము చందమున పెంతయుఁ భీమమునై జనంబులం, బెదరఁగఁ జేయు . భార. విరా. ౧. ౧౬౦.

మ. తన పట్టిన మరియు పెన్పెనుఁబాము వదనంబు, వ్రయ్యంగ దఱిగిన .. భార. అర. ౨. ౭౭.

సీ. . పెనుఁబాము నా నజగరాహ్వయము వెలయు. ఆం. భా. ౧. ౧౪౪.

౨. ఆదిశేషుఁడు.

ద్వి. పెనుఁబాందఁ బఱచిన పెనుఁబాముచాపఁ, దనచంకి నిజికి పద్మాయుతుం డగుచు. ద్వి. పరమ. ౨. ౧౧౪. పొ.

**పెనుకూళ్లిమారి.** విశే. (పెను + కూళ్లి + మారి.) ప్రతిచోటను భుజించువాఁడు.

సీ. గంగాధరునకు సంగడికాఁడు గాఁడొకో పెనుకూళ్లిమారైన యనిమిషపతి. వీర. ౪. ౪.

(యజ్ఞములందు పలువిధములగు హవిస్సులను భుజించువాఁడు.)

**పెనుకెడ.** వి. తృణవిశేషము.

గీ. పారికి పెనుకెడ కంచేటిపొరుజ గరిక, పిరికి పాల్వము పొంపె కుందురు గరిమిడి ... హంస. ౫. ౪౫.

**పెనుగువ్వ.** వి. (పెను + గువ్వ.) ఒకజాతి అడవి పావురము.

ఆ. పికిలి కేలకొమిలి పెనుగువ్వ బకదారి, పొట్టి రాయి పిపదు పలువరింత . . హంస. ౩. ౧౩.

**పెనుచే(న్చు)=పెంచే.** స. క్రి. (√ పెరుఁగు.) ౧. వర్ధిల్లఁజేయు, (ఆహారాదులచే) పోషించు.

ఆ. నయముతోడి చప్పనయూల భండారంబుఁ, బెనుతె యుగ్రవీరజనములపోఁద, గాలియైన నుడియఁగా నీక ..
భార. అశ్వ. ౨. ౪౪.

ఉ. ఆనవపీమఁ గ్రోధజనితారుణదీధితిఫాలభాగ నేత్రానలకీలలం బెనుప హస్తమున నిశిత త్రిశూలముంబూని .. పారి. ౪ ౧౪.

ఉ. . పుత్రులం, జేకొని పెన్పు నాపముఁ జేయుము నావుడు మాద్రి తద్దయున్.
భార. ఆది. ౫. ౧౪౪.

౨. ఉబికించు, ఉబ్బించు.

చ. అనుజతనూజమంత్రి సుభటాప్తజనంబులపోరు నూఁది స్వైమ్మదమునఁ బొంగి పైఁ బెనిచి మత్స్యమహీరమణుండు .
భార. విరా. ౩. ౬౯.

౩. రక్షించు, సాకు.

సీ. పెనుపలేఁడాయె నే పృథ్వీసుపర్వకుమారు నిర్గత జీవమారుతిముల. వసు. ౪. ౪౩.

గీ. .. సాకె మనిచెఁ బెంచెఁ, బెనిచెఁ బ్రతికించెఁ గాచె శేద నన నొప్పెరుఁ, బ్రోచె ననుమాట
ఆం. భా. ౩. ౧౨౩.

అ. క్రి. పెరుఁగు, అతిశయించు, మించు.

గీ. అనుచుఁ బలికినజనపతి మనుచుపేర్కొ, బెనుచువాలుంగ మేలుంగాఁ గినుచు ననియె
దశా. ౧. ౧౩౬.

క. అనుచు స్నెచ్చెలు లాదన్, వినుచు స్మది లోనఁ బెనుచువేడుక గనుచున్, ననుచు న్నునుసిగ్గున వ్యవ్యనజానన యుండుననంత వైభవలీలన్. ఇందు. ౫. ౭౫.

పెనుజోగి. వి. (√ పెను.) శివుఁడు.

సీ. పెనుజోగితేజంబుఁ బృథుల ఘాతంబులు దంత్యస్థిమయనిశదంబసమితి. (చి. శి., చి.ని.)

పెనుపడు. అ. క్రి. (పెనుపు + పడు.) అతిశయిల్లు, వర్ధిల్లు.

సీ. బిరుదశాఖాశిఖలు పెనుపడం బైబ్రాయ ఘనశస్త్రరోచు లాకసముఁ బ్రాఁక.
కై. భా. ౨. ౬౪.

ద్వి. కనినంతనే కురంగములసంఘములఁ బెనుపడి చెండాడు పెనుతిండిపులులు ..
అ. మ. క ౫. ౨౨౧. పొ. ౨౦. పం.

క. ఘనమైన కోపవహ్నియుఁ, బెనుపడ ...
భా. రా. ౪౮ ౨. (శ. ర.)

పెనుపరి. విశే. (పెనుపు + అరి.) ౧. వృద్ధి పొందించువాఁడు. (చి. ని., శ. ర.) ౨. అధికుఁడు, గొప్పవాఁడు

క. హరి పలికినవిధ మెంతయు, నెరవై యున్న యది వింటె యిమ్మాటలెల్లం, గరయు దము తోలంత నీపెనుపరిచందం బెల్ల నెఱుక పడియెడుఁ బిదపన్.
భార. ఉద్యో. ౩. ౨౧౪.

(పెనపరి — భేదశీలుఁడు అని శ. ర.)

పెనుపారు = పెంపారు. అ. క్రి. అతిశయించు, అధికమగు.

గీ. ప్రాణదానంబు వేఁడినఁ బార్థుఁ డభయ, హస్తమిచ్చుచు దయ పెనుపారఁ బలుకు. .
భార. విరా. ౫. ౨౨౫.

మ. పెనుపారన్ వర మిచ్చి తెట్టు గడిమిన్ భీమాగ్రజుం డాజిఁ గిట్టినఁ బట్టం గడు నగ్గ మైనయెడఁ గ్రేడించు ..
భార. ద్రో. ౧. ౩౭౭.

పెనుపు = పెంపు. వి. (√ పెనుచు.) ౧. వృద్ధి, అతిశయము.

క. అనవరతసౌఖ్యసంపదఁ, బెను పొందుచు నుండు మీకు భీకరకాంతారనివాసాయాసం బుల, వనఘా యిట్టింగి నపయ నలమట వొందముఁన్. భార. అర. ౧. ౨౧౩.

సీ. (వర్షాకాలవర్ణన) ఎఱ్ఱలపెను పట్టె నేలపైఁ గొఱలఁ జొచ్చె విక్ర. ౪. ౨౩.

క. ఒనరింపఁ బిచ్చలింపక, మునుకొని యయ్యె దవి మనికిమొనగాం ద్రతవిన్, కెనసి పెను గట్టుఁ జెట్టును, బెనుపొదవఁగ రువ్వట యును బెగదక వాఁడున్.

ఆచ్చ. రా. యు. ౧౩౧

౨. పెంచుట, వృద్ధినొందించుట.

ఆ. పరిజనములఁ బెనుపు పతికి హితము . భార. శాం. ౨. ౧౭౯.

౩. మహాత్త్వము, గొప్పతనము

క. మునిదివిజాదికలోకము, లనంతుఁ దనఁగ జగతికెల్ల నాధారంబై, పెను పొందదు శేషాత్ముని, వినుతింతున్

భార. శాం. ౨. ౩౬.

క. విను సైంధవుఁడు మహారథుఁ,దనిఁ బోక పెనంగు వతని నాద్రాపదికై, పెనుపుఁ బఱచిరి కుంతీ,తనయులు ..

భార. ఉద్యో. ౪. ౨౨౨.

౪. పొడుగు, ఉన్నతి.

చ. పెనుపున నాకసంబుఁ బొరయు బృంహితముల్ దము నుగ్రగర్జిత, స్వనములతోడి మేఘముల చందముగా నొనరింప మీఁది యోధనికర మేయు సాయకవితానము భీమవృష్టిగా రయంబు,బుఁ బయికొన్న యేనుఁగులపోరునఁ దేరులు దేరె నెత్తుటన్.

భార. శల్య. ౧. ౧౨౧.

౫. గర్వోక్తి.

క. ... నీ, పెనుపులు లాఁతికుపలుక పెనఁచిన మేలే. దశకు. ౪. ౨౬.

౬. ఒప్పిదము, అందము.

గీ. కదళి దివియించె నగ్రాంఘ్రికంబు దొదల పెనుపున .. అము. ౫. ౩౦.

౭. సామ్యము, పోలిక.

క. . పెనుకొదలు పొదల మొదలంకొదవు తుమ్మెదల పదువు లినుపసరిపెణల పెనుపును బనుపుఱచుచు కళా. ౬. ౨౨౪.

౮. వైభవము.

చ. . నీవు గానఁగల వాత్మజా నొక్కని కాని కాంతయుం, బెనుపు నిప్పయోజముఖిఁ బెండిలిసేయుదుఁగాక వేడుకన్.

హరి. పూ. ౩. ౧౩౫.

చ. వావుడు, బెనుపుగ వింద్రుపీటికిని చేర్కొని పోరుదవేని నేను నీ, కెమకవ వస్తునంము రతి వేడుకఁ బిల్కిన

వీర. ౭. ౨౪.

(వృత్తియందుఁ గొన్నియెడల అంత్యవర్ణ లోపము. చూ. పెను.)

విశే. ౧. పెద్దది, పరిమాణాతిశయము గలది.

ద్వి. వైద్యులకును మంత్రవాదులకును న,భేద్యం బసాధ్యంబు పెను పగు వ్రణము.

పండితా. మహిమా ౨౫౯.

చ. అన విని కూర్మ మి ట్లను . . మత్సమంబునై, పెనుపుసత్వము ల్గాలఁదివెట్టఁగరానివి లోఁ జరింప సొం, పెసఁగిన గంగ ..

హరి. ఉ. ౫. ౨౧.

౨. బహుళము, అధిక సంఖ్యాకము.

మ. పను లాజ్ఞాపనసేయు వేళలఁ దగంద్రాకుల్ నిలింపోత్తముల్, పెనుపై కొల్తురు .. నృసిం. ౧. ౬౦.

౩. అధికము, గొప్పది.

క. తనుఁ దొరఁగుతండ్రి నుడుపఁడు, మునివరుఁ
డని యతని చిత్తమున నే గ్రొద్దున్, బెను
పగు కోపంబు వసిష్ఠుని దిక్కునఁ గలిగె .
హరి. పూ. ౨. ౪౨.

క. పెను పైన యనావృష్టికి, జననాథుఁడు
వనటఁ బొంది . భా. రా. బాల. ౫౪.

క. పెను పగ వమరత్వ మవ్విధిమునుఁ డొందన్.
ఉ. రా. ౨. ౧౯౩.

జ : పెంజెలువప్రోలు, పెంజీకటి, పెంజెర,
పెందర, పెందలకడ, పెందలాడ,
పెందళ్కు, పెందిరువడి, పెందుఱుము,
పెందెర, పెందెరువు, పెందోడ, పెంద్రోవ,
పెంబోతు, పెనిమిటి, పెనుఁగొమ్మ, పెనుఁ
బాము, పెనుగుఱ్ఱ, పెనుజోగి, పెనుమస
నము, పెనుమినుకులు, పెనుమ్రాను, పెనువెల్లి,
పెనువ్రేలు, పెన్నపెఱుఁగు, పెన్నాటకము,
పెన్నాటకమునేయు, పెన్నిక్కు, పెన్నిట్ట,
పెన్నిదురు, పెన్నిధానము, పెన్నిధి,
పెన్నుద్ది, పెన్నెఱులవాఁడు, పెన్నెఱులు,
పెన్పులుఁగు.

పెనుమసనము. వి. (పెను + మసనము.) మహా
శ్మశానము, కాశి.

చ. పెను మసనంబునం గలవు పెక్కులు తీర్థ
ములు .. కాశీ ౬. ౧౨౪.

పెనుమినుకులు. వి. బ. (పెను + మినుకులు
సమాసమునం దుత్తరపదము పరమైనపుడు బ
వర్ణకలోపము.) వేదములు.

క. . ప్రాఁబలుకులు పెనుమినుకులు నా, వెల
యున్ శ్రుతులకునుఁ బేర్లు విశ్వాధిపతీ.
అం. సం. దేవ. ౪౧.

క. పెనుమినుకు లెనలు తెలివిం, గనుఁగొను బల్లి
దుఁడవైన. గనరాని నినుం, గనుఁగొంటిమి ..
అచ్చ. రా. బాల. ౬౫.

క. ఎవ్వరని గొనబుకాఁడా, పెనుమినుకుం
దెగలు వొగడు పేరిమికాఁడా .
అచ్చ. రా. సుం. ౧౮౧.

పెనుమ్రాను. వి. (పెను + మ్రాను.) ౧. మహా
వింబము. ?.

సీ. పెద్దమ్రా నవఁగను బెనుమ్రా నన న్మహావింబ
నామములుగా నొగడుచుండు.
ఆం. భా. ౨. ౪౯.

పెనువెల్లి. వి. (పెను + వెల్లి) ౧ మహా
ప్రవాహము. (చూ. వెల్లి.) ౨. ప్రళయకాల
మందలి ఏకార్ణవము.

క ఇట్లు లోకంబెల్ల నేకార్ణవం బైన .
పదంపడి యప్పెనువెల్లి యుల్లవల్లఁ దిగిచి
పోవం దొడంగు నెడన్.
భార. అర. ౪. ౨౭౯.

పెనువ్రేలు. వి. (పెను + వ్రేలు.) అంగుష్ఠము,
బొటనవ్రేలు.

క. నెమ్మిని నీ దక్షిణహ,స్తమ్మున పెనువ్రేలు
దునిమి దక్షిణ యిమ్ము
భార. ఆది. ౫. ౨౪౩.

గీ. కూలి, కాలిపెనువ్రేలు దెమలించి
కరము కత్తు,కొన నదృశ్యతలోక గవి
విభుండు ఉ. రా. ౩. ౮౪.

పెన్న. వి. (సం. పినాకినీ. త. పెణ్ణై.) ఒకానొక
నది, పినాకిని.

(ఇది ఉత్తరపినాకిని, దక్షిణపినాకిని అని యిరు
తెఱఁగులది.)

సీ. అందు సుఖాసీనుఁడైనఁ యవ్వరుణేంద్రు
నంబుధుల్ వాల్గిను . కృష్ణ, వేణి సరస్వతి
పెన్న యైరావతి... సతతంబుగొలుచు.

భార. సభా. ౧. ౪౧.

సీ. పెన్నాడి తల్పైన వీఁగఁదోలుటకును బృథు
ర క్తమున ముఖ్య పెన్న పాఱి.

రామ. ౨౫౯.

గీ. చెలఁగు నే ఱన నది తద్వికేపసంజ్ఞ, యమరుఁ
బెన్న యనంగను జమున యనఁగ.

ఆం. భా ౧. ౧౬౩.

పా : పెన్నదాఁటినఁ బెరుమాళ్ళసేవ = పెన్ననది
దాఁటుట యతికష్ట మనుట.

పెన్నడపులుఁగు. వి. (పెను + నడ + పులుఁగు.)
కురము, పక్షివిశేషము. (శ. ర., శ్రా.)

పెన్నాటకము. మి. వి. (పెను + నాటకము.)
౧. మహానాటకము, పెద్దనాటకము. ౨. గొప్ప
వర్తనము. ౩. అతిశయము, ప్రాచుర్యము.

క. పిప్పలిరొప్పను నల్లంబు మొల్లంబును
జేలపిండి మెందును . . పెన్నపెన్నాటకం
బును గలిగి . కాశీ ౩. ౧౭౫.

పెన్నాటకముసేయు. స. క్రి. (పెన్నాట
కము + చేయు.) విస్తరించిచెప్పు, అతిశయ
ముగా వచించు

గీ. సంభవించిరి గంధర్వజాతి ననిన, గలితనం
తేల పెన్నాటకంబుసేయు, ననఁగ ధీమేశ్వ
రునిఁ గొల్తు రప్సరసమున, సాను లనుశేరి
యప్సరశ్చంద్రముఖులు. భీమ. ౧. ౭౭.

పెన్నిక్క. వి. (పెను + ఇక్క.) గొప్పస్థానము.

గీ. ఆ తరుణియక్క ఖహునృత్యగీతవాద్య, కళల
పెన్నిక్క వలరాజు కంచుతక్క ...

హైజ. ౧. ౧౦౪.

పెన్నిట్ట. వి. (పెను + నిట్ట.) పెద్ద ప్రవాహము.

గీ. గాఢసంస్పర్శభంగులు గలుగునట్టి, పాోమ
సమయకృత్యంబుల నొదవి సౌఖ్యరసము
పెన్నిట్ట పొరిఁబొరిఁ గ్రమ్మ దేర, సమ్మదాం
బుధిఁ దేలిరి సతియుఁ బతియు.

భార. విరా. ౫. ౪౦౨.

పెన్నిదు(ద్దు)ర. వి. (పెను + నిదుర.)
౧. గాఢనిద్ర.

చ. కుచములమీఁదఁ బెన్నిదురఁ గూరినబాలునిఁ
దల్లి గానలే, కచటికిఁ బోయెనో యనుచు
నేడ్చినయట్లు . వాసిష్ఠ. ౫. ౨౪౯.

౨. పెద్దనిద్దుర, చావు.

సీ. సమయుట యీల్గుట . మిత్తి పెన్నిదుర
నా మీఱును మరణము ...

ఆం. భా. ౨. ౨౨౫.

ఉ. . . శాంభవలోచనవహ్నిఁ గ్రాఁగి పెన్ని
ద్దురఁ బూని మే నెఱుఁగనేరక యుండెడి, ,
నీకు మ్రొక్కి వేఁడుదులు చెప్పినన్ మనసు
చొచ్చునె బోధము పుట్టు నేర్చునే.

వసు. ౪. ౪౦.

(ఇది రెండర్థములకు నుదాహరణము.)

పెన్నిధానము. మి. వి. (పెను + నిధానము)
గొప్పనిధి.

గీ. పద్మముఖుఁ డైనయతఁడు నాపాలి కనకు,
పెన్నిధానంబు మాటలు పెక్కు లేల.

నైష. ౨. ౪౫.

పెన్నిధి. మి. వి. (పెను + నిధి) పెద్దనిక్షేపము,
గొప్పపాఁతఱ.

ఉ. .. అత్యంతము చోద్యమై మెఱయు
నజున మభ్రిపవానికిన్ ధరాక్రాంతము
లైనపెన్నిధులు కన్నులకుం బొడచూపు
లై నడిన్. విప్ర. ౧. ౧౯౨.

క. కాంచిన నతఁడును పెన్నుధిఁ, గాంచినగతి వలరి యెదురుగా వచ్చి ..

వి(క్ర. ౨. ౧౪౨.

పెన్నీ(నునీ)రు. వి. దే. అవా (పెను + నీరు.)
౧. అధికజలము, ఎక్కువనీరు.

క. పెన్నెలలు గాని జక్కవకన్నులఁ బెన్నీరు వెడలఁగా వెలరాలన్, జన్నీరు వెడలఁ గాలెన్, కన్నియయును జలకమాడఁ గలిగె ననంగన్. రామా. ౬. ౧౨౫.

౨. సముద్రము

సీ. . పెనునీటఁ దేలాడుపిన్నపాప.

ఉ. రా. ౧. ౮౦.

పెన్నుద్ది. వి. (పెను + ఉద్ది.) పెద్ద, ప్రతిస్పర్ధి, పోటిచేయువారి నాయకుఁడు.

వ. అంతటు హాస్యక్రీడనం బను నాటకుం దొడంగి రెండు సంగడంబులై కృష్ణుండును శ్రీధాముండును పెన్నుద్దులుగాఁ దక్కువవారునుం దమలోన దొరయుభంగి దోయి గట్టిరి. హరి. పూ. ౬. ౯౨.

వ. తానును బలభద్రుండును పెన్నుద్దులై యితర వల్లవు లెల్ల నుద్దించుకొని

భాగ. ౧౦. పూ. ౬30.

విశే. ౧. మిక్కిలి సమానుఁడు.

గీ. సురల పెన్నుద్దులై జరామరణభయము, లని యెఱుంగక వర్తింతు రందఱుఁ ద్రిజులు.

వి. పు. ౧. ౧౬౨.

ఆ. పేదయైన ధనదు పెన్నుద్దిరొ చను, సాయ మునకు వెచ్చ మల్ప మైన . .

వి(క్ర. ౨. ౧౬౧.

౨. మిక్కిలి గొప్పవాఁడు, మిక్కిలి గొప్పది.

గీ. విషముమ్రింగిన పెన్నుద్దివేల్పు కేఁడు, మునసి జారాతి మ్రింగి గజ్జనఁగఁ ద్రేఁచె ...

కాశీ. ౪. ౨౩౬.

ద్వి. పెద్దల కేఁడు పెన్నుద్దులకొందలు .

బసవ. 3. ౯౦౬. పం.

పెన్నె(న్నే)రు. వి. అశ్వగంధ. క్రీ.

సీ. పెన్నె రనంగను బెన్నెరనంగను దొమ్మడో లనఁగను దోఁచు నశ్వగంధ . .

అం. భా. ౨. ౬3.

సీ. సహదేవి జట్టుప చలిపిండి చిటిముటి పెన్నేరు విషబొద్ది పిండికొండ ..

హంస. ౪. ౧౦.

పెన్నెఱులవాఁడు. విశే. (పెను + నెఱులు + వాఁడు.) పెద్దవెండ్రుకలు కలవాఁడు. కేశి.

గీ. పెన్నెఱులవాఁ డనంగను వెలయుఁ గేశి.

అం. భా. ౨. ౧౧౯.

పెన్నెఱులు. వి. బ. (పెను + నెఱులు) పెద్ద వెండ్రుకలు, దీర్ఘకేశములు. (వృత్తియందిది ఏకవచనముగాఁ గూడనుండును.)

సీ. కుడి విప్ప నడుగుఁదమ్ములపైని వ్రాలు పెన్నెఱులు దేం ట్లగుట సందియము గలదె. ఆము. ౨. 30.

సీ. నిడుద పెన్నెఱిగుంపు జడ గట్ట నగరుమ స్మసమండు తపము గైకొనినచోటు.

మనుచ. ౨. ౯.

ఇట అతి దీర్ఘములగుకురు లని భావము.

సీ. అమృతంబుఁ ద్రావు నీలాభ్రమో యది గాదు కప్పుపెన్నెఱిగొప్పకొప్పు కాని.

దశా. ౨. ౨౪౪.

సీ. కొదమతుమ్మెదరొప్పు వదలింపఁ గలకప్పు గులుకు పెన్నెఱికొప్పు లలవరించి.

రాజ. చ. ౨. ౧౨౬.

పెన్నుఁబులుఁగు. వి. (పెను + పులుఁగు.) గరుత్మంతుఁడు.

తే. ... మహాస్థలయుగాంగ వ్యాళావిభుఁ
డెప్పులంగెడ్డినమాడ్కి నీడ్చి వ్రచ్చిలికుఁ
గాలభైరవుఁడు పైకుబుసం బొకపాయ శత్రుఁ
గడ. పాండు. ౪. ౨౯౪.

పెన్నంగ. వి. పృథువిశేషము.

సీ. కలివిరి గుంద్రయు గచ్చ పెన్నంగయు .
హంస. ౪. ౯.

(క్రొత్త, వ్రాఁత ప్రతి. పా.)

పెమ్మె = పెరిమె. వి. (కే. హెమ్మె.) బి. వ.

దంభవచనములు, బడాయిమాటలు.

ద్వి. జనవరాధమ కూరిజముఁ డిట్టియెదలఁ,
బెమ్మెలు పలుకుచే పేర్చిపశక్తి, సమ్మదంబు
గఁ జోపి జయ మొందుఁగాక

ద్వి. భాగ. ౧౦. (శ. ర.)

పెయ్య = పేయ. వి. ౧. పాలువిడిచిన ఆఁడు దూడ, తఱపి.

సీ. . . వెలయుఁ గోడె యనంగఁ బెయ్య యనఁగఁ, గీ. గోప్రభృతిపుంస్త్ర్య పత్యముల్. ఆం. భా. ౨. ౨౬౨.

క. తఱుగులపాది యొకదానఁ బెయ్యలదామెన యొక్కవలన ననుపై యుండఁగ, మొల కొపి పెక్కుచుట్లన్, బలుఁద్రాటం జుట్టి గోపభావం బలరన్.

భార. విరా. ౧. ౨౩౫.

వ. ... తీయావులకోడెలను అంబోతులం జేసేది పెయ్యలను కదుపునంగూర్చి ..
వ. రా. ౪. ౬౫౯.

౨. లేఁగ, దూడ.

గీ. తఱుగు లార్చి పెయ్యల నెల్లఁ దల్లిచన్ను, గుడుచువిడుచుఁ గొన్నిటి వలుగడలఁ దోలు. హరి. పూ. ౫. ౨౦౭.

గీ. హేమశైలంబు దోగ్ధగా భూమిసురభి, సకలరత్నౌషధులను గల్పాదియందుఁ, బృథుమహారాజు పంపునఁ బిదికె నెలమి, మంచుగొండను బెయ్యఁ గావించి గిరులు.
హర. ౫. ౨౨.

౩. ఆవు, గోవు.

గీ. పాలు గుడుఁ బెక్కు దానిపాము లెన్ని, పెయ్య కళ్మలిగలదు మత్ప్రియనుతుండు, పాల కేడ్చిన మపుడ చన్నిట్టనిచ్చు.
భార. అను. ౨. ౪౨౩.

శ్లో. దేశకాలోపసంపన్నా, దోగ్ధ్రి శాంతాతి వత్సలా, స్వాదుక్షీరప్రదా నస్యా మమ నిత్యం నివేశనే.

సం. వా. ౭ . ౧౦౫. ౧౫.

సీ. వలయుకోరికె లియ్యఁగలపెయ్య గలిగి ముప్పిందపమున్ పరితుష్టిఁ జెంద నెల్ల.
ఉ. రా. ౫. ౨౦౯.౪

విశే. (ఆవుదూడలలోను గేదెదూడలలోను) స్త్రీజాతి.

ఉదా: పెయ్యదూడ.

చూ: పెయ్యమ్మ.

పెయ్యమ్మ. పనికిమాలినవాఁడు, పనికిమాలినది, అప్రయోజకుఁడు, అప్రయోజకురాలు.

(వ్యవ.) వాఁడు పట్టిపెయ్యమ్మ.

పెర. వి. తేనెపట్టు, మధుకోశము.

ద్వి. గిరు లెక్కి కణములఁ గ్రిక్కిరియంగఁ, బెరలతేనియ లాని ప్రేలరింపుచును.
రం. రా. యు. ౨౮౪. పా. ౨. పం.

సీ. తిర వొందఁ దేనియపెర లెచ్చటను గన్నఁ, దాటవ నీటొగురువాతెఱయు తలఁచి ...
నీలా. ౩. ౧౦౭.

జ : పెరతేనియ, పెరయీఁగ.

**పెరజే.** వి. సర్పవిశేషము.

సీ. కాఁకకేటులఁ జిల్వగులియలు క్రాఁచులు పెరజాలు గుఱ్ఱపుఁబెరజా లచట. గీ. గలవు తక్కి_వ జెఱ్ఱిపోతులును . ద్వా. ౧. ౯౭.

**పెరడు.** వి. జో. (క. పెఱ.) గృహపృష్ఠభూమి, ఇంటి వెనుకటిదొడ్డి.

సీ. కరటిదానవవైరి పెరటికల్పద్రుమం బనుచు నేత్రుఁడు పిద్దర నదుచెలను.

పి. కథం. ౪. ౪.

సీ. ఏపాధ్వి పెరటిలో వెలసోఁటఁ గని వజ్రి వంటనవని నిందవం బొనర్చు.

దశా. ౧. ౫౦.

సా : పెరటిచెట్టు మందు గాదు = పరిచిత వస్తువునకు విలువయుండదు. (సులభమగు పదార్థముగ నిర్లక్ష్యముచేసి నిరసింతు రనుట.)

ఆ. తమ కసాధ్య మైనఁ దమితోడఁ గాంక్షింతు, రాగశాలిమును ధరాభినాథ, తమకు సులభ మైన నమృతంబుఁ గైకొన, రెందుఁ బెరటి చెట్టు మందు గాదు. శశా. ౪. ౩౯.

క. ఏమిటికి నీదుమతికిని, రామైతిమి దుమ్ము విడువరా దని యెంతేఁ, ప్రేమం జెప్పిన విన విటు, మామాటలు పెరటిచెట్టు మం దగునె నృపా. రుక్మా. ౪. ౨౦.

**పెరతే(న)నియ.** వి. (√ పెర.) పెరనుండి తీసినతేనె, పట్టుతేనె, మధువిశేషము.

క. అట్టు కణుజెట్లు గాల్చిన, పెట్టుల నింకెట్ల మతియుఁ బెరతేనియలం, బెట్టుక పెసఁ గుచు శాఖుని, పట్టికి నిం పెసఁగ నిట్లు ప్రతివచనంబున్. శాక. ౩. ౫౧.

క. ... మానుమతేనె పూఁదేనె జాజితేనె పుట్టతేనె పెరతేనె కజ్జితేనె జుఱ్ఱతేనె...

ప్రబంధ. ౧౧౭.

**పెరయీఁగ.** వి. (√ పెర. పెర నిర్మించు తేనె టీఁగ.) పుత్తిక, ఒకజాతి తేనెటీఁగ.

క. పెరయీఁగల గతిఁ గవయుచుఁ, బోరిఁ బోరిఁ గడుఁదురల పగిదిఁ బొదువుచు ...

భార. ద్రో. ౧. ౨౫౭.

చ. అదురులు వాలు మూఁదికొని హాస్తయుగం బునఁ గింసవైరిఁ గ్రొట్టెదుర సురంబు ప్రేమ పెరయీఁగగతిం గలచె న్మురాంతకున్ ...

ఉ. హరి. ఉ. ౯౦.

**పెరరేఁచు** = ప్రేరేఁచు. స. క్రి. ప్రేరించు, పురికొల్పు.

(ఇది సానుస్వారమని చి. ని. నిరనుస్వారమని శ. ర. రేఁగు, రేఁచులను బురస్కరించుకొని సానుస్వారమనుట యుక్తము.)

క. . నిజసోదరులం బడినచోటికి కృష్ణుండైనను నిమ్మనక్, బెరరేఁచి తెచ్చె నిత డెం దరి గాదు ... జై. భా. ఒ. ౨౧౫.

చ. ... ఓమునివర నీవు సేయు తపము జపమున్ బెరరేఁప నెల్లి కేఁటున భవదగ్ర వీథిక గడారపటుం డిటు వచ్చు మున్నె రయాయన నిను జెలిపాఁడు చరితార్థుఁడ నీవు చతుర్థ సంపదన్. పాండు. ౪. ౭౧.

మ. తరుణుల్ తల్లి రెండుం గుచంబు లనుపం దచ్చైత్యముల్ దీమలై, పెరరేఁపన్ జను దంచె గాక .. అను. ౨. ౭౭.

జ : పెరరేఁపు.

**పెరరేఁపు** = పెరరేఁచు (శ. ర.)

**పెరవణి** = పేరణి. వి. (సం. పేరణీ, నిర్యావృ్ని. క. పేరణి.) నృత్యవిశేషము.

క్వి. అంగజారాతికి సానంద మొదవ, భృంగి
ముందటికంటెఁ బెరవణి చూప.
ప్రభులిం. ౨. ౧౩. పా. (శ. ర., బ్రౌ. పా. పేరణి. ముద్రి. పా.)

**పెరసు.** వి. పాలను, మాంసము. (శ. ర., బ్రౌ.)

**పెరిమ.** వి. (సం. ప్రేమా.) ప్రేమ, అనురాగము, వలపు.

సీ. సురలకు హితవు నొనరించితివి, ధా కేగుము
నిన్నుఁ జూడఁ దద్దయు వేడ్కం, ద్వారక
పడుచున్నవారలు, హరివిక్రమ నీ సహోద
రాదులు పెరిమన్. హర. ౪. ౧౭౯.

క. గురుతుచ చెలిమూఁపున నో, మరదోఁపఁగ
నిలిచి చూచె నధిపతి నతఁడుం, బెరిమం
జూచెను సతి .. పరమ. ౩. ౧౪౨.

క. మురియుదు రెవ్వరి బిడ్డలు, మరు లింతియు
నాళ సుతులు మతి యతిహితులే పెరిమను
బుట్టిన పుత్త్రులు పెరుఁగఁగ శత్రులను
బ్రతులు పెక్కులు వినకే.
కుచేల. ౧. ౫౯. (పెరిమె అపముద్రి.)

**పెరిమె = పెమ్మె.** వి. (క. పెర్మె. తు. పేర్మె, త. పెరుమై) ౧. గొప్పతనము, ఘనత.

క. కలిమిఁ దలముగాని వ్యయం,బులు పెరిమెల
కొఱకుఁ జేసి పాలియు రెదుర్యు,ద్ధులు నారి
కేళిజితమన, పులుఁగు దుర్దైశ్వర్యమహిమఁ
బొలిసిన భంగిన్. కేయూర. ౩. ౧౪౬

౨గిడ. పేర్పుమైనల్ల యది నెఱులఁ దొలిపూఁ
దుతిమె, దర్పకున కర్పింపఁదలఁప నంతటి
పెరిమె. మనుచ. ౩. ౭౪.

శా. అన్నది పావనగుణ సం,పన్నతనుతియింపఁ
గలఁడె పన్నగపతియుం, బిన్నకయన్నది
మునిఁగిన,యన్న దఁ దమ్మరునికంద్రి యనఁ
దగుఁ బెరిమెన్. రామా. ఉ. ౩. ౩౨.

౨. ప్రసిద్ధి, ఖ్యాతి.

గీ. అగ్నిబిందు విస్ఫురిత జాజ్వల్యయంబుఁ, గార్చి
మధుకైటభారాతి కూర్మి మిగుల, బిందు
మాధవుఁడను పేరఁ బెరిమెవడసె.
కాశీ. ౬. ౧౧౨. (ప్రాఁత ప్రతి. పా.)

౩. ప్రాశస్త్యము, శ్రేష్ఠత్వము.

వ. మిరియుంబు పెరిమెయుఁ బనుపుసయు
అవశ్యరయు .గలిగి .
కాశీ. ౬. ౧౭౯. (చి. వి. పా.)

**పెరుఁగాకు.** వి. (పెరుగు² + ఆకు.) = పెరుఁగు తోఁటకూర, మహాబాష్పకాకము. శ్రీ.

**పెరుఁగు¹(గ్గు) = పెరువు¹, పెఱుఁగు.** (త. పెరుకు. క. పెర్చు.) అ. క్రి. ౧. (వయఃప్రమాణాదులలో) ఎదుగు, వర్ధిల్లు, పెంపొందు.

సీ. . . పాండుకుమారులు .., ధృతరాష్ట్రు
సొద్దఁ, దత్సుతులతో నొక్కటఁ బెరుఁ
గుచు భూసురవరుల వలన . .
భార. ఆది ౩. ౧౨.

క మృతుఁడఁట పుట్టుఁ బెరుఁగు, మృతుఁడఁట
కేతోకఁడు గుడుచ కోకొనఁ దృప్తిన్ ..
హైమ. ౪. ౪౫.

గీ. వింధ్య కుమరాద్రిపాటికి వివిధశాఖ,శతములు
మొలపూసలుగఁ బెరుఁగి మదిఁ దలఁచె,
నెన్నఁడు ..
పాండు. ౫. ౧౨౬.

మ. పలుకుందొయ్యలిచేతి రాచిలుక పెంపక్క
పెర్గి నాకాశనా, కలపాలిలఁ బ్రికాలశటిని
యనంగా ... వర్తింతుఁ గాంకామణీ.
విక్ర. ౪. ౫౦.

౨. ఉత్సాహించు, ఉత్సహించు.

సీ. శాతశాతవతమున వా-శల్లఁ బాండవాగమనంబు
విని సంతసమునఁ బెరిఁగి .
భార. ఆది. ౭. ౧౪౭.

౩. పూను, ఉద్యమించు.

క. చక్కనగు మనిన రక్కనుఁ, దక్కజముగఁ
బెరిఁగి . . భార. ఆది. ౭. ౨౦౩.

ఉత్సాహము. ... ఈక్షణంబె యేఁగి పాం,
చాలుఁ బట్టికెత్త మధికశౌర్యశీల మొఱ
యఁగాఁ, బోలు సనుచుఁ బెరిఁగి రాజ
పుత్రు లరిగి . భాగ. ఆది ౭. ౭౫

౪. కలుగు, పుట్టు.

క. కుసుసేనఁ గదా గెలుచుట, కరముద్ధరము
నరున కవకు గాండీవమును, బెరిఁగినయమ్ముల
మంటలు, దరికొని తెగఁగాల్చునటిదయ
యగుఁజామ్మా (భా. ల. వ్యా. పా.)
భార. ఉద్యో. ౨. ౧౯౪

౫. తెగు, భిన్నమగు (ఈ యర్థమున విరను
స్వారమని శ. ౨. వ్యతిరేకలక్షణచే సబిం
దుకమునకే యీ యర్థము రావచ్చును.
చూ. పెంపు.)

చ. పెరిఁగిన హారరత్నములపెల్లున నొక్కఁడు
దాఁౘపట్టియై పారి. ౪. ౩౭.

వ. కరఁగిన కపురంపుతిలకంబుతోఁ బెరిఁ
గిన తారహారములతో బడలిన సెమ్మో
గంబుతో . ఉ. రా. ౪. ౨౨౧.

విశే. ౧. ఏండ్లు చెల్లినవాఁడు, ఏండ్లు చెల్లినది
(శ. ర)

౨. వృద్ధిపొందినది. (శ. ర.)

జ: పెంచు, పెంచుకోలు, పెంపగు, పెంపరము,
పెంపరి, పెంపలు, పెంపారు, పెంపారుచు,
పెంపు, పెంపుడు, పెక్కువ, పెనుచు, పెను
వడు, పెనుపరి, పెనుపారు, పెనుపు, పెరఁ
గుడు,

పెరుఁగు²(గ్గు). వి. = పెరుగు² (త. పెరుగు)
దధి.

గీ. మినిమి గలపుల్లపెరుఁగుతో మిళితమైన.
సైమ. ౭. ౧౩౦.

ఉ. కమ్మనిజున్ను మంచిమెయి గట్టిది మీఁగ
డతోఁ బెరుంగు చొక్కమ్మగు జున్నుపాలు
చిలుక మ్మిపిదీసినవెన్నముద్ద
హంస. ౨. ౧౧౧.

చ. రమణి యొకర్తు కొంటి మదురాపురికిం
బెరుఁ గమ్మఁ బోవుచో
దశా. ౯. ౨౦౪.

ఉ. పేరిననేయి దుగ్ధములు పెర్గును మీఁగడ
యున్ సదాప్రజాగారము సొచ్చి త్రాగి
పెస గింతులు వైచు మురారి పెంచఁగా.
అప్ప ౪. ౨౩౦. పా.

చ అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం గను
పట్ట గన్నెలోఁ, బెరుఁగును వంటకంబు వడ
ంది యలం గుడువంగఁ బెట్టు నిర్భర
కరుణాధురీణ యగుప్రాణము ప్రాణము తల్లి
యున్నదే కాశీ. ౪. ౧౧౫.

పెరుఁగు వడ్లును గలిపినరీతి = ఒకరితో నొకరు
కలియక యుండుట.

ద్వి. ఈ రీతి విశ్వాసం బెందును లేక, పెరుఁగు
వడ్లును కలిపినరీతి నుండ, నరినాథుఁ
డేతెంచి ద్వి. పరమ. ౫. ౩౫౭. పా.

జ: పెరుఁగాకు, పెరుఁగుతోటకూర, పెరుఁగు
సంద్రము.

పెరుఁగుఁడు. వి. (√పెరుఁగు¹.) వృద్ధి.

సీ. తగఁ ద్రివర్గాభివృద్ధి తగ్గు నిల్కడ పెరుఁగుట
యనునివి మూఁడు కోలు .
ఆం. భా. ౨. ౧౯౦.

పెరుఁగుతోటకూర=పెఱుకు తోటకూర.
వి. (పెరుఁగు¹ + తోటకూర = పెరుఁగు

వలె మృదువైన తోఁటకూర.) మహాశాస్త్ర
శాకము.

సీ. ..పెఱుకతోఁటకూర, పెరుఁగుతోఁటకూర
యనఁగఁ జను మహాశాస్త్ర సంజ్ఞ.
అం. శా. ౨. ౩౩.

**పెరుఁగుసంద్రము.** వి. (పెరుఁగు¹+సంద్రము)
పెరుఁగుకడలి, దధి సముద్రము. (శ. ర)

**పెరుమాళ్కోయిల.** వి. (పెరుమాళ్లు + కోయిల.
త. పెరుమాళ్ కోవిల్.) కాంచీపురము, ఒకా
నొక పుణ్యక్షేత్రము.

క. కోయిలఁ దిరుమలఁ బెరుమా,కోయిలఁ దిరు
పతులఁ గుంభకోణాదికపు,ణ్యాయతనంబుల
మాయం, బైయొక్కఁడఁ బోయెనొకా
మురాంతకు ప్రతిమల్. (కాశీ. ౫. ౨౮౭.)

**పెరుమాళ్లడుగుబుగ్గ.** వి. (పెరుమాళ్లు +
అడుగు + బు ) విష్ణుపాదోద్భవయైనయేఱు,
ఆకాశగంగ.

సీ. .. ముత్తెరువు లాఁడి తెలివాఁక పాంచా
మరకుఁబంట, కఱకంఠుతలయేఱు పెరు
మాళ్లడుగుబుగ్గ జడదారిచే యూట చదలు
వాఁక. గీ అమరతటినికి నామధేయములు
పొంబ . పాం. ని. దేవ. ౧౬.

**పెరుమాళ్లు.** వి. బ (త. పెరుమాళ్.) దేవుఁడు,
విష్ణువు.

చ. మన మత్స్యతంపుపెంపు పెరుమాళ్లె యెఱుం
గు వీఁకన్ సమస్తముల్
పరమ ౨. ౧౩౩.

చ. అలసరా యెుందు నీ వీఁక గులాముమకుం జన
వద్దు మాకు వి,చ్చలఁ బెరుమాళ్లకోవెలఁ
బ్రసాదముకట్టడి సాగినప్పు డా,తలిరుఁ

బ్రసాద మాత్ర సతతంబుఁ గాపాడము.మన్న
బ్రమ్మోక్క యన్,మెల్లఁకుక స్వామి చిత్తమున్ని
కోనాటియు స్మదిశాంతరంగయై.
వైజ. ౨. ౧౨౭.

జ : పెరుమాళ్కోయిల, పెరుమాళ్లడుగుబుగ్గ.

**పెరువు¹(ర్వు)** = పెరుఁగు. అ. క్రి. ఎదుగు,
వర్ధిల్లు. (శ. ర.)

విశే. ౧. ఏండ్లు చెల్లినవాఁడు, వృద్ధుఁడు,
వృద్ధురాలు.

సీ. పోవుచున్నార మీపువ్వుఁబోఁడియు నేనుఁ
బెద్దకాలమువాఁటిపెరువఁ గాన లావు
చాలదు జరాదైన్యంబు కతమునఁ జాదవ
మ్మోనప్పు డండిగడునవుడు.
కాశీ. ౨. ౧౬౩.

౨. పెరిఁగినది, వృద్ధిపొందినది.

వ. . తెరువులం బెరువులై విరువులంగఁ
బూచి మురువు లలరుకదంబతరువులును .
రాజ. వి. ౨. ౪౭. (శ. ర., వా.)

**పెరువు²(ర్వు)** = పెరుఁగు. వి. దధి.

క. తరువంబెటినబానల పెరువులు మును గిల
కరించి పేర్చిన వెన్నల్ మరువు లెసఁగఁ
గ్రోలి హరి. పూ. ౫. ౨౦౩.

సీ. పెరువులోఁ బాలును బెరువు వెన్నను వెన్న
చల్లను జల్ల యూజ్యమునఁ గలవు.
హరి. పూ. ౫. ౨౦౭.

ఈ. ఒల్లమిచేసి పీరలను సత్తర మీకు నృపాల
పెర్వులుం, జల్లలు దమ్ముకొన్న యవి చాలఁగి
మున్నవి ... పి. కమ. ౧. ౧౨౫.

**పెర్కు** = పెఱుకు. స. క్రి. ఊడఁదీయు
ఊడఁదీయు.

ద్వి. ఆలోన పవనజుఁ డసమానవిజయుఁ, లోలుఁ
డై వానిఁ జాలఁ బెక్కు-చంపె
రం. రా. సుం. ౨౭. ౭. పా. ౧౮. పం.

(శ. ర. పా. ఱేఁకి చంపె. ముద్రి. పా.)

**పెఱ.** (సం. పరః. త. పిఱ. దీనికి వ్యస్తరూపముగాఁ బ్రయోగము లేదు.) అన్యము, ఇతరము.

క. చెఱచి యొకచేతఁ గూర్మముఁ, బెఱచేత
గజమ్ము బట్టి భార. ఆది. ౨. ౭౯.

గీ. సభలఁ బలుకు దీవు సరి లేరు నా కని,
యిది రణంబు వచ్చె నెల్లవారి, కెఱుఁగ
వచ్చు దీనఁ బెఱచోట రజ్జైన, మాట్లు పూర
గింప నగునె యిచట.
భార. విరా. ౪. ౭౭.

వి. (సం. పరః = శత్రువు) పగవాఁడు, శత్రువు.

మ. ప్రాసఁగంగా నేస్త్రీ స్నేహంగాం, తిరిఁ
బోపెఁ బెఱరాజకోటి
(రాజపక్షమున.) మను చ ౪. ౩౭.

జ: పెఱగాయ, పెఱగాయసుద్దులు, పెఱత్రోవ, పెఱపోక, పెఱమగఁడు, పెఱవాఁడు, పెఱసుద్ది.

**పెఱగాయ.** విణ. (పెఱ + కాయ.) పనికి మాలినవాఁడు, అప్రయోజకుఁడు.

(చూ. పెఱగాయ సుద్దులు.)

**పెఱగాయసుద్దులు.** వి. బ. (√ పెఱ.) పనికి మాలినమాటలు, వ్యర్థవచనములు.

క. ... కేసుగోరుకోరికవితగా, నటునిటు
ద్రొద్దులు ద్రిచ్చుచు, నటుమటఁ బెఱగాయ
సుద్దు లాడెదవారా. శశా. ౩. ౩౭.

**పెఱత్రోవ.** వి. (√ పెఱ.) అన్యమార్గము, కెఱుత్రోవ, ఉపమార్గము, పెడత్రోవ.

చ. కనకదళాయతాక్షి మగవాఁడు పరాంగన
పొందుఁ గోరువాఁ, డని వినవేమొ యిట్టి
రుచు లంటినచో మఱి చాక చేయఁడే,
నిను వటుగాన బూని మగనిం బెఱత్రోవలఁ
బోవనీక చేర్పున నని బుద్ధిగాఁ గఱపు
ముద్దియ సందియమందకుండఁగన్.
శుక. ౧. ౪౩౪.

**పెఱపోక.** వి. (√ పెఱ.) అన్యప్రవర్తన, కెఱు నడత, చెడ్డనడత, దుష్టప్రవర్తన.

చ. పురజను లప్పటప్పటికిఁ బుణ్యచరిత్రల
వారలక్షవిభా, స్వరమణిసౌధమార్గముల
వచ్చుచుఁ బోవుచు నుండఁజూచుచుం,
గరములు మోడ్చి ద్రొక్కుడురుగాని తదీయ
సురూపలక్ష్మి కెవ్వరుఁ బెఱపోకఁబోరు
మను వార్తకొంధం బెద నిల్పి పాయమిన్.
కళా. ౭. ౧౪౩.

**పెఱమగఁడు.** వి. (పెఱ + మగఁడు.) అంకు మగఁడు, జారుఁడు.

వ. . . పెఱమగలచే నంపించుకొ మఱలునప్పుడు.
చంద్రా. ౪. ౭౩.

**పెఱవాఁడు.** వి. (పెఱ + వాఁడు.) అన్యుఁడు లాఁతివాఁడు, పరాయివాఁడు.

కి. పెఱవారి నెల్లఁ దఱిమిడి, నఱకుదుఁ బాండు
క్షితీశనందనులను రూపఱు నేయుం జే
యఁడదు ... భార. ఉద్యో. ౪. ౧౫౦.

తరళ. నగుచు నమ్మని పల్కు నోవరనాథనందన
నాయమే, బెగడుచుఁ బెఱవానిపోలిక
భేదవాక్యము లాడఁగా.
ఉ. రా. ౩. ౭౧.

**పెఱసుద్ది.** వి. (పెఱ + సుద్ది.) అన్యవచనము, కొంటెమాట; అపవాదము, నింద.

క. పెద్దతల లేక మీ శ్రీ, విద్దపురూపముల
యెచట నిల్చిన మనము, బెద్దటికము చాలదు
పెటు,సుద్దులు గల్పింతు రెందు సుజనులు
గలరే. కళా. ౨. ౧౫౨.

పెటిక(ర్క). వి. (త. పెటికె) ఈ ప్రక్కను ఆ ప్రక్కను ధాన్యాదులు పోసి ఎద్దు, గుఱ్ఱము మున్నగువానిమీఁద వేసి మోయించెడు గోనె మూట.

చ. మఱియును నన్నిధిం గల సమంచితకాంచన
రాశి బిందులం, బెటికల మోపులం గొలఁది
వెట్టఁగఁ లెక్కగు బారువుల్ .
భార. అశ్వ. ౩. ౧౫౪.

ఆ. ఇక్కు ముట్టి చక్కి నెక్కంగ మఱచి,
సంభ్రమముఁ బొంది పిఱుఁదఁ బ్రమథ
గణము, లార్వఁ బోతుమీఁది నడ్డంబుపడి
యుప్పు,పెటికవోలె వెఱచి పఱచె జముఁడు.
కు. సం. ౨. ౨౦౭.

(పెటిక. వ్రాఁత ప్రతి.పా.)

గీ. పెటికయే చాలు నావడ్డి విఱుఁగఁజేయు,
దానిపైఁ దాను నెక్కు
శుక. ౩. ౪౦౫.

సీ. పలంద యేనుఁగు మొత్తములఁ బట్టి పులుల
పైఁ బెటికిన యుష్ట్రతోల్ పెటికగములు.
చంద్రా. ౨. ౪౧

ద్వి. ఇవ్వియుఁ జెప్పఁగానేల యీ షడ్డీమ
సైన్యపఁ గొనిపొందు గొన్ని పెర్కలను.
బసవ. ౪. ౧౧౪.

మోకాళ్లమీఁది పెటిక = గమన ప్రతి బంధకము, కష్టకరము.

ఆ. ముసలివాని బ్రదుకు మోకాళ్లమీఁదటి,
పెటిక యుంతె యంతెపెట్టు పెట్టి, కొట్ట
నేల నీవుఁ గొడుకులఁ గన్నఁడ, విఱియ
నీకు రాఁగ నేసె చూతు. శుక. ౩. ౧౧౯.

చూ: పెటికపెట్టి, పెటికాటము.

పెటికపెట్టి. వి. (పెటిక + పెట్టి.) పెటికాటము చేయుపెట్టి, వర్తకుఁడు.

ద్వి. కటికంయుగుడి యిది కంటి కేమనుచు,
బెడికపెట్లాతనిఁ బిలిచి చూపుడును ...
బస.పు. ౨. ౪౦౭. పం.

పెటికాటము. వి. (పెటి + ఆట.) ఎద్దు మొ., వానిచే ధాన్యాదులు మోయించుకొని పోయి చేసెడి వ్యాపారము.

సా. కర్కటము కర్మాటము. రాఁగానే
పెటికాటము పడిపోవును = వర్షము అధి
కము కాఁగానే పెటికాట వ్యవహారము
ఆగిపోవును

పెటికించు. స. క్రి. (√ పెటుకు) ౧. పెల్లగింపఁ జేయు.

సీ. పేళ్లతోడుతఁ గల్ప వృక్షముల్ పెటికించి
కొనిపోయి తన కుపవనముఁ జేసె.
కు. సం. ౪. ౩౭౪.

౨. ఊడఁదీయించు., పీకించు.

వ. చతురు లగుదితితనూజులు తమతమ నికేత
నంబులకుం గొనిపోవుటకై విఱుగకుండఁ
బెటికించి నురికుమారకులతలల కెత్తించిన
ఘటితమణికోటికోటిమండితక,వాటసంఘా
తంబులును . ఉ. హరి. ౧. ౫౩.

౩. మోయించు.

చ. ... కప్పముల్ ధరణిపాలుఁ జేఁ గొని
మూఱుపేల్ గజంబులఁ బెటికించి తెచ్చె ...
భార. ఆది. ౫. ౩౯.

పెటుకు = పెర్కు. స. క్రి. ౧. (వృక్షశిలాదులను) పెల్లగించు, ఉన్మూలించు.

గీ. తినము లాతటు నంతలం బెఱికి రొంపి,తోవ
నీటఁ దమల్పి తొంపుగ నమర్చి ...
భార. అను. ౩. ౨౨౩.

వ. గుఱ్ఱంగొని సేల ద్రెక్కలంగఁ గ్రొచ్చియు
దున్నలు త్రింగియును శిలల్, పెఱి
కియు ... భా. రా. బాల. ౪౦౬.

౨. ఊడఁబీఁకు, ఊడఁదీయు, (ఖడ్గాదులు)
దూయు, పైకిలాగు.

క. పెఱికితి వలుఁగులు మేనులు, పెఱికిఁ బడ
వెల్లడలఁ గలయు విదితి పూరు లి, త్రెఱి
నీకులు ద్రావక తెప్పియవు ..
భార. ద్రో. ౩. ౧౭౦.

గీ. ఏచి మున్నీరు సేయుఁత నీఁద వగ్ని,
మఱుక వాడుకికోలలు పెఱుకఁ గడఁగి,
నట్టు గాద రాధేయ నీ వర్జునకుఁ, బోర
వెక్కటి మార్కొనఁ బూను టరయు.
భార. విరా. ౪. ౨౧౩.

గీ. ... వధియింపు మిద్రుడ యనుడుఁ, దలిసి
ఖడ్గంబు పెఱికి దైతేయుదీర్ఘ,కఠినభుజదండ
మున్గ్రవేగమున నఱకె.
భా. రా. అర. ౩౯౦.

౩. పీఁకు, లాగు.

గీ. మిత్తి తలదన్ని నుదకాల్పుమీద లూడఁ,
బెఱికి విసదారికాయని బెదరఁ దోలి ..
అచ్చ. రా. సుం. ౧౫౮.

౪. పోయు, వహించు.

ఆ. బలిమిఁ గొనినధనము పదికేలలొట్టియల్,
పెఱికి రాఁగ వైరిభీకరుండు, వచ్చె నకు
లుఁడు ... భార. సభా. ౧. ౨౭౩.
(శ. ర., చి. వి. పా.)

౫. పొఱయించు, పొఱయించివేయు.

సీ. వలుదలేమసఁగుల ముత్తెములఁ బట్టి ఘూలు
లపైఁ బెఱికిన యిట్టితోళ పెఱికగములం
చంద్రా. ౨. ౪౧.

అ. క్రి. పెల్లగిల్లు, ఉన్మూలితమగు.

గీ. .. మారటంబుల తరువులు మారు వొంగి,
తలిమిపాతనఁ గూలు వేతసము లేల, పెఱికి
పోవని మా కేమిప్రియము మొనర్చె.
భార. శాం. ౩. ౭౨.

జ: పెఱికించు, పెఱుకుతోఁటకూర.

పెఱుకుతోఁటకూర. వి. (పెఱుకు + తోఁట
కూర = పెఱికి యుపయోగించెడు తోఁటకూర.)
పెరుఁగుతోఁటకూర, మహాశాప్పము. శ.

సీ. ... పెఱుకుతోఁటకూర పెరుఁగుతోఁట
కూర యనఁగఁ, జను మహాశాప్పసంజ్ఞ ...
ఆం. భా. ౨. ౬౩.

పెఱుగు = పెరుఁగు. అ. క్రి. ఎదుగు.

సీ. తలచుటుమ్ముల సేదు పెఱిగినచందంబు నేపె
రయంబునఁ జిత్రసేనుఁడు.
భార. కర్ణ. ౧. ౯౬.

వ. ఇట్లు విరథుండును విక్షతదేహుండును నై
యతం డేదు పెఱిగినట్లు నీరుమఱింది యుగ
వ్రమను వరదంబుమీఁది కరిగె ...
భార. భీష్మ. ౩. ౩౦.

పెలరు. అ. క్రి. (క. పెళలు.) తొలఁగు.

క. అంక గొన నుభయబలములఁ, బొంతం
బఱి తలరి పెలర భుని గ్రక్కదలఁగ, వింక
మదకరులు రెండుం, దాంకె వడిం గొండ
గొండ దాఁకినభంగిన్. (కు. సం. ౧౨. ౭౪౯.)

పెలుక. వి. జలజంతువిశేషము.

గీ. పెలుక నిర్ఘాత బోచు తాఁబేలు పిరక,
మొసలి శింశుమారము పెద్దమొసలి ...
హంస. ౪. ౧౭౨.

క. అది వోయి శత్రుదేహము, భిదురము గిరి
వ్రయ్య నడుము పెలుచన్ లీలన్, విదళితము
చేసె వ్రయ్యలు, పొదలిన నెత్తురులతోడ
భువిఁ బడ వ్రాలెన్.
హరి. ఉ. ౬. ౨౧౭.

విణ. (దీనికిఁ గర్మధారయసమాసమునఁ దఱచుగా నిగాగమంబగు.) ౧. క్రూరము.

చ. పెలుచగురూపుతోఁ బునుకపేరులు దూల
వెడందవాలుకిన్, పెలవుల వాకిలించు
నిరువేతుల కేడెము వాలుఁ బూని మై,
పొలసుగివుల్కుడుం గిదురఁ బొట్టకుఁ గర్గె
నటంచు వార్చుచున్, పొలయక వచ్చు
కాటకిఁగనుంగొని రాజదదారి రామలోకన్.
యయా. ౩. ౭.

(పెలుచగు రూపుతో శ. ర. పా.)

౨. కఠినమైనది, గట్టిది.

సీ. బలితంపుజంఘల పెలుచనితాఁకున నమర
యానములు తుత్తుమురు గాఁగ.
హరి. ఉ. ౫. ౧౬౧.

౩. అధికము, పెద్దది.

క. అనుటయుఁ బెలుచనియెలుఁగున, ఘనతూల
ప్రబలశాఖికాదుర్జయు న్నన్నను దాఁకిన
నతని ప్రభంజనుఁడను నామంబునకు ననత్యత
వచ్చున్. భార. శాం. ౩. ౩౭౭.

జ : పెలుచన.

క్రి. విణ. ద్రు. ౧. అధికముగా, మిక్కిలి.

క. ... పెటి పెడి నురగాలి విసర నిలువక
పెలుచన్. ఉ. హరి. ౨. ౨౪.

సీ. పెల్చ పల్లిండ్లు నిల్పెద నన్ను నదలించుఁ
బెలుచ గాలింప సెంచితను గనరు.
విప్ర. ౩. ౧౫.

౨. శీఘ్రముగా, అవిలంబముగా.

గీ. కందుదొడలును విఱిగిధరిత్రిఁ బెలుచఁ, గూలి
రూ పఱి రారాజు ధూళి ద్రుంగె .
భార. శల్య. ౧. ౯౦.

గీ. . నిఖిలైకగురుఁడనైన, నాదువాక్యంబుచే
భవార్ణవంబు పెలుచ, దాఁటుదురు మత్ప
దాంబుజధ్యానపరులు.
భాగ. ౧౦. ఉ. ౯౯౭.

శా. అంతేవాసులు నీవుఁ గూడుకొని మధ్యా
హ్నభిక్షాక్రియల్, కాంతస్వాంతతజావ్హ
విం జలిపి పెల్చక రండు .
హేమ. ౨ ౧౨౩.

౩. గట్టిగా, దృఢముగా.

గీ. దండధరుఁ బెల్చ డాకాలఁ దన్ని ధ్రువుఁడు,
నింద నందును వానికి నెక్క
భాగ. ౪. ౪౪౯.

౪. బలాత్కారముగా.

ఉ. దినాంతరయోధుఁ డీ,చాయఁ దదీయ
పత్నిఁ బెలుచం బడ నీడిచికొంచుఁ బోయె
దుర్గ, గో యనుమాడ్కి నంతట శకుంత
రవంబు పెలంగ నెల్లెడన్.
పారి. ౨. ౩౦.

౫. బిగ్గరగా, ఉచ్చైస్స్వరముతో.

సీ. తమచేసెదిక్కు, గనఁగొని పెలుచ జోకర్ణ
రోహిప రోవురోధన పొరన క్షొత్తి
రొంపుదుఁ, జెప్పుదురు .
భార. ద్రో. ౫. ౩౨౨.

క. ఓయమునానది నీయం, బాయకముగ నాకు
వలయు నవగాహంబున్, జేయఁగ రావో
కేడో, తోయము లని పిలిచె పెలుఁగు
తొట్రిలఁ బెలుచన్. హరి. ఉ. ౨. ౯౩.

౬. నిష్ఠురముగా.

ఆ. అలుక నొందమి కంపితాధరపల్లవుఁ, డగుచుఁ
బెలుచ నిట్టు లనియె నతఁడు.
మార్క. ౫. ౨౭.

**పెలుచే(ల్చ)న.** వి. (√పెలుచే.) ౧. అతిశయము, ఆధిక్యము.

ఆ. అలిగి యాడు గొంచి యొక్కటి పెలుచన,
నిలువలేక యసుర నింగిదాఁకఁ, బెరిఁగి
యుదుగుదెంచె భీకరూపంబుతో, నుగ్రవంగి
భీముఁ డున్న దెస.
భార. ఆది. ౬. ౨౯౧.

౨. ఆగ్రహము, కినుక.

క. జనని యనక యి ట్లెంతయు, నను లంకించి
తటుగావునం బదము మహిం, దునిసిపడు
గాక యని పెల్చ, నన కయింపుమటయు
మించి జముఁ డాతుఁడై.
హరి. పూ. ౧. ౧౪౭.

మ. అని యద్దేవి రయంబున న్నెగసి దైత్యా
ధీశకంఠంబు పెల్చనఁ బాదంబునఁ జిక్కఁ
ద్రొక్కి .. (మార్క. ౬. ౧౧౪.)

౩. ఉద్ధతి, ఆటోపము.

మ. అని కోపంబునఁ బల్కు నప్పవనుతో నా
భూరుహం బింత పెల్చన నీ వాడెద వంత
తక్కువనె వేలా లోకసామాన్యవృత్త
నిశాయంబున నన్ను నొక్కటిగ నిచ్చం
జూచితే .. భార. శాం. ౩. ౩౯౧.

విశే. అధికము.

క. ... మునిసత్తమ వారద్భుశ్యమూర్తు లయిరి
పెల్చన కరుబలిచే నాతివఘనదీపంబు
లనఁ బోలె గ్రక్కున నంతన్.
మార్క. ౪. ౨౦.

క్రి. విశే. ప్రా. మిక్కిలి అధికముగా.

క. ఘనజాలములేకయుఁ బెల్చఁగఁ బిడు
గులతోడి వృష్టి వైద్యుతి పాతంబునఁ
గురిసె భాగ. సభా. ౨. ౪౦.

చ. కలపనగంప యీ తపని రాజాలం, బెలు
చన లేచి తెచ్చి తల పెట్టు వినోదపుఁదీట
వోవఁగన్. హరి. పూ. ౫. ౯౨.

౨. గట్టిగా, దృఢముగా.

క. అనిలసుతుఁ బట్టికొని పెల్చనఁ ద్రోచి
కిడంగి కినక శైలనికుంజంబులు వోని వాని
వక్షముఁ, దన దృఢతరముష్టిఁ బొడిచెఁ
దద్దయు నలుకన్. భార. ఆది. ౬. ౧౦౦.

క. అన్యుఁడు దాని దవ్వులఁ, గని ఘనుఁ
డయి పాండవుండు గాండీవగుణధ్వని
సేయుచు డాసిన పెల్చన సేయఁ గడింగి
విలిచె సంరంభమునన్.
భార. అర. ౧. ౩౦౩.

౩. శీఘ్రముగా, చెచ్చెర, వెంటనే.

క. మనసిజరాగంబునఁ బెనఁగిన యిట్టిని లేడిఁ
జూచి కృతవాసుఁడు పెల్చన నేరమ్ముల
నా కంటిని బ్రద్దలుగఁ జేసెఁ గడుఁగఠిన
హృదయుఁడై. భార. ఆది. ౫. ౪౯.

ఉ. ... కావునన్, ఖేదము సేయఁగా నలయఁ
బెల్చన నంతఁ గూడ దుండఁగన్.
భార. ఆది. ౭. ౧౩.

౪. బిగ్గరగా, ఉచ్చైస్స్వరముతో.

మ. అనినం బెల్చన నవ్వియమ్మునులతో నాతండు
నమస్కారుం, డనుశాసింపఁ బ్రభుండె . .
హరి. పూ. ౨. ౧౦౪.

ఉ. ... లవలీదళగండమండలిం, దనుఁగవ
కావ్యముల్ దొరఁగఁగా నట దేవ్యా

బాణరాశిత్ర పెల్చిన ..వంచనాఘనతుహినా
విహారపరికల్పితగద్గదకంఠవైఖరిన్.
విప్ర. ౩. ౬.

**పెల్ల.** వి. మంటిగడ్డ, బెత్తిక.

శా. ఎల్లిం జంద్రికమించు నీరధము వాఁడెవ్వాఁడు
దిక్కిత్తులం, బెల్లల్ రాలెడు నిష్ఠురస్ఫురిత
గంభీరాటహాసంబునన్.
భా. రా. యు. ౧౦౧౭.

మ. ..రదఘాతోత్థితరాజతాచలరజోవ్రాతంబు
నిండారుకొ,ముడిగొ దిక్కులఁ బిక్కటిల్లఁ
దనకొమ్ముం జమ్ములకా వీడు పెల్ల దివింజం
దరుఁడై వెలుంగ ...
భోజనుతా. ౧. ౬.

**పెల్లగించు.** స. క్రి. (√ పెల్లగిల్లు.) ౧. (వృక్షపర్వతాదులను) ఉన్మూలించు, పెకలించు.

సీ. బిందుసరంబులోఁ గుందనంపుందమ్మి పేము
లేకుండఁగఁ బెల్లగించి.
ప్రభా. ౧. ౧౨౦.

ద్వి. పృథుశక్తి రజతాద్రి బిగియారఁబట్టి,
పృథివి వేయఁగ నూఁచి పెల్లగించుటయు.
రం. రా. ఉ. ౩౫. పా. ౨౪. పం.

వ. ... అతండొక్కతరువుఁ గరయుగళినిజియం
బట్టి పెల్లగింప. మనుచ. ౪. ౧౧౫.

ఊడఁదీయు, పీకు.

మ. ... దీర్ఘసటాఝూటముఁ బెల్లగించుగతి
సాంద్రక్రోధిఁ గిమ్మన్ వెరం,బు నితక్రూర
భటన్నభావకులు ... అము. ౪. ౨౨.

౩. కదల్చు, ఊఁచు.

గీ. ఏడుపాతాళములును గగ్గోలువడిరొఁ, బెల్ల
గించి మహీధ్రంబు పెకలిసప్ప, డిందిరా
భర్త గిరి మోఁదికెత్తినప్రుడు గ్రక్కదలసాగ
బ్రహ్మాండకర్పరంబు. (కూర. ౨. ౪౬.)

౪. పెల్లలు లేచునట్లు త్రవ్వు.

చ. భయ మనుతోల్లికన్ విమలభాసురభూధరఁ
బెల్లగించి భక్తియ నెడుని త్తుఁ బెట్టి ప్రతిధీ
నదిసమ్మదవారిజల్లఁగాఁ, నయమున నంకు
రించుచు నవల్ గొనలై యొలమిం
జెలంగి కాళ. ౪. ౧౨౨.

౫. కలఁతనొందించు, క్షోభపెట్టు.

ఉ. వారలఁ గాంచి శోక మనివారణఁ జిత్తము
పెల్లగింపన, క్కారవసత్తముం డెలఁగు
గద్గదికం బగులంగ నేడ్చుచుం ..
భాగ. మా. ౧౧౧.

**పెల్లగిలించు = పెల్లగించు.**

క. మగబొమ్మఁ జూడ నొల్లని, ముగుదతనం
బెల్ల మూలకుట్టుగ నిఁక పెల్లగిలించు
కొంటి కవిక. ౩. ౧౦౧.

**పెల్లగిల్లు(లు.)** అ. క్రి. (√ పెల్ల.) ౧. (వృక్షపర్వతాదులు) పెకలు, ఉన్మూలితమగు.

గీ. . . పుడమి వగులఁ, బెల్లగిలి కూలెఁ దరు
వులుఁ గొల్లలెల్లఁ గూడఁబడిరి .
హరి. పూ. ౫. ౨౪౩.

సీ. వితతనిశ్శ్వాసమారుతఘట్టనంబునఁ బృథ్వీధరం
బులు పెల్లగిల్ల ... కాశీ. ౫. ౧౩౦.

గీ. అవని యొక్కెడ పొంబుకళ్యాణశోభఁ, బెల్ల
గిలి నట్టి దేవుని పేరివాని, కెండ్లికోక పట్టనం
బైనఁ బెల్లగిలదె, యంచు భీష్ముండు నగియెఁ
దాలాంకుఁ జూచి. దశా. ౭. ౧౩౬.

శా. .. అవ్వీఁడు దుర్వారగర్వారంభంబున
గంగలో వయిచువాఁడై ఘోరనీరంబు
ప్రాకారాంతంబునఁ గొన్ని పెల్లగిల
మ్రగ్గఁడమై దివ్యంగన్. (హరి. ౪. ౧౦.)

౨. ఊదు, ఊడిపోవు.

వ. . . శాశ్వరా నీవు వైశ్వానరునిసప్త జిహ్వాపల్లవంబులు పెల్లగిల గిల్లితి ..
భీమ. ౩. ౨౧౧.

సీ. ఒకమునీశ్వరుపిల్ల నిక పెల్లగిలఁదీయు,నొక్క కరాగేంద్రునిముక్కుఁ జదుము.
సీతావి. ౧. ౨౬.

౩. పాఱిపోవు, పలాయితమగు.

శా. వానిమ్రాతంగంబుం బడ నేసి వాఁ డొఱగుచోఁ దన్మస్తకం బుర్వి డొల్లం గలిగిధమెుప్పు నేయ బలమెల్లం బెల్లగిల్లెన్ వడిన్.
భార. ద్రో. ౧. ౩౧౩.

మ. రారాజు సైన్యంబు లొక్కొక్క మొగిన్ బెల్లగిలంగ బట్టడర బ్రోధాంతరింగింబు తోన్.
భార. కర్ణ. ౨. ౩౫౨.

వ. పెల్లగిలక కయ్యంబు సేయువారును
విక్ర. ౪. ౯౮.

౪. చలించు, కలఁగు, క్షోభించు.

గీ. భీష్మునంపఱ కోర్వక పెల్లగిల్లె, శంఖులోడి రథావళి జలదపంక్తి, భూరిమారుతహతిఁ దూలపోవునట్లు, పఱచెఁ గని క్రీడి. యుద్ధంబు పఱపెఁ జేరు.
భాగ. భీష్మ. ౧. ౨౮౭.

ఉ. సేనలు పెల్లగిల్లి పఱచెన్ దశకంఠుఁడు కోట దగ్గఱంగా నడచెన్ మణిస్ఫురిత కాంచనతోరణకాంతిఁ జూచుచున్.
నిర్వ. ౪. ౫౩.

సీ. ఉల్ల మెల్లను బెల్లగిల్లి వింశతిరూపభారి తేంపఁడవను విదాహు నెంద వె.
హై. భా. ౮. ౧౭.

౫. పేడెత్తు, పగులు.

మ. ...చుక్కలు రాల నద్రి పెల్లగిల్ల ... పతి శౌర్యం బెట్టి వాపోవఁగన్.
ఉ. రా. ౩. ౮౫.

౬. నశించు, చెడు.

చ. తలఁపులు వీక్క చీఱువడి తాల్ములు పెల్లగిల్లంగఁ . .
హరి. ఉ. ౩. ౮.

వ. ... నందభూమీశ్వరునకుం దగుతెఱంగున నత్తెఱం గతిలంగించిన నతండు ధైర్యంబు పెల్లగిల్ల
విక్ర. ౩. ౧౦౬.

౭. వినఁబడు, బయలుపడు.

చ. అడుగవుగా త్రిశిర్షుని గుణావళి వానితపంబు వెన్నునిం, బడసెఁ బ్రసన్నుఁగా హరికృపం గృప గల్గి జగద్రహస్యముల్, పెదతలనున్న కిన్నమునఁ బెల్లగిల నృకలాగ్రవేదియై, షడిసనినాఁ దతం దతని సంగరికాలమ మోతు కాలమున్.
కకు. ౫. ౧౦౧.

జః పెల్లగించు.

పెల్లారు. అ. క్రి. (√పెల్లు.) అతిశయించు.

క. ఎల్లారిఁ బ్రోవఁ గరుణం, బెల్లారిన కల్పవల్లి ప్రియకరలీలా,సల్లాలిత యనఁదగు శివు, నిల్లాలి వధూమతల్లి నీశ్వరిఁ గొలుతున్.
శివలీలా విలాసము. ౧. ౧౨౫.

ఉ. ఆ రుచిరాంగిఁ జూచి యునయంబుచు దక్షుఁడు సమ్మనంబులో, నీరమణీలలామ మున శిష్టగతిం బ్రతివచ్చునాథు సే, నారసి యే క్రియం బరిణయం బొనరింపఁగఁ గాంతు నంచుఁ బెల్లారు విచారసాగరమునందు మునుంగుచుండె నంతటన్.
శివలీలా విలాసము. ౧. ౧౬౦.

పెల్లిదము. వి. (√పెల్లు.) అతిశయము.

క. ఒదవెడు తృష పెల్లిదమున, వదనము వఱ వట్టి వట్టె ...
భారి. విరా. ౧. ౮౮.

విణ. అధికము, బహుళము.

ఉ. తదవసరంబునకా వెలుచు వాని సుమాలి
యుపేంద్రుపైఁ బటుప్రదరము లర్థి మద్రి
శిఖరంబును వారినిముంచినట్లు పెల్లిదముగ
జేసె నిర్వ. ౩. ౨౩.

పెల్లు. వి. (సం. పులక్. త. పెలక్.) ౧. అతిశయము, ఆధిక్యము.

క. దారుణకల్పాంతమరుత్ప్రేరిత హవ్యవహుల
శిఖల పెల్లిది యని... (భార. ఆది. ౭. ౩౯.)

ఆ. అశ్వసుభటతతులయుంగి ఖండంబులు, రుధిర
కర్దమమున ద్రుంగియున్న, పెల్లు చూడ
రౌద్రబీభత్సకరుణభ, యానకైక హేతువయ్యె
నధిప. భార. ద్రో. ౧. ౨౪౯.

గీ. ఎసగుచాకటి పెల్లున నిందునందు, వదవఁ
జరియించి యాహార మబ్బకునికి, నలసి యొక
జంబుకంబు భాగ్యమునఁ గాంచెఁ, గలహ
మొనరించి పోయినకదనభూమి.
నా. పంచ. ౧. ౧౪౯.

౨. ఉద్రేకము.

ఉ. ఒక్కనగంబు వచ్చి నినదోద్ధతి నొక్కట
దిక్కటాహముల్, పిక్కటిలంగఁ బెల్లున
గుభిల్లున కుక్షిమతీస్రవంతి పేర్చక్కన ద్రావి
యాఁగ భువనావళి నుద్భటవింధ్యశైఖరిణా.
వసు. ౨. ౧౪౬.

౩. ఉరుటు, ఉద్ధతి.

శా. చెల్లింపం దగు నీకు నీప్రతిన నాచేఁ జావు
సిద్ధంబు నీ, కెపెల్లం బొలియించు శక్తి
యని మస్ఫీతంబుగాఁ బల్కుచున్.
భా. రా. యు. ౧౫౪౯.

వ.... పెల్లం బగు పెల్లుమాప ద్రుళ్ళించుచు...
అచ్చ. రా. యు. ౩౬౪.

౪. విధము, రీతి.

చ. పిడుగులపిండుబ ట్టులియఁ బెల్లునఁ బార్థుఁడు
శంఖు మెత్తెనా.
భార. విరా. ౪. ౧౪౧.

వ. ... కదలి పెల్లి విరిపిన పెల్లున సకలబలంబులం
గూడుకొని . రా. వి. ౫. ౭.

౫. గుంపు, సమూహము.

గీ. తెలియ రసవంతమగు కృతి తెలఁగ నేర,
దల్పరసకృతి తెలఁగుమ దల్పు తెల్లఁ,
దెలుకువిడిచినరసమున తెలఁగిరాక, పిప్పి
కరగదు నీఁగల పెల్లుపోలె.
కు. షం. ౧. ౩౦.

సీ. దర్పంబు గమఁబాటు దాఁకకుండఁగ గొడు
గుల పెల్లి ఖచరద్యుక్కొటి నాఁగు.
భార. భీష్మ. ౭. ౧౧౯.

౬. ఆస్పదము, నెలవు.

ద్వి. వినయంబు చేత వివేకంబుకోట, యనురక్తి
యిల్లు సుదాత్తత పెల్లు, బసవఁడు కేవల
భక్తుఁడేయనుమ. (బస. పు. ౭. ౧౩౪. పం.)

సీ. విభవంబులకుఁ బెల్లు విద్యల కొరగల్లు
పురమంజులక్ష్మికిఁ బుట్టినిల్లు.
శివద. ౧. ౧౬.

విణ. ౧. అధికము, బహుళము.

క. భారతవర్షమునకుఁ గాఁ, గౌరవులును
బాండవులును గాంతుం గడుఁ బెల్లై రావి
యొండొరులతోఁ, బోరం దగిరి .
భార. భీష్మ. ౧. ౭౭.

చ. బిసరుహపత్రలోచనకు బెల్లగు మోహము
సంఘటిల్లె ... పారి. ౧. ౧౦౦.

శా. ... పిల్లలుం బిల్లగో ప్పెల్లో యంచు ...
రా. వి. ౩. ౧౪.

౨. ఉప్పొంగినది, ప్రవృద్ధము.

క. అని యిరుదేవతా ప్రార్థనమ్ము వాదిమకవి
వినుతముఁగా వించి నిలిచి పెల్లగుముల్లం, బు
నందు నీతోఁక పురాణముం జెప్పంగన్.
జై. భా. ౧. ౪.

క్రి. విశే. మిక్కుటముగా, అత్యంతము.

క. దోర్లీలుతలయును దునిసెడు, విల్లును ధర
కొఱగుమేను విఱిగాడిసిరము, పెల్లి దొరఁగు
నెత్తురునై, పల్లటిలందొడఁగె నపుడు
పాండవబలముల్. (భార. భీష్మ. ౪. ౨౪౦.)

సీ. ... పేదలై పెంచుట కలయంగఁ బెల్లి
పుట్టు, దురు ప్రజ తంతయు విరిగలవారు
గోరంగఁ బుట్టరు
భార. శాం. ౧. ౨౧౬.

ఙ: పెల్లారు, పెల్లిదము, పెల్లుకొను, పెల్లున,
పెల్లుమీఱు, పెల్లెత్తు.

పెల్లుకొను. అ. క్రి. (పెల్లు + కొను.) అతిశ
యిల్లు, విస్తరిల్లు.

క. పెల్లుకొనఁ గురిసి రప్పుడు, దల్లుగఁ దమ
చూడ్కులకును దలమిచ్చు మ ఘూ, వల్లభుఁ
పైఁ బురభామలు కొల్లలుగా లాజమిళిత
కుసుమాంజలులన్. కవిక. ౩. ౧౬౦.

వ. ఎల్లెడలఁ బెల్లుకొని యుల్లంబులు జల్లనం బిడు
గులు వడం జేసియు ..
జై. భా. ౨. ౨౪.

పెల్లున. క్రి. విశే. ద్రు. (√పెల్లు.) అత్యంతము,
మిక్కిలి.

క. తనరాము లేదు నుప్పురి, పెనముల నీరులును
బోలెఁ బెల్లున నుడిగెన్.
కు. సం. ౬. ౪౧౨.

ద్వి. పృథివిపై విప్రులు పెల్లునఁ జూచిఁ ప్రథమ
యుగంబునఁ బృథువుఁ జింతించి.
రం. రా. ఉ. ౧౫౪. పా. ౧౫. పం.

క. కల్లలకెల్లను బుట్టిన, యిల్లనఁ బెల్లువఁ
తెలంగు నెఱిమీఁదుల కే, బల్లిదులం గొలి
యెగుదురె, తెల్లంబుగ నొకటి నీకుఁ దల్పెద
వినుమా. అచ్చ. రా. బాల. ౧౦౪.

పెల్లుమీఱు. అ. క్రి. (పెల్లు + మీఱు.)
అతిశయించు, అగ్గలమగు.

ఆ. ఓకిదోసకారి యెదుగనిక్రొవ్వునఁ, బెల్లు
మీఱి జగముతల్లియైన, ధ్రామకోలపుసామి
మద్దియ నిటు లేల, కొంచుఁబోయె దిపుడు
కొంకులేక. అచ్చ. రా. ఆ. ౬౯.

సీ. ఐరావతగజంబు వాతోహణముచేయ నొల్లని
మాంద్యంబు పెల్లుమీఱ. సుద. ౩. ౬.

పెల్లెత్తు. అ. క్రి. (పెల్లు + ఎత్తు.) అతిశయించు.

ఉ. . మది నల్లనిల్లి పెల్లెత్తినకేదృ
నష్వరమహీరుహముం దనసొమ్ము సేతలై,
చిత్తన కేఁడెఁ జిత్తవిభు వేకొని యచ్చకు
రుండుఁ జెచ్చెరన్.
హరి. ఉ. ౪. ౨౦౪.

పెళపెళ. వి. విఱుగుట, ఉఱుముట, అర్చుట,
వానపడుట, మొదలగువానియందగు ధ్వని కను
కరణము.

గీ. విఱిగి పెళపెళ ధరఁ గూలె విపినతరులు.
ఉ. రా. ౨. ౪౪.

చ. పెళపెళ బల్లెముల్ విఱిచి భిల్లులు తల్లడ
మంద నద్దలిన్ దలలను ద్రెంచి లేచిపయి
వచ్చుకిరి ద్దోర నొంచెఁ దూపునన్.
ఉ. రా. ౪. ౪౧౫.

చ. పెళపెళ మబ్బు వి ట్టుఱుము ..
అము. ౪. ౧౦౧.

క. . . అడిదముఁ గొని, బెడిదముగా నఱికె
వాఁడు పెళపెళ నార్చెన్.
శశా. ౫. ౨౭.

ద్వి. పె ళ్ళనుఱుంకుల బెదరి యాపిట్ట, కల్లు
టదర వాకాశంబు ముట్టె.

ద్వి. వ. సారంగ. ౧. ౧౧. పా. ౧౩. పం.

ద్వి. అసురులచేతిశస్త్రాస్త్రంబు లాడిసి, పెనఁ
బుచ్చి పెల్లున విఱుకురు కపులు.

రం. రా. యు. ౪౨౧. పా. ౫. పం.

ఉ. బెబ్బులిగొంతుద్రొ ల్గఁ జుచి పెల్లున మార్మొర
ద్రొళ్ళి దాఁటుచూ ... ఆము. 3. ౨౦.

పెల్లు² = పెడలు, పెరడు. వి. గృహాపృష్ఠ
భూమి, దొడ్డి.

క. పెర దనఁ బెర లనఁ బె ళ్లనఁ, బరఁగ
గృహాపృష్ఠపేరు (ఆం. భా. ౨. ౧౯.)

ద్వి. నీ కేల పలవింప నీకుమారునకు, నీకును గాఁ
జేర నేఁ డిల్లుఁబెల్లు.

ద్వి. హరిశ్చ. ఉ. ౧౮౫.

(ఇల్లుఁబెల్లు, అనఁగా సర్వము అని భావము.)

పెల్లు³. వి. కంచెకును ఇండ్లగోడలకును అడవి
ప్రదేశములందుండువారు ఉపయోగించుకొను
చివుకక గట్టిగానుండెడు ఒకజాతి పెంకు.

చ. గొతియలమంద యాఁ బసులగుంపు కృషి
క్రియదుక్కి టెడ్లదా, డ్డిణికెడు పెళ్ళుకంపబలి
యించినలోఁగిలి ముల్లుపెండెమల్, తఱ
పులగాఁడి కోడియులదా మెన గాదెల్లుగొల్చు
గర్గి రొ, కొంఁతియ తేకయుల్లు కొక
గొల్లత ... వేం. పంచ. ౧. ౫౮౩.

పెల్లెము. వి. మద్యము చేయుటకు అనేక వస్తు
వులు చేర్చి చేసినపిండి, పేదకము.

గీ. ... చెలఁగు పేదకముపేరు, పెళ్ళె మనఁ
గను ... ఆం. భా. ౨. 303.

పెసర = పెసరు. వి, ముద్గసస్యము. ?.

వ. .. కందియుందంబును పెసరపిరియును
మినుముఖలంపును .. భీమ. 3. ౫౪.

గీ. ... ఎఱకెల్లకంది చిర్నవగ జొగ, పిత్త
వలవత్పటము పిల్లపెసరగాయ, మల్లు ...
హంస. ౪. ౧౨౪.

జ: పెసరగింజ, పెసరపప్పు.

పెసరగింజే. వి. (పెసర + గింజ) ముద్గసస్య
బీజము.

గీ. అది విహంగము కేను విహంగమంబఁ బెసర
గింజకు దక్కువే పెసరగింజ, యబల యిటు
చూడు మప్పుడియుద టదంతుఁ గుటిల
చంచూపుటకోటికట్టినములు.

కాశీ. ౩. ౨౯౩.

పెసరప(ర్ప)పు, పెసరుఁబప్పు. వి.
(√పెసర.) ౧. ముద్గసూపము.

సీ. పలుచగా వండినవలిపెంపుఁజూఁపట్లు పెసర
పప్పులతోఁ బెనఁచి పెనఁచి.

హైమ. ౩. ౧౨౦.

ఉ. కప్పురభోగివంటకము కమ్మనిగోధుమపిండి
వంటయున్, గుప్పెడు పంచదారయును
గ్రొత్తగఁ గాఁచినయాలచే పెసర్పప్పును
గొమ్మువల్లనఁటిపండ్లును వాలుగుపైదుమంబా
లున్, లప్పలతోఁ గ్రొంబెరుఁగు లత్మ్మణ
రొుల్జలయింట రూకకున్. క్రీడా. ౧౩౩.

క. పెసరుంబ ప్పేమిటికని, కసరు స్నెయి
గొనఁడు పండుగను గొయకూకే, కొసరుం
బులుచనిచల్లరు, మెుసరుం గనఁ దతనిలోభ
ముఁన కే మందున్. బహు. ౫. ౮.

సీ. పెసరుఁబప్పును బాలుఁ బెరుఁ గోగిరంబుఁ
బాయసాన్నంబులు పానకంబుఁగీ. ... వాది
గా భక్ష్యభోజ్యలేహ్యాదులైన, బహుపదా
ర్థంబు లర్పించి ప్రణుతు లైరి.

శూర. ౩. ౫౯౧.

**పేఁడు = పేను¹.** స. క్రి. (దారము పేను.) పేను. (శ. ర., గ్రా.)
(వ్యవ.) ఆమె తొడమీఁద దారము పేఁడు చుండెను (గ్రా.)
జ: పేఁట.

**పేక.** వి. వస్త్రముల నేతయందలి యడ్డనూలు.
ద్వి. తొడయందుఁ బొడముపాఁతూలఘుట్టవలఁ, బడుగుఁ బేకయుఁబోలెఁ బడ మహీజములు.
రం. రా. సుం. ౭౦౧. పా. ౧౯. పం.
రగడ....పాలిఁ డాఁగెను సన్నపుఁ బేకల్
బహు. ౨. ౧౩.

**పేగు(వు) = ప్రేగు.** వి. ఆంత్రము. (శ. ర., గ్రా.)
విణ. దగ్గర సంబంధము కలవాఁడు
(వ్యవ.) అది నా పేగు కదుక సామనము కాళి లేదు. (గ్రా.)
(వ్యవ.) మే మందఱము నొకపేగు. (గ్రా.)

**పేచకము.** సం. వి. అ. పుం. ౧. గుడ్లగూబ, ఉలూకము. ౨. గజపుచ్ఛమూలోపాంతము, ఏనుఁగుతోఁక మొదలిసమీపము ౩. పర్యంకము, మంచము. ౪. మేఘము. ౫. యూకము, పేను.

**పేచకి.** సం. వి. న. పుం. ఏనుఁగు.

**పేచి(చీ).** వి. (హిం. పేచ్. క పేచ.) చిక్కు, బాధ.
(వ్యవ.) వానితో దినదినము నేదియో పేచీ వచ్చుచునే యున్నది.
జ: పేచీకోరు.

**పేచిక.** వి. ఒకానొక చెట్టు.
(శ. ర. జారగడ్డి, అని గ్రా.)

**పేచిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఆఁడుగుడ్లగూబ. (వై. ని.) ౨. పింగళి యను సంజ్ఞగల పక్షి పైఁడికంటి. (శే. ని.)

**పేచిలము.** సం. వి. అ. పుం. ఏనుఁగు.

**పేచీకోరు.** విణ. (పేచీ + కోరు. హిం. పేచ్ ఖోర్.) పేచీలుపెట్టువాఁడు, తంటాలమారి.
(వ్యవ.) వాఁడు పేచీకోరు.

**పేచుకము.** సం. వి అ. న. పేచులి. (త్రి. ని)

**పేచులి.** సం. వి. ఈ స్త్రీ. వాడీచశాకము. కీ. (త్రి. ని.)

**పేచువు.** సం. వి. ఉ. న. వాడీచశాకము. కీ. (త్రి. ని.)

**పేట.** సం. వి. ఆ. స్త్రీ మంజూష, పెట్టె.

**పేటకము.** సం. వి. అ. పుం. కదంబకము, సమూహము.

**పేటన.** వి. (సం. ఖేదనమ్.) బాధ, చిక్కు.
(మా. పేటనపెట్టు.)
జ: పేటన పెట్టు.

**పేటనపెట్టు.** అ. క్రి. (పేటన + పెట్టు.) ౧. చిక్కు కలిగించు, బాధకలిగించు.
మ. అవలోకించి వయస్యలార కడురమ్యంబైన యీతోఁటలోన వినోదింతము గొన్ని నాళ్లిటుఁ బెంటపెట్టు నీపాపిగాంధ్ర వృథాసందడి గాసిఁబొంద జన నేలా పొంత పోవంగఁ జేయవలెం బేటనపెట్టియుండు నెమనం బై భీకరప్రక్రియన్.
వరాహ. ౧౧. ౬౫.
(వ్యవ.) వానిది రోఁదో పేటనపెట్టుస్వభావము కాని యూరకుండుస్వభావము కాదు.

౨. ప్రయత్నించు.

చ. పయిఁబయిఁ బందుకొల్ప విరిపైఁడి కసు
గట్టిదినుమన్న కోయిఁ,పృయ మత్తే బంటు
బానిసలఁ బైరయఁ బెయ్యఁబుఁ జేసఁ
జెట్టు లోనయిన సమస్తసంపదలు నన్ను విశీ
ర్ణకి వెచ్చపెట్టఁగాఁ,ప్రియలు ధరించు
సొమ్ములఁ జేటనపెట్టఁ జలింప కంకటన్.
కళా. ౬. ౨౫. (పేటనఁబెట్టె నూకనముద్రి.)

పేటము. సం. వి. అ. పుం. ప్రహస్తము, చప్పెట, ప్రతిశ్చాఁచినయఱచేయి.

వ. ౧. కంకోలము, పెద్దగంప. ౨. పేటిక, పెట్టె. ౩. సమూహము. ౪. పరిజనము. (విలియమ్సు.)

పేటాకము. సం. వి. అ. పుం. = పేటకము.

పేటాడు. స. క్రి. (పేటు¹ + ఆడు ఇది, కొన్ని పట్ల 'పెటుకు' ధాతువు నంటి ప్రయోగము లందుఁ గన్పట్టుచున్నది.) ఖండించు, త్రెంచు.

సీ. మదము గ్రాలంగ సామజయూధనాథుండు
గమలినిఁ బేటాడఁగడఁగుచుండ్కెఁ.
భా. రా. యు. ౧౪౦౪.

సీ. త్రేవులు గండలు పెఱికి పేటాడి యంగదుఁ
గొని మెదళుల గల్పికొనుచు.
భార. ద్రో. ౨. ౯.

సీ. అంకఁ ద్రికూటాచలముతోన ముస్నిటఁ
బెఱికి పేటాడి కైపింతు మసుకు ...
భా. రా. యు. ౨౦౩.

౨. క్రి. ౧. పెనఁగులాడు.

మ. పెనరుంగాయమున కొత్తకమ్ములకునై పేటాడు
మున్గొల్లెన్. శా. వి. ౨. ౩౫.

౨. అతిశయించు.

ద్వి. గోవులు పేటాడు కొనరు తిట్టులకు సం
పంగి భంగింపఁజాలుబాచకుడు, కొక్క ...
అ. మ. క. ౩౧. పా. ౨౩. సం.

ద్వి. వాటమై మిగులవిద్యుత్కుదంబములఁ, బే
టాడు సారాజకోలగంబు.
ద్వి. పరమ. ౫. ౩౭౦. పా.

పేటి(టీ). వి. (క. పేటీ. త. పేటు) నడికట్టు, సారసనము.

గీ. .. పేటి నాఁగను దనరుఁ, సారసన
సంజ్ఞ ... ఆం. భా. ౨. ౨౦౪.

పేటీ. సం. వి. ఈ. స్త్రీ. చిన్నపెట్టె.

పేటిక. సం. వి. ఆ. స్త్రీ. ౧ చిన్నగంప. ౨. చిన్నపెట్టె. ౩. తుపభేదము. ౪. సమూహము. (శ. ర.)

పేటిలు. అ. క్రి. (√పేటు¹.) తీఁటలువాఱు, పగులు.

మ. . ఉత్పృటన భుజంగస్థానలోకంబు
పేటిలఁగాఁ జేయుత్రయీవిభూషు విసఁ
బాకినప్రభుం గొల్చెదన్.
భార్గవపురాణము. ౩. ౧౯౫.

పేటు¹ = పేడు. వి. (సం. భేదః ?) తీఁటిక, బత్తిక.

చ. ఒకవాఁడు కత్తురిం,గొని యిడు బోటు వా
కనుచుఁ గొర్కి సొసంగినఁ బెట్టుచుండఁ
బ్రొబ్బినుచు కెంగరిబు ప్రకీనటుకోకన
యనూర్పుల నిండి యింకిపోయిన పలుపేట్లు
గోరఁగొని రొం త్తొక పట్టెను మాటిమాటికిన్.
అము. ౫. ౬౨. (వేంకట్రా. ముద్రి.)

సీ. పరువేద సారసిపోవఁగఁ బెట్టినట్టి గంధపుఁ
బేట్లతో నొప్పు నఖపదములు.
ప్రభా. ౫. ౬౨. (వేంకట్రా. ముద్రి.)

సీ. పొంగు గంధవుఁ బేటుకొలుగులం బిరమ్మ్రద
రుచులుగా జాగరారుణ్యో మదర.
భోజరాజ. ౩. ౧౦౮.

జ: పేటించు, పేటెత్తు, పేట్రేగు.

**పేటు²**. వి. వేట కుపయోగించు నొకానొకసాధనము; కుతంత్రము, మాయోపాయము.

ఆ. ... మిల్లు వలలు పేట్లు గోళ్లు దీమంబులు,
వాదిగాఁగఁ దెచ్చి రాటవికులు
పి. శకుం ౧. ౧౧౭.

క. పేటెత్తి విపులతో విసి,వో టగు పదు
పాయ మొకటి పుట్టింపఁదగుఁ,బో టాడ్డి
యైనఁ దాఁ గను,చాటున నుండంగి వేఁట
పలిపెడుచోఁ. కవిక. ౨. ౪౪.

జ: పేటాడు.

**పేటు³**. వి. (క. పేట్టు) సరిగ లోనగువానితో నేసినపట్టు. (శ. ర.)

**పేటు⁴**. వి. పర్వత శిఖరము. (శ. ర., బ్రా.)

సీ. శిఖరాఖ్య దొప్పుచు సిగరము గుబ్బ పే
టనఁ ... ఆం. భా. ౨. ౩౦.

**పేటె(టుఎ)త్తు = పేడెత్తు**. అ. క్రి. (పేటు¹ + ఎత్తు.) ౧. చిటులు, చీఁటలువాఱు.

గీ. పెదవి పేటెత్తు నాలుక పిడుచగట్టు,దాహ
మున కుదకము లేక దడదబ్బ నేని .
దశా. ౨. ౧౩౭.

ద్వి. పెనఁకువ నది తొల్లి పేటెత్తి యుంటఁ,
గని నీవు నిటిచితిగాక భూనాథ.
రం. రా. బాల. ౯౦. పా. ౪. పం.

వ. ... ఇంపారు కలపంబు లబ్బాటునన్ బేటు
లెత్తి దొండోరుల దొత్తడిన్ బోడిపాడి
రై ... మనుచ. ౫. ౬౧.

క. అలఁదిన చందనంబు వృథయౌఁ జెమరింపఁగ
సమ్మదాశ్రులన్, దోలఁచినయట్టు వోయెడుఁ
గనుంగవ కాటుక చేటుగెత్తెఁ జెక్కుల
మకరీవిలాసము గరగొప్పడుచ నెన్నారిఁ బాచు
కెఱలోఁ,చలి కయినేయకమ్మ యని చేడియ
యొక్కతె విర్బ చెచ్చెలిన్.
పారి. ౩. ౧౨.

౨. తొలఁగు, స్థానభ్రంశము నొందు.

క. క్రేటుకుకు వాఁడుఁ బిడికిటఁ, బోటుగొనం
గిటి పట్టి పారి బ్రాణంబుల్, పేటెత్తి
నెత్తి మృతి క,ప్పా టొక్కఁడ చాల నేలఁ
బడనైచి వడిఁ. భా. రా. యు. ౬౨౮.

సీ. అప్పుడు చిట్టు ముత్తాము గోరకలను దమ
కంబుచే నైన కత్తరము లేఁ, బేటెత్తి విలు
కడఁ జెదఁబాయు పిగ్గుల నొక్కెంత
సుత్తూఁక లూఁగఁ దారి. విప్ర. ౩. ౯౮.

౩. తగ్గు, క్షీణించు.

మ. . పేటెత్తిన లజ్జ సంప్రమికటకంబుల్
ప్రోయు . మనుచ. ౨. ౩౯.

౪. అతిశయించు.

క. పా పెరుఁగని పతితోలంపును, గూటంబున
కొలుఁకపడని గోమలి రతియుఁ, బేటెత్తఁ
జేయు చెలిమియు, నేటికి నెదు రీఁదినటు
లెన్నఁగ నుమతి. ను. క. ౬౯.

**పేట్రేఁగు**. అ. క్రి. (పేటు¹ + రేఁగు.) చెలరేఁగు, విజృంభించు.

(వ్యవ.) ఆ యూరిలో దొంగలు మిక్కిలి పేట్రేఁగి యున్నారు.

(వ్యవ.) భయభక్తులు లేక వాఁడు పేట్రేఁగి పోవుచున్నారు.

**పేడ**. సం. వి. అ. స్త్రీ. మంజూష, పెద్దపెట్టె. (వాచ.)

**పేడి**. వి. (సం. షండః. క. పేడి.) నపుంసకుఁడు, షండుఁడు.

ఆ. ... సంధ్య సుగ్రీవ పాడటఁ, గూడనేని యుతేఁడు పెడిఁ గాంచుఁ.
మార్క. ౩. ౨౪౧.

క. పువఁ పేడికి దారక్రియ్యయును పైవిటికి మధురగీతియును జీవన కృత్యమును రూప దర్శనమును జేయుటఁ బోలుఁ గృష్ణుఁ బూజించు టులఁక. భార. సభా. ౨. ౧౪.

క. చనుదెంచి పేడితనమును, వనితారూపంబు నమర వాసవసుతుఁడు ...
భార. ౧. ౨౨౯.

పేడు = పేటు[1]. వి. (ప్రా. పేండం.) దార్వాదుల, సన్నచెక్క.

సీ. ...పే దన సూత్మ దారుభేద. గీ. మగుచు ..
ఆం. భా. ౨. ౩౭.

జ: పేడత్తు.

పేడ(డియ). విశే. గడ్డము మీసము లేనివాఁడు, లేనిది.

ఉదా: పేడమూతి, మొ.(శ. ర., చి. ని., శ్రా)

పేడెత్తు = పేటెత్తు. అ. క్రి. (పేడు + ఎత్తు.) ౧. చీటలువాఱు, పగులు.

సీ. ఘుమ్మనుగందంబు బొమ్మపైవలంది యది తోఁక పేడెత్తి వలుకఁ జెండు.
పార్వ. ౪. ౧౫౩.

మ. .. మృజ్జగముల్ తల్లడమంది బ్రహ్మాదులఁ జేరి స్వాంతంబు పేడెత్తఁగన్.
మైరా. ౩. ౬౨.

౨. తొలఁగు, స్వస్థానమునుండి చలించు.

క. వాడెంపుఁబోటరి పై, పేడెత్తక పొంగిని గాచబెబ్బులితోఁ బోరాడుము ...
అచ్చ. రా. యు. ౧౧౧.

౩. పోవు, వఱుచు.

శా. .. దిగ్దానాంబరకాధిక్యముల్, భీతిం బొందిరి స్వాధికారగరిమల్ పేడెత్తు నంబాత్మలోన్. కాశీ. ౧. ౧౨౫.

స. క్రి. పీడు, వదలు.

గీ. మున్ను మాకు సహాయుఁడై యున్నవాళ్లు, మించుమదమందు నేఁ డాత్రి మించ కెంచు, నితఁడు మనుఁ జూడఁ డాళ్మి పేడెత్తఁ డీతఁ, డెంతవాఁ దని చింతిల్లి రింక లాత్మ.
రామా ౨. ౧౨౫.

పేణీ. (వి. (సం. ఫేనికా. కపేణీ.) భక్ష్యవిశేషము.

క. .. అంగరోల్లెలు మణుఁగుబువ్వలు పేణీలు నేతుల తిగెలు .. అదిగాఁ గల భక్ష్యంబులు (హంస. ౧. ౧౦౫.)

వ. .. మణుఁగుఁబువ్వలు పేణీ లొబ్బట్లు ...
ప్రబంధ. ౧౧౨.

పేత్వము. సం. వి. అ. న. ౧. అమృతము, ౨. ఘృతము, ౩. తప్తమైన భూభాగము, కాలిననేల. పుం. పొట్టేలు, మేషము, (వై. వి.)

పేద. విశే. (సం. భీత. త. పేదై.) ౧. పిఱికి, భీరువు.

ఉ. పేదమన సగుట ధర్మువుగాదు నరేంద్రునకు జగము గావం బ్రోవంగాదె
భార. శాం. ౧. ౬౧.

గీ. హంసడిభకులు లోనుగా సఖిలధరణిఁ, బెరుగుకింటకళోటిచేఁ బేదలైన, నగపతుల కీర్తిపటములు చిరుగకుండ, పెరవుతో సుద్ధరించినవేల్పు కారి. ఉ. హరి. ౪. ౨.

౨. అశక్తుడు, అసమర్థము.

వ. ... ఇ ప్పేదగుఱ్ఱంబు లతిదూరం బెట్లు పోవనోపు. భార. అర. ౨. ౧౮౫.

క. అస్త్రశస్త్రవ్యస్తంబు లుదయుం బరథర్యాద
యుంబు క్రాంతం బకించనంబు గంధమాద
నంబు పేద . కాశీ. ౧. ౧౦౦.

౩. దరిద్రుఁడు, లేనివాఁడు.

క. పేదలకును సాధులకును, వేదములకుఁ
దాపసులకు పేరోల సమస్తాదిత్యులకును
వందను, కాద బ్రదుకఁ జేయు రాజా
గావింపంగన్. భార. శాం. ౧. ౯౩.

క. పేద విధానము గన్నట్లు ...
కు. పం. ౩. ౩౨౩.

ఆ. పేద యైన ధనుడు పెద్దయై చను,
గాయమునకు పెచ్చు మల్పమైన .
విక్ర. ౨. ౧౮౧.

౪. సౌమ్యము, అనుద్ధతుఁడు.

క. తాపోముఁ జంపఁ బ్రదుకుసె, సాపుత్రుఁడు
విడువు మర్జునక సావుడు వాఁ, డీపేదమాట
తెల్లను గోపవిదకుఁడైనవాఁడుఁ గొలుపవు
ముగ్ధా. భార. అను. ౧. ౧౧.

గీ. ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిఁ జూచి,
తరుణి తనుమధ్య మెచటికో తలఁగిపోయె,
నుండదేనియుఁ గనబడకున్న యహహా,
యుద్ధతులమధ్యమునఁ బేద యుండఁదరమె.
కవిక. ౩. ౨౬.

౫. అల్పము, సన్ననిది.

క. గురుకుచవమానభరమ్మునఁ, బోరిఁబోరిఁ బేద
తవు నలిగి పోఁబోయినతి,ద్భరవమానమునకు
భరపడు, కరిణిం జఘనంబు సతికి ఘనమై
యమరుఁ. కు. పం. ౩. ౨౯౨

సీ. కుచకుంభయుగళిఁ బ్రేఁగునఁ దొట్రుపడి పేద
కౌఁదీఁగ జవజవఁ గంపమొంద.
కాశీ. ౫. ౧౧౯.

ప్రా: పేదకోపము పెదవులచేటు.

ఆ. పేదకోప మెందుఁ బెదవులచేటుగా, కదికి
యేమి చేయనోపు నన్ను ... కళా. ౬. ౩౦,

చెవిపేద = వినుటయందు దరిద్రుఁడు; చాడీ
లకుఁ జెవి యొగ్గువాఁడు.

క. అవశ్యంబు రాజులు చెవిపేద లని పలికి ...
కేం. పంచ. ౧. ౫౩౫.

పేదసాదులు = పేదలుసాధువులు.
(పేదసాదలు. వా.)

చ. మనపురియేలు సాతనికుమారిక సజ్జనురాలు
దానిపే, రనుమతి పేదసాదులకు సారపి
యన్నము పెట్టుచుండు .
భోజరా. ౫. ౨౨౩.

జ. పేదగిలు, పేదతనము, పేదరాలు, పేదఱిక
పేదతికము, పేదతిమి, పేదవడు, పేద
వాఁడు.

**పేదగిలు.** అ. క్రి. (√పేద.) కృశించు, చిక్కు.

ఉ. కానునుం, బేద యనంగ దేహమును
పేదగిలం దుది నింక నీమనః, ఖేదము మాను
మమ్మ రసా. ౩. ౨౭.

**పేదతనము.** వి. (పేద + తనము) ౧. దారి
ద్ర్యము, సన్నఁదనము.

గీ. ఆపతివ్రత పెనిమిటి ననుసరించి, సులభముని
నిర్వాదేగ్గుర సుతులఁ గనియెఁ, బేదతనమునకే
కాద పెక్కులైన, బిడ్డల నొసంగు విధి
యొంత దొడ్డతనము. కుచేల. ౧. ౩౧.

క. గడుసువలిగబ్బిగుబ్బల, బెడిదపు భారమున
జడిసి పేదతనముతో, వడఁకెడి నీ నడుమున
కి,య్యెడ గర్భసమృద్ధి యభయమిచ్చెఁ గద
చెలి! ఉ. రా. ౬. ౧౬౩.

౨. పిఱికితనము, భయము.

ఉ. భయ మేఁటికి లబ్ధికులార యాత్మకున్,
పేదతనంబు మేల ముఱి మృత్యువు దాఁగగడి
చోట లేదొకో. కుకుచ. ౪. ౧౦౫.

**పేదరాలు.** విశే. స్త్రీ. (పేద + ఆలు.) దరిద్రురాలు.

గీ. పేదరా లవంగ దరిద్ర వెలయు ..
ఆం. భా. ౩. ౧౦౭.

ఉ. అక్కడ పేదరాలి గృహమందున .
భోజరా. ౪. ౧౪౬.

పేదరాలుపెద్దమ్మ = బీదయవ్వ.

క. ఆ రూఢి యశోద యనం,బేరుపడిన పేదరాల పెద్దమగృహముం, జేరం జని యాయవ్వయు, రా ర మ్మని ప్రియ మెలర్పం బ్రముదితుం డగుచున్. శుక. ౨. ౨౩.

(పేదరాసిపెద్దమ్మ యని వాడుక.)

**పేదఱపు.** వి. (పేద + ఱపు.) దరిద్రపుమాట, దీనాలాపము.

ఉదా: సంపదకలవారు పేదఱపు లఱచుచుందురు.

గీ. . తాన,యాకేం బలుమారుం జేరి పేదఱపు లఱచి,యును మనోజవికారవర్తనలు సలిపె
రాఘవ ౪. ౬.

**పేదఱికము.** వి. (పేద + ఱికము.) ౧. దారిద్ర్యము, బీదతనము.

క. ఒడమి గల వసెఁగు నినను, బుడమింగలవారలెల్ల భూషింతురు శ్రీ,పెడఁబాసిన దూషింతురు, కడుం బేదఱికంబుకంటెఁ గష్టము కలదే. విక్ర. ౨ ౧౪౬.

సీ. నెఱి పేదవాని పేదఱికంబు వోవు నే ద్రవ్యప్రభావకీర్తనమువలన. సీతారా. ౧. ౯౪.

౨. అసమర్థత, చేతఁగానితనము.

ఉ. పేదఱుగొన్న మానవుని వేమఱు గంటియు నిటుగాల్చియుంగా, కొందియు నీటఁ ద్రొక్కి-
యుమ ముక్కొని తీర్పఁగడంగువెజ్జున, బ్లోఁదగ నిన్ని చందముల నీకని దీర్పుటకై పెనంగితిగా, పేదఱికంబు గట్టుకొని బెట్టుగఁ జిక్కిరి నేమి సేయుదుగా.
నృసిం. ౫. ౧౨.

(ఇట్టిచతుర్థపాదమున ప్రాసము నిరనుస్వారము.)

౩. సూక్ష్మత్వము, సన్నఁదనము.

గీ. అధిక దౌహృదయసంపద వాసికొ,గంధి నడిమికిఁ బేదఱికంబు మాపెఁ,దలఁప నట్టిద యుట్టివారలకునైన, లేమికాపురముండునే భూమిలోన. వరాహ. ౩. ౭.

**పేదఱిమి(రిమ్రి).** వి. (పేద + ఱిమి) ౧. పిఱికితనము, భీరుత్వము.

గీ. తగునె యర్జున యీపెంకితనము నీకు, దండిపై లెమ్ము మనను పేదఱిమి విడిచి.
భార భీష్మ. ౧. ౧౯౨.

౨. దారిద్ర్యము, లేమి

క. ఆదినముల వ ప్పురిలో, వేదవిదుండైన విప్రుఁడు మిగులన్, బేదఱిమి నొగిలి ధనం,పాద మతి భద్రకాళిపాలికిఁ జనియెన్.
ద్వా ౧. ౪౪.

సీ. బహుధనధాన్యసంపదలసొంపు వహించి పేదఱికిని కొమ్మ వెట్టువారు
విక్ర. ౫. ౧౨౪.

సీ. కమ్మఁబువ్వులుఁ బూఁత కిలలోపలను లేక పేదఱికతమునఁ బెండ్లిలేక
నా పంచ. ౫ ౩౫.

(శ. ర., పా. పేఱిమి ముద్రి. పా)

**పేదవడు.** అ క్రి. (పేద + పడు.) ౧. దారిద్ర్యమునొందు, బీదయగు.

గీ. చెల్లియుండియు సైరణసేయు నతఁడుఁ, పేదవడియును నర్థికిఁ బ్రియముతోడఁ, దనకుఁ

గలభంగి నిచ్చువఁడండుఁ బుణ్యపురుషు
లని చెప్పి రార్యులు గురువరేణ్య.
భార. ఉద్యో. ౨. ౪౨.

గీ. ఒకబ్రాహ్మణుండు, ధనికుఁ డటు
తొల్లి యవిలంఘ్యదైవ ఘటనఁ, బిన్నదై
పుత్రు లుండంగఁ బేదవడియె.
కేయూర. 3 303.

౨. చిక్కు, కృశించు.

గీ. పదివేలగజములబలమున విలసిల్లు నవిల
మతుండు గాఁడవిలోనఁ, గ్రుమ్మరి కాయ
ముఁగూరలుఁదిని పేదవడినఁ జూచి .
భార. అర. ౧. ౨౧౫.

3. సన్నగిల్లు.

గీ. తాఁ గృశత్వము నొంది సౌందర్యమునకుఁ,
బూర్ణభావంబు గొల్పెడు పుండరీక,నయను
మధ్యంబు పక్వబింబు పొగడెఁ, బరమపద
పోషకులు పేదవడియుఁ దగరె.
కవిక ౬. ౧౪౬.

సా॰ పులి పేదవడినఁ బసులవాండ్రె యెక్కు
డుదురు

గీ. అకట మోమోట లేక తా రంత చేసి,
బ్రదికిపోయిరి పులి పేదవడినఁ బసుల,వాండ్రె
యెక్కుడి రసుకత వచ్చె
ఉ హరి. ౪ ౧౦౨ (వీరేశ. శ ర పా.)

పేదవాఁడు. విశే. (పేద+వాఁడు.) దరిద్రుఁడు, బీదవాఁడు

సీ. నెటి పేదవాని పేదతనంబు వోవునే ద్రవ్య
ప్రభావకీర్తనమువలన. సీతారా. ౧. ౯౪.

పేను¹. వి. (క. పేను త. పేన్. ఋ పేలు) తల
యందు జనియించెడు స్వేదజవిశేషము,
యూకము.

గీ. శిరమునపైఁ బేనుఁ బొడగన్నఁ జేరఁబోయి,
హింససేయకు మని చేతిఁ జిచ్చుఁ దిగిచి ... ,
వైజ. ౨. ౧౩౮.

సీ. .. పే నమంగ. గీ. నలరు యూకాఖ్య ..
ఆం. భా. ౨. ౭౭.

గీ. పెఱులఁ గలిగిన పేల నన్నింటిఁ దిగిచె.
పాండు. 3. 30.

పేను² = పేఁడు. స. క్రి. దారము మొ. కలిపి
పురియెక్కించి యేకముచేయు, పెనవెట్టు, కలి
పెట్టు.

ద్వి. బెడిదంబు గాఁగ ముప్పిరిఁ బేనినట్టు,లారు
నీలచ్ఛాయ నమర .
రం. రా. ఉ. ౧౧౭. పా. ౧౪. పం.

క. ఏనిద్రఁ జెందునంతకుఁ,దా నొల్లదు నిద్రఁ
దాల్పఁ దా నప్పుడు నా,మేను తనమేని
తోడం, బేనికొనుం జెలువ కూర్మి పెం పే
లడుగన్. కేయూ. ౨. ౫3

పేన్నీళ్లు. వి. బ (పేఁడ + నీళ్లు.) కలయంపి
చల్లుటకై పేఁడ కలిపిననీళ్లు.

సీ ఆస్థానమందు విద్యావంతులను గని బ్రాహ్మ
ణుండెడుశుద్ధమూర్ఖజనుల, తటుకున గ్రామ
ప్రదక్షిణం బొనరించి నిల్చినచోటఁ బేన్నీళ్లు
చల్లి. వేణు ౪. ౧౯. (శ. ర పా.)

పేపర. వి పక్షివిశేషము (శ ర, బ్రా.)

పేము = ప్రేము. వి. దే. ఒకజాతి బెత్తము,
వేత్రభేదము

సీ బెత్తమం చనఁగను వేత్ర మలరుఁ,
బే మటంచనఁగఁ దద్భేదంబు విలసిల్లు .
ఆం. భా. ౨. ౬౨.

చ. . గ్రామ్యతరుణీతతి డించిన పేఁపగంపలం,
దళ మగుచున్న చెంగలువదండలకా ..
ఆము ౭. ౩౫.

జ: పేముబొద్దు.

*పేముబొద్దు. వి. (√పేము.) గోడ అంచుల యందు పేమువలె నేర్పఱచెడు బొద్దు, కుడ్యాలంకార విశేషము. (శ. ర.)

పేయ = పెయ్య. వి. చూడు.

చ. నందిపోతులునుఁ దారునుఁ బేయలు సమ్మదంబునన్, గలిసి రమించు ధేనువులఁ గాంచిరి . కు సం. ౬. ౭౦౪.

ద్వి. ధీయుత విసవయ్య దేవగదాని, బేయఁ బాకము చేసి పెట్టవే యనిన ...
బ. పు. ౪. ౨౨౧. పా. ౩౫౮ పం.

పేయము. సం. విణ. (అ ఆ. అ) ౧. త్రావఁదగినది. ౨. రుచిగలది

వి. అ. న ౧. నీళ్లు ౨ పాలు. ౩. గంజి, జావ లోనగు పానీయము. (ఇది అష్ట విధాన్నములలో నొకటి) వి. ఆ. స్త్రీ. ౧. సిక్థయుక్త పేయద్రవ్యము, మెతుకులు కలిపి పుచ్చుకొనెడి పానీయము ౨. త్రాణ, కాఁపుడుగంజి. ౩. అచ్ఛమండము, స్వచ్ఛమైన మీఁగడ.

పేయువు. సం. వి. ఉ పుం. ౧ సముద్రము. ౨. అగ్ని. ౩. సూర్యుఁడు. (ఆ. ని.)

పేయూషము. సం. వి. అ. పుం., న. ౧. అమృతము. ౨. నవఘృతము, క్రొత్తనెయ్యి. ౩. ఈనిన యేడురాత్రులలోని పాలు, ముఱ్ఱుపాలు, జున్నుపాలు.

పేర. సం. వి. ఆ. స్త్రీ. ౧. వాద్యభేదము. ౨. భూమి. (వై. ని.)

పేరఁటము. వి. ౧. వివాహాది శుభకార్యములలో సువాసినులు నడపు మంగళకృత్యమునకుఁ బిలుచు పిలుపు.

ఉ. పెండ్లి నృపాలునింట నని పేరఁటముల్ ప్రియ మొప్పఁ జెప్ప నిం(డ్లిం)డ్లకు శోభనాక్షతలు హేమపుఁబాత్రలఁ గొంచుఁ బెద్దపూఁ,బోండ్లు చరించిరి .
కళా. ౪. ౫౯.

ఉ. ఎల్లియు సోఁకుటాజ్ఞ యతఁ డేపునఁ జేయును గూఁతుపెండ్లి యం,చల్లన పైఁడి పళ్లెరములందును గందముఁ బూలు పచ్చఁ గ్రొవ్వుల్, పెల్లుగ నించి పొల్తుకలు పేరఁటముఁ దగఁ జెప్పి వీటిలో, నెల్లెడఁ ద్రిమ్మరం దొణఁగి రింపుగ వాయిదముల్ చెలంగఁగన్. యయా. ౪. ౭౩.

౨. వివాహాది శుభకార్యములయందు ముత్తైదువలు వచ్చి చేయుమంగళకృత్యము.

సీ. కైసేసి శచి లోనుగాఁగల దేవపురంధ్రివర్గములు పేరఁటము సేయ.
హరి. ఉ. ౭. ౨౪౨.

క. మారారిద్రోహు నింటికిఁ, బేరంటమువచ్చి తనుచుఁ బిలుచను గోపన్, వైరమున వదిలిముక్కును భారతి నాసికయు వీరభద్రుఁడు దు(ద్రా). శివ. సా. ౩౦౯.

(పేరంటమువచ్చు = పేరంటమునకు వచ్చు అని భావము)

౩. చిరంటీత్వము, ఐదువతనము.

సీ. . చి,రంటీత్వ మెసఁగుఁ బేరంట మనఁగ
ఆం. భా. ౨ ౧౦౬.

పిలువని పేరంటము = అనాహూతముగా, అప్రార్థితముగా

చ. పొలయలుకాని యున్న పువుఁబోణులు ఖండితనాయికాలలా,మలు పదిరియ్యకోల్ వలయు మానిను లేఁటికి వచ్చెనమ్మ కాఁ, పిలువని పేరటం బనుచు బెగ్గిలి బాధులఁగాఁగి

లింపఁగాఁ, బొలుపుగనందుఁ బెండ్లినడుపుల్
నడుపున్ వలినాలి తెమ్మెరల్.

విజ. వి. ౧. ౧౩.

సీ. సిగ్గుమాలి, పిలువని పేరంటమలవుపై
నిండఱు నవ్వఁగాఁ బఱతెంచి

రుక్మా ౫ ౭౭.

జ. పేరఁటాలికూర, పేరఁటాలు.

**పేరఁటాలికూర.** వి. (√ పేరఁటాలు.) ఒక దినుసుకూరాకు. (శ. ర.)

**పేరఁటాలు.** వి. ఔ (పేరఁటము + ఆలు, బ. పేరఁటాండ్రు, పేరఁటాండ్రురు.) పేరంటమునకువచ్చు చిరంటి, ఐదువరాలు

గీ రిక్కరాయఁడు దిమిదిమిఱ రేవెలందిఁ, జెండ్లి యగునని కడకను పేరఁటాలు, మొనసి యేరినీటికై ముంచు పసిఁడి,కుందయనఁ బ్రొద్దు మున్నీటఁ గ్రుంకెనంత.

అచ్చ రా అయో. ౧౨

క. చెలరేఁగి రెండుతోయంబుల పేరంటాండ్రు చిత్తముల సెంతయు వేడ్కలుమీఱఁ జల్లు లాడిరి, తలఁకక యభినవకుభాతుత్రవాతము నన్.

కళా. ౪. ౭౦

ద్వి. పేరఁటాం డ్రోగిఁబాడు పెండ్లిపాటలకు, శారికాకీరముల్ సందిడిసేయు

రం. రా బాల ౩౪. పా. ౨౪. పం.

గీ. పేరఁటాంగ్రుకు హస్తపంకేరుహములఁ, బూఁచియెత్తిన కనకంపుఁ బూజెగుండ, లున్నతస్తనములుగాఁగ నొప్పు మిగిలెఁ, దరుణియును బోలె నృపగృహద్వారభూమి.

సైమ. ౬. ౭౨.

౨. మృతచిరంటి, మరణించి యాత్మరూపము నొందిన సువాసిని.

సీ. మృతచిరంటికి నాఖ్య లెసఁగుఁ బేరంటాలు నాఁగను . ఆం. సం. కూచ. ర.

ఉ. నిన్నటిరేయి నా యెదుట నిశ్చలజామి కల లోన మాకు పేల్, పన్నెడు పేరఁటాల్ నిలిచి బాపఁడరెడ్డికిఁ దెల్పరాద న న్నెన్నఁడుఁదిన్నెఁబెట్టి నుతియించుచుఁ గొల్వ రటంచుఁబల్కె . కుక. ౨. ౪౪౧.

**పేరఁబడు.** అ. క్రి (పేరన్ + పడు, స్వార్థమున.) దట్టముగాఁ గూడు, సంఘీభవించు

క. కరిమదిగంధమునకు మధుకరములు పిండు కొని ముసరి కటితటముల భ్రాంతుయ్యె నగతటంబులఁ, బరువడి మొగులెఱఁగి పేరఁబడినవిధమునన్. కు సం. ౧. ౭౭.

**పేరకమ్మ.** వి ఒకానొకనది

గీ, బెరసి వెన్నెల గాయంగఁ బేరకమ్మ, పులిఁ తలముల నాయాయి కొలము లెఱిఁగి,తాల్చు శస్త్రాస్త్రములు జారదంపతులకు, నసమ బాణుండు తిరునాళ్ళ నన్నివాళ్ళ .

క్రీడా. ౨౧౩.

**పేరగు** అ. క్రి (పేరు[1] + అగు.) ప్రసిద్ధికెక్కు, విఖ్యాతమగు, గొప్పదగు.

గీ. మఱియుఁ బేరగు తులువల నుఱుముసేసి.

నీలా. ౧. ౩.

రగడ. పేరైనమూర తుపింగాణిగిన్నియలు .

హంస. ౩. ౩౫౬.

ఉ. . కడుఁ బేరగునట్టి తపంబుసేసి యుద్దామ విభూతి నింతటిపదంబు భజించెద .

హరి. ఉ. ౪. ౪.

**పేరజము.** సం. వి. అ. న. = పేరోజము.

**పేరడఁగించు = పేరడఁచు.** స. క్రి. (√ పేర డఁగు.) సంహరించు, చంపు.

ఉ. కారణమానుషత్వమునఁ గంసుఁడు లోనుగ దుష్టదైత్యులం, బేరడఁగించుచుండెను వినుము

పృథ్వీజనించినవాని వాదిపం, శేరుహానాభుఁగా
నెఱిఁగి హరి. ఉ. ౧. ౪౦.

**పేరడఁగు.** అ. క్రి. (పేరు¹ + అడఁగు) రూపఱు, నశించు.

(చూ. పేరడఁగించు, పేడఁచు)

**పేరడఁచు = పేరడఁగించు.** (√ పేరడఁగు)

గీ. వసుధలోపల నిరువురు వాసుదేవు, లున్నఁ
దడఁబాటుగాదె యే నొక్కరుఁడన, పేరు
సెల్లింతు నని వీనిఁ బేరడంతు, మెచ్చి
భూపాలు రెల్లను బిచ్చలింప.
హరి. ఉ. ౨. ౬౩.

**పేరడవి.** వి. (పేరు¹ + అడవి) అరణ్యాని, మహారణ్యము.

చ. కోమలభాస్కరుం డనం, బడు నతఁ
డొక్కనాఁడు తనశాలసఖుండును దానుఁ
గూడి పేరడవిఁ జరించుచో ...
భోజరా. ౫. ౨౧౨.

క. పేరడవిలోన రాఁగా, నీరజహితుఁ డస్త
మించి నెఱి నఖిలాశా, పూరితమై తమ
మెచ్చెను విక్ర. ౫. ౧౭౫.

సీ. . పేరడవి నాఁగను వరణ్యాని చెలఁగు.
ఆం భా. ౨. ౩౪.

**పేరణము¹ = పేరణి¹.** వి. భాండోపరినృత్యము, నాట్యభేదము.

గీ. ఒండుపనులకు నాకు సెలవు లేకునికిఁజేసి,
యభ్యసించితి శైశవమాదిగాఁగ, దండ
లాసకవిధమును గుండలియును, ప్రేక్క
ణంబు తెలుఁగును పేరణంబు.
భార. విరా. ౧. ౨౪౦.

సీ. పడఁకు పన్నగరాజు పడగలమీఁద నర్పం
సహికాంత పేరణము సూప ...
ఉ. హరి. ౪. ౨౧౬.

క తాటించెఁ బేరణము నా, స్ఫోటించెఁ గిరీటి
వక్షము వృషాంకుఁడు . .
పార. ౩. ౭౭.

**పేరణము² = పేరణి².** వి ౧. కవచము.

సీ . పేరణ మనఁగను బేరణియన, మైమఱు
వనఁగను కవచంబు శోభిలు .
ఆం. భా. ౨. ౨౦౪.

౨. ఆవిరి.

క. కారణములేని నగవును, బేరణమునులేనిలేమ
పృథివిస్థలిలోఁ, బూరణములేని బూరెయు,
వీరణములులేని పెండ్లి వృథరా సుమతీ.
సు. శ. ౩౬.

**పేరణి¹ = పేరణము¹, పేరిణి, పెరవణి.**
వి (సం. పేరిణీ. క. పేరణి) నాట్యవిశేషము, భాండోపరినృత్యము.

సీ. నాట్య భేదంబుల నామము ల్దనరు జక్కిణి
గుజరాతి పేరణి లనంగ.
ఆం. భా. ౧. ౧౩౦.

ఉ. పేరణి దండలాస్యమును జొక్కణి కుండలి
నాఁ జతుర్విధో, దారములైన నాట్యముల ...
పాల్కు. ౩. ౫౧.

లయగ్రాహి. చారుపద మాఘురము లారభటి
మీఱ మణిహారములు చన్దవలఁ దారవిల
సేలా, యహ్యారముల నచ్చరలు పేరణి
నటింప ... ఉ. రా. ౨. ౧౧౫.

ద్వి. కోదలక పేరణి గొనఁ జంద్రరేఖ . .
వరుస నటించిరి వన్నెమీఱఁగను ..
రఘునాథా. ౭. ౭౦.

**పేరణి² = పేరణము².** వి. ౧. కవచము.

౨. అంగీ, మోఁగాళ్లదాఁక వ్రేలాడు తొడుక్కొ.

మ. తల విద్దాతగటీలు పేరణులు పైదట్లుగా
రుమా మారకత్తులు జోల్లం బదనించినట్టి
కరహేతుల్ తక్కు గుల్కంగ
రా. వి. ౬. ౫౪.

విణ. సాంద్రము, దట్టము

ఉ. పౌరుల సాధువాదములు బాంధవకోటి
ప్రమోదభావలుగా, వార వధూవిధూవక
జనంబుల నాగరకంపుమాటలుం, పేరిణియై
దిగంతములఁ దిక్కటిలంగ
భోజరా ౪ ౨౭

**పేరణి.** సం. ఇ. ఈ. స్త్రీ. నృత్య విశేషము
(విల్యమ్సు)

**పేరము = పేరెము.** వి. (సం. ప్రేంఖా)
రేచితము, గుజ్జము మున్నగువాని గతివిశేషము.

గీ. శంకరుఁడు నందిపై నెక్కి హుంకరించి,
యతిశయార్భటిఁ, గవ్వన వార్చి పేర్చి,
చాకళింపులు దుమికించి చక్రగతులఁ,దరిమి
పేరంబు దోలుచు వరిగె వనికి.
అని. ౪. ౪౬.

జః పేరములువాఱు.

**పేరములువాఱు = పేరెములువాఱు.**
అ. క్రి. (√పేరమ.) పరుగెత్తు, భావనవిశేషముచేయు.

సీ. కలరవంబుల రకంబులు పికంబులు గేర
రమణఁ గీరములు పేరములువాఱె.
భద్రాపరిణయము. ౧. అ.

వ. . గోవిందునిసేవకులు ఛూరఁగూడక
పేరములువాతిశారి తుపాకులు సంధించిన
సేనలు వంచి బొంకించి నాగదత్తుండు
తనబలంబుల నెచ్చరించి ...
ప్రబంధ ౩౨౭.

**పేరాముట్టి.** వి. ఒకజాతిమొక్క.

సీ. కేతి,టీల పేరాముట్టి పీఁచర ములు
గాలిమిడి చేదుపాట్ల యుమ్మెత్త తిప్ప,
తీఁగె
హంస. ౪. ౧౦. (కొత్తప్రతి. పా.)

**పేరాముదిము.** వి. (పేరు[1] + ఆముదము) ౧.
రక్తైరండము. కీ. (శ ర.) ౨. రక్తైరండ
తైలము. (శ ర.)

బ. పేరాముదాలు = పెద్దాముదపు గింజలు.
(తదితరమైనజాతి చిట్టిఆముదము శ ర)

**పేరాయఁడు** వి ఒకానొకజాతి కొండదొర.
(బ. పేరాయలు.)

రగడ కొండలగ్గలఁరకుగొనని పేరాయలును
దండివనమర్గభేదకులైన కోయలును.
పి. కథం 3. ౨౨౫.

**పేరాలము.** సం. వి. అ. పుం. పేతధూమలము,
పసుపు పొగరంగు కలిసినరంగు. (వై. ని.)

**పేరిణి = పేరణి[1].** వి. నాట్యవిశేషము, భాండోపరి నృత్యము.

క. చెలి తకతోం తకతోంత, త్తళంగతోం ధక్త
తోం దదధిగిణతోమం, చలవోక దీటుఁ
బేటిణి, వెలయించుచుఁ జూచువారు విస్మయ
మందన్. దశా. ౭. ౨౯౧.

ద్వి. కోలాటమును బాత్రగొండ్లి పేరిణియుఁ,
గెళిక కోకలై లీల నటింప.
బస. పు. ౧. ౧౨. పా. ౫౨౯. పం.

సీ. సేల యురు మురుములీలఁ పేరిణి వగఁ బద
ఘాతమున శబ్ద మొందవఁజేసి.
ప్రబంధ. ౧౦౯.

**పేరిమికాఁడు.** విణ. [(√పేర్మి(రిమి[1])] గొప్పవాఁడు, ఘనుఁడు.

క. ఎనతెవిగొనబుకాఁ డా, పెనుమినుకుం
జగము వాగడుపేరిమికాఁడా ...
అచ్చ. రా. కాం. ౧౭౧.

(శ. ర. పా. పేరిమివాఁడా. ముద్రి.)

పేరీఁదు. వి. (పేరు¹+ఈఁదు².) ఖర్జూరము. శ.
(శ. ర.)

పేరు¹. అ. క్రి. (క. త. పేర్.) ౧. అతిశయించు, మించు.

ఉ. ఆ రమణీలలామ హృదయంబున నాదట
లంతకంతకుం, బేరఁగ నింపు సంతసముఁ
బెంపు వహింపఁగ కేయూర. ౪. ౫

చ. బెడిదపుకొండ పెక్కుపికలఁ బేరిన వేదనవాప
గామణుల్, వడి బెడిపోవువేళ విడువంబడి
శిక్షితజీవపంబులై. చంద్రా. ౨. ౭౧

ఉ. వాఁడు ప్రాణముల నిల్పినఁ జాలిటఁ
దెచ్చి వెజ్జులం, బెట్టిగుణంబు చేసి మదిఁ
బేరిన కెంజిలి దీఱ వానికేఁ, బట్టముగట్టి
సారంగ. ౩. ౨౭.

౨ సాంద్రమగు, దట్టమగు.

ఉ. .. సర్వజంతుసం,చారవిహీనమై రవి
నిశాకరదీప్తులు లేక చీకటుల్, పేరినయొక్క
చోటు గని పెద్దియు విస్మయమంది
యందిటున్. హరి ఉ ౧౦ ౧౯౪

ఉ. పేరినఘోరవెంద్రుకలు కీటలువాలన
దీర్ఘకాయముల్ కల్గిన బ్రహ్మరాత్రు
సుం,డు దశకు. ౧౦ ౬౪.

చ. .. తమంబును బేర దిక్కులన్.
ఉ. రా. ౫. ౨౩౯.

౩. ఘనీభవించు, గడ్డకట్టు, తోడుకొను.

గీ. సాగరమునీరు పేరుట శైలకులము, తెయవు
లిచ్చుట . ఉ. హరి. ౨ ౫౬.

ద్వి. వడి వర్ధ్యశిలలపై వడిసి యుంతంద, మడువు
లై పేరినమనుజరక్తములు.
ద్వి. హరిశ్చ. ౧౬౩౪.

సీ. పేరి పక్వంబైన పెరుఁ గుండఁ గవ్వంబు
పులిచల్లలో నుంచి చిలుకఁబోవు.
శుక. ౨. ౫౬౧.

విశే. ౧. పెద్దది, గొప్పది.

క. . వరము గోరు పిమాగోత్రమ నీ,వనిత
శుకంబు మహీజం,బునకుం బేరలమి వేడ
భూపవరేణ్యా భార. అను ౧ ౧౫౪.

క. ధారుణిఁ బడియెడుపు లిభాం,కారధ్వానం
బుచేయఁగా వినుచు వమో,నారాయణాయని
ముని, పేరలుఁగున నుగ్గడించె ఖీతాత్ముఁడై.
వరాహ. ౪. ౭౧.

౨. శ్రేష్ఠము, మంచిది.

సీ. వలపార నను జూచి కిలకిలనవ్వఁగఁ
బేరైనముత్యాలసేసు విగు.
గవికే ౫. ౧౪౨,

౩ వృద్ధము, ముసలిది.

మ డెందంబునన్ రాజనం,దను
చూపాప్పరయ వేఁడి పేరలుఁగు నిద్రన్ మేను
తూఁగాడెనున్ విక్ర ౩ ౯౪.

క్రి విశే. అత్యంతము, మిక్కిలి

గీ ననలఁ బే రసఁగ పవనములు నమేను
రతోవృష్టి బూది చఱవ
ఆము. ౫. ౧౪౩.

వి. జౌ (క పెసర్ త. మ పేర్) ౧. నామము, నామధేయము

వ. . ఉంగిడి యదుదుఁద్రిక్క యనువానికి
నా పేరు పెప్పినం జాలు
భార. విరా. ౧. ౨౭౬.

క. విను తీర్థయాత్ర చని యేఁ, బ సుక్షేత్రంబైన
బదరికాశ్రమమున నొక్కనిఁ గాంచితిఁ
గృతకాశ్రమునిఁ, దమఁ దన పేరింటివానిఁ
జాపవర్యుణ. భార. శాం. ౩. ౧౫౫.

గీ. కామసంచారవారణ ప్రగల్భమైన, శాస్త్ర
మనుపేరి యధికలోచనము కలిమి
నైష. ౧. ౪౬.

గీ. మధువుఁ గాంతలపుక్కిటిమధువుఁ బేళ్ల,
యూర్వియఁ బరసూపఁ బొగడపై కెలయ
దాన, విరిసెఁ బొల్లిటిదళిములు విరులు
జడిసె, దీన వగ్గెల్పునకు నబ్బి లేటులార్చె.
ఆము. ౫ ౧౩౦

(దీని యాత్రేడితరూపము పేర్వేరు.)

సీ. దాదులు పేర్వేర ధరణీపతులఁ జూపి
చెప్పంగఁ జూచుచుఁ జేతఁ బుష్పమాలిక
యొప్పు భార శాం ౧. ౭౯

(పేర్వేరు = పేరుపేరు వరుసను, ప్రత్యేక నామములతో )

సీ. పేర్వేర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు
నళులలతోడ వియ్యంబు లందు
భాగ ౧౦ పూ. ౧౬౭౪

౨. (పేరుగల మనుష్య దేవతాది) వ్యక్తి.

గీ. ఇంక నీయుజ్జ్వలను నీ కిమ్మనటి, పెప
లెవ్వ రీ వచ్చినపేళ్లయందు
కు సం. ౨ ౧౫౯

ఉ భారతికి గాదిలి ముప్వురతో ల్పేరు
వి,త్యమ్ముగ నాయువీయుతఁ గళా
ధ్యుఁడు. హరి పూ ౧ ౩.

వ కమ్మసాని పేరు ౧ టికి చిర (మె)ట్టు
వరి వడ్డినలెకు పుట్టి ౧ ట్టికి చి ౧౦ కొడ
మంగలి పేరు౧ ట్టికి (దా శా. ౧౩౦౪)

౩. శబ్దము, మాట, సమాచారము.

చ. . . ఎయ్యెడలందుఁ బండితాగ్రయతము
పేరు లేక శిలమై శనఁ గూల్చితో ...
కళా. ౬. ౭౬.

క. మాపాలు పాలింతఁ గమఁగొని, శాపముఁ
దట వలపుపేరు దైవ మెఱుంగుత, శాప
మొఁటగ మకరులుగాఁ, గోపరసావేశ
రూతు కుటిలేతుఁడై. రాజ. వి. ౨. ౫౬.

౪. కీర్తి, ప్రతిష్ఠ.

క. ఉక్కటి సురపతికైనను, ద్రొక్కము
నృపధర్మ మూఁది మొనతలఁబడినన్,
మిక్కిలిపేరును నిట దివి నక్కజముగఁ
బెంపుఁ బడయనగుట నుపేంద్రా.
భార. ఉద్యో. ౩. ౩౬౦.

మ. సరిగ, జభవుం డింద్రుఁడు లోనుగాఁ
గల మరుత్సంఘంబుతో సేగుడెం,చె
భువిన్ బేర్కలపంయమాంగ్రతతి వచ్చెం
బేర్చు మొరంబునన్
హరి. పూ. ౧. ౧౧౧.

౫ రూపము, మిష, వ్యాజము.

౬. గురుఁ దల్లి నింద్రిని స్నాదరా నకారణము
ప్రల్లదముఁబల్కి న ముమ్మరుచేత నూఱు
పణములు, ధరణిశుఁడు గొనుట నీతి పిండువ
పేరు విజ్ఞా. ప్రా ౪౩

సీ. తలిరుజొంపముపేరఁ బులకాంకురము
లూనుఁ బువ్వులపేర లేనవ్వు నవ్వు.
కవిరా. ౫. ౩౪.

క ఆ చపలాక్షికిఁగా మన,కీచకు లందఱను
రాత్రి గీటడఁగించె రహ, స్యోచితవిధమున
గంధర్వాచరణముపేర భీముఁ డతి భీమము
గాన్. భార. విరా. ౫. ౩౩౧.

చ. కలయఁగ మంచిలగ్న మిది గట్టిగ నే గడ
లెన్నియయ్యెడో, తెలిపెద నంచు జో స్యులఁ జను

దేర వరదుని యాత్ర గాన్పించి, విలిచెద
వంచు జోద్రు వారాసే రడి వా రటు లేఁగి
రంద ఱచ్చెలియలవెంటనే నగము వి గ్గరగన్
రమణీలలామకున్. విజ. వి. ౩. ౨౧౮.

౬. మాటు, ప్రతి.

ఉ. ... విమలముక్తాదామము .. ప్రమదా
రత్నము పేరుగా నెద నిసుం బాటించి
ప్రార్థించెదన్. వసు. ౪. ౧౦౦.

సీ. నావాడపతి పంపినయమూల్య కటకముల్
గ ర్గపేరుఁగఁ బదాగ్రములఁ బెనఁగ.
వసు. ౧. ౧౫.

౭. ఎద, విషయము.

ఉ. .. ప్రభువుల్ ప్రయోజనా, పేక్ష నొకప్పు
డాశ్రితులపేర సముచితగౌరవోన్నతుల్.
హరి. ౩. ౩౯.

శ్లో. .. ప్రాయశ్చలం గౌరవ మాశ్రితేషు.
సం. కు. స. ౩. ౧.

జ. పేరఁబడు, పేరగు, పేరడఁగించు, పేర
డఁగు, పేరడఁచు, పేరడవి, పేరామదము,
పేరీడు, పేరుంగరము, పేరుకొను, పేరు
కొంచు, పేరుగాంచు, పేరుడు, పేరుపడు,
పేరుపెట్టు, పేరువాడు, పేరువాలు,
పేరెక్కు, పేరైనవాఁడు, పేరొందు, పేరో
లగము, పేర్కను, పేర్కొను, పేర్కోలు,
పేర్చు, పేర్పు, పేర్చిందువు, ప్రెబ్బొత్తి.

పేరు², వి. దండ, హారము.

సీ. పెండఁదన్ను ఫుసుకలనిసుపేరు లొండొంటిఁ
బోరిఁబోరిఁ దాఁకి బోర్లాంబుపరవఁగ.
హర. ౫. ౧౬.

సీ. ఉత్తగా రిచ్చిన మాణిసుదర్శనపుఁ బేరునకు
ము త్రైదుక వనటఁ బొందు.
కాంచ. ౩. ౫౦.

పేరుంగరము. వి. (పేరు¹ + ఉంగరము.) పేరు
చెక్కిన యుంగరము, ముద్రిక. (శ. ర.)

పేరుకొ(ఱ్కొ,గొ)ను. అ. క్రి. (పేరు¹ +
కొను, స్వార్థమున.) ౧. అతిశయించు, ప్రవృద్ధ
మగు.

వ. పేరుకొను కొరికలు దారుకొన జాయామెరం
బొంగిన యంగంబుల . (పారి. ౨. ౫౨.)

౨. ఘనీభవించు, గడ్డగట్టు.

(వ్యవ.) పేయి పేరుకొనినది.

(వ్యవ.) నీరు పేరుకొని మంచుగడ్డ యగును.

౩. ఖ్యాతికెక్కు, ప్రసిద్ధినొందు.

గీ. అకట వీరవ్రతస్థుండవై జగమునఁ, బేరుకొన్న
వాఁడవు యదువీరుచేతఁ, గోలుపోయితె
నీపేర్మి గోముదక్కి, యెందుఁజేయుదు రింక
నీ రేలుజనులు. (హరి. పూ. ౯. ౧౭౫.)

చ. మును ఘోషయాత్రను బదంపడి గోగ్ర
హణంబునందుఁ బేరుగాంచిన నీకు ని ట్లనుట
క్రొవ్వులు దక్కుము పాలు నన్నియున్.
భార. ద్రో. ౫. ౯౯.

౪. పేరుపెట్టు, పేరిడు.

గీ. పేరుకొని చెప్పె నతని గాంధారి కంత.
భార. ఆశ్ర. ౨. ౩౪.

సీ. పేర్కొని పలుమాఱుఁ బిలిచి రారా యనుట
లేకున్న న య్యింటిలోఁ గన్న కూడి.
భార. ఆను. ౧. ౬౭.

స. క్రి. ౧. పేరుపెట్టి పిలుచు, పిలుచు.

గీ. పతుల నన్నలఁ దమ్ముల సుతుల హితులఁ,
బేరుకొని వారు వెందంగఁ బ్రేముడించి,
సముఖులమకుల వినువారి మనసుఁ దేల్చ,
గురకులనారి [illegible] వచ్చె.
భార. స్త్రీ. ౧. ౯౯.

ఆ. దానఁ జేసి జహ్నుతనయ నా జాహ్నవి,
యనఁగఁ బేరుగాంచె నమరగంగ.
జాహ్నవీ. ౨. ౧౨౪.

౨. ఖ్యాతికెక్కు, ప్రసిద్ధినొందు.

మ. ... ధన్యాత్ముఁడై పేరుగాంచె నిలన్
నందురిబాపమంత్రితనుజుఁ డౌ శ్రీ సూర్య
నారాయణుం,డు . (జాహ్నవీ. ౧. ౭౭.)

పేరుడు. వి (√ పేరు¹.) పేరుట, ఘనీభవించుట
(శ. ర.)

పేరుప(ర్వ)డు. అ. క్రి. (పేరు¹ + పడు.) ౧.
నామము వహించు, పేరుదాల్చియుండు.

క. ఆగాధి యశోద యనం, బేరుపడిన పేద
రాలి యద్దమగృహముం, జేరి
శుక. ౨. ౨౩.

౨. ఖ్యాతికెక్కు, ప్రసిద్ధినొందు.

చ. . శాకపతి పయోధి ద్రచ్చునెడఁ గేతు
వుపై మణిమాల చేర్పఁ బేరుపడియెఁ గేతు
మాల మన రూపసువర్షము దానిపేరిటన్.
వరాహ. ౧౦. ౧౨౦.

సీ. హయమేధరాజనామయము లనన్ బేర్వడ్డి
సవనతంత్రంబు లంతయును మాకు.
మనుచ. ౨. ౪౩.

పేరుపెట్టు. అ. క్రి. (పేరు¹ + పెట్టు.) ౧. నామ
కరణముచేయు, పేరుంచు.

గీ. అంత సుమతికి సంజాతుఁడైనయట్టి, పట్టికిని
భట్టి యని పేరుపెట్టి .
విక్ర. ౧. ౧౭౪.

౨. నిందపెట్టు.

ఆ. చిచ్చులేక చిమ్మదుమచ్చరీఁడునద్ది, వజ్రసాధుఁ
డొర్పువాఁడ యొకటు, యుగళపేరుపెట్టి
యతిన యెవ్వతో యింత, చేసె నమను
మమ్ముఁ గెందుఁ దోలుత.
ప్రభా. ౧. ౧౩౪.

౩. నామకార్థము కొంతయిచ్చి కెలనిర్ణయించు.

(వ్యవ.) ఈ యావు నేదో రొక్క పేరుపెట్టి
తోలుకొనిపొమ్ము.

పేరువా(ర్వా)డు. అ. క్రి. (పేరు¹ + వాడు.)
యుద్ధాదులందు కార్యసూచకముగా నామము
ప్రకటించు, పేరుచెప్పికొను.

వ. ఆ యిద్దరువాగును బేరువాడి పోరుచున్నప్పుడు ..
భాగ. శల్య. ౧. ౧౨౪.

సీ. సురరాజు కృష్ణు నీరేడుకరంబుల న్తగ
కులేశ్వరు మప్పదికంటనేసెఁ బేర్వాడి ..
పారి. ౫. ౨౧.

ద్వి. పిలుఁదు, లూరులతీరు నోరూరఁగాఁ
జూచి, పేరువాడి మరుండు పెళపెళ వార్చె.
రం. రా. వాల. ౬౦. పా. ౧౯. పం.

౨. క్రి. పేర్కొను, వ్రాకుమ్ము.

ఉ. కంటినీరు కుచ్చౌలములం దురలంగ సేద్య
ము, తుప్పల్లపతోజక్షేత్ర తనపూరుము సారకుఁ
బేరువాడుచున్. మైరా. ౩. ౧౩౭.

పేరువాటు. స. క్రి. (పేరు¹ + వాటు.)
పేర్కొను, వాక్రుచ్చు.

గీ. చేసి యిటు లేకలమ్ముల బైసిఁగొనిరొ, యవ
విభుఁడు సూడ నొకకొన్ని జాగిలములు,
సారసాకుకు విరుమలఁ బేరువాటి చేరి విను
తింపఁ దముఁ బెంచు చెంచుదొరలు.
చంద్రా. ౨. ౯౧.

గీ. ఏల యీలో వివాదంబు లిట్లు గెలచు, పేరు
వా రని మా రల పేరువాటు.
భోజరా. ౨. ౫౨.

వటు విలంబిహారంబులఁ బేరంబులువాఱెనో
యన . వసు. ౪. ౨౩.

౩. ప్రసరించు, వ్యాపించు.

సీ. రత్నాంగుళీయకప్రభ పేరములువాఱఁ గెలి
పద్మంబు కెంగేలఁ ద్రిప్ప.

కళా. ౫. ౧౧౭

**పేరముపె(వె)ట్టు.** అ. క్రి. (పేరము + పెట్టు.)
పరుగిడు, పరుగెత్తు.

ద్వి. ధీరుఁడై నిజఖడ్గదీప్తులు నిగుడఁ, జాటి
పేరముపెట్టి సుడిగొన నొడిసి,పట్టి కూఁతలు
బెట్ట బలువిడి పోఁడి.

ద్వి. మారిక్చ. ౬. ౧౬౫౫. పం.

సీ. దట్టించి చంగునదాఁటి పేరముపెట్టు నీడల
నంతంత నిలిచి చూచు.

అచ్చ. రా. అర ౪. ౩.

**పేరలువాఱు.** అ. క్రి. (పేరము + పాఱు.)
పరుగులిడు, గంతులువేయు.

ద్వి. గములు,గట్టి పేరలువాఱి తిటలు ద్రోచి
దట్టంబులై సముద్ధతి సేఁగుదెంచి.

పండితా. పర్వ. ౩౬౦. పొ.

గీ. మంజామాకందమంజరీపుంజచర్వ,ణక్రియాకుంర
కలకంఠనాదసరణి, నాలకించిన మరుఁ దంత
వంగ, వసుధఁ జెలరేఁగి పేరలువాఱునన్న.

చమ. ౧. ౪౯.

**పేరైనవాఁడు.** విశ. (√పేరగు.) విఖ్యాతుఁడు.

గీ. ...ఖ్యాతసంజ్ఞ, యగును పేరైనవాఁడు వాసైన
వాఁడు, మంతుకెక్కినవాఁడు నా మాత్ర
భూత. ఆం. భా. ౩. ౪.

**పేరొందు.** అ. క్రి. (పేరు¹ + ఒందు.) ప్రసిద్ధి
కెక్కు, ఖ్యాతిగాంచు.

సీ. ఏ భూసురశ్రేష్ఠుఁ డిలలోనఁ బేరొందెఁ
గాళిదాస్తిమహత్త్వకథ రచియించి.

ఇందు. ౧. ౭.

**పేరోజేము = పేరోజేనము.** వి. ఒకజాతి గరుడ
పచ్చ.

గీ. పేరోజంబు మణుల మొగముట్టు

మనుచ. ౪. ౨౭.

(శ. ర., చి. ని. పా. పేరజము ముద్రి. పా.)

**పేరోజేనము = పేరోజేము, పేరోదనము.**
వి. (సం. పేరోజమ్.) గారుత్మతమణివిశేషము,
ఒకజాతి గరుడపచ్చ.

సీ. నడిచక్కిఁ బేరోజనపుఁజెక్కడపుఁబైఁడి
పళ్లెంబు ముక్కాలిపై ఘటించి.

దిశా. ౭. ౨౩౭.

**పేరోజము.** సం. వి. అ. న. ఉపమణిభేదము.
(వాచ. కల్ప.)

**పేరోదనము = పేరోజేనము.** వి. ఒకజాతి
గరుడపచ్చ.

సీ. గారుత్మతం బొప్పు గరుడపచ్చ,యనఁ
దద్విశేషాఖ్య యగును పేరోదనం బన ...

ఆం. భా. ౨. ౨౩౬.

**పేరోలగము.** వి. (పేరు¹ + ఓలగము. క. పేరో
లగవు. త. పేరోలక్కం.) పెద్దకొలువు, (ప్రభు
వులు చేయు) మహాసభ.

గీ. ఏఁగి పేరోలగమున దేవేంద్రవిభవ, మొసఁగ
మొనఁగంగ వసియించి

౬ రా. ౩. ౨౫౭.

వ. ఆ రాజన్యుండు పేరోలగంబున రత్నసింహాస
నాసీనుండై యున్న యవసరంబున.

విక్ర. ౨. ౨౦.

పీ. ఆస్థానసంజ్ఞ యై యలరు నోల.
గీ. గమ్మ కోల వన నది మించి కానిపింపఁ బోలుఁ బేరోలగమ్మ నాడ్డోలగ మన
ఆం. భా. ౨. ౧౩౧.

పేర్కను. అ. క్రి. (పేరు + కను) ఖ్యాతి కెక్కు, ప్రసిద్ధినొందు.
గీ. ... జగంబుల నెల్లఁ బేర్కనినబుధులు, వారి సప్తర్షి గణ మంద్రు కొరుకేంద్ర.
భార. అను. ౩. ౨౦౭.

పేరో(రుకో)లు. వి. (√పేరుకొను.) పేరు కొనుట. (శ. ర.)

పే(రుచే)ర్చు. అ. క్రి. (పేరు + చు - స్వార్థమున.) ౧. అతిశయించు, వర్ధిల్లు.
చ. . పైకొనుతఱి పోరగించు మదిఁగోర్కులు పేర్చిన నప్పళించు
భార. విరా. ౨. ౩౧.
క. దైతేయులు దానవులును, ఘోరనిశాచర పిశాచములు దద్దయు సంప్రీతిం బొదలఁగ నాతని, యాతతసామ్రాజ్య మంతకంతకుఁ బేర్చెన్.
నృసిం. ౨. ౧౧౧.
౨. చెలరేఁగు, విజృంభించు.
గీ. విశిఖనవకంబు నాఁటించి వెగడుపఱిచి, పేర్చి యార్చిన సురకోటి పిచ్చలించె.
భార. భీష్మ. ౧. ౨౩౨.
శా. ఆమాట ల్విని పాకశాసనుఁడు క్రొధాకారుఁడై పేర్చి
పారి. ౪. ౬౦.
౩. ఉబ్బు, పొంగు.
క. చారుమనస్సమ్మదరసపూరము వెలిపేర్చుపట్లు పొలఁతికి విగళితమ్మారి సజనిత పయో, ధారలు జానందబాష్పధారలు నొప్పెన్.
భార. ఆది. ౬. ౨౦.

౪. ఉప్పొంగు, సంతోషించు.
శా. శర్వాణీస్తనచక్రవాకముల వక్షస్స్ఫురచ్ఛా సారముల్, గర్వం బింపెసలారఁగాఁ దఱిసి పెద్దన్ ఋల్ల కోటిమించముల్, సర్వాంగీణముగా ధరించికొని యుర్వం బేర్చు కంథుండు .
హరి. పూ. ౧. ౨.
ఉ. ... అంపె యని చీరి హుమ్మనుచుఁ బేరిచి మార్కొని పంచితిల్లి .
భాగ. ౧౦. పూ. ౫౧౭.

స. క్రి. (√పేరు¹.) ౧. ఒకదానిమీఁద నొకటి యేర్పఱుచు, అమరుచు.
వ. .. కిసలయతల్పంబులకు నిట మున్ను సహాయుండ నగు నీకుఁ జిత్రం బేర్పంజాలఁ వచ్చె నే .
హర. ౩. ౬౩.
వ. ... సరయూతటంబున సౌధ పేర్చి యం దా రాజశవ మిడి ...
భా. రా. అయో. ౨౩౩.
౨. కూడఁబెట్టు, నిలువచేయు.
సీ. తరువంబెట్టినబానల, పెరువులు మును గిలకరించి పేర్చినకిన్నల్, మరువు లెసఁగఁ గ్రోలి .
హరి. పూ. ౫. ౨౦౩.
౩. అధికముగఁజేయు
క. ఇది యెంత పేర్చెదరు మీ, చదివినయాకునకె తాను జదివినయది మా, నుదతియు నెందల ఫలించెన్, ఐదభీష్టము పెద్దపిన్నతనముల వరుసన్.
ప్రభా. ౫. ౪౪.

వి. పెంపు. అతిశయము.
చ. అనిశము గ్రమ్ము పువ్వుమధు వర్షజలంబుగ చుట్టునుండి పేర్చున రతితో డిసంబెరమ చూపు విధంబునఁ బొల్చు ఘనాజముల్.
కు. సం. ౫. ౫౬.

ఉ. .. మారగాయములం, గోయము సుశ్యానం
బులంలగోళులఁ దోళులఁ గొంచుఁ
బేర్పునన్, గూయఁ జంపి రేమఁగుల
కొమ్ములు సెమ్ములు గొంచు .
కు. సం. ౬. ౬౯౭.

చ. ... పేర్పునఁ బ్రతిలేక గర్జ నతికూరుఁ
డుమారు నడల్పి శాఁక . అసురాగ్రణి
తారకుఁడు .. (కు. సం. ౧౨. ౯౫౦.)

పేర్పు(రుపు). వి. (√పేర్చు.) ౧. అతిశయము
సమృద్ధి.

క. పేర్పున భుజించి సుఖసంతర్పణు లగు
మానులకు ముదం బొనరించెన్, గర్పూర
ఖండతాంబూ, లార్పణములఁ జారితోషి
తాదులవలనన్. శై. భా. ౬. ౯౩

౨. ఒకదానిమీఁద నొకటి యుంచుట.

(వ్యవ.) ఇటుకావళ్ళ పేరుపు బాగుగా నున్నది

౩. ఘటవిశేషము, దాఁక.

గీ. ఒసఁగి రుముడపేర్పులోఁ గాఁగుచున్న యాల
పాలు ... పాండు. ౪. ౧౩౪.

ఉ. అరయ శ్వేదనాదివిధు లన్నిట నూతము
మందవీర్యనూ, ధారుణిలోఁ శోధనవిధం
బొఁగిఁజేయఁడి యుప్పుతోసి యూ, పేరుపు
లోనఁ బారదము పెటి జలంబులు సల్లి
మూతు డిం,పారఁగ మూసి మీఁద లఘు
వైనపుటం బిడి వండఁగాఁ దగుఁగా
నూతనప్రదీపిక. (చి. ని.)

పేర్బిందు(వు). వి. (పేరు¹ + బిందువు.) ఘర్మ
బిందువు, చెమట బొట్టు.

సీ. జంవడిఁ దొరఁగు పేర్బిందులతోడన కన్నీరు
తొరలఁ గదలుకొనఁగ.
కు. సం. ౫. ౫౯౯.

గీ. తలఁకి కనుఁగవఁ గన్నీరుధార లొలుక,
మేనఁ బేర్బిందు లురులంగ మొలఁకవోలిచె.
కు. సం. ౫. ౫౭౪.

గీ. వరదుమ్ముఖదీప్తి వెదలి పార్వతీముఖంబు,
ప్రీతి విలసిల్లఁ గలయఁ బేర్బిందులెసఁగె.
కు. సం. ౫. ౫౧౩.

పేర్మి¹(రిమి). వి. (క. పెర్మెక. పెరుమై.)
౧. అతిశయము, పెంపు, అభివృద్ధి.

ఉ. అర్మిలి నిల్పి యాగియఁ బ్రియంబున జా
రుముడ నాఁడునాఁటుకిం, బేర్మి వహించుచుండె
నదెపెం దనతమ్ములలోనివానిఁగాన్.
భార. విరా. ౧. ౨౭౩.

క. . ఘనసంతాపంబు పేర్మి నితర,వ్యాపా
రము మానియుండె హరియును నచటన్.
పారి. ౧. ౧౦౨.

ఉ. ఆదర మింతలేక నరుఁ డాత్మబలోన్నతి
మంచివారితెన్, ఖేదము చేయుటం దనదు
పేర్మికిఁ గీడగుమూల మె ట్లను,ర్వాద
హిరణ్యపూర్వకా? హన్దనుజుండు గుణాఢ్యుఁ
డైన ప్రహ్లాదున కెగ్గు చేసి ప్రశియంబున
బొందఁడె మున్న భాస్కరా.
భా. శ. ౧౦.

౨. గౌరవము, గొప్పతనము.

క. ధర్మతనూభవుదెస దుష్కర్మము రూపించి సభ
నొకండును మైమైఁ, బేర్మి సెడక పోసే
ర్పునె, ధార్మికు లింకెట్టివారు తథ్యం బర
యన్. భార. ఉద్యో. ౧. ౨౫౯.

క. అందుఁ గుచేలుండను ముని,నందనుఁ డొక్క
రుఁడు దినదినము హరిసేవా,నందంబున
సకలేంద్రియ,బృందములఁ బరిత్యజించి పేర్మి
వహించున్. కుచేల. ౧. ౨౫.

చూ : పేరిమికాఁడు.

**పేర్మి¹(రిమి)** = పెరిమ. వి. (సం. ప్రేమ.) ౧. ప్రేమ.

క. ధర్మార్థకామమోక్షద,కర్మంబుల శైశవాది కాలంబుల నీ, నిర్మలభక్తియుఁ గల్గఁగఁ, బేర్మిం గృపచేయు మదిరు ప్రియము మునుండా. వి. పు. ౨. ౨౫.

గీ. ఆర్యునకుఁ బేర్మి రెట్టిడో యద్రియింట, నిల్లటం బుండెఁ ద్రిభువనాధీశ్వరుండు. హర. ౫. ౮.

౨. ఆసక్తి.

ఉ. పేరిమితో వలంబడినచిట్టయుఁ బోలె నపార ఘోరసం,సారమిరింతపాశములసందు దగుల్పడి చే ఛవత్పదాం,భోరుహచింతనంబు మదిఁ బూనుట కేమతియొంటి వచెల. ౩ ౮౨.

విశే. హితము, ఇంపు.

గీ. ఇతము పేరిమింపన హితమెసఁగు సొంబ సాం. ని. మాన. ౩౩.

**పేలగింజ.** వి. (√ పేలు) నిప్పులో వేఁగిపడిన ధాన్యాదిబీజము.

వ. అక్కటకటా దైవంబ నీకింటికిం బేలగింజయుఁ బెద్దయయ్యెనే సైష. ౧. ౧౧౦.

(పేలగింజయుం బెద్దియగు = స్వల్పవస్తువును మహాపదార్థముగాఁ గానవచ్చుట.)

ఉదా. జ్వరితునిరొమ్ముదలిశేఁడిచే వడ్లగింజలు పేలగింజ లగుచున్నవి.

**పేలపిండి.** వి. (√ పేలు.) పేలాలు విసరిచేసిన పిండి, సక్తువు. (శ. ర.)

వ్యవ. ఎంతకఠినగ్రంథమైనను వానికిఁ బేలపిండిగాఁ గాన్పించును.

(పేలపిండిగా = తేలికగా, లఘువుగా.)

**పేలము.** సం. వి. అ. న. (ప్రయుచిహ్నమగు.) అండకోశము.

**పేలములు.** వి. బ. లాజలు (దీనికి వ్యుత్పత్తి మృగ్యము.)

ఉదా. పేలగింజ, పేలపిండి.

చ. మిటమిటఁగాయుతాతపము మించఁగఁ గోర్వక గండశైలముల్, పెటపెటఁ బ్రేలి పేలముల పెంపు వహించెను. చిత్ర. భా. ౨. ౯.

సీ. జొరుగులు మొదలుగాఁ బోచిల్లు పదములు బహువచనాలుగాఁ బరగుచుండు, ... లాజలు దనరుఁ బేలాలనంగ. గీ. నత్తుల పేరు పోచిల్లువాఁగ ఆం. భా. ౨. ౨౫౩.

శా. కాకోకారతికామ్రపర్య యను చున్ ఘోషించు చందంబునన్, గోకోకో యని పూఁచె బుంజాలు మెల్లంగుం జొక్కి పేలాల కున్, గోకోకో యన వేగుఁజుక్క పొడిచెన్ గ్రుంకె న్విధుం డేదిది,క్కోకో కోమల కైరవాళి కనఁగా నుద్యత్ప్రభాతాగతిన్. చంద్రా. ౫ ౧౧౮.

**పేలవము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. కోమలము, మెత్తనిది. ౨. కృశము, చిక్కినది. ౩. విరళము, పలుచనిది, వెలితిగలది. (వస్త్రాదిది)

వి. అ. న. మరిచము, మిరియము. (శే. వి.)

**పేలా.** వి. (తె. పేలా.) నీళ్లు త్రాగెడు ఒక దినుసు గిన్నె. (శ. ర.)

**పేలిక** = ప్రేలిక. వి. (√ పేలు.) పీలిక, జీర్ణ వస్త్రఖండము, వస్త్రఖండవిశేషము, వస్త్రఖండము.

పీ..., ళ్రేపేలిక యుంచుక పేలికయన. గీ. జీర్ణ
వస్త్రైకదేశంబు పేలఁగుచుండు ...
ఆం. భా. ౨. ౧౫౬.

గీ. దబ్బ్రపేలియుంగరవు మేధాని వౌట్టు,
మడుఁగు పేలిక పిరిమట్టుఁ బెడఁగుగాఁగ
హరి ౮ ౧౦ ౨౦౩.

సీ. మొలనున్న ధవళంపు ముద్దుపేలికతోడ
నిమ్మైన కృష్ణాజినమ్ము తోడ.
పీ. ౨ ౧౮౯.

(మయూరాదివిశిఖము.) వ కాకోదరంబుల యుదరంబులం చంమాపుటంబులం జెందినఁ ప్రేవులు ప్రోవులు పడం గడసి వాలికలు పేలికల విధంబునం దూలం ...
సౌ. భా. ౪. ౧౦౦

**పేలు** = ప్రేలు. అ. క్రి ౧. (ధాన్యాదులు) వేడిచే వేఁగిపగులు. (ళ ) ౨. వేడిమిచే బయలుకొలిసి చిన్నచిన్న పొక్కులు కలిగియుండు.

వ్యవ. ఈ యెండలకు శరీరమంతా పేలినది.

౩. (తుపాకి మున్నగునవి) ధ్వనించు.

వ్యవ. ఆ కాల్చిన తుపాకాయ బాగుగా పేలలేదు

౪ ఉపయోగిపని లేనిమాటలు అతిమాత్రముగా మాటలాడు, వదరు

(వ్యవ.) పెద్దలయెదుట నట్లు పేలరాదు.

జ: పేలగింజ, పేలపిండి, పేలముల, పేలిక, పేలుచు, పేలలు.

**పేలుచే(ల్చు)** = ప్రేలుచు. స. క్రి. (√పేలు.) పేలఁజేయు.

(క) కాల్చుటచే పగిలి యెగురునట్లు జేయు.

ఉదా: పేల్చినజొన్నలు, పేల్చినమాంసము ...

(చ) పగుల్చు, చీల్చు; ధ్వంసముచేయు.

సీ. కైదువుల్ విండ్లును గత్తళంబులు పేల్చి
బూరలుఁ దుగుములు బుగ్గిఁ గలిపి
అచ్చ రా. యుం. ౧౦౭.

(ట) తపింపజేయు, బాధించు.

గీ. బాణములు . బలము నెల్ల, మంగలములోని
పేలాలమాడ్కిఁ బేల్చె.
రా. వి. ౫. ౨౨.

క .. పెండ్లివులు గోనిశేమి పెటపెటఁ
బేల్చెను. శుక. ౩. ౨౮౩.

(త) తుపాకి మున్నగునవి కాల్చి ధ్వనింపఁజేయు.

(వ్యవ.) తుపాకిపేల్చఁగానే పక్షులు పారిపోయినవి.

**పేశకోశ(ష)ము** సం. వి. అ. పుం అండకోశము

**పేశలము.** సం. విణ. (అ. ఆ. ఈ.) ౧. చక్కనిది, సుందరము. ౨. దక్షము, నేర్పుగలది ౩. కోమలము, మెత్తనిది. ౪ ధూర్తము, వంచనగలది ౫ అలంకృతము.
౧ ల. న చక్కదనము, సౌందర్యము.

**పేశస్కృత్తు.** సం. విణ. (త్.) తాను గ్రహించిన కీటమునకు రూపాంతరమును గలిగించు కీటక విశేషము, భ్రమరము

**పేశస్సు.** సం. వి. స్. న. ౧. రూపము. ౨. హిరణ్యము, బంగారు. ౩. కోశము. ౪. అలంకారము, అలంకరణము.

**పేశి.** సం. వి. ఇ., ఈ. స్త్రీ ౧. మాంసఖండము, మాంసపుముద్ద. ౨. మాంసపిండము, మాంసపుముద్ద. ౩. అండము, గ్రుడ్డు. ౪. సువిక్వకలిక, వికసించఁబోవుచున్న మొగ్గ. ౫. జటామాంసి.

౬. కత్తిఱొఱ, ఖడ్గపిధానము. ౭. నదీభేదము. ౮. పిశాచీభేదము. ౯. రాక్షసభేదము. ౧౦. గర్భమును చుట్టుకొనియుండు చర్మకోశము, మూలు నిలిచిన యించుక కాలమునందలి గర్భపిండము ౧౧ వాద్యభేదము. (ఈ యర్థము లంను ఈశాగాంతమని వాచస్పతి) ౧౨ ... (ఇది పుంలింగమును అని కొందఱు.) ౧౩ మాషవిదళము. ౧౪ కాలిచెప్పు. ౧౫. పండు లోనగువానిపైతొక్క.

**పేషకుఁడు** సం. వి. (అ. పుం.) నూఱువాఁడు, పొడిసేయువాఁడు

**పేషణము.** సం. వి. అ. న. ౧. మార్జనము, పొడిసేయుట. ౨. ఖలము, కల్లము; కళ్ళము, ధాన్యము నూర్చుచోటు (అని కొందఱు.) పుం. వృక్షభేదము.

**పేషణి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. నూఱురాయి, సన్నెకల్లు, కలువము.

**పేషము.** సం. వి. అ. పుం. పొడిసేయుట, నూఱుట

**పేషాకము.** సం. వి. అ. పుం. = పేషణి

**పేషి.** సం. వి. ఇ. పుం. వజ్రము.

**పేసెము = బేసము** వి. (సం. పేశీ, పేసి. ప్రా. పేసా కు బేసవు ఉ. ర. పేసము, అని. చి ని) శిలాసిలలో అనుకుగా నుండు పదార్థము, గుంజు

గీ. పేసె మనంగను ఖ్యాఖ్య విలసిల్లు
ఆం. భా. ౨. ౪౦.

ఉ. అల్లన వేఁ ఖేరవచ్చి ధవళాన్నము గమ్మని యాలనేతితో, బెల్లముతోడ నాల్కొడపుఁ బేసెముతోడను నిమ్మపండ్లతో పిసాళికిఁ బ్రియంబున నూర్పెక పెట్టె భిక్షుకున్.
హర. ౫. ౭౬. (పేసము. ముద్రి.)

**పేస్వరము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గమనశీలము, పోవుచుండు స్వభావము గలది. ౨. నాశము సేయునది.

## పై

**పై** = పయి. వి. (సం. పైః) సప్తమ్యర్థకము. ౧. మీఁదు, ఉపరిభాగము.

గీ. మీఁద, పై పయిని నాఁగ నూర్ధ్వాఖ్య పఁగు మంగు
ఆం. భా. ౩. ౬౬.

గీ. పొలఁతి పయ్యెదకొంగు పైఁ బొందుపఱిచి.
ఉ. హరి. ౧. ౪౦.

చ. పరసపుటల్కఁదీర్పఁ దతి ... గుణాప్తి ... పైఁ గటిపై ... శంబుపై, హరినలు ... సుఖాంబుధి నిచ్చలుఁ దేలలాడు నిందిర కృపజూచుఁ గాత ...
పారి. పీఠి. ౪.

౨. విషయము, ఎడ.

ప్రయో. నాపై దయయుంచుము.

౩ వెనుక, అనంతరము.

గీ. కుడుపుపైఁ గుడ్చు దినవిద్రగూరి ... నొందుఁ ... కూసపగు విమాథుఁ ...
గారి. అశ్వ. ౧. ౧౬౬.

చ. పలపలదొ ... మాటికి నేటవాలుగా, జలకణముల్ నిగుడ్చు వెసన్ జడిపైజడి సందడింపఁగా, జలధరపంక్తి దార్కొనుచు .. (ఉంప ౩. ౧౦౪.)

౪. బహిర్భాగము, వెలుపల.

ఆ. భక్తిగాలిచిరాఁగఁ బ్రాగ్జ్యోతిషంబుపై, విడిసెఁ దక్షుప్రతమున విభుఁడు
భార. సభా. ౧. ౨౨౭.

ఉ. .. పరస్పరాత్మలం, దాశరథులుపైన
బిమ యాకృతులచ్ఛటం బైకిదోప . .
ఆము. ౧. ౧.

సీ. అర్భకకీర్తి పై కావిర్భవించెనోయన మోము
పాండిమ యతిశయిల్లె   వి(ప్ర. ౧. ౩౭.

మ. . శ్వేతలయూచెం గలకంఠి యచ్చెరువునం
దాటంకరత్నప్రభల్, పలుకంబాతీవ చెక్కు
టద్దముల పై బైపై విలంఘింపగాన్.
కాశీ. ౫. ౧౭౭.

౨. ౧ మీదనున్న.

చ. కెరలుప్రవంతిం బై యినుక క్రిందగుజేశి
ఆము. ౪. ౧౫౦.

సీ. నీపలుకుటెండ్లేవి పైకిమ్ము దివ్వించు ...
బిల్హ. ౧. ౪౧.

౩. బహిర్భాగమందున్న, వెలుపలనున్న.

క. గడివాడు చెడునెయుం దిగుం, జెడజేయుట,
చెడదయేని చెల్మియు దగుం బై, గడివాండేపని
కగుం దన్, గడివాం డరియైనం దనకె గడికావం
ఒనున్.   ఆము. ౪. ౨౭౭.

(దీని యామ్రేడితరూపంబు, 'పై పై.')

పైపై = పైపయి ౧. మీదను మాత్రముండు
నది. (నిజముపమా లేదని భావము.)

శా. . . కుకవిప్రణీతకృతి సామ్రాజ్యాకృతిం
బూని పైపై వన్నెల్ పచరింప దానిం దిల
కింపం బోరు ధీరోత్తముల్.
వసు. ౧. ౧౯.

౪. మిక్కిలి, అత్యంతము, అధికము.

సీ. పైపై మహాశ్చర్యపర్యుత్సుకంబులై తన
మీద పృథులస్తోత్రములు వ్రాల.
వైషు. ౪. ౧౩౪.

౫. మతిమతి, కొనుకొంట.

ఉ. ఏనుగు దాంపునం దెలుం చేర్పఁడం
చెప్పతి. ఆ విబుధమానవతీమణి ప్రేమ
తోడం బైపై నడుంగన్ విదేశి మెలకపాటియు
చిల్కల కేమిసేప్పినన్. (కళా. ౫. ౪౩.)

గీ. జల్లుకొని వచ్చెం బైపైన సారమేయ,
యూధములు వేదమనుమూర్తి లుద్ధతిమున.
హర. ౩. ౩౭.

౪. సాధ్యమగు, సుకరమగు

ఉ. ధనము సంపాదించుట పైపైనున్న దను
కొంటివా '

పైపైగా = పయిపయిగా, సులభముగా.
వ్యవ ఆ తప్పు పైపైగా తేలిపోయినది
(శ. ర.)

పైపైమాటలు = అంతస్సారంలేని మాటలు

పైపై చదువులు = అంతస్సారములేని చదువులు,
మంచిజ్ఞానములేని చదువులు.

పైపైపనులు = బాధ్యతలేని పనులు.

పైమీదిబట్ట = ఉత్తరీయము.
వ్యవ. వాడు తొందరలో పైమీదిబట్టకూడ
మఱచి పోయినాడు

పైపని = వంటతప్ప తక్కిన పని.

(వాడుకలోని ప్రయోగ విశేషములు.)

వ్యవ మాకీ సంగతి పైగా దెలిసినది.
,, అది మనలోమన యుండవలెనుగాని పైగా
పోరాదు.
,, మాకీ పనివలన లాభములేదు సరిగదా పైగా
నష్టముకూడం గలిగినది.
,, ఏవీ పనిచేసి పైగా నామీదం బెట్టితివి.

౫. పైంటు, పైటకొంగు, పైంజేలు, పైంబడు,
పైంబెట్టు, పైపాటమి, పైకోము, పైకొలుపు,

పైచీర, పైచెఱఁగు, పైచేయి, పైచేయు, పైనడచు, పైవచారము, పైపడు, పైపయి, పైపాటు, పైపెచ్చు, పైయెద, పైవచ్చు, పైవెట్టు, పైవోవు

**పైంగి.** ౧౦. వి. ౩. పుం యామ్యుఁడు.

**పైంజూషము.** సం ౫. ౨. పుం. చెవి, కర్ణము.

**పైండిక్యము.** సం ౨. న భిక్షుకత్వము, భైక్షుజీవిక.

**పైండిన్యము.** సం. పైండిక్యము.

**పైఁట, పయఁట, పయిఁట, పయ్యట.** వి. (పై + అంట - వృ గిని వ్ణాలోప వర్ణవికారరూపములు. సం. ౯ాత (ప్రా. పఇరా) పయ్యెద, కుచోపరిచేలము, స్త్రీలటొమ్మవీఁది వస్త్రము.

సీ. కాంతో త్తరీయంబు పైయెద పయ్యంట పైట పయిట. (ఆం. భా. ౨. ౧౫౫)

సీ. అంగకంబులతొగు లరసి యీూమఁ దొడంగె సడలసీవయ్యె నెప్పుడును పైఁట కళా. ౬. ౨౦౩.

ఉ. పైటకు లాగులాడి కటిపై ఘటియించిన చేవిడబ్బలన్ .. పోరాటముబాయిసా యన కోయారి యొడాటములకా పాట పాటిన్. పాంచా. ౫. ౭౦.

**పైఁటకొంగు.** వి. (√ పైఁట.) పయ్యెదచెఱఁగు.

గీ. వయసుదెల్పెడుగతి కంకణములు మెఱయఁ, గొపుసలియుంపఁ బులకలు గ్రమ్మకొన్న, సబ్బియరగానరాఁ బైఁటకొంగుజాఱ, మసవ యాగతి తెగువతోఁ దిసువ నఠఁడు. దశా. ౩. ౬౮.

క. ... నిట్టూర్పు పవనంబు జవనంబునం బైఁటకొంగదలింపఁ (మనుచ. ౩. ౭౮.)

ఇష్టి: పైఁటచెఱంగు.

సీ. కులకించు జిలుఁగుదువ్వలువ పైఁటచెఱంగు జాఱువాపొర్లు వసంతమాన . ప్రబంధ. ౧౯.

**పైఁడి=పయిఁడి, పసిఁడి, పహిఁడి, పహిఁణి.**

వి. ౧ సువర్ణము, బంగారము.

సీ. కనకాచలేంద్రంబు గళమునఁగట్టిన కిమనీయమగు పైఁడిగంట గాఁగ. కు. స౦ ౮. ౭౭.

ఉ. వాసనఁ గేతకీదళముపంకిఁ గళింకము లేని పైఁడి య,భ్యాసముచేసెనేని యగునప్పుసమానము నైష. ౯. ౪౩.

౨. ధనము, రొక్కము

దండకము లోకత్రయిక్ నీకు వప్పు-కునేమారునిక్కా జారునికా జేసి రప్పింతు సేబ్రాఁతి యే పైఁడి నాపైఁకి యేపైఁడి లే దింటిలో వింటివా (భోగినీదండకము. ౧౧ పా.)

సీ మును ప్రతిశ్రుతము చేసినపైఁడి రాని న్న ముచ్చిచ్చునను వేగ పచ్చుదనుక. గీ. వనరు... పాండు. ౪. ౧౪౯.

సీ. తటి చూచి యిచ్చె సెద్దానిఁ బట్టికఁ దల్లి జూదమాడినపైఁడి సుట్టుకొనిన. కాశీ. ౪. ౯౯.

౩. ఒకవిధమగు బంగారునాణెము.

క. వినుపగు నలిగానము విని, వనదేవత గరము మెచ్చి వానికి నొసఁగం,జనఁ బైఁడుల బీడెలు ప్ర,చ్చినవిధమునఁ బొన్న లెలమిఁ జెలువుగఁ బూచెా. (కు సం. ౪ ౪౫౭.)

శా. . ధర్మైకవిత్తార్జనన్, సంభూతం బగు పైఁడి కోటికొకపైనాణాటికి స్వాచ్ఛ్యము. . ఆము. ౭. ౩౫.

౪ పిల్లలకు ముద్దుపేరు. (కానులు మొ.వంటిది.)

దండకము. . . నే మారుని జారుని జేసి
రప్పింతు నే బ్రాఁతిరయే పైఁడి వాల్గైఁడి యే
పైఁడి లే దింటిలో వింటివా
భోగినీదండకము ౧ . పా.

౫ కన్యాశుల్కము, ఓలి

గీ. ఈంకు వన్నె లి యనఁగ ౦ కనంగఁ,
పైఁడి యనఁ గన్యాశుల్కనామక మగు.
ఆం. నా ౧౪౯.

౬ వేశ్యాభృతి

సీ. లో యనఁ ఁ దన రొక్క మనంగను
వేశ్యాభృతికి సంజ్ఞ వెలయుచుండు.
ఆం. నా. ౨. ౨౦౩

జా · పైఁడికంటి¹, పైఁడికంటి, పైఁడికొండ,
పైఁడిగోల్లె, పైఁడిచాలాలు, పైఁడిబల,
పైఁడితంగు, పైఁడితామర, పైఁడిదొర,
పైఁడిసెలఁత, పైఁడిప్రత్తి, పైఁడిముడుము,
పైఁడియుమ్మె, పైఁడివచ్చు, పైఁడిపట్టు.

పైఁడికంటి¹ = పయిఁడికంటి. వి (పైఁడికన్ను
కి. పైంగణ్ణి) కనకాక్షి యను నొక శకునపక్షి.

(క) దీనిపలుకులచే భావిశుభములు తెలియును

వ. కౌశికంబు దబ్బు గబ్బులుఁగు గౌళి
కినుఁబెంటి పైఁడికంటి లోనగుతిర్యక్కులు
భావిప్రయోజనసూచకంబులై యున్నయవి.
ఆము. ౬. ౬౬.

గీ. పైఁడికంటి, పలుకులకీతులు ప్రశ్నభాగం
బులు హం.స. ౪. ౪౩.

సీ. . కుడిభుజ మదరిన వా నంబు దీర్చిన
పైఁడికంటి చే కిలయఁబలికిన బంగారు
కలశ, మెదురైన (ప్రబంధ. ౩౭౧.)

(చ) ఇది వీచిన అపశకునము.

సీ. చెవులపో తెదురయ్యెఁ దెమర డాదనఁ
జాపెఁ బలుమారు నిదె వీచెఁ బైఁడికంటి.
రా. ౬. ౨౩౫.

ఆ. ఒంటిపాటఁ బైఁడికంటి వీచె, నెలుఁగు
నేసెఁ బెద్దపులుఁగు పామటుదోఁచె ...
ద్వా. ౧. ౨౧౩

(ట) ఇది తఱుచు జతగూడి యుండును.

సీ. జంటఁబోవుచు పైఁడికంటులు దిరిగెఁగాఁక
నాడ నామది కెంతో వేడుకయ్యె.
కలు. ౪ ౯౦.

౨ బంగారువన్నెగల కన్నులు గలది
( )

పైఁడికంటి². వి. (√పైఁడి) కంఠభూషణము.
(కంఠభూషణము నర్థమున పైఁడికంఠె అని
యుండవలెను కాని ఆం. నా. కారుఁడు నానా
ర్థములలోఁ పైఁడికంటి అని వ్రాసియున్నాఁడు.)

సీ. కంఠభూషణమును గనకాక్షినామంబు పైఁడి
కంటి యనంగఁ బరగుచుండు.
ఆం. నా. ౩. ౫౩.

పైఁడికొండ. వి. (√పైఁడి.) మేరుపర్వతము,
కనకాద్రి

మత్తకోకిల. వెండికొండకుఁ బైఁడికొండకు
వింధ్యయన్ బలుకొండకున్, కొండ
రాయఁడు బంపె లేఖలు కోటికాలరి
పంపిచే. వీర ౩. ౧౦౮.

చ. దస్యుప్రమూఁకలు పైఁడికొండపై,
ననయముఁ గాపురంబులుంగి సన్నిధిఁ
గాచుచునుండు నెంతయున్
మయా. ౧. ౯౩.

ఇవ్లి · పైఁడిమల, మొ.

సీ. దేవళ్ల వెంటలఁ దివియుట గారాదు లలిఁ
బైఁడిమల తేఁక నిలిపి రండు.

యయా. ౩. ౩౪.

**పైఁడిగోళ్లు.** వి. బ. (√పైఁడి) కిన్నెర, వీణె మొదలగునవి మీఁటునపుడు పెట్టుకొనెడు బంగరుగోళ్లు.

ఉ. కీరము నోజ్జవాణి యొకకిన్నెరి కిన్నెర మీఁటి మీఁటి యొయ్యారపులీల నేఁగి వసుధాధిపుఁ గన్గొనె డిల్లపర్యేదర్, హారముఁ జక్కఁబెట్టెడు కుచాహితహస్తము పైఁడి గోళ్లు హింసాదతి పేయుదర్పకుని ... మల్లెలుఁబోలె మించఁగన్

మనుచ ౪. ౭౭.

**పైఁడిచూలాలు.** వి. (√పైఁడి.) వసుంధర, భూమి.

గీ. అమరెఁ బుష్పాడిదిప్పపై యంతనంత, మెట్ట దామరపాకులమీఁద జాతి, పైఁడి చూలాలి చెవిల్లు వాయఁ దోఁట, కిలిమిచెలి వెట్టు కిలవంటకంబు లనఁగ. (యయా. ౪. ౯.)

**పైఁడిచేల.** వి. (పైఁడి + చెల.) విష్ణువు ధరించెడి కనకాంబరము, పీతాంబరము.

ఉ. పైఁడిచేలకొం, గించుక జాఱ నొక్క కరకేతన హస్తము కేలఁబూని

శాకి. ౨. ౬.

**పైఁడితంగేడు.** వి. ఔ. (√పైఁడి) వృక్షవిశేషము, బంగారమువలె పచ్చని పువ్వులు గల తంగేడు. శ్రీ.

సీ. జిల్లేడు వెంపలి ఎద్దువెంపలి పైఁడితంగేడు తంగేడు తగిడి యును. (హంస. ౪. ౧౦.)

**పైఁడితామర.** వి. (√పైఁడి.) ౧. బంగరు తామర.

ఉ. . వేల్పు తేటిలో, విచ్చిన పైఁడితామరల వెంబడి వచ్చిన కమ్మగాడ్పులన్, మెచ్చుల రీతి హర. ౬. ౧౦.

౨. స్థలపద్మము, మెట్టతామర.

సీ. స్థలపద్మ మగు మెట్టతామర యనఁ పైఁడి తామర యనఁ బచ్చతామర యన, నేల తామర యన ఆం. భా. ౨. ౬౯.

**పైఁడిదొర.** వి (√పైఁడి.) ధనాధిపుఁడు, కుబేరుఁడు

సీ. అది పైఁడిదొరరాణియనఁగఁ జెలఁగెలుసుమీ యువిద గారవము సేయుదువుగాని.

సుయా. ౪. ౧౩౫.

ఇట్లే పైఁడిరాయఁడు, పైఁడిఱేఁడు. మొ.

చ. నలువయుఁ పైఁడిరాయఁడుం, స్మరలును నంద్రముల్ మొద లనందగు నిజ్జగ మెల్ల నీవయై, వెలుఁగుచునుండు వేలుపుల వేలుప, ముమ్మొనవాలుదాలుపా.

చ్ఛ. రా. సుం. ౧౮౦.

**పైఁడినెలఁత.** వి. (√పైఁడి) శ్రీకాంత, లక్ష్మీదేవి

మ. గెలుపుం పైఁడినెలంతఁ గైకొనిరు వగ్గింపన్ జగం బంతయున్ ..

యయా. ౧. ౨౨.

(గెలుపుం పైఁడినెలంత = జయలక్ష్మి.)

**పైఁడిప్రత్తి = పయిఁడిప్రత్తి.** వి. (√పైఁడి.) బంగారువలె పచ్చనిగింజలుగల ప్రత్తి, కార్పాసభేదము. (శ. ర.)

సీ. . పాషాణముల కెల్ల పైఁడి ప్రత్తి.

**పైఁడిముడుచు.** అ. క్రి. (√పైఁడి.) ౧. గర్భాదానము చేయు.

ద్వి. ముని యోఁటనే పైఁడిముడిచిన పడుచు, చదుగులు గోరోత్తి చను గట్టివాఁడు
అ. మ. క. ౧. ౩౪. పొ. ౧౧. పం.

౨. నిశ్చితార్థము చేయు. (శ. ర.)

పైఁ(పయిఁ)డిముడుపు. వి. (√ పైఁడిముడుపు.) నిశ్చితార్థము. (శ. ర.)

పైఁడియుమ్మెత్త. వి. (√ పైఁడి.) కాంచనము. శ్రీ.

సీ. పైఁడియుమ్మెత్త నాఁ బరగుఁ గాంచ.

గీ. నాహ్వయము . (ఆం. భా. ౨. ౫౩.)

పైఁడేలు. అ. క్రి. (పైన్ + ఏలు) బహిర్గతమగు, వెలువడు.

సీ. సర్వాతిశయిత రాజసము పైఁడేల నా జడగుంపు ముడికెంపు సొరుమీఱ.
ఇందు ౧. ౧౬౧.

పైఁబడు. అ. క్రి. (పైన్ + పడు) ౧. పూను, చలఁబట్టు.

ఉ. పానియు పేరువాడు నని పైఁబడి యొక్కఁడు పల్కెనేనియుం, బానినవాఁటి పత్రములఁ వాయు కెటింగిన జ్ఞాతివర్గముల్, వాసిన బందుమిత్త్రులు నొడంబడ నిచ్చిన కొన్న యప్పులుం, వానినయిల్లు పేఱ తెలుపందగువానికి నా కెఱుంగగన్.
విజ్ఞా. వ్యవ. ౧౪౬.

౨. వాపరించు, ప్రాపించు.

క. బిడ్డలకు బుద్ధి సెప్పని, గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పొండిరె పైఁబడ్డాఁ దని పీసుం డొఱఁగొడ్డెములాడంగఁ గూడు గుడిచెద వధిపా.
భాగ. ౧. ౩౧౩.

పైఁబెట్టు. స. క్రి. (పైన్ + పెట్టు.) పెరుగు.

ద్వి. వడుగులచేత నీవార్త విన్నప్పుడే, ఈడయక నే రానితప్పు పైఁబెట్టి, యలుకమై ముఖపద్మ మర్వలఁ జేసి, పలుకవో . .
ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౦౫. పం.

పైకము. వి. (క. పైక, ప్ర ప్య. త. పయిక్కం.)

౧. రెండు కాసుల నాణెము, కాకణిద్వయము.

సీ. కా సనఁగాను గాకణి పేరు విలసిల్లుఁ బైకమంచనఁగఁ దద్ద్వయము వెలయు.
ఆం. భా. ౨. ౨౪౪.

క. ఆరపైకంబును జేయని, హరివాసరమునకు నిజాత్మజుఁ దునుమన్, గవాలుఁ జేతఁ బూనినకరణి యనుపమెంలకు మేదఁ గాల్పటనుమ్మి.
దశావ్మ. ౫. ౧౪౩.

౨. రొక్కము, వెల.

సీ. . అమరు రొక్కమునఁ బైకమన ధనము.
ఆం. భా. ౨. ౨౪౫

సీ. కొమ్మ పైకమ్ము లేకమ్మజాలల కని మాచు మింగారంపుఁ జాపుదలిచి .
రా. వి. ౧. ౫౪.

సీ. గగులుఁగెం డ్లేవి పైకమ్ము దప్పించు పైకమ్ము పెస్ట నే చేకొనంగ బిల్వ . ౧. ౪౧.

౩. సమూహము.

క. సుకియు వదుము విలాసర్పైకము సెమ్మెగము దీవిమృదుమధురోక్తుల్ పైకముఁ దొగడు స్వపలాపైకములో నెల్ల మేలుబంతి బలిరా.
జ . ౨. ౧౦౪

చ. .. వీఁగెఁ బల్లకీకడల నతంబుగా నగరి కావలిఁ గాచిన రాచపైకముల్
రా. వి. ౨. ౬౪.

సీ. ... పిండు కొంత్తము తొట్టి పైకము
దాఁపెలొద్ద. గీ. . . వర్గము తగు ...
ఆం. భా. ౨. ౧౦౦.

**పైకూటమి.** ౧. (√పై.) ఉపరిసంగతము, పురుషాయితము.

సీ. ఉపరిసురతసంజ్ఞ యొప్పును మగపోల్కి-
కూటమి యనఁ బైకూటమి యన
ఆం భా. ౨. ౧౭౦.

**పైకొను = పయికొను.** అ. క్రి. (√పై)

౧. మీఱు, అతిశయించు

చ. అనియని యుగ్గడించు ప్రతి యల్లలవాడినఁ
దల్లడించుఁ బైకొనుతలఁ పోరగించు
భార. విరా. ౨ ౨౧

సీ. మాటిమాటికిఁ గూర్మి మాటువేసెద నన్నుఁ
బైకొన్నవలవంత బయలువఱుచు
విక్ర ౧ ౧౭౯

౨. (కామక్రోధాదులచే) విజృంభించు, చెల
రేఁగు

మ. ఆశ్వికులు పైకొని ఎాఁది మానుషులం
వ నిమిష క్రోధుపకు రథంబ లున
భార భీష్మ. ౧. ౨౬౩

క. చలపాడిచి అంకిలికుమును, ఒలుమఱు ముం
గాళ్ళఁ ద్రవ్వి బలువిడిఁ ఒసికాఁ, పులఁ
గ్రుమ్మి విడుచుఁ బైకొని, పాలమంతయు
నవిరు యగుచుఁ బొగిరు పెలంగిన్

సీతా ౨ ౫౬

ఉ. చీకటితప్పనం బరులచేడియలన్ గమియింప
దూతికా,లోకముమాటతీపులకు లోఁబడి
భీత్యభిమానలజ్జలన్, బోకడఁబెట్టి ప్రాణ
సౌఖ్యపోఁకకుఁ గైకొనకుండు సాహసుల్,

పైకొని చేరి త న్నుభయపాగ్య వ్యము.లంటుసు
భక్తిఁ గొల్చి రాన్. సైప. ౭. ౪౭

మ. మగవారి న్మొగమెత్తి చూడఁ గులకన్యా
ధర్మము ల్దప్పవే, తగవే పైకొనఁగాక కూర్మి
బలకంతంబైన నారాజు ధైర్యగుణో
దాతుని దర్శ మల్లముఖులారా యేల
చింతింపఁగన్. వరాహ. 3. ౧౭౯.

మ. దంతావళబృంహితంబు విని శైలాగ్రంబు
పైనుండి ప్రకొనుసింహము ... దోఁప.
దశా. ౪. ౨౨౦.

3. (యుద్ధాదులందు) ఎదుర్కొను, కవియు, పయిఁబడు.

శి దానఁ గడు దర్పి నాతని,సేన యరాతు లతి
యెత్తిఁగి వెస్పెఁ ... లసం,తానముతోడం
బైకొని, యానపతిఁ జెఱిచిరి .
గౌర అశ్వ. ౧. ౧౯

వ ఇవ్విధంబున నాచార్యుం డేచిఁ నతని
ప్రాపున భవత్సేనలు ... లంగి పెకొనియు
బాల. భీష్మ. ౨. ౬౫

సీ ... ంతెంత నగిపడినట్లు రఁగనిచ్చుఁ బైకొనఁ
జూచినఁ ఒరువువెట్టె (విక్ర ౨. ౧౨౫.)

౪. వర్తించు, కడఁగు

ఉ. మేరువు బూరిగాఁ దఱఁచు మిన్నుఱచేతన
మూయఁ బైకొనున్, నీరధిఁ బుక్కిలింతు
నను కవిక. ౫. ౧33.

క. నా కిపు డెత్తఁగింపుము మ,శ్లోకునిచరి
తామృతంబు శ్రోత్రాంజలులన్, బైకొని
జొత్తియుఁ దనివిం, గైకొనకున్నది మనంబు
గరుణోపేతా. భాగ. ౪. 3౭౬

౫. కలుగు, సంభవించు.

సీ. వలికంపుటంగిపై వలెవాటుచేసిన పైఠాణి
తగటుదుప్పటి నటింప. (రా. వి. ౫. ౩౫.)

వ. .. మేలిపలిపై సరిగంచు చలువపైఠాణి
నేఖువ మేలుముసుంగిడి
ఉ. రా. ౪. ౧౩౮.

**పైఠిణీ** = పైఠాణి. వి. జమ్. జలతారు.

తా. కంగుల్ దరిన పైఠిణీ వలె వన్నెటి
గాణింపఁగాఁ, జెంగల్వల్ నెఱిగొప్పునం
నౌల పై నెంతం గుబాళింపఁగా
విజ. వి. ౨. ౧౫౪.

ఉ. మేలిపసిండివ్రాఁతచనుమిట్టులకుఁ గాలిచల్వ
పైఠిణి, చేలచెఱంగులై యచటఁ జెల్వగు
జెలుపుకోటి పెంచరల్
ఉ. రా. ౧. ౫౮.

**పైరీనసి.** సం. వి. ఇ. పుం. ఒక ఉపస్మృతికర్త
(కల్ప.)

**పైతామహము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧.
పితామహసంబంధి. ౨. పితామహునివలన
ప్రాప్తము. ౩. పితామహుఁడు (బ్రహ్మ) అధి
దేవతగాఁగలది. (అస్త్రాదిi.)

**పైతామహికము.** సం. విణ. (అ. ఈ. అ.)
పితామహసంబంధి

**పైతృకము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. పిత
వలన ప్రాపించినది ౨. పితృసంబంధి. ౩.
పితృదేవతాకమైనది.

వి. అ. న. పితృదేవతావిషయకమగు శ్రాద్ధము.

**పైతృమత్స్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧.
కన్యకొడుకు, కానీనుఁడు. ౨. ప్రసిద్ధుఁడగువాని
కొడుకు. (విల్యమ్సు.)

**పైతృష్వసేయి.** సం. వి. ఈ. స్త్రీ. మేనత్త
కూఁతురు.

**పైతృష్వసేయుఁడు.** సం. వి. అ. పుం.
మేనత్తకొడుకు.

**పైతృష్వస్రీయ.** సం. వి. ఆ. స్త్రీ. మేనత్త
కూఁతురు.

**పైతృష్వస్రీయుఁడు.** సం. వి. అ. పుం.
మేనత్తకొడుకు.

**పైత్తము.** సం. విణ. (అ. ఈ. అ.) పిత్తధాతు
వుచేఁ గలిగింపఁబడినది (జ్వరాదిi.)

ఇట్లే. పైత్తికము.

**పైత్రము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. పితృ
సంబంధి (శ్రాద్ధాదిi.) ౨. పితృపితామహ
సంబంధి. ౩. పితృదేవతాకము.

వి. అ. న. ౧. అంగుష్ఠతర్జనుల మధ్యభాగము.
౨. పితృసంబంధి. (దినము, మొ.)

**పైద** = పయిద. వి. (ఉ. పైదల్.) పిల్లవాఁడు.

క. పసుచుం బైదలు పన్నిద్దఱ గడవి చనక చింతా
తోడి కియ్యమునకు కేఁ, గడఁగుట తగదవి
యాయని, విడిచి దశాననుఁడు వారు విన ని
ట్లనియెన్. నిర్వ. ౪. ౪౩.

ఆ. తిరిగితిరిగి యుద్ధికఁ జనవ త్త్రిముతోడఁ, గోఁట
దొడ్డి చొరఁగఁ గాలఁబోయి, ఉసుచుఁ
బైద పెంపు ఒడి నొవ్వ నడుమునన్, రేమి
సేతు నంచుఁ బ్రేమఁడించి.
భోజరా. ౪. ౧౩౮.

ఉ. . . అలరు బిడ్డలు బంటుఁ బైదలై
మూలధనార్జనంబు నిలు ముంగిలియై గళ
వృష్ట పర్వతాన, వాలినవారి కెట్టు లయ
వర్గము భర్గ . . . (పాండు. ౫. ౧౭౨.)

చూ. పైదలి.

**పైదలి** = పేయుదలి. వి. (పైత + అలు.) ఆఁడుది, స్త్రీ.

సీ. జవరాలి సెజ్జపై జడవాహములు మించఁ దడియార్చి ముడిచెఁ బైదలి యొకర్తు. వసు. ౫. ౧౧౭.

ఉ. ... నూఱుఁగఁజొచ్చె వంటసే, పచ్చని వింటువాఁ డపుడు పైదలిపైఁ దలిరాకుఁ గైదువుల్. విజ. వి. ౨. ౧౭౪.

క. పైదలి నలు పెన్న నలుతపడఁతికిఁ దరమె. అచ్చ. రా. బాల. ౧౩౫.

**పైనడుచు.** అ. క్రి. (పైన్ + నడుచు.) దండెత్తి పోవు, మీఁదికి నడుచు.

గీ. వరుస మాళవబర్బరధరణిపతుల, పైనడిచి భీషణంబైన భండనమున, ఒహలువిభాయుధ పటిమచే భంగపఱిచె. (శివా. ౧. ౧౧౫.)

**పైనమ(ముల)గు** = పయనమగు. అ. క్రి. (√ పైనము.) ౧. బయలుదేఱు.

ఉత్సాహ. ఇంకశంకలుజ్జగించి యవ్విభుస్, బ్రాపులేదు కొండుపాండు పైనమై ధరిత్రికిన్. వి. పు. ౫. ౭౩.

ఉ. పైనము లైరి పాండునరపాలతనూజులు పాంచాలీ. ౫. ౪౭.

వ. .. అతనితోడగూడఁ బావకపతేతగాజ పాకపాణులు పైనంబులైరి. పైమ. ౩. ౩౭.

౨. దాడివెడలు, దండెత్తు.

క. తనతేజము తనబలమును, దనగర్వము తన మదంబు దనసంపదయున్, ఘనతరముగ వచ్చెరవుగఁ, బనిగొనఁ బరమేశుమీఁదఁ బైనంబయ్యెన్. వీర. ౨. ౯౨.

**పైనము** = పయనము. వి. (సం. ప్రయాణమ్. ప్రా. ప్రయాణం.) ప్రయాణము, బయలుదేఱుట.

ఉ. పైనమి దేలయన్నఁ గ్రతుభంగముఁ జేసిన దోసము .. కళా. ౨. ౧౩౪.

ఉ. పడిమరకట్టగాడ్పుదురఁ బైనముపోఁగని వెల్గురేఁడు. చంద్రా. ౨. ౧౭.

పైనముచేయు = బయలుదేఱఁజేయు.

ఉ. పైనముచేసి తంత్రీశను పంచెను వంతను తోడ నిట్లనెరా, ధ్యానగిరింబు వెల్వడి . . చం. గా. ౨. ౨౧.

జ పైనము.

**పైపచారము.** విశే. (పై + పచారము.) వంచకము, కపటమైనది.

క. నయగారపుఁదమిఁ గపటప్రియముల మెఱు మెచ్చుఒక్కరింతను మిథ్యావచనములను పపచారపు నయగున మానిఁగూడి కొన్ని నాళు రమింపన్. విప్ర. ౪. ౧౩.

**పైపడు** = పయిపడు. అ. క్రి. ౧. మీఁదఁబడు. (౧. రి.) ౨. పైకొను, కవియు, సంభవించు.

క. ఆపద సమస్తలోకములఁ బ్రాపించుఁ దోలంగు నపుడు పవనముభంగిం, బైపడునాపద దిగ్విచిన, భూపాలా తఱచు గోసఁ బొందు శుభంబుల్. భా. రా. అర. ౨. ౨౪౪.

(రెండిటికి నిదియే యుదాహరణము.)

౩. కడఁగు, ఉద్యమించు

క. పాపాత్ము లారుల నూరక, చూపోపక బాధ పెట్టఁ బోయుదు రెందున్, బైపడుదురు దుష్ప్రాధుల, దీపించిన పాటివారి తెరువదు గఱ్ఱ. శేష. ౪. ౪౩.

౨. కేలొకటి, భిన్నము.

క. కేలొక టనఁ బైపెచ్చన, మాట యున్మడి
యనఁ సమాప్యాయములు పెం,పాటును
వస్త్వంతరమును,కు . ఆం. శే ౧౫.

పైయెద = పయ్యెద, పయ్యెఁద. ి. (పై +
ఎద) పైఁట.

సీ.. ాంతో తరీయంబు పయ్యెద పయ్యంట
పైఁట పయింట. గీ. పైయెద పయంట
నాఁగను బరగుచుండు .
ఆం. భా. ౨. ౧౯౫.

పైరి = పఱర, పయర. (శ ర.)

పైరగు = పయిరగు. అ. క్రి. (పైరు + అగు.)
౧. సాగుబడియగు.

సీ. అన్నె నేతకుఁదొచ్చినపుడున్నదీవితోఁ బైయా
ఱుదీవులు పైరు గావ. కళా. ౧. ౧౨౯.

౨. పెరుగు, వృద్ధినొందు.

లయగ్రాహి. . సహకారమిలదేలా,ధార
ముల జారుహిమవారిశ్రీతసారణులఁ చైరైన
చెంగలువయూరికలలో
వసు. ౪. ౨౨.

పైరము = పయిరము. వి. ౧. ధేనువు, ఆవు.

ఉ. కట్టిన కొండ్రోకళ్లు తమకే తమకే పిలు
పంచుఁ బైపయిక్క, గోష్టిలు పాఁడిపైర
ములు కోకలు గూకలు ముందుముందుగా,
కట్టుని రిచ్చి వచ్చి అలవాకిలి గాతురు
కేకరింబవల్ పై జ. ౨. ౩౨.

చ. బంటుబానిసలుఁ పైరియుఁ పయ్యెయుఁ
జేనుచెట్టు లో,నయినసమ ప్రపంచదలు వన్న
బత్తిక్కి వచ్చపెట్టఁగాఁ, బ్రియులు ధరించు
సొమ్ములకుఁ జేటుపెట్టఁ జలింప కంతకున్.
కళా. ౬. ౭౫.

పైరు = పయిరు. వి. (క. పయిర్. త. పయిర్.
బ. పైరులు, పైర్లు, పైళ్లు.) ౧. సస్యము,
చేను.

సీ. పై 'నంగను బయిరుకా నకి యనఁ
గాను సస్యము చెలఁగు ...
ఆం. భా. ౨. ౩౯.

చ. .. పువుఁదేనియునసోనకాలువల్, జనము
పైరుపంటలకుఁ జాలవె యిన్నటికైన సెన్నఁ
గఁ . ప్రభా. ౧. ౨౨.

ఉ. కొల్లగపెల్లపైరులను గొంతును జంతున
శేక మేయఁగాఁ, దల్గడిమంది వచ్చితిమి .
నీలా. ౨. ౫౪.

౨. మొదటిపంట తర్వాత పొలమున పెట్టెడు
సస్యము.

వ్యవ. మొదటిపంట సొమ్ము దానిది దానికి సరి
పోయినది. పైరువలన నాలుగు వందలు
వచ్చినవి.

౩. ధాన్యము.

వ. కలియుగమహిమలు కానరులు కాశీ
ప్రయాగలు ఎప్పటిమూలు గమ్మనరులు అను
నూటనాలుగు వగల పైరుల చేరుదు
బియ్యంపు వటిపసారంబులు .
ప్రబంధ. ౧౧౨.

గీ. పచ్చడంబులు సెనగలు పంచదార, పనస
పండ్లును జెఱకులు పైర్లు శన్ను,బియ్యములు
కూరగాయలు నెయ్యి మేఁక,పోతులాదిగ
గొలుచు విద్యార్థి మెలసి.
పట్ప్రశ్రీ. ౨. ౪౨.

౪. ఓషధి. (చూ. పైరులరొక్కిమీఁదు.)

ప్రయోగ విశేషములు : పైరుగాలి.

పైరుధాన్యములు = పెసలు, మినుములు'
మొదలు. మొ.

వ్యాక. పైరుగాలి వీచినచోఁ జేను పెరుఁగును.

చూ. పైరగు, పైరులయేలికమీఁడు.

పైరులయేలికమీఁడు = పయిరులయేలికమీఁడు. వి. (√పైరు) ఓషధీశుఁడు, చంద్రుఁడు. (శ. ర.)

పైలపేటా. వి. అలంకారముగా చేసిన ఒక విధమగు అంచు.

సీ. మెలిపెట్టి చుట్టిన తెలిపరంగిముండాసు పైలపేటా దట్టి పసలఁ జెలఁగ

శుక. ౨. ౪౭౮.

సీ. మెలిగొనఁ జుట్టిన తలపాగచెంగుంచి పైలపేటాచుట్టు పట్టుశాలు. (హంస. ౨. ౨౬.)

పైలుఁడు. సం. వి. అ. పుం., ఒక మునివ్యాసశిష్యుఁడు.

పైవచ్చు. అ. క్రి. (పై + వచ్చు.) మీఁదికి వచ్చు, ఉపద్రవకరమగు.

వ. అతఁడంబ పరదానగర్వంబున నుద్వృత్తుండై కదంగి.

క. ఆహార మ స్త్రకమునఁ గదు, సాహసమునఁ జేయివట్ట జడియక యదియుఁ, ఓహో తన మెచ్చులు తను, కావఁ పైవచ్చెననుచు నథవుఁడు వీతెన్.

(భాగ. ౧౦. ఉ. ౧౨౪౦.)

గీ. రఘుకు నట్టింటిపగవాఁడు కమలవైరి, కింనుఁ బోలిన యుగ్రశేఖరుఁడు వాఁడు, పేనమానని చూడకు మాను చెలిమి, యటకుఁ బైవచ్చు కొలుఁగకే మారికుమారి.

విజయ. ౩. ౪౮.

(కంతర్థముల కివియే యుదాహరణములు.)

పైవెట్టు. అ. క్రి. (పై + పెట్టు.) బయలుపఱుచు, ప్రకటించు.

సీ. పైపెట్టమియె కాని పైకొనఁదమిఁగల్గి సత్రీ పులకలు సాక్షిపలుక. (కవిక. ౩. ౨౧౩.)

పై(పయి)వోవు. అ. క్రి. (పై + పోవు.) ఉన్మార్గగామియగు, త్రోవతప్పి నడుచు.

వ. కరాళింపక లాఁతసేయక పైవోవక కొక్కిరింపక ... (ఉ. హరి. ౪. ౨౧౩.)

(వీరేశ. పా. - పయివోవు, వావిళ్లి. పా.)

పైశాచము. సం. విశే. (అ. ఈ. అ.) ౧. పిశాచకృతము. ౨. పిశాచసంబంధి.

వి. అ. పుం. ౧. పిశాచము. ౨. వివాహభేదము. (నిద్రించియు త్రాగి మైమఱచియు శీలము పరాకుపడి యున్న దాని రహస్యముగా చెఱచి కొను వివాహము. ఇది అష్టవిధవివాహములలో నధమము. శ్లో. సుప్తాం మత్తాం ప్రమత్తాంవారహో యత్రోపగచ్ఛతిస పాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమో ఽధమః) ౩. అయోగశీలి సంఘభేదము. ౪. దానభేదము (అక్రోశించుచు యిచ్చుట గాని యిచ్చి యాక్రోశించుటగాని గలది.)

పైశాచి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఒకానొక ప్రాకృతభాషాభేదము. ౨. రాత్రి. (విల్యమ్సు.)

పైశునము. సం. వి. అ. న. (పిశునభావము.) ౧. కొండెగానితనము. ౨. దూర్తత్వము, వంచకత్వము. ౩. దుష్టత్వము.

(ఇట్లే : పైశున్యము.)

పైష్టము. సం. విశే. (అ. ఈ. అ.) పిష్టసంబంధి.

క. ఉత్తానశయుఁడు బోడుగుడు, పొత్తులలో
నునికి దివ్యపురుషుఁ డని కేమో, మత్తులు
నిముఁ గానరు    పరమ. ౧. ౧౪౫.

సీ. భవపరాఙ్ముఖుఁ డైన పగిది సత్త్వముఁగూడి
పొత్తులపాన్పుపైఁ బొరలఁబడియె
కాశీ. 3. 30.

ఉ. ఎత్తిన నిబ్బరంపుఁబరు వించుక తగ్గక బల్
మెకంబులన్, హత్తఁగఁ దాకు గాయములు
నారసి కోపెద మన్న లజ్జగో, పొతుల కెల
పొత్తులని యొల్లఁడు
చంద్రా. ౨. ౫౧.

వ. అటఁ జని యుత్తరప్రదేశంబున ముక్తిక్షి
వసుండగు వసుంధరారమణుండు మెత్తని
పొత్తిం దలమేనితడి యొత్తిన యనంతరంబ.
ద్వా. ౭౦౪.

మ. మసొత్కుమారు చని నిల్పి వెం,
దలిపూజాంపు పొత్తులం గొదవి ధాత్రీ
జాతముల్ జోలవాడె.
వసు ౧ ౧౭౭.

౨. క్రిమికోశమువలనఁ గలుగు తంతుసము
దాయము, పట్టు.

(చూ. పొత్తిచీర, పొత్తినూలికాయ. మొ.)

౩. పోఁకఅరఁటి మొ. వెల్లపై పట.

ఉదా: పోడుముపొత్తి, పోఁకపొత్తి. మొ.

సీ. మనువోఁకపొత్తిఁ గప్పిన దొప్పగిమితోడ. .
ఆము. ౧. ౭౭.

౪. వత్తి, ఒట్టబద్ద.

సీ. . . వత్తి ఎగఁగుఁ జొత్తి.
ఆం. భా. ౨. ౧౫౪.

౫. పీలికలతో పొత్తిగాచేసిన కాఁగడాకొన,
కరదీపికాముఖము.

ఉ. కాఁగడా బాగుగా వెలుగుటలేదు, పొత్తి
మీఁద కొంచెము చమురు వేయుము.

౬. (పొత్తిపలె మెత్తనైయుండెడి చెంక్కకొన్న
యొక్క) కండ, పొట్ట.

ఉదా: లేఁత చెంక్కకొన్నపొత్తులు తినుటకు
బాగుగా నుండును.

జ. పొత్తి¹, పొత్తిచీర, పొత్తిదామరం, పొత్తి
నూలికాయ, పొత్తినూలిపువ్వు, పొత్తి
నూలు. పొత్తిపాగ.

పొత్తి². వి. (సం. వర్తి. ప్రా. వట్టి.) క్రేఁగడుపు,
పొత్తికడుపు.

సీ. ఇది పొత్తి సెలవిన మృగనాభి మృగివేత్తు
రులు గప్పళించిన సెలవులయ్యె.
రా. ౭ 3. ౫౪.

౭ పొత్తికడుపు.

పొత్తి³. వి. విశల్య. శ్రీ.

సీ. తనకు విశల్యయై తరిగొట్టె వెన్నచెఱుకు
పొత్తినాఁగ    ఆం. భా. ౨. ౭౮.

౨ పొత్తిగడ్డ.

పొత్తిక¹. (సం. పుత్త్రికా. ప్రా. పొత్తిఅ
పొత్తి¹+ఇక, స్వార్థమున) బొమ్మలకు కట్టెడు
చిన్నవస్త్రము.

క. కురువీరుల గెలిచి తదంబరములలోఁ జిత్ర
వర్ణభాసురములుగాఁ, దర మెంతేఁగి లోన
కోత్సవకరములుగా బొమ్మపొత్తికలకుం
డెండీ.    భార. విరా. ౪. ౪౪.

ఆ. కర్ణసింధురాజకౌరవేంద్రాదుల, తలలపాగ
లెల్లఁ దడవి తెచ్చి, యేమపొత్తువిలిమి
నిచ్చితి విరటుని పుత్త్రి యడుగ బొమ్మ
పొత్తికలకు.    భాగ. ౧. ౩౭౫.

౨. (శిశువుల కుపయోగించు.) వస్త్రఖండము,
గుడ్డముక్క.

వ. పొత్తికల నత్తమిల్లిన యయ్యుత్తానశాయినిం
దనపాలిగిట నిడుకొని సవినయంబుగా

ఎన్నిధి విలిచియున్న మరున్నటితిలకముం

దేటచూచి. కృ. శతం. ౧౯౩.

౩. దొప్పు. (సం. పుటీ.)

శా. . సఖా సుఖం బెట్లుగ కిండ్లన్ భిక్షు

భిక్షించి యంత్రాతుం బొత్తికఁబెట్టి తెచ్చి

మరమధ్యం జేర్చితిం జూడు నేఁ, డీకొండా

టపుటెల్క యు శక్యంబుగ కి క్లైహార

భక్షించెడిన్. వేం. పంచ. ౨. ౧౨.

**పొత్తిక².** వి. (పొత్తు + ఇక, స్వార్థమున)

కూడిక, సంగతి, కలయిక

గీ. ఆజ్ఞపొత్తిక సంపద లక్ష్మి నిచ్చి, బంధు

వర్గంబుఁ బోషింతె బహువిధముల

విక్ర. ౪. ౩.

(ఆజ్ఞపొత్తికన్ = ఆజ్ఞయొక్క కలయికతో, ఆజ్ఞచేసి, లని భావము.)

**పొత్తికడుపు.** వి. (పొత్తి² + కడుపు.)

క్రిందికడుపు, నాభిక్రింది కడుపు.

(వ్యవ.) ఆమెకు పొత్తికడుపులో నొప్పి

ఎక్కువగా నున్నది.

సీ. పొత్తికడుపు క్రిందికుపు నాఁగనువత్తి

చన్నొందు. ఆం. భా. ౨. ౧౩౭.

**పొత్తిగడ్డ.** పు. (పొత్తి¹ + గడ్డ.) పొత్తి,

విశల్య. శ. (శ. ర.)

**పొత్తిచీర.** వి. (పొత్తి¹ + చీర.) పట్టుచీర,

కౌశేయము.

సీ. చెలఁగి చెలఁగి పొత్తిచీరలు గట్టెదు మాకు

కమ్మకు దర్శమాయురస్తు.

క్రీడా. ౨౧౪.

వ. . మనుష్యుండు ధూపద్రవ్యంబులు గాని

చీమ యగు ... పొత్తిచీర గాని పసిఁడి

పుర్వగు. మార్క. ౨. ౧౧౭.

**పొత్తిదామర.** వి. (పొత్తి¹ + తామర.)

ముడుఁగుఁదామర, నమస్కారి శ. (శ. ర.)

**పొత్తినూలికాయ.** వి. (పొత్తినూలు+కాయ.)

పట్టుకాయ, పట్టుపురుగు కాయవలె నిర్మించెడి

గూఁడు.

ఆ. తనకుఁదాన బంధ మొనరించుకొనియెడు,

పొత్తినూలుకాయ పురువుభంగి, నగుణ

మయ్యు సగుణతావాప్తిఁ బొందు నత్తఱము

ప్రకృతి గుణము సంక్రమించి.

భార. శాం. ౬. ౧౯.

**పొత్తినూలిప్రువ్వు.** వి. (పొత్తినూలు+ప్రువ్వు.)

పట్టుదారములు చేసెడి పురుగు, పట్టుపురుగు,

పట్టకీటము.

గీ ఆయఁ గీలు పరిగ్రహ మది సమగ్రమై

నతఁడు పొత్తినూలిప్రువ్వట్లు తాన, తనకు

బంధంబు గావించుకొను లతాంగి .

భార. అను. ౪. ౨౩౦.

**పొత్తినూలు.** పు. (పొత్తి¹ + నూలు.) పట్టు

కాయనుండితీయు తంతుసమూహము

(చూ. పొత్తినూలికాయ. పొత్తినూలిప్రువ్వు.)

**పొత్తిపాగ.** వి. (పొత్తి¹ + పాగ.) పట్టుపాగ.

ద్వి. పాపఁ జుట్టినయట్టి పొత్తిపాగలును,

గసటు లేనట్టి నీరావిదోవతులు.

ద్వి. పరమ. ౩. ౧౭౭. పా.

**పొత్తు.** అ. క్రి. (త. పొతు. క. పొత్తు.) ఒక

దానితో నొకటి కలయు.

ద్వి. కోరయుఁ బొత్తినకొంగునఁ గప్పు, ధోరయఁ

జని కివాగాంబు జొచ్చి

బస. పు. ౩. ౪౧౪. పం.

వి. ౧. స్నేహము, చెలిమి.

సీ. మంతనం బుండి యమర్త్యులతోడి పొత్తిం
తియ చాలు నిం కేల యనుచు.
భార. ఆది. ౨. ౨౧.

క. కౌరవనాయక పాండుకుమారులు నీతోడి
పొత్తు మఱియెద మనఁగా
భార. ఉద్యో ౨. ౩౪౩.

(పొత్తు = పొత్తునన్)

క. ఇత్తెఱఁగున మృగజాతుల, పొత్తులు మే
మెఱుఁగి మనుచు భూవల్లభుడుం, జిత్తము
లోపల నామునిసత్తము సద్వృత్తమునకు
సంతసపడుచున్. భాగ. ౯. ౬౦౦.

౨. సహస్థితి, సహవాసము, కూడియుండుట.

ఉ. చేటు పురంబున వారి కెప్పుడున్, గాకటు
లుండు నిటి యువగాఢ బ్రౌఁబొత్తుమనంగ
వచ్చునే. భార. విరా. ౩. ౩౨.

సీ. శాడబంబును దాను వాథోకుక్షిలో సరి
పొత్తైమన్న దుర్జాతి వీఁడు.
నైష. ౨. ౭౨౨.

చ. మగులపొతున స్మైలఁగు మానల కేడ
తలంబు లారియున్.
పా. శకుం. ౨. ౨౨౩.

౩. (అన్నపానాదులంపు) కలయిక, కూడిక,
సహభావము.

క. పొత్తునఁ గుడుచుట యుభయము గూడు
దూషించుటయున్.
భార. అను. ౪ ౧౦౯.

చ. తనఁ గనుఁద్రాపి రొుండొకలతిం బతి
కొడుకు తేఁటిబోఁటిపొత్తున విరదనెగ్రలఁ
గ నెపుర్వడి పారి. ౩. ౫౭.

సీ. .. పువ్వుబోఁటులఁ దానఁ బొత్తుల భుజి
యించు మధురసంభావితవిధిఁ దొలంగి.
కాశీ. ౨. ౧౧౮.

౪. సహభోజనము, సఖ్య, బంతికుడుపు.

సీ. పొత్తనఁగను పఙ్క్తి పొలంచు ..
అం. భా. ౨. ౧౪౯.

సీ. ఏను బొత్తుకురాక రొున్నఁడు నారగింపని
యనురక్తు మజ్జనకుఁ దలఁచి.
విక్రి. ౬. ౫౯.

౫. సంబంధము.

క. కిడుఁబెద్దకాల ముండితి, కొండఁబడి యిం
డెంతకాల మున్నను మన కయ్యెడులాభ
మేమి మఱి రొుప్పుడు నుచితమె రొురుల
యిండ్లపొత్తున నుంకెన.
భా. ఆది. ౭. ౨౮.

(ఒరులయిండ్లపొత్తు = పరాధీనత అని భలితా
ర్థము.)

గీ. ఉత్తమక్షత్రియుల నెల్ల నుగ్రవృత్తి, నేఁడు
పదినాళులేని నానికతిశరచయములఁ
గూల్చితి వేసరినట్టులయ్యె, మునితోడిపొ
త్తిం కిట మాను టొప్పు.
భార. భీష్మ. ౩. ౨౬౪

౬. సమష్టి, విభక్తిలి, ఉమ్మడి.

సీ. బలదేవుఁ డిది నాకుఁ బద్మనాభునకును,
బొత్తులసొమ్మను బుద్ధి నేసె.
హరి. పూ. ౩. ౨౫౬.

క. ఉత్తమగురుద్రవ్యంబును విత్తంబును వగ్ర
జునికి నంశాంశంబున్, బొత్తున నిచ్చి సహో
దరు, లత్తి సమాంశంబు గొనుట యర్హం
బెందున్. విజ్ఞా. వ్యవ. ౧౨౬.

ఉ. ఒకనిపొతు గూడి రొూదచేరముకోరొుదవు
పదాన్న దానధనముకొలకు.
కళా. ౬. ౯౮.

(పొత్తుగూడి = ఒకనితోఁగూడి, ఉమ్మడిగా
అని భావము.)

గీ. లేచి మెలపునఁ దాను గీలించి యున్న,
మెట్టు సడలించి వాకిటఁ జేటినట్టి, తడికఁ
గేడించి పొదరునఁ దార్చి భూమి,నురళిఖా
మణి యటు తొంగిమ్రొచునపుడు.
విప్ర. ౩. ౬౮.

వ. మట్టశెత్తుకొని యెతుగిల పొదరుటడవులు
చొరంబాఱు పిడకడితికదుపు.
మనుచ ౪. ౩౭

విణ. (పొదవంటిది) మూలము, ఆదికారణము.

పొదరుటిల్లు = పొదరిల్లు. (శ. ర., చి. ని)

క. ఆది యట్టిద యప్పునికిం, బొదరగుటన్ దూతి
ప్రీతిఁ బురికొనఁబలికెన్, జదురాలికిఁ దవు
లెత్తిన, యది నీతో నెట్లు మాటలాడం
గూడున్ వేం. పంచ. ౪ ౭౭

జ ౦ పొదరిండ్ల చుక్క, పొదరిల్లు, పొదరుకొను,
పొదరుటిల్లు.

పొదరుకొను. అ. క్రి (√పొదరు) గుమిగూడు
సంక్షీభవించు.

క. తమలోనఁ బొదగుకొని యుప్పరిము వాకిట
నిల్వఁబనిచి రహిఁ దమ్ముడున్,సముఖమున
కరిగ నండుఁ ద్వరము జూపి యుభా
రిలోఁ గరట మి ట్లనిరయున్.
వేం. పంచ. ౧. ౪౯౩

పొదలా(లియా)డు. అ. క్రి. (పొదలు+ఆడు.)

౧. ప్రబలు, అతిశయించు.

గీ. చెన్నుమిగుల నొండొరులకుఁ జెప్పికొనుచు,
నద్భుతంబులు భయములు నాదరములు,
గౌతుకంబులుఁ బొదలాడఁగాఁ బ్రియుండు,
ప్రియురాలుఁ గ్రోలిరి నూతనప్రేమరసము.
హరి. ఉ. ౭. ౧౭౩.

(శ. ర. పా. పొరిపొరి - క్రొత్తప్రతి.)

౨. కలఁగియాడు, చంచలించితిరుగు.

సీ. ...లఁ బొదువుచుక్కలు దక్కటగాక
పొదలాడెఁ జెట్లపైఁ బులుఁగుమూఁక.
పాండు ౪. ౨౯౨

పొదలించు=పొదల్చు. స. క్రి (√పొదలు)

౧. వృద్ధినొందించు, వర్ధిల్లఁజేయు, హెచ్చించు.

క పదునాలుగులోకంబులుఁ, బొదలింపం
ద్రుంపవలసి పొడవులు రెండై, తుదిఁ దా
రొక్కటి యగుదురు
ఉ. హరి ౨. ౭౯.

సీ. ఇది యజ్ఞదక్షిణ పొదలించునట్లుగా నప్ర
మేయధనంబు లావహించు
విక్ర. ౫. ౧౧౫.

వ పాంశురడిండీరమండలంబులు సంబరంబులు
పొదలింప నమరి యు నక్కాలంబు మహి
తాబ్జకామినీజాలపరిభ్రాజితంబు గా వున
నళిమిథునమానకటీమకరాది పరివృతంబై.
చంద్రి. ౪ ౬౮.

౨ ఉప్పొంగించు, సంతోషపెట్టు.

క. సంపాతరంగరింఖణ,ఝంపాసంపాత్యమానజల
కణరేఖా,సంపాతశీతలానిల,సంపద పొద
లించెఁ బరమహైవోత్తంసున్.
పాండు ౧. ౧౭౮.

౩. పుట్టించు, కలిగించు

క. చని సూనసచనసచనలఁ, జనవులఁ బరిరంభ
ణాదిసంభావనలన్, మనను గరగించి పుల
కలు, తనువునఁ బొదలించి రతులఁ దగిలించి
తగన్. విక్ర ౮. ౩౮.

౪. కదపు, పోఁజేయు.

ద్వి. తప్పియు నుల్లంబు తల్లడిలంగఁ, బ్రొద్దొక
రోఁడుగాఁ బొదలింపుచుండి.
ద్వి. తి సా. ౧ ౧౨. పొ. ౧౦. పం.

౫. కావించు, ఒనర్చు.

చ. యాతనలం బొదలించుచుఁ, జేతులు విఁగఁ
గట్టి కొట్టి సేయనిబాధల్, పాతాళింపఁగఁ
జేయుచు, దూతలుచనఁ జాచి విష్ణుదూతలు
కరుణన్. శ్రీరం. మా. 3. ౯౧.

**పొదలిక.** వి. (√పొదలు) ౧. పెంపు, వృద్ధి.

ద్వి. అదిగాక నీలోన వర్తించుచుండు,మదక
ణములు తామసరాజసములు, పెంపొం
దున్నవి వానిపొదలికవలన, నదసద్వివేకంబు
జనియింపఁ బోదు.
విష్ణుమాయావిలాసము పూ. ౨. ఆ (౧౦)

౨. పూనిక, ప్రయత్నము, ఉత్సాహము.

క. భూదారము పెం దూటిన, భూదారుం డెకుగు
తోలఁగి పొదలిక సేసెన్, మేదురవ గొని
రెండె చని, మేదినిఁ బడ దాని నపుడు
మిత్రులు పొగడన్
భాగవతద్విజయము ౬ ౨౩౭. (వ్రా)

3. ఒప్పిదము, అందము.

వ. పొదలికల చెన్నుదలకులుకులు గల బలిజ
కన్నెదమిటారులు ప్రబంధ ౩౭

౪. పాదనము

సీ. వికటారిపీరులప్రకటాహవమిక మాను చిక
టారి పొదలికల్ చెన్నుమిగుల
శకా. ౨. ౧౬.

సీ. ఔ నన్నఁ జే శెల్లు మని హెచ్చరించుచుఁ
జకటారి పొదలిక ల్సేయువారు
కుకల. ౨. ౯౬.

సీ. చికిలికోపులు కమ్మచేక ట్రిమాన్పిని జకటారి
పొదలిక చెలువు గులుక. (దశా. ౧ ౨౭౬.)

౫ సంతోషము.

చ. కుదలనిసన్న పైట యనిపేరుబినిర్బలకార
కాత్నులుం, జెదరని యట్టి యుంతిరిని
జ త్తరుబొమ్మల భేదమొక్కటే, పొదలిక
నీదుపేరు విని పుల్కలు జాల్కొను మేన
జేయవక్. రసు. 3. 33.

**పొదలికకత్తెర.** వి. (√పొదలిక.) మల్లబంధ విశేషము, పదిరెండు పరువడులలో నొకటి.

వ. ఎడమడుగుపరువడికుడియడుగుపరువడి .
సర్పబంధకత్తెర జాగెనకత్తెర పొదలిక
కత్తెర కోగినపావు మొదలుగాఁ గల
పదిరెండు పరువడులును
ప్రబంధ. ౩౭

**పొదలికదండ.** వి. (√పొదలిక.) మల్లబంధ విశేషము, పదిరెండు దండలలో నొకటి.

వ పైసరపుదండ సింగపుదండ పొదలికదండ
యడుగడుగుపొదలికదండ మొదలుగాఁ
గల పదిరెండు దండలును
(ప్రబంధ. ౩౭.)

వ. అర్ధ్వరుండు సముదండ పొదలికదండ .
కుక్కుటపుదండ మొదలుగా గల పదిరెండు
దండల యఖండపాండిత్యంబు దెలిసి ...
హంస. ౧. ౨౦౬.

**పొదలిపుచ్చు.** స. క్రి. (√పొదలు.) దాఁచు, కప్పిపుచ్చు.

ద్వి. అదలించి కాదు లే దనుచు నీకల్ల, పొదలి
పుచ్చఁగ నింకఁ బోలదు నీకు.
పర. ౨. ౬౩. పా. 30. పం.

**పొదలు.** అ. క్రి. (త. పొదిర్. క. పొదళ్)
౧. పెరుఁగు, వర్ధిల్లు.

గీ. పొదలుఁ దఱుఁగుటకై పొద పొదవుఁ
బడుటకై కడుం జేరుఁ బాయుటకై .
భార. శాం. ౧. ౨౦౬.

గీ. మేను జీర్ణముగాఁ జేయుఁగాని మరణ, మొందఁ
జేయదు విను కాలమొందు నరుని, పూర్వ
కర్మములు లాయువుఁ బొదలఁ జేయు,

సన్నముగఁ జేయ బ్రదుకును జావుఁ గలుగు.
భార. అను. ౫. ౧౨౮.

క. కోకిలములఁ దలిచినఁ బలు,గాకులపొదిఁ బొడమునట్టి కష్టపుఁబులుఁగుల్, నాకు నసహ్యము లని యూ,హా కూఁకలు మానఁ గలవె యని ప్రార్థనలన్. (కళా. ౬. ౨౮౦.)

౨. పుట్టు, కలుగు

క. పదియాఱువేలమాద్వ్యరఁ, బొదలినయిలజవ్వనంబు పొలివోవక యుం,పొదవెడువారిఁ గనియె న,మ్ముదితలు సద్దేవుదన సముత్సుక లగుచున్. (హరి. ఉ. ౪. ౧౭౦.)

క. గిరియందుఁ దరువు పొదలిన,వరుసన కాయంబునందుఁ బ్రభవించె నహం,కర ణము వా. రా. ౫. ౧౧౫.

౩. నివసించు, ఉండు.

క. ఇది సార మిది యసారం, బిది తుల్యము ఘన మి దనక యెందును దాసై, పొదలుట దెలుపఁ డె దితినుతే,సదన స్తంభమున నెల్ల జగములు నెఱుఁగన్. (భోజరా. ౧. ౮౩.)

సీ. పాలు చాలఁగఁ గ్రోలఁజాలు నే తగ నాల పొదుఁగులఁ బిణుఁదులు పొదలుచున్న.
కేదారా. ౩. ౪౩.

౪. ప్రకాశించు, పొల్చు, ఒప్పు.

గీ. కిరణజాలంబుల్యమున సుధాకరుఁడు పొదలె.
రా. వి. ౩. ౨౦.

గీ. కుదురుకొని దిగీంద్రములు కూర్మకులాగ్రణి కీవనస్థితిం, బొదలె ఫణీశ్వరుండు బహుభోగసమున్నతి నుల్లసిల్లె ...
విక్ర. ౨. ౮౦.

గీ. గట్టుదొరపట్టి యెనలేనికని ఁముసఁ, బొదలుచును మమ్ము ననయంబుఁ బ్రోచుఁగాత.
నీలా. ౧. ౨.

౫. స్థూలమగు, ఉబ్బు, పొంగు.

క. గెలుపున మెయి పొదలఁగ పాం,ఛాలతనూజుఁడు రథము నడపి పాంచాలబలం, బు సుగులపడఁ బలు దెఱఁగుల, యలవుల విహరించె సుత్యుటాటోపమునన్. (భార. కర్ణ. ౧. ౧౪౬.)

సీ. తనుమధ్య యనుమాటఁ దప్పింపఁగాఁబోలుఁ బోలఁ లేక నడుములు పొదలఁజొచ్చె.
మొ. రా. బాల. ౪౩.

చ. మదవతి మందమందగతి మార్దవ మొప్పఁగ వచ్చెఁ జైపయిం, బొదలుచునున్న రాగరసపూరముతో కదిరించు కైవడిన్.
విక్ర. ౪. ౨౧౬.

గీ. కటభారాతిరూ దనున్నకా స్తుభంబు పొల్చుఁ బంటి కొంకవింతపొల్పు దెల్పు, శ్రీయు వమారమ మామజాబిల్లిఁ జూచి,పొదలె నుగుణాంబురాశి యాభూవిభుండు.
సుద. ౨. ౧౦౨.

(ఇట సంతోషించెనని భావము.)

౬. ప్రబలు, అతిశయించు.

ఉ. కృతార్థతా,కలితులు ధీరు లేమనిభుఁ గానఁగఁ గాంచినపుణ్యు పెద్ది రేఁ,కొలఁదుల నెన్నిజన్మములఁ గూర్చిరొ నాఁ బొదలున్ జనస్తుతుల్. (హరి. పూ. ౧. ౨౧.)

చ. పొదలితి రాజ్యభోగములఁ బూనితి దిగ్విజయోన్నతిం గడున్,నదలక దానధర్మముఖ వర్తనలం దగునట్లు సల్పితిన్.
రాఘవ. ౧. ౪౪.

౭. ఉద్రేకించు, విజృంభించు.

క. యాదవు లుల్లోకభుజ,శ్రీదర్పసమగ్రులని విశేషోక్తుల బా,హ్వేదించినఁ దక్షిణమా,ర్గోదితి మగు మత్స్యమున నుల్లము పొదలన్.
హరి. ఉ. ౨. ౧౧౬.

౮. క్రీడించు

ఉ. తోట్టినవేడ్క లం బొదరిండ్ల కందువులం బొదలు రమణీరమణులును.

పారి ౨. ౫౨

౯. వ్యాపించు, క్రమ్ము.

క. తదనంతరంబ జనముల, కిది పగ లిది రాత్రి యనఁగ నేర్పఱుపంగా, హృదయముల కగోచరమై, చదలం బొదలెం గ్రొవ్వి జలధరవితతుల్.

విక్ర. ౪ ౭౯.

౧౦ విఱ్ఱవీఁగు, మిక్కిలి గర్వించు.

చ. హృదయము గ్రేఁ గొకింత యిమయించెను దెల్పవుఁ గ్రొవ్వపెంపునం, బొదలెడు రంభ కున్ సవతిపోరు ఘటించుట కింకురార్పణం, బిది యిటు గొంత చేసితి

కళా. ౨. ౩

౧౧. తోఁచు, కనఁబడు.

ఉ. ర్యగన్నియ కేనిమేను తోలుఁగట్టి తుదం బొదలెం గ్రమంబునన్ వసు. ౩. ౩

౧౨. ఫలించు

క. పండియుఁ బలికోర్కి పొదలు, దండవసతి యన శరగుణరేఖఁ దనరుచున్, గండొసఁ గెడునుతరత్నము, పాండురమణిలక్ష్మి రోలెఁ బడసె హరికృపన్. (రాఘవ. ౧. ౭౨.)

౧౩. అగు, ప్రవర్తిల్లు.

క. మొదలుండ నచటఁ బోయక, తుదిగొమ్మలు నీటఁ దడుపఁ దుద నిష్ఫలమై, పొదలుంగా కది ప్రబలునె వీర. ౪. ౧౫.

జ: పొదలాడు, పొదలించు, పొదలిక, పొదలికకత్తెర, పొదలికదండ, పొదలిపుచ్చు, పొదలుకొను, పొదల్చు

పొదలుకొను. అ. క్రి. (పొదలు+కొను, స్వార్థమున) ౧. మెండుకొను, అతిశయించు.

వ. గొంగడిగాఁడు సుదలుగాఁ గలుగు పక్షులు పొదలుకొనియుండు పిట్టపట్లును సమ్మదంబున విలోకించుచు

చంద్రా. ౨. ౭౪.

సీ. ఉరగవల్లీగాఢపరిరంభణంబులఁ బోఁక ప్రాఁకులఁ బెంపు పొదలుకొనఁగ.

కాశీ. ౧. ౯౧.

౨ పొంగు, స్థూలమగు.

సీ. పెన్నిధిఁగాంచిన పేదచందంబునఁ బొలఁతుక నీకొను పొదలుకొనియె (నిర్వ. ౭. ౭౬)

పొదల్చు = పొదలించు. స. క్రి. పొదలఁ జేయు, వర్ధిల్లఁజేయు.

చ. నిగుణంబు లిం,తటఁ జల మేది మేదినిఁ బొదల్చుము విశ్వనృపాలమన్మథా

కావ్యా. ౨ ౮౩

పొదవు = ఒదవు అ క్రి ౧. కలుగు, సంభవించు

గీ కుడిచి కూర్చుండి క్రొవ్వునఁ బుడమికోని, పడఁతిఁ దెచ్చుట నిట్టిచేడ్పాటు పొదవె.

ఉచ్చ రా యు. ౪౫౨.

మ పొదివెన్ ఘూర్ణితదుగ్ధధామనిబిడప్రోద్భూత సంరంభముల్ వసు. ౪. ౨౦.

౨ ఎసఁగు, ఒప్పు

ద్వి. సమబుద్ధి నీతియు సౌమనస్యంబు, మొద లైన సద్గుణంబులరాశి యనుచుఁ, బొదవిన పెంపు పొల్లుగాఁజేసి.

రం రా. కిష్కిం. ౨౧౨. పొ. ౧౯. పం

పొది. వి. (క., తు. పొదె. మ., త. పొది. ౧. దొన, తూణీరము.

సీ. కలికిచూపులకు భీతిని డాఁగి నిలిచినకైవడిఁ బొదుల మార్గణము లలర.

హై. భా. ౫. ౧౧౧

సీ. తరకసమ్ము పొది బత్తళిక పొణిపదమ్ము
తొన యనఁ దూణీర తొనరియుండు.
అం. భా. ౨. ౨౧౪.

గీ. పిడికిటమ్ములు వీఁపుననిడిన పొదియు.
చంద్రా. ౨. ౪౦

౨ మంగలి క్షౌరసాధనము లుంచుకొనెడి తోలు
సంచి, అడపము (శ. ర) 3 పొదుఁగు,
ఊధము.

సీ. పొట్టపొంగునఁ దల్లి పొదిఁ బాసి పిడికిఁ
బాటి, క్రమ్మటుఁ జెడ్డపరువుతోడ
భోజరా ౬. ౨౧

౪ సమూహము, మొత్తము, బాణసమూహము.

సీ. ఆడు గృహపశాకికలకు పాట గలపి, ప్రోది
నెమళుల రొక్కల పొదలు పిచ్చి, మంద
సంచారముగ సుకుమార మగుచు, మొలసెఁ
బ్రత్యూషసమ సమీరణంబు
నృసిం 3 ౧౧౧

క. కోకిలములఁ దలిచిన బలు, గాకులవోగిఁ
బొదిలినట్టు కష్టపుఁబులుఁగుల్, నాకు
నసహ్యము లని యా, పౌ తూఁటలు మానఁ
గలదె యని ప్రార్థనలన్
శశా ౬. ౨౭

౫ సెలఁకులు నొంచెదం బొదులు గొంచెద
వజ్జను గాత్రశాలలోన్
భార. విరా ౪ ౨౦౧.

౫ కేశబంధము, ముడి.

సీ ఇరుగడఁ బొది విచ్చి విరియవేనలితోన
మోహాంధతమసంబు ముంచుకొనఁగ,
కు సం. ౫. ౫౪౯

౬. మోపు, కట్ట.

క. తలుగులపొది రొకదెసఁ జెప్యాలవామెన
రొక్కవలన నమవై యుండఁగ, మొలమోవ
- పెక్కుచుట్లన్, బలుద్రాటం బట్టి కోప
భావం బలరన్. (భార. విరా. ౧. ౨౫౫.)

సీ. అవిన విక్కుం బిది యందఱు నొండొరు
లే మనియెదరో పీ కిబిసముల, పొది రేమ
దాఁచి మాచెదనని దాఁచితి .
భాగ అను. 3. ౨౪౯.

౭ కప్పు, అచ్ఛాదనము, ఆవరణ.

సీ ఈ కొప్పపొది విచ్చి యుంచుక చూచిన
నొప్పునుకన్న సెట్లుండునొక్కొ.
కేయూర. ౪. ౭.

ద్వి ముడుతకుళ్లాయి కిమ్ముల మిట్టిపడఁగ,
దట్టమై పొదిగల్గి సెరవాయి బెట్టి, కట్టిన
పెనుపు సరిగు చంక నలఁగ.
ద్వి. పరమ. 3 ౨౨౯. పొ

ద్వి. పొది గల్గుమూలంబు భోగంబుగాఁగఁ, బది
నూఱుశిరముల ఫణిరాజు కనెఁ.
ద్వి పరమ 3 ౧౬౨. పొ.

౮ వరుస, క్రమము

౯ పొదిఁ దనవంగిన ఖలలో, నదికిన నవ్వులుబు
వగ్గిజాఖ్యాయు లొయున్ (కావ్యా ౭ 3౬.)

౧౦ పొదికట్టు, పొదిగూడు, పొదిగోను, పొది
చెను, పొదివిరియు, పొదుక

పొదికట్టు. వి (√పొది) వాకిటిముందఱి పంచ
పాక, పంచాది, వసార. (శ. ర., బ్రౌ.)

సీ. ఒకవైష్ణవగృహంబునకు నెలుంగక యేఁగి
పొదికట్టుమఱుఁగునఁ బొంచియుండ.
పరమ ౪. ౧౮౬.

(శ. ర పా పొదిగిటిమఱుఁగున. ముద్రి.)

పొదికిలి వి. దే. ద్వారపార్శ్వము, గుమ్మము
ప్రక్క

ఉ. ... ఘనస్థిరకాయు లనేకరాక్షసుల్, కొది
గొని కాన నివ్వలలో నమ్ృతంబు దుర
తిక్రమిగా. (భార. అను. ౧. ౨౧౬.)

సీ. దనుజారి పారిజాతముఁ జేరి పొదిగొన్న
రాజన్యరాజీరములలోన. గీ. కలయఁ దొలు
జాముకోయులు గలవు కాకు

ఉ. హరి. ౪. ౧౩౪.

పొదిచెడు. అ. క్రి. (√పొది.) పొదగు.

క. అది కడుపుగోలఁదియును దిని, సదనమునకు
మగిడివచ్చి సరిపొద్దున ని, ట్లద వరసి
యరుగఁ దిరుగం, బొదిచెడియుఁ జైరు .

వేం. పంచ. ౩. ౫౦.

పొదిటి = పొదడు. విణ. పొట్టివాఁడు, వామ
నుఁడు.

సీ. పొట్టి కొంటి గిటక పొదిటి పొదడు .
యనఁగ వామనాఖ్య దనరు

ఆం. భా. ౨. ౧౨౩.

పొదిరించు. స. క్రి. (√పొదుగు.) పుష్పింపఁ
జేయు, పూచునట్లుచేయు.

సీ. పొట్టుగు లేమావిఁ బొదరించి నొక్కత్తె
చూచియుఁ జేనంటిసొబగుమీఱ.

యయా. ౪. ౨౦.

(క. ర. పా. పొదలించె. ముద్రి)

పొదివించు. స. క్రి. (√పొదువు.) పొదువఁ
జేయు, వ్యాపింపఁజేయు.

సీ. ఒకవనుప్రతిమ యిం పూన్పు తెల్లనికావిఁ
బొదివించెదుకలాచి పూని నిలిచె.

చంద్రి. ౨. ౨౫.

పొదివిరియు. అ. క్రి. (పొది + విరియు.) ౧.
గుంపుచెడు, విడిపోవు, చెదరు.

గీ. తెంలి పరచక్రము పొదివిరివి పఱచ ...

కు. సం. ౧౨. ౭౯.

౨. బిగిచెడు, ధైర్యహీనమగు.

క. గిరిజలలితాంగములు పొరిఁ,బొరిఁ గనుఁగొని
సొగసి యినుకబొమ్మ జలమ్ముల్, దరలఁగ
విరిసినగతిఁ బొదివిరిగి మహేశ్వరు మనంబు
వికటం బయ్యెగా. (కు. సం. ౫. ౧౧౬.)

పొదుఁగు = పొదువు[2]. వి. ఊధము, ఆవు మొద
లగు వానికి పా లుండెడిచోటు.

మధ్యాక్కర. మృదురోమములును శంఖనిభ
కర్ణముల్ మెత్తని వలుఁద, పొదుఁగును ...

భార. ఆది. ౪. ౯౫.

ఉ. దండమె దీనివాలధి సుధానిభవాఃకరకంతె
దీని యీ,కుండపొదుంగు .

పాండు. ౫. ౨౪౪.

చ. పురి కేఁగెఁ జగు స్తనంబులం, బలసి
పొదుంగు ద్రేఁగు పఱపంగ గభీరరవంబుతోడ
వీ,థుల నడయాడు బాలకులు దోరపుఖీతిఁ
దొలంగి పాఱఁగన్. (భోజరా. ౬. ౨౦.)

సా. పొదుఁగు కోసి పాలుద్రాగు = ఆశ్యాశచే
మొదటికే నష్టము నందు.

జ. పొదుఁగుచేయు

పొదుఁగుచేయు అ. క్రి. (పొదుఁగు+చేయు.)
ఈనఁబోవుసమయమున పశువు పెద్దపొదుఁగు
కలదియగు.

(వ్యవ.) ఆవు పొదుఁగుచేసినది. పది దినములలో
ఈనవచ్చును. (శ. ర.)

పొదుక. వి. (పొది + ఉక, స్వార్థమున) పొది,
పొట్లము, మూట.

గీ. వంజు, దంతయును బుచ్చి పొదుకగా
నమరఁ గట్టి,కొనుచు పోఁబోకగుటయుఁ
జనియె (భార. శాం. ౩. ౪౯౯.)

**పొదుఁగఁబట్టు.** స. క్రి. (పొదుఁగన్ + పట్టు.) పొదిగిపట్టు, కప్పి పట్టుకొను.

వ. ... ఇవ్విధంబునం గలభాషితేశంతంబునకుఁ దనకంఠరంబు వద్దంబుఁ జేర్చి క్రేటు కనుపేర దాని నిరుగేలం బొదుఁగఁబట్టుకొని పరమకరుణాపరవశత్వంబునఁ దొలంగక యా వృద్ధభామిని .. (కళా. ౩. ౧౨౦)

**పొదుగు = పొదువు[1], ఒదుగు.** స. క్రి. (క. పొదిను, పొదుంకు, త. పొదుక్కు.) ౧. క్రమ్ము, ఆవరించు.

క. బ్రదికెదమనంతకుఁ బురుషుఁడు, క్రిదులక
నిలువెల్ల వగలఁ బెనఁగొనియుండుఁగా, గుదురు
కొని దూది పోఁగుడు, పొదిగిన కార్పాస
బీజమునకుం బ్రతియై.
కవిక. ౫. ౧౧౭.

సీ. చదలఁ బ్రువ్వు లతనిఁ బొదుగఁ బుట్టలు
పెట్టెఁ బుట్టక్రోవులలోనఁ బుట్టెఁ జెట్లు.
వాల్మీకి. ౩. ౧౪౦.

౨. (పెట్ట పిల్లలు చేయుటకై గుడ్లను రెక్కలలో) కప్పు.

గీ. అంబునిధితీరమునఁ గులాయము బన్నర్చికొని
కలంగుచుఁ దిట్టిభి గ్రుడ్లఁ బెట్టి, పొదిగె.
కేం. పంచ. ౧. ౭౨౦.

౩. (రత్నములు, మొ.) ఖచితముచేయు, చెక్కు.

ఉదా : వజ్రాలు పొదిగిన యుంగరము.

౪. క్రి. కలియు, పైఁబడు.

గీ. పొదుగుల ద్రంబుల నొదుఁగు మనను,
ధైర్యశౌర్యనిరంకుశత్వము వహించె.
కవిరా. ౨. ౬౩.

(శ. ర. పా. పొదవు. ముద్రితపా.)

వి. శిశువులబొత్తుల కుపయోగించుగుడ్డ.

క. కలిఁ జొచ్చి మాపెద్ద తివి, కలత్రవ్రజము
యుండు చేతికైలంబున శౌ, త్రిల రాఘ
మెత్తగాఁ బొదు, గలరింది కుమారు మనిచి
రాజాదు లటన్. (ద్వా. ౩. ౪౦.)

ఇ : పొదిగిలి, పొదుఁగఁబట్టు, పొదుగుడు.

**పొదుగుడు.** విశే. (√పొదుగు.) ౧. పొదుగ్గ నది, కప్పునది.

(వి. కప్పుడు, ఆచ్ఛాదనము. అని. శ. ర.)

క. ఉత్తానశయతఁ బొదుగుడు, బొత్తులలో మనికి
దివ్యపురుషుఁ డని తమో, మతులు విమఁ
గానరు నను, నత్తెఱఁగునఁ జాదకుము దయం
బ్రోవఁదగున్. పరమ. ౧. ౧౪౫.

౨. గ్రుడ్లు పొదిగి పిల్లలను జేయునది.

సీ. చూనలో దాఁచినపటుపుట్టము చించి
పొదుగుడుకోళ్లకుఁ బొత్తిచేసె.
శుక. ౩. ౫౦.

వి. బ. ౧. పొదుగుడుబొత్తులు, శిశువులకుప యోగించు వస్త్రఖండములు.

గీ. ఆ కుమారి పరంజ్యోతియైనవాఁడు, క్రోల
నేఁటికిఁ బెట్టిరి ముగ్ధ లనుచు, నగువిధంబునఁ
బొదుగుళ్లనడుమ నగుచు, నుండు మందిరదీప
కాజ్యోతిఁ జూచి. వరాహ. ౭. ౫.

వ. .తొలంబట్టల పొదుగుళ్లపైఁ గ్రొమ్మడుఁగు
సెజ్జిబిలుకు చుంగుల నిక్కుచెక్కును ...
కళా. ౭. ౨౨౪.

౨. బాలక్రీడావిశేషము.

**పొదుపు.** వి. (త. పొదిప్పు.) ౧. వృద్ధి, పెంపు.

క. కరువువఁబోసినవిధమున, నరుదుగఁ దనరూప
మెట్టిదట్టిద కాఁ ద,త్పురభూమి క్రేపుల
నీనఁగఁ, బొరిఁబొరి కేపేటఁ గదుపుపొదు
పుదెంచెన్. (భోజరా. ౭. ౩౧౭.)

౨. మితవ్యయము. (గ్రా.)

(వ్యవ.) వానిదగ్గఱ పొదుపు లేదు, ఎంత దబ్బైనను చాలదు.

(వ్యవ.) పొదుపుగా వాడికొన్నయెడల నెలకు నేఁబదిరూపాయలు చాలును.

౩. పొందిక కలది, యథా క్రమము, సరియైనది.

(వ్యవ.) ఆమె సరుకు లన్నియు గదిలోఁ బొదుపుగా నుంచినది.

సీ. పొదుపుగా నమ్ముల పొదులు వీపునఁ జేర్చి .. మ. చ. ౨. ౫౨.

జః పొదుపుచేయు.

పొదుపుచేయు. స. క్రి. (పొదుపు + చేయు.) చక్కఁబఱుచు, పొందుపఱుచు.

(వ్యవ.) బుద్ధిమంతుఁడు కనుక చెడిపోయిన సంసారము పొదుపుచేసికొన్నాఁడు.

(వ్యవ.) పండినపంట పొదుపుచేసికొని యింటికిఁ దెచ్చికొనుము.

పొదురు. అ. క్రి. పూచు, పుష్పించు.

(శ. ర. చూ. పొదిరించు.)

జ : పొదిరించు.

పొదువఁ(గఁ)బట్టు. స. క్రి. (పొదువన్ + పట్టు.) గట్టిగాఁ బట్టు, బిగియఁబట్టు.

మ.... దగ్గతియుగ్రకోపమున దోర్లీలాసముల్లాసియై, పొదువంబట్టి వహించెమూఁపుల ... భా. రా. అర. ౧. ౨౯.

ఇట్లే : పొదువఁగఁబట్టు.

ఆ. బోటిపిండుచేతఁ బొదువంగఁబట్టించి, రాజసమున దైత్యరాజతనయ, దాదరి దేవయానిఁ ద్రోపించె ... భాగ. ౯. ౫౨౩.

పొదువు¹ = పొదుగు స. క్రి. (త. పొదుక్కు.)
౧. కప్పు, ఆచ్ఛాదించు, క్రమ్ము, ఆవరించు.

సీ. వీఁకమై నకులునిఁ జాలి మన్నాపనఁ దత్త్వ్యగ్రబాణచయమునఁ బొదివె.
భార. భీష్మ. ౧. ౨౫౪.

సీ.... హేమము పొదివిన. గీ. యలతియనురాగమి కటులందు మెఱయు.
(ఆము. ౪. ౫౮.)

క. నిభుఁడు నద్దనుజానిచాపమ్ముఁ దునుకలు సేసెను రథ్యమ్ముల సారథిని నంపధారలఁ బొదివెన్. హ. హరి. ౧. ౧౪౧.

క. దేవతాపతియాజ్ఞన్, మరలి వియచ్చరవాహిని మురహరునిం బొదివి ఘోరముగాఁ బోరెదరన్. పారి. ౫. ౧౫.

౨. చుట్టుకొను, పరివేష్టించు.

ఆ. భీమసేను నపుడు పెక్కుబలంబులు, పొదువ పెచ్చెఁగి ద్రుపదపుత్రకుండు.
భార. భీష్మ. ౨. ౩౬౩.

సీ. కలకలఁబల్కుచిల్కలకొల్కిఁ దమ చాతి గాఁబోలు నని చిల్కకొదుపు పొదువ.
హ. రా. ౬. ౨౩.

గీ. నన్నుఁ బొగిడిరి పొరుగిండ్లనున్న తపసులు ..
మనుచ. ౬. ౫౧.

౩. అణఁచు, ఆక్రమించు.

సీ. ఆత్మావనీమండలావర్తిఁ బెడఁబాసి లలనానితంబమండలముఁ బొదువు.
విక్ర. ౩. ౪౧.

౪. లోపల ఉంచు, మాటుపఱచు.

వ. ... విక్రమవిహారంబు ముగియించి గవురునఁ బొదివినకనుమకోరండు పెండెబలపోఁతదకుట టరిగెఱుంగుదు మెఱుం గడంగియుండు రాజమండలంబు మాగుడువాఱి కానిపించె.
ప్రభా. ౫. ౫౪.

క. ... పారిజాతంబుఁ గ్రొన్నన మిన్నుటిపవెండి
నై తమ్మిచిగురుటాకునం బొదివి యిచ్చిన.
(పారి. ౧. ౫౨.)

౫. చెరువు, చెక్కుకొను.

సీ. కబరికాభరణము పైఁ గన్నె గేదఁగి పువ్వు
రేకతోఁ గూడ రోఁకనిఁ బొదివి.
(వైజ. ౬. ౨౭.)

(చెరివి, వేదం. పా.)

౬. గట్టిగాఁ గూర్చు, చేర్చు

మ. తనయా రమ్మని కౌఁగిటం బొదివి నిద్దా
చెక్కులన్ నొక్కి—
(చంద్రా. ౬. ౫౬.)

చ. అన విని చాలఁదల్లడిలి యాయకినాయకుఁ డంత
మున్ రయంబునఁ దన కౌఁగిటం బొదివె
కళా. ౩. ౨౫౦.

౭. (యుద్ధమున) మార్కొను, తలపడు

ఆ. కౌరవకపాటు చూచి కోపించి కళింగపతి
రయమునఁ దేరు వఱపి భీముఁ, బొదివి
పిడుగుఁగొదవవోనినారసము బిట్టేసి
భార. భీష్మ. ౬. ౭౫.

గీ. గట్లు చెట్లును దప్పించి కిట్టఁగిట్టి, వేగిరమ
దాటి చెడుతోలి వెల్వఁ బొదవు
అచ్చ. రా. యు. ౭౯.

౮. స్పృశించు, తాఁకు.

క. అది చుట్టకాద నిప్పనఁ, జెదలంటునె దేవ
దేవ శ్రీరమణీశున్, మది మనిచిన యు తమ
మునిఁ, బొదవునె యాపదలు సూర్యుఁ
బొదువునె తమముల్. (నృసిం. ౪. ౩౭.)
(బ్రమ్మ. అని, ౯. ౭.)

ఉ. లలితశరీరమృదులంబులు నీచరణంబు
లక్కటా, యిల యిది రాతి మిట్టు
లలయించుట గాదని బ్రార్థనామృదూ,

క్షతలఁ జెలఁగంగ కెన్ పొదివి తోల్పఁదమ్ము
ల్లగు విన్నపంబులం, బలుమఱుఁ జేరుచుండు
మూన బంగరుటందియ లుగ్గడింపఁగన్.
పాండు. ౨. ౩౭.

క. పదివాడితూపు లాఘవ్ల్లుదొరన్ గుణికేసి
యేయ గొబ్బున నవి పైఁ, బొదువంగనీక
రెక్కలఁ, జదియంగా మోఁద ఒలిమి పద
లక యతఁడున్. (అచ్చ. రా. అర. ౭౪.)

౯. పట్టుకొను.

చ. ముని యటు రాఁ దటాలున సమున్నత
పీఠము డిగ్గి నిల్చినం, గవనిరుచేదకాను తుచ
గౌరవ మూర్తిక్ కింపమొందఁగా, జనపతి
చూడ్కి తోడనె ససంభ్రమసంభరితాను
కలసమై, యొనసి వలగ్నముం బొదివి
నీకులు దీనదయాళుదర్శనుల్.
వను. ౨. ౧౪.

క. గరుడుఁడు వొదివిన నాగము, కరణిన్ ..
భాగ. ౬. ౪౦౧.

౧౦. విన్యసించు, ఉంచు.

సీ. పల్లవమ్ములకు సంపల్లవమ్ములగూర్పు పదము
లొక్కటి రెండు బొదువ నేర్చు.
అచలా. ౨. ౩౪.

౧౧. పక్షులు పిల్లలను చేయుటకుఁ గ్రుడ్లను రెక్క
లతోఁ గప్పు.

సీ. గ్రుడ్డులఁ బొదువుపక్కలు దక్కట గాక
పొదలాడఁ జెట్లపైఁ బులుఁగుతూఁగ.
పాండు. ౪. ౭౯.

౧౨. (రత్నములు లోనగువాని) ఖచించు,
చెక్కు.

ఉదా : రత్నాలు పొదిగిన యుంగరము.

౧౩. చేరఁదీయు, వశపఱుచుకొను.

క. అని పలికె మతియుఁ గొడుకుం, దనవుచు
శోకమునమునఁగు ఫల్గుణునిఁ దగం, దనకరి
ముఁలఁ బొదువుచు ...
భార. ద్రో. ౨. ౨౫౬.

గీ. చాలుదురు వారు నృపతికి మేలుసేయఁ,
గడొనగ్నింగఁ గావునఁ గిల్బిషములఁ,బొరయ
కుండంగ వారల నరసికొనుచుఁ, బొదివి
నడపుట కార్యంబు భూవరునకు.
భార. శాం. ౨. ౩౬౧.

౧౪. అనునయించు, బ్రతిమాలు.

వ. మీ రిద్దఱు నొక్కటియై భరింపడి యిప్పుని
సక్కంజేసి శాక మీలోన నిట్టిరొరపు
మాట లేల యని పొదివిపలికె.
భార. ఉద్యో ౪ ౨౫౨.

౧౫. అనుకరించు.

వ. అప్పుణ్యవంశంబు చదలేటిసీటివలని
పొదరియున్నహాలబ్ధంబులుంబోని పావనత్వ
శుచిత్వగాంభీర్యమాధుర్యంబులు చరితమున
స్వభావవచనంబుల ధరియించి సైదోడుం
బొదివి భీమ. ౧. ౩౧.

అ. క్రి. = పొదుగు. ౧. కవియు, పైఁబడు.

సీ. ఒక్కఁడు పెక్కండ్ర కొక్కన విచ్చియుఁ
బొదివి చెటొకపోటు వొడుచుఁగొడలు.
భార. విరా. ౩. ౧౬౪.

క. పొదువుచు విచ్చుచు బలువిడి, కొదురుచుఁ
గాలుచును మఱి మహీభాగము గ్రక్క
దలం గార్ముకవిద్యావిదుఁడగు గురుతోడఁ
బోర విభినబలంబుల్.
భార. ద్రో. ౧. ౧౪౪.

వ. ...దివిజగణంబులు నీలనిశాసంబున రాముడు
లతో సమరంబుసేసి యామారిసామారిం
జెలఁగి విచ్చుచుం బొదువుచుండిరి ...
హ. రా. ౩. ౩౯.

౨. పొదవు, ఒదవు; కలుగు, పుట్టు.

గీ. కొలఁగుపాటు దనికి కొలఁకాడి సౌఖ్య సం
వ్యగలు వగల నీకు దిగులు వొదిని.
భార. విరా. ౨. ౧౦౬.

క. విదితంబగు నర్ధవుని, సదమలరూపంబునందు
జగదార్త్యు లాగిం, బొదువుచు విచ్చుచు
పెలుఁగుచు, మది విస్మృతిసేయు నెంత
మావులభంగిన్. వా రా. ౨. ౩౫.

౩. క్రమ్ము, వ్యాపించు

గీ. తరుణశైవాలజలజపత్త్రములు పొదువ, పుర
శతచ్ఛాయఁ బొల్పొం దళ్వరిఖబలము ..
అము. ౨. ౮.

చ. పిడుగుతునుకలు వానరవీరు లొక్కటఁగా,
బొదివిరి లంకచుట్టనను భూగగనంబులు
నిండ నార్చుచున్. (రామా. ౨. ౧౮౦.)

వి కప్పడు, ఆచ్ఛాదనము, కప్పునట్టి వస్త్ర
చర్మాది.

గీ. పసిఁడిచెలఁగులరవసెల్ల పైన కేగ, పొదు
వుగాఁ గప్పుకొని పూలపాదముఁగుడ,
నిలిచి యఱుకుచు బెళుకుచుఁ గెలుఁ జూచి,
చిలుకవలె ముద్దుపల్కులఁ బలికె నిట్లు.
వేం. మా. ౪. ౬౧.

వ. పొదువు విరియం దట్టి కసుంగొని నిరూపించి
సారథియని సవ్యసాచిం బిలిచి యిట్లనిరి.
భార. విరా. ౪. ౧౧౩.

వ. కూరులకోపొనలాతిరేకంబులఁ గాకంబు
లగు కాకుతాఁకుల నింతింతలగుగుండెదివియు
పలుఁ గండపొదువులఁ గలకమ్మ మూర
భుజించుధాత్రీసులును. (చంద్రా. ౬. ౯౩.)

జ: పొదివించు, పొదువఁబట్టు, పొదువఁబడు.

పొదువు² = పొదుఁగు. వి. ఊధము, ఆవులు
లోనగువాని పాలుండెడి చోటు.

గీ. సమయమునఁ బాలకాగ్రణి చదలు చేరి, సురభిజా
ధిల్లి పొదువునఁ గరమొసంగ, విపులచంద్రికా
దుగ్ధపూరములు పిదికి ఘనతరశశాంక
వత్ససంఘముల దనిచె.

పె. శకుం. ౨. ౧౯౦.

గీ. ... ఆవు, తనకుఁ దాఁ బొదువునఁ బడి
క్రాఁచె నేమొ, యనఁగ వానిఁ దన్నించి
యవల నంపె. (వేం. మా. ౪. ౧౫౭.)

పొద్దు = ప్రొద్దు. వి. (సం. ప్రబుధ్న. ప్రా. పద్దో. క. పొత్తు. త. పొళుదు.) ౧. దినము.

(వ్యవ.) నేటికి అయిదు పొద్దుల పురుడు అయినది.

గీ. పొద్దవఁగ నాఁడు దనంగను బొద్దుపోఁగఁ
బొదలుచుండునుదినము

ఆం. భా. ౧. ౯౦.

గీ. ముద్దుముద్దుగఁ గడుఁ బొద్దు పొద్దువన్నె,
పుట్టములు గట్టి చిటిపొటిపూఁతసొమ్ము,
పెట్టు. ఘటికా. ౨. ౩౪.

క. ఏపొద్దు భేదమున సంతాపించుచునుండె
నతఁడు ధరలో భార్యారూపవతీశత్రువని
క,దా పెద్దలు పల్కు చెలతప్ప నటంచున్.

కవిరా. ౨ ౩౬.

౨. సూర్యుఁడు.

(వ్యవ.) పొద్దు పొడిచినది త్వరగా లెమ్ము.

పొన్ = పొను. వి. (దీనికి అచ్చుపరమగునప్పుడు ద్విత్వమగును.) బంగారము.

క. తొణ్ణాముల జగదంబిక, నణ్ణామలవిశ్వనాథు
నారాధించెన్, వణ్ణాసయఁ బొన్నాసయఁ,
బెణ్ణాసయు చెవిచారి తెన్నిధు లనుటన్.

కాశీ. ౩. ౧౭౫.

సీ. కాంతవాళిధలు బంగారు జంగఱ్ఱ పోన్నప్ప
పసిఁడి పసిండి పొన్ హైడి పయిఁడి.

ఆం. భా. ౨. ౨౬౯.

ఉ. ... మారుసాముసం, వోదశ రూఢిగాంచి
బిరుదొందిన పొన్నొలసాలిఘంటమూన్కిఁ
దన మేటియై పటుకటీతటి నీటగు నివ్వ
ధూటికిన్. ఉ. హరివం. ౩. ౬౦.

గీ. మృగమదముచెంతఁ గుంకుమరేఖవోలె,
నీలమణిపొంత సుదిరిపొఁజేకవోలె, మేఘము
కెలంకటను దీఁగమెఱుపువోలె, నర్జునుని
చెంగట సుభద్ర యలరె నపుడు.

విజ. వి. ౩. ౧౧౭.

పొన[1] = పొన్న[1]. వి. పున్నాగము.

సీ. పొన్న పొన యనంగఁ బున్నాగముఁ
దనర్పు సాం. ని. స్థా. ౫౪.

పొన[2] = పొన్న[2]. విశ. అల్ల, అ. (దూరముగా నుండు పదార్థమును జూపుటయం దుపయోగింపఁబడును)

రగడ. పొలఁతి యది చనసాఁగెఁ బొనపొన్న
నీడలకుఁ, జిలుకపలుకులు తెలుచు జేరవని
నీడలకు. ఉ. రా. ౬. ౬౧.

మ. పొలఁతీ యాపొనగున్న పొన్నవిరిఁ బల్కుఁడేవె
బల్కాల్వగా, నలరన్ సారెకు నెక్కుచున్
దిగుచుఁ జాలై తుమ్మెదల్ పించె ...

కవల. ౩. ౧౭౦.

పొనఁటు = పొరఁటు. స. క్రి. పొగచు, కాలించు.

సీ. ... కాలింపు తిరుగఁబోఁత పొగు పనంగ,
సంస్కారములో వ్యాఖ్యానము కాలింపు
దైచినది పొరఁటినది పొనఁటిన దన, బలు
లను సంస్కృతశాఖలంబులుగాను ...

ఆం. భా. ౨. ౨౫౨. (పొనటు. అహమద్రి.)

పొనపొన. విణ. మిక్కిలికొంచెము, అత్యల్పము.

క. రాజులు నీతనిపాదాం, భోంబులు ముట్టి కొలిచి పొనపొనదవులన్, రాజితమకుటమణిచ్ఛవి,రాజుల నీరాజనంబు రచియించుచు రనన్. ప్రబోధ. ౨. ౧౬.

చ. పొనపొననిద్రమబ్బునఁ బ్రఫుల్లసరోజదళాయతాక్షి యొల్లన నృపమోహమోహాపమున అంప టట్లోఁ జాచె ... (హంస. ౫. ౯౧.)

క. అని సిద్ధరాలు చెప్పినఁ, బొనపొనగా భ్రమలు చెందఁ బులకలు పొదమెన్, మన సిజశిఖి యెనసినచోఁ, గనపడు ధూమాంకురములగతి నృపుమేనన్.

హంస. ౧. ౭౫.

క్రి. విణ. ద్రు. ౧. శీఘ్రముగా, సత్వరముగా, (మెల్లగా అని బ్రౌ.)

క. పొనపొనఁ గానక దేవర,పమపునఁ జని యచటఁ గంటిఁ బ్రాకీయాంతరబద్ధ ననిచదు గోత్రగిరినిభ,తను సద్రంశ మనిహాణధరుఁ గట్టెదురన్. కేం. పంచ. ౧. ౨౦౨.

౨. తిన్నగా, సూటిగా.

చ. పొనపొనఁ బొన్నగున్నపయి బోటిరొ మల్లిక ప్రాఁకి మాటికిన్, ననువిరితేనెఁ జెందుచు మనోహరభృంగరవం బెసంగఁ గ్రాలి నొర యుచున్ రతిన్ వినుపతెన్ తెలుపొందెడి ..

ఉ. రా. ౭. ౪౩.

వి. అక్కడ.

క. అల్లదె కంటే పొనపొన, తెల్లనిగట్టుల మబ్బుదేఱెడుపోలమం, దల్లెదఁ బూచిన ధరణీవల్లభ నీరామునేన వాలు మెఱుంగుల్.

మనుచ. ౪. ౧౬.

క. మిమమదిమ్మె కొండెమింటన్, బొనపొన నల తెల్లమబ్బుపొంతన దిసువాటున నెఱ కలదో కేలో, యనుమాత్రము గానఁ గంటిమా నృపతనయా. సారంగ. ౧. ౧౨౪.

సీ. అగ్గద మ్రొక్కెద యచట యూడ యుండదె పొనపొన యర్యోక యట, మందఁ జాడద్రాగ్గమై ... అం. భా. ౩. ౭౬.

పొనరారు. అ. క్రి. (పొనరు + ఆరు.) ఒప్పు, శోభిల్లు.

పటువర్ప్తము. కేకేరాయుఁడు విరిగేస్తుండుం, దేజాల్ మీఱఁగడిటమూల త్రిన్, కేకోహోరలు వెటఁ గావింపన్, బూజుం కెందుచుఁ బొనరార్చ టీ. (అచ్చ. రా. యు. ౭౦౦.)

ద్వి. అనిమిషద్విరదంబు హస్తంబులోనఁ, బొనరారువలిదమ్మి పూమొగ్గ యనఁగ.

ద్వి. తి. సా. ౧. ౪. పా. ౧౬. పం.

క అని తెల్పుచు వారలఁ దోడ్కొని యప్పుడె కదలి తపసికోలఁకులు సేయం,ద్యునగోవులఁ బల్లియలున్, బొనరారఁగఁ గడచి వైశ్యమునఁ జనుచెదలన్.

అచ్చ. రా. బాల. ౧౪౧.

పొనరించు = ఒనరించు, పొనరుచు. స. క్రి. (√పొనరు.) ౧. చేయు, కావించు.

క. .. పెక్కుసవనములు దనఁ జావ మూర్తి వైదికయుక్తిం, బొనరించుచు ...

భాగ. ౧౦. ఉ. ౧౩౨౦.

శా. . శీతక్రియ, లొప్పనరింప నృమకట్టి ...

దశకు. ౩. ౧౨౩.

ఉ. .. ఓజ వహించి కన్నులకు మత్స్యమయం బొనరించ నెంతయున్. (వైష. ౬. ౫౨.)

౨. పుట్టించు, కలిగించు.

క. ధనమును విద్యయు వంశము,ఋజు దుర్మ
తులకు మదంబుఁ బొనరించును ...
భార. ఉద్యో. ౨. ౩౫.

క. ధనవంతుఁడు రూపవియును, మనమునఁ దల
పోయు నధికమాన్యులు ప్రాభాం,గనసౌఖ్యాది
కమురాగము, పొనరింపఁగఁజాలు నతఁడ
పురుషుం డెందుఁ. (దశకు. ౫. ౪౭.)

**పొనరు** = ఒనరు. అ. క్రి. ౧. కలుగు,
సంప్రాప్తమగు.

క. అనఘా యగ్నిహోత్రముల, ననఁగా భావింప
జగమునకు నెపుడు హితం, బొనరింతుఁ
దత్సుకృతముల, బొనరినమద్భక్ష్యానామముల
వివరింతుఁబ్. (భార. శాం. ౭. ౪౩౦.)

ఉ. అనఘ యపూర్వమైన భవదాగమనంబు
తలంప నొక్కచోఁ, బొనరినకయ్య మిప్పు
డాఁబోయఁగ వచ్చిన యట్ల తోఁచె
కళాం. ౪. ౧౯౪.

(పొసఁగు, అని శ. ర.)

గీ. అనుచు నుగ్రశ్రవనుఁ డింపు పొనర చెల్ల,
తపసి యొండ్లకు చెలఁగింప
నీలా. ౧. ౧౧౭.

౨. పొందుకలిగియుండు, పొత్తుగానుండు.

క. అనవుడు పిద్దలుఁ దమలోఁ, బొనరియు
రయుండొరులతోడ భూభుజా లలుకన్...
భార. ఆది. ౮. ౧౧౧.

౩. ఒప్పు, పొసఁగు.

మ. అనిమ స్మేచ్ఛి వృకోదరుం డితఁడు కార్యం
బింత చెల్లంబుగాఁ, బొనరం బల్కె
యుంచుఁ బేరాలఁగుపొంపుం బొంద ...
భార. ఉద్యో. ౩. ౧౪౩.

ద్వి. మును తేనియొక్క త్రోవ ముందట నున్నఁ,
బొనర నిక్కల యయ్యెఁ బోకల యనుచు.
బస. పు ౩. ౭౯. పా. ౨౩౩. పం.

వి. ౧. పొందిక, పొంకము. (దూ. పొనరాకు,
పొనరుపడు.) ౨. ఇంపు. (శ. ర.)

జ: పొనరాదు, పొనరించు, పొనరుచు, పొనరు
పడు.

**పొనరుచే(ర్చు)** = ఒనరుచే. స. క్రి.
(√పొనరు.) ౧. చేయు, కావించు.

క. తనపేర్మికి ననుగుణముగ, వనరుహలోచనుఁడు
పుంసవనసీమంతా,ద్యనుపమ కల్యాణంబులు,
పొనరిచి సమ్మోదవిభవపూర్ణత నొప్పెన్.
హరి. ఉ. ౩. ౧౮౧.

తే. తనముదిమి తాను గాని జ్యవ్వనము కుమా
రున కొసంగి వానిన్ జనపాలనఖేలనలోలు
నిగాఁ, బొనరిచి యానుకృతి పవెఁ దపో
వనమునకున్. ఉ. రా. ౭. ౪౦౩.

చ. ...గచ్చుకొట్టమున క్రొంతచెలంగెడి పట్టునం
బొన్పర్చిన విభలంబు యోగము వికీర్ణదళస్థలి
యందు మందలోన్.
(మార్క. ౩. ౩౭.)

౨. ఉపయోగించు, వినియోగించు.

క. తవకొలఁది నుపాయంబులు, బొనరిచి ధన
వంతుఁడగుట భూపగుణము నిర్ధనుని నిజ
ప్రజయును గై,కొనదు వినోదులును సరకు
గొనరు కుమారా. (భార. శాం. ౩. ౧౭౩.)

౩. పొసఁగఁజేయు, పొందుపఱుచు.

క. పొనరిచి యాడెడుమాటలఁ,గొనఁ దలఁపక
దుర్వినీతకోటిధనంబుల్, దన కొక్కనట్టి
తప్పులఁ,గొని సుజనుల కీగి నృపతిగుణ
మంత్రులుబుధుల్. (భార. శాం. ౨. ౧౯౭.)

**పొనరుపడు.** అ. క్రి. (పొనరు + పడు.) పొందు
పడు, అనుకూలించు. (శ. ర.)

**పొనలు.** అ. క్రి. ధగధగమండు.

ద్వి. .. తద్బిలాంతర్వీథినుండి, కనలుచుఁ బొన
లుచుఁ గనగనయనుచు ..వరలుఘోరాగ్నిఁ,
జొడగని .
పండితా. పర్వ. ౩కాం. పొ. ౧౩. పం

**పొనిక.** వి. తృణవిశేషము, ముంజగడ్డి. శ్రీ.

సీ. పొనిక యంచునఁ దగు ముంజమ .
ఆం. భా. ౨. ౬౪.

చ. నక్కతోఁకయున్, పొని కద పీరి
తోఁటఁగియు ప్రబంధ. ౨౦౦.

**పొను = పొన్ను[1].** వి. బంగారము.
(చూ. పొనుఁగంటి.)
జ : పొనుగంటి

**పొనుఁగంటి.** వి (పొను + కన్ను.) కనక
నయనుఁడు, హిరణ్యాక్షుఁడు.

క. తొలుతఁ బొనుఁగంటి నుట్టుటు,వలనం బాఁప
వలె ముద్దుఁగు వసుధాస్థలిపై
దశా ౩. ౨౧౨

**పొనుఁగు[1].** వి. నిగులు, నిప్పుకాంతిని కప్పివేయు
భస్మము, తేజోహీనత.

ఆ. పొగయు మిడుఁగుఱుంను బొనుఁగులేని
శిఖియు, బహులశిఖలునైనపగిది ననఘ .
భార. శాం. ౫. ౯౪.

విణ. నిస్తేజము, దీనము.

గీ. వీతలజ్జఁడై పలుచె పౌవికవిభుఁడు, పొనుఁగు
ప్రజ సేల యాఁడి దురిమిపైన, నమరా
త్ముని వినుకొని యనుపు లిభుడు, గానఁగ
వలయు శరెమ్ము నద్వినుతకార్య.
భార. ఆది. ౬. ౨౩౭.

జ : పొనుఁగుపడు, పొనుఁగుపఱచు, పొనుఁగు
వోవు, పొప్పుకు.

**పొనుఁగు[2].** వి. తృణవిశేషము. (శ. ర.,శ్రీ.)

**పొనుఁగు[3].** విణ. వామనుఁడు, పొట్టివాఁడు.

సీ. పొట్టి కొట్టి . . పొనుఁగు బుడుత ...
యనగను వామనాఖ్య దనరు.
ఆం. భా. ౨. ౧౨౩.

జ : పొనుఁగుచేరు.

**పొనుఁగుచేరు.** వి. (√పొనుఁగు[3].) మత్స్య
విశేషము. (శ. ర.)

**పొనుఁగుప(వ)డు = పొనుపడు, పొన్పడు, పొంపడు.** అ. క్రి. (పొనుఁగు[1] + పడు.) ౧.
నిస్తేజమగు, కాంతిహీనమగు, చల్లారు.

క. మును సంకటపడి మూఁకలు, కనుకని విచ్చు
టయుఁ బిదప గాండివి మెఱసెం, బొనుఁగు
వడి యుండి తగుగా,నున్న మండుమణి
నలంబుపోల్కి మహీశా.
భార. ద్రో. ౩. ౨౧౩.

ఆ. జగములెల్ల దాఁటిచాన త్రివిక్రమ్ము,చరణ
నఖరచంద్రచంద్రికలను, బొనుఁగుపడిరొ
సత్యమున బ్రహ్మతేజంబు, దివసకరుని యుదుల
దివియవోలె. భాగ. ౮. ౬౨౮.

గీ. అమరపతినందనుఁడు పాద వడఁగి చనిన,
ననుచరుఁ డుచు నుడివోనునట్లకాడ, యదరి
దరికొని మండుఁదీవ్రానలంబు, వుడుక కెద
గల్గ పైచిరఁ బొనుఁగు వడదె.
నిర్వ. ౬. ౧౧౦.

చ. కటకమానిద్రుమద్రుమవితానము లాప్పుఁ
బరాధి కంక మ,త్కటచటులోర్మి మా స్త
ముల గర్వమునన్ వెదలంగఁద్రోచినన్,
బటుతగ భావ మేదిని బహుభంగి విశీర్ణత
నొంది క్రింద న,చ్చటవచటన్ బొనుంగువడి
ప్రగ్గినవాడకికలలో యనన్.
నృసిం. ౧. ౩౩.

100

**పౌరోధసము.** సం. వి. అ. న. పురోధసుని వృత్తి

**పౌరోభాగ్యము.** సం. వి. అ. న. ౧. పురోభాగ భావము, తప్పులుమాత్రమె ఎత్తిచెప్పుట ౨. ఈర్ష్య, అసూయ. 3. దుండగము, దుడుకు. ౪. పిలువని పేరంటముగాఁ బోవుట. ౫. అధిక ప్రసంగము

**పౌరోహితము.** సం. విణ. (అ. ఈ. అ.) పురోహితునికి సంబంధమైనది. - వి. అ. న. ౧. పురోహితకర్మము. ౨. అథర్వణవేదము (శే. వి.)

**పౌరోహిత్యము.** సం. వి. అ. న. పురోహితుఁడు చేయుపని

**పౌర్ణమాసము.** సం. విణ. (అ. ఈ. అ.) పూర్ణిమాసంబంధి, పున్నమకు సంబంధించినది - వి. అ. పుం. పున్నమనాఁడు చేయవలసిన యాగము. (ఇది అగ్నిహోత్రముచేయువారు చేయుపని)

**పౌర్ణమాసి.** సం. వి. ఈ. స్త్రీ. పూర్ణిమ, పున్నమ.

**పౌర్ణమాస్యము.** సం. విణ. (అ. ఆ. అ.) పున్నమనాఁడు కలుగునది (సూ. గా. ది.) వి. అ. న. పున్నమనాఁడు చేయుయాగము.

**పౌర్ణమి.** సం. వి. ఈ. స్త్రీ. పున్నమ (వాచ.)

**పౌర్తికము.** సం. విణ. (అ. ఈ. అ.) పూర్తమునకు సంబంధించినది, పూర్తమునకు (చెఱువులు త్రవ్వించుట మొ.) సాధనమైనది. (కర్మము.)

**పౌర్వదే(దై)హికము.** సం. విణ. (అ. ఈ. అ.) పూర్వదేహసంబంధి, పూర్వజన్మమునఁ జేయఁబడినది.

**పౌర్వపదికము.** సం. విణ. (అ. ఈ. అ.)-సమాసము-పూర్వపదమునకు సంబంధించినది, పూర్వపదగ్రాహకము.

**పౌర్వము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. పూర్వకాలసంబంధి. ౨. పూర్వదిక్సంబంధి, తూర్పుది.

**పౌర్వాపర్యము.** సం. వి. అ. న. ౧. పూర్వాపరత్వము, ఒకటికొకటి ముందటిది వెనుకటిదిగా నుండుట ౨. అనుక్రమము, సొరిది.

**పౌర్వాహ్ణికము.** సం. విణ. (అ. ఈ. అ.) పూర్వాహ్ణభవము.

**పౌలస్తి.** సం. వి. ఈ. స్త్రీ. పులస్త్యబ్రహ్మ కూఁతురు, శూర్పణఖ.

**పౌలస్త్యము.** సం. వి. అ. న. యుద్ధము. (శే. వి.)

**పౌలస్త్యుఁడు.** సం. వి. అ. పుం. - పులస్త్యుని యపత్యము.-౧. రావణుఁడు. ౨. కుంభకర్ణుఁడు. 3. విభీషణుఁడు. ౪. కుబేరుఁడు. ౫. చంద్రుఁడు. (విల్సన్)

**పౌలి.** సం. వి. ఇ. పుం. ఇంచుక వేఁచి యించుమించుగాఁ బక్వావస్థకుఁ దెచ్చినది, గుగ్గిళ్లు, అభ్యూషము.

**పౌలు** = పవులు., ౧ గులు. (క్రి. (శ. ర.)

**పౌలోమి.** సం. వి. ఈ. స్త్రీ. (పులోముని కూఁతురు) శచీదేవి.

**పౌషము.** సం. వి. అ. పుం. పుష్యనక్షత్రముతోఁ గూడిన పున్నమగల నెల, పుష్యమాసము. న. ౧. ఉత్సవము. ౨. యుద్ధము.

**పౌషి.** సం. వి. ఈ. స్త్రీ. పుష్యమాసమున వచ్చు పున్నమ.

**పౌష్కరము.** సం. విణ. (అ. ఈ. అ.) పుష్కర సంబంధి.

ప్రకటించు. స. క్రి. ప్రకాశింపఁజేయు, వెల్లడిసేయు.

ఉ. ... నేఁ, డిరణములోన నిట్లు ప్రకటించె భవద్భుజవీర్యకార్యముల్.

భార. కర్ణ. 3. 3౫.

చ. పురుషవిశేషవిస్ఫురణకుఁ బూజ్యుఁడు రాజులలోన నీయుధిష్ఠిరుఁ డని నీగుణాలిఁ బ్రకటించి మనంబులలోన

భార. సభా. ౨. ౧౨.

ప్రకటితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రకాశితము, ప్రకటింపఁబడినది, తేటతెల్లముసేయఁబడినది, వెల్లడిసేయఁబడినది. ౨. కనుపట్టినది, గోచరించునది.

ప్రకటిల్లు. సం. అ. క్రి. ప్రకాశితమగు.

సీ. పదపల్లవంబునఁ బ్రకటితం బచదళేఖ ... క్రి ... (కాశీ. ౪. ౧౧౭.)

ప్రకటీకరించు. సం. స. క్రి. ప్రకటముచేయు.

వ. ... హృదయంబు ప్రకటీకరించిన...భూత కరుణారసాశ్రుభావంబున

కళా. ౭. ౬౯.

ప్రకథనము. సం. వి. అ. న. చక్కఁగా చెప్పుట, వెల్లడించుట.

ప్రకరణము. సం. వి. అ. న. ౧. శాస్త్రసిద్ధాంతమును ప్రతిపాదించు గ్రంథము. ౨. ఏకార్థప్రతిపాదకమగు గ్రంథభాగము, ఏకవిషయబోధకమగు గ్రంథభాగము. 3. ప్రస్తావము, అవసరము. ౪. దృశ్యకావ్యభేదము. (ఇందు ఇతివృత్తము లౌకికమును కవికల్పితమును, శృంగారము అంగి, నాయకుఁడు విప్రామాత్యవణిజులలో నొకఁడు, ధీరశాంతుఁడు.) ౫. (మీమాంస) అంగవాక్యసాపేక్షమగు ప్రధానవాక్యము.

ప్రకరణి. సం. వి. ఈ. స్త్రీ. ఉపరూపకభేదము. (ఇందు నాయకుఁడు సార్థవాహకాది; నాయిక నాయకసమానవంశజాత)

ప్రకరము. సం. వి. అ. పుం. ౧. సమూహము. ౨. చెదరిన పుష్పములోనగునవి, చల్లఁబడిన పుష్పాదులు. 3. అతిక్షేపము, అనల వి...కైమట న ... ౪. చందనము.

ప్రకరి. సం. వి. ఈ. స్త్రీ. నాటకాదులయందు కొంత కథాభాగమునందుమాత్రమే ప్రకరగవశమునకుండు గ్రంథభాగము.

ప్రకర్షకుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు. (...)

ప్రకర్షణము. సం. వి. అ. న. ౧. ఉత్కర్షము. ౨. ఆకర్షణము. 3. చక్కఁగా దున్నుట.

ప్రకర్షము. సం. వి. అ. పుం. ౧. ఉత్కర్షము, అతిశయము. ౨. బలిమి, శక్తి. 3. మిక్కిలి కర్షణము, చక్కఁగా దున్నుట. ౪. విశేషత్వము.

ప్రకర్షి. సం. విణ. (న. జీ. న.) అతిశయించునది, ఉత్కృష్టము.

ప్రకర్షించు. సం. స. క్రి. గొప్పవానినిగాఁ జేయు.

దండకము. లలాటాక్షు దర్శింపుమీ లేవ భోగిన్ ప్రకర్షింపుమీ గానము భావింపుమీ

భోగినీదండకము.

ప్రకర్షితము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి లాగఁబడినది.

ప్రకల. సం. వి. ఆ. స్త్రీ. అతిస్వల్పభాగము.

ప్రకల్పన. సం. వి. ఆ. స్త్రీ. ఏర్పాటు, వ్యవస్థ.

ప్రకల్పించు. సం. స. క్రి. కల్పించు.

గీ. కౌగి ... కుటీగోళంబులో గాలి కుంభక
మున, బలిమి నిలిపిన .. యది ప్రకల్పించఁ
సుస్థాదులై నరుజలు. (కాశీ. ౫. ౧౩౫.)

ప్రకల్పితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చేయఁబడినది; కల్పఁబడినది. ౨. ఏర్పఱుపఁబడినది. ౩ రచింపఁబడినది.

ప్రకాండము. సం వి. అ. పుం, న. ౧. చెట్టుయొక్క వేళ్లు మొదలుకొని కొమ్మలవఱకుఁగల భాగము, చెట్టుబోదె ౨ నిటపము -విణ. శ్రేష్ఠము (ఇది ఉద్ఘశబ్దముపంటిది ఏా. ఉద్ఘము.)

ప్రకాండరము. సం వి అం. పుం వృషభము.

ప్రకామము. సం విణ. (అ. ఆ. అ) మిక్కిలి కామముగలది, ప్రకృష్టకాముకము ౨ యథేష్టము -వి. అ. పుం తృప్తి, సంతుష్టి

ప్రకారము. సం వి అ. పుం ౧. సాదృశ్యము, పోలిక. ౨. (తర్క) విశేషణము, విశిష్టజ్ఞానమునందు విశేషణముగాఁదోఁచు పదార్థము. ౩ భేదము.

ప్రకాలనము. సం విణ. (అ ఆ. అ.) హింసించునది.-వి. అ పుం. సర్పభేదము -వి అ. న. మారణము, చంపుట

ప్రకాశకము. సం. విణ. (అ. కా. అ.) ౧. వెలిఁగించునది, వెలుఁగునిచ్చునది, వివరించునది, విశదీకరించునది ౨. ప్రకాశించునది, వెలుఁగునది.

ప్రకాశకజ్ఞాత. సం. వి ఋ పుం.-వెలుఁగును నిచ్చువానిని ముందుగాఁ దెలిసికొనునది - కోడి, కుక్కుటము.

ప్రకాశనము. సం. విణ. (అ. ఆ అ.) ప్రకాశింపఁజేయునది, వెలయించునది, వెల్లడించునది. -వి. అ. న. ౧. ప్రకాశింపఁజేయుట, వెలయించుట. ౨. చాటుట, ప్రదర్శనము. ౩. వెలిగించుట. ౪. ప్రకటించుట, చాటుట.

ప్రకాశనారి. సం. వి. ఈ. స్త్రీ. వేశ్య.

శ్లో. ప్రకాశనారీధృత ఏవ యస్మాత్, తస్మా
త్త్వయం ధారయ నప్రకాశాత్.
(మృచ్ఛ. ౩. ౭.)

ప్రకాశము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వెలుఁగునది, మెఱయునది. ౨. స్ఫుటము, తేటతెల్లమైనది. ౩. ప్రసిద్ధము. ౪. వికసించినది. ౫. తుల్యము. (శే. ని.)-వి. అ. పుం. ౧. వెలుఁగు, కాంతి ౨. వికాసము, వికసించుట. ౩. ఎండ, ఆతపము. ౪ ప్రసిద్ధి. ౫. గ్రంథభాగము. (అధ్యాయాది) ౬. గుఱ్ఱపుదేహముయొక్క మీఁదిభాగమందలి నిగ్గు ౭. ప్రహాసము, పెద్దనవ్వు. (మే ని)

ప్రకాశి. సం. విణ. (న్. నీ. న్) ప్రకాశించునది.

ప్రకాశించు. సం స క్రి. ప్రకాశింపఁజేయు.

ఉ. కాంత నిజంబె యొరికిని గానిఁ బోయిన
సుద్దులే ప్రకాశింతువు గాని యూనదుమఁ
జేసినదోసము తెంచరేకదా.
(సారంగ. ౩. ౫౬.)

అ. క్రి. ౧. వెల్లడియగు.

క. అని తలఁచి తనదుతలఁ బెవ్వనికిఁ బ్రకా
శింపకుండ (భోజరా ౧. ౯౨.)

౨. కనఁబడు.

గీ. వెలుఁగుచుండెడి దీపంబు వేలవస్తువులఁ
బ్రకాశింపఁజేయునట్లు .
(భార. శాం. ౪. ౧౬౭.)

౩. ఒప్పు.

భుజంగప్రయాతము. . విశాలేక్షణంబుల్ ప్రకా
శింప విద్యుత్ప్రభాదేవి చూచున్
(వరాహ. ౩. ౧౧.)

౪. తెలుఁగు, వెలుఁగు.

ప్రకాశితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తెల్లడి యైనది. ౨. (గ్రంథము) ప్రకటితము. ౩. వెలు సినది, తెలిఁగినది. ౪. దృష్టిగోచరమైనది.

—వి. అ. న. ౧. తెలుఁగు. ౨. స్పష్టత.

ప్రకాశ్యము. సం. వి. (అ. ఆ. అ.) ప్రకాశింపఁ దగినది —వి. అ. న. తెలుఁగు

ప్రకిరణము. సం. విణ. (అ. ఆ. అ.) చెదరినది.

ప్రకీరము. సం. వి. అ. పుం. చెవులియడుగు చెట్టు ‡. మా. పూతికర(ం)జము. ‡.

ప్రకీర్ణకము. సం. వి. అ. న. ౧. వింజామరము. ౨. విరివి.—పుం. గుఱ్ఱము

ప్రకీర్తన. సం. వి. ఆ. స్త్రీ. ౧. కీర్తించుట. ౨. పేర్కొనుట. ౩. ప్రకటించుట.

ప్రకీర్తనము. సం. వి. అ. న. ప్రకీర్తన

ప్రకీర్తి. సం. వి. ఇ. స్త్రీ. గొప్పకీర్తి

ప్రకీర్తితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కొని యాడఁబడినది. ౨. పేర్కొనఁబడినది ౩. వివ రింపఁబడినది ౪. ప్రకటితము, బయల్పడినది

ప్రకీర్యము. సం. విణ. (అ. ఆ. అ.) చెల్లఁదగినది. —వి. అ. పుం. ప్రకీరము.

ప్రకుట్యము. సం. వి. అ. పుం. అడవిమల్లె. ‡.

ప్రకృతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. చక్కఁగాఁ జేయఁబడినది. ౨. గ్రంథప్రస్తావము వలనఁ బొందఁబడినది. ౩. మొదలుపెట్టఁబడినది ౪. నెరవేర్పఁబడినది. ౫. సహజసిద్ధమైనది.

—వి. అ. న. ప్రస్తుతవిషయము, ఎత్తికొన్న విష యము.

ప్రకృతార్థము. సం. వి. అ. పుం. ప్రారం భించిన విషయము.

ప్రకృతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. సహజస్థితి. ౨. సహజస్వభావము. ౩. సహజస్వరూపము. ౪. వంశసంభవము ౫. మూలకారణము. ౬. (వ్యాకరణ) అర్థవచ్ఛబ్దరూపము, ప్రత్యయా దులు చేరని మొదటి శబ్దరూపము ౭. సృష్టి విషయమున పరమాత్ముని సంకల్పము, ఉపా దానకారణము. ౮. జననేంద్రియము. ౯. (గణిత) మానము, గుణకము, గుణకాంకము. ౧౦. పరమాత్మ. ౧౧. పగిది, రీతి ౧౨ ఒక ఛందస్సు (చరణమునకు ౨౧ అక్షరములుండు శ్లోకములు గలది )

ప్రకృతిత్రయము — వాత, పైత్య, శ్లేష్మములు మూఁడు.

ప్రకృతి వ్యూహములు— దండ, భోగ, మండల, అసంహతములు నాలుగు.

ప్రకృతులు— స్వామ్యాది సప్తప్రకృతులు :— స్వామి, అమాత్యుఁడు, సుహృత్తు, కోశము, రాష్ట్రము, దుర్గము, బలము

అవ్యక్తాది అష్టప్రకృతులు .- అవ్యక్తము, బుద్ధి, అహంకారము, పంచతన్మాత్రలు - అనగా శబ్దస్పర్శరూప రసగంధములు.

ప్రకృష్టము. సం. విణ (అ. ఆ. అ.) ప్రకర్షము గలది.

**ప్రకోపనము.** సం. వి. అ. న. రూ. ప్రకోపణము ౧. ఉత్తేజనము. ౨. ఉద్దీపనము ౩. ఉద్బోధనము

**ప్రకోపము.** సం. వి. అ. పుం. ౧. తీవ్రమైన కోపము. ౨. ఉద్రేకము

ఉదా. ఉపదేశము మూర్ఖులకు ప్రకోపము కల్గించునే కాని, శాంతము కల్గింపదు

౩. (సమాసములందు ఉత్తరపదముగా నున్నప్పుడు) అతిశయము, ఆధిక్యము.

ఉదా. వాతప్రకోపము

**ప్రకోపించు.** సం. అ. క్రి. ఉద్రేకించు, ముమ్మరించు.

ఉదా. శైత్యము ప్రకోపించినది.

**ప్రకోష్ఠకము.** సం. వి. అ. పుం. ప్రకోష్ఠము[4].

**ప్రకోష్ఠము.** సం. వి. అ. పుం. ౧. తొట్టికట్టు. ౨. కలాంచి, ముంజేయి మొదలుకొని మోఁచేతి వఱకును గల ప్రదేశము. ౩. ముంజేయి. ౪. భవనమునందు బహిర్ద్వారము కడనుండు గది ౫. ప్రాంగణము. ౬. ద్వారభాగము.

**ప్రక్క.** దే. వి. (సం. ప్రక్కా.) ౧. పక్షము. ౨. బరిక్కెంక. ౩. పార్శ్వము.

సీ. హిమభాను మీనల్లుఁ డితని లావణ్యంబు తలఁచిన మశక మాత్రమ్ము సుమ్ము, శతపత్రదాయాదుఁ డితని తేజంబు ముందరను ఖద్యోత మాత్రమ్ము సుమ్ము, చతురానన బ్రహ్మ యితని వాక్పటిమ ముందరఁ బరాగము మాత్రమ్ము సుమ్ము, నిఖిల ప్రపంచంబు నిక్క మితని దొక్క ప్రక్కను మెతుకు మాత్రమ్ము సుమ్ము.

పాంచాలీ. ౨. ౨౪.

**ప్రక్కి.** వి. రూ. ప్రక్క.

**ప్రక్కె.** వి. పిచులము. ?

**ప్రక్షరము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వాఁడిగలది ౨. తీవ్రమయినది.

**ప్రక్రమణము.** సం. వి. అ. న. ౧. గమనము. ౨. గమనప్రారంభము

**ప్రక్రమభంగము.** వాక్య దోషములలో నొకటి. ఉద్దిష్ట ప్రక్రమమునకు కలిగిన భంగము భగ్నప్రక్రమత

ఉదా. ఆ బంతులలో మొదటిది తెల్లనిది, మూఁడవది నల్లనిది, రెండవది పచ్చనిది పువ్వులు పూచును, కాయలు కాచును, పండు పండును.

**ప్రక్రమము.** సం. వి. అ. పుం. ౧. నడచునప్పుడు పెట్టెడి యడుగు. ౨. దూరమానము. ౩. ప్రారంభము. ౪. ముందరికి పోవు గమనము, గతి. ౫. క్రమము ౬. ఉపధ ౭. పనికి ముందుగాఁ జేయు ప్రయత్నము. ౮. అవసరము. ౯. క్రమపారపఠనము.

**ప్రక్రాంతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మొదలు పెట్టఁబడినది ౨. కదలినది. ౩. చర్చలో నున్నది. ౪. ముందు చెప్పఁబడినది. పూర్వోక్తము. ౫. అతిక్రమము. ౬. ధైర్యము గలది.

—వి. అ. న. ౧. ప్రయాణ ప్రారంభము ౨. చర్చలోనున్న విషయము. ఎత్తికొన్న విషయము.

ప్రక్రియ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రకరణము ౨. అధికారము. ౩. మేలైన కార్యము. ౪. (వ్యాక) శబ్దరూపము కలిగిన విధము ౫. కావింపదగిన కార్యము. ౬. కార్యవిధానము.

ప్రక్లిన్నము. సం. విశ. (అ. ఆ. అ.) ౧ ఎక్కువగా తడిసినది, ఆర్ద్రము. ౨ తృప్తము పూర్తిగా తృప్తిచెందినది ౩. కరుణార్ద్రము

ప్రక్వణము. సం వి అ. పుం. వీణాధ్వని

ప్రక్వాణము = ప్రక్వణము.

ప్రక్షయము. సం. వి అ. పుం నాశనము

ప్రక్షరణము. సం. వి. అ. న. బొట్టుబొట్టుగా కారుట, ఓడుట

ప్రక్షాల(ళ)నము. సం. వి అ న ౧ చక్కగా కడుగుట ౨ శుద్ధిచేయుట ౩. స్నానము ౪. శుద్ధికార్యసాధనము. ౫. కడుగుటకుఁ దగిన నీరు.

ప్రక్షాలి(ళి)తము. సం. విశ. (అ ఆ. అ) ౧. సుస్నాతము. ౨. కడుగఁబడినది ౩ శుద్ధిచేయఁబడినది.

ప్రక్షిప్తము. సం. విశ. ౧. విసరివేయఁబడినది. ౨ (అక్రమముగా) దూర్చినది

ఉదా. ఈ గ్రంథములో ప్రక్షిప్తము లనదగిన పద్యము లున్నవి. అనఁగా గ్రంథకర్తరచింపనివి కలవు అని అర్థము.

ప్రక్షీణము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. క్షీణించిపోయినది. ౨. నష్టమయినది ౩. శిథిలించినది.

ప్రక్షుణ్ణము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. నలఁగఁగొట్టఁబడినది. ౨. పొడువఁబడినది.

ప్రక్షేపణము. సం. వి. అ. న. ౧. విసరివేయుట. ౨. (ధరలు మొ.) నిర్ణయించుట.

ప్రక్షేపము. సం వి. అ. పుం. ౧. విసరుట. ౨. చల్లుట. ౩ దూర్చుట. ౪. సమష్టివ్యాపారమందు వాటాదార్లు ఒక్కొక్కరు పెట్టిన పెట్టుబడి ధనము. ౫. కషాయములో కలిపిన పదార్థము.

ప్రక్షోభణము. సం. వి. అ. న ౧. క్షోభకలుగుట ౨ ఉద్రేకము కలుగుట.

ప్రక్షోభించు. సం అ క్రి మిక్కిలి కలఁతపడు.

ప్రక్ష్వేడన. సం. వి. ఆ స్త్రీ. చూ. ప్రక్ష్వేడనము

ప్రక్ష్వేడనము. సం. వి. అ న. ౧ అగ్రమునందు ఉక్కుకొనకగల బాణము. ౨. బిగ్గరగా పెట్టిన ఘోష.

ప్రఖరము. సం. వి అ. పుం ౧ పక్కెర, ఏనుఁగు గుఱ్ఱము మొ వానికి తొడుగు కవచము, కంబళము. ౨. కంచర గాడిద. ౩. కుక్క.

—విశ. (అ. ఆ. అ ) ౧ మిక్కిలి వేఁడిగలది. ౨. మిక్కిలి వాఁడిగలది ౩ మిక్కిలి కఠినమయినది ౪ మిక్కిలి వేఁడిగలది, ౫. మిక్కిలి కఠినమైనది, ౬. మిక్కిలి కఠినమైనది ౭ మిక్కిలి వాఁడిగలది.

ప్రఖ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రత్యక్షత. ౨. ప్రఖ్యాతి, కీర్తి ౩. తెల్లడి. ప్రకాశనము ౪. ప్రాదుర్భావము.

—విశ. ౧. స్పష్టము. ౨. పోలికగలది, సదృశమైనది. సమాసములందు ఉత్తరపదముగానే యుండును.

ఉదా : శశాంక ప్రఖ్యాతుగు పెంగము.

**ప్రఖ్యాతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి ప్రసిద్ధి కెక్కినది. కీర్తి పొందినది, ౨. తృప్తము, ౩. పరిచ్ఛిన్నము, ౪. పూర్వక్రయాధికారముతో ఆత్మీయముగా ప్రతిపన్నమైనది.

**ప్రఖ్యాతవప్తృకము.** సం. విణ. (అ. ఆ. అ) ప్రఖ్యాతుఁడైన తండ్రి గలది

**ప్రఖ్యాతి.** సం. వి. ఇ. స్త్రీ ౧. ప్రసిద్ధి, కీర్తి. ౨. స్తుతి, పొగడ్త ౩ ప్రత్యక్షత.

**ప్రఖ్యానము.** సం. వి. అ. న ౧. ప్రకటనము, వెల్లడిచేయుట. ౨ విజ్ఞాపనము, నివేదనము, ౩. ప్రత్యక్షత

**ప్రఖ్యాపనము.** సం వి అ న ౧ ప్రకటనము, వెల్లడించుట ౨ విజ్ఞాపనము, నివేదనము ౩ వార్తాప్రసరణము.

**ప్రగండము.** సం. వి అ. పుం మోఁచేతినుండి బుజము వఱకును గల బాహువు

**ప్రగండి.** సం. వి ఈ. స్త్రీ నగరమునందలి వెలుపలి గోడ

**ప్రగడ.** వి సచివుఁడు (చూ. ప్రగ్గడ, ప్రెగడ, ప్రెగ్గడ. ప్రెగ్గడ.)

**ప్రగతజానుకుఁడు.** సం. విణ. (అ అ అ.) దొడ్డికాళ్లవాఁడు. చూ. ప్రజ్ఞువు

**ప్రగతము.** సం. విణ. (అ ఆ. అ.) ౧. దూరముగా పోయినది. ౨. ఎడము గలది

**ప్రగతి.** సం. వి. ఇ స్త్రీ. ౧. ముందుగతి. ౨. పురోభివృద్ధి

**ప్రగధనము.** సం. వి. అ. న. అల్లిక.

**ప్రగమనము.** సం. వి. అ. న. ౧. పురోగమనము. ౨. ప్రేమించుటలో మొదటియడుగు వేయుట.

**ప్రగమము.** సం వి అ. పుం ౧ ప్రగతి. ౨. ప్రేమయొక్క ప్రథమ ప్రాదుర్భావము.

**ప్రగర్జనము.** సం. వి అ. న బిగ్గరగా గర్జించుట.

**ప్రగల్భ.** సం. వి ఆ స్త్రీ. ౧. స్వీయాంతర్భేద విశిష్టనాయికా విశేషము. పదునెనిమిదేండ్లకు మించిన వయసు గలిగి సంపూర్ణ యౌవనముతో వెలయుచు రతికళా పరిజ్ఞానము నిండుగా నుండు స్త్రీ. ౨ ప్రౌఢ

**ప్రగల్భత.** సం వి. ఆ. స్త్రీ. ౧. దిట్టతనము, ధృష్టత్వము. ౨ గర్వము. ౩ ప్రవీణత, ప్రావీణ్యము. ౪. పరిపాకము ౫ దర్పనము, తోఁపిక. ౬ వక్తృత్వము, మాటకారితనము ౭. పదవి, అంతస్తు ౮. నిశ్చయము, దృఢచిత్తత. ౯. పెంకెతనము, ధూర్తత్వము ౧౦. ప్రగల్భచూపు శృంగార చేష్టావిశేషము.

**ప్రగల్భుఁడు.** సం. విణ (అ. ఆ అ.) ౧ ప్రతిభ గలవాఁడు, ౨ ప్రౌఢుఁడు

**ప్రగాఢము.** సం వి అ. న ౧. పెల్లు. ౨. ఆహారవిహారాభావము, దేహక్లేశము.

—విణ. (అ. ఆ. అ.) అధికము. ౨. దృఢము. ౩. పూర్తిగా ముంచఁబడినది.

—అవ్య. ౧. తీవ్రముగా. ౨. అధికముగా. ౩. దృఢముగా. ౪. బలవంతముగా.

**ప్రగీతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పాడఁబడినది. ౨. గానముతో ముఖరితమయినది.

—వి. అ. న. ౧. పాట. ౨. పాడునట్టుగా చదువు రీతి.

**ప్రగీతి.** సం. వి. ఇ. స్త్రీ. ఛందోవృత్తవిశేషము.

**ప్రగుణనము.** సం. వి. అ. న. సరిగానుంచుట.

**ప్రగుణము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧ సరియైనది, సమ్మేళముగలది. ౨. ఋజుమార్గమున వర్తించునది ౩. అగ్రతగలది. ౪. సమర్థతగలది. ౫. నేర్పుగలది. ౬. తెలివిగలది.

**ప్రగుణితము.** సం. విణ. (అ. ఆ అ) ౧. సరిచేయఁబడినది. ౨. ఋజుమార్గమునఁ బెట్టఁబడినది.

**ప్రగుణీకరించు.** సం స క్రి ౧. సరిచేయు. ౨ ఋజుమార్గమునఁ బెట్టు ౩ పోషించు

**ప్రగుణ్యము.** సం విణ (అ ఆ అ) ౧. అధికము. ౨. గుణోపేతము, ప్రశస్యతము

**ప్రగృహీతము.** సం విణ. (అ ఆ అ.) ౧ గ్రహింపఁబడినది ౨. (వ్యాకరణ) సంధికార్యము లేనిది చూ. ప్రగృహ్యము.

**ప్రగృహ్యము.** సం వి అ.న ౧ (వ్యాకరణ.) సంధికార్యము లేని అచ్చు "ఈదూదేద్ద్వివచనం ప్రగృహ్యమ్" పాణిని. ౧. ౧. ౧౧. శబ్దద్వివచన రూపాంతరముల నుండు ఈ ఊ ఏ లు ప్రగృహ్యములు. ౨. అభిజ్ఞానము. ౩. వాక్యము.

**ప్రగ్గ.** దే. వి ప్రంగయొక్క రూపాంతరము.

**ప్రగ్గడ.** (రూ. ప్రగ్గాడ) సచివుఁడు.

క. అపుడు హతశేషు లసురా,ధిపుఁ జేరంబోయి దేవ దేవర సేనా,ధిపులం బ్రగ్గడ కొడుకులఁ గపిచరుఁ డొకరుఁడ సమైనికముగాఁ గూల్చెన్.

రామా. ౬. ౨౧౩.

**ప్రగ్గము.** తె. వి. పగ్గమునకు రొండటిరూపము. (చూ పగ్గము౩) తాడు.

ఈ. దిగ్గియనంచ దూఁడుగాని తీరపువేతువు వంకిమీఁదుగా,నగ్గడ పుల్లకేసరమునందు వసింపఁగ నెక్కినూలిమట్టి, ప్రగ్గము నందఁగాఁ దరుమరంద పరీమళరంద గోష్ఠికిన్, దగ్గలమాడు లేంట్లు మరువింటికిఁ బూని గుణ ద్వయత్వమున్.

ఆము. ౫. ౧౨౨.

**ప్రగ్గడ.** రూ ప్రగ్గడ.

**ప్రగ్రహణము.** సం వి. న. ౧. లెస్సగా గ్రహించుట ౨ సూర్యచంద్రగ్రహణారంభము. ౩. కళ్లెము ౪ ప్రతిబంధము. ౫. కట్టు. ౬. సమర్పణము. ౭ మార్గదర్శనము.

**ప్రగ్రహము.** సం. వి. అ. పుం. ౧. పట్టుకొనుట. గ్రహణము. ౨ సూర్యచంద్రగ్రహణారంభము. ౩. చెఱ. ౪. చెఱఁబడినది ౫. పగ్గము. ౬. కొరడా. ౭. ఏనుఁగు గుఱ్ఱము మొదలగు మృగములను మచ్చిక చేయుట. ౮. రశ్మి. ౯. త్రాసునూత్రము. ౧౦. విష్ణునామము. ౧౧. బాహువు, ౧౨. మార్గదర్శి. ౧౩. దయ, అనుగ్రహము. ౧౪. కర్ణికారము. క్రి. ౧౫. ప్రగృహ్యము.

**ప్రగ్రాహము.** సం వి. అ. పుం. ౧. పట్టుకొనుట, గ్రహణము ౨. వహించుట. ౩. త్రాసునూత్రము. ౪. కళ్లెము.

ప్రగ్రీవము. సం. వి. అ. పుం., న. ౧. కలశము, ౨. ఒలుగుదిండు. ౩. కొండ. ౪. ప్రాసాదము నందలి వాతాయనము, కిటికీ. ౫. ప్రాసాద శిఖరగృహము. ౬. వృక్షాగ్రము. ౭. మందిరమునకు చుట్టును కొయ్యతో కట్టిన ప్రాకారము ౮. విలాసమందిరము

ప్రఘటా. సం. వి. అ. స్త్రీ. శాస్త్రముల ప్రాథమిక సూత్ర విషయము

ప్రఘటావేత్త = ప్రాథమిక సూత్ర విషయములు మాత్రమే తెలిసినవాఁడు

ప్రఘణము. సం. వి. అ. పుం. రూ. ప్రఘనము, ప్రఘాణము, ప్రఘానము ౧. అలిందము, వాకిలి ముందుండు నలుచదరపు చోటు ౨. ద్వార ప్రకోష్ఠము, తలవాకిలి ప్రక్కనుండు గృహము. ౩. ఇనుపగుదియ. ౪. రాగి బిందె

ప్రఘసము. సం. విశే. (అ. ఆ. అ.) కుక్షింభరి. ఘస్మరము

—వి. అ. పుం. ౧. తిండిపోతుతనము ౨. రాక్షసుఁడు

ప్రఘాణము = ప్రఘణము.

ప్రఘాతము. సం. వి. అ. పుం. ౧. చంపుట. ౨. యుద్ధము.

ప్రఘానము = ప్రఘణము.

ప్రఘారము. సం. వి. అ. పుం. ౧. కాఱుట, క్షరణము. (జలాదిధార అని శ. ర.) ౨. యజ్ఞాదులందు అగ్నిహోత్రము మీఁద ఘృతాదుల కాఱుట. (వాచ.) చూ. ప్రాఘారము.

ప్రఘూర్ణము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి తిరుగుడుగలది. ౨. చుట్టు తిరుగుట. ౩. పర్యటనము, పరిభ్రమణము.

—వి. అ. పుం. అతిథి.

ప్రఘోషము. సం. వి. అ. పుం. ౧. పెద్దధ్వని. ౨. కోలాహలము.

ప్రచండము. సం. విశే. ౧. తీవ్రము ౨. అధికము ౩. దృఢము ౪. మిక్కిలి వేఁడిగలది. ౫. కోపాకులము ౬. భీషణము ౭. దుస్సహము. ౮. సరభసము. ౯. చేరరానిది ౧౦. వాఁడియైనది.

—వి. అ. పు. కరవీరవిశేషము, [తెల్ల గన్నేరు]

ప్రచక్రము. సం. వి. అ. న. ౧. ప్రయాణము సాగించుచున్న సేన ౨. పరిభ్రమించుసేన (సైనికుల ఆహారపదార్థముల అన్వేషణమునకై)

ప్రచక్షుస్సు. సం. వి. స. పుం. ౧. బృహస్పతి. ౨. గురుఁడు (గ్రహము)

ప్రచయనము. సం. వి. అ. న. (పుష్పాలు మొ.) కోసిపోఁగుచేయుట, సంగ్రహించుట.

ప్రచయము. సం. వి. అ. పుం. ౧ (పుష్పాదుల) పోఁగు, రాశి. ౨. గుంపు ౩. వృద్ధి. ౪. కొలఁదిపాటి చేరిక. ౫. అనుదాత్త ఉదాత్త స్వరిత ప్రచయములను స్వరములలో నాల్గవది ఉ. (శ్రేణియందలి అంకెలలో ప్రతి రెండంకెలకును సాధారణముగా నుండు వ్యత్యాసము ఉదా 1 4. 7, 10, 13, 16-ఇందు ప్రచయము. 3

ప్రచరణము. సం. వి. అ. న. ౧. ముందుకు సాగుట. ౨ ప్రచారములో నుండుట. ౩. చెలామణియగుట. ౪. పూనుకొనుట, మొదలిడుట ౫. వాడుట.

ప్రచరణి. సం. వి. ఈ. స్త్రీ. కొయ్యగరిటె

ప్రచరము. సం. వి. అ. పుం. ౧. మార్గము, బాట. ౨. ప్రయోగము. ౩. వాడుక. ౪. ఆచారము.

ప్రచరించు. సం. అ. క్రి. చరించు, తిరుగు. —స. క్రి. ప్రచారములో నుంచు.

ప్రచరితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రచరించినది. ౨. ప్రచారములో పెట్టఁబడినది. ౩. (వృత్తిధర్మముగా) సాగింపఁబడినది.

ప్రచలనము. సం. వి. అ. న. ౧. (భయాదుల వలన) వడఁకుట. ౨. కొనసాగు మరలుట. ౩. వాడుకలో నుండుట, చెలామణియగుట.

ప్రచలము. సం విశే. (అ. ఆ. అ.) ౧. (భయాదులవలన) వడఁకుచున్నది. ౨. బయలు చేరినది. ౩ వడమనది. ౪ క్షుభితము. ౫. మార్గభ్రష్టము.

ప్రచలాకము. సం వి అ. పుం ౧. విలువిద్య. ౨. నెమలితోఁక. ౩. పాము.

ప్రచలాకి. సం వి. ఇ పుం. నెమలి.

ప్రచలాయితము. సం విశే. (అ. ఆ. అ.) తొగ్గుట

—వి అ న (కూర్చుండి కునికిపాట్లు పడునప్పుడు) కలిగెడు తలయూఁపు

ప్రచాలము. సం. వి అ. పుం. వీణాకంఠ (భాగ)ము.

ప్రచితము. సం విశే (అ ఆ అ) ౧ (పుష్పాదులు) కోసి పోఁగుగాఁ బెట్టఁబడినది. ౨. (పదార్థములు) కూర్పఁబడినది ౩. అనుదాత్త స్వరము ౪ నింపఁబడినది

ప్రచురత. సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రాచుర్యము. ౨. బాహుళ్యము. ౩. విపులత.

ప్రచురత్వము. సం. వి. అ. న. ప్రచురత.

ప్రచురము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. బహుళము. ౨. విపులము. ౩ అధికము, పెద్ద, ఎక్కువ. సమాసములందు ఉత్తరపదముయినప్పుడు అధికమని అర్థము.

ఉదా: శిల్పకళా ప్రచురుఁడు, సద్గుణ ప్రచురః ఘనము మహావృక్ష ప్రచురము.

ప్రచురీకృతము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రచుర మయినదిగాఁ జేయఁబడినది.

ప్రచేత. సం. వి. ఋ. పుం. (రథాదివాహన) తోలెడువాఁడు.

ప్రచేతసుఁడు. సం. వి. స్. పుం. రూ ప్రచేతుఁడు, ప్రాచేతసుఁడు. ౧ వాల్మీకి. ౨. మనువు. ౩. దక్షుఁడు. ౪. వరుణుఁడు.

ప్రచేలకము. సం. వి. అ. పుం. గుఱ్ఱము

ప్రచేలము. సం. వి. అ. న. పసుపుపచ్చని చందనపు చెక్క.

ప్రచోదనము. సం. వి. అ. న. చోదనముచేయుట, ప్రేరేచుట.

ప్రచోదని. సం. వి. ఈ. స్త్రీ. ౧. వాఁకుడు. ౨. సంగడి తెడ్డు.

ప్రచోదితము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రేరితము.

ప్రచ్ఛదము. సం. వి. అ. పుం. కప్పు, అచ్ఛాదనము.

ప్రచ్ఛనం. సం. వి. ఆ. స్త్రీ. ప్రశ్న.

ప్రచ్ఛనము. సం. వి. అ. న. ప్రశ్నము.

ప్రచ్ఛన్నము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. కప్పఁబడినది. ౨. రహస్యమైనది. ౩. దాఁచి యుంచినది ౪ (వస్త్రము) తొడిగినది. ప్రచ్ఛన్నతస్కరుఁడు=కనఁబడని దొంగ —వి ౧ రహస్యద్వారము. ౨. వాతాయనము. —అవ్య. రహస్యముగా.

ప్రచ్ఛర్దకము. సం. వి. అ. న. వాంతి చేసికొనుట.

ప్రచ్ఛర్దిక. సం. వి. ఆ. స్త్రీ. వాంతి.

ప్రచ్ఛాదకము. సం. విశే. (అ. ఆ. అ.) రహస్యముగా నుండునట్టిది. (సమాసములం దుత్తర పదముగా నుండును)

ఉదా: యుద్ధవిషయ ప్రచ్ఛాదక సమితి.

—వి. అ. పుం. పతి పరిత్యక్తయైన భార్య తన సంతాపమును మఱుఁగు పఱచి అన్యాపదేశముగా పాడెడు పాట

ప్రచ్ఛాదనము. సం. వి. అ. న. ౧ అచ్ఛాదనము. ౨. పైని ధరించునట్టి ఉత్తరీయము.

ప్రచ్ఛాదితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. కప్పఁబడినది. ౨. దాఁచినది.

ప్రచ్ఛానము. సం. వి. అ. న. (గొంతు కొను.) పుండగుట.

ప్రచ్ఛాయము. సం. వి. అ. న. దట్టమయిన నీడగల ప్రదేశము.

ప్రచ్ఛిలము. సం. విణ. (అ. ఆ. అ.) నిర్జలము, జలములేనిది. (వాచ.)

ప్రజ. సం. వి. ఆ. స్త్రీ. ౧ సంతతి. ౨ జనము. (స, ఖ, దుస్, సు లు పూర్వపదముగాఁగల బహువ్రీహియందు ఉత్తరపదముగు నీపదము సాంతమగును. వా. సుప్రజసుఁడు, దుష్ప్రజసము, సుప్రజసుఁడు.)

ప్రజననము. సం. విణ. (అ. ఈ. అ.) పుట్టించునది, జనకము. - వి. అ. న. ౧ గర్భాధానము. ౨ జననము, పుట్టుట, కనుట, ప్రసవించుట. ౩ ఆఁడుగుఱ్ఱి.

ప్రజనము. సం. వి. అ. పుం. ౧ ప్రజననము, కనుట, ప్రసవించుట. ౨ ఆవు మొదలగువాని యందు ఎద్దు మొదలగువాని గర్భగ్రహణార్థమగు మైథునము. (ఆవు ఎనుము మొదలగువాని తొలిచూలు. నిఘం.)

ప్రజనిక. సం. వి. ఆ. స్త్రీ. తల్లి, జనని.

ప్రజల్పనము. సం. వి. అ. న. వట్టి మాటలాడుట, ఉపయుక్తము కాని యొఱుకుమాటలు.

ప్రజల్పము. సం. వి. అ. పుం. ౧ వాక్యభేదము. ("అసూయేర్ష్యా మదోయుజా యో౽వధీరణముద్రయా, ప్రియస్య కౌశలోద్గారః ప్రజల్పస్సతు కథ్యతే") ౨ ప్రస్ఫుట కథాభేదము. ౩ ముచ్చట్లు, వట్టి యొఱుకుమాటలు.

ప్రజవనము. సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వేగము గలది.

ప్రజవి. సం. విణ. (న్. నీ. న్.) మిక్కిలి వడి గలవాఁడు, తగస్వి.

ప్రజాగరము. సం. వి. అ. పుం. ౧ మేలుకొనుట, రాత్రి మేల్కొని యుండుట, నిద్రలేమి. ౨ జాగరూకత. ౩. కావలి కాయువాఁడు, జాగ్రత్తతోఁ గాచుకొనువాఁడు.

ప్రజాత. సం. వి. ఆ. స్త్రీ. బాలెంతరాలు, ప్రసూత.

ప్రజాతంతువు. సం. వి. ఉ. పుం. సంతానము, వంశము.

ప్రజాతము. సం. విణ. (అ. ఆ. అ.) చక్కఁగా పుట్టినది. - వి. అ. పుం. అశ్వభేదము. (గోడిగ యందు కలసస్కందనము గావించిన గుఱ్ఱము.)

ప్రజాతి. సం. వి. ఇ. స్త్రీ. ౧ ప్రజ. ౨ ప్రజననము, కనుట, ప్రసూతి. ౩ సంతతి. (వాచ.)

ప్రజాద. వి. ఆ. స్త్రీ. గర్భధాత్రీవృక్షము.

ప్రజాదానము. సం. వి. అ. న. వెండి.

ప్రజాద్వారము. సం. వి. అ. న. సూర్యుఁడు. (విల్సన్.)

ప్రజాపతి. సం. వి. ఇ. పుం. ౧. బ్రహ్మ. ౨. దక్షాది. ౩. రాజు. ౪ అల్లుఁడు. ౫ సూర్యుఁడు. ౬ అగ్ని. ౭ త్వష్ట, విశ్వకర్మ. ౮. యజ్ఞము. ౯ కీటభేదము. ౧౦ తండ్రి, జనకుఁడు. ౧౧ మగుడు. ౧౨ ఒకానొక సంవత్సరము.

శ్లో॥ ప్రభవో విభవః శుక్లః ప్రమోదో౽థ ప్రజాపతిః. నిర్ణయసింధువు.

ప్రజావతి. సం. వి. ఈ. స్త్రీ. ౧ తోడఁబుట్టినవాని పెండ్లాము. ౨ కుటుంబిని, పిల్లలుగల స్త్రీ.

ప్రజాహితము. సం. వి. అ. న. ప్రజలకు హితమైనది, నీరు.

ప్రజినము. సం. వి. అ. పుం. గాలి.

ప్రజుఁడు. సం. వి. అ. పుం. పెనిమిటి, పతి.

ఆ. క్రి ౧ మండు (శ ర) ౨ ప్రకాశించు
సీ పద్మరాగప్రభల్ పయిపయి నిగిడించు, పాద
పల్లవరుచుల్ ప్రజ్వలింప
భా రా బాల ౭ ౪౯

ప్రజ్వలితము. సం విణ (అ ఆ ఆ) ౧ మండినది ౨ ప్రకాశించినది. వి అ న ౧ మండుట ౨ ప్రకాశించుట

ప్రడీనము. సం వి అ న (పక్షి) ౧ నలుప్రక్కలను పఱచుట ౨ ముందు పఱచుట ౩ పాఱిపోవుట, పలాయనము

ప్రణతి. సం వి ఇ స్త్రీ నమస్కారము

ప్రణతుఁడు. సం విణ (అ ఆ ఆ) ౧ మిక్కిలివంగినవాఁడు ౨ నమస్కరించినవాఁడు. ౩ నడఁకువగలవాఁడు

ప్రణదితము. సం విణ (అ ఆ ఆ) శబ్దించునది, ధ్వనిచేయునది

ప్రణమిల్లు. సం అ క్రి ౧ వంగుఁడగు
వ వాఁడు వినయంబున కయ్యెడ దిగ్గన గరుణం
గన్నీరొలుకం బ్రణమిల్లి చేలు మొగిడ్చి
మహాత్మా, నీతలం పేమి?
భాగ కాం ౩ ౨౭౮
౨ నమస్కరించు
క కని భక్తిఁ బ్రణమిల్లుడు, ముని యాతిథ్యం
బొసఁగ మోదంబున
భాగ కాం ౩ ౧౪౬
ఆ పరమభక్తితోడఁ బ్రణమిల్లి యున్న నృ
పకృత్యమువలన మునినికాయ మెల్ల
భాగ ఆది ౧ ౨౩
వ. .. ఆ య్యీదు వుర వు తం ప్రిచరణంబులకుం
బ్రణమిల్లి. (మార్క ౩ ౧౪)

ప్రణము. సం విణ (అ ఆ అ) ప్రాఁతది, పురాతనము (వాచ)

ప్రణయకలహము. సం వి అ పుం నాయికానాయకులకు పరస్పరము కుటిలప్రచారము వలననో చిట్టకమువలనో కలుగుజగడము, వలపుజగడము, నెయ్యంపుఁగయ్యము

ప్రణయకుపితుఁడు. సం విణ (అ ఆ అ) ప్రణయకోపముగలవాఁడు

ప్రణయకోపము సం వి అ పుం ప్రేమము యొక్క కుటిలప్రచారములవలన కారణము లేకయే నాయికానాయకులకుఁ గలిగెడికోపము, పొలయలుక, నెయ్యంపుఁగినుక

ప్రణయనము. సం వి అ న ౧ తెచ్చుట ౨ కొనిపోవుట ౩ చేయుట, కరణము ౪ రచించుట ౫ (కారణాదులను) ఎత్తిచెప్పుట, ఉదాహరించుట ౬ అగ్నికి సంస్కారవిశేషమును జేయుట

ప్రణయనీయము. సం విణ (అ ఆ అ) ౧ మిక్కిలి కొనిపోఁదగినది ౨ సంస్కరింపఁదగినది (వహ్ని) ౩ వహ్నిసంస్కారసంబంధి. (ఇధ్మ కాష్ఠాది = వంటచెఱకు మొ)

ప్రణయము. సం వి అ పుం ౧ ప్రేమము, వలపు ౨ చెలిమి, మైత్రి ౩ విశ్వాసము ౪. ప్రార్థన, యాచన ౫ నిర్వాణము, మోక్షము

ప్రణయి. సం విణ (న్ నీ న్) ౧ ప్రణయముగలవాఁడు, ప్రేమగలవాఁడు ౨ ప్రేమింపఁబడినవాఁడు, ప్రియుఁడు ౩ పరిచయముగలవాఁడు. వి న్ పుం ౧ పరిచితుఁడు, చెలికాఁడు ౨ స్వామి, భర్త, ౩ భక్తుఁడు, కొలుచువాఁడు

ప్రణయించు. సం స క్రి జ్వలింపఁజేయు, మండఁజేయు.

ప్రతి. సం. అవ్య. (ఇది సమాసపూర్వపదముగా నుండి యీక్రిందియర్థముల నిచ్చును.) ౧. ఆదానము, స్వీకరించుట. ఉదా: ప్రతిగ్రహణము. ౨. ఆభిముఖ్యము ఉదా: ప్రతిసూర్యగమనము ౩. వారణము ఉదా ప్రతిషిద్ధము. (సమాసోత్తరపదముగా నుండి లేశము అనునర్థ మిచ్చును. ఉదా శాకప్రతి) ౪. వీప్సను తెలియఁజేయును. ఉదా ప్రతిదినము, ప్రతిగృహము (ఈక్రింది యర్థములందు వ్యస్తముగా కన్పడుచున్నది వైకృతమని కొందఱు) ౧. సమానము

గీ. వేయు నేఁటికి వలపాంధవేయుసాటి, పిడుఁడిల లేడు ప్రతి రఘువీరుఁ డొకఁడు.
విజ వి ౧ ౯౪.

మ ... ఎవ్వారు నీప్రతి లే రీభువనత్రయంబున జగత్ప్రఖ్యాత వైరోచనీ
హరి. ఉ ౧౦. ౨౩౭.

సీ. సరి యుద్ది ప్రతి సదృశము నకుఁగు
సాం. ని ... ౬౪

౨. ప్రతినిధి, మాఱు.

చ. ఏను కీల తగ నర్పననే సిదఁగాని కాంథ కక (శై ఖా ౧ ౧౦౭)

సీ. . ప్రతి మాఱు బను ఁనఁ ప్రతినిధి యగు
ఆ గా. ౨ ౩౦౭

ద్వి. ఎన్నిన జగతి నహి ప్రతి యనఁగ
ద్వి. పరమ. ౧ ౪౩౩ పా

ఉ. విన్నప మాలకించు రఘువీర నహిప్రతి లోకమందు నా,కన్న దురాత్ముఁడున్
దా ౪ ౩౯

ఉదా: ప్రతిదినము, ప్రతిగృహము, ప్రతివత్సరము మొ

ప్రతికంచుకుఁడు. సం. వి అ. పుం విరోధి, శత్రువు. (ఆ. ని.)

ప్రతికము. సం. విశే. (అ. ఆ.) కార్షాపణము వెలగలది, కార్షాపణమునకు కొనఁబడినది.

ప్రతికరము. స. వి. అ. పుం చేసినదానికి బదులు పాతితోషికాదులు చేయుట

ప్రతికర్త. సం. వి ఋ పుం బదులుచేయువాఁడు, విరోధి, శత్రువు.

ప్రతికర్తవ్యము. సం. విశే (అ. ఆ అ) ౧. మరలఁ జెల్లింపఁబడఁదగినది (అప్పు మొ) ౨. బదులుగా చేయఁదగినది (అపకారాది) ౩. చికిత్స సేయఁదగినది ... న బదులుతీర్చుకొనుట, పగ మొ॥ తీర్చుకొనుట,

ప్రతికర్మము. సం వి న ౧ బదులు సేయుట ౨ చికిత్స ౩ వస్త్రాద్యలంకరణము, శైసేత

ప్రతికశ(ష)ము సం వి పుం కశాఘాతము (చబుకు దెబ్బ) నొందిన గుఱ్ఱము

ప్రతికారము సం వి పుం ౧ మాఱుచేఁత, బదులుసేయుట, ప్రతిక్రియ. ౨ పగదీర్చుట ౩ చికిత్స, పరిహారము ౪ ... గోగము, విఘ్నము

ప్రతికారి. సం విశే (కా ణీ రి.) ప్రతికారము చేయువాఁడు.

ప్రతికార్యము. సం ప్రతికర్తవ్యము

ప్రతికాశము. సం విశే (అ ఆ ) తుల్యమైనది, తుల్యత్వము కలది

ప్రతికుంచితము. సం విశే (అ ఆ అ) వంగినది, వంకరైనది

ప్రతికుంజరము. సం వి. అ పుం శత్రువగు కుంజరము.

ప్రతిఘటిం(యిం)చు. సం. అ. క్రి. మాఱొడ్డు, ఎదిరించు.

వ. . అశ్వత్థామయు నాచార్యపుత్రత్వచోదితుం డై యుగాంతకాలానలుండునుం బోలెఁ బ్రతిఘటించి నిలిచిన ..

భార. ఆది ౬. ౩౭.

సీ. ఫాలలోచనునితోఁ బ్రతిఘటించి పరాం బుజమునఁ గన్గొన్న గౌతమతపస్వి.

ఉ. రా. ౪. ౧౯౪.

సీ. పారిజాతకపాదపారిజాతరిపుద్వి పారిజాత శ్రీలఁ బ్రతిఘటించి. (దశా ౧. ౬౦.)

క. ప్రతిఘటియింపఁగ వచ్చెను, ప్రతిభటులకు నసమసమరోగ్ఘ్నలు మతోదన్. (భీమ. ౧. ౬౧.)

క. అరయ నీయుదయమునకుఁ, గారణమై యేకులంబు గాంభీర్యమునన్, దారాపతిఁ గన్న పయఃపారావారంబుతోడఁ బ్రతి ఘటియించెన్. (నైష. ౪. ౯.)

ప్రతిఘట్టించు సం. అ. క్రి. ప్రతిఘటించు

ద్వి. గబ్బున శైవమార్గమై యాది యనుచు, నిబ్బందిజనమును నీయుబ్బు లూర, మెట్టి మాటలోఁ బ్రతిఘట్టించి యాడ, పెట్టణ వాదంబు నిల్పి గెల్చినను.

బస. పు ౬. ౫౬౦.

ప్రతిఘము. సం. విశ (ప. అ. అ.) ప్రతిఘా లము. వి. అ. పుం. ౧ మాఱుదెబ్బ, ప్రతి ఘాతము. ౨ కోపము. ౩. పగతీర్పుకొనుట. ౪. మూర్ఖుడు. ౫. శత్రువు. ౬. వధము (శే వి)

ప్రతిఘాతనము. సం. వి. అ. న. మారణము, చంపుట.

ప్రతిఘాతము. సం. వి. అ. పుం. ౧. మాఱు దెబ్బ. ౨. ఎదిరించుట. ౩. అడ్డగింత, వారణము, వారించుట. ౪. మాఱుచేత. ౫. చంపుట

ప్రతిఘాతి. సం. విశ. (శ. సీ. న.) పగతీర్చు కొనువాఁడు.

ప్రతిఘ్నము. సం. వి. అ. న దేహము. (వాచ.)

ప్రతిచింతనము. సం. వి అ న ధ్యానము.

ప్రతిచికీర్ష. సం. వి. అ. స్త్రీ. ౧. బదులు చేయుటకునిచ్ఛ. ౨. పగతీర్చుకొననిచ్ఛ.

ప్రతిచేయు. అ. క్రి (ప్రతి + చేయు) సాటి చేయు, పోల్చు

గీ. ఇంతి నెమ్మోము ప్రతిచేసి యున్నచోటఁ జందురునిమేను పూర్వపక్షంబు నొందు.

విక్ర. ౪. ౧౪.

ప్రతిచ్ఛందము సం. వి అ పుం ౧ ప్రతిమ, ప్రతిరూపము ౨ ప్రతినిధి.

సీ కల్పకారామరేఖకుఁ బ్రతిచ్ఛందంబు త్రిద శేంద్రుకరటి శాల్మేకింతంబు గీ . మంత్రియున్నయదేవస్యముహితయుకము

(ఇట ఔపమ్యవాచకము.) భీమ. ౧ ౫౩.

ప్రతిచ్ఛదనము. సం. వి అ న కప్పడు, కప్పగువస్త్రము.

ప్రతిచ్ఛన్నము. సం విశ (అ. ఆ అ) కప్పఁ బడినది ౨. దాఁపఁబడినది

ప్రతిచ్ఛాయ. సం. వి. అ. స్త్రీ. ౧ ప్రతిబిం బము, నీడ ౨ ప్రతిరూపము, ప్రతిమ. ౩. సాదృశ్యము, పోలిక.

ప్రతిజంఘ. సం. వి అ. స్త్రీ. అగ్రజంఘ, పిక్కలయొక్క ముందిభాగము (వాచ.)

ప్రతిజల్పకము. సం. వి. అ. పుం దూతవాక్య భేదము.

ప్రతిజాగరణము. సం. వి. అ. న. కావలికాచుట

ప్రతిఘటిం(యిం)చే. సం. అ. క్రి. మాఱొడ్డు, ఎదిరించు.

వ. ...అజ్ఞపంచుమ నాచార్యప్రాణాసురేశకుం డై యుగాంతకాలానలుండునుం బోలెఁ బ్రతిఘటించి నిలిచిన ...

భార. ఆది ౬. ౩౭.

సీ. ఫాలలోచనునితోఁ బ్రతిఘటించి పరాం బుజమునఁ గన్గొన్న గాఠమతిపద్యి.

ఉ. రా. ౩. ౧౬౪.

సీ. పారిజాతకపాదపారిజాతకిపుద్వి పా రి జా త శ్రీలఁ బ్రతిఘటించి. (దశా ౧. ౬౦.)

క. ప్రతిఘటియించఁగ వచ్చునె, ప్రతిభటులకు నసమసమరఘల్లుముతోడన్. (భీమ. ౧. ౬౧.)

క. అరయ నీయుదయమునకుఁ, గారణమై యేకులంబు గాంభీర్యమునన్, దారాపతిఁ గన్న పయఃపారావారంబుతోడఁ బ్రతిఘటియించెన్. (నైష. ౪. ౯)

ప్రతిఘట్టించే సం. అ. క్రి. ప్రతిఘటించు

ద్వి గబ్బున జైనముల్గామై యాది యనుచు, నిబ్బందికినమును గీయుబ్బ లూర, మెట్టి మాతోఁ బ్రతిఘట్టించి యాఁడ, సెట్టణ వాదంబు నిల్చి గెల్చినమ.

బస పు ౬. ౫౬౦.

ప్రతిఘము. సం. విశ (౧ అ. అ) ప్రతిఘాతము. వి. అ. పుం. ౧. మాఱుదెబ్బ, ప్రతిఘాతము ౨. కోపము. ౩. పగతీర్చుకొనుట. ౪. మూర్ఛయు. ౫. శత్రువు. ౬. వధము (శే వి)

ప్రతిఘాతనము. సం. వి. అ. న. మారణము, చంపుట.

ప్రతిఘాతము. సం. వి. అ. పుం. ౧. మాఱుదెబ్బ. ౨. ఎదిరించుట. ౩. అడ్డగింత, వారణము, వారించుట. ౪. మాఱుచేఁత. ౫. చంపుట.

ప్రతిఘాతి. సం. విశ. (శ. వి. శ.) పగతీర్చు కొనువాఁడు.

ప్రతిఘ్నము. సం. వి. అ. న. దేహము. (వాచ.)

ప్రతిచింతనము సం. వి. అ న. ధ్యానము.

ప్రతిచికీర్ష. సం. వి ఆ. స్త్రీ. ౧ బదులు చేయుటకునిచ్ఛ. ౨. పగతీర్చుకొననిచ్ఛ.

ప్రతిచేయు. అ. క్రి (ప్రతి + చేయు) సాటి చేయు, పోల్చు

గీ. ఇంతి నెమ్మోము ప్రతిచేసి యెన్న చోటఁ జందురుని మేను పూర్వపక్షంబు నొందు.

విక్ర. ౪. ౧౩.

ప్రతిచ్ఛందము. సం వి అ పుం ౧ ప్రతిమ, ప్రతిరూపము ౨ ప్రతినిధి

సీ కల్పకారామకేళుకఁ బ్రతిచ్ఛందంబు త్రిద శేంద్రుకరటి కార్మేఘకింతంబు . గీ . మంత్రియన్నయ దేవయ్యమహితయశము

(ఇట నౌపమ్యవాచకము.) భీమ. ౧ ౫౩

ప్రతిచ్ఛదనము సం వి అ న కప్పడు, కప్పుగువస్త్రము.

ప్రతిచ్ఛన్నము. సం విశ (అ. ఆ అ) కప్పఁ బడినది ౨. దాఁచఁబడినది.

ప్రతిచ్ఛాయ. సం. వి. ఆ స్త్రీ. ౧ ప్రతిబింబము, నీడ ౨ ప్రతిరూపము, ప్రతిమ. ౩. సాదృశ్యము, పోలిక.

ప్రతిజంఘ. సం వి ఆ. స్త్రీ. అగ్రజంఘ, పిక్కలయొక్క ముందిభాగము (వాచ)

ప్రతిజల్పకము. సం. వి. అ పుం దూరవాక్య భేదము.

ప్రతిజాగరణము. సం వి. అ. న. కావలికాచుట

ప్రతిజాగరము. సం. వి. అ. పుం. ౧. మేలు కొనుట, మెలఁకువ. ౨. హెచ్చరిక. ౩. కాచుట.

ప్రతిజిహ్వ. సం. వి. ఆ. స్త్రీ. చిఱునాలుక, కొండనాలుక.

ప్రతిజ్ఞ. సం. వి ఆ. స్త్రీ. ౧. ఏదే నొకపనిని దప్పక చేసెదనని దృఢముగా చెప్పుట. ౨. ఒప్పు కొనుట, అంగీకారము ౩. (న్యాయ) సాధ్య త్వముచేత పక్ష నిర్దేశము (పంచాంగన్యాయము యొక్క అవయవ భేదము)

ప్రతిజ్ఞాంతరము. సం. వి. [illegible] న (న్యాయ) నిగ్రహస్థానభేదము (ప్రతిజ్ఞాతార్థమునకు ప్రతి షేధము కలుగఁగా [illegible] వికల్పమువలన తదర్థము నిర్దేశించుట)

ప్రతిజ్ఞాతము [illegible] (అ ఆ [illegible]) ౧ దృఢముగాఁ [illegible] ౨ ప్రతిజ్ఞ చేయఁ బడినది ౩ [illegible]
వి. అ. న ప్రతిజ్ఞ.

ప్రతిజ్ఞాతవ్యము [illegible] (అ అ) ౧. ప్రతిజ్ఞ [illegible] ౨ [illegible]

ప్రతిజ్ఞానము సం వి. [illegible] న ౧ చెప్పుట, దృఢముగాఁ [illegible] ౨ అంగీకారము ౩ ప్రతిజ్ఞ.

ప్రతిజ్ఞాసన్న్యాసము సం. వి [illegible] పుం ౧ ప్రతిజ్ఞ [illegible] ౨ (న్యాయ) ప్రతిజ్ఞాహాని, ప్రతిజ్ఞను దిగవిడుచుట

ప్రతిజ్ఞాహాని. సం. వి ఇ. స్త్రీ (న్యాయ) ప్రతిజ్ఞను దిగవిడుచుట

ప్రతిజ్ఞేయము. సం. విశ (అ. ఆ. అ.) ౧. ప్రతిజ్ఞ చేయఁదగినది. ౨. అంగీకరింపఁదగినది.

ప్రతితంత్రసిద్ధాంతము. సం. వి. అ. పుం. వాదిప్రతివాదులం దొకఁడుమాత్రము ఒప్పకొన్న సిద్ధాంతము.

ప్రతితరము. సం. వి. ఉ. పుం. కడపుఁకోయి, ఓడకొక్కు లోనగు తరణసాధనము. (వాచ)

ప్రతితాలి. సం. వి. ఈ. స్త్రీ. తాళపుఁజెవి.

ప్రతితాళము. సం. వి. అ. పుం. (సం.గీ) తాళ భేదము

ప్రతితూణి. సం. వి. ఈ. స్త్రీ. వాతరోగభేదము.

ప్రతిదానము. సం. వి. అ. న ౧. వస్తువుల మాఱుపు, పరివర్తనము ౨ దాపనిచ్చినదానిని మరల నిచ్చుట, న్యాసప్రత్యర్పణము.

ప్రతిదారణము. సం. వి. [illegible] న. ౧ విదార ణము, చీల్చుట. ౨ యుద్ధము

ప్రతిదివము. సం. వి న్. పుం. ౧. దినము. (విశ్యమ) ౨ సూర్యుఁడు. (వాచ.)

ప్రతిదృష్టాంతసమము. సం వి. అ. పుం. (తర్క) ఒకవిధమైన ప్రతికూలసమాధానము.

ప్రతిదేయము. సం విశ (అ. ఆ. అ.) మరల నియ్యఁదగినది. వి అ న. ౧. కుదువ, తాకట్టు. ౨. తీసికొనిమరల నియ్యఁదగిన వస్తువు.

ప్రతిద్వంద్వి. సం. విశ (న్. నీ న్.) ౧. పగ వాఁడు, శత్రువు, ౨ ప్రతికూలుఁడు, ఒవ్వని వాఁడు. ౩ తుల్యరూపుఁడు, సమానుఁడు. ౪. ఎవ్వనితో ద్వంద్వయుద్ధము చేయఁబడునో వాఁడు.

ప్రతిధ. సం. వి. ఆ. స్త్రీ. ప్రతివిధానము, ప్రతీ కారము.

ప్రతిధానము. సం. వి. అ. న. నిరాకరణము. (వాచ.)

ప్రతినివర్తనము. సం. వి. అ. న. ౧. లభించు వస్తువునుండి నివర్తించుట. ౨. నివారణము.

ప్రతినివిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) పట్టు పట్టఁబడునది. (శ. ర.) చలపాది, పట్టుదల గలది (ఆ. ని.)

ప్రతినివేశము. సం. వి. అ. పుం. లెక్కర, పట్టుదల, చలము

ప్రతిపక్షము. సం. విణ. (అ. ఆ. అ.) సదృశము, సమానము. - వి. అ. పుం. ౧. విరుద్ధపక్షము ౨. శత్రువు, ఎదిరి. ౩. (వ్యవహారమందు) ప్రతివాది, విపక్షుఁడు.

ప్రతిపక్షి. సం. వి. (న్. ఇ. న్.) ప్రతికూలుఁడు.

ప్రతిపక్షితము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రతిపక్షముగలది. - వి. అ. పుం. (న్యాయ) సత్ప్రతిపక్ష మనుదోషముతోఁ గూడిన హేతువు (ఇదియొక హేత్వాభాసము.)

ప్రతిపత్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రాప్తి, పొందుట. ('స్వర్గప్రాప్తి') ౨. ఎఱుక, తెలివి, జ్ఞానము. ('శబ్దార్థప్రతిపత్తి' 'అభేదప్రతిపత్తి') ౩. ప్రవృత్తి, పూనిక ౪. ప్రాగల్భ్యము, నేర్పు. ౫. గౌరవము. ౬. పదప్రాప్తి. ౭. ఫలశూన్యమగు కర్మాంగవిశేషము (ఇది మీమాంసకార్థము. శ్రాద్ధాదులందు దత్తమగు ద్రవ్యము కుశమయబ్రాహ్మణపక్షమున జలాదులందు నిక్షేపించుటయు ఫలశూన్యమగు కర్మాంగము) ౮. ప్రకాశము. (శ. ర.)

ప్రతిపత్తిపటహము. సం. వి. అ. పుం. వాద్యభేదము, నగారా.

ప్రతిపత్తిభేదము. సం. వి. అ. పుం. మతభేదము, అభిప్రాయభేదము.

ప్రతిపత్తిమంతుఁడు. సం. విణ. (త్. వ. తీ. త్.) ౧. ప్రగల్భుఁడు, నేర్పరి. ౨. బుద్ధిమంతుఁడు, తెలివిగలవాఁడు. ౩. పనియందు చుఱుకుదనముగలవాఁడు. ౪. ప్రసిద్ధుఁడు, గొప్పవాఁడు.

ప్రతిపత్తు. సం. వి. ద్. స్త్రీ. ౧. ప్రవేశము. ౨. ఉపక్రమము, ప్రారంభము. ౩. బుద్ధి, జ్ఞానము ౪. ఢక్కవాద్యము. ౫. పాడ్యమి. ౬. బహిష్పవమానస్తోత్రమందు ప్రథమ స్తుతి. (వాచ) అవతారికయగుశ్లోకము. ౭. బాధము. (శ. ని.)

ప్రతిపన్నము. సం. విణ. ౧. ప్రాప్తము, పొందఁబడినది ౨. అవగతము, తెలియఁబడినది. ౩. స్వీకృతము, గైకొనఁబడినది.

ప్రతిపర్ణశిఫ. సం. వి. ఆ. స్త్రీ. ద్రవంతీ వృక్షము.

ప్రతిపాదకము. సం. విణ. (అ. దికా. అ) ౧. ఇచ్చునది. ౨. నిరూపించునది, స్థాపించునది. ౩. బోధకము, తెలుపునది, వివరించునది ౪. ప్రాపకము, పొందించునది.

ప్రతిపాదనము. సం. వి. అ. న. ౧. దానము, ఇచ్చుట. ('పాత్రప్రతిపాదనము') ౨. నిరూపణము. ౩. బోధనము, తెలుపుట, వివరించుట. ౪. నెఱవేర్చుట, నిర్వర్తనము. ౫. కలిగించుట. ౬. ఉపక్రమించుట.

ప్రతిపాదయిత. సం. విణ. (ఋ. త్రీ. ఋ.) ౧. బోధకుఁడు. ౨. దాత, ఇచ్చువాఁడు. ౩. నిరూపకుఁడు.

ప్రతిపాదించు. సం. స. క్రి. ౧. ఇచ్చు, దానము చేయు.

క. క్షితిపతులవలన సముపార్జితమైన ధనంబు ... దీనిం, బ్రతిపాదింపంగవలయుఁ బాత్రవశమునన్. (భాగ. షష్ఠ. ౧. ౨౦౦)

౨. తెలుపు, నిరూపించు.

౪. ఉపనిషదుక్తార్థంబులు, ప్రపంచకర్త యగు విష్ణు ప్రతిపాదింపుచున్. (కాశీ. ౫. ౧౧౩.)

౩. కలిగించు (విద్యను)

ప్రతిపాదితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రతిపాదింపఁబడినది, దత్తము, ఇయ్యఁబడినది ౨. నిరూపితము. ౩. బోధితము, తెలుపఁబడినది. ౪. చెప్పఁబడినది. ౫. కల్పింపఁబడినది.

ప్రతిపాద్యము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రతిపాదింపఁదగినది.

ప్రతిపాలకుఁడు. సం. విణ. (అ. అ. .) రక్షకుఁడు.

ప్రతిపాలనము. సం. వి. అ. న. రక్షణము.

ప్రతిపాలించు. సం. స. క్రి. రక్షించు.

వ. ఇట్లు ప్రస్తావకరాది వివాహాంబులవలన సమస్తలోకంబులుం దాన యై విష్ణుండు ప్రతిపాలించును. (వి. పు. ౪. ౧౯)

ప్రతిపాలితము. సం. విణ. (అ. ఆ. అ.) రక్షితము.

ప్రతిపూజనము. సం. వి. అ. న. ౧. ఒకరు చేసిన పూజనమునకు బదులుపూజనము చేయుట ౨. ఎదురొకని పూజించుట. ౩. ఒకరికొకరు పూజించుట, వందనాదులు చేయుట.

ప్రతిపోల్చు. స. క్రి. (ప్రతి + పోల్చు.) సరిపోల్చు.

ద్వి. బలగర్వమున మిమ్ముఁ బ్రతిపోల్పఁజాలు, బలియురవానరపతులఁ జెప్పెదఁ.

రం. రా. బాల. ౧౯. పొ. ౨. పం.

ప్రతిప్రణామము. సం. వి. అ. పుం. ఒకరు చేసిన ప్రణామమునకు బదులుచేయు ప్రణామము, మాఱుమ్రొక్కు.

ప్రతిప్రయాణము. సం. వి. అ. న. మరలి వచ్చుట, మరలఁబాటు

ప్రతిప్రశ్నము సం. వి. అ. పుం. ౧. ఒక ప్రశ్నకు బదులుగా నడిగెడి ప్రశ్నము. ౨. ఉత్తరము, ప్రత్యుత్తరము.

ప్రతిప్రసవము. సం. వి. అ. పుం. (వ్యాక.) బాధకబాధకము, సామాన్యవిధిని బాధించెడి విశేషవిధిని బాధించు సూత్రాదికము.

ప్రతిప్రస్థాత. సం. వి. ఋ. పుం. అధ్వర్యునకు సహాయుఁడైన ఋత్విగ్భేదము.

ప్రతిప్రస్థానము. సం. వి. అ. న. శత్రుపక్షమును జేరుట, విరుద్ధపక్షము నాశ్రయించుట.

ప్రతిప్రహారము. సం. వి. అ. పుం. ౧. మాఱుదెబ్బ, దెబ్బకుఁదగిన మాఱుదెబ్బ. ౨. ప్రతిఘాతభేదము.

ప్రతిఫలనము సం. వి. అ. న. ౧. ప్రతిబింబించుట. ౨. సాదృశ్యము.

ప్రతిఫలము. సం. వి. అ. పుం. ౧. ప్రతిబింబము. ౨. చేసినకర్మమునకు ననురూపమైన ప్రతీకారము, తగినఫలము.

ప్రతిఫలించు. సం. అ. క్రి. ౧. ప్రతిబింబించు.

గీ. తరుణి కడు వింత నీముఖదర్పణమునఁ, బ్రతిఫలించెను శుకదష్టపక్వబింబఫలము ...

ఉ. రా. ఉ. ౪౦౯.

౨. తగినప్రతిపకారమునిచ్చు.

ప్రతిఫలితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రతిబింబించినది. ౨. తగినప్రతీకారము చేయఁబడినది.

ప్రతిబంధకము. సం. విణ. (అ. ధికా. అ.) ౧. బంధించునది, కట్టునది. ౨. అడ్డగించునది, ప్రతిరోధకము. ౩. ఎదిరించునది, విరోధించునది. -వి. అ. పుం. విటపము, కొమ్మ.

**ప్రతిబంధనము.** సం. వి. అ న. ౧. బంధించుట, కట్టుట ౨. చెఱయుంచుట. ౩. అడ్డగింత, ప్రతిరోధనము

**ప్రతిబంధము.** సం. వి. అ పుం. ౧ బంధించుట, కట్టుట. ౨ అడ్డగింత, ప్రతిరోధము ౩. ఎదురించుట, మాఱొడ్డుట ౪ ముట్టడి ౫ సంబంధము. ౬ ఆశాభంగము, మనస్సు చెదరుట ౭ (సాంఖ్య) వ్యాప్తి, నియతసంబంధము. (అగ్నిధూమములకుం గల ఎడతెగని సంబంధము)

**ప్రతిబంధి.** సం. విణ. (న్ నీ న్.) ౧ బంధించునది. ౨. అడ్డగించునది. -వి. ఇ పుం, ఇ. ఈ. స్త్రీ. ౧. ఆక్షేపము. ౨. ప్రకృతమగు నొక కల్పమునందుఁ బ్రవర్తించినపురుషునిఁ గూర్చి ప్రకృతమగు కల్పాంతరమును ఆపాదించుట. (ఇది ప్రతివాదిమతమందు అనిష్టాంతరప్రసంగము కలిగించు వాక్యమగును. దీనివలన వాదికి వలెనే ప్రతివాదికిని అనిష్టప్రసక్తి కలుగును.)

**ప్రతిబంధించు.** సం. స. క్రి. ౧. అడ్డగించు

వ. మహాఋషుల వదలించి పితరులఁ బ్రతిబంధించి వసువులఁ బరిమార్చి
హర ౩. ౯.

౨. ఒకదానికి చేర్చికట్టు. ౩. (రత్నాదులను) చెక్కు, తాపు.

**ప్రతిబంధువు.** సం. వి. ఉ. పుం. బంధుసమానుఁడు. (దౌహిత్రాది.)

**ప్రతిబద్ధము.** సం. విణ. (అ. ఆ అ.) ౧. (ఒకదానికి) బంధింపఁబడినది, కట్టఁబడినది. ౨. సంబద్ధము, సంబంధించినది. ౩. ప్రతిరుద్ధము, అడ్డగింపఁబడినది. ౪. స్థగితము, తాపఁబడినది. ౫. వ్యాపకము, నియతసంబంధము గలది, ఎల్లప్పుడు ఎడతెగక సంబంధించియుండునది. (ధూమమునందు అగ్ని ప్రతిబద్ధము)

**ప్రతిబలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧ బలవంతుఁడు ౨. సమానబలుఁడు
౩ అ. పుం శత్రువు.

**ప్రతిబాధకము.** సం. విణ (అ. ఇకా. అ) మరల్పునది, మఱలఁ జేయునది, ఆఁపునది. ౨ అడ్డగించునది.

**ప్రతిబాధి.** సం. విణ. (న్ నీ. న్) అడ్డగించునది. -వి. న్ పుం. విరోధి

**ప్రతిబాహువు** సం. వి. ఉ పుం బాహువుయొక్క అగ్రము (వాచ.)

**ప్రతిబింబము** సం వి. అ పుం. న. ౧ ప్రతిఫలనము. ౨. ప్రతిమ.

(బుధుని ధ్యానము) సీ. ప్రతిబింబమో కాని రజనివల్లభునకు, ధ్యాహారమో కాని యమృతరుచికి. (ఇటసాటి యనిభావము.)
కాశీ. ౪ ౧౯౧.

**ప్రతిబింబవాదము.** సం. వి. అ పుం. జీవుఁడు ఈశ్వరునకుఁ బ్రతిబింబమని స్థాపించుటకైన వాదము. (ఇది వేదాంతులవాదములలో నొక భేదము.)

**ప్రతిబింబించు.** సం. అ. క్రి. మాఱురూపము తోఁచు, ప్రతిఫలించు.

వ తొట్టితొట్టి యుడిసెడు మదువులు గట్టినసజ్జకపుగొజ్జంగినీరునందుఁ బ్రతిబింబించు నవ్వురికాంతలవదనారవిందంబులలో పలంబడి తేలియాడు వాడని చేయుంతిబంధులవడువునై ... (భీమ. ౫. ౧౨౦.)

**ప్రతిబింబితము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రతిఫలితము, ప్రతిఫలించినది.

**ప్రతిబుద్ధము.** సం. విణ. (అ. ఆ. అ.) జాగరితము, మేలుకొన్నది. ౨. తెలివినొందినది, మరల సంజ్ఞవచ్చినది. ౩. వికసించినది, విరిసినది. ౪. తెలియఁబడినది, జ్ఞాతము.

**ప్రతిబుద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. మేలుకొనుట. ౨. ప్రతికూలమైన యుద్దేశము.

**ప్రతిబోధకము.** సం. విణ. (అ. ధి కా. అ.) ౧. మేలుకొలుపునది. ౨. తెలుపునది, ఎఱిఁగించునది.

**ప్రతిబోధనము.** సం. విణ. (అ. ఆ. అ.) మేలుకొలుపునది. -వి. అ. న. ౧. మేలుకొలుపుట. ౨. బోధించుట. ౩. జ్ఞానము, తెలివి.

**ప్రతిబోధము.** సం. వి. అ. పుం. ౧. మేలుకొనుట, జాగరణము. ౨. జ్ఞానము, ఎఱుక. ౩. బోధనము, ఉపదేశము. ౪. వివేకము. ౫. స్మరణము. విణ. (అ. ఆ. అ.) మేలుకొన్నది, జాగరితము. ౨. ఎఱుఁగునది, తెలిసికొనునది.

**ప్రతిబోధి.** సం. విణ. (న్. నీ. న్.) ఎఱుఁగఁబోవువాఁడు, ప్రతిబోధమునొందఁబోవువాఁడు.

**ప్రతిబోధితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మేలుకొలుపఁబడినవాఁడు. ౨. బోధింపఁబడినవాఁడు.

**ప్రతిభ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. తోఁచిక, స్ఫూర్తి. ౨. దీప్తి, కాంతి. ౩. బుద్ధి. ౪. ప్రత్యుత్పన్నబుద్ధి, అప్పటప్పటికి క్రొత్తక్రొత్తగా వికసించెడు బుద్ధి.

**ప్రతిభటించు.** సం. అ. క్రి. ౧. పాటియగు, సదృశమగు.

ఉ. ఇప్పుడిప్పాట నాతోడం బ్రతిభటింపఁ గలయది. (కాశీ. ౧. ౧౦౦.)

౨. ప్రతియోధుఁడగు.

క. భీమసేనుండును వానికి నక్కజంబుగా మల్లయుద్ధసన్నద్ధుండయి ప్రతిభటించి నిలిచె నంత. (భార. సభా. ౧. ౨౦౧.)

౩. ఎదిరించు, అడ్డగించు.

సీ. గుదకంబళాదుల గోవృదంబులఁ బిన్న, పరవృషభము లని ప్రతిఘటించు ...
భాగ. ౧౦. పూ. ౪౩౦.

**ప్రతిభటుఁడు.** సం. వి. అ. పుం. ప్రతిస్పర్థి. ఎదిరి.

**ప్రతిభయము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. భయంకరము. ౨. పాపకరము, ఆపత్కరము. -వి. అ. న. భయము.

**ప్రతిభాతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. దీప్తిగలది. ౨. జ్ఞానమునుఁ బొందినది, తెలియఁబడినది.

**ప్రతిభానము.** సం. వి. అ. న. ౧. దీప్తి, కాంతి. ౨. బుద్ధి. ౩. ప్రతిభ, ప్రత్యుత్పన్నబుద్ధి.

**ప్రతిభావంతుఁడు.** సం. విణ. (త్. వతీ. త్.) ౧. దీప్తిగలవాఁడు. ౨. బుద్ధిమంతుఁడు. -వి. త్. పుం. ౧. సూర్యుఁడు. ౨. చంద్రుఁడు. ౩. అగ్ని.

**ప్రతిభాష.** సం. వి. ఆ. స్త్రీ. ప్రత్యుత్తరము, మాఱుపలుకు.

**ప్రతిభాషించు.** సం. అ. క్రి. మాటలాడు.

వ. ప్రాణావసానకాలంబున .. నంపతితోడం బ్రతిభాషించుచు ననాయాసంబునఁ గర్మశరీరంబులు విడిచి (పానందో ౧. ౧౩౧.)

**ప్రతిభాసనము.** సం. వి. అ. న. ౧. తోఁచిక, స్ఫురణము. ౨. పోలిక.

**ప్రతిభాసము.** సం. వి. అ. పుం. ౧. మనస్సున కటాలున తోఁచుట. ౨. తోఁచిక, స్ఫురణము.

3. ప్రకాశము. ౪. మాయ. -విణ (అ. ఆ. అ) ప్రకాశమానము, వెలుఁగునది.

ప్రతిభాసించు. సం. ౧ క్రి. ౧ స్ఫురించు.

వ. పరశురామవత్తం బయిన శార్ఙ్గశాస్త్రం బను పేరిటి మహానీయసాధనంబు రాఘవు నకుం బ్రతిభాసింపకుండె.

భార. శ్ర. 3 3౪౫.

౨. స్పష్టమగు, ప్రకాశించు.

వ అది వినిన భవదభ్యస్థిరం బైనయట్లుంబు ప్రతిభాసించును. భార. శాం. ౬ ౭౯.

ప్రతిభిన్నము. సం విణ (అ ఆ అ) ౧ వాటఁ బడినది, భేదింపఁబడినది ౨ ఉత్పాటింపఁబడినది, వెకల్పఁబడి 3 3 ది గా ంబంధించినది.

ప్రతిభుఁడు. సం. వి. పుం (నాట్య) పిమాను షుఁడు.

ప్రతిభువు. సం. వి. ఊ పుం పూటకాఁపు

ప్రతిభేదనము సం వి అ న ౧ ఉత్పాటనము, చీల్చుట. ౨ నేత్రాదులను పెకల్చుట. 3. విభాగించుట, పేలుపఱచుట

ప్రతిభేదము. సం. వి. అ. పుం ౧ ఉత్పాటనము, పెకల్చుట ౨. చీల్చుట, భేదించుట 3. కనిపెట్టుట, కనుఁగొనుట

ప్రతిమ. సం వి ఆ స్త్రీ. ౧ శిలాదినిర్మితమగు విష్ణ్వాదిమూర్తి ౨. విగ్రహము, బొమ్మ, పడిమ. 3. సాదృశ్యము. పోలిక ౪ ప్రతిబింబము ౫. అనుకృతి. ౬. చిహ్నము ౭. ఏనుఁగు వాతకుంభముక్రింది దంతములనడిమిచోటు, గజదంతబంధము.

ప్రతిమండలము. సం. వి. అ. న సూర్యాదుల మాఱుటబింబము. ౨ సూర్యాదుల పరివేషము, పరిధి.

ప్రతిమల్లుఁడు. సం. వి. అ. పుం. ప్రతిభటుఁడు. శత్రువు.

ప్రతిమానము. సం. వి. అ. న. ౧. ఉపమానము,మాదిరి. ౨. శిలాదినిర్మితవిష్ణ్వాదిమూర్తి, విగ్రహము, పడిమ. 3. ప్రతిబింబము. ౪. సాదృశ్యము, పోలిక. ౫. ఏనుఁగువాతకుంభము క్రింది దంతములనడిమిచోటు.

ప్రతిమార్గకము. సం. వి. అ. పుం. ఆకాశచారి యగు సౌభపురము.

ప్రతిమాల. సం. వి. ఆ. స్త్రీ. అంతాద్యక్షరపద్య రాజి,పద్యముల జ్ఞప్తియొక్క పరీక్షకై యొక పద్యము చివరి యక్షరముతో నారంభించదగిన పద్యముల వరుస (శ్రా , శ. ర)

ప్రతిముక్తము. సం విణ.(అ. అ అ.) ౧. కట్టఁబడినది, పరిహితము. (వస్త్రము.) ౨ తొడుగఁబడినది (కవచము.) 3. విడువఁబడినది, పరిత్యక్తము.

ప్రతిముఖము. సం. విణ. (అ. ఆ. అ) ౧. ముగమున కెదురుగా నున్నది, అభిముఖము. ౨. దగ్గఱది, సన్నిహితము.

వి. అ. న. ఒకనాటకసంధి. (చూ సంధి.)

ప్రతిమూర్తి. సం. వి ఇ స్త్రీ. ప్రతిమ, ప్రతిరూపము.

ప్రతిమె. వి. (సం. ప్రతిమా.) ప్రతిమ,విగ్రహము.

క. ఆ ప్రతి,మెలు విలుపఁగవలయు నచట మృదుపీఠములకా. (భాగ. ౬.) (వి.వి.)

ప్రతిమోచనము. సం. వి. అ. న. ౧ సడల్చుట, విడుదలఁజేయుట. ౨ పగదీర్చుకొనుట. 3. విడిచిపుచ్చుట.

ప్రతియత్నము. సం. విణ. (అ. ఆ. అ.) ఒకని ప్రయత్నము నకు మాఱుగ కలిగిన ప్రయత్నము చేయునది.

వి. అ. పుం. ౧. ప్రయత్నము. ౨. గుణాంతరమును గలిగించుట, సంస్కారము. ౩. రచన. ౪. వాంఛ, ఇచ్ఛ. ౫. ఉపగ్రహము, అనుకూల్యముచేత. ౬. నిగ్రహించి. ౭. గ్రహణము. ౮. నిగ్రహము (పరిగ్రహము ?) ౯. చేకొట్టుట.

ప్రతియాతన. సం. వి. అ. స్త్రీ. ౧. ప్రతిమ. ౨. తుల్యయాతన. (శ. ర.)

ప్రతియాతనము. సం. వి. అ. న. పగదీర్చుకొనుట.

ప్రతియానము. సం. వి. అ. న. మరలిపోవుట, వెనుకకిపోవుట

ప్రతియుద్ధము. సం. వి. అ. న. ఎదుర్కొని యుద్ధముచేయుట, మార్కొనుట.

ప్రతియోగము. సం. వి. అ. పుం. ౧. విరోధము. ౨. విరుద్ధసంబంధము. ౩. ఎదుర్చుట, అడ్డగించుట.

ప్రతియోగి. సం. విశే. (న్. నీ. న్.) ౧. విరోధి, విరోధించునది. (న్యాయ ఘటాది, ఘటాద్యభావమునకు ప్రతియోగి) ౨. విరుద్ధపక్షము. ౩. (విశిష్టబుద్ధినియామకమగు సంసర్గముయొక్క) సంబంధిభేదము. (చంద్రతుల్యముఖము అనుచోట సాదృశ్యమున చంద్రుఁడు ప్రతియోగి, ముఖము అనుయోగి ఇట కేవలముఖము నకు చంద్రతుల్యముఖమనుచోఁ గల విశిష్టబుద్ధియందు విశేషణముగా భాసించునది సంసర్గముయొక్క ప్రతియోగి, విశేష్యముగా భాసించునది సంసర్గముయొక్క అనుయోగి. ఇట్లే 'ఘటవద్భూతలము' అనుచో సంయోగమునకు ఘటము ప్రతియోగి, భూతలము అనుయోగి)

ప్రతియోధనము. సం. ప్రతియుద్ధము.

ప్రతిరంభము. సం. వి. అ. పుం. ౧. ప్రతిలంభము, లాభము. ౨. క్రోధము, ఆగ్రహము.

ప్రతిరథుఁడు. సం. వి. అ. పుం. ప్రతియోధుఁడు.

ప్రతిరవము. సం. వి. అ. పుం. ౧. కలహము, పోరాటము. ౨. ప్రతిధ్వని. ౩. ప్రతికూలశబ్దము. ("వాదనము వీఁడు భుజింపఁదగదు, వీఁడు సాధనము చు బలవంతముగా వసూలించుచున్నాఁడు. ఇత్యాదిగా లోకములందు ఉద్ఘోషించుట ప్రతిరవము)

ప్రతిరుద్ధము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. అడ్డగింపఁబడినది. ౨. ముట్టడింపఁబడినది

ప్రతిరూపకము. సం. విశే. (అ. ఈ. అ.) (సమాసాంతములందు) సమానరూపముగలది, సదృశము. వి. అ. న. ౧. ప్రతిమ, విగ్రహము. ౨. ప్రతిబింబము. ౩. ఒకదానివలెనే కల్పింపఁబడినది. (పత్రము చూ.)

ప్రతిరూపధర. సం. వి. ఆ. స్త్రీ. కమసాలిపడి యచ్చు.

ప్రతిరూపము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. సమానరూపముగలది. ౨. అనురూపము, తగినది. వి. అ. న. ప్రతిమ, విగ్రహము.

ప్రతిరోధకుఁడు. సం. విశే. (అ. ధికా. అ.) ౧. అడ్డగించువాఁడు, ఎదిరించువాఁడు. ౨. ముట్టడించువాఁడు, దొంగ.

ప్రతిరోధనము. సం. వి. అ. న. ఎదిరించుట, అడ్డగించుట.

ప్రతిరోధము. సం. వి. అ. పుం. ౧. ఎదిరించుట. ౨. అడ్డగించుట, నిరోధము. ౩. ప్రతిబంధము. ౪. ముట్టడి. ౫. పరచౌర్యము, బలాత్కారమున దొంగిలించుట. ౬. తిరస్కారము. ౭. (న్యాయ) సాధ్యాసమితినిరోధకమగు సత్ప్రతిపక్షము. దుష్టము నగు హేతువు.

ప్రతిరోధి. సం. వి. ఇ. పుం. ౧. ఎదిరించువాఁడు. ౨. బందిపోటుదొంగ.

ప్రతిలంభము. సం. వి. అ. పుం. ౧. లాభము, ప్రాప్తి, పొందుట ౨. ఉపాలంభము, దూఱు వాడుట.

ప్రతిలిఖించు. సం. స. క్రి. వ్రాయు.

సీ. పఠియించినను దీనిఁ బ్రతిలిఖించిన విన్న, దానంబు చేసిన .. (కాశీ. ౩. ౨౬౨.)

ప్రతిలోమజుఁడు. సం. వి. అ. పుం. తక్కువ వర్ణమువానికి ఎక్కువవర్ణముగల స్త్రీయందుఁ బుట్టినవాఁడు

ప్రతిలోమము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ వామము, విపరీతము, క్రమముతప్పినది, అవరోహణక్రమము గలది. (వ్యతి అనులోమము) ౨ జాతి దుష్టమైన (మగనికంటె తక్కువ వర్ణముగల స్త్రీ యందుఁ బుట్టిన)వాఁడు, తక్కువ వర్ణమువానికి ఎక్కువ వర్ణముగల స్త్రీయందుఁ బుట్టినవాఁడు ౩. ప్రతికూలము. ౪. నీచము, అధమము, ౫. పిలవాగి.

ప్రతివచనము. సం వి అ. న. ౧. ప్రతివాక్యము, మాఱుమాట. ౨. ఉత్తరము. ౩. ప్రతిధ్వని. ౪ విరుద్ధవాక్యము.

ప్రతివచస్సు. సం వి. స. న. ౧ ప్రత్యుత్తరము. ౨. ప్రతిధ్వని.

ప్రతివచ్చు. అ. క్రి. సమానమగు.

క. అతిమ్మక్షితిపాలుఁడు, పాతివ్రత్యమున పతిల భాగ్యశ్రీలన్, సీతకుఁ బ్రతివచ్చినవి,ఖ్యాత గుణాలంబు మాచమాంబ వరించెన్.

వి. పు. ౧. ౩౫.

సీ. బందికంబానతోడఁ బ్రతివచ్చుమైచాయ నీలి పచ్చడముతో మేళవింప. (సైవ. ౭. ౯౩.)

సీ. తన్వంగి పారిజాతప్రవాళములతోఁ బ్రతి వచ్చు నీహాస్తపల్లవములు...

కాశీ. ౫. ౨౮౩.

ప్రతివర్ణికుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సమానుఁడు, సదృశుఁడు.

ప్రతివసథము. సం. వి. అ పుం. గ్రామము, సంవసథము.

ప్రతివసి(యి)ంచు. సం. అ. క్రి. నివసించు.

గీ. దక్షవాటికి పశ్చిమద్వారభూమిఁ, బ్రతివసిం చును సర్వాంగరమ్య యుంచు.

భీమ ౧. ౯౭.

చ. ప్రతివసియించు గోవుఁ ఖురంబులయందు సమస్తతీర్థసంతతియు (కాశీ. ౨ ౧౮౭.)

ప్రతివస్తువు సం. వి. ఉ. న. ౧. సమానమైన వస్తువు, తుల్యరూపమగు వస్తువు. ౨. ఒకదానికి బదులుగా నిచ్చినవసువు

ప్రతివస్తూపమ. సం. వి. ఆ. స్త్రీ. ఒక యర్థాలంకారభేదము.

శ్లో॥ వాక్యయో రేకసామాన్యే ప్రతివస్తూపమా మతా, తాపేన భ్రాజతే సూర్యః శూర శ్చాపేన రాజతే. (చంద్రాలోకము.)

ప్రతివాక్యము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రత్యుత్తరము చెప్పఁదగినది. - వి. అ. న. ప్రత్యుత్తరము.

ప్రతివాదము. సం వి. అ. పుం. ప్రత్యుత్తరము, మాఱుమాట, వాదిప్రయుక్తమగు న్యాయమునకు విరుద్ధమగు న్యాయవాక్యమును బ్రయోగించుట, ప్రతిపక్షవాదము.

ప్రతివాది. సం. విణ. (స. నీ. స.) ౧. ప్రత్యుత్తరముచెప్పువాఁడు, మాఱుపలుకువాఁడు. ౨. విరుద్ధముగా పలుకువాఁడు, విరోధవచనము చెప్పువాఁడు. (వ్యవహార.) వాది ప్రయోగించిన

న్యాయమునకు విరుద్ధముగ న్యాయవాక్యమును వాదించువాఁడు, వాదికి ప్రతిపక్షమువాఁడు. వి. న. పుం. విరోధి.

ప్రతివాదించు. సం. అ. క్రి. వాదికి ప్రతిపక్షముగా మాటాడు. (శ. ర.)

ప్రతివాపము. సం. వి. అ. పుం. (వైద్య)మందు లను కషాయాదులుగా కాఁచునప్పుడు గాని, కాఁచి దించినప్పుడు గాని యితరపదార్థముల నందుఁ గలుపుట.

ప్రతివారణము. సం. విణ. (అ ఈ అ.) నివారించునది (శ త్రు)-వి. న. నివారణము.

ప్రతివార్త. సం వి ఆ స్త్రీ ప్రత్యుత్తరము వంటిదగు వృత్తాంతవిశేషము

ప్రతివాసి. సం విణ (న సీ న) ఇరుగుపొరుగుల నివసించువాఁడు.

ప్రతివిధానము. సం. వి. అ న. మాఱుసేఁత, ప్రతీకారము

ప్రతివిధి. సం. వి. ఇ. పుం. గ్రా. ప్రతీకారము, మాఱుసేఁత. ౨. ప్రతిచికిత్స, నివారణోపాయము

ప్రతివిష. సం వి. ఆ స్త్రీ. అతివస. కీ.

ప్రతివిష్ణుకము. సం. వి. అ పుం. ముచుకుంద వృక్షము.

ప్రతివీరుఁడు. సం. వి. అ. పుం. ప్రతిభటుఁడు.

ప్రతివెట్టు. వి. స క్రి. (ప్రతి+పెట్టు.) ఎదుట నుంచు, సమానముగానుంచు.

ఉ. అంతర పెట్టిదో యని నిజాస్యముతోఁ బ్రతివెట్టి రోహిణీ, కాంతుఁ బరీక్ష సేయుటకు. హైమ. ౨. ౭౫.

ప్రతివేశము. సం. వి. అ. పుం. ఇరుగుపొరుగు ఇల్లు.

ప్రతివేశవాసి. సం. విణ. (న. సీ. న.) ఇరుగు పొరుగుల వసించువాఁడు.

ప్రతివేశి. సం. విణ. (న. సీ. న.) ఇరుగుపొరు గులవాఁడు.

ప్రతివేశుఁడు. సం. వి అ. పుం. ఇరుగుపొరు గులవాఁడు.

ప్రతివేశ్యుఁడు. సం. వి. అ పుం. ఇరుగుపొరుగు వాఁడు.

ప్రతివేష్టితము. సం. విణ (అ ఆ అ.) వెను కకుఁ జుట్టఁబడినది, వ్యత్యస్తముగాఁ జుట్టఁబడి నది.

ప్రతివైరము. సం వి. అ. న. పగతీర్చుకొనుట.

ప్రతివ్యూఢము. సం విణ. (అ. ఆ. అ.) వ్యూహ ముగా వన్నఁబడినది, ఎదురుగా నిల్పఁబడినది.

ప్రతివ్యూహము సం వి అ పుం. మాఱొడ్డుట, శత్రువున కెదురుగా సేనను బన్నుట.

ప్రతిశబ్దము. సం. వి. అ పుం. గ్రా. ప్రతిధ్వని ౨. ఘోషము, మ్రోఁత, బొబ్బ

ప్రతిశయనము. సం వి అ న. గ్రా. ప్రతి స్వాపము, ఎదురుగాఁ బరుండుట ౨. ఇష్ట లాభమునకై ప్రత్యాదేశముచేత దేవునిమ్రోల స్నానభోజనాదులు వర్జించిపరుండుట. (వాచ)

ప్రతిశయితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ప్రతి శయనము చేయువాఁడు

ప్రతిశాపము. సం. వి అ పుం. బదులుశపిం చుట, మాఱుతిట్టు.

ప్రతిశాసనము. సం. వి. అ న. గ్రా. ఆజ్ఞా పించుట, పనిపంచుట ౨. పిలిచి పనిపంచుట, నికృష్టులగు భృత్యాదుల నియోగించుట.

ప్రతిశిష్టుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) గ్రా. పని పంపఁబడినవాఁడు, ప్రేషితుఁడు. ౨. ప్రత్యా ఖ్యాతుఁడు, నిరాకరింపఁబడినవాఁడు.

ప్రతిశీర్షకము. సం. వి. అ. పుం. ఆర్తి, కుడువ, తాకట్టు.

ప్రతిశ్యా. సం = ప్రతిశ్యాయము. (వాచ.)

ప్రతిశ్యాయము. సం. వి. అ. పుం. పీనసము, పడిశము.

ప్రతిశ్రయము. సం. వి. అ. పుం. ౧. ఆశ్రయము, ప్రాపు. ౨. గృహము. ౩. సభ. ౪. యజ్ఞగృహము ౫. ఆశయము, పట్టు.

ప్రతిశ్రవణము. సం. వి. అ. న. ౧ ఆలించి వినుట ౨ అంగీకారము.

ప్రతిశ్రవము. సం వి అ పుం అంగీకారము.

ప్రతిశ్రుతము. సం. విశే. (అ. ఆ అ) ౧ అంగీకరింపఁబడినది. ౨. ప్రతిజ్ఞ సేయఁబడినది. వి అ. న ప్రతిజ్ఞ, ప్రతిన.

ప్రతిశ్రుతి. సం. వి ఇ. స్త్రీ = ప్రతిశ్రుత్తు

ప్రతిశ్రుత్తు. సం. వి. త్ స్త్రీ. ౧ అంగీకారము. ౨. ప్రతిజ్ఞ. ౩. ప్రతిధ్వని.

ప్రతిషిద్ధము. సం. విశే. ( అ. అ.) నిషేధింపఁబడినది.

ప్రతిషేధకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. నిషేధించువాఁడు. ౨. నివారించువాఁడు.

ప్రతిషేధనము. సం. వి. అ. న ౧ నిషేధము. ౨. నిరాకరణము. ౩ నివారణము.

ప్రతిషేధము. సం. వి. అ. పుం. ౧. నివారించుట, నిషేధము. (ఇట్లు చేయకుము ? అని వారించుట, అడ్డగించుట) ౨. నిరాకరించుట. ౩. నిరోధించుట. ౪. ఒక అర్థాలంకారభేదము.

శ్లో. ప్రతిషేధః ప్రసిద్ధస్య నిషేధ స్యానుకీర్తనమ్, న ద్యూత మేత త్క్షత్రస్య క్రీడనం నిశితై శ్శరైః (చంద్రాలోకము.)

ప్రతిషేధించు. సం. స. క్రి. నిషేధించు.

వ. అరివర విరి యుయ్యూరవిందాస్య యాదాన్యభి సందివవలంబిరకూస్యతు(స్రా)ను(ప్రితం) రైవ చూపుచం జూచి యాభూపాలుండు ప్రతిషేధించె. (వైమ. ౫. ౧౫౧.)

ప్రతిషేధోపమ. సం వి. ఆ. స్త్రీ. ఒక ఉపమాలంకారవిశేషము.

శ్లో. న జాతు శక్తి రిందో స్తే ముఖేన ప్రతిగర్జితుమ్, కలంకినో జడస్యేతి ప్రతిషేధోపమైవ సా. (కావ్యాదర్శము.)

ప్రతిషేద్ధ. సం. ఋ. (ఋ. ద్వి. ఋ.) ప్రతిషేధకుఁడు.

ప్రతిష్కషము. సం. వి. అ. పుం. తోలువాఱు, కొరడాచర్మరజ్జువు

ప్రతిష్కసుఁడు. సం. వి. అ. పుం. చారుఁడు.

ప్రతిష్కృఁడు. సం వి. అ. పుం దూత.

ప్రతిష్టంభము. సం విశే (అ.ఆ.అ.) అడ్డగింత.

ప్రతిష్టబ్ధము. సం విశే. (అ. ఆ. అ.) అడ్డగింపఁబడినది.

ప్రతిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. ౧ స్థానము, చోటు. ౨. నేల, భూమి. ౩. స్థైర్యము, నిలుకడ. ౪ గౌరవ . ౫. కీర్తి. ౬. (ఉద్యోగాదులందు) స్థాపించుట, నెలకొల్పుట, శాశ్వతముగా నిలుపుట ౭. దేవతావిగ్రహాదులకుఁ బ్రాణ్యాదులు గలిగించు సంస్కారభేదము. ౮. అడుగు, పాదము. ౯. నాలుగవఛందస్సు. ౧౦. మాహాత్మ్యము. (శ వి.)

ప్రతిష్ఠము. సం. విశే. (అ. ఆ. అ.) ప్రసిద్ధము.

ప్రతిష్ఠానము. సం. వి. అ. న. ౧. స్థానము, చోటు. ౨. ఆశ్రయము, విశ్రమస్థానము. ౩. విఖ్యాతి. ౪. ప్రశాదుల సమాప్తియందుఁ జేయు కర్మభేదము. ౫. దేవతావిగ్రహాదులకుఁ బ్రాణాద్యము గలిగించు సంస్కారభేదము. ౬. గణాగ

యమునాసంగమమందు చంద్రవంశపురాజుల రాజధానిపట్టణము, గోదావరీతీరమున గల కాళి వాహనుని రాజధానియగు నొకపట్టణము.

ప్రతిష్ఠాపనము. సం. వి అ. న. ౧. నిలుపుట, నెలకొల్పుట, శాశ్వతముగా నిలుపుట ౨. ఉద్యోగాదులందు నెలకొలుపుట. ౩. దేవతావిగ్రహములను స్థాపించుట.

ప్రతిష్ఠాపయితృ సం విశే. (బు స్త్రీ. బు) ప్రతిష్ఠాపించువాఁడు.

ప్రతిష్ఠాపించు. సం. స క్రి. ప్రతిష్ఠచేయు (సిద్ధి ప్రతిష్ఠచేయించు అని ప్రేరణార్థముకూడ చెప్ప వచ్చును.)

మ. సముథూమిన్ బరమోత్సవంబునఁ బ్రతి
ష్ఠాపించె శ్రీరంగమున్
శ్రీరంగ. ౨. ౩౭

క. విశ్వగురుండు వైశ్వానరుఁ బ్రార్థించి నియో
గించి భృగువచనంబు ప్రతిష్ఠాపించె
భార. ఆది. ౧. ౧౮౩.

మ. ... అత్యనపాయుండు తదాశ్రమస్థ యగు
మద్యద్రాజ్యలక్ష్మిన్ సుధాశనగేహంబున
శాశ్వతంబుగఁ బ్రతిష్ఠాపించెఁ జెంపేర్పడన్.
హరి పూర్వ. ౩ ౩౯.

ప్రతిష్ఠించు. సం. స. క్రి. శాశ్వతముగా నిలుపు నిలుపు.

వ. ... హైయంగవీనపూర్ణ తామ్రపాత్రంబున యథాశక్తి ధర్మనిర్మితసమందరకూర్మప్రతిమ ప్రతిష్ఠించి షోడశోపచారంబుల సలిపి
వరాహ. ౯. ౧౫.

ప్రతిష్ఠితము. సం. విశే. (అ. అ. అ.) ౧. నిలుపఁబడినది, నెలకొలుపఁబడినది. ౨. శాశ్వతముగా నిలుపఁబడినది, స్థిరముగా నెలకొలుపఁబడినది, స్థాపింపఁబడినది. ౩. నెలకొల్పఁబడినది. ౪. విఖ్యాతము, వాసికెక్కినది. ౫. నిర్వయింపఁబడినది.

ప్రతిసంక్రమము. సం. వి. అ. పుం. ౧. ప్రతిచ్ఛాయ. ౨ సంచారము

ప్రతిసంఖ్య. సం. వి అ. స్త్రీ. ౧. ప్రసంఖ్యానము, లెక్కఁగా లెక్కపెట్టుట. ౨. సాంఖ్యాదిసిద్ధమగు జ్ఞానభేదము.

ప్రతిసంఖ్యానిరోధము సం వి. అ. పుం. బుద్ధిపూర్వకముగా భావములు నశించుట. (ఇది బౌద్ధమతసిద్ధమగుపదార్థభేదము)

ప్రతిసంగత్రిక. సం. వి. అ. స్త్రీ దుష్టమైనపైఁబడనీక హరించుటకగు దుప్పటము

ప్రతిసంచరము సం. వి అ. పుం. వెనుకకు మరలుట, వెనుకకుఁదిరుగుట. ౨. మరల లయించుట, ప్రలయభేదము. ౩. జగత్తు మరల ప్రకృతియందు లయించుట. ౪ సంచారము.

ప్రతిసందేశము. సం. వి. అ. పుం. సందేశమునకు మాఱుసందేశము, పంపినవృత్తాంతమునకుఁ బ్రత్యుత్తరము. (ఇది వాచికముగా నుండును.)

ప్రతిసంధానము. సం. వి. అ. న. ౧. ఒకటిగా గూర్చుట. ౨. ఇంద్రియనిగ్రహము. ౩. స్తుతి. ౪. అనుసంధానము, అనుచింతనము. ౫. అన్వేషణము, వెదకుట.

ప్రతిసంధి. సం. వి. ఇ. పుం. ౧. మరలఁ గూడుట. ౨. గర్భమునుజొచ్చుట. ౩. యుగముల నడిమికాలము. ౪. ఉపరమము, ఉడుగుట. ౫. వియోగము. ౬. ప్రతిసధానము.

ప్రతిసంధేయము. సం. విశే. (అ. అ. అ.) ప్రతికార్యము, ప్రతీకారము చేయఁదగినది.

ప్రతిసంవేదకుఁడు. సం. విణ. (అ. దిగా. అ.) సవిస్తరముగా నెఱిఁగించువాఁడు.

ప్రతిసంస్థానము. సం. వి. అ. న. ప్రవేశించుట, ప్రవేశము.

ప్రతిసంహారము. సం. వి. అ. పుం. ౧. లోపలికి తీసుకొనుట, మడఁచుకొనుట. ౨. సంకోచము, ముడుఁచుకొనుట. ౩. అంతర్భావము, లోపలఁ జేర్చుకొనుట. ౪. ఇముడుట.

ప్రతిసమము. సం. విణ. (అ. ఆ. అ.) విసదృశము.

ప్రతిసమాసనము. సం. వి. అ. న. నిరసనము, నివారించుట.

ప్రతిసరము. సం. విణ. (అ. ఆ. అ.) నియోజ్యము, నియోగింపఁదగినది. - వి. అ. పుం., న. ౧. భూషణము. ౨. హస్తబంధనమాత్రము, తాయెత్తు. ౩. ఏనుఁగుకుంభముల క్రిందిచోటు. (శ. ర.) ౪. ఆరక్షకుఁడు, ఆరెకుఁడు. పుం. ౧. సైన్యపశ్చాద్భాగము, సేనవెనుకటి దిక్కు. ౨. వివాహాదులందు దీక్షార్థముచేతఁ గట్టుకొను తోరము, కౌతుకసూత్రము. ౩. మంత్రవిశేషము. ౪. మాల్యము, పూదండ. ౫. కడియము. ౬. వ్రణశుద్ధి. ౭. ప్రాతఃకాలము.

ప్రతిసర్గము. సం. వి. అ. పుం. బ్రహ్మయొక్క సృష్టికి పాటియగు మరీచ్యాదులసృష్టి. (ఇది పురాణలక్షణములలో నొకటి - చూ. లక్షణము.) ౨. ప్రలయము.

ప్రతిసవ్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రతికూలుఁడు. ౨. విరుద్ధాచారుఁడు.

ప్రతిసాంధానికుఁడు. సం. వి. అ. పుం. బట్టువాఁడు, స్తుతిపాఠకుఁడు, మాగధుఁడు.

ప్రతిసారణము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. ఆపసారకము, తొలఁగించునది. ౨. దూరీకారకము, దూరముగాఁ జేయునది. - వి. అ. న. ౧. దూరీకరణము. ౨. (న.శ్రుతి) అగ్నికార్యభేదము. (వాచ.) ౩. కంటియందు మందువూయుట కుపయోగించెడి యొక పనిముట్టు. ౪. పాడి మొదలగువానితోఁగాని, వ్రేలితోఁగాని పంటిని రుద్దుట (వైద్యకి)

ప్రతిసారణీయము. సం. విణ. (అ. ఆ. అ.) స్థానాంతరమునకుఁ గొంపోవఁదగినది.

వి. అ. పుం. (న.శ్రుతి) క్షారపాకవిధి భేదము, క్షారములను వండువిధులలో నొకభేదము.

ప్రతిసారి. సం. విణ. (న్. ఈ. న్.) ౧. విరుద్ధముగాఁ బోవునది. ౨. నీచముగాఁ బోవునది.

ప్రతిసీర. సం. వి. ఆ. స్త్రీ. తెర, యవనిక.

ప్రతిసూర్య(క)ము. సం. వి. అ. పుం. ౧. కృకలాసము, తొండ. ౨. రెండవసూర్యుఁడు తోఁచుట. (ఇది అంతరిక్ష ఉత్పాతభేదము.)

ప్రతిసృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రేరితము. ౨. ప్రత్యాఖ్యాతము, నిరాకరింపఁబడినది. ౩. మత్తము, మదించినది.

ప్రతిసేన. సం. వి. ఆ. స్త్రీ. శత్రుసైన్యము.

ప్రతిసేయు. మి. స. క్రి. పోల్చు, ఉపమించు.

తే. రమణఁ బ్రతిసేయవచ్చు ... యౌదార్య
విభవధారియై మించుశ్రీరంగశౌరి కెపుడు.
వసు. ౧. ౩౪.

ప్రతిసోమ. సం. వి. ఆ. స్త్రీ. మహిషవల్లి. తీ.

ప్రతిస్నాతుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) స్నానముచేసినవాఁడు, జలకమాడినవాఁడు.

ప్రతిస్పర్ధ. సం. వి. ఆ. స్త్రీ. పోటి, పురుడు.

ప్రతిస్పర్ధి. సం. విణ. (న. పు. న.) పోటిచేయు వాఁడు, మత్సరించువాఁడు.

ప్రతిస్పర్ధించు. సం. అ. క్రి. స్పర్ధచేయు, పోటి చేయు.

క. వింధ్యం బను మహీధరంబు విబుధశైలం బుతోఁ బ్రతిస్పర్ధించి. (కాశీ. ౧. ౯౮.)

ప్రతిహతము. సం. విణ. (అ. ఆ. అ) మరలఁ గొట్టఁబడినది, మాఱుదెబ్బపడినది. ౨. నిరస్తము, త్రోసివుచ్చఁబడినది, తఱుమఁగొట్టఁబడినది. ౩. రుద్ధము, అడ్డగింపఁబడినది. ౪. ద్విష్టము, ద్వేషింపఁబడినది. ౫. ప్రతిస్ఖలితము, తొట్రుపడినది, మనసుచెడినది.

వి. అ. న. నిరాసము, త్రోసివుచ్చుట.

ప్రతిహతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. మాఱుకొట్టుట, మాఱుదెబ్బ. ౨. విఘాతము, అడ్డగింత. ౩. పరావృత్తి, కొట్టఁబడి మరలపోయుట. ౪. రోషము.

ప్రతిహర్త. సం. విణ. (ఋ. క్రీ. ఋ.) ౧. మరలఁగొట్టువాఁడు, మాఱుదెబ్బఁగొట్టువాఁడు. ౨. మరలఁదెచ్చువాఁడు. ౩. ఋత్విగ్భేదము (ఉద్గాతకు సహాయుఁడు).

ప్రతిహర్తకుఁడు. సం. వి. అ. పుం. ప్రతిహర్త.

ప్రతిహారకుఁడు. సం. వి. అ. పుం. గారడి విద్యయందు నేర్పరియైనవాఁడు. (వాచ.)

ప్రతిహారము. సం. వి. అ. పుం. ౧. మరలఁగొట్టుట, మాఱుదెబ్బ. ౨. ద్వారము. ౩. గారడివిద్య. ౪. (వ్యాక.) దంత్యాక్షరముల యుచ్చారణమున నాలుక పండ్లకొనల నొత్తి తాఁకుట. ౫. శబ్దపము, తాఁకేలు. (శ. ని.)

ప్రతిహారి. సం. వి. న. పుం. వాకిటికావలివాఁడు.

ప్రతిహారుఁడు. సం. వి. అ. పుం. ౧. ద్వారపాలకుఁడు, వాకిటికావలివాఁడు. ౨. గారడివాఁడు.

ప్రతిహాసము. సం. వి. అ. పుం. ౧. నవ్వునకు మాఱునవ్వు. ౨. గన్నేరు.

ప్రతిహితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. హితమైనది. ౨. దగ్గఱగానుంపఁబడినది.

ప్రతీంధకము. సం. వి. అ. పుం. విదేహదేశము.

ప్రతీకము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రతికూలము, విలోమము. ౨. అనురూపము. (శ. ని.) వి. అ. పుం. ౧. అవయవము. ౨. ఏకదేశము.

ప్రతీకారము. సం. = ప్రతికారము.

ప్రతీకారి. సం. విణ. = ప్రతికారి.

ప్రతీకాశము. సం. = ప్రతికాశము.

ప్రతీక్ష. సం. వి. ఆ. స్త్రీ. = ప్రతీక్షణము.

ప్రతీక్షణము. సం. వి. అ. న. (ప్రత్యాశతో) ఎదురుచూచుట, అపేక్ష.

ప్రతీక్షించు. సం. అ. క్రి. ఎదురుచూచు.

వ. ప్రాచేతసాగమనంబు ప్రతీక్షించుచున్న యెడ. (ఉ. రా. ౮. ౨౧.)

ప్రతీక్షితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎదురుచూడఁబడినవాఁడు. ౨. భావింపఁబడినవాఁడు, ఎన్నఁబడినవాఁడు. ౩. గౌరవింపఁబడినవాఁడు.

ప్రతీక్షుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ఎదురుచూచువాఁడు.

ప్రతీక్ష్యుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పూజ్యుఁడు. ౨. ప్రతీక్షింపఁదగినవాఁడు.

ప్రతీఘాతము. సం. = ప్రతిఘాతము.

ప్రతీచి. సం. వి. ఈ. స్త్రీ. పశ్చిమదిక్కు, పడమర.

ప్రతీచీనము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పడమటిది, పశ్చిమదిక్కునందుఁ బుట్టినది. ౨. పిమ్మటిది, అనంతరము రాఁగలది.

ప్రతీచ్ఛకుఁడు. సం. వి. అ. పుం. గ్రాహకుఁడు, పుచ్చుకొనువాఁడు.

ప్రతీచ్యము సం. విణ. (అ. ఆ అ.) పడమటిదిక్కునందలిది, ప్రత్యగ్భవము. ౨. అంతర్హితము.

ప్రతీతి. సం వి ఇ స్త్రీ. ౧. దృఢజ్ఞానము, ఎఱుక. ౨ ప్రసిద్ధి 3. ఆదరము ౪ హర్షము ౫. దగ్గఱకుపోవుట, కదియుట.

ప్రతీతుఁడు. సం. విణ. (అ ఆ అ.) ౧ బయలుదేఱినవాఁడు, వెడలినవాఁడు. ౨ ఖ్యాతుఁడు 3. జ్ఞాతుఁడు, తెలియఁబడినవాఁడు ౪. హృష్టుఁడు, సంతోషించినవాఁడు ౫. సాదరుఁడు, ఆదరముగలవాఁడు. ౬. ఆప్తుఁడు, ప్రత్యయితుఁడు. - వి అ. పుం. ౧. విశ్వేదేవగణభేదము. ౨. బుధుఁడు, విద్వాంసుఁడు. (శే. వి.)

ప్రతీపతరణము. సం వి. అ. న వెల్లువకెదురొత్తినిపోవుట, ఎదురీదుట.

ప్రతీపదర్శిని. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడుది, అంగన

ప్రతీపము. సం విణ (అ ఆ అ) ౧ ప్రతికూలము ౨ విలోమము, తలక్రిందైనది. - వి అ న ఒక అర్థాలంకారము
శ్లో. ప్రతీప ముపమానస్యోపమేయత్వప్రకల్పనం, త్వల్లోచనసమం పద్మం త్వద్వక్త్రసదృశో విధుః (చంద్రాలోకము)

ప్రతీపవచనము. సం. వి. అ. న. ౧. ఎదురాడుట, ఆక్షేపించుట. ౨. తాఱుమాఱుగా మాటాడుట.

ప్రతీపవిపాకి. సం. విణ. (న. నీ. న.) ప్రతికూలఫలము నిచ్చునది, ప్రతికూలముగా పరిణమించునది

ప్రతీపుఁడు. సం వి అ. పుం. ౧. శత్రువు. ౨. శంతనుతండ్రి చంద్రవంశపురాజు.

ప్రతీరము. సం. వి అ. న (నద్యాది) తీరము, గట్టు

ప్రతీవాపము. సం వి అ పుం. ౧ కరిగిన స్వర్ణాదులను ద్రవ్యాంతరముచే పొడిసేయుట (వాచ) రాలిన లోహపుఁబొడిని కాఁచి చాఁగఁగొట్టు (శ ర) ౨. విక్షేపించుట 3 జనోపద్రవవిశేషము (మారి, మశూచి లోనగునవి) ౪ ప్రాఁగఁదగిన యౌషధవిశేషము ౫ ఔషధవిశేషముల యొక్క సంయోగభేదము

ప్రతీవేశము. సం. = ప్రతివేశము

ప్రతీవేశి. సం విణ (న. నీ న) = ప్రతివేశి

ప్రతీష్టము. సం విణ (అ. ఆ అ) స్వీకృతము, కైకొనఁబడినది

ప్రతీహారము. సం వి అ పుం ౧ ద్వారము. ౨ పూర్వము చేసిన దానికి మేలుచేసితినిగాన నిపుడు నీవును నాకు మేలుచేయుమని యొనరించిన సంధి

ప్రతీహారీ. సం. వి. ఈ స్త్రీ. ద్వారపాలిక. - న పుం ద్వారపాలకుఁడు.

ప్రతీహారుఁడు. సం. వి. అ. పుం ద్వారపాలకుఁడు.

ప్రదేశనము. సం. వి. అ. న. ౧. ఉపదేశము. ౨. రాజాదుల కర్పించుకానుక, ఉపహారద్రవ్యము.

ప్రదేశ(శి)ని. సం. వి. ఈ. స్త్రీ. జుట్టనవ్రేలు, తర్జని.

ప్రదేశము. సం. వి. అ. పుం. ౧. చూపుట, సూచనము. ౨. చోటు, దేశము. ౩. గోడ. ౪. జట్టిలి.

ప్రదేహము. సం. వి. అ. పుం. ౧. పూఁత, లేపము. ౨. (వైద్య.) పూయునట్టిచమురు మొ.

ప్రదోషము. సం. విణ. (అ. ఆ. అ.) చెడినది, చెడ్డది. -వి. అ. పుం. ౧. దోషము, తప్పు, నేరము. ౨. మునిమాపు, సంజ.

ప్రదోహము. సం. వి. అ. పుం. పాలుపిదుకుట.

ప్రద్యుమ్నుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు; కృష్ణునకు రుక్మిణియందు మన్మథాంశమునఁ బుట్టినకొడుకు.

ప్రద్యోతనము. సం. వి. అ. న. ౧. వెలుఁగుట, ప్రకాశించుట. ౨. కాంతి.

ప్రద్యోతనుఁడు. సం. వి. అ. పుం సూర్యుఁడు.

ప్రద్యోతము. సం. వి. అ. పుం. కిరణము.

ప్రద్యోతించు. సం. అ. క్రి. ప్రకాశించు.

క. ..పద్యమునకు నిట్లు యమకబంధమునడుమం, బ్రద్యోతించిన నది... (కావ్యా. ఉ. ౩౪.) (ఇట యుండరా అని భావము.)

ప్రద్రవము. సం. వి. అ. పుం. పలాయనము, పాఱిపోవుట.

ప్రద్రాణకుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కష్టిత గతి నొందినవాఁడు, అతిదరిద్రుఁడు.

ప్రద్రావము. సం. వి. అ. పుం. పలాయనము, పాఱిపోవుట.

ప్రద్రావి. సం. విణ. (న. నీ. న.) పలాయనము సేయువాఁడు, పాఱిపోవువాఁడు.

ప్రద్విషత్. సం. శత్ర = ప్రద్విట్టు.

ప్రద్విట్టు. సం. విణ. (ష.) ౧. మిక్కిలిద్వేషించువాఁడు. ౨. ప్రతికూలుఁడు, విరోధి.

ప్రద్వేషణము. సం. వి. అ. పుం. మిక్కిలి ద్వేషము.

ప్రద్వేషము. సం. వి. అ. న = ప్రద్వేషణము.

ప్రద్వేషించు. సం. అ. క్రి. విరోధించు, పగఁగొను.

వ. ఏను నీయధ్వరంబున నుపదర్శనంబు సేయుచుండ నద్దివస్పతియు బృహస్పతియుఁ బ్రద్వేషించి రోషంబు వాటించుదు ...

భార. ఆశ్వ. ౧. ౫౦.

ప్రధ. సం. వి. అ. స్త్రీ. ౧. కశ్యపునిభార్యలలో నొకతె. (దక్షునికూఁతురు.) ౨. విధానము.

ప్రధనము. సం. వి. అ. న. ౧. యుద్ధము. ౨. యుద్ధమునందలికొల్ల. ౩. నాశనము. ౪. చీల్పుట. -పుం. ముద్గము, పెసర ౘే. (శే. వి.)

ప్రధమనము. సం. వి. అ. న. ౧. ఊఁదుట. ౨. తుమ్ములుకలిగించు మందు. (అ వి)

ప్రధర్షకుఁడు. సం విణ (అ. క్షి కా అ) ౧. ఎదిరించువాఁడు, చెనకువాఁడు. ౨. కారించువాఁడు, ఉపద్రవము చేయువాఁడు.

ప్రధర్షణము. సం. వి అ న. ౧. ఎదుర్చుట కాఁకుట. ౨. అవమానించుట, మేరమీఱివర్తించుట.

ప్రధానధాతువు. సం. వి. ఉ. పుం. పరమ ధాతువు, రేతస్సు. (వాచ.)

ప్రధానము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రశస్తము. ముఖ్యము. -వి. అ. న. ౧. (సాంఖ్య) సత్త్వ రజస్తమోగుణాత్మకయగు ప్రకృతి. ౨. పరమాత్మ. ౩. బుద్ధి ౪ కార్యసహాయుఁడు, సచివుఁడు (ఇది మిత్రాదులలోనిది.)

ప్రధారణము. సం. వి అ. న. ఫలము పేక్షించి యిచ్చుట. (శ. ర)

ప్రధావించు. సం. అ. క్రి. పరుగెత్తు, పాఱు.

ప్రధి. సం వి. ఇ. పుం. బండికంటి కడకమ్మి, నేమి

ప్రధ్మాపనము. సం వి. అ. న. శ్వాసమార్గము అందు అడ్డుపాటు కలిగినప్పుడు ఊర్పునకు తోడ్పాటుగాచేయు చికిత్స.

ప్రధ్వంసము. సం.వి.అ.పుం. నాశము,ధ్వంసము.

ప్రధ్వంసాభావము. సం. వి. అ పుం. ప్రధ్వంసముచేఁ గలిగిన అభావవిశేషము.

ప్రధ్వస్తము. సం. విణ (అ. ఆ. అ.) పొత్తిగా నాశము పొందినది

ప్రనప్త. సం. వి. ఋ. పుం. మునిమనుమఁడు, ప్రపౌత్రుఁడు

ప్రనాలి. సం. = ప్రణాళి.

ప్రన్న. విణ. ౧. మనోజ్ఞము, చక్కనిది.
(వ్యుత్పత్తియందు నిగాగమము నిత్యము.)
క. వనితలు మేలపు మెయి మెలు,పునఁ దిగిచిన నొప్పుకరములు మెదలగు ప్రన్నపుతొడవులు ... (భార. స్త్రీ. ౨. ౧౬.)
సీ. మణికాయముల చూపు లనుకూలములఁ దన ప్రన్నపు మేను తెప్పంబు గాఁగ.
కళా. ౧. ౭౧.

ఉ. ప్రన్ననివ్వటాలఁబర్వఁగ్రొమ్మల జేమ కాంతిసం,పన్నత తప్తహేమరుచి భామలతో పల్లవభోగ్య లాదరే. (కాశీ. ౪. ౪౭.)
ఉ. ప్రన్నని దైవధాతురుచిరంజన నొప్పుమసోన్ ప్రదిశవడిగా, గన్నులు రెండునుగా మూసుఁగఁ గా మెడ సెత్తురు ..
భా. రా. యు. ౧౨౦౭.
౨. సాంద్రము. (మనోజ్ఞము అని శ. ర.)
క. మృ స్నేహ మేన నలఁదిన,ప్రన్ననిభసితంబు నణఁచి . (పాండు. ౫. ౧౩౧.)
౩. కోమలము, మృదువు.
చ. ఘణఫలకంబు విచ్చి కదుఁ బ్రన్ననిమే నొగ యుంగఁజేయుచున్ .. (సైస. ౫. ౨౯.)
ఉ. ప్రన్ననిపాదముల్ చిలుకవాలినఁ, గందదు మేనుఁదీఁగెయుగా, కన్నులఁ గట్టినట్టు పొడ గానఁగనర్యోడు నాకు నెచ్చెలీ
రాజ. చ. ౨ ౧౬౭.
సీ. వలచేత బంగారుజలపోసనములోఁదఁబ్రన్నని పట్టుతోరము ధరించి. (క్రీడా. ౪౩.)

ప్రన్నఁదనము. వి. (√ప్రన్న.) ౧. సౌందర్యము, చక్కఁదనము.
ఆ. ఉలుము గొన్నవాఁడు దోలుమేన నాఘాత, బంధనముల నొరులప్రన్నఁదనము, సెఱచి వాఁడు ... (భార. అను. ౫ ౧౦౦.)
ఉ. . గుణప్రసన్నతగా, బ్రన్నఁదనంబుఁ జూపఁగలరంగయరాఘవమంత్రి నిచ్చలుగా, వన్నెకుఁ దెచ్చు నిచ్చు వభివాంఛితవస్తువు లర్థికోటికిగా. (పాండు. ౧. ౫౪.)
౨. కోమలత్వము. మార్దవము.
ఆ....కృపం బసంగ మేనిప్రన్నఁదనము,నిపుణత చేఁత గాదు ... (భార. శాం. ౨. ౩౪౮.)

ప్రప. సం. వి. ఆ. స్త్రీ. [illegible]

ప్రపంచకము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. విస్తరింపఁజేయునది, విస్తరించునది. ౨. సవిస్తరముగా వివరించునది.

ప్రపంచనము. సం. వి. అ. న. ౧. విస్తరించుట, విరివిచేయుట. ౨. సవిస్తరముగా వివరించుట.

ప్రపంచబుద్ధి. సం విశే. (ఇ) మోసపుచ్చువాఁడు.

ప్రపంచము. సం. వి. అ. పుం. ౧. విస్తారము, విరివి, శబ్దవిస్తరము. ౨. వివరణము, వ్యాఖ్యానము. ౩. వైవిధ్యము, పెక్కువిధములు గలిగియుండుట. ౪. సంసారము. ౫. ప్రతారణము, మోసపుచ్చుట. ౬. వ్యత్యాసము, తలక్రిందు. ౭. రచన. ౮. భూలోకము.

ప్రపంచముసేయు. సం. స. క్రి. విస్తరించు, అతిశయింపఁజేయు.

వ. చూచి రెండును ఫలంబు గాని యీ జగాత్రి యాయన నింక నేమి ప్రపంచంబు సేఁన నెఱియ నెడసిపోవుటకక్కఁ బ్రయోజనం బేమియులేదు ... (కళా. ౪. ౬౩.)

ప్రపంచించు. సం. స. క్రి. విస్తరించు, అతిశయింపఁజేయు.

వ. ఈశ్వరునకు వైషమ్యాదిపరిహారార్థంబుగా నింతయుం బ్రపంచింపఁబడిరు ...

కవిక. ౫. ౧౫౩.

ప్రపంచితము. సం. విశే. (అ. ఆ. అ) ౧. విస్తరింపఁబడినది, విరివిచేయఁబడినది. ౨. వ్యాఖ్యానము సేయఁబడినది. ౩. ప్రతారితము, మోసపుచ్చఁబడినది. ౪. సంపాదితము (వాచ.)

ప్రపతితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. పడిపోయినది, పారిపోయినది. ౨. క్రిందపడినది. ౩. క్షీణించినది, తఱిగినది. ౪. నశించినది.

ప్రపత్తి. సం. వి. ఇ. స్త్రీ. భక్తిపరులుచేయు శరణాగతి. (శ. ర.)

ప్రపథ్య. సం. వి. ఆ. స్త్రీ. హరీతకి, కరక. కై.

ప్రపదనము. సం. వి. అ. న. ప్రపత్తి, భక్తిపరులుచేయు శరణాగతి.

ద్వి. ... మహాపూర్ణగురుఁడు, తనగురుం డల ప్రపదన ముపాయంబు, తత్త్వంబు నేను సద్వైతంబ మతము, తత్త్వార్థ మిది ప్రపదనమున తరయ.

ద్వి. పరమ. ౮. ౬౦౪. పొ

ప్రపదము. సం. వి. అ. న ౧. మీఁగాలు. ప్రపదములం దులుకు. (కవి. ౧. ౭) (శ. ర.) ౨. ముంగాలు, పాదాగ్రము.

ప్రపన్నము. సం విశే. (అ. ఆ. అ.) ౧. పొందినది, చెందినది. ౨. శరణాగతము, శరణొందినది, ప్రపత్తిచేసినది. ౩. పొందఁబడినది.

ప్రపన్నాదము. సం. వి. అ. పుం. చక్రమర్దము, తగిరస. కై

ప్రపలాయి. సం విశే (న్. నీ. న్) ౧ పారిపోవువాఁడు. ౨ చెఱపట్టఁబడినవాఁడు, బందీ.

ప్రపాఠకము. సం వి. అ. పుం ౧. వేదాధ్యాయముయొక్క అంశభేదము. ౨ గ్రాంథ గ్రంథముయొక్క అంశభేదము.

ప్రపాణి. సం. వి. ఇ. పుం. అఱచేయి, పాణితలము.

ప్రపాతనము. సం.వి.అ.న.క్రిందఁబడఁద్రోయుట.

ప్రపాతము. సం. వి. అ. పుం. ౧. పడుట, పాఱుట. ౨. క్రిందఁబడుట, పాటు. ౩. హటాలున పైఁబడుట, ఉన్నట్టుండి తాఁకుట. ౪. సెలయేఱు, నిర్ఝరము. ౫. కూలము, గట్టు. ౬. కొండచఱియ. ౭. పునిపాటు. (శ. ర.)

ప్రపాదికము. సం. వి. అ. పుం. నెమిలి.

ప్రపానకము. సం. వి. అ. న. ఒకదినుసు పానకము, పటికబెల్లము మిరియములు లోనగునవి చేర్చిన యొకదినుసు పానీయము.

ప్రపానము. సం.వి అ.న. ౧ మిక్కిలి త్రాగుట. ౨. గుఱ్ఱపు పైపెదవియొక్క క్రిందిభాగము.

ప్రపాపాలిక. సం. వి. ఆ. స్త్రీ. చలిపందిరిపెట్టి కాని వచ్చినవారికి నీళ్లుపోయుస్త్రీ.

ప్రపితామహి. సం. వి. ఈ. స్త్రీ. ప్రపితామహుని భార్య, ముత్తవ్వ.

ప్రపితామహుఁడు. సం. వి. అ. పుం. ముత్తాత

ప్రపీత(న)ము. సం విశ. (అ. ఆ. అ.)మిక్కిలి బలిసినది, మిక్కిలి పీనము.

ప్రపునా(న్నా)ట(డ)ము. సం. వి. అ. పుం. చక్రమర్దము, తగిరస. వై.

ప్రపూరిక. సం. వి. ఆ. స్త్రీ. కంటకారిక వాఁకుడు. వై.

ప్రపూర్వగుఁడు. సం. వి. అ. పుం. పరమేశ్వరుఁడు.

ప్రపోషించు. సం. స. క్రి. ఎక్కువగాఁ బోషించు.

మ. మావారితోఁగూడఁ జయ్యనఁగొంపోయి సమస్తభోగముల నిత్యంబుఁ బ్రపోషింపుచున్. (యశ్మా. ౫. ౭౦.)

ప్రపౌండరీకము. సం. వి అ. పుం. ఏనుఁగుల కును మనుష్యులకును గంటికి హితకరమై తాల పర్ణియాకులవంటి యాకులుగల యొకతృణము. వై. పుండరీకమను గంధద్రవ్యము. వై.

ప్రపౌత్రి. సం. వి. ఈ. స్త్రీ. మునిమనుమరాలు.

ప్రపౌత్రుఁడు. సం. వి. అ. పుం. మునిమనుమఁడు పౌత్రునికొడుకు.

ప్రప్రపితామహుఁడు. సం. వి. అ. పుం. ప్రపితామహునితండ్రి.

ప్రప్రమాతామహుఁడు. సం. వి. అ. పుం. ప్రమాతామహునితండ్రి.

ప్రఫుల్తము. సం. విశ. (అ. ఆ. అ.) ప్రఫుల్లము.

ప్రఫుల్తి. సం. వి. ఇ. స్త్రీ. విరియుట, వికాసము.

ప్రఫుల్లము. సం. విశ. (అ.ఆ అ.) ౧. చక్కఁగా విరిసినది, వికసించినది. ౨. నవ్వునది ౩. ప్రకాశించునది, మెఱయునది, ౪. ఉల్లసిల్లునది, సంతోషముగలది.

ప్రబంధ(ద్ధ.) సం. విశ (ఋ త్రీ. ఋ) ప్రబంధకర్త, గ్రంథకర్త

ప్రబంధకల్పన. సం వి ఆ. స్త్రీ. ఇంచుకసత్యమును మిక్కిలి కల్పనయుఁ గలకథ.

ప్రబంధము. సం. వి. అ. పుం. ౧. ప్రకృష్టబంధము, మిక్కిలికట్టు. ౨. అవిచ్ఛేదము, ఎడతెంపులేమి, ఎడతెగకుండుట ౩. గ్రంథము యొక్క రచన. ౪. కావ్యము.

ప్రబ(వ)ర్హము. సం.విశ. (అ.ఆ.అ.) శ్రేష్ఠము, ముఖ్యము.

ప్రబద్ధము. సం. విశ. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి కట్టఁబడినది, బధింపఁబడినది. ౨. ప్రతిబద్ధము, అడ్డగింపఁబడినది.

ప్రబల. సం. వి. ఆ. స్త్రీ. ప్రసారిణి, గొంతెపు గోరు. వై.

ప్రబలంచేయు. మి. స. క్రి. దీపింపఁజేయు.

క. నరుఁడు గని ధన్వరంబుగ, వరశాస్త్రం చేయుటయును ఘని కన్నులనకాని

మాపెదయట్లుగఁ, బరగిన గురుసుతుఁడు

పెద్ద ప్రబలంచేసెన్.

వ. ఇవ్విధంబున సత్వస్థాను యత్నహస్త్రంబు

దీపింపంజేసిన ...

భార. ద్రో. ౫. ౩౦౫. ౩౦౬.

ప్రబలము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ మిక్కిలి బలముగలది. ౨. మిక్కుటమైనది, ఉత్కటము. ౩. గొప్పది. ౪. ముఖ్యము. వి. అ. పుం. పల్లవము, చిగురు.

ప్రబలు. అ. క్రి. ౧. పెరుఁగు, వర్ధిల్లు.

గీ. గగన మెుక్కండ చిక్కంగఁ గ్రాఁగిపోవ,

నంధకారంబు నీరంధ్ర మగుచుఁ బ్రబలె

కాశీ. ౫. ౭.

సీ. పైఁటచా టొయ్యఁగక ప్రబలు ద్రావిడవధూ

కుచకుంభంబులు చూచి కొంకె నేమొ.

దశా. ౧ ౧౧౫.

౨. (సంతోషాదులచే) అతిశయిల్లు, ఉప్పొంగు.

గీ. వ్రాయ నేర్చినవాఁడె సద్వర్ణసమితి, వర్ణి

వర్ణులు ప్రబల వ్రాయంగ నేర్చు.

విక్ర ౧. ౪౭.

సీ. చక్రవిద్వేషణాశ్రయగానికోపించి పతిప్రతా

పము మెచ్చి ప్రబలుసంజ్ఞ.

ఉ. రా. ౧. ౩౦.

౩. వర్తిల్లు, ఉండు.

సీ. కాలకూటానలగర్వంబు సర్వంబు ప్రచ్ఛన్న

తనులీలఁ బ్రబలె ననఁగ.

హరి. పూ. ౬. ౭౮. (వర్ధిల్లు శ. ర.)

సీ. కర్ణాటకీర్తి లోకవిఖ్యాత మగుచుఁ,

బ్రబలుఁ గా కని దీవించి ...

వై. భా. ౨. ౯౯. (అతిశయిల్లు శ. ర.)

ప్రబల్హిక. సం. వి. ఆ. స్త్రీ. = ప్రవల్హిక. ప్రహేళిక, గూఢముగానుంచఁబడిన యర్థము గల కావ్యవిశేషము.

ప్రబాధకము. సం.విణ (అ.ఆ.అ.) ౧. మిక్కిలి బాధించునది. ౨. మిక్కిలి యొత్తలిగించునది. ౩. నిరాకరించునది

ప్రబాలము. సం వి. అ పుం న. = ప్రవాలము. ౧. చిగురు, కిసలయము, నవపల్లవము. ౨. వీణాదండము, ఒళగు. ౩. పగడము. (శ. ర.)

ప్రబాళఫలము. సం. వి. అ. న = ప్రవాళఫలము ఎఱ్ఱచందనపు మ్రాను.

ప్రబాళాశ్మంతకము. సం. వి. అ. పుం = ప్రవాళాశ్మంతకము, ఎఱ్ఱ అశ్మంతకవృక్షము.

ప్రబాహుకము. సం. అవ్య. ౧. మీఁద, ఊర్ధ్వ భాగమున. ౨. సమకాలమందు, ఒకప్పుడే. (దీనికిఁ దెనుఁగునఁ బ్రయోగములేదు.)

ప్రబుద్ధము. సం విణ. (అ.ఆ.అ.) ౧. ప్రఫుల్లము, వికసించినది. (పుష్పాది) ౨. జాగరితము, మేలు కొన్నది. ౩. ప్రబోధముకలది, జ్ఞానముకలది. ౪. కార్యము చేయుటకుఁగాని, ఫలించుటకుఁ గాని కదలినది.

ప్రబుద్ధుఁడు. సం. విణ. (అ.ఆ.అ.) పండితుఁడు. (శ. ర.)

ప్రబోధకుఁడు. సం. వి. అ. పుం. రాజులను మేలుకొలుపువాఁడు, వైతాళికుఁడు.

ప్రబోధనము. సం.వి.అ.న. ౧. మేలుకొలుపుట. ౨. మేలుకొనుట. ౩. (మూర్ఛాదులనుండి) తెలివినొందుట. ౪. యథార్థజ్ఞానము. ౫. చక్కఁగాబోధించుట. ౬. ఉద్దీపనము, రేఁపుట. ౭. పూర్వముండుకొన్న చందనాదులకు పరిమళము పోఁగా పరిమళమునకై మరలఁబూసి కొనుట, అనుబోధము.

ప్రబోధ(ధి)ని. సం. వి. ఈ. స్త్రీ. కార్తిక శుద్ధ ఏకాదశి. (ఈదినమందు విష్ణువు చాతుర్మాస్యక నిద్రనుండి మేలుకొనును.)

మర్గ. ౫. ఒక యేరుని పట్టణము. ౬. ఒక అప్సరస. ౭. సూర్యపత్ని భేదము. ౮. గోపికభేదము.

ప్రభంజనము. సం. వి. అ. న. చక్కఁగా విఱుచుట. - పుం. వాయువు. విఱ (అ. అ. అ.) చక్కఁగా విఱుచునది.

ప్రభద్ర. సం. వి. అ. స్త్రీ. ప్రసారణీలత, గొంతెమగోరు. ళ

ప్రభద్రకము. సం. వి. అ. న. పంచదశాక్షర పాదకమగు ఛందోభేదము. పదునేనక్షరముల పాదముగల యొకానొక వృత్తము

ప్రభద్రము. సం. వి. అ. పుం. వింబము, వేము. ళ.

ప్రభవ. సం. వి. అ. పుం. ఒకానొక సంవత్సరము.

ప్రభవము. సం. వి. అ. పుం. ౧. నదీమూలము. ౨. పుట్టుక, జన్మము. ౩. కారణము. ౪. ప్రభావము, పరాక్రమము.

ప్రభవించు. సం. అ. క్రి. జనించు, పుట్టు.

క. రాగిత్వము విడువదు నిను, రాగవిదూరుఁ డగునుతుఁడు ప్రభవించును నీకు ...

భార. శాం. ౬. ౫౭౯.

సీ. పరులదోషంబునఁ బ్రభవించుఁ గ్రోధ మజ్ఞానతమోరయంబు క్రేశేని పొలియు

భార. శాం. ౩. ౪౨౧.

వ. . అతనికిఁ గుంభి యతనికిఁ బ్రలోభుఁ డును బ్రభవించిరి .. (మార్క. ౧. ౩౧)

స. క్రి. పుట్టించు.

చ. అతులతపంబునన్ వరుణుఁ డమ్మనిచే బహు పుణ్యకర్మము, క్షితిఁ బ్రభవింపఁగాఁబడిన దివ్య మునీంద్రుఁడు ...

భార. ఆది. ౪. ౧౫౬.

ప్రభవిల్లు. సం. అ. క్రి. కలుగు.

సీ. ప్రభవిల్లుఁ బద్మసౌభాగ్య కేలిరేఖోచి తమహిమాభిఖ్యా క్రిఁ దెల్పొందినభూత.

శం. రా. ౧. ౪.

ప్రభవిష్ణువు. సం. విణ. (ఉ) ౧. ప్రభావ శీలుఁడు. ౨. ఉత్కృష్టుఁడు, మేటి. వి. ఉ. పుం. ప్రభువు.

ప్రభాంజనము. సం. వి. అ. పుం. మునగ, శోభాంజనము. ళ. (త్రి. ని)

ప్రభాకరము. సం. వి. అ. పుం. ౧. జిల్లేడు. ళ. ౨. కుశద్వీపమందలి వర్షభేదము.

ప్రభాకరుఁడు. సం. వి. అ. పుం. ౧. సూర్యుఁడు. ౨. చంద్రుఁడు. ౩. అగ్ని. ౪. శివుఁడు. ౫. సముద్రుఁడు. ౬. ఒక మీమాంసకుఁడు. ౭. ఎనిమిదవ మన్వంతరమందలి దేవగణభేదము.

ప్రభాకీటము. సం. వి. అ. పుం. మిణుఁగుఱుఁ బురుగు.

ప్రభాగము. సం. వి. అ. పుం. ౧. విభజించుట, పంచుట ౨. (గణిత) భిన్నముయొక్క భిన్నము.

ప్రభాతము. సం. వి. అ. న. తెల్లవాఱుటకు ముందు నాలుగుగడియలకాలము, వేకువ

ప్రభానము. సం. వి. అ. న. దీప్తి, కాంతి.

ప్రభావము. సం. వి. అ. పుం. ౧. కోశదండము వలనఁ గలుగుతేజస్సు. ౨. సామర్థ్యము, శక్తి. ౩. విక్రమము, మగఁటిమి. ౪. కాంతి. ౫. ఉద్భవము, పుట్టుక. ౬. మాహాత్మ్యము. (శ. ర.)

ప్రభాసంతుఁడు. సం. వి. అ. పుం. పరమేశ్వరుఁడు, రుద్రుఁడు.

ప్రభాసము. సం. వి. అ. పుం. మిక్కిలికాంతి, పుం., న. ద్వారకాసమీపమందలి యొక తీర్థభేదము.

ప్రభిన్నకరటము. సం. విశే. (అ. ఆ. అ.) మదముచే విరిసిన చెక్కులుగలది, (అనఁగా) మదము పట్టినది. (ఏనుఁగు.)

ప్రభిన్నము. సం. విశే. (అ. ఆ. అ) ౧. మిక్కిలి భేదింపఁబడినది, చీల్పఁబడినది. ౨. వేఱుపఱుపఁబడినది. ౩. మదముపట్టినది. (ఏనుఁగు.)

ప్రభువు. సం. విశే. (ఉ) ౧. స్వామి, ఏలిక. ౨. సమర్థుఁడు.

ప్రభూతము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. సంభూతము, పుట్టినది. ౨. ప్రచురము, అధికము. ౩. ఉన్నతము, ఎత్తైనది. ౪. దీర్ఘము, నిడుద.

ప్రభూతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రభవము, పుట్టుక. ౨. మూలము, ఉత్పత్తిస్థానము

ప్రభృతి. సం. వి ఇ స్త్రీ. మొదలు.
ఉదా : మునిప్రభృతిజనంబులు.

ప్రభేదము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలి భేదించుట, చీల్చుట, మిక్కిలిచీలిక. ౨. విభజించుట, వేఱుపఱుచుట. ౩. ఏనుఁగుచెక్కిలి నుండి మదము కాఱుట ౪. తినుట, మాచిరి, భేదము. ౫. ప్రకారము, విశేషము

ప్రభ్రంశథువు. సం. వి ఉ. పుం. నాసికారోగభేదము

ప్రభ్రష్టకము. సం. వి. అ న. సిగమ్రేలెడు దండ.

ప్రమ. సం. వి. ఆ. స్త్రీ. ౧. (న్యాయ.) యథార్థజ్ఞానము. (స్మృతి - భ్రమము.) ౨. కొలఁత.

ప్రమతము. సం విశే.(అ.ఆ.అ.) ౧. చక్కఁగాఁ దలఁచఁబడినది. ౨. మంచిబుద్ధిగలది, మంచి ఆలోచనముగలది.

ప్రమత్తగీతము. సం. విశే. (అ. ఆ. అ.) అజాగ్రత్తతో పాడఁబడినది, ఏమఱుపాటుతోఁ బాడఁబడినది.

ప్రమత్తుఁడు. సం. విశే. (అ.ఆ.అ.) ౧. మిక్కిలి మత్తుగొన్నవాఁడు. ౨. ఉన్మత్తుఁడు, వెఱ్ఱివాఁడు. ౩. అనవహితుఁడు, ఏమఱుపాటుగలవాఁడు. ౪. తప్పినవాఁడు, ఉల్లంఘించినవాఁడు. ౫. లంపటుఁడు, కాముకుఁడు. ౬. ప్రమాదపడినవాఁడు.

ప్రమథ. సం. వి. ఆ. స్త్రీ. హరీతకి, కరక్కాయ. ౭. (శ. వి.)

ప్రమథనము. సం. వి. అ. న. ౧. క్లేశము, మిక్కిలి కలఁతపెట్టుట, దుఃఖపెట్టుట. ౨. చంపుట ౩. చిలుకుట, కలఁచఁబెట్టుట, విలోడనము, కలఁచుట

ప్రమథము. సం. వి. అ. పుం. ౧. గుఱ్ఱము ౨. ప్రమథగణము

ప్రమథాధిపుఁడు. సం. వి. అ. పుం. శివుఁడు. ఇట్లే ప్రమథనాథుఁడు.

ప్రమథి. సం. విశే. (స. నీ. స) చంపునది.

ప్రమథితము. సం.విశే.(అ.ఆ అ) ౧. చక్కఁగా మథింపఁబడినది, చిలుకఁబడినది. ౨. క్లేశపెట్టఁబడినది. ౩. అణఁగఁద్రొక్కఁబడినది. ౪. చంపఁబడినది. - వి. అ. న. నీళ్లుపోయక చిలికిన మజ్జిగ

ప్రమద. సం. వి. ఆ. స్త్రీ. ౧. యౌవనాదిమదముగలయాఁడుది, ఆఁడుది. ౨. ఏకాదశాక్షరపాదకమగు వృత్తభేదము, పాదమునకు పదునొకండక్షరములుగల యొకానొకవృత్తము.

ప్రమదకుఁడు. సం. వి. అ. పుం. పరలోకము లేదనెడు నాస్తికుఁడు. (వీఁడు నాస్తికులలో నొకతెగవాఁడు.)

**ప్రయజ్యావు.** సం. ఉ. పుం. అధ్వర్యుఁడు. (వాచ.)

**ప్రయతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. సంయతుఁడు, ఆత్మనిగ్రహముగలవాఁడు, జితేంద్రియుఁడు, పరిశుద్ధుఁడు, పవిత్రుఁడు. ౨. ప్రయత్నముగలవాఁడు, పట్టుగలవాఁడు. ౩. సంస్కృతుఁడు. (శ. ర.)

**ప్రయత్నము.** సం. వి. అ. పుం. ౧. విడువని పూనిక, మిక్కిలియత్నము. ౨. పూనిక, యత్నము. ౩. (వ్యాక.) బాహ్యప్రయత్నములలో నొకటి, ఉచ్చారణవ్యాపారవిశేషము. ౪. (న్యాయ.) జీవనవృత్తిప్రయత్నము, గుణవిశేషము. (ప్రవృత్తిశ్చ నివృత్తిశ్చ తథా జీవనకారణమ్, ఏవం ప్రయత్నత్రైవిధ్యం తాంత్రికైః పరిదర్శితమ్.) (కారికావళి.)

**ప్రయత్నశైథిల్యము.** సం. వి. అ. న. యోగాంగమగు ఆసనమును సిద్ధింపఁజేయు ప్రయత్నవిశేషము. (ఇందు స్వాభావికప్రయత్నము యొక్క ఉపరమ ముండును.)

**ప్రయత్నించు.** సం. అ. క్రి. మిక్కిలి యత్నించు.

**ప్రయస్తము.** సం. విణ. అ. చేయి, నూనెలోనగు వానిచేత పాకాకింపఁబడినది. (వ్యంజనము.)

**ప్రయాగభవయుఁడు.** సం. వి. అ. పుం. గొప్పయాగములు చేయువారు తవస్థానము సాక్షి మింతుకొనాయని భయముకలవాఁడు, ఇంద్రుఁడు.

**ప్రయాగము.** సం. వి. అ. పుం., న. ౧. యజ్ఞము. ౨. గుఱ్ఱము. ౩. తీర్థవిశేషము. (కాయర్థమున తఱ్ఱాదులలోనిది.)

ఉ. ... ప్రయాగఁజేసిన, ప్రజాపతియజ్ఞము ...

కాశ. అశి. ౨. ౨౫౧.

సీ. వైకుంఠమునసుండి వచ్చి వైకుంఠుండు తోసహాయుఁడై తీర్థమాడు ... గీ. పూని కాశరక్షుఁడైనయప్పుడు ప్రయాగ.

కాశీ. ౩. ౯౨

౫. ధాన్యవిశేషము.

సీ. అర్థిఁ బ్రయాగంబు లార్జింప నార్జింపఁగానోప మెట్లు గంగాజలంబులు.

కవిజ. ౧. ౧౩.

**ప్రయాగుఁడు.** సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

**ప్రయాజము.** సం. వి. అ. పుం. దర్శపూర్ణమాసాదులకు అంగమైన యాగభేదము.

**ప్రయాణము.** సం. వి. అ. న. ౧. పయనము, ప్రస్థానము. ౨. (శత్రువు) దండెత్తివచ్చుట, దాడి. ౩. ఏనుఁగుల నేత్రపూర్వప్రదేశము. (శ. ర.)

**ప్రయాణించు.** సం. అ. క్రి. ప్రయాణముచేయు.

క. అంచలతెత్తల వడి జంకించుచు బంగారు పల్లకి రెక్కి ప్రయాణించు నెడం గాంతలకు (వై. భా. ౮ ౨౫౭.)

**ప్రయాతము.** సం. విణ. (అ. ఆ. అ.) ప్రయాణమై పోయినది. - వి. అ. పుం. ౧. కొండచఱియం దున్నతప్రదేశము. ౨. సౌప్తికము, రాత్రియుద్ధము.

**ప్రయామము.** సం. వి. అ. పుం. ౧. సంయమము, నిగ్రహించుట. ౨. నిడివి. ౩. మిక్కిలి వెలలు హెచ్చుటవలన ధాన్యాదులందు కలుగు యాదరాతిశయము. (శ. ర.) ౪. [క్రమమునకు నియ్యఁదగినది (అని కొందఱు) హెచ్చుచున్న వెలలను కొలఁదిపెట్టుట, మూల్యావధిక్క పరిచ్ఛేదనము. (వాచ.)] ౫. అందువలన లోపములేని వ్యాపారమున ధాన్యాదుల వెలలు ప్రసిద్ధపఱచుట. (శ. ర.)

**ప్రలంబనము.** సం. వి. అ. న. మిక్కిలి ప్రేలాడుట.

**ప్రలంబము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి ప్రేలాడునది. - వి. అ. పుం. ౧. ప్రేలాడుట ౨. రెమ్మ, ఉపశాఖ. ౩. మెడకుఁజుట్టినపూదండ. ౪. పొరబిరేకము. ౫. స్తనము. ౬. తగరము. ౭. గుమ్మడిపాదు. ౮. లతాంకురము. ౯. గాథ. ౧౦. దోస.

**ప్రలంబితము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రేలాడునది, ప్రేలాడఁగట్టఁబడినది.

**ప్రలంబుఁడు.** సం. వి. అ. పుం. బలరామునిచేఁ జంపఁబడిన యొక రాక్షసుఁడు

**ప్రలంభనము.** సం. వి. అ. న. ఏమఱించుట, మోసపుచ్చుట, వంచనము.

**ప్రలంభము.** సం. వి. అ. పుం. ౧. మిక్కిలి లాభము పొందుట, పడయుట, ప్రాప్తి ౨. ఏమఱించుట, వంచించుట

**ప్రలపనము.** సం. వి. అ. న. ౧. మాటలాడుట, సంభాషణము ౨. ప్రలాపము, వదరుట. ౩. అనర్థక వాక్యము, అర్థములేనిమాట. ౪. ఏడ్పు, రోదనము, పరియేడ్పుట

**ప్రలబ్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) వంచితము

**ప్రలయము.** సం. వి. అ. పుం. ౧. నాశము ౨. కల్పాంతము. ౩. మృత్యువు ౪. మూర్ఛ. ౫. (అలంకార.) ఒక వ్యభిచారి భావము.

శ్లో. ప్రలయః సుఖదుఃఖాద్యై శ్చేష్టాజ్ఞాననిరాకృతిః (సా. ద.) ౬. అస్పందనస్థితి, కదలకుండుట. ౭. శ్లేషము, (కే. ని.)

**ప్రలవము.** సం. వి. అ. పుం. ౧. లేశము ౨. ఖండభేదము. ౩. మిక్కిలి ఛేదించుట. ౪. ఆకుపైఁ గొప్పయున్న కొక్కెము.

**ప్రలాపము.** సం. వి. అ. పుం. ౧. సంభాషణము, మాటాడుట. ౨. (పిచ్చివాఁడు లోనగువారి,) అర్థశూన్యమైన మాట, పలవరము. ౩. ఏడ్పు.

**ప్రలాపహము.** సం. వి. హ. పుం. ఒక దినుసు కాటుక.

**ప్రలాపి.** సం. విశే. (హ. నీ. హ.) ౧. మాటాడునది. ౨. వదరునది.

**ప్రలాపించు.** సం. అ. క్రి. ౧. అనర్థకమ్ములైన మాటలాడు. (శ. ర.) ౨. (దుఃఖములో) కేకలు వేయు.

వ. అయ్యయ్యో శ్రీరామభద్రుని యర్ధాంగలక్ష్మి చేఁటిలో మాస్వామి నెడఁబాసి పోయితే యని బిట్టుగాఁ బ్రలాపించువారును (ఉ. రా. ౭. ౫౪.)

**ప్రలీనము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రళయము నొందినది. ౨. మిక్కిలి లీనమైనది ౩. చేష్టశూన్యము, మూర్ఛనొందినది

**ప్రలేపము.** సం. వి. అ. పుం. వ్రణాదులకుఁ బూయు పూఁత మొదలగుమందు దినుసు.

**ప్రలోభనము.** సం. వి. అ. న. మృగములను పట్టుటకు పెట్టుమచ్చు. ( )

**ప్రలోభము.** సం. వి. అ. పుం. మిక్కిలి లోభము, పేరాస.

**ప్రలోభించు.** సం. స. క్రి. మోసగించు, వంచించు.

వ. ఒక్కముఖంబునఁ బురస్త్రీజనంబులఁ బ్రలోభింపను సంకేతంబు చేసి వేఱువేఱు మార్గంబులం గాశికానగరంబుఁ బ్రవేశించి.

కాశీ. ౬. ౬౩.

**ప్రలోభ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి మోహింపఁదగినది, ఆకర్షించునది.

ప్రల్ల. (సం. ప్రలాపః) అర్థములేనిమాట.

ద్వి. ప్రేల్లువారుచు నీకుఁ గేకరింపుచును, ప్రల్లఁ బల్కుచు నెదపాటఁ బాడుచును.

పండితా. పురా. ౧౦౧ పు.

ప్రల్లఁదనము. వి (ప్రల్ల + తనము; ప్రల్లద + తనము = ప్రల్లదము అని శ. ర.) ౧. వదరుఁబోతుఁదనము, వాచాలత్వము.

ఉ. ప్రల్లఁదనంబుచే నెఱుకపా టొకయింతయు లేక యిచ్చటన్, బల్లిదుఁడైనసత్ప్రభు నబద్ధము లాడినఁ ద్రుంగి పోదురు ...

భా. శ. ౨౯.

ఉ. ప్రల్లదనంబుచే నసదు పల్కిన బోదుల నెంపువోవునే ..(అచ్చ.భా ర. ౨౩. పు.)

౨. పొగరుఁబోతుఁదనము.

ప్రల్లదకాఁడు. విణ (ప్రల్లదము + కాఁడు) ప్రల్లదుఁడు.

చ. .జాదకాంద్ర కడఁ బ్రల్లదకాఁడ్రైద చేతికాను లదిపోకడవెట్టుచు నే మదంబు నన్.

(భల్లా. 3. ఆ. చి. ని.)

ప్రల్లదము. వి ౧. పారుష్యము, పరుసఁదనము

గీ. వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు, ప్రల్లదంబును .. యనెడుస ప్తవ్యసనములఁ జనదు తగుల. (భార. ఉద్యో. ౨. ౪౪.)

౨. అప్రియవచనము, పరుషవచనము, దుర్భాషణము.

ఉ. ప్రల్లద మేది యిట్లు శిశుపాలుఁడు వజ్రపాతాద్రికుల్యుఁడై, ప్రేల్లుడు వాని దైన పృథుదేహ మువెల్వడి తేజ మంబరం, బెల్ల వెలుంగి ... (భార. సభా. ౨. ౨౯.)

సీ. ఓయి విశ్వామిత్ర యూహింప కేరితిఁ బ్రల్లదంబులు పల్కఁ బాడి యగునె.

హరిశ్చ. ౧. ౧౪౨.

వ. ఇవ్విధంబునం బ్రల్లదంబు లాడెదరుగాన మిమ్ము బాలుకలు గోయక నెలవులు ప్రేల్పక ప్రాణంబులు గొనక యిట్లు పైరింప వచ్చి (సైమ. ౩. ౬౨.)

క. కోపించి వారు దుర్వ్యాద్యాపాండిత్యమునఁ బ్రల్లదము లాడుదురే ...

వరాహ. ౩. ౧౫.

క. గురుఁ దల్లి దండ్రిని సోదరుని వకారణము ప్రల్లదముఁ బల్కినమ్మ్యకుచేత .

విజా. ౨. ౪౩.

3. దుష్కార్యము, చెడ్డపని.

ఆ. ... ఇట్టికడిమి నమ్మియే ప్రల్లదంబులు, సేయఁదొడఁగి తనుచు ..

భార. అర. ౬. ౨౪౫.

గీ. వీటఁ దమ కెవ్వ రెదు రని వెఱపులేక చెల్లుబడిఁ బ్రల్లదంబులు సేయఁదొడఁగి, రథపురెంకలు (హార. ౫. ౭.)

౪ ధార్త్యము, దార్ప్యము, పొగరుఁబోతుఁదనము.

గీ. కోపమున హలధరుఁ డొక గుండు వైవ, దానిఁ దప్పించుకొని ప్రల్లదమున నతని.

క. నగి యానవకలకముఁ గొని, జగతీరుహశాఖ యెక్కి చాపలమున వ్రజ్జగతిపయి వైచె ... (భాగ. ౧౦. ఉ. ౫౪౪.)

శ్లో. స వంచయిత్వా గ్రావాణం మదిరాకలశం కపిః, గృహీత్వా హేలయామాస ధూర్తస్తం కోపయన్ హసన్.

సం. భాగ. ౧౦. ౬౭. ౧౪.

వ. పవరనిపాపలం దదవితదవి . కొనిపోవచ్చినఁ బయిపడి విడువఁజాలక పెనంగు తల్లులఁ బ్రల్లదంబునం ద్రెళ్లం ద్రోచి తిట్టుచు. (ఉ. హరి. ౧. ౫౩.)

సీ. అప్పాటఁ దాలుమేన నతిగర్వులై ప్రల్ల దమ్మునఁ జెక్కుచ్ర దప్పఁ జేక, తిట్టియు

భార. అను. ౫. ౧౦౪.

మత్తకోకిల. ప్రల్లదంబున పేల్పు అద్ధతిఁ జాతి రాజనివాసము, గొల్లపెట్టి సమస్తవిత్తముఁ గ్రూరతం గొనిపోవఁగా.

భాగ. ౩ ౨౨౫ (దుష్కృత్యము శ. ర.)

౫. వ్యర్థభాషణము.

క. పల్లవులు రజ్జులనం, బ్రల్లదము లనంగ వ్యర్థభాషణములకున్, బే ళ్లై వర్తిలు.

ఆం. శ ౪౩.

విశే. గర్వముతోఁ గూడినది.

ఉ వింటికి వానిప్రల్లదపు వెంగలికూఁతలు

శకా౦ ౪ ౧౭౮.

ప్రల్లదీఁడు = ప్రల్లదుఁడు. విశే (ప్రల్లదము+ ఈఁడు.) దుష్టుఁడు, దుండగీఁడు

సీ చక్కనిమానంబు చిక్కఁబట్టెద నన్నఁ బంచబాణుఁడు గదుఁ బ్రల్లదీఁడు

విక్ర ౧. ౧౨౯ (చిక్కనిమానంబు. శ. ర.)

ప్రల్లదుఁడు = ప్రల్లదీఁడు. విశే. ౧. దుష్టుఁడు, దుర్మార్గుఁడు.

ఉ. ప్రల్లదుఁడైన యొక్కపులపాంసను చేసిన దానఁ దక్కులందెల్లను దూషితం బగుట.

భార. ఆది. ౧. ౧౨౫.

క. కావున నాప్రల్లదులగు,భూవరులజయించి...

మార్క. ౭. ౧౭౯.

గీ. . ప్రల్లదులచేత వంశవాపకులచేత . కల్లరులచేతఁ దర్పించుఁ గలియుగంబు.

హై. బా ౭. ౨౧౨.

౨. పొగరుఁబోతు, గ్రొవ్వినవాఁడు.

ద్వి. ప్రల్లదుఁ డొకచాకి ధర్తుండ ననుచు.

బస. పు. ౪. ౧౦౧. పా.

ఉ. బల్లదుఁడైనవానరుఁడు బాహుబలంబునఁ బట్టి యుద్ధతిఁ బ్రల్లదుఁడైన రక్కసుని ...

భా. రా. యు. ౧౧౯౭

౩. దుండగీఁడు, అగడములుచేయువాఁడు.

ద్వి. తల్లి లేకుండినతనయుఁడు గానఁ, బ్రల్లదుఁడై యున్నిపాట్లకు వచ్చె.

బస. పు. ౩. ౬౪. పా.

ప్రల్లదురాలు. విశే. (ప్రల్లద + ఆలు.) దుష్టురాలు.

క. . కోపమునను రక్కసియుఁ గరము ప్రల్లదురాలై (దుర్భాషలాడునది అనిభావము

నిర్వ ౫. ౧౨౧

ప్రవక్త. సం వి బు పుం. ౧. చక్కఁగా చెప్పువాఁడు, చక్కఁగా మాటాడువాఁడు ౨ వేదాదులఅర్థము నుపదేశించువాఁడు.

ప్రవచనము సం వి అ న ౧ చక్కఁగా మాటలాడుట, తెప్పగాచెప్పుట, చాటుట, వెల్లడించుట. ౨. అర్థానుసంధానముతో వచించుట, అర్థముచెప్పి వివరించుట. వేదాదిశాస్త్రము ౪. మాట, వచనము. ౫ బౌద్ధుల ముఖ్యసిద్ధాంతము.

ప్రవచనీయుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రవక్తవ్యుఁడు, చక్కఁగావివరింపఁదగినవాఁడు ౨. ప్రవక్త. (శ ని)

ప్రవణము. సం. విశే. (అ. ఆ. అ) ౧ క్రిందికి ఏటవాలైనది, వాటముపల్లము ౨ వడిదుడుకైనది, జాలుపైనది ౩ ప్రహ్వము, వంగినది, వంకరైనది. ౪. ఆసక్తము, తగులుగలది ౫. స్నిగ్ధము, నెయ్యముగలది ౬. నమ్రము, అడఁకువగలది ౭. క్షీణము, తఱిఁగినది. ౮. సమర్థము - వి అ పుం, న. ౧. నాలుగుదారులు కలియుచోటు, చతుష్పథము. ౨ ఉదరము, కడుపు.

**ప్రవత్స్యత్.** సం. (శతృ.) ప్రవాసముసేయనున్న, పరదేశమునకుఁబోవనున్న.

**ప్రవత్స్యత్పతిక.** సం. వి. ఆ. స్త్రీ. మగఁడు పరదేశమునకుఁబోవనున్న యాఁడుది.

**ప్రణయస్ను(యుఁడు.)** సం. విణ. (స్) ౧. మిక్కిలివయస్సుచెల్లినవాఁడు, వృద్ధుఁడు. ౨. పురాతనము, పురాణము.

**ప్రవరణము.** సం. వి. అ. న. ౧. పిలుపు ఆహ్వానము ౨. వర్షాకాలాంతమందు శ్రాద్ధులు చేయు ఉత్సవవిశేషము.

**ప్రవరము.** సం. విణ. (అ. ఆ. అ) శ్రేష్ఠము, మేటి. - వి. అ. పుం. ౧. పిలుపు, ఆహ్వానము ౨. అగ్న్యాధానముచేయునపుడు బ్రాహ్మణుఁ డగ్ని నిగుడించి చేయు స్తోత్రవిశేషము. ౩. సంతతి. ౪. గోత్రము. ౫. కప్పుడు, గవుసెన. ౬. ఉత్తరీయము, పైరవాసము. ౭. నల్లపెసరు స్త్రీ. ౧. సముద్రపుటుప్పు (కేవి). ౨. అగరుచందనము. స్త్రీ.

**ప్రవరవాహనులు.** సం. వి. అ. పుం. ద్వి. అశ్వినీదేవతలు.

**ప్రవర్గము.** సం. వి. అ. పుం. అగ్నిహోత్రము, హోమాగ్ని.

**ప్రవర్గ్యము.** సం. వి. అ. పుం. అగ్నిష్టోమాది యాగములం అంగభూతమైన యాగవిశేషము.

**ప్రవర్తకుఁడు.** సం. విణ. (అ. స్త్రీ. అ.) ప్రవర్తింపఁజేయువాఁడు, నడపువాఁడు.

**ప్రవర్తనము.** సం. వి. అ. న. ౧. ప్రవర్తిల్లుట. ౨. ప్రవర్తింపఁజేయుట, నడపుట.

**ప్రవర్తయిత.** సం. విణ. (ఋ. స్త్రీ. ఋ) ప్రవర్తింపఁజేయువాఁడు, నడపువాఁడు.

**ప్రవర్తించు.** సం. అ. క్రి. నడుచు.

క. .. రాజు ప్రవర్తించిన పోలికను గురుతల్ప గమన మూచితము మాకున్. సైవ. ౫. ౬౪.

స. క్రి ప్రవర్తిల్లఁజేయు, జరుపు, చేయు.

మ. విశ్రాంతి యస్మజ్జనంబున్ వివిధ ప్రమోదనముగా నమ్మెయిఁ బ్రవర్తించి సర్వ జగత్ఖ్యాతి నుల్లసిల్లుచు...

(హరి. పూ. ౬. ౧౫౩.)

వ. కపటకైతవం బెఱింగియుం బాపద్యూతంబుఁ బ్రవర్తించి యధర్మప్రవృత్తుండ వయితి గావున . (భార. సభా. ౨. ౨౨౩.)

వ. గీతవాద్యనృత్తంబులును నాదిగాఁగల వివిధ శుభాచారంబులం బ్రవర్తింప నియోగింప వలయు (భా. విరా ౩. ౨౩౬.)

**ప్రవర్తిల్లు.** సం. అ. క్రి. ౧. వర్తించు, జరుగు.

వ ప్రజానాశనకారణంబై ప్రవర్తిల్లిన యాడి బకయుద్ధంబు తెలియం గాంచెద

మార్క. ౨ ౨

౨. కడఁగు, ఉద్యమించు.

ఉ. లోకముల్ శుభసమేతములే యను రాధముల్ ప్రవర్తిల్లరుగా సమస్తజగతీపరి పీడ యొనర్పఁ గ్రమ్మఱన్.

హరి పూ. ౫ ౪.

౩. ఉండు.

వ. గృధ్రంబును జంబుకంబును ముదంబునం బొంగుచు బోయి తమతమ కులంబులలోఁ బ్రభూతంబులై ప్రవర్తిల్లె.

భార. శాం. ౩ ౩౮౧.

వ. . మదీయలోకంబున సుశ్లోకుండై నిత్య స్థితి నత్యుదాత్తపదవిం బ్రవర్తిల్లు పుణ్య తముం దగుటకుం దమవు దోఁలంగవలయు ననిరేడు. (భార. శాం. ౨. ౪౪౩.)

౪. కలుగు, పుట్టు.

వ. ఇవ్విధంబునం బ్రవర్తిల్లు జనవాదంబు గ్రమ
క్రమంబున సమస్తదేశంబుల నెరసి చెల్లు
చుండె. (భార. విరా. ౩. ౩౧.)

**ప్రవర్ధిలు(ల్లు).** సం. అ. క్రి. వృద్ధిపొందు.

వ. జలంబున నెసఁగు బుద్బుదంబునుబోలె
నొకయండం బుద్భవిల్లి క్రమంబునం బ్రవ
ర్ధిల్లి యుదకంబునం దుండ

మార్క. ౪. ౮.

**ప్రవర్షించు.** సం స. క్రి. కురియు.

శా. ... దేవేంద్రదిక్పాలకుల్, పాలస్ సంతస
మంది దివ్యసుమవర్షంబుల్ ప్రవర్షించి
రత్యేకస్ (భా. రా. ౨. ౮౧)

**ప్రవలు=ప్రబలు.** అ క్రి వృద్ధిబొందు, వర్ధిల్లు.

చ ప్రవలుచు మించు మించుముగరానిగరాలఁ
గరాళితం బగుస్, ధవళసరోజరాజమునఁ
. వెలయునించెరస్ గనిరొ ..

అచలా ౧. ౪౪.

**ప్రవహణము.** సం. వి. అ. న. కర్ణీరథము,
మూఁపున మోచికొనిపోవు పల్లకి మొదలగువాహ
నము, మట్టితోఁజేసిన బాలకాదుల క్రీడాశక
టము.

**ప్రవహము.** సం. వి. అ. పుం. ౧. ప్రవహిం
చుట, పాఱుట, ౨. వాయువు. ౩. మహా
వాయువు, సప్తవాయుస్కంధములలో నొకటి.
(ఇదియె గ్రహములకు సంచారము గావించును.)
౪. బహిర్గమనము, పత్తనమువదలిపోవుట.

**ప్రవహించు.** సం. అ క్రి పాఱు.

(భిల్లరాజపుత్రి వర్ణనము) గీ. ... కందుకక్రీడ
గావించు ఘర్మవారి, గరఁగి డిగజాఱ నవ
శైలకద్రవంబు, గిరులఁబ్రవహించు ధాతు
నిర్ఝరము లనఁగ. (వరాహ. ౨. ౧౧౪.)

**ప్రవల్హిక = ప్రబల్హిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧.
ప్రహేళిక, గూఢముగానుంచబడినఅర్థముగల
కావ్యవిశేషము.

**ప్రవాచకము.** సం. విశే. (అ. చిశా. అ) ౧.
వివరణముచేయునది, వ్యాఖ్యానము చేయునది.
౨. ప్రవక్త, మాటకారి.

**ప్రవాణము.** సం వి. అ. న. నేఁతవస్త్రమునకు
అంచుకట్టుట.

**ప్రవాణి.** సం. వి. ఈ. స్త్రీ. సాలెవాని సాధన
విశేషము, లాకి.

**ప్రవాతము.** సం విశే. (అ. ఆ. అ.) మిక్కిలి
గాలికి ఆస్పదమైనది. (దేశము మొ)

**ప్రవాదకుఁడు.** సం విశే. (అ. దిశా. అ.)
వాయించువాఁడు.

**ప్రవాదము.** సం వి. అ. పుం. ౧. పరస్పర
కథోపకథనము, ఒకరికొకరు ముచ్చటలాడుట.
౨. లోకవాదము, లోకమునందంతట వ్యాపిం
చినమాట, పరంపరగా వచ్చినమాట.

**ప్రవారణము.** సం. వి. అ. న. ౧ ముందుగా
వరించుట. ౨. నిషేధము ౩ కామ్యదానము.

**ప్రవార(క)ము.** సం. వి. అ పుం. గవుసెన,
ముసుఁగు.

**ప్రవాళఫలము.** సం. వి. అ. న = ప్రబాళ
ఫలము, ఎఱ్ఱచందనపుమ్రాను.

**ప్రవాళము.** సం. వి అ పుం., న. = ప్రబాలనము.
౧. పగడము, ౨. వీణాదండము, ఒకగు. ౩.
చిగురు.

**ప్రవాళాశ్మంతకము.** సం. వి. అ. పుం =
ప్రబాళాశ్మంతకము, ఎఱ్ఱ అశ్మంతకవృక్షము.

**ప్రవాసనము.** సం. వి. అ. న. ౧. పరదేశ
వాసము. ౨. పరదేశమునకు వెడలఁగొట్టుట.
౩. చంపుట, వధము.

ప్రవాసము. సం. వి. అ. పుం. పరదేశవాసము.

ప్రవాసి. సం. విణ. (న్. నీ. న్.) పరదేశయాత్ర చేయువాఁడు, యాత్రికుఁడు.

ప్రవాసితుఁడు. సం. విణ (అ. ఆ. అ.) ఊరు వెడలనంపఁబడినవాఁడు, దేశాంతరమునకు వెడలఁగొట్టఁబడినవాఁడు

ప్రవాహికుఁడు. సం విణ.అ. మిక్కిలి వహించువాఁడు. - వి. అ. పుం. రాతసుఁడు.

ప్రవాహనము. సం వి. అ న. ౧. తఱుమఁగొట్టుట. ౨ విరేచనము.

ప్రవాహము. సం. వి. అ పుం ౧ వెల్లువ, ప్రోతస్సు ౨. (దేశకాలములందు) ఎడతెగకుండుట, సంతతి, పరంపర. ౩. ప్రవృత్తి. ౪. వ్యవహారము. ౫ ఉత్తమాశ్వము.

ప్రవాహి. సం. విణ. (న్. నీ న్.) ౧. మిక్కిలి వహించుకొనిపోవునది. ౨. తోలఁగఁబుచ్చునది, తఱుమఁగొట్టునది ౩. ప్రవహించునది, పాఱునది. - వి. ఈ. స్త్రీ. ఇసుక

ప్రవాహిక. సం. వి. ఆ. స్త్రీ. అతిసారరోగము.

ప్రవిదారణము. సం. వి అ. న ౧. అవదారణము, మిక్కిలిచీల్చుట. ౨. యుద్ధము. ౩. గత్తర, అల్లరి - విణ. (అ. ఆ. అ) ౧. అకీర్ణము, చెదరినది. ౨. చీల్చునది (శ_ర)

ప్రవిద్ధము. సం. విణ. (అ. ఆ అ.) త్రోసిపుచ్చఁబడినది, పాఱవైవఁబడినది.

ప్రవిభాసిలు. సం అ. క్రి. ప్రకాశించు.

మ. . .కర్మంబె యత్యధికంబై ప్రవిభాసిలు న్నరభిమల్లా నీతివాచస్పతీ.

మల్లభూ. నీతి. ౯౧.

ప్రవిలయము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలి లయము, మిక్కిలిలీనమగుట. ౨. పూర్ణనాశము.

ప్రవివరము. సం. వి. అ. పుం. కీతకాష్ఠము. ?.

ప్రవివ. సం. వి. ఆ. స్త్రీ. అతివస. ?. (వాచ.)

ప్రవిష్టుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ప్రవేశించినవాఁడు, చొచ్చినవాఁడు.

ప్రవిస్తరించు. సం. స. క్రి. విస్తరిల్లఁజేయు, ధిరిబిచేయు.

తే గీ విద్య చోద్యంబు గాఁగఁ బ్రవిస్తరించి, పదఁకు లొనరించి రప్పుడు భరతభవితి.

కవిరా. ౧. ౧౯౨

ప్రవీక్షించు. సం. స. క్రి. చూచు.

శా. ఆగూఢోరగ వైరయైన శతపత్రాక్షుం బ్రవీక్షించి (ఉ హరి. ఉ. ౧౭౩.)

ప్రవీణుఁడు. సం. విణ. (అ. ఆ అ) కుశలుఁడు, నిపుణుఁడు.

ప్రవీరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఉత్తముఁడు, శ్రేష్ఠుఁడు ౨. మిక్కిలి శూరుఁడు. ౩. మంచిభటుఁడు.

ప్రవృంజనీయము. సం వి అ పుం. ౧. ప్రవర్గ్యము. ౨. మహావీరము.

ప్రవృత్తకము. సం వి అ న ౧ రంగమును ప్రవేశించుట ౨ వైతాలీయ ప్రవరణీయమగు మాత్రావృత్తభేదము

ప్రవృత్తము. సం విణ (అ ఆ అ) ౧. ఆరంభింపఁబడినది. ౨. వర్తించినది, ప్రవృత్తిగలది ౩. కూర్చిపోవునది. ౪ గుండ్రనిది, వృత్తము, వర్తులము. - వి. అ పుం. వర్తులాభరణము, గుండ్రనిసొమ్ము. (ఖవిర) - వ ప్రవృత్తి.

ప్రవృత్తి. సం. వి ఇ స్త్రీ. ౧. ప్రవాహము, నిరంతరప్రసరణము ౨ పొడసూపుట (ఉదా. కనుమప్రవృత్తిసమయము.) ౩ వర్తనము. ౪.

వృత్తి, జీవిక, బ్రతుకుఁదెరువు. ౫. ఐహిక కర్మములందు ముఖ్యముగా వర్తించుట (వ్యాత్తి నివృత్తి.) ౬. వార్త, వృత్తాంతము. ౭ ఇంద్రియములు స్వస్వవిషయములందు సంచరించుట. ౮. ఏనుఁగుమదము. ౯. అవంత్యాదిదేశము (మే ని.) ౧౦. (న్యాయ.) (చికీర్షాకృతిసాధ్యతాజ్ఞానాధీనమగు) ప్రయత్నభేదము. ౧౧. కోశిద్ధధాన్యము, ఉలవలు. ౧౨. మాత్రము (శ ని.)

ప్రవృత్తిజ్ఞుఁడు. సం. వి అ పుం. వేఁగులవారిలో నొకరగువాఁడు, వృత్తాంతము నెఱిఁగినవాఁడు

ప్రవృద్ధము. సం విశే. (అ. ఆ. అ) ౧ పెరిఁగినది, హెచ్చినది. ౨. ప్రౌఢము. ౩. పెద్దది, పృథువు.

ప్రవృద్ధి. సం. వి. ఇ స్త్రీ. ౧ మిక్కిలివృద్ధి ౨ ఉన్నతి

ప్రవేకము. సం విశే (అ ఆ అ) ఉత్తమము, ముఖ్యము.

ప్రవేటము. సం వి. అ. పుం. యవలు (శ్రీ ని.

ప్రవేణి సం. వి ఇ, ఈ స్త్రీ ౧ ఏనుఁగుమీఁదఁ బఱచెడి యొజ్జకంబళి ౨ (స్త్రీలు భర్తృవిరహాదులందు) కైసేయక యొక్కజడగా పెనఁచుకొన్న కురులు ౩ జలాది ప్రవాహము.

ప్రవేత. సం. వి. ఋ పుం రథికుఁడు.

ప్రవేదనము. సం వి. అ. న. తెలుపుట, జ్ఞాపనము.

ప్రవేపము. సం వి అ. పుం. మిక్కిలివణఁకు, కంపము.

ప్రవేలము. సం. వి. అ. పుం పీతముద్గము, పచ్చపెసర. శ.

ప్రవేశకము. సం. వి. అ. పుం ఒకానొక నాటకాంగము. (నీచపాత్రములచే, రంగమందుఁ బ్రదర్శింపఁబడనివిషయములు వస్తుసంగతికై అర్థోపక్షేపకముగా నిందుఁ జెప్పఁబడును. ఇది ప్రథమచరమాంకములం దుండదు.)

శ్లో. ప్రవేశకోఽనుదాత్తోక్త్యా నీచపాత్రప్రయోజితః అఙ్కద్వయాన్తర్విజ్ఞేయః. (సా. ద.)

ప్రవేశనము. సం. వి. అ. న. ౧. ప్రవేశించుట, చొచ్చుట. ౨ చొప్పించుట, ప్రవేశపెట్టుట. ౩. ప్రధానద్వారము, తలవాకిలి. ౪. సింహద్వారము. (వాచ.)

ప్రవేశము. సం. వి. అ పుం. చొచ్చుట.

ప్రవేశించు. సం. స. క్రి, అ. క్రి. చొచ్చు.

వ అమ్మహర్షివరు పగిదియుం బ్రవేశించిరి.

మార్క. ౧. ౭౫.

ప్రవేష్టము. సం వి అ పుం ౧. బాహువు, చేయి. ౨ బాహ్వధోభాగము, చేతిక్రింది భాగము. ౩ ఏనుఁగుపృష్ఠస్థానము. (ఆరోహకుఁడు కూర్చుండు కందపుష్టిగల పట్టు.) ౪ ఏనుఁగుపంటియిగురు, గజదంతమాంసము. (వాచ.)

ప్రవేష్టించు. సం. స. క్రి చుట్టుకొను

శా. మేనాపత్యసత్పుత్రి, నెమ్మెను ద్దాల్చి
శుభాధిదేవతలు సంప్రీతిం బ్రవేష్టింప
ని,త్యానందంబున నంది మొందు నరవిందా
వాసచందంబునన్. (వసు. ౫. ౧౨౫.)

ప్రవ్యక్తము. సం విశే. (అ. ఆ అ) స్పష్టము, వెల్లడియైనది

ప్రవ్యాహారము. సం. వి. అ. పుం. మాటలను (సంభాషణాదిని) దీర్ఘముగాఁ జాగించుట, దీర్ఘభాషణము.

ప్రవ్యాధము. సం. వి. అ పుం. అధికబలముతోఁ బ్రయోగింపఁబడిన బాణముపడుచోటు.

ప్రవ్రజనము. సం. వి. అ. న. సన్న్యాసియగుట, సన్న్యాసము, గృహస్థాశ్రమమందలి పుత్రాదులను వదలిపోవుట.

ప్రవ్రజిత. సం. వి. ఆ. స్త్రీ. ౧. జటామాంసి శీ. ౨. బుద్ధభిక్షుకీభేదము.

ప్రవ్రజితుఁడు. సం విశే. (అ.ఆ.అ.) సన్న్యాసియైనవాఁడు.

ప్రవ్రజ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. పర్యటనము, దేశము త్రిమ్మరుట ౨ చతుర్థాశ్రమము, సన్న్యాసము. 3. వానప్రస్థాశ్రమము.

శ్లో. రత్నాతుమాత్రాః ప్రవ్రజ్యాం కల్పవృక్షా ఇవాశ్రితాః (సం. కు. సం ౬ ౬.)

ప్రవ్ర్యజ్యావసితుఁడు. సం విశే. (అ ఆ. అ.) సన్న్యాసచ్యుతుఁడు, సన్న్యాసమునుండి వీడినవాఁడు

ప్రవ్రాజము. సం. వి అ. పుం. సన్న్యాసము.

ప్రవ్రాజిక. సం వి. ఆ. స్త్రీ. తాపసి, సన్న్యాసిని.

ప్రవ్రాజిత. సం. వి. అ స్త్రీ ౧. తపస్విని ౨ జటామాంసి. శీ.

ప్రవ్వ వి (క. పరవి = వ్యాప్యయఘటము.) కుండ, ఘటము (క. ర.)

క. ఎవ్వలన ఱగము అన్నిటఁ, బ్రవ్వజలము నిలిచినట్లు ప్రజఁ బుట్టించెన్ భాగ. ౬. ౨౦౫.

ప్రశంస. సం. వి. ఆ. స్త్రీ. ౧. స్తోత్రము, పొగడిక, కీర్తి, యశము. ౨ ప్రస్తావము.

ప్రశంసకుఁడు. సం. విశే (అ ఆ. అ.) పొగడువాఁడు.

ప్రశంసనము. సం. వి. అ. న. పొగడిక, స్తోత్రము.

ప్రశంసాముఖరుఁడు. సం విశే. (అ. ఆ అ.) బిగ్గరగా పొగడువాఁడు

ప్రశంసించు. సం. స. క్రి. ౧. స్తుతించు, పేర్కొను.

వ భరద్వాజుండు ప్రముదితాత్ముం డగుచు నమ్మహాత్ముం బ్రశంసించి వినకుండె పీడ్కొనిరి. (భార. శాం. ౪. ౧౧౬.)

శా గజవస్త్రీ మాకు సఖివస్త్రీగా. బ్రశంసించెదన్ (మార్క ౧. ౪.)

మ. హరిఁ బ్రశంసింపంగ రాక మునీశ్వరులున్ (ఉ. హరి. ౨. 3)

౨. ప్రస్తావమునకు తెచ్చు.

దండకము. నీకీతిఁ గామానలంబున్ నివారించు సేనాధిభోదన్ విచారించు సేవెంట రాచూలి వంచించు సేవంకఁ గోర్కుల్ ప్రశంసించు. భోగినీదండకము

ప్రశంసితుఁడు. సం. విశే. (అ ఆ. అ) పొగడఁబడినవాఁడు.

ప్రశంసోపమ. సం. వి. ఆ. స్త్రీ. ఒక విధమగు ఉపమాలంకారము.

శ్లో బ్రహ్మణో ప్యుద్భవః పద్మ శ్చంద్ర శ్శంభుశిరోధృతః, తౌ తుల్యౌ త్వన్ముఖే నేతి సా ప్రశంసోపమోచ్యతే. (కావ్యాద. ౨. 3౧.)

ప్రశమనము. సం వి. అ. న. ౧. శాంతత కలిగించుట. ౨. శాంతి 3. వధము, వాక్య.

ప్రశమము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలి శమము, మిక్కిలిశాంతి. ౨ నివృత్తి, ఉడుకుప.

ప్రశమితము. సం. విశే. (అ. ఆ. అ.) శాంతి కలిగింపఁబడినది, ఓదార్పఁబడినది.

ప్రశ స్తము. సం. విశే. (అ. ఆ అ.) ౧. ప్రసిద్ధికెక్కినది, కొనియాడఁబడినది. ౨. శ్రేష్ఠము.

౩. క్షేమము. ౪. నేయి, నూనె లోనగువానిచే బాగపండబడినది.

ప్రశస్తాద్రి. సం. వి. ఇ. పుం. ఒకానొక పర్వతము.

ప్రశస్తి. సం. వి ఇ. స్త్రీ. ౧. ప్రశంస, పొగడ్త. ౨. ప్రసిద్ధి.

ప్రశస్యము. సం. విణ. (అ. ఆ. అ.) ౧ ప్రశంసింపందగినది. ౨. ప్రసిద్ధికెక్కందగినది.

ప్రశాంతకాముఁడు. సం విణ (అ ఆ అ.) కామము మిక్కిలి అడంగినవాఁడు, తృప్తుఁడు.

ప్రశాంతము. సం. విణ. అ ౧. మిక్కిలిశాంతి నొందినది. ౨. మృతము, చచ్చినది.

ప్రశాంతి. సం వి. ఇ స్త్రీ మిక్కిలిశాంతి ౨ విశ్రాంతి, విరామము.

ప్రశాఖ. సం. వి. ఆ. స్త్రీ. అగ్రశాఖ, కొనకొమ్మ.

ప్రశాఖము. సం. విణ. (అ. ఆ అ.) ౧. పెక్కుశాఖలుగలది, పెద్దశాఖలుగలది. ౨ పంచమదశయందున్నది. (గర్భపిండము) ఈదశయందు కరచరణము లేర్పడును.

ప్రశాసకుఁడు. సం. విణ. (అ నీకా. అ) ౧ మిక్కిలిశాసించువాఁడు, నియమముచేయువాఁడు, విధించువాఁడు. ౨ ఆచార్యుఁడు

ప్రశాసనము. సం.వి.అ.న ౧ శిష్యులు మున్నగువారికి మంచిచెడ్డలను దెలుపుటకై కర్తవ్యాకర్తవ్యములను బోధించు వాక్యములను బలుకుట; కర్తవ్యతను దెలుపు వాక్యమును జెప్పుట. ౨. ఏలుట, పరిపాలనము.

ప్రశాస్త. సం. విణ (ఋ. స్త్రీ. ఋ) ౧. ప్రశాసించువాఁడు, నియమించువాఁడు, కర్తవ్యాకర్తవ్యములను బోధించి నడపువాఁడు. ౨. ఏలువాఁడు, రాజు. - వి. ఋ. పుం. ఋత్విగ్భేదము.

ప్రశిథిలము. సం విణ. అ. మిక్కిలిశిథిలము, శిగిలినది.

ప్రశిష్టుఁడు. సం విణ (అ. ఆ అ.) ప్రశాసింపఁబడినవాఁడు.

ప్రశిష్యుఁడు. సం. వి అ పుం. శిష్యునియొక్క శిష్యుఁడు.

ప్రశ్నదూతి. సం. వి ఇ, ఈ స్త్రీ ప్రహేళిక (శ్రీ ని.)

ప్రశ్న(ము.) సం. వి అ పుం ౧ అడుగుట. (తెలియనిదానిని తెలియఁజెప్పుమని యడుగుట.) ౨. (వ్యవహార.) విచారణ. ౩ వివాదాంశము, చర్చావిషయము. ౪. సమస్య ౫. గ్రంథముయొక్క స్వల్పపరిచ్ఛేదము.

గీ. కణఁగి వద్దును బెరుఁగును గలుషభంగి, వకటవికటంబులగుప్రశ్న లడిగ .

వా. రా. ౨. ౧౩౨.

క. కమలేక్షణ నీ వడిగిన, విమలప్రశ్నములు బ్రహ్మవిద్భోధకయోగ్యము లతిదుర్లభములు ... (వా. రా ౨. ౧౩౪.)

ద్వి. పాకశాసనుఁ డేల ప్రశ్నగావించె.

ద్వి. హరిశ్చ. ౨౪౦౨.

ప్రశ్నవివాకుఁడు. సం. వి. అ పుం. ౧. ప్రశ్నోత్తరదాయకుఁడగు నొక జోస్యుఁడు. (వాచ.) ౨ వివాదములను తీర్చు మధ్యస్థుఁడు.

ప్రశ్ని. సం. వి. ఈ. స్త్రీ కుంభిక, నాఁచు. కీ. (శ్రీ. ని.)

ప్రశ్నోపనిషత్తు. సం వి ద్. స్త్రీ ఒకయుపనిషత్తు. (ఇందు ఆఱుప్రశ్నలును ఆఱు ఉత్తరములు నుండును.)

ప్రశ్రథము. సం. వి. అ. పుం. మిక్కిలిసడలినది, విగిలినది, ప్రశిథిలము.

ప్రశ్రయము. సం. వి. అ. పుం. ౧. మరియాద, వినయము, అనునయము. (శ. ర) ౨. ప్రణయము, వలపు.

ప్రశ్రితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వినీతుఁడు, వినయముగలవాఁడు.

ప్రశ్లిష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. పెనఁచుకొనఁబడినది, పెనగొన్నది ౨. వి. అ. పుం అకారాదులకు పరమగు నచ్చులతోడి సంధియందు వాకేళమగు నచ్చు

ప్రశ్లేషము. సం వి అ పుం. గుత్తమైనకూడిక, గాఢమగు కలయిక

ప్రశ్వాసము. సం. వి అ పుం ఊర్పు, కోష్ఠమందలివాయువును బయటికి వెడలఁబుచ్చుట

ప్రష్ట. సం. విణ (ఋ ప్టీ౨.ఋ) అడుగువాఁడు, ప్రశ్నించువాఁడు

ప్రష్ఠవాహము. సం. వి. హ పుం అలవాటు పఱచుటకు కాఁడిమోపెడి యెద్దులదాపుఁగట్టెడికోడె

ప్రష్ఠుఁడు. సం విణ (అ ఆ అ) ౧. అగ్రగామి, అగ్రేసరుఁడు ౨ శ్రేష్ఠుఁడు

ప్రష్ఠౌహి. సం వి ఈ స్త్రీ తొలుచూలిపడ్డ

ప్రసంఖ్య. సం వి ఆ స్త్రీ ౧. మొత్తము, వెలసి ౨. చింతనము, ఆలోచన.

ప్రసంఖ్యానము. సం వి అ పుం. ౧. లెక్కించుట, గణనము. ౨ సమ్యగ్జ్ఞానము, ధ్యానము, చింతనము. ౩. కీర్తి, ప్రసిద్ధి.

ప్రసంగము. సం వి అ పుం. ౧. ప్రకృష్టసంగము, మిక్కిలితగులు, మిక్కిలికూడిక. ౨. ప్రస్తావము. ౩. ఆసక్తి వ్యాపృతి. ౪. చర్చావిషయము. ౫. సంగతిభేదము (శ్లో. సత్ర సక్తి ఉపోద్ఘాతో హేతుతావసర స్తథా, నిర్వాహకైక్యకార్యైక్యే షోఢాసఙ్గతి రిష్యతే. అన్నసంగతులలో నొకటి ఇది కలఁదు. కొన్నప్పుడు ఉపేక్షింపరాకుండుట; కలంపుగాక వచ్చినప్పుడు ద్వేషింపఁదగినది కాకుండుట.) ౬. వ్యాప్తి. ౭. అనురక్తత్వము. ౮. మైథునాసక్తి. ౯. ప్రాప్తి.

ప్రసంగించు. సం. స. క్రి. ౧. ప్రస్తావించు.

వ. అని పలికి తనతోడికోడలిం బ్రసంగించి.

భోజరా. ౬. ౧౩౦.

వ పదంపడి కార్యంబు ప్రసంగించి నాయాడిన మాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికినవచనంబులింక యొప్పునే.

భార. ఉద్యో. ౨. ౧౧౪.

౨. విస్తరించి చెప్పు.

గా. శ్రీరామాయణముఖ్యమామకకథాశ్రేణుల్ ప్రసంగించుచున్ ఉ రా. ౮. ౩౨౬.

ప్రసంజనము. సం. వి అ. న. ౧. ప్రస్తావమునకుఁ దెచ్చుట, సందర్భము కూర్చుట ౨. ప్రయోగమునకుఁ దెచ్చుట, వినియోగించుట.

ప్రసంధిల్లు సం. అ. క్రి కూడు.

ఉ. . సకలాంగముల్ ప్రసంధిల్లుటచేత కికమగుఁ దేజము లేక క్రుతోనవీర్యమై.

శేషజకల్పము. ౧౪. పా.

ప్రసక్తము. సం. విణ. (అ ఆ. అ.) ౧. ప్రసంగవిషయమైనది, ప్రస్తావమునకు సంబంధించినది. ౨. నిత్యము.

ప్రసక్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. ప్రసంగము, ప్రస్తావము. ౨. వ్యాప్తి. (అతిప్రసక్తి = అతివ్యాప్తి.) ౩. అనుమతి.

ప్రసక్తించు. సం. అ. క్రి. ప్రస్తావమునకు వచ్చు. (శ. ర.)

ప్రసజ్యప్రతిషేధము. సం. వి. అ. పుం. ఒక ప్రసంగమును ఆరోపించి (అట్టిదానినే) నిషేధించుట. (వ్యతి పర్యుదాసము)

శ్లో. ప్రసజ్య ప్రతిషేధోఽయం క్రియయాసహ యత్ర నఞ్ । పర్యుదాస స్స విజ్ఞేయో య త్రోత్తరపదేన నఞ్.

ప్రసజ్యము. సం. విణ. (అ. ఆ అ) ౧. తగులుపడఁదగినది కూడుకొనఁదగినది ౨ ప్రయోగింపఁదగినది, అనుసంధింపఁదగినది. ౩. ప్రసక్తింపఁదగినది, కలుగఁగూడినది

ప్రసత్తి. సం వి ఇ. స్త్రీ ప్రసన్నత, నైర్మల్యము.

ప్రసత్వ. సం. వి న్ పుం. వాయువు. విణ. (న్. రీ. న్) మాంసమును భక్షించు జంతువు. (శే. వి)

ప్రసత్వరి. సం. వి. ఈ. స్త్రీ. ౧. తల్లి ౨. ప్రతిపత్తి, జ్ఞానము. (శే. వి)

ప్రసన్న. సం. వి. ఆ. స్త్రీ ౧. సుర, కల్లు ౨. ప్రసన్నోన్ముఖయగు, గోత్ర (శే. వి)

ప్రసన్నము. సం. విణ (అ. ఆ అ.) ౧. నిర్మలము. ౨. సంతుష్టము ౩. దయగలది, అను గ్రహముగలది ౪. తేటయైనది, తెలివిడియైనది. ౫. సరియైనది, సమంజసము.

ప్రసభము. సం వి. అ. న. బలాత్కారము. పుం. వేగము. (శే వి.)

ప్రసమీక్షణము. సం. వి. అ. న. ఆలోచనము, వివేచనము.

ప్రసయనము. సం. వి. అ. న. ౧. బంధనము ౨ తంతువు, పోగు. ౩. జాలము, వల.

ప్రసరణము. సం. వి. అ. న. ౧. చాఁగుట నిగుడుట. ౨. పలాయనము. ౩. తృణాదులు తెచ్చుటకై సేన లిటునటుపోక, ఆసారము.

ప్రసరణి. సం. వి. ఈ. స్త్రీ. = ప్రసరణము.

ప్రసరము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలి నిగుడుట, చాఁగుట. ౨ వ్యాపనము, పర్వుట. ౩. సమూహము. ౪. యుద్ధము. ౫ నారాచాస్త్రము, ఇనుపబాణము, ౬. వేగము ౭. అనునయము, వినయము (శ ర) ౮. ప్రలయము. ౯. ప్రణయము. (శే. వి.)

ప్రసరించు. సం. అ క్రి = ప్రసరిల్లు.

౧. ఆవిర్భవించు, అభివ్యక్తమగు.

సీ. ముఖమున బహువేదములు ప్రసరింపఁగఁ జేసి వానికి మేలుచేత బుద్ధి.

భార. శాం ౬. ౫౨౦.

౨. ప్రవర్తించు.

౪. రాగాదులఁ, బరిభూతులఁజేయు చిట్లు ప్రసరింతు రిలన్. (మార్క. ౪. ౬౪.)

౩. వ్యాపించు.

క. . . సురాసురులు . . . దుగ్ధసింధువు మథియింపఁ దొడంగిరి. డిండీరపిండఖండంబులు బ్రహ్మాండంబునం బ్రసరించె. (హర. ౬. ౫౮.)

స. క్రి. వ్యాపింపఁజేయు.

మ. వినతానూనుఁడు దాని పైపక్ష మహాని ష్ఠీర్ణ ముల్గాఁగ గ్రక్కున రెక్కల్ ప్రసరించి వాయునసమసంక్షోభంబునం బాతి కాఁకిన .. (హరి. పూ. ౪. ౧౩౬.)

(ఇట విప్పు అని భావము.)

క. ధర్మంబునకుఁ జలనం బొలసిన నెలవులను విచిత్రంబులగుజన్మంబులఁ గర్మంబులు

ప్రసరించి లోకస్థితి నిర్వహించు ...
హరి. పూ. ౪. ౧౩.

ప్రసరిల్లు. సం. అ. క్రి. వ్యాపించు.

క. దిక్కరిణీబృంద కొంక్కట యీనినవిల్లుల
దివిఁ బ్రసరిల్లె ననఁగ.
హరి. పూ. ౭. ౧౭౩

*ప్రసర్పణము. సం వి. అ. న. ౧. పోఁగుట, ౨. వ్యాపనము, ప్రసరణము.

ప్రస(శ)లము. సం. వి అ. పుం. హేమంత ఋతువు. (వాచ.)

ప్రసవకము. సం వి. అ. పుం. ప్రియాళు వృక్షము.

ప్రసవనము. సం. వి. అ. న. ౧. మిక్కిలిబిడ్డలను గనుట. ౨. మిక్కిలిఫలములు నిచ్చుట.

ప్రసవబంధనము. సం. వి. అ. న. ఆకులోనగు వాని తొడిమ, వృంతము.

ప్రసవము. సం వి. అ. పుం ౧ బిడ్డనుగనుట. ౨. కాన్పు, గర్భమోచనము. ౩ బిడ్డ, అప త్యము. ౪ పువ్వు. ౫. ఫలము, పండు. ౬. కార్యము ౭ పారంపర్యప్రసంగము. ౮. ప్రేరణము. ౯. ప్రసృతి. ౧౦. అనుజ్ఞ.
(శ. ని)

ప్రసవస్థలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పుట్టు చోటు, ౨. తల్లి. (వాచ.)

ప్రసవించు. సం. స. క్రి. ౧. (బిడ్డను)గను.

వ. రాజాధిదేవి యావంత్యులగు విందాను విందులం బ్రసవించె. (హరి. పూ. ౧.)

౨. పుష్పించు.

సీ. వినఁ దన్నితివో ప్రసవించె నశోకంబు ...
సమీ. ౧. ౧౭౮.

ప్రసవిత. సం. వి. ఋ. పుం తండ్రి, జనకుఁడు.

ప్రసవిత్రి. సం. వి. ఈ. స్త్రీ. తల్లి.

ప్రసవ్యము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఎడమ, ౨. కుడి. (శ. ర.) ౩. అనుకూలము. ౪. ప్రతి కూలము, విపర్యస్తము. ౫. ఆయత్తము.
(శ. ని.)

ప్రసహనము. సం. విశే. (అ. ఆ. అ.) సహ నములేనిది, ఓర్పులేనిది. (శ ర.)

వి. అ. పుం. మాంసాహారియగు పక్షి

- వి. అ. న. ౧. మిక్కిలిఓర్చుట. ౨ కౌఁగి లించుట.

ప్రసహము. సం. విశే. (అ ఆ. అ.) మిక్కిలి సహించునది. - వి. అ. పుం. ౧. మాంసాహారి యగుపక్షి, బలవంతముగాఁ బట్టితిను పక్షి విశేషము.

శ్లో. కాకో గృధ్రశులూకశ్చ చిల్లశ్చశశఘాత. చాషో భాసశ్చ కురరః ఇత్యాద్యాః ప్రసహాః స్మృతాః (భావప్రకాశిక)

౨. ఎదుర్చుట, తాఁకోర్చుట.

ప్రసహ్యాచోరుఁడు. సం వి. అ. పుం. బలవం తముగా పైఁబడి దోఁచుకొను దొంగ.

ప్రసహ్యాహరణము. సం వి. అ. న బలవంత ముగా కొనిపోవుట.

ప్రసాతిక. స. వి ఆ. స్త్రీ అణుధాన్యము, మాత్మ్య ధాన్యము. (వాచ.)

ప్రసాదకుఁడు. సం. విశే. (అ. దికా. అ) ౧. తేర్చునది, నిర్మలము చేయునది. ౨. సంతోష పెట్టునది, ఉల్లాసముగూర్చునది.

ప్రసాదనము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. తేర్చునది, తేటచేయునది. ౨. నిమ్మళము గావిం చునది, కలఁకఁ పుచ్చునది, ఉపశమింపఁజేయునది. ౩. సంతోషపెట్టునది, ఉల్లాసము గలిగించునది వి. అ. న. ౧. తేర్చుట. ౨ ప్రసన్నముగాఁ జేయుట. ౩. సంతోషపెట్టుట. ౪. అనుగ్రహము కలిగించుట. ౫. అన్నము. (శ. ర.)

**ప్రసాదము.** సం. వి. అ. పుం. ౧ అనుగ్రహము. ౨. నైర్మల్యము, ప్రసన్నత, తేటఁదనము. ౩. కావ్యగుణములలో నొకటి. ౪. దేవనైవేద్యము. ౫. గురుజనాదులచే భుక్తపరిశిష్టమైన అన్నము కొందలగునది. ౬ విరాళము. ౭ మనస్సు

**ప్రసాదించు.** సం. స. క్రి. అనుగ్రహించు.

వ. అగ్రపుత్రుఁబుకుంతులకు వాఁకిలి యెన్నం డును లేకయుండం బ్రసాదించి యంతర్హితుం డయ్యె. (భార. శాం. ౩. ౩౭౧)

క. శరణంబు వేఁడెద భవచ్చరణంబులు గనుఁగొనం బ్రసాదింపఁగదే.

భార. ఉద్యో ౩. ౪౦౭

వ. అని యిట్లు సమ్రజ్జనకుండు ప్రసాదించిన సేము పెద్దకాలంబునకు (మార్క ౧. ౯౨.)

(ఇట అనుగ్రహపూర్వకముగాఁ బలికిన అని భావము)

**ప్రసాధకము.** సం విశే (అ. ధికా. అ.) ౧. మిక్కిలిసాధించునది, నెఱవేర్చునది ౨. తేర్చునది, శుద్ధిచేయునది ౩. వస్త్రాదులచే అలంకరించునది

**ప్రసాధనము.** సం వి. అ న. ౧. మిక్కిలి సాధించుట, చక్కఁగా నెఱవేర్చుట. ౨. సిద్ధి. ౩. క్రమముగా ఏర్పఱచుట. ౪. అలంకరణము, సింగారము, అలంకారము, భూషణము. ౫. శుశ్రూష. - పుం. కంకతిక, దువ్వెన (శే. ని.)

**ప్రసాధని.** సం. వి. ఈ. స్త్రీ. కంకతిక, దువ్వెన.

**ప్రసాధిక.** సం వి. అ స్త్రీ. ౧. (రాణి మొదలగువారికి) అలంకారముచేయు స్త్రీ, సైరేయు నది. ౨. నీవారధాన్యము, నివ్వరులు.

**ప్రసాధితము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. నిష్పాదితము, పరిపక్వముచేయఁబడినది, చక్కఁగా సాధింపఁబడినది. ౨. అలంకరింపఁబడినది.

**ప్రసారణము.** సం. వి. అ. న. ౧. చాఁచుట (శాఖాప్రసారణము,) (న్యాయ.) క్రియాభేదము. ౨. వ్యాపించుట, పర్వుట. ౩. శత్రువును చుట్టుకొనుట. ౪. తిరుచుట. ౫. (వ్యాక.) సంప్రసారణము

**ప్రసారణి.** సం వి. ఈ స్త్రీ. గొంతెమగోరు, కింటుభరి. శ్రీ

**ప్రసారము.** సం వి . పుం వ్యాపనము, వ్యాపించుట.

**ప్రసారి.** సం. విశే. (న్ ణీ. న్) ప్రసరించునది.

**ప్రసారిణి.** సం. వి. ఈ. స్త్రీ. లజ్జాలులత. శ్రీ.

**ప్రసారితము.** సం విశే. (అ. ఆ. అ.) ౧ విస్తరింపఁబడినది, విరివిగా చేయఁబడినది, వ్యాప్తము గావింపఁబడినది. ౨ తిగువఁబడినది, (శ ర)

**ప్రసితము.** సం విశే (అ ఆ అ) ౧ బద్ధము, కట్టఁబడినది ౨ తత్పరము, ఆసక్తము, తగులు గఁవి ౩ మిక్కిలిశుభ్రము. - వి అ. న. పూయము, చీము

**ప్రసితి.** సం. వి ఇ స్త్రీ. ౧ కట్టెడు సాధనము. (సంకెలమొ.) ౨. తంతువు ౩ జాలము, వల (వాచ) ౪ నిర్బంధము. (శ ర.)

**ప్రసిద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వాసికెక్కినది, ప్రసిద్ధికెక్కినది. ౨. ప్రసాధితము, అలంకరింపఁబడినది.

**ప్రసిద్ధి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఖ్యాతి ౨. నిష్పత్తి మిక్కిలిసిద్ధి, చక్కఁగా కుదురుట. ౩. అలంకారము, వగ.

**ప్రసువు.** సం. విశే. ఊ. బిడ్డ లోనగువాని కనునది. - వి. ఊ. స్త్రీ. ౧. తల్లి. ౨. అల్లి గుజ్జము, గోడిగ.

ప్రసూత. సం. వి. ఆ. స్త్రీ. బాలెంతరాలు.

ప్రసూతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కాన్పుకొండినది, పుట్టినది ౨. పొడమినది, ఫలించినది. 3 కనినది, ప్రసవించినది. వి. అ. న. పువ్వు.

ప్రసూతి. సం వి. ఇ స్త్రీ ౧ ప్రసవము, కానుపు, గర్భమోచనము ౨ (పువ్వులులోనగునవి) తలచూపుట, పొడసూపుట 3 ఫలితము ౪ బిడ్డ, పిల్ల. ౫ తల్లి.

ప్రసూతిక. సం. వి ఆ. స్త్రీ బాలెంతరాలు

ప్రసూతిజము. సం వి అ న. బాధ, దుఃఖము.

ప్రసూనము. సం. విణ. (అ ఆ అ) పుట్టినది, (వాచ) వి. అ. న. ౧. పువ్వు. ౨. పండు

ప్రసూనేషువు సం వి. ఉ పుం. పూవిలుకాఁడు, మన్మథుఁడు.

ప్రసృత. సం వి ఆ. స్త్రీ. జంఘ, కాలిపిక్క

ప్రసృతజుఁడు. సం వి అ పుం పర స్త్రీయందుఁ బుట్టినవాఁడు. (కుండగోళకాది)

ప్రసృతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వినిడినది, చాఁగినది. ౨. కొనసాఁగి పెరిఁగినది 3. వ్యాపించినది, పర్వినది. ౪. వేగితము, తీవరింపఁబడినది. ౫. విహితము. ౬. గతము. ౭. నియుక్తము, నియోగింపఁబడినది. ౮. తీర్పఁబడినది. (శ. ర) - వి. అ. పుం, న. రెండుపలముల కొలఁది. - వి. అ పుం. చేర, పుడిసిలి.

ప్రసృతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. చాఁగుట, వ్యాప్తి, ప్రసారము. ౨. ప్రవహించుట. 3. చేర, పుడిసిలి. ౪. తంతువు, దారము. ౫. వాక్కు. ౬. బాలుడు. ౭. తాత్పర్యము. ౮. బంధనము. (శ. వి.)

ప్రసృత్వరము. సం. విణ (అ. ఆ. అ.) ప్రసరించునది.

ప్రసృమరము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రసరించునది. ౨. ప్రవహించునది, ఒలుకునది.

ప్రసృష్టము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తొలఁగఁబుచ్చఁబడినది, విగవిడువఁబడినది. ౨. గాయపఱుపఁబడినది.

ప్రసేకము. సం వి. అ. పుం. ౧. స్రవించుట, కాఱుట. ౨. అసించనము, చల్లుట, తడుపుట. 3. జాఱుట, చ్యుతి ౪. గరిఁటె లోనగువాని చిప్ప.

ప్రసేకి. సం. వి. న్. పుం. అసాధ్యవ్రణభేదము.

ప్రసేదిక. సం వి ఆ స్త్రీ. చిన్నతోఁట.

ప్రసేవకము. సం. వి అ పుం. ౧. వీణకరిప. ౨. సూత్రకచితపాత్రము.

ప్రసేవము. సం. వి. అ పుం ౧ ధాన్యము పోయుసంచి. ౨ ఎండుపుఁదట్టు. 3. వీణకరిప విణ. (అ. ఆ అ.) ౧. స్యూతము, కుట్టఁబడినది. ౨ గ్రథితము, గ్రుచ్చఁబడినది

ప్రస్కందనము. సం. వి. అ న. ౧. అస్కందనము, గంతువేయుట, క్రేళ్లుదాఁటుట. ౨. విరేచనము. 3. ఆపాదనము,. కలిగించుట.

ప్రస్కందము. సం. వి. అ పుం. కుండము అనఁబడు చతురాకారమగు వేదిక.

ప్రస్ఖలనము. సం. వి. అ. న. తడఁబడుట, తొట్రుపడుట, అడుగుతొట్రిలుట, జాఱఁబడి పడుట.

ప్రస్తరణము. సం. వి. అ న. ౧. సెజ్జ, శయ్య. ౨. ఆసనము, పీఁట.

ప్రస్తరము. సం. వి. అ. పుం. ౧. చిగుళ్లలోనగువానిచే సేర్పఱిచిన సెజ్జ. ౨. రాయి. 3.

రత్నము. ४. దుర్భముష్టి. ౫. గ్రంథముయొక్క భాగవిశేషము. ౬. కథము. (శ. ర.)

ప్రస్తరించు. సం. స. క్రి. ౧. విస్తరించు, పెంపొందించు.

సీ. యజ్ఞ కటాకంబునందుఁ గ్రుంకిలు వెట్టి, బ్రహ్మర్షి పీఠభృత్పీఠిఁ బ్రస్తరించు భీమ 3 ౧౧౪

క. చిలిచిలువు ప్రస్తరింపన్, దొలుదొల్త సజాండు గురువునన్ లఘు విడె నా, పెలయున్ ఫాలము వానికి, యలపొంగక్యమునఁ గంఠ మట గల మయ్యెన్. (సుదంతా 3 ౩౬)

(ఇది శందర్భములకు నుదాహరణము)

౨. ప్రస్తారముచేయు

సీ. జనియించెఁ బ్రస్తరించినఁ గ్రమంబున యర సతతభజన లనంగ సప్తవిధము, లు అప్ప. ४. ३౬.

ప్రస్తవము. సం. వి. అ. పుం. ౧. స్తోత్రగీతము, స్తుతిసామము. ౨. ప్రస్తావము. 3. ?. కుము

క. . . . వ్వారలు నీప్రస్తవమున నిష్ఠులఁ గృతము దలంచి ప్రాణములు విడుతు రనిక్. భార. సభా. ౧. ౩౮.

క. అనఘా నీప్రస్తవమున, నని నీల్గిన వీరభటుల యనుపోష్యుల. ... భార. సభా. ౧. ౩౯.

ప్రస్తవించు. సం. స. క్రి. విషయమునకుఁదెచ్చు, ప్రస్తావమునకుఁదెచ్చు.

ఉ. సమ్మతిఁ బ్రస్తవించు శుకశారికలాగమ భాషితంబులన్. (హర. ౫. ౩౧.)

ప్రస్తారపంక్తి. సం. వి. ఈ. స్త్రీ. ఛందోవిశేషము.

ప్రస్తారము. సం. వి. అ. పుం. ౧. పఱచుట. ౨. చిగుర్లు పెండలుగవానిచే ఏర్పఱచిన సెజ్జ. 3. సెజ్జ, శయ్య. ४. చదునైన ప్రదేశము. ౫. తృణప్రధానవనము, వృక్షవిస్తారము. (శ. ర.) ౬. (ఛంద)లఘుగురువులను దెలుపు ప్రక్రియా భేదము, ఛందశ్శాస్త్రమునందలి ప్రత్యయవిశేషము.

ప్రస్తారపఙ్క్తిము. సం. వి. న్. న. క్షేత్రభాగ భేదము.

ప్రస్తావన. సం. వి. అ. స్త్రీ. ౧. స్తోత్రము, స్తుతించుట ౨. ఆరంభము 3 ఉపోద్ఘాతము, అవతారిక. ४. ఆముఖము, నాటకముయొక్క అంగభేదము.

ప్రస్తావము. సం వి. అ పుం ౧ ఆరంభము, ఉపక్రమించుట. ౨ అవతారిక, ఉపోద్ఘాతము. 3. ప్రసంగము. ४. అవసరము, తగినతఱి, యుక్తసమయము. ౫. ప్రకరణము ౬ సామావయవ భేదము ౭. ప్రకృష్ట స్తవము, అధికమైనస్తుతి.

ప్రస్తావించు. సం. స క్రి. ప్రస్తావమునకు తెచ్చు (శ. ర.)

ప్రస్తీత(మ)ము. సం విశే. (అ. ఆ అ.) ౧. సంహతము, గుమిగూర్పఁబడినది, ఒక్కటిగా కూడినది. ౨ ధ్వనితము, మొరయింపఁబడినది, మ్రోగింపఁబడినది. (వాచ.)

ప్రస్తుత. సం. వి. ఆ స్త్రీ (శోనఁబోవు సమయమున) పొడుగుచేసినయావు.

ప్రస్తుతము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలిస్తుతింపఁబడినది. ౨. ఆరంభింపఁబడినది. 3. ఉపస్థితము, సమీపించినది. ४. ప్రకరణమునచే ప్రాప్తించినది, ప్రాసంగికము. ౫. ప్రతిపన్నము, ప్రాప్తము. ౬. ఉద్యతము, సిద్ధమైనది, సిద్ధముచేయఁబడినది. (శ. ర.)

వి. అ. న. ౧. ప్రస్తావమునకు వచ్చిన విషయము. ౨. ఉపమేయము.

**ప్రస్తుతాంకురము.** సం. వి. అ. పుం. ఒక అర్థాలంకారము.

శ్లో. ప్రస్తుతేన ప్రస్తుతస్య ద్యోతనే ప్రస్తుతాంకురః, కిం భృఙ్గ సత్యాం మాలత్యాం కేతక్యా కణ్టకేద్ధయా. (చంద్రాలోకము.)

**ప్రస్తుతించు.** సం. స. క్రి. మిక్కిలి. కొనియాడు

చ. .. పురమిజనంబు రాజులును భూసురలున్ వినుచు బ్రస్తుతింపఁగే.

భార. ఉద్యో. ౧. 3౨3.

క. అని చెప్పిన నమ్ముని యమ్మనుజపతిం బ్రస్తుతించి (భార. శాం. ౫. 3౪౯.)

చ. ఇద్దనప్రకృతియు దైత్యనాయకుఁడు పంప బకాదిపుఁ బ్రస్తుతించుచున్.

భార. శాం. 3. ౫౭౧.

**ప్రస్థపుష్పము.** సం. వి అ పుం. ౧. మరువకము, మరువము. శ ౨. చిన్నాకులతులసి. శ. 3. జంబీరభేదము, ఒకవిధమగు నిమ్మ. శ.

**ప్రస్థము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పోవునది, ఉండునది, వసించునది. ౨. వ్యాపించునది, పర్వునది. 3. నిలుకడయైనది, స్థిరము. - వి అ. పుం, న. ౧. కొండచెత్తము, పర్వతమునందలి సమభూమి. ౨. ముప్పదిరెండుపలములకొలఁది, నాలుగుమానికలకొలది. (వైద్య.) రెండుశరావములకొలఁది. 3. ఉన్నతవస్తువు, తూనికవేయఁ బడినవస్తువు. (మే. ని.)

**ప్రస్థానము.** సం వి. అ. న ౧. గమనము, పోక. ౨. జిగీషువుయుద్ధమునకై వెడలిపోవుట. 3 ఉపదేశోపాయము, దర్శనమును బోధించు శాస్త్రము. (ఉపనిషత్తు, గీత, బ్రహ్మసూత్రములు వీటిని ప్రస్థానత్రయ మందురు.)

**ప్రస్థాపించు.** సం. స. క్రి. చక్కఁగా స్థాపనము చేయు. (శ. ర.)

**ప్రస్థాపితము.** సం. విశే. (అ. ఆ. అ.) పంపబడినది, ప్రేరితము. ౨. చక్కఁగా స్థాపింపఁబడినది.

**ప్రస్థాయి.** సం విశే. (న్ నీ. న్) పోవువాఁడు, పయనమగువాఁడు

**ప్రస్థిక.** సం వి. ఆ స్త్రీ. అంబష్ఠాలత శ.

**ప్రస్థితము.** సం. విశే (అ ఆ అ) ప్రయాణమై పోయినది, ప్రయాతము

**ప్రస్థితి.** సం. వి. ఇ. స్త్రీ. బయలుదేఱుట, గమనము, పోక.

**ప్రస్థితుఁడు.** సం విశే (అ ఆ అ.) పయనమైనవాఁడు, బయలుదేఱినవాఁడు

**ప్రస్నవము.** సం వి. అ. పుం. స్రవించుట. కాఱుట

**ప్రస్నుష.** సం వి ఆ స్త్రీ మనుమనిపెండ్లము.

శ్లో స్నుషాః ప్రస్నుషాశ్చైవ ధృతరాష్ట్రస్యవిహ్వలాః

సం భార కర్ణ ౭౦ 30.

**ప్రస్ఫురించు.** సం. అ క్రి తోఁచు, కన్పట్టు.

సీ కటకరక్కసుని నొక్కఁడనిఁ జిక్కఁగఁ ద్రొక్కి భద్రకాళిక యెందుఁ బ్రస్ఫురింపు.

పాండు. ౫ ౭౯.

**ప్రస్ఫురిల్లు.** సం. అ. క్రి. ప్రకాశించు.

సీ మేఘకాళ్ళింబున మెఱయుసురేంద్రచాపము లీల వనమాల ప్రస్ఫురిల్ల, నల్లనుసజాయమే నొప్పు . . (హరి. ఉ ౮ ౬౫.)

**ప్రస్ఫోటనము.** సం వి అ న ౧ వికసనము, విరియుట. ౨ ప్రకాశనము, బయలుపుచ్చుట. 3. చీల్చుట. ౪ ధాన్యముచెరుగుట ౫ చేట.

**ప్రస్రవణము.** సం వి. అ. న ౧ మిక్కిలి కాఱుట, మిక్కిలిస్రవించుట. ౨. సెలయూట,

౩. చెలము, ఉటు. ౪ మూత్రవిసర్జనము. -
౧. అ. న. ఒకపర్వతము, మాల్యవంతము.

ప్రసావము. సం. వి అ. పుం. ౧ ప్రసవించుట, కాచుట ౨ మూత్రము

ప్రస్వేదావ్హా. సం వి అ స్త్రీ పిరంగిచెక్క

ప్రహతము. సం విణ (అ ఆ అ) ౧ కొట్టఁబడినది, చంపఁబడినది ౨ వితతము, విస్తరింపఁబడినది ౩ క్షుణ్ణము, పొడిచేయఁబడినది, పలుమాఱు రారాపునొందినది, త్రోవ ౪. వుత్పన్నము (శే ని)

ప్రహారకుటుంబి సం వి ఈ స్త్రీ కుటుంబినీ క్షుపము ?

ప్రహరణకలిక. సం వి ఆ. స్త్రీ చతుర్దశాక్షర పాదకమగు వృత్తభేదము

ప్రహరణము. స. వి. అ. న ౧. కొట్టుట, ప్రహారము. ౨. ఆయుధము ౩ యుద్ధము. ౪. దమము

ప్రహరము సం. వి అ పుం జాము, యామము.

ప్రహరి. వి. (సం ప్రాకారః) ప్రాకారము, చుట్టుగోడ. (శ. ర.)

సీ అలదేవమణికిఁ గావలి యిద్దప్రహరి నా,
గళిమున ఘంటికావళులు మెఱయ.
పారి ౪. ౬౬.

ప్రహరి, సం. వి. న్ పుం యామికుఁడు, గంటలు కొట్టుటకు ప్రహరకాలమునందు అధికారము గలిగియుండు బంటు.

ప్రహరించు. స క్రి కొట్టు.

ఉ ...గదచేఁ బ్రహరించినఁ గంప మేమియుం,
జెందక నిల్చి (రామా ౭. ౧౦౯.)

క. కదనసములఁ బ్రహరించిరి, యదఁచిరి లాత
ముల ... (శివరా. ౪. ౫౯.)

ప్రహరిచరించు. అ. క్రి. (ప్రహరి + చరించు.) ఊరు, కోట మొ. వానికాఁపుదలకై చుట్టి వచ్చు; ప్రదక్షిణముచేయు.

చ ప్రహరిచరించు కప్పడును భైరవు లర్ధనిశాగమనంబులన్. భీమ. ౧. ౧౦౭.

ప్రహరిచుట్టు. అ. క్రి. (ప్రహరి + చుట్టు.) అలంగము తిరుగు, ప్రదక్షిణముచేయు.

మ. అని చింతించుచు నొక్కధామమునకున్...
గంధర్వకాంతల్ సుకం,రవినాదాతిశయం
బుతోఁ బ్రహరిచుట్టం గంటిఁ జిత్రంబు
గాన్. (వసు. ౪. ౬౭.)

ప్రహరిదిరుగు. అ. క్రి, (ప్రహరి + తిరుగు. ఊరు, కోట. మొ వాని కాపుదలకై చుట్టు తిరుగు, ప్రదక్షిణముసేయు; చుట్టుతిరుగు.

గీ. ప్రహరిదిరుగుట చాలించి భైరవుండు, గవని
మెంగసాల యరుఁగుపైఁ గన్ను మోగిచె.
కాశీ. ౩.౭౩౫.

క కెలిఁ బ్రహరిదిరుగువెల్లరఁ, జాలకగ
గికురించి నగరు చొచ్చి కదంకన్
రామా. ౬. ౧౧౭.

సీ తనదుర్గమునకు నక్తందివంబును సితభాను
భాస్వంతులు ప్రహరిదిరుగ ...
వరాహ ౩. ౬౫.

ప్రహర్త. సం. విణ. (ఋ త్రి. ఋ.) ప్రహరించువాఁడు కొట్టువాఁడు, యుద్ధము చేయువాఁడు

ప్రహర్షణము. సం విణ. (అ. ఆ అ) మిక్కిలి హర్షము గలిగించునది. (క ర్త.) ౧. అ. న. మిక్కిలి హర్షము గలిగించుట అ. పుం. బుధగ్రహము.

ప్రహర్ష(ర్షి)ణి. సం. వి ఈ. స్త్రీ ౧. పసుపు ౨ త్రయోదశాక్షరపాదకమగు వృత్తవిశేషము. (వాచ)

ప్రహర్షించు. సం. స. క్రి. సంతోషించు.

ఉ. పాండవగర్భ రక్షకరమూర్తి త్రిదశేంద్రులు
ప్రాభవరీతిఁ గీర్తించిన పెంపువోలె వినవిని
కృష్ణుఁడు సత్కృతకీర్తనం బ్రహర్షించి
వినయ్. (ఉ. రా. ౧ ౪౨.)

ప్రహసంతి. సం. వి. ఈ. స్త్రీ. ౧. యూథిక, అడవిమల్లె. కి. ౨. వాసంతి కి. ౩. పెద్ద కుంపటి.

ప్రహసత్. సం. (శతృ) నవ్వుచున్న.

ప్రహసనము. సం. వి. అ. న. ౧. పెదనవ్వు. ౨. పరిహాసము. ౩ దృశ్యకావ్యవిశేషము. (భాణవత్సంధి సంధ్యంగలాస్యాంగాంకైర్వినిర్మితమ్, భవేత్ప్రహసనం వృత్తం నింద్యానాం కవికల్పితమ్) (సా. ద.)

ప్రహసించు. సం. స. క్రి. పెద్దనవ్వునవ్వు, తిరస్కరించు.

వ. జంఝూపవన ఘూర్ణమానార్ణవంబు కలకలంబునకు గలకలం బ్రహసించె.
వరాహ. ౪ ౧౨౦.

సీ. రథనిస్స్వనంబులఁ బ్రహసించి పరవీర, భయదంబులై భటాస్ఫోటములు నిగుడ.
వరాహ. ౩. ౪౨

ద్వి. ... యమితతేజమున, భానుకోటిస్ఫూర్తిఁ బ్రహసింపుచున్న, యానినందనుఁ గాంచి .
(ద్వి. పరమ. ౨ ౬౩౦)

(ఇట ఉపమావాచకము.)

ప్రహస్తము. సం. విశే. అ. చప్పెట, చపేటము.

ప్రహస్తుఁడు. సం. వి. అ. పుం. రావణునిమంత్రి యగు నొకరాక్షసుఁడు.

ప్రహాణము. సం. వి. అ. న. విడుచుట, త్యజించుట.

ప్రహారము. సం. వి. అ. పుం. ౧. అఘాతము, దెబ్బ; కొట్టుట. ౨. చంపుట.

ప్రహారవల్లి. సం. వి. ఈ. స్త్రీ. మాంసరోహిణి. కి.

ప్రహారి. సం. విశే. (న్. ణీ. న్.) ప్రహరించువాఁడు.

ప్రహాసము. సం. వి. అ. పుం. ౧. అట్టహాసము, పెద్దనవ్వు. ౨. పరిహాసము. ౩. అపగీతము, పరిహాసాత్మకమగు ప్రబంధము ౪. ప్రభాసమను తీర్థవిశేషము.

ప్రహాసి. సం విశే. (న్. నీ. న్.) ౧. నవ్వించువాఁడు. ౨. నవ్వువాఁడు. ౩. పరియాచకము చేయువాఁడు. - వి. న్. పుం. విదూషకుఁడు

ప్రహిత. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఉంచఁబడినది. ౨. పంపఁబడినది, ప్రేరితము. ౩. క్షిప్తము, వేయఁబడినది, వింటనుండి విడువఁబడినది. (బాణము.) ౪. నియుక్తము. వి. అ. పుం., న. సూపము, వండినపెసరపప్పు మొ. (శ. ర.)

ప్రహితుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) వ్యక్తపన్నుఁడు (శ. ర.)

ప్రహృష్ట. సం. విశే. అ. ౧ మిక్కిలి హర్షించినది. ౨. రోమాంచయుక్తము. ౩. విస్మితము. ౪. ప్రతిహతము. (శ. ని)

ప్రహేణకము. సం. వి. అ. న. పిష్టకభేదము, ఒకదినుసు పిండివంట.

ప్రహేళిక. సం. వి. అ. స్త్రీ. ప్రవల్హిక. ఇది యొక పొడుపుకథవంటిది. (తరుణ్యాలింగితః కంఠే నితంబస్థలమాశ్రితః గురూణాం సన్నిధానేఽపి కః కూజతి ముహుర్ముహుః) దీని ఉత్తరము. ఈపద్యమున జలపూర్ణకుంభము. ఇది శాబ్దియు ఆర్థి అని ద్వివిధము.

ప్రహ్లత్తి. సం. వి. ఇ. స్త్రీ. ఆహ్లాదము, సంతసము.

ప్రహ్లన్నుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) సంతుష్టుఁడు.

ప్రహ్లా(హ్లా)దము. సం. వి. అ. పుం. ౧. మిక్కిలిఆహ్లాదము, ప్రమోదము. ౨. శబ్దము.

ప్రహ్వము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. వాటమైనది, ఏటవాలైనది, ఒకప్రక్కకు వాలినది. ౨. వంగినది, వినయము ౩. ఆదరమునగలది, నమ్రము ౪. ఆసక్తము, తగులముగలది.

ప్రహ్వాయము. సం. వి. అ. పుం. పిలుపు, ఆహ్వానము.

# ప్రా

ప్రా. విణ. (వృత్తియందు ప్రాఁత శబ్దమున తొలి యచ్చుమీఁది వర్ణము లోపింపఁగా మిగిలిన రూపము చూ ప్రాత.

ఉదా : ప్రామినుకులు, ప్రావేల్పు మొ. దీనికి అచ్చు పరముగునపుడు యడాగమమును, పరు షములు పరములగునపుడు నుగాగమము నగును.

ఉదా: ప్రాయిల్లు, ప్రాయేలు, ప్రాఁగెంపు మొ.

సీ. చిలిలి ప్రాఁగెంపుటిట్టికల గోడలుబెట్టి వజ్రంపు గారల నునుతానర్చి

(ఉ. రా. ౨. ౨౯౨.)

మ. ...నన్ ప్రాఁగెంపుటా మేడలో, నలుకన్ గిల్లడగొట్టు కేళి .

ఉ. రా. ౪. ౨౨౨.

ప్రా. వి. (సం. ప్రాసః) ప్రాసము, పద్యపాద ద్వితీయాక్షరము (చూ. ప్రాసు.)

౪ క. విలసత్ప్రాసాద్యక్షర, ములు వర్ణసు నాద్వితీయములు ప్రాసల్ మాత్ర లోని తమకము పాతంబులు యతిపై నన్నిపాదములఁ బ్రాల నుదున్. (కవిజనా. సంజ్ఞా. ౬౨.)

ఆ. పలుకులందునైన పలుకులు గలిగియుఁ, బ్రాలువర్ణుకలని వెలుఁగవిత, బెన్నుకల్లన్ .

ద్వా. ౪. ౧౯౧.

ఉదా : ప్రాయిల్లు, ప్రాగెంపు మొ.

ప్రావడి = ప్రాసము వడియును.

మహాక్కర. అమరఁ బ్రావళ్లు రెండునాఁ కెలఁగి నాల్గుచోట విరతి యాదిత్యుమీఁద కవిజనా. జాతి. ౨౫.

ప్రాంగణము. సం. వి. అ. న. ౧. ముంగిలి, అజి రము ౨. గృహాభూమి, ఇంటినేల. ౩. పణ వము ఉడుక

ప్రాంగము. సం. వి. అ. పుం. పణవము,ఉడుక. (విల్యమ్సు )

ప్రాంచత్. సం శత్రి ప్రకాశించుచున్నది, ఒప్పు చున్నది.

శా. ప్రాంచద్భూషణశాతకుంభముల రుచితోఁ బాలిండ్లుబంగారు... (మనుచ. ౨ ౬౮)

ప్రాంజలము. సం. విణ (అ ఆ. అ) ౧. నున్న నిది, సరళము ౨ సుబోధము, చక్కఁగాఁ దెలియునది ౩ నిలువైనది (విల్యమ్సు)

ప్రాంజలి. సం విణ (ఇ) చేతులు మోడ్చిన వాఁడు, మోడ్పుగేలివాఁడు. - వి ఇ. పుం చేమోడ్పు.

ప్రాంతము. సం. వి. అ. పుం. ౧. చివర, అంచు. ౨. (పెదవి, కన్ను లోనగువాని) మూలు ౩. ఎల్ల, మేర. ౪. చిట్టచివర, కొట్టకొన. ౫. మొన, కొస. ౬. తీరము. ౭. సమీపము

ప్రాంతరము. సం. వి అ. న. ౧. దూరగమ్య మగుమార్గము, దవ్వు పోగునట్టిదారి. ౨. చెట్లు

సీ. కన్నుర జడ్డిగాని క్రమ్మఁ బ్రాఁ కొక్కెనక్రు
కపాలభాగములు గతిని.

భా౦. ఆర. ౪ ౨౮.

౨. (కండ్లకుఁబట్టిన) పాఁచి, ముసికి

ద్వి. మీఁక లోకముల కేలించినపండ్ల, బ్రాఁకు
వోకున్న సాధ్రుశియాగ్నిరుద్ర, బ్రింగన
గొండి పై మింగితి బసవలింగకుమారు

పండితా. మహిమ. ౩౦౪ పా.

ద్వి. ప్రాఁకువట్టినపండ్లు బ్రద్దచేతులును

బస పు. ౩. ౧౧౧౪

౩. తీఁగె ప్రాఁకుటకు బ్రక్కను నిలువఁబడెడు
కఱ్ఱ, ఉపఘ్నము.

ఉ. ఊర్జితశక్తినుద్భటుం, డై పెనిపెన్ సమీర
సుతునల్కఁ బ్రాఁకెడినట్లు మీఁకలోన్

భార. విరా. ౨ ౧౫౦.

సీ. ప్రాఁకునఁ దీఁగఁ గూర్పంగనేరని కొమ్ము
గుణము సేక్రియ ధనుకోటిఁ గూర్చు.

భాగ ౧౦. ఉ. ౧౭౧.

(చి. వి. పా. ప్రాఁకున, ముద్రి. పా.)

గీ. మనసుపాదునఁబొడమి సమగ్రభక్తి, రసపరి
ప్లుతిఁదాలిమి ప్రాఁకుపడవి తనరు ...

హె శతం. ౨ ౧౬౨.

౪. పోమణము.

గీ. ప్రాఁకుఁజేసిన వర్తనల్ పదటగలిపి, క్రొత్త
వర్తన జేకురు గోఁడకాండ్రు.

వేమన. ౩ ౩౨

౫. ప్రాఁచితీఁగె, నీటియందు బయలు దేఱు
పచ్చనితీఁగె, శైవాలము. కై.

(భూ. పాఁకు.)

చూ. ప్రాఁకుడు, ప్రాఁకుడెంచు, ప్రాఁకులాడు,
ప్రాఁకొను.

ప్రాఁకుడు = పాఁకుడు. వి. (√ప్రాఁకు) ౧.
ప్రాఁకుట. ౨ పాఁచి. (శ. ర.)

ప్రాఁకుడెంచు. అ. క్రి. (ప్రాఁకు = తెంచు,
స్వార్థమున) పైవచ్చు, వ్యాపించు.

గీ. గగనభాగమునఁ గొన్ని యుల్లసఁ
బ్రాఁకుడెంచె, నవుడు.

వేం. పంచ. ౪. ౨౨౮.

ప్రాఁకులాడు. అ. క్రి. (√ప్రాఁకు.) పొర్లాడు,
దొరలు

సీ. ఎడఁబోక నిదురపోయెడి కుంభకర్ణుండు
బిబ్బురించుచు లేచి ప్రాఁకులాడె.

దశా ౪. ౨౦౪.

౨. క్రి ఆశ్రయించు.

వ్యవ. వానిని పట్టుకొని ప్రాఁకులాడిన లాభము
లేదు

ప్రాఁకొను. అ. క్రి. (ప్రాఁకు + కొను.) పాఁచి
పట్టు, నీరు నిలువై యుండుటచే పచ్చని ముసికి
కలదగు

క. ప్రాఁకొన్ననూతి యుదకము, పోఁకలపాడి
యును కోఁత మేదిని సుమతీ

సు. శ. ౧౦

ప్రాఁగబ్బము. వి. (ప్రాఁక్ + కబ్బము.) వేదము

సీ. ప్రాఁగబ్బపుం బల్కుబడి చిక్కు దీర్పరి
గారుడాది పురాణకవనకర్త.

పాంచాలీ. ౩. ౩౪.

ప్రాఁచి = పాఁచి. వి. వారిపర్ణి, చిన్నియాకులు
గల యొకజాతిపాఁచు.

సీ. ప్రాఁచినీరాకు నా వారిపర్ణి చెలఁగు.

ఆం. భా. ౧. ౧౨౪.

ద్వి. కమియమొడఁటఁ బ్రాఁచి గప్పియుండి
యును, మలినంబైన గంగాంబువులట్లు.

పండితా. పురా. ౧౩౫ పా.

చ. అప్పుడుఁ బురంబునం దొగల నంతర దావురఁ బ్రాఁచిఁ గప్రపుష్పలపులు మాలు.

ఆము. ౧. ౯౧.

౨. నీరు నిలువయుండుటచేఁ గలిగెడు పచ్చని మురికి.

సీ. పాథోధిజలయుక్తిఁ బ్రాఁచిపట్టిన దిశాకరులు నాఁ దగు మరకతపుఁగరులు

ఆము ౧. ౫౩.

గీ. సంతతజలాంతరాళ సంస్థానమహిమఁ బ్రాఁచి పట్టినకైవితోఁ బయలు మెఱసి, వచ్చి వలిగట్టు తొలిపట్టి (వసు. ౫ ౩౭)

విశే. పర్యుషితము, నిలువయున్నది (చలిది మొ.)

సీ. పెరుఁ గంతయును గ్రోలి పిదప బానయందు సంపూర్ణముగఁ బ్రాఁచిచల్లనుచు

హరి. పూ. ౫ ౨౦౭.

(ప్రాఁతది అని శ. ర)

అ. అనుపనీతులోడ నాడితోఁ బొత్తునఁ, గుడుపఁ జెల్లఁ బ్రాఁచి కుడువఁ జెల్లు

విజ్ఞా. ఆచా ౩౧.

చ. దధిపయోదధియుఁ గ్రోలఁగఁ బ్రాఁచి దాటఁ జెన్నులబాఁగఱల్లఁ గ్రాయ .

ఆము. ౪. ౧౧౭.

౨. అపరిశుద్ధము. (చూ. ప్రాఁచిపడు)

౩. ప్రాఁతది.

ద్వి. ప్రాఁచిశేషాంతముల్ భవ్యపదాబ్జములు, దాఁచినభావన మాత్కంటి దాఁచి.

పండితా. దీక్షా. ౭౦. పా.

జ : ప్రాఁచితీఁగ ప్రాఁచిపడు, ప్రాఁచిపని, ప్రాఁచిపురువు.

ప్రాఁచితీఁగ = ప్రాఁచి. వి. వారిపర్ణి. నాఁచుఁ దీఁగ. (వై. ని.)

ప్రాఁచిపడు=పాఁచిపడు. అ. క్రి.(√ప్రాఁచి.) అపరిశుద్ధమగు.

ఆ. గంగనీర చెంత కలఁకను బడసినఁ, బ్రాఁచి పడినతటాకంబునట్టియున్న, స్నానయోగ్యము. ·

విజ్ఞా. ఆచా. ౫౦.

ప్రాఁచిపని = పాఁచిపని. వి. (√ప్రాఁచి.) పూర్వపుదినమున నుపయోగించిన పాత్రలను శుద్ధిచేయుట.

సీ. ప్రాఁచిపనుల్ సేయ లేచునోదంఢ్ర కాన్తల వలని భయంబుకంటె. ఉ.రా ౫. ౨౮౨.

ప్రాఁచిపురువు. వి. (√ప్రాఁచి.) క్షుద్రజల జంతువిశేషము

గీ. . నీరు,పాప నీర్కట్ట నీర్పిల్లి ప్రాఁచిపురువు, లాది కొఱగాని జంతువు లన్నివిడిచి.

(హంస. ౪ ౧౭౭)

ప్రాఁజేదువు. వి. (√ప్రాఁత.) వేదము.

(జ. వ అని శ. ర)

సీ. గీ తోఁచెఁబ్రాచీనమహీధరోత్తుంగ నరణిఁ, బ్రాఁజదువుమానికంబుల బరణితరణి.

పారి. ౪. ౪౯.

శా ఆ,నందోబ్రహ్మయటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా.

మనుచ. ౨. ౭౨.

ఉ. పదములయుక్తిఁ జేసి గురుసన్నిధిఁ బాఠకులొనరఁ జొరఁ బ్రాఁజదువులు . . తుది నుట్టిపడంగఁ బఠియించుబుగన్.

భోజరా. ౪. ౨౨౦.

ప్రాఁత = పాఁత, వి. ౧. వస్త్రము. (శ. ర.)

౨. జీర్ణవస్త్రము, వస్త్రఖండము, గుడ్డపేలిక.

సీ. పెనుమైలయగు పీలిపేలిక చెలఁగట్టి పైకొక దుమ్మిలి ప్రాఁతదాల్చి.

భా. రా. బాల. ౫౯౩.

ఉ. ప్రాంతలు మీఁదఁగప్పినఁ గృపామతి
సొచ్చితి (కాశీ. ౩. ౧౦౦.)

వ. ... కతిపయకాలంబది ప్రాంతఁ గనిరైన నీడ కవిరైనం జెదరు గాదనకట్టువగుంబు ...
ఆము. ౪. ౩౪.

విశే. (దీనికి ఉత్తరపదము పరమగునపుడు బహుళంబుగా తొలియచ్చుమీఁదివర్ణంబుల కెల్ల లోపంబగు. చూ. (ప్రా.) ౧. ప్రాచీనము, పూర్వపుది.

ద్వి. పసరింపఁ గ్రొత్తేమి ప్రాంతేమి యింక.
బస పు. ౫ ౪౭౭ పం

గీ. ప్రాంతయనఁగ బురాణాఖ్య పరఁగుచుండు
ఆం. భా. ౩. ౨౩.

౨. పూర్వకాలపుది, చిరకాలమునుండియున్నది.

గీ. భక్తిమతి లింగపతియను ప్రాంతమాట, నేఁడుగాఁగద్దె నే యలినీలవేణి.
హర. ౨ ౧౩.

క. తనదు ప్రాంతందలమున్, స్థానికుఁ డొసంగి.. ఆము. ౨. ౬౫. (వేదం.పా.)

౩. భృత్యుఁడు, సేవకుఁడు.

ఆ. పసులఁగాచి కాని బ్రతుకఁ గొరవుల ప్రాంతలమున్న కేను ధర్మపుత్రు, పశుగణంబు లెల్లఁ బాలింతు .
భార. విరా. ౧. ౨౬౫.

౪. పూర్వపరిచితుఁడు, పరిచితుఁడు.

ఉ. ప్రాంతల కేమ నీకుఁ బహుకాములఁబొందక యున్ననాఁటి నీ,చేఁతలు గంటిమి ...
ఉ. హరి. ౪. ౯౩.

గీ. ... కేలంబు కల కేలుగలుగఁ బ్రాంత, వాతిఁ గాఁ జేయు మరిచని చేరకుండ ...
ఆము. ౪. ౨౫౮.

౫. జీర్ణము, చినిఁగినది.

గీ. కట్టుబట్టలు గాని ప్రాంతబట వయమ్ము,గోఁచు లిడి నిచ్చి ... (ఆము. ౭. ౪౮.)

గీ. .. ప్రాంతపైచీరచెఱఁగున బడుగువాఁడు, హేమకైలంబు చిదిపి తా కన్ని మడుచు.
వైష. ౮. ౧౪౮.

ప్రాఁబసిఁడి = చిరకాలమునాఁటి బంగారము.

ఉ. బలితంపుఁగాఁగుబన్, మాఱుగుచున్న ప్రాఁబసిఁడి మంచి ధనార్థుల కిచ్చు ..
పాండు. ౪. ౨౧౧.

ప్రాఁబాఁపఁడు = ముసలిబ్రాహ్మణుఁడు.

గీ. వచ్చి ప్రాఁబాఁపఁ డొకఁ డిచ్చెఁ బాటి సాఁచి,తదవి నీ పెద్ద రన్న.
కళా. ౧. ౧౬౮.

ప్రామానికము = కెంపు.

సీ. ప్రామానికపునిగ్గుఁ బ్రామానికపు శిలాపట్ట భంగంబులు పరిఢవిల్ల.
సారంగ. ౧. ౧౧౨.

జ ప్రా,ప్రాఁగబ్బము, ప్రాఁజదువు, ప్రాంతకాఁపు ప్రాంతగిల్లు, ప్రాంతచదువు, ప్రాంతపలుకు, ప్రాంతమగవాఁడు, ప్రాంతమాట, ప్రాంతతీకము, ప్రాంతవడు, ప్రాఁబడు, ప్రాఁబల్కు. ప్రాఁబల్కుమ్రుచ్చు, ప్రాజంగము, ప్రాకేక, ప్రాదయ్యము, ప్రామడుగు. ప్రామినుకు, ప్రాయెలు, ప్రావిరి, ప్రావేల్పు.

ప్రాంతకాఁపు. విశే. (ప్రాంత + కాఁపు.) చిరకాలకాపు.

చ. కిదంక రెంలర్ప దొడ్డపను గ్రంథము కైచియు కొక్కునాఁటిలో, పదరఁగఁ బ్రాంతకాఁపులలు రక్కడ గోపకులంబు లందరుఁ. (హరి. పూ. ౭. ౨౫.)

ప్రాంతగిల్లు(లు). (√ప్రాంత.) ప్రాంతపడు.
(శ. ర., చి. ని.)

ప్రాంతచేదువు. వి. (ప్రాంత + చదువు.) చదువు.

గీ. ప్రాఁతచదువులు వలశాశిపనిఁడియందు,యు యమ్మ గూర్చుండు తీఁటయు నసుచు ...
దశా్మం. ౧. ౧౫౪.

ప్రాఁతపలుకు(పల్కు-) = ప్రాఁబల్కు-
ప్రాతమాట. వి. (ప్రాఁత + పలుకు) వేదము
సీ. తొలిసదువులు ప్రాఁతపలుకులు మిసుకులు ప్రామిసుకులు తొంటిభాసలనఁగ, వేదాఖ్య లగు . . సాం. వి. మాన. ౨.
ఉ. పలుకువెలందికిఁ మనికిప ట్టగు . ప్రాఁత పల్కు-లు బోటాటముగా పదువంగ నేరకే, తల దెగఁ ద్రెటులంబడిరొ .
అచ్చ రా. బాల. 3౯.

ప్రాఁతమగవాఁడు. వి. (√ ప్రాఁత )పురాణ పురుషుఁడు, శివుఁడు
గీ. ప్రాఁతమగవాఁడు పెలిబూదిపూఁత వాఁడు (అచ్చ రా బాల ౧3 )

ప్రాఁతమాట = పాఁతపలుకు.
వి. (√ ప్రాఁత ) వేదము
సీ ప్రాఁతమాటలె తాని బహువాగ్విస్ఫూర్తి లేని యజా గెల్తు రచ్చటి యవనిసురలు
వా స ౧ ౪.

ప్రాఁతతికము. వి (√ప్రాఁత )దాస్యము, సేవ
ద్వి. లరతరంబులను ప్రాఁతతికంబుగఁ బనఁ,. . బ్రతుకేఁగఁ గోరు నీ పరివారజనులె.
ద్వి పరమ. 3. ౨౧౨. పొ.

ప్రాఁతవడు = ప్రాఁబడు. వి (ప్రాఁత+పడు.) పాఁతగిల్లు, మాయు, కుప్పపట్టు.
చ. పలుకులపొందు లేక రసభంగము సేయుచుఁ ప్రాఁతవడ్డమాటలఁ దమ సేస్తు చూపి . .
నిర్వ. ౧. ౭.

క. . . ప్రాఁతవడిన కృపాణంబులు గడుగ వాఁడనిచె నీ,గళర క్తముచేత నేఁడు ఖరకర వంశా. కవిక. ౨. ౨౧3.

ప్రాఁతు = పాఁతు. స. క్రి. భూమిలో పాఁతి పెట్టు.
ద్వి . ఒకపాతకు సొలసి చచ్చుడును, నతో్చనఁ ప్రాఁతినఁ తెచ్చెర నెలచె, నమ్మగా నీమత్తి .
బస. పు ౫ ర౬౨. పం.
సీ. క్రమమున నాల్గవంచముకోల్ల క్రింద నేఁ ప్రాఁతిన యవి మాకుఁ బాల్గొనఁగఁ గొలొనుఁడు . (ద్వా. ౯. ౧౦3.)
వి. మాలము.
గీ. నగళిఖరశిల్ల పిగపట్టి దిగిచినట్లు, వ్రాల్ల కల్లోలముగఁ ప్రాఁతు పెల్లగిల్ల.
బహు. 3. ర౭

ప్రాఁబడు = ప్రాఁతవడు. అ. క్రి. (ప్రాఁత + పడు.) ౧. మాయు, నశించు, పోవు.
సీ ములు పడిప్రాఁబడ్డ వలరాజుడాగులమీఁద గందపుఁబూఁత మేకొలిచి. (వి.క్ర. ఆ. ౪.)
క. వెలు తెతేఁగిన నాడెదరను,తలఁకది ప్రాఁబడియె నిపుడు .
కవిక. 3. ౧౦౨.
చ. బతిచెడి సంచరించెదవు ప్రాఁబడిపోయెనె నీవికేకముల్. (క్రీడా. ౪౦.)
౨. అలవడు.
చ .. వలరాయనిగ్రావ్యరికొఁడిలెని ప్రాఁ, బడనిమొయారి దారి కనుపట్టఁ గొలం కుసఁజేరి రెంతయుల్. (చంద్రా. ౪. ౨3౯.)

ప్రాఁబల్కు-(లుకు) = ప్రాఁతపల్కు-. వి. (ప్రాఁత = పలుకు) వేదము. (శ్రుతియందలి వచనాంతము.)

క. ... నీరజంబులు బొందుగఁ బ్రాఁబల్కు
నడుపుపాలిక నుమ్మ్రా (నీలా. ౧. ౯౧.)

క. . బ్రాఁబలుకులు పెనుమినుకులు శాపెల
యున్ బ్రకులకును వేల్గు .
అం. సం. దేవ. ౪౧

బ్రాఁబల్కు కడలు = ఉపనిషత్తులు.

సీ. బ్రాఁబల్కు,కడలవెంబడి మెలంగుచు వేల్పు
గమిచేత మ్రొక్కులు గొనెడుచాయ.
అచ్చ. ఛా. ౧. ౬.

ఇట్లే. బ్రాఁబల్కు కుదలు.

సీ. బ్రాఁబల్కు కుదలలోఁ బ్రణుతించుసంయమి
ప్రవరుల నతిఁ బెదచెవులఁ బెట్టి.
ఉ. రా. ౨. ౧౩౭.

బ్రాఁబల్కు చాల్ తల్లి = వేదమాత.

దండకము బ్రాఁబల్కు చాల్ తల్లి కీల్గంటు
బ్రాఁబల్కు లూర్పుంగముల్.
అచ్చ రా. యు ౧౬౧.

ఇట్లే. బ్రాఁబల్కు కల్కి

సీ. బ్రాఁబల్కు కల్కి పాపటకు సిందూరమై
యొవ్వానిపదకాంతి యొనక మెసఁగు
ఉ రా. ౫ ౬౯.

బ్రాఁబలుకుటెంకి = సూర్యుఁడు.

గీ. తమ్మిచుట్టము మిన్నురతనము ప్రొద్దు, బ్రాఁబ
లుకుటెంకి సూర్యుఁడౌ.
అం. ఛా. ౧. ౭౧

ప్రాబల్కు-ప్రముచ్చు = వి (√ప్రాఁత.)
సోమకుఁడు.

దండకము మున్నీరుసొత్తెంచి బ్రాఁబల్కు
ప్రముచ్చునవ్వడిన్వ్రచ్చి. (నీలా. ౧ ౪౧.)

ప్రాక్. సం. అవ్య. (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.) ౧ ముందు, ముందట ౨. మునుపు. ౩ మొదట, పూర్వము. ౪ తూర్పున. ౫. ముంగల. ౬. వెనుక. ౭. వేగవను.

ప్రాక = పాక. వి. దూలము లంచక కట్టిన యిల్లు, శాల. (శ. ర.)

ప్రాకట్యము. సం వి అ. న. ప్రకటముగా నుండుట, ప్రసిద్ధత.

ప్రాకరణికము. సం. విశే. (అ. ఈ. అ) ప్రక రణముచే ప్రాప్తించినది, ప్రస్తుతవిషయమునకు సంబంధించినది. (ఉపమేయాది.)

ప్రాకషికుఁడు. సం. వి. అ. పుం. ౧. స్త్రీలకు నర్తనము గఱపువాఁడు, నట్టువుఁడు. ౨. పరదా రోపజీవి, ఇతరుని పెండ్లముచే పొట్ట ప్రోచికొను వాఁడు. (వాచ)

ప్రాకామ్యము. సం. వి. అ. న. ౧. ఇచ్ఛ యొక్క స్వాతంత్ర్యము. ౨. ఇచ్ఛాపూర్వ కత్వము. ౩. అడ్డు లేనియిచ్ఛ. (ఇది అష్టసిద్ధులలో నొకటి.)

ప్రాకారము. సం. వి. అ. పుం. చుట్టు పైచిన పెలుగు, గుడి లోనగువాని చుట్టుగోడ, ప్రహరి.

ప్రాకారీయము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రాకారమునకుఁ దగినది. (ఇటుక మొ.) ౨. చుట్టు ప్రాకారము గలది.

ప్రాకాశము. సం వి అ. పుం. కుండలాభర ణము.

ప్రాకాశ్యము. సం. వి. అ. న. ౧. స్పష్టముగా నుండుట, తేటతెల్లముగా నుండుట. ౨. ప్రసిద్ధి ఖ్యాతి.

ప్రాకృతప్రలయము. సం. వి. అ. పుం. ప్రళయ భేదము.

ప్రాకృతమిశ్రము. సం. వి. అ. న. తనకు సహజ శత్రువగు రాజుయొక్క దేశమునకు ననంతర దేశపురాజు.

ప్రాకృతము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. స్వభావసిద్ధము, సహజము. ౨. సామాన్యము, సాధారణము. ౩. అల్పము, అముఖ్యము. ౪. ప్రకృతివలనఁ బుట్టినది. ౫. లౌకికము. (భాష) వి. అ. న. ఒకానొక భాష.

ప్రాకృతశత్రువు. సం. వి. అ. పుం. తనదేశము నకు తరువాతివాఁ డగురాజు.

ప్రాకృతికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. ప్రకృతివలనఁ గలిగినది. ౨. మిథ్యాత్మకము, భ్రమాత్మకము. ౩. ప్రకృతిసాధ్యము.

ప్రాకృతుఁడు. సం. విణ. అ. ఆ. అ. సంస్కారము లేనివాఁడు, నీచుఁడు, పామరుఁడు.

ప్రాకెన(న్న) = పాక్కెన. చూ. పాకెన్న.

క. తగఁ బ్రాకెనయును దీవించి,నగవులనవ
రైనపెనుక యయా. ౪. ౧౧౫.

మ. ... మఱిప్రాకెన్న చెలంగఁ గీర్తిలతికల్
పాకారి లోకంబుకెం,టకా బ్రాకె న్నయు
కొంప్పు పాంచా. ౪. ౩౧.

ఉ. ధరణీసురేంద్రులు .. క్రమయుక్తరీతిఁ
బ్రా,కెన్న రొమచర్చి రింపలర
ఇందు. ౬. ౬౫.

ద్వి. ప్రాకెన్నజేసిరి బ్రహ్మాదు లెల్లఁ, బ్రాకటాశీ
ర్వాదఘనులు మా. మ్య. వి. ౩. ౫౭.

ప్రాక్కు. సం. విణ. (చ్. చీ. చ్.) ౧. ముందు ప్రక్క పెలఁగనైనది, ముందరిది. ౨. మును పటిది. ౩. తూర్పుది.

ప్రాక్కూలము. సం. విణ. (అ. ఆ. అ.) కొనలు తూర్పుదంతు తిరిగినది. (కుశాది.) వి.అ.న. తూర్పుదంతుగా కొనగల దర్భపోఁచ.

ప్రాక్తనము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. పూర్వపుది, మునుపు గలిగినది. ౨. మునుపటి కాలపుది, మునుపటి జన్మమునది. ౩. ప్రాచీనము ప్రాఁతది.

ప్రాక్ఫలము. సం. వి. అ. పుం. పనస చె.

ప్రాక్ఫ(ఫా)ల్గుని. సం. వి. ఈ. స్త్రీ. పూర్వ ఫల్గుని, పూర్వాభాద్ర.

ప్రాక్ఫాల్గునుఁడు. సం. వి. అ. పుం. బృహ స్పతి గ్రహము.

ప్రాక్ఫాల్గునేయుఁడు. సం. వి = ప్రాక్ఫాల్గునుఁడు.

ప్రాక్శిరుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) తూర్పు వంక తలగలవాఁడు.

ఇట్లే ప్రాక్శిరసుఁడు, ప్రాక్శిరస్కుఁడు.

ప్రాక్సంధ్య. సం. వి. అ. స్త్రీ. పూర్వసంధ్య, తొలుసంజ.

ప్రాక్సవనము. సం. వి. అ. న. యజ్ఞమునందలి ప్రథమసవనము.

ప్రాక్స్రోతస్సు. సం. విణ. (స్.) తూర్పు దిక్కుగా ప్రవహించెడిది. సం. వి. స్. స్త్రీ. నది, ఏఱు.

ప్రాఖర్యము. సం. వి. అ. న. ౧. మిక్కిలి వాఁడియైనదాని ధర్మము. ౨. కటుత్వము. ౩. మత్తత్వము. ౪. ఉత్సాహము.

ప్రాగభావము. సం. వి.అ. పుం. ౧. (న్యాయ.) ఇపుడుగాక భవిష్యత్కాలాది ప్రతీతి సిద్ధమగు వినాశియగు అభావము.

ప్రాగల్భ్యము. సం. వి. అ. న. ౧. దిట్టతనము, ధృష్టత్వము. ౨. గర్వము. ౩. ప్రతిభ, నేర్పు. ౪. పరిపాకము. ౫. ధర్షణము, తోఁచిక. ౬. శక్తత్వము, మాటకారితనము. ౭. ఉద్ధతి అంకస్థ్యము. ౮. నిశ్చయము, దృఢమతి.

౯. పెంకటకము, ఖార్త్స్యము. ౧౦. స్త్రీ. శృంగారశేష్టావిశేషము. (శ. ర.)

ప్రాగుత్తరము. సం. విశే. (అ. ఆ. అ.) తూర్పుత్తరముక్కటి.

ప్రాగుదీచి. సం. వి. ఈ. స్త్రీ. తూర్పుత్తర దిక్కు, ఈశాన్యకోణము.

ప్రాగ్జ్యోతిషము. సం. వి. అ. పుం. ఒకానొక దేశము. (దీనికి కామరూప మని నామాంతరము. వి. అ. న. ఒకానొకపట్టణము.

ప్రాగ్దేశము. సం. వి. అ. పుం. తూర్పుదేశము.

ప్రాగ్భారము. సం. వి. అ. పుం. ౧. అతిశయము, ఉత్కర్షము. ౨. పరభాగము, ముందటిభాగము. ౩. పర్వతాదుల శిఖరము.

ప్రాగ్భవము. సం. వి. అ. పుం. ౧. ముందుపుట్టి. ౨. ఉత్కర్షము, అతిశయము.

ప్రాగ్రసరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. మొదటివాఁడు. ౨. అగ్రగామి, ముందునడచు వాఁడు.

ప్రాగ్రహరము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. శ్రేష్ఠము, ముఖ్యము. ౨. మొదటిది. ౩. ముందు నడచునది. (శ. ర.)

ప్రాగ్రాటము. సం. వి అ. న. అఘనదధి, గడ్డగా నుండని పెరుఁగు (అ. ని)

ప్రాగ్ర్యము. సం. విశే = ప్రాగ్రహరము.

ప్రాగ్వంశము. సం. వి. అ. పుం. ౧. యజమానపతి నంశము. ౨. హవిర్గృహమునకుఁ దూర్పుభాగ మున యజమానుఁడు లోనగువా రుండుట కైన గృహము.

ప్రాఙ్గంగ్యం కుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు (వాచ.)

ప్రాఘాతము. సం. వి. అ. పుం. యుద్ధము. (వాచ.)

ప్రాఘారము. సం. వి. అ. పుం. ౧. కారుట, స్రవించుట. (జలాదిధార. అవి. శ. ర.) ౨. యజ్ఞాదులందు అగ్ని హోత్రముమీఁద ఘృతా దులు కారుట. (వాచ.)

ప్రాఘుణకుఁడు. సం. వి. అ. పుం. అతిథి.

ప్రాఘుణికుఁడు. సం = ప్రాఘుణకుఁడు.

ప్రాఘుణుఁడు. సం. వి. అ. పుం. అతిథి.

ప్రాఘూర్ణ(ర్ణి)కుఁడు. సం. వి. అ. పుం. అతిథి. (వాచ.)

ప్రాఙ్న్యాయము. సం. వి. అ. పుం. వ్యవహార విషయమగు ఉత్తరభేదము, ఇది పూర్వవిచా రణయందు జరిగినన్యాయము చెప్పి చూపుట. (వాచ.)

శ్లో. ఆచారేణావసన్నోపి పునర్లేఖయతే యది, సోభిధేయో జితః పూర్వం ప్రాఙ్న్యాయస్తు స ఉచ్యతే.

ప్రాచారుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ఆచార ప్రచ్యుతుఁడు, ఆచారము విడిచినవాఁడు.

ప్రాచార్యుఁడు. సం విశే. (అ. ఆ. అ.) ప్రాప్తా చార్యుఁడు, ఆచార్యుని విడచినవాఁడు. (శబ్దాది.)

ప్రాచి. సం. వి. ఈ. స్త్రీ. ౧. తూర్పు. ౨. పచ్చాకుచెట్టు, పాతికపత్రి. ?.

ప్రాచిక. సం. వి. అ. స్త్రీ. ౧. వనమక్షిక, అడవియీఁగ. ౨. ఆఁడుడేగ, ౩. పాలపిట్ట. ౪. నల్లి.

ప్రాచీతము. వి. (సం. ప్రాచ్యత్తరం.) ప్రాయ శ్చిత్తము. పాపనివారణార్థము చేయుకర్మము. (శబ్ద.)

క. త్రిందున మేను పిడియు మనుకొందలపా
టొంది ప్రాణగోడ్డ బుగుటఁ దప్పం దొలఁ
గఁజాలెను ... భార. అను. ౪. ౩౨౦.

ప్రాణగ్రహము. సం. వి. అ. పుం. ముక్కు.

ప్రాణఘాతకము. సం. విణ. (అ.ఆ.అ.) ప్రాణమును నాశనము సేయునది, ప్రాణము పోఁగొట్టునది.

ప్రాణఘ్నము. సం. విణ. (అ. ఆ అ.) ప్రాణమును నాశనము చేయునది.

ప్రాణచ్ఛేదము. సం. వి. అ. పుం. వధము, హత్య.

ప్రాణత్యాగము. సం. వి. అ. పుం. ప్రాణమును వదలుట, ఆత్మహత్య ౨. మరణము.

ప్రాణథము. సం. విణ (అ. ఆ. అ) బలవంతము, బలము గలది.
వి. అ. పుం. = ప్రాణము. (వాచ.)

ప్రాణద. సం. వి. ఆ. స్త్రీ. ౧. హరీతకి. †.

ప్రాణదండము. సం. వి. అ. పుం. మరణదండనము.

ప్రాణదము. సం. విణ. (అ. ఆ అ.) ౧. ప్రాణముల నిచ్చునది. ౨. దాత.
వి. అ. న. ౧. జలము. ౨. నెత్తురు. ౩ బుద్ధియను గంధద్రవ్యము. పుం. జీవకము, వేగిస. †.

ప్రాణదయితుఁడు. సం. వి. అ. పుం. పెనిమిటి, మగఁడు.

ప్రాణదాత. సం. విణ (ఋ. త్రీ. ఋ.) రక్షకుఁడు, ప్రాణములను గాచినవాఁడు, ప్రాణముల నిచ్చువాఁడు.

ప్రాణదుఁడు. సం. వి. అ. పుం. ౧. విష్ణువు ౨. చికిత్సకుఁడు, వైద్యుఁడు.

ప్రాణధారణము. సం. వి. అ. న. ౧. శరీర ప్రాణదికొనుట, దేహయాత్ర. ౨. జీవనోపాయము, బ్రదుకుఁ దెరువు. ౩. సత్త్వము, జీవనశక్తి.

ప్రాణధారము. సం. విణ. (అ. అ. అ.) ప్రాణముగలది.
వి అ పుం ప్రాణి, చేతనము.

ప్రాణనము. సం వి. అ. పుం. జలము. వి. అ. న. ౧. ఊర్పుట, శ్వాసవ్యాపారము. ౨. జీవనము, బ్రదుకు. ౩. ప్రాణము కలిగించుట.

ప్రాణనాథుఁడు. సం. వి. అ. పుం. ౧ పెనిమిటి ౨. యముఁడు (విల్యమ్సు)

ప్రాణనిగ్రహము. సం. వి. అ. పుం. ప్రాణాయామము.

ప్రాణపతి. సం వి. ఇ. పుం. ౧. ప్రియుఁడు, చెలువుఁడు, పెనిమిటి ౨. ఆత్మ.

ప్రాణపత్ని. సం వి. ఈ. స్త్రీ. కంఠస్వరము ఎలుఁగు.

ప్రాణప్రద. సం. వి. ఆ. స్త్రీ. బుద్ధి యను నోషధి. †

ప్రాణప్రదము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. బలము నిచ్చునది. ౨. ప్రాణము నుద్ధరించునది.

ప్రాణభాస్వత్తు. సం. వి. త్. పుం సముద్రము.

ప్రాణభృత్తు. సం. విణ. (త్. తీ. త్.) ౧. ప్రాణము గలది, చేతనము. ౨. ప్రాణమును పోషించునది. వి. త్. పుం. చేతనవస్తువు, ప్రాణి.

ప్రాణమయకోశము. అ. పుం. పంచకోశములలో నొకటి.

ప్రాణమయము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రాణముగలది. వి. అ. పుం. ప్రాణమయకోశము.

ప్రాణప్రవృత్తి. సం. వి. ఇ. స్త్రీ. జీవసంబంధి యగు (హృదయాదుల) వ్యాపారము.

ప్రాణసంకటము. సం. వి. అ. న. ౧. ప్రాణములు నిలుచుటగాని విడుటగాని యనుసందేహించు సంకటపు యుపాయము, మరణము గలిగించఁగల కష్టి యవస్థ, గొప్పవిపత్తు.

చ. . . పాంథులనుట ధరిత్రిపై, సరగిదఁ ప్రాణసంకటము సైనరయుండాలో నుందు జేసెదిన్. వేం. పంచ. ౧. ౭౬౫.

ప్రాణసంశయము. సం. వి. అ. పుం = ప్రాణసంకటము.

ప్రాణసద్మము. సం. వి. న్. న. దేహము.

ప్రాణసమ. సం. వి. అ. స్త్రీ. ప్రియురాలు, భార్య.

ప్రాణసముఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ప్రాణములతో సమానుఁడగు ప్రియుఁడు. వి. అ. పుం. ౧. ప్రియుఁడు, పెనిమిటి.

ప్రాణహరము. సం. విశే. (అ. ఆ. అ.) ౧ బలమును హరించునది. ౨. ప్రాణమును దీయునది (విషము లోను) ౩. దేహమునుండి దేహాంతరమును పొందించునది.

ప్రాణహారకము. సం విశే. (అ ఇకా అ) ప్రాణమును హరించునది, నాశకము. వి. అ. న. ఒకవిధమగు వత్సనాభము. ?

ప్రాణాం(త)తికము. సం. విశే (అ. ఇకా అ.) ౧. మరణమును కలిగించునది. ౨. ప్రాణముండువరకు వర్తించునది. ౩. భయంకరము, అపాయకరము. వి. అ. న. వధము

ప్రాణాఘాతము. సం. వి. అ. పుం. ప్రాణాపాయము. (శ. ర.)

ప్రాణాచారము. సం. వి. అ. పుం. ప్రాణాపాయము. (శ. ర.)

ప్రాణాచార్యుఁడు. సం. వి. అ. పుం. రాజ వైద్యుఁడు.

ప్రాణాతిపాతము. సం వి. అ పుం. = ప్రాణఘాతము.

ప్రాణాత్మ. సం. వి. న్ పుం జీవాత్మ.

ప్రాణాత్యయము. సం వి అ పుం ౧ ప్రాణములు పోవుసమయము. ౨. ప్రాణముపోవుట, మరణము

ప్రాణాదము. సం విశే. = ప్రాణాంతకము.

ప్రాణాధిపుఁడు. సం వి అ పుం. ఆత్మ

ప్రాణాపానములు. సం. వి ద్వి. అ పుం. ప్రాణవాయువును అపానవాయువును, ఉచ్ఛ్వాసము, నిశ్వాసము. (విల్యమ్సు.)

ప్రాణాపానులు. సం. వి. అ. పుం ద్వి. అశ్వినీదేవతలు.

ప్రాణాయనము. సం. వి అ. న. ఇంద్రియము

ప్రాణాయామము. సం వి. అ. పుం. ప్రాణవాయువును (నాశికాముఖములందు సంచరించెడు దానిని మంత్రపూర్వకముగా) నిరోధించుట. (ఇది యోగాంగము లగునష్టాంగములలో నొకటి.)

ప్రాణాహుతి. సం. వి ఇ. స్త్రీ భోజనమునకుముందు పంచప్రాణరూపాగ్నిని దృప్తిచేయు ఆహుతి.

ప్రాణి. సం. విశే (న్. నీ న్.) ప్రాణముగలది, జీవించునది, బ్రదుకునది. వి. న్. పుం. ౧. జంతువు, జీవము. ౨. మనుష్యుఁడు.

ప్రాణిజాతము. సం. వి. అ. న. సర్వజీవసమూహము, జీవసమష్టి.

ప్రాణిద్యూతము. సం. వి. అ. పుం. న ౧. కోడిపందెము లోనగునది, సమాహ్వయము, యుద్ధము. (శ. ని.)

ప్రాణిమాత. సం. వి. ఋ. స్త్రీ. గర్భధాత్రీ క్షుపము. శ.

ప్రాణిహింస. సం. వి. ఆ. స్త్రీ. జీవములను హింసించుట

ప్రాణిహిత. సం. వి. ఆ. స్త్రీ. పాదుక, పావలు. (త్రి. ని.)

ప్రాణేశ. సం. వి. ఆ. స్త్రీ. ప్రియురాలు. పత్ని

ప్రాణేశము. సం. వి. అ. పుం. ఒకానొక • వాయువు. (విల్యమ్సు.)

ప్రాణేశుఁడు. సం. వి. అ. పుం. ప్రియుఁడు, పతి.

ఇట్లే: ప్రాణేశ్వరుఁడు మొ.

ప్రాణోపహారము. సం. వి. అ. పుం. ఆహారము (విల్యమ్సు.)

ప్రాతఃకాలము. సం. వి. అ. పుం. వేకువ. ప్రొద్దుకా. ప్రాతఃకాలము వాయసంబు .

నైష. ౮ ౧౯.

ప్రాతర్. సం. అవ్య. (ఇది తెనుఁగున సమాస పూర్వపదముగానే యుండును)

ఉదా: ప్రాతఃకాలము, ప్రాతస్స్నానము, ప్రాతర్భోక్త. ౧. వేకువ. ౨. సూర్యోదయము మొదలు రెండు ముహూర్తముల కాలము.

ప్రాతరచకము. సం. వి. అ. పుం. ఒకానొక సర్పము. (శాండు)

ప్రాతర్గేయము. సం. వి. అ. న. ప్రాతఃకాలమున గానముచేయఁదగిన పాటము. (త్రి. ని.)

ప్రాతర్గేయుఁడు. సం. వి. అ. పుం. స్తుతిపాఠకుఁడు, వేకువను రాజాదుల గీతాదులచే మేలుకొలుపువాఁడు.

ప్రాతర్దినము. సం. వి. అ. న. తెలిగలు, దినమునందు మొదటి భాగము.

ప్రాతర్భోక్త. సం. వి. ఋ. పుం. కాకి

ప్రాతర్భోజనము. సం. వి. అ. న. = ప్రాతరాశము.

ప్రాతస్తనము. సం. విశే. (అ. ఈ. అ) ప్రాతఃకాలమందలిది, వేకువది

ప్రాతిస్త్రివర్గ. సం. వి. ఆ. స్త్రీ. (దేనియందు ప్రాతస్స్నానముచే త్రివర్గము లభించునో) గంగ

ప్రాతస్సంధ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. తొలిసంజ. ౨. సంధ్యోపాసనభేదము

ప్రాతస్సవనము. సం. వి. అ. న. ప్రాతఃకాలమునందు చేయఁదగిన సోమయాగాంగకర్మభేదము.

ఇట్లే ప్రాతస్సవము మొ.

ప్రాతాని. ప్రధాని, మంత్రి

వ. • చైత్రబ(శ) బృహస్పతి వారమున కలింగలోవిబోడగంగ దేవుని ప్రాతాని బుడిమిరిదాను నాయుకకొడుకు ...

దశా. ౪ ౧౧౭౫.

ప్రాతిక. సం. వి. అ. స్త్రీ. జపా, దాసనము. శ. (రాజని.)

ప్రాతికూలికము. సం. విశే. (అ. ఈ. అ.) ప్రతికూలమైనది.

ప్రాతికూల్యము. సం. వి. అ. న. ప్రతికూలత్వము. (వ్యతి. అనుకూల్యము.)

ప్రాతిజనీనము. సం. విణ. (అ. ఈ. అ.) ప్రతిజనునకు సాధకమైనది.

ప్రాతిపక్ష్యము. సం. వి అ. న. శత్రుత్వము, పగ.

ప్రాతిపదికము. సం. వి. అ. పుం. అగ్ని. వి. అ. న (ధాతుభిన్నంబును ప్రత్యయభిన్నంబును కృత్తద్ధితభిన్న ప్రత్యయాంత భిన్నంబును వాక్యభిన్నమునగు) అర్థవచ్ఛబ్ద రూపము, నామము.

ప్రాతిభము. సం. విణ (అ ఈ అ) ౧. ప్రతిభకు సంబంధించినది. ౨. ప్రతిభవలన జనించినది

వి. అ. న. ౧. (యోగులకు కలుగు) ఉపసర్గము, విఘ్నభేదము. ౨. ప్రతిభ, బుద్ధివైశద్యము (విల్యమ్సు.)

ప్రాతిభావ్యము. సం. వి. అ. న. ౧ పూటకాఁపుతనము, ఉత్తర వాదిత్వము ౨. ధనము. (వాచ)

ప్రాతిభాసికము. సం. విణ. (అ. ఈ. అ) ప్రతిభాసించునది, మిథ్యయైనది. ౨. (ఒకదాని.) వలె కనఁబడునది.

ప్రాతిలోమ్యము. సం. వి అ న. ప్రాతికూల్యము, విరోధము (విల్యమ్సు.)

ప్రాతివేశికుఁడు. సం. వి. అ. పుం పొరుగువాఁడు.

ఇట్లే ప్రాతివేశ్మకుఁడు, ప్రాతివేశ్యకుఁడు నెం.

ప్రాతివేశిని. సం. వి. ఈ. స్త్రీ. (సమీప గృహవర్తినియగు) దూతికా విశేషము, (ప్రతాపరుద్రీయము.)

ప్రాతివేశ్యుఁడు. సం. వి. అ. పుం. ౧. పొరుగువాఁడు, ప్రక్కయింటివాఁడు.

ప్రాతిశాఖ్యము. సం. వి. అ. వైదిక వ్యాకరణ విశేషము. (వేదములలో ప్రతిశాఖకు చెందిన వ్యాకరణము.

ప్రాతిస్వికము. సం విణ. (అ. ఈ. అ.) తనకుమాత్రము కలది, అసాధారణము. (త్రి. వి.)

ప్రాతిహార(రి)కుఁడు. సం. వి అ. పుం. ప్రతిహారకుఁడు.

ప్రాతిహార్యము. సం. వి అ. న. ౧. గారడీ విద్య ౨. అద్భుతము 3 ద్వారపాలకత్వము, పారా.

ప్రాతీతికము. సం విణ (అ. ఈ. అ.) ప్రాతిభాసికము.

ప్రాతీపుఁడు. సం. వి. అ. పుం. శంతనుఁడు. (త్రి. వి.)

ప్రాతీపికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. ప్రతికూలము, విరుద్ధము. ౨. ప్రతికూలముగా నడచునది.

ప్రాత్యయికము. సం. విణ. (అ. ఈ. అ.) నమ్మదగినది. విశ్వసనీయము.

ప్రాత్యయికుఁడు. సం. వి. అ. పుం. ప్రతిభువు, పూటకాఁపు.

ప్రాథమకల్పికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. క్రొత్తగా చదువ నారంభించినవాఁడు, (శిష్యుఁడు) ౨. మొదట ప్రారంభింప దగినది. (వేదాధ్యయనాది.)

ప్రాథమికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. ప్రథమము, మొదటిది. ౨. మునుపటిది, పూర్వము. 3. మొదటిసారి కలిగినది.

ప్రాథమ్యము. సం. వి. అ. న. ప్రథమత్వము.

ప్రాదయ్యము. వి. (√ప్రాఁత) రాకాసుఁడు.

ము. ...బంటవలెంతి యల్లుఁడును ప్రాదయ్యంత్రి తేజ్యంబతియుచున్, బలుచందంబులఁ గోరి...
అత్య. రా. యు. ౩౫.

**ప్రాదుర్భవించు.** సం. అ. క్రి. పుట్టు.

వ. .. నాదుశరీరంబునం ప్రాదుర్భవించిన శృంగారకళాధురంధరుం డైనపురుషుండు బుగ్వేదం బని .. వరాహ. ౧. ౯౯.

**ప్రాదుర్భావము.** సం. వి. అ పుం. ౧. పుట్టుక. ౨. పొడచూపుట. ౩. (దేవాదుల) అవతారము.

**ప్రాదుర్భూతము.** సం విశే (అ. ఆ అ) ౧ పొడచూపినది. ౨. పుట్టినది

**ప్రాదుష్కరణము.** సం వి అ. పుం. ౧. ప్రకాశనము ౨. పొడచూపించుట.

**ప్రాదుష్యము.** సం. వి అ న ప్రాదుర్భావము,

**ప్రాదేశనము.** సం. వి. అ న. త్యాగము, దానము.

**ప్రాదేశము.** సం. వి. అ. పుం. ౧. జాత్తిలి, తాడికి ౨ ప్రదేశము.

**ప్రాదేశి.** సం. విశే (న్. ని. న్.) ప్రాదేశపు కొలతగలది, జాత్తెఁడు

**ప్రాదేశికుఁడు.** సం. వి అ. పుం. కొద్దిభూమి కధిపతి, మండలాధిపతి.

**ప్రాదేశిని.** సం. వి. ఈ. స్త్రీ. చూపుడు వ్రేలు

**ప్రాధనికము.** సం వి. అ. న. పాశకర మగు ఆయుధము, పోటుముట్టు.

**ప్రాధానికము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రధానము, ముఖ్యము. ౨. ప్రధానమునకు (ప్రకృతికి) సంబంధించినది.

**ప్రాధాన్యము.** సం. వి. అ. న. ౧. ప్రధానత్వము, ముఖ్యత్వము. ౨. ఉత్కర్షము, అతిశయము.

**ప్రాధేయపడు.** వి. న. క్రి. వేడుకొను. (శ. ర. ప్రాథేయపడు అని గ్రహించినాఁడు, కాని దానికి ప్రామాణ్యము చింత్యము.)
వ్యవ వాఁడు చాలఁ ప్రాధేయపడుచున్నాఁడు.

**ప్రాధ్వము.** సం. విశే (అ ఆ. అ.) ౧. ప్రణ తము, నమ్రము.
వి. అ. న. ౧. దూరమార్గము. ౨. బంధనము
అవ్య. అనుకూల్యము (శ. ర.)

**ప్రానుడుగు(వు).** దే. (ప్రాఁత + నుడుగు) సామెత.

సీ. మధుమున్నెనఁ ప్రానుడుగులఁ బొగడుచు పెడఁగుల, బడుగుల మముఁ ప్రోవుము
ఉ. వి. ౩. ౧౦.

చ. కుడుములు చాల మెక్కి కలఁగున్ బలు లాయువు తేట నెక్కి ప్రానుడువులవన్నె కెక్కె. అహల్యా. ౧. ౮.

**ప్రాపకము.** సం విశే. (అ. పిక. అ.) ౧. కొంపోవునది, పొందించునది. ౨. సమకూర్చు నది. (నిల్యమ్ము)

**ప్రాపడు.** అ. క్రి (ప్రాపు + పడు-వృత్తిని, వర్ణలోపము) ఆశ్రయము కలిగియుండు, ఇరవు కొనియుండు.

మ. ప్రమదోద్దామ సుఖానుభూతి గలలోఁ బ్రాపించుటన్ మున్ను చిత్తములం బ్రాపడి యున్న యయ్యరపురం దర్శనీ వీక్షించుచో ... హరి. ఉ. ౩. ౧౩౫.

**ప్రాపణము.** సం. వి. అ. న. ౧. పొందుట, పడయుట. ౨. పొందించుట, కొనిపోవుట. ౩. సమకూర్చుట, ఒడఁగూర్చుట.

**ప్రాపణికుఁడు.** సం. వి. అ. పుం. వర్తకుఁడు, వర్తకుడు.

ప్రాపణీయము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ప్రాపింపఁదగినది, పొందఁదగినది.

ప్రాపము. సం. విణ. (అ. ఆ. అ.) పొందునది, చేయునది.

ప్రాపించు. సం. స. క్రి. పొందు.

సీ. వీరలకు శుశ్రూషసేసి యిట్టిపరిజ్ఞానమును ప్రాపించితి. భార. అర. ౫. ౧౧౬.

క. ప్రాపింతురు మోక్షసుఖము పశుపతి నీచేన్. శివతత్త్వ ౭౯.

క. ... గోమతిఁ బ్రాపించి ప్రాద్యుగ్రుంకిన యంతన్. ఉ. రా. ౬. ౨౮౮.

అ. క్రి. ప్రాప్తమగు, కలుగు.

క. .. ధాత్రీపాలా శతమఖధములు, ప్రాపించును ధర్మతత్పరతసిద్ధించున్. భార. అను. ౫. ౩౧౫.

శా. . గీర్వాణాధీశుఁడుఁ బొందలేనిశుభము ల్ప్రాపించునీకు . ద్వా. ౧౦. ౭౯.

ప్రాపితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. కొంపోవఁబడినది, పొందింపఁబడినది ౨. పొందఁబడినది.

ప్రాపు. వి. (సం. ప్రాప్యం.) ౧. అండ, ఆశ్రయము.

క. ఆలమికొనియుండొరుల ప్రోవులఁ బ్రాపుల నెలమికలిమిఁ బొంది భార. ఉద్యో. ౨. ౧౬.

గీ. దీనిప్రాపునఁ జేల సాధింపకుండు, విమతు బాణుఁడు ద్రిజగతీవిజయసిద్ధి. సైమ. ౩. ౧౭౦.

౨. దిక్కు, రక్షణము, ఏడుగడ.

ఉ. .. ఏము ధర్మ్యులము ప్రాపును దాపును నీవ గల్గుటన్. హరి. ఉ. ౧. ౧౪౫.

శా. ... ఆకేశాగ్రదిగా, జ్యోతిర్మయబ్రహ్మబోధ రూపసమాహితంబై, యొప్పుతేజంబు ప్రాప్తై మాకున్ సిద తీపునకున్ ...
మల్లభా. నిర్వ. ౧.

గీ. ఎంచి చూడంగ మాకుఁ బ్రాపెవ్వ రిఁక, దీనులము మేము నీకన్న దిక్కుగలదె. జాహ్నవి. ౧. ౨౩౯. పొ.

౩. సాహాయ్యము, తోడ్పాటు.

గీ. . ఆదిత్యకులరాజవరాయుఁ డేము చెప్పు పదము దోడుప్రాపు సుస్థిరతఁ దనర. రాఘవ. ౩. ౧౧౭.

ఉ. వాలి నృపాలకాలి చతురంగబలంబుల ప్రాపుఁ గోరకం, జాల పరాక్రమించి... కుశ. ౧. ౧౯౦.

౪. అవలంబము, అండ.

సీ. కృత్యపంచకము సాఁగింపఁగఁ దేయింతి ప్రాపు లేక కృతాంతధంజయుండు. కాశీ. ౪. ౧౫౦.

ఆ. ప్రాపుఁ జూపువాఁడు పరమపుణ్యుం డయ్యె, ప్రాపుఁ జెఱచువాఁడు పసువు వేమ వేమన. ౩. ౭౯.

౫. స్థానము, నెలవు.

౬. . యేపారఁ గీర్తిలక్ష్మికిఁ, బ్రాపై తొల్లింటిరెడ్డి రాజులకరణిన్. వి. పు. ౧. ౩౧.

గీ. సత్యమున కాస్పదము సదాచారమునకుఁ, బ్రాపు పైపుణ్యమునకుఁ జేపట్టుఁ గొమ్మ. ఉ. రా. ౧. ౩౬.

౭. సమీపము, దగ్గఱ.

గీ. . ప్రాపు చొక్కు మరంగటు పజ్జ చెంత, నికటాభ్యాసము సమీప. ఆం. భా. ౩. ౨౧.

శా. సింహస్కంధుని ... నీకును, స్త్రీయే పార్వతీ
సమ్యగ్భావమిగా జాల జింతింప నీప్రాప్తియే
కు. సం. 8. ౧౧౩

౧౫. కంసుని భార్యాభేదము.

ప్రాప్తించు. సం. స. క్రి. పొందు
శా. ... ఇంతం తనన్ రానిమ్ము, త్రేతలన్ నను
గావిచేయు నిది న న్నేలాగు ప్రాప్తించె .
ఉత్త. రా. 8. ౭౯౯.

ప్రాప్యము. సం. విశే. (అ. ఆ. అ) పొందఁ దగినది.

ప్రాప్త్యాశ. సం. వి అ. స్త్రీ. ౧. లాభేచ్ఛ, పొందుకోరిక. ౨. (అలంకార) ప్రారంభింపఁ బడిన కార్యముయొక్క అవస్థాభేదము.
శ్లో. ఉపాయాపాయశంకాభ్యాం ప్రాప్త్యాశా
కార్యసంభవః. (ప్రతాపరుద్రీయము.)

ప్రాబల్యము. సం వి అ న. ౧ బలిష్ఠత, శక్తి. ౨. ఉత్కర్షము, ఆధిక్యము

ప్రాభంజనము. సం. వి. అ. న స్వాతి.

ప్రాభంజని. సం. వి. ఇ పుం. ౧. హనుమంతుఁడు. ౨ భీముఁడు

ప్రాభవత్వము సం. వి అ న విభుత్వము, ప్రభుత్వము.

ప్రాభవము. సం వి. అ. న ౧. ప్రభుత్వము, దొరతనము. ౨ శ్రేష్ఠత్వము

ప్రాభవముకొలుపు. వి. అ. క్రి ప్రభుస్వభావ మలవడు, ప్రభుత్వముతో నలరారు.
గీ. . . గర్భమైనది మొదలుగాఁ గశ్యపాగ్ర,
పత్ని భావంబులోనఁ బ్రాభవము మెఱసి.
దశా 3. ౧౦౮

ప్రాభాతికము. సం విశే. (అ. ఈ. అ) ప్రభాతమునకు సంబంధించినది.

ప్రాభృతము. సం వి. అ. న. కానుక, ఉపహారము, రాజాదులకు సమర్పించు వస్తువు.

ప్రామథి. సం. వి. ఇ. పుం (కల్పభేదమున) సప్తర్షులలో నొకఁడు

ప్రామాణికము. సం విశే. (అ. ఈ. అ.) ౧ ప్రత్యక్షాది ప్రమాణసిద్ధము. ౨. శాస్త్రసిద్ధము 3. హైతుకము, హేతుయుక్తము.

ప్రామాణికుఁడు. సం. విశే. (అ ఈ అ.) ౧. మర్యాదాభిజ్ఞుఁడు, మేర నెఱిఁగినవాఁడు ౨. శాస్త్రము నెఱిఁగినవాఁడు 3 పరిచ్ఛేదకుఁడు, కొలుచువాఁడు, ప్రమాత. ౪ సత్యముతప్పనివాఁడు. (శ ర) ౫ ప్రత్యక్షాది ప్రమాణముల నంగీకరించువాఁడు వి. అ పుం. వర్తకముల కధిపతి. (విల్సన్)

ప్రామాణ్యము. సం. వి. అ న. ౧. తద్వతి తత్ప్రకారకత్వరూప మగు జ్ఞానధర్మభేదము, ప్రమాణత్వము, ౨ నమ్మఁదగియుండుట, విశ్వసనీయత. 3. దృష్టాంతము ౪. సాక్ష్యము. ౫. ప్రమాణము.

ప్రామాదికము. సం విశే. (అ. ఈ. అ.) ప్రమాదమువలనఁ గలిగినది.

ప్రామాద్యము. సం. వి అ. న. ప్రమాదము, పొరపాటు వి. అ పుం. ౧ వాసకవృక్షము.

ప్రామార్జ్యము సం. వి. అ. న. అప్పు, ఋణము (త్రి వి)

ప్రామిడి. వి ౧ క్రౌర్యము.
ఉ ఏమని చెప్పవచ్చుఁ బరమేశ్వర నీఁడు ధరాతలంబునన్, ప్రామిడిఁ జేసినట్టి ఘనపాతకకోట్లకు లెక్కలేదు .
భల్లా 3. ఆ. (శ. ర.)
౨. అజ్ఞానము.

**ప్రోక్షణము.** సం. వి. అ. న. ౧. (నీళ్లు) చిలుకరించుట, చల్లుట, సేచనము. ౨. యజ్ఞమునందు పశువును వధించుట. ౩. వధము.

వి. ఇ., ఈ స్త్రీ. ౧. ప్రోక్షించుటకైన జలము. ౨. అట్టిజలమున కాధారమగు పాత్రము.

**ప్రోక్షణీయము.** సం. విణ. (అ ఆ అ.) ప్రోక్షింపఁదగినది - వి అ. న. ప్రోక్షించుటకైన జలము

**ప్రోక్షించు.** సం స క్రి (యజ్ఞమునందు) పశువును వధించు, వధించు

వ. ఆకర్ణింపు మధ్వర్యులందు పశువుం బ్రోక్షించు చుండ యతి నిరీక్షించి యిది హింస గాదే యనిన నతండు. భార. అశ్వ ౨ ౬౧.

మ భుజయూపంబున గోవృషాఖ్యపశువుం బ్రోక్షించి శాంతి యను యజనంబున్ .
హరి పూ ౬ ౧౬౩

౨. చల్లు, (నీళ్లు) చిలుకరించు.

క. అని నిశ్చయించి హంసంబున జలములు పూని తల్లి పాప్మని ప్రోక్షించిన
వరాహ ౧౦ ౪౦

**ప్రోక్షితము.** సం విణ. (అ ఆ. అ) ౧. చిలుకరింపఁబడినది ౨. (యజ్ఞమునందు) వధింపఁబడినది. ౩. యజ్ఞమునందు మంత్రాదులచే సంస్కరింపఁబడినది (శల్య.)

**ప్రోగు = ప్రోవు, పోగు.** వి. (సం. పూగః.) సమూహము, గుంపు.

చ. చలువలరచ్చపట్టు జలజంబులపుట్టు విరాళికల్కి ప్రోగుల కనుపట్టు జక్కవలగొట్టు ..
రా వి. ౧ ౮.

జ: ప్రోపడు¹, ప్రోపెట్టు.

**ప్రోచికోలు.** (√ప్రోచు.) (బలహీనత్వమును బొందిన గవాదిక-) కాపాడి యను భవించుకొనుట.

ఉదా. వానికి ఆయావును ప్రోచికోలుగా నిచ్చినాఁడు. (శ. ర.)

విణ. వ్యర్థము.

ఉదా ' గడ్డిపోచయు ప్రోచికోలు కాదనఁగా మనుష్యునిఁ జెప్పనేల.
(శ. ర - వా. పోచికోలు.)

**ప్రోచిల్లు = పోచిల్లు.** వి. బ. శకునము చూచుటకై ఇరుగుపొరుగుఇండ్లమీఁద అక్షతలు నీళ్లు చల్లుట. (శ ర.) శకునము చూచుటకై ఇరుగుపొరుగిండ్లమీఁదఁ జల్లెడు అక్షతలునీళ్లు

**ప్రోచు.** స. క్రి (సం. పుష్) ౧ (అన్నపానాదులచే) పోషించు, పెంచు, రక్షించు, పాలించు.

క. అనమా నీప్రశస్తమున, నని నీల్గినవీరభటుల యనుపోష్యుల నెల్లను బ్రోతే .
భార. సభా ౧ ౩౯

శా. భూవిస్తారము నాక్రమించి ప్రజలంబ్రోవంగ దండింపనుం, గావ న్నేర్చి మహక్రియల్ నడపె . (భార. శాం ౧. ౧౭౧.)

ఉ . మమ్ము వందఱం, బ్రోవుము బాంధవా ప్తజనపోషణకంకణను ధర్మ మున్నదే
ఆము. ౩. ౫౬.

క. శారద పతఁబురుఁ బ్రోచు జన్నయనిద్ధున్.
విక్ర. ౧. ౬.

సీ. ఆ నవారాతి యమరులఁ బ్రోవంగఁ బూని యాయదువంశమున జనించి ..
పారి. ౧ ౩౬.

౨. పెంచు, వృద్ధిచేయు.

ఉ. భావములోనికేలుపరిపాటిఁ బరిస్ఫుటతావిలాసమున్, బ్రోవఁగ నేర్కతో నిమఃభూపతికై యొదయాదుదృష్టి ల,క్ష్మావతి యొట్టకేల శోకచందమునన్ మగిడించి.
నైష. ౫. ౧౭౪.

శా. ఆరక్షించిన దేవభర్తయు జగం [illegible] పూర్ణంబు లు,ద్రేకింపం దనఁ జూడ [illegible]

సుఖాగాత్మప్రౌఢ గంధర్వయోషా,షాళంతధ్వని
శాశ్వంతరచనా చాతుర్య హేవాకసంపన్న
కస్త్రీమణి కంకణోల్లసదమందకేంకృతుల్
ప్రౌఢగన్. కవిక. ౧. ౫౦.

జః ప్రౌఢిశోలు, ప్రౌఢదు౧, ప్రౌఢతి, ప్రౌఢము.

ప్రౌఢ = ప్రౌఢఁడు. విశే. (సం. ప్రౌఢ.) ౧. ప్రగల్భుఁడు, సమర్థుడు.

సీ....అస్త్రగురుండుఁ దత్తనయుండుఁగృపుఁడు
రాధాసుతుండుఁ గీ. వాడిమానును లంద్రు
నిశ్చాలు శోకనిఁ జొదివిరిశ్శిరొపెక్కండ్రు
ప్రౌఢ లిదియు, మగఁటిమియు
భార స్త్రీ. ౨. ౩౬.

గీ. భుదమిఁ ఉఁడుల నడఁచినప్రౌఢ వీవ.
పారి ౧. ౪౯.

ఉ. చూడవుగాని రాకొమరుజోదులఁ బోల్పఁగ
రానికయ్యపుంబ్రౌఢల భానుకోటిరుచిఁ
శోల్చిన బిల్విలుకాండ్రఁ జక్కరా,జోదు
వెంగంబువారల. రామా ౩ ౧౮౯

౨. చతురుఁడు, నేర్పరి.

మ. ... అప్పరంభరాదిబృందారకచతుష్టయంబు
మున్నాడి ప్రౌఢ లగు వేల్పుచేడియలచేత
దమయంతికిం గానకలగా . పంపిరి
నైష. 3. ౩౩

వ. ... ప్రౌఢలగు వెచ్చెలులు . (వధూవరుల)
శార్చి తూర్చి చనుటయు. . పారి. ౧. ౫౨

3. అధికుఁడు, గొప్పవాఁడు.

ఉ. సర్వజగంబుల న్నటనచాతురిఁ దాఁ గడు
ప్రౌఢ నంచు దుర్గర్వము పూని శాస్త్రగతి
సైకొన శొల్లక రంభ యాడె ...
విక్ర. ౨. ౯3.

సీ. అరయ పెట్టికపీలలంత లయ్యును వింకపుర
బ్రహ్మశిఖ పుట్టు ప్రౌఢలార
ప్రభా. ౧. ౧౦౪.

౪. విత్తి.

గీ. ... బుద్ధి చెప్పిన వినియెడుప్రౌఢ గాఁడు. .
భార. స్త్రీ. ౧. ౩౯.

వి. ౧ ప్రౌఢ, ప్రౌఢత్వముగల స్త్రీ.

సీ .. ప్రౌఢ ప్రౌఢ యుం చన మాటు ...
ఆం. భా. ౨. ౧౦౫.

౨. ఆఁడుది, స్త్రీ.

సీ. ఏప్రౌఢఁ జూచిన నింపొందు ఘనసార
ఘనసారసాంద్రాదకలితరీతి. (ల.వి 3. ౪౦.)

దండకము. ఏమి భాషించిరో నేఁడు నీతోడఁ
గ్రీడించుప్రౌఢల్ కుమారీ
భోగినీదండకము

జ . ప్రౌఢతనము

ప్రౌఢఁడు = ప్రౌఢ. నిపుణుఁడు, జాణ.

క. ఏడెనిమిది దినముల నీ,కేడుజగంబులను
వ్రాసి యిచ్చెద నీకున్, జూడుము చిత్ర
పటములోఁ, బ్రౌఢండై నిన్నుఁ బొంది
పోయినవానిన్ . వి పు. ౮. ౧౨౨.

ప్రౌఢతనము. వి. (√ప్రౌఢ) ప్రౌఢత్వము, నైపుణ్యము

చ. చెలువము విద్దెయుం గొనముఁ జేవయుఁ
బ్రౌఢతనంబుఁ దల్పియున్ .
నీలా. ౧. ౯౨.

ప్రౌఢము = ప్రౌఢము. సం. విశే. (అ.ఆ.అ.) ౧. ప్రవృద్ధము,చక్కఁగా పెరిగినది. ౨.వయస్సు నిండినది, పెద్దది. 3. ప్రగల్భము, దిట్టతనముగలది. ౪. నిపుణము, నేర్పుగలది. ౫. గొప్పది, బలముగలది. ౬. ఉద్ధతిగలది, ఉరవడిగలది. ౭. దట్టమయినది. ౮. పెండ్లాడఁబడినది. ౯. పయికెత్తఁబడినది. ౧౦. చర్చింపఁబడినది. వి. అ. స్త్రీ. ౧. స్వీయాంతర్భేదవిశిష్టనాయికాభేదము; స్వీయనాయికలలోనొకతె. (పదునెనిమిదిసంవత్సరముల పైబడిన వయస్సుగలిగి సంభోగార్హయౌవనము గలది. క. ర. . ముగ్ధతి

రెండ్లు తొడలుకొని ౫౫ ఏండ్లవరకుఁగల వయస్సుగలది. వాచ)

**ప్రోఢి.** సం. వి. ఇ. స్త్రీ. = ప్రౌఢి.

**ప్రోతము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧ కట్టఁబడినది ౨. నిడివిగాఁగాని నిలువుగాఁగాని చాఁపఁబడినది. (వ్యతి ఓతము.) ౩. బద్ధము, కట్టఁబడినది. ౪. గ్రుచ్చఁబడినది ౫ ఊఁటఁబడినది చొరఁబడినది. ౬ కూర్పఁబడినది, సంధింపఁబడినది వి. అ న ౧. వస్త్రము, నేఁతవస్త్రము. ౨ కుట్టుట.

**ప్రోతోత్పాదనము.** సం. వి అ న. ౧ గొడుగు ౨ వస్త్రకుట్టీమము, పటకుటీగము, డేరా.

**ప్రోత్కృష్టము.** సం. వి ౯. న. మిక్కిలి గిట్టి ప్రోఁత

**ప్రోత్ఫలము.** సం వి. అ పుం. సింగపులోఁకవంటి పువ్వులుగల యొకానొక చెట్టు.

**ప్రోత్ఫుల్లము.** సం విశే. (అ. ఆ అ) చక్కఁగా విరిసినది.

**ప్రోత్సారితము.** సం. విశే (అ ఆ అ) ౧. తొలఁగింపఁబడినది ౨ పురికొల్పఁబడినది, ప్రేరితము. ౩. దిగవిడువఁబడినది, పరిత్యక్తము ౪. ఇయ్యఁబడినది, దత్తము. (విల్యమ్సు.)

**ప్రోత్సాహకుఁడు.** సం. విశే. (అ ఈ. అ.) ఉత్సాహపెట్టువాఁడు.

**ప్రోత్సాహనము.** సం. వి. అ. న. ౧. మిక్కిలి ఉత్సాహపెట్టుట, పురికొలుపుట. ౨. ఒకానొక నాట్యాలంకారభేదము. (పా. ద.)

**ప్రోత్సాహము.** సం. వి. అ. పుం. మిక్కిలి ఉత్సాహము.

**ప్రోథము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. ప్రసిద్ధము. ౨. స్థాపితము, ౩. ప్రయాసపడుచున్నది. ౪. ప్రియము. - వి. అ. పుం., న. ౧. గుఱ్ఱపుముట్టె, అశ్వనాసిక. పుం. ౧. పిఱుదు. ౨. జీర్ణవస్త్రము. ౩. గర్భపిండము. ౪. భయము, దిగులు ౫. గర్తము, గోయి ౬. పిఱుదులయందలి గుంట

**ప్రోథి.** సం వి న. పుం. గుఱ్ఱము.

**ప్రోది.** వి. (సం వృద్ధిః ?) ౧. పోషణము, పెంచుట

గీ మధుగలాలస యంతఁ గ్రమంబుతోడఁ,
దల్లిదండ్రులప్రోదిని దరుణి యగుచు, ...
కళా. ౫. ౩౬.

౨ అతిశయము, ఆధిక్యము, వృద్ధి, పెంపు.

సీ. తనకూటములఁ బ్రోదిఁ దాల్చు రంభాదులు
సరసభావము దప్పి శీఁము వంప.
వసు ౨. ౧౧౩

సీ. అంగదమణిదీపు లలమి యొప్పగు తన
భూజములకాంతికిఁ బ్రోది సేయ
హరి. ఉ. ౬. ౫౯.

౩ ఒప్పు, శోభ

మ తదీయనిర్ఝరసమీరాందోళితైలాటుగం,
ధినికుంజాంతినవేందుకాంతమణివేదిం బ్రోది
మై విశ్రమించిన . (వసు. ౨. ౧౩.)

౪ వైభవము, సంపద

క. ఆదట నేనుఁగు డిగి .. ముత్తైదువలారతు
లీఁగాఁ బ్రోదిన్ దనవగరు సొచ్చెఁబూవిశె
మొఱయన్. (యయా. ౪. ౧౬౧.)

ఉ. అన్నగరంబు ప్రోదిఁ దనరారఁగఁ దమ్ములఁ
గన్నతల్లిని . (రాఘవ. ౨. ౪౫.)

౫. ఉత్సాహము, పూనిక.

క. . . స్వామికార్యము సేయం, బ్రోది గల
వాఁడు నిద నీ, పాదంబులె దిక్కనూని పర
మార్థముగన్. (సా. పంచ. ౧. ౩౬౬.)

విశే. ౧. పొత్తియుండునది, సహచరము,

సీ. పుష్పవర్ష మలకుఁ బ్రోది యై వినువీథి దేవ దుందుభినాద మావహిల్ల. (హర ౬. ౭౭)

౨. పెద్దది, గొప్పది

చ. పరి మతిలేని కోడిగపు భాషఁ పని నీ వొకప్రోది చేసి పేర్కొని విప్ర ౨. ౭౩.

క. . త న్నెంతయుఁ బ్రోది సేయఁ దగని ట్లనియెన్. (వి పు. ౧ ౨౪)

౩. అతిశయింపఁజేయునది, పోషకము

వ. పొదలుమదనోన్మాదంబునకుం బ్రోది గాకాదంబునం గాదంబరి గండూషించి మను చ ౩ ౨౭.

౪. పెంచఁబడినది, సాఁకఁబడినది

వ. పోషితరాజకీరంబులు సేయఁబ్రోదికోయిలలు మంగళగానంబానని

సై ౧ ౯౫

ఉ. కోమలి ప్రోదిరాచిలుకకున్ ఫల మర్మిలి నందియియ్య మే, కోమని దయ్యెన య్యెడ రామా. ౩. ౯౩.

గీ. అందియలమొరపంబున నరుగుదెంచి, ప్రోదిరాయంచ రయమునఁ బోవుచ్వ్యధంబున. భార. విరా. ౪. ౭౯.

జః ప్రోదిగొను, ప్రోదిపట్టు, ప్రోదియొనర్చు, ప్రోదివెట్టు, ప్రోదిసేయు.

ప్రోదిగొను. స. క్రి. (√ప్రోది.) పోషించు, రక్షించు.

మ. అసిఁ కెంజాడి విపక్షవృక్షముల శౌర్యాగ్నిచ్ఛటం జేర్చి శత్రుప్రసరత్సరములన్ రజోర్వీతలమున్ సంఘట్టనముం జేసి వైరశ్రీ స్పృగార్ద్రింబొసరించి ప్రోదిగొన కుదృత్కీర్తిసస్యాఘము, శ్వాస వీర్ధించు నెయఖంచుఁ బల్కు నరపార్వీశాధుయోధావళిన్. వరహ. ౩. ౧౭.

క. ప్రోదిఁగొనఁదగినపుష్పఫలాదులు గొడ్డంట వచ్చి ... కవిక. ౨. ౧౩.

ప్రోదిపట్టు. వి. (√ప్రోది.) పోషణస్థానము.

సీ. పున్నమపెన్నెలప్రోదిప ట్టిది యని కాంతం బులగుశశికాంతరుచులు,

కు. సం. ౩. ౭౧.

ప్రోదియొనర్చు. స. క్రి (√ప్రోది.) సంరక్షించు. పాలించు.

ఉ. వసుమతీసురవంశవతంస మెల్ల వారు న్వినుతింపఁ బెంపెసఁగఁ బ్రోదియొనర్చుచుఁ దల్లిఁ దండ్రి సెం,దు న్విధిధానురూపతను దోహదభోజనపూజనాదులన్

పాండు. ౨ ౧౨.

చ ... కుంచెల, స్నిగసినమాయతాభూములు నిర్భర సౌరభసంప్రదాయ మిం,పుగినధివాస ధూపములఁ బ్రోది యొనర్చుచు నిచ్చె నర్చనన్. సైమ. ౪. ౧౩౨.

తరళ సరళిశైఖరి మజ్జగంబులఁ జాలఁబ్రోది యొనర్పఁగాఁ, గరళకంధరు డున్నవాఁడు ... దశా. ౨ ౬౫.

ప్రోదివెట్టు. స. క్రి (√ప్రోది) పోషించు.

సీ. క్రొవ్వారుకెందమ్మికొలఁకునఁ బ్రొద్దున బాలసినవలపులఁ బ్రోదివెట్టి. భాగ. ౭. ౨౭౬.

సీ. రమణీయమందిరారామదేశంబులఁ బువ్వుఁదీఁగెలకును బ్రోదివెట్టు. భాగ. ౧౦. పూ. ౧౬౭౭.

ప్రోదిసేయు. స. క్రి. (√ప్రోది) ౧. పోషించు, పెంచు.

వ. కాఁబా కొక్కెర చిందు లాదిగాఁగలపాదిచేటకుం బ్రోదిచేసిన పతంగంబులును ... కాశ. ౩. ౪౭.

౨. సంరక్షించు, పాలించు.

క. ... పౌ, క్తులలోన నంచి తూరిమి, చెలఁ గఁగ వావాటఁ బ్రోదిసేయుచుఁ బెనుపక్.
చంద్ర. ౧ ౧౦౩.

క....జగ మెల్లం బ్రోదిసేయఁజాలెదు నీకున్.
అచ్చ. రా అర. ౧౦౪.

3. అతిశయింపఁజేయు, అధికముచేయు

వ. గహ్వరంబులనుండి బ్రామయసింహ నాదంబులం బ్రోదిసేయు తరంగతురంగ గళగళారావంబు నొండొండ శోదకీకుహ రంబులు నిండ. కాశీ. ౧. ౧౪౨.

గీ ఆకసంబునఁ దిరుగు నైరావతంబు, స్వాదు ఫలరసగంధంబు స్వప్రభాప్రభూతదానంబు గంధంబు ప్రోదిసేయు
వరాహ. ౧౦ ౧౨౫.

ప్రోద్ఘుష్టము. సం విణ. (అ ఆ. అ) ౧ ప్రతిధ్వనించునది. ౨ పెద్దధ్వనిచేయునది.

ప్రోద్ఘోషణ. సం. వి అ స్త్రీ ౧ చాటుట ౨ బిగ్గరగ శబ్దించుట

ప్రోద్ఘోషణము. సం. వి అ న. = ప్రోద్ఘోషణ.

ప్రోద్యతము. సం. విణ. (అ ఆ అ) ౧ లేపఁబడినది ౨. చెయ్యూనినది, పనిపడిగలది

ప్రోపడు[1]. ౬ . క్రి. (ప్రోగు + పడు) రాశియగు, కలిసిపోవు.

ఉ . రక్కసుతోడ రక్కసుం, బ్రోపడ ప్రేయుచుం గపులు పోరుచునుండగఁ నన్ని శాచరుల్. భా. రా యు ౯౨౦.

ప్రోపడు[2] అ క్రి. (ప్రోపు + పడు) పోషింపఁబడు. (శ. ర.)

ప్రోపరి. విణ. (ప్రోపు + అరి) ౧ రక్షకుఁడు, పాలించువాఁడు.

ఉ కల్లల కెల్ల నిల్కడలు గారె కలుంగొన నేల ప్రోపరుల్. (అచ్చ. రా. అయో. ౩౪.)

౨. పోషకుఁడు, ఆహారమిచ్చి పెంచువాఁడు.

ఉ. ..క్రొం, బూవిలుకాని సాహిణపుఁబ్రోపరి యామని వచ్చె నత్తఱిన్.
కృ. శకుం. ౧. ౪౦.

ప్రోపఱు. అ. క్రి. (ప్రోపు + అఱు.) ౧. పుష్టిచెడు, బలహీనమగు.

ఉ . వారాముల్, ప్రోపఱ నెల్లవారును బ్రభూత భయార్తిఁ గలంగి రయ్యెడన్.
హరి. పూ ౪. ౧౦౦.

౨. రక్షణలేకుండు.

క. ఈపాపజాతి రక్కస, యేపగిదిఁ గడంగి యచటి కేతెంచెనొ యీ, పాపం డిమ్మెయి నెట్లో, ప్రోపఱియె ని దేమిమాయ పుట్టెనొ యెఱుఁగన్. హరి ౫. ౧౫౪.

ప్రోపు. వి. (√ప్రోచు) ౧. పోషణము, ఆహారమిచ్చి పెంచుట.

చ. ఒకరనిచేతఁబ్రోపువు దదున్నతి ప్రాపున గాంచి యెల్లవెంటకును గొంత లేక పొగడం దగుసంపద నొంది
భార. ఉద్యో. ౨. ౩౩.

క ఆపాద్యుఁడు గోపానల, దీపితుఁ డై విశిఖ శిఖలతీవ్రనిహతి నత్తాపులగమి నేర్చి యమునిఁబ్రోపు గుడువఁ బుచ్చె వారిఁ బురపంశనిధి భార ద్రో. ౧. ౨౫౩.
(ఇట ఆతిథ్యమని తాత్పర్యము.)

క ఏ నమ్ముడుగడవఁగఁ బత్తున్నులు గను గందు లగ్రజుండవు నీ వి, క్లైనతతి నెంత దుఃఖమెం, యీనీప్రో పానపడెదు నిరుగురు వులకున్ పాండు. ౩ ౩౫.

౨. రక్షణము, పాలనము.

దండకము ... ఏపు దీపించునీ ప్రోపు ప్రేపా పలం గ్రేపుల నైపరీత్యంబుగాఁ ఖాపి యాపద్ఘటాం డొక్కటో డాఁచినన్.
పారి. ౩. ౩౯.

కం. ఆపురము నతో త్తముఁ డను,భూపాలుండేలు నతనిప్రోపున వైశ్యుం,డేపారు నొకఁడు .

శుక ౨. ౬౧.

3. విజృంభణము.

గీ. ... వైరులప్రో పడంచి ..

ప్రబోధ. ౨. ౪౩

సీ. కొమ్మలు వడి నూఁది కుదియింతుఁ బ్రో పణ వనువాఁడు పడవైచి యనువుదప్పఁ బట్టి పెల్లుగ ముక్కు గుట్టుదు నను వాఁడు (హరి పూ ౬. ౧౩౩ )

**ప్రోపెట్టు.** స క్రి (ప్రోగు + పెట్టు.) ప్రోగుగా నుంచు

లయగ్రాహి ముట్టి . బిట్టదరికేల మెద మట్టి తెగ నెత్తువడ నటులు శిరంబులను మెట్టులుగొనం బ్రో,పెట్టు.

కు. సం ౧౨. ౯౫౩.

**ప్రోయాలు.** వి (ప్రోవు + ఆలు.) (ప్రోలు + ఆలు. అని ... ) ఇఙ్గాలు, భాగ్యము, శ్రీ

ఉ . అనలు మో ునేలుప్రో,యాలు ప్రవీణ మానికమహాకృతిన ... ఁ వ్రాళ్గుఁ జేయుతన్

రామా ౧. ౯.

సీ. జవ్వని బిత్తరి చాన ప్రోయా లన్న కన్నె లేమ ... నలికి గోల (ప్రబంధ ౨౬౭ )

దండకము గుజ్జుప్రోయాలికిన్ సజ్జకంబైన యందంబు నొందింపవే పారి 3. 3౯.

క ఆలోలనయనఁ గనుఁగొని, ఇది యచ్చర ప్రోయాలో కా కల్లమునియాలో యను చుక్. (విజ వి. ౨. ౪౭ )

**ప్రోలు.** వి. జా. అనా. (సం. పురీ. క. పొజలు. త. పొజిల్.) ౧. పట్టనము (బ. ప్రోలులు, ప్రోళులు, ప్రోళ్లు)

సీ. ... ఈప్రోలికి వామదకేల . .

భార. ఆది. ౬. ౨౬౪.

ఉ. ... భూవలయంబునఁ బ్రోళు శిల్ల కా) రూపింపనభంగిఁ జూచి .. (దశకు. ౯. ౨.,

మ.... కామినీకామినం,తతి కేలా రుచిరత్రెచ్చుఁ గంతుకలహోన్మాదంబు లా ప్రోలునన్.

ఆము. ౨. ౩౧.

౨. లోకము.

మ. ... శివశర్మా వేదశాస్త్రాగమూం, బుధి చంద్రోదయ చంద్రలోక మిది యీప్రో లేలుచుండుం, గళానిధి ...

కాశీ. ౪. ౧౭౧.

3 స్థానము

(కావేరి వర్ణనము )

సీ జలధినాయకు నేలుబడి గన్నయిల్లాలు నిఖిల పుణ్యపుఁజాలు నిలుచుప్రోలు ...

శుక. ౧. ౩౭౬.

౪. పెండ్లిలో నాగవల్లినాఁడు రంగులతోఁ బెట్టెడి పిండిపట్టు, ఆస్థలము.

సీ ఒజ్జన మొనరింప సుచితక్రమంబునఁ బుణ్యాం గనల్ గడెఁ బ్రోలు చొచ్చి.

కళా ౭ ౯౩

మ. సరలం గూర్చినకొప్పతోఁ బసపుమిన్న శ్రేలు సెమ్మోముతో, గరిసన్నాగమసాని ప్రోలు దిగంగా జంకునై తూగ్యమూల్, మొర యుంగాఁ గదు నొప్పి సాకిబలి ...

వేం పంచ. ౪. ౩౭౦

జ. ప్రోగాను, ప్రోగుచుపు

**ప్రోల్గుడుపు** స. క్రి (ప్రోలు + కుడుపు ) ప్రేరేచు (అప్ర శ. ౮)

**ప్రోవగు.** అ క్రి. (ప్రోవు + అగు.) గుంపగు, గుంపుగూడు

క కావునఁ బాండవపక్షము, భూవల్లభకోటి యిచటఁ బ్రోవగును .

భార. ఉద్యో ౧. ౧౬.

ఉ. వేవురు చంద్రులొకఁ బదివేవురు సూర్యులు లక్షపావకుల్, ప్రోవయి యున్నయట్టి దగు భూరితరం బగుతేజము.

హరి. ఉ. ౭. ౨౧౫.

ప్రోవు = ప్రోగు, ప్రోగు. వి. సమూహము, గుంపు.

చ. ఆదటలఁ గొండలం బడి మహాపద గూ
పతి చన్నవారి ని,ప్పుడు గొనివచ్చి
కృష్ణుఁ డొకప్రోవుగఁ గూటువమాఁకఁ
గూర్చెనం, .. భార. ఉద్యో ౨. ౨౦౮.

గీ. ప్రోవు లిడ్డమృణాలకర్పూరవిరతిఁ, గాంచి
వైదర్భి మదిలోన గళివళించెఁ జాల
కాయాతచంద్రికాజాల మనుచు.
నైష. ౨. ౧౧౭.

జ. ప్రోవగు, ప్రోవుకొను, ప్రోవుకొల్పు, ప్రోవుగట్టు, ప్రోవుతీయు.

ప్రోవుకొను=ప్రోవుగట్టు. అ క్రి (√ప్రోవు) గుంపుగూడు, గుంపగు. (చూ ప్రోవుకొల్పు.)

ప్రోవుకొల్పు = ప్రోవుకొనఁజేయు. స క్రి, (√ప్రోవుకొను.) ప్రోగుగాఁజేయు.

చ. . ఇప్పుడొరాంబునిధి పల్మఱుఁ జెల్లలి
కట్టమీఁదఁ జెల్లరుదుగఁ బ్రోవుకొల్పెడు
మహోపలతోపలమౌక్తికావలిన్.
కవిక. ౬. ౧౧౨.

ప్రోవుగట్టు. అ క్రి. (√ప్రోవు.) రాశియగు, కూడు.

వ. ... వేవురు విభాకరులు పదివేవురు పరిశియ
పావకులును బ్రోవుగట్టినట్టిపగిదిం ...
హరి. పూ ౪. ౬౯

ప్రోవుదీయు. (ప్రోవు + తీయు). రాశినుండి దీయు.

ఉ. కమ్మరివారిబాలిక చకోరవిలోచన ముద్దు
గుమ్మ యొ,కమ్మదరిన్ రసాయలిన వస్త్రము
చుంగులు జాఱఁ గట్టి తాఁ, గమ్మనికాఁగ
తతోఁ గరవఖమ్ముల ఖాండము లంగజాస్త్ర
మో,తమ్మనఁ బ్రోవుదీసె విటతండము
గుండియ లార విచ్చఁగన్. వీథి. ౨౩.

ప్రోషము. సం. వి. అ. పుం. ౧. కాల్చుట. ౨. సంతాపము. ౩. కాలుట.

ప్రోషితభర్తృక. సం. వి. ఆ. స్త్రీ. ప్రియుఁడు దేశాంతరగతుఁడైయుంట ఖేదము నొందియుండునాయిక.

ప్రోషితుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) దేశాంతరగతుఁడు

ప్రో(ప్రౌ)ష్ఠపదము. సం. వి. అ. పుం. భాద్రపదమాసము. వి ఆ. స్త్రీ పూర్వాభాద్రయు ఉత్తరాభాద్రయు

ప్రో(ప్రౌ)ష్ఠము. సం. వి. అ. పుం. ౧. ఎద్దు. ౨. పీఁట, పీఠము. ౩. ఎగిరియెగిరిపడెడు మత్స్యవిశేషము, శఫరము.

ప్రోహము. సం. వి అ. పుం ౧. తర్కము ౨. ఏనుఁగుకాలు ౩. ఏనుఁగు మోఁకాలు. ౪ కూర్పు, సంధి. ౫ నేర్పు. (శ. ర.)

ప్రోహుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తార్కికుఁడు. ౨. నేర్పరి.

## ప్రౌ

ప్రౌఢ = ప్రోఢ. సం. ఆ. స్త్రీ. స్వీయాంతర్భేద విశిష్టనాయికా విశేషము స్వీయనాయికలలో నొకతె. (పదునెనిమిదియేండ్లపైబడిన వయస్సుకలిగి సంపూర్ణయౌవనము గలది. శ. ర. ముప్పదియేండ్లు మొదలుకొనిఁ యేఁబది యేండ్లవఱకుఁగల వయస్సు గలది. (వావి.)

ప్రౌఢము. సం = ప్రోఢము.

ప్రౌఢి. సం వి. ఇ. స్త్రీ. పరివృద్ధి, చక్కఁగా ఎదుగుట, నిండుగా పెరుఁగుట, పరిపాకము. ౨. వృద్ధి, పెంపు. ౩. గొప్పతనము, గౌరవము. ౪. ప్రాగల్భ్యము, దిట్టతనము. ౫. గర్వము, అహంకారము, క్రియలందు ఉత్సాహ [illegible]

గలదొనెడి నిశ్చయము. ౬. సామర్థ్యము, నేర్పు. ౭. చర్చ, వివాదము. ౮. ఉత్సాహము. ౯. ప్రాశోక్తి. ౧౦. ప్రౌఢమ్మ వాచకము.

వ. భావములయందు సత్యంబునేన ఋతువు లందు వసంతంబు ప్రౌఢి మాసంబుల మార్గ శీర్షంబునవీవు. భాగ. ౧౨. ౪౮.

ప్రౌఢిమ(ము.) వి. (సంస్కృతభాషలో ప్రౌఢి శబ్దమేగాని యిదిగానఁబడదు.) ప్రౌఢత్వము.

ఉ. ... తనర నేర్తును నన్ను దక్ష్యప్రజ నిగమ శాస్త్రప్రౌఢిమల్ గాంచితిన్.
ఇందు. ౧. ౧౭౮.

శా. ... గారవించి పలికెన్ గంభీరవాక్ప్రౌఢి మన్. నైష. ౧. ౧౨.

ఉ. పురాణప్రౌఢిమన్ మించితిన్ ...
విక్ర. ౧. ౧౧౦.

ప్రౌణుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. నేర్పరి. ౨. మిక్కిలి అపసారకుఁడు, మిక్కిలి తొలఁగఁ బుచ్చువాఁడు.

ప్రౌష్ఠపది. సం. వి. ఈ. స్త్రీ. భాద్రపదపూర్ణిమ.

## ప్ల

ప్లక్ష. సం. వి. అ. స్త్రీ. (ప్లక్షద్వీపమునుండి బయలు వెడలిన) సరస్వతీనది.

ప్లక్షప్రస్రవణము. సం. వి. అ. న. సరస్వతీ నది పుట్టినచోటు.

ప్లక్షము. సం. వి. అ. పుం. ౧. జువ్వి. ౨. కలుజువ్వి. ౩. సప్తద్వీపములలో నొకటి. (చూ. ద్వీపము.) ౪. వెరతితలుపు, దిడ్డి తలుపు. ౫. ద్వారపార్శ్వమందలి ప్రదేశము. శ. రా. శ.

ప్లవ. సం. వి. అ. పుం. ప్రభవాది సంవత్సరము లలో నొక సంవత్సరము

ప్లవంగమము. సం. వి. అ. పుం. ౧. కోఁతి. ౨. కప్పు.

ప్లవంగము. సం. వి. అ. పుం. ౧. కోఁతి. ౨. మృగము, జింక. ౩. ప్లక్షము. జువ్వి. శ.

ప్లవకము. సం. వి. అ. పుం. ౧. కప్పు. ౨. కోఁతి. ౩. ప్లక్షము, జువ్వి. శ.

ప్లవకుఁడు. సం. వి. అ. పుం. దాఁటువాఁడు.

వి. అ. పుం. ౧. చండాలుఁడు. ౨. కత్తి మొనలగువాని పైనాఁడు బొమ్మరి మొనలగు నర్తకుఁడు.

ప్లవగతి. సం. వి. ఇ. స్త్రీ. కప్పు.

ప్లవగము. సం. వి. అ. పుం ౧. కోఁతి. ౨. కప్పు. ౩. ప్లవమనెడిపక్షి. ౪. శిరీషవృక్షము, దిరిసెనపుఁజెట్టు.

ప్లవగుఁడు. సం. వి. అ. పుం. సూర్యసారథి, అనూరుఁడు.

ప్లవనము. సం. విణ. (అ. ఆ. అ.) ప్రవణము। నిమ్నము, క్రిందికి ఏటవాలుగా నున్నది.

వి. అ. న. ౧. దాఁటుట. ౨. తేఁలుట. ౩. మునుఁగుట, క్రుంకుట, స్నానము. ౪. పఱచుట. ౫. మహాప్రవాహము, పెనువెల్లి. ౬. వాటపుఁ బల్లపునేల, ప్రవణము. ౭. నింపుట.

ప్లవము. సం. విణ. (అ. ఆ. అ) ౧. తేలునది, తేఁదులాడునది. ౨. దాఁటునది.

వి. అ. పుం. ౧. తేలుట, తేఁదుట. ౨. నీరు పొంగినవెల్లువ. ౩. దాఁటుట. ౪. తెప్ప. ౫. కప్పు. ౬. కోఁతి. ౭. వాటపుఁబల్లపునేల, ప్రవణము. ౮. గొఱ్ఱె. ౯. ఒక దిమురుచేఁపవల, పఱవము. ౧౦. శా. వి. శ. ౧౧. నీరుకాకి. ౧౨. నీరుకోడి. (కారండవము, కన్నుచేఁడి.) ౧౩. జలకము. ౧౪. ప్లక్షవృక్షము. ౧౫. శర[illegible]

ప్రభిగతి. ౧౬. క్రౌంచద్వీపము. ౧౭. పర్కటి, జువ్వి. శ. ౧౮. కాశీకుశ్మ. శ.

వి. అ. న. ౧. కలుపబడినట్టిది. ౨. గంధతృణము.

ప్లవికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. తెప్పచేత నద్యాదులను దాఁటించువాఁడు. ౨. తెప్పచేత నద్యాదులను దాఁటువాఁడు.

ప్లవుఁడు. సం. వి. అ. పుం. ౧. శత్రువు. ౨. శ్వపచుఁడు, మాలవాఁడు.

## ప్లా

ప్లాక్షము. సం. వి. అ. న. ప్లక్షఫలము, జువ్విపండు.

ప్లాయనము. సం. వి. అ. న. పలాయనము, పాఱిపోవుట.

ప్లావనము. సం. వి. అ. న. ౧. దోవదోవ్యము నటుగడలఁబర్వుట, వెల్లిగొనుట. ౨. స్నానము చేయించుట, ముంచుట. ౩. మిక్కిలి జలములోఁ గూర్చుట, బహుతరజలసంయోజనము. ౪. ప్రవాహము, వెల్లువ.

వి. ఈ. స్త్రీ. పృథివ్యాదిభూతముల ధారణాభేదము.

శ్లో. స్తంభనీ ప్లావనీ చైవ శోషణీ భ్రామణీ తథా, ప్లావనీ చ భవం త్యేతాః భూతానాం పంచధారణాః.

సం. కాశీ. ౫౦. ౪౪. అ. (వాచ.)

ప్లావము. సం. వి. అ. పుం. ప్లవము.

ప్లావి. సం. విణ. (న. నీ. న.) ౧. ప్రవహించునది. ౨. ప్రచారము గలిగించునది, పర్వఁజేయునది. వి. న. పుం. ౧. పక్షి. ౨. మగశేడి.

ప్లావితము. సం. విణ. (అ. అ. అ.) ౧. తేలింపఁబడినది, తేల్పఁబడినది, ఓలార్పఁబడినది. ౨. జలాదులచే అంతట వ్యాప్తమైనది. ౩. తడుపఁబడినది, మిక్కిలి జలాదులలోఁ గూర్పఁబడినది.

ప్లాశి. సం. వి. ఇ. స్త్రీ. శిశ్నమూలమందలినాడి.

ప్లాశుకము. సం. వి. అ. పుం. మిక్కిలి తక్కువకాలములో పండెడి యొక దినుసువడ్లు.

## ప్లి

ప్లీహఘ్నము. సం. వి. అ. పుం. మురి ఊడుగు. శ.

ప్లీహము. సం. వి. న. పుం. హృదయమునకు ఎడమప్రక్క నుండెడు మాంస విశేషము; మాంసము పెరుగుటవలన నయిన రోగవిశేషము. వి. ఆ. స్త్రీ. ప్లీహము.

ప్లీహారి. సం. వి. ఇ. పుం. అశ్వత్థము, రావి శ.

ప్లీహశత్రువు. సం. వి. ఉ. పుం. ప్లీహఘ్నము.

ప్లీహోదరము. సం. వి. అ. న. (ప్లీహము పెద్దదిగా పెరిఁగడి) రోగవిశేషము.

## ప్లు

ప్లుష్టి. సం వి. ఇ. పుం. ౧. అగ్ని. ౨. ఇల్లుకాల్చుట, గృహదాహము. ౩. స్నేహము, చమురు. ౪. శుష్కాలము గాదు.

ప్లుతగతి. సం. వి. ఇ. పుం. కుందేలు, శశము.

వి. ఇ. స్త్రీ. ౧. దాఁట్లచేఁబోవుట, అశ్వగతి విశేషము.

ప్లుతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఈఁదునది, తేలునది. ౨. ప్రవాహము పైని పర్వునది, వెల్లువపాఱినది. ౩. దాఁటఁబడినది. ౪. మూఁడుమాత్రలుగలది. (స్వరము.) ౫. అవరింపఁబడినది. ౬. గ్రుంకులిడఁబడినది. ౭. తడుపఁబడినది.

వి. అ. న. ౧. దాఁటు, గంతు. ౨. (వేగముగ అంతమేరయు సమముగాఁబోవుడు) అశ్వగతివిశేషము, విప్లుతము. (చూ. ధార.) ౩. దాఁటుట, దాఁట్లచేఁబోవుట. ౪. వక్రముగాఁ బోవుట, తిర్యగ్గతి.

వి. అ. పుం. మూఁడుమాత్రలకాల మచ్చ రింపఁబడెడు స్వరము.

**ప్లుతి.** సం. వి ఇ. స్త్రీ. ౧. ప్రవాహము, వెల్లువ. ౨. దాఁటు. ౩. అశ్వగతివిశేషము ౪. స్వరమును మూఁడుమాత్రలకాల ముచ్చ రించుట.

**ప్లవము.** సం. వి. అ. పుం. కా ౕట, దాహము.

**ప్లుష్టము.** సం. విణ. (అ. ఆ. అ.) కాల్పఁబడి నది, దగ్ధము.

## ప్లో

**ప్లోతము.** సం. వి. అ. పుం. గాయము మొదలగు వానికి కట్టుగుడ్డ, శస్త్రకర్మముయొక్క ఉప కరణభేదము. ౨. వస్త్రము.

**ప్లోషణము.** సం విణ (అ.ఈ అ) కాల్చునది, నీఱుచేయునది. వి. అ. న. కాల్చుట,దాహము.

**ప్లోషము.** సం. వి అ. పుం. కాల్చుట,దాహము.

## ఫ

**ఫ.** సం ఒకానొక యక్షరము

**ఫ.** సం. వి అ. పుం ౧. ఝంఝూవాతము, వానగాలి ౨. నోరు మిక్కిలితెఱచి యావులిం చుట, జృంభావిష్కారము ౩. ఫలభాగము. ౪. వర్ధనము ౫ ...జ్ఞసాధనము ౬. పెచ్చు... స్త్ర... న ౧ ...క్ష భావణము,పరుష ...ట ౨ ఫూత్కా రము ౩ నిష్ఫలవాక్యము

**ఫంజి.** సం. వి. ఈ. స్త్రీ. భార్జి శ. (వామన హాటి.)

**ఫంజిక.** సం. వి. ఆ. స్త్రీ ౧. భార్జి. శ దేవ తాడము శ ౩ దురాలభ, తీఁటకపెంద. శ.

**ఫంజిపత్రిక.** సం. వి ఆ. స్త్రీ అఖుకర్ణి, ఎలుక చెవియాకు. శ.

**ఫండము.** సం. వి. అ. పుం. జఠరము, కడుపు.

**ఫక్కా.** సం. వి. ఆ. స్త్రీ. రీతి, ప్రకారము. (శ. ర.)

**ఫక్కిక.** సం. వి. ఆ స్త్రీ ౧ తత్త్వనిర్ణయా ర్థమగు పూర్వపక్షము ౨ అసద్వ్యవహారము ౩. హేత్వాభాసము, సత్యాభాసము. ౪. కప టోపాయము, జిత్తు. ౫. అవిచార పూర్వక ముగాఁ గలిగియున్న యభిప్రాయము. ౬. తార్కికనిర్దేశము. ౭. గ్రంథము.

శ్లో ఫణిభాషితభాష్యఫక్కికా విషమా కుండ లనామవాపితా. సం. నైష. ౨. ౯౫.

**ఫట్.** సం అవ్య. ౧ మంత్రోచ్చారణమం దుచ్చరింపఁబడు అనుకరణా శబ్దము. ౨. యోగము ౩. అస్త్రనామకమగు మంత్రభేదము ౪. విఘ్న నివారణమునం దుపయోగింపఁ బడునది.

**ఫటము.** సం. వి అ పుం ౧. పట్ల. ౨ కిఁ వుఁడు, వంచకుఁడు, మోసకాఁడు.

**ఫడింగ.** సం వి ఆ స్త్రీ ఝిల్లిక, ఈలపురుగు

**ఫణ** సం వి ఆ స్త్రీ. = ఫణము.

**ఫణాధరము.** సం. వి అ. పుం. సర్పము.

ఇట్లే ఫణాధరము

**ఫణాభృత్తు.** సం. వి త్. పుం. సర్పము

**ఫణము** సం వి అ పుం. పాముపడగ.

**ఫణావంతము** సం. వి. త్. పుం. పాము.

**ఫణాకరము** సం. వి. అ. పుం. సర్పము.

ఇట్లే ఫణాధరము మొ.

**ఫణి.** సం వి. న్. పుం. ౧. పడగగల పాము. భోగి, పాము. ౨. రాహువు, ౩. పతంజలి (మహాభాష్యకారుఁడు.) ౪ మరువకము.

**ఫణికేసరము.** సం. వి.అ.పుం. నాగకేసరము. శ.

ఫణిచక్రము. సం. వి. అ. న. వివాహాదులందు శుభాశుభసూచక నాడీకూటమును దెలుపుటకైన చక్రవిశేషము.

ఫణిజ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక వృక్షము.

ఫణిజిహ్వా. సం. వి. ఆ స్త్రీ ౧ మహాశతావరి. శ. ౨. మహాసమంగ శ.

ఫణిజ్ఝకము. సం. వి. అ. పుం. ౧ మరువము. శ. ౨. జంబీరము, నిమ్మ శ.

ఫణితము. సం. వి అ. న. గమనము.

ఫణితల్పగుఁడు. సం. వి అ. పుం. శేషశయనుఁడు—విష్ణువు,

ఫణితి. సం వి. ఈ స్త్రీ. వాక్కు. (శ. ర.)

సీ. అతినీలకుంతలయమృత పూరంబుతో దొర
వచ్చు నీముఖ సరసఫణితి
కాశీ. ౫. ౨౮౩.

ఫణిని. సం. వి. ఈ స్త్రీ. సర్పిణి అను ఓషధి శ.

ఫణిప్రియము. సం. వి. అ పుం. గాలి.

ఫణిఫేనము. సం. వి. అ పుం. నల్లమందు.

ఫణిభుక్కు. సం. వి క్. పుం. ౧. నెమలి, గరుడుఁడు.

ఫణిముఖము. సం. వి. అ న ఇంటికికన్నము పెట్టుదొంగలకు మట్టి త్రవ్వుటకై యుపయోగించునొకవిధమగు గుద్దలి, చోరసాధనము.

ఫణివల్లి. సం వి ఈ స్త్రీ. నాగవల్లి. శ. తములపాకుతీఁగ

ఫణిహంత్రి. సం. వి ఈ. స్త్రీ. గంధనాకులి, సర్పాక్షి. శ.

ఫణిహృత్తు. సం. వి త్. స్త్రీ. క్షుద్రదురాలభ. శ. ఒకవిధమగు కపింద. శ.

ఫణీంద్రుఁడు. సం. వి. అ. పుం. ౧. శేషుఁడు. ౨. వాసుకి. ౩ పతంజలి.
ఇట్లే: ఫణీశ్వరుఁడు.

ఫత్కారి. సం. వి. న్. పుం. పక్షి.

ఫరంజే = ఫరుఁజే. వి. (క త్తి. పోం. వాని.) పిడి, త్సరువు.

శా. బంగారంపు ఫరంజు గ్రొంజికిలివాల్పట్టైన
డాలున్ జిరా,నింగాణిం దొవలకా వహించు
చు .. రంగా. ౩. ౪౯.

ఫరము. సం. వి. అ. న. ఫలకము, పలక, కేడెము.

ఫరవానా. హిం వి. (హిం. ఫర్వానా.) రాజాజ్ఞ, శాసనము.

క. హాతకారా ల్గానివచ్చిన, ఫరవానా చూచి
హర్షపరవశుఁ డగుచున్, శిరసావహించు
కొనుచుం, దిరముగ బహుమానజలధిఁ
దేల్చెక వారిన్. రంగా. ౨. ౧౪౪.

ఫరుబకము. సం. వి. అ. న చెక్కలాకుపెట్టె, తాంబూలకరండము.

ఫర్ఫరము. సం. విశే. (అ ఆ. అ.) చంచలము.

ఫర్వరీకము. సం వి అ. పుం ౧ చపేటము, వ్రేళ్లుచాఁచిన అఱచేయి. అ. న. ౧. నవపల్లవము, లేఁతచిగురు. ౨. మృదుత్వము. ఆ స్త్రీ. పాదుక

ఫలకంటకము. సం. వి. అ. పుం. కంటకి ఫలద్రుమము, పనస. శ.

ఫలకపాణి. సం. విశే. (ఇ) పలక చేతఁగలవాఁడు, కేడెముచేఁబూనినవాఁడు (యోధుఁడు.)

ఫలకము. సం వి. అ. న. ౧. పలక, కేడెము. ౨. పలకవలె చదునైన యుపరిభాగము. ౩. వ్రాయుట కుపయోగించు శిలాదిపట్టికము. ౪. పిఱుఁదు. ౫. అఱచేయి. ౬. ఫలము, ఫలితము. ౭. లాభము. ౮. ఆర్తవము, రజస్సు. ౯. బాణాగ్రము. ౧౦. తామరపూవునందలి దుద్దు. ౧౧. అస్థిఖండము, శిరస్సునందలియెముకలు పైన చదునైనయస్థి. ౧౨. నాగకేసరము.

ఫలకయంత్రము. సం. వి. అ. న. భాస్కరా చార్యులు కనిపెట్టిన యొకజ్యోతిశ్శాస్త్ర యంత్రము

ఫలకర్కశ. సం. వి. అ. స్త్రీ. వనకోలి, కారు రేగుచెట్టు.

ఫలకసక్థుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) పలక వలె వెడలుపైనతొడలుగలవాఁడు.

ఫలకి. సం విశే. (న్. నీ. న్.) ౧. ఫలకములు గలది, పలకలుగలది. ౨. పలకదాల్చినవాఁడు, కేడెము ధరించినవాఁడు. వి న్. పుం. ౧ ఒక విధమైనచేప. (మే. ని.) ౨. కఱ్ఱపలకతో చేసిన యానసము. పుం. న. చందనపుకఱ్ఱ.

ఫలకృష్ణము. సం. వి. అ. పుం. ఓఁక, పానీ యామలకము. రై.

ఫలకేసరము. సం. వి. అ. పుం. కొబ్బరిచెట్టు.

ఫలకోశము. సం. వి. అ. పుం. అండకోశము, వృషణము.
ఇట్లే: ఫలకోశకము. (త్రి. ని)

ఫలగ్రాహి. సం. విశే. (న్ ణీ. న్.) ఫలించు నది, కాలమునఁ బండ్లుపండునది (చెట్టు) వి న్. పుం. ఫలవృక్షము.

ఫలచమసము. సం. వి. అ. పుం ౧. దధి మిశ్రితనటవృక్షచూర్ణము, పెరుఁగుకలిపిన మఱ్ఱి పట్టపొడి. ౨. న్యాయభేదము.

ఫలచోరకము. సం. వి. అ. పుం. చోరమను గంధద్రవ్యము.

ఫలత్రయము. సం. వి. అ. న. ౧. కరక, తాడి, ఉసిరిక అని మూఁడుఫలములు. ౨. ద్రాక్ష, ఖర్జూరము, కేసరము అని మూఁడుఫల ములు.

ఫలత్రికము. సం. వి. అ. న. కరక, తాడి, యుసిరికలు.

ఫలదము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. ఫలము నిచ్చునది, ఫలించునది. ౨. లాభమునొసఁ గూర్చునది. ౩. ప్రతిఫలము నిచ్చునది, పారి తోషికమిచ్చునది. వి. అ. పుం. వృక్షము.
ఇట్లే: ఫలప్రదము.

ఫలనము. సం. వి. అ. న. ౧. ఫలించుట, పండ్లు పండుట. ౨. లాభము నిచ్చుట.

ఫలనిర్వృత్తి. సం. వి. ఇ. స్త్రీ. ఫలము కలుగుట.

ఫలపాకము. సం. వి. అ. పుం. ౧. కరమర్ద కము, కలివె. రై. ౨. పానీయామలకము. ఒక జాతి ఉసిరిక. ౩. పండు పండుట.

ఫలపాకాంత. సం. వి. ఆ. స్త్రీ. ఒకసారి ఫలించి నశించు అరఁటి, వరి. మొ. ఓషధి.

ఫలపాకి. సం. వి. న్. పుం. గర్దభాండవృక్షము.

ఫలపుచ్ఛము. సం. వి. అ. పుం. ఏరండ వృక్షము, ఆముదపుఁచెట్టు.

ఫలపుష్ప. సం. వి. ఆ. స్త్రీ. పిండఖర్జూరి (రా. ని.)

ఫలపూరము. సం. వి. అ. పుం. మాదీఫలము. రై.
ఇట్లే: ఫలపూరకము.

ఫలప్రియ. సం. వి. ఆ స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణము. రై.

ఫలభాక్కు. సం. విశే. (క్. క్. క్.) ఫల మును బొందువాఁడు.

ఫలభూమి. సం. వి. ఇ. స్త్రీ. కర్మముల ఫలముల ననుభవించు స్థానము (స్వర్గము మొ.)

ఫలమత్స్య. సం. వి. ఆ. స్త్రీ. కలబంద. రై.

ఫలము. సం. వి. అ. న. ౧. పండు. ౨. పంట. ౩. పరిణామము, ఫలితము. ౪. ప్రతిఫలము. ౫. కార్యము. (వ్యతి. వచనము.) ౬. ఉద్దే శము. ౭. ప్రయోజనము, ౮. లాభము, వడ్డి.

౯. సంతానము. ౧౦. పండులోని గింజ. ౧౧. జాతిఫలము, జాపత్రి. ౧౨. కత్తివాదర. ౧౩. ఫాలము, నాగటికఱ్ఱు. ౧౪. బాణము ములికి. ౧౫. ఫలకము, కేడెము. ౧౬. జాజికాయ. ౧౭. త్రిఫల. ౧౮. ప్రత్తికాయ (శ. ర.) ౧౯. కక్కోలము, పెద్దయేల. ౨౦. ఆర్తవము, రజస్సు. ౨౧. ముష్కము, వృషణము. ౨౨. దానము, ఈవి. ౨౩. కుటజము. ౧. ౨౪. (వ్యాక.) కర్త్రాది వ్యాపారనిష్పాద్యమైన ప్రధాన ప్రయోజనము, ధాత్వర్థజన్యమగు సంయోగాది. శ్లో. యస్యార్థస్య ప్రసిద్ధ్యర్థం ఆరభ్యంతే పచాదయః తత్ప్రధానంఫలం తేషాం వలాభాది ప్రయోజనం. (హరికారిక.) ౨౫. (గౌతమ ప్రోక్తము.) ప్రమేయభేదము. ౨౬. (గణిత.) త్రైరాశికమునందలి మూఁడు రాసులలోను రెండవరాశి ౨౭. ఒకక్షేత్రముయొక్క చదరపుకొలత ౨౮. పందికోల చివర. (శ.ర.) ౨౯. కక్కోలము. ౧. (వాచ.)

ఫలముఖ్య. సం. వి. ఆ. స్త్రీ. అజమోద ఓమము. ౧.

ఫలముద్గరిక. సం. వి. ఆ. స్త్రీ. పిండఖర్జూరి. ౧.

ఫలయోగము. సం. వి. అ. పుం. (అలం) సమగ్రమగు ఫలప్రాప్తి.

శ్లో. సావస్థా ఫలయోగః స్యాద్యః సమగ్ర ఫలాగమః. (సా. ద.)

ఫలవంతము. సం. విణ. (త్రి. వత్. త్.) ౧. పండ్లుగలది. (వృక్షము.) ౨ ఫలమునకు సాధనమైనది. (యాగాది) ౩. ఫలముతోఁగూడినది. ౪. ఫలితము లిచ్చునది. వి. త్. పుం. పండ్లతోఁ గూడినచెట్టు.

ఫలవంధ్యము. సం. వి. అ. పుం. గొడ్డుచెట్టు, పండ్లుకాయని చెట్టు.

ఫలవతి. సం. వి. ఈ. స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణము. ౧. (విల్యమ్సు.)

ఫలవర్తులము. సం. వి అ. పుం. కాలింగ వృక్షము.

ఫలవృక్షకము. సం వి. అ. పుం. పనసచెట్టు.

ఫలశాకము. సం. వి. అ. న. (పత్త్రం పుష్పం ఫలం నాళం కన్దం సంస్వేదజం తథా) ఆను షడ్విధశాకములలో ఫలరూప మగుశాకము. (కూష్మాండాది)

ఫలశైశిరము. సం. వి. అ. పుం బదరవృక్షము.

ఫలశ్రేష్ఠము. సం. వి. అ. పుం. మామిడిచెట్టు.

ఫలషాడవము. సం వి. అ. పుం. దానిమ్మ. ౧.

ఫలసాయము. మి. వి. పంట. (శ. ర)

ఫలస్థాపనము. సం. వి. అ. న. సీమంతోన్నయనమనెడు సంస్కారము.

(ఇందు ఔదుంబరఫలములు రెండు స్థాపింపఁబడునుగాన యిట్టిపేరు.)

ఫలస్నేహము. సం వి. అ. పుం. అంకోటవృక్షము

ఫలహారకము. సం. వి. అ. పుం. ఫలకము, పలక. (విల్యమ్సు.)

ఫలహి. సం.వి.ఈ. స్త్రీ. ప్రత్తిచెట్టు. (విల్యము.)

ఫలాంతము. సం. వి. అ. పుం. వెదురు. ౧

ఫలాఢ్య. సం. వి. ఆ. స్త్రీ. కాష్ఠకదళి, అడవియరఁటి. ౧.

ఫలాదనము. సం. వి. అ. పుం. శుకము, చిలుక.

ఫలాధ్యక్షము. సం. వి. అ. పుం. రాజాదనము, పాల. ౧.

ఫలాపేక్ష. సం. వి. ఆ స్త్రీ. ఫలము కెదురుచూచుట, ఫలమునందలి యాశ.

ఫలామ్లము. సం. వి. అ. పుం. అమ్లవేతసము, పుల్లప్రబ్బలి. ౧. న. చింతపండు, వృక్షామ్లము.

ఫలాశనము. సం. వి. అ. పుం. చిలుక.

ఫలాస్థి. సం. వి ఇ. న. కొబ్బరికాయ.

ఫలి. సం. విణ. (స్. సీ. వ్.) ౧. ఫలములు గలది, పండ్లుగలది. (వృక్షము.) ౨. ౹౦వి ఫలితముగలది, లాభకరము వి వ్. పుం చెట్టు ఇ. పుం. మత్స్యభేదము. ఈ. స్త్రీ. ప్రేంకణము శ.

ఫలి(యి)ంచే. సం. అ క్రి పండు

పీ అవారములు పెట్టునది పితృకోటిః వవి వారి కర్పంబు లై ఫలించు.

మార్క 3 ౨౦౯.

చ నీమహానీయసంగమం,బున ఫలియిం చె నాతలంపు వోయెద... మార్క 3 ౩౮౧.

ఫలిక. సం వి ఆ. స్త్రీ ౧. నిష్పావి, ౨. శాకాగ్రము, అలుసుములికె

ఫలితము. సం. విణ. (అ ఆ. .) ౧. నిష్పన్నము, ఫలించినది, పండినది. ౨ ఈడేతీరక ఇపోయినది. వి అ. పుం. పండ్లుపండినచెట్టు అ స్త్రీ రజస్వల. అ. న. శైలేయము, ఱ పుష్పం.

ఫలినము. సం. విణ. (అ. ఆ. అ.) ౨౦ గలగు వి. అ పుం. పనస. శ. చెట్టు.

ఫలిని. సం. వి. ఈ. స్త్రీ. ప్రియంగువు, ప్రేంకణము. శ. (ఇది మామిడికి ప్రియురాలని కవి సంప్రదాయము.) ౨. తరిగొప్పు. శ.

ఫలీకృతము. సం. విణ. (అ. ఆ అ) దంచి పొట్టూడునట్టు చెరుగబడినది. (ధాన్యము)

ఫలేంద్రము. సం. వి. అ. పుం. అల్లనేరేడు, రాజజంబువు. శ.

ఫలేగ్రహి. సం. వి. ఇ. పుం - తగుసమయమున ఫలించునది - చెట్టు.

విణ. (ఇ) కాలమునఁ బండ్లు పండునది.

ఫలేపుష్పి. సం. వి. ఆ. స్త్రీ. ద్రోణపుష్పి, తుమ్మి. శ.

ఫలేరుహా. సం. వి. ఆ. స్త్రీ. పాటలి, కలిగొట్టు. శ.

ఫలోత్తమ. సం వి. ఆ. స్త్రీ. ౧. విత్తులేని ద్రాక్ష. కిసిమిసి. ౨. త్రిఫల.

ఫలోత్పత్తి. సం. వి. ఇ స్త్రీ. ౧. ఫలము కలుగుట. ౨ లాభము. వి. ఇ. పుం. మామిడి శ.

ఫలోదయము. సం. వి అ. పుం ౧. ఫలము పొడసూపుట, కోర్కి ఫలించుట. ౨ లాభము. ౩. ప్రతీకారము. ౪. హర్షము. ౫. స్వర్గము

ఫల్గనము. సం. విణ. (అ ఆ. అ) ఫల్గునీనక్షత్రమునఁ బుట్టినది. వి.అ పుం. ఫాల్గునమాసము.

ఫల్గుని. సం వి. ఈ. స్త్రీ ౧. ఒక నక్షత్రము. ౨ కక్కమేడి, కాకోదుంబరిక. శ

ఫల్గునీభవుఁడు. సం వి. అ పుం బృహస్పతి గురుఁడు (విల్యమ్సు)

ఫల్గునుఁడు. సం. వి. అ. పుం. అర్జునుడు.

ఫల్గువాటిక. సం. వి. ఆ. స్త్రీ. కాకోదుంబరిక, కక్కమేడి. శ.

ఫల్గువు. సం. విణ. (ఉ) ౧ సారములేనిది. పసలేనిది. ౨ నిష్ప్రయోజనము, ౩. చిన్నది. సూక్ష్మము. ౪. నిరర్థకము. ౫. దుర్బలము, సత్తువలేనిది. ౬. మిథ్యయైనది, కల్ల. ౭. రమ్యము. వి. ఊ. స్త్రీ. ౧. వసంతసమయము, ౨. కాకోదుంబరిక. శ. కక్కమేడి. శ. ౩ గయాతీర్థమందుఁగల యొకనది. (గులాల్ అను) ఒకవిధమగు పెట్టినపొడి. (దీనిచే హోళిపండుగునందు వసంతము లాడుదురు.

ఫల్గువృంతాకము. సం. వి. అ. పుం. కోష్ఠ భేదము, దుండిలము. శ.

ఫల్గూత్సవము. సం. వి. అ. పుం. హోళి పండుగు.

(దీనిని హిందువులు ఫాల్గున పౌర్ణమాసియందు చేయుదురు.)

ఫల్యము. సం. వి. అ. న. పుష్పం.

ఫల్లకి. సం. వి. ఈ. పుం. మత్స్యభేదము.

ఫల్లఫలము. సం. వి అ. పుం శూర్పవాతము, చేటగాలి.

*ఫల్లా. అవ్య. (హిం. ఫల్లా) వరె (అంగీకారమును దెలుపును.)

క. ఫల్లా కాని మ్మిపు డా, కిల్లాకిల్లాకు నడఁచి కించిన్మాత్రక, హల్లాకు నూలు కొల్పుచుఁ జెల్లాకుంజెదరఁజేయ శీఘ్రము మెవారికా. రంగా. ౬. ౨౮౩.

ఫళీన. క్రి. విశ. ద్రు. గట్టిగా.

క. తరలక భీ యని మనుఁగే, నరపుంద రటున ఫళీన జాడించినఁ డా, నరుగక చండి తనంపుం, గరకరి కుక్షిసైంధవంబు గళగళ పడుచుకా. చంద్రా ౩. ౬౫.

## ఫా

ఫా. సం. వి. అ. పుం. ౧. నిష్ఫల భావణము. ౨ సంతాపము ౩ వృద్ధి. విశ వర్ధకుఁడు (దీనికిఁ దెనుఁగున వ్యాప్తప్రయోగములేదు)

ఫాంటము. సం విశ (అ ఆ అ) అనాయాసముగా చేయఁబడినది. వి. అ పుం. న ఆయాసములేక చేసిన కషాయము, కషాయమున చిలుకునపుడు తొలుతఁబుట్టెడు వెన్నచిద్రుప.

ఫాండము. సం వి అ న కడుపు, ఉదరము.

*ఫాటకి. సం. వి. ఈ. స్త్రీ. పటిక.

ఫాణి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కండచక్కెర. ౨. కరంభము, దధిమిశ్రితసక్తువు, పెరుఁగుతోఁగలపిన పేలపిండి.

*ఫాణితము. సం. వి. అ. న. కండచక్కెర.

ఫాలఖేల. సం. వి. అ. స్త్రీ. పూరేడుపిట్ట.

ఫాలనేత్రుఁడు. సం. వి. అ. పుం. ముక్కంటి శివుఁడు.

ఫాలము. సం. వి. అ. పుం న. నాఁగటికఱ్ఱు. ౨. పాఁపటదీర్చుట, సీమంతభాగము ౩ కట్ట, మోపు ౪ నుదురు. పుం ౧. నిమ్మచెట్టు. ౨. ఒకానొకచెట్టు న. ౧. నూలితోనేసినవస్త్రము. ౨. దున్నినపొలము. విశ. (అ. ఆ అ.) నూలితోనేయఁబడినది (మే. ని)

ఫాలాహతము. సం. విశ. (అ. ఆ. అ) దున్నఁబడినది (విల్యము)

ఫాలుఁడు. సం. వి. అ. పుం. ౧. బలరాముఁడు ౨ శివుఁడు. ౩ కృషీవలుఁడు, కాఁపు.

ఫాల్గునము. సం. వి అ. పుం. ౧ ఒకమాసము. ౨. నీటిమద్ది. ‡

ఫాల్గునానుజము. సం. వి. అ. పుం. ౧. చైత్రమాసము ౨ వసంతకాలము.

ఫాల్గుని. సం వి. ఈ. స్త్రీ. ఫాల్గునమాస పూర్ణిమ.

ఫాల్గునికము. సం. వి అ పుం ఫాల్గునమాసము.

ఫాల్గునీభవుఁడు సం వి అ పుం గురుఁడు, బృహస్పతి.

ఫాల్గునుఁడు. సం వి. అ పుం. అర్జునుఁడు

## ఫి

ఫి. సం. వి ఇ పుం. ౧ పాపము. ౨ కోపము. ౩. నిష్ఫలవాక్యము. ౪ దుష్టుడైన మనుజుఁడు.

ఫింగకము. సం. వి. అ. పుం పక్షివిశేషము, ఒకజాతి పక్షి.

ఫిరంగము. సం. వి. అ. పుం. ౧ ఒకానొక దేశము ౨. పరంగివారి రోగవిశేషము.

ఫిరంగి. సం. వి. ఈ. పుం పరంగివాఁడు. విశ. (ఈ. ఈ. ఈ.) ఫిరంగరోగము కలవాఁడు.

## ఫు

**ఫు.** సం. వి. ఉ. పుం. ౧. మంత్రోచ్చారణ పూర్వకమగు ఫుత్కారము. ౨. తుచ్ఛవాక్యము.

**ఫుకము.** సం. వి. అ. పుం. పక్షి.

**ఫుట్.** అవ్య. తె. ౧. ఊదుట మొదలగు వాని యందగు ధ్వనికి అనుకరణము. ౨. కీచుమని కూపెట్టుట.

ఇట్లే: ఫూట్. తెం.

**ఫుత్కరము.** సం. వి. అ. పుం. అగ్ని

**ఫుత్కారము.** సం. వి. అ పుం. ౧ ఊదుట. ౨. బుస్సుమనుట, పాము బుసకొట్టుట. ౩. ఎగరోజుట. ౪ కీచుమని కూపెట్టుట.

ఇట్లే ఫూత్కారము.

**ఫుత్కృతి.** సం. వి. ఇ. స్త్రీ. ఫుత్కారము.

ఇట్లే: ఫూత్కృతి.

**ఫుప్ఫుసము.** సం. వి. అ. పుం. శ్వాసకోశము, ఊపిరితిత్తి

**ఫుల్లతువరి.** సం. వి. ఈ. స్త్రీ. పటికారము, పటిగారము. (ఆ. వి)

**ఫుల్లదామము.** సం. వి. న. న. పాదమునకుం బందొమ్మిదియక్షరములుగల వృత్తభేదము.

**ఫుల్లనేత్రము.** సం. విణ (అ. ఆ అ) విప్పారిన నేత్రములుకలది

వి. అ. పుం. ఒకవిధమగు లేడి, న. విశాలమైన కన్ను.

ఇట్లే: ఫుల్లలోచనము మెం.

**ఫుల్లఫాలము.** సం. వి అ. పుం. ధాన్యము తూరుగునప్పుడు కలుగుగాలి, చేటగాలి.

**ఫుల్లము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. వికసించినది, విరిసినది. ౨. పూచినది.

వి. అ. న. చక్కఁగా విరిసినపువ్వు.

**ఫుల్లరీకము.** సం. వి. అ. పుం. ౧. దేశభేదము ౨. సర్పము.

**ఫుల్లి.** సం. వి ఇ. స్త్రీ. వికాసము, వికసించుట, పూచుట.

## ఫూ

**ఫూత్కృతము.** సం. విణ. (అ ఆ. అ) ౧. ఊదఁబడినది. ౨. నీటిబుగ్గ మొదలగువానివలె పైకి చిమ్మఁబడినది. ౩. గట్టిగా కూపెట్టునది.

వి. అ. న. ౧. గాలియంత్రములోనగు వాని ధ్వని. ౨ కీఁచుమని బిగ్గరగా కూయుట

**ఫూత్కారము** = ఫుత్కరము.

## ఫె

**ఫెళఫెళ.** వి. చటచటల్లు చప్పుడు

గీ. రమ్యమేఖలఘుళిఘుళల్ రత్నహేమ, కలిత నూపురఝుళఝుళల్ చలువపలుకు, ఫెళఫెళల్ గిలుకుఁజుట్టెలగిలగిలల్ రహింతరాయంచకడ నిల్పెఁ జంచలాక్షి.

హంస. ౩. ౫౪.

## ఫే

**ఫేన.** సం. వి. ఆ. స్త్రీ. సాతలాఖ్యపము కీ.

**ఫేనకము.** సం. వి. అ పుం. ౧. ఫేనము. ౨. పిష్టకభేదము, ఒకదినుసు పిండివంట.

వి. ఆ. స్త్రీ. జలపక్వతండులచూర్ణము, నీటితో నుడికించిన వరిపిండి.

**ఫేనదుగ్ధ.** సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతిక్షుపము. కీ.

**ఫేనము.** సం. వి. అ. పుం. ౧. నురుఁగు. ౨. సముద్రపు నురుఁగు. ౩. నోటి నురుఁగు లేక చొంగ. ౪. పాలుకయందూరు తియ్యనియుమ్మి. ౫ మంచు.

**ఫేనవాహి.** సం. వి న. పుం. ౧. వడియఁగట్టు వస్త్రము. (విల్కిన్సు.) ౨. వస్త్రము. (శాక.)

ఫేనాగ్రము. సం. వి. అ. న. బుగ్గ, బుద్బుదము, బుడగ.

ఫేనాశని. సం. వి. ఇ. పుం. నురుపున వజ్రాయుధముగాఁ గలవాఁడు, ఇంద్రుఁడు.

ఫేనగిరి. సం. వి. ఇ. పుం. (సింధునది సమీపమునయున్న) ఒక పర్వతము. (విల్సన్)

ఫేనిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. పక్వాన్నభేదము. (కాకాఅనివాచ) ౨. భక్ష్యవిశేషము, ఫేణి (శ. ర.)

ఫేనిలము. సం. విణ (అ. ఆ. అ.) నురుఁగు గలది. వి. అ. పుం. ౧ బదరీవృక్షము, రేఁగు చెట్టు. ౨ అరిష్టవృక్షము, కుంకుడు. ౩. న. మదనవృక్షఫలము, ఉమ్మెత్తకాయ. ౩. రేఁగుఁ బండు

ఇట్లే ఫేనలము.

ఫేరము. సం వి. అ పుం. సృగాలము, నక్క.

ఫేరవము. సం. వి. అ పుం. నక్క.

ఫేరవుఁడు. సం. విణ. (అ. ఆ. అ) ౧. ధూర్తుఁడు. ౨. ఘాతుకుఁడు, హింసకుఁడు. వి. అ. పుం రాక్షసుఁడు

ఫేరుండము. సం. వి. అ. పుం. = ఫేరము.

ఫేరువు. సం. వి. ఉ. పుం. నక్క, జంబుకము.

ఫేల. సం. వి. ఆ. స్త్రీ. ఎంగిలి, ఉచ్ఛిష్టము.

ఫేలము. సం. వి. అ. న. ఎంగిలి.

ఫేలి. సం. వి. ఈ. స్త్రీ. = ఫేల.

ఫేలిక. సం. వి. ఆ. స్త్రీ. = ఫేల.

ఫేషువా. వి. (పార. పేష్వా.) కోశాధ్యక్షుఁడు.

సీ. పేంపు మీఱుచుసంతేఫేషువా హవుజియన నుండి చెలామణికొనర దెలుప ... మధుర జాతుకజాత నిండుగదాలె సభకుం.

అని. ౩. ౯౧.

# ఫ్సా

ఫ్సా. సం. వి. ఆ. స్త్రీ. భక్షణము, తినుట.

ఫ్సాతము. సం. విణ. (అ ఆ. అ) భక్షితము, తినఁబడినది.

ఫ్సానము. సం. వి. అ న. ౧. తినుట, ఆహారము, భోజనము.

# బ

బ. ఈధ ఒకయక్షరము.

బ. సం వి. అ పుం ౧ వరుణుఁడు. ౨. జలము ౩. సీటికడవ. ౪. పురుషుఁడు ౫. భగము. ౬. సింధువు. ౭ గమనము. ౮. గంధనము. ౯. తంతుసంతానము, పోఁగులసమూహము ౧౦ వపనము. (మే వి. దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు.)

బంక. వి. (సం. పంకః. క. బంకె.) ౧. (చెట్ల) జిగురు, నిర్యాసము.

సీ. అకురాలుపుగండ్ల నాసెడు నాసనింతడు గూఁడి బంకటియంగలార్చి.

ఆము ౫. ౧౧౭.

ద్వి. అడవిచెట్టులబంకలాకులునలము, పెడపట్టి దొక్కలు పెల్లుగామోచి,కొనితెచ్చు ...

పండితా. పురా. ౧.౨౦. పొ. ౯. పం.

౨. అననమునుండి జిగటపడెడి రోగవిశేషము. (శ. ర.)

౩. లోభము. (చూ. బంకెత.)

ఇ: బంకతెవులు, బంకదుత్తెర, బంకపురుగు, బంకమన్ను, బంకముచ్చు, బంకెత.

బంకతెవులు. వి (√బంక.) సస్యములకుఁ గలిగెడు రోగవిశేషము. (బ్రౌ.)

బంకదుత్తెర. వి. (√బంక.) ఒకవిధమగు తెండ. శ్రీ. (చూ. ఉత్తిరి.)

సీ. ముయ్యాకుపొన్నయు, కొంగబీంతు త్రికబంక
మ త్రికహంసపాదిగం బె ..

బంకపురుగు. వి. (√బంక.) ఒకవిధపుగు
కీటము.

(ఇది ప్రాఁకునపుడు వెనుక వల్లనిచాతిక శేర్ప
డును.)

బంకమన్ను. వి (√బంక) కుంభకరమృత్తు,
కుండలుచేయుమన్ను, జిగురుగలమన్ను

సీ. .. బంకమన్నవఁగఁ గుంభకరమృత్తు.
ఆం. భా. ౨. ౫.

బంకముచ్చె. విశ (√బంక) పిసినారి,
లోభి (శ. ర.)

బంకు. విశ ౧. వృద్ధుఁడు. కూరునివలె
నటించువాఁడు. (శ. ర.)

చ ఆతనికింపెను బంకుపీరుమ, ద్విసభుజ
శ త్రికిందరముగారు
ఉ హరి. ౪. ౧౩౧.

౨. కావలివాఁడు (గ్రా, శ. ర.)

వి. ౧. కత్య, ఇంటిలోపలిభాగము.

ద్వి. పొందలగునిమ్ము లిమ్ముగఁ గనుంగొనుచు,
గొదుకక బంకుబంకులు దాఁటి చనుచు.
ద్వి తి. సా. ౧౭౯. పా. ౧౦. పం.

బంకెత. విశ. (√బంక.) బుబ్బురాలు

ద్వి. బంకెతల్ బంకెతల్ పచ్చిరక్కసలు .
పండితా. పురా. ౧౧౬. పా. (శ ర. పా)

బంగనబయలు. వి. (బయలు+బయలు.) బట్ట
బయలు. (శ. ర.) (వ్యవ) గోడ తీసివేయఁ
గానే పెరడు బంగనబయ లయిపోయినది.

బంగరపుగట్టు. వి. (√బంగరము.) మేరు
పర్వతము.

.... బంగరపుగట్టు, కుదను గనుపట్టునీల
తోయద కుటంగ... ఉ. రా. ౨. ౪౨.

బంగరము=బంగారము. వి. కాంచనము, సువ
ర్ణము.

మ. .. విరించిచేఁ గొనిన మార్యం దవ్వ
దార్వశ్నబం, గరభుంబూడియ శై...
హైమ. ౮. ౧౫౯.

ఉ. ఇత్తడి రాగి బంగరములిప్పటియప్పుల కైవ
జాలవు... శేమ. ౩. ౧౨౩.

జ బంగరపుగట్టు.

బంగరు(వు.) = బంగారము, బంగారు. వి.
స్వర్ణము, బంగారము.

గీ. బంగరు సేయుటకొఱకు...
ఆ. ము. ౨. ౮.

ఉ ముంగిటికల్వ భూరుహము మాలధనంబు
నివేశనంబులో, బంగరునావ ... జగంబు
లందు మా మంగళశైలవల్లభుసమం బగు
దైవము లేదు చూడఁగన్. అని ౧. ౪౨.

క. కరు వేఁటికి బలితపుబం,గరు లేఁటికి ...
నిన్నువిడిచి చను కెడఁ దరుణీ.
రసిక. ౬. ౧౧౦.

శా. ప్మొసాధోత్తమపార్వతీగిరికులం గానీ రమా
విష్ణులం, గానీ రూపినపాటి బంగరుపునా
గావించి సేమకబుంచన్, దానం బీఁదగు ...
వరాహ. ౯. ౬౨.

ఉ. పరిఖ నిజాశ్రయాంబుపరిపాటిఁ దలిర్పఁ
బదారువన్నెబం, గరువున హైమరాజ గృహ
కల్పన కర్ణిక గాఁగ ...

జ. బంగరుఁగంటి, బంగరుకొండ, బంగరు
గట్టు, బంగరుగుండు, బంగరుచేల, బంగరు
పిచ్చిక.

బంగరుఁగంటి. వి. (బంగరు + కన్ను.) పీర
కొక్కెరుఁడు.

సీ. గొంటుబంగరుఁగంటి కంటువేలుపువింటిగుఱ
రవంబున నంటు గుండెదిగులు.
ఉ. రా. ౨. ౨౧౪.

(గొంటుబంగరుఁగంటి కంటువేలుపు = క్రూరుఁడగు హిరణ్యాక్షునకు శత్రు వగుదేవుఁడు, విష్ణువు అని భావము.)

బంగరు(వు)కొండ. వి. (బంగరు + కొండ) మేరుపర్వతము

ఉ. బంగరుకొండనుండి దిగుబాల దివాకరులీల
రాముఁ డు,త్తుంగమణీమయాసనముఁ డొరవు
వేడుక డిగ్గి ... ఉ. రా. ౧. ౧౪౧.

ఉ. ... నీలవర్ణ నీ,యున్నతిఁ జూడ మీఁది
వగ మెల్ల ఘనాఘనపంక్తి పర్వి పై,కొన్న
మెఱుంగు బంగరువుకొండగతిం దిలకింప
జెంతయున్. కవిక. ౬. ౨౦౦.

బంగరుగట్టు. వి. (బంగరు+గట్టు.) మేరువు.
(రాత్నసవర్ణనము.)

క. బంగరుగట్టుపట్టు కాఁడవి నిర్గమించి
సౌవర్ణవాహినీజలావగాహనంబునకు వచ్చు
నచ్చొ కృశోదవస్తం దేరదు కదంబకంబు
దంబున ... శం. రా. ౨. ౬౩.

బంగరుగట్టువింటివాఁడు = మేరుధన్వుఁడు, శివుఁడు.

ఉ. ... బంగరుగట్టువింటివాఁ డబ్బుర మైన
నవ్వనంబురాణులలందగటార్పపాదుపై ...
గల్పనగుం గృతికేల కప్పుడున్.
శం. రా. ౧. ౧.

బంగరుగుండు. వి. దే. (బంగరు + గుండు.) మేరువు.

అ. కలక జాలి గలదు గలుబలాభ్యుదయిఁ జెప్పి,
నివారించు మాని యడరుఁ దనిన, మునుము
ఘనమిఁ గంటి మునుము బంగరుగుండ్లు, కరో
యలకపీంద్రు నండుఁ గాంచి.
సమీర. ౧. ౧౫౬.

ఉ. బంగరుగుంటివింటిదొరపాటి యనం దగు
కేటి పాటి మీ, అంగలగొంటురక్కసుల
రాయిడి గెంటెడుపోటుబంటు...
సమీర. ౨. ౩౧.

బంగరుగుంటివింటిదొర = శివుఁడు.

బంగరు(వు)చేల. వి. (బంగరు(వు) + చేల.) కనకాంబరము, పీతాంబరము.

మానిని. బంగరుచేలయుఁ బద్మనిభాక్షుఁడు
బాహుచతుష్కము... కళా. ౨. ౧౪౦.

చ. ... సురాధిపుఁ డభ్రమువల్లభంబు న
య్యన డిగి వల్లెవాటుగ భుజాగ్రమునం దగు
మేలిజాళువా, జిసఁగు మెఱుంగు బంగరువు
చేల చెఱంగు కటీతటంబునం, దెనఁచి...
దశా. ౨. ౩౪.

బంగరుపిచ్చుక. వి. (బంగరు + పిచ్చుక.) పక్షివిశేషము.

క. ... బంగరుపిచ్చుకఁ గొంచుక, వింగి
సాళువపులుఁగు ..అచ్చ. రా. అర. ౬౨.

బంగల. వి. ౧. కుంపటి, అంగారధానిక. (శ.ర.) ౨. బండికుంపటి, ఒకచోటనుండి వేఱొక చోటికి తీసికొనిపోవుట కుపయోగించు కుంపటి.

గీ. బంగలయునంగ బండికుంపటియనుభవ.
అం. భా. ౨. ౨౪౧.

('బండిగలయది' ప్రాఁతప్రతి.)

బంగలా. వి. (హిం. బంగలా.) గృహవిశేషము.

ద్వి. బంగరుపని రంగు బంగళా యుండు,
ముంగల... ప్ర. వి. ౧. ౨౬.

బంగారము = బంగరము,బంగరు,బంగారు. వి. (సం. భృంగారః. ప్రా. భింగారో. క.

బంగారవు. త. వంగార ) కనకము, పసిఁడి.

క. ... బం,గారము బోలెఁడుకోడంన,కు ..

హరి. పూ. ౫. ౨౬౫.

ఉ. హరిమిత్రుతో ద వలకూబరుఁ డేకతమాడి పెద్దబం,గారపుఁగోరఁ గల్పవనిరాజని రాంతము లైనచీరలున్. మనుచ. ౫. ౯౨.

విశే. (బంగారమువంటిది) అధికమూల్యము కలది; దుర్లభము.

సీ కప్పుకో ల బంగారిమా ప్రపుబంతు లవి సువర్ణలతోదయములనుమ్ము.

కవిరా. ౧. ౮౧.

బంగారయ్య. విశే (బంగారు + అయ్య) బంగారువలె ప్రియమగువాఁడు, ప్రియుఁడు

క.... నాబం,గారయ్యా నీవు చల్లఁగా నుండు మింకన్. శుక. ౨ ౩౧.

బంగారు(వు) = బంగరు, బంగారము. వి ౧. స్వర్ణము, పసిఁడి.

సీ. చదలేటిబంగారు జలరుహంబులకూండ్లు భోజనంబులు మాకుఁ బువ్వుఁబోణి.

నైష. ౨. ౭౯

ద్వి. కలఁకఁ దొలంగినకమలినివోలె, బలుమట్టు గడిగిన బంగారువోలె.

రం. రా. బాల ౫౧, పా. ౫. పం.

ఉ. రాదు మెఱుంగు లయ్యె సురుఁగాంతికిఁ దైవార గిపికేయం బం,గారువు లయ్యెఁ జేజగలఁ గండినపట్లు కవిక. 3. ౨౨.

౨. బంగారుతోఁ జేసిన భూషణము.

గీ. ఉదుటుగట్టులు గలతల్పటురము నూది, గందకట్టులు నూది బంగారు నూది, చీటి వాకటితోటినే నిదుర కెప్రదు

అను. ౨. ౧౦.

(ఇది వైకింతర్థములకు నుదాహరణము.)

విశే. ౧. అపురూపము.

సీ మించుమే నటు కాఁగిలించి చూచెద నన్నఁ జెలి యది బంగారు చేసికొనెదు.

సారంగ. ౨. ౨౨౫.

౨. మిక్కిలి ప్రేమపాత్రము.

(వ్యవ.) మా అమ్మాయి బంగారుతల్లి నేను చెప్పినట్లు వినునమ్మా.

బంగారు బొమ్మకు మసిపాతగట్టు = అమూల్యపు వస్తువులఁ గూర్చుట.

ద్వి. పొఁగిన బంగారుబొమ్మను దెచ్చి,మసి పాతఁ గట్టుట మాకు సమ్మతమె.

ద్వి. నల. ౧. ౬౭౧.

జ. బంగారయ్య, బంగారు కడుపువాఁడు, బంగారుకుండ, బంగారుకొండ, బంగారు తీఁగ

బంగారుబోఁడి = బంగారువలె మనోజ్ఞారాలగు ఆఁడుది, ఆఁడుది.

ద్వి. బంగారుబోఁడుల పాలిండ్లఁ బోలు, బంగారుకుండల పసమించి ..

ద్వి పరమ. ౧. 33. పా.

బంగారు మొలక = సంపంగి మొక్క.

సీ పంజాలు కర్పూరపాదపంబులు తెచ్చి జల నోగి బంగారు మొలకదెచ్చి.

హర. సీత. ౧. ౨౫.

ముంగొంగు బంగారము = ముందుకొంగునముడిచి కొన్న బంగారము-అతిసులభము, ఎప్పుడును సిద్ధముగా నుండునది.

(వ్యవ.) భగవంతుఁడు భక్తులకు ముంగొంగు బంగారు.

సీ. ముక్కుచక్కనముజాని ముంగొంగుబంగారు ...

రాధికా. ౧.౨.

చ. గుడిగుడి గ్రాగ బంగు బడఁ గూర్చినచిల్క
గుడాకుమూర్ద్ధమై, బడి రవిలించి క్రోవిపాగ
వచ్చెదురీతిని మించ .. (పార్వ. ౨. ౯౭.)

బంటరి. విణ. (బంటు + అరి. స్వార్థమున.) శూరుఁడు.

ఉ. ...భూరిమఖాధిపత్యములఁ బొందుదురప్పరి
పోటుబంటరుల్. (శుక. ౧. ౪౪.)

బంటతీకము. వి. (√బంటు.) దాస్యము.

క. చేరఁడుమాకలఁ బిడికెడు, కూరయుఁ గాని
యొక్కపూఁటకూటికి దొరయు, యూరకఁ
బంచినఁ బోఁబడు, పారాపాత్యంబు బుద్ధి
బంటతీకముగా. ద్వా. ౨. ౧౪౩.

బంటి. అవ. నీరు కొండలగువాని పరిమితిని దెల్పు ప్రత్యయము.

లయగ్రాహి. మత్తకలబంటి యగు పొత్తరులు
దోయిళుల, నెత్తి చవిఁ గ్రోలుచును ...
భార. స్త్రీ. ౨. ౭.

గీ ... మద్దులు మునింగి, పొలు పెంపళ్లు తమ
కెంతబంటి యనుట ..
ఉ. హరి. ౪. ౧౨౪.

వ. ... యమునాజలంబులు నీర నందు సుందర
సుందరులు నొచ్చి పదప్రమాణంబు జాను
దఘ్నంబు కటిద్వయసంబు మధ్యమాత్రంబు
కుచంబులబంటి యని పలుకుచు ...
భాగ. ౧౦ పూ. ౧౦౯౯.

ఉ. ఉత్తరశాయకేక్షణకటాక్షవిలాస రసప్రవా
హముల్, మత్తుకబంటి తామరల కుందలము
న్కలు గండుమీలకున్. విజ. వి. ౩. ౧౫.

ద్వి. కోకట నోకపెట్టు రూఢిగాఁ బడిరి,
మొందమోఁకురి కిక్క ముక్కనబంటి.
ద్వి. హరిశ్చ. ఉ ౧౦౧౧. పం.

గీ. ఛయము దోడ్తోన ముక్కునబంటి యయ్యె.
కేం. కుంచ. ౧. ౨౧౧.

(ఇట వృత్తిని నగాగమము.)

బంటు. వి. (సం. భటు. క. బంట.) ౧. భృత్యుఁడు, పరిచారకుఁడు.

వ. స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౯౯౨. కెంటి
చైత్రశుద్ధ ౫ మంగళవారమునాండు విషువ
సంక్రాంతి నిమిత్యమున శ్రీ వెలనాంటి
రాజేంద్రచోడయరాజులబంటు వెలనాంటి
లోని .. కరపాటి నిజవాసమండైన పోతి
నాయకుండు శ్రీ కోణవగిరి త్రిపురాంతక
మహాదేవరకు ... ధారాపూర్వకముగా ..
ఇచ్చి (కావల్యపురము శాసనము. గు. జి.)

సీ. ... బంటు వరవుఁడు గుండడు నాఁగ
దానాఖ్యలుగాఁగఁ దనరు.
అం. భా. ౨. ౨౯౭.

గీ. వకులప్రస్తరంబు బంట్లకు దీర్పంగ,వలయు
ననుట కు. సం. ౧౧. ౪౦౨.

మ. ... తాపం బాఱఁగఁ గౌఁగిలించుకొనకే
తథ్యంబు నీబంటనే, ..యోపక్వబింబాధరీ.
నైష. ౭. ౫౧.

౨. శిష్యుఁడు.

చ. గొనములప్రోక యంగిరను కూరిమిమన్మఁడు
జేల్పుటొజ్జ పేర్మిని గనుకొన్నబిడ్డ మణి
మీకును బంటు ... (యయా. ౩ ౧౩౦.)

(శ. ర. పా నీకుఁబట్టు ముద్రి పా.)

౩ యోధుఁడు, జోదు.

గీ. ... భటుఁడు, పరగు జో దన పెం కన బం
టనంగ. అం భా. ౨. ౧౭౪.

సీ తొడరి పెబ్బులినైనఁ బెడకేలఁబడఁద్రోయు
పోఁడిమిగల్గినబంట్ల పుట్టినిల్లు.
యయా. ౧. ౩౦.

విణ. ౧. ధృష్టుఁడు.

సీ. మునిమాపు బలుగంబమునఁ బుట్టి బంటు
నక్కఁజుఁ గాచిపట్టినంగంబ మీఱ.
భోజ. ౧. ౪౯.

క. కొలిచిన బంటుల కోర్కులు, దీరఁ దీర్పఁ
దగఁగఁ బిడుకు వేలు పుట్టించక పుట్టదవనిన్
నీలా. ౧. ౨౧.

౨. శూరుఁడు, పరాక్రమశాలి.

క. ధరలో శూరావ్యయములు, పరఁగఁ
జెఱువదాఁ దనంగ బంటనఁగాఁ బోఁటఁ
యున వడిగలవాఁ డన, బిరుదన వాఁడి
మగఁడనఁగ ... (ఆం. సం. మూన. ౫౧.)

ఉ. వాపతి డాగురించి కుమారాగతి నన్నిటరి
దెచ్చి బంట వై, పాపము లేల యాడెదు.
భా. రా ము. ౧౬౩.

క. ఇంటం దెచ్చిలునఁ జచ్చుట, కంచెను బాఱుంబు
లాండు గలదె నృపులకున్, బంటై కలనఁ
బొలియుటఁ, గఁట నిధానంబుఁగంట కాదె
మనకున్ భార. భీష్మ ౧. ౯౯.

(శ ర పా. 'పంటకలను బొలికల'నిదియు ద్రి.పా.)

దుక్కిబంటు = దుక్కిపనిచేసెడి సేవకుఁడు, పాలేరు.

చ ఒకద్రుటి కాల మేని పని కొగ్గక మీఁదులు
చూచు దుక్కిబంట్లను మడిఁ జేనఁ
గల్వల కొడంబడి ఘాసములూడ్పు కూలి
కాం, డ్రకు ... (వేం. పంచ. ౧. ౭౭౧.)

జః బంటరి, బంటతికము, బంటుతనము, బంటు
వాఁడు, బంట్రౌతు, బంట్రౌతుతనము.

బంటుతనము. వి. (బంటు + తనము.) పరా
క్రమము.

ఉ. బంటుతనంబు మాటలకుఁ జాలదు పాండు
నృపాలు రై, కొంటయ చాలు
భార. ఉద్యో ౩. ౫౯.

క. ... ద్వితుఁడు దొంతబలియుండో కదా యని
కొలువాలు కి, ట్లుడుటున్న వానిఁ బ్రాంతు
నను నొక్కనిఁ బరుపిన పంటి చాలకే, యిటి
కెర సైన బంటుతన మిట్టిది నీక తగుం
గుమారకా. ప్రభా. ౨. ౫౯.

బంటువాఁడు = బంటు. వి. (బంటు+వాఁడు.
స్వార్థమున) సేవకుఁడు, బంటు.

ఉ. కానఁ దపస్విఁ బిల్వఁగ [illegible]
చేడియ లేద బంటువాఁ, డైనను లేదె
యవ్వటువు నంపఁగ నేఁటికి ...
వి. ప్ర ౫. ౭౧.

గీ. పెట్టుపోఁతలసాగ పాని పెట్టిపాని, [illegible]
కద నుండి యట్టాడు బంటువాఁడు
[illegible] ౨. ౨౦౯.

బంట్రౌ (ట్రవు) తు. వి. (బంటు + రౌతు.)
సేవకుఁడు.

క చాలఁ గురంగటి మదుఁగుల, గాలాపు ద్వేఁటు
లాడఁగా దొరకినబల్మిలుఁ జవిఁ జెల్ప
నపు డా, పాలెంబున డిగిన బక్కబంట్రౌతు
లకున్. కువల. ౨ ౧౦౯.

సీ. నిల్చినాఁ డితఁడు పోనిం దల్కనుంట
బంట్రౌతుపాడియె యని డాయువారు.
రా. వి. ౫ ౫.

క. త్వరితమ్ముగఁ దలవాకిలి, దెఱచుక బంట్రౌతు
నోటికిటయుఁ దీఱన్ .
హంస. ౪. ౧౭౭.

బంట్రౌతుతనము. వి (√బంట్రౌతు) కూర
త్వము.

శా. నీవాణంబులు రాల నీధనువు ఖండీభూతమై
పోవ... నీబంట్రౌతుతనంబు స్త్రీలరయఁగ
నిక్కెన్నవ్వరున్ నవ్వరే .. (ఇందు. ౪. ౫౩.)

బండ¹. వి. విశాలశిల, చాఁపరాయి, [illegible]

సీ ... బం దన నిశాలకల బొబ్బ.

అం. భా. ౨. ౨౯.

చ. వన గల బొందల స్గదురుబందలఁ గాకల
బిండి పొంగుచా, వృషరక్షకాలచే విభురఁ
జాతిన నిర్వ్యరిరోగిరంబు .

చంద్రా. ౨. ౪౬.

చ. పలుమలు పచ్చరాచలువబందల ప్రాలుచు ·

సారంగ. ౨. ౧౮౧.

౨. పొట్టిగోఁకలి. (శ. ర)

విశే. ౧. మొద్దుకేతిపది. (ఆతిగినది. శ ర.)

(వ్యవ) ఇది బందకత్తి; తెగదు. (పాషాణము వంటిది.)

౩. బుద్ధిహీనుఁడు, మందుఁడు, చురుకులేని వాఁడు.

ద్వి. బందలు గాకరాపములు సాష్టాంగ,దండ
ప్రణామములఁ జేరిదరిఁజేసి

పండితా. పురా. ౧౩౪. పా.

(వ్యవ.) వీఁడు బంద; వీని కెంత చెప్పినను ఒక్క ముక్కరాదు.

(వీనిది బందబుద్ధి యేది చెప్పినను గ్రహింప లేదు.)

జ : బందకత్తు, బందచింత, బందతనము, బంద తల, బండారు.

బంద². వి. (సం. భండః. క. బణ్ణ. త. వందన్)
౧. ఘోరకృత్యములుచేసి బిచ్చమెత్తెడు ఒక నీచజాతి.

ఉదా : బందవాఁడు, బందది. (శ. ర.)

౨. శైలూషాదులగుజాయాజీవులలో నొకజాతి వాఁడు

సీ. బందలు బూతులు పరిహాసకులు నట్టువా
రాదిగాఁ గలవారు దక్క ...

విజ్ఞా. ౨. ౧౧౬.

విశే. ఆగడము. (శ. ర.)

బందతిట్లు=బందజాతివాండ్రు తిట్టుకొనుతిట్లు. (అనఁగా బూతులు.)

గీ. కందకమున్నలవాని నాఁకటను బంద,తిట్ల
కెత్తికలసారెఁ దిట్టువాని.

అము. ౬. ౨౦.

బందబూతులు = బందవాండ్రు తిట్టుకొను బూతులు. (బందుబూతులు. శ. ర.)

జ : బందగుఁడు. బండాట, బండెక.

బందఁగి. వి ౧. దీము, వేఁటకాఁడు పశుపక్ష్యాదులను బట్టుకొనుటకై పెంచినమృగము పక్షి లోనగునది.

పీ. ... గాడ్పుమృగము బందఁగిఁ జేసి యుల
యించి పెలలోనియుక్తిఁ జేయు.

కు. సం. ౪. ౩౪౯.

క. డేగలను వేఁటయురులన్, జాగిలముల జాతి
మంగిసల బందఁగులన్, వేగఁ గొని ...

చంద్రా. ౨. ౪౧.

౨. వేఁటకాండ్రు మృగములు మున్నగువానిని బట్టుకొనుట కుపయోగించు కపటయంత్రవిశేషము, ఒకవిధమగు బోను.

క. పొంకించుఁడు మాయిఱ్ఱులఁ,గొంకుల సీసంపు
గుండ్లఁగొమ్మల నురులం,బొంకించి దిగువ
గాలివ,లంకుల బందంగిబండ్లు పఱపుం
డనుచున్. (కళా. ౪. ౬౩.)

క ... కు,క్కలు ప్రోగులురులు కొమ్ములు
బందం,గులు పందిపోటులు ...

వరాహ. ౪. ౬౧.

చ. మిడిబిండ్లు బందఁగులఁ గొమ్ములఁ
జాదులు వల్లెత్రాళ్లఁ జి,వ్వలతడికెల్
ధరించి యురువంకలఁ జేరిరి కొంత యుద్ధతిన్.

చంద్ర. ౨. ౨౧.

(దీనిని శ. ర. 'బందగు'గా గ్రహించి 'బోను' అను నర్థమిచ్చెను.)

సీ. ఆయాధికర్యయాసధికంబునుం బ్రజావిభవం బగాఁగ బండరువుఁ గూర్చి.

ఆము. ౪. ౫౩

ద్వి. సుకుల ముముక్షువుల మూలబండరువు.

పండితా. దీక్షా. 3. పా

ద్వి. కాళికమారయ్య మూలబండరువో, శంకర దాసయ్య కెంకరియో

పండితా పురా. ౧౫౬ పా

బండవలము = బండాలము. వి. ౧. సంచి కొందలు, మూలధనము. (శ ర)

౨. సామర్థ్యము. (శ. ర)

బండాట(ము). వి. (శ. ర. బండ² + ఆట.) అకతాయితనము

గీ దొడ్డబండాటమునఁ గోకఁ బ్రోసికొనుచు, గుడిసెజంతలు కవిక. ౪. ౯౫.

(శ. ర. పా బండాటము. ముద్రి. పా)

బండారపుటిల్లు. వి (బండారము + ఇల్లు) కోశగృహము, ధనాగారము.

సీ. ఇదులబండారంపుటింటికిఁ బెట్టిన బొందు మట్లెలకోటఁ బోరగలిచి

ఉ హరి ౨. ౧౭౧.

బండారము=బండరు, బండరువు, బండారు¹. వి. (సం భాండాగారః ప్రా. భాండాఆర, భాండార. క. బండారవు) ౧. కోశాగారము, బొక్కసము

సీ. బండారములయందుఁ బరమవిశ్వాసుల భక్తుల దక్షులఁ బంచితయ్య.

భార. సభా. ౧. ౪౭

శా. ..ప్రద్యుమ్నుం డాహవకేళి సేయుతెఱఁ ... విస్మాన్తాసకలంబు లాక్కుకొనిగా వింటారి బండారముల్.

ఉ. హరి. ౬. ౬౯.

౨. ధనము.

ద్వి. దండింప రా దను తలఁతువ నిట్లు,బండార మంతయుఁ జాడుచేసితివి.

బస. పు. 3. ౧౧. పం.

౩ : బండారపుటిల్లు, బండారి

బండారి. వి. (బండారము+ఇ³)కోశాధ్యక్షుఁడు.

క. బండారితోడఁబుట్టువు, నిండినయశ మెల్ల వరదనీటఁ గలిపి తాఁ,వెండిలి గా కట ముష్టే, యుండెడుగర్భమున లజ్జనొందెడు. మదిలోన.

చెన్న. ౧. ౧౭౦.

ద్వి. భక్తవత్సలుఁడ నేఁ బర్వతపుత్రి,భక్త రత్నములకు బండారి యితఁడు

బస. పు. ౨. ౬౧౭. పం.

గీ. తనరుశలమ త్రిగండప్రతాపరుద్ర, మనుజవరు నకు బండారియును మహానిధి,కారియును నా పుడుసు నయి గణన కెక్కి ...

మార్క ౧ ౪3.

(శ. ర. పా. సేనాని ముద్రి పా.)

బండారిల్లు(లు). వి [బండారు² + ఇల్లు(లు.)] కోశాగారము.

మహాస్రగ్ధర ఈర వైచాగంబు భోగం బుధ యము నాకపా లుగ్రసేనావనార్థం, బిరు వా ల్బిండారు బండారిలు చూర నాక పాలు

ఆము. ౪. ౨3౭.

బండారు¹ = బండారు. వి (బండ¹ + ఆరు) ౧. పసుపు, హరిద్ర, జాతిమిఁదజాచి పూసి కొనెడి పసుపు. హరిద్రావిశేషము.

క. బండారు నానబిండియు, కెండియు మణి కొట్టబింది వివరముతోడన్, కొంచుగ నడి కిలితోడను, కొండొంటింగలిపి పెట్ట నొప్పుగ మూసుక్. (చి. కి. చి. వి.)

ద్వి. కసి గలిగిల సంగల్లఁ బూదండ, లాస వరి బాగుకై చెంగరంగఁ జట్టి, బండారు

గలిబిలిపడిమిద్రొమ్మిసిమి,పిండి గంధములు
ముప్పిరిగొనఁ బూసి.
అ. మ. క. ౨. ౧౨. పా. ౨౨. పం.
సీ. గొరగర్రౌ మైలారుఁ గొనియాడు నొక
కేల నొసలిపై బండారుపసుపుఁ దాల్చి.
కాశీ ౩. ౨౩౦.

౨ వృక్షవిశేషము, ఒకజాతిచెట్టు.
సీ. చవికె బండారాకుసందుల డిగి మంచు
కుంపురల్ దుష్పటిఁ దొప్పదోఁగ.
రా ౯. ౨. ౪౦
జ: బండారుపిచ్చిక.

బండారు³ = బండారము. వి. ధనము.
(చూ. బండారిల్లు.)
జ: బండారిల్లు.

బండారుఁడు. సం. వి. అ. పుం బళ్లెలను గాచు
వాఁడు. (శ. ర.)

బండారుపిచ్చిక. వి (√బండారు¹.) పీత
మ్రుండము, పచ్చతలపిచ్చుక. (చి. ని., శ. ర.)

బండారువు = బండరువు. వి. బొక్కసము.
మ. తనబండారువు చూఱ యిచ్చెనొకో కంద
ర్పుండు నేఁ డంచు .
కు. సం. ౧౦. ౩౯౩

బండాలము=బండవలము. వి. (సం. భాండం.)
౧. సంచిమొదలు, మూలధనము
గీ. మొదలు బండాల మనఁ దగు మూలధనము.
ఆం భా. ౨. ౨౬౩.
౨. సామర్థ్యము. (శ. ర. బండారము. అని
వ్యవ. దాని బండారము బైటపడినది.)

బండి. వి. (క. బండి. త పండి. . ఐ. బండులు,
బండ్లు.) ౧. శకటము.
గీ. ...బండ్లు యతఁడు శకటపదూర్యమొ యతఁడు
చుండు. (ఆం. భా. ౨. ౨౦౦.)

గీ. తెప్పదరలఁగ బండు తేరెంచుచున్న,యది
మహాత్మ ... (భార. అను. ౪. ౩౦౧.)
సీ. బండులు విఱుగంగఁ బైదాఁటి పండిళ్లు పడఁ
ద్రోచి కలుపులు సదలదొ త్రి.
హరి. పూ ౬ ౧౩౧.
౨. రథము.
సీ ఎఱుఁగులుఁ బులులుఁ గాదెనుఁబోతులును
బూనుబండిపై దేవాంతకుండు వచ్చె
రామా. ౧. ౬౬.
సా: నిండుబండికిఁ జేట బరువె=ఘనకార్యము
నిర్వహించువానికి అసందర్భమున నొకచిన్న
కార్యము చేయుట కష్టము గా దనుట.
క .కా,ర్యాటోప నిండుబండికిఁ, జేటబరువె
యువనినాథ చింతింపంగన్
రుక్మా ౩ ౧౨.
ఇట్లే నిండుబండికిం జేట భరమె
ఉ ఘోరపుబాధలఁ బొందు చూంటిమైఁ,
బాటిలునాత్మకున్ భరమె పాపము నీయది
నిండుబండికిం, జేట భరంబె యేమిటికిఁ
జేయవు విప్రుఁడ కిల్బిషంబులన్.
సైవ. ౪ ౪౬.
పాఁకుడిబండ్లకుఁ బదములు సాఁచుట = అక్క
ఱకుమాలిన సాహసకృత్యమును జేయుట.
ద్వి పాఁకుడిబండ్లకుఁ బదములు సాఁచు,
వీతిఁడిపగిది వివేకంబు మాలి.
ద్వి. హరిశ్చ. ఉ ౨౩౦౪. పం.
చ. పిలిచితినన్న నిన్ను నతిథీశుఁడవిప్రుఁడ నమ్మి
నాఁడ నీపలు కవృతంబు గాఁ దగుఁజె
పాఁకుడుబండ్లకుఁగాళ్లు సాఁపఁగా, వలవదు
నన్ను పోటుమగఁడై యటుచేసితిగాక
యాసతో, విలుకు ... నీకులమంచిదఁ
బాలమంచినన్ (ఉ. హరి. ౨. ౩౧.)
జ: బండికన్ను, బండికల్లు, బండికంపటి, బండి
గుతిగింజ, బండిగురివెంద, బండిపులి, బండి

బండిబాట. వి. (√బండి.) ఘంటాపథము, రాజమార్గము.

సీ. బాట యనంగను బండిబా టనఁ దగు ఘంటాపథము ... (ఆం. భా. ౨ ౯.)

బండిబారు. వి (బండి + బారు) రథసైన్యము.

ఉ. . అట్టపై, నిలిచినకృత్తమ స్తకము విప్పఁ గొల్చుఁగ బండిబారునన్ (శకు. ౫ ౧౭౪.)

బండిమొగ్గరము. వి. (√బండి) శకట వ్యూహము (శ ర)

బండిరక్కసుఁడు. వి (√బండి) శకటాసురుఁడు (చి ని)

బండిరిక్క. వి (√బండి.) రోహిణీనక్షత్రము (శ. ర)

బందు. వి. (క. బందు.) ౧. అవమానము (అకతాయతనము శ ర)

గీ తాను భిక్షాకపాలంబు దాల్చి వచ్చి బందు సేయుటకంటె రాకుండు టుఱవు
కాశీ ౭ ౮౦

౨ ఆకతాయమాట

(వ్యవ.) నన్ను వాఁడు బందుబూతులు తిట్టినాఁడు. (శ ర)

బండెల. వి. (√బండ³.) బండజాతి యాఁడుది.

ద్వి మిండెలకత్తెకు మిగిలినగొంట్లు, కొండెంపుఁ గొఱవులు బండెల ల్మెచ్చులు
పండితా. పురా ౧౧౬ పా.

బండ్లకల్లులు. వి. బ. బాలక్రీడావిశేషము.

సీ. బండ్లకల్లులఁ జొప్పబెండ్లమంచంబులు గంగెద్దులాటలు గీ . ఆడుకొంటి
హంస. ౩ ౧౪౬.

బంతి¹. వి. ౧. కందుకము, చెండు.

చ. ఇరుపుర నీలనీరజనిరీక్షణ లించినవేడ్కతోఁ బరస్పర మొదిరించి కాంచనపుబంతుల దచ్చనవాటులాడఁగా. (నైష. ౩ ౯౫.)

ఉ. పట్టక ముంచె క్రొన్ననలబంతులు గందున గోరు నాటఁగన్, గట్టిగ మందుఁగొంటి లను (నీలా. ౨. ౨౩.)

గీ. కందుకము చెండు బంతి నాఁగను దనర్చు.
ఆం భా. ౨ ౧౭౪.

౨ బాలక్రీడావిశేషము, చెండుతో నాడెడి యాట, బంతియాట.

సీ. గోటదొర్లుడుకాయ గొబ్బిళ్లు మొపిళ్లు నీగ పోగిస బంతి దూగిలాట
హంస ౩. ౧౪౬.

సీ. తూరనతుంకముల్ దోపిడియాటలు బంతి యాలంకి ప్రబంధ. ౭౧౩.

౩ పుష్పవృక్షవిశేషము, ఒకజాతి పువ్వుల చెట్టు.

ఉదా బంతిపువ్వు, బంతినారు. మొ॥

౪. జేటకాంద్రమను, చోరులు నుపయోగించు ఓషధివిశేషము

గీ భల్ల మది యేల యాయచ్ఛభల్లములకు, నయ్య యీబఁతి నీకబంతి యయ్యెనేని.
చంద్రా ౨. ౪౩.

గీ బంతి తలముళ్లు వాకట్టుబదనికలును, నక్క కొమ్ములుఁ బూనువా రుక్కుమిగిలి.
సుద. ౩. ౭౭.

ద్వి తలముళ్లు ... నిద్దపుగద్దగోరు, బల పంపుబదనికల్ బంతి కత్తెరయు
ద్వి పరమ. ౭. ౪౯౫.

బంతి². వి. (సం. పంక్తి. ప్రా. పంతి. క. బంతి.) ౧. వరుస, పంక్తి

సీ. . . బారు బంతి, వరుస చాల్ చాలుపు పాఁజు సోరిది చాలు నాఁగను బంక్తి నాఁగు వగును (ఆం. భా. ౨. ౩౪.)

ఉ. వాలుకబంతి వ్రేలఁబడి వంజాఁ దోఁగి
కమాలపల్లవశ్రీల నాపింప.
మనుచ. ౫ ౫౦.

౨. ఆ సేతలు భోజనము సేయుటకు ఏర్పడినవరుస.

చ. . . అర్క పుత్రము, ఖ్యాలు రఘురాముబంతిఁ
బ్రియ మెుప్ప భుజించి సుఖించిరెంతయున్.
ఉ రా ౫ ౧౭౭.

సీ బంతికూళ్ళకుఁ బ్రీతిఁ బటిలించి తొడ
తొడఁ గలయఁ బంతులు సాగఁ గలరుగాక.
చంద్రా 3 ౪౫.

3. పంక్తిలోఁ బెట్టెడు భోజనము

సీ వారివారిప్రభుత్వసారతమ్య మెఱింగి గిరి
కుండు బంతి సాగించువాఁడు
కవల ౨ ౬౧.

(వ్యవ) నేఁడు వారియింట అట్లబంతి

బంతితేరులపంటవలంతి తేఁడు = చాల్పుతేర్ల
దొర, దశరథభూపాలుఁడు

గీ. బంతితేరులపంటవలంతి అని, కొడుకు దొర
యగునతనికి (నీలా ౧ ౪౩)

బంతిమోముల దొర = పంక్తిముఖుఁడు, రావ
ణుఁడు

గీ వారిఁ దద్దియు నర్మిలి గాగవించి, బంతి
మోములదొర తనబంతిఁ గుడువఁ, బెట్టి
పీడెంబు లిడి (అచ్చ రా. యు. ౨౩.)

జ: బంతికట్టు, బంతికుడుపు, బంతికూడు,
బంతులుసాఁగు, బంతెనగుండులు

బంతి(తులు)కట్టు. స క్రి. (బంతి[1] + కట్టు)
చతుష్పాజ్జంతువుల నొండొంటి నొకపలుపుతో
కట్టు

వ మహిషాజాదిక ప్రముఖాటవికమృగంబులం
బట్టుకొని బంతికట్టుకొని కాఁపేనిగడిక
నడుచునప్పుడు ... కాశ. 3. 3౬.

సీ. దొరలు దప్పించి బంతులుగట్టి యార్పించు
పొట్టేళ్ల నెత్తురు బురదరొంపి.
కుక. ౨. ౩౬

వి కుప్పనూర్చునప్పుడు ఎద్లవరుసకుఁ గట్టెడు
పలుపు. (శ. ర)

బంతికుడుపు. వి (బంతి[1] + కుడుపు.) ఆ సేతలు
చేరి భుజించుట, సగ్ధి. (శ. ర.)

బంతికూడు వి. (బంతి[1] + కూడు.) పెక్కండ్రు
పంక్తులుగా కూడి చేయుభోజనము, పంక్తిభోజ
నము, సగ్ధి.

సీ. బంతికూళ్లకుఁ బ్రీతిఁ బటిలించి తొడ
తొడఁ గలయు బంతులు సాగఁ గలరుగాక.
చంద్రా 3. ౪౫.

సీ బంతికూళ్లకుఁ బాలుపడుపోటుబంట్లు వా
రేరయా యని యని కేఁగువారు.
రా వి ౫. ౫

బంతులుసాఁగు అ క్రి. (బంతులు[1] + సాగు.
పరంపరగా వ్యాపించు, వరుసగా వ్యాపించు.

మ. . చెటు పయి బంతుల్ సాఁగఁ దాటంగ
దీ, ప్తులు దశా. ౨. 3౬౪

బంతెనగుండులు. వి బ. (బంతి[1] + ఎన +
గుండు) భోజనపంక్తిలో ఒకరికొకరు విసర
కొను కబళములు మొ॥

సీ ఇన్ని యుండఁగఁ బంచి యిడుట మెచ్చరి
తన మనుచు బంతెనగుండు లాడు కొకఁడు.
భాగ ౧౦ పూ. ౪౬౬

బండ = బండా, బందాయి. విణ (సం. బద్ధః
క. బందం. హిం. బన్దా) బద్ధుఁడు, లొంగిన
వాఁడు

క. రూపము చెలు వది చిత్తరు, రూపంబుల
యందుఁ గలదు రుచిగొని పతి దన్, బైపడని
చోట నున పీడు, పాపపుబిటుకంటె లంజ
బండయగుఁ గలఁడే. (కవిక. ౪. ౧౧౫.)

ఉ. మనుజాం డీరఁడు ... రయంకతిశాఁడు పెం
దయిన బందాకోరుఁగాఁ జేసెదన్.
హంస. ౨. ౩౯.

బందాటము. వి. అభినివేశము, పట్టుదల.
గీ. రూకి లడుగుచుఁ దుదిఁ బిచ్చనాశ్రైన,
నొదఁబడుచు హస్తగత మైన నొడియ
నదచి, దొడ్డబందాటమునఁ గోకఁ బ్రోవి
కొనుచు, గుడిసెజంతలు తెరువాటు గొట్టి
రవుడు. కవిక. ౪. ౯౫.

బందాము = బందము. (శ. ర.)

బందాయి = బంద. విణ. వశవర్తి, లోపడిన
వాఁడు.
ద్వి. చోళేంద్రముఖుల రాజులఁ జొక్కఁజేసి,
తనకు నైజంపుబందాయిలం జేసి,కొని...
ద్వి. పరమ. ౪. ౨౩౨. పా.

బందారు = బండారు¹. వి. ౧. హరిద్ర,
పసుపు; పసుపుచెట్టు.
సీ. ... పసుపు బందారు నాఁగను హరిద్ర
చను (ఆం. భా ౨. ౨౪౯.)
౨. వృక్షవిశేషము, ఒకానొకచెట్టు.
సీ. గొంగడిముసుఁగుతో గొల్లలు చట్రాతిపైని
బందారాకుఁ బఱచికొనఁగ.
శుక. ౨. ౩౪౨.

బందారుబసవన్న. వి. బాలక్రీడావిశేషము.
సీ. కుమ్మరదేఁపుర్లు కుమ్మరసారెలు బందారు
బసవన్న పత్తికాయ. (హంస. ౩. ౧౪౭.)

బంది = బందె. విణ. (సం. బంధీ. క. బంది)
నిర్బంధింపఁబడినవాఁడు, నిర్బంధములో నున్న
వాఁడు.
గీ. విప్రకృతులైన యిబ్బందివేల్పువెల్ల, మనఁగఁ
గోరి సేవాని మక్కువమాలి.
హర. ౪. ౪౭.

వి. ౧. ఇబ్బంది, కష్టము; నిర్బంధము; చెఱ
సాల.
(వ్యవ.) తానవుడు డబ్బు లేక చాల ఇబ్బంది
పడితిమి. కాని యిప్పుడు డబ్బు దొరకినది.
ఇంక బంది లేదు.
ద్వి. భావింప మన మీద బందిఁ జొక్కితిమి,
దేవర గలిగె నా చావు దప్పెడిని.
బస. పు. ౨. ౩౯౭. పా.
సీ. ఏతదర్థము కదా ఋషి దేవతాకోటి బందిఁ
బెట్టినవాఁడఁ బట్టి తెచ్చి.
కాశీ. ౬. ౨౨౧.
౨. బందిపోటు. (నిర్బంధము అని శ. ర.)
సీ. అధ్వరాదిక్రియల్ ప్రవర్తింపక
తక్కిలి బంది యెదిక్కులందుఁ, దఱ
చయ్యె ... (భార. శాం. ౨. ౭౯.)
జ: బందికత్తె, బందికాఁడు, బందిగము, బంది
గీఁడు, బందిపోటు, బందివట్టు, బందివాటు,
బందికట్టు.

బంది. సం. వి. ఈ. స్త్రీ ౧. బంధము, చెఱ. ౨.
కైది.

బందికత్తె = బందెకత్తె. విణ (బంది+కత్తె.)
దోపుడుకత్తె, బందిపోటుచేయుస్త్రీ.
గీ. తఱచు పూయుదు తోలగందంబుఁ బసుపు,
బందికత్తెలు సురతప్రపంచవేళ ...
కాశీ. ౩ ౧౦౯.
మ. ... నాత్రాహిణ్యముం గోలుపో,యి బలిష్ఠుం
దగుకామువారిఁ బడి నే నెట్లోర్తునే బందిక,
త్తెబడిం బాపవుఁదృష్ణ యిప్పు డకటా
దీర్ఘాకృతిన్ రాల్పెడిన్. (భాగ. ౯. ౫౩౫.)

బందికాఁడు = బందెకాఁడు. విణ. (బంది +
కాఁడు.) బందిపోటు చేయువాఁడు.
గీ. పేర్చి దివసక్రమంబున పీడ బలిసి, బందికాఁ
డైనఁ బొరుగులు బ్రతుకఁ గనునె.
మనుచ. ౩. ౧౨౧.

సీ. విహరింప బందికాఁడవుట కెనుకన్నాఁడవనయము
స్ఫురణఁజేసెదటుగల్గి. (పారిజా. ౪. ౧౦౩.)

బందిగము. వి. (√బంది. క. బందిగ.) చెఱసాల.
గీ. ధర్మమార్గంబు దప్పనితండ్రి సుగ్రీ, సేఁచు
శృంఖలాబద్ధునిఁ జేసి బంది,గమున నిడి
మేటిదైత్యులఁ గాపువెట్టె ...
వి. పు. ౩. ౩౧౨.

గీ. అదరుఁ గారాగృహంబు గుయ్యారము చెఱ,
సాల బందిగ మనంగను
ఆం. భా. ౨. ౨౨౬.

బందిగీఁడు. విశే. (బందిగము + ఈఁడు.) చెఱ
సాలయం దుంచఁబడినవాఁడు.
సీ. ధర బందిగీలఁగాఁ దాళ్చి కెచ్చితిగదా
మాళవచోళనేపాళనృపుల ...
రంగా. ౨. ౩౯.

బందిపోటు. వి. (√బంది.) ౧. నిర్బంధపుఁబడి
కొట్టు, చౌర్యము, దొంగతనము, నిరోధించి
దోచికొనుట. (దోచుట. శ. ర.)
సీ. పరగుఁ దెక్కులి యన బందిపోటనఁగను
దొంగతన మనంగఁ జౌర్యంబు చెల్లు ...
ఆం. భా. ౨. ౨౯౨.

బందివట్టు. అ. క్రి. (బంది + పట్టు.) బంది
పోటుచేయు.
సీ. కన్నంబు పెట్టి తెక్కులి గాని యుంకంబు
పలువురతో నాడి బందివట్టి.
దశకు. ౬. ౯౫.
సీ. మగ లాఁడుకాంతి మరిగి ప్రుచ్చిలి బంది
వట్టి కన్నంబులుపెట్టి తెరువుద్రెక్కొని ...
కు. సం. ౩. ౧౬౩.
వి. నిర్బంధముచేయుట.
సీ. విదనిపెన్కువ మట్టుగడచిన బనకొట్టుఁ
బొందుకతోఁ దొడపట్టు బందివట్టు.
తంజా. ౬. ౧౫౧.

బందివాటు. వి. (√బంది.) నిర్బంధము.
ద్వి. కనుఁగొన రోఁ దైన కాలకోశమ్మునిత
హా మ్మును బందివాటులమాట.
ద్వి. పారిజా. ఉ. ౧౦౯౫. పట,
(బందివాటులమాట = నిర్బంధములకు పుట్టినిల్లు.)

బందివెట్టు. అ. క్రి. (√బంది.) బందిపోటు
చేయు, నిర్బంధించి దోఁచుకొను.
ద్వి. జంగమార్చన పేయు సమయంబునందు,
దొంగలు బందివెట్టంగ నూహించి.
బస వు. ౨. ౩౭౨.

బందు¹. వి. (త ఎరుసు.) గృధ్రవిశేషము,
బోరువపక్షి, (రాబందు. అని. శ. ర)
గీ. మాత్తుకొని మొత్తులాడి పెన్నెత్తురోలుకఁ,
జాముపారల కెంతయు సొబగుమీఱ,
బూరుగులపోల్కిఁ బొలిచి రపాప్పియసేల,
బూచిగములను బందులఁ బోదలియాడ.
అచ్చ. రా. యు. ౧౩౫.

బందు². వి (సం. బంధః. క. బందు.) ౧. ఆవ
రణము, అచ్ఛాదనము.
ద్వి. గొన శైనయిలవీఁగగుమి గప్పకొన్న,నునుఁ
బొన్నచెట్టుబందున నందమైన, చందురా
తిన్నెపై ... (విష్ణు. మా. వి. ౪. అ.)
(శ. ర.)
౨. చుట్టుకొనుట, అల్లికొనుట.
వ. ... పోఁకక్రముఁకులతీఁగలబందునఁ బొందిన
ద్రాక్షపందిళ్ళనందునన్ . .
(బందున = అల్లికలో.) ఉ. రా. ౯. ౨౪.
౩. పెట్టె మొ. వానిమూలలబిగించెడి యినుము
మొదలగువాని తగడు. (శ. ర.)
(వ్యవ.) ఆపెట్టెకు బందులు చేయుము.
౪. నిరోధము, కట్టివేత. (శ. ర.)

౩. పశువులదండుగ, చెఱలోఁ బడిన పశువును విడిపించుకొనుట కిచ్చెడి సొమ్ము. (శ. ర.)

౪. ఎనుమునకు బంద పొతిక,గొన నగు . . ఒదయఁ డెఱిఁగి విడిచినన్. (విజ్ఞా. ౨. ౪.)

౫. ఇబ్బంది, కష్టము.

గీ. చుట్టముల కెల్ల వశులుగట్టి యురక, ప్రజకు బందెలు గొల్పంగఁ బ్రాభుఁ డీవు. శేవ. 3 ౧౯౨.

ద్వి. పోనీక బందెలఁ బొరలించి తపసి, దానవుం డై నల్లద్రావుచున్నాఁడు. ద్వి. హరిశ్చ. ఉ. ౪౫౦ పం.

సీ. ఆదికాలమునాఁటియగ్రహారంబులు బందెలు గల్పించి పాడుసేయు. (వి. పు. ౨. ౧౦౩.)

జ : బందికత్తె, బందకాఁడు, బందగొను, బందదొడ్డి, బందెలపోతు, బందెలమారి, బందెలుసుట్టు, బందవట్టు.

బందికత్తె = బందికత్తె. విణ. (బంద+కత్తె.) దొంగుదుకత్తె.

సీ. మదనసమ్మోహనమంత్రాధిదేవతల్ పంచశిలీముఖు బందికత్తె,లు ..
భాగ. ౬. ౪౪౫.

బందికాఁడు = బందికాఁడు. (√బంద.) వి. బందికారి, బందిపోటుదొంగ. (చెఱలోనేయు వాఁడు. అని శ. ర.)

సీ. ... బందకాఁ డనఁ దగు బందికారి. ఆం. భా. ౨. ౨౯౧.

చ. జలరుహమిత్రుఁ డాత్మరుచిసంపదఁ జీఁకటి బందకానిఁ బోల్, గలఁగుచు నిలోకనిడిశై లోగె... పారి. ౨. ౫౯.

బందిగొను. స. క్రి. (బంద + కొను.) ౧. నిరోధించు. ౨. కష్టపెట్టు, ఇబ్బందిపెట్టు, చెఱపెట్టు.

గీ. అర్క వస్నాడి రాజపుత్రాంతికముడఁ, దొరకెల బందఁగొని రొండు మాఱు లే, యంధకారంబ్యంబితంబైన. ...
కరిక. ౪. ౯౨.

(రందర్థముల కిదియే యుదాహరణము.)

బందెడ. వి. తెల్లవావిలి, శ్వేతసురస. శ్రీ.

సీ. .. బందెడ యనఁ దెల్లవావిలి యన శ్వేత, సురసాభిధాన మై పరగుచుండు.
ఆం. భా. ౨. ౫౧.

సా : బందెడకు పచ్చి లేదు, కోడలికి క్రొత్త లేదు.

బందె(ల)దొడ్డి. వి. (బంద + దొడ్డి.) బంద, పశువులచెఱ.

గీ. పుట్టినిలు డించి యత్తయి ల్మెట్టినట్టి, కోడలి తెఱంగు కొఱకుచే న్పేదవాడి, బందెదొడ్డిఁ జను కోడెచందము. (రా. వి. 3 ౧౪౨.)

బందెలపోతు. విణ. (√బంద.) నిర్బంధము కలిగించువాఁడు, కష్టపెట్టువాఁడు. (చెఱసేయు స్వభావము కలవాఁడు. శ. ర.)

ద్వి. అచ్చి వారొందర బ్రహ్మకుఁ బోవరాదు, పురిలోన బందెలపోతులఁ దనఁగ.
ద్వి. హరిశ్చ. ఉ. ౬౨౭. పం.

బందెలమారి. విణ. (√బంద.) ౧. బందెలపోతు.

ఉ. కొండల మందడి ప్మనను గొబ్బున నాయక వాలకించి యా,బందెలమారిచంద్రిభగ భాగ్యముఁగోరకు మానదండమా.
చంద్ర. వి. ౨. ౧౩౭.

౨. చెడ్డవాఁడు, దుష్టుఁడు.

సీ. మూళ బందెలమారి ముండటి పాపాలమొద్ద భగిడి. హంస. ౫. ౧౧౬.

బందెలుసుట్టు. స. క్రి. (బందెలు + చుట్టు.) నిర్బంధపెట్టు.

శా. బందులఁ బట్టి సజ్జనుల బాధలఁ బెట్టి యసాధుకోటిఁ బెన్,బందెలుపట్టి యూరములు వట్టి పథంబులు గొట్టి బిట్టరై.

భాగ. ౬. ౧౦౪.

బందె(లు)పట్టు. స. క్రి. (బందె+పట్టు.) ౧. నిర్బంధపఱుచు.

గీ. భరత మాతల్లి పతి బందెపట్టి నీకు, రాజ్య పట్టంబునకు వేఁడి రాము వదలి, కనిచె

భా. రా. అయో. ౨౩౩.

౨. కొల్లగొట్టు.

సీ. చోరసంచయ మగ్రహారముల్ బందెలుపట్టి సమస్తసంపదలు గొనిరొ

వి పు ౨. ౧౨౪.

బంధకము. విశే. (అ. ధిశా. అ) ౧. బంధించునది, కట్టునది. ౨. పట్టుకొనునది. ౩ స్త్రీలను చెఱుపువాఁడు, రతిహింసకుఁడు.-వి. అ. పుం. ౧. కట్టుత్రాడు. ౨. ఆనకట్ట. ౩. వినిమయము, మాఱుపు.౪. ప్రతిజ్ఞ ౫. పత్తనము.-వి. అ. న. ౧. చెఱ, బంధము. ౨. చెఱసాల.

బంధకరణము. సం. వి అ. న. సంకెలవైచుట, చెఱపట్టుట. (విల్యమ్సు)

బంధకి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పుంశ్చలి, ఱంకుటాలు. ౨. పణ్యస్త్రీ, భోగముది. ౩. పెడిరేమఁగు, ఆఁడరేమఁగు. ౪. గొడ్డురాలు, వంధ్య.

బంధనగ్రంథి. సం. వి. ఇ. పుం. ౧. ప్రశాదులకుఁ గట్టెడికట్టు కొంకలగువానిముడి. ౨. ఉరి. ౩. పశులనుగట్టు పలుపు.

బంధనము. సం. విశే. (అ. శే. అ.) ౧. బంధించునది, కట్టునది. ౨. నిరోధించునది, అడ్డగించునది. ౩. ఆశ్రయించినది.-వి. అ. న. ౧. బంధించుట. ౨. కట్టుట, సంకెల కొంకలగువానితోఁగట్టుట. ౨. చుట్టుఁగ్రమ్ముకొనుట. ౩. బంధము, కట్టు. ౪. కట్టుటకైన సాధనము, (గొలుసు, త్రాడు మొ॥ ౫. పట్టుకొనుట. ౬. చెఱ, నిర్బంధము. ౭. చెఱసాల. ౮. రచన, నిర్మాణము ౯. కూర్పుట. ౧౦. గాయపఱచుట. ౧౧. తొడిమ, వృంతము. ౧౨. ప్రశాదులకుఁ గట్టెడి కట్టు. ౧౩. అడ్డు, ప్రతిబంధము. ౧౪. సంబంధము. ౧౫. వధము, కొల.

బంధన స్తంభము. సం. వి. అ. పుం. ౧. ఏనుఁగు మొ॥ వానినిఁ గట్టుకంబము. ౨. కొండగోఁగు. †

ఇట్లే. బంధ స్తంభము

బంధనాలయము. సం. వి. అ. పుం. చెఱసాల.

ఇట్లే: బంధనాగారము. మొ॥

బంధము. సం. వి అ. పుం. ౧. కట్టు, ముడి. ౨. (తలవెండ్రుకలకట్టు) దారము. ౩. సంకెల, కట్టుగొలుసు. ౪. చెఱపట్టుట, బందిచేయుట. ౫. పట్టుకొనుట. (గజబంధము.) ౬. రచన. (పరుషబంధము మొ॥) బంధము ౭. నిర్మాణము. ౮. సంబంధము. ౯. కూర్పు, ఒకటిగాఁగూర్పుట. (అంజలిబంధము) ౧౦. ప్రణములకు కట్టెడుకట్టు. ౧౧ ఒద్దిక, ఐకమత్యము, అనురూప్యము. ౧౨. పరిణామము, ఫలితము. ౧౩. సంయోగవిశేషము. (ఇది కామశాస్త్రమున ౮౪ చెప్పఁబడినది.) ౧౪. (అలం) చిత్రాలంకారవిశేషము. (ఖడ్గబంధము, పద్మబంధము మొ॥ ౧౫. (పటము కొంకలగువానికి చుట్టువైచు.) చట్టము. ౧౬. దేహము. ౧౭. పడుపు. ౧౮. (నదికి) నడుమకట్టుట. ౧౯. కన్నులు చక్కఁగా మూఁతపడని రోగవిశేషము.

బంధించు. సం. స. క్రి. కట్టివేయు.

సీ. ... ఇంద్రియవ్యాపార ముడిగించి క్రియలెల్ల విడిచి పుణ్యపాపబంధంబుల నోపిబంధిం పంగఁ బడక మనోవృత్తి నొడిచి...

భార. ఆది. ౫. ౭౦.

బంధింపించే. సం. స. క్రి. కట్టించు.

వ. ... వలువిచే నేకువు బంధింపించి కన్యా ర్గంబునం జని . . (భాగ. ౨. ౧౬౩.)

బంధితము. సం. విశే. (అ.అ.అ) ౧ బంధింపఁ బడినది, కట్టఁబడినది. ౨ చెఱపెట్టఁబడినది.

బంధిత్రము. సం. వి. అ. పుం. ౧. చర్మవ్యజనము, తోలువిసన. ౨. మచ్చ, కలు.

(విల్యమ్సు.)

బంధిద్రుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు.

బంధుకము. సం. వి. అ. పుం. బంధుజీవము, మంకెన. చె. - వి. అ స్త్రీ. బంధకి, అంకుటాలు. (విల్యమ్సు)

బంధుకుఁడు. సం. వి. అ. పుం. జారజుఁడు, అంకుమగనివలనఁ బుట్టినవాఁడు.

బంధుజీవము సం వి అ. పుం. మంకెన. చె.

(ఇత్లీ. బంధుజీవకము.)

బంధుత. సం. వి అ. స్త్రీ. ౧ బంధుత్వము. ౨. బంధుసమూహము.

బంధుత్వము. సం. వి. అ. న. చుట్టఱికము.

బంధుర. సం. వి. అ స్త్రీ. వేశ్య.

బంధురము. సం. విశే. (అ. అ. అ.) ౧. ఉన్నతానతము, మెరకపల్లములుగా నుండునది, విషమము. ౨. నమ్రము, వంగినది. ౩. వంకరైనది, వక్రము. ౪. రమ్యము, ఇంపైనది. ౫. బధిరము. చెవిటిది. ౬. బాధకము. -వి. అ. పుం. ౧. హంస, కలహంస. ౨. పక్షి. ౩. కొంగ. ౪. బాయువిడంగము. ౫. తిలకల్కము, తెలకపిండి. ౬. అఁడుగుటి. ౭. బంధుజీవము, మంకెన. చె. ౮. మకుటము. ౯. పేలపిండి, పత్తువు.

బంధులము. సం. విశే. (అ. అ. అ.) ౧. నమ్రము, వంగినది. ౨. రమ్యము, ఇంపయినది. వి. అ. పుం. బంధుజీవము, మంకెన. చె.

బంధులుఁడు. సం. వి. అ. పుం ౧. అంకుటాలి కొడుకు, అసతీపుత్రుఁడు. ౨. వేశ్యయింటి అనుచరుఁడు.

శ్లో. పరగృహలలితాః పరాన్నపుష్టాః, పరపురుషైర్జనితాః పరాంగనాసు, పరధననిరతా, గుణేష్వవాచ్యా, గజకలభా ఇవబంధులా లలామః (మృచ్ఛకటిక. ౪. ౨౮.)

బంధువు. సం. వి. ఉ. పుం. ౧. చుట్టము. ౨. సహచరుఁడు, తోడివాఁడు. (ప్రవాసబంధువు: ధర్మబంధువు మొ॥) ౩. జ్ఞాతి. ౪. మిత్రుఁడు. ౫. బంధుజీవము, మంకెన చె. ౬. ఒకవర్గము వకు నామమాత్రమున చేరినవాఁడేగాని నిజముగా దాని విహితకృత్యములు చేయనివాఁడు.

ఉదా ' క్షత్రబంధువు బ్రహ్మబంధువు.

బంధూకము. సం వి అ పుం ౧ మంకెన. చె. ౨. వేఁగిస, పీతసాలకము. - న. చె. బంధూక పుష్పము.

బంధూరము. సం. విశే. (అ అ అ.) ౧. ఉన్నతానతము, ఒకచో ఉన్నతమై మఱొక్కచో అనతమైనది, విషమము. ౨. నమ్రము, వంగినది. ౩. రమ్యము, ఒప్పిదమైనది. - వి. అ. న. ఛిద్రము, రంధ్రము.

బంధూలి. సం. వి. ఇ. పుం. బంధుజీవము, మంకెన. చె.

బంధ్యము. సం. విశే. (అ. అ. అ.) ౧. బంధింపఁదగినది, కట్టఁదగినది. ౨. ఒక్కటిగాఁగూర్పఁ

జనితము. 3. రచింపఁబడినది. ౪. నిబద్ధము, కూర్చబడ్డది.

**బంపు.** వి. (క. బంపు.) పంపఁబడినది, పాఁకుడు.

సీ. సన్నుతింపుచుఁ జేరుజటివరేణ్యులకోటిబంపు కంపున నెగఁద్రోఁకుకొనగటు.

చంద్రా ౧ ౬౧.

**బంబ.** విణ. (క. బంబ.) పెద్దది, స్థూలము.

ద్వి. ... భవ్యహస్తముల, బంబలింగంబులఁ బాపనివారు. ప్రభు 3. ఆ.

(శ ర. పా పంబి ముద్రి. పా.)

జ: బంబోతు.

**బంబోతు = పెంబోతు.** విణ. (బంబ+పోతు.) ఎద్దువలె బలిసినమేను గలవాఁడు.

సీ. బంబోతు నా నెద్దువలెను మిక్కిలి యొడ ల్బలిసియుండెడివాఁడు పరగుచుండు

ఆం భా. ౨. ౧౨౦.

వి. బలసినయెద్దు. (గ్రా)

**బంభరము.** సం. వి. అ పుం తుమ్మెద.

**బంభరాలి.** సం. వి ఈ స్త్రీ. ఈఁగ.

(విల్యమ్సు.)

**బంభ్రమించు.** సం అ. క్రి. మిక్కిలితిరుగు.

క. కీటకముఁ దెచ్చి భ్రమరము, పాటవమున బంభ్రమింప ధ్యానింతంబై తత్కీటకము

భాగ ౪ ౧౬.

సీ. పుడువుమంత్రము వూరి వెదఁగుమంత్రముఁ బూని పరమేష్ఠిచిత్తంబు బంభ్రమించె .

సమీర. ౪. ౨౬.

(మిక్కిలి కలతపడె నని భావము )

**బంహిమ(ము).** సం. వి. న. పుం. బాహుళ్యము, పెల్లుఁదనము.

**బంహిష్ఠము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి బహుళము.

**బంహీయము.** సం. విణ. (న. యున. న.) మిక్కిలిబహుళము.

**బకచరుఁడు.** సం. వి. అ. పుం. వేషధారి, మోసగాఁడు.

శ్లో. అధోదృష్టి ర్నైష్కృతికః స్వార్థసాధకతత్పరః, శఠో మిథ్యావినీతశ్చ బకవ్రతచరో ద్విజః మ. శా. ౪. ౧౯౬.

**బకదారి.** వి. ౧. పారావతవిశేషము.

సీ. పారావతం బగుఁ బావురాయి యనంగఁ.. తద్భేదములుగాను దనరుచుండును ... బక దారి దూరబారులనంగ .

ఆం. భా. ౨. ౭౯.

క. మేలైన లకోరీ ల్గాడ్డీలుం బదటీలు వల్ల టీల్ పక్కివ లూఁచీలుం బకదార్లను గూకీలు వనెడుపేరులం దగినపార్శ్వములన్.

సారంగ. ౧. ౧౧౪.

వ. మరకతంపు టుప్పరిగకొణిగ దక్షి యయిుంకు బకదారిపాయవామిటారితీరున ...

చం. రా 3. ౨౯.

రగడ ..ఇట్టులపురతిపేరఁ గవకివ లెసఁగు నీలక దారిపిట్టలు శుక. ౧ ౧33.

౨. పారావతము, పావురము.

చ అలజలజారిపైరి యగడాడెముచిల్కయనన్ బజాతి బల్లులవ చకోరి వారిజము తూరిన నామదిలో లకోరి వాఁకలబకదారి మూరి కలకంత మెఱుంగ దొకింత దారి కేవలము తుటారి శారి యని వాడి కడున్వలరాకటారి కిన్.

చంద్రా. ౪. ౧౭౩.

**బకము.** సం. వి. అ. పుం. ౧. బకోటము, పక్కికొంగ. ౨. బకపుష్పము. కృ.

**బకోరుక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. చిన్నకొంగ. ౨. గాలిచే వంగుఁబడినచెట్టుకొమ్మ.(విల్యమ్సు.)

బకలము = బగళము. వి. అపకరణము.
(చూ: బకలముసేయు.)
ఇ: బకలముసేయు.

బకలముసేయు = బగళముచేయు. స. క్రి (బకలము + సేయు.) తొలఁగించు.
సీ. బకలంబుసేసె హాటకక్షేత్రపాణియై కలిమి
విప్రేశ్వనదండనాథుఁడు ..
శ్రీరం. ౧. ౧౨౬.

బకవృత్తి. సం. వి. ఇ. పుం. = బకచరుఁడు.

బకాను. వి. చిలుకేరు ? (శ. ర.)

బకి. సం. వి. ఈ. స్త్రీ. పూతన.

బకుఁడు. సం. వి. అ. పుం. ౧. భీమునిచే చంపఁబడిన ఒకరాక్షసుఁడు. ౨. కృష్ణునిచే హతుఁడైన ఒకరాక్షసుఁడు. ౩. కుబేరుఁడు.

బకురము. సం. విణ. (అ ఆ అ.) భయంకరము. (వాచ.)

బకోటము. సం. బకము.

బక్క = బ్రక్క. విణ. ౧. కృశుఁడు, దుర్బలుఁడు.
గీ. వారికంటెను బలియుఁ డీబక్కవాఁడు...
పార్వ. ౪. ౧౦౯.
సీ. ... బడుఁగన బడుదన బక్క యనఁగ,
పెలయు పదాంగనుండు ..
ఆం. భా. ౨. ౧౧౯.
ఉ. ... ప్రోద్ధత్యనికేవ మెక్కడిది తావని
బక్కలకింక ... (చం. రా. ౨. ౧౫.)
౨. అల్పము, నీచము.
ఉ. పెక్కడి బక్కదైవముల పేరుఁ గొల్చెద
రట్లు రాదయా. దా. శ. ౨౫.
చ. బలకరత్రుందవుల్ గలిగి బక్కనిరాగి
యటుంబ్రజ కష్టుటుల్. (రా. వి. ౨. ౩౧.)
ఇ: బక్కచిక్కు, బక్కటిల్లు, బక్కపలచ.

బక్కచిక్కు. అ. క్రి. (బక్క + చిక్కు.) మిక్కిలికృశించు.
చ. ... నీతను వనంకబలాఢ్యము బక్కచిక్కి
యున్నది .. కుశ. ౩. ౪౦౦.

బక్కటిల్లు. అ. క్రి (√బక్క.) ౧. కృశించు. (శ. ర.)
(వ్యాప) ఆయెద్దు బక్కటిల్లినది.

బక్కమజ్జిగ. వి (బక్క + మజ్జిగ) నీళ్లు అధికముగా చేర్చిన మజ్జిగ. (శ ర)
(ఇట్టే బక్కచల్ల మొ॥)

బక్కరించు. స క్రి నిగిడించు
ఉ. .. వెన్కొ గి చివి బక్కరించి యుఱుకుం
బొడకట్టిన ప దాఁటుచున్.
శివల. ౨. ౨౪.

బక్తరు. వి (హిం బఖ్తర్. కవచము.)
సీ పందీఁ బెలలు గంటి పాఱ నుక్కున కోల
బక్తరుగుట్టాల బసిక బసిక ...
రంగా. ౩. ౨౨౩.

బక్షీ. వి (హిం బఖ్షీ) సేనాధిపతి.
సీ. మునిషీ యొకఁడు చెప్ప మొనసి బక్షీ చెప్ప,
దరువాత సాముజాందారు చెప్ప.
వేణు. ౪. ౧౨.
సీ. వరుస బక్షీచిత్తనైకల్యుఁ డైనను గడుదీర్ఘ
వత్తికాల తైన. (వేణు. ౪. ౪౨.)

బగనము. విణ. (సం భగ్నః.) భగ్నము, పాడైనది.
క. అగినిగణంబున కిరుదస, నగణముతోఁ
గూర్చి చెప్ప సక్కవి మదిలో, నగిదైనఁ
దిట్టి యైనను, బగనముగాకుండఁ గమల
భవుఁడో శివుఁడో. (కవిజనా. సంజ్ఞా. ౫౦.)

బగబగ. (అగ్ని, కురుపు, మొ.) అధికముగా మండుట కనుకరణము.

చ. ... సోదరుం, బగగొని రాజ్యలోభమునఁ బట్టి వధించిన దుష్టకర్మునిన్, బగబగమండు మంటలకుఁబట్టి కమర్పఁగ లేదు పద్మజా. రక్షా ౭ ౨౦ (శ ర.)

వ.... దిగదిగన విసరి బగబగన మండు చిఱుగు సొదమంటలకు ... (మనుచ. ౪ ౭౦.)

(వ్యవ) మండువేయుటచేత కిరుపు బగబగ మండుచున్నది

బగళమగు. అ. క్రి (బగళము + అగు) అపసరిల్లు, తొలఁగు

సీ. అవసరం బిప్పుడ యగు నంతదాఁకను బగళమై నిలుఁడు దిశాపాలవరులు
నృసిం ౧. ౬౦.

బగళము = బకలము. వి అపసరణము

గీ. తెరపి భద్రమహాశాలి భృంగిరిటులు, పాయు బగళంబు తొలఁగు విచ్చేయుఁ డనచు
భీమ ౫ ౭౫

జ : బగళమగు, బగళముచేయు.

బగళముచేయు = బకలముచేయు. స. క్రి (బగళము + చేయు.) తొలఁగించు, తప్పించు.

ఉ. పాయఁ దొలంగుఁడంచుభయపార్శ్వము లన్ బగళంబుసేయుచున్
సైవ. ౩. ౧౪౫.

బగి. వి. ప్రక్క, పార్శ్వము.

సీ. బగిని లింగన్నకోడిగములు వీక్షించి హాసంబుతోఁ జెయి ప్రేవిప్రేవి.
వరాహ. ౧౧. ౧౦.

సీ....పార్శ్వసంజ్ఞ, కెలనఁ గెలఁ కనఁ గద యన బగి యన ప్రక్క యనంగఁ గప్పట్టు ... (అం. భా. ౭. ౧౩౬.)

బగితి. వి. (సం. భక్తి.) పూజ్యులయందుఁ గల యనురాగము.

ద్వి. తెలనిబగితియు నిలనికిఁ గూర్పు సాటి కూర్మియు .. (బస. పు. ౫. ౩౪౭. పం.)

ద్వి. పసు లేదఁ దా లేద బగి లేద జగతి.
బస. పు. 3. ౬౦౭. పం.

జ : బగుతుఁడు

బగిస. వి వృక్షవిశేషము.

సీ. కేల,తాడి బగిస పోఁక తాడుకొబ్బర చెట్టు పెద్దమాను. (హంస. ౪. ౧౧.)
(బగ్గిస. క్రొత్తప్రతి పా.)

బగిసి = బైసి, బవిసి. వి స్త్రీలమర్యాద, పాతివ్రత్యము.

క. అబిడ గర్భోత్పత్తికి, సై బగిసియు మాలి పతింత దృతిమీఁదన్, లోఁ బొదమినరుచి మించినఁ, బ్రాబల్యము గలుగువిటులపాలిది యయ్యెన్ (హంస. ౨. ౬౨.)

గీ. ... వీరిబగిసికి మఱి గారవించి మాయఁడు, కాయసిద్ధి రొమసంగులే కల్ల గాక.
కుక. 3. ౯౪.

బగీలు. వి. (క. బగీలు త. పగీల్.) సంతాపము నందలి ధ్వనికి యనుకరణము.

ఉదా : ఆమాట వినఁగనే నాకడుపులో బగీలు మన్నది. (శ. ర.)

బగుతుఁడు. వి. (√ బగితి)సం భక్తః.) భక్తుఁడు.

ద్వి. బగుతులపాదుకాప్రతతులు సాకు, నగవడ నంచు నందంద ప్రొక్కుచును.
బస. పు. ౧. ౫౪౩. పం.

బగ్గము. విణ. (సం. భగ్నం.) భగ్నముకొంది నది, చెడినది, పాడైనది. (చూ. బగ్గముపాడు.)

జ : బగ్గముపాడు.

బగ్గముపాడు. విణ. (√ బగ్గము.) మిక్కిలి పాడైనది.

సీ. కలక్రోవులు వైచి భీతిఁ బైపులజార
బగ్గముపాడై తుపాకిమూఁక.

రా. వి. ౫. ౧౫.

బగ్గరి. విశే. (బగ్గు + అరి.) బగ్గనిమండిపడు వాఁడు. (శ. ర.)

బగ్గి = బుగ్గి. వి బూడిద, దుమ్ము

గీ. కాక పెంచినమూట నిక్కంబరోని ప్రాఁత
పరివారములతోట బగ్గి పడిరి

కుశ. ౨. ౨౯౪.

జ: బగ్గిపెట్టు.

బగ్గించు. స.క్రి. (సం.భంగః √బగ్గు) గద్దించు, కోపమున వదలించు.

ద్వి దిగ్గన లేచి వల్దనలను జూచి, బగ్గించి
పలుక శబ్దం బెట్లు దోఁచె.

పండితా. పర్వ. ౩౯౩. పా.

బగ్గిపెట్టు. స.క్రి. (బగ్గి+పెట్టు) బుగ్గిలోఁగలుపు.

గీ. ఏకకాపీనధారియై యింటి కింటి, కక్క
సిగ్గును భయమును బగ్గిపెట్టి.

శివధ ౫. ౬౦.

(ఇట వదలి అని భావము.)

బగ్గు. వి. ౧. పొరిపుచ్చుటయం దగు ననుకరణము.

క. సిగ్గుచెడి విరియఁ బాఱెరి, బగ్గనఁ బొరిపుచ్చు
వీరభద్రుని ధాటిన్ సుగ్గు అయి ...

కాశీ ౪. ౧౪.

౨. (మనస్సు) పరితపించుటయం దగు అను కరణము.

క.....అకటా, బగ్గనమం డెదునీమను, సిగ్గించుకి
లేదు ... (కుశ. ౩ ౨౧౦.)

౩. భ్రద్దలగుటయందగు అనుకరణము.

ద్వి. పరవశుం డై గుండె బగ్గన నవియ.

ద్వి. శ. పా. ౩. ౧౧౧. పా. ౨, పం.

౪. (నిప్పు, కురుపు మొ॥) మండుటయం దగు అనుకరణము.

(వ్యవ.) నిప్పు బగ్గున మండుచున్నది.

,, కురుపు బగ్గున మండిపోవుచున్నది.

జ: బగ్గరి, బగ్గించు, బగ్గుండి, బగ్గున, బగ్గు బగ్గురుమను, బగ్గుమను

బగ్గుండి. వి. (బగ్గు + పిండి.-వర్ణలోపము.) చిమ్మి నపుడు బగ్గున మండినట్లు కనఁబడెడు చూర్ణము, ఎఱ్ఱనిపిండి.

సీ. దిక్సతీమణులు మ త్తిలి చల్లులాడెడు గడి
తంపుబగ్గుండిపొడు లనంగ.

రవిక. ౪. ౯౪.

గీ. త్రాడుఁదాలుపుచెలి పైఁడిమేడమీఁద,గొండ్లి
సలుపుచు ననుగులఁ గూడి చల్లు,లాడు
బగ్గుండిపొడులు.

అచ్చ రా. అయో. ౧౩.

బగ్గున. క్రి. విశే ద్రు. (√బగ్గు.) తొందరగా.

సీ. వలపక్కచూడ్కి కవ్వల యాదవాగ్రణు
ల్బగ్గున నిరువంకఁ బాయ మొసఁగ.

బహు ౧. ౧౦౧.

బగ్గుబగ్గురుమను=బగ్గుమను. అ క్రి (√బగ్గు.) బగ్గుబగ్గునమండు.

వ. ... ముక్కంటి కెక్కున నక్కటికం బతి
యిక్కటికిరాతికుఁడియ నగ్గలపుటలుకయగ్గి
బగ్గుబగ్గురుమన. ... (కువల. ౨. ౩౭.)

బగ్గుమను. అ. క్రి. (బగ్గు + అను.) బగ్గనమండు. (శ. ర.)

బచేనికాఁడు. విశే. మొ త్తనివాఁడు, చేసినట్లెల్ల మారకుండువాఁడు.

గీ. విభుఁడు కానటివాఁ డైనను వృద్ధుఁ డైనఁ
దన్ను మెచ్చుకి యొక్కతెఁ దగిలెనేని,

దీరఁగ వ్రాసియున్న యా,బచ్చెనల్లి వంచి
నునుభాణుండు ... (సుక. ౨. ౪౫.)

౨. రంగు, వర్ణము.

సీ. కైసేసికొనుచుఁ బ్రాక్తరుణి సొమ్ములకునై
పట్టిన బచ్చెనబరణి యనఁగ .
వరాహ. ౪ ౧౪౫.

క. ... పైపై, నింకఁగ నింకఁగఁ బల్మఱుఁ,
బంకించుటఁబోలె మోవిబచ్చెన పోచ్చన్.
పాండు. ౨. ౪౧.

క. పొచ్చెములు లేక పటమున,నచ్చాంద్రమ
న స్తనంధయాభరణాంకున్, బచ్చెనవొత్తిన
రీతిని, ముచ్చటగా వ్రాసి గౌరిముందట
నిడుచున్. (పార్వ ౪. ౧౩౧.)

(బచ్చెనవొత్తు = అచ్చొత్తు.)

౩. గుఱుతు, చిహ్నము.

సీ. లక్కనం బాది కళంకానవా లడియాలమై
బచ్చెన యనఁగఁ జిహ్న, గీ. మలరు
ఆం భా. ౧ ౮౦

౪. వంచన, కపటము, మోసము.

చ. సులభమొ దుర్లభంబొ యని చూడ కెఱుం
గవు ..యిడుములందగఁ.. నినుఁ బుచ్చెద
బచ్చెన రూపుపోకులన్.
భార. శాం. ౪. ౫౧.

విణ వంచకము, మోసగించునది

చ. కనుఁగవఁ బాఱఁజూచెదవుగాని మనంబునఁ
జాడవృత్తులం, దరిపెనుగాని భావమునఁ
దప్ప వొకప్పుడు నీప్రవీణత,ల్యనుపద వింక
నీపటలు బచ్చెనచేఁతలు చాలుఁ జాలు .
వరప. ౨ ౧౪.

క. ఇచ్చిన బాసొమ్ముంతయు, మచ్చిక రాఁ దీసి
కొన్నిమాసంబుల కా,కెచ్చెలిని గన్నుజం
కటు, బచ్చెనమాటలను బయలుపందిలి
యిడుచున్. ప్రబంధ. ౩౨౫.

ఉ. ఎచ్చటనుండి వచ్చితిరొ యెయ్యెడ కేఁగఁ
దలంచితిరొ యీ,ముచ్చట లేల మాకు.
ద్విజముఖ్యులెసం జనుఁ దట్టిబోటికిం, బచ్చెన
మాటలేల .. (శ్రీరం. మా. ౨. ౯౯.)

చూ: బచ్చెనపెట్టు.

బచ్చెనవెట్టు. అ. క్రి. (బచ్చెన + పెట్టు.)
సిద్ధముచేయు.

ద్వి బండియుఁ బొణకయు బచ్చెనవెట్టి, బండి
కెల్లెడ సందిపడగలు గట్టి
బస. పు. ౩. ౧౫౦. పం.

బజెగా(గే)డి. విణ. దుష్టురాలు, దుష్టుఁడు

క. బజగాడిమాటలు చెవి విడి సుజనుఁ గుమా
రుని లీలాం,గజునిం బోనాడుకొంటిఁగద కేఁ
దనుచున్. (సారంగ. ౩. ౨౧౪.)

సీ ఓవరిపైన నీ కునికిఁ గావించిరే బజగాడి
యని దూఱు బావగారు.(కుక. ౩. ౨౯౪.)

సీ పాపిష్ఠి బజగేడి పంచమహాపాతకియు వ్యతి
పాత ప్రాకిళ్లమారి. (హంస ౫. ౧౧౩.)

బజారము. వి ౧. ప్రలాపము, ప్రల్లదము.

సీ బజారము నాఁగఁ జెలఁగ నాఁ బ్రఁలా
పావిధి (ఆం భా. ౧ ౧౧౬.)

౨ వ్యభిచారము. (చి. ని )

బజారపుఁ బలుకులు = స్వేచ్ఛాలాపములు,
స్వైరాలాపములు.

శా. పాలిండ్లపైఁ బల్మఱున్, జీర ల్లాఁగి
బజారపుంబలుకులం జెట్టాడుచుం బాడుచు,
స్సారాచొక్కుల దిక్కులం దిరిగికన్నం
గన్ను వ్యాన్నెలన్. (బహు. ౩. ౫౮.)

బజారి. విణ.(సం జారిణీ ప్రా జారీ.బజారు+ఇ.)

౧. దుష్టుఁడు, చెడ్డవాఁడు.

సీ. .వ్రాత్యుఁడు బజారి ...
హంస. ౫. ౧౧౩.

౨. వ్యభిచారిణి,

సీ. అవలోకములఁ జేర్చి యలద్విజుండవిష్ణు
శిష్టుని భ్రష్టుఁజేసినబజారి.

బహు. ౫. ౧౪౯.

3. రజ్జులాఁడు, ప్రేలరి.

ఉ. ఏల బజారి రంకు లిడి యెవ్వరు మెత్తురు
నోరిలో పలన్ ప్రేలిడినప్పుడుం గలదనేరఁడు
సీమకుఁడు . (సారంగ. 3 ౫౭.)

వి. ధూర్త స్త్రీ.

సీ. ... బజారి యనంగ దండులంటె, గట్టిజంత
టాఁగ గయాళి యనఁగను ధూర్తయోష
బిరుదొఁచుచుండు.(ఆం. భా ౨. ౧౧౪.)

బజారించు. అ. క్రి (√బజారు.) వ్యభిచరించు.
(చి. ని. బజాతించు. శ. ర.)

బజారు. వి. (సం ప్రచారః ప్రసారః. హిం
బజార్) అంగడివీథి. (బజాఱు. అని. శ గ.)
(వ్యవ.) ఈయూరిబజారు లన్నియు విశాలముగా
నన్నవి.
బజారుమాట = వీథులయందు చెప్పుకొనెడు
మాట. (శ ర.)
జ: బజారి, బజారించు.

బజీతు. వి (హిం. ఫజీహత్.మిశ్ర(గ్రా.) కష్టము,
దుఃఖము.
క. మన కేల దుష్కరం బగు,పనిఁ బూను
బజీతు దేవపతి కేఁడె నటం, చని తెల్పవచ్చె
దేవా,తనురతు పరోపకారితాధికముగదా.
పార్వ. 3. 3౭.
విణ. భంగముగొందినది, అవమానము నొందినది.
గీ. ... చుట్టాలచేత బజీత నగుదు
కుక. ౨. ౧౨౪.
జ: బజీతుచేయు.

బజీతుచేయు. స. క్రి. (బజీతు + చేయు.) పరా
భవించు, అవమానించు.

గీ. అఁదుదాని బజీతుచేయంగ నగునె.
అము. ౫. ౫౧.

చ. అవనిరనూజపైఁ గదిసె నం పూశెకరము
మోవిరక్కసిం,గవయఁదలంచుదాని నపుగా
దన కిట్లబజీతుచేసె ...సమగ్రదావ్యదన్.
భోజను. 3. ౧౨౯.

బజ్జడి. వి. (సం. భంజలి) అశ్వగతివిశేషము.
(పాదన్యాసవిశేషము. శ. ర )
ద్వి బహుచిత్రగతులతో బజ్జళ్లు ద్రొక్క.
పల్నాటివీరచరిత్రము. ౨. భా. (శ. ర.)

బజ్జి. వి. (క, త. బజ్జి.) అనుకుగాఁజేసిన వ్యంజన
విశేషము.
మ. ఫలముల్ పానకముల్ రసాయనము లంబ
ళ్లూరుబిం డ్లూరుఁగా,యలు బజ్జుల్ దధిపిండ
ఖండములు నం దావిర్భవించెన్ దగన్.
రాజ. చ ౨ ౧౨౪.
సీ. కలవంటకములు బజ్జులు పిండివంటలు
చక్కగి జాన్న రసాయనములు.
ఘటికా. ౨. ౧౬.
సీ ఒకప్రేలఁ జవి చూచి యూరఁ ద్రోచినబజ్జి
యాప్రమాణమున జేర్చునాప్రఫలము
పాంచా. ౮. ౫౯.

బటానబయలు=బట్టబయలు. (బటాక
బయలు, స్వార్థమున కకారాగమము అని శ. ర.)
విణ. ప్రకటితము.
క. .. ఆ, తొయ్యలి యూఁచక యూఁచక,
పయ్యెదగొంగును బటానబయలుగఁ జేసెన్.
సారంగ. 3. ౧౬.
(బటాకబయలు, శ. ర. పా.)
ఉ అటఁ గనుచున్ బటానబయ లైనచనుంగవ
పైటఁ జేర్చ . కొనక లేచి ...
ఉ. పారిజా. ౪. ౧౪౦,

, (బటారబయలు. ముద్రి.)

బటాని¹. విశే. దుష్టుఁడు, చెడ్డవాఁడు.

సీ. నం దాటింగినదొంగ సాకెనగొట్టు పిసాని
ద్రిమ్మరి కేరిజము బటాని. (చెన్న. ౨. ౨౪.)

బటాని². వి. కాయధాన్యవిశేషము.
(శ. ర, వ్యవ.)

బటాబయలు = బట్టబయలు. విశే. ప్రక టితము.

చ. అనవుడు నవ్విశాలతరలాక్షి కటాక్షములందు
నంకురిం,చినకినుకఁ బటాబయలు సేయక
నవ్వ ... (సారంగ. ౨. ౧౧౩.)

బటాబూరము. వి. (బూరము + బూరము)
ఆడంబరము.

ఆ. దాయ మెత్తనో యూసార దాఁక నీక,
కట్టి గలిచెద నిద పాపికలనిదయ్య,ముల
బటాబూర మిం దేమి ముట్టఁగలదు, పొంది
వచ్చిన వ్రాలక పోవుఁగాక.

ఉ. హరి. ౩. ౧౪౧. (చి. ని, శ ర., పీఠిక,
బేటూరి పారములు .. పాపికలను వచ్చి
పట్టెనో భూతమిం దేమి పుట్టఁగలదు.
వావిళ్ల. వ్రాఁతప్రతి పా.)

బటారము. వి. (సం. పటుః) ఆడంబరము.

ఉ. . పైని బటారమె కాక వానికిన్,లోన
లొటార మాట మది లోకు లెఱుంగర
చేయు సేఁటికిన్. (తపతి. ౨. ౨౩.)
(వ్యవ.) లో లొటారము బయలు బటారము.

వ. ... ముద్దులకటారంబులును బయిటి బటా
రంబులును ... ప్రబంధ. ౪౫.
(గొప్పతి. అని. శ. ర.)

బటుది. వి. పానపాత్రము, (తాగుగిన్నె.

సీ. ... గిన్నె బటుది కోర. గీ. తబ్బుర
... ...
సాం. ని.హాస. ౨౫.

బటువారు. అ. క్రి. (బటువు + అరు.) ఒప్పారు,
అందముగా నేర్పడు.

సీ. చక్కఁగా బటువారుసందడుసచ్చెళ్లచెలఁగు
మట్టియలపైఁ జెందులాడ. (వీధి. ౧౨.)
(బటువారు = గుండ్రముగా నగుటచే నొప్పగు
అని భావము.)

బటువు.¹ వి. (సం. వర్తులం.) ౧. గుండ్రన, వర్తు
లత్వము.

గీ. బటువు లొంది, యలరెఁ గొమ్మలకుచ
ములయందములను. (ఉ. రా. ౬. ౧౧.)

ద్వి. పుటపుటగా జాజిపూవులు దాల్చి,బటు
వులు గలమించుబటువు లింపొంద,
అ. మ. క. ౩. ౧౬౯ పా ౪. పం.

౨ అంగుళీయకవిశేషము, గుండ్రనియుంగరము.

సీ. ... అంగుళీయవిశేష మలరును బటువు.
గీ. హాఁగ. (ఆం. భా ౨. ౧౫౦.)

గీ. తళుకుజిగికెంపుబటువు ప్రత్యర్థిభిన్న, మధ్య
రుచి చండమార్తాండమండలంబు, తనవిమల
కీర్తికాంతకు నవఁగమించు,నతఁడు సౌందర్య
నలుఁడు విఖ్యాతబలుఁడు.
చంద్రా. ౧. ౪౫.

౩. ఉపధానవిశేషము, గుండ్రని తలగడ.

సీ. . తల,గడ తలాడ తలాఁడి తలయంపి
యొఱగు నా నుపధానసంజ్ఞ లై యొప్పు
చుండుఁ,దద్విశేషాభిధానంబు తగునుబటువు,
దిల్ల దిం దన ... (ఆం భా. ౨. ౧౬౩.)

సీ. యామిని శయనించునాకాశనీలతల్పము
మీఁదఁ జెంగావిబటు వనంగ,గీ ... చంద్ర
బింబంబు వొడిచె. (వరాహ. ౪. ౧౪౫.)

సీ. ఇలయు నీలయుఁ బాదనళినముల్ గుబ్బచన్
బటువులఁ జేర్చి యుంతముగ నొత్త.
వాల్మీ. ౧. ౪౦

౪. (క. బటువు = సౌందర్యము.) అంతము

ద్వి. పటపటదీపకమా నయములఁ బ్రోవో, బటువుల పిండో శోభనకదంబంబో.

ద్వి. పరమ. ౪. ౨౩౧.

౫. దిట్టతనము, ప్రౌఢత.

వ. బటువు మిగిలి పొటనికాయంబు రాయిడిం బడి పుటపుట నైనకూలంకష చాటువుల మాటకారితనంబు మెరసి .

మనుచ. ౫. ౧౦౧

విశే. ౧. వర్తులము, గుండ్రనిది.

గీ . . వర్తులాఖ్య చెల్లు, బటు వనఁగి వట్రు వనఁగను (ఆం. బా ౩. ౧౬ )

క. కటిలాలక నీగుబ్బలు, బటువు లయి మెూగాని కౌగయుబంగరునిగ్గుల్, బోటమరిలుఁబుట్టచెంబ్లొ, నటుగాదే నింతపట్టి యాడుమనఁట కే.

సారంగి. ౨ ౨౦౭.

మ. బటువుంజన్నులు చందమామ తళుకుల్ ప్రస్ఫావకాంచీలస, త్కటిలీల ల్గలజవ్వనుల్ తవులం గాఁగాఁగాక . (మల్ల శృం. ౩౧.)

౨. అందమైనది, మనోజ్ఞమైనది.

గీ. ... ఎదుటఁ, బసివలపు లిచ్చు పచ్చాకు పసిఁడిపట్టు, బటువుకోడును బటువులై పుటముగులుకఁ, బూని రండల మెంతయు బోయ లంత (రా. వి. ౨. ౪౩.)

బటువువిల్లు = గుండ్రని విలగడ

గీ. ... పైఁటలో మరునిబటువు, విల్లక్రియఁ బట్టుఁగంచెల బిగువుఁజన్ను, నిక్కఁ దిస్సెలఁ జ్రాకాళి చిత్తమాడు. (ఆము. ౧. ౫౯.)

సీ. పకిపెలపట్టెమంచముఁ బట్టుఁదలగడ బటువు బిక్కలు మార్కొపటపుఁబులుపు. (వైజ. ౩. ౬౪.)

జ : బటువారు, బటువుకత్తి, బటువుకైదువు, బటువుకైదువుజోదు, బటువుగువ్వ, బటువు పుల్గు, బటువుబాలు, బటువువాలుతాల్పు.

బటువు². విశే. (సం. పటుః.) ౧. గొప్పది, పెద్దది, అధికము.

క. అటుమందటపటుకైతోర్వ్యుద్భట మయి దిట మయి నిగాఢదళసంతతివి, స్ఫుట మయి కడు శ్యావట మయి బటు వయిన దోశ్కూటముం గనియెన్.

ప్రబంధ. ౨౦౬.

గీ. పోయగముచేత బటు వైనపొంబసుచేత.

కవిక. ౬. ౧౫౪.

౨. దృఢము. (శ. ర.)

బటువుకత్తి. వి. (బటువు¹ + కత్తి) చక్రము.

గీ. . వేయంచులుఁగు, చుట్టుఁగైదువు గుదు మవా లున్నడియడిదము, బటువుకత్తి వాఁ జక్ర మా. (ఆం. భా. ౧. ౫౨.)

బటువుకైగువు = బటువువాలు. వి. (బటువు + కైదువు.) చక్రము. (బటువుఁగైదువు. శ. ర.)

సీ వచ్చుఁచున్నఁ గన్గొని వాఁడు గ్రస్నపం దూలంగ గ్రుద్దుల బటువుకైదువుల నడిద, ముల మరల్చినఁ బోక. ..

అచ్చ. రా. ౨౬౩.

సీ. బటువుకైదువవాని భాసమానమృగాంకభాగ మానమ్మితాస్యంబువాని. (దశా. ౨. ౨౫౩.)

బటువుకైదువుజోదు. వి. (బటువుకైదువు + జోదు.) చక్రాయుధుఁడు, విష్ణువు.

సీ. . బటువుకైదువుజోదు బమ్మతండ్రి ...

గీ. కారిపేరులలరు... (సాం. ని. చేమ. ౪.)

బటువుగువ్వ. వి. (బటువు + గువ్వ.) బటువు పుల్గు, చక్రవాకము.

గీ. జంటపిట్ట బటువుగువ్వ జక్కవ యనఁ గో సాముంబు లగు... (సాం. ని. తిర్య. ౬౮.

బట్టతల కొరకొరలు మొడిపెట్టుట = అసాధ్యమగు పనిచేయుట.

సీ. కడుబట్టతలల కొరకొఱ్ఱ్లను ముడిపెట్ట నేసేర్తు మతియును నేసె నేర్తు. విప్ర. ౪. ౭౮.

బట్టతలవాఁడు. విణ. (√బట్టతల.) ఖల్వాటుఁడు.

శా. ఎండ న్మిక్కిలి తపింప బట్టతలవాఁ డొందె నిలన్ నీడఁ గూర్చుండన్ దాళకుజంబుక్రింది కరుగన్ . . (మల్లభూ. నీతి. ౭౪.)

బట్టబయ(బై)లు = బటాబయలు, బటాబయలు, బట్టబయలు. వి. దే. (బయలు + బయలు. అని చి. ని., శ. ర.) వృక్షాద్యావరణాచ్ఛాదనరహితమగు బయలు.

మ. .. వన్యవృక్షవితానంబులు లేనిబట్టబయలన్ శాకాశనుండై యుధిష్ఠిరుఁ డంతించుచు చేసెఁ దపమున్ దాత్పర్య ధైర్యంబునన్. (పి. శకుం. ౭. ౧౧౭.)

ఉ. తొట్టినశోకవిస్ఫురణతో ధరణిం గలపక్కణస్థలుల్, బట్టబయళ్లుగా మెదడు వట్టినపాండుకపాలఖండముల్, గట్టినకండ్ల వాళముల తైవడి నంట ఖురాంచలంబుల, న్మట్టి నిషాదమస్తములు మారమణీరమణుండు ఱిక్కెయై. (వరాహ. ౮. ౭౫.)

గీ. గరుడగంధర్వభుజగకిన్నరపిశాచ, భటులు చావడిముంగటి బట్టబయలఁ, జటులతరవృత్తిఁ గోటులసంఖ్య లేసఁగ నట్టగద్భుండు గొలువు పున్నయవసరమున. (కాశీ. ౭. ౪.)

ఉ. ప్రాలువు బట్టబైట నిజపుత్రకుఁడుం బలుగాకి యుట్టిచో, పలుపు తోలిగొల్చు టాకవిక్రమమే బలిదైత్యవల్లభా. వరా. ౭. ౪౭౩.

సీ. తమపొంత్తు గుడియుంచి తలయంతున్నమ నారలేఁటిలోగా బట్టబైటబ్రతుకు. ఉ. రా. ౧. ౭౧.

విణ. (బట్టబయలువంటిది.) ప్రకటమైనది.

ఉ. . అమ్మక్కల గుట్టు బట్టబయలై కనిపింపఁగ కారి పొన్నపై, నెక్కి రమించుచున్కి .. (సారంగ. ౨. ౭౦.)

బట్టమేఁక. వి (√బట్ట) పక్షివిశేషము. (శ. ర.)

బట్టి[1]. వి. బహుమానము.

ఉత్సాహ. అట్టివేళ విశ్వకర్మ యరుగుదెంచి దీనికిన్, జట్టి పుట్ట దంచు పాంచజన్యజన్యశంఖమున్, బట్టి గాఁగ నిచ్చి యలనభస్వరత్స్వరద్విషున్, జాట్రవేల భూవరునకుఁ జూపి యేకతంబుగాన్. (కకు. ౭. ౧౦౯.)

బట్టి[2] = బట్టికాఁడు. ౧. చిఱుక.

సీ. మాణిక్యమకుటంబు మాటి మస్తమునందు బట్టియాఁకల కొట్టె ముట్టిపడిరి. పుటికా. ౧. ౧౫౩.

౨. వాగ్ధోరణి. (చూ. బట్టికాఁడు.)

జ: బట్టికాఁడు

బట్టి[3](ట్టీ). వి. (క. బట్టి, బట్టీ.) మందులు వండుటకును ఓమము కొందలగువానినుండి ద్రవము తీయుటకు నుపయోగించెడిప్రొయ్యి, అవము. (శ. ర.)

బట్టికాఁడు = బట్టి[2]. వి. (√బట్టి[2].) ౧. చిఱుక.

గీ. చదువు శుకసంఘ బట్టికాఁ దనఁగ రాదు, తమ్ము యతఁ జెలంక యడఁగ. ...

అం. ఛా. ౨. ౭౯.

౨. గోరువంక, శారిక.

సీ. బట్టికాఁడుల నింపు పుట్టియ్యఁగ నేలఁ బట్టి మాటలఁ గఱువంగరాదు.

సింహా. ౨. ౯౧.

**బడబడ.** వి. ౧. బొబ్బ వడగండ్లు మొ. తొందరగా పడుటయందగుధ్వని కనుకరణము.

ద్వి. పిడుగుల మంటములఁ బేర్చు పేగములఁ, బడబడ వడగండ్లు వడియె వెల్లడల.

ద్వి పారిజ. పూ. ౨౧౪౯. పం.

౨. ప్రేంగుట లోనగువాని ధ్వని కనుకరణము.

క. బడబడ పేలఁ బ్రేంగితి,కడుపుమి యాభల మటంచుఁ గ్రోధముతోడన్ ...

పద్మ. ౮. ౨౪౨.

౩. అధికముగా మాటలాడుటయం దగుధ్వని కనుకరణము.

(వ్యవ.) వాఁడు బడబడ వాగుచున్నాఁడు.

౪. ఇనుపతగడు మున్నగువానిని కొట్టునప్పుడు అగు ధ్వని కనుకరణము.

(వ్యవ.) కమ్మరివాఁడు డబ్బా బడబడ వాయించుచున్నాఁడు.

౫. నీరు కొందలగునది కాఁచుటయం దగు ధ్వని కనుకరణము.

(వ్యవ.) ఆ బిందె బడబడ కాఁచుచున్నది.

**బడబాకి.** విశే. (బడ + బాకి?) మిక్కిలిగొప్పది, మిగుల పెద్దదైనది.

ద్వి. పెలుచినకురులును నిడుదకోఱలును, బలుపైన కడుపును బడబాకినోరు.

రం రా. అర. ౧౯౦. పా. ౨౪. పం

ద్వి పడఁగకంపెసఁగడి బడబాకినోరు, పెదను చెవులుఁ గుఱుచఁగద్దమును.

పల. ౩. ౧౪౯. పా. ౨౦. పం.

**బడబాగ్ని.** సం. వి. ఇ. పుం. = బడబానలము.

**బడబానలము.** సం. వి అ. పుం. బడబాగ్ని, సముద్రమునందుండు అశ్వాకారముగల యగ్ని.

**బడబాముఖము.** సం. వి. అ. పుం. = బడబాగ్ని.

**బడరుఁడు.** వి. (క. బడ. తు. బళ.) ౧. దేవుఁడు, ప్రభుఁడు.

క. ఒడలు గుడి యంతరాత్మయ, బడరుం డను పలుకు లుడిగి భక్తిని గుడియే, గుడి యనియు లింగమూర్తియ, బడరుం డని కొలుచు నది పాతకము శివా. (శివ. సా. ౨౬౦.)

౨. దరిద్రుఁడు.

క. తోడవులు చిరిగిన యెమ్ములు, గుడిముట్టు గపాల మిల్లు గుడి ముడిచె దిక్కుఁడు, గట్టువలువు దో లగు, బడరునకై నవయ నేమి ప్రళయము వచ్చెన్

కు. సం. ౮. ౭౪౦.

**బడలించు** = బడలఁజేయు, బడల్చు. స. క్రి. (√బడలు.) శ్రమపెట్టు, అలయించు.

క. వడి గెలవా రని భటులను,బడలించిన మనము నిడుదపయనంబుల మం,దడు వేసవినిన్ విడిసిన,రిపులన్ బ్రజపప్పినొప్ప తెఱఁగుకరుణన్. (భా. రా ౪. ౬౭.)

౨. నొప్పించు, బాధపెట్టు.

సీ. జంబుమాలిని మూఁడు శరముల బడలించి యూపాతు నాల్గింట నుదుటు మాన్చి.

భా. రా. ౪. ౬౬.

౩. క్షోభపెట్టు, వ్యాకులపెట్టు.

భా. ... భీమసం,గ్రామకుతూహలంబున జగత్త్రయమున్ బడలించురాక్షస,గ్రామములన్ హరించి మముఁ గావఁగదే శివ యంచు బ్రొక్కినన్. (భా. రా. ౧. ౩౧౨.)

ద్వి. పరిపూర్ణకళపోము బడలించుకోమ.

ద్వి. పల. ౧. ౭౨౫. (ఇట ఔపమ్యద్యోతకము.)

**బడలిక.** వి. (√బడలు.) ౧. శ్రమము, అలయిక, శ్రమచిహ్నము.

చ. పదమర కెట్టునయ్యెడుఁ బ్రాశన కొల్లకొట్టిపేదలై,బడలిక నూడువచ్చిలువ్రగ్గములన్. (ఆము ౨. ౪౯.)

చ. అడిగినయంతలోన సరసాన్నములన్ సమకూర్చి వాఁకటన్, బడలిక కెందినీక ...

పారి. ౧. ౬౧.

క. తన భవితభుటిక నీకే, నొసంగాద నీకోరఁ
దగిన యువిదలఁదన నీ బసుమను నొడలం
బిడి వను వసదృశగతి భక్ష్యు లగుదు రాచెలు
లధిపా — సానందో ౫ ౧౪౯

ఉ. యీబసువంబు కప్పురమె యీతిరి వేణియె
పట్టుఁజీరలే యీబిజుసైన వల్కలము లీతప
మిష్ట మనోజభోగమే — ఉ రా ౩ ౧౦౬

బస్తకము. సం వి అ న కామకము లవణ భేదము ఒక విధమగు ఉప్పు

బస్తకర్ణము. సం వి అ పుం సాలవృక్షము

బస్తగంధ. సం వి ఆ స్త్రీ ఒక దినుసు తులసి

బస్తము. సం వి అ పుం మేఁకపోతు భాగము

బస్తా. వి గోనసంచి
(వ్యవ) ఆ బస్తాలో ధాన్యము పోసి యుంచినారు

బహి. వి (సం బహిః) వెలపల వెలి (మా బహిరొనర్చు బహివడు)

బహిత్రము. సం వి అ న యానపాత్ర విశేషము (శ ర)

బహిరొనర్చు. మి స క్రి (√బహి) బహిరెట్టు వెలివేయు

సీ. ఆత్మజ లెఱిఁగిన నాదరింపరు చూచి
బంధువు లెఱిఁగిన బహిరొనర్తురు
భాగ ౧౦ పూ ౯ ౪౭

బహిరంగము. సం విణ (అ ఆ అ) ౧ బయటిది, వెలుపలిది బయలుపడినది ౨ పెఱ లాతి వి అ న ౧ వెలుపలిభాగము ౨ వెలుపలి అవయవము ౩ పొత్తు ౪ (మీమాంసా) ఒక కర్మమునందు దీక్షాద్యర్థ మగు పూర్వ భాగము ౫ (వ్యాక) ఘటిత నిమిత్తకమగు కార్యము (వ్యతి అంతరంగము)

బహిర్ద్వారము. సం వి అ న తలవాకిలి తోరణము, సింహద్వారము.

బహిర్లంబము. సం వి అ పుం (గణిత) సమకోణముకంటె పెద్దకోణముగల త్రికోణము

బహిర్లాపి. సం వి ఈ స్త్రీ ఉత్తరము వేఱు మాటలయందు దాఁగియుండునట్లు అడుగునట్టి విషమసమస్య (శ ర)

బహిర్వ్యాకారము. సం వి అ పుం సవాయి రోగము

బహివడు. అ క్రి (√బహి) వెలివేయఁబడు కులములోనుండి బహిష్కరింపఁబడు

సీ. బహివడ్డ ద్విజున కల్పపుఁబాచితం బిడి పవిఁ
డిక్కై తా వానిబంతిఁ గుడిచి
ఆము ౬ ౬౯

బహిపెట్టు. స క్రి (√బహి) వెలివేయు కులమునుండి బహిష్కరించు

సీ. బహిపెట్టినతనియన్న ఆ. మను నిజాగ్ర
జానకు మును పెండ్లియాడిన పురుషునన్న
మును నభోబ్య మంద్రు
భార శాం ౧ ౩౨౨

బహిష్కము. సం విణ (అ ఆ అ) బయటది వెలిది

బహిష్కరణము. సం వి అ న ౧ వెలియింద్రియము (వ్యతి అంతఃకరణము) ౨ వెలుపలికిఁ దఱుమఁగొట్టుట ౩ వినాయించుట

బహిష్కరించు. సం స క్రి వెలివేయు బహిపెట్టు (శ ర)

బహిష్కారము. సం వి అ పుం ౧ వెలికిఁ దఱుముట ౨ వెలివేయుట ౩ వినాయించుట

బహిష్కృతుఁడు. సం విణ (అ ఆ అ) ౧ వెలువరింపఁబడినవాఁడు ౨ వెలిపెట్టఁబడినవాఁడు

బహిస్. సం అవ్య స్ ౧ వెలి, వెలుపల ౨ బయట (వ్యతి) అన్య ఇంటికి బయట ౩ వేఱుగా ప్రత్యేకముగా ౪ తప్పు (దీనికి తెనుఁగున స్వతంత్రప్రయోగము లేదు)

బహుళకము. సం వి అ పుం ౧ జిల్లేడు ‡ ౨ ఎండ్రి ౩ దాత్యూహము, పూకురుగుండఁగి అనుపిట్ట.

బహుకరము. వి అ పుం లొట్టియ ఉష్ట్రము

బహుకరి. సం వి ఈ స్త్రీ చీపురు సమ్మార్జని

బహుకరుఁడు సం విణ (అ ఈ అ) ౧ మిక్కిలి చేయువాఁడు చుఱుకైనవాఁడు ౨ పెక్కువిధముల నుపయుక్తుఁడైనవాఁడు ౩ ఖలపువు కళ్లము ఊడ్చువాఁడు

బహుకర్ణిక. సం వి ఈ స్త్రీ ఎలుకచెవిచెట్టు

బహుకుఁడు. సం వి అ పుం సూర్యుఁడు

బహుకూర్చము. సం వి అ పుం ఒకదినుసు కొబ్బెరచెట్టు మధునారికేరకము ‡

బహుక్రమము సం వి అ పుం మాఁడుపదముల కెక్కుడు పదముల క్రమపాఠము

బహుగంధ. సం వి అ స్త్రీ ౧ కుందురము ఒకానొక గంధద్రవ్యము ‡ ౨ లవంగపుపట్ట ౩ యూథిక అడవిమొల్ల ‡ ౪ నల్లజీలకఱ్ఱ

బహుగంధద. సం వి అ స్త్రీ మృగమదము కస్తూరి

బహుగంధము. సం విణ (అ ఆ అ) మిక్కుటమయిన వాసన గలది వి అ న ౧ త్వచము లవంగపట్ట దాల్చిని చెక్క ౨ కుందురుకము. ‡

బహుగ్రంథి. సం వి ఇ పుం పక్కిచెట్టు ఝాబుకము ‡

బహుతరకణిశము. సం వి అ పుం రాగి ధాన్యము

బహుతరము. సం విణ (అ ఆ. అ) ప్రాయికము, తఱచు

బహుతిక్త. సం వి అ స్త్రీ కాకమాచి ‡

బహుతిథము. సం విణ (అ ఈ అ) మిక్కిలి, పెక్కు అనేకము

బహుత్వక్క(చము). సం విణ. (చ.) భూర్జపత్రవృక్షము బుజపత్రి ‡

బహుదుగ్ధము. సం వి అ పుం గోదుమ ధాన్యము

బహుధా. సం అవ్య అనేకవిధములచేత, పెక్కురీతులను

చ పలుకులు వేయు నేమిటికిఁ బార్థివుఁడాత్మభుజాభృతక్షమా తలమున గుట్టుకీడు బహుధా యరయించి యడంచి అమ ౪ ౨౫౦ (దీనికి గ్రంథాంతరములఁ బ్రయోగము మృగ్యము వి శ ర)

బహుధాన్య. సం వి అ పుం అఱువది సంవత్సరములలో నొకటి

బహుధారము. సం వి అ న ఇంద్రుని వజ్రాయుధము

బహునాదము. సం వి అ పుం శంఖము

బహుపత్రము. సం వి అ పుం నీరుల్లి ‡

బహుపత్రి. సం వి ఈ స్త్రీ ౧ లింగిని ‡ ౨ ఘృతకుమారి ‡ ౩ తులసి ‡ ౪ బృహతి ‡ ౫ గోరక్షదుగ్ధ ‡ ౬ జతుక ఒక జాతి గబ్బిలము

బహుపత్రిక. సం వి అ స్త్రీ ౧ భూమ్యామలకి నేలఉసిరిక ‡ ౨ మేథిక, మెంతి ‡ ౩ మహాశతావరి ‡

బహుపర్ణము. సం వి అ పుం సప్తచ్ఛద వృక్షము ఏడాకులఅరఁటి ‡

బహుపర్ణి. సం వి ఈ స్త్రీ మేథిక, మెంతి ‡

బహుపర్ణిక. సం వి అ స్త్రీ ఆఖుకర్ణి ఎలుకచెవి ‡

బహుపాత్తు. సం వి ద్ పుం మఱ్ఱి ‡

బహుపుష్పము. సం వి అ పుం నింబము, వేప. ‡

**బహుప్రజము.** సం. విణ. (అ. ఆ. అ.) పెక్కు ప్రజలు గలది. వి. అ. పుం. ౧. పంది ౨. ముంజగడ్డి. ‡.

**బహుప్రదుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి యీవికాఁడు, దానశౌండుఁడు.

**బహుఫలము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి ఫలములు గలది. వి. అ. పుం. ౧. కదంబము, కడప ‡ ౨. వికంకతము ‡

**బహుఫలిక.** సం. వి. ఆ. స్త్రీ. భూమిబదరి, నేలరేఁగు ‡

**బహుఫేన.** సం. వి. ఆ. స్త్రీ. సాతల, సంబరేను ‡

**బహుబలము.** సం. వి. అ. పుం. సింహము

**బహుభుజ.** సం. వి. ఆ. స్త్రీ. దుర్గ.

**బహుమంజరి.** సం. వి. ఈ. స్త్రీ. తులసి ‡

**బహుమతము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. గొప్పగా నెన్నఁబడినది ౨. అనేకమతములు (అభిప్రాయములు) గలది

**బహుమతి.** సం. వి. ఇ. స్త్రీ. గొప్పయెన్నిక, గొప్పమన్నింపు, బహుమానము

క. బహుతురగ శకటగోగణ, బహుళ బహుగ్రామములను బహుమతి నిత్తున్
భార. అను. ౩. ౨౧౩

**బహుమలము.** సం. వి. అ. న. సీసము.

**బహుమానము.** సం. వి. అ. పుం. గొప్పగా భావించుట, మిక్కిలిగౌరవము. వి. అ. న. గొప్పవారు తక్కువవారి కిచ్చు పసదనము, సమ్మానము.

**బహుమానించు.** సం. స. క్రి. మిక్కిలి గౌరవించు.

మ. అహహా లోకము లేకొలంది మను..
ష్యుండు చేసవికి నీక శ్రీక వాగీశుల,స్వహ
స్తున్ పూర్వమునందు శయ్యానిక ముఖ్యాపార
శాస్త్రంబులన్, బహుమానించుచు వారి ...
కృ. శకుం. ౧. ౩౨. (ఇట్లు ఆక్రమించుదురు అని భావము.)

**బహుమాన్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి గౌరవింపఁదగినవాఁడు.

**బహుమార్గగ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గంగానది ౨. చెడిప, జంకుటాలు.

**బహుమార్గము.** సం. వి. అ. పుం. పెక్కుదారులు కలియుచోటు, చత్వరము.

**బహుమార్గి.** సం. వి. ఈ. స్త్రీ. పెక్కుమార్గములు కలియుచోటు, చత్వరము.

**బహుమూర్తి.** సం. విణ. (ఇ) అనేకమూర్తులు గలది, పెక్కు ఆకారములు గలది. వి. ఇ. స్త్రీ. వనకార్పాసము, అడవిప్రత్తి ‡.

**బహుమూర్ధుఁడు.** సం. వి. డ. పుం. విష్ణువు.

**బహుమూల.** సం. వి. ఆ. స్త్రీ. శతావరి, చల్లగడ్డ ‡

**బహుమూలకము.** సం. వి. అ. న. ఉశీరము, వట్టివేరు.

**బహుమూల్యము.** సం. విణ. (అ. ఆ. అ.) మిక్కిలి వెలగలది, మహార్ఘము, వి. అ. న. మిక్కిలి వెల

**బహురంధ్రిక.** సం. వి. ఆ. స్త్రీ. మేధ ‡

**బహురస.** సం. వి. ఆ. స్త్రీ. అధికమగు రసము కలది-మహాజ్యోతిష్మతి ‡

**బహురూపము.** సం. విణ. (అ. ఆ. అ.) పెక్కురంగులు గలది, చిత్రవర్ణము గలది. వి. అ. పుం. ౧. సరటము. ఊసరవెల్లి పెక్కురూపములు గలది. ౨. కేశము ౩. సర్జరసము, సజ్జరసము.

**బహురూపుఁడు.** సం. వి. అ. పుం. ౧. విష్ణువు ౨. శివుఁడు ౩. మన్మథుఁడు (శ. ర.)

**బహురేతసుఁడు.** సం. వి. డ. పుం. చతుర్ముఖబ్రహ్మ.

**బహురోమము.** సం. వి. డ. పుం. మిక్కిలి రోమములు గలది-గొఱ్ఱె.

**బహులగంధ.** సం. వి. ఆ. స్త్రీ. ఏలకి కీ.

**బహులచ్ఛదము.** సం. వి. అ పుం. రక్తశోభాంజనము. కీ

**బహులము.** సం విణ. (అ ఆ అ) ౧ దట్టమైనది, నిబిడము. ౨. కలుచు. ౩. అనేకము, పెక్కు ౪ వల్లనిది (వాచ) ౫. (వ్యాక) ప్రవృత్త్యాది విధేయధర్మము శ్లో క్వచిత్ప్రవృత్తిః క్వచిదప్రవృత్తిః క్వచిద్విభాషా క్వచిదన్యదేవ, విధేర్విధానం బహుధా సమీక్ష్య చతుర్విధం బాహులకం వదన్తి వి అ పుం ౧. కృష్ణపక్షము ౨ అగ్ని ఆ స్త్రీ ౧ ఆవు. ౨ పెద్దయేలకి కీ. ౩. నీలిచెట్టు అ న. ౧ ఆకాశము ౨ తెల్లమిరియాలు ౩. నలుపు (వాచ)

**బహులీకరణము.** సం వి అ న బహుళముగా చేయుట ౨ తూర్పెత్తుట, చెరగుట

**బహువచనము.** సం వి అ న (వ్యాక) బహుత్వమును తెలుపు ప్రత్యయము.

**బహువల్కము.** సం వి అ పుం మోరటి, ప్రియాళువు. కీ

**బహువారము.** సం అవ్య పెక్కుమాఱులు.

**బహువారకము.** సం వి అ. పుం శ్లేష్మాతకము, విరిగి. కీ.

**బహువిధము.** సం. విణ (అ ఆ అ) పెక్కుతెఱఁగులు గలది, వివిధము. (శ. ర)

**బహువీర్యము.** సం వి. అ పుం ౧ విభీతకము, తాడి. కీ. ౨ తండులీయశాకము, చిత్తికూర కీ ౩. బూరుగు కీ ౪. మరువకము కీ

**బహువు.** సం. విణ. (ఉ. ఉ హ్వీ. ఉ) ౧ విపులము, అధికము, ఎక్కుడు. ౨. పెక్కు, అనేకము.

**బహువ్రీహి.** సం. విణ (ఇ) మిక్కిలి వ్రీహి (= ధాన్యము.) గలది. వి ఇ. పుం. (వ్యాక) తెలుగు అన్యపదార్థ ప్రధానమగు సమాస విశేషము. (ఇది తద్గుణ సంవిజ్ఞానము, అతద్గుణ సంవిజ్ఞానము అని ద్వివిధము. సమాసార్థ ఘటక పదార్థములకు సంయోగ సమవాయాన్యతర సంబంధ మున్న రెండవ తద్గుణ సంవిజ్ఞానము. ఉదా చిత్రవస్త్రునిఁ దీసికొనిరమ్ము, లంబకర్ణునిఁ దీసికొనిరమ్ము. అది లేనిచో నతద్గుణ సంవిజ్ఞానము ఉదా. దృష్టసముద్రునిఁ దీసికొనిరమ్ము

**బహుశత్రువు.** సం వి. ఉ. పుం చటకము, ఊరపిచ్చుక

**బహుశస్.** సం అవ్య న్ ౧. మిక్కిలి, కలుగా ౨ మాటికి, పెక్కుమాఱులు. ౩. ప్రాయికముగా, సాధారణముగా.

**బహుశల్యము.** సం. వి. అ. పుం రక్తఖదిరము, ఎఱ్ఱచంద్ర. కీ

**బహుశాలము.** సం. వి. అ పుం. స్నుహీవృక్షము, జెముడుచెట్టు. కీ.

**బహుశ్రుతుఁడు.** సం విణ. (అ. ఆ అ) అనేకశాస్త్రముల నధ్యయనము చేసినవాఁడు.

**బహుసంతతి.** సం. వి ఇ పుం. మిక్కిలి సంతానము గలది, ఒకదినుసు వెదురు కీ

**బహుసారము.** సం వి అ పుం మిక్కిలి చేవ గలది, మిక్కిలి సత్తువగలది ఖదిరము, చండ్ర కీ.

**బహుసుత.** సం వి ఆ స్త్రీ పిల్లపీఁచర, శతమూలి కీ

**బహుసువు.** సం వి. ఊ స్త్రీ. పెక్కు బిడ్డలను గన్నయాఁడుది, పెంటి పంది.

**బహుసూతి.** సం వి ఇ స్త్రీ. ౧. పెక్కుబిడ్డలఁ గన్నయాఁడుది. ౨ పెక్కుఁ దలీసెడి యావు, పరేష్టుక.

**బహుస్రవ.** సం వి ఆ స్త్రీ. సల్లకి, అందుగు. కీ.

**బహూకరించు.** సం. స. క్రి. సన్మానించు, మన్నించు.

క. ఈ దంపతులు చరాచరప్రపంచంబు
రక్షింతురని గాక యనుచు దీవించిన విరించి
బహూకరించి సనకసనందన సనత్కుమా
రాదుల సంభావించి   కరాహ ౬ ౪౩
(తథాస్తు అని సమ్మతించి అని భావము)

క. అని యిట్లు తండ్రి చెప్పిన వినతోక్తులు
వినియు శుకుఁడు విద్యానిధి నెమ్మనమున
బహూకరింపమిఁ గని వేదవ్యాసుఁ డతని
గని యిట్లనియెన్   వాసిష్ఠ ౧ ౧౪౦

బహూదకుఁడు. సం వి అ పుం శౌచార్థము మిక్కిలి ఉదకములు కలవాఁడు - ఒకానొక సన్న్యాసి

బహ్వపత్యము. సం వి అ పుం మిక్కిలి పిల్లలు గలది ౧ పంది ౨ ఎలుక

బహ్వాశి. సం విణ (ప్ సీ న్) తిండిపోతు

బహ్వృచుఁడు. సం వి అ పుం ఋగ్వేదము చదువువాఁడు ( శాఖా బ్రాహ్మణుఁడు- శాకల )

## బా

బాండువ. వి (సం బాణ్డః) కుండ, ఘటము (చి ని, శ ర)

బాంధకినేయుఁడు. సం వి అ పుం కులట కొడుకు ఱంకుటాలి కొడుకు

బాంధవము. సం వి అ న ౧ బంధుత్వము చుట్టఱికము

క. పవనసుతుఁడు నీకును బాంధవము గలదొ
భార శాం ౩ ౩౫౪

ఈ యర్థము తెలుఁగుగ్రంథములందే కనఁబడుచున్నది

౨ మైత్రి

చ. తను సగఁబాలు గోలుపడి దానినయిప్పుడు
గోరు పీరికిఁ, సముచితవృత్తి విచ్చి తను
పాయున సంతసమంది యున్కి యుక్తము
ధృతరాష్ట్రనందనుఁడు దాన నశోభనము శేక
యుండుఁ గో,వ ముడిగి పేరు పేరుచును
బాంధవ విగ్రహముం బ్రియంబడుట్
భార ఉద్యో ౧ ౧౫

బాంధవుఁడు. సం వి అ పుం ౧ చుట్టము ౨ జ్ఞాతి ౩ మిత్రుఁడు ౪ భ్రాత

బాంధవ్యము. సం వి అ న చుట్టఱికము (విల్యమ్సు)

బాఁకా. వి (హిం బాంకా) కాహళము ఊఁదెడి వాద్యవిశేషము చర్మవాద్యవిశేష మని చి ని నిరనుస్వార మని శ ర

వ్యవ పెండ్లివారు ఊరికెలుపల బాఁకా పట్టించుచున్నారు

బాఁకు. వి (క బాక హిం బాంక్) ౧ కటారి కత్తి వంకరకత్తి

సీ. గొనబుగా మురులఁ జెక్కిన చెంగుతోడ
కేలఁ బొందుబాఁకుతోఁ బొల్పు నీవిదట్లు
రా వి ౨ ౪౪

చ. తన కిది దక్కె నంచుఁ బ్రమదంబునఁ
బంక్తిముఖుండు మీనకేతుని చిగురాకుబాఁకు
మదిఁ దూఱినఁ దాలిమి మాలి
ఉ రా ౩ ౧౧౫

ఉ. మీనునిడంబు రాకు రహిమించిన చెక్కుల
తేజ చెక్కు మేలైన ప్రసూనసాయకము
లన్నియు చేయుచుఁ గల్వయొగ్గ చే బా
నటు చిమ్మి కుందనపుఁజాయల గెదఁగికేకు
బాఁకుచే   భాను ౩ ౨౩

గీ. బాఁకు, వంకి చిల్లాణ మనఁగను శస్త్ర
మలరు మండును   అం భా ౨ ౨౧౪

బాఁజ్. వి (హిం బాజ్) ఒకవిధము డేగ శ్యేనవిశేషము

(ఇది రెక్కపాటు విడిచిన పులుఁగు మీఁదికిఁ బోయి పులుఁగును గొట్టును గాని వెండవ విడెయుపులఁ బోవదు మిగుల శౌర్యంబు గలిగి కరం బుపలాలనీయంబై యుండును. చి ని)

తే. పాఁకుడు గిడ్డు లగుడు పేసడము కురుజా, బాఁజె ఇలకొట్టై జాలియ వ్రైల యణుజా, సోర ణంబును వాదిగాఁ జేరుపడిన. పేఁటదేగల గిజిగాఁన విడిచి కడిమి. హరిశ్చ ౨ ౨౨

బాఁడు = బాపఁడు. వి (సం. బ్రాహ్మణః కు. బాటు = కుంటెన కాఁడు )

ఉ ఇట మీఁద సేవకో, శేఁడఁగఁ బోయెడిం గరణదేశపు జాణఁడు గాఁగ బోలు నీ,బాఁడు పణోపహారపరిపాటి రయింగఁగ వచ్చు టెవిచేన్ క్రీడా ౧౫౯.

బాఁదు. స క్రి (సం. బాధా క బాదు )కొట్టు, తాడించు

క శేలం ఒడి పారలు మన్న మహిషంబున ఘట్టించియు రజ్జుపరంపరల బాఁదియు రాల అవ్వియు . శేష 3 ౧౯౯.

క అఱచేతులం బాఁదుచుఁ దూపులఁ ఒఱ పుచుఁ గవిసియుఁ దనివిగొనక వీర ౪ ౧౦౪

జ బాఁదుకొను.

బాఁదుకొను. స. క్రి (బాఁదు + కొను స్వార్థ మున) కొట్టు, తాడించు

క ఎద్దొక్కొకడుఁ దీసిన, గద్దతి రయుఁబోతు నొక్కకడ కీడ్పుటయున్, పెద్ద మని కోల చేఁ జే,కొద్దిన్ వడి యడర బాఁదు కొనుచున్ దున్నెన్ శేష. ౪ ౯ ౮

బాఁపఁడు = బాఁడు, బాఁపనుఁడు. వి (సం బ్రాహ్మణః ప్రా బ్రామ్హణో ) బ్రాహ్మ ణుఁడు, పాఱుఁడు.

సీ ఒకవాఁడు చనుచోట నొక బాఁపఁడ పెట్టు, పెట్టు మంచు . వరాహ. ౭ ౬౩

గా చాటుప్రౌఢిఁ బిసాళి మాడెదవు కాస ల్నాటి బాఁపండవో క్రీడా ౬౨.

క. నందుఁడు మాకుం గాదిలి,ఒందుగుఁ దానివి కొల్ల బాఁపఁడ వగుటన్ .. నీలా. ౧. ౧౯౨.

బాఁపత. వి. (బాఁపన + త, వృత్తియందు వర్ణ లోపము) పాఱుత, బ్రాహ్మణస్త్రీ.

ద్వి. కుసిగుంపు వడగల కోడె బాఁపతలు, అస మానగతి వచ్చిరావిప్రవరులు .

అ. మ. ౯. ౫. ౨౩౬.

క. అపాఱుఁ దవ్వఁవనితా, వ్యాపారుం డగుట రయితేఁగి వంచించి విప్రప్రాపిత ధర్మము లిడి యా,బాఁపత హరియించె వతని ప్రాణా నిలమున్. పానందో. ౫. ౯౧.

సీ. బాఁపత యంచన బ్రాహ్మణి చె కొన్నెందు .. అం భా. ౨. ౧౦౯.

బాఁపన. వి (సం. బ్రాహ్మణః.) ౧. బ్రహ్మ కులము.

మ నీ పాలికి దేవుఁడింక జవినీఁడే యంచుఁ దా నాడఁ గాఁ వలెనె బాఁపన మొప్పె రైన పరిరయే శుక. ౨ ౪౧౬.

ద్వి. పరిణమించితి నిన్ను బాఁపనవడుగ, తిరు గక యీమాట తిరము గా నిలుపు

ద్వి. హరిశ్చ ఉ. ౧౪౭౧. పం.

సీ. పరగుఁ జతుర్వర్ణ బాఁపన రాచ కోమటి రెడ్డి నాఁగను అం భా ౨. ౧౬౦

౨ బ్రాహ్మణుఁడు

చ. పలుకులు వేయు నేఁటికిఁక బ్రాహ్మణ నూనుఁడ నీవు నీకు దో,ర్బలమున నేమి కార ణము బాఁపనపోటుమ గప్పుకాటుమం, గలదె ధరిత్రి విక్ర ౪ ౬౩

కి. నా బాహుబలిమి కోర్వఁగ, నీ బల మది యెంత త్రుంతు నెతి నీక్షణమే, నా బలిమి నేల పెనఁగం,గా బాఁపనపోటు కప్పు కాటుం గలదే. రుక్మాం ౫. ౨౨

జ. బాఁపత, బాఁపనక్క, బాఁపనచీమ, బాఁపనమ్మ, బాఁపనయ్య, బాఁపనుఁడు, బాఁపతికము.

బాఁపనక్క. వి (బాఁపన + అక్క) బ్రాహ్మణ స్త్రీ, పాఱుత. (శ ర.)

(వ్యవ) బాఁపనక్కలు స్నానమునకుఁ బోవు
చున్నారు

**బాఁపనచీమ.** వి (√ బాఁపన) బ్రాహ్మ వృత్తు
ములయందుండు గోరోజనపు వర్ణము గల యొక
జాతి పెద్దచీమ (శ ర)

**బాఁపనమ్మ.** వి (బాఁపన + అమ్మ) బ్రాహ్మణ
స్త్రీ పాఱుతి

తే మున్న పురుషునిఁ జెడనాడు మగుచ మీఁదఁ
బోయి పులిగాని పురు వయి పుట్టు ననుచు
బాఁపనమ్మలు చెప్పిన పాట చేసె
యనుచు శుక ౩ ౧౪౫

**బాఁపనయ్య** = బాఁపనుఁడు, బాఁపఁడు,
బాఁడు. వి (బాఁపన + అయ్య) బ్రాహ్మ
ణుఁడు పాఱుఁడు

గీ అపుర మెచ్చితి నో బాఁపనయ్య నిన్ను
వారిజ ౪ ౨౯

ఆ బాఁపనయ్య యొసఁగు బాఁపనయ్యల కగ్ర
హారవార సార భూరి గంధసార రత్నాంబర
మాన్యమాన తతులు మహిని వెలయ
సానందో ౧ ౨౯

ఆ అంతఁ బెద్ద బాఁపనయ్యల యానతి బడిసి
అచ్చ రా బాల ౧౯౨

**బాఁపనుఁడు** = బాఁపఁడు. వి బ్రాహ్మణుఁడు
పాఱుఁడు

సీ అమరును విప్రుండు పాఱుఁడు బాఁపఁడు
బాఁపనుండు గీ పుడమి వేల్పన
ఆం భా ౨ ౧౪౦

**బాఁపతీకము.** వి (బాఁపన + తీకము) బ్రాహ్మ
ణ్యము

గీ బ్రాహ్మణ్యము తనరారు బాఁపరికమన
ఆం భా ౨ ౧౪౧

**బాకి.** విణ విస్తృతము విశాలము పెడఁద

చ అతిసాధు మునీంద్రుఁడు వోలె నేత్రముల్
దెఱచె బాకినోరు పెదలించె దైకుశ
పట్టు నంచు భాగ ౯ ౨౦౪

త్ర్య ఎసఁగిన బాకినో రంతయుఁ జెఱచి
త్ర్య. కాళ్ళ ౮ ౧౯౫౧ పం

సీ బాకి కాఁ మనరాదు పగ పొటి వెదకించు
కొంటె పల్లనరాదు కంటగించు
శుక ౩ ౨౧

వి (= బాకీ) అప్పు ఋణము (శ ర)

జ బాకినోటిమెకము

**బాకినోటిమెకము.** వి (బాకి + నోరు +
మెకము) పంచాస్యము సింహము
(శ ర బ్రా)

**బాకీ** = బాకి. వి (క బాకీ త బాకీ హిం
బాకీ) అప్పు ఋణము

సీ పైక మీఁజాలక బాకీ టకాయించి యొఱ
గొడ్డములఁ బల్కు చుండినాఁడు
రంగా ౨ ౧౩౧

**బాగగు.** అ క్రి (బాగు + అగు) ౧ ఒప్పు
రమ్యమగు

సీ ఇంతి సంపెఁగచెంత నెంత బాఁగాయెఁ
జేమంతిబంతులు వింతకాంతి నెరసి
దశా ౩ ౮

గీ వయసువాఁడు న మిగుల బాగయినవాఁడు
నన్నిట నొయారియై యుండునట్టివాఁడు
సారంగ ౨ ౯

౨ సెలవేఱు

గీ అన్నఁ గరకూలమునఁ గూర్చి నమఁ
డతఁడు నడఁగఁ దనకూలములన బాగయ్యెఁ
బనులు కవి ౫ ౯౫

**బాగడము.** వి కట్టడము

ఉ చందురు రాతి బాగడపు జంట బవంతి
విజ వి ౩ ౧౮౮

**బాగము(గా)లు = బాగలు.** వి బ (సం భాగ
క బాగ త పాక్కు) పోఁకచెక్కలు
వక్కలు

గీ వండుటాకులు కపురంపు బాగములును
ముత్తియపు సున్నము లవంగములును
కవిరా. ౫ ౧౮౪

గీ. లీల జేసన్న బరతి బాగాలు గులికి, యుక్త
యుకు బెట్టి చుట్టి యా కిచ్చి యిచ్చి ..
విక్ర. ౭. ౯౭.

సీ. బాగాలు జెస కొక్కు పద్మాక్షి యొసఁ
గిన . మనుచ. ౩. ౭౭.

క. సోగ లగు కెండి కేకుల, లాగునఁ దల
నాకు మడిఁచి లలనఁ యొసంగన్, బాగాలు
జేసికొని తన, బాగా లున్నట్టి మడ పళ్లెము
శేఁగన్. సారంగ. ౨. ౧౯౪

సీ. పూగభాగమ్ములు పొలుచు బాగాలన
అం భా. ౨ ౧౭౭

బాగరి. విణ. (బాగు + అరి) సుందరుఁడు, అందగాఁడు, సుందరి, అందకత్తె

ఉ. తెల్లని దీవికమ్మి తెలదేఁటివలెన్ దగు
సొక్కు బాగరిన్, పాల్కడలి యిల్లట
పల్లునిఁగాంచిరయ్యెడన్ రామా ౩ ౪౪

గీ. నాగరకముద్ర గల మంచి బాగరి యఁట, నాగ
వాసములో వింతనటనల దఁట, కులుకు
గుబ్బలప్రాయంపుఁ గోమలి యఁట, వలచి
వలపింపదే యెంతవాని నైన
విజ వి ౧ ౧౧౦

బాగలు = బాగములు. చూ కపురము

బాగిలించు. అ క్రి (క. బాగిల్ = వాకిలి, ద్వారము) బయటఁబడు, వెలుపడు.

ద. నగరంబు వెలువడి వచ్చినయది మొదలు
ఎందుఁ బాతిపోయెదు నాశారిం బడితి
వింక బాగిలింపక యుంగిలించిన విడుతు నే .
దశా ౭ ౪౭

బాగు. వి. (కం బగు, త పొంగు) ౧ ఒప్పిదము, సౌందర్యము, సొగసు.

గీ. పసిఁడిచంపక దామంబు బాగుఁ గూర్చి, వాలు
క్రొన్నెల చెలువున వాఁడిదీర్చి...
భాగ ౭. ౨౭౭.

సీ. బలుపోయుగంపుఁగోలఁడు, నాఁగ నలు
తొందు నయ్యెలనాఁగబాగుఁబొగడ నలవి
యౌ పలుకుల పొలఁతి యైన. నీలా. ౨. ౧౭.

౨. విధము, రీతి

ఆ. అలిగి బతుఁడు, ఏనిభాగు చూడ జేయుంచు
డావిన, తరువుఁ జెతికి కొనుచుఁ దాఁడు
దంచె భార. అది ౭. ౧౯౨.

సీ. నిగిడి పూఁతెంకుబాగుగఁ గత్తరించినగడ్డంబు
కొన రొమ్ముఁ గమ్మిరింప, హైష. ౬ ౯౩
ఉ. రా ౩ ౧౦౩.

౩ క్షేమము (వ్య)
(వ్యవ) మావా రందఱును బాగున్నారు

౪ ఆరోగ్యము

చ బడిబడిఁ గూరలే మనుచు వచ్చు సువారకు
వారిఁ జూచి నా, యొడలికి బాగు లేదు మతి
యొక్కటి యొల్లను పార్వ. ౨ ౯౯.

౫. భద్రము, శుభము

సీ మంచి మేల్ బాగు లెస్స యన శుభంబు
లలరు సాం ని మాన ౩౩

చూ బాగుపడు

విణ ౧ చక్కనిది, సొగసైనది

క. సోగు లగు కెండి కేకుల, లాగునఁ దలనాకు
మడిఁచి లలన యొసంగన్, బాగాలు జేసి
కొని తన, బాగాలున్నట్టి మడ పళ్లెము
శేఁగన్ సారంగ. ౨. ౧౯౪.

౨. యుక్తము, తగినది

గీ బహుకథా సంగతులు సేయ బాగుగాదు ...
కాశీ. ౧. ౬౯.

సీ దట్టంబు నీకట్టినట్టి చెంగావికి బాగు గావని
కేలఁ బయుఁట నిమిరె మనుచ. ౭. ౭.

క వేగ నరేంద్రుఁడు రాకే, బాగా యిటు
చనఁగ .. సారంగ. ౨. ౨౬.

౩. శుద్ధము, పరిశుద్ధము. చూ. బాగుచేయు.
బాగుపడఁ జెచ్చు, పరిశుద్ధము సేయు.

సీ. చందురు ననుఁగాంతికం దేర్చి కూర్చి బాగు
పడఁ దెచ్చినయట్లు కొమరు మిగిలి ...
భార. విరా ౨. ౫౨.

జ. బాగరు, బాగరి, బాగుచేయు, బాగుపడు, బాగులాఁడి.

**బాగుచేయు.** స క్రి (బాగు + చేయు) చక్కఁ బఱచు (శ ర త్నా)

(వ్యవ) నిర్భాగ్యుని బాగుచేయువాఁడు లేఁడు

ఆ వియ్యము బాగుచేయును

**బాగుదార.** వి చూరకత్తి చిన్నకత్తి ఆయుధ విశేషము

చ నూతన పలాశసుమంబను బాగుదారచేఁ జలమున నయ్యతిన్ వణఁక సారససాయక వీరుఁ డంతటన్ చంద్రి ౨ ౧౪

గీ బాగుదారన వల్పాని పరగు

ఆం భా ౨ ౨౧౪

సీ బాకుపెట్టినయట్టి బాగుదార్లరుమాలు తెగ వైచి తెగ వొరల్ పేయువారు

మల్లు ౨ ౪

**బాగుపడు.** అ క్రి (బాగు + పడు) భద్రము నొందు మేలొందు

ఆ ద్రోహబుద్ధినైన దొంగతనమునైన సటలనైన సాహసమునసైన సంప దధికుచేత సాధించి ధనమును ఒడుగు చిచ్చి బాగుపడును వేమ

వేమ ౩ ౧౩౭

**బాగులాఁడి.** విశే (బాగులు + ఆఁడి) అందకత్తె సుందరి

చ అసుదుసుర్రై యలంతి నడు మల్లలనాడఁగ ముందుముందుగా నొసఁవరి బాగులాఁడి యవు డొక్కతె వచ్చి సారంగ ౧ ౩౯

**బాగెము.** వి (సం భాగ్యమ్) సుకృతము పుణ్యము

గీ రాజ గాఁడమ్మ కంబము రాయఁ డితని వేసమున మేలు బాగెము నేసియుంట నిపుడు గమఁగొంటి మని పల్కి నెఱుఁగు దొరలు యయా ౧ ౧౨౦

ఉ సంతాపము రానిదేవు నిరతంబును వేసట లేని ప్రాపు నా పాపముతీరఁ బావు కల బాగెపు నెమ్మది కోపు బూమిలో, వైపువ నీకె గాక వెఱవారికి లేదుగదా ధరామురా ప్రబంధ ౪ ౨౯

**బాగోతి** = భాగవతుఁడు (సం భాగవతః కృష్ణుఁడు మొదలగువారి వేషము వేసికొని యాడి జీవించువాఁడు)

ఉ బాగోతుల బచ్చిగాని కోక కొంచె మనంగ గృహంబు చేయమిన్

క్రీడా పీఠి ౭౯ పా

**బాజాలు.** = బజాలు. వి (సం ప్రసారః హిం బాజార్ క బాజారు) ఇది చి ని క ర లలో శకటరేఫముగా గ్రహింపఁబడినది నిర్ధారకప్రయోగములు లేవు అంగడివీధి విపణి

క పూజారివారికోడలు తా జాఱఁగ విందజాతి దబ్బునఁ ఒడిరెయిన్ మైజాఱు కొంగు దడిసిన బాజాలో తిరిగి చూచి పక్కున నవ్వెన్ వీధి ౧౮

సీ కూరగాయల కంచుఁ గోరి తా బాజాలు కును మఱిమఱి తేఁగుఁ గొమరుతోడ

హంస ౧ ౨౧౮

వి అంగడి బాజాలనంగ విపణి పొల్చు

పా ని మాన ౪౪

**బాజా.** వి (క బాజా) ౧ శ్రేణి వరుస

క తేజేరాతాబాబా తె గ జగి నొగిఁ దగిడి నెగడఁగాఁ జానెడు మే త్తె జానెడు కుత్తుక గల తేజేకున్ అచ్చ రా ౪౮ ౨౬

సీ కొట్టి తోలఁగ నీకు గోవృషభంబుల బాజా గాదు గురాలఁబోఁటగాని వి౦ నార ౧౫

వ ప్రమూనరాజాల రాజిలి బాజాలగు జాజులు బోదులు చేయుచు

భార్గవపురాణము ౫ ౧౨౫

౨ గృహపార్శ్వములయందు దమర్చుడు పొడువైన దారువిశేషము పొడుగైన లావుగల కఱ్ఱలు (ఇది మాలముకంటె సన్నముగా నుండును)

(వ్యవ) ఈ యింటికి మంచి బాజా లమర్చినారు

**బాజాబందు.** వి (సం భుజబంధః, క బాజా బందు త పాకిబందు) సందిటఁ గట్టుకొను భూషణము

సీ పులిగోరు తాళి పచ్చల బొజ్జబందు నిద్దా
మెల్కొడాని జల్తారుపాగ వేణు ౫౯

సీ కంకణంబులు మూడిగా ల్బొజ్జబందులు
కేయూరహారముల్ కీలి నరులు
కృష్ణాభ్యుదయము ౩ ఆ శ ర

**బాట** వి (సం వాటః క వ టె త వ టె హిం భాట్) ౧ విశాలమార్గము బండిదారి దారి

సీ కోయిల రొదసేయ గూయదే కకంబు
దంతి వచ్చినబాట గుంత రా
రామలిం ౧ ౩౫

సీ బాట యనంగను బండి వాటన దగు ఘంటా
పథము ఆం భా ౨ ౯

సీ బాట నాదిక్కు త్రోవయుం జెలంగు
ఆం భా ౩ ౪౩

౨ దిక్కు ప్రదేశము

సీ ఒకవాటనాఖేట కలాటవిక కూట మొక
వాట వనఘోటకకుల ఝూటము
ప్రబంధ ౪౫

జ వాటసారి

**బాటసారి** విణ (√బాట) త్రోవ నడచువాడు తెరువరి థికుడు (చి ని శ ర)

ఉ అత్తఱి బాటసార్లు పరపైన భువిం బడు
వారి నెత్తురున్మత్తగజంబు గన్న గరివన్
శుక ౨ ౧౪

**బాడతి** వి (హిం భాడా అద్దె వెల) వేశ్య కిచ్చెడు రొక్కము చూ బాడతికాఁడు

౨ బాడతికాఁడు

**బాడతికాఁడు** విణ (బాడతి + కాడు బ బాడతికాఱు బాడతికాండ్రు) విటుడు

వ ఎడకోఱ కడసాచ్చి చిల్లరక్రొంబు లాడుచు
లోకాల లాడకాడం ఒలికి లగ కోకాలలు
గాన బాడతికాఱ బజ్జగించుచు
కు సం ౨ ౧౩౬

**బాడ(వ)బుఁడు** సం వి అ పుం బ్రాహ్మణుఁడు

**బాడవ(బ)ము** ౧ ఆఁడుగుఱ్ఱముల సముదాయము

౨ ఔర్వాగ్ని బడబానలము

**బాడవేయులు** సం వి అ పుం ద్వి అశ్వినీ కుమారులు

**బాడవ్య(బ్య)ము** సం వి అ న బ్రాహ్మణ సముదాయము

**బాడాసువు** సం వి ఉ స్త్రీ బాడిస (శ ర)

**బాడింగనము** సం వి అ పుం వార్తాకి ములక ?

**బాడిగె** వి (సం భాటకః ప్రా భాడఅ క బాడిగె త వాడహై) ౧ ఒకరి దొకని సొత్తు నుపయోగించుకొనుటకై ఆసొత్తు గలవాని కిచ్చెడు ధనము అద్దె (శ ర)

(వ్యవ) ఆ యింటికి నెలకు ముప్పదిరూపాయలు బాడిగె

౨ జీతము

ద్వి బాడిగ నీకిచ్చి పతిభక్తి సేయు జాడ
లన్నియు నీదు సంగతి నేర్చి
ద్వి వారిశ్చ ఉ ౧౧౭౯ పం

సీ బాడిగ కూలి సంబళము జీత మనంగ వేతన
సంజ్ఞలై ఖ్యాతి జెందు
ఆం భా ౨ ౩౦౩

**బాడిత = బాడిస** వి వడ్రంగి కఱ్ఱలు చెక్కు సాధనవ (చి ని శ ర బాడితె ప్రా)

సీ చంద్రుకల మోవులను దువ్వెనలు గేదె
కొమ్ములు ప్రాతకుండలు చిన్ని బాడి
తలును చెన్న ౨ ౨౦౪

సీ కొండ జీతని సందుసందులు చక్కగా
బాడిత నటకించు బాడియండ్రు
భోజరా ౫ ౩౧౬

**బాడిదము** వి (సం పారిభద్రః) దేవదారువు ? (చి ని శ ర)

**బాడిస=బాడిత** వి వడ్రంగి కొయ్య చెక్కెడు కొఱముట్టు

సీ బాడిస వటికిన భంగిఁ గొన్నింటిఁ దుత్తుని
యలుగా చిట్టు ద్రుంచి త్రుంచి
భార విరా ౫ ౩౫

ఉ కేవల సాధనంబు లిరుగేల వహించి నటించు నమ్మహా, భావనానట్ల యుక్కుటులి బాడిస యుం గొని నీవు మామ కీ నావసథంబునన్ మెలఁగ వేం పంచ 3 ౨౪౧

గీ వర్ధినికిఁ జేరు జెలయుచుండు బాడిస యటం చనంగఁ జెవ్వందిలింగి ఆం భా ౨ ౩౦౦

బాడు. వి (క పాడు) గవుసెన ప్రావరణము ముసుఁగు

సీ బాడు పెట్టినయట్టి బాగుదార్ల రుమాలు లెగ పైచి లెగ నొరల్ సేయువారు వల్లపు ౨ ౪

సీ ప్రావరణ మాఁ ఒరదా యనంగను బాడు నాఁగ ఆం భా ౨ ౧౫౯

జ బాడుగోలు, బాడు వెటు

బాడుగోలు. విణ (వాడ + కోలు) వార్తాహరుఁడు (మానహీనుఁడు అని శ ర)

ఉ పెండెము బాడుగోలునకు భృత్యునకు న్మెడనూలు మెలత్రాడులు కుంటెనకాని కియ్యఁగన్ వాంస ౫ ౧౩౬

బాడుదల. వి (క పాడుదుపై) ఇది ఎట్టుధాతువుతో వ్యవహితము గను ఉవ్యవహితముగాను అనుప్రయుక్తమై ప్రయోగింపఁబడెడి కూరకృత్యము సాహసకృత్యము (అవమానించుట అని శ ర)

గీ బాడుదల నొండెఁ బటము పాండుతనయ ముఖ్య భార కర్ణ ౨ ౬

సీ ఛీఛీఁ బాలెడి పురుహూతు వెన్కని బాడుదలఁబట్టి నృసిం ౨ ౧౧౫

చ కడిఁది మగంటిమిం దొడరి కయ్యమునం దవ బాహుదర్ప మేర్పడ నమరేంద్రు బాడుదలఁబట్టినరావణి భా రా యు ౪౪౪

బాడువ = బడువ. వి (క పాలి) పల్లపుసేల.

వ మిన్నేటి బాడువల జొన్నెలపుల్లలు సెమ్మి బోఁదెలు బెదర రొద లొదవ బ్రోయు పోతుపేసుంగులును అచ్చ భా 3 ౩౬

గీ ధగణి విస్తారనిమ్నమై దనరఁజేసి, బాడు వన ఒడు వనఁగి ను ఒరగుచుండు తెం భా ౨ ౫ చ ద్ర వి 3 ౪౦

బాడుపెట్టు. స క్రి (బాడు + పెట్టు) ముసుఁగు పెటు

ఉ చే నైతు వ మా శరాసనము వే త్రోంటన్ (నూనాస్త్ర పంచకముం దాపున బాడు ట్టి టు లెంచ న్మించు గొజ్జంగియున్ గొ్గి గుసుజాపరుంజా జెలయ న్మారుండు ధేయం చనని శుకఘోటిం గుదెఁ దట్టి మీాటె వడిగా సుత్రాము మోసాలకున్ పార్వ ౨ ౧౧౪

బాఁ వి బురద పంకము (శ ర బ్రా బాడి-వాడుకి)

బాంయము. సం విణ (అ ఆ అ) ౧ దృఢము ౨ మిక్కిలి అధికము 3 గట్టి(ధ్వని)

బాణ సం వి ఆ స్త్రీ ౧ శరపుంఖము బాణము పింజ ౨ నీలఝింటి నల్లగోరంట కీ 3 సరస్వతి

బాణకారి. వి బాణసంచులు కాల్చువాఁడు

౧ చిత్రవిచిత్రగులు గాఁ జూపుచు భాణ కాగులు మందలి నడుమ హంస 3 ౨౯

బాణగంగ. సం వి ఆ స్త్రీ (రావణుని బాణము చే నిర్మితమగు) ఒక నది

బాణజత్తు సం వి త్ పుం విష్ణువు

బాణధి సం వి ఇ పుం అంపపొది

బాణపాతము. సం వి అ పుం ౧ అమ్ముల యేటుదూరము ౨ అమ్ము పోవు మేర

బాణపుంఖ. సం వి ఆ స్త్రీ శరపుంఖ, వెంపలి కీ

బాణపుంజివ్వ. వి (బాణము + చివ్వ) ఒకవిధమగు బాణసంచు

వ పెట్లుఁ గ్రోవుల పెటపెటలు, జబురు జంగుల ఢిరంగుల ఢిమఢిమలు, ధమామీాల ధమధమలు, బాణపుఁజివ్వల జిలజిలలు కృష్ణ 3 ౨౯

బాణము. వి ఒకవిధమగు ఫిరంగి (దీనికి వృత్తిని ముబర్ణలోపము చూ బాణవిద్దె మొ)

గీ బాణములఁ జివ్వలుసించిన బాణములను గ్రోవు
లను గుంటగ్రోవుల    రా వి ౫ ౨౨

గీ సురగ్రోవి పిరంగి బాణము గుంటగ్రోవి
జబురుజంగి తుపాకి బజాయి నాఁగ నెలయు
నగ్ని ప్రసారణాఖ్యలు మహేశ
అం భా ౨ ౨౧౮

దయ్యపుబాణసరిచిల్కు — తామిస్రాస్త్రము

సీ సరగ దయ్యపుబాణసరిచిల్కు దొరఁగించి
ఒగలఁ గూరుచు ముల్కినొగుల జేసి
చంద్రా ౬ ౯౦

జ బాణపుఁ జివ్వ బాణవిద్దె బాణసంచు

బాణము. సం వి అ పుం ౧ అమ్ము శరము ౨ గురి లక్ష్యము ౩ బాణముచివర ౪ ఎఱ శరపుంఖము ౫ అవుపాదుగు ౬ అయిదు అనుటకు సంకేతనామము ౭ శబ్దము ౮ వాక్యము ౯ అగ్ని ౧౦ నీలఝుంటి నల్ల గోరింట ౧౧

బాణముద్ర. సం వి అ స్త్రీ ముద్రాభేదము

శ్లో యథా హస్తగతా బాణా స్తథా వాస్తాం
కురం ప్రియే బాణముద్రా సమాఖ్యాత
రిపువర్గ నికృంతనీ (వాచ)

బాణలి. వి (క పాణలె త పాణలి) వేఁచుట మొదలగువాని కుపయోగించు లోహపాత్ర విశేషము

పీ కంచువు బాణలి కంచు కంటనఁ దగు
అం భా ౨ ౨౪౩

బాణవారము. సం వి అ పుం వారబాణము కవచము

బాణవిద్దె. వి (బాణము + విద్దె) బాణసంచు బాణసంచులు కాల్చు విద్య

వ చక్ర బిరుసులఁ బంచవన్నె బిరుసులు
గజ బిరుసులు మొదలయిన బాణవిద్దెల
పైఖరులు చిత్ర విచిత్రముగాఁ జూపుచు
బాణకారులు ముందఱ నడువ హంస
౩ ౨౯ (బాణవిద్య ముద్రిపా)

బాణసంచు. = బాణవిద్దె వి (బాణము + సంచు) తుపాకిమందుతోఁ జేసి వేడుకకుఁ గాల్చెడు బాణవత్తులు చిచ్చుబుడ్లు లోనగునవి
(వ్యవ) ఈ సంవత్సరము దీపావళికి బాణసంచు చాల తక్కువ

బాణా. వి (త పాణ త్తడి) దండాయుధము

గీ గడలు బాణా ల్పటాలు నగ్గలికఁ బూని
సగివడల్ ద్రొక్కొనుచు నిబ్బరపు బీర
ములు గనంబడ ఎ మరల్ మ్రోలఁ జెలఁగి
సాధన లొనర్ప    రసిక ౧ ౭౧

జ బాణకత్తి బాణవకిణి

బాణాకత్తి. వి (బాణా + కత్తి) ఆయుధవిశేషము పొడగుపాటకత్తి

క మనసీఁడు మెఱుఁగుఁ జాయల నన
బాణకత్తి దుసుమునం బఱపెంచెన్
భోజసుతా ౩ ౫౫

సీ ఇట్లుండు శక్తివహించు గుహుం డన్న సరణి
బాణకత్తి చాఁచి చాఁచి
౧ సు ౨ ౨౧

బాణావంకిణి వి (బాణా + వంకిణి) దండాయుధమువంటి బాఁకు బాణకత్తి

శా బాణావంకిణి బెద్దకత్తి గుమితిన్ బాణా
సన ప్రౌఢిమన్ ద్రోణాచార్యుల కైనఁ
జక్కుదురు నేర్పుల్    శశాం ౨ ౧౪

బాణావలి. సం వి ఇ ఈ స్త్రీ ౧ బాణముల పంక్తి ౨ ఏకవాక్యముగ నున్న యైదుపద్యముల వరుస (విల్యమ్సు)

బాణాశ్రయము. సం వి అ పుం ౧ అమ్ముల పొది ౨ ధనుస్సు విల్లు

బాణాసనము సం వి అ న విల్లు ధనుస్సు

బా(వా)ణిని. సం వి ఈ స్త్రీ ౧ విదగ్ధరాలు ౨ నర్తకి ౩ ఉత్తమస్త్రీ (హే ని)

బాణుఁడు. సం వి అ పుం ౧ ఒకానొక రాక్షసుఁడు ౨ కాదంబర్యాది గ్రంథకర్త

**బాతలిం(ళిం)చు.** అ క్రి ౧ బ్రద్దలగు

సీ దీర్ఘ కంఠకఠోర ఘూర్ఘురస్వనమునఁ బాతాళ
గోళంబు బాతలింప    శివరా ౧ ౬౧

౨ అలచు కొంటువెట్టు

ద్వి తాతాత తామాత యనుచు మోచేతు
లాఁతగా వెనుకకు నొఱఁగి కాలిత్రొఁబడి
పాటుకొని గుండె బలువిడి నదరి పడఁగ
వెలుంగని బాతళింపఁగను    నవ ౩
౧౫౬ పా (తత్తరపడు అని శ ర)

౩ సంభ్రమించు తత్తరపడు

గీ శేఁటిఁ బొడగని వెస బాతళించువారు నైన
మునులను జూచి హస్తాబ్జ మెత్తి వెలి
పుడుగుఁ డోడ కుండుఁడు వెడలుఁ డనుచు
వంచితాలాపముల భీతి నపనయించి
పి కళుం ౩ ౧౦౫

చ తపసుల్ ధరణిం బడి బాతళింపఁగా
వరాహ ౫ ౧౧౨

**బాతి.** వి (సం భక్తిః)(సానుస్వారమని శ ర)

౧ ప్రీతి ఇష్టము ఇంపు

క అతఁడు కాలాంతరమున బాతిగ భవదీయ
భవ్య పరలోకవిధుల్ చేతోగతి భక్తి పరి
స్ఫీతములుగఁ జేయు    భార మా ౧౨౦

ఉ బాతిగఁ జైకొన వ్వలయు    పెద్దగ
చాటువు

౨ శ్రద్ధ జాగరూకత

క ప్రాతఃకాలము సనియెడు బాతిగ సంధ్యాది
విధులు పరిపాటిగ నీ వాతత మతిఁ జేయుము
భా రా బాల ౩౩౪

క పాతాళలోక మంతయు బాతిగ శోధించి
హయము బరికించి
భా రా బాల ౪౦౪

క అని బాఁతి బాతిపెట్టిన పెనుఁ బాఁతవరాల
సోలఁ బెకలించి ఘనస్తని కిచ్చి
కేం పంచ ౪ ౫౦౧

౩ రీతి విధము

ద్వి పిఁ జేమిబాతి నీకలఁదిఁ కేహూర్చు
(రం రా కిష్కిం చి ని)

**బాతు¹(వు)** వి జలపక్షివిశేషము అడేలు

గీ బాతవంగ నగు కరారి
అం భా ౨ ౯౩

మ తలఁ బక్షచ్ఛట గ్రుచ్చి బాతువులు కేదా
రంపుఁ గుల్యాంతర స్థలి నిద్రింపఁగ
ఆము ౧ ౬౫

**బాతు².** వి (హిం భాత్) అన్నము

సీ పసదనము బాతు సాద మోగిర మన
జరుగు నన్నము పేళ్లు
సాం ని మాన ౨౨

**బాద.** వి (సం బాధా) వేదన నొప్పి బాధ

గీ వవట యంగలారుపు వెత వంత గోడు బాద
యంగద వగ పనఁ బరగుఁ బీడ
సాం ని మాన ౩౩

సీ బాద వెగులు నొవ్వి వందురు అవంగిఁ
జను వ్యథ    అం భా ౧ ౧౫౦

**బాదము = బాదాము.** వి (సం బాదామ్ క బాదామి త వాదామరం హిం వాందామ్) ఫలవృక్షవిశేషము (దీని గింజల లోని పప్పును భక్షింతురు శ ర)

**బాదరము = బాదరు** (శ ర)

**బాదరము** ౧ విణ (అ ఈ అ) ౧ బదర సంబంధి బదరవృక్షము - రేఁగు చెట్టునకు సంబంధించినది ౨ ప్రత్తిగి నూలిది నూలితో నేయ బడినది వి అ పుం ౧ ప్రత్తిచెట్టు కార్పాసము కీ ప అ న ౧ రేఁగుచెట్టు ౨ పట్టు ౩ జలము ౪ నూలివస్త్రము నూలి పోగు ౫ దక్షిణావర్తమగు శంఖము కుడి వైపుగా సుడిచుట్టియున్న సంకువు ౬ ఫాలము వి అ స్త్రీ ప్రత్తిచెట్టు కార్పాసవృక్షము

**బాదరాయణసంబంధము.** సం వి అ పుం లేనిపోని దూరాకృష్టమగు సంబంధము

శ్లో యుష్మాకం బదరచక్ర మస్మాకం బదరీ తరుః బాదరాయణ సంబంధో యూయం యూయం వయం వయమ్ చాటువు

-రాయణి సం వి ఇ పుం శుకుఁడు

-రాయణుఁడు సం వి అ పుం ౧ వ్యాస ముని ౨ తెత్తివాఁడు ౩ నిష్ప్రయోజకుఁడైన పురుషుఁడు (శ ర)

-రించు అ క్రి (√ బాదరు) ప్రతిఘటించు

క నిస్సాణములు మ్రోఁతి వీఁగి మట్టి మురారి పాంచజన్యమ్ముతో బాదరింప ఉ హరి ౫ ౬౦ (ఇట బౌమ్యద్యోతకము)

క మొలకమీఁకటిఁ గ్రాలు ముత్యాలరాశి ధనిన్గపు బొట్టుతో బాదరింప కాశీ ౩ ౨౪౦ (ఇటను బౌమ్యద్యోతకము)

-రు=బాదరము వి (క బాదర = ప్రత్తి) తుపాకిలో జానకి త్రాఁ డుంచెడుతావు

సీ బాదరు నాఁగను బరగుఁ దుపాకిలోపలను జానకి త్రాఁడు నిలుపు తావు

ఆం భా ౨ ౨౧౯

జ బాదరించు

-దామము. సం వి అ న బాదముకాయ (శ ర)

-దాము = బాదము (శ ర)

-ధ సం వి ఆ స్త్రీ బాసము

-ధకము సం విణ (అ ఆ అ) ౧ బాధించునది పీడించునది వి అ పుం ఋతుకాలమందు బిడ్డలు పుట్టుశక్తి నడ్డగించు స్త్రీరోగవిశేషము

-ధనము. సం విణ (అ ఈ అ) ౧ బాధించునది పీడించునది ౨ నిషేధించునది అడ్డగించునది వి అ న ౧ పీడ కాఁతియ ౨ రద్దు ౩ తోలఁగఁబుచ్చుట నివారణము ౪ నిషేధము నిరాకరించుట ౫ ప్రతిబంధము అడ్డగించుట

-ధము. సం వి అ పుం ౧ పీడనము కాఁతియ ౨ కొందలము, దుఃఖము ౩ ఎగ్గు, హాని ౪ అపాయము ౫ ప్రతిషేధము, నిషేధము ౬ ప్రతిబంధము అడ్డు ౭ (న్యాయ) సాధ్యాభావము గలది (వహ్న్యనుమితియందు వహ్న్యభావము గల హ్రదము బాధము ఇది హేత్వాభాసములలో నొకటి)

బాధించు సం స క్రి బాధపెట్టు

శా ధనాదానసం ధాపారుష్యముతోడ సాధుజనులం బాధించె రక్తాంగకుం డే పాపాత్ముఁడు నీ పితామహుఁడు సుమిత్రా వంశవిస్తారకా వరాహ ౨ ౯౫

బాధితము సం విణ (అ ఆ అ) ౧ పీడితము నొప్పింపఁబడినది ౨ కష్టపెట్టఁబడినది ౩ అడ్డగింపఁబడినది ప్రతిబద్ధము ౪ నిషేధింపబడినది ౫ త్రోసిపుచ్చఁబడినది నిరాకృతము ౬ ఖండింపఁబడినది ౭ (న్యాయ) సాధ్యాభావవత్పక్షము గలది (ఉదా వహ్ని అనుష్ణము)

బాధిర్యము. సం వి అ న చెవుడు

బాధ్యత. సం వి ఆ స్త్రీ ౧ బాధ్యత్వము ౨ పూచీ

బాధ్యము. సం విణ (అ ఆ అ) ౧ నొప్పింపఁదగినది బాధింపఁదగినది ౨ నిషేధింపఁదగినది ౩ నిరాకరింపఁదగినది రద్దుసేయఁదగినది

బాన. వి (సం భాండః ప్రా బాణమ్ క బాన త పానై) ౧ కడవ పెద్దకుండ

సీ తతముఖ భాండాఖ్య తనరు బాన

ఆం భా ౨ ౨౪౬

మ కడు నుద్యన్మానవిచ్ఛేదనం, బిది పూరింపఁగరాని బాన నరునే రుచీకులం ద్రిప్పఁ జాలదు వల్ల హై ౨౨

మ ఘనసూచీముఖ కూచకాగ్ర ధవళాంగ స్థూల రోమాళి దుస్సిన బ్రహ్మాండము కూండ్ల బానవలె భాసిల్లఁగ

దశా ౩ ౧౫౩ పాంచాలీ ౫ ౭౫

౨ ఎతపు కడవ (శ ర)

జ బానగిలు

**బానగిలు(ల్లు).** అ క్రి (√ బాన) బలాత్కృతముగు బలవంతముగ లాగఁబడినదగు

ఉ పూనినరీతి వాని తలఁపు ల్వడిఁ బ్రాసములుం
జలంబునం బానగిలంగి నీడ్చి యొకపద్యముఁ
గూర్పఁగవచ్చుఁ గాక యాఖ్యాన కథాను
కూలముగఁ గావ్యముఁ జెప్ప వశంబె
ద్వా ౧ ౨౦

**బానసము.** వి (సం మహానసః కి బాణసు)

౧ వంటశాల

సీ శివుఁ డాత్మసుతు నభిషేకింబు సేయుడు
దిగధీశు లంతన ధిక్కరించి పనులడ్గరాఁడ
జంభారి బానసమున కనలుండు రాఁడ
కు సం ౧౦ ౫౫౫

ఆ ధూమిని నవమాన పఱచి యునిచెఁ గుక్క
బానసమున దశకు ౧౦ ౧౦౧

ఉ శౌరి కరాసిధారచేఁ ఎచ్చడిచేయఁగా
జముని బానసముం బుడుడించు చోటికిన్
ఉ హరి ౪ ౧౯౬

౨ వంట

శా నీ చిత్తంబునవ్ మెచ్చునట్లే వండం గడు
నేర్త బానసమునం దిచ్చోటనే కాదు నన్నే
వీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁడు
భార విరా ౧ ౨౧౭

గీ హరియు మాహిష్మతీ పురి కరుగుదెంచి
రక్షగాఁ బట్టి తిరిగెడు రాక్షసులకుఁ దోలుత
జము బానసము నింటి త్రోవఁ జూపి
ఉ హర ౧ ౧౩౯

**బానసమువాఁడు** = వంటవాఁడు

వ ఆ కల్మాషపాదు నొక్కనాఁ డొక్క
బ్రాహ్మణుం డధిక క్షుధార్తుండై వచ్చి
సమాంసంబయిన భోజనంబడిగిన నిచ్చిపోయి
వాఁ డంతఃపురంబున నుండి మఱచి యర్థ
రాత్రంబు నప్పుడు దలంచి తన బానసంబు
వానిం బిలిచి భార ఆది ౭ ౧౧౪

**బానసపుబాడబుఁడు** = వంటబ్రాహ్మణుఁడు

గీ తెచ్చి యొక హైన్యవుఁడు గాను కిచ్చె ననుచు
బానసపు బాడబులచేతఁ బంపుటయున్న
ఆము ౪ ౧౯౬

జ బానసీఁడు

**బానసీఁడు.** వి (బానసము + ఈఁడు కి బాసిగ) వంటవాఁడు వల్లవుఁడు

ఉ నన్నిమిఱఁగ బానవీని నొకనిం బుఱిఁగానః
యట్లుగాఁగ మేన్ గాఁచియునెట్టి ద్రౌ
నొడిక్షంబుగ వందుదు నెల్లవారలున్
భార విరా ౧ ౪౪

**బానిస.** వి దాసి

గీ దాసి యొవ్వ బానిసయనంగఁ దత్త
ఆం భా ౨ ౨౯౭

చ బంటుబానిసలు వైవు పెయ్యలు నే
చెట్లులో నయిన సమస్త సంపదలు నన్న
వితీర్ణికి జెచ్చుపెట్టఁగా కళా ౬ ౭౭

క అవ్వారాంగనబానిస ముప్పురు నీల్గటక
దాన మూలంబనుచున్ విక్ర ౬ ౧౩౦

**బానిసము.** వి దాస్యము బానిసతనము

గీ వరవుడం బనఁ బను పన బానిసమన దా
నామంబులై యుండు
ఆం భా ౨ ౨౯౭

జ బానిసీఁడు

**బానిసీఁడు.** వి (బానిసము + ఈఁడు) సేవకుఁడు భృత్యుఁడు

గీ ఫ్రాఁదోఁటకావలి బానిసీంద్రు పాల
జచ్చిరి కేఁడు అచ్చ రా సుం ౧౨౪

సీ బానిసీఁడు బంటు వరవుఁడు గుండక
నాఁగ దాసాఖ్యలు గాఁగఁ దనరు
ఆం భా ౨ ౨౯౭

ఆ కొల్వకాఁడు లెంక గుండఁడు నవుకర
బంటు జీతకాఁడు బానిసీఁడు వరవుఁ డ
భటుండు వఱలు ఆం పదా నర ౩

**బాపు = బాపురే.** అవ్య ౧ ప్రశంసార్థకము
(దీని యామ్రేడిత రూపము బాపుబాపు)

జ. బారశాల, బారాది.

బారంగి. వి. (సం. భార్గి) ఒకజాతి మందుచెట్టు, గంటుబారంగి.

గీ.. బారంగి గంటుబారంగియుఁ జఱి,శే కవఁగ భార్గి తెలియను. ఆం. భా ౨. ౫౪.

బారకము. వి. (సం. భారః) బరువు. (శ ర)

(వ్యవ.) నా యొపిలు బారకముగా నున్నది

జ' బారకించు.

బారకట్టి. వి. (బార¹ + కట్టి) బారఁడు పొడుగు కట్టి.

గీ గడ్డిబొడ్డుకలెను పేను గాసిఁంప, బారకట్టల తెఱఁగున బాహులలర, ఒనకరూగఁబుఁ జూడె వచ్చెను చం(ద్ర. వి. ౧ ౩౩

బారకాఁడి. వి. (బార¹ + కాఁడి) దున్నుటకై కోఁడెల నలవరించు కాఁడిమ్రాను. (చి ని ప్రా., శ ర)

బారకించు. అ క్రి (√ బారకము.) భారమగు, బరువగు

(వ్యవ.) వాని ఒడలు కొంచెము బారకించినది. (చి ని, శ ర.)

బారకీరము. సం విణ (అ అ అ) బారగ్రాహి. వి అ. పుం. ౧ ఒడలొనలము ౨ యూక, పేను. ౩ కేతికేథని, దుక్వాన ౪ (నీరాజిక మయిన) గుజ్జము.

బారపట్టె. వి. (బార¹ + పట్టె) స్తంభముమీఁద నడ్డముగా నమర్చెడు నిడుపాటి పట్టె. (శ ర.)

బారపోయు. స క్రి (బార¹ + పోయు) చేయి చాచునంత కొలఁది నూలుపడుకు (శ. ర.)

బారసాల. వి. (√ బార³ సం. ద్వాదశాహః. ప్రా వారసావహో, పాలీ. బారసావహో) నామకరణము అను శిశువులకు చేయు సంస్కార విశేషము. (చి. ని., శ. ర.)

బారసి. వి. (సం. ద్వాదశి ప్రా బారసీ.) ద్వాదశి, పక్షములయందుఁ బండ్రెండవ తిథి.

క. విని పిందుకదని యఘసన్న్యతి, సతి భక్తిం గొలుచు బహుజనములు కదంబాప్లకు బున్నది బారశిని పనినయందు గఁ దాన నెల్ల విభవము కలుగున్.

భార. శాం ౪. ౨౫౨.

సీ. బారసి పో నీడు పైనిద్రఁ బొంటు,శక్కులు వాడు మత్స్యశ్యాకథలఁ ద్రోయు.

అము. ౪. ౫౦.

గీ. బారసి యనంగ ద్వాదశి పరగు . .

ఆం. భా ౧. ౭౨.

బారా = బార². వి (సం. ద్వాదశ, ప్రా. బారస, హి. బారా) పండ్రెండు.

ఉ తెలయాంధ్రు ను దాసు వినోద లీల బా,రా పది దచ్చి యుత్తిగ దుగా యని పన్నిద ముగ్గడించుచున్ నిరం ౨. ౨౨

మ. . తచ్చాక చౌఠంచి యు,త్తిగ బారా దుగ యంచుఁ జిల్కు-రొద లుద్దీపింపఁ దా దవ్వు లన్ . కళా. ౩. ౧౪౧

బారాటి. వి పెట్టభూమి

గీ. చాటిపార గాక చిట్టూటచ్చోటు గాక, తెల్లి తల గాక క్రేఁకెద శ్వేదపురువు, రాతి పోటును లేని బారాటినేల . .

విప్ర. ౨ ౧౭.

బారాది. విణ (బార³ + ఆది) ౧. అనేకములు.

క బారాది సామ్ము లుండఁగ, వారకు లే కొనుచుఁ జనిరొ నండజము .

పాండు. ౪. ౨౩౨.

క. వా రిరువురు . హోరాహోరిఁగఁ బోరిరి, బారాది దినంబులు .. అము. ౩. ౧౫.

౨. మిక్కుటము, అధికము.

వ.:. ఎగుడదిగుడు బారాది యను దూరం బేగఁ బోసుచాఱించి యత్తాగ్ని బలి తెల్లం బెర తెత్తి .. మను చ. ౪. ౩౩.

బారి. వి. (సం. వారి. క బారి.) ౧. ఆలిగోలుసు; ఏనుఁగు గాలఁ గట్టెడు గొలుసు.

బాలక్రీడ. సం వి ఆ స్త్రీ బాలురయాట బాల్య వినోదము

బాలక్రీడనకము. సం వి అ న బాలురయాట బొమ్మ వి అ పుం చెండు (రాజని)

బాలక్రీడనము. సం వి అ న బాలురయాట, బాలురయాటబొమ్మ

బా(వా)లఖిల్యుఁడు. సం వి అ పుం అంగుష్ఠ మాత్రప్రమాణముగల ఋషిగణవిశేషము (వీరు సూర్యరథమునకు ముందు పోవుదురనియు అఱు వదివేవురనియుఁ జెప్పఁబడుదురు)

బాలచర్య. సం వి ఆ స్త్రీ బాలుని నడవడి

బాలచర్యుఁడు. సం వి అ పుం కార్తికేయుడు కుమారస్వామి (త్రి ని)

బాలతంత్రము. సం వి అ పుం గర్భిణీచర్య మంత్రపానీకనము (త్రి ని)

బాలతనయము. సం వి అ పుం ఖదిరము చంద్ర ‡

బాలతృణము. సం వి అ న శష్పము లేత కసవు ‡

బాలదలకము. సం వి అ న ఖదిరము చంద్ర ‡

బా(వా)లధి. సం వి ఇ పుం వెండ్రుకలుగల తోఁక

బాలపత్త్రము. సం వి అ పుం ౧ యువా సము తీఁటకసింద ‡ ౨ చంద్ర ‡ వి అ న క్రొత్తయాకు – ఇట్లే బాలపత్త్రికము

బాలపాశ్య. సం వి ఆ స్త్రీ ౧ చేయిచుక్క– పాపటక్రింద నుండు బంగారు లోనగువానిచే రచితముగు రేకు ౨ వెండ్రుకలను గట్టుటకుఁ గాని వానితోడఁ బెనంచి యల్లుటకుఁగాని యుపయుక్తముగు ముత్యాలసరము (విల్యమ్సు)

బాలపుష్పి. సం వి ఈ స్త్రీ యూథిక అడవి మొల్ల ‡

బాలపుష్పిక. సం వి ఆ స్త్రీ బాలపుష్పి ‡

బాలభద్రకము. సం వి అ పుం విషభేదము

బాలభైషజ్యము. సం వి అ న ౧ రసాంజనము ౨ శిశువుల యౌషధము

బాలభోజ్యము. సం వి అ పుం చణకము సెనగలు (రాజని)

బాలము. సం విశే (అ ఆ అ) ౧ శిశువు నిసుఁవు ౨ క్రొత్తగాఁ బొడమినది (బాల చంద్రుఁడు) క్రొత్తది ౩ మూరము ౪ ఎరి శుద్ధము (యజ్ఞపశువు మొ॥) వి అ పుం ౧ శిశువు నిసుఁవు ౨ ఎన్నవాఁడు పదునా ఱేండ్లలోఁబడినవాఁడు ౩ గుఱ్ఱపుపిల్ల ౪ తోఁక గుఱ్ఱపుతోఁక ఏనుఁగుతోఁక ౫ కేశము వెండ్రుక ౬ అయిదేండ్ల ఏనుఁగుపిల్ల ౭ మత్స్యభేదము ౮ వాలికేశము ‡ పుం న కురువేరు గంధద్రవ్యవిశేషము

బాలమూలము. సం వి అ న చిన్న ముల్లంగి ‡

బాలమూషిక. సం వి ఆ స్త్రీ చిట్టెలుక గిరిక

బాలయజ్ఞోపవీతకము. సం వి అ పుం పంచ కట్టము జన్నిదము (త్రి ని)

బాలరాజము. సం వి అ న వైడూర్యమణి

బాలవత్సము. సం వి అ పుం ౧ లేదూడ ౨ పావురము

బాలవము. సం వి అ పుం (జ్యోతి) కర ణములలో నొకటి

బాలవాయజము. సం వి అ పుం వైడూ ర్యము (బాలవాయపర్వతమందు పుట్టునది విదూరనగరమందు సంస్కరింపఁబడును)

బా(వా)లవాసస్సు. సం వి స న ఉన్ని వస్త్రము (కల్ప)

బాలవాహ్యము. సం వి అ పుం అడవిమేఁక

బా(వా)లవ్యజనము. సం వి అ న చామరము

బాలవ్రతుఁడు. సం వి అ పుం (మం జుఘోషుఁడను) బౌద్ధసన్యాసివిశేషుఁడు (త్రి ని)

బాలసంగడము. వి మల్లసాధనవిశేషము

సీ. తత్ప్రథనంబుల తగఁ గంటము గొలతకటి
కన లోడు సంగడము బాల,సంగడము నీతి
గోతా మసంగ.. ఆం. భా. ౨. ౨౦౪.

**బాలసంధ్య.** సం. వి. ఆ. స్త్రీ. తొలుసంజ, లేఁతసంజ.

**బాలసము.** వి. (సం. బాలిశ్య) బాలిశగుణము, మౌర్ఖ్యము.

ఉ. వలి సన్నులు నిక్కనిజాలు సూడఁ గా
బాలస మంద చిత్రరతిఁ బ్రౌఢలు గావున
సౌఖ్యభంగిఁ బాం,చాలన శైనఁ గాంత
లనిజం విడి యుట్టిది నాఁగఁ జాలునే.
కు సం. ౮ ౧౬౯

**బాలసాత్మ్యము.** సం వి. అ న. (బాలురకు సుఖమును చేయునది) క్షీరము

**బాలసూర్యము.** సం వి అ పుం. వైడూర్యము. ఇట్లే బాలసూర్యకము

**వా(వా)లహస్తము.** సం వి అ.పుం ౧ వాలధి, కెంద్రుకలు చిబుకొనియుండు తోఁక. ౨. కేశ సమూహము

**బాలాక్షి.** సం వి. ఈ. స్త్రీ. కేశపుష్పివృక్షము.

**బాలాజీ.** వి (మ. బాలాజీ) తిరుపతివెంకటేశ్వరునకు బైరాగులు వాడెడుపేరు (శ ర)

**బాలాతపము.** సం వి. అ. పుం లేయెండ.

**బాలార్కుఁడు.** సం. వి అ. పుం ౧. ఉదయ సూర్యుఁడు. ౨ కన్యారాశిస్థ సూర్యుఁడు.

**బాలి.** సం. వి ఇ న్ పుం. వాలి, సుగ్రీవుని యన్న.

**బాలిక.** సం. వి. అ. స్త్రీ ౧. బాల, నిసువు. ౨. పదునాఱేండ్లకు లోఁబడిన వయసుకల పిల్ల. ౩. కన్యక. ౪. ఇసుక. ౫. కర్ణభూషణము, చెవిబొగడ. ౬. పీఁక, పత్రకాహళ ౭. వాలుక, ఇసుక. ౮. చిట్టేలకి. శ.

**బాలిని.** సం. వి. ఈ. స్త్రీ. అశ్వినీనక్షత్రము.

**బాలిమము.** సం. వి. మ. పుం. బాల్యము.

**బాలిశము.** సం. వి. అ. న. ఉపధానము, తలగడ.

**బాలిశుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) ౧. బాలుడు, పలితనము కలవాఁడు. ౨. పిల్లవాఁడు, పిన్నవాఁడు. ౩. మూర్ఖుఁడు, మూఢుఁడు. ౪. జాగ్రత్తలేనివాఁడు. వి అ. పుం. బాలుఁడు.

**బాలీశము.** సం. వి. అ. పుం. మూత్రకృచ్ఛ్ర రోగము.

**బాలీసు.** వి (సం. బాలిశము, హిం. బాలీశ్) తలకు చేరఁబడుట కుపయోగించు దిండు, ఒరగుదిండు.

సీ బాలీసు రతనంపు కీలుబొమ్మలు చిటి చాపలు
కడఁద వింజామరములు. రసిక ౧. ౬౧

సీ పట్టెమంచంబు ను బలుపు ను బాలీసుఁ
జందుగు పెట్టెలు మందసముల.
నీలా. ౩ ౮౬.

**బాలుక.** సం వి అ స్త్రీ వాలుక

**బాలుకము.** సం వి. అ పుం పానీయామలకము. శ న ౧. ఏలావాలుకము. (గంధద్రవ్యము) ౨ కర్కటి, నాఁగుదోస, శ ౩ కర్పూరము ౪ యంత్రభేదము అ. స్త్రీ. ఇసుక, వాలుక

**బాలుకాగడము.** సం వి అ పుం. మత్స్య విశేషము

**బాలుకాత్మికా.** సం. వి. అ స్త్రీ. శర్కర, చక్కెర.

**బా(వా)లుకాప్రభ.** సం వి. అ స్త్రీ. నరక విశేషము.

**బా(వా)లుకాయంత్రము.** సం. వి. అ న. ఔషధపాకార్థమగు యంత్రభేదము, మందులు వండుట కుపయోగించు యంత్రము.

**బాలుకి.** సం. వి. ఈ. స్త్రీ. కర్కటీభేదము, నాఁగుదోస. శ (త్రి. ని.)

**బాలువు.** సం. వి. ఉ. పుం. ఏలావాలుకమను గంధద్రవ్యము.

**బాలూకము.** సం. వి. అ. పుం. విషభేదము.

**బెళుకుదేరు.** అ. క్రి. (బెళుకు + తేరు, స్వార్థమున.) తళతళ ప్రకాశించు.

సీ. ఇసుకదిన్నెల మెట్టు పసిఁడిచెంబులఁ గొట్టు పిఱుఁదుపై మొలనూలు బెళుకుదేర.

శివ. ౯. (బెళుకుఁదేరు. ముద్రి.)

**బెసబెస.** వి. త్రోయుటయందగు ధ్వనికనుకరణము.

చ. ముసుఁగిడి పండుకొమ్మనుచు మోహము తోడ వితర్దిఁ జూపి తా, నుసురను రంచు ఖిన్న యయి యొయ్యన పేఁగి కవాట మర్త్యలన్, బెసబెసఁ ద్రోచి . .

హంస. ౪. ౧౧౩

**బెసుకు.** అ. క్రి. ౧. (స్వస్థానమునుండి) తప్పు. (శ ర.)

(వ్యవ) వానికాలు బెసికినది.

౨. వికలమగు.

(వ్యవ) ఆ వ్యవహారము బెసికినది.

**బెస్త.** వి పల్లకీలోనగువానిని మోయుటచేతను, చేఁపలను పట్టుటచేతను జీవించు నొకజాతి వాఁడు, బోయీ.

సీ. భాగవాహకుఁ జేరు పరగుచుండును బెస్త మోపరి బోయఁడు బోయి నాఁగ.

ఆం. భా. ౨. ౨౭౭.

సీ తనబ్రమోల నుండు నందలము గానకి దాఁటి పేరెలుంగున బెస్తఁ జీరువారు. అము. ౪. ౩.

మ. తలిరుంగైదువురాయఁ దద్యగులపై దండెత్త నే గాలిబె,స్తలచేఁ బంపిన పండుటాకుఁ దఱటీజాబుల్ గనుంగొంచు . . .

చంద్రా. ౪. ౭౩.

**బెహారము = బేహారము.** వి. (సం. వ్యవహారః) వాణిజ్యము, క్రయవిక్రయ వ్యాపారము.

క. పెక్కం డ్రొక్కటియై తా, రొక్క బెహారంబె యాడుచుండఁగ దానం, దక్కఁగ గలిగిన వందఱు, నొక్కటిగా వసుభవించు టుచితం బెండున్.

విష్ణు. ౨. ౭౦.

క. అలము విప్రులు చేయఁగ, నాలిషతై రాజు లడఁగ నంత్యజాలు బెహా,రా లాడం గష్టపుఁ గలి,కాలంబున వర్తనములుఁ గత్తరఁ గల యున్.

వరాహ. ౯. ౧౨౫.

జ: బెహారి.

**బెహారి = బేహారి.** (√ బెహారము.) క్రయవిక్రయములు చేయువాఁడు, వణిజుఁడు.

చ. . అందటి కొక్క బెహారిచే రహ,స్యనియతి మూల్య మందుకొని యచ్ఛటికింగానిపోరొ వారలన్.

కళా. ౭. ౯౯.

## బే

**బే = అంబే.** వి. గోవాలియఱుపున కనుకరణము.

క బే యనుఁ దల్లీ నీ పెటఁ,బోరొద వసు నన్ను డించి పులివాతఁబడం, బోరొద బే యను...

భోజరా. ౭. ౪౪.

**బేగఁడా.** వి ఒకానొక రాగము.

ఉ. . ధనాసరి ఘూర్జరి పూరి బేగఁడా, యారభి రామక్రియ మొదలై తగురాగము లింపుమీఱఁగన్.

చెన్న. ౨. ౨౩౭.

**బేగడ.** వి కాకిబంగారు, అభ్రకము.

గీ ఒకరొకరి యింటిముందటి యుదిరిపనిఁడి, మేరువంతేసి రాసులై మెఱయు ననఁగఁ, దెల్లబేగడకొండ యాస్తి యగు వలకు,బేరుఁ డైన యానె యీపీటి బేరులకును

చం. రా ౩ ౫౭. (తెల్లబేగడకొండ = వెండికొండ)

వ బేగడలతోడిబిల్లలచెప్పులు తొడిగి చెంగావికాసెకోకలు కట్టుకొని

వి పు. ౩. ౧౪౩.

గీ. కాకిబంగా రవంగ బేగడ యవంగ, నభ్రకము దోఁచు

ఆం. భా. ౨. ౨౩౭.

**బేగము.** వి. (హిం. బేగమ్.) రాణి, రాజభార్య.

సీ. ప్రబలి సాహేబు సుబా యొంత దేలిన బేగంబులకుఁ గుట్టుపోఁగులేను. వేణు. ౧౪.

**బేగి = వేగి.** క్రి. విశే. (సం. వేగః) శీఘ్రముగా. (శ. ర.)

**బేషిమాలు.** విశే. (హిం. బేజామాల్) పావఁజట్టఁ బడినది, చికిలిచేయఁబడినది, ప్రయోగించుటకు సిద్ధపఱుపఁబడినది.

మ. రమణీరత్నము జగ్గల్ మీాఱు క్రొంబేజా మాల్, బమదాడిం ఒరుజెంచి
అహ. ౧ ౯౯

ఉ. అద్దమరేయిదాఁక నిద్దుర రాక యక్కృపి మనీషి మనోజానిపొన్న బేజామాల్, పెద్ద ఓరంగియఁకుడుల బెగ్గిలి
సమీర ౨ ౫౧

జ. బేజామాలుచేయించు, బేజామాలుచేయు.

**బేషిమాలుచేయించు.** స. క్రి. (√ బేజామాలు) చికిలిచేయించు

ఉ. పంచశరుండు పాంథజనబంధనబంధురబుద్ధి దండువో, పెంచ ధరాధసంతుఁ దళఁ డెత్తెడు కత్తుల బేజామాలుసేయించెకో నాలఁ ఒల్లవము లెల్ల నగంబుల మించెఁ గోయిలల్, గాంచె ననూనతానకలగానని దాన కుహూనినాదమున్
సమీర ౧ ౧౨౫.

**బేషిమాలుచేయు.** స. క్రి. (√ బేజామాలు) మా బేజామాలు చేయించు

**బేటంబేటము.** వి. (బేటము + బేటము) అత్యం తానురాగము.

క. మాటలఁ జెయ్యుల బేటం,బేటముగా నల వరించె సెసఁగ గ సతి లాలాటతిటన యనుఁడు కు సం ౧ ౧౨౭.
(పరస్పరానురాగమని వ్యాఖ్య.)

**బేటము.** వి. (క. బేట) ౧ అనురాగము.

సీ. ప్రీతి నీవిసుకలి బేటంబు గొనియున్న జెలఁ దుల బేటంబు వృథయ కాఁగ.
కు. సం. ౫. ౫౫౩.

చ. పొంతనల బేటము లెంచుచు, గౌరి నీశ్వరుఁడు కేళిపెక్ రతిం గ్రమంబు నన్. కు. సం. ౯. ౩౮౫.

౨. సంభోగము.

ద్వి. మతి యట్లు గాక యమ్మగువపై దృష్టి, నాటించి చూచినవయనముల్ డిల్పి, బేట మానించి యుబ్బినకోల గోసి, రేగు పెంచిన కాల్ల నిల నర్కి త్రైచి.
పండితా. పురా. ౧౪౪. పా.

జ. బేటంబేటము.

**బేటి.** వి. (హిం. ఫేటీ) త్రైరము

వ. అని యిట్లు కెండియూ నొండొరుల మీాఱుచు పాటికిన్ బేటికిఁ బాటెల్లరోసంబున పెపె పెడ పాసంబు లడర వాల్మీ ౩ ౫౭

**బేటు = పేటు.** వి. చి. ని. (ఇది సానుస్వారమని శ. ర.) ౧ అడుగు దెబ్బ. యెండినపుడు విచ్చు పెల్ల.

ఉ. అగ్గిరి రొక్కి దాశరథి లట్ల ప్లవంగ తురంగ మంబులన్, డిగ్గిన నంగదుం డిరెసుఁడీ మనమారుతి త్రొక్కి లేచినన్, దిగ్గన నేలఁ దూతి చనుదెంచినకొండ యెఱుంగ రాద యూడిగ్గ తికూట కాంచనతిటఁ బుల నంటిన మంటిబేటులన్ రామ ౭ ౩౫

చ. అలఁదిన చందనంబు వృథయాఁ జెమరింపఁగ సమ్మదాశ్రులన్, గొంఁచినయట్లు వోయెడుఁ గ మంగిన కాటుక బేటు లెత్తుఁ జెక్కులమకరీవిలాసము గగుర్పొడువన్
పారి ౩ ౧౨.

చ. కస్తురిం, గొని యిడు బొట్టు నాకనుమఁ గూర్మి నొసంగినఁ బెట్టుచుండె జ్ఞానము పొంగంబు వేసినటులౌ తన యూర్పుల నింకి యింకి పోయినపలు బేట్లు గోరఁ గని యొత్తెపెపట్టను మాటిమాటికిన్.
ఆము. ౫ ౬౨

౨. కొండలోనగువానియందలి చీలిక (శ. ర.)

**బేడ**[1]. వి. రూపాయలో సెనిమిదవవంతు, సరక రూపాయ. దీనారము (వరహా)లో ౩౨ వంతు

శీ. దీనారమందు ద్వాత్రింశదంశం బైన బేడ యుఁచకఁగను జెలయుచుండు.
అం. ధా. ౨. ౨౬౩.

**బేడ¹.** పొట్టుతీసిన కాయధాన్యములపప్పు.

ఉ. బెల్లపుటచ్చులున్ పెసగిబేడలుఁ జిమ్మిలి నువ్వుటుండలున్ హర. ౨. ౯౧.

గీ పెరుఁగు వడియంబులును బచ్చివరుగు బేడ, లురుతరాచ్యుతపూజోపకరణపేటికలును .. ఆము. ౨. ౯౪.

సీ. పప్పు బేడ యన నూపంబు తనరు అం భా. ౨. ౨౪౭

**బేడ.** స వి ఆ స్త్రీ పడవ

**బేడ(ము).** సం వి. అ న. చిల్లులేకుండదట్టముగాఁ గూర్చుట.

**బేడస(ము) = బేడిస.** వి. మత్స్యవిశేషము. ఎగి రెడిచేఁప, పాఠీనము

సీ ఘలబేడిసలతోడఁ గలహింపఁ దగుజాపఁ గలికిశేటజెడందకన్ను లమర. చంద్రా ౨ ౧౧౪

సీ. పరికొక్కెరలు బేడసమీలఁ దరఁగలు తెగదాఁటి నడిమికిఁ దెచ్చుకొనఁగ కకు ౨. ౭౦

సీ బేడిసంబుల నిచ్చె వేడుక కాంద్రకు గొండెల, ఒలుదుండగీల కిచ్చె ద్వా. ౧ ౨౪౦

**బేడా.** వి గర్భాలయమునకుచుట్టునుండెడి మండపము

సీ దర్పణాకృతిఁ దళ్తుకీలాడుకంబాలు డంబై చెలంగు బేడా హారంగు. సిం నార ౧౨

**బేడిగె = బెడిగ.** వి (సం భాటకః, క. బాడిగె.) పన్ను, భాగధేయము (బేడిగ. అని చి ని, శ. ర, బ్రౌ.)

వ . సాగివచ్చినపూర్వపు మాన్యపు క్షేత్రాలకుక్రితము బేడిగరొఖం యీతదాతిథిపుణ్యకాలమందు తమతండ్రి వీరవసాయనింగారికి పుణ్యముగా ధారవోసియిస్తిమి. గు జి గుత్తికొండ. శా. ౧౫౦౭.

**బేడిజేము.** వి. మాయ, టక్కు. (శ. ర., బ్రౌ.)

**బేడిదము = బెడిదము.** విశే. భయంకరము.

క. బేడిద మగు నా దెబ్బకు, నోడక ... కాశీ. ౪. ౧౭౭.

**బేడిస¹ = బేడస.** వి. మత్స్యవిశేషము, పాఠీనము.

ఉ. బింబఫలోష్ఠికన్ను లను బేడిసమీలను దిక్కులన్ సమానంబుగఁ బర్వుచున్న. . ప్రభా. ౨. ౪౧.

సీ. కొరద దాసరికొయ్య కొఱ్ఱ మీనులకు ముచ్చుంగు బేడిస జెల్ల చాఱమీను. హంస ౪. ౧౭౪.

జ. బేడిసతిరుగుళ్లు

**బేడిస².** వి నమస్కారము.

రగడ అనిశంబును వృషభాద్రినియతశ్ఖురిపేరిట హరికిని బేడిస లెన్నుచు హంస ౪ ౨౧౩.

**బేడిసతిరుగుళ్లు.** వి బ (బేడిస + తిరుగుళ్లు.) బాలికాక్రీడావిశేషము

సీ పిప్పిళ్లు త్రొక్కుళ్లు బేడిసతిరుగుళ్లు వచ్చన గండ్లు దాయాలు పొళ్లు హంస ౫ ౧౫౫.

**బేతాళము.** సం. వి ఆ. పుం ౧ పిశాచము. ౨. భూతావిష్టమృతదేహము (శ ర)

**బేతాళుఁడు.** సం. వి అ పుం యమకింకరుఁడు. (శ ర.)

**బేత్రి.** వి (హిం ఖేత్రి) మూఁడు. (ఇది సొగటాలాటపరిభాష)

సీ. కంకణంబులు మ్రోయఁగా దుగా బేత్రి చౌకం చంచుఁ బంచెముల్ వైచువారు చమ. ౧. ౧౦౨.

**బేది.** వి. (సం. భేదీ.) పాసనము, విరేచనము. (శ. ర, బ్రౌ.)

**బేరకత్తె.** విశే. (బేరము + కత్తె.) బేరముచేయునది, బేరమాడునది.

చ. సరస మెఱుంగు చంద్రముఖి సొవడిదంటయు బేరకత్తెయున్. మొ రా. అరో. ౧౨.

**బేరగాఁడు.** విశే. (బేరము + కాఁడు.) బేరము చేయువాఁడు.

(వ్యవ.) ఈ వారము చేరగాండ్రు ఎక్కువగా వచ్చుటచే పశువులధర చాల చులుకగా నున్నది.

**చేరజేము.** వి. ౧. కుత్సితప్రవర్తనము, చెడ్డనడవడి.

రగడ. ఇంతి పావురపుకోడ రయిల వినె దార
జము, వింతరయి విరహిణుల వెతఁబెట్టు
చేరజము. మనుచ. ౩. ౭౪.

ద్వి. జగడించు నల చేరజమునకు నోడి, పొగు
లుచు నిలు సొచ్చి పోవంగలేక.
ద్వి. పరమ. ౪ ౩౦౨ పొ.

౨ బ. పరుషవచనములు.

గీ. కాంతుఁ డపరాధియైన ధైర్యకలనఁ జేరఁ,
గెరడము లాడు దైన్యంబు గీలుకొనిన,
చేరజము లాడు.
శృంగారరసాలవాలము ౨ ఆ (౪ ౮)

విణ ౧. కుత్సితుఁడు, కుత్సితురాలు, కుత్సితము

చ. ప్రౌఢవా,రిజముఖి యొర్తు చూచి సతి
ప్రేమ భరంబు మరల్పరాదు చే,రజపు
లతాంతబాణుఁడు కరస్థితపల్లవఖడ్గధారచే,
గజిబిజి చేసెనేని . రాజ. చ. ౩ ౭౩

క. దొరకొని తనుఁ బొదివి కడున్, సరగను
జదలికిని వొగిని జను చేరజపుం,గరువలిఁ బలు
తోలఁ జేసి, నరుదుగ గుడికాల్పువీటి కనిచెం
గడిమిన్, నీలా. ౧. ౪౪.

క ఊరార్పు యుడుగ నమ్మది, చేరజ మిది విన్న
నీకుఁ బెనుదుఃఖంబౌ . శుక. ౨. ౪౩.

క. రమ్మనక పోదు తాత్పర్య మ్మధికము దేవ
దేవి కది సహజంబే, యమ్మగలి చేరజ
మ్మది, రమ్మని నసుమాట నమ్మరాదెప్పటి
కిన్. హైజ. ౪. ౪౨.

చ...ఎంతటిగయాళికి చేరజపున్ విచారముల్,
దెలియనివానికైఁ గలది లేనిది చాల ఘటించి
తండ్రిబిడ్డల కడసేయఁజూచి తకటా . .
సారంగ. ౩. ౪౯.

గీ. అమరపతికొల్వునకు వచ్చు సుకుమారుండు,
గులుకుపాలిండ్లు గయ్యాళి తలిరుబోండ్ల,
యారజపు చేరజపుఁజేత లపుడు జూపి కచ్చు
కొని దూఱు కెప్పుంగ వమ్ము కరణి.
చంద్రా. ౩. ౨౪.

౨. ధూర్తుఁడు.

సీ. ... కేడ ములుచ చేరజ మన ధూర్తుపేరు
వెలయు. ఆం. భా. ౩. ౪.

౩. తేర్పరి, చతురుఁడు

ఉ. నడవడిగిల్గువాఁడు కడు నాణెము చేఁగల
వాఁడు రూపువసి, బెడఁగగువాఁడు బల్
రతుల చేరజమై తగువాఁడు నిద్ధరన్
హంస ౫. ౨౧౭

**చేరము.** వి. (సం. వ్యవహారః, ప్రా. ఓవహారో-
దీనికి వృత్తియందు ముఖర్ణలోపము.) క్రయ
విక్రయవ్యాపారము, వాణిజ్యము.

సీ. బ్రాహ్మణుం డయ్యు చేరములాడు దుర్జాతి
యంధకూపంబున నవశుఁ డగుట.
ఈ రా. ౩. ౩౨౫.

మ. ధన మార్జింపుడు నార్జితం బయిన తద్ద్ర
వ్యంబు చేరంబుచేఁ, గొనసాగింపుడు వడ్డి
వాసిదలనన్ గూర్తు న్మరింగొంత .
ప్రబోధ ౪. ౩౩

౨ కొనునపుడు వస్తువుల వెలకొలఁదిని నిర్ణ
యించుట, మూల్యనిర్ణయము. చూ చేరమాడు
జ. చేరమాడు.

**చేరమాడు.** స. క్రి. (√ చేరము) కొనునపుడు
వస్తువులను కొంతవెలకు ఇమ్మని అడుగు.

(వ్యవ.) అతఁడు కందులు చేరమాడుచున్నాఁడు.
ఓడ చేరమరుగు = వాణిజ్యమునకై ఓడపై
ద్వీపాంతరమున కేఁగు

క. ఈరీతి వణిగ్వల్లభుఁ డారూఢిగ నోడచేర
మరిగిన తఱి . శుక. ౧ ౭౦.

జ: చేరకత్తె, చేరగాఁడు, చేరసారము, చేరి[1].

**చేరసారము.** వి. (చేరము + సారము.) క్రయ
విక్రయవ్యాపారము

వ. ... కోమట్లు తాకట్లు దక్కం దిరిగియు
ధారణ దరకియు చేరసారంబులరయుఁ

దణుఁగు మెుఱఁగు చేసియు వద వం బు గా
ధనంబు గూడఁ బెట్టి. . వరాహ. ౯. ౧౨౩.

గీ ఈడము వళంద బందర యింగిలీషు, కళము
మెుదలైన పేటలగౌర లెల్ల, సారభద్రవ్య
ములు బేరసార మాడఁ, బిలువనంపిరి తమ
తమ పేటలకును హంస. ౧. ౧౧౨

**బేరి¹.** వి (బేరము + ఇ³,-క. బేరి) వ్యాపారుఁడు,
బేరగాఁడు

సీ కుడుము రూకల కెల్లఁ గొన నైతిఁ గా యంచు
బేరి తీఱనియూరి బేర మెుంద
శుక ౨ ౫౬౩

సీ కోటికిఁ ఒడగట్టుకొనియున్న పెక్కు మల్
పెక్కురై వర్తిల్లు బేరిజనులు. హంస ౨ ౯

సీ వైశ్యసామంబులు పఱలుఁ గోవట్లన బేహారు
లనఁగను బేరు లనఁగ.
ఆం భా ౨ ౨౨౭

**బేరి².** వి (సం. భేరీ. క. బేరె) దుందుభి, వాద్య
విశేషము.

క. పెక్కుములు దౌనలు భేరులు, జిక్కు
తెగలు బొడమటయు పెంం గొని యని
కిన్. అచ్చ రా యు ౧౩౯

సీ తా నున్న కేళి కంఠటికి గణాచారి పెక్కు
సుద్దులు బ్రోయు పెద్ద బేరి శుక ౩ ౧౭.

**బేరీజు.** వి (హిం బేరీజ్.) ౧ రాజులకిచ్చుపన్ను
మెుత్తము ౨ లెక్కల వివరణము (శ.ర., బ్రౌ)
(వ్యవ.) మీ రీ బేరీజు సరిచూడుఁడు

**బేల.** విణ (సం. భేల:) ౧ మూఢుఁడు, తెలివి
లేనివాఁడు, అవివేకి, మూఢురాలు, తెలివిలేనిది

ఉ. సంపదదక్కియుండఁగ నళక్తు లనంజను
మమ్ముఁ బిల్చి పూజింపఁగ నంత బేలె
పతి. . భార. ఉద్యో ౧ ౩౧౪.

ఉ. అంతిపురములోని కన్యల పేరిటి, పోతుటిఁగ
నైన బొలయకుండ, నాజ్ఞ పెట్టి శారదానంద
గురు నాజ్ఞ, పెట్ట నేర వైతి బేలవైతి.
విక్ర. ౩. ౫౯.

ఐ యుగ్ని సాక్షికం, బునఁ బరిణీతయైనసతిఁ
బొల్పుగ నొక్కతెఁ గాని యన్యలఁ, మన
మున నేనియుం దలఁప మా వి ని యిట్టి
ఒతాత్మ నన్ను నిట్లని పలుకంగ నీ కగునే
యన్యులఁ బల్కినయట్ల బేలవై.
భార. ఆది. ౪ ౧౩౩.

గా కాంతా శైశవచాపలంబున లతా కాంతార
వీథిం ౯రి, క్రాంతిం బొందెద బేల ? బేలవై
ననున్ శక్యం బె పట్టంగ . వైష. ౨ ౪౩

సీ ముగ్ధకుఁ బేళ్లగు ముగుద యన మృద్దరాలు
నా గోల నా బేల యనఁగ
ఆం. సం. మాన ౪.

౨ భీరువు, పిఱికి

గీ. బేల యీ బేరజపుఁదనం బేల యింక.
నీలా ౨ ౯౪.

ద్వి కోమలదేహవు గోలవు బేల, వేమియు
నేపాటు నెఱుఁగవు నీవు
రం రా అరూ ౧౦౩ పా.

జ బేలతనము, బేలపోవు, బేలరి.

**బేలతనము.** వి (√ బేల) ౧ అవివేకము,
తెలివితక్కువతనము

ఉ బేలతనంబున నిన్ను నమ్మి నా గట్టును
జేఁ ము న్మిగులఁ గోల్పడిపోయితి నేమి
సేయుదున్ పారి ౧ ౧౨౩

ఉ. బ్రహ్మ దాని కీ, లాలితరూపయౌవనకళా
లలితాంగ విలాసవిభ్రమం, బేల యొసంగె
బేలతిన మేటికి నిచ్చె . అహ. ౩. ౧౧.

క. మెుదటికి నిహమే లే దఁట, పిదపం బర
మెటులు గల్గు బేలతనము గా, కిది మరము
గాదు . దశా. ౯. ౫౭.

౨ భీరుత్వము, కాతర్యము (చి. ని.)

**బేలపోవు.** అ క్రి (√ బేల) నిస్సారమగు.

గీ బీజమాత్రంబు చిక్కక బేలపోవు, నెల్ల
ధరణియు . శ్రీరం. మా. ౩. ౧౪.

**బేలరి.** విణ. (బేల + అరి³) వివేకహీనుఁడు.

ఉ. చాలుఁ బురే సరోజభవ సత్పథవృత్తిఁ
దొరంగి కూఁతు ని, ట్లాలరిషై రమింప
హృదయంబునఁ గోరుట ధర్మరీతియే, బేలరి
వైతి. భాగ ౩ ౩౭౦

**బేలు.** విణ వివేకహీనుఁడు, వివేకహీనురాలు, వివేకహీనమైనది.

చ. తనముఖ మంబుజాత మని దండడి మూవు
నలిప్రజంబుతోఁ, బెనఁగు విదగ్ధ ప్రోల
నొక బేలుపతిం గని కు ౨౦ ౯ ౨౭౪

క. సౌబలునీతియుఁ గర్ణుభు,జాబలమును గూడి
తనకు సామ్రాజ్యం బీఁ,గా బలసి పెలయు
వాఁడై, యూచే లూఱడు మనమునం
దేప్రొద్దున్. భార కర్ణ ౧ ౨౨౨

శా కడుం దోస మీ బేలుంజెద్దు
దశకు ౬ ౬

వి. మోసము. చూ బేలుపడు, బేలుపోవు మొ

జ. బేలుఁదనము, బేలుపడు, బేలుపఱచు, బేలుపోవు, బేలుపెట్టు, బేల్పాటు

**బేలుఁదనము.** వి (బేలు + తనము) అవివేకము, తెలివితక్కువ

క. ఏలిక నాదు మఖాంశ,శ్రీలకు నోరుఁ దడెవ
చేల శిర సుండెఁగ మోఁ,కాలను సేసలు
పెట్టుట, బేలుదనము గాక మీకుఁ బెద్దతి
కంబే. ఉ హరి ౧ ౯౬

**బేలుప(ల్ప)డు.** అ క్రి (బేలు + పడు) మోసపోవు

క... శే న,మ్మాటల బేలుపడితి .
భోజరా. ౬ ౫౫

చ. .. తమించుచు నెయ్యండొరు చేతఁ జిక్క యీ,
పెనుఁబగ నొంది మాటపస బేల్పడి
క్రమ్మఱఁ జేరఁ టొప్పునే.
భార శాం ౩ ౨౫౨.

క. బలియుండగు పగతున కెడ, గలిగి చన
వ్వలయు వాఁడు కార్యముకొఱకై, కల
ఁగఁబడ్డిన బేల్పడి, కలిపికొనఁగఁ దలఁదు .
కేయూర. ౩. ౨౬౨.

ఆగు.

శా. ఏ కార్యంబు ఫలించె నీవు చెప్పినా యోచం
బుగా నాత్మమ,ర్మాకారస్థితితోడ బేలుపడితి
స్నైరే నృపుల్ ప్రాక్తనుల్.
హరి. పూ. ౭. ౭౭.

**బేలుప(ల్ప)ఱచు.** స క్రి. (√ బేలుపడు) వంచించు, మోసపుచ్చు

క యకటా యెవ్వతియొ వివేకవిహీనుం,
డని యితని బేలుపఱచెం .
శుక ౨. ౨౭౦.

క ఈ బొమ్మకు గిలిగింతలు, నీబోటిని బేలు
పఱచి నేఁ డిది చుట్టం,బై బమయించెను
నన్నుక్, సాబాసే బాల ప్రబంధ ౬౩౦

చ నన్ను బేల్పఱచి యాత్మజుఁ డున్నెడ
కేఁగి సత్వరం,బునఁ జనుదెంతు నంటివి
భోజరా ౪. ౧౪౧.

మ త్రిపురస్త్రీలఁ బతివ్రతావ్రతముల సారం
బుం బ్రేలీవర్తనం, బుపదేశం బొనరించి బేల్ప
ఱచి పారి ౩ ౩౪

**బేలుపోవు.** అ క్రి (బేలు + పోవు) మోసపోవు

ఉ ఇప్పుడె నిజంబుగ నన్ననుఁ గొన్న యప్పుడే,
చేవ దలిర్పఁ బైఁబడి కి చింత యొనర్చుచు
బేలుపోయె నే, నేవగ దానవో, యనుచు
శుక ౨ ౨౫౬.

గీ ఏల యేఁచుచున్నాఁడు హృదయభవుఁడు,
నెలఁతయును నేను సమదృష్టి నిలిచినపుడు,
బేలుపోవును దాన యీకే తెలియఁగఁడు,
తెల్లవాఱంగవలెఁ గదా దేవకృపను.
పి. తకుం ౩. ౧౬౫.

సీ. గోలుపోయె ననంగ బేలుపోయె ననంగ
మోసపోయె ననుట పోలుచు ...
ఆం. భా. ౩. ౯౪

**బేలుపెట్టు.** స. క్రి (బేలు + పెట్టు) మోసపుచ్చు.

క. తానటె మాంసముఁ దిన దటె, యీ
నక్కయు బేలుపెట్టె నిన్నాళ్లును .
భార. శాం. ౩. ౬౬.

ఆ. కపట మెఱుంగకుండఁ గాంతకుఁ గాంతకుఁ,
బాలుచేసి చాల బేలుపెట్టి.
దశకు ౬ ౧౨౫

బేల్పాటు. వి. (√ బేలుపడు) మోసపోవుట
వ. బేల్పాటు చిత్తంబునం, దొదవన్
దశకు ౧౧ ౫౫.

బేసడము. వి శ్యేనభేదము, ఒకజాతిడేగ
వ బేసడంబులు జలకట్టెలు తఱుకు మించు
మొదలగు డేగలం గరంబులఁ గల చిత్తం
బుల హత్తించి షందు ౨ ౬౦

బేసము = పీసెము. వి (దే బేసవు) చిక్కని
పండ్లరసము, గుజ్జు
సీ పాకవేళారంభపరిపాటిఁ దమయంతిఁ ఒగి
లినపనసక్రొంబండ్ల బేసము
పాండు ౧ ౧౧౮
వ మొత్తంబులై చిత్తంబులు మత్తంబులుగఁ
దత్తరంబునం దియ్యనిపండ్లకుఁ గయ్యంబులు
సేసి పయ్యన నేసరేఁగి బేసంబులు గాసం
బులు గాని భాగ ౮ ४४१
చ వవియగు తేనె జొబ్బిలెడుచక్కెరమామిడి
పండ్ల బేసముం భాను ౩ ౨౨

బేసరి. వి స్త్రీల నాసికాభూషణవిశేషము (ఒక
జాతిముంగర శ ర)
(వ్యవ) ఈ బేసరి వెల యెంత ?

బేసి. విశే (సం విషమః) సరిసంఖ్య కానిది
(సంఖ్యలలో నొకటి, మూఁడు, ఐదు మొదలగు
నవి.)
క బేసి యనన్ విషమమనకుఁ బేరై వెల
యున్. ఆం. శే ४४.
జ బేసికంటి, బేసికంటిమామ, బేసికంటి
వేల్పు, బేసికైదువుజోదు, బేసితాపసులు

బేసికంటి. వి. (బేసి + కన్ను) విషమాక్షుఁడు,
శివుఁడు.
సీ. నగఁ గల్గినను జాలు మొగసాలవాకిలి
కాపించు నట్టి బేసికంటి కైన
యయా. ౧. ౮౫.

బేసికంటిమామ. వి (√ బేసికంటి) హిమ
వంతుఁడు.
సీ గట్లరాయఁడు బేసికంటిమామ, చలికొండ
. నా హిమగిరినామంబు లెసఁగు . .
సాం. ని. స్థా. ౫౫.

బేసికంటివేల్పు. వి (√ బేసికంటి) త్ర్యంబకుఁడు,
శివుఁడు
ఉ వెండికొండఁబోలు వెలిగి త్తుపై నెక్కి,
బాసవాలుగములు బలసి కొలువ, నాకసంబుఁ
బుడమి నలమిన వెలుఁగునఁ, గానవచ్చె
బేసికంటివేల్పు చెన్న. ४. ౮౦.
సీ మిక్కిలికంటిదేవర బేసికంటివేల్పు.
ఆం సం దేవ ౬.
ఇక్లే బేసికంటియొకిమీఁదు, బేసికన్నులదొర,
మొ॥
క. దేవర నీవివు డలుగఁగ, నీవెఱఁదుక బేసి
కంటియొకిమీఁడో జముం,డో వేల్పు ఱేఁడో
నెత్తురు,ద్రావుడుగమి కాఁడో నీళ్లరాయఁడో
చెపుమా అచ్చ రా సుం. ౫౯.
క అది నిండె నేరి నిన్న నిఁ, గదియంగా వెలుచు
బేసికన్నులదొరయున్.
అచ్చ. రా. యు. ४३౬.
గీ గుజ్జువేల్పుతండ్రి, బేసికన్సామి యన
నీదు పేళ్లు పాంబ సాం ని. దేవ ౩.

బేసికైదువుజోదు. వి (బేసికైదువు + జోదు)
విషమశరుఁడు, పంచబాణుఁడు, మన్మథుఁడు.
(శ. ర.)

బేసితాపసులు. వి. బ. (బేసి + తాపసులు)
సప్తమహర్షులు.
శా...మిన్నెట నీ,రాడంబోయెడి బేసితాపసులు
మేలౌ మ్రోల సిద్ధించె గా, యాడంబోయిన
తీర్థ మంచు మదిలో హర్షింతు రత్రాంత
ముక్ నరస. ౫. ౫३.

బేహారమాడు. అ క్రి. (బేరహాము + ఆడు)
వాణిజ్యము చేయు.

ద్వి. పూని బేహారమాడి పోవువారలను, బోనీక
మీఁద కాఁపులు పెట్టి.
ద్వి. పరమ. ౪౯౨ పా

బేహారము = బేహారము, బెహారము. వి
(సం. వ్యవహారః) వాణిజ్యము.

సీ బేహారమాడింపఁ బెరిగినధనమునఁ గోటుల
సంఖ్యలై కొలఁది మీఱ నా పంచ ౫ ౧౩.

జ బేహారమాడు, బేహారి

బేహారి. వి (బేహారము + ఇ³) బేహారి, వణిజుఁడు

ఉ. గురుపదపంకజాతములు గొల్వనివారలు
వేమహాబ్ధిని, స్తరణకుఁ గర్ణధారహితంబగు
నావను సంగ్రహించు బేహారిగతి భూరి
దుస్తరభవాంబుధిలోన మునుంగుచుందురు
భాగ. ౧౦ ఉ ౧౨౭

మ మీరలిట్లతిక ష్టస్థితి నోడబేహారులపొలై
పోవ నాచెట్టపట్టితిరే యంచు
కళా ౬ ౧౧౪

ద్వి ఇగవొంగ నెన్నికకెక్కు బేహారులు,
వారల గంతులఁ దోగహత్తుగా రాచ్చి
ద్వి పరమ ౬. ౪౨౬ పా

బేహారమాడు. అ క్రి (బేహారము + ఆడు)
వాణిజ్యముచేయు

గీ కృషిసేయుటయును బేహారమాడుట
యును భాగ ౧౦ ౭ ౨౫౬.

గీ అన్నిదీవులఁ దెచ్చులాభార్థకోట, యర్థులకు
నిచ్చి కీర్తి బేహారమాడు, నవచిత్రిపురాంత
కుండు వంశాబ్ధివిధుఁడు హార పీఠ ౭౬.

గీ కిమ్మతంబులలోన గనులు ద్రవ్యించి
బేహారమాడించి యన్యాయధనముఁ జొర
నీక పి శకుం ౪ ౧౭౫

గీ అశ్వముల గొర్పెంబుల నమ్మకొనుట,
యొండొ దా వెక్కి బేహారమాడుకొనుట,
యొనర మధుమాంససేవయు నర్తగమున,
నెందుఁ బెక్కండ్రు చేయుట నెగ్గు లేదు
విజ్ఞా. ౧ ౩౭

బేహారము = బెహారము. వి (సం. వ్యవహారః) క్రయవిక్రయ వ్యాపారము, వాణిజ్యము.

క. కరిసనమును బేహారము, వరవి పశులఁ
గూర్చుటయును వనఁగా వృత్తుల్, వరు
లకు హారి పు ౪. ౧౩౦.

గీ పారలౌకికకుసీద, మాసపడువారి కిదియ
బేహార మరయ నైష. ౩ ౫౧

జ బేహారమాడు, బేహారి, బేహారికుఁడు.

బేహారి. వి (బేహారము + ఇ³) క్రయవిక్రయ
వ్యాపారముచేయువాఁడు, వణిజుఁడు

క బేహారులు మితసత్య,వ్యాపారులు వచ్చి
నిలిచి వలసినవస్తు, వ్యూహములు నించి
రప్పురి, నాహారిదశ్వాన్వవాయు నా ద్యుతి
వలనన్ ఉ. రా. ౪. ౧౫౪.

సీ కోట్లు బేహారులగొనబుటంగడులందఱుచుగా
గొండెముల్ తలుపులంద
అచ్చ రా శాల ౪౭ పరమ ౪. ౧౯౬.

బేహారికుఁడు. వి (√ బేహారము సం. వ్యావ
హారికః) కోమటి, వణిజుఁడు

ద్వి లెక్కకు నవనిధు ల్లెక్కని ధనదు,
పెక్కుడెవ వెచ్చని బేహారికులును.
ప్రభు ౧ ౧౯ పా ౨౨. పం

## బై

బైజే. వి ప్రలాపము, అర్థములేనిమాట (అజ్ఞా
నము అనిశర పనికిమాలినపని యని. బ్రౌ)

ఉ కల్లలు వేదముల్ స్మృతులు గల్లలు కల్లలు
యజ్ఞకర్మముల్, కల్లలు పైతృకక్రియలు
కల్లలు ఘోరతపఃప్రభావము, ల్లల్లలు దే
దేవకార్యములు గావున బైజలు మాఁ
మామతిం, బెల్లవిధంబులన్ నడుపు
డిమ్ముల ముక్తికిఁ బోవఁ గోరినన్.
వి పు ౪. ౩౭౯

సీ రజ్జు క్రీడలు పలుము పలవరింపు బై
ప్రల్లదము వదరువదాగళి ఒజారము నాఁ
జెలఁగ నొంట్ర,లాపాభిధ.
ఆం. భా. ౧. ౧౧

సీ. జవరాండ్రమందహాసముల వెండవెన్నెలని
నిలువరు పండువెన్నెలలబైట
ఉ రా ౫ ౨౯౧

౩. ఆకాశము.

సీ ప్రసవాస్త్రమాయావి బైట వ్రాసినసుడి
విసరుహాననకు గంభీరనాభి
పి శకుం ౨ ౧౭౭

విశే. ౧ ప్రకటము, వెల్లడియైనది

శా. తానే దొంగిలి గిన్నె శిష్యవరుచేతిఁ బంచి
చౌర్యంబు బైబైనం దూఁట చనంగ
జేరమిని విప్ర ౫ ౬౨

సీ గబ్బిగుబ్బలు బైలుగాఁగఁ బైటచెఱంగు
జాఱించి సవరించు సారెసారె.
ఘటికా ౨ ౩౪

౨ తొలఁగినది

సీ. పర్యాద యొక్కింత బై బైనవో నింతి
యొకతె దాడిమశంక నొడియఁ జూడ
రా. వి ౩ ౧౬.

జః బైటఁబెట్టు, బైలగు, బైలుదేఱు బైలుదేర్చు,
బైలుపడు, బైలువట్టు, బైల్పడు

బైలుదేఱు. అ క్రి. (√ బైలు) గృహాదులనుండి
వెలువడు

వృథ ఎక్కడికో బైలుదేఱినాఁడు

బైలుదేర్చు. స క్రి (√ బైలుదేఱు) బయలు
దేఱఁజేయు, వెలువఱచు వెలిపుచ్చు.

సీ తనహిరణ్మయగర్భతను బైలుదేర్చిన ట్లంగ
రంగద్ద్యుతి యతిశయింప ఖండు ౧ ౩

బైలుపడు. అ క్రి (బైలు + పడు) ప్రకటితమగు,
వెల్లడియగు

గీ జలరుహోత్పలపదనఖంబులను బోలఁ, జాల
వింతయు తిక్కచా ల్మైలు పడి రొఁ.
రసిక. ౨ ౧౦౪ (ఆకాశమునందుండు
అని శ్లేషార్థము దేలపడు ముద్రి పా.)

వు . జిలుగుంగుచ్చిళ్లకొం గత్తి గుబ్బలపైఁ
గప్పిన బైలుపడ్డయట్టునప్రాంతంబు వీక్షించి ..
దశా. ౧. ౧౨౩. (ప్రా. పా )

బైలువట్టు. అ. క్రి. (బైలు + పట్టు,) బయలుపడు,
బైటవ్యాపించు, బయటనుపొందు.

మ. తనతోఁబుట్టువు బైలువట్టెనను సంతాపంబు
శైలేంద్రనందనకున్ భర్త యడంగన
వ్వగకు నానానిమ్న గాశ్రేణికిన్, జనియిం
చన్ శరవహ్ని బ్రమందినసరస్వంతు ద్దయాం
చద్వీలో, చనవీతామృతనిర్ఝరావళిఁ బన
స్సంపూరితుం జేయవే సమీర. ౧. ౬౬
(నిరాశ్రయయగు అని భావము )

బైల్పడు. అ క్రి (బైలు + పడు) బయల్పడు
ప్రకటమగు

చ ద్యుమణి పడంగ విచ్చుచరవాదధి బైల్పడ
వచ్చుబాడబో,ద్గమితశిఖాని కాయభున కాంతి
యన ద్దనరారె సంధ్య ముకుంద ౩. ౪౩

బైల్వము సం విశే (అ. ఈ అ ) బిల్వసంబంధి,
మారేడుసంబంధము గలది.

వి అం పుం. మారేడుపండు

బైసణ = బయిసణ. వి వీణాసారకాయయొక్క
బంధనము (శ ర.)

బైసి = బయిసి, బగిసి. వి ౧. గొప్పతనము,
గౌరవము ఆధిక్యము

గీ అమృతమును రత్నమును బోయినపుడ
ఫణుల,బైసి చెడిపోవుఁ దుది నీరుపాము
లగును. భై. భా. ౪. ౮౧.

ఉ నీ,బైసి తొలంగఁ దొత్తువలెఁ గాపెడఁ
గూటికిఁ జేరకుం జెడన్.
నా పంచ. ౧. ౧౭౯.

ఉ ఎప్పట్టునఁ జూచినన్ శిశువిబైసి
యొఱుంగగ రాదు భామినీ. హర. ౪. ౨౯.

శా ధానుష్కున్నతి చెప్పఁదీరదె మునీంద్రా
పేరువో మందరం,బో నీచాపము దాని
బైసియు నీకన్ జూపెట్టఁగా గావలె.
చం. రా. ౩. ౧౪౯.

౨. సొంపు, చక్కఁదనము.

సీ. కోరచూపుల రొప్పుచేరు గ్రుడ్డులవాఁడు బైసి మాలినబ్రమాని పణఁతవాఁడు
తరావ. ౨. ౪౫.

సీ. బందికం దెనచాయ బైసిమాలినజేన పెందడు గందపురొంపి పెంత్తివాఁడు మనుచ. ౪. ౩౩.

3. నియతి, భాగ్యము.

గీ అలరుఁ గట్టిఁడి ఒనిని దయ్యమ్మ బైసి, కట్టడి యనంగ నియతిగా ఆం భా ౧ ౯౯

౪. తాలువు, పాతివ్రత్యము, స్త్రీలమర్యాద.

చ. అగు నగు బైసిమాలిదితి నంచు విజృంభణ వృత్తి నివ్విధిన్, సాగయనిమాటలం జెవులు మూడకు సైఁచినదానఁ గాను న్యాయగనికి నిన్నుఁ బంటి కొలమాలినమానుసు లేఁడె.
కేం పంచ 3. ౨౭౫.

జ బైసికొను, బైసిగాఁడు

**బైసికొను.** స క్రి. (√బైసి.) చంపు

గీ ఇటు లేకలమ్మల బైసికొనిరొ, జనవిభుఁడు మూడ కొకకొన్ని జాగిలములు
చంద్రా ౨ ౯౧

**బైసిగాఁడు.** వి (√బైసి) గౌరవహీనుఁడు (ఇట వ్యతిరేకలక్షణ)

గీ వ్రాసికొన్నారు బాఁపనబైసిగాండ్రు
శుక ౨ ౨౪౭

**బైసుక=బయిసుక.** వి ౧ నియమము, ఏర్పాటు ప్రతిజ్ఞ

సీ తోగిణిఁ గొసరి బైసుక పెట్టి పలకపై పారెలు వోయించి సరిమ నూచి
ఉ వారి 3 ౧౨౦

గీ పలకఁ దలుమక బైసుక పల్లటిలక.
ఉ హరి 3. ౧౨౪.

చ ... అతిసాధుమునీంద్రుఁడు కోరకేత్రముల్, కెలకులు బాకిసోదు తుదలింపక బైసుక పెట్టి నందు . .
భాగ. ౯. ౨౦౭.

ఆ . అవనినాథుఁ డొటుఁగ డాగ్రహంబె కాని, నీచవృత్తి నిట్లు నీకు నేల, ప్రాణ మిత్తు ననుచు బైసుక పెట్టంగ, వలదు రమ్ము భూప వరతనూజ.
రుక్మా. ౫. ౧౫౬.

(శ. ర. పా. బైసిక. ముద్రి. పా.)

౨. నెలవు, స్థిరనివాసము.

క భావంబున సంతసంబు బైసుక పెట్టన్.
విక్ర. ౭ ౭౯.

# బొ

**బొంకణము.** వి బొక్కణము, విభూతిసంచి

ఆ. కటితటంబునందుఁ గట్టినగోఁచియు, నొలుఁ బడిలి విట్టు లొంటిఁ దిరిగి, చంకబొంకణము సడలిన దిఁకసైన, గొండలందుఁ దిరుగకుండు దేవ
బస. 3 (శ. ర.)

**బొంకప్ప.** వి మత్స్యవిశేషము. (శ. ర.)

**బొంకరి.** విణ (బొంకు + అరి) అసత్యవాది, కల్లరి.

ఉ ఆ, బొంకరిదివ్యవాణియుఁ దపోధనులన్ మము నిట్లలంతుకే
భార. కర్ణ. 3. ౫౯.

సీ బొలుచు నసత్యుండు బొంకరి యన..
ఆం. భా. 3. ౧౨.

**బొంకి.** వి కరోటిభేదము, పుఱ్ఱెపెంకు.

గీ తనరును గరోటి కప్పెర పునుక .. బొఁకి బొంకి, పెంచు పెంకు తద్విశేషాఖ్య.
ఆం భా. ౨ ౧౩౩.

**బొంకించు.** స క్రి (√బొంకు.) ౧. మోసపుచ్చు, వంచించు.

సీ పూరజం బని చాల గొంకించి యమ్మరో కుమిలి నిగ్గులు దేరకుమ్మ గుప్పి.
చంద్రా ౪, ౧౬౭.

౨. అసత్యమగునట్లు చేయు.

క. మాటలయట్టిది యగునే, బోటనులోకంబు వలుకు బొంకించెద నే, మాటలకంటెను వని నా, బో టగ్గల మింత నమ్మ భూభుజ నన్నున్
కు. సం. ౧౧. ౬౦.

3 బొంకఁజేయు, అసత్యమాడునట్లు చేయు.

వ్యవ . శ్రీకృష్ణుఁడు ధర్మరాజును బొంకించెను.

**బొంకింపు.** వి. (√ బొంకు) మల్హణచరిత్రము
క... ఈ చాయింపువితంబును, బొంకింపువితం
బును .. మల్హణ. ౩. ౬౯.

**బొంకు.** అ. క్రి. అబద్ధమాడు.
క. ఇప్పరికిం జనుదేరఁ గతము బొంకక
చెప్పుమా. భార. విరా ౧. ౩౧౪.
క. చను బొంకఁగ బ్రాహ్మణ్యము,మున సర్వ
ధనాపహరణమున... భార ఆది ౩.౧౩౭
ఉ. ఇంక నివారిధుల్ ధరణి నెవ్వరి వేఁడని
యింద్రు లెన్నఁడున్, బొంక నిధర్మనందనులు
నృపతికుంజరమానులు పొల్తురప్పరిన్
విక్ర ౧ ౩౨
వి ౧ అసత్యవచనము
క. బొంకాడెడుగతికలె విూ, రిం కిటఁ జూచు
కొనుఁ డితని నెట్లుడిచెదనో.
హరి. పూ ౫ ౨౩౧
ఉ. బొంకము గానియీవలని బొంకులు మాచవి
గావు రుక్మిణీ,పంకజపత్రనేత్రకును బ్రాణ
పదంబులు గాని . హరి ౧.౧౨౫.
అ. జల్లి బురుడ బొంకు పొల్లు దబ్బఱ .
పొలితక్క సా నసత్య మభిధ
అం. భా. ౧ ౧౧౯
౨. అసత్యత్వము, కల్లతనము
గీ బొంకువకు నోర్చి బ్రహ్మాస్త్రమునకుఁ గాగ,
బ్రాహ్మణుఁడ నని చెప్పి తత్పాదభక్తిఁ,
గలిగి మెలఁగంగ భారా కర్ణ ౨ ౭౭
గీ. కాలదండం బమోఘంబు గాఁగ నేన,
యాచరించితి దీన దశాననుండు, నొచ్చినను
నొవ్వకున్న నానోడుపు బొంకుఁ,జెందునటు
వలెఁ గాకుండఁ జేయుము , .
ఉ. రా, ౩. ౩౯౧.
సీ. అయింతి ప్రద్యుమ్ను జాయగాఁ బలికిన గొరి
మాటకు బొంకుగలుగ దనుచు.
ప్రభా. ౧. ౧౨౭.
౩. తప్పు, పొరపాటు.
క పెట్టు బయలుగాఁ గరువలి, పట్టి చెడంకుచు
ను వేగుబరులు నురంబున్, జొట్టుకొని విసర
నాజెగ,జెట్టి మిగుల నడిఁకి బొంకుచేసిత
ననుచున్. శై. భా. ౨. ౭౦.
విశే. (క. బొంకు) అసత్యమైనది.
సీ వినుము మాతాన్వయంబున నీవు పుట్టుట,
బొంకు . భార. ఉద్యో. ౪. ౫౯.
ఉ. భూతపతిప్రసాదవిధి బొంకగు నెందును
లేమి దశకు. ౨. ౩.
గీ. ఆత్మవత్సర్వభూతాని యనుట బొంకె
ఆము ౫. ౪౩.
జ' బొంకించు, బొంకింపు, బొంకులబొన,బొంకు
లాఁడి, బొంకులాఁడు.

**బొంకులబొన.** వి (√ బొంకు) అసత్యమాడునది;
అసత్యమాడువాఁడు, బొంకులబుంగ.
సీ. నక్కచిక్కులమారి పెక్కుకురూపి దూబర
దిండి బొంకులబొన మొండి.
చెన్న. ౨. ౨౪.

**బొంకులాఁడి.** విశే (బొంకులు + ఆఁడి)కల్లలాడు
నది, అసత్యములాడునది (శ. ర.)

**బొంకులాఁడు.** విశే (బొంకులు + ఆఁడు) కల్ల
లాడువాఁడు, అసత్యములాడువాఁడు.
అ బాలకుండు వృద్ధు పగవాఁడు చుట్టంబు,
బూతు మానగాఁడు పాతకుండు, బొంకు
లాఁడు ముచ్చు మచ్చరి కొండీఁడు, కల్లు
ద్రాగువాఁడు గాఁడు సాక్షి. విజ్ఞా.౩ ౧౦౪

**బొంగరము.** వి. (సం. భ్రమరకమ్) బాలురాడు
కొను బొమ్మరము, బొంగరములతో నాడు
కొనెడియాట
సీ. బొంగర మనఁగను బొమ్మర మనఁగను
భ్రమరాభిధానంబు పరఁగుచుండు.
అం. భా. ౨. ౩౦౩.
క....కురుని కెంపుబొంగరములంతోని మెట్టు
దాపురమొనగడలను. యయా. ౪. ౧౩.
గీ. పొట్టగీరవగింజలు బొంగరములు, గచ్చ
కాయలు దాఁగిలిముచ్చులాట . .
ప్రబంధ ౧౯౩.

**బొంగు.** వి కీచకము లావుగలిగి బోలుగ నుండు వెదురు పల్లకిలోనగువానిని మోయుటకుపయోగించు వెదురు
సీ కీచకసంజ్ఞ లైయి తోఁచు బొంగన
ఆం భా ౨ ౪౮
రగడ బొలుపొందు గందలపు బొంగులను గడేలు హం ౫ ౩౫౬
౯ బొంగువెదురు

**బొంగువెదురు=బొంగు** వి (బొంగు + వెదురు) లావుగలిగి బోలుగానుండు వెదురు కీచకము
క విదితముగ బొంగువెదురున నొదవినముక్తికము తారకోజ్జ్వలము రత్న ౩౬

**బొండ.** వి (సం బంధః ప్రా బందో) తప్పు చేసినవారి కాలుచేతులకుఁ దగిల్చెడు దారు యంత్రవిశేషము ద్రుపదము (దీనిని బొండ కొయ్య బొండక్రాను అనియు నందురు)
గీ భోగములకండ యులవేల్పుబువ్వదండ ఎతిగు లకు బొండ పేదలపైఁడికుండ
రా వి ౧ ౩౧
క విన వచ్చి దొంగగా యని యెవరఁగ నిట బొండకొయ్య నుంచిరి శుక ౩ ౨౦౪
సీ బొండయనంగను బోవనఁగూటయంత్రాభిధానంబుగాఁ దనరుచుండు
ఆం భా ౨ ౨౯౩

**బొండము=బొండలము** వి ఒలవని కొబ్బరకాయ
సీ కడుకైనై లేనారికేడపుబొండము లట్ల బెట్టి దంబుగఁ దల ద్రిప్పుచుకొనుచు
అచ్చ రా యు ౨౪౫
సీ నారికేరంపుబొండాలు మీఁగడయును వర దధిపిండఖండాల్గుడుములు పార ౬ ౫౫

**బొం(డ్ల)దలము=బొండము.** వి ఒలవని కొబ్బరకాయ
శా పారావారపుమారికేడంపుబొంగలము లేమ్రాఁ ద్రెల్లిలో క్రీలుటన్ నిరేమై తోఁగన్
చంద్ర ౨ ౧౦౩
సీ ఎలనీటిబొండలంబులుకోరి మెదడెల్ల జాఱిమైచిన డొల్లపుల్లెగములు ఆము ౬ ౧౪
చ పగడపుఁజాయచెందిరము ద్రామినపొండ్ల వనూకుచంబులన్ వగనరుణంపుబొండ్లములు నారికేడంబులు వజ్రకుట్టిమంబగు పథమం బెలంగు ఆము ౧ ౫౪
సీ తాళాదికళలాటు తవరు బొండ్లమువంగ
ఆం భా ౨ ౪౭

**బొండామము=బొండలము.** (శ ర)

**బొండిగ.** వి ఈగెమొదలు తొడిమ (శ ర)

**బొందు.** విశే గుండ్రమైనది వర్తులము
(ఉదా బొందుగంటలు చి ని శ ర ప్రా)
జ బొందుమల్లె

**బొందుగ(వ)=బొందుగు** వి కంఠము (కంఠ నాళము అని శ ర
ద్వి బొందుగ లుచ్చి యూపొట్టలు చీరి గుండెలు ఛేదించి కోలలు నుతిమి
నవ ౧ ౫౧ పా ౨౪ పం
సీ మొగిని రక్కసుని బొందుగఁ జించు నీ గోళ్లు చిటిలెనో నిరికుచశిఖరి దాఁకి
సిం నార ౬
క బాలద్విరగకరంబులఁ బోలెడుకరములను దమజాబొందుగ బిగియం గింప ప్రేలఁబడి రెను బాలకుఁ డోకకొండభంగి బరువై యధిపా భాగ ౧౦ భా ౨౬౩

**బొందుగు(వు)=బొందుగ** వి కంఠము
గీ గొంతు గొంతుక కుత్తుక కొలికి బొందు గవఁగఁ గంఠంబు చెలఁగును
ఆం భా ౨ ౧౪౧
ఉ కొందలబొందుగుల్ వగుల గ్రుద్దియుఁ గొందలనోళ్ల వ్రచ్చియున్
అచ్చ రా. యు ౧౩౭
(బొందుగల్ వగుల గ్రుద్దియు శ ర పా)
గీ ఊడ్చి బొందువు వ్రచ్చి ప్రేవులిడి నంజా డంతయును బుచ్చి పొదుకగా నమరఁగట్టి

కొనుచు వేఁగుఁబోకగుట చూఁజనిరొ
భార. శాం ౩. ౪౯౯ (బొండుమ్రచ్చి శ. ర. పా)

**బొండుమల్లె (ల్లియ).** వి. (బొండు + మల్లె.) మల్లెలావిశేషము, ఒకజాతిమల్లె, గుండుమల్లె.

గీ. బొండుమీఁటినపగటిపేరెండ దాఁకి, యొల్లఁ
బోయిన లేబొండుమల్లెపొదల
ఆము ౨ ౫౬.

సీ. బొండుమల్లె లశోకములు మంకెనలు నంది
వర్ధనంబులు విరవాదివిరులు.
ఉ. రా. ౩ ౨౦౧

గీ. బొండుమల్లె యనఁగ మహామల్లి యనును
ఆం భా ౨. ౫౧

గీ. బొండుమల్లియవిరిదండ ఖండపరశు
పూజించె నలుఁడు నైష ౮ ౧౦౪

సీ. బొండుమల్లియలపైఁ బొరలాడుఁ బొరలాడి
పుష్పంధయంబుల బోఁటిఁ బోవు నప్పారం
బునఁ బ్రమదవనానిలుండు విక్ర ౧ ౯౫

**బొండెము.** వి. తెమడుమున్నగువానితోఁ జేర్చిన యాభరణము, ద్వారమునకు ముండ్లకంపతో నల్లి యమర్చిన తడక. (ముండ్లకంపతో అల్లి తొట్టునకు అమర్చెడు తడుకు శ ర)

**బొంత.** వి (సం బ్రోథః కె బొంత) కప్పుకొనుటకును పఱచుకొనుటకును దట్టముగాకుట్టినగంత

గీ. బొంతకు గంతకుఁ బ్రోగిడిపోవు, నంతకు
విక్రయంబార్చి తెప్పించి
బస పు. ౪ ౨౭౦ పం

యోగి యొకఁ డిడుఁ బలపం, బును గాతము
బొంతయు గమ్యకున నాతని కిచ్చి వాని
గుణములు చెప్పెన్. హ్యా ౮. ౧౧౨.

క ఇప్పుడు శకవిధుఁ డెనటు, కొఱప్పడుకూ
మున్న బొంతయును లాతమును, గప్పెర
యును కావుకలును, జొప్పడినవి ప్రతుకు
టొప్పు జోగియుఁబోలెన్ విక్ర. ౪ ౬౨

విశ. పెద్ద (చూ. బొంతకాకి, బొంతరఁటి మొ॥)

జ బొంతకాకి, బొంతజెముడు, బొంతమడమలు, బొంతరఁటి, బొంతఱాయి, బొండడము, బొండడీఁడు, బొండడీలు.

**బొంతకాకి.** వి (బొంత + కాకి.) కాకోలము, మాలకాకి (శ. ర., బ్రా, వా)

**బొంతజెముడు.** వి (బొంత + జెముడు.) ఒకజాతిజెముడు

గీ. బొంతజెము డుల్లియును సదాముస్తె పొదలు,
గాఁ గలుగునట్టి చిటుచెట్లఁ గాంచి యంత
హంస ౪ ౧౦

**బొంతమడమలు.** వి. బ ధాన్యభేదము, ఒకవిధమగు ధాన్యము.

వ . రాయమెచ్చు లేఱుమల్లెలు మునిమనోహ
రాలు జెండిగుండ్లు బొంతమడమలు కూటి
కుప్పలు కాఱుసంపెఁగలు .
ప్రబంధ ౧౧౨.

**బొంతరఁటి.** వి (బొంత + అరఁటి.) పెద్ద కాయలు కాచెడు ఒకజాతి అరఁటి (శ ర., బ్రా.)

**బొంతఱాయి.** వి. (బొంత + ఱాయి.) శిలాభేదము, ఒక విధముగుఱాయి. (శ. ర., బ్రా.)

**బొంతు.** వి. జొన్నలులోనగువాని గింజలయడుగున నుండు కుదురువంటి పొట్టు (చి. ని., శ. ర.)
బ. పొట్టుతోనున్నజొన్నలు (బ్రా.)

**బొంద[1].** వి (సం బృందమ్) ౧. గుంపు, సమూహము

చ వనికి గురూక్తి దోఁచు పరివారపుబొందపయి
న్నిరీహుఁడై, తనపినతల్లి యానతిని దాల్చెఁ
గటిస్థలి రాఘవుండు . వల్కలచేల
మత్తతిన్ చం. రా. ౮. ౫౮.

మూ.. సపరిచ్ఛద ఏవ గచ్ఛ ...
సం. చం. రా. అయో. ౩౩౮

**బొంద[2].** వి. గొతిము, బీటు, గర్తము, చిన్నగోయి.

వ. ... మిహిరుండు కా తగుతుతిగర్భంబు
ఛేదింప నాటిన బల్లాయములో యనంగఁ
గనుపట్టె న్గన్న బొంద ల్ధరన్.
చంద్రా. ౨. ౨౫

ద్వి. పుచ్చినకన్నులబొందల మున్ను, వచ్చు
కీలాలప్రవాహంబు నడిగి
పండితా మహిమ ౨౫౧ పా
గీ. లాగ బాతియ బొంద యనగ బొలుచు
గర్తంబు అం భా ౧ ౧౪౫

బొందక². వి ౧ అరటిఆకులోనగువాని ప్రకాండము
ఉ బొంద దూట వేదండము దాకనట్లు
దశా 3 ౨౦౧
(వ్యుత) ఈ అరటిబొంద విస్తళ్లకు చాలా
బాగుండును
౨ బాలకాశము, తేతితాడ
సీ. బాలతాళాఖ్య బొంద నా బరగు
అం భా ౨ ౩౩
౩ బొందకోల, బొందపక్కి

బొందక³. వి ఒక శాకవిశేషము, ఒకవిధముకూర.
వ. .కందయు బొందయు జారులు దియ్య
కూరలు. కాశీ ౩ ౧౮౫

బొందకోల. వి (బొంద³ + కోల) మల్లసాధ
నాయుధవిశేషము (చి ని, శ ర)
సీ. సాధనాయుధములు సానకత్తి యనంగ
బొందకోల యనంగ బొలుపు గాంచు
అం భా ౨ ౨౦౬
క. చిరుదుగలకులుక లిరువురు కెఱమట్టి
మెఱుంగుదట్టు తెగుచల్లడముల్, బరగంగ
బొందకోలల వారిగల తాటించి ప్రెు
క్కు-యారము మీఱన్. ప్రబంధ. ౮౫

బొందడ(శ)ము. వి (బొంత + దడము) కంచు
కము, చొక్కా-యు, కవచము.
సీ పాతకంబులు నీలిపట్టుబొందడములు పగ
లింటినిద్రలు పచ్చడములు. హైమ ౩ ౬౧.
గీ. చొచ్చి చెదుగు లారుల సొంపజూతు
రట్లు, బొందడము తెమి వాడికూపులును
బోరె అచ్చ భా. ౧. ౪౨
ము. . . తెందమ్ముబొందళపుక్ రొతున ప్రాసి
నట్టి పడకింటన్ మించుటూరనొన్నచన్.
ఉ. రా. ౪. ౨౨౨.

సీ కేరణ మనగను చేరణి యన, [illegible]
వనగను బొంగళిం బనంగ, జో డనఁ
గవచంబు శోభలు అం. భా. ౨.౨౦౪

బొందడీ = బొందడము. వి (√బొంత) కవ
చము
౧ పలపులలొజ పీవు గిరిశం యలజాబిలి చిల్క-
తేజ తూపులు నన లెంచ విల్ చెఱకు
పొందుగ దేరులు నారి బొందడీ, తిలి
రలమూపి యి పపాది తారకులెక్కొర
చుట్టు మెట్టి నీ, కలవడు కెట్లు మెంక్కులపు
టంపము లబ్బర మెంచి మాచినన్
యయా ౫ ౮౦.

బొందడేడు. వి. (బొందడము + ఈడు)కంచుకి
(కవచముతొడగినవాడు వర్మితుడు శ ర)
గీ కంచుకి యొసగుచుండు, బొందడీఁ
డని అం భా. ౨ ౧౮౩.

బొందడీలు. వి బ. (√బొందడము) ధాన్య
విశేషము, ఒకవిధముధాన్యము.
వ బొందడీలు పునుగుదావులు తేనె
తొలలు మోసనాలు ప్రబంధ. ౧౧౨.

బొందపక్కి. వి (బొంద + పక్కి) మత్స్య
విశేషము, ఒకజాతిచేప (శ. ౬)

బొందపువ్వు. వి (బొంద³ + పువ్వు) తాటి
మొవ్వునంటియుండెడు మాగుపూవు.(శ ర.)

బొంది. వి (ప్రా. బోది, బుది ఎ బొంది.
త. పొంది) దేహము, మేను.
గీ. నిజవు లేకని నడిమి ఉచ్చినఫలమున
బొందితోడన దివికేగు బొలుపుకోతె.
కు. సం ౧౧. ౩౩౦.
ద్వి బొందితోడను కూడ బోయి స్వర్గంబు,
నందుము పొమ్మన్న నాత్రిశంకుండు.
రం. రా. బాల ౫౮. పా ౧౧. పం.
గీ అబ్బలియు రంక, నిన్ను గనుగొన్న
బొందితో నిల్వనీరు.
అచ్చ. రా యు. ౧౧౨.

బొందిలీ. వి భారతీయులలో నొకజాతి (బొందిలి. అని శ. ర)

గీ ఎనుఁగులు వేయి బొందిలీ లెంచి చూడ లక్ష వెంజాయ లౌకలక్ష కృష్ణ ౩ ౨౫

బొందివేఁట. వి గూండ్లలో నుంచి పెంచెడు కాఁగాలు మొదలగు పక్షులసహాయమున నాడెడు వేఁట

ఆ కారుకోడి కాఁజా మొదలుగాఁగ బొందివేఁటకు మీఱు నెట్టు లెల్ల గూండ్ల బిట్టు వెలఁగ యయా ౧ ౧౧౩

బొందు. వి (సం బంధః) ౧ దారము

సీ ఎవ్వఁడు రవణిల్లు సెల్లజీవులయందుఁ బూస లలోనున్న బొందువోలె కాశీ ౫ ౯౭

సీ గీఱునామము చిన్నికోరమీఁసలు చెంపఁ బనిమట్టునీక బొందువట్టునూలు శుక ౨ ౨౮౧

౨ పూవుకొత్తు

గీ నియమమునఁ బుష్పములఁ గోసి చేర్చి మీఱఁ బలువన్నెలంగులవి తవింతలుగ మాలి కలువ బొందులు కందుకమ్ములు రచించి కళా ౪ ౯౨

౩ చొక్కాయ ముడివేసెడు సన్ననినాడా

ఉదా బొందులచొక్కా పరికిణీబొందు మొ॥

౪ శుష్కసస్యము పెన్ను దీయుటకు యోగ్యము గాని తరి లోనగునవి

సీ బొం దవఁగాను శుష్కసస్యము చెలంగు ఆం భా ౨ ౨౩౪

వ్యవ ఈ సంవత్సరము నీరు చాలక చేనంతయు బొం దయిపోయినది

విశే స్థూలము, లావైనది

ఉ చాల దళంబుగాఁ బృథులచంపకకీలనఁ బొల్చు బొందుఁ దోరూ రెలనంగఁ గల ల్సుగంధకదళీనవపంక్తుల సొప్పు నప్పురిన్ ఆము ౧ ౬౯

౫ బొందుపోవు

బొందుపోవు. అ క్రి (బొందు + పోవు) పఁ మున్నగునవి పెన్ను తీయుటకు యోగ్యముగాక పోవు

వ్యవ ఈ యేఁడు రసంగిచేలు బొందుపోయినవి

బొందె. వి కదళీత్వగంతర్గతశ్వేతకాండము గల పేశిన అరఁటిచెట్టు లోపల నుండు తెల్లని భాగము ఊఁచ (దీనికే దూఁట దవ్వ అని వ్యవహరింతురు)

సీ బొందె యంచనఁగను బొల్చును కదళీత్వ గంతర్గతశ్వేతకాండసంజ్ఞ ఆం భా ౨ ౫౮

బొక్క. వి (సం భూకః క బొక్క త పొక్క) ౧ కలుగు కన్నము బిలము

ఆ చాటినేలమన్ను కాచకే పుమన్నుఁ బుట్ట మన్ను సెలకబొక్కమన్నుఁ దక్క నొండు చోటఁ దామన్ను గని కాచ మాచరింప వలయు నంద్రు బుధులు విజ్ఞా ౧ ౩౭

క ఒక్కయెడం దములో నొక బొక్కకు వాదడిచి కశకముఁ గపింజలమున్ కేయూర ౨ ౯౧

గీ లాఁగ బొటియ బొక్కి కలుఁగు బొక్క బొంద యనఁగఁ బొలుచు గర్తంబు ఆం భా ౧ ౧౪౫

౨ గోయి గర్తము

ద్వి ఎడపెడ బొక్కలనిడినకాలకుల పడ లించి భక్షించు వేశాకతతులు ద్వి హరిశ్చ ౬ ౧౬౭౯ పం

౩ హాని అఁడుగుతి (వా) ౪ కారాగారము ఖైదు

(వ్యవ) వానిని బొక్కలో పెట్టినారు

౫ నష్టము దండుగ

(వ్యవ) వానికి బేరములో నాలుగువందల బొక్క వచ్చినది

౬ బొక్కచెరడు బొక్కలాఁడు

బొక్కెన(ము). వి (క బొక్కెన త బొక్కెనం మ బొక్కెనం) నిర్భూతి పొక్కిళ్లనుబంధి

ద్వి. కడఁగి కేరడమ్రుఁ గాయ పం జేరి, కుడిచి
కత్తించు పెక్కురకాపకులకుఁ, బోడలకళా
పంజా బూదిబొక్కణాము, జడలా రుద్రా
క్షలా సంపదకేల.
ద్వి. హరిశ్చ పూ. ౧౪౭౨. పం
సీ. బూదిబొక్కణ లాతిమును గమండలువును
బులికళాసముఁ గరంబున వహించి.
హర ౨. ౭౪

బొక్కనియ=బొక్కనా. వి గుఱ్ఱములకు దాణా పెట్టుసంచి.
సీ పాదంబుతో నశ్వముఖుల లాయంబులఁ
గట్టి బొక్కనియలఁ గవణ మెత్తు
నృసిం. ౨ ౧౨౪.

బొక్కబొరడు. వి. సర్పవిశేషము, ఒకజాతి పాము (శ. ర., బ్రౌ.)

బొక్కలాఁడు. వి. (బొక్కలు + ఆఁడు) ౧ సర్పము ౨. కన్నగాఁడు
ద్వి '(శ్రుతిబాహ్యుఁ డిలఁ బుట్టుగ్రుడ్డి తాను
సుఁడు, గతిచెడ్డచెడుగు తెక్కలి బొక్క
లాఁడు, పదవిహీనుఁడు జగత్త్రాణభక్ష
కుఁడు, కడకి యీవిసపాలవిత్తు నేమందు'
ద్వి. హరిశ్చ ఉ. ౨౦౩౬. పం
(ఇది పైరెండర్థములకును లక్ష్యము)

బొక్కసపి(పుటి)ల్లు. వి. (బొక్కసము + ఇల్లు) ధనాగారము.
సీ. సరుకులుండు,మిద్దె చిల్లరులు నమ్మెడు
దుకాణము బచ్చుమళిగ బొక్కసపిల్లు
మచ్చులు .. హంస ౨ ౨౨౬.
గీ. బొక్కసపుటిండ్లు సుగ్రాణముల సెలవులుఁ,
పాకశాలలు మరము లనేకభోజనార్హ
శాలలుఁ .గట్టఁ బనుపు. ఉ. రా. ౭. ౧౪

బొక్కసము. వి. (క. బొక్కస. త. పొక్కిసం)
౧. ధనాగారము, బండారము.
గీ. పూర్వ కేం మున్నదో మీదు బొక్కసముల,
రొక్కములు వీరి యది కేం మొబుంగ
మునకు. ఉ. హరిశ్చ. ౧. ౪౨.

గీ సలిలపతి బొక్కసము నదీసతుల కెల్ల, వర్మ
సీమంబు గిరులకు వర్మ మవిల,తాండవిత
పాండుడిండీరఖండధారి, ధళ్యసాంద్రంబు
పాలసంద్రంబు మించు. వాల్మీకి. ౧. ౬౧.
సీ. బండరు వంచన బండార మంచన,
బొసఁగుచుండు, వల్లభాండాగారము
ఎం. భా. ౨ ౧౫.
౨ పెట్టె.
సీ. తతి నిండుజాబిల్లి తళుకుబొక్కసములోపల
మించు వలిమంచు వలువఁ బూని.
చంద్ర. ౪. ౪౭.
గీ తండులాదిక తామ్రపాత్రములతోడ, పెసఁగు
సంచియు నగలబొక్కసముఁ దాల్చి, వెంట
శిష్యుఁడు చనుదేర . ఇందు. ౨.౧౧౫.
౩ మూట.
గీ ఆస్థిగర్భితతామ్రపేట్యాన్వితముగు, బొక్కసం
బెత్తుకొనిపోయె బోయ యనుచు
కాశీ. ౫ ౬౩.
ద్వి చంక బొక్కసమును సడలియున్నదియు,
శంకింప కొం కెట్టు సరియించెదయ్య.
బస. పు ౩ ౬౫౬.
౪. ధనము, కోశము. (చూ బొక్కసపిల్లు.)

బొక్కి. విణ ౧ మాంసములేనిది, గుంటలుపడినది.
సీ. నొక్కుఁబ్రక్కలు బొక్కిరొమ్ములు
కలుగు నెఱకుముసుఁడిఁ గనిరి సతులు.
కు. సం. ౬. ౬౯౪.
సీ బొక్కిఱొమ్ములు లోతుఁబొట్టలు మిడి
గ్రుడ్లు గూనివీఁపులు నిడుఁగొంకికేళ్లు.
ఉ. హరి ౨. ౧౨౨.
సీ కొంగమెడయు నిడుగూనివీఁపు నొలుగు
పోయినరొండియు బొక్కిఱొమ్ము.
హరిశ్చ ౪. ౧౬౭.
౨ బోసివాఁడు,పండ్లులేనివాఁడు, పండ్లులేనిది.
ఆ. చీకు పెలుఁగు బొక్కి చెవుడుఁ గలయది,
మూఁగ శబ్దవిశరములు గ్రహింప,లేనిపనిది ...
వెన్న ౪. ౪౭.
చేదబొక్కి = పాఁతచేద.

ఆ. చేఁదబొక్కిఁ బోదను జేర్చి ఖాండంబుల, లోతునీళ్లమడుఁగులోన ముంచి. హైజ. ౩. ౬౩

జ బొక్కిపడు.

బొక్కిపడు. అ. క్రి. శిథిలమగు.

వ కోట బొక్కిపడంగా యవనోగ్రసైన్యము ఫిరంగీల్ గుప్పి రొక్కుమ్మడిన్ రంగా ౩ ౪౨

బొక్కిస. వి. వస్త్రములుపెట్టెడి పెట్టె, కోశకము. (శ ర.)

బొక్కిసా. వి చిన్నమూట, అల్పభారము.

(వ్యవ) బొక్కిసాలో కొంతకచ్చువలె వీఁడు సిద్ధమైనాఁడు

బొక్కు. స క్రి ౧ ఏదేని వస్తువును నోటినిండ జేసికొని తిను

సీ. జలినారసాగడు జొన్నలకాఁడలఁ ద్రొక్కి ముక్కునఁ ద్రెంచి బొక్కి బొక్కి. ద్వా ౮ ౧౧౮

క. రక్కసుఁడై కోపం బిడి, యొక్కొక యపరాధమునకు నొక్కొక్కఁడు గా, బొక్కఁగ లోకము పురపురఁ బొక్కఁగఁ బాదర్యో నంతిపురముం బురమున్. మనుచ. ౫. ౨౫

ఉ. తనవారు వారివా రనక దొరకినవారినెల్లం దునకలు చేసి బొక్కుచుం ద్రొక్కుచు రామా ౯. ౧౫౦

వి. బొక్కుట.

జ. బొక్కులాడు.

బొక్కులాడు. స క్రి (బొక్కులు + అడు) నోటి నిండ జేసికొని తిను, బొక్కు.

చ. కలమపుఁగెండుగల్ ద్రవిడకన్యలు ముంగిటఁ గాచుచుండి తజ్జలరుహనాథగేహరుచి కాబము సారెకు బొక్కులాడ చెంగలువ దండలఁ దోలుదు రప్పురంబునన్ ఆము. ౧. ౪౫

బొక్కెన[1]. వి నీరుపిప్పలి. ‡.

సీ. నీరుపిప్పలి యంచనిన బొక్కెన యనంగఁ దోయపిప్పలిసంజ్ఞ దోఁచుచుండు. అం. భా. ౨. ౫౪.

బొక్కెన[2]=బొక్కెనియ. ౧ ఉలవలు మున్నగు దాణా ఉంచి గుఱ్ఱమునోటికి తగిలించుసంచి.

సీ అశ్వఖాదనసాధకాస్యలంబి,భస్త్రి బొక్కెన యనఁ బరగు... అం.భా ౨.౨౦౦.

౨ చేఁద, నీళ్లుతోడుసాధనము.

గీ చేఁద, బొక్కెన యనంగఁ దద్భేద మొప్పుచుండు. అం. భా. ౨. ౨౯౩.

బొగడ. వి ౧ మంచపుఁగోడు మొదలగువాని తలయందును గందపట్టెమీఁదను ఉండుగుబ్బ.

చ పగడపుఁబాదపట్టియలు బన్ను మెఱుంగు కిరీటిపచ్చబొ,బొగడ కడానిక్రొంబసిమి పుత్తడివ్రట్టువకోళ్లసంతనం, దగుమగఱాతి పట్టియలు పెంపగుమంచమునన్ మహోన్నతిన్ చంద్రా ౬. ౨౩౨.

౨ చూచుకము, చన్మొన

చ చనుబొగడల్ పిఖాకలనఁ జక్కిలిగింతలు వోవ లోఁగుచున్ కళా. ౧. ౨౪.

సీ తెలిముత్తియపుసరుల్ దిద్దుపెపంబున గుబ్బచన్బొగడలఁ గోరఁ జెనకి. నీలా ౩. ౧౦౩.

౩ ఆఁడువారు కొనచెవిని ధరించెడు భూషవిశేషము, బుగడ

సీ. చెవులపువ్వు బొగడ బవిరె రాకెక ... కర్ణభూషావిశేషములు అం.భా. ౨.౧౮౯

సీ కెలన మించుధరాజకెంపుటాబొగడల జిగి చెవిజవ్వాదిచెల్మి కలర. ఉ. రా. ౬ ౧౧౯

ద్వి. మగబాలతలుకుఁగమ్మలును గట్టాణి,బొగడలు చుఱుకుఁగెంపులబవిరెలును. రం రా. బాల. ౪౫. పొ. ౬.

౮. చెఱువుకట్ట లోనగువానియందు నీళ్లు దూఁటి వచ్చెడు రంధ్రము. (శ. ర.)

జ బొగడపచ్చలు, బొగడసరులు.

బొగడపచ్చేలు. వి బ. (బొగడ + పచ్చెలు. వస్త్రవిశేషములు, ఒకదినుసువస్త్రములు.

సీ. నిండువన్నెలు మంచి నిగనిగోచరుల. సామంతవీథులు ప్రతిపలుకు బొగడ. గీ.పచ్చలును.. మొదలుగా వస్త్రాలు ధరించి నందికేలపుడు. ప్రబంధ. ౨౪౨

**బొగడసరులు.** వి.బ.(√ బొగడ)ధాన్యవిశేషము.

సీ. ఏదుకట్లు వంకి లికుకరాజనములు పులి
గోళ్లవంకెలు బొగడసరులు.
హంస. ౪. ౧౨౭.

**బొగ్గు.** వి. మండి చల్లారిన కట్టెతునుక, కాలిక

గీ. బొగ్గులకుఁబోలె నొదలంటఁబొడువఁబనదు
భార. ఉద్యో ౨. ౫౪

క . . బొగ్గులకై కల్పతరువుఁ బొడుచుట
సుమతి. సు. శ. ౫౭.

గీ. .బొగ్గు, నల్ల లనఁగను గాలికానామములగు.
ఆం. భా. ౨. ౨౪౨.

విణ. నల్లనిది.

మ. తలిరుంగేల మరుత్కిశోరగమితాత్యచ్ఛ
ప్రసూనాంతరో,జ్జ్వలకింజల్కసమాఖ్యకో
ద్రవము లెంచ న్నింది శేఁదేఁటిపిల్కల
పేరం దగు బొగ్గుతీసువలకోల్లన్ బట్టి
యాడించె . చంద్రా. ౪ ౭౧

జ' బొగ్గుపడు, బొగ్గులుసేయు.

**బొగ్గుపడు.** అ. క్రి. (బొగ్గు + పడు.) నల్లనిదగు.

సీ. కనకవర్ణంబైన కైటభాసురకైరి పొఁగచూరి
నల్లనై బొగ్గుపడిరొ భీమ. ౪ ౬౧

శ్లో॰ కాలకూటాగ్ని సంపర్కాన్నీలవర్ణ స్తదాఽ
భవత్.

**బొగ్గులుసేయు.** స. క్రి. (బొగ్గులు + చేయు ) బొగ్గులుగాఁ జేయు,పాడుచేయు

ఉ. సిగ్గొకయింతలేక నెలచేడియకైవడి ధర్మ
కీర్తులన్, బొగ్గులుసేసి జారుకళిఁబొందికటా
కడుపేలతెచ్చుకొంటి. . భాగ. ౯ ౩౪౭.

**బొచ్చు.** వి. రోమము, కాంద్రుక.

సీ. రోమము బొచ్చున ద్రుమ్మండు నా మీసము...
ఆం. భా. ౨. ౧౪౬.

**బొచ్చె.** వి. కరోటికోశము; తలపెంకు.

గీ. తనయుని గరోటి క్రొవ్విర పునుక ... బోలె
బొచ్చె నా ... ఆం. భా. ౨. ౧౩౩.

**బొజంగు.** (సం. భుజంగః)౧ విటుఁడు, వేశ్యాపతి

క వడివడి నెలనెలఁదులనెం,బడో నదకించిరి
పోరిఁపోరిఁ బ్రాయపుఁ బొజంగుల్.
అచ్చ. రా. అరణ్య. ౧౫.

క నాకుఁదుబొజంగు వినుము న్య,పా! కట
విటుకై ష్యుఁ దర్థపతి యనువాతం,డు...
దశకు. ౬. ౯౯.

సీ. విటనామధేయమా విటకాఁడు పేడుక కాఁడు
బొజంగు నన్నుకాఁడు లంకె,కాఁదనఁగ ..
ఆం. భా. ౨. ౧౧౬.

౨ ప్రభువు, అధిపతి

మాలిని జగములయొకిమీఁదా జాకువాడింటి
వాఁడా, తిగకోటికలగొంగా దిట్టకేకే
బొజంగా. అచ్చ. రా. కిష్కి. ౧౦౯.

జ' బొజంగులాఁడి

**బొజంగులాఁడి.** వి. (బొజంగులు + ఆఁడి ) పైన్యరిణి, అంకటాలు

సీ. బొజంగులాఁడి లోడారిబుద్ధి పల్గాకి
జాదరి రొమ్మెబ్బెరాసి గాతలకోటారు.
చెన్న. ౨. ౨౪.

**బొజ్జ.** వి (క బొజ్జె) పొట్ట, కడుపు.

సీ బొజ్జన బొజ్జనఁ బొట్టన డొక్కనఁ గడు
పనఁ గుక్షియాఖ్యలు చెలంగు.
ఆం. భా. ౨. ౧౩౪.

గీ. అమృతమధురంబు లగుగాడ్పు లానియాని,
బొజ్జపెంచినపెనుపాఁపపెజ్జమీఁద . కారి
పవ్వళించు హైమ ౫. ౪౪.

గీ లెక్కలిడరానిరాయంచజక్కిబోదు,గ్రుడ్లఁ
బనఁటులు నిండారు గప్పబొజ్జఁ బూను
పెనుదంట .. నీలా. ౧ ౪౪.

జ' బొజ్జదేవర, బొజ్జవాఁడు

**బొజ్జదేవర.** వి. (బొజ్జ + దేవర ) వినాయకుఁడు.

గీ. గుజ్జువేలుపు పిళ్లారి కొమ్ముకొమ్ము బొజ్జ
దేవర ... వినాయకుసకుఁ పేర్లొప్పును ...
ఆం. భా. ౧. ౪౫.

**బొజ్జవాఁడు.** వి. (√ బొజ్జ) తుందిలుఁడు, పెద్ద పొట్ట గలవాఁడు.

ఉ. కాకటిబొట్టె తెందుపోరకాయలబుజ్జులు
కంట్లపెద్దలుక్, కూఁతగ తెక్కుసంబయిన
మాటలు మున్నగువానిఁ గొంచు మీ, రీవిధి
నెంచు పోరెూదరో . చెన్న 3. 33.

ఆ. పాప బుడుత చిఱుత పట్టె పిసువు కందు,
మాన నిసువు బిడ్డ కుఱ్ఱ బొట్టె, యనఁగ శిశు
సమాఖ్య లగు ఆం. సం. మాన ౧౨
౨ వృత్తి)క, కూఁతురు.

వ అప్పు డప్పుడముదాల్పుదొరబొట్టె యిట్టి
ట్టనరానిసొగసులుట్టిపడ దండంబుబెట్టిన
మృ వి. 3. ౧౨

**బొట్టె² = బొట్టియ².** వి కోడికాలివెనుకప్రక్కనందు వాఁడియైనగోరు, అట్టి యాకారముగల బాణాగ్రము, ములికి.

సీ . . నార బొట్టె యనఁ దదంఘ్రిజన్య,
కంటకాతిని తాంగం బొప్పు
ఆం. భా. ౨ ౯౨

గీ కాల మసమూనటీఁడు బింకంబుతోడ, సరకు
సేయక ధీకరతరశమిప్రసారణముఁ గూల్పఁ
జాచు కటారికోల, తెండిబొట్టెయుఁబలెఁ
దోఁచె వేఁగుఁజుక్క. పరమ 3. ౨౪౪.

జ బొట్టెకోల.

**బొట్టెఁడు=బొట్టియఁడు.** వి కొడుకు, పుత్రుఁడు, పిల్లవాఁడు, బాలుఁడు.

క. బొట్టెఁడ వీ పెట్లు నిలిచి పోరెదు
చెపుమా అచ్చ రా బాల ౨౦౨

**బొట్టెకోల.** వి (బొట్టె² + కోల) కోడికాలి వెనుకప్రక్కనుండు వాఁడిగోరువంటి ములికిగల బాణవిశేషము

గీ ఒప్పుచున్న వియమని చెప్పనార, కాయనకు
బొట్టెకోలలు గానె నాళ,ములఁ బ్రకాశించు
కామరశెుంగ్గ లరయ. కళా. ౪. ౧౩౩.

(కామరశెుంగ్గవంటి ములికిగల బాణవిశేషము. అని శ. ర.)

**బొట్ట్రొనర్చు.** స క్రి. (√బొట్టు) లేకుండఁజేయు, నశింపఁజేయు.

సీ. తమ్ముల దోషాక్తిఁ గ్రమ్మి మాపికలట్టు
నయశాలలను బొట్ట్రొనర్చుకొంటె.
బిల్హ. ౧. ౩౪.

(బొట్టరొనర్చు అని యర్థాంతరము. కాలిబొట్ట
లతో జంతులకు సాదృశ్యము ప్రసిద్ధము.)

**బొడబొడ.** వి కక్కుట కాఱుట ప్రాయుట మున్నగువానియందలిధ్వని కనుకరణము.

క బొడబొడ నెత్తురు గ్రక్కుచుఁ, బడిరొఁ
బ్రలంబుండు గోపబాలురు చెలఁగక్.
దశ. ౯. ౨౨

వ బొడబొడను వడలెడు నుడుతునెత్తుట
న్నడలి మనుచ. ౪. ౭౦.

ద్వి. పుతియమాఁగలు బొడబొడమనిప్రేరాయ.
ద్వి. హరిశ్చ. పూ. ౨౦౭౦.

**బొడిగ.** వి. బాలకుఁడు

సీ బాలకసంజ్ఞ నలువు మీఱ,. .బుడుత
కుఱ్ఱ కొడుకు బొడిగ . ఆం. భా. ౨. ౧౧౯.

**బొడిప.** వి. చెట్లయందలిబుడిపి. (శ. ర.)

**బొడిబొడి.** వి దుఃఖించుటయందగు ననుకరణము

ద్వి బొడిబొడిఁ బొక్కుచుఁ బొవుచున్నంతఁ,
దొడరంగఁ బతియు బంధులు సేఁగుదెంచి.
పండితా మహిమ. ౨౯౪. పా.

**బొడిమ.** వి పాతకొళ్లబిరడ (శ. ర., గ్రా.)

**బొడియ.** వి కుటుపము, చేతిపిద్ద.

సీ బొడియ యం చనఁగను బొలుచును గుతు
పంబు ఆం భా ౨ ౨౪౩ (రెండు
పిడ్డలకు వేసెడు పెన అని శ ర)

**బొడ్డ.** వి వృక్షవిశేషము, అత్తిచెట్టు. (శ ర., గ్రా)

**బొడ్డనబావి.** వి నడుమచిన్నరాయిగల కోనేఱు.

క. మన బొడ్డనబావులలో, వనువిసముఁ జరించు
నంచలం దోరకాంతాంగన దోయి చెప్పఁ
దంత్రి, కని విని సె నెందు నెఱుఁగ గని
విద్యలకుక్. ప్రభా. ౪. ౫౭.

వ... వజ్రపురంబునం గల కొలంకులం దటా
కంబులం గొలఁకుల బొడ్డనబావుల నడ్డు,

పెట్టు లేక విహరించుటకు వజ్రబాహు మొదల యడిగి ... ప్రభా. ౧. ౧౨౧.

బొడ్డసరము=బోడసరము. వి. ఓషధివిశేషము, పైరులలో మొలచు ఒకవిధమగు చిన్నచెట్టు. (బ్రౌ., శ. ర.)

బొడ్డి. విణ. ౧. మూర్ఖురాలు, వివేకములేనిది

క ఒడ్డారంబునఁ దులువై, యడ్డిడ కారెడ్డి సాము మఱచి మనమునన్, జడ్డనఁ గులముఁ జెఱచు నా,బొడ్డిని రా జంత యంతిపురమున గనిచెన్. ఉ. హరిశ్చ ౪. ౫౮.

౨ లోతైనది

ద్వి. పొట్టయు వడగొంతునోయినవీఁపు, బొడ్డి కన్నులు ముడిచొములు బ్రేల్ జడలు
పండితా. దీక్షా. ౪౦. పా.

బొడ్డిగము. వి అవివేకము. (చూ. బొడ్డిగీఁడు)
జ: బొడ్డిగీఁడు.

బొడ్డిగీఁడు. విణ. (√బొడ్డిగము) మూర్ఖుఁడు, అవివేకి.

గీ. రెడ్డిగాడుకైవ యొకయొడ్డ బొడ్డిగీఁడు
ఉ. హరిశ్చ ౪ ౧౨

బొడ్డు. వి (త. పొట్టు) ౧ నాభి, పొక్కిలి.

సీ. . బొడ్డు పొక్కిలి యనఁ బొసఁగు నాభి
ఆం భా ౨ ౧౩౮.

౨. నాభినాళము.

గీ. . మరునకుం గుసుమర్తు వన్మంత్రసాని, బొడ్డు గోసినకాడువలినో శ ఆము. ౫ ౧౧౨

౩. గిన్నె పీసా మొదలగు వానికిఁ గ్రిందుభాగమున లోపలికి మొనగానుండు ప్రదేశము

చ. దేవతలఘట్ట మొసంగుచు బొడ్డుగిన్నెలో, సుసుతురు రాగిసంకటి తలోదరులు
శుక. ౨. ౩౩౫.

౪. నూతిచుట్టును ఎత్తుగా కట్టినగోడ. (శ. ర.)

జ: బొడ్డుఁజవిక, బొడ్డుకొంగు, బొడ్డుగంట, బొడ్డుపుడక, బొడ్డుమల్లె, బొడ్డువంచు, బొడ్డారు, బొడ్రత్నము.

బొడ్డుఁజవిక. వి. (బొడ్డు + చవిక) చుట్టుకొల్లారము వడిమిచావడి (శ. ర.)

బొడ్డుకొంగు. వి (బొడ్డు + కొంగు) బొడ్డుకడ చెక్కుకొనుకట్టు ఒట్టుకొన

(వ్యవ) వాఁడు డబ్బు బొడ్డుకొంగున గట్టిగా కట్టికొనివాఁడు

బొడ్డుగంట. వి అలంకారవిశేషము, మొలగంట.

గీ భూరితారావళులు మొలపూసలయ్యెఁ, గమలినీనాయకుఁడు బొడ్డుగంట యయ్యె.
సీతా వి. ౨. ౧౩౦.

బొడ్డుపుడక. వి (బొడ్డు + పుడక) కఱ్ఱతోఁజేసిన యొకవిధమగు పనిముట్టు, దూదేకులవాండ్రుపయోగించు కొయ్యముట్టు (శ ర., బ్రౌ.)

బొడ్డుమ(ల్లియ)ల్లె = బొండుమల్లె. వి. (√బొడ్డు) ఒకజాతిమల్లె ‡ లతావిశేషము, దానిపుష్పము

ద్వి కన్నె గేదంగులు గరవీరములును, పొన్నలుఁ బొగడలు బొడ్డుమల్లియలు
ప్రభులిం. ౨ ౧౮. ౩. పం.

గీ. పొగడలును బొడ్డుమల్లెలుఁ బొన్నవిరులుఁ బాన్పునను నాల్గుదిక్కులఁ బఱచికైచి
పి. శకుం ౩ ౪౧.

బొడ్డువంచు. అ క్రి. (బొడ్డు + వంచు) ఓపిక గలిగి యుండు.

ఉ ఏపనికైనను బొడ్డువంపకే, దండుకొఁ దోడు చీమ చిటుకన్నను వాదుకు వచ్చుచుండు
భోజరా. ౬. ౧౪౨.

బొడ్డారు(రిక). వి. (√బొడ్డు) పశురోగవిశేషము.

క తొట్రుపడు లేచఁ బలుమరు, నిట్టలపడి చూచి కాళ్లు నీల్గుచునుండుం, బొట్టదు మొయ్యదు బొడ్డారు పుట్టిన పసరము చికిత్స పొందరుగంగా.

సహదేవపశువైద్యశాస్త్రము. ౧౧. పా. ౩౪. ప.

బొడ్రత్నము. వి. (బొడ్డు + రత్నము) [illegible] దుండు మణి, భాగ్యవిశేషము.

బోల. వి. ౧. కుండబొచ్చు.

క మ, మ్మేలాగున రక్షించెదో బోలెడు
కుడిగలుగువారము పుణ్యముచేతన్
చంద్ర వి. ౩ ౭౭ ('బోలెడు = మిగుల
నధికము' అను నర్థమున తఱచుగా వాడఁ
బడును )

గీ. తనరును గరోటి కప్పెర బుఱక పుఱ్ఱె పుచ్చె
యనఁగను దగు బోలె గొచ్చె బోఁకి, పెంచు
పెంచిక పెంచి పెంకం చనంగఁ, దద్విశే
షాఖ్య అం భా ౨ ౨౩౩

౨ ఓటికుండ (శ ర ) ౩ కత్తు పాల, కక పాల,
సన్న్యాసుల చంకను ధరించు కుంచి

సీ బోలె నాఁగను గకపాల నాఁగను గక్ష
పాలాహ్వయంబుగాఁ బరగు
అం భా ౨ ౧౭౭

బోలెము[1]. వి వేగము

క అలోనఁ జంద్రహాసుఁడు, మేలుకనుచు
నవుడు తత్సమీపసరః ప్రక్షాళితముఖుఁడై
కసిగని, బోలెమునఁ గదిల్చి నిగరముఁ బ్రవే
శించెన్ జై భా. ౪ ౭౯

బోలెము[2]. వి వేఁటకుపయోగించుసాధనవిశేషము.

మ గళభాగమ్ముల బోలెము లొ దలఁ జక్క-
మ్ముల్ వలగ్నస్థలంబుల నెంలే గడి తోళ్ల
నంట మెఱయన్ చంద్రా ౨ ౧౦౭

బోళము. వి (సం బోలః ) ౧ వృక్షవిశేషము

సీ భూతాంకుశ మశోకభూర్జపత్త్రమ్ములు బోళమ
మంకెన పులుసు గొంగ, రేఁగు
వాఁస ౪ ౧౧

౨ గంధరసము

ఉదా. బోలెంతబోళము.

సీ. అన్నభేదియు వస యక్కలకఱ పంచలవణ
చవ్యములు బోళము మణిశిల
హంస. ౨ ౨౨౭.

బోళా. విశే. (హిం భోలా) అమాయకుఁడు,
కపటములేనివాఁడు. (శ. ర.)

వ్యవ. అతఁడు పట్టిబోళావాఁడు.

బోసి. విశే ౧. దంతములులేనిది.

గీ బోసినోటను దమలంబు బూని యుటుల,
విటులఁ బలుమాఱు నగఁజేయు వృద్ధవేశ్య.
రా. వి. ౩. ౭౧.

౨ అలంకారశూన్యము, నగలులేనిది

ఉదా బోసిచెవులు, బోసిమెడ మొ॥

ఆ ముక్కు-లేని బోసిమొగమున వాడలెడి, నిడుద
యూర్పులోడ నెత్తురొలుక విక్ర ౭ ౧౬౦
(ఇట నాసారూపమగు భూషణములేనిది
అని భావము )

బోసిపులి = పండ్లులేనిపులి, చడిచప్పుడు
కాకుండ పరధనము లపహరించువాఁడు.

(వ్యవ ) అయ్యో! అతఁడా! బోసిపులి

౨ బోసిపుచ్చు, బోసివడు, బోసిపోవు

బోసిపుచ్చు. స క్రి (√బోసిపోవు) బోసియగు
నట్లుచేయు

సీ పటుచపేటంబునఁ బండ్లు డుల్లఁగ మొత్తి
బ్రాహార్కవదనంబు బోసిపుచ్చె
కాశీ. ౨ ౧౮

బోసివడు. అ క్రి (బోసి + పడు) పండ్లులేనిది
యగు, దంతశూన్యమగు

సీ ఎగ్గొట్టన వేఁడియొండఁ బండులు రాలి
బ్రాహార్కవదనంబు బోసివడియె
భీమ ౩ ౩౭

బోసిపోవు. అ క్రి (బోసి + పోవు) దంతాది
శూన్యమగు, పండ్లు మొ॥ లేనిదియగు.

సీ బ్రాహార్కవదనంబు బోసిపోయినయట్లు
విఘ్నినిచక్రంబు విఱిగినపుడు భీమ. ౬.౪౪.

ద్వి పుటములతో ముక్కు బోసిపోఁ గఱచి,
పటుగతి మీఁదికి భానుజుం డెగయు.
రం. రా యు. ౪౧౨. పొ. ౭. పం.

బోసేయు. స క్రి (బోనము + చేయు) భుజించు,
తిను (వ్యుత్పత్తిని వర్ణలోపము.)

ద్వి సిరి గల్గిలేని బోసేయుట కాక, రొండుల
గంతులవెట్టనొప్పునే యిట్లు.
అ. మ ౪. ౧. ౩౫. పొ. ౨౫. పం.

గీ తెచ్చి 'సుఖమతి' యను నామధేయమునను, బరగుబ్రియురాలిచేత కేర్పరంగనీయ, నాబి పెన్నంబు సంకటి యంబలియును, శేయ పనులేయివేళ బోనీసిపోవు హంస ౪ ౩౨

## బౌ

బౌద్ధము. సం వి అ న బుద్ధునిచే గచింపఁబడిన నిరీశ్వరశాస్త్రము

బౌద్ధుఁడు. సం. విణ (అ. ఈ అ) బుద్ధునిమతమ నవలంబించినవాఁడు

బౌద్ధులు మాధ్యమికులు, యోగాచారులు సౌత్రాంతికులు, వైభాషికులని నాలుగు తెఱఁగులు. వీరలు క్రమమున సర్వశూన్యత్వము, బాహ్యశూన్యత్వము, బాహ్యార్థానుమేయత్వము, బాహ్యార్థప్రత్యక్షత్వమును నవలంబించువారు (కల్ప)

బౌధుఁడు. సం వి అ పుం. బుధునిపుత్త్రుఁడు, పురూరవుఁడు

## బ్ర

బ్రంను. అ క్రి. లేనినిందమోపు

ద్వి. ఎందున నిది పాప మీపాపఫలము, బ్రందిన జనులకో పార్థివేంద్రునకో

రం రా. ఉ ౧౨౪ పా ౧౧ పం

బ్రక్కఁ = బక్క. విణ. ౧ కృశుఁడు, చిక్కిన వాఁడు. ౨ దీనుఁడు

గా. అబ్రహ్మణ్యములోన నైచికోన నవ్యాయంబున నృత్కుస్రక్క, ఈబ్రక్క ద్విజాఁ జూడరయ్య పథవారీరంగధర్తంచు.

అము ౬ ౧౦౧.

బ్రగతి. సం. = ప్రగతి, లత.

బ్రతికించు = బ్రదికించు. స క్రి (√బ్రతుకు) "బింపఁజేయు, బ్రతుకునట్లుచేయు

వ. అ,చతురత్వం బిటుఁ గొంత గానఁబడె నీ చంద్రాననం గూర్చి నన్, బ్రతికింపంగడ ముద్దుఁగీరమ .. విజ. వి ౨ ౧౪౪.

క. పితరదౌర కేటబ్రాటక్క, జతనంబునఁ బిత్తుమిగుల జడుపునసెదలో, జతగుడుచు కపసి బిడ్డని, బ్రతికించి యపంబు గన్న బల్లిదు న కొగిన్ సీలా. ౧. ౨౨.

బ్రతుకు = బ్రదుకు. అ క్రి జీవించు, సుఖజీవనముచేయు

గీ ఎవ్విధంబైన నేమి నీవిభుడు తిరుగ, బ్రతికివచ్చితివి ఇందు ౪. ౪౯.

క గాండీవము నీచేతిది, పాండవునిన్ జేరఁబట్టి బ్రతికితిమి మను చ. ౩ ౪౪.

గీ వాద మేమాయె నన్న భూవరునిపత్ని,పాత మాదానకిఁ గల్గి బ్రతికె నసెడు,వారు అము. ౪. ౬.

వి. ౧ జీవనము, సుఖజీవనము

క పెరపెట్టుమనే యిఁక నీబ్రతుకు ఒయల్లాను నాలిపయ్యెరకష్టా సీలా. ౩ ౨౪

గీ. మానుషిల్లంబున్నంబు మేలనంగఁబడునె పరికింప విషములో బ్రతుకుగాదె దశా ౧. ౧౩౮

గీ తోఁచు జీవమ్ముగను మనుట, మనికి బ్రతుకు బ్రదిమి యన ఆం భా ౨ ౨౨౬.

క తనబ్రతుకు భూమిసురులకుఁ, దనవిరుదుల పంటవంశిరణీశులకున్, దననయము భూమి ప్రజలకు ననవేమన యిచ్చెఁ గీర్తి నధికుం డగుచున్ వి పు. ౧. ౩౦.

౨ జీవనోపాయము, బ్రతుకుఁదెరువు.

క పెలఁకువ లథమాధమములు, పలుకు లసత్యములు లేవు పౌరుషములు నేన్పులు రిత్త బ్రతుకులు తఱుచు,గలవని చెప్పంగరాదు కలియుగ చేరన్. వి. పు. ౬. ౩౯౮

సా: మెతుకువోయిన బ్రతుకువోవు ననుకొనుట. (పరమలుబ్ధుఁ డనుట.)

౩ స్థితి, ఉనికి.

చ ఈ,జగములపుట్టువుం బ్రతుకుఁ జావును నీవలనన్ స్వభావమై, పెగడినరాజుతాదిక మనీయగుణత్రయి చేష్టితంబులు ...

వి. పు. ౨. ౬౯.

చూ: బ్రతికించు, బ్రతుకుమందు.

**బ్రతుకుమందు.** వి. (బ్రతుకు + మందు) సంజీవ ఔషధము.

సీ. అనిలజుండు ...బ్రతుకుమందులనగమును దెచ్చి .. (రామయుద్ధార్థమున.)
రాఘవ. ౪. ౨౩౯.

**బ్రదికించు = బ్రతికించు.** స. క్రి. (√ బ్రదుకు) జీవింపఁజేయు.

మ. హృదయాహ్లాదకరుండు విక్రముని నిష్కాంతదుర్గంబులో, బ్రదికింప న్మదిగోరె భర్త. దశకు. ౨. ౪౧.

ద్వి. పదముల వ్రాలి భూపాలబాలకుని, బ్రదికించి నానిందఁ బాపి రక్షింపు.
ద్వి. హరిశ్చ ౨౬౪౫

ద్వి అదిగాన మమ్మాదరయామతిఁ బాదిఁ బ్రదికింపవే యని ప్రస్తుతింబంగ.
బస. పు ౫ ౬౭౩. పం.

**బ్రదిమి.** వి. (బ్రదుకు) జీవనము.

గీ...తోఁచు జీవనమ్ము వనుమనుట, మనికి బ్రతుకు బ్రదిమి యన . .
ఆం. భా ౨ ౨౨౬.

గీ. అరయఁ గారణ మింపుకరైన లేక, బలము గలవాఁడుబడుగైన బలము లేనివాఁడు బలశాలియుఁ దెలియంగవలయు వాని, బ్రదిమి యునిమిదినెల లౌట భవ్యమతులు.
శివయోగసారము. ౫ ౨. ౮ (౪. ౪)

**బ్రదుకు = బ్రతుకు.** అ. క్రి. జీవించు, మను, సుఖజీవనము చేయు.

చ....మానినికిం దమఁదాన కాదికో, వాదవినదానఁజేసి సభ నొచ్చెము దక్కినఁ బాండునందనుల్, బ్రదికిరి గాక యయ్యేడరు రాచకొమారులు కోర్వునట్టిదే.
భార. ఉద్యో. ౧. ౩౪౭.

శ్రీ. [illegible] నైన బ్రదికి పోవఁగ నీని కార్యంబు ... దశకు. ౧. ౬౬.

ద్వి. బ్రదుక కొల్లకయున్నఁ గొలమ్ము నీవు, కదనంబు కాదోడఁ గావించుగాక.
రం. రా. యు. ౬౧. పా. ౨౭. పం.

శా.. యోగ్యాలా వాలాయము సేయఁగా బ్రదుకు నీ వాచారవంతుండవై. మను-చ. ౩. ౯౪.

చ. బ్రదుకుము విక్రమార్కనరపాలక దిగ్విజయంబు చేసి .. విక్ర. ౧. ౨౦౩.

సా బ్రదుకు జీవుఁడా! (కష్టములు తీఱినవి అను భావమున నిది వాడఁబడుచున్నది.)
బ్రదుకుజీవనమని బ్రాహ్మణుఁ డట్టి మెదపులఁ గొన్న రాముఁడు చోద్యమంది.
రం. రా. అయో. ౧౦౭. పా. ౪ పం.

వి జీవనలు, మనికి, సుఖజీవనము.

గీ మునుబు నజాఁడు మున్నుగ మహామూర్తి విష్ణు, నుదరదేశంబు సొత్తురు బ్రదుకఁ గోరి.
హరి. పూ ౧. ౧౬౧.

ఆ బ్రదుకు చేటు బోగడుబడుట దూతోందుట, యీగి వేఁడుకొనుట.
భార. ఉద్యో. ౨. ౪౯.

క....లక్ష్మి,హృదయేశుఁడు నిను వేడఁగ బ్రదికితి నీబ్రదుకు బ్రదుకుబలిభూపాలా.
విక్ర. ౨. ౧౫౦.

౨. జీవనోపాయము, బ్రతుకుఁదెరువు.

సీ. పాపాత్ముఁ డొకఁడోయ పక్షుల వధియించి, తినియును బెక్కమ్మికొనియు నదియు, బ్రదుకుగా. భార. శాం ౩. ౩౦౪.

క. ఏ వెతఁగినబ్రదుకేగద, యీనడువడి యొల్లు గలిగె నింతటిలోఁ గాం,తా విక్షేపము గంటివో .. శుక. ౩. ౨౬౫.

౩. ఆయువు, జీవితకాలము.

సీ. కాకిపిట్టకుఁ జాలఁ గడలేనిబ్రదు కిడి.
నీలా. ౧. ౧౧౧.

చూ: బ్రదికించు, బ్రదిమి, బ్రదుకుఁదెరువు.

**బ్రదు(తు)కుఁదెరువు.** వి. (బ్రదుకు + తెరువు)

౧. ప్రాణరక్షణోపాయము, వృత్తి.

గీ. పాండవులయట్లు రాధాసుతుండు గాదు, బలుకులు నియ్యకోను నీవు బ్రదుకుఁదెరువు, కట్టు ... భార. కర్ణ. ౩. ౨౪౨.

గీ. బ్రదుకఁ జేరదు విడి నీకు నీబుద్ధి వైర, మడిగి నా మాట వినుము ... రామా. ౬. ౧౬౫.

క. మన కెల్ల బ్రదుకఁ జేరదుపుడు, మనమున కింతయుఁ బ్రియంబు . . భా. రా. కిష్కి-౦. ౫౫౧.

(వ్యవ.) వానికేదియు బ్రదుకఁ జేరదుపుగన్పడ లేదు.

బ్రద్ద$^{1}$ = బ్రద్ద, బద్ద. వి. (సం. భిత్తకః.) ౧. శకలము, తునుక.

ఉ. తోఁచు శకలసంజ్ఞ . బ్రయ్య బ్రక్క-బ్రచ్చు బ్రద్ద బ్రద్దర పత్తి యన ఆం. భా. ౧. ౪౯.

౨. చీలిక. (శ ర.) విణ. పలుచనిది.

ద్వి వద్దు మొగంబును వలుద చేతులును, బ్రద్ద చెంటలొడలు బరదుప్రక్క-లును. పండితా. దీక్షా. ౮౦. పా.

ద్వి బ్రాఁయుపట్టినపండ్లు బ్రద్దచేతులును. బస. పు. ౩. ౧౧౧౪.

జ: బ్రద్దరి, బ్రద్దలుసేయు.

బ్రద్ద$^{2}$. వి. (సం. బ్రేత్రమ్.) వేత్రము. (చూ. బ్రద్దలవారు.)

జ: బ్రద్దపరి, బ్రద్దలవారు.

బ్రద్దపరి. వి (√బ్రద్ద$^{2}$) పేముతో నల్లిన కేడెము.

గీ. వాశేము ల్వ్రెట్టి క్రొంతలు బ్రద్దపరులఁ, గత్తి గొంతంబు వాఁడివెల్లఁ గత్తళములు. ఉ. హరి. ౨. ౯౨.

ద్వి. బరవసంబున వాలుఁబడియున్న బ్రద్ద,పరి యును గొని శరబలియుఁ డో నెగసి. రం. రా. యు. ౩౪౫. పా. ౨౮. పం.

బ్రద్దర = బ్రద్ద. వి. (బ్రద్ద$^{1}$ + అర. స్వార్థమున) ౧. శకలము, తునుక. (చూ. బ్రద్ద.) ౨. చీలిక. (శ. ర.)

బ్రద్దలవారు. వి. బ. (√బ్రద్ద$^{2}$) వేత్రహస్తులు, కట్టికవారు.

ఉ. బ్రద్దలవారిఁ గ్రొన్ని పురంబున వారవిమ్రుబ్ర సిద్ధులా, పెద్దలెల్ల విచ్చటికిఁ బిల్వఁడు పొండన ... చెన్న. ౫. ౨౩౫.

ద్వి. తనసేవఁ గూర్చు బ్రద్దలవారిఁ బనిచె. రం. రా. యు. ౩౩౫. పా. ౩౦. పం. (ప్రధానులఁబనిచె. ప్రా. ముద్రి. పా.)

చ. సిరులఁదనర్చుదివ్యసభఁ జేరఁగవచ్చి పరాకు జెయ్య రా,చ్చరిక యనఁబోయటంచు సరస ధ్వనితో నిరుపంకలన్ బరా,బరు లొనరించుచుం బసిఁడిబ్రద్దలవారలు దెల్పు జేలు పున్, దొర లిరుగేలు ఖడ్గములతో మకుటంబుల నుంచి కొల్వఁగన్ చంద్ర. ౨. ౬౪.

(పసిఁడిబ్రద్దలవారు = కనకవేత్రధరులు.)

బ్రద్దలుసేయు. స. క్రి. (బ్రద్ద$^{1}$) పగులఁగొట్టు

చ. అటుల మరు త్తధూవిభునియజ్ఞ ధరాస్థలిఁ జూచి యార్చుచున్, బటుమహోర్చుటుల్ దిశలు బ్రద్దలుసేయ నజయ్యుఁడై. ఉ. రా. ౩. ౧౫౩.

బ్రధ్నచక్రము. సం. వి. అ. న. సూర్యచక్రము, రాశిచక్రము. (విల్యమ్సు.)

బ్రధ్నత్వము. సం. వి అ. న. ౧. గొప్పతనము. ౨. బలిష్ఠత.

బ్రధ్నబింబము. సం వి. అ. న. సూర్యబింబము.

బ్రధ్నము. సం. వి. అ పుం ౧. జిల్లేడు. శ్రీ. ౨. దినము, పగలు. ౩ గుఱ్ఱము. ౪. వృత్తకాలము. ౫. వేరు, బుధ్నము. (శల్ప.) న. రోగభేదము.

బ్రధ్నుఁడు. సం. వి అ. పుం. ౧. సూర్యుఁడు ౨. శివుఁడు.

బ్రమ. వి. (సం. భ్రమః) మోహము. (చూ. బ్రమపెట్టు.)

జ, బ్రమయించు, బ్రమయు, బ్రమపెట్టు.

బ్రమయించు. స క్రి. (√బ్రమయు) భ్రాంతి నొందఁజేయు, మోసగించు; మోహింపఁజేయు.

సీ. పగలెల్ల నాటల బ్రమయించుచును నుండు, గొందు లెల్ల వెదకికొనుచు రేలు, కన్న గాండ్రగుచు నగళ్ల బ్రవేశించు ... ప్రభా. ౧. ౧౦౯.

ఉ....కలకంఠ దీని నిం,కేమనిచూడ్ర చూచి బ్రమయించెద నంచు. ఉ. శా. ౬. ౪౯.

చ. భ్రమియించుచు నింగికిన్ నెగసి కన్పడని
ప్రమాదముం గూలం ద్రోయుచున్, బ్రమరలు
వాలుచున్ దెసలు బ్రయ్యఁగ వార్చుచు...
భా. రా. సుం. ౨౨౩.

బ్రమవెట్టు. స. క్రి. (బ్రమ + పెట్టు) మోహింపఁ జేయు, మోహపెట్టు.
గీ. అందఱను బ్రమవెట్టుచు నవ్వభూతి ...
హర. ఉ. ౧౦౪.

బ్రమ్మి. వి. (సం. బ్రాహ్మీ.) ఒకవిధమగు కూరాకు చెంచ్కి, పొన్నగంటికూర. (సామిదచెట్టు అని శ. ర.)

బ్రల్లు. వి. విఱుగుటయం దగు ధ్వని, ఆ ధ్వని కనుకరణము.
ఉ. రావి కడిందికొమ్మయును బ్రల్లునఁ గూలెవిద చేసు బోవుచున్. పరమ. ౫. ౨౨౭.
(బ్రల్లన. శ. ర. పా.)

బ్రసి. ప్ర. వి. ఈ. స్త్రీ. = బ్రుసి. (శ్రీ. ని.)

బ్రహ్మ. సం. వి. న్. పుం ౧ హిరణ్యగర్భుఁడు (నవబ్రహ్మలు - భృగువు, పులస్త్యుఁడు, పుల హుఁడు, అంగిరసుఁడు, అత్రి, క్రతువు, దక్షుఁడు, మరీచి) ౨. బ్రాహ్మణుఁడు ౩ ఋత్విగ్భేదము. ౪ బృహస్పతి ౫ (జ్యోతి) విష్కంభాది యోగములలో నిరువదియేడవది

బ్రహ్మకన్యక. సం. వి ఆ స్త్రీ ౧. సరస్వతి (త్రి ని.) ౨. బ్రహ్మీలత

బ్రహ్మకమ్మి. వి. వి ఉత్తరపుకట్టు, రెండు మూఁడు గుడ్డకుక్కల నొకటిగాచేర్చి అడ్డముగా కట్టినట్టి పెద్దకట్టు.
సీ. తడిదోవతి తిమ్మళ్ళ పడిమికి వడిఁ జింపఁ గట్టుకొ౦టబడె బ్రహ్మకమ్మి శైలి.
శై. భా. ౪. ౨౬.
సీ. త్రోక్కు చేలావెంటకుంట్లై బ్రహ్మకమ్ముల చింపి దోవతి ముటికిపలత. వరాహ. ఉ ౧౭.

బ్రహ్మకళ. సం వి ఆ. స్త్రీ. (మనుష్యుల హృదయ మందు వసించెడు) చైతన్యశక్తి.

బ్రహ్మకాష్ఠము. సం. వి. అ. పుం. పట్టుతురుగు చెట్టు (విల్యమ్స్., ఆ. ని.)

బ్రహ్మకుండము. సం. వి. అ న. బ్రహ్మచే నిర్మింపఁబడిన ఒకానొక సరస్సు.

బ్రహ్మకుశ. సం. వి. ఆ. స్త్రీ. జీలకఱ్ఱ.

బ్రహ్మకూటము. సం. వి. అ. పుం. ౧. ఒకా నొకపర్వతము. ౨. బ్రాహ్మణులసమూహము

బ్రహ్మకూర్చము. సం. వి. అ. న. ౧. ఒకానొక వ్రతము
శ్లో. అహోరాత్రోషితో భూత్వా పౌర్ణ మాస్యాం విశేషతః, పంచగవ్యం పిబే త్ప్రాతః బ్రహ్మకూర్చ మితి స్మృతమ్.
౨. కుశోదకము.

బ్రహ్మకైవర్తము. సం. వి. అ. న. అష్టాదశ పురాణములలో నొకటి.

బ్రహ్మకోశము. సం వి. అ. పుం. వేదభాగము (విల్యమ్స్).

బ్రహ్మకోశి. సం. వి. ఈ. స్త్రీ. అజమోద, ఒక విధమగు ఓమము. శ్రీ. (రా. ని.)

బ్రహ్మగంధము. సం. వి. అ. పుం. బ్రహ్మకమ

బ్రహ్మగర్భ. సం. వి ఆ. స్త్రీ. అజగంధ వాయింట. శ్రీ (రా. ని.)

బ్రహ్మగర్భుఁడు. సం. వి. అ పుం ౧. కుమా స్వామి. (శ్రీ. ని ) ౨. న్యాయాధికారి (విల్యమ్స్)

బ్రహ్మగాయత్రి. సం. వి ఈ. స్త్రీ గాయత్రి భేదము.

బ్రహ్మగిరి. సం. వి. ఇ. పుం. ఒకానొకపర్వతము

బ్రహ్మగోళము. సం. వి. అ. పుం. బ్రహ్మాండము ప్రపంచము.

బ్రహ్మఘాతకుఁడు. సం. విశే. (అ. ఆ. అ బ్రహ్మహత్యచేయువాఁడు.

బ్రహ్మఘాతిక. సం. వి. ఆ. స్త్రీ. ఘాతిక, పెద యతుగు చెట్టు.

బ్రహ్మఘాతిని. సం. వి. ఈ. స్త్రీ. రెండవనాఁటి రజస్వలాస్త్రీపేరు.

శ్లో. ప్రథమేఽహని చండాలీ ద్వితీయే బ్రహ్మఘాతినీ.

బ్రహ్మఘోషము. సం. వి. అ. పుం. ౧. విషము (వై. వి.) ౨. వేదము. (విల్యమ్సు)

బ్రహ్మఘ్నుఁడు. సం విశే. (అ. ఆ. అ) బ్రహ్మఘాతకుఁడు.

బ్రహ్మచక్రము. సం. వి. అ. న ౧. సంసారచక్రము. ౨. డోలాచక్రము.

బ్రహ్మచర్యము. సం. వి. అ. న ౧ వేదాధ్యయనముకయిన నియమము. ౨. నాలుగాశ్రమములలో మొదటియాశ్రమము

బ్రహ్మచారి. సం. విశే. (న. నీ. న.) ౧. వేదాధ్యయనమునకయి వ్రతమాచరించువాఁడు. ౨ బ్రహ్మచర్యాశ్రమమును స్వీకరించినవాఁడు. వి. న. పుం. కుమారస్వామి. (వై. వి.)

బ్రహ్మచారిణి. సం. వి. ఈ. స్త్రీ. ౧. దుర్గ ౨ భార్గి, భారంగి. ౩. బ్రాహ్మీశాకము ౪ వారుణీవృక్షము.

బ్రహ్మజము. సం. వి. అ. న ౧. మోక్షము పుం. దేవతలలో నొకతెగ (విల్యమ్సు)

బ్రహ్మజజ్ఞుఁడు. సం. వి అ. పుం సమష్టిస్థూలదేహాభిమాని, విరాట్టు. (కల్ప.)

బ్రహ్మజట. సం వి. ఆ. స్త్రీ దమనకము ‡

బ్రహ్మజామలము. సం. వి. అ. న. = బ్రహ్మయామలము.

బ్రహ్మజీవి. సం. విశే. (న. నీ. న.) వేదముచే జీవించువాఁడు.

బ్రహ్మజుఁడు. సం. వి. అ. పుం. హిరణ్యగర్భుఁడు.

బ్రహ్మజ్ఞానము. సం. వి. అ. న. బ్రహ్మవిషయమగు జ్ఞానము.

బ్రహ్మజ్ఞాని. సం. విశే. (న. నీ. న.) = బ్రహ్మజ్ఞుఁడు.

బ్రహ్మజ్ఞుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) బ్రహ్మమును దెలిసినవాఁడు.

బ్రహ్మజ్యము. సం. విశే. (అ. ఆ. అ.) బ్రాహ్మణులను బాధించునది.

బ్రహ్మణ్యము. సం. విశే. (అ. ఆ. అ.) బ్రాహ్మణులకు హితమైనది. వి. అ. పుం. ౧ బ్రహ్మదారువు, తూలము. ‡. ౨. ముంజతృణము

బ్రహ్మణ్యుఁడు. సం. వి. అ. పుం శనైశ్చరుఁడు. (కే. వి.)

బ్రహ్మత. సం. వి ఆ స్త్రీ. ౧. బ్రహ్మత్వము, బ్రహ్మధర్మము ౨. బ్రాహ్మణసమూహము

బ్రహ్మతంత్రము. సం. వి. అ. న. వేదబోధితమగు విషయము.

బ్రహ్మతాళము. సం. వి. అ పుం. (సంగీ) ఒకానొక తాళభేదము.

శ్లో చతుర్మ్ఖాభిధే తాళే జగణానుతరం ప్లుతః (కల్ప.)

బ్రహ్మతీర్థము. సం. వి. అ పుం. ౧. పుష్కరతీర్థము, తీర్థభేదము. ౨. అంగుష్ఠమూలతీర్థము. ౩. ఉగల్యకోష్టుకంటె ఒకతినుసుమూలము, ఇది కాశ్మీరదేశమున పుట్టును. (రా. ని)

బ్రహ్మతుంగము. సం వి అ పుం. ఒకానొక పర్వతము

శ్లో స్నిగ్ధాంజనచయాకారం సంప్రాప్తః కాలపర్వతమ్, బ్రహ్మతుంగం నదీ శ్చాన్యాః తథా జనపదానపి సం భార ద్రో ౮౦ ౩౧.

బ్రహ్మతేజము(స్సు). సం వి న్.న. ౧ బ్రాహ్మణవర్చస్సు ౨. బ్రహ్మవర్చసము.

బ్రహ్మత్వము. సం వి. అ. న. బ్రహ్మభావము.

బ్రహ్మదండము. సం. వి. అ. పుం. ౧. ఒకానొక ఆయుధము. ౨. శాపము, బ్రాహ్మణశాపము, ౩. వసిష్ఠుని సిద్ధదండము. ౪. బ్రాహ్మయష్టిక, భార్గి. ‡. ౫. కేతువు (వాచ.)

బ్రహ్మదండి. సం వి ఈ. స్త్రీ. కంటకపత్త్రఫల. ‡. ఒకానొకకుప్ప. (రా. ని.)

బ్రహ్మదర్భ. సం. వి. ఆ. స్త్రీ. ఓమభేదము. శ్రీ.

బ్రహ్మదారువు. సం. వి. ఉ. పుం. = బ్రహ్మవృక్షము. శ్రీ.

బ్రహ్మదైత్యుఁడు. సం. వి. అ. పుం. బ్రహ్మరక్షస్సు.

బ్రహ్మద్విట్టు. సం విశే. (వ. కీ. వ.) ౧. వేదనిందకుఁడు. ౨. బ్రాహ్మణులను నిందించువాఁడు

బ్రహ్మద్వేషము. సం. వి అ. పుం. ౧. వేదనింద ౨ బ్రాహ్మణనింద.

బ్రహ్మధార. సం. వి ఆ స్త్రీ సీమ, పొలిమేర (శ్రై. ని)

బ్రహ్మధ్వజము. సం. వి అ. పుం. ఒకానొక ఉపనిషత్తు.

బ్రహ్మధ్వజుఁడు. సం. వి. అ పుం బుద్ధుఁడు.

బ్రహ్మనది. సం. వి. ఈ స్త్రీ ౧. సరస్వతి ౨. ఒకానొకనది.

బ్రహ్మనాభుఁడు. సం వి. అ. పుం. విష్ణువు

బ్రహ్మనాలము. సం. వి. అ. న. తీర్థభేదము, ఒకానొకతీర్థము.

బ్రహ్మనిర్వాణము. సం. వి. అ న. మోక్షము, బ్రహ్మభావము లభింపఁగా సకలానర్థనివృత్తిరూపమగు పరమానందము.

బ్రహ్మనిష్ఠ. సం వి ఆ స్త్రీ పూతిక, కంబళిచెట్టు

బ్రహ్మపత్త్రము. సం. వి. అ న. పలాశపత్త్రము, మోదుగాకు

బ్రహ్మపన్నగము. సం వి అ. పుం. సర్పభేదము, ఒకజాతిపాము.

బ్రహ్మపవిత్రము. సం. వి. అ. పుం. తెల్లదర్భ, కుశభేదము. శ్రీ.

బ్రహ్మపాదపము. సం. వి. అ. పుం. మోదుగు శ్రీ.

బ్రహ్మపాశము. సం. వి. అ. పుం. ఆయుధవిశేషము, అస్త్రభేదము.

బ్రహ్మపిశాచము. సం. వి. అ. పుం. బ్రహ్మరక్షస్సు.

బ్రహ్మపుత్ర. సం. వి. ఆ. స్త్రీ నదీభేదము, ఒకానొకనది.

బ్రహ్మపుత్రము. సం. వి. అ. పుం. ౧. విషభేదము ౨. క్షేత్రభేదము. ౩. నదీభేదము. ౪. దేశభేదము. (విల్యమ్స్.)

బ్రహ్మపుత్రి. సం. వి ఈ. స్త్రీ. ౧. సరస్వతీనది. ౨, వారాహీకంద. (రా. ని)

బ్రహ్మపురము. సం. వి. అ. న. ౧. బ్రహ్మోపాసనకనుకూలైనది, హృదయము. ౨. శరీరము. ౩ హిమాలయశిఖరము. ౪. ఒకానొకదేశము, బర్మా-(వాచ.)

బ్రహ్మపురాణము. సం. వి అ. న. అష్టాదశమహాపురాణములలో నొకటి.

బ్రహ్మపురి. సం. వి ఈ. స్త్రీ. ఒకానొకపట్టణము.

బ్రహ్మబంధువు. సం. వి. ఉ. పుం. ౧ నీచమయిన బ్రాహ్మణుఁడు, నిందితుఁడయిన బ్రాహ్మణుఁడు ౨. (ద్వేషముచే) గ్రహింపతగని పేరు కలవాఁడు. ౩. గుతింపఁబడువాఁడు, ఉద్దేశింపఁబడువాఁడు, (శ ర)

బ్రహ్మబాంధవము. సం వి అ. న. బ్రహ్మబంధుని ధర్మము

బ్రహ్మబిందువు. సం వి. ఉ పుం. వేదోచ్చారణసమయమున చిమ్ముతుంపురులు.

బ్రహ్మబీజము. సం. వి అ. పుం. ౧. వేదమూలము ౨. కంబలిచెట్టు. శ్రీ (విల్యమ్స్)

బ్రహ్మబ్రువాణుఁడు. సం విశే. (అ. ఆ. అ) తన్ను బ్రాహ్మణుఁడని చాటుకొనువాఁడు. వి. అ. పుం. పేరుఁగలైన బ్రాహ్మణుఁడు.

బ్రహ్మబ్రువుఁడు. సం. విశే. = బ్రహ్మబ్రువాణుఁడు.

బ్రహ్మభద్ర. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక ఓషధి. రక్షించుకోషధి. శ్రీ.

బ్రహ్మభావము. సం. వి. అ. పుం. ౧. బ్రాహ్మణుఁ డగుట. ౨. బ్రహ్మయగుట. (శ్రీ. ని)

బ్రహ్మభూతి. సం. వి. ఇ. స్త్రీ. సంధ్య.

బ్రహ్మభూమిజ. సం. వి. ఆ. స్త్రీ. సైంహళి, సింహళదేశపు పిప్పలి. శ్రీ.

బ్రహ్మభూయము. సం. వి. అ. న. బ్రహ్మత్వము.

బ్రహ్మమండూకి. సం. వి. ఈ. స్త్రీ. ౧. అధ్యండ, జొట్టుపుచెట్టు. ౨. భూమ్యామలకి. శ్రీ.

బ్రహ్మమహము. సం. వి. స్. న. బ్రహ్మోత్సవము.

బ్రహ్మమీమాంస. సం. వి. ఆ. స్త్రీ. బ్రహ్మప్రతిపాదకమగు శాస్త్రము, వేదాంతశాస్త్రము (ఇది వ్యాసప్రణీతము. దీనిని ఉత్తరమీమాంస యందురు.)

బ్రహ్మము. సం. వి. న్. న. ౧. వేదము. ౨. తపస్సు. ౩. సత్యము ౪. తత్త్వము. ౫. చిత్స్వరూపము.

బ్రహ్మముఁజేయు = పరమాత్మస్వరూపమువలెఁ దెలియరానిదిగాఁజేయు, రహస్యముచేయు

చ. అనవుడు నింతకాలము ప్రయాస మదేఁటికి నాఁడె చెప్పినన్, బని వినసే యడంచి యొక బ్రహ్మముఁజేసితి నేఁడు నీవు చెప్పినసమయంబు తప్పక యభీష్టము నీకొనఁగూడు

ద్వా. ౧-౨. ౧౩

బ్రహ్మముడి. వి. వి. వివాహమందు వధూవరుల వస్త్రాంచలములుచేర్చి పురోహితుఁడు వేయు ముడి, బ్రహ్మగ్రంథి. (వా.)

బ్రహ్మమేఖలము. సం. వి. అ. పుం. ముంజగడ్డి.

బ్రహ్మమేడి. వి. వి. వృక్షవిశేషము, కాకోదుంబరము. శ్రీ. దీనికి నూగుగల పెడల్పయిన ఆకులుండును.

సీ. రావి మామిడి కొండరావి మేడియు బ్రహ్మమేడియు జీడిమామిడియుఁ జంక.

కాంస. ౪. ౧౧.

బ్రహ్మమేధ్య. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకనది. (విష్ణుపు.)

బ్రహ్మయజ్ఞము. సం. వి. అ. పుం. ౧. పంచయజ్ఞములలో నొకటి, వేదాధ్యయనము.(బ్రహ్మ, దేవ, పితృ, మనుష్య, భూత యజ్ఞము లయిదు.) ౨. అధ్యాపనము, వేదమును చెప్పుట.

బ్రహ్మయష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧. భార్ఙి శ్రీ. ౨. ఒకానొక వృక్షము. (కల్ప)

బ్రహ్మయాగము. సం. వి. అ. పుం. బ్రహ్మయజ్ఞము

బ్రహ్మయాతువు. సం. వి. ఉ. పుం. బ్రహ్మరక్షస్సు.

బ్రహ్మయామలము. సం. వి. అ. న. తంత్రభేదము, ఒకవిధమగు తంత్రము.

బ్రహ్మయోగము. సం. వి. అ. పుం. ౧. బ్రహ్మప్రాప్తిసాధనము, సమాధి ౨. విష్కంభాది యోగములలో ఇరువదియైదవది.

బ్రహ్మయోని. సం. విణ. (ఇ.) బ్రహ్మకారణముగా కలది. వి. ఇ. పుం. ౧. బ్రహ్మగిరి ౨. జ్ఞాననిష్ఠ, ౩ తీర్థభేదము. ఈ. స్త్రీ. సరస్వతీ నదీతీరము.

బ్రహ్మరంధ్రము. సం. వి. అ. న. శిరోరంధ్రము, నడునెత్తి, బ్రహ్మప్రాపకమగు రంధ్రము.

బ్రహ్మరథము. సం. వి. అ. న. ౧. బ్రాహ్మణులు మోయురథము, పాలకి మొ॥ ౨. మృతిబొందిన సన్యాసులను తీసికొనిపోయెడు వాహనము. (శ. ర.)

బ్రహ్మరసము. సం. వి. అ. పుం. అమృతము. (విష్ణుపు.)

బ్రహ్మరాక్షసము. సం. వి. అ. పుం. ఒకానొక చెట్టు (విష్ణుపు.)

బ్రహ్మరాక్షసుఁడు. సం. వి. అ. పుం. ౧. బ్రాహ్మణుడయి దుష్టకర్మలచే రాక్షసుఁ డైనవాఁడు. ౨. శివానుచరుఁడు.

బ్రహ్మరాతుఁడు. సం. వి. అ. పుం. ౧. శుకుఁడు. ౨. యాజ్ఞవల్క్యుఁడు.

బ్రహ్మరాత్రము. సం. వి. అ. న. బ్రాహ్మముహూర్తము.

బ్రహ్మరాత్రికుఁడు. సం. వి. అ. పుం. యాజ్ఞవల్క్యఋషి. (శ. ని.)

బ్రహ్మరాశి. సం. వి. ఇ. పుం. గ. వేదసమూహము. అ. పరశురాముఁడు.

బ్రహ్మరీతి. సం. వి. ఇ. స్త్రీ. పిత్తలము, ఒకదినుసు ఇత్తడి (రా. ని.)

బ్రహ్మరూపిణి. సం. వి. ఈ. స్త్రీ. వస (విల్యమ్సు.)

బ్రహ్మరేఖ. సం. వి. అ. స్త్రీ. బ్రహ్మలిపి, బ్రహ్మవ్రాసినవ్రాఁత

బ్రహ్మర్షి (ఋషి). సం. వి. ఇ. పుం. వేదమును స్మరించిన ఋషి. (వసిష్ఠాది) బ్రహ్మవేత్తఅయిన ఋషి

బ్రహ్మలిఖితము. సం. వి. అ. న. బ్రహ్మవ్రాసినవ్రాఁత.

బ్రహ్మలోకము. సం. వి. అ. పుం. గ. సత్యలోకము. అ. తురీయబ్రహ్మస్వరూపము.

బ్రహ్మవధము. సం. వి. అ. పుం. = బ్రహ్మహత్య.

బ్రహ్మవధ్య. సం. వి. అ. స్త్రీ. బ్రహ్మహత్య

బ్రహ్మవర్చసము. సం. వి. అ. న. గ. వేదాధ్యయనమువలన కలుగు తేజస్సు

శ్లో. తపస్స్వాధ్యాయజం యచ్చ తేజస్తు బ్రహ్మవర్చసమ్. (వాచ.)

అ. సదాచారాధ్యయనసమృద్ధి

శ్లో. స్యాద్బ్రహ్మవర్చసం వృత్తాధ్యయనర్ధిః... (అమరకోశము)

బ్రహ్మవర్తము. సం. వి. అ. పుం. = బ్రహ్మావర్తము.

బ్రహ్మవర్ధనము. సం. వి. అ. న. తామ్రము, రాగి.

బ్రహ్మవర్మము. సం. వి. న్. న. ఒకవిధమగు బలి (విల్యమ్సు.)

బ్రహ్మవాది. సం. వి. న్. పుం. వేదాంతి. (శ. ర.)

బ్రహ్మవాలుకము. సం. వి. అ. న. ఒకానొక విషము.

బ్రహ్మవిద్య. సం. వి. అ. స్త్రీ. గ. బ్రహ్మజ్ఞానము, అ. దుర్గ. (కల్ప.)

బ్రహ్మవృక్షము. సం. వి. అ. పుం. గ. పలాశవృక్షము, మోదుగ. కో. అ. ఉదుంబరము, మేడి. కో.

బ్రహ్మవేది. సం. వి. ఇ. స్త్రీ. దేశవిశేషము.

శ్లో. బ్రహ్మవేదిః కురుక్షేత్రే పంచారామహ్రదాంతరమ్. (కల్ప.)

బ్రహ్మవైవర్తము. సం. వి. అ. న. అష్టాదశమహాపురాణములలో నొకటి.

బ్రహ్మవ్రతము. సం. వి. అ. న. వేయిసంవత్సరములచే సాధింపఁదగిన బ్రహ్మప్రాప్తికి సాధనమయిన వ్రతవిశేషము.

బ్రహ్మశల్యము. సం. వి. అ. పుం. సోమవల్కము, నల్లతుమ్మ. కో.

బ్రహ్మశిరము. సం. వి. స్. న. ఒకానొక అస్త్రము.

బ్రహ్మసంజ్ఞము. సం. వి. అ. పుం. నాలుగుముఖములుకల రుద్రాక్ష. (శ. ని.)

బ్రహ్మసంభవుఁడు. సం. వి. అ. పుం. గ. జైనులలో నొకఁడు. (వాచ.) అ. బ్రహ్మపుత్త్రుఁడు, (వసిష్ఠాది.)

బ్రహ్మసంహిత. సం. వి. అ. స్త్రీ. మూలధ్యాయములుకల వైష్ణవాచారభేదమును తెలుపు గ్రంథవిశేషము.

బ్రహ్మసతి. సం. వి. ఇ. స్త్రీ. గ. సరస్వతి. అ. సరస్వతీనది. (విల్యమ్సు.)

బ్రహ్మసత్రము. సం. వి. అ. న. = బ్రహ్మయజ్ఞము.

బ్రహ్మసభ. సం. వి. అ. స్త్రీ. పద్మసరస్సు. (విల్యమ్సు.)

బ్రహ్మసరస్సు. సం. వి. స్. న. ఒకానొక తీర్థము

బ్రహ్మసర్పము. సం. వి. అ. పుం. సర్పభేదము. (త్రి. ని.)

బ్రహ్మసవము. సం. వి. అ. పుం. గ. బ్రహ్మస్తోత్రము. అ. ఒకానొక యజ్ఞము.

**బ్రహ్మసాయుజ్యము.** సం. వి. అ. న. బ్రహ్మత్వము, బ్రహ్మీభావము, పరబ్రహ్మముతో నైక్యముఁ బొందుట

**బ్రహ్మసావర్ణి.** సం. వి. ఇ. పుం. పదియవమనువు.

**బ్రహ్మసుతుఁడు.** సం వి. అ. పుం. ౧. కేతు భేదము. ౨. బ్రహ్మపుత్త్రుఁడు, మరీచి మొ॥

**బ్రహ్మసువర్చల.** సం. వి ఆ స్త్రీ. ౧. ఒకానొక ఓషధి, సూర్యకాంతపుతీఁగలో నొక భేదము ౨. అతీఁగరసము

**బ్రహ్మసువు.** సం వి ఊ పుం ౧ ప్రద్యుమ్నుఁడు. ౨ విష్ణుమూర్త్యవతారభేదము, అనిరుద్ధుఁడు 3 కామదేవుఁడు, కామాధిష్ఠానదేవత.

**బ్రహ్మసూత్రము.** సం వి అ. న. ౧. యజ్ఞోపవీతము, జందెము. ౨. వ్యాసప్రోక్తమయిన బ్రహ్మప్రతిపాదకమగు సూత్రము.

**బ్రహ్మస్తేయము.** సం వి అ న. అనుజ్ఞలేకయే వేదమును చదువుట.

**బ్రహ్మస్థలి.** సం వి. ఈ స్త్రీ. గ్రామమధ్యప్రదేశము (శై ని)

**బ్రహ్మస్థానము.** సం. వి. అ. న తీర్థభేదము.

**బ్రహ్మస్వము.** సం. వి. అ న. బ్రాహ్మణధనము

**బ్రహ్మహత్య.** సం వి. ఆ స్త్రీ బ్రాహ్మణవధము, బ్రాహ్మణుని జంపుట

**బ్రహ్మహుఁడు.** సం విణ. (స్.ఘ్న స్) బ్రాహ్మణహత్యచేసినవాఁడు.

**బ్రహ్మహ్రదము.** సం.వి.అ న ఒకానొక సరస్సు.

**బ్రహ్మాంజలి.** సం. వి. ఇ. పుం. వేదపాఠము సేయునపుడు సేయుదోసిలి.

**బ్రహ్మాండము.** సం. వి. అ. న. భువనగోళము.

**బ్రహ్మాక్షరము.** సం. వి. అ. న. ఓంకారము.

**బ్రహ్మాగ్రభువు.** సం. వి. ఊ. పుం. ఘోటకము, గుఱ్ఱము.

**బ్రహ్మాణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. బ్రాహ్మీశక్తి, ౨. రాజరీతి ఇత్తడిలో నొకభేదము. 3. రేణుకయను గంధద్రవ్యము, (రా. ని.)

**బ్రహ్మాత్మభువు.** సం. వి. ఊ. పుం. అశ్వము, గుఱ్ఱము.

**బ్రహ్మాదని.** సం వి. ఈ స్త్రీ. హంసపది, ఎఱ్ఱ అత్తపత్తి ? (రా ని.)

**బ్రహ్మాద్రిజాత.** సం. వి. ఆ స్త్రీ. గోదావరి (నది.) (రా ని విల్యము). బ్రహ్మాదిజాత, బ్రహ్మాధిజాత, అని పాఠాంతరములు. వాచ. కల్ప.)

**బ్రహ్మాపేతుఁడు.** సం వి. అ. పుం. మాఘమాసమునందు సూర్యసమీపస్థుఁడగు నొక రాక్షసుఁడు

**బ్రహ్మారణ్యము.** సం వి అ. న. వేదపాఠభూమి. (త్రి. వి.)

**బ్రహ్మావర్తము.** సం వి. అ పుం ౧. దేశవిశేషము.

శ్లో॥ సరస్వతీదృషద్వత్యోర్దేవనద్యోర్యదంతరమ్ తం దేవనిర్మితం దేశం బ్రహ్మావర్తం ప్రచక్షతే

౨ ఒకానొక తీర్థము.

**బ్రహ్మాసనము.** సం వి. అ. న ౧. ఆసనవిశేషము.

శ్లో॥ ఏకపాద ముర్ దత్వా తిష్ఠేద్దండాకృతిర్భవేత్ (వాచ.)

౨ ధ్యానాసనము, ధ్యాననిష్ఠ. 3 యోగాసనము, యోగనిష్ఠ. (అమర)

**బ్రహ్మాస్త్రము.** సం. వి. అ న. అస్త్రములలో నొకటి.

**బ్రహ్మి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. శంకగండకమత్స్యము, బురదలోనుండు చేపపిల్ల. ౨. శాకభేదము. 3. ఒక్కతీఁగ.(వాచస్పత్య.)

**బ్రహ్మీభూతము.** సం. వి. అ. న. = బ్రాహ్మీభూతము. (కల్ప.)

**బ్రహ్మీభవించు.** సం. అ. క్రి. బ్రహ్మతో నైక్యము పొందు.

గీ. కంరభజ గౌతమ వ్యాస భృగువు లుండ
బ్రహ్మేభవించి యఖండగరిమ దనరు నే
నండ...నీశల పెనఁగ. హరిశ్చ. ౧. ౧౫౩.

బ్రహ్మేశయుఁడు. సం. వి. అ. పుం. ౧. కుమార స్వామి. ౨. విష్ణువు

బ్రహ్మోజ్ఝుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వేద నిందకుఁడు.

బ్రహ్మోదుంబరము. సం. వి. అ. న. ౧. ఒక శాక తీర్థము.

బ్రహ్మోపనేత. సం. వి. ఋ. పుం. పలాశ వృక్షము, మోదుగుచెట్టు. (రా. ని.)

బ్రహ్మౌదనము. సం వి. అ న. (యజ్ఞము వందలి) ఓదనభేదము.

బ్రహ్మౌదనాగ్ని. సం. వి ఇ. పుం. (యజ్ఞము నందు) బ్రహ్మౌదనము వండుటకయినయగ్ని

## బ్రా

బ్రాఁతి. వి. ౧ ప్రీతి, ప్రేమ. (ఇది సానుస్వారమని శ ర. కాని నిరనుస్వారమనుటకు భారతాది ప్రయోగములు నిర్ధారకములు. మధ్యకవులు కొందఱుమాత్రము దీనిని సానుస్వారముగా వాడియున్నారు రం రా. యు. లో సాను స్వారముగా నున్నది చూ. విణ 3 అర్థము )

ఉ. జాతర సేయఁగావలయు సర్వజనంబుల నంబురాశికిన్, బ్రాఁతిగ భక్తితోడ వని బంధుల కెల్లను జెప్పి భార. తూ. ౨౪

ద్వి. మాతండ్రి ధర్మైకమతి కు శధ్వజుఁడు బ్రాఁతిగా నియతి నా బ్రహ్మర్షి కరుఁడు వేదంబు చదువ జానకి నేఁ బుట్టి, వేదవతి నాఁబరగుదు...

రా. ఉ. ౩౪. బా. ౩. ౭౦.

ఉ. భాతిఁ దదంచి బ్రాకిక్క యవధాతసరోజ దళాక్షుఁగాంచి లో, బ్రాఁతి పెనంచి ...
పాండు. ౪. ౬౩.

వ. పలువురయందు జొక్కనికి బ్రాఁతియు జొక్కనియందు జూడ నగ్గలముగు ప్రేమ పల్వురకుఁ గల్గుట యద్భుతము ...
మనుచ. ఉ. ౩౦.

౨. ఆసక్తి, వాంఛ, కోరిక

క. నూతులదరులను లోఁతగు, పాతటికసవులను నెట్టి పచ్చికయున్నన్, బ్రాఁతిపడి మేయఁ బోకుము, మూతి యిడకు మగ్రసత్త్వములు గల నీటన్.
భోజరా. ఉ. ౩౫.

ఉ. ప్రాఁతలు మీఁదఁగప్పిఁన గృహామతి నోర్చితి నీచుబొత్తునన్ బ్రాఁతి పెనంగి తీవు
శశా. 3 ౧౦౦

విణ ౧ ప్రియము, ఇష్టమైనది

ఉ. ప్రాణసఖీరహస్యముల బ్రాఁతియఁ గ్రీడలు కానివాని యా, రేఁణవిలోలలోచనకు పెచ్చినమన్మథచేష్ట నయ్యెడన్
శశా. ఉ. ౨౧౭.

క. నీతోడ వియ్యమందం, జేతోగతి నాసఁజేసి చెచ్చెర నిట్లే, నేరాంచితి మత్రార్థన, బ్రాఁతిగఁ జేకొనకయునికి పాడియె నీకున్.
భార. అర. ౩. ౧౯౪.

గీ. పగఱు లెలతోఁటనీడలు బ్రాఁతియయ్యెఁ, బగఱులును లేలు దనుగాలి బ్రాఁతియయ్యె .
నృసిం. ౩. ౩౩.

గీ. భక్తిగాని నీకేమియు బ్రాఁతిగాదు.
ఉ. హరి. ౨. ౧౯౪.

౨ దుర్లభము

చ పాండవమనోరథసిద్ధి భవద్దయాసమృద్ధి నగుట వింతయే భవదధీనులకున్ విజయంబు బ్రాఁతె
భార. ద్రో ౫. ౯.

శా. ఏలా యుండుము నందుఁ గాఁచెదపు నీకే బ్రాఁతియే కన్నులు, కాలుం జాలక ...
హరి. పూ. ౫. ౨౩౪.

మ. గణుతింపంగ నితంతు సౌల్యదలికిం గారాబుఁబుత్రుండు బ్రా, హ్మణరాజౌషధి భర్త నెట్టుకొని సంపాదించినన్ బ్రాఁతియే మణిమంత్రౌషధముల్. శైవ. ౯. ౧౨౫.

౩. ఘనము, గొప్పది.

ఉ. వాసవుఁ డిట్టె నన్ను డుగ వచ్చుఁ బ్రియంపడి నాకు నొక్క బ్రా, తేసురలోక వందిత మదిం గవచంబును గుండలంబులున్.

భార అర. ౭ ౨౮౯

ద్వి బ్రోఁతి బొందులు సొచ్చి బ్రోఁతులై వచ్చి బ్రాఁతైనకరటికబంధముల్ దెచ్చి

రం రా యు ౫౩౪ పా. ౧౯. పం

ఉ నిన్నుబుట్టి తా, నెన్నఁడు బ్రాతియయ్యె మతి యెన్నఁడు నేర్చును జెక్కిరింపఁగా

కు సం ౧౦. ౫౧౦

౪. అధికము, ఎక్కువ

దండకము రక్తంబునుం ఒట్ట మైపూఁతయున్ బ్రాతిగాఁ బూని పారి ౩ ౩౭

ద్వి. ప్రేతవాహకునిఁగా బిలువ రెవ్వ గను, బ్రాతిగా జెడలింప బడుగులు లేవు

ద్వి హరిశ్చ ఉ ౫౧౪ పం

౫. అపురూపము, అపూర్వము

సీ. పాండునందనులకు బ్రాతెరత్నంబులు కౌరవ నాథుభండార మెల్లఁ, గైకొన్న వారు

భార. సౌ. ౨ ౪౫

౬ అనుకూలము.

వ పుత్త్రకా యిట్టిగట్టి తెలివి గలిగిన సంసార రోగికిఁ దన కనుకూలరైన వనితఁగూడి మెలంగుట ప్రబోధోదయంబునకుం బ్రాతి గాని హానిగాదు ప్రబోధ ౫ ౪౨

౭. పృథువు, గొప్పది.

ద్వి. లాఁతిమించులచూపు లలితకటాక్షములు, బ్రాఁతి చన్నులఁ దోఁప బయ్యెద దొలఁగ

రం. రా ఉ. ౪౧. పా. ౨౪ పం

బ్రాబిక. వి. (సం. భ్రమః) అపేక్ష, కోరిక.

ఉ. కామితవస్తుసంపదలు గల్గుఫలం బొరులాస పడ్డచో, నేమియుఁ బెట్టఁడేని సిరియేఁటికి నిష్ఫల మున్నఁజోయినన్, బ్రామిక పడ్డ లోకులకుఁ బండుగనే మది యెండిపోవఁగా నేమిఫలంబు లేదు విడదన్నటిశైన ముసిండి ఘాస్కరా, భా. శ. ౩౨.

గీ. బ్రామికలు దీర నన్యోన్యభాష లారా...

హంస. ౨. ౧౧౯.

బ్రాహ్మగుప్తము. సం వి. అ. న. ఆయుధజీవు లగువారి సంఘము.

బ్రాహ్మణకము. సం. వి. అ. న. ఆయుధజీవు లైన బ్రాహ్మణులు కల దేశము.

బ్రాహ్మణబ్రువుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) బ్రాహ్మణాధముఁడు, బ్రాహ్మణుఁడని చెప్పు కొనువాఁడు

బ్రాహ్మణము. సం వి అ. న మంత్రేతరమయిన వేదభాగము.

బ్రాహ్మణయష్టిక. సం. వి ఆ. స్త్రీ. భార్గి. కీ. (అమర. రా. ని)

బ్రాహ్మణాచ్ఛంసి. సం వి న్.పుం యజ్ఞములో బ్రహ్మకు సహాయముచేయు నొకఋత్విజుఁడు.

బ్రాహ్మణాయనుఁడు. సం. వి. అ. పుం. శుద్ధ వంశమునందు పుట్టిన బ్రాహ్మణుఁడు. (శ్రీ. ని.)

బ్రాహ్మణార్థము. సం. విణ. (అ ఆ. అ.) బ్రాహ్మణునికొఱకైనది. వి. అ. న. నిమంత్ర ణము, పితృకార్యము, పితృకార్యములయందు దేవపితృస్థానములయందు భోజనమునకై బ్రాహ్మణుల నియమించుట

గీ తిథులయందైన మఱి యుపత్నికుఁ దనుచు, బ్రాహ్మణార్థంబుఁ జెప్ప రేపాటివారు.

శుక. ౩. ౩౪౫.

బ్రాహ్మణి. సం. వి. ఈ. స్త్రీ ౧. బ్రాహ్మణస్త్రీ. ౨. ఫంజిక, భార్గి కీ. ౩. చీమ. ౪. జరటి, కందురీఁగ ౫. పృక్క, స్పృక్కయను గంధ ద్రవ్యము ౬. వలికిండ్లపాము. (శ. ర.)

బ్రాహ్మణుఁడు. సం. వి అ. పుం. అగ్రజన్ముఁడు. బ్రాహ్మణజాతివాఁడు.

బ్రాహ్మణ్యము. సం. వి. అ. న. ౧. బ్రాహ్మణ సమూహము. ౨. బ్రాహ్మణత్వము, బ్రాహ్మణ ధర్మము. పుం. శనిగ్రహము.

బ్రాహ్మపింగ. సం.వి.అ.స్త్రీ.ఇండి.(విల్యమ్సు.)

బ్రాహ్మపురాణము. సం. వి. అ. న. అష్టాదశ మహాపురాణములలో నొకటి.

బ్రాహ్మము. సం వి. అ. న ౧ ౧ అంగుష్ఠమూలతీర్థము. ౨ వివాహభేదము. ౩ అష్టాదశపురాణములలో నొకటి. ౪. బ్రహ్మ అధిదేవతగాఁగల నక్షత్రభేదము, రోహిణీనక్షత్రము, అభిజిన్నక్షత్రము. పుం. ౧. పాదరసము. ౨. బ్రహ్మదినము, బ్రహ్మమానము. ౩. ధర్మభేదము ౪. కాలవిశేషము, అరుణోదయమునకు పూర్వము దండద్వయాత్మకమగు కాలము.

బ్రాహ్మముహూర్తము. సం. వి అ పుం., న. అరుణోదయమునకు పూర్వము ఘటికాద్వయాత్మకమగు కాలము, అభిజిన్ముహూర్తమని కొందఱు

బ్రాహ్మహోరాత్రము. సం. వి. అ. న బ్రహ్మయొక్క దినరాత్రులు. (ఇది మనుష్యులకు కల్పద్వయకాలము.)

బ్రాహ్మి. సం. వి. ఈ. స్త్రీ. ౧. సరస్వతి ౨. వాక్కు. ౩. సోమవల్లరి, పొన్నగంటికూర. ‡ ౪. భార్గి ‡. ౫. బ్రహ్మదండి, వారాహీకందము. ౬. హిలమోచిక, మల్లంగి. ‡. ౭. రోహిణీనక్షత్రము. ౮. సప్తమాతృకలలో నొకతె.

బ్రాహ్మిక. సం. వి అ స్త్రీ భార్గి ‡

బ్రాహ్మీకందము. సం వి అ. పుం. ౧. వారాహీకందము, బ్రహ్మదండి ‡. ౨. భార్గి ‡

బ్రాహ్మ్యుఁడు. సం వి. అ పుం. నారదుఁడు.

బ్రాహ్మ్యము. సం విణ (అ. ఈ. అ) బ్రహ్మసంబంధమైనది. వి. అ. న. ౧ ఆశ్చర్యము ౨. దృశ్యము. ౩. బ్రాహ్మముహూర్తము.

## బ్రి

బ్రిందు. వి. ఇఱుకుచోటు.

క...వైశ్యపతి కానుకు ధరాక్రాంతుఁడై డిగ్గి తొలంగి యతఁడంతరగృహాంబుజము బలిచి కెలుచలిచి సందులు బ్రిందులు గొందులు దూఱియుండె   నృసిం. ౫. ౩౧.

## బ్రు

బ్రుంగు. అ క్రి. ౧ మునుఁగు, మగ్నమగు.

ఉ. బ్రోయనివార్ధి నెత్తురుల బ్రుంగనిరాముఁడు వంకవిల్లుగాఁ జేయని స్రైఁడికొండ ..   కావ్యా. ౩. ౬.

సీ ఏమహామాయచే నెట్టివిద్వాంసుల బుద్ధి తెలియంగమి బ్రుంగుచుండు   మార్కం. ౬. ౩౨.

మ   మనుజాల్ తత్త్వజ్ఞులయ్యున్ విషాదమునన్ బ్రుంగుదు రింతె కాని విషయత్యాగోత్సుకుల్ గారు   మల్ల. ౩. ౧౮.

౨ క్రుఁగు, దిగఁబడు.

ఆ అశ్వసుభటతతులయంగఖండంబులు, రుధిరకర్దమమున బ్రుంగియున్న, పెల్లు చూడ   భార. ద్రో. ౧ ౨౪౯.

క పెనురొంపిలోపలను బ్రుంగిన ధేనువు నెత్తి పోలికిని   భార కల్యా ౧. ౧౫౩.

౩ కప్పఁబడు, ఆచ్ఛాదితమగు

చ. విరిసినయజ్ఞ టాభరము విన్ననిమోము దురంతఖేదనం, బౌరల ధరాపరాగమున బ్రుంగినయంగము గల్గి యమ్మహీశ్వర మటు దూఱ.   భా. రా. అయో. ౧౭౪.

చ. పొగలఁ గావిరి బ్రుంగెడుపుల్గుమోంబు తె,ల్లపెఁ గనుపట్టె   ఆము. ౪. ౧౨౭.

శా. క్రుప్పల్ గాలుచు నీచుకంపుకలుచుక్ కొంకై తెఱం బాసి పెన్ ముద్దన్ బ్రుంగిన గర్తభాఖీ దినుచున్ సుశ్రీకమై జాగిలం, బవ్వేలుప్పుం దొరఁ జూచి కొంకదు.   మల్ల. ౧. ౯.

౪. చాటగు, మఱుఁగుపడు.

చ....గాడ్పు సమానధూతశతన్ సొంపికి సుఖానకారింగుతోయ మదంపుఁగ దశ్శ్రుకానిచోఁ బొడమున నాగ్గి తొల్లిదియ బ్రుంగున నీరము తత్తడాగతిన్.   చంద్రా. ౨. ౧౯.

౫. చెడు, నశించు.

సీ...భగ్నకార్యదయుఁ, డగుచు వివిశతశరవిశే
షాభిహాతిని, బ్రద్దలైన సాధనులసద్వృత్తి
నియతి, బ్రుంగఁ గేవలసారంగబుద్ధిఁ జేసి
రాఘవ ౧ ౨౦.

౬. చచ్చు, మరణించు

సీ. మడిసె బ్రుంగె సమసెఁ గడచె మునిగె నీల్గెఁ
దరలెను చచ్చె ననుమాట కాఖ్యలయ్యె
ఆం. భా. ౩ ౯౪.

జ బ్రుంగుడు, బ్రుంగుడువంగుడు, బ్రుంగుడువడు, బ్రుంగుడువఱచు, బ్రుంగుడువాటు, బ్రుంగువడు, బ్రుంచు

బ్రుంగుడు. విశే. (√బ్రుంగు.) ౧. అదృశ్యము, కప్పబడినది.

(ప్రహ్లాదుఁడు) ఉ దనుజవీరులమాయలచేత
బ్రుంగుడై, భస్మములోపలన్ మెఱయు
పావకమూర్తియుఁ బోలె ...
వి. పు ౨. ౨౯౯.

౨. పూఁడినది, దిగఁబడినది.

సీ. లీల నాకోమలిపాలిండ్ల కస్తూరిరొంపిలో
నెన్నండు బ్రుంగుడౌదు వరాహ. ౧ ౫౬.

౩. మునిఁగినది, మగ్నమైనది

గీ ఏమి సేయుదునని యాత్మ నేమమునకుఁ,
బోయి తినలోనఁ దలపోఁత బ్రుంగుడయ్యె,
నెపుడు పడమటికొండపై నెక్కె భానుఁ,
డెప్పు డుదయించు . కాశీ ౨. ౧౨౫

ద్వి. రంగత్తరంగల రాలుపుప్పొళ్లు, బ్రుంగుడై
కొలయంగఁ బొలుపారుదాని
రం. రా ఉ. ౯౯ పా ౧౯ పం

౪ మఱుఁగుపడినది.

ద్వి పుట్టి కాననముల బ్రుంగుడై పొరలు,
పొట్టయ్యె జపతపంబులఁ గానలేని,యట్టి
శ్రీకృష్ణుని వనికంబుఁ దలఁచి,నట్టి వీూపుణ్య
కేమునిదొడ్డ మనుచు.
అ. ను. క. ౩. ౧౬౭. పా. ౪. పం.

బ్రుంగుడువంగుడు. విశే. (√బ్రుంగు.) నిమగ్నము, అత్యాసక్తము.

క. ధనమును సత్యము శౌచం,బును సాదిగఁ
గోలుపోవు భువి దుర్వ్యసనం,బని యెన్నఁ
బడ్డ జూద,మ్మున బ్రుంగుడువంగుడౌటఁ
బొందిది యుగునే. ద్వా ౧౦. ౯౪.

బ్రుంగుడువడు. అ క్రి (బ్రుంగుడు + పడు.)

౧ మఱుఁగుపడు, చాటగు

సీ ఎడనెడ బ్రుంగుడువడియున్న రాజులు సమ
దంచి కనునవసరము లేచి
భార శాం ౧ ౧౪౬

క అవిభుఁడు రాజ్యసుఖలీ,లావిముఖత వెడలి
బంధులం దొఱఁగి యతిక్లేశావాసత బ్రుంగుడు
వడిపోవుట నెచ్చోటఁ గడుపుఁ బ్రోకుకొ
యనుచున్ భార విరా ౧. ౧౬౮.

౨ కప్పఁబడు, అచ్ఛాదితమగు

చ కడ యిడరానివంత యెడగాంచని చిక్కలి
కేలు ధూళి బ్రుం,గుడువడు మేనునన్ గలిగి
కుందెడి జానకిఁ గాంచి కూరిమిన్.
ఉ. రా. ౬. ౩౦౯.

సీ పూఁదేనెగండాన బ్రుంగుడువడియున్న
గండుఁదుమ్మెద లెంకగములతోడ
విక్ర ౮. ౫౪.

బ్రుంగుడువఱుచు. స క్రి (√బ్రుంగుడువడు) మఱుఁగుపఱుచు, కప్పిపుచ్చు

గీ కర్ణుఁ దొలుచూలుగా నేల కంటి తల్లి, నీదు
మంత్రంబు పరమవిషాదకారి,యయ్యె మా
కెల్ల నట్టిమహోన్నతైక,గణ్యు బ్రుంగుడువఱ
చుట కారణముగ. భార స్త్రీ ౨ ౧౭౦

బ్రుంగుడువాటు. వి (√బ్రుంగుడువడు) మఱుఁగుపడుట.

ఉ అట్టిమహాత్ముఁ డొక్కనికి నాశ్రితుఁడై..
యిప్పు డిటు బ్రుంగుడువాటునఁ బొంద
చూచి నా,కెట్టు మనంబుపట్టు..
భార. విరా. ౨. ౯౯౨.

బ్రుంగువడు. అ. క్రి (బ్రుంగు + పడు. - ఱ్వ్యర్థమున.) మగ్నమగు, మునుఁగు.

గీ. సుకర శర్కరాదినకలవస్తువులు వగల, బ్రుంగు
వడనినుఖంబు చేయంగ వాలవు
కవిత ౫. ౧౧౪

బ్రుంచు. స క్రి. (√బ్రుంగు) బ్రుంగఁజేయు
(శ ర)

బ్రుయ్యు. అ. క్రి నశించు
ఆ. దానఁజేసి మీరు నేనును బ్రుయ్యుఁ బా,పంబు
లేక వడలఁబడితిమి భార. మా. ౨౧౧.
శ. ర. పా (ప్రయ్యుఁ బా పంబు లేక
ముద్రి పా.)

బ్రువత్. సం శత్ర. చెప్పుచున్న .

బ్రువాణుఁడు. సం విణ (అ. అ అ) చెప్పు
చున్నవాఁడు

బ్రువుఁడు. సం విణ (అ అ ఆ) చెప్పువాఁడు
(దీనికి కృత్తియందు నిందావాచకత్వ ముండును
ఉత్తరపదముగ ప్రయోగింపఁబడును.
ఉదా: బ్రాహ్మణబ్రువుఁడు మొ॥)

బ్లేమ్కము.సం వి. అ పుం వల. (విల్యమ్సు)

# భ

భ. సం ఒకానొక యక్షరము

భ. సం వి. అ. పుం ౧ ఈశ్వరుఁడు ౨
తుమ్మెద. ౩ భావము ౪ శుక్రుఁడు ౫
అంశువు, కిరణము ౬. మేఘము (శా. ని
దీనికిఁ దనుఁగున వ్యస్తప్రయోగము కన్పడదు)

భంకా(గా)రి. సం. వి ఇ పుం కోఁకిగ. (అ ని)

భంక్తి. సం. వి ఇ. స్త్రీ. పగులుట, వ్రక్కలగుట

భంగ. సం వి ఆ స్త్రీ. ౧ జనము, మాతు
లాని కై ౨. భంగిచెట్టు (గంజాయి)నుండి
సిద్ధముచేసిన మత్తుగల ద్రవపదార్థము. ౩
త్రివృత్తు, తెగడ. కై.

భంగపడు. మి. అ. క్రి. (భంగము + పడు) అవ
మానపడు
ఆ. మనము భూఁచిపట్టి కొంచుతేర్చికొల్చి పోకఁ,
బాండురాజసుతుల బలము గడిపి, గాక

చేయునదియుఁ గాక నీముందటఁ, ఒదన
తనయుచేత భంగపడితి భార భీష్మ ౩ ౫.

భంగపఱుచు. మి. స క్రి (√భంగపడు) అవ
మానఱుచు, భంగపెట్టు.
గీ హంసపరమహంసు లగునీయతీంద్రుల, పేరు
పైఁ పలేక పెచ్చుపెరిఁగి, హంసుఁ డాత్మ
నామహరు లని కానోపుఁ ఒట్ట మమ్ముఁ జాల
భంగపఱిచె ఉ హరి ౪ ౯౭

సీ. తేలికతో మేలమెప్పుడు వినమించుఁ పడు
చుతోనవ్వినగ పఱుచు నీతి ౫౨

భంగపాటు. మి వి అవమానము.
తే సర్వజనవంధ్యయైన పాంచాలి సింహ,బలు
నిచే నివ్విధంబున భంగపాటు దనకువచ్చిన
నెంతయు దైన్యమొంది, యవ్విరాటు నిసభఁ
జేర నరిగి నిలిచి విర. విరా ౨ ౧౩౪
శా ఈనిర్భాగ్యు నిటుల చూచితిని నాకీభంగ
పాటొంద నేలా దశా ౬. ౪౯

భంగపెట్టు. మి స క్రి (భంగము + పెట్టు)భంగ
పఱుచు
క కూర్పణఖనట్లు పోడిమిచెడ నుద్దురభంగి
భంగపెట్టినదురితాత్ముని తోడ పెట్లు దొడ
౦క పోదుక్ భా రా అర ౨ ౨౧
గీ ప్రజలఁ జెఱఁబెట్టి దొరలను భంగపెట్టి,
తఱిమి యొఝంగిఁ బెక్కుబాధల నలంచి
భాగ ౧౦. ఉ ౭౩౭

భంగము. సం వి అ పుం ౧ చీలికయగుట,
తునియుట ౨ గండి ౩. కోయుట, కోఁత.
౪ విడఁదీయుట ౫. ముక్క, తునియ. ౬.
భ్రష్టత (రాజ్యభంగము, సత్యభంగము మొ॥)
౪. విఘాతమగుట, అటంకమగుట (యాత్రా
భంగము మొ॥) ౭. ఓడిపోవుట. ౯. చెల్లా
చెదరగుట. ౧౦. తరంగము, అల. ౧౧. కౌటి
ల్యము. ౧౨. భయము ౧౩. జలనిర్గమము. ౧౪.
రోగము, రోగవిశేషము. ౧౫. అవమానము.
ఉ. భంగముతోడ నున్న వసుఁ బంధు విరాటుని
మీఁద ... భార. విరా. ౩. ౧౨౯.

చ. అలవ్రజలంబుఁ బోవిడిచి యాసభ నించుక యంతలేక నీపలికిన యన్నియు మ్మఱచి భంగపుఱచ్చుట దెచ్చుకొంటి
భార. ద్రో. ౩. ౫౭

**భంగవాస.** సం. వి. అ. స్త్రీ. హరిద్ర పసుపు

**భంగసార్థుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) కపటి, ధూర్తుఁడు (వాచ.)

**భంగాకటము.** సం. వి. అ. న. జనపవిత్తులనూఁగు భంగారజస్సు

**భంగి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧ పగులు విచ్ఛేదము ౨ కౌటిల్యము ౩ తరంగము ౪ వ్యాజము ఛలము ౫ విన్యాసము రచన ౬ ఒప్పు

క. భంగిగఁ దనర్పెఁ దేరుమ తంగజశరశీకరముల దానజలములన్ గంగాయమునాతతజల సంగమదేశంబువోలె శరవణ మెప్పెన్
కు. సం. ౧౦. ౩౭౭

ద్వి. అనయంబు నేఁడు నాఁ డనక ముప్పొద్దు భంగిగా సద్గురుభావంబునందు జంగమ కోటికర్చనలు సేయుచును
బస. పు. ౫. ౫౭౪ పం

౭ రీతి విధము

సీ. అకట మాతో మీరు నడవుల నిడుమలఁ బొందితి రొకభంగిఁ బోయె గాలము
భార. విరా. ౧. ౪౭

సీ. వేయిభంగులను గావించె దాలోచనక్రమము స్వాస్థ్యముకేద ఖచరనాథ దశా. ౨. ౬౫

౮ ఉపాయము

ఉ. చంద్రవదన యింక సైరంధ్రి నిక్కోప్పటు వాపవలయు నేమిభంగినైన భార. విరా. ౩. ౩౦.

౯ గతి.

క. ఇట్లగు పెఱుఁగవచ్చితి, పెట్లో కో మన భంగి నీర వీందఱును గఁడున్, పెట్టిదు లఱ మునకు మార్కొను నట్టికొలఁది గాదు భీతి యుడిగెడుఁ దోర్దర్పేన్ భార. విరా. ౪. ౫౪.

**భంగించు.** సం. స. క్రి. మందలించు

వ. వారలవలన నీదురాగ్రహం బుడుగుడు ని కొడుకును భంగించి సకలబాంధవహితంబు సేయందలంచి ద్రౌపదిని రావించి కాంత వచనంబుల నిట్లనియె
భార. సభా. ౨. ౨౫౬

౨ ఎదుర్కొను

వ. పాండవులు ప్రచ్ఛన్నవేషంబున విరటు ప్రోల వసియించినవారు గావలయు నతం డును బ్రతిభటుండయి భంగించుచుండు
భార. విరా. ౩. ౧౧౭

౩ భంగపఱుచు అవమానపఱుచు

సీ. భంగించినట్లుండుఁ బరేతి వా టికిమాటి కూర్ధ్వకంపంబు సేయుటకతమున
కాశీ. ౬. ౧౯

**భంగిభక్తి.** సం. వి. ఇ. స్త్రీ. పంక్తిగా నేర్పఱుచుట సోపానపరంపరగా నేర్పఱుచుట

**భంగిమ.** సం. వి. స్. పుం. = భంగి

**భంగురము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧ పెళు సైనది పగులుటకుఁ దగినది ౨ నశ్వరము నశించునది ౩ మార్పుగలది ౪ వంకరదైనది, వక్రము వి. అ. స్త్రీ. ౧ ప్రియంగువు కై ౨ అతివస కై

**భంగ్యము.** సం. వి. అ. న. జనుముపండెడుభూమి

**భంజ.** సం. వి. ఆ. స్త్రీ. దుర్గ

**భంజకము.** సం. విణ. (అ. జికా. అ.) చీల్చునది విడఁదీయునది

**భంజనము.** సం. వి. అ. న. విఱుపు (శ. ర.)

**భంజరువు.** సం. వి. ఉ. పుం. దేవాలయ సమీప మున మొలచు వృక్షము

**భంజలి.** సం. వి. ఈ. స్త్రీ. అశ్వగతిభేదము.

గీ. తనకుఁ బ్రతిదేవుఁ డెందు లేఁడనుచు మెఱసి, పగిది దగనద్దకెడుఁ బ్రేంఖి గతియు, భంజలి మురళి ఝుళిపి ఝుంపయు నుభాల, మును గతు లెసఁగఁ జూపుచు వాలిమీఱ
ప్రబంధ. ౧౭౫

ద్వి పరిపరివిధములఁ బాదరసంబు, కరణి భంజళ్లఁ
ద్రొక్క—నిచ్చోట్లు ద్రొక్క—, తురగరత్నము
తొక్క— ... నవనాథ. ౪. ౧౫౨. పా.

గీ. బయలు గుబ్బంబు భంజళ్లఁ బఱపుకొ్క్రఁడు.
క్రీడా. ౧౧౫.

భంజలిక. సం. వి అ స్త్రీ. = భంజలి.

చ. పతగవిభుండు మింటిపయి భంజలికామురళీ
సుధాలహరికముల రా . పారి. ౨.౧౦౧.

భంజించు. సం. స. క్రి ౧. భంగపఱచు

సీ ఉగ్రావాహంబు, సేవిన నమరులఁ జెచ్చెరఁ
బాఱఁడు భంజించెఁ దనదివ్యబాణశక్తి
శూర ఆది. ౮ ౨౪౮

౨ సంహరించు.

వ శుంభనిశుంభాదిదుష్టజనుల భంజింపను
జగంబుల రక్షింపను. మార్క— ౬.౧.౨౪.

భంజిక. సం. వి అ స్త్రీ. చిఱుతాకు. ? (శ. ర.)

భంటాకీ. సం. వి. ఈ స్త్రీ ములకచెట్టు దుష్ప్ర
ధర్షణి. ?

భండకము. సం. వి అ. పుం ఖంజనపక్షి,
కాటుకపిట్ట.

భండనము. సం వి అ న. ౧ కవచము ౨
యుద్ధము ౩ మోసము, ప్రతారణము (వాచ)

భండహాసిని. సం వి ఈ స్త్రీ గణిక, వేశ్య.

భండారము. సం వి అ పుం బొక్క—సము (శ ర)

భండి. సం వి ఇ., ఈ స్త్రీ ౧ వీచి, తరంగము,
అల ౨ మంజిష్ఠ ?

భండించు. సం అ క్రి బండాటలాడు

క ఖండింపుము సుతునటు గాకుండిన వ్రత
మైన మానియుండుము నీవిం, దొండైనఁ
జేయ కూరక, భండించినఁ గలదె పరమపదవి
కృపాలా. దుర్శాం ౫.౧౧౬.(శ. ర. పా.)

భండీలము. సం. వి. అ. పుం. శిరీషవృక్షము,
దిరిసెనచెట్టు. ?.

భండీలుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అదృష్ట
వంతుఁడు, అభివృద్ధిగలవాఁడు. ౨. వార్తా
హరుఁడు. ౩. పనివాఁడు, శిల్పి.

భండీరము. సం. వి. అ. పుం. ౧. దిరిసెనము. ?.
౨. చిఱ్ఱిపూర. ?. (శ. ర.)

భండీరి. సం. వి ఈ. స్త్రీ. మంజిటి. ?. (శ. ర.)

భండుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. అశ్లీల
సంభాషణచేయువాఁడు. ౨. సంకరజాతివిశే
షము. (భండజాతి.)

భందిలము. సం. వి. అ న ౧. శుభము. ౨.
దడ, వణకు, కంపము.

భందిలుఁడు. సం. వి అ. పుం. దూత. (వాచ.)

భంభము. సం. వి అ పుం, ౧ దంశము, అడవి
యీఁగ. ౨ పొగ

భంభరాళి. సం వి. ఈ స్త్రీ. ఈఁగ (త్రి వి.)

భక్తకరము. సం. వి అ. పుం. కృత్రిమధూపము,
వేఱు వేఱు సుగంధద్రవ్యములు కలిపి చేసిన
ధూపము.

భక్తజ. సం వి. ఆ. స్త్రీ. అమృతము.

భక్తదాసుఁడు. సం. వి అ. పుం. అన్నమాత్ర
లాభమునకు దాస్యము చేయువాఁడు. (పదిహేను
విధములుగల దాసజనములలో నొకఁడు )

భక్తపత్త్రి. సం వి. ఆ. స్త్రీ నాగవల్లి, తమల
పాకుతీఁగ.

భక్తము. సం. విణ (అ. ఆ అ.) ౧. విభజింపఁ
బడినది, భాగింపఁబడినది ౨. భక్తిగలది, విశ్వా
సముగలది వి అ న ౧ భాగము ౨
అన్నము ౩ ఆరాధనము, పూజ

భక్తసిక్థము. సం వి అ న అన్నపు మెతుకు.

భక్తి. సం వి. ఇ స్త్రీ ౧ విడఁదీయుట, విభా
గించుట ౨. భాగము. ౩ దైవభక్తి, తత్పరత,
౪. సేవ, ఆరాధన ౫. రచన. ౬. గుణవృత్తి.
౭. సంబంధించుట, చెందుట.

భక్తిలము. సం. వి. అ. పుం. మంచిగుఱ్ఱము,
సాధుఘోటకము.

భక్షకము. సం. విణ. (అ. కి. కా. అ.) భోజనము
చేయునది.

**భక్షకారుఁడు.** సం. విణ (అ ఆ అ) వంటవాఁడు, పాచకుఁడు

**భక్షకుఁడు.** సం. విణ. (అ ఈ ఆ అ) ౧ తినువాఁడు ౨ తిండిపోతు, తెగఁదినువాఁడు

**భక్షణము.** సం. వి అ. న తినుట

**భక్షణీయము.** సం విణ. (అ.ఆ.అ.) భక్ష్యము, తినఁదగినది

**భక్షించు.** సం. స క్రి ౧. భుజించు.

గీ యోగబల మూఁది దేహంబు నుజ్జగింపు, జీవుఁ
డొడలిలోనున్న భక్షింపనని, నాక్షణమ
యోగసంయుక్తుఁడయ్యె మునితదీయనిశ్చయ
మెఱిఁగి యద్దేవవిభుఁడు మార్క ౧. ౭౦

౨ పాడుచేయు. ౩ కఱచు, కాటువేయు

**భక్షితము.** సం. విణ (అ ఆ అ) ౧ తినఁబడినది, తినివేయఁబడినది వి అ న భోజనము

**భక్ష్యకారుఁడు.** సం. విణ. (అ ఈ అ) ౧ పిండివంటలుచేయువాఁడు, అపూపికుఁడు. ౨ పిండివంట లమ్మికొని జీవించువాఁడు

**భక్ష్యము.** సం విణ. (అ. ఆ అ) తినఁదగినవి, భోజనార్హము వి అ న ౧ అపూపసామాన్యము, పిండివంట. ౨. తినుబండము. (పంచభక్ష్యములు = భక్ష్యము, భోజ్యము, లేహ్యము, చోష్యము, పానీయము)

**భగందరము.** సం వి. అ పుం గుహ్యస్థానమందలి వ్రణము

**భగఘ్నుఁడు.** సం. వి అ పుం (భగునిచంపినవాఁడు) శివుఁడు

**భగణము.** సం. వి అ పుం ౧. నక్షత్రసమూహము, అశ్విన్యాది నక్షత్రసమూహము, రాశిచక్రము

**భగదేవత.** సం వి. అ. స్త్రీ వివాహాధిష్ఠానదేవత.

**భగదేవుఁడు.** సం. వి. అ. పుం. చాలపోకిరి, ముండలమారి, మిక్కిలి దుర్నీతిపరుఁడు.

**భగదైవతము.** సం విణ. (అ. ఆ అ.) ౧. దాంపత్యసుఖమును స్థిరపఱచునది. వి. అ న. పూర్వఫల్గునీనక్షత్రము.

**భగభక్షకుఁడు.** సం వి. అ. పుం కుంటెనకాఁడు, తార్చువాఁడు. (వాచ)

**భగభగ.** వి కాలుటయందగుధ్వని, ఆ ధ్వని కనుకరణము.

ద్వి విషాగ్ని,పటలంబుచే భగభగఁ గాలిపడిన
నరనాథ ౨. ౧౬౫. భా. ౧౦. పం

క. మేపూతన్, భగభగ యనిపించె నతఁడు
నాహృదయంబున్. కళా. ౨ ౭౮.

**భగము.** సం వి అ. పుం, న ౧. అదృష్టము, సుఖస్థితి, సౌఖ్యము ౨ ఐశ్వర్యాది. (శ్లో. ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః, జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాంవర్గోభగ స్స్మృతః) ౩ ఘనత, ఎన్నిక, గణ్యత ౪ కీర్తి ౫ మనోజ్ఞత, అందము ౬ మాహాత్మ్యము, ప్రాశస్త్యము ౭ కామము, ప్రేమము. ౮. యోని, స్త్రీగుహ్యము ౯. సుగుణము, నీతి, ధర్మము ౧౦. యత్నము, ఉద్యమము ౧౧. సర్వశక్తిమత్త్వము, సర్వశక్తులు కలిగియుండుట. ౧౨. కోరిక, ఇచ్ఛ ౧౩ శివునియష్టసిద్ధులలో నొకటియగు అణిమ, పరమాణువంతటి చిన్నరూపము దాల్చు దైవికశక్తి ౧౪ పూర్వఫల్గునీనక్షత్రము. ౧౫. కాంతి ౧౬ తపస్సు. ౧౭ ఆకాశము. ౧౮ స్వర్గము ౧౯ పురుషుల గుదమునకు నండములకు మధ్యభాగము

**భగవంతుఁడు.** సం విణ (త్. వతీ త్) ౧. మహాత్తరుఁడు, మాహాత్మ్యము గలవాఁడు. వి త్ పుం ౧ దేవుఁడు ౨. దేవత. ౩ విష్ణువు ౪ శివుఁడు ౫ బుద్ధుఁడు

**భగవతి.** సం వి ఈ స్త్రీ ౧. దుర్గ, పార్వతి. ౨ లక్ష్మి ౩ పూజ్యురాలగు స్త్రీ ౪. గంగ. ౫ సరస్వతి. (శ. ర.)

**భగాయించు.** అ క్రి. (హిం భాగ్ = పరుగెత్తు) పాఱిపోవు, పరుగెత్తు.

వ గభీరనీర కాసారంబు గండ్లుపడినవడువునం
బటాపంచలై చాంచల్యంబు నొంది పులిం
దులవాజు భగాయించి చనుటయు.
రంగా. ౩. ౧. ౫౬

**భగాలము.** సం. వి. అ. న. ౧. పుర్రె, నర కపాలము. ౨. నరమస్తకము.

**భగాలి.** సం. వి. ఇ. పుం. శివుఁడు (త్రి. ని)

**భగిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧ తోఁబుట్టువు, సోదరి. ౨. భాగ్యవంతురాలగు స్త్రీ ౩. స్త్రీ, ఆఁడుది.

**భగీరథప్రయత్నము.** సం. వి. అ. పుం. భగీరథుని యొక్క యత్నమువంటి గొప్పప్రయత్నము (ఇదిగొప్ప-అమానుషమైన-యత్నమును దెలుప నాలంకారికపద్ధతి నుపయుక్తమగును.)

**భగీరథసుత.** సం. వి. ఆ. స్త్రీ. భగీరథుని పుత్రిక, గంగ.

**భగీరథుఁడు.** సం. వి అ. పుం సూర్యవంశపు రాజులలో నొకఁడు, సగరుని మునిమనుమఁడు. (స్వర్గమునుండి భూమికి గంగానదిని దీసికొని వచ్చినవాఁడు.)

**భగుఁడు.** సం. వి. అ పుం. ౧ ద్వాదశాదిత్యులలో నొకఁడు, సూర్యుఁడు. ౨. చంద్రుఁడు. ౩. శివుఁడు.

**భగోలము.** సం వి అ. పుం. నక్షత్రగోలము, నక్షత్రమండలము.

**భగ్గు**=బగ్గు. వి మండుటయం దగుధ్వని, అట్టి ధ్వని కనుకరణము.

శా. ఆగ్నేయాస్త్రము దేవతాధిపతి యొనర్ప
దానిచే భగ్గునన్, భగ్నంబయ్యె మహా
రథంబు . . దశా. ౨ ౩౯౬.

సీ. తపనకరములు సోఁక భగ్గనమండురవి
రత్నము లతను జ్వాలిక లొలసినవుడె.
ఉ. రా. ౨ ౧౬౧.

ద్వి. అవిషవహ్ని భగ్గని పేర్చి మేన, నాశహింపక
మున్నె వే మాత యనుచుఁ, జాత్రుతో సరి
పోల్చఁజను మూర్ఛ నొంది.
ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౧౩.

౨. బ్రద్దలగుటయం దగు ధ్వనికనుకరణము

గీ. ఇవ్విధంబున సైన్యంబులెల్లఁ జెల్లవిఱిగి
దిక్పతులపత్తి వెంటవెంటఁ, దగిలివచ్చిన

చందానఁ దలలు వీడఁబాఱిరి బలారిగుండియ
భగ్గుమనఁగ. వరాహ ౩ ౫౦౫

౩ కల్లడపాటునం దగు ధ్వని కనుకరణము, కల్లడ పాటునం దగు ధ్వని.

౪ ఇది యేమి యని యెద నడి, యదవదలై గుండె భగ్గుమని కల్లడపాటొదవఁగఁ బలుకుల దీనత, గదురఁగ నదియేమి తెల్పఁగద రయ్య యనన్ సారంగ. ౨. ౨౬౯

శా. ఆవార్తల్విని గుండె భగ్గురన మూర్ఛాక్రాంతయై తల్లి దశా. ౪ ౧౩౪.

క. వాలంపతాఁకునకు ధృతి, క్రీలఁగ వే తాత యనుచు వెలుఁవడు తన్మ్రత్యాలాపమునకు నాజన, పాలకులొత్తంపుగుండె భగ్గనఁ గలఁగన్. రాఘవ ౧. ౨౨

౫ కాఁకుటయందగు ధ్వని, అధ్వని కనుకరణము.

మ అని మత్తేభము చిత్రజాహితుని దిక్కైక్రొంకి యిక్కాళి మేఁకనుమం బోవునో యంచుఁ దుంప మిఱియంగాఁబట్టి వక్షస్థలంబునఁ గీలించి పిఱిందికిన్ జని శిరంబున్ వంచి యక్కొండ భగ్గునఁ దాఁకెన్ ... కాశి. ౨. ౧౪౯

**భగ్నపృష్ఠుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧ నడుము విఱిగినవాఁడు. ౨. ఎదుటకు వచ్చినవాఁడు, సమ్ముఖుఁడు.

**భగ్నము.** సం విశే (అ. ఆ. అ.) ౧. పగిలినది చీల్చఁబడినది, ముక్కలైనది. ౨. విఫలమైనది ౩. నశింపఁజేయఁబడినది.

**భగ్నసంధికము.** సం. వి. అ. న తక్రము, మజ్జిగ

**భగ్నాత్మ.** సం. వి. న్. పుం. చంద్రుఁడు. (వాచ

**భచక్రము.** సం. వి. అ. న. నక్షత్రమండలము.

**భజన.** సం. వి. ౧. సేవనము.

ఉ. గజము మదముడిగి తిరుగుచు, గుజగుజ్జ గీఁకపెట్టఁ గలిశము పొన్ భజనచేసి విధి నింద్రుఁడు, గజబిజలో వెగడె నసురకథ జగంబుల్. భాగ. ౬. ౪౦

౨. శక్తి, సత్త్వము.

క. భజనసేడి వాఁడుగూలిన, విజయుఁడు వని
ఘోరబాణవితతుల సేయన్, భుజసత్త్వ
మొప్పఁ బాటలకుజమొక్కటి దాల్చి
బ్లవగకుంజరుఁ డంతన్ భా. ౭. ౪౦౩.

భజనము. సం. వి. అ. న. ౧. విభజించుట, విడఁదీయుట ౨. సేవ, పూజ, ఆరాధనము.

భజమానము. సం. విణ (అ. ఆ. అ) ౧. విభజించునది. ౨. అనుభవించునది

భజవణి. వి. ఒకస్వరస్థాయి

ద్వి. భజవణి శవణియు భరణిమిరాయి ఆదిగా
సాగయుతాయములు. బస.పు ౩.౯౩౮ పం.

భజావళి. వి. సంగీతములోని స్వరస్థాయిభేదము

ద్వి. వరుసలేర్పడ నిజావళి భజావళియు, వరవి
పాళిగము తాయము లేర్పరించి.

అ. మ క. ౨ ౧౦౯. పా ౧౦ పం.

క. క్రమమొంద నా భజావళి మీాఱన్ .

సమీర ౬. ౨౦౫

భజి(యి)ంచు. సం స. క్రి ౧. సేవించు.

చ శైష్ణవమాయ భజించు గ్రక్కునన్.

మార్క ౨. ౫౯

వ. కావున మహానుభావుండగు నద్దేవు నీవును
భజియింపుము వరాహ ౯. ౫౨

౨ ఆదేశించు

భట. సం. వి అ. స్త్రీ. ఇంద్రవారుణి, పెద్ద
పాఁపర కాయ.

భటము. సం. వి. అ. పుం దినముయొక్క పదు
నైదవభాగము. (శ. ర)

భటిత్రము. సం. విణ (అ. ఆ. అ) శూలా
కృతము, శలాకట్టు, శూలముతోఁ గాల్చినది.

భటుఁడు. సం. వి. అ. పుం. ౧. యోధుఁడు.
౨. మాలికి జాతి, సేవకుఁడు పురుషుఁ డను
యోధుఁడు. ౩. కిరాతుఁడు, అటవికుఁడు. ౪.
రాక్షసుఁడు. ౫. మ్లేచ్ఛుఁడు ౬. ఒక సంకీర్ణ
జాతివాఁడు.

భట్టవృత్తి. సం. వి. ఇ. స్త్రీ. పండితులగు బ్రాహ్మ
ణులకు సత్కారపూర్వకము రాజులొసంగు
మాన్యము.

సీ. అమితమా దేవదాయ బ్రహ్మదాయములన్
భట్టవృత్తు లుచితకట్టుబళ్లు.

ఉ. హరిశ్చ. ౧. ౬౩.

భట్టారకుఁడు. సం. విణ. (అ తా. అ.)
పూజ్యుఁడు. వి. అ. పుం ౧. ముని. ౨.
సూర్యుఁడు. ౩ (నాటోక్తియందు రాజు. ౪.
పండితోత్తముఁడు.

భట్టారుఁడు. సం విణ. (అ ఆ అ.) = భట్టార
కుఁడు వి అ పుం. ముని.

శా ఇంక నొక మా టేర్పాటుగాఁ జెప్పుమా,
భట్టారా! యని నందికేశ్వరుఁడు .

కాశీ. ౩. ౧౦౩.

భట్టిని. సం వి. ఈ. స్త్రీ. ౧ (నాట్య) పట్టాభిషిక్త
రాలుగాని రాజభార్య ౨. బ్రాహ్మణభార్య.

భట్టుఁడు. సం. వి అ పుం. ౧. ప్రభువు. (ఇది
రాజులను సంబోధించునపుడు బిరుదుగా నుప
యుక్తమగునది.) ౨. విద్యావంతులగు బ్రాహ్మ
ణుల నామముతోఁ జేర్చబడి బిరుదము. భట్టనారా
యణుఁడు, భట్టగోపాలుఁడు మొ॥ ౩మా రిల
భట్టుఁడు.

భడిలుఁడు. సం. వి. అ పుం. ౧. యోధుఁడు,
యుద్ధభటుఁడు. ౨. సేవకుఁడు, పరిచారకుఁడు
౩ బాలుఁడు. ౪. ఋషులలో నొకఁడు.

భదంతుఁడు. సం విణ. (అ.ఆ అ.) పూజ్యుఁడు
వి.అ పుం. ౧.మాయాదేవిపుత్రుఁ డగు బుద్ధుఁడు
౨. బౌద్ధుఁడు మొ॥లగువారికి గౌరవసూచక
ముగా నుపయుక్తమగును. ౩ సన్న్యాసి.

భద్రాకము. సం. వి. అ. పుం. సౌభాగ్యము,
సంపత్తు.

భద్ర. సం. వి. ఆ. స్త్రీ. ౧. గోవు. ౨. విదియ,
సప్తమి ద్వాదశి యను తిథులలో నొకటి. ౩.
పవిత్రమగు గంగ ౪ రాస్న (ఓషధివిశేషము.)

౫ శ్రీకృష్ణబలరాముల సోదరియగు సుభద్ర. ౬. శ్రీకృష్ణుని అష్టమహిషులలో నొకతె. ౭ కట్ఫలము, గుమ్మడు. ‡ ౮. కృష్ణపిప్పలి ‡, అనంత, సుగంధిపాల. ‡.

భద్రంకరము. సం. విశే. (అ. ఈ అ.) శుభము చేయునది, శుభకరము.

భద్రకము. సం. విశే. (అ ఆ అ) ౧ శుభప్రదము. ౨ అందమైనది, సుందరము ౩ దేవదారువృక్షము. ౪. ఒకజాతిచిక్కుడు. ‡. ౫ భద్రజాతిముస్తకము ‡ ౬.(ఛంద) ఒకానొకవృత్తము.

భద్రకంటము. సం వి అ పుం. గోక్షురము, పల్లేరు. ‡.

భద్రకాలి. సం. వి ఈ స్త్రీ దుర్గాదేవి.

భద్రకాశి. సం. వి ఈ. స్త్రీ భద్రముస్త ‡

భద్రకాష్ఠము. సం. వి అ న. దేవదారువృక్షము

భద్రకుంభము. సం. వి అ. పుం. రాజద్వారమందుంచఁబడు జలకుంభము

భద్రజము. సం. వి అ పుం ఇంద్రయవము, కొడిసెవిత్తు

భద్రదారువు. సం వి ఉ పుం, న దేవదారువృక్షము

భద్రనామము. సం వి న్ పుం ఖంజనము, కాటుకపిట్ట (త్రి ని)

భద్రపీఠము. సం వి అ న ౧ భద్రాసనము, రాజాకూర్చుండు పీఠము ౨ రెక్కలుగల పురుగులలో నొకజాతిపురుగు

భద్రబల. సం. వి. అ. స్త్రీ. ప్రసారణి, గొంతెరుగోరు. ‡.

భద్రబలుఁడు. సం. వి. అ. పుం. బలరాముఁడు.

భద్రము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. శుభప్రదము. ౨. శ్రేష్ఠము. ౩. సాధువు, మంచిది. ౪ వంచకము, మోసము చేయునది.

వి. అ. న. ౧ మంగళము. ౨. స్వర్ణము, బంగారము. ౩. ముస్తకము. ‡. ౪. ఇనుము, ఉక్కు. ౫. (జ్యోతి) కరణములలో నేడవది. పుం. ౧. ఎద్దు. ౨. ఖంజనము. ౩. గజజాతివిశేషము ౪. మేరుపర్వతము. ౫. దేవదారువృక్షము. ౬. కదంబవృక్షభేదము, ఒకజాతికడిమి ‡ ౭. స్నుహి, జెముడుచెట్టు ౮ జాగ్రత్త, జాగరూకత (ఈయర్థము తెలుఁగునందే కలదు )

గీ మణిఖచితహేమపంజరమధ్యమమునఁ, బ్రేమనాశాల్యముగఁ దాను పెంచినట్టి, హంసరాజంబుఁ గదియంగ నరిగి తనదుపయనమెఱిఁగించి యుంటిలో భద్ర మనుచు.

హంస ౧ ౧౧౦

భద్రముంజము. సం వి అ పుం ఒకవిధమగు ముంజము ‡

భద్రముఖుఁడు. సం విశే. (అ ఈ. అ ) సువక్త, చక్కఁగా మాటలాడువాఁడు.

భద్రముస్తకము. సం వి. అ. న నాగరముస్తకము, ఒకజాతితుంగ. ‡

భద్రమృగము. సం వి అ. పుం. గజజాతివిశేషము

భద్రయవము. సం వి అ న కొడిసెకాయ

భద్రరేణువు. సం వి ఉ పుం ఐరావతము, ఇంద్రునియేనుఁగు (త్రి ని )

భద్రరోహిణి. సం వి ఈ స్త్రీ కటకరోహిణి. ‡

భద్రవర్మము. సం వి న్ న నవమల్లిక. ‡.

భద్రశాఖుఁడు. సం వి అ, పుం. కుమారస్వామి, కార్తికేయుఁడు.

భద్రశ్రయము. సం. వి. అ. న. చందనవృక్షము.

భద్రశ్రీ. సం. వి. ఈ. స్త్రీ. చందనవృక్షము, భద్రశ్రయము.

భద్రసోమ. సం. వి. అ. స్త్రీ. గంగ.

భద్రాంగుఁడు. సం. వి అ. పుం. బలరాముఁడు.

